టోకియ్యఁగన్." చంద్రా. ౪, ఆ. ౨౧౧. ఆం. భా. తృ. ౪౫ విణ. 1. ముక్తమైనది (ప్రా.); 2. సమీపమైనది ఆం. భా. తృ. ౪౫.

టోటము సం. విణ. (అ. ఈ అ.) 1. కొంచెము. 2 నీచము.

టోపి = టొప్పి. (పట్టులోనగువానితో నేర్పఱచిన కిరీటము.) "చ. జిలుఁగుమృణాలతంతుకృతచేల ముతోఁ జిగురాకుటోపితో." రావి. ౪, ఆ. ౭౭ ఆం. భా. ద్వి. ౧౫౫.

టోపీ - టోపి (వా).

టోలా. హిం వి. గుంపు (శ. ర)

టోలి హిం వి పైసలో నెనిమిదవభాగము (శ. ర)

టోలీ = టోలి (వా.)

టోళి = టోలి. (వా).

ఠ

ఠ. ఉభ దే వి ఒకానొకయక్షరము. సం. వి అ. పుం. 1. మండలము; 2. చంద్రబింబము; 3. శివుఁడు; 4. శూన్యము (దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు)

ఠంగు. దే.వి. గంట మొదలగునది మ్రోఁగుటయం దగు ననుకరణము, వా:—ఠంగున ఒంటిగంట కొట్టినది

ఠంగుఠింగు. దే. వి ఆయుధములు మున్నగు కఠిన పదార్థము లొండొంటిని తాఁకునపుడు కలుఁగు ధ్వని కనుకరణము; "ఉత్సా...డబ్బు డుబ్బు ఖంగుఖింగు ఠంగుఠింగు మన్ధ్వనుల్." కళా. ౧, ఆ. ౧౦౯.

ఠంఠం. దే వి. నారియొక్క ధ్వనికనుకరణము; "క...లుంఠించి గుణనినాదము, ఠంఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్." భాగ. ౯, స్కం ౬౧౫

ఠక్కురము సం వి అ పుం. దేవతావిగ్రహము.

ఠక్కురుఁడు సం వి అ పుం. 1. దేవత (శ. ర) 2. సంజ్ఞావాచక పదములచివరకు జేరు గౌరవ వాచకపదము. (టాగోరని వంగీయులు)

ఠమ్మ. దే. వి పటహాదులధ్వని కనుకరణము; "చ. బలు పటహమ్ము ఠమ్మనుచు భర్గుని గేహమునందు మ్రోసి నన్." శివరా. ౪, ఆ. ౪౨.

ఠవఠవ. దే. వి. 1. శ్రమము; "క. భుని నంతదవ్వు నేమ్మను, ఠవఠవ లే కరుగుదు ము హుటాహుటి నడలన్." స్వా. ౧, ఆ ౭౬. 2. జంకు; కొంకు "చ. ఠవఠవ క్రొత్తక్రొత్త యగుటం జనియించెను. నీకు నేఁడు..." వేం పంచ ౪, ఆ ౫౭౬; 3. బాధ. "క...లుంఠించి గుణనినాదము, ఠంఠమ్మన బాల నేసె ఠవఠవ గదురన్." భాగ. ౯, స్కం. ౬౧౫; 4. చింత, విచారము; "చ...జూద మాడి తెత్తువొ చని, తెత్తువో యదియు దోసమొ నాకు నేటి క్షా, ఠవఠవ..." వాల్మీ. ౨, ఆ. ౧౦౯; 5. దుఃఖము; "క. ఠవఠవ పడనేటికి మది, శివగోచర నీకు నన్నుఁ జెం చొకఁడు శ్రుతి, వ్యవహారేతరమతమున, దవిలి మహాభక్తిఁ గొలువ దయపుట్టుటయున్." కాళ. ౩, ఆ. ౧౦౭; 6 అసత్యము. ఆం భా. ప్ర. ౧౧౯.

ఠవణి దే వి. ఒకానొక స్వరస్థానము "ద్వి. భజవణి ఠవణియు భరణి..." బస. ౩, ఆ ౯౩౦ పం.

ఠవణించు దే స క్రి. 1. రచించు, కూర్చు. "క. ఠవణింతు నొక్క శ్రీభాగవతచరిత్రంబుఁ బరమ కల్యాణ సముద్భవభవనంబు..." పాండు ౧, ఆ. ౧౦. ద్వి. పరమ. ౩, ఆ ౧౭౫, పా; 2 చేయు, "సీ ఠవణించు శింజినీటింకారరవములు..." భాగ. ౬, స్కం. ౩౬౯. కాశీ. ౨, ఆ. ౪౯; 3. పోలు "ఉ. నేరెడుపండుచాయ ఠవణించెడు మేన..." శ్రీరం. ౧, ఆ. ౧౬౭; 4 నడువఁ జేయు, ప్రవర్తిల్లఁజేయు. "సీ...పరాశర సుతుఁడు, చతురవర్ణాశ్రమాచార ధర్మంబులు ఠవణింప..." భాగ. ౩, స్కం. ౧౦౯.

ఠవణిల్లు. దే అ. క్రి. 1. ప్రవర్తించు "సీ ఎవ్వఁడు ఠవణిల్లు నెల్లజీవులయందు..." కాశీ. ౫, ఆ ౯౬. వాల్మీ. ౨, ఆ. ౫౭; 2. ఒప్పు "సీ తల్లి దండ్రులకు నిద్దపుభక్తి ఠవణిల్ల శుశ్రూష చేసిన శుద్ధమతులు." కాశీ ౨, ఆ ౧౧ ఆం. భా. తృ. ౦౩; 3 ఉచితమగు "క...నమస్కారము లొలిఁ జేయుచు పదపీఠము గలనిచుఁ బొగడ వశమె ఠవణిల్లంగన్." భాగ ౩, స్కం. ౦౫౫.

ఠవర. దే. విణ నేర్పరి "క కమ్మఁగ నవాతుచక్కెర, క్రమ్మఁగ మాటాడుఠవర కలకంఠవరా." విజ ౩, ఆ. ౫౬ ఆం భా. తృ. ౩.

ఠవరతనము. ద్వ. వి (ఠవర+తనము) నైపుణ్యము "గీ ఠవరతనమున నెచ్చోట నవతు లేక" వె శకుం. ౧, ఆ. ౪౩.

ఠవళి. దే. వి 1. అసత్యము. ఆం. భా. ప్ర. ౧౮౯; 2. కపటము. "క. బంతిమొగంబులరక్కసుc, డెంతయు వైళంబ ఠవళి యేరుపడంగన్." అచ్చ ఆర ౫౨. సా. 3, ఆ ౨౦౫. విణ అసత్యమైనది. "మ .. భ్రామణమా కల్ల విచారమా ఠవళి వంశాచారమా నాస్తి..." హ్మాస ౫, ఆ. ౧౧౧.

ఠవళికాఁడు. దే విణ. (ఠవళి+కాఁడు) 1. మోసగాఁడు. "క. అటు లున్న ఠవళికానిన్, దటుకునc బొడఁగాంచి..." అచ్చ. యు ౪౦౦; 2. ధూర్తుఁడు. "సీ... టక్కరి చిలుమువాల్ ఠవళికాఁడు. •గీ...ధూర్తుండు" వేంక. మాన. ౨౮; 3. కుజనుఁడు, దుర్మార్గుఁడు ఆం సం. మాన.౧౧.

ఠవళీ. దే. విణ. కపటము, కృత్రిమము. "మ... టాటా ల్గుణింపంగ నీఠవళీవిద్యలు చూపవోర్వ నది వీటన్ లేదు మాబోంట్లతో..." ప్రబంధ. ప్రబంధ. ౭౪౮.

ఠవిణ. దే. వి. ఢంకా. 'సీ. గ్రహరాజురథము ముంగల జయాంకంబుగా డాకొల్పువజ్రంపుఠవిణి యనంగ.' భాను. 3, ఆ. ౮3.

ఠా

ఠాకురు. వై.వి. గ్రా. 1. దేవత; 2. అధిపతి; 3. తండ్రి.

ఠాగూరు = ఠాకురు. (వా.)

ఠాణ. దే. వి పోరునపుడు మల్లులు నిలుచుచోటు. "వ...ఇట్టిద్దఱు నుద్దవిడి నున్నతభిషమంబు లగు ఠాణ లిడి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧3౪౫.

ఠాణము. వై. వి. (సం. స్థానమ్) నివాసస్థానము. "చ...ప్రోడతనంబుల ఠాణముల్ పురిన్, బొదలెడి భూసురోత్తముల భూరిపవిత్రశరీర వల్లరుల్." పాండు. ౧, ఆ ౧౦౮. పార్వ. ౨, ఆ. ౮౨; 2. కావలి యుండుచోటు. "క. గడిదుర్గంబులకోటల, నిడుఠాణపుదారల కెల్ల నెప్పుడు జెల్లేపుడమియె మన్నెవజీర్లకు..." ఉ. హరిశ్చ. ౧, ఆ. ౬౬.

ఠాణవారు. దే. వి. అధికారి. వేంక. దేవ. ౧౮.

ఠాణా = ఠాణము. (అధికారులుండుచోటు.) "మ..సైన్యముమీఁదc దారసిలుచున్ ఠాణాలు ఠాయించుచున్." రంగా. 3, ఆ. ౨౭౮.

ఠాయము. వై. వి. స్వరస్థాయి. "చ... ఠాయముసేసి ధ్రుపుక్కరాగము దగ నాలపించి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౯౯౧. పండితా. పర్వ. 3౭౭ పొ.

ఠాయి = ఠాయము. "శా. ఠాయింబద్ధభవాపదాన ముల పాట ల్లేట లుప్పొంగ..." విప్ర. ౧, ఆ. ౬. ఉ. రా ౬, ఆ ౧3౫.

ఠాయించు. వై. స క్రి. నెలకొలుపు "మ... ఠాణాలు ఠాయించుచున్." రంగా 3,ఆ ౨౭౮.

ఠావు. వై. వి (క ఠావు) 1 స్థానము "క. గోవర్ధనాద్రిc దొల్లిటిఠావున నిడి..." వి పు ౭, ఆ. (శ. ర.) "ఉ. ఠావుననుండి యన్నమిలిటక్కెము గూలినయప్డు .." ఉ. హరి. ౫, ఆ. 3౦; 2. "శా...ప్రాణముల్, ఠావుల్ దప్పెను..." భాగ. ౮, స్కం. ౯౦ విణ. మేలైనది "ఉ... ప్రియంబు ప్రయాగము హేమకూటమున్, ఠా వగురంగధామము..." భో. ౧, ఆ ౧౪౮. నైష. ౬, ఆ ౧౦౮.

ఠావుకొను. వై. అ. క్రి. (ఠావు+కొను.) నెలకొను. "క. పావనిముందర మశకము, రావణుc డన నెంతపట్టి రాఁచెఁగ లేఁడే, దేవునకీర్తి జగత్త్రయి, ఠావుకొనcగ నూరకుండుటయ కాక యనిన్." సమీర ౪, ఆ. 3౪ ఉ. రా. ౬, ఆ ౨౪.

ఠి

ఠింగణ దే. విణ. వామనుఁడు, పొట్టివాఁడు. "గీ... కుఱుచ ఠింగణ గిడ్డ...వామనాఖ్య కా..." సాం ని. మాన ౫

ఠింగణా = ఠింగణ 1. (పొట్టివాఁడు) ఆం భా. ద్వి ౧౨3; 2. (బాలుఁడు) "గీ సంగతియె యోాయి యిసుమంతఠింగణావు." ఆము ౪, ఆ. ౬౦

ఠీ

ఠీవి. దే. వి 1. వైభవము. "నీ ఠీవియుc దేజుc బాడియు..." అచ్చ. యు ౫౮౧ దశా. ౧, ఆ ౫౧; 2. అందము. "సీ మొదటిలత్తుకఠీవి చెదరినకెమ్మోవి..." దశా. ౮, అ. 33; 3. గొప్పతనము. "గీ. మురువు ఠీవియు నామోద మును బవంబు, వడువు నొప్పంగ..." భీమ ౪, ఆ. ౧౭౫. చం. రా 3, ఆ. ౨౨; 4. రీతి. "క...ఇట్టినిగారపుసొంపు మదమఠీవులు ఛన్నే." కళా. 3, ఆ. ౨౬౪. చిత్ర. భా. ౬, ఆ. ౧౬.

## తే

తే. దే. వి. ధ్వనించుటయం దగుననుకరణము. "కమును గడియారంబునఁ గట్టినపెనుజేగంట రవము తే యనునెడ .." ద్వా ౨, ఆ ౯.

తేవ. దే వి 1. ఒప్పిదము "మ. తన దుర్వారతరప్రతాప శిఖిచేతం బుట్టువీరాహితా, వనిరాట్పుట్టణ భస్మపాళి గొని త్రేవన్ వన్నెగావించు న్నార..." రామా ౧, ఆ ౭౪; 2. విధము రీతి "చ...పుట్టినపటుశూల చక్రతేవలు సూప..." భాగ. ౬, స్కం. ౬౪. "సీ పరిధవింతుఁ బ్రబాధ పరమేశ్వరునితేవ సూక్తివైచిత్రి నొక్కొక్క మాటు." కాశీ ౧, ఆ ౧౩; 3. స్థానము "సీ. వేదవేదాంతాది విద్యలయం దెల్ల గుఱిసేయఁ దగుతేవ గురునిసేవ." ఇందు ౧, ఆ ౧౭౨; 4 అశ్వశిక్షణములలో నొకటి. "సీ వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి తేవ చూపి" పి. శకుం ౧, ఆ. ౧౧౨.

తేవణి దే వి. అభినయభేదము "ద్వి డిల్లాయితూకణి తేవణి జంకె..." పండితా. పర్వ ౩౭౮ పొ.

తేవము వై వి (సం. తేమః) తడి ఆర్ద్రత్వము "లయగ్రాహి...రక్తస్రావమునఁ బెల్లయిన తేవమునఁ జూడఁ గడు నేవ మగుపట్ట..." భార. స్త్రీ. ౨, ఆ. ౯.

## తో

తోలా దే వి. తెగ, సమూహము (శ. ర)

తోళి = టోళి. (వా)

## డ

డ. ఉభ. దే వి ఒకానొక యక్షరము. సం. వి. అ. పుం. 1. ధ్వని; 2 భయము; 3 శివుఁడు; 4 బడబాగ్ని. సం. ఆ. స్త్రీ. ఢాకిని (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

డం. దే. వి డమ్మనుధ్వనికనుకరణము (చూ. డమ్మను)

డంక దే. విశ. దుష్టుఁడు. "ఆ. కొంకు లేనివెతల గుండెడి ముగుదల, డంకతనము మీఱ జంకులేక" నీలా ౩, ఆ ౨౧.

డంకా. వై. వి (సం. ఢక్కా.) డక్క (శ. ర.)

డంగరి. సం. వి ఈ. స్త్రీ పొడవుదోస.

డంగు. దే అ. క్రి. (బియ్యము మొ) సలఁగు. (శ. ర) విశ సలఁగినది. (శ. ర)

డంగుఁబ్రాలు. దే. వి బ. (డంగు+ప్రాలు.) తెల్లఁగా సలిగినబియ్యము. (శ. ర.) [ప్ర. ౧౨౮.

డంగురము. దే. వి. చర్మవాద్యవిశేషము. ఆం. భా.

డంచు. దే. స. క్రి. (డంగుధా. ప్రే.) 1. ధాన్యము మొ. రోకళ్లతో సలఁగఁగొట్టు. (వా); 2. చిదుకఁగొట్టు. "సీ పిండిపీచంబుగాఁ బృథివీధరంబులు డంతునే కాలదండమున నభవ." కాశీ ౭, ఆ ౭౯.

డంపకము. దే వి. దంచుట, "సీ ..డంపకములకు వంటకములకును..." భార. శాం ౯, ఆ. ౩౯౩.

డంబకము. దే వి మోసము. "ద్వి బకమురూపమున డంబకము సూపుచును." అ. మ క. ౧, ఆ. ౧౯. పొ. ౯ ప పండితా. పురా. ౧౨౨ పొ.

డంబము. వై. వి (సం. దంభః) 1 స్థితికి మించిన వేషము; 2. ప్రతిష్ఠ. (చూ. డంబు)

డంబరము సం. వి. అ పుం 1. సమూహము; 2. ఆడంబరము; 3. జృంభణము; 4 పోలిక. విశ. (అ. ఆ. అ) సమానమైనది.

డంబు. వై. వి. (సం. దంభః. క. డంబవు) 1. కపటము, మోసము. "పంచచామరము...నరాదుఁడీమృగంబు డంబునన్ వనంబులోనఁ గానరా ..." ఉ. రా. ౧, ఆ. ౪౪. ద్వి. హరిశ్చ. ఉ. ౬౧౧ పం; 2. గౌరవము 'ద్వి. నరుఁడు డంబు నకు జన్మము చేసెనేని" ద్వి భాగ ౬, స్కం. (శ. ర); 3 గర్వము. "మ. ప్రతివీరప్రకరంబు డంబుమెయిఁ గప్పం బొప్పనం బీక..." ఉ. హరి ౪, ఆ ౩౯. చంద్రికా. ౧, ఆ ౧౩; 4. శోభ, కాంతి "ఆ...మేపూఁత, డంబుతోడ వచ్చెఁ దుంబురుండు" కళా. ౨, ఆ. ౭౭ నీలా ౩. ఆ ౧౦౯; 5. విధము, రీతి. "గీ అఖిల జనములు దాతలై యలరఁ గలరు, సత్యలోకం బుడంబున జగము దనరు" ధర్మ. ౧, ఆ ౨౮౯ "సీ తనదివ్యమకుటంబు తనంబున ననంతమణిసంతతద్యోత మహిమఁ గాంచ" ఉ. రా. ౧, ఆ. ౮౩. విశ. 1. అధికము. "క. డంబుగఁ బంచమహాశబ్దంబులు మ్రోయంగ..." భా. రా. ఆ. ౮౩; 2. సుందరమైనది. "సీ. కమనీయ ముఖచంద్రుఁ గబళించుచిల్వ నా డంబైనబవిరి గడ్డము చెలంగె." శుక ౨, ఆ. ౩౯౮.

డంభము. సం. వి. అ. పుం. దంభము; "శా. డంభాచారము లుజ్జగించి..." కావ్యా. ౨, ఆ. ౧౩౨. "ఉ. డంభమయాన్యదర్శన విడంబనుఁడు..." వృషా. శ. ౦౪; "సీ. డంభ మిచ్చుటను గూడదు కృష్ణ..." అప్ప ౨ ఆ. ౧౪౩. పాణినీయమున దంభధాతువే గాని డంభధాతువు కానరాదు. ఐనను ప్రయోగము లిట్లున్నవి.)

డక్క. వై. వి. (సం. ఢక్కా.) వాద్యవిశేషము; "వ... కరంబుఁ దంబుఱలు పీఁపెలు డక్కలు .." ఉ. రా. ౫, ఆ. ౨౪౦.

డక్కఁగొను. దే అ. క్రి. (డక్కన్+కొను.) వశపఱచుకొను. "ఉ...ఏలనిబంటుగా మరుం, డక్కఁగొనంగరాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్." విజ. ౨, ఆ. ౩౫ విజ. ౧, ఆ.౦౬

డక్కి. వై. వి. డక్క. "వ...ఆనగరంబు వెనమొండి దిమ్మ రేఁగినయట్లు... తప్పెటలును డక్కలును... మ్రోయ..." ద్వా ౧౧, ఆ. ౨౬. ఆం. భా. ప్ర. ౧౨౭.

డక్కించుకొను దే. స. క్రి. (పోతుండ) కాపాడుకొను; "క...హా, రక్కసివంగడ మంతయు, డక్కించుకొనంగఁ జూడు ట క్కుడిగి యుఁకన్." అచ్చ. సుం ౦౪౬.

డక్కీ = డక్కి "క సంగీతపు మేళము జత, సంగతి తాళములు నాగసరములు డక్కీల్." ప్రబంధ. ౯౩.

డక్కు. దే. అ. క్రి. 1. చేతికి చిక్కు "ఉ...నీకు నే డక్కితి నంచుఁ బ్రేమ నిగుడం బుఘుఁ బొన్నున జేర్చి యచ్చటన్." శుక. ౩, ఆ. ౫౩౬; 2. అధీనమగు; "ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిటు తమ్మునిభాగ మీక..." భార. ఉద్యో ౨, ఆ ౫౨ కాళ ౧, ఆ. ౧౧౬; 2. లభించు; "క. చుక్కల రాయఁడు మరుఁడుం, జక్కలయొకిమానికొడుకు జతవోలనియా, చక్కని పాపఁడు నీకున్, డక్కెంబో యల్లుఁడై దిటం బలరాగన్." అచ్చ. బాల. ౧౦౫; 3 స్థిరముగా నుండు "ఉ. అక్కట మందభాగ్యునకు నట్టికనూభవరత్న మెవ్విధిం, డక్కు..." భార ద్రో. ౨, ఆ. ౧౪౦. పాండు. ౫, ఆ. ౦౦. వి భయము "ద్వి ఉక్కడఁగింతు రన్ డక్కను లేక." పండితా దీక్షా. ౪౨..ప్రా.

డక్కొను = ధక్కొను. (శ ర)

డగర. దే వి. పిశాచము; "గీ. మగువ గాదుర యిది పెనుడగరగాని." కళా ౩, ఆ. ౧౦౬ విన మగడి. "గీ చొక్కముగఁ బాటఁ బాడు నొక్కొక్కచోట, డగరకోయిల లెల్లఁ జుట్టుతిక మరయ." ఉ. రా. ౭, ఆ ౪౪౪. గంధ. ౬.

డగరము దే. వి కీడు. "మ ..ఈ, డగరంపుబ్రుంగ అన్ జయించు నని శుండాలంబులున్ మేటిత్తే, రుగముల్"...కొల్వ... సుద ౩, ఆ. ౧౭. ఉ. హరి. ౫ ఆ. ౧౦౪.

డగ్గర = డగర (శ. ర)

డగ్గఱ. దే. వి. సమీపప్రదేశము. "ఉ. డగ్గఱ మేదినీ పరివృఢప్రవరుండు..." నైష. ౦. ఆ ౧౦౦. "చ . అతినిష్ఠురఘోరవిశాలదండతా, డనములు చేయుచున్ జమునిడగ్గఱకుం గొనిపోయి చూప ..." భ్ల. ౩, ఆ (శ. ర)

డగ్గఱించు. దే. అ. క్రి. 1. దగ్గఱకు వచ్చు, సమీపించు; "ఉ...మృత్యువు చెంద వానికిం, గాలము డగ్గఱించె నది గానియెడన్ మది నిట్టు లెంచునే." ఉ. రా. ౩. ఆ. ౩౧౯. స. క్రి. దగ్గఱకు వచ్చునట్లుచేయు; "చ... మంజరఘోటకంబులన్, మొన యఁగ డగ్గరించియును..." వై. ౩, ఆ ౪౧.

డగ్గఱిలు. దే స క్రి. సమీపించు "క. డగ్గఱిలి మైత్రి భామిని, డగ్గుత్తుక యిడుచు..." ప్రబోధ. ౩, ఆ. ౭౫.

డగ్గఱు. దే. అ. క్రి. సమీపించు; "క. వెఱచఱచి వెగడుపడి ని, వ్వెఱగందుచుఁ గురుబలంబు వీరు లకని డగ్గఱ..." భార. భీష్మ. ౨, ఆ ౨౨౩. కు. సం ౦, ఆ ౨౪.

డగ్గు = దగ్గు. (శ. ర)

డగ్గుత్తిక. దే. వి. (డగ్గు+ఉత్తిక.) గాద్గద్యము; "మ. అని డగ్గుత్తికతో మహాభయముతో..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౬౦. ఆం. భా. ప్ర. ౧౨౨.

డగ్గుత్తికపడు. దే అ. క్రి. (డగ్గుత్తిక+పడు) గాద్గద్యము కలదగు; "గీ కూఁతు నెడఁబాయుఁవగతి డగ్గుత్తివడఁగ." కాళిందీ ౩, ఆ. ౨౦౫

డగ్గుపడు. ద్వి. అ. క్రి. (డగ్గు+పడు.) గాద్గద్యము నొందు; "చ . కెంజిగురుగుంపులు లంపులు మేసి క్రొవ్వి పీ, కున నొగరెక్కి డగ్గుపడుకుత్తు

కలన్...కెరలించెఁ గోవెలల్." శ్రీరం. ఆ. ౨, ౨౫౧.

డజను. ఆం. వి. (Dozen) పన్నెండు.

డప్పి. దే. వి. 1 ఆయాసము; "వ...నీవు కడు దూరంబు వచ్చి డస్సితి వింక మరలుట లెస్స..." గీ. నాకు డప్పి యెక్కుడిది మనంబు భర్త, చరణ పంకజాసక్తమై..." భార. అర. ౭, ఆ ౨౩౯. ౨౪౦ హరి పూ. ౨, ఆ ౪౪; 2. తైష్ణ్యము; "క. ఏవానిబంధుమిత్రులు, జీవధనంబులును డప్పిఁ జెందును గృశునిం, గా వాని నెన్నఁగాఁ దగు..." భార. శాం. ౧ ఆ ౫౨. 3. దాహము, పానము చేయుకోరిక; "గీ. డప్పిఁ గుందితి డస్సి దట్టంబు నైతి." కాశీ ౬. ఆ. ౪౪. ఆం. భా. ద్వి. ౬౬౦.

డప్పిగొను. దే. అ. క్రి. (డప్పి+కొను.) దాహమందు "గీ. ప్రవాహవాయు కురంగమంబరమునందు, డప్పిగొని యాసుధాంశుమండలము సొచ్చి." నైష. ౯, ఆ. ౧౭౭.

డప్పు. దే. వి. (క. డబ్బు.) మాదిగవాఁడు వాయించు చర్మవాద్యవిశేషము. (శ. ర.)

డబడబ. దే. వి. గర్వము. "సీ. పాలనాఁడు రాముఁడై బూతఁపుఁజిల్కలఁ గొట్టినడబడబల్ గట్టువడియె." చమ ౨, ఆ ౭౩.

డబిత్థము. సం. వి. అ. పుం. కఱ్ఱతో చేయఁబడిన మృగము.

డబ్బఱ. దే. వి. బొంకు. "గీ. డబ్బఱలు పల్కువారి కడ్డంబు గలదె." కాశీ. ౪, ఆ. ౯౬.

డబ్బా. దే. వి. 1. తుపాకిమందు లోనగునవి యుంచుకొనెడి తోలుపెట్టె (శ. ర.); 2. నూనె మొదలగునవి పోయుట కుపయోగించు రేకుపాత్ర. (వా.)

డబ్బాటు. దే. వి. ఆకస్మికత. "సీ. డబ్బాటుమై నొక్కెడలు చూపి యవి మాయ నడఁగ వేఱెడఁ జూపువ్యాపృతులును." ఆము. ౬, ఆ. ౯౮. విశ. ఆకస్మికము. ఆం. భా. 3, ఆ. 3౨. క్రి. విశ. హఠాత్తుగా "క. ఒకనాఁ డజుండు నీనీడకు డబ్బాటరుగుదెంచుటయును..." భార. శాం. 3, ఆ. 3౯౨ ఆము. ౬, ఆ. ౮౦.

డబ్బాటుసాకిరి. ద్వ. విశ. యదృచ్ఛాభిజ్ఞుఁడు శ. ర.

డబ్బి. దే. వి. (హిం. డిబ్బీ. క. డబ్బి.) 1. బరణి "సీ...భరణి మీఱును దార్వు బరణి డబ్బి" ఆం. భా. ద్వి. ౧౬౩; 2. ఒకానొక శకునపక్షి. "ఆ. డబ్బి బొబ్బలిడియె నుబ్బు లడర." ద్వా. ౧, ఆ. ౨౩౧.

డబ్బీ = డబ్బి. (వా.)

డబ్బు. దే. వి. (క. డబ్బు.) 1. కపటము ఆం. భా. ప్ర. ౧౩౮; 2. అబద్ధపుమాట. ఆం. భా. ప్ర. ౧౮౯; 3. డాంబుమాట. "క. పలికిన విని మిక్కిలి డబ్బులు నిలుఁగుము చాలు..." పరమ ౫, ఆ ౧౭; 4. మూఁడు (నాల్గు) పైసలు విలువ గలనాణెము. ఆం. భా. ద్వి. ౨౭౪; 5. ధనము, సొమ్ము. "క... నాడ,బ్బైవారిఁ బ్రోవ భిక్షా, జీవికవర్ణికిని విధి సృజించెనుగాదే." ఆము. ౪, ఆ. ౬౭; 6. ఒకానొకశకునపక్షి. "వ...కౌశికంబు డబ్బు గబ్బులుఁగు..." ఆము. ౬ ఆ. ౬౬. హంస. 3, ఆ. ౧౨. విశ. ప్రకాశవంతము. 'ద్వి. డబ్బైనయెడల నొడ్డాణంబు మీఱి.' ద్వి. శ. సా. ౨, ఆ. ౯౧. హా. ౧3 పం. స. క్రి. అబద్ధమాడు. "ఉ. మొన్న సమర్తవెట్టె నని ముద్దియ డబ్బిన నుబ్బె నయ్యెడన్" బహు. ౫, ఆ ౧౦౬.

డబ్బుడుబ్బు. దే వి. తుపాకులధ్వని కనుకరణము. "వ...గుంటిక్రోవుల డబ్బుడుబ్బులు." ప్రబంధ. ౭౮౮ కళా. ౮, ఆ. ౧౦౯.

డబ్బుర. దే. వి. 1. పానపాత్ర. ఆం. భా. ద్వి. ౨౪౪; 2. పెద్దనోరు గల లోహపాత్రవిశేషము. (శ. ర.)

డమరము. సం. వి. అ. పుం. 1. కొల్లగొట్టుట మున్నగు దేశోపద్రవము; 2. భయముచే పాఱిపోవుట. పుం. దుశ్శకునము.

డమరుకము. సం. వి. అ పుం. డమరువు.

డమరుగము. వై. వి. (సం డమరుకః.) చర్మవాద్య విశేషము. ఆం. భా. ప్ర. ౯౨౭.

డమరువు. సం. వి. ఉ. పుం. బుడుబుడక్కలవాఁడు వాయించువాద్యవిశేషము.

డమామి. దే. వి. మహారాజచిహ్నమగు పెద్దవాద్యము "సీ. తరలి రమ్మనినఁ జేతము కొక్కటియె కాని పేర్కొన వెఱతురు పెదడమామి" చంద్రా. ౧, ఆ. ౫౦. సువంతా. ౬, ఆ ౩౧.

డమాయి = డమామి. (శ ర.)

డమారము. దే. వి. (క. డమార) చర్మవాద్యవిశేషము. (శ. ర.).

డమ్మను. దే. అ. క్రి. (డం+అను.) 1. తప్పుగాఁ పలుకు. "ఉ. అక్కట పొట్టబింబిన నొకక్షరమైనను రాదు టెక్కులుం, డక్కలె కాని యమ్మనిన డమ్మనఁ నేరఁడు..." శుక. ౨, అ. ౪౩౭; 2. చచ్చు. (శ. ర. బ్రౌ.)

డయనము. సం. వి. అ. న. 1. క్రీడాశకటము. (శ. ర.); 2. పక్షియెగురుట; 3. మూఁపున నిడికొని మోయు పల్లకి మొ.

డయ్యించు. దే. స. క్రి. (డయ్యుధా. ప్రే.) చిక్కునట్లుచేయు. "గీ. దుష్కరం బైనతపమిట్లు తోడరి చేసి, మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చె." హర. ౪, అ ౨౩.

డయ్యు. దే. అ. క్రి. 1. అలయు, "ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ, వియ్యెడఁ దప్పి తేని జగమే మను నీచుక సేపు పోరులం, డయ్యుట తప్పె .." భార. భీష్మ ౩, అ ౨౬౯. హర ౨. అ ౧౧; 2. బలహీనమగు "గీ. డప్పిఁ గుందితి డస్సి దట్టంబునైతి" కాశీ ౬, అ. ౪౪. ప సం. ౧౦, అ ౪౫౬; 3. చిక్కు, కృశించు. "ఆ. ఏమికొఱఁత యయ్యె నిట్లు డయ్యుచు దమచ్ఛాయ దఱిఁగియుండ..." భార. సభా. ౨, అ. ౧౦౨ నైష ౨, అ. ౧౧౩; 4. అణఁగు, తగ్గు ఆం. భా. తృ. ౮౮. "క. వెర్వెఁ డ్డయ్యెను నీతోఁ, గ్రయ్యంబడి యున్న వాఁడఁ గామసుఖములం, గ్రుయ్య దొకయించుకైనఁ, డయ్యదు కొనలిడియెఁ ద్రుష్ణ నవపద్మముఖీ." భాగ. ౯, స్కం. ౫౭౭; 5. చెడిపోవు. "సీ. ఏఱు ప్రయ్యి లొనర్చి యూరు డయ్యఁగఁ జేసి మలయులాహిరి కని మహిమ యెంత." ఉ. రా. ౧, అ. ౬౬.

డయ్యంబాఱు. దే. అ. క్రి. (డయ్యన్+పాఱు. స్వార్థమున) అలయు, డయ్యు. "శా. అఖిలం బగుదం ప్రీవెంట నట డయ్యంబాఱి ఖిన్నాంగుఁడై." విక్ర. ౫, అ. ౧౩౯.

డల్లకము. సం. వి. అ. న. వెదురుగంప.

డవాలీ. ఉ. వి. నౌకరుబిళ్లను తగిలించుపట్టి (బ్రౌ. వా.)

డవిణ. దే. వి. డిండిమము, జయము మొదలగువానిని సూచించుటకై మ్రోయించువాద్యవిశేషము. "గీ. కేటి తోడ దట్టిగొని బిట్టు కేకవైచి, మీనములు దీటి యెదిరికి రోస మొదవ, డవిణ వాయింపఁ జేయుచు..." పసల ౪, అ. ౨౧౧. ఆం భా. ప్ర. ౧౨౭.

డవులు. దే వి 1. మదింపు, అంచన. (శ. ర.); 2. రాజునకు రాజ్యమునుండి వచ్చు ఆదాయము. (బ్రౌ.); 3. దంభము. (బ్రౌ.)

డా

డా. దే. విశే. ఎడమనున్నది. (ఇది సమాసపూర్వావయవమై యుండును. ఉదా. డాకన్ను. డాకేలు. మొ.)

డాంగరి. సం. వి. ఈ. స్త్రీ. పొడవైనదోసకాయ (విల్యమ్సు.)

డాఁకొను. దే. అ క్రి. (డాఁగు+కొను- స్వార్థమున.) డాఁగు, మఱుఁగున నుండు. "గీ...తమయింటి డాఁకొని యున్న విన్ను, మూలదేవరవి త్తైత్తఁ జాలు మేటి." అచ్చ. బాల. ౧౫౯.

డాఁగనమ్రుచ్చిలు. దే. వి. బ. (డాఁగుడా.) బాల్యక్రీడావిశేషము. "క. అచ్చిన్ని చెలువ డాఁగన, మ్రుచ్చిళ్లను నాల్గుగంబముల యాటలు..." పాంచా. ౧, అ. ౫౭.

డాఁగనమ్రుచ్చులు. = డాఁగుడుమూతలు. "సీ. తన దాడి కరి డాఁగు ననురీతిఁ జెలికాండ్రకాడ డాఁగనమ్రుచ్చు లాడ నేర్చు." రా. వి. ౨, అ. ౨౩.

డాఁగికొను. దే. అ. క్రి. (డాఁగు+కొను. స్వార్థమున.) డాఁగు. "క...గర్భగృహమునఁ దన్మూర్తికివెనుక డాఁగికొని..." శుక. ౩, అ. ౬౯.

డాఁగిలిమూఁతలు = డాఁగుడుమూఁతలు. "సీ. అచ్చనగండ్లు డోయాలును డాఁగిలిమూఁతలు నాలుగు మూలలాట." దశా. ౮, అ. ౮౧.

డాఁగిలిమ్రుచ్చులు. = డాఁగుడుమూఁతలు. "సీ. డాఁగిలిమ్రుచ్చులాటలు గచ్చకాయలు..." కాశీ. ౩, అ. ౩౩.

డాఁగిసేయు. దే. స. క్రి. (డాఁగి+చేయు.) కాలయాపనముచేయు. "మ. చనునే పెండిలి డాఁగి సేయ..." శ్రీరాధా. ౩, అ. ౧౦౯.

డాఁగు. దే. అ. క్రి. దాఁగు, మఱుఁగుననుండు. "క. లోఁగుఁ దరమైనపొదరుల, నాఁగిన శకునతతులఁ దలఁచు నడుగడుగునకున్, డాఁగఁ గొలనరయు..." కు. సం. ౫, అ. ౧౩౬; "శా.

డాఁగెం బల్వలపంకసీమ బకజాల్తత్రస్తపాఠీన ముల్." పారి. ౪, ఆ. ౨౦.

డాఁగుడుమూఁతలు. దే. వి. బ. బాల్యక్రీడావిశే షము. "గీ. మేఁత దలఁపక డాఁగుడుమూఁత లాడు." య. 3, ఆ. ౫౫.

డాఁగురించు. దే. అ. క్రి. దాఁగు. ఆం. భా. తృ. ౯౦. స. క్రి. 1. దాఁచు. "ఉ....ఏ మటు పోక శౌరి మది నేర్పడ మున్ గని డాఁగురిం చెనో." భార. సౌ. ౧, ఆ. ౨3౦; 2. మోస పుచ్చు. "గీ. అతివ మొఱఁగి, మగఁడుఁ బతి డాఁగురించి భూమలయుఁ దిరుగుదురు..." హరి. ఉ. ౯, ఆ. ౪౦. "శా. నాకద్వేషుల డాఁగురిం చుటకునై నాఁడేనుఁగనై కొన్న కాంతాకా రంబు...భాగ. ౮, స్కం. 3౯౧.

డాఁగురింత. దే. వి. (డాఁగురించు ధా.) 1. దాఁ చుట. 2. దాఁగియుండుట; 3. మోసగించుట బ. బాలక్రీడావిశేషము. "చ...డాఁగురింతలు హరితోడ నాడుదురు తద్వనవీథులయందు గోపి కల్." హరి. పూ. ౦. ఆ. 3౫. కళ. 3, ఆ. ౭౦.

డాఁగురుమూఁతలు. దే. వి. బ. బాల్యక్రీడావిశే షము. "సీ. పైఁడిపెట్టిక లెక్కి పై కేఁగి చేఁత గట్లందు డాఁగురుమూఁత లాడి యాడి." య. 3, ఆ. ౫౫. వేం. మా. ౬, ఆ. ౯౬.

డాఁచు. దే. స. క్రి. (డాఁగుధా. ప్రే.) 1. డాఁగఁ జేయు, కప్పిపుచ్చు. "చ...వృకోదరుం డొకండ తలిఁకిఁ జొచ్చి దోర్బలము డాఁపక పోరెడు..." భార. భీష్మ. ౨, ఆ. ౭. స్వా. ౧, ఆ. ౭౫; 2. జాగ్రత్తపెట్టు. "ఉ. డాఁచినసొమ్ము చేర నిచటన్..." ఉ. హరి. ౧, ఆ. ౧౬౦. విక్ర. ౦, ఆ. ౧౨.

డాఁపరీఁడు. దే. విశే. వంచకుఁడు, మోసగాఁడు. "గీ. చక్రవాకము లెడఁబాయ జారసతులు, డాయ నబ్జాలాసంబుడాఁపరీఁడు, ప్రాచి కొనరించె గుసుమ పూబంతిచెలువు." పి. శకుం. 3, ఆ. ౧౫౪.

డాక. దే. వి. (క. డాకు.) 1. పరాక్రమము. "క. లగ్గలపనట్లు కోటకు, డగ్గఱుత నమొనల నెల్ల డాకఁ దఱిమి..." ప్రభా. ౫, ఆ. ౨౦౧. ఆం. భా. తృ. ౪౫; 2. విజృంభణము. "శా...తోడై తీర్చు రమాకుమారుషను లెందున్ విందులం బోలి యొంతే డాకన్ బలిరే..." వేం. పంచ. ౧, ఆ. ౬౦. కళా. పీఠి. ౯౧; 3. ఒప్పు. "ద్వి. డాకతో నదిని గాఢంబు కాష్ఠంబు, జోకమై బాసినచొప్పు దీపింప." రం. రా. అయో. ౧3౯, పా. 3౦. పం. 4. రీతి, విధము. "సీ. అఁ కొన్న హరిడాక చేకొన్న వాఁడంచుఁ గాకవైఖరి దండకరుఁడు పూనె." ఉ. రా. 3, ఆ. ౧౪౧; 5. పక్షియాఁకౢ. ఆం. భా. ద్వి. ౯౯.

డాకరేమి. వై. వి. (సం. ద్రాక్షరామః) ద్రాక్షారా మము. "చ.. దక్షవిరోధికి డాకరేమి దీపక మొనరించె " శా. ప. మం. 3-౨-3.

డాకలి. దే. వి. (డాయి+కలు.) కమసాలెవానిలో హంపుదిమ్మె. "సీ. తనరును లోహసంతాడనాధా రంబు డాకల్లు పట్టెడ డాకలి యన." ఆం. భా. ద్వి. ౭౯౯.

డాకల్లు. దే. వి. (డాపు+కల్లు.) 1. బండిచక్రము యొక్క ఆకు. (బ్రౌ.) 2. లోహసంతాడనాధా రము, కమసాలి లోహమును సాగగొట్టు ఉక్కు దిమ్మ. ఆం. భా. ద్వి. ౭౯౯.

డాకిని. సం. వి. ఈ. స్త్రీ. పిశాచభేదము.

డాకిరి. దే వి. మల్లక్రియాభేదము. "సీ. డాకిరి సొచ్చిన డాగినీ మూఁగిన..." ద్వా. ౭, ఆ. ౬౦.

డాకురు. దే. స. క్రి. కాల్లో తేలగిలవేయు. (శ. ర.)

డాకొను. దే. అ క్రి. (డాపు+కొను.) 1. సిద్ధపడు. (బ్రౌ.) 2. ఉండు. "క. కని రాజహంసలు భజింపఁ నున్న మత్పుండరీకమండలములు డాకొనఁ జక్రవర్తులగు ధంబున..... పొదలు తదబ్ధిన్." వరాహ. ౭, ఆ. ౫౫. (డాకొనన్ = సముద్ర పక్షమున ఉండఁగా. అని యర్థము.) 2. లాంఛిత మగు, గుర్తుగా అంటు. "క. కను మదలంబితకర ణాంబునఁ గూడిరి సతియు వల్లభుఁడు నిదె యొక గోడను లాక్షారస మొకగోడను జందనకర్ద మంబు డాకొనెఁ బడఁతీ." రసిక. ౬. ఆ. ౨౫. స. క్రి. పట్టుకొను. "క. రాకొమరులార గుబ్బలి రాకన్నియమగని యబ్బురపుసీల్లిది ముం, డాకటి మెడదోర దీనిం, డాకొని బలుంటక్కరుల నడంచెం గడిమిన్." అచ్చ. బాల. ౧౭౦, అ. క్రి., స. క్రి. సమీపించు. "గీ. గొల్ల లెల్లను చెల్లంగ వల్లియలును, బల్లిదపులం కెపలుపులు మొల్లముగను, ఖూని యమ్మేటి పొగరుటాఁబోతుతుట్టుము, బలిమిమెఱ యంగ డాకొని పట్టుటయును." నీలా. ౨, ఆ. ౬౪.

"గీ. ఒక్కసతి వెలికిలి యీఁద రొమ్ముఁ
గురులు, పీఁగు జన్నులు వలరాచవేఁటకాఁడు,
కోకములఁ బట్టి నొడ్డువాగురులు వాని, డా
కొనఁగఁ బెట్టుదీముపిట్టలు ననంగ." వరాహ. 3,
ఆ. ౧౦3.

డాకొలుపు. దే. స. క్రి. (డాకొను. ధా. ప్రే.) దగ్గ
ఱకు రప్పించు. (చూ. డాకొల్పు)

డాకొల్పు = డాకొలుపు. 1. (దగ్గఱకురప్పించు.)
"మ...మెకములం డాకొల్పు వశ్యంపుమం,
దులు..." హరిశ్చ. ౨, ఆ. ౮; 2. (ప్రతి
ష్ఠించు, నిలుపు.) "సీ. గ్రహరాజరక్షముముం
గల రయాంకంబుగా డాకొల్పు వజ్రంపుర
వీణ యనఁగ" భాను 3, ౮౪.

డాగలి = డాకలి.

డాగిని. దే. వి. మల్లక్రియావిశేషము. ద్వా. ౭,
ఆ ౬౦.

డాగు. దే వి. (క. డాగు) 1. గుఱుతు "సీ. గాఢ
నాళీకసంగ్రస్తుఁడై నేఁడును నీడాగువాఁడు వాణీ
విలాసి." వసు. 3, ఆ. ౧౭౭. చంద్రా. ౬,
ఆ. ౨౭; 2. మఱక. వా:—సిరాపడి బట్ట డా
గయినది; 3. కళంకము. "సీ. వేయిడాగుల
తోడి విబుధలోకేశునిమూర్తికి నెవ్వఁడు
మూల మయ్యె." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦; 4.
వాఁత. "చ. విరహిజనంబులన్ మరుఁడు వీపుల
డాగుల వేయఁ బూని..."చంద్రా. ౪, ఆ. ౨౦౫.

డాచేయు. దే. స. క్రి. (డాపు+చేయు.) ఆధారము
చేసికొను. "మ...లచ్చినిట్టఃపుంజన్గవఁ బోలు
మున్నొరగు మున్ డాచేసి యుల్లాసియై." పాండు.
3, ఆ. ౧౬౦.

డాపల. దే. వి. ఔ. వామభాగము. "ద్వి. డాపలి
కేలు బిటారంబు నెఱప." ద్వి. పరమ. ౧, ఆ.
౧౭. పొ. ౧౬ పం. "క. పటుశరమ్ములమీఁదికి
డాపటికిన్ వలపటికి నపరభాగమునకు ముం,దటికిఁ
జదల నడపె .." భార. ద్రో 4, ఆ 3౨౨.

డాపలించు. దే. స. క్రి. ఎడమప్రక్కగా నుంచు...
"క. అరయఁదమగాని యిష్మోవారమునకును
డాపలించి యరదముఁ బోనిమ్మురవడి..." భార.
విరా. 4, ఆ. ౨౪౬.

డాపు. దే. వి. దగ్గఱ. "చ...కర్ణకుండలరుచిధాళి
ధళ్యములడాపునఁ బొంచి..." వసు. 3, ఆ.
౪౯. వేఙ్క పంచ. ౧ ఆ. ౫౫; 2. ఆశ్రయము
"సీ. డాకేలు సెక్కున డాపిడి తనలోనఁ దల
పోసి .." దశ. ౫, ఆ. ౪౦. విణ. సమీపము,
దగ్గఱయున్నది. (శ. ర.)

డాపురము, దే. వి. ప్రాప్తి. (శ. ర) విణ ప్రాప్తించి
నది. (శ. ర)

డాబ. దే.వి. 1. పక్షివిశేషము. "సీ. మూలసందులనుండి
మూల్గు డాబల క్రిందుగుంపుకేరజపుఁ గయ్యంపు
రొదలు "చంద్రా. ౨, ఆ. ౭౧ పార్వ. ౬, ఆ.
౭౭. (హిం. డాబ.); 2. యోధులు మెడలఁ
దాల్చెడు తోలుపటకా. ఆం. భా. ద్వి. ౨౦౪.

డాబా. దే. వి. 1. యోధులు మెడలఁ దాల్చెడు
తోలుపటకా. "గీ. పడఁతి జఘనంబు పెద్దడా
బాలు పూని, కాయజుఁడు పొక్కిలను సొరంగ
మునఁ దూటి, తెగువఁ గుచదుర్గయుగము
సాధించుకొనుఁ, దార్చునిశ్రేణి యన వళిత్ర
యము నెలఁగు." బిల్హ. ౨, ఆ. ౧౦౮ 2. శత్రు
వుల ఫిరంగిగుండ్లు తగులకుండ అడ్డుగా పట్టు పెద్ద
కేడెమువంటి సాధనము. "గీ. పార్థివేంద్రుని
భటులు డాబాల నడుప" కువల. 3, ఆ. ౧౦.
రంగా. 3, ఆ. ౭౯; 3. ఉన్నతమైన కట్టడము,
బోడిమిద్దె (వా)

డాబు. దే. వి. 1. అతిశయపుమాట. (శ. ర.);
2. దినుసులపట్టిక. (బ్రౌ.); 3. కృత్రిమవేషము.

డాబుచేయు. ద్వి. స. క్రి. (వా.) (డాబు+చేయు.)
మోసగించు. వేమన. ౧3౭.

డామరము. సం. వి. అ. పుం. 1. క్షోభ; 2.
ఉపద్రవము. "చ...తదీయదేశముల్, దల
రక యొప్పె రోగభయ తస్కరడామరవర్జితం
బులై." భార. ఆ. ౮, ఆ. ౮; 3. ఉత్సవాదుల
యందలిధ్వని; 4. చమత్కారము; 5. ఒకసంకీర్ణ
జాతిభేదము.

డాయి. దే. వి. డాకలి. (శ. ర.)

డాయించు. దే. స. క్రి. 1. డాయఁజేయు, పొం
దించు. "మ...మాయ డాయించుచున్." శుక.
౧, ఆ ౫౨౧; 2. సోకించు. "ద్వి. ముద్దాడి
మోముపై మోము డాయించి." ద్వి. పరమ.
3, ఆ. ౧౬౧. పొ.

డాయు. దే. అ. క్రి. ప్రవేశించు. "క...ఆమంద
గతిన్ మరునిమాయ మదిలో డాసెన్." ఇందు.

౨, ఆ. ౧౮౭. స. క్రి. 1. పొందు. "మ. కలలో వార్తలు విప్పి చెప్పెడి క్రియన్ గాథా పురాణార్థముల్ దెలుపన్నేర్తురు గాని నేరరు సుమీ తీవ్రవ్రతాచారకళ్ఙ్కులులై యుండెడు ముండధారులు సుముక్తుల్ డాయఁగా......" పాండు. ౫, ఆ. ౨౧౪; 2. తగులు; "ఉ. రామయ్యఁ దమ్ముఁడున్ గొలువ రాజశిఖామణి చిత్రకూట చూడామణి యైనవార్త చెవి డాసిన నొచ్చితి నింక..." భా. రా. అయో. ౧౬౯; 3. కవియు. తాఁకు. "చ...పోటరి యతఁ డింద్రజిత్తనికి డాయరు వీని సురాసురాదులున్." భా. రా. యు. ౭౯౫, అ. క్రి. స. క్రి. సమీపించు "క...మోపెట్టఁగ, కొలఁదియె యని డాయరైరి కొందఱు డాసిన్." భార. ఆది. ౭, ౧౭౬. "ఉ ఒయ్యన డాయఁగాఁ జనియె సుగ్రవిలోచనపార్శ్వభూమికిన్." పార. 3, ఆ. ౬౬. భార. ఆది. ౬, అ ౨౧౪.

డాలించు. దే. అ. క్రి. కేడెముపట్టు. (శ. ర.) స. క్రి. 1. పట్టించు. "ద్వి. జవ్వాదిమెఱుఁగుహస్తముల డాలించి." ద్వి. పరమ. 3, అ ౨౧౪; 2. కూర్చు. "ద్వి క్రొత్తకట్టాణిముత్యములు, డాలించుకరణి..." ద్వి. పరమ. 3. ఆ. ౧౭౦. పొ; 3. ప్రకాశించు. "ద్వి. బాలేందుచాయల పదిరెండువగల, డాలించు నూర్ధ్వపుండ్రంబుల వాని." ద్వి. పరమ. ౪, ఆ. ౨౮౦. పొ. ౨ ౫౬. పొ.

డాలు. వై. వి. (సం. ఢాలమ్. క. డాలు.) 1. కేడెము. "గీ. నడుమసీ లున్నతోలుడాల్, బెడఁగు సూప" శుక. ౨, ఆ. ౪౨౬. పాండు. ౧, ఆ. ౧౦౦; 2. కెండా. "క...అతనుని,డా లావాల్యాపు లన మిటారి రహించెన్." హంస. ౨, అ ౨౩౮, రా. వి. ౧, ఆ. ౭౯; 3. కాంతి. "సీ. నీలమేఘముడాలు డీలుచేయఁగఁ జాలు..." ఆము. ౧. ఆ. ౧౨. ఆం. భా. వ్ర. ౮౨; 4. వీణాధ్వనివిశేషము. "గీ. డాలునను డాలు చెల్లఁగాఁ జాలు కంపితమునఁ గంపిత మయ్యె విభాత్ఛిరసు" పాంచా. ౧, ఆ. ౫. పరాహ. ౧౧, ఆ. ౩౫.

డాలుకాఁడు. ద్వ. విణ. (డాలు+కాఁడు.) డాలు ఖాల్చినవాఁడు. (శ. ర.)

డాలువాఱు. ద్వ. వి. కేడెము. (శ. ర.)

డావరడంగి. దే. వి. ఏరవకడ, దేవతాళము ౘె (శ.ర.)

డాహూకము. సం. వి. అ పుం. పక్షివిశేషము.

డి

డింక. దే వి. మరణము (చూ. డింకవేయు)

డింకవేయు. దే. అ. క్రి. (డింక+వేయు) మరణించు; "మ. కెడసెన్ దుష్టులు డింకవేసె నెలుఁగుల్ గిట్టెన్ బులుల్..." సా. ౧, అ ౧౦౭. ఆం. భా. తృ. ౮౭.

డింకాకొట్టు = డింకవేయు. (శ ర)

డింకి దే. వి. (క. డింకి.) సాములలో నొకానొక భేదము; "ఉ దండములున్ బుటమ్ములును డాళములున్ బసికీలు తిర్గుడుల్, మండులు డింకులున్..." పార్వ ౬, అ. ౩౧.

డింకీలు దే. వి బ మల్లవిద్యావిశేషము. ఆం. భా. ద్వి. ౨౦౭.

డింకు. దే. అ క్రి. 1. చచ్చు; (శ. ర. బ్రా.); 2. అణఁగు (బ్రా.)

డింగరము. సం. వి. అ. పుం. 1. ప్రేరించుట; 2. చిమ్ముట; 3. తిరస్కృతి; 4. అరణ్యము.

డింగరీఁడు. వై. వి. (సం. డింగరః. క. డింగర) 1. సేవకుఁడు; 2. భక్తుఁడు; "ద్వి. మీబంట మీదూత మీడింగరీఁడ." బస. ౪. ఆ. ౧౦౨. పం.

డింగరుఁడు. సం. విణ. (అ. ఆ. అ) 1. మోసకాఁడు; 2. సేవకుఁడు; 3. అధముఁడు.

డింగిల్లు దే. వి. బ. నమస్కారభేదము. (శ ర.)

డించు. దే. స. క్రి. 1. విడుచు; "చ...ఒకమాటు నాగ్రహము డింపవు" భార. విరా. ౫, ఆ. ౧౮౬. కాశీ. ౨, ఆ. ౭౫; 2. తగ్గించు; "వ... ఏము చాంద్రాయణంబులఁ జంద్రవృద్ధిబడిఁ గడియెక్కించినఁ దా డించు..." ఆము ౫,ఆ.౧౫౭; 3. క్రిందికిఁ జేర్చు; "ఉ. కాంచనపర్వతోన్నతముగాఁ బెనుబ్రో విడి మద్యభాండముల్,డించి..." భా. రా యు. ౮౫౮, పసు. ౬, ఆ. ౧౨.

డిండిమము. సం. వి. అ. పుం. 1. వాద్యవిశేషము; 2. కలివె ౘె.

డిండీరము. సం. వి. అ. పుం. ఫేనము, నురుఁగు.

డిందించు. దే. స. క్రి. (డిందుధా. ప్రే.) 1. నశింపఁజేయు; "శా...రణసన్నాహంబు డిందించి రంగత్కోణం బడఁద్రొబ్బెఁ గృష్ణుఁడు..." భాగ. ౧౦,

స్కం, పూ. ౧౩౭౪; 2. ముంచు; "మ...నే నొల్లకున్నడిన సర్వోర్వియుఁ ద్రొక్కి తోయము లలో డిందింతు..." హరి. పూ. ౧, ఆ. ౧౦౪

డిందు. దే. అ క్రి. 1. తగ్గిపోవు; "సీ. సురుచిర కరుణవిస్ఫురణంబు డింది యొంతయు మాఁగువడిన మార్తాండుపగిది." మార్క. ౯, ఆ. ౧౯౮. ఆం భా. తృ. ౮౮; 2. అడఁగు వ్యాకులపడు. "మ. ఆపాసలం, బిఱువోవున్, బొద లిందు డిందుచే బొద మున్..."భార. ఆర. ౬,ఆ. ౩౨౭. భార. అశ్వ. ౨, ఆ. ౧౦; 3. మ్రొగ్గు. "చ...తనయంగమునం గలమాంసమెల్లఁ బెట్టినను గపోతభాగము గడిం దిగ డిందుచు నుండె నత్తులన్." భార. ఆర. ౩, ఆ. ౨౩౫; 4. తొట్రుపడు. "ఉ. కాంచి విరించి నందనుఁడు కన్నులు బిమ్మిటినొంద డింది యొ, క్కించుక కొంతు దేఱి..."పాండు ౨,ఆ. ౧౫౦; 5. మరణించు; "గీ రావణుండు డిందె భువన ముల్ రక్షిఁ జెందె. ఉ. రా. ౧, ఆ. ౧౪౯; 6. ఆఱిపోవు; "మ ..పై మండెడు తప్తతాప మెయదీపజ్వాల డిందన్ .."ఆము ౪, ఆ. ౨౪; 7. నశించు; "క. మునుకొని దుఃఖములు డిందు మోక్షము చెందున్." వాసిష్ఠ. ౪, ఆ. ౯౬; 8. మునుఁగు; "శా. రారానబ్ధిఁ గలంబు డిందు టయు..." దశ. ౨, ఆ. ౮౯. వి అడఁకువ. (శ. ర)

డిందుపడు ద్వ. అ క్రి. (డిందు+పడు-స్వార్థమున) 1. శాంతించు; "క...ఆతనికిఁ బుట్టినయుత్తల పాటు కొంత డిందుపడఁగన్." భార. విరా. ౧, ఆ. ౯౯. భార ఉద్యో ౨, ఆ. ౫౪; 2. సమాధానపడు; "అ...తొడిగినట్టి తూపుకొనలోన వైచిన, దనుక డిందుపడదు మనసు నాకు" రామా. ౭, ఆ ౧౨౧; 3 మత్తెక్కు; ఆం. భా. తృ. ౧౧౬.

డిందుపఱుచు. ద్వ. స. క్రి. (డిందుపడు. ధా. ప్రే.) పోఁగొట్టు; "సీ. సంతసంబున ముఖాబ్జమునందుఁ జెఱుసవ్వ కందళింపకయుండ డిందుపఱిచి" స్వా ౩, ఆ. ౯౭. భార. విరా. ౪, ఆ. ౧౭౮.

డిందుపాటు. ద్వ. వి. డిందు+పాటు.) స్వస్థచిత్తత; "క...ఏమిటను డిందుపాటు లేకుండిన నంద భూపాలుండు .." విక్ర. ౩, ఆ. ౧౦౬. వైజ. ౪, ఆ. ౬౧.

డింపు. దే. వి. డింపు. "ద్వి. పెద్దల బాలుర బెరయుఁ నాపతులఁ, దద్దయు డింపునఁ దరలించుకొనుచు" ద్వి. భాగ. ౧౧, స్కం. శ. ర;

డింబము సం వి. అ. పుం. 1. భయము; 2 కలలము, గర్భస్థపిండము; 3. అొమ్మునం జెడమపైపున నుండు మాంసగోళము; 4 గ్రుడ్డు; 5 మొగ్గ.

డింభ. సం. వి ఆ స్త్రీ. ఆఁడుపిల్ల.

డింభకము. సం వి. అ. పుం శిశువు.

డింభకుఁడు. సం. వి. అ. పుం బాలకుఁడు.

డింభము సం. వి. అ. పుం. మృగాదుల శిశువు.

డింభిక. సం. వి. ఆ. స్త్రీ. బాలిక.

డింభుఁడు. సం. విణ (అ. ఆ. అ) 1. మూర్ఖుఁడు; 2. చంటిబిడ్డ.

డిగఁద్రావు. దే అ క్రి. (డిగన్+త్రావు.) 1. అణఁచి వేయు; "గీ. మేలు డిగఁద్రావి కీడు దుర్గమింపఁ జేయు, పాపకర్ముండు రాజైన బ్రతుకు గలదె." వేం. పంచ. ౧, ఆ ౪౫౬; 2. విడిచిపెట్టు; "సీ. వేగ మాయావధూవేషంబు డిగఁద్రావి..." హర. ౬, ఆ ౧౩౧ ఉ. హరి. ౬ ఆ ౧౮౩.

డిగఁబడు ద్వ అ. క్రి. (డిగన్+పడు.) 1. వ్రేలాడు; "క. మెడ బిగియఁబట్టుకొని డిగఁ, బడియెడిబాల కునిచేత..." భాగ. ౧౦. స్కం. పూ. ౨౭౪; 2. నేలపై కూలు; "ఉ...బలుండు సంగరా. ఘాటము దాఁటవైచిన విగంబడెఁ గ్రోశయుగంబు చక్కటిఁ" ఉ. హరి. ౪. ఆ. ౨౬౯.

డిగించు. దే. వి. క్రిందికిఁ జేర్చు; "చ మునిపలి బుష్యశృంగుఁడు ప్రమోద మెలర్పఁగ శత్రు దారుణం, బనుసురవారణంబుఁ దనకై నిజమంత్ర బలంబు పేర్మి మే, దినికి డిగింపఁగాఁ గొని..." హరి పూ. ౩, ఆ. ౮౦

డిగియ. దే. వి. నడబావి. "క...డిగియబావి దొరువు లన్" హంస. ౪, ఆ. ౨౧౦. (శ. ర పా.)

డిగు. దే. అ క్రి. 1. అవతరించు. "చ. వినుకలిఁ గూర్మి జిక్కి పృథివీభువనంబునకుం డిగంగ నే, యనువును లేక..."నైష. ౨, ఆ ౫౪. "క. ఇది యేమి కంక నీ వున్న దవృత్తిని శంకదక్కి సా గద్దియపైఁ, బదిలంబుగఁ గూర్చుండితి నదియ్యును గా కిపుడు డిగవు..."భార. విరా. ౫, ఆ. ౩౧౮. 2. క్రిందికి అణఁగిపోవు. "గీ. జలధి యుల్లోల కల్లోలములను దగిలి, యట్టె యెగయుచు డిగు

చుచు " దశా. ౧, ఆ. ౧౯౫; 3. తగ్గిపోవు 'సీ. ఆఘను దానధారాపూర్ణవర్ష మూర్వరఁ బర్వ డిగియె నవగ్రహార్తి." వసు. ౬ ఆ. ౯౯; 4. బస చేయు "క. చాలఁ గుఱుఁగుల మడుఁగుల, గాలాపున్వేఁటలాడఁ గా దొరకిన బల్మీలు చవిఁ దెల్పె నపుడా, పాళెంబున డిగిన బక్కబాం ట్రౌతులకున్." కువల. ౨, ఆ. ౧౦౯; 5 జాలు వాఱు. "సీ. కటములు డిగి చిబుకమున రేఁ బేరిన మదము..." ఆము. ౪, ఆ ౧౫౩ స. క్రి. అవరోహణముచేయు "చ. డిగకుఁడు వాహనంబులు కడింబిమగఁటిమి గోలుపోవ..." భార ద్రో. 3, ఆ. 3౮౧.

డిగుడు = దిగఁడు. (శ ర)

డిగువ. దే. వి. క్రిందిభాగము. "ద్వి. ఎందు లోకోన్నతుఁ డీకఁడె దుఃఖములఁడింది యక్కుమలికి డిగువ నున్నాఁడు." రం. రా. యు. ౫౨౨, పొ. ౨౯. పం. విణ క్రిందిది (శ. ర)

డిగువడు. ద్వి. అ క్రి. (డిగు+పడు) శాంతించు "గీ. అని యనేకవిధంబుల నతనియాగ్రహంబు డిగువడఁ జెప్పి రామావనీశు, నతులదివ్యాస్త్ర మహిమయుం నల్లఁ దెలిపి" భా. రా. అర ౧, ఆ. ౨౫౭.

డిగ్గఁద్రావు = డిగఁద్రావు స. క్రి. 1. అణఁచివేయు. "శా. పగ్గంపుంబలు చిల్వరాపడగనున్ బ్రాఁగెంపు టాచాయలన్, డిగ్గంద్రావి..." ఉ రా. ౪, ఆ. ౨౫3; 2. పరిత్యజించు. "ఆ. మర్మభేద జైనమార్గణంబుల కోపాటించి సిగ్గఁ జలము డిగ్గఁద్రావి." భార. కర్ణ. ౧, ఆ. ౧33 భో. ౧, ఆ. ౧౧౧

డిగ్గజాఱు = దే అ. క్రి. (డిగ్గన్+జాఱు) క్రిందికి జాఱు. "గీ ఆదికూర్మంబునకు భీతి యగ్గలింప, సప్తపాతాళములు డిగ్గజాఱి యడఁగ." హరి. ఉ ౯, ఆ ౨౨౦.

డిగ్గదాఁటు. దే స క్రి. డిగ్గన్+దాఁటు) క్రిందికి దుముకు "క. పొదివికొని శకునిబలు ముష్ట దగలి సాత్యకిరథంబు సణకిన నాతం డది డిగ్గదాఁటి ." భార భీష్మ. ౨, ఆ ౧౦౭

డిగ్గన. దే క్రి. విణ. ద్రు. తటాలున 'ద్వి. గద్దియ మీఁద డిగ్గన డిగ్గ నుఱికి." రం రా. యు. ౨౯౭, పొ. 3. పం. బహు. ౫, ఆ ౨౬.

డిగ్గించు దే. స. క్రి. దింపు. "వ... అమ్మానవనందనుం డరదంబు డిగ్గించె .." భార. సౌ. ౨, ఆ. ౨౬.

డిగ్గియ. వై. వి. (సం. దీర్ఘికా.) నడబావి. "సీ. అలరు చెత్తమ్ములకలిమిఁ జెల్వగు డిగ్గియలతీర భూముల నల్లఁ బొంది" భార. శాం 3, ఆ. 33౨. ఆం. భా. ప్ర. ౧౬3.

డిగ్గు. దే. అ క్రి. 1. క్రిందికి వచ్చు. "సీ. పంయిపోటుగా డిగ్గుపవనాంకురంబులు బడలికయూర్పులబాగుఁ దెలుప" కళ 3, ఆ ౬౨ 2. అవరోహించు. "సీ. పేరోలగంబునఁ బెద్దగద్దియ నుండి దృష్టించి డిగ్గినధీరతయును." నైష ౨, ఆ. 3౫; 3 పతితమగు,రాలు "చ. ఒక చిమకున్ ససస్య యగుచుర్వికి డిగ్గఁగనీవు..." ఆము. ౪. ఆ ౯౦; 4. దిగఁబడు "ఉ... వెఱచాన లిసాత్మజవెంట వ్రేఁగునన్, మిక్కిలి డిగ్గు పాదసరణిన్..." ఆము. ౫, ఆ. ౬౯; 5. సన్నద్ధమగు. "ఉ... రాముని బాట నేను సుగ్రీవుఁడరా దురాత్మ రణకేళికి డిగ్గుదు గాక..." భా. రా. యు. ౪౭3; 6. ఉపశమించు. "సీ కరిముఖుం డెప్పుడు కడుపుబ్బు డిగ్గనికతన లంబోదరాఖ్యాకు డయ్యె." వరాహ ౧౨, ఆ. ౬౧. ద్వి. ౫, ఆ. ౭3; 7. తగ్గిపోవు. "గీ. వాహకుం డెక్కి విడిచినవారువంపుఁ, గోదమయునుబోలి రతికేళిమదము డిగ్గి." క్రీడా ౮౭; 8 దిగువతి యగు "సీ మలయజం బేవటఁ దొలుచెక్కుడు లిచి మేడల కిడ్డ మిగులు భూములకు డిగ్గు" ఆము ౨, ఆ. 3. స క్రి. 1. అవరోహించు. "చ. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై..." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౦. వరాహ. ౧, ఆ. 3; 2. పైనుండి క్రిందికి దిగు. "మ.. ఈమట్టి డిగ్గిన యూ యూడలఁ బ్రాకి కాదె మనకొగ్గం బోయఁ దేజాలమున్. కేయూర 3, ఆ ౪౮ కాశీ. ౨, ఆ ౨౧౧. వి. 1. తైణ్యము, తక్కువతనము. "ఆ ఒక్కరూప కాని యెక్కుడు డిగ్గుచు, గానరాదు ముఖవికాసమునకు." నిర్వ ౧, ఆ ౪౪; 2. ఊఱుకులు మున్నగువానియం దగుధ్వని కనుకరణము "గీ. అని శపించినఁ దుంబురుఁ డతిభయమున, డిగ్గనంగ విమానంబు డిగ్గనుఱికి." హర. ౧, ఆ. ౫.

**డిగ్గుడు.** దే. వి. దిగులు. "ద్వి. కొమరుపలర్ప నెక్కుళ్ల డిగ్గుళ్ల." పండితా. పర్వ 3౪3, పా. విణ. 1. ఖల్లము; (శ ర.) 2. తక్కువ (శ. ర.)

**డిగ్గున.** దే. క్రి. విణ. తటాలున; "సీ. కొలువున నుండి డిగ్గున డిగ్గనంతన్" దశా. ౨, ఆ ౧3౧.

**డిగ్గుపడు.** ద్వ. అ. క్రి (డిగ్గు+పడు) న్యూనమగు, తక్కువపడు. "ఉ...చుక్కల్ల సోయగంబు ము, త్యాలబెడంగు డిగ్గుపడునట్లుగఁ జేసిన బాగపుం బలీ." య. ౪, ఆ. ౧౬3.

**డిత్థుఁడు.** సం. వి. అ. పుం. విశేషలక్షణములు గల పురుషుఁడు. ("శ్లో. శ్యామరూపో యువా విద్వాన్ సుందరః ప్రియదర్శనః, సర్వశాస్త్రార్థ వేత్తాచ డిత్థ ఇత్యభిధీయతే.")

**డిప్ప.** దే. వి. 1. అనఁటిచెట్టుపైపొర. (వా) 2. పంపర పనస మొదలగుకాయల పైతొక్క (వా); 3. తలపైచిప్ప (వా.)

**డిప్పకాయ.** దే. వి 1. తలపైకొట్టుదెబ్బ. (వా) 2. ఊరుఁగాయ. (వా)—విణ. అల్లరివాఁడు. (వా) ఆతఁడు వట్టిడిప్పకాయ.

**డిబ్బి** = డబ్బి. (వా)

**డిబ్బీ** = డిబ్బి. (వా)

**డిబ్బుడిబ్బు.** దే. వి. మొంతెములు నేలపైఁ బడునప్పుడు కలుగుధ్వని కనుకరణము; "చ...డిబ్బుడిబ్బునఁ బడునట్టులుం గడుభయావహమయ్యె మహాహవంబునన్." కు. సం. ౧౧, ఆ. ౧౫౧.

**డిమము.** సం. వి. అ. పుం. దృశ్యకావ్యభేదము.

**డిమ్మరి.** దే. విణ. దుష్టుఁడు. (చూ. డిమ్మరితనము.)

**డిమ్మరితనము.** ద్వ. వి. (డిమ్మరి+తనము) చెడ్డతనము "క. వనితలపురుషులయెడఁ బుట్టినయది వెల్లివిరిసేఁత డిమ్మరితన మె, ట్టినికృష్టుం డైనను ని, ప్పనికిఁ జొఱఁడు..." భార. శాం. ౬, ఆ. ౨౦౮.

**డిమ్ము.** ఆం. విణ (Dim) కాంతిలేనిది.

**డిల్ల.** దే. వి. పిఱికితనము. "ద్వి డిల్ల సొంపెఱి తల్ల డిల్ల..." అ. మ. క. ౨, ఆ. ౬౭. పా.

**డిల్లగుడుచు** దే.అ. క్రి. (డిల్ల+కుడుచు) ఆశ్చర్యపడు "ఆ. అయిన నిట్టిమాట యూ వెలందుకయొద్ద, అనిన డిల్లగుడుచు నట్లుగాన" కాళిందీ ౨, ఆ. ౧౨౦.

**డిల్లచెడు.** దే. అ. క్రి. (డిల్ల+చెడు) ధైర్యముపోవు, "సీ కుంభినిఫణముూఁదికొని డిల్లచెడినట్లు పరవశు గతిరుగ్గుకరణినుండ." ఇందు. ౪, ఆ. ౯౭.

**డిల్లతనము.** ద్వ. వి. (డిల్ల+తనము.) తెలతెలపోవుట. "ఉ. డెందము విన్ననయ్యె నొకడిల్లతనంబొడఁగూడె మోముపైముందరిలాగుగాఁడు.." కావ్యా. ౨, ఆ. ౫౯.

**డిల్లపడు.** ద్వ. అ. క్రి. (డిల్ల+పడు.) (భయపడుటచే) 1. బలహీనమగు. "ఉ...తనువృద్ధతఘర్మజలంబుఁ దాల్చుచున్, డిల్లపడంగ..." భార. విరా. ౨, ఆ. ౯౧; 2. కలఁతనొందు. "వ... వలవంతల సెగలఁ గ్రాఁగి వేఁగినైపరాకున్న డిల్లపడి..." నిలా. 3,ఆ 3౦ ఆం. భా. తృ. ౧౦౦; 3. భయపడు. "గీ...జనులెల్లఁ దల్లడిల్ల వ్రేపల్లె దద్దయుఁడిల్లపడియె. హరి పు. ౬, ఆ. ౯.

**డిల్లపాటు.** ద్వ. వి. (డిల్లపడు ధా.) 1. ఆశ్చర్యము. "గీ. బాణహతినిందుకయు డిల్లపాటుగలిగె తోన తిరమైన ధైర్యంబుతోడఁ బొలిచి" భా. రా. యు. ౧౦౪౮; 2. తెల్లఁబోవుట. "చ. అరవిరిబాగుకమ్మరస మంటెనకన్నులు డిల్లపాటుక్రొం, జిఱుచెమటల్..." వేం. పంచ. ౪. ఆ. 3౫౧.

**డిల్లపోవు.** దే. అ. క్రి. (డిల్ల+పోవు.) ఆశ్చర్యపడు. "సీ. ఉరుకుచాప్రుల నంట నూహించు నూహించి క్రేళ్లమలంగిన డిల్లపోవు." సాంబో. ౧,ఆ. ౭౦.

**డిల్లము.** దే వి 1. వ్యాకులత్వము. "ఈ...ఉల్లము డిల్లము చెంద నవ్విభుం, డొండొకధర్మమార్గమున నొప్పుగ సంతతి నిర్వహింపఁడే." భో. ౨, ఆ. ౧౯౬; 2. దౌర్బల్యము. "ఉ. తల్లుల చేరిన న్వినక దాదులదిక్కును జూడ కంగముల్, డిల్లము నొంద..." పద్మ. 3, ఆ. ౨౪3.

**డిల్లాయి.** దే. వి. 1. నాట్యవిశేషము. "ద్వి. డిల్లాయి తూఖణి శేవణి ఝుండి." పండితా. పర్వ 3౭౮, పా; 2. అశ్వశిక్షలలో నొకటి. "సీ. డిల్లాయి ప్రకటించి తేప చూపి." పి. శకుం. ౧, ఆ. ౧౧౨.

**డిస్ట్రిక్టు.** ఆం. వి. (District) జిల్లాకలెక్టరు అధికారమున నుండు దేశభాగము.

## డీ

**డీ.** దే. అవ్య. 1. తలతో పొడిచి ఆడునపుడు పిల్లలనుమాట. (వా.); 2. పొట్టేళ్లను పోరించుటకై పురికొల్పుమాట. (వా.); 3. యుద్ధప్రేరణము. (చూ. డీకొను, డీకొలుపు మొ.)

**డీకు.** దే వి. పురికొలుపుట. (శ. ర.)

డీకొను. దే. అ. క్రి. (డీ+కొను.) పూనుకొను. "శా...దిగ్విజయ మీా డీకొన్నచందాన..." విజ. ౧, ఆ. ౧. అ. క్రి., స. క్రి. 1. ఎదుర్కొను. "ఉ. భేదిలద్రొబ్బ నయ్యసర బిమ్మిటి నొంది చెమర్చి మ్రొగ్గి దుర్మాదముతోడ డీకొనెఁ బ్రమత్తవిమర్దను నాజనార్దనున్." భాగ. ౧౦, స్కం. పూ ౧౧౪౩. ఆం. భా. తృ ౧౩౬; 2. ఆటయందు బాలురు డీడీ యనుచు తాఁకుకొను. (వా); 3. పొట్టేళ్లొండొంటిని తాఁకు. "క...డీకొనఁగాఁ దగ రని వాసినఁగని యోటము వెట్టినట్లు కౌరవనాథా." భార. ఉద్యో. ౨, ఆ ౧౩.

డీకొలుపు దే. స. క్రి. (డీకొను. ధా. ప్రే.); 1. ప్రేరేపించు. "క...ఏకాంతంబున నుండిన, లోకములోఁ దలఁప నెట్టిలోకులనైనన్, డీకొలుపు బుద్ధి సతిపై .."బిల్హ. ౩, ఆ. ౭౪; 2. కలియఁజేయు. "క...అంజక బాలకుఁ డనియును, గొంజక దయమాలి రాజకుంజర యంతన్, గుంజరమును డీకొలిపెను, గుంజరపాలకుఁడు గోపకుంజరుమీఁదన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౧౭. సా. ౨, ఆ. ౪౬.

డీకొల్పు = డీకొలుపు. (కలియఁజేయు) "క... డీకొల్పి రతుల..."హంస. ౨, ఆ. ౧౭౦. దశా. ౮, అ. ౧౪౮.

డీకోలు. దే. వి. (డీకొను ధా.) డీకొనుట. (శ. ర.)

డీడిక్కు. దే. వి. బాలురు ఆటలో తలలు తాఁకించునపు డుపయోగించుమాట. (చూ. డీడిక్కులాడు.)

డీడిక్కులాడు. దే. అ. క్రి. (డీడిక్కులు+అడు.); 1. బాలురు డీ డీ డిక్కు, అనుచు తలలు తాఁకించుకొను. (వా.); 2. ఒకదానితో నొకటి కొట్టుకొను. "క. ఉరువడి డీడిక్కులాడునొఱపునఁ దఱుచై." రంగా. ౩, ఆ, ౬౭.

డీనము. సం. వి. అ. న. పక్షియెగురుట. వి. ణ. (అ. ఆ. అ.) ఎగిరినది. [తృ. ౪౪.

డీలగు. దే అ. క్రి. (డీలు+అగు.) తగ్గు. ఆం. భా.

డీలపోవు. = డీలుపడు. (వా.)

డీలాపడు = డీలపోవు. (వా.)

డీలించు. దే. స. క్రి. చులుకనగాఁ జేయు. "గీ. నగము డీలించ బాహులు దిగిచికొనఁగ." నిర్వ. ౮, ఆ. ౯౫.

డీలు. దే. అ. క్రి. నిస్సారమగు. (శ. ర.) విణ. దుర్బలమైనది. "మ. అరుణాంశుఁడు హిమర్తువన్ రజని డీలై క్రుంకి..."ఆము. ౫, ఆ. ౧౦౫.

డీలుకొను. దే. అ. క్రి. (డీలు+కొను.) చెదరు. "వ...డీలుకొనం బనువడగండ్లగములు..."హర. ౨, ఆ ౨౦.

డీలుపడు. ద్వ అ. క్రి. (డీలు+పడు.) 1. బలహీనమగు "మ...భోగివరుండు డీలుపడ..."ఉ. రా. ౩, ఆ. ౩౩౪, నైష. ౨, ఆ. ౫౦; 2. వ్యర్థమగు "ఉ:...ఆతనియాలు డీలుపడ నట్టిమనోజునివాలు..." శుక. ౨, ఆ. ౬౨. కృ. శకుం. పీఠి. ౨౯; 3. బాధపడు. "ద్వి. ప్రకృతివాసన డీలుపడుచు నజ్ఞాననికరవారిధుల మునింగి తేలుచును." ద్వి. పరమ. ౧, ఆ. ౨౨. పా; 4. మరణించు. (చూ. డీల్పడు.)

డీలుపఱచు. దే. స క్రి. (డీలుపడు. ధా. ప్రే.) తక్కువపఱచు. (చూ. డీల్వఱుచు.)

డీలుపాటు ద్వ. వి (డీలుపడు ధా.) "గీ....డీలుపాటు ప్రకటదైన్యంబుఁ దోఁప..."నైష ౭, ఆ. ౫౨. (శ. ర.)

డీలుసేయు. = డీలుపఱచు. (డీలు+చేయు.) "సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁ జాలుమెఱుఁగుఁ జామనచాయ మేనితోడ." ఆము. ౧, ఆ. ౧౨.

డీల్పడు = డీలుపడు. (మృతినొందు.) "సీ. మడియుట తెగుట డీల్పడుట..." ఆం. భా. ద్వి. ౨౨౫.

డీల్వఱచు. = డీలుపఱచు. "సీ. సూరోత్తముఁడు వాయుసుతుఁ డంత నిల కతిగాఢప్రమోదసంఘటన దొరక, లంక పెంపెల్ల డీల్వఱచె..." రాఘవ. ౮, ఆ ౩౨

## డు

డు. దే. ప్ర. (ఇది బిందుపూర్వకముగా నుండును.) 1. ప్రథమావిభక్తిప్రత్యయము. ఉదా:—రాముఁడు, రంగఁడు; 2. ప్రథమపురుషప్రత్యయము. ఉదా:—వినుచున్నాఁడు, చదువఁడు. మొ; 3. ప్రార్థనాద్యర్థకములందలి మధ్యమపురుషప్రత్యయము. ఉ:—చదువుఁడు, రండు. పొండు. మొ; 4. కర్తృ, కర్మ, అధికరణ, కరణ, భావార్థములందు నిర్బిందుకముగ. వచ్చువర్ణము. (కర్త్రర్థము.) "క...కుఱుమ్రాపుడుఁ బుట్టం, బలపడఁ గట్టి..." భార. విరా. ౧, ఆ. ౨౯౧.

(కర్త్రార్థకము.) "చ. తనచెలు లిండ్లయందు దవవ ద్రావుడు ద్రావుచు..." పాండు. ౩, ఆ. ౧౯. (అధికరణార్థము.) "ఉ. ఎక్కడివా రొకో గరుడు డెక్కుడుగాఁ గలవారు..." ఉ హరి. ౬, ఆ. ౩౭. (కరణార్థకము.) ఉదా:— త్రోపుడుబండ, చోపుడుకోల. ఇము.(భావార్థము.) "ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టుడుఁ బోడన పుట్టు నుత్తమజ్ఞానము..." భార. ఆది. ౧, ఆ. ౧౫౪.

డుంకు. దే. అ. క్రి. (క. డొంకు.) 1. తగ్గు. ఆం. భా. తృ. ౪౪; 2. వశమగు. "ద్వి. శంకింప నెదురుగాఁ జనుదెంచురిపుల, డుంకఁబట్టుచుఁ బండ్లు డుల్లంగఁ గొట్టి." అ. మ. క. ౧, ఆ ౫౯. పా. ౨౬, పా.

డుంగు. దే. అ. క్రి. వణఁకు, చలించు. "క. వాలుఁ బయినడుచున ట్లొబ్బాలిక నడునడన డుంగి భయమున..." భార. ఆది. ౨, ఆ. ౧౫౫. కు. సం ౨, ఆ. ౩౯.

డుంఠి. సం. వి. ఇ. పుం. కాశికలో వాయవ్యభాగమున నున్నవిఘ్నేశ్వరుఁడు "శా...లోలార్కునిన్, డుంఠీశున్ వినుతించి..." చంద్రా. ౩, ఆ. ౭౨. కాశీ. ౧, ఆ. ౨.

డుండుకము. సం. వి. అ. పుం. దుండిగము. ❦ విణ. (అ. ఆ. అ.) 1. అల్పము; 2. క్రూరము.

డుండుభము. సం. వి. అ. పుం. విషము లేనిరెండు తలలపాము.

డుక్కు. దే. అ. క్రి. 1. దాఁగు. "ఉ:...అక్కట దిక్కులేమి రజతాచల మొక్కఁడు వెల్లగించె... అంచునప్పురిన్, డుక్కినగట్లయోజ నెగడున్ నవరత్నవినూత్నసౌధముల్." చంద్రా. ౧, ఆ. ౧౫; 2. వాడు, వడలిపోవు. "చ. కొలనికెలంకులన్ జెలులు కోమలి నిల్పిన మేనికాఁకచే సలసలఁ గాఁగె నీళ్లు...డుక్కె బిసంబులు ప్రీలె బత్త్రముల్." ప్రబంధ. ౫౩౯.

డుబుడక్క. వై. వి. (సం. హుడుక్క.) డుబుడక్కవానివాద్యము. "సీ. కడిఁదిమీఁఱిగఁ జంకనిడినబొట్టియకోల డాకమ్రోసెడు డుబుడక్కకేల." హంస. ౨, ఆ. ౨౭. చంద్రా. ౮, ఆ. ౬.

డుబుడక్కవాఁడు. ద్వి. వి. (డుబుడక్క+వాఁడు.) సాయిలవాఁడు, "గీ. వచ్చె నచటికి డుబుడక్కవాఁ డొక్కండు." హంస. ౨, ఆ. ౨౭. చంద్రా. ౮, ఆ. ౬.

డుయ్యు. దే. అ. క్రి. 1. నాఁటి పైకి వెడలు. "క...అవి యుక్కఱ గాఁడి డుస్సి పాఱెన.." స్వా. ౮, ఆ. ౮౫. భా. రా. యు. ౬౯; 2. తెగు. "సీ. తోరణంబులు డుస్సి ధూళిఁ గలసె." వీర. ౮, ఆ. ౨౮౬. స. క్రి. 1. పైకి తీయు. "వ...అడిదంబులు డుస్సి వ్రేసినఁ బూసిన చందంబున నేలం గూలిన యేనుంగుపీనుంగులును..." ఉ. హరి. ౩, ఆ. ౨౭; 2. సడలించు. "ఉ:...దీని మిత్తికిం బుత్త మటంచుఁ బట్టెడలు బోరన డుయ్య భయంకరాకృతిన్." స్వా. ౮, ఆ. ౮౦; 3. గ్రుచ్చు. "ద్వి...గొఱ పంబులను డుస్సి..." రం. రా. ఉ. ౫౨, పా. ౪. పం.

డుఱ్ఱుచ్చి. దే. వి. 1. యుద్ధమునకు పిలుచుటయందుపయోగించుమాట. (బ్రా. శ. ర.); 2 ఆఁబోతులను ఱెచ్చఁగొట్టుట కుపయోగించుమాట. (వా.)

డులడుల. దే. వి. రాలుట మున్నగువానియం దగు ననుకరణము. "ద్వి. ప్రళయకాలమునాఁటి బ్రహ్మాండతలము, డులడులఁ జుక్కల డుబ్బికైవడిని." రం. రా. యు. ౮౧౩, పా. ౨౬. పం.

డులి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు.

డులిపించు. దే. స. క్రి. (డులుపు. ధా. ప్రే.) రాల్పఁజేయు. (చూ. డుల్పించు.)

డులుచు. దే. స. క్రి. 1. పడఁజేయు. "వ...ముట్టికోలల రారాజుమకుటంబమణులు డులిచి..." భార. విరా. ౫, ఆ. ౨౨౧. కు. సం. ౮, ఆ. ౧౧౫. వరాహ. ౧, ఆ. ౫౨; 2. ఊడఁదీయు. "సీ. సాలీఁడు గాఁబోలు సమదవేదండంబు తెలినారచీరలు డులిచి తెచ్చె." కువల. ౨, ఆ. ౬౩. ఆము. ౨, ఆ. ౩; 3. పోఁగొట్టు. (చూ. డుల్పు.); 4. ఎడచేయు. "వ. ఖాండిక్యుండు భయకర్మంబులు డులిచి..." ఆము. ౩, ఆ. ౪౯.

డుల్లు. దే. అ. క్రి. 1. రాలిపోవు. "ఆ. రత్నకేతనములు రాజితశేఖరంబులును రుచిరఘంటికలును బార్థుబాణనిహతిఁ దునిసిపడెఁ గౌరవులచేట్లు, తెలుప డుల్లునుల్కములును బోలె." భార. విరా. ౫, ఆ. ౫౦. భార. ద్రో. ౧, ఆ. ౧౩౨; 2. ఊడిపడు. "వ...గాండీవి యనునొక్కఁ తపస్వి

శాపంబునఁ బక్షంబులు డుల్లి..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౧౧; ౩. నశించు. "గీ. త్రుప్పు డుల్లిన నొప్పారుతో యజాస్త్ర, చికిలినిద్దంపుఁ గైదువుచెలువు తోఁప." హంస. ౫, ఆ. ౨౧౫. నిరం. ౨, ఆ. ౧౨౮; ౪. పాయు, విడుచు. "క. కారాకులు డుల్లినట్లు కర్మము వెల్లం, గోర పెడఁ బాయ వలయుట..." భార. భీష్మ. ౧, ఆ. ౨౦౮.

డూ

డూయు = డూయు. (శ. ర.)

డె

డెందము. దే. వి. 1. హృదయము "ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే" పారి. ౧, ఆ. ౧౩౩. నైష. ౧, ఆ. ౧౭; 2. వక్షస్స్థలము. "మ...దేవబృందమునకుం డెందంబుపై రా యనం,జనునాపంక్తిముఖున్ వధించిన మహోత్సాహంబున్..." నిర్వ. ౬, ఆ. ౬౫. జై. ౨, ఆ. ౬౯; 3. ఊహ. "సీ. మఱఁగువెట్టక డెంద మెఱిగించుకై వడి గొబ్బునఁ బయ్యెదకొంగు సడల." విక్ర. ౧, ఆ. ౧౨౨.

డెందముచూలి. దే. వి. (డెందము+చూలి) మదనుడు. "సీ...కమ్మవిల్కాఁడు డెందమ్ముచూలి." ఆం. భా. ప్ర. ౪౫.

డెక్క. దే. వి. పశువులకాలిగిట్ట; "సీ. కఠినపద్దాల వక్త్రము లయ్యె నీజన్నె మును డెక్క లక్కొంద మూలములకు." పాండు. ౫, ఆ. ౨౪౩. ఆం. భా. ద్వి. ౯౭.

డెక్కు. దే. వి. అడ్డగించుట. "చ.. సలిలంబులన్ దనరఁ జిల్కుచుఁ గుత్తుక డెక్కు నంతనం,తన.." ఉద్భ. ౨, ఆ. ౨౪౯. స. క్రి. 1. అడ్డగించు. (శ. ర.); 2. గొణఁగు. (వా.)

డెక్కొను. దే అ. క్రి. (డెక్కు+కొను) 1 నెలకొను. "సీ. కడలొత్తుకరముగాలభునకాంతి చూపఱ డెందంబులలో సిక్కి డెక్కొనంగ." నృసిం. ౨, ఆ. ౭౧. ఆం. భా. తృ. ౯౯; 2. (డెక్కు+కొను.) డెక్కుపడు, గొంతున కడ్డముగు "సీ. చివు రెల్లఁ గసి నొత్తి తొవరాకుఁ గుత్తుక డెక్కొని కోయిల వెక్కుచుండు." కు. సం. ౫, ఆ. ౧౪౨.

డెప్ప. దే. వి కొండమీఁది సమానమైనప్రదేశము. (బ్రౌ. శ. ర.)

డెప్పరము. వై. వి. ఆపద. "క. ఇం దుండఁగ మన కిమ్మాడ్కిం దనుకఁగరాని కడిఁదిడెప్పర మొంజెన్" హరి. పూ. ౬, ఆ. ౧౧. ఉ. హ. ౫, ఆ. ౧౩౨. విణ. (సం. దుర్భరః.) 1. ఆపద కలిగించునది. "ఆ. జున్ను డెప్పరంపుఁజో టైన చతి నున్న..." భార. స్త్రీ ౧, ఆ. ౧౯. భార. ద్రో. ౨, ఆ. ౧౧; 2. అబ్బురము గలిగించునది. "చ. అకట యజాతశత్రుఁ డనునప్పలు కిప్పుడు నిక్క మయ్యె వానికిఁ గురునాథ యిట్టు లతనిం గొల్చుచుట ఘోర కాజిఁ బట్టికొనుట గోరి తివ్విధము డెప్పర మెంతయు..." భార. ద్రో. ౧, ఆ ౧౯; 3. అధికమైనది. "ఉ...తక్కరూప్మముల్, డెప్పర మైనలోహశకటి ప్రకటీకరణంబుఁ గామినుల్." ఆము. ౫, ఆ. ౧౪; 4. సహింపరానిది. "ఆ. డెప్పరంబు గాఁగ డెబ్బదిశరములు, నినిచె..." భా. రా. యు. ౧౭౬; 5. అసాధ్యము. "చ...నిన్నుఁ గొంగు వట్టినదురితంబు వాయుటయె డెప్పర మైనది..." భో. ౪, ఆ. ౩౨౩. శుక. ౨, ఆ. ౨౬. క్రి. విణ. అధికముగా "క.. సవితృప్రభలు దిశల డెప్పర మలమన్." ఆము. ౬, ఆ. ౧౨౨.

డెప్పరించు దే. అ. క్రి. అశక్యమగు. (శ ర)

డెప్పఱికము. దే. వి. (డెప్పరము + ఱికము.) ఆపద. "చ...మది నోటకండ సెడి డెప్పఱికంబులు సేసె దిట్టకొవ్విదములు దక్క..." కు. సం. ౪, ఆ. ౬౫.

డెప్పు = దెప్పు (శ. ర.)

డెబ్బందు. దే. స. డెబ్బదిమంది. (శ. ర.)

డెబ్బది. దే. స. సం. (ఏడు+పది) ఏడుపదులు. "ఆ. డెప్పరంబు గాఁగ డెబ్బదిశరములు,.." భా. రా. యు. ౧౬౨. ఆము. ౪, ఆ. ౨౧౧.

డే

డేకు. దే. అ. క్రి. పిఱ్ఱలతో జరగు. (వా.)

డేగ. దే. వి. (క. డేగె) 1. శ్యేనము, సాధారణపక్షులను వేటాడుపక్షి. "సీ. సురగాలిదవదగ్ధతరుపర్ణతతి డేఁగఁ బావురా లని డేగపదుపు దూఱె." ఆము. ౨, ఆ. ౪౬. హంస. ౩, ఆ. ౧౩; 2. స్త్రీజాతిశ్యేనము. ఆం. భా. ద్వి. ౯౦.

డేగపదను. దే. విణ. (డేగ మితాహారము తినుపద్ధతి.) మితము. "గీ. అంబిపురి చేఁగి మజ్జిగం బాడి

వేటల, బోవుతఱి డేగపదనుగ భోజనంబు, నేసి..." సా. ౧, ఆ. ౭౮.

డేగాట. దే. వి. (డేగ+ఆట.) పెండ్లిలో అయిదవ నాఁడు వధూవరుల నెత్తికొని డేగలవలె ఆడెడు ఆట, దండాడింపు. (బ్రౌ. శ. ర.)

డేగిసా. దే. వి సిల్లుకాఁచెడి కాఁకు. (వా.)

డేర. దే. వి. గుడారము. శంక. మ్హార. ౭౨.

డేరా = డేర. "గీ చాల నలరారు డేరా హజార మునను." రసిక. ౩, ఆ. ౧౮౧.

## డై

డైరీ. ఆం. వి. (Diary) దినచర్య. దినచర్యవ్రాయు పుస్తకము.

## డొ

డొంక. దే. వి. 1. పొద. "సీ. పాలచేరులఁబట్టి తూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూఱి చుట్టఁబెట్టు." స్వా. ౪, ఆ. ౪౨. రామలిం. ౧౭; 2. పల్లపుప్రదేశము. "చ...డొంకలను వంకలఁ బంకము లారె..." కృ. శతం. ౧. ఆ. ౪౪. "గీ గంగ ప్రవహించునీటిడొంకలును బోలె." పాండు. ౫, ఆ. ౧౫౪.

డొంకవల. దే. వి. (డొంక+వల.) ఒకరకపువల హంస ౪, ఆ. ౧౮౫.

డొంకు. దే. అ. క్రి. (క. డొంకు.) 1. క్షీణించు. "ఉ...దరస్మితవిలాసపుఁజంద్రిక డొంకి వాడు టన్." స్వా. ౩, ఆ. ౫౩. నా. పంచ. ౨, ఆ. ౧౧౪; 2. తగ్గు. "చ...మరుశాట్ల తెఱంగున ంకి డొంకి పొర్లినగతి..." హంస. ౩. ఆ ౦౩; 3. ఇంకిపోవు. "క. ధరణీపంకంబు లింకె బిసులు డొంకెన్." భా. రా. కిష్కిం ౪౦౯. సిం. ౩, ఆ. ౧౧౦; 4. దాఁగు. "సీ. ఇన రాంతరముల కెడయాని మ్రాని క్రీనీడజాడల ంకి నిలిచెఁ గొన్ని" వేం. పంచ. ౪, ఆ. ౩౯; 5. వెనుదీయు. "చ. ముని మునిచీఁకటి డువ ముంగిటివాఁకిట నైననొంటిపాటున నడ ాడుజవ్వనుల డొంకక పయ్యెద యైనఁ బెట్ట ునను...పట్టు..." దశా. ౮, అ. ౨౨౭. వి. ంకర. "ద్వి. గూను డొంకులు దీఱఁ గ్రమ్మడి ఱ." రం. రా. అయో. ౧౩౦, పొ. ౧౪. . రా. వి. ౧, ఆ. ౨౬. విణ 1. వంకరైనది. సీ. వికలంపుఁ దార్ఢ్యపోలిక డొంకుచేతులు పందిలి

గుంజలపగిది కాళ్లు." ప్రబంధ. ఉ౨౩, ఉ. హరిశ్చ. ౪, ఆ ౧౫౭; 2. అవ్యక్తమధురమైనది. "ద్వి మల్లడిగొనడొంకుమాటలు నేర్చి." రం. రా. బాల. ౨౦. పొ. ౭౯. పం.

డొంకెన. దే.వి. 1. వంకరయలుగు గలయాఁటె.(శ.ర.) వంకర యైనఛేదనసాధనము. "పే.. కుఁటెల డొంకెనలక్ గటార్ల బల్, కత్తుల సత్తలంబు లను." కళా. ౮, ఆ. ౫౭. భోజసుతా. ౩, ఆ. ౭౯; 2. చివరచిన్నపుల్ల కట్టి కాయలు మొ. కోయుట కుపయోగించుగడ. (వా.) ఆడొంకె నతో కాయలు కోయుము.

డొంకెనపోటు దే. వి. (డొంకెన+పోటు.) డొంకె నతో పొడిచినపోటు. "క. పడిఁ దేఁజి దోలి రా జుర్వడి డొంకెనపోటుగా నురుక్షరలి నవు డా, పిడికిటిగొరకన్ వేయన్..." సా. ౧, ఆ. ౯౬. "సీ. డొంకెనపోటులఁ బొంక మడఁచి." భార. శల్య. ౧, ఆ. ౩౪౦.

డొంగ. దే. వి. దొంగ. "గీ. డొంగవలె వచ్చి యిచ్చట డొంగిసా వ,దేమయా..." వైజ. ౪, ఆ. ౩౬.

డొంగియాడు. దే. అ. క్రి. (డొంగి+ఆడు.)బాలురు చేతులు మోకాళ్లు అని నడచు..."సీ. ఎలనవ్వు పాలబుగ్గలపై దువాళింప నత్తత్త యని డొంగి యాడు చుండ." సా. ౧, ఆ. ౪౯. ద్వి. పరమ. ౫, ఆ. ౩౭౭. పొ.

డొంగు. దే. అ. క్రి. 1. దాఁగుకొను. "గీ. డొంగ వలె వచ్చి యిచ్చట డొంగిసా వ,దేమయా..." వైజ. ౪, ఆ. ౩౬; 2. ప్రాఁకు. "ద్వి. ఎలమిఁ గూర్చుండియు నేఁగరాకున్న, నిల డొంగి డొంగి యొక్కింత సనఁగ, బోరఁ బోరి డొంగియుఁ బోవ రాకున్న." పండితా. పర్వ. ౫౨౩, పొ. ౧౨. పం. వి. 1. చెట్టుతొఱ్ఱ. (బ్రౌ. శ. ర.); 2. చిల్లి, రంధ్రము. (చూ. డొంగులువాఱు.)

డొంగులువాఱు. దే. అ. క్రి. (డొంగులు+వాఱు.) తొఱ్ఱలేర్పడు. "ద్వి. పలుచని నిడువాలు పదను తూపునను, గొలిచినరీతి డొంగులువాఱ గొఱిఁగి." ఆ. మ. క. ౨౦౮, పొ. ౧౬. పం.

డొంకారము. దే. వి. కడుపు, అంతరాళము. (శ. ర. చూ. డొంకారముసొచ్చు.)

డొకారముపొచ్చు. దే. అ. క్రి. (డొకారము+చొచ్చు.) 1. లోపల ప్రవేశించు. "చ. కరుణను బ్రోవుమం చని డొకారముసొచ్చెను నాఁగ..." పార్వ. ౫, ఆ. ౨౦౭; 2. శరణుచొచ్చు. "చ. గరగరి మాని యొక్కట డొకారము సొచ్చుమహాద్రులో యనన్." చంద్రా. ౧, ఆ. ౧౩. ౪, ఆ. ౨౭౦.

డొక్క. దే. వి. (క. డొక్కె.) 1. ఎముకలగూడు, కంకాళము. "క. భూనాయక దుందుభి యను, వానికళేబరము నెత్త వాలి యొకం డా, నే నొకఁడ నగుదుఁ దక్కిన,వానికి నాడొక్క నెత్త వచ్చునె జగతిన్." భా. రా. కిష్కిం. ౧౪ భార. శాం. 3, ఆ. ౨౧౪; 2. టెంకాయపై చెక్కు. ఉదా:—కొబ్బరిడొక్క; 3. శవము; ఆం. భా. ద్వి. ౧౩౪; 4. శరీరము. "వెక్కసపుమద్యపానపు, డొక్కపసం దగిలి దుర్వ్యటుఁడై చెడితిన్." భాగ. ౬, స్కం. ౧౩౬. వేమన. ౧, ఆ. ౧౬౭; 5. ఉదరము. "గీ. శరధిజలమెల్ల రిత్తగాఁ గురియ నుప్పు, డొక్కఁ జేరిన నత్తెల్వ చిక్కె..." ఆము. ౪, ఆ. ౧౭౦. ఆం. సం. మాన. ౨౪. విణ. ముసలివాఁడు. ఆం. భా. ద్వి. ౧౧౮.

డొక్కబుట్ట. దే. వి. (డొక్క+బుట్ట.) లేగ పాఁటి పీడిన తాటివిత్తు. (శ. ర.)

డొక్కరము. వై. వి. (సం. దోఃకరమ్. క. డొక్కర. హిం. ఠోకర.) మల్లబంధవిశేషము. "గీ. కళవరానకు వచ్చి డొక్కరము హత్తి." ఉ. హరి. 3, ఆ. ౬౮. భాగ. ౧౦. స్కం. పూ. ౧౩౪౫.

డొక్కు. దే. అ. క్రి. ముదియు. (శ. ర.) విణ. ముదిసినది. ఆం. భా. ద్వి. ౧౧౯.

డొగరు. దే. వి. 1. అపరాధము; 2. నింద. (శ. ర.)

డొప్ప = దొప్ప. (దొన్నె.) "గీ..... డొప్పచెవులును..." నైష. ౭, ఆ. ౯౩.

డొమిణి. దే. వి. (హిం. డోమని.) దొమ్మరులలో నొకజాతివాఁడు. హంస. 3, ఆ. ౨౯.

డొలుక. దే. వి. దొలుక. "క. రవిమండలము డొలుకగా నని చెప్పెన్." కళా. ౨, ఆ. ౧౯౦.

డొల్చు. దే. స. క్రి. డొల్లఁజేయు, దొరలించు. "సీ...ఆలండికలు డొల్చె సత్యలోకంబుననుండి యాకమలగర్భుఁ డు..." కాశీ. ౧, ఆ. ౭౭.

డొల్ల. దే. వి. 1. చేటవలె మూఁడుప్రక్కలందు అడ్డుపలకలు గలబల్ల లోనగునది. "మ...విరోధులంబునిధి వెల్లిం డొల్లఁ జెల్లింపఁగన్. ఉ: హరి. ౪, ఆ. ౨౦౬; 2. మల్లసాధనవిశేషము. "సీ. కంబము కొణత లాగను డొల్ల..." ప్రబంధ.౨౨.

డొల్లఁబొట్ట. దే. వి. (డొల్ల+పొట్ట.) బొజ్జకడుపు. "క. డొల్లంబొట్టయు వంకర,కాళ్లన్..." మల్హాణ, ఆ. ౬౭.

డొల్లు. దే. అ. క్రి. 1. పొరలు, ప్రవహించు. "గీ. డొల్లునీరంబు నాఁకట్టఁ జెల్లఁగాక." కవిక. ౪, ఆ. ౧౧౯; 2. దొరలు. "సీ. ఎలనీటిబొండలంబులువోలె మెదడెల్ల జుట్టివెచిన డొల్లుపుట్టగములు." ఆము. ౬, ఆ. ౧౭. కాశీ. ౧, ఆ. ౭౭; 3. వ్రేలాడు. "చ...ఒయారపుగందపుఁబూఁత డొల్లుపొగులు..." హంస. ౧, ఆ ౨౩౨; 4. తెగిపడు. "క.. విందునితల యిల్లపై డొల్లఁగ నేసెఁ దీవ్రభల్లప్రహారిన్." భార. ద్రో. 3, ఆ. ౧౪౬. భార. భీష్మ. ౧, ఆ. ౨౭౦; 5. నడలగు. "ద్వి. డొల్లకుప్పసములు నల్లగాఁజాలును." పండితా. పర్వ. 3౫3, పొ; 6. వడిపోవు. "చ. నివిడినబొజ్జపై మిగులనిద్దపుదోవతిదట్టి డొల్లి రాఁ, దివిచి..." ఆము. ౬, ఆ. ౭౧; 7. చచ్చు. "చ...ఆరాతిసేన డొల్లనడిచి యూసుశర్మని బలంబుఁ జలంబును మాన్చి..." భార. విరా. 3, ఆ ౨౦౪. విణ. వ్రేలాడునది. "వ...మూరకొక్కుండును జేన కొక్కుండును గాఁ గుట్టిన డొల్లుటుల్లారు లఁల్లసిల్లి..." ఆము. ౪, ఆ. 3౫.

## డో

డోంబి. సం. వి. ఈ. స్త్రీ. రూపకములలో నొకటి.

డోఁకి. దే. వి. పట్టుకొనుటకు వెదురుబద్ద గ్రుచ్చిన చిప్ప. "సీ. చెలమలో నీరుడోఁకులఁ జెట్ట దోఁడుఁగా కద్ధితో యముఁ దోడ నలవి యగునె." రామలిం. ౯౨.

డోఁకు. అ. క్రి. (హిం. డోక్.) క్రక్కు. (వా.) వి. వమనము. (శ. ర.) స. క్రి. గడ్డిలోనిగువానిని పాఱ మున్నగువానిచే చెక్కు. (వా.)

డోఁగాడు. దే. అ. క్రి (డోఁగు+ఆడు) బిడ్డ నేలపై చేతులుపెట్టి మోకాళ్లతో ప్రాఁకు. (చూ. డోఁగియాడు.)

డోఁగియాడు = డోఁగాడు. "సీ. కొమరొప్పఁ దమఁదాన కూర్చుండఁగా నేర్చి నాడకాడకు డోఁగియాడనేర్చె." చంద్రా. ౪. ఆ. ౪. (శ. ర. పా.)

డోఁగు. దే. అ. క్రి. 1. డోఁగియాడు. (శ. ర.); 2. మేనితోలు ఒలుచు. (శ. ర.)

డోకడా. దే. వి. 1. నూటవపాళు. (బ్రౌ. శ ర.) 2. వడ్డికట్టుటకు మూలధనసంఖ్యను కాలముచే గుణింపగా వచ్చినమొత్తము (వా.)

డోరడి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు.

డోరము. సం. వి. అ. న. చేతికిఁ గట్టుకొను వ్రతసూత్రము.

డోరములు. దే. వి. బ. కత్తిమీఁదిచారలు. (శ. ర.)

డోరియా. ఉ. వి. (ఉర్దూ. డోర్యా.) ఒకవిధమైన చార. (వా.) డోరియాచీర.

డోల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉయ్యాలవంటియానసాధనము; 2. ఉయ్యాలతొట్టె; 3. నీలిచెట్టు.

డోలనము. సం. వి. అ. న. ఊఁచుట.

డోలాబ్జము. సం. వి. అ. న. కలువపూవు. (శ. ర.)

డోలాయంత్రము. సం. వి అ. న. ఔషధశుద్ధికై యుపయోగించుయంత్రము.

డోలి. వై. వి. (సం. డోలికా.) ఉయ్యాలవంటి అందలము. (శ. ర.)

డోలిక. సం. వి. ఆ. స్త్రీ. డోల.

డోలు. వై. వి. (సం. ఢోలక.) చర్మవాద్యవిశేషము. "వ... ముఖవీణె... డోలు... మున్నగు ననసంఖ్యాత వాదిత్రత్రితయపరంపరలు......" ఆము. ౪, ఆ. ౩౯. అచ్చ. యు. ౨౦౯.

డౌ

డౌలు = దవులు. (మదింపు. రీతి. శ. ర.)

ఢ

ఢ. సం. ఒకానొక అక్షరము. వి. అ. పుం. 1. ఢక్క; 2. కుక్కతోఁక; 3. పాము; 4. కుక్క; 5. ప్రతిధ్వని. విశే. (అ. ఆ. అ.) నిర్గుణుఁడు.

ఢకాఢకి. దే. వి. తాఁకుటయం దగుధ్వని కనుకరణము. "వ... మొకమ్ములు వంచి రెండిమ్ముల ఢకాఢకిఁ దాఁకి..." ప్రబంధ. ౧౮౬.

ఢకీలు. దే. వి. మొట్టుట, తాఁకుట మున్నగువానియం దగుధ్వని కనుకరణము. (దీనియామ్రేడితము. ఢకీలుఢకీలు.) "ఉ. కిట్టి వెడంద పేరెద ఢకీలుఢకీలునఁ గుమ్మలాడు..." ప్రబంధ, ౯౩.

ఢక్కా. సం. వి. ఆ. స్త్రీ. 1. డంకా; 2. ఢక్కి.

ఢక్కను. దే. వి. మహమ్మదీయులలో నొకజాతి. (దక్కనుదేశస్థులు) రంగా. ౨, ఆ. ౩౯.

ఢక్కామొక్కి. ఉ. వి. ఇరుకు, సంకటము. (బ్రౌ.)

ఢమామిక. సం. వి. ఆ స్త్రీ. చర్మవాద్యవిశేషము.

ఢమామి. దే. వి. ధరంగివంటి మారణసాధనము. "వ . ఢమామిలఢమఢమలు .." కృష్ణ. ౩, ఆ ౭౯.

ఢమి. దే. వి ప్రేలుటయం దగునసుకరణము. రంగా. ౩, ఆ. ౬౪.

ఢమిలు. దే. వి. ప్రేలునప్పటిధ్వని కనుకరణము. "చ. పరువడి నొక్కపెట్టునఁ దుపాకులు ఢామ్ము ఢమి ఢ మిలునన్." రంగా. ౩, ఆ. ౬౪.

ఢా

ఢాం. దే వి. ప్రేలెడిధ్వని కనుకరణము. "వ... పెట్టుఁ గ్రోవుల వరుసల . ఢాం ఢంకరణశబ్దంబులు..." ప్రబంధ. ౭౮౮.

ఢాంగు. దే. వి. ప్రేలెడిధ్వనికనుకరణము, ప్రబంధ. ౭౭౮.

ఢాక. దే. వి. 1. చెలరేఁగుట. "క. బల్లిదుఁడు కృష్ణభూపతి, పెల్లుగ ఝుళిపించువాలు పెనుఢాకకు భీతిల్లినపగవాఁడు..." కళా. పీఠి. ౯౦. ప్రభా. ౨, ఆ. ౧౧౬; 2. ఉత్సాహము. "ఉ. తెచ్చిన నెక్క యవ్విభుఁడు తీవ్రత లంకకు సమ్ముఖంబుగా, హెచ్చినఢాక ఢేయనిన నేమని చెప్పు..." పరమ. ౩, ఆ. ౩౧౯. 3. పరాక్రమము; "క. అమల పాటు వియోగులకే కాదు ప్రపంచధర్మ మెఱుఁగని వృకా, నీకంబునకుం గలిగెను, ఢాక వసంతు నిజ మిక్కుటంబుగ ధాత్రిన్." శకుం. ౨. ఆ. ౧౧౧.

ఢాణదారు. దే. వి. మల్లయుద్ధమందలి పదునాలుగు విసరులలో నొకటి. ప్రబంధ. ౭౮.

ఢామర. సం. వి. ఆ. స్త్రీ. అడుహంస.

ఢామ్ము. దే. వి. ప్రేలుటయం దగునసుకరణము; "చ... ఢామ్ముఢమీఢమిలునన్." రంగా. ౩, ఆ. ౬౪.

ఢాలము. సం. వి. అ. న. డాలు.

ఢి

ఢిమఢిమ. దే. వి. ప్రేలుటయం దగుధ్వనికనుకరణము, కృష్ణ. ౩, ఆ. ౭౯.

ఢిమిరింగు. దే. వి ప్రేలుటయందగుధ్వనికనుకరణము, ప్రబంధ. ౭౮౮.

ఢీ

ఢీ. సం. వి. ఈ. పుం. గొఱ్ఱెపోతులను పోట్లాడించుటకై ప్రేరేపించుమాట.

ఢు

ఢుంఢి. సం వి ఇ. పుం. కాశీకయందు దుండుగణేశ్వరుఁడు. (డుంఠి యని తెనుఁగుకవులు చూ. డుంఠి)

ఢో

ఢోలము. సం. వి. అ. పుం. డోలు.

ఢౌ

ఢౌకనము. సం. వి. అ. న. 1. గమనము; 2. పొందించుట.

ణ

ణ. ఉభ. ఒకానొకయక్షరము. సం. వి. అ. పుం. 1. బిందుదేవుఁడు; 2. అలంకారము; 3. చలిపందిరి; విణ. గుణహీనుఁడు. (దీనికిఁ దెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు.)

త

త. ఉభ. ఒకానొకయక్షరము. దే. ప్ర. 1. కొన్ని శబ్దములకు స్త్రీత్వమతుబర్థముల వచ్చుతద్ధిత ప్రత్యయము. ఉదా:—బోయత, మాలెత మొ. ద్రు; 2. ధాతువునకు ఆశీరాద్యర్థమందు వచ్చు ప్రత్యయము; "శా...సీ, తాభూమీపతి ప్రోవుతం దిరుమలేంద్ర శ్రీమహారాయనిన్." వసు.౧, ఆ ౧; 3. యువర్ణాంతధాతువులకు తఱచుగా వచ్చు కృత్ప్రత్యయము. ఉదా:—కోఁత, కలఁత. మొ. సం. వి. అ. పు 1. తోఁక; 2. ఱొమ్ము; 3. గర్భకోశము; 4. దొంగ; 5. యోధుఁడు; 6. అలంకారము; 7. దుర్మార్గుఁడు. న. 1. ధర్మము; 2. భావము; ఆ. స్త్రీ. లక్ష్మీదేవి. (దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు.)

తంకము. సం. వి. అ. పుం. 1. వియోగదుఃఖము; 2. కష్టజీవనము; 3. భయము. 4. కట్టుబట్టు; 5. ఉలి.

తంకర. దే. వి. పొల్లు, గింజలేనిధాన్యము. ఆం. భా. ద్వి. ౨౩౮.

తంగు. దే. వి. గుఱ్ఱపుగంత జాతిపోతుండ బిగఁగట్టెడు వారు. ఆం. భా. ద్వి. ౧౯౯.

తంగువారు. దే. వి. (తంగు+వారు) తంగు (శ. ర.)

తంగేడు. దే. వి. ఔ. అనా. గుల్మవిశేషము. ❀ "సీ. కెలఁకుల నున్నతంగేటిజుర్రు గృహమేధి .." స్వా. ౧, ఆ. ౬౬. రసిక. ౫, ఆ. ౧౩౧.

తంగేడు - తంగెడు. "సీ ..పైఁడితంగేడు తంగేడు తగిడి యుస్తె." హంస. ౪, ఆ. ౧౦. కాశీ. 3, ఆ. ౧౧౦.

తంగేడుగొరవంక. దే. వి. (తంగేడు+గొరవంక.) తంగేడుపూవువలె పచ్చనిరంగు గలగొరవంక; "సీ ..తంగేడుగొరవంక జక్కన చెరువుకోడి." హంస. 3, ఆ. ౧౭.

తంట. దే. వి. (క. తంటె) 1. మోసము; "ఉ. ఎందుకుఁ దప్పె యోజనలు కృష్ణునితంట లెటింగి దానిపై, నింద ఘటింప నేమగును..." రాధా. 3, ఆ. ౧౩౪ చంద్రా. 3. ఆ. ౧౦౭; 2. అధర్మము; "ద్వి. బాలుఁడ నని తంటపని సేయఁబోక." ద్వి. శ. సా. ౧, ఆ. ౪౮. పొ. ౧౭ పం. 3. బొఁడ్డీ, కొండెము. (శ. ర.) 4 కలహము (శ. ర.); 5, కష్టము. (వా); 6. చిక్కు; "గీ. కాని యవి రత్నమయము కాకటకములను, దాల్పఁజేసితి నే నంట తంట గాదె." పార్వ. ౫, ఆ. ౧౩౭; 7. అప్పు. (శ. ర.)

తంటలమారి. దే. విణ. (తంటలు+మారి) వంచకుఁడు; వంచకురాలు. "ఉ...ఆ, తంటలమారి మర్మముగ దానికి నాన్నపుప్రేముఁ దెల్పఁగన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౪౫.

తంటసము = తండసము. "ద్వి...తంట, సమ్మున నిడి కొయ్య చక్కనఁ బెఱుక." పండితా. పురా. ౧౩౪. పు.

తంటా = తంట. "క. వింటివా లేదో యిపు డొక, తంటా గొనితెచ్చు కొంటి..." చంద్ర. వి. ౨, ఆ. ౯౦.

తంటియము = తంటెము.

తంటెము. దే. వి. తగిరిస. ❀ "క. తంటెపు మోకా యిదేమి తబ్బిబ్బోకా." చంద్ర. వి. ౨. ఆ. ౯౦.

తండ. సం. వి. ఆ. స్త్రీ. దెబ్బ.

తండకము. సం. వి. అ. పుం. న. 1. నురుఁగు; 2. కాటుకపిట్ట; 3. చెట్టుబోదె; 4. గృహదారువు; 5. అలంకారము; 6. సమాసవాక్యము; 7. ఒకానొక వృత్తవిశేషము. (శ. ర.)

తండకుఁడు. సం. విణ. (అ. డి కా. అ.) 1. మాయావి; 2. బాధించువాఁడు.

తండము. సం. వి. అ. పుం. గుంపు "సీ...తఱపడ్డ కంకాళతండములును." కాశీ. 3, ఆ. ౧౬౭; "క. మనుమలతండము గని..." భార. భీష్మ. 3, ఆ. ౩౮౫.

తండతండములు. సం. విణ. అపరిమితము "మ...తగెం దమంబుల్ తండతండంబులై." విప్ర. 3, ఆ. ౪౮. పి. శకుం. ౧, ఆ. ౮౬.

తండసము. ఉభ. దే. వి. మంగలి వెండ్రుక లూడలాగు సాధనము. "క...తండసంబులును బోటు బిన కెందుకోరల బిట్టూడి..." కాశీ. ౪, ఆ. ౬౮. సం. వి. అ. పుం. అంగారధాని; కమ్మరకొలిమి. (శ. ర.)

తండా. దే. వి. 1. లంబాడీ మున్నగువానిగుంపు(శ.ర.); 2. సరకు నింపినగోనెల సమూహము. (శ. ర.)

తండారు. దే. అ. క్రి. (తండు+ఆరు.) చల్లారు. "ద్వి. తరమఁ జేసియు నేల తండారవైతి." రం. రా. అయో. ౧౧౫, పా. ౪౫. పం.

తండిగము. దే. వి. ఒకవిధ మైనగోనెసంచి; "చ. తణ గము లానుకంట్లములు తండిగముల్..." హంస. ౫, ఆ. ౯౭.

తండిరి. దే. వి. జనకుఁడు. "ఆ. అనిన వార లిట్టు లనిరి తండిరిచావు, వినియు వెనుకచేసి చనఁగ నగునె." భో. ౬, ఆ. 3౭౦. (శ. ర. పా.)

తండు. దే. స. క్రి. (అ. క్రి. అని. శ. ర. బ్రా. 1. ఈయవలసిన ధనాదికమును అడుగు. (శ. ర.); 2. ధనమును వసూలుచేయు. (బ్రా.)

తండుగోల. దే. వి. 1. చేఁపలను పొడిచెడి చిల్లకోల. "సీ. చుంగు లల్లాడుగోఁచులు తండుగోలల సెట్టు కొల్పిన మీలపుట్టికలును." వేం. పంచ. ౧, ఆ. ౬౦3; 2. తెడ్డు. (బ్రా.)

తండురీణము. సం. వి. అ. పుం. 1. పురుగు; 2. కడుగునీరు.

తండులము. సం. వి. అ. పుం. 1. బియ్యము; 2. వజ్రమణియొక్క మానభేదము.

తండులీయము. సం. వి. అ. పుం. 1. చిట్టికూర; 2. వాయువిడంగము; 3. ధాన్యము. (శ. ర.)

తండువు. సం. వి. ఉ. పుం. 1. నందికేశ్వరుఁడు. "క. కలకల మని మోగసాలకు, వెలుపట నొక రవళి వొడమ విని తండువు నక..." పార్వ. ౪, ఆ. ౪3.

తండెలు. దే. వి. ఓడపెత్తనగాఁడు. (శ. ...)

తండేలు = తండెలు. (శ. ర.)

తండోపతండములు. సం. విణ. బ. (తండములు+ఉప తండములు.) అపరిమితము. "ఆ. తప్పు లెన్ను వారు తండోపతండములు..." వేమన. ౨, ఆ. ౧౮ "సీ ..తండోపతండములు వీరభటప్రవరులు." వరాహ. 3, ఆ. ౨౮.

తండ్రి. వై. వి. (సం. తాతః. క. తందె. త. తంద్రై.) 1. కన్న వాఁడు, జనకుఁడు. "శా. తల్లిదండ్రియును నన్నుఁ గానమనస్తోకంబుసం. బోక్కుఁగా..." స్వా. 3, ఆ. ౯౪. ఆము. ౪, ఆ. ౧౪౯; 2. వాత్సల్యము భక్తి మున్నగునవి సూచించునపు డుపయోగించుపదము. "గీ. ఎన్ని వేర్చితి నను గన్న చిన్నితండ్రి." హా. ౫, ఆ. ౬౬. "ఆ. పతియు శరణముఁడు బంధుండు గాపునఁ దండ్రి మమ్ముఁ బ్రోవఁదగుదు వీవు." భా. రా. అర. ౧. ఆ. ౫.

తండ్రితండ్రి. దే. వి. పితామహుఁడు. (శ. ర.)

తంతి. ఉభ. దే. వి. వీణెతీఁగ. ఆం. భా. ప్ర. ౧౨౬. సం. వి. ఇ. స్త్రీ. 1. త్రాడు; 2. గోవు; 3. వరుస; 4. విరివి. (బ్రా.)

తంతికుఱుపు. దే. వి. (తంతి+కుఱుపు.) నారకుఱుపు.

తంతిపాలుఁడు. సం. వి. అ. పుం. 1. గోపాలకుఁడు; 2. అజ్ఞాతవాసమున సహదేవుని పేరు.

తంతియలు. దే. వి. బ. మెట్లు. "చ. వెనుకొని కోట తంతియలవెంబడిగా దిగివచ్చి..." ముకుంద. ౧, ఆ. ౨౧. పా. 3. పం.

తంతు. వై. వి. (సం. తంత్రమ్. క. తంతు.) 1. ఉత్సవము. ఆం. భా. ప్ర. ౧౪3; 2. ఉభయార్థ సాధక మైనయుపాయము. (శ. ర.); 3. చేయఁదగినక్రియ. (వా.); 4. మోసము. (వా.)

తంతుకాష్ఠము. సం. వి. అ. న. 1. సాలెవానినాడె; 2. నూలువడకెడికదురు.

తంతుకీటము. సం. వి. అ. పుం. 1. పట్టుపురుగు. 2. సాలెపురుగు.

తంతునాగము. సం. వి. అ. పుం. సర్పాకారమైన జలజంతువు, సెగడు. (శ. ర.)

తంతునాభము. సం. వి. అ. పుం.-నాభియందు ధారము గలది - సాలెపురుగు.

తంతుభము. సం. వి. అ. పుం. 1. తెల్లావ; ✽ 2. దూడ.
తంతువాయము. సం. వి. అ. పుం. 1. నేఁత; 2. సాలెపురుగు.
తంతువాయుఁడు. సం. వి. అ. పుం. నేఁతగాఁడు; సాలె.
తంతువు. సం. వి. ఉ. పుం. 1. దారము; 2. తామరతూఁడు లోనగువానియందలి దారము; 3. వీణతీఁగ; 4. సుజ్ఞసంస్థ. పుం. న. 1. కత్తి; 2. కత్తిపిడి. న. సాముభేదము.
తంతుశాల. సం. వి. ఆ. స్త్రీ. నేఁతనేసెడియిల్లు.
తంతుసారము. సం. వి. అ. పుం. పోఁక. ✽.
తంతె = తంతియ. (మెట్టు.) ఆం. భా. ద్వి. ౨౨.
తంత్రకవం. సం. వి. అ. పుం. 1. క్రొత్తబట్ట; 2. తంత్రము.
తంత్రణము. సం. వి. అ. న. కార్యములను సక్రమముగ నడపుట.
తంత్రపాలుఁడు. సం. వి. అ. పుం. సేనాధిపతి.
తంత్రము. సం. వి. అ. న. 1. కుటుంబమును పోషింపఁదగువ్యాపారము; 2. సిద్ధాంతము; 3. ఔషధవిశేషము; 4. ముఖ్యాంశము; 5. పరివారము 6. హేతువు; 7. సైన్యము; 8. రాష్ట్రము; 9. స్వరాష్ట్రచింత; 11. ధనము; 12. శపథము; 13. మార్గము; 14. గృహము; 15. శివప్రోక్తమగుశాస్త్రవిశేషము; 16. నూలిపోఁగు; 17. రాజ్యాంగపరిపాలనాదివ్యవస్థ; 18. శాస్త్రము; 19. పూర్వమీమాంసాశాస్త్రము; 20. సమూహము, గుంపు
తంత్రి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1 వీణాగుణము; 2. తిప్పతీఁగ ✽; 3. దేహమందలిసిర; 4. త్రాఁడు; 5. ధనురాదులనారి. న్. పుం. 1. గాయకుఁడు; 2. యోధ. విణ. (న్. ఙీ. న్.) 1. తంతువులు గలది. (బట్ట); 2. తీఁగలు గలది. (వీణె.)
తంత్రీపాలుఁడు. సం. వి. = తంతిపాలుఁడు.
తందనతానలు. దే. వి. బ. 'తందానతాన' అను పల్లవితో పాడుపాట. "శా. ఏలలే తందనతాన లేమయిన లేవె యంచు..." వే. పంచ. ౨. ఆ. ౧౩౩.
తందనపదములు. = తందనతానలు. (వా.)
తందనము. వై. వి. (సం. తానః.) 1. తానశబ్దపూర్వకముగాఁ జేయు రాగాలాపము; "గీ. నారదుఁడు మెచ్చుచును తందనాలు పాడె." దశా. ౬, ఆ. ౧౩౭. కళా. 3, ఆ. ౧౮౭; 2. పోరు, జగడము. (చూ. తందనాలజడదారి.) గంతులు వేయుచు సంతోషముతో పాడుపాట.
తందనాలజడదారి. వై. వి. (తందనాలు+జడదారి.) నారదుఁడు. "చ. జగడపుఁ గూటిసత్తరువు సారెకుఁ గోరుకుమ వీరివారిసిం, దగిలెడుతందనాలజడదారి..." కళా. ౨, ఆ. ౩౮౭.
తందర. వై. వి. (సం. తంద్రా.) 1. కునికిపాటు. "సీ. నిన్న విశ్వామిత్రునికిఁ దందర ఘటించి యెడలెఱుంగక పడియుండఁ జేసె." కువల. ౨, ఆ. ౮౦; 2. ఆలసట (బ్రౌ.) "చ...చిట్టుగంధమున్...తడఁబడుయానమున్ వలపుతందరయుం దగమారుసాదనం,బడలి..." రాధికా. 3, ఆ. ౧౧౨: 3. దిగులు. "ఉ. సుందరయాన యిందుమణిసుందరమందిరసీమ లేమికిం,దందరఁ జెందె." కాళిందీ. ౨, ఆ. ౧౭౨.
తందానతానలు = తందనతానలు. (వా.)
తంద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. బడలిక; 2. కునుకుపాటు; 3. సోమరితనము.
తంద్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బడలినది; 2. సోమరియైనది; 3. సోమరి.
తంద్రి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. తంద్ర.
తంప. సం. వి. ఆ. స్త్రీ. ఆవు.
తంపటి. దే. వి. 1. తేగలు మున్నగువానిని కుండలు పెట్టి బోరగిలఁజేసి పైని మంటపెట్టి ఉడికించుట. (వా.); 2. పెద్దమంట. (బ్రౌ.)
తంపము. దే. విణ. 1. సాంద్రము; 2. సమూహము. (చూ. తామరతంపము.)
తంపర. దే. వి. తియ్యనినీరూరెడుపల్లపుప్రదేశము. విణ. 1. సాంద్రము. ఆం. భా. తృ. ౧౬; 2. సమూహము. "గీ. అచటివారలుజవస్ఫూర్తి నందలేక, దురుసుటంపలతంపర దోనలఁ బడియె." సుదంతా. ౧. ఆ. ౯౩.
తంపి. దే. వి. 1. దాలి; దాలిగుంట "సీ. చేతులు గొనిపోయి చెఱియఁ దంపులఁ బోసి పెనుమంట లోఁ డొంట తనరఁజేయం." హరి. పూ. ౯, ఆ. ౨౦౬. ఆం. భా. ద్వి. ౨౮౧; 2. కలహము. (శ. ర.)
తంపిపెట్టు. దే. అ. క్రి. (తంపి+పెట్టు.) 1. తంపటిలోఁ గాల్చు. (బౌ.); 2. జగడము పురికొల్పు. (బ్రౌ. వా.)

తంబ. ఉభ. దే. వి. ఒకవిధ మైనతీఁగ. ప్ర. "గీ... శింబి యాఁ జమ్మ తంబ యనంగ..." ఆం. భా. ద్వి. ౭౨. సం. వి. ఆ. స్త్రీ. అవు. (వై. ని.)

తంబళి. దే. వి. శివపూజ చేయు ఒకానొకజాతి "సీ నంబికవిత్వంబు తంబళిజోస్యంబు .." వేణు. ౭౨. చంద్ర. వి ౩, ఆ. ౧౬౧.

తంబళి. దే. వి. (తంబళ+ఇ) శివార్చకుఁడు "గీ...పూజసేయఁ, గ్రొత్తకాణాచితంబళి హత్తుకొనియె." హంస. ౧ ఆ. ౧౮౨. ఆం. భా. ద్వి. ౨౮౪.

తంబి. దే. వి. తమ్ముఁడు. "చ...నీదుబావకున్, వినుతి యొనర్పు తంబి యన నీలగళున్ గని జాగి మ్రొక్కినన్." చెన్న. ౩, ఆ. ౧౫౮.

తంబికి, సం. వి. ఈ. స్త్రీ. ముక్కుమాట.

తంబిగె. దే. వి. మెడ నిడుపుగా నుండెడుచెంబు. (శ. ర. 'తంబిగ, తంబుగ' అని బ్రా.)

తంబు. దే. వి. 1. తమ్ముఁడు; 2. వాత్సల్యసంబోధన మం దుపయుక్తము. (శ. ర.)

తంబుగు = తంబిగె. "ద్వి. కుంకుమ నలుగిడి గొజ్జంగి నీరు, పొంకంపుఁ బసిఁడితంబుగులచే ముంచి" ద్వి. పరమ. ౫, ఆ. ౨౪౮. పా. ఆం. భా. ద్వి. ౨౪౫.

తంబుర. వై. వి. (సం. తుమ్బురమ్. క. తంబూర.) గాయకులు శ్రుతికై వాయించు తంత్రీవాద్యము. "క. వెనుకం బురుహూతుదెసం, దనతంబురవలన గెలిచె నానాగతులన్." కువల. ౪, ఆ. ౧౦౭

తంబురా = తంబుర. "సీ. అలతాళ్లపాక చిన్నన్న రోమము లైనఁ దంబురాదండెకుఁ దంతు లౌనె". వేణు. ౭౩. (వా.)

తకతక. దే. వి. తాళమునం దగుధ్వని కనుకరణము.

తకపికె. దే. వి. సంచలించుటయం దగుధ్వని కనుకరణము. "సీ. దాసిజనులఁ గన్నుఁ దకపికల్ వెట్టుచు." మల్హ. ౩, ఆ ౧౦.

తకపికలాడించు. దే. స. క్రి. (తకపికలాడు ధా. ప్రే.) మోసపుచ్చు. "ద్వి. ఒక పేదతపసిగా నూహించి నన్నుఁ, దకపికలాడింపఁ దలఁచితివేని" ద్వి. మారిచ. (బ్రా.)

తకపికలాడు. దే. అ. క్రి. (తకపికలు+ఆడు); 1 ఇట్టటు చలించు; "చ...తకపికలాడ నాచెలువు ధన్యత నందఁగ..." శశాం. ౪, ఆ. ౬౧; 2. తలఁగు; "చ. తకపికలాడు నంచు మదిఁ దాలిమి వీడును వేఁడు దైవమున్" రాఘా. ౫, ఆ. ౧౧; 3. మోసపడు. (చూ. తకపికలాడించు.)

తకరా = తకరారు. (వా.)

తకరారు. హిం. వి. వివాదము. (శ. ర.)

తకిట దే. వి. తాళమునం దగుధ్వని కనుకరణము; "గీ. తకిట తక్కిట యం చని తాళరీతి, రంభ మొదలైనవారు తలంటఁగలరు." పార్వ. ౫, ఆ. ౧౨౩.

తక్క. దే. అవ్య. ద్రు. వినార్థకము. "క...బ్రాహ్మణ, తాదశ దక్కనె ప్రశాంతిఁ దక్కఁ సుమారా." భార. శాం. ౫, ఆ. ౧౮౯. ఆం భా. తృ ౬౯.

తక్కటి దే. వి. త్రిముఖదీపిక. ఆం. భా. ద్వి. ౧౬౫, విశే. ఇతరము; "వ...చేయు దుసిసినం దక్కటి చేతం గైదువుగొని .." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౭, ఆం. భా. తృ. ౫౪.

తక్కరి. వై. విశే. (సం. తస్కరః—తక్కు+అరి.) 1 సూచకము; "ఉ...నాలుకపయి న్నువు గింజయు నానఁగట్టిబల్, తక్కరిశారదుం డతఁడు ..." నిరం. ౪, ఆ. ౧౮; 2. మాయ కలవాఁడు; "క. ముద్దులతక్కరిబిడ్డఁడు, మద్దులఁ గూల్పంగఁ దలఁచి మసలక తా నా, మద్దికవయున్న చోటికి, గ్రద్దన జో లీడ్చుకొనుచుఁ గడకుం జనియెన్." భాగ. ౧౦, స్కం. పూ ౪౦౦.

తక్కరీఁడు ద్వి. విశే. (తక్కరి+ఈఁడు. స్వార్థమున) మోసకాఁడు; "సీ. తక్కరీఁ డనుపల్కు దక్క నందఱకోర్కె లిచ్చువాఁడను..." అచ్చ. భా. ౧, అ. ౧౭.

తక్కల. దే వి. కళవళము. (చూ. తక్కలపడు.)

తక్కలపడు. ద్వి. అ. క్రి. (తక్కల+పడు) కలఁత నొందు; "వ...తక్కలపడి యిది యేమి చోద్యం బని విచారింపంగ..." ద్వా. ౧౧, ఆ. ౫౫, (బ్రా. పా.)

తక్కించు. దే. స. క్రి. 1. తొలఁగించు, చక్కఁ జేయు; "గీ. చక్కఁగా నిక్క దృక్కులు ముక్కు చక్కిఁ, జిక్కఁ దక్కించి..." సీతారా. ౧, ఆ. [illegible]; 2. మోసపుచ్చు; "క. క్రించా మూఢుని నిను దక్కించుట యన నెంత..." వేం. పంచ. ౪, ఆ. ౪౧౮.

తక్కిట దే. వి. తానధ్వని కనుకరణము; "గీ. తకిట తక్కిట యం చని తానరీతి" పార్వ. ౫, ఆ.౧౨౩

తక్కిడి. ఉభ. దే. వి. 1. మోసము (శ. ర.); 2. తక్కెడ. (వా.) వై. విణ. (సం. తస్కరః) 1. వంచకుఁడు; (చూ. తక్కిడితనము); 2. అబద్ధము; "క. ననుఁ జిత్తంబున మఱవకుఁ, డని తక్కిడివగల లోఁచకాంబువు లురులన్." చెన్న. ౨, ఆ. ౩౦౨.

తక్కిడికాఁడు. ద్వ. విణ. (తక్కిడి+కాఁడు. స్వార్థమున) వంచకుఁడు; "క. ఉక్కేడి నేలజేఁడులఁ, డక్కునఁ గనుఁబ్రామి సన్నిటకుఁ దెచ్చిరబల్, తక్కిడికాఁడవు..." అచ్చ. సుం. ౪౭, (శ. ర. పా.)

తక్కిడితనము. వై. వి. (తక్కిడి+తనము) మోసము. "గీ. జగిలి యిలువిద్య తక్కిడితనము నాది." విప్ర. ౪, ఆ ౨౮.

తక్కినవాఁడు. దే. విణ. అన్యుఁడు. ఆం. శే. ౭౧.

తక్కిలి. వై. వి. (సం. తర్కారి.) బుడ్డబుడుసర ౘె. ఆం. భా. ద్వి. ౫౦.

తక్కు. దే. అ. క్రి. 1. మిగులు; "ఉ. ఇక్కడ పౌండ్రభూపతి విహీనవివేకతఁ జేవ యెక్కఁగా, నెక్కడ వాసుదేవుఁ డిల నే నొకరుండన వాసుదేవుఁడన్, దక్కినవాఁడు నందకసుదర్శనశార్ఙ్గగదాదిహేతులన్, సుక్కక కట్టినన్..." ఉ. హరి. ౩, ఆ. ౪, భార. విరా. ౩, ఆ. ౧౧౫; 2. తక్కువగు; "ద్వి. తక్కనిధక్తితోఁ దల్లిదండ్రులకు, మొక్కి పోవుచు..." రం. రా. ఉ. ౮, పా. ౪, పం; 3 పోవు; "క...తమ మెల్లం, దుదివోయి లేక తక్కెను..." భార. అను. ౧. ఆ ౩౫౮, స్కా. ౪, ఆ. ౬౯; 4. ఉడుగు, అణఁగు; "ఉ...సందడుల్, దక్కె పురంబు వీథుల..." భార. విరా. ౨, ఆ. ౩౧౯; 5. తొలఁగు; "ఉ. అంచితవారవల్లి వలయాభరణంబులు తక్కఁ ద్రోయుఁ జి, ల్కంచుఁ బసిండి..." ఆము. ౧, ఆ. ౬౧, స. క్రి. 1. విడుచు. "చ. ధరణిపుచక్క గట్టెదురు దక్కి..." భార. విరా. ౧, ఆ. ౧౭౯; "ఉ...ధర్మముం, దక్కుట కోర్వఁజాలుదునె..." భార భీష్మ. ౩, ఆ.౩౦౭; 2. మానుకొను; "క. విటిఁ గెడివారికి నైనను, గఱపక తక్క రుచితప్రకారము..." భార. విరా. ౧, ఆ. ౧౧౬; 3. వంచించు; "క. ననుపు విటుని దక్కుచు నా, తనిచెలికానికిఁ బ్రియంబుఁ దగఁ జెప్పిన...' కాశ. ౪, ఆ. ౭౧; 2. టక్కుచేయు; "ఉ...అని యసత్యపుఁదక్కులు తక్కి పెండియున్." శుక. ౨, ఆ. ౨౧౭. వి. 1. విలాసము; "ద్వి. మొక్కినఁ గనుఁగొని మోహించి సుతునిఁ, దక్కులమాట లాతని నాడ లేదు." ద్వి. శ. సా. ౩, ఆ ౧౦౪, పా. ౧౫, పం; 2. విలాసచేష్ట; "ఉ...మాధవుఁ డూరక లంజతక్కులం, బూనె..." దశా. ౨, ఆ ౩౮౩; 3. మాయ; "ద్వి. మొక్కులు చిక్కులు మొఱఁగులు నక్క, తక్కులు నీ వట్టితానకంబులును" ద్వి. హరి. శ్చ. పూ. ౧౧౮౬, పం. ఉ. రా. ౪, ఆ. ౨౧౪; 4. అబద్ధము; ఆం. భా. ప్ర. ౧౧౯; 5. మిగులు; (శ. ర.); 6. విసర్జనము; ఆం. భా. ద్వి. ౧౭౩. విణ. 1. ఇతరము, అన్యము; "గీ. అట్టిగర్భంపునిలుపుత క్కన్నిగర్భ, ములును భవవస్త్రమున దగ్ధములుగఁ జేయు, ము..." భార. సౌ. ౨, ఆ. ౮౦, భార. శాం. ౧, ఆ. ౯; "గీ... దీన లేకుండుచొప్పు, దక్కొకంటను లేదు..." భార. స్వ. ౮౨.

తక్కుడు. దే. వి. 1. విడుచుట; "ఉ...వినయంబు దక్కుడ, స్థైర్యముఁ దేకయున్నె..." నిర్వ. ౪, ఆ. ౬౬. (శ. ర. పా.) 2. మిగులుట(బ్రౌ.)

తక్కులఁబడు. ద్వ. అ. క్రి. (తక్కులన్+పడు) మోసపోవు, "ద్వి. తక్కులఁబడఁడ నాదబ్బులఁ బడఁడ" పండితా. పర్వ. ౫౧౮, పా. ౧౬. పం.

తక్కులఁబెట్టు. దే. స. క్రి. (తక్కులన్+పెట్టు) మోసపుచ్చు; "ఉ. దారుణవృత్తి నున్ననను తక్కులఁబెట్టఁగఁ జూచెదేని..." వి. పు. ౧, ఆ. ౧౪౪.

తక్కులాఁడి. దే. విణ. (తక్కులు+ఆఁడి,) 1. వంచకురాలు; 2. విలాసవతి. (శ. ర.)

తక్కులాఁడు. దే. విణ. (తక్కులు+ఆఁడు.) 1. వంచకుఁడు; 2. విలాసవంతుఁడు. (శ. ర)

తక్కువ. దే. విణ. 1. న్యూనము; "శా. నీవై శిక్షయము లెట్టులన్ మెఱయునే నీకంటె నేఁ దక్కువే." స్కా. ౬. ఆ. ౪౯. వి. లాఘవము; "ఆ. ఇరువు రందు నప్పు డెక్కువ తక్కువ, యింత లేక..." విక్ర. ౪, ఆ ౧౮౩, భార. ఉద్యో. ౪, ఆ. ౫౯.

తక్కువపడు. ద్వ. అ. క్రి. (తక్కువ+పడు.) న్యూనతవొందు, "ద్వి.. తక్కువపూజావిధానంబు

తెల్లఁ, దక్కువపడకుండఁ దా నాచరించి." పండితా. పురా. ౧౨౪.

తక్కువపఱచు. ద్వ. స. క్రి. (తక్కువపడు ధా. ప్రే.) చులుకనచేయు; "వ...జక్కువకవలఁ దక్కువ పఱచుచు..." భీమ. ౧, ఆ. ౧౧౭.

తక్కువపాటు. ద్వ వి తక్కువపడు ధా. న్యూనత. "ఉ...అట్టు లైనయా, తక్కువపాటు లేక ప్రమదంబున దేవపదంబు నొందుదున్." భార ఆర. ౬, ఆ. ౧౭. హరి. ఉ. ౭, ఆ. ౯౧.

తక్కె. దే. వి. రెండువీసెలపరిమితి. (శ. ర. బ్రా.)

తక్కెడ. వై. వి. (సం. త్రికంటకమ్.) రెండుకుడుకలు గలత్రాసు. "ఆ. అక్కపోత మున్నతక్కెడ కుడుక వ్రేఁగైన..." శేషధ. ౨, ఆ. (శ. ర.) ఆం. భా. ద్వి. ౫౦.

తక్కెఱ. దే. విశే. అల్పము. (శ. ర.)

తక్కెల = తక్కిలి. (శ. ర)

తక్కేడ = తక్కెడ. (శ. ర)

తక్కేల = తక్కిలి. (శ. ర.)

తక్కొండు. దే. విశే. (తక్కు+ఒండు) ఇతరమైనది "మ...ధరన్ దక్కొంట నీసొంపు లే దని భావించురు..." కావ్యా. ౫, ఆ. ౭౮.

తక్కొరుఁడు. దే విశే. (తక్కు+ఒరుఁడు) ఇతరుఁడు "క. ఈమహనీయమహిమకును, ధాముము విష్ణుండు గాక తక్కొరుఁ డగునే." భార ఉద్యో. ౩, ఆ. ౨౬౬ నైష. ౩, ఆ ౧౪౪.

తక్కొను. దే. అ క్రి (తల+కొను) పూనుకొను. "ఉ...నరుఁడు తక్కొననేర్చునె నన్ను మ్రుచ్చిలన్." భార. ఆది. ౪, ఆ. ౯౦. భార అను ౪, ఆ. ౭౫.

తక్కోలము. సం. వి. అ. న. తక్కోలపుచెట్టు.

తక్తు. హిం. వి. సింహాసనము (శ. ర.)

తక్రకూర్చిక సం. వి. ఆ. స్త్రీ. పాలవిఱుగుడు.

తక్రపిండము. సం. వి. అ. పుం. నీరు వడియఁబోయఁగా మిగిలినపెరుగుబిళ్ల. [మజ్జిగ

తక్రము. సం. వి. అ. న. పాల్గవవంతునీరు చేర్చిన

తక్రసారము. సం వి. అ పుం వెన్న.

తక్రాటము. సం. వి. అ. పుం. మంథానము, కవ్వము.

తక్షకుఁడు. సం. వి. అ. పుం. 1. వడ్లవాఁడు; 2. సూత్రధారుఁడు; 3. విశ్వకర్మ; 4. ఒక సర్పరాజు.

తక్షణము. సం. వి. అ. న. చెక్కుట.

తక్షణి. సం. వి ఈ. స్త్రీ. బాడిస, కట్టెలు చెక్కు సాధనము.

తక్షుఁడు. సం వి. అ. పుం. 1. రామునితమ్ముఁడైన భరతునికుమారుఁడు; 2. వడ్లవాఁడు; 3. విశ్వకర్మ.

తక్సీరు. దే. వి (హిం. తక్సీర్.) అపరాధము. "గీ. మాయెడల నిట్టితక్సీరు మాపుచేసి." రంగా. ౨, ఆ. ౧౫౩

తగటి. దే వి. (తగటు+ఇ.) 1. జరి. "సీ. ధళధళ ద్యుతి నిండి తగటిమెఱుంగుదుప్పటి కాసెచుంగులు బాగుమీఱ." శశా. ౫, ఆ. ౪. దశా. ౧, ఆ. ౭౧; 2. జరిగలవస్త్రము ఆం. భా. ద్వి. ౧౫౯.

తగటీ - తగటి 1. (జరి.) "మ...గుజ్జరి నిద్దాతగటీ కరాళమాలతో సంపంగిపూఁ బాన్పునన్." చంద్రా. ౮. ఆ ౭౦; 2. (జరిబట్ట) "మ. తల నిద్దాతగటీలు..." రా. వి. ౨, ఆ ౫౨.

తగటు. దే. వి. 1. జలతారు. "గీ. తగటుఁ జీరలు రతనంపుఁ జెక్కఁ దొడవులు..." అచ్చ. బాల. ౧౬౮; 2. బంగరుజేకు. "గీ. తావికపురంపు బాగాలు తగటుపచ్చ,టాకులును." రసిక. ౧, ఆ. ౭౮; 3. బంగరు మెఱుంగుపూఁత. "సీ. తగటు చేసినక్రొత్తజిగి గన్నబాగాలబరణి..." సీమం. ౩, ఆ. ౧౮౧.

తగటుదట్టి దే. వి. జరిదట్టి. "గీ...మేలు, తగటు దట్టీల్ కుళాయీలు..." య. ౧, ఆ. ౬౫.

తగడు. దే. వి. (క. తగడు.) 1. బంగారు మున్నగువానిజేకు. "క. లలితాంగి వెన్నుకట్టియ, తళతళమను కుందనంపుఁదగడుం దెగడున్." పాండు. ౩, ఆ. ౨౦౨. ఆం భా. ద్వి. ౨౭౫; 2. పార. (చూ. తగడెత్తు).

తగడెత్తు. దే. అ. క్రి. (తగడు+ఎత్తు.) పారలెత్తు. "సీ. పగిలి బీటలువాఱి తగడెత్తెఁ గుఱుసంపు తోరంపువెల్లుల్లితునకలట్లు." భీమ. ౪, ఆ. ౧౩౦.

తగరము. ఉభ. వై. వి (సం. తమరమ్. క. తగరవు.) వంగ మనుమెత్తనిలోహము. "చ. తగరము వాఁడిచేసి వెడతాపసి నాకడ బీరగాఁడుగాఁ బొగడెదు.." కు సం. ౭, ఆ. ౩౩: సం. వి. అ. పుం. 1. సందివర్ధనము *; 2. మదనవృ

షము; 3. పొట్టేలు. (శ. ర.) న. తగరమూల మున పుట్టు నొక గ్రంథద్రవ్యము.

తగరు. వై. వి. (సం. తగరః.) పొట్టేలు; "క. కొం డం గని తగరు తాఁకఁగోరుట కాదే." భార. ఉద్యో. ౧, ఆ. ౨౩౭; "క...తాఁకు తగళ్ల నడుమఁ జచ్చినసక్కన్" సా. పంచ. ౧, ఆ ౧౭౨.

తగరుతాలు. ద్వ. వి. (తగరు+తాలు) మేషవాహ నుఁడు, అగ్ని. (శ. ర.)

తగరులవిడుపులు. దే. వి. బ. బాల్క్రీడావిశేషము; "మహాస్త్రగర, సరిబేసుల్ భూర్ణతుంకాల్ తగ రులవిడుపుల్..." ఇందు. ౨, ఆ. ౧౮.

తగవరి. దే. వి. (తగవు+అరి.) తీర్పరి, "క. తగవరి యగుతా నొంచినఁ, దగుదండము రాజువాని దండింపఁదగున్..." విజ్ఞా. ప్రా. ౧౨౨, ఆం. భా. ద్వి. ౧౮౩, విణ. న్యాయశీలుఁడు; "క. నళినదళలోచనుఁడు దమఁ, దెలిపిన సద్ధర్మపద్ధతిని దగవరులై, యిలఁ బరిపాలించుచు.." భాగ ౧౦, స్కం. ఉ. ౭౬౨.

తగవు. దే. వి. 1. తగుట; "క...బుద్ధి సొనిపి, తడవి కని కొనంగవలయుఁ దగవుఁ దగమియున్." భార. శాం. ౨,ఆ. ౧౮౭. భార. సభా. ౨, ఆ. ౧౧౬; 2. న్యాయము; "ఆ. చేటుకాల మైనఁ జెట్ట మాటలు నెఱి,గాని తెరువు పట్టికర్జములును, తగవు లట్లు తోఁచు..." భార. ఉద్యో. ౨, ఆ. ౬౪. (శ. ర. పా) ఆం. భా. ద్వి. ౧౮౧: 3. జగ డము; "క. కోపము పాపమునకుఁ బో,త్తే పెను దగవునకుఁ దగఁగ నేతెట్లాటల్, ప్రాపించునో..." కళా. 3, ఆ. ౨౮, భీమ. ౫. ఆ. ౯౫; 4. వివాహాది శుభసమయములం దిచ్చెడుకానుక; "గీ. తగవు లిచ్చిరి పుట్టింటితల్లి ప్రజలు." శివరా. ౨, ఆ. ౬౨, య. ౪, ఆ. ౧౨౪; 5. మేలు; "చ. తగిన నరేంద్రసూనుఁ డని తన్నుఁ బ్రియంబునఁ బిల్చి తెచ్చి మృచ్చిగ సుత నిచ్చి మత్ప్రితిమఁ జేసిన సింహళరాజసూనుఁ డాతగవు మదిం దలంపక.." విక్ర. ౬, ఆ. ౭౬; 6. తీర్పు; "ద్వి. వసుధేశ యీవట్టివాగ్వాద మేల, మసలక మీలోనిమల కలువాయఁ, దగవు గాంతుఁ బెద్దలు మెచ్చి పొగడ. ద్వి. హరిశ్చ. ఉ. ౭౭౩, పం. జై. భా. ౮, ఆ. ౨౧౯; 7. రీతి; "సీ. చిగురులు రెంటి

కేతగవునఁ బొడమెనో యందంపుఁదొట్టుపా టెందువదన." కవు. ౪, ఆ. ౩౦, విణ. తగినది, "క. తగుఁ బగఁ దీర్చుట యిమ్మెయిఁ, దగ వగునే నెత్తురెత్తి త్రావుట .." భార. స్త్రీ ౨, ఆ. ౬౨, భార. ఉద్యో. ౧, ఆ ౫౫.

తగవుగోరి. దే. విణ. (తగవు+కోరి) సంధిచేయు వాఁడు "వ...తగవు గోరియుంబోలెఁ గూడఁ బెట్టినయు .." కవిక. ౪, ఆ. ౧౧౩. (శ.ర.పా.)

తగవులాఁడు. దే. విణ. (తగవులు+ఆఁడు) న్యాయ స్థుఁడు. "సీ. తనకూఁతుసవతి మందాకినీనదికి నాధార మై నిలిచినతగవులాఁడు." వరాహ. ౧౦, ఆ. ౪౮.

తగాదా. హిం. వి. వ్యాజ్యము; తగవు.

తగాయిదా = తగాదా. (వా).

తగిడి. దే. వి. వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౦.

తగిరిస. దే. వి. ప్రపున్నాడము ₰. "మ. గురుగుం జొంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుల్..." ఆము. ౪, ఆ. ౧౩౪, ఆం. భా. ద్వి. ౬౯.

తగిలించు. దే. స. క్రి. 1. సక్తముచేయు; "క. మనసుఁ గరఁగించి పులకలు, తనువునఁ బొదలించి రతులఁ దగిలించి తగన్." విక్ర. ౮, ఆ. ౩౮, హంస. ౪, ఆ. ౪౮; 2. సంబంధము కలిగించు; "క. తగి లించుకొన్నపిమ్మట, నిగిలించుటే కాని కార్య మే మున్నది..." శుక. ౨, ఆ. ౨౫౧; 3. లగ్నము చేయు; "సీ...ఖడ్గము సంకఁ దగిలించి..." భార. విరా. ౧, ఆ. ౨౧౧; 4. మోహింపఁ జేయు; "గీ. దీనిఁ దగిలించి తగులక తాన ధైర్య, వంతుఁడై యున్నసొబగుఁ డెవ్వఁడు జగతి." కు. సం. ౭, ఆ. ౧౪; 5. ముట్టించు; "గీ. చని యధిశ్రవణిని వహ్ని సంగ్రహించి, యింటినడి కప్పు తగిలించి..." శుక. ౩, ఆ. ౨౦౪.

తగు. దే. అ. క్రి. (క. తగు.) 1. అర్హమగు; "మ... అపాండుపుత్రులు నీపుత్రులు కారె వారిఁ దగునే దూరస్థులం జేయఁగన్." భార. ఆది. ౮, ఆ. ౪౫, నైష. ౧, ఆ. ౬౮; 2. న్యాయమగు, "క. తగు నిది తగ దని యెదలో, వగవక సాధులకుఁ జేద వారల కెగ్గుల్, మొగిఁ జేయుదుర్వినీతుల, కగున నిమిత్తాగంబు లైనభయంబుల్." భార. ఆది. ౧, ఆ. ౮౫, పారి. ౪, ఆ ౫౬; 3. సమర్థమగు; "క...సారథి తగువాఁ, డెచ్చోటఁ లేమి నాతం,

యున్నె." పార్వ. ౪, ఆ. ౮౩. హరి. పూ. ౧, ఆ. ౧౭౧; **5.** ఇష్టపడు "వ...ఘోరనిష్ఠతోఁ, దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్ముగ నిచ్చి ..." భార. ఆది. ౨, ఆ. ౧౪౯. భార. ఉద్యో. ౨, ఆ. ౧౬౧ (వ్యవహారమునందలి యర్థవిశేషములు:) **1.** సోఁకు "వ ...వృకంబువెంటఁ దగిలి..." భార. ఆది. ౨, ఆ. ౧౬౯; **2** తాకు. వానికి రోగము తగిలినది; **3.** పచ్చు. గోదావరికి క్రొత్తనీరు తగిలినది; **4.** వ్యయమగు. అకర్మ్మా కాక వానికి మఱిమూఁడురూకలు తగిలినవి; **5.** కలుగఁజేసికొను. నీ వ్యవహారములో తగుల పడను. (వా.); **6.** కలుగు, తటస్థించు. అతనికి మంచిబేరము తగిలినది; **7.** పుట్టు. వరికి పొట్టలు తగిలినవి; **8.** మెఱకకెక్కు. కాలువను నీరు లేక పడవలు తగులుచున్నవి; **9.** ప్రాప్తించు. వానికి నాలుగు చీవాట్లు తగిలినవి; **10.** కనబడు. నీకు ఆదారిలో పెద్ద మేడ తగులును; **11.** స్ఫురించు. ఆవిషయము నామనసునకు తగులలేదు; **12.** ఫలించు. వానితిట్లు నాకు తగులవు; **13** సంభవించు. నాకు రేపు ప్రయాణము తగిలినది; **14.** అంటుకొను. మన్ను కాలికి తగిలినది; **15.** దొరకు. ఆగ్రంథమున నా కాపద మెచ్చటను దగులలేదు; **16.** తగులుబడియగు. ఆపనికై నాచేతివి పదిరూపాయిలు తగిలినవి; **17.** ప్రవేశించు. ఆశాస్త్రమున నాబుద్ధి తగులదు. స. క్రి. **1.** కూడియుండు. "ఆ. సుందరాంగి వారియం దేల యపరక్తయగు మనోముదంబుఁ దగులఁగాక." భార. ఆది. ౭, ఆ ౨౯. భార. శల్య. ౧, ఆ. ౬; **2.** వెంబడించు. "గీ. మగుడ నడఁకి నడిచినఁ దగిలి యతని,తోడఁ; దమ్ములుఁ బోన్..." భార. ద్రో. ౧, ఆ. ౧౧౧. ఆను. ౯, ఆ. ౧౧౮; **3.** ఆశ్రయించు. "క. ఏపేరిని వారిఁ దగిలి యేల వచింతున్." కళా. ౩, ఆ. ౨౨౨; **4.** కూడు "వ...సాహసాంకమహీనాథుండు ..విదర్భరాజనందనం దగిలి..." విక్ర. ౪, ఆ. ౨౨౭; **5.** పురికొలుపు. "చ. జగడపుఁబోటిస త్తరువు సారెకుఁ గోరుచు వీరివారినిం, దగిలెడు తందనాల జడదారి..." కళా. ౨, ఆ ౩౭౩. అ. క్రి. స. క్రి. **1.** తాఁకు. "సీ. నాకుఁ దజ్జన్మంబునన్ శాప మొక్కటి తగుల రెండవమేను దాల్ప వలపె." కళా. ౯, ఆ, ౧౦. స్వా. ౧, ఆ. ౩౮; **2.** మోహించు. "చ...భిక్షుకుఁ,దగిలి తపంబు సేసె దఁటె..." కు. సం. ౮, ఆ, ౨౦, స్వా. ౬, ఆ. ౮౪. వి. **1.** అభిలాష. "ఆ. ఎంత మోటువడిన నంతియ జూవంబు కడపఁ దగులుఁ జలము నతిశయిల్లు." భార. ఆర. ౨, ఆ. ౬౨. కేయూర. ౪, ఆ. ౨౦౩; **2.** మోహము. "గీ. సాత్త్వమీఁదఁ, దలఁపు గలదు నా కతఁడును దగులుగలిగి యుండు .." భార. ఉద్యో. ౪, ఆ. ౨౮౯. భార. శాం. ౧, ఆ. ౨౪౭; **3.** సంబంధము. "గీ. అట్టిపేరఁ బ్రసిద్ధమై యంతలోనఁ, బట్టితను గూడఁ దీర్ఘయాత్రక చరిత్రిఁ, బ్రస్మరుచు..." కళా. ౪, ఆ. ౧౪౪. భార. శాం. ౬, ఆ. ౬౨; **4.** కలయిక. "క. నీవంటిరూపవతికిని, నీవంటిప్రియుండు గలుగ నిర్మింపఁ గహో, యీవిధిని దగులుచేసిన, యావిధి నిటు దూఱ నిఁక నగుఫల మేమి." హంస. ౧, ఆ. ౯౨ **5.** రతి. "ఆ. మదనబాణభిన్నహృదయమై యాతని, తలఁపు దెలిసి తగులఁ దలఁపు చేసి." వి. పు. ౬, ఆ. ౧౭. కాళ. ౧, ఆ. ౪౪; **6.** సంతోషము. "గీ. తనదుచూడ్కికి నెంతయుఁ దగు లొనర్చి." భార. స్వ. ౯౪; **7.** అడ్డము. "సీ...తలవరి యెఱిఁగినఁ దగులు సేయు." భాగ. ౧౦, స్కం. పూ. ౯౮౭. హరి. ఉ ౯, ఆ. ౭౪; **8.** దండుగ. (వా) ఆబేరమందు నాకు తగులు లేదు. విశే. **1.** సక్తుఁడు, సక్తము. "చ .. ఈకుబేరతనయాగ్రణికిం దగులై తిఁ గ్రొత్తగన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౪౩. భో. ౨. ఆ. ౧౧౨; **2.** ప్రియురాలు. "తరల ..ఈ,తొగతగుల్ వెడవింటిబోయకుఁ దోడు వచ్చినవాఁడపో." విజ. ౩, ఆ. ౬౪; **3.** ఆశ్రితుఁడు. "చ...ఇంత మాత్రకు నిటు బాములం బఱతురా గుడికిం దగులైననంబులన్." వి. ప్ర. ౯, ఆ. ౨౮.

తగులుకొను దే. అ. క్రి. (తగులు+కొను) ప్రీతి కలుగు, ప్రేమించు. "ద్వి. సుగుణాత్మురాలైన సుదతియె రైనఁ, దగులుకొందురుగాక దాన మీఁగలదె." ద్వి. భల్లా ౩, ఆ. ౬౧, పు. పారి. ౯, ఆ. ౮౯. స. క్రి. మోహించు, "క. మగఁడేల రాఁడొ యొండొక, మగువం దగులుకొని నన్ను మఱచెనొకో..." శుక. ౨, ఆ. ౩౨౭;

ఆ. క్రి. స. క్రి. అంటు, సోఁకు. "గీ...తత్త్వ ప్రాప్తలము భువర్లోకమును మించి యమరనగరిఁ, దగులుకొన్న సుపర్వులు తల్లడిల్లి." దశా. ౪, ఆ. ౨౪, కాశీ. ౨, ఆ. ౯౦.

తగులుకొలుపు. దే. స. క్రి. (తగులుకొను ధా. ప్రే.) తగుల్కొనఁజేయు. (చూ. తప్పిలుకొలుపు.)

తగులుకోలు దే. వి. తగులుకొనుట. (శ. ర.)

తగులుగొండి. దే. విశే. (తగులు+గొండి.) తగులుకొనునది. (శ. ర.)

తగులుచు. దే. స. క్రి. 1. కూర్చు, "క. విను మాట విపోతెం దన, తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచి కొన్నాఁడు..." భార. ద్రో. ౩, ఆ. ౨౦౧, భీమ. ౫, ఆ. ౯౫, 2. అంటించు. (చూ. తగుల్చు.)

తగులడు. దే. వి. తగులుట. "క. హారము జూదము వేఁటయు, మానినియును భూపతులకు సుఖేర వినోద, స్థానము లగు నైనను దగ, నైనవిధము దక్కఁ దగులు డాపదఁ బెచ్చున్." భార. శాం ౩, ఆ. ౨౭౨. (శ. ర. పా. 'తగులము' ముద్రి.)

తగులుదల. దే. వి. తగులుడు. (శ. ర.)

తగులుపడు. ద్వ. అ. క్రి. (తగులు+పడు.) 1. ఆసక్తినొందు. "సీ. సుందరీముఖములఁ జూడ గోరుచుఁ జూడ్కి తావకాకృతులపైఁ దగులు పడదు." భాగ. ౭, స్కం. ౩౬౩; 2. చిక్కుకొను, (చూ. తగులువడు.) 3. లభించు, "సీ. తామరచెలిపట్టి తావుఁ గొల్లాడఁగాఁ దగులుపడ్డట్టి యేనుఁగలగములు" య. ౪, ఆ. ౭౭, 4. అఁగు, (చూ. తగుల్పడు.)

తగులుపఱుచు. ద్వ. స. క్రి. (తగులుపడు. ధా. ప్రే.) 1. ఆసక్తి కలుగఁజేయు, "గీ. మిగులఁ జొక్కించి యెంతయుఁ దగులుపఱిచి." ప్రబోధ. ౧, ఆ. ౭౫, 2. నిలుపు, "సీ...నగరు గావు మటంచుఁ దగులు పఱిచి." అచ్చ. యు. ౪౩౯; 3. లగ్నము చేయు, "సీ...తరలనినియమంబుఁ దగులు పఱిచి." ఉ. రా. ౨, ఆ. ౧౬౩.

తగులుపాటు. ద్వ. వి. (తగులుపడు. ధా.) 1. తగులుబడి, వ్యయము. (బ్రా.) 2. తగులువాటు. (శ.ర.)

తగులుబడి. దే. వి. కట్టుబడి, వ్యయపఱుచుట. (శ. ర. బ్రా.)

తగులువడు = తగుల్పడు. 1. (సక్తమగు) "క. సౌందర్యవిలాసాదుల, యందునె తగులువడి యితరమరయఁడుమతవ్యాపారం బెఱుఁగఁడు గలరు..." కళా. ౭, ఆ. ౯౨; 2. (చిక్కుకొను) "...నరేంద్రనందనునిచేత, ...ఆమహీనాథుకాం కన్యాలలామ, తగులువడె..." రామా. ౪, ఆ. ౧౫౯; 3. (కొరకు) ఆం. భా. తృ. ౧౫౫; 4. (అడ్డుకలుగు), "క. తగులువడి యపుడు వడి నెడి, గగనమణిరథంబు పోరఁగలుగడి నిలిచెన్." కాశీ. ౧, ఆ. ౧౩౩.

తగులువాటు = తగులుపాటు. తగులువడుట.

తగ్గించు. దే. స. క్రి. (తగ్గు. ధా. ప్రే.) తగ్గఁజేయు, కృశింపఁజేయు. "మ...లపం బొనర్చు జటిల వ్యాఘ్రంబు బనాభూక్షకృష్ణముదండం బగు మేనూనని యమత్రాప్తాగ్నిఁ దగ్గించుచున్." పాండు. ౫, ఆ. ౧౮౬.

తగ్గింపు. దే. వి. (తగ్గు. ధా.) తగ్గుదల. (ప్రా. వా.)

తగ్గు. దే. అ. క్రి. 1. తక్కువగు. ఆం. భా. తృ. ౯౬; 2. వెనుదీయు. "గీ. స్మరుఁడు పరదేవతాంఘ్రిలు సంస్మరించి, చెఱకువింటను గరికల్వవిరిని బూన్చి, కుడిభుజము తగ్గఁ దేటగా వడిగ నీడ్చి, శంభుఁడు చలింప మోహనాస్త్రంబు వైచె." పార్వ. ౩, ఆ. ౫౪; 3. ఒదుగు. "క. తగ్గెడు కారణము లేక తడఁబడి పడఁగల్." భార. విరా. ౪, ఆ. ౮౭; 4. కృశించు. "ఉ......వాడి వత్తలై, తగ్గిన మేనులున్..." విప్ర. ౨, ఆ. ౫౩. వి. 1. తక్కువ. (వ్యతి. మొగ్గు.); 2. ఉదయస్థానవృక్షు లందొకటి యగుక్షయము. ఆం. భా. ద్వి. ౧౭౦. విశే. తగ్గినది. "చ...మార్మ గల పగ్గెలు తగ్గులు సేసి..." ప్రబంధ. ౧౭.

తగ్గుదల. దే. వి. (తగ్గు. ధా.) తక్కువ. (శ. ర.)

తగ్గుపడు. ద్వ. అ. క్రి. (తగ్గు+పడు.) 1. నశించు. "గీ. దార్ఢ్య మాలోచనము తెల్వి తగ్గుపడియె." హంస. ౧, ఆ. ౧౯౦; 2. కృశించు. "గీ... సుధాకరానన నెమ్మేను తగ్గుపడియె." చంద్రా. ౨, ఆ. ౧౨౩.

తచ్చె. వై. వి. సాకు, మిష. "ద్వి. తచ్చలు పచరించి తటమటించెదవు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౪ పం.

తచ్చెన. వై. వి. (సం. తర్జనీ.) 1. గేలి. ఆం. భా. ప్ర. ౧౩౯; 2. అసత్యము. "ద్వి. తచ్చనఁ దమయింటఁ దద్దినం బనుచు." రం. రా. ౪౨. ౧౫౧, పు; 3. సాకు. (చూ. తచ్చె.) 4.

మోసము. (చూ. తచ్చనగొండి.) విణ. అసత్యము, సత్యముకానిది. "వ...తచ్చనవినయంబులు..." వసు. ౪, ఆ. ౨౩. శుక. ౩, ఆ. ౯౧.

తచ్చనగొండి. ద్వ. విణ. (తచ్చన+గొండి.) మోసకత్తె. "సీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి..." చెన్న. ౨, ఆ. ౨౪.

తచ్చనలాడు. ద్వ. అ. క్రి. (తచ్చనలు+ఆడు.) చిక్కుపడు. "ద్వి. కుచ్చులు మెఱయంగఁ గొన కొన్న సరులు, తచ్చనలాడంగ..." అ. మ. క. ౪, ఆ. ౯౭. భా. ౨౯, పం. అ. క్రి. స. క్రి. గేలిసేయు. "చ...అనుచు శారద తచ్చనలాడ మాటికిం, గలకల నవ్వుభాత..." కాళిందీ. ౧, ఆ. ౭. ఉ. హరిశ్చ. ౧, ఆ. ౩౨.

తచ్చనవాటు. ద్వ. వి. (తచ్చన+వాటు.) ఉత్తవేటు "చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁ బరస్పర మెదిరించి కాంచనపుబంతులఁ దచ్చనవాటు లాడఁగా." నైష. ౩, ఆ. ౯౫.

తచ్చనసేయు. వై. అ. క్రి. (తచ్చన+చేయు.) గేలిసేయు. "ఉ. వచ్చిపయోజపత్త్రముల వ్రాలెదుతుమ్మెదబొమ్మిమూఁకలన్, దచ్చనసేయుచున్...." పాండు. ౧, ఆ. ౧౯౯.

తచ్చలాడు. ద్వ. స. క్రి. (తచ్చనలు+ఆడు.) 1. గేలిసేయు, "వ...పచ్చరాగచ్చుల నిచ్చలంపు బచ్చిపచ్చికల తచ్చలాడుగోడల నాడనాడ ప్రీడలతో జలక్రీడలాడు గొల్లకాపుప్రోడచేడియలు.." సావి. ౧, ఆ. ౧౧౧, 2. మోసగించు, "ఆ. పచ్చ విల్తుచేతఁ గ్రచ్చర జనులెల్లఁ, దచ్చలాడఁబడిరి ధరణిలోన." వేమన. ౧౧౧.

తచ్చాడు. ద్వ. అ. క్రి. (తచ్చనలు+అడు.) ఊరక యటునిటు తిరుగు. (బ్రా. వా.)

తజివీజీ. దే. వి. (హిం. తజ్ వీజ్.) ఇంగితము, "సీ. తజివీజులో మెల్ల దుఖావుచేసితిగదా నానావగైరాల నాఁడునాఁట." రంగా. ౨, ఆ. ౩౯. "ఆ. దానిఁ బట్టఁబూనుతజివీజీ గనుఁగొని..."చంద్ర. వి. ౩, ఆ. ౩౨.

తటకా. దే. వి. 1. నిశ్చేష్టత. (చూ. తటకాపడు.); 2. కలఁత. (చూ. తటకాపడు.)

తటకాపడు. ద్వ. అ. క్రి. (తటకా+పడు). 1. ఆశ్చర్యపడు. ఆం. భా. తృ. ౧౦౧; 2. చేష్టలు దక్కు. "ఉ...లంకాపురరాజ్యలక్ష్మిఁ దటకాపడి చూచుచు నున్న నత్తతిన్." దశా. ౭, ఆ. ౨౮. ౯౫. "చ. కలఁగుచు బల్కఁబోవుఁ దటకాపడు ..." రాధికా. ౧, ఆ. ౧౨౯; 3. కలఁగు. "మానిని. గబ్బిసఖుల్ తటకాపడి మానిని గన్గొని పల్కిరి కర్జము గాన్." ప్రబంధ. ౫౩౬.

తటకాపాటు. ద్వ. వి. (తటకాపడు. ధా). ఆశ్చర్యము. ఆం భా. త్ర. ౧౬౨.

తటతట. దే. వి. 1. గుండె మొ. అదరుటయం దగు ధ్వని కనుకరణము. "సీ. హృదయంబు తటతటనదరంగ..." భార. విరా. ౪, ఆ. ౯౦; 2. పడుటయం దగుధ్వని కనుకరణము. "సీ. చిటచిటారవముతోఁ దటతట వడగండ్లు యూవరాజముఖ్యుల నొదుఁగఁజేయ." హంస. ౪, ఆ. ౨౨౧; 3. బాధ. (చూ. తటతటపడు.)

తటతటపడు. ద్వ. అ. క్రి. (తటతట+పడు). బాధపడు. "క. సొటసొట నాఁకట సోలుచుఁ, దటతటపడుచాతకముల దైన్యము వాసెన్." వైజ. ౨, ఆ ౧౪౬. [-చించు. (వా).

తటపటాయించు. దే. అ. క్రి. వెనుకముందు లాలో

తటపెట. దే. వి. వాద్యముల మోఁతయందలిధ్వని కనుకరణము. క్రీడా. ౨౨౫.

తటమట. దే. వి. 1. మోసము. "క. తప్పక కనుచుంటి వారితటమట లంతన్." రాధికా. ౨, ఆ. ౧౩౪; 2. కలఁత. (చూ. తటమటించు.) విణ. కలఁగినది "క...తటమటగమనంబు లూని తప్పఁగ నడచున్." నృసిం. ౪, ఆ. ౧౯౨.

తటమటించు. దే. స. క్రి. 1. మోసగించు. "ద్వి. తచ్చలు పచరించి తటమటించెదవు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౪, పం.; 2. కలఁచు. "సీ. భమ్మితేకుల సిరిఁ దటమటింపఁగఁ జాలుమెఱుఁగుఁగన్నులు తలఁ దిరిగి రాఁగ." భాగ. ౪, స్కం. ౭౪౬, స్వా. ౫, ఆ. ౧౦౧.

తటము. సం. వి. అ. పుం. న. 1. ఏటియొడ్డు; 2. ప్రదేశము. (కటితటము); 3. కొండచరియ. (గిరితటము).

తటవట. దే. వి. 1. మోసము. (శ. ర.); 2. కల్ల. ఆం. భా. ప్ర. ౧౧౯. విణ. వంచకము. "ద్వి. తటవట మాటలఁ దప్పనాడెదవు." ద్వి. శ. సా. ౬౪, పు.

తటవటచేయు. ద్వ. స. క్రి. (తటవట+చేయు). మోసగించు. "ద్వి. తల్లిదండ్రులఁ బాపి తటవట

చేసి" ధర్మా. ౧.భా. (శ. ర.) పశా. ౨, ఆ. ౩౧౨.

తటస్థము. సం. విశే. (అ. ఆ. అ); 1. ఒడ్డున నున్నది; 2. సమీపమందున్నది; 3. ఉదాసీనము; 4. లభించినది.

తటస్థించు. సం. అ. క్రి. 1. కలుగు. "వ...ప్రద్యుమ్నున కిద్దురవస్థ తటస్థించె..." హర. 3, ఆ. ౧౫; 2. లభించు.

తటస్థుడు. సం. విశే. (అ. ఆ. అ); 1. ఒడ్డున నున్నవాడు; 2. ఉదాసీనుడు; 3. న్యాయస్థుడు; 4. లభించినవాడు.

తటాకము. సం. వి. అ. పుం. న. చెఱువు.

తటాన. దే. క్రి. విశే. ద్రు. (దీనియామ్రేడితరూపము తటాతటాన); 1. శీఘ్రముగా. "ఉ.... బంతి తటాన వైవ..." కృ. శకుం. ౨, ఆ. ౯౭. "పంచచా. తటాతటాన గుండె సారె తల్లడింపు చుండఁగా." ఉ. హరిశ్చ. ౨, ఆ. ౧౨౮; 2. ఆకస్మికముగా. "ఉ...యముండు తటానఁ జూచి ..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౬౫.

తటాయించు. దే. అ. క్రి. నాటు. "క...ఎదఁ దటాయించన్, గొంచించక మొగలిరేకుగుమ్మిలిఁ జిమ్మెన్." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౧౪. స. క్రి. అడ్డగించు. ఆం. భా. కృ. ౧౨౦.

తటాలు. దే. వి. 1. గుండె యదరుటయందగు ననుకరణము. "క...గుండియ తడా లనఁగన్." జై. ౬, ఆ. ౧3; 2. ఆకస్మికముగ సంభవించుటయందగు ననుకరణము. "మ...వర్షముల్ జడిగాఁ బట్టి తటా లనంగ వెలిచెన్..." హర. ౨, ఆ. ౨౫.

తటాలున = తటాన. (శీఘ్రముగా) "చ. ముని యటు రాఁ దటాలున సమున్నతపీఠము డిగ్గి..." వసు. ౨, ఆ. ౧౪.

తటాల్న = తటాలున. "ఉ. ఈపరిపాటిఁ దార్చ నగు నింటికి వీనిఁ దటాల్న..." వైజ. 3, ఆ. ౫3.

తటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒడ్డు; 2. ప్రదేశము.

తటిత్తు. సం. వి. త్. స్త్రీ. మెఱుపు.

తటిని. సం. వి. ఈ. స్త్రీ. నది.

తటుకున. దే. క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా. "ద్వి...ఆచక్రవర్తి తటుకున నిత్యకృత్యము లెల్లఁ దీర్చి." ద్వి. హరిశ్చ. పూ. ౫౫౬; 2. అనాలోచితముగా. "ఉ. తటుకున నియ్యకొంటి మతి దప్పి మరుద్గురునంతవానితో." కాశీ. ౨, ఆ. ౧౧౧; 3. ఆకస్మికముగా. "చ. తటుకున రాజుమో మెదుటఁ దారస మైన..." స్వా. ౫, ఆ. ౧౧; 4. అవలీలగా. "చ...ఏనును దత్తరంగమున్, దటుకునఁ బట్టెదన్..." జై. ౪, ఆ. ౧౦౭.

తటుక్కున = తటుకున. (శీఘ్రముగా) "చ...వి ల్లటు తటుక్కున ధారుణి వైచి..." రామా. ౨, ఆ. ౪౦. భీమ. ౬, ఆ. ౬౫.

తట్ట. దే. వి. (క. తట్టె. త. తట్టమ్.) 1. వెదురుగంప. "వడ్లతోఁ గూడఁ ద వే ట్టండవలసి వచ్చె" (శ. ర.); 2. పళ్లిక. ఉదా:—తక్కెడతట్ట; 3. (లోహాదికముతో చేసిన) పళ్లెము. "క. అని యనిమిషపతి తనుదయఁ, గని తనచేఁ బెనఁడి తట్టఁగప్పులబాగా,లును దొడవు లొసఁగి..." చంద్ర. ౨, ఆ. ౬౦. ఆం. భా. ద్వి. ౨౪౪. "సీ. చెలువొందువలువలు వెలవొచ్చుసొమ్ములు పొందక్కతట్టలఁ బొందుపఱిచి." శశాం. 3, ఆ. ౫.

తట్టకొమ్ము. దే. వి. (తట్ట+కొమ్ము.) వేఁట కగుసాధనములలో నొకటి. రుక్మా. 3, ఆ. ౭౦.

తట్టగిల్లు. దే. అ. క్రి. తట్టయగు. (శ. ర.)

తట్టపాగ. దే. వి. (తట్ట+పాగ.) తట్టవలె నెత్తుగఁ జుట్టినతలపాగ. "చ...తట్టపాగ లీగరిమను వేషముల్ దనరఁగా..." చెన్న. ౨, ఆ. ౨౦౬.

తట్టము. దే. వి. (క. తట్టు.) ఎండుచర్మము. "సీ... కట్టిన పెనుఁబాఁపతట్టంబుతోడ..." కళా. 3, ఆ. ౬౨. (శ. ర. పా. 'దట్టము' ముద్రి. పా); 2. (చర్మాదుల) ప్రోగు. "లయగ్రాహి. ముట్టిగజయూథములఁ బట్టి రదనాగ్రములఁ గుట్టి తెగఁజీరి పలుతట్టములు పెట్టున్." కు. సం. ౧౨, ఆ. ౧౭3.

తట్టన. వై. వి. ధైర్యము. "చ, జవమున నానిశాచరి భుజంబులు సాఁచుచుఁ గిన్కఁ రామభూధవుపయి నేఁగుదేరఁ గడుఁ దట్టన వాంకృతితోడ సంయమిప్రవరుఁడు ఘూర్ణివాక్యముల భర్జనసేయుచు..." భా. రా. బాల. ౨౫3. ఉ. హం. 3, ఆ. ౧౨3.

తట్టాడు. దే. అ. క్రి. (తట్టు+ఆడు.) 1. ఇటునటు తిరుగు. "ద్వి. తట్టాడ కిటు పోకఁ దరుణి

ర మ్ముచు.' బస. ౨, ఆ ౧౯౬. పం; 2. అడుగు లిటునటు వేయు. "సీ. రెండుమూఁడడుగు లొండొండఁ దట్టాడునప్పుడు త్రివిక్రమలీల బుద్ధిఁ జూచు." నృసిం. 3. ఆ, ౧౪౭; 3. కెమ్మదిగాఁ దిరుగు. "ఉ... దివ్యగంధములతో సుఖశీతల మారుతంబు దట్టాడె..." ఉ. హరి. ౧, ఆ ౧౨౩. సుమ. ౨, ఆ. ౧౨౨.

తట్టి, దే. వి. 1. కంచము. వేంక. మాన. ౪౭. సాం. ని. మాన. ౨౯; 2. (క. తట్టి.) వేఁటతెర. "సీ. తట్టికి వచ్చి యిట్టట్టు వో నేరనివెల్లవిధంబున లీల మెఱయు." నిర్వ. ౫, ఆ. ౧౦౦. కృష్ణ. 3, ఆ. 3౭.

తట్టివేయు. దే. స. క్రి. (తట్టు+వేయు. స్వార్థమున) తట్టు,వెనుకకు గెంటు. "ఉ. దవ్వునఁ దట్టి వేయఁ గలదా వలదా తలదాఁకగా వలెన్." పార్వ. ౨, ౧౨౭.

తట్టు. దే అ. క్రి. 1. కలుగు. "ఆ. దైవయోగము నను దట్టినమేలుకే, ళ్లనుభవింప కెట్టు లరుగ వచ్చు." కుచేల. 3, ఆ. ౧౬. వసు. ౨, ఆ ౧౦౪; 2. స్ఫురించు. "క. అట్టియుపాయము నీకుం,దట్టిన నృపుపొందుమాటఁ దలఁపుము...' హంస. ౨, ఆ. ౧౨౭; 3. కరఁగు. "చ. ఘనగత శంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి పుసుం గినోష్మఁ దట్టినది యలంది..." ఆము. ౨, ఆ. ౧౬ స. క్రి. 1. ఇది కొన్నిక్రియలతుమున్నంతరూపముల కనుప్రయుక్తమై యాయాధాతువుల ప్రేరణార్థము నిచ్చును. ఉదా:—పోవఁదట్టు, పాయఁ దట్టు, పోఁదట్టు. మొ.); 2. చేతితో మెల్లగాఁ గొట్టు; "ఉ...కేల నాఘూలిభుమేను దట్టి ముని పుంగవుఁ డిట్లనిరెక్ ప్రియంబునన్." కువల. ౨, ఆ. ౧౭; 3. వాయించు; "స్రగ్ధర... బే. తాళక్రవ్యాదభూతోత్కరము జతలై తాళముల్ దట్టి యాడన్..." భాగ. ౧౦. స్కం. ఉ. ౭౭3; 4. విడుచు; "గీ. అఁకలిని గట్టి దప్పుల నవలఁ దట్టి." పార్వ. ౪, ఆ. ౪౨. వాల్మీ. ౨. ఆ. ౧౨౬; ౫. నిలుపుకొను. "సీ... ఎట్టు తట్టుదుఁ బ్రాణము..." మార్కం. ౧, ఆ. ౧౬3; ౬. చేరు; "చ...కఠిన్, దనరుసుధాశశేంద్రులను దట్టితి ముప్పదిమూఁడు కోటులన్." అచలా. ౧, ఆ.౭౨. యు. దే. వి. 1. చఱచుట కొట్టుట మొదలగు వానిచే చర్మము పొంగుట; అట్టు పొంగినచర్మము. వా:—వానివీపుమీఁద చఱవఁగాఁ దట్లు లేచినవి. (చూ. తట్టుగట్టు.); 2. పొంగు; చర్మరోగవిశేషము. (బ్రౌ.); 3. నీచజాతిగుఱ్ఱము. "సీ. పఱ గఁటితట్టైన భద్రేభమైనను ద్యాగశీలునకు లత్త్యంబు గాదు.' ర్గామలిం. ౬౭; 4. శబ్దభేదములలో నొకటి "చ. జవరఁజనంబు గల్లి మఱి జల్లిని బొల్లుచు దట్టు ప్రోవనుం, జవులక..." భల్లా. ౧, ఆ. (శ. ర.); వై. వి (సం. తటి.) 1. తీరము. నీటిదరి; ఆం. భా. ప్ర. ౧౯౯; 2. ప్రదేశము, చోటు; "క...అతట్టున నొక్కతోఁట నపురఁగఁ జేసెన్." హంస. ౧, ఆ ౧౮3.

తట్టుగట్టు. దే. అ. క్రి. (తట్టు.) చఱచుట కొట్టుట మొ. వానిచేఁ జర్మము పొంగు. "క. అడిచెద నని యీూఁకించుట, యడుచుట మెయి తట్టుగట్ట నడుచుల... అధికపుఁదప్పుల్." విజ్ఞా.ప్రా.౯౧.

తట్టుచేయి. ద్వ. వి. (తట్టు+చేయి.) కోటకొమ్మమీఁది యవయవవిశేషము. "ద్వి. తట్టుచేతులును గొత్తడములతోడ, నిట్టుకకోటయు..." రం. రా. యు. ౭౮౧. పు.

తట్టుపునుఁగు. ద్వ. వి. (తట్టు+పునుఁగు.) పూతి పునుఁగు. (ఇది మిక్కిలి శ్రేష్ఠమైనది.) "సీ. అలరుకస్తురి తేనె లలికి వాకిళ్ల చెంతల వైచి పోయిన తట్టుపునుఁగు." య. ౧, ఆ. ౪౭. ఆం. భా. ద్వి. ౧౬౧.

తట్టుముట్టాడు, ద్వ. స. క్రి. (తట్టు+ముట్టు+ఆడు.) అపారమగు; మిక్కుటమగు. "గీ. తట్టుముట్టాడు నిట్టిపేదఱిక మిట్లు, నొంప దీని కుపాయ మూహింపవైతి." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౬౬. "ద్వి. దరహాసదీప్తులు తట్టుముట్టాడ." పండిత. మహిమ. ౧33. పొ. ౧౯. పం.

తట్టుముట్టు. ద్వ. అ. క్రి. (తట్టు+ముట్టు.) అపారమగు. (చూ. తట్టుముట్టాడు.) వి. పనిముట్టు. (బ్రౌ.)

తట్టువ. వై. వి. (సం. దండరి) 1. నీచజాతిగుఱ్ఱము; గుఱ్ఱము. ఆం. భా. ద్వి. ౧౯౬. "వ...అదిట్ట తట్టువ నభిముఖంబుగఁ ద్రాకొలివి..." సాంబో. 3, ఆ. ౨౬. అచ్చ. యు. ౧౯౬. 2. వాహనము. (చూ. తట్టువము.)

తడఁబాటు. ద్వ. వి. (తడఁబడు. ధా.) 1. తొట్రుపాటు. "చ...తడఁబాటుపు దత్తరముం జలంబులో, నడరఁగ..." పారి. ౧, ఆ. ౧౦౧. విజ ౧, ఆ ౪; 2. పొరపాటు. "ఉ ..పట్టఁగ వచ్చినారొ తడఁబాటున వీని మతిభ్రమంబునన్." శివరా. ౪, ఆ. ౫౬; 3 వ్యత్యయము. ఆం. భా. ద్వి. ౧౭౪; 4. కష్టము. "గీ. వసుధలోపల నిరువురు వాసుదేవు,లున్నఁ దడఁబాటు గాదె.." హరి. ఉ. ౬, ఆ. ౯౩ ; 5. విభ్రమము. "గీ. క్రాలుకన్నులు వలిచన్నుఁగవలుఁ జెలివి,మొగములుఁ గురులు బంధురముగను బెరసి,మూఁడఁ దడఁబాటుగా జలక్రీడ సలిపె,నెలమిమనముల నెలకొన్నఁ జెలువపిండు." నిర్వ. ౮, ఆ. ౫౩.

తడక. దే. వి. (తడిక యనియుం వాడుక. శ. ర. అన్మధ్య మనుటకుఁగాని ఇన్మధ్యమనుటకుఁ గాని నిర్ధారక ప్రయోగములు కానరావు.) 1. వెదురు బద్దలు కొబ్బరితాడి మున్నగువానియాకులతో నల్లి తలుపు మొ. వానివలె నుపయోగించుకొను సాధనము. (చూ. తడకవెట్టు, తడకద్రోపరి మొ. 2. శిథిలమగువస్తువు. "క.. పుస్తకపుం,దడక ధరియించి " ప్రబోధ ౩, ఆ ౨౦. ౭. ౭, ఆ. ౧౯౭; 3. బిగి లేనివాక్యరచన. ప్రబంధ. ౨౧.

తడకట్టు. దే. స. క్రి. (తడక+కట్టు.) అధిక్షేపించు. "క. పొడమెం గవ్వపుగుబ్బలి, నడునెత్తముమీఁదఁ గుందనపుఁగొండఁ జెలం,గెడు వేల్పువీటిచెలువముఁ, దడకట్టుఁగఁ జాలునొప్పిదంబులతోడన్." వరాహ. ౧౧, ఆ. ౩౧. విశే. 1. అధిక్షేపించునది, పాఱఁ ద్రోలునది. "చ... శే, పొలఁతుక తాళిబొట్టు తమపుందడకట్టు సరోజసౌధముల్, గల చెలితోడఁబుట్టు తొలుగట్టువయిం గనుపట్టె నంతటన్." రా. వి. ౭, ఆ. ౮; 2. స్తంభింపఁజేయఁ్నది; నిరోధించునది. "సీ. పిడుగుకైదువు పెట్టు తడకట్టుగాఁ బయోధిమహామథిరసంబు చమరె ననఁగ." వసు. ౫, ఆ. ౩౬.

తడకకట్టు. దే. అ. క్రి. (తడక+కట్టు.) అధిక్షేపించు, హేళనముచేయు. ఇట్లే, తడకలుకట్టు. (వా.)

తడకద్రోపరి. దే. వి. (తడక+త్రోపు+అరి) కవాటనోదకుఁడు, తలుపు బ్రద్దలుకొట్టి లోనఁ బ్రవేశింపుచొంగ. ఆం. భా. ద్వి. ౨౬౧. వేం. పంచ. ౪, ఆ. ౨౪౦.

తడకద్రోపు = తడకద్రోపరి. "క... తడకద్రోపులొంటరికాండ్రున్, లజ్జ యెఱుంగనివిటులును, సజ్జకముగ వారసతులజన్మఫలంబుల్." మల్హ. ౨, ఆ. ౧౪.

తడకవెట్టు. దే. అ. క్రి. (తడక+పెట్టు). పోఁద్రోలు. "సీ. బంధుల క్షితిఁ దంచుఁ బరుల దూషించుచు దనయిల్లు చొచ్చినఁ దడకవెట్టు." వేణు. ౬౩.

తడకాలు. దే. వి. (తడ+కాలు); 1. వణఁకుకాలు. (చూ. తడకాళ్లువడు); 2. మల్లబంధములలో నొకటి. ఆం. భా. ద్వి. ౨౦౯.

తడకాళ్లువడు. ద్వ. అ. క్రి. (తడ+కాళ్లు+పడు). కాళ్లు వణఁకు. "సీ. ఉడుగనివిభ్రాంతిఁ దడకాళ్లవడ నిల్చుఖానులు డాఁగఁ జీఁకటులు సేసె." వసు. ౧, ఆ. ౪౬.

తడగము. దే. వి. పక్కాలి, ఎద్దుమీఁద నుంచి నీళ్లు తెచ్చెడుతోలుసంచి. "ద్వి. ఒడలిపీర నెఱుంగ కుదరంబు పెద్ద, తడగంబుగతిఁ దోఁప..." ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౫౬. పం.

తడప. దే. వి. 1. త్వక్కు, పట్ట. ఆం. భా. ద్వి. ౩౭; 2. తాటికమ్మ మొ. వానినుండి తీయునార. (శ.ర. వా.)

తడపెట్టు. దే. స. క్రి. (తడ+పెట్టు). తడఁబఱచు, తాఱుమాఱుచేయు. "చ. తలఁపులు సిక్కుసీరువడఁ దాల్మలు పెల్లగిలంగ...కోర్కులక్రందు చేష్టితం,బులఁ దడపెట్ట..." హరి. ఉ. ౩, ఆ. ౮. (శ. ర. పా).

తడము. దే. స. క్రి. 1. నిమురు. "వ...అక్కుసుమకోమలి నల్లనల్లన తడమికొని వచ్చి .." కు. సం. ౫, ఆ. ౧౪౪; 2. అరయు. "గీ...ఇచ్చఁ దలఁచి, తడమి నాచేత దీవన వడయుమమ్మ." భార. విరా. ౨, ఆ. ౨౧౪.

తడయు. దే. అ. క్రి. 1. ఆలసించు. "గీ. వీఁగి తన తల్లిదాస్యంబు నీఁగఁ బూని, తడయ కమృతంబు గొనిపోవఁ గడఁగి వచ్చె." భార. ఆది. ౨, ఆ. ౮౪; ౬, ఆ ౨౬౦; 2. వసించు. "ఆ. అడవిలోన నేము దడసినదినము లన్నియు గణించి యంబునిధిపురంబు, శేషకడయ ముంచు..." భార. మా. ౧౯౭; 3. ఆలస్యమగు. "క. సకలైశ్వర్యసమృద్ధులు, నొకతల సంతానలాభ మొకతల యదియొ,టెకిఁ దడసె [illegible]

కృప మేల లేదు మన కిప్పాటన్." కాశీ. ౩, ఆ. ౨౧౬.

తడవ. దే. వి. మాఱు. పర్యాయము. ఆం. సం. మాన. ౬౨.

తడవాటు. ద్వి. స. (తడవు+పాటు.) ఆలస్యము, విలంబనము. "ద్వి. దంటుమాటలు కొన్ని తడవాటు వన్ని. గెంటక నోరార్చి తెల్వేఁజూచెదవు." ద్వి. హరిశ్చ. పూ. ౨౯౦. పం. (తడవాటువన్ని=విలంబనమునకై పన్ని).

తడవాడు. దే. అ. క్రి. (తడవు+ఆడు.) 1. డోఁగి యాడు. "క. తడవాడిరి బలకృష్ణులు, జడ వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్." భాగ. ౧౦, స్కం. పూ. ౨౯౦. 2. క్షోభపడు; "క. తడవాడి రరులు భయమునఁ, దడవాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్". భాగ. ౧౦. స్కం. ౨౬౦; 3. చేతులతోఁ దడవు. "చ...చీఁ, కటి నడిమిద్దె టింటఁ బడి కాంతమణుల్ బయ లంచు భ్రాంతిచే, నట నెగఁబ్రాఁకి తాఁకి తడవాడుచు గూడుల వెంట దూఱి..." రాధా ౨, ఆ. ౧౪౦. స. క్రి. వెదకులాడు. "గీ. చూపుచాలమి వివిధరూపోప కరణ,వితతిఁ దడవాడు..." పాండు. ౨, ఆ. ౧౯.

తడవియాడు = తడవాడు. 1. (డోఁగాడు) "గీ తడవియాడె వసుంధరాస్థలమునందు, విశ్వపతి తత్త్వ మనుమణి వెదకురీతి." కాళ. ౩, ఆ. ౩౦. (చేతులతోఁ దడవు) "గీ. మన్మథాకారుఁ డొక రెండుమానికంబు, లిరువు రేణాయతాక్షుల కిచ్చి మరల, నొకతె మణి వేగఁ గైకొనె నొకతె మణికిఁ, దడవియాడుచుఁ బృథుపయోధరము లంటె." గంధ. ౯౦.

తడవిల్లు. దే. వి. (తడ+విల్లు.) తడచెట్టుకఱ్ఱల బద్దలతోఁ జేసినవిల్లు. "సీ. తడవిండ్లు సేపట్టి తడయక రొమ్ములకై మూర్చుచు..." భార. అర. ౧, ఆ. ౩౦౦. ఉ. రా. ౩, ఆ. ౩౮౭.

తడవు. దే. అ. క్రి. (క. తడవు. త. తడవు.) 1. డోఁగాడు, మెమ్మదిగాఁ బ్రాఁకు. "సీ. ముద్దులు డొలఁకాడ మోఁకాలఁ గేలను దడవుచు నెందును దారి తారి." హరి. పూ. ౫, ఆ. ౧౯౩; 2. తొడఁగు; యత్నించు. "గీ...నారాయణాస్త్రంబుఁ గార్ముకమునఁ, బూనఁ దడవ..." భాగ. ౪. స్కం. ౩౪౭. ద్వి. పరమ. ౨, ఆ. ౫౨. పు, 3. జీవించు,వర్తిల్లు. "క. ఉడివోనిసిరుల నిటువలెఁ దడవెదునయ్యాల్లగర్వఁ దశించుచుండ..." సీతా. ౧, ఆ. ౫౩. స. క్రి. 1. నిమురు. "సీ. అయ్యుపేంద్రుఁడు నొచ్చినహయచయంబుఁ, దడవి తేర్చి..." భార. భీష్మ ౩, ఆ ౧౪౧. ఆం. భా. తృ. ౧౩౫; 2. వెదకు; "క...ఇందు నిమం దడవి కంటి మిగ్వాడు ..." భార. శల్య. ౨, ఆ. ౬౬; 3. సంపాదించు; "సీ. ధర్మమార్గంబునఁ దడవినధన మెల్ల ధరణీసురుల కర్థి దాన మిచ్చి..." దశ. ౯. ఆ ౧౪; 4. తాఁకు; "గీ. వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు." పాండు. ౩, ఆ. ౪౩; 5. తలఁచు; "చ...పలవించె దైవముఙ్, దడవుచుఁ బంచమధ్వనుల తానము లీనుదికాంగనాగరిన్." కాళ. ౧, ఆ. ౫౦; 6. ఆలోచించు; "క. ఎయ్యెడనైనను బుద్ధి సొనిపి, తడవి కని కొనంగవలయుఁ దగవుఁ దగ మియున్." భార. శాం. ౨, ఆ. ౧౮౭; 7. పలుకు; "గీ. ఇట్టివిగదయ్య చెప్పఁబోయిన నుపమలు, వీనిఁ దడవ సిగ్గొదవు నవ్వెలఁది సెంచి" ప్రభా. ౨, ఆ. ౬౪; 8. స్తుతించు. "సీ. గంభీరపదహృద్యగద్య ప్రబంధ విభ్రమరమాపారీణు బొణుఁ దడవి." వరాహ. ౧, ఆ. ౧౮; 9. నిందించు. "క. కర్మములు మేలు నిచ్చుచు, గర్మంబులు కీడు నిచ్చుఁ గర్తలు తనకుం, గర్మములు బ్రహ్మకైనను, గర్మగుఁడై పరులఁ దడవఁగా నేమిటికిన్." భాగ. ౧౦. స్కం. పూ. ౩౨. నీతి. ౨౧; 10. చేయు. "క...నాపైఁ, గినియ విని యతఁడు దర్పిత, దనుజకృతం బని రణంబు దడవుఙ్ బిదపన్." ఉ. హరి. ౫, ఆ. ౧౮౫. వి. 1. జాగు. "క. ఈవాయుపుత్త్రుఁ డాజిన్, ద్రావుదు నే దుస్ససేనురక్తం బనియెన్, ద్రావఁగ శక్యం బేనిన్,ద్రావు మనంగాదె యింకఁ దడవేమిటికిన్." భార. ఉద్యో. ౪, ఆ. ౧౯౫; 2. కొంతసేపు. "గీ. పెట్టుటకు నంగనలకును బట్టెఁ దడవు." నైష. ౬, ఆ. ౧౨౨; 3. తెలివి. "వ...అడుగువారికిఁ దెలివిపడ నుడువం దడవు లేక......" పారి. ౪, ఆ. ౬౬; 4. సేపు. "చ. గడెతడ వాతఁ డొక్కపనిగాఁ జని యింటికి రాకయుండినన్, దడఁబడు..." శశాం. ౨, ఆ. ౭౮; 5. చిరాయువు. "సీ. కాకివిట్టకుఁ జాల్గ

గడలేని బ్రదు కిడి చిలుకకుఁ దడ వేల చేయఁ దయ్యె." సీతా. ౧, ఆ. ౧౧౧. విశ. ఉరవు, అధికముగఁ గడచినది. "ఆ. తడవ్రాసినముఁజసు ధరణీసురశ్రేష్ఠ, మాకు మీకు సంగమంబు గలిగె" కుచేల ౨ ఆ. ౭౮.

తడవుకొను. దే. అ. క్రి (తడవు+కొను.) స్వార్థమున.) తడవు, వెదకు. (వా.)

తడవుడు దే. వి. (తడవు. ధా.) వెదకుట. ఆం. భా. ద్వి. ౧౭౩.

తడవులనిదుపవు దే. వి (తడవులు+నిదుపు+అఁడు- చిరకాలదీర్ఘ శరీరి.) అనంతుఁడు, శేషుఁడు "క. తడవులనిడుపనికి నైనఁ దరమే యెన్నన్ .." అచ్చ. యు. ౫౫. వేంక. శిర్వ ౧౦౪.

తడవులాడు = తడవాడు. (వా)

తడాకము. సం. = తటాకము.

తడాగము. సం. వి. అ. పుం. న. చెఱువు.

తడి. ఉ. భ. దే. వి. (తడియు. ధా. క-తడి.) 1. నీరు: "చ. తడి తల డిగ్గ ముంప..." ఆము. ౪, ఆ ౧౧౮. చంద్రా. ౪, ఆ. ౨౬౨; 2. తేమ: "చ. చిరసముపాత్రితాగ్ని తడిఁ జెంది నశించు నంచునో..." ఆము. ౨, ఆ. 33; 3. తడిబట్ట "సీ. తడి గట్టినట్లు ..' కవిరా. 3, ఆ. ౧౮౮; 4. కష్టము. "గీ ధార్మికస్థానమున కిట్టితట్టి పుట్టె. రామలిం. ౮౯. విశ. అర్ద్రము, తేమగలది. "గీ. దరుల తడివండు పొదువుమూపురము లంటు, జెల్లుగంటల నాఁబోతు లుల్లసిల్లె." ఆము. ౪, ఆ. ౧౫౬. సం. వి. ఇ. పుం. దెబ్బ. విశ. (ఇ) కొట్టునది.

తడిగ. వై. వి. (సంస్థాలికా. త. తళిగై.) స్థాలిక, పాత్రము; పళ్లెరము. 'చ. పొడఁగనవచ్చువారికిని భోగము వారికి నాటువారికిన్,దడిగలు మోచు వారికిని దండలు గట్టెడువారికిన్..." శ్రీరం. మా. ౬, ఆ. ౭౭.

తడితీయు. దే. అ. క్రి. (తడి+తీయు.) ఎండు. "గీ. పెదవి పేటెత్తు నాలుక పిడుచగట్టు, గొంతు తడితీయు..." దశా. ౨, ఆ, ౧౩౬.

తడిత్తు. సం. = తటిత్తు.

తడిత్వంతము. సం. వి. త్. పుం. మేఘము.

తడిపి. దే. వి. ధనము, సొమ్ము. (వా.)

తడిపొడి. దే. విశ (తడి+పొడి.) కొంచెము తడి గలిగి పొడిగా నుండునది. (శ. ర. వా.)

తడిబము. దే. వి. శయ్య; తలిమము. ఆం భా ద్వి. ౧౬౪.

తడిమము = తడిబము ఆం. భా. ద్వి ౧౬౪.

తడియాఱు=తడితీయు. "గీ పెదవు లెండుఁ గుత్తుక తడియాఱు..." మార్క. ౨, ఆ ౩౪.

తడియు దే. అ. క్రి ఆర్ద్రమగు. 'చ. తడిసినయేక వస్త్రపరిధానముతోడ...' భార. సభా. ౨, ఆ ౩౦౭.

తడియొత్తు. దే అ. క్రి. (తడి+ఒత్తు.) తుడుచుకొను. "సీ... స్నాన మాచరించి, గీ వేగ వెడ వెడఁ దడియొత్తి ..." దశా. ౧, ఆ. ౮౮. వి. తుడుచుకొనువస్త్రము "సీ. ధౌతాంశుకంబులు తడియొత్తులఁను దేర..." ఆము. ౫, ఆ ౮౯. "సీ. ...తడియొత్తులను మేనితళ్లు తుడిచి" చంద్రా. ౪, ఆ ౨౬౨.

తడివెండి. దే వి. (తడి+వెండి.) పాదరసము. (వా.)

తడిసుడు = తడి యొత్తు (తడితుడుచుకొనుబట్ట) "ద్వి. సరగున మంగళస్నాన మాడించి, తరుణికి జిలుఁగు గారుతడిసుడు విచ్చి." ద్వి. పరమ. ౫, ఆ. ౫౭౮, పు.

తడుకు. దే వి. 1. తడక. ఆం. భా. ద్వి ౧౨; 2. కంచె. "గీ తడుకు పొడిపించి యూతుల, గుడిసెల పదియించె మంత్రి గురుభట యుతుఁడై" ఆము. 3, ఆ ౧౭; 3. వేటసాధనవిశేషము "క. కట్టలుకఁ దడుకుచాటునఁబిట్టల నురిగోలఁ దిగిచి......" భాగ. ౭, స్కం ౫౯.

తడుకుఁబెండెము. దే వి. (తడుకు+పెండెము) తెట్టు కొఱకు ముడ్లతో నల్లినతడక. ఆం. భా. తృ. ౩౪. 'ఆ... తాఁ,దడుకుఁబెండె మలంక పొదమ వెడలి. ఆము. 3, ఆ. ౨౭.

తడుకున = తటుకున. (శీఘ్రముగా) "చ మడిఁగి ముసుంగుతో వెయక ముందును జూడక వచ్చి లోనికిం, దడుకునఁ బోయి .." కవిక. ౪, ఆ. ౯౬. (శ. ర. వా)

తడుకువాడుచు దే అ. క్రి. (తడుకు+పాడుచు.) 1. కంచెవేయు. "క...పరు ల్యావాల మటు చొరకుండఁ దడుకువాడించినభంగిన్."కళ. ౫ ఆ. ౧౫౫. స్వా. ౪, ఆ. ౩౭; 2. కంచెవేసినట్లు

చిమ్ము. "సీ. కేతకీమందారకేసరాదులఁ దన్ని కెడపి వీథుల నెల్లఁ దడుకువాడిచి." రామా. ౬, ఆ. ౨౦౧.

తడుపు. దే. స. క్రి. (తడియు. ధా. ప్రే.) ఆర్ద్రి మొనర్చు. "గీ. అంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ, దడిపె వెండియుం హర్షాశ్రుతతులఁ జేసి." భార. ఆది. ౬, ఆ. ౫౩. "సీ...దగసొట్టి వెదవులు దడుపువారు." పిన. శకుం. 3, ఆ. ౧౦౬. వి. **1.** వస్త్రము. "గీ. తడుపు గట్టక నీళ్లాడఁ దగవు గాదు." కాశీ. ౨, ఆ. ౮౫. భార. శల్య. ౨, ఆ. ౧౬౦; **2.** చిన్నవస్త్రము; "గీ పసుపుఁ గౌపీనమును బచ్చపట్టు తడుపు, నమరఁ జిన్నారి చిఱుతప్రాయమున మున్ను, జగతి బలి వేఁడినట్టి వేషము ధరించి." వైజ. 3, ఆ. ౧3౬. హరి. పూ. ౫, ఆ. ౨౫౫. విశే. తడిసినది. "గీ. పడ్తులు లయ్యెడఁ దడుపుపావడలు విడిచి." భాను. ౨, ఆ. ౯౦.

తడుపుదాలుపు. దే. వి. (తడుపు+తాలుపు.) బ్రహ్మచారి "సీ...వడుగు బొమ్మసారి తడుపుదాల్పు. గీ. నఁగ వటుండు .." వేంక. మాన. 3౮. ౯౦. భా. ద్వి. ౧౮౬.

తడుమన. వై. వి. (సం. జడిమన్. త. తడిమన్.) సంశయము. "క. అడిగిన నృపసుత గా నని, నొడివెడినో యిది మనంబు నొవ్వ నని విభుం, డుడురాజవదన నడుగక, తడుమన నొక కొంత ప్రొద్దు తడఁబడఁ జొచ్చెన్." భాగ. ౯, స్కం. ౯౧౧. విశే. మందము, అల్పము గీ. పరభృతావళిఁ దొలుమొల్లపండ్లరసము ద్రావె నన ముద్దుఁ బలుకులు దడుమ నయ్యె, మధుమదాసక్తి నిజ రూపమహిమ లెడసి, యభినవాంగప్రభాసిత వైరి సతులు." కు. సం. ౯, ఆ. ౧33. "సీ. అన్నవ యగుమధ్య మల్లలనాడంగఁ దడుమనియూనంబు తడఁబడంగ." వీర. ౨, ఆ ౧౬౯.

తడుము. దే. స. క్రి. నిమురు. "చ...పృథుభీమణ బాహులసాళువంబులన్, డడిమి కెరల్చుచున్ జనిరి..."స్వా. ౪, ఆ. 3౦. (శ. ర. పా.)

తణగము. దే వి ఎద్దుమీఁదనుంచి నీళ్ల తెచ్చెడి తోలుసంచి. "సీ. పేరాది యొద్దాది భారాదులనవచ్చు గోనెలు తణగాలు గోతములును." హంస. ౪, ఆ. ౭౪. హంస. ౫, ఆ. ౯౨.

తతకారము. సం. వి. అ. న. తాళము వేయునపుడు చేయుశబ్దోచ్చారణము. "సీ. అత్తమామలు చూడ నలివేణి యొక్కతె తతకారములు చేసి తాళ మొత్తె." వి. పు. ౨, ఆ. ౭౮౦.

తతపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. విరివి యైనఆకులు గలది అరఁటి.

తతము. సం. వి. అ. పుం. గాలి. న. **1.** వీణ లోనగు వాద్యము; **2.** విస్తారము. విశే. (అ. ఆ. అ.) **1.** విరివియైనది; **2.** వ్యాపించినది.

తతి ఉభ. దే. వి. సమయము. "క. తతిఁ గూడు లేక యూఁకటఁ, గుతిలపడు నతండు గువ్వకుత్తుక తోడన్." పాండు. 3, ఆ. ౨౦. అం. భా. ప్ర. ౭౬. సం. వి. ఇ. స్త్రీ. **1.** సమూహము; **2.** వరుస.

తతిగొను. దే. అ. క్రి. (తతి+కొను) సమయము కని పట్టు. "క. తనయుఁ డని నొడువఁ దలఁచును, దనయుఁడు గా వున్న మినులఁ దతిగొని నవతున్ దను నగియెద రని తలఁచును..." భాగ. ౧౦, స్కం. ఉ. 3౨.

తతిమ్మా. దే. విశే. (హిం. తతిమ్మా.) మిగిలినది. (శ.ర.)

తత్క్షణము. సం. వి. అ. పుం. అక్షణము, అప్పుడు.

తత్తకతక. దే. వి. తాళమునం దగుధ్వని కనుకరణము. శశాం. ౪, ఆ. ౬౫.

తత్తడి. దే. వి. గుఱ్ఱము ; వాహనము. "చ. సగర కుమారు లందఱును...తత్తడిఁ గానక తత్తరంబు నన్." జాహ్నవీ. ౨, ఆ. ౫౯. "క... జేజేగము లకుఁ, దఱుగనిమే లిడినళిబ్బతత్తడిదొరకున్." నీలా. ౧, ఆ. ౧౯.

తత్తడిమోరపైదలి. దే. వి. (తత్తడి+మోర+పైదలి) కిన్నరస్త్రీ. అచ్చ. సుం. 3౫.

తత్తబడ. దే. వి. **1.** సైన్యము. "ఉ...ఈ,తత్తబడల్ పిఱింది దెసఁ దాఁకిన..." నిర్వ. ౬, ఆ. ౧౪౬; **2.** పరివారము. "క. చిత్తం బూరకే కలఁచెదు,నెత్తము నాతోడ నాడనేరుపు గలదే, బొత్తుగలసి నీవును నీ,తత్తబడలు రండు గెలిచెదం బరువడితోన్." ఉ. హరి. 3, ఆ. ౧౧౬. (శ. ర. పా. 'తత్తబళ.' ముద్రి.)

తత్తఱ. దే. వి. (తఱ+తఱ.) **1.** తొందర. "చ... ఎచటికేనియు నేఁగుతలంపుతోడఁ ద,త్తఱమున నేఁగుదెంచి ప్రమదంబున నిన్నముఁగొంటి నియ్యె

డన్." రుక్మా. ౫, ఆ. ౯. ఆం. భా. ప్ర. ౧౮౦; 2. ఆకులపాటు "చ...తడఁబాటును దత్తరముం జలంబు లో౯నదరఁగ..." పారి. ౧, ఆ. ౧౦౧. విశే. సంభ్రమముతోఁ గూడినది. "క. వెదవులు దడుపుచుఁ బదములు, గుదిగొనఁ దత్తఱపుమాట గుత్తుక దగులన్." ఈ. హరి. 3, ఆ, ౧3౬.

తత్తఱపడు. ద్వ. అ. క్రి. (తత్తఱ+పడు) 1. తొందరపడు. "క. ఇత్తెఱఁగున నయ్యింతులు, చిత్తజుబాణములచేత సిగ్గంతయుఁ బోనొత్తి మునిఁ బెండ్లియాడఁగఁ, దత్తఱపడు టెఱిఁగి వర్షధరుఁ డాలోనన్." వి. పు. ౫, ఆ. ౧౫౨; 2. ఆకులపాటు నొందు. "చ. మఱియును దైత్యుఁ డానృపకుమారుని నుగ్రశిలీముఖంబులన్, నెఱకులు దూఱ నేసి...తత్తఱపడఁ జేసె దేవసముదాయము నెల్ల నువగ్రవృత్తియై." భా. రా. యు. ౨౦౫౮.

తత్తఱపాటు. ద్వ. వి (తత్తఱపడు ధా.) 1. తొందఱపాటు, సంభ్రమము. "సీ. తాఁకినవాఁడు తత్తఱపాటుతో మేలుఁ గని ముచ్చు ముచ్చంచుఁ గళవళించె." కాశీ. ౪, ఆ. ౧౭౪. చంద్రి. ౧, ఆ. ౫౫; 2. ఆకులపాటు. "క. అత్తాపసోత్తమునిమదిఁ దత్తఱపా టొదవఁ జేయఁ దక్కొరులకుఁ గాదు..." ఉ. హరి. ౨, ఆ. ౧౭౯. పె. శకుం. ౨, ఆ. ౯౪.

తత్తఱపెట్టు. దే. స. క్రి. (తత్తఱ+పెట్టు.) తొందరపెట్టు. "క. మనసిజుఁ డిద్దఱకును గుంపెన కాని తనంబు చేసెడిం గనుఁగొన నాఁ జనవులు మాటల యనువులుఁ, దనువునఁ బులకలును గలుగఁ దత్తఱపెట్టెన్." వి. క్రి. ౮, ఆ. ౫౪.

తత్తఱబిత్తర. దే. విశే. (తత్తఱ+బిత్తరము. క. తత్తఱబిత్తఱ) కలఁతనొందినది. "ద్వి...తలఁపు లెంతయును దత్తఱబిత్తర రయ్యె." ప్రభు. ౧, ఆ. 3, గతి. ౨౦. పు.

తత్తఱించు. దే. అ. క్రి. 1. తొందరపడు. "చ... నోయగంబు బోలుకఁగ వచ్చె నత్తఱి రఘూత్తము చిత్తము తత్తఱింపఁగన్." ఉ. రా. ౬, ఆ. ౧౬౧; 2. క్షోభపడు, ఆకులతనొందు. "గీ. అర్చి యెడవంక సాత్యకి యడ్డగింప, వాసుదేవుండు వలపంక పచ్చి యుండుము, ప్రియ నవ్వరుఁ డచ్చోట ప్రేమెఁ దత్తఱించి సౌంద్రుండు ధర మొగతెల్లఁ బడియె." ఉ. హరి. 3, ఆ. ౬౫; 3. చలించు; "సీ. మెలఁత నెమ్మోమున గ్రమ్మెఁ బుగుసంచున మించ దనుజేంద్ర చిత్తముల్ దత్తఱించె." దశా. ౨, అ. 3౦౧; 4. భయపడు; "గీ. ఉదకమునఁ దత్తఱించుచు నున్ననన్నుఁ, జూచి భయ మేమి యనుటగా చోద్యమయ్యె." దశా. ౧, అ. ౧3౬. నరస. ౨, ఆ. ౧౧౫.

తత్తఱింత. దే. వి. (తత్తఱించు ధా.) తొందర. "గీ. మమతలును దత్తఱింతలు మక్కువలును..." పి. శకుం. 3, ఆ. ౨౧౯. కేయూర. ౧, ఆ. ౬౯.

తత్తఱిల్లు. దే. అ. క్రి. 1. తొందరపడు; "ఉ... కాంతఁ బొన్నునకుఁ దార్చెను దన్మధురాధరామృతా, క్రాంతిరసోద్ధతిన్ దన మొగంబులు నాలుగు నొక్కమాటె యత్యంతము దత్తఱిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్." కళా. ౫, ఆ. ౧౪. కళా. ౭, ఆ. ౭౬; 2. కలఁతనొందు; "వ...పచ్చవిలుకాఁడు మునుపటిపచ్చిగా యంబులపై విచ్చలవిడిఁ బెచ్చుపెరిఁగి క్రొత్తవిరిముల్కిముత్తములు హత్తించిన బిత్తరి తత్తఱిల్లి... మూర్ఛిల్లి..." మ్మ. వి. ౨, ఆ. ౮౦.

తత్తళా. దే. వి. వాహనము. "ఉ...మరుండును జిల్కదత్తళా, మీఁదఁ జివుక్కునం బడి..." గంధ. ౧౪౫. [303.

తత్తెర. దే. వి. సారాయి వోసెడితిత్తి. ఆం. భా. ద్వి.

తత్పరము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆసక్తము; 2. ఒకదాని తరువాతిది.

తత్పురుషము. సం. వి. అ. పుం. (వ్యాక.) తఱచుగా ఉత్తరపదార్థప్రధాన మగునొకసమాసము.

తత్ఫలము. సం. వి. అ. పుం. 1. నల్లకలువ; 2. చెంగల్వకోష్టు; 3. చోరమను ఓషధి.

తత్రత్యము. సం. విశే. (అ. ఆ. అ.) అక్కడనున్నది.

తత్త్వజ్ఞుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తత్త్వము నెఱిఁగినవాఁడు.

తత్త్వము. సం వి. అ. న. 1. సత్యము; 2. కలరూపు; 3. బ్రహ్మము; 4. చేతము; 5. వస్తువు; 6. స్వభావము; 7. సత్త్వరజస్తమాదులలో నొకటి; 8. సృష్ట్యవయవభూత మగుపదార్థము. (ఇవి మతభేదములచే ననేకవిధములు.)

తథా. సం. అవ్య. అట్లు, ఆప్రకారము. ఉదా:— తథాకృతము.

తథాగతుఁడు. సం. వి. అ. పుం. బుద్ధుఁడు. విశ. (అ. ఆ. అ.) 1. అట్లు వచ్చినవాఁడు, 2. అట్లు వెళ్లినవాఁడు. [సత్యమైనది.

తథ్యము. సం. వి. అ. న. సత్యము. విశ. (అ. ఆ. అ.)

తద్. సం. స. (ద్) అ. ఉదా:—తత్కాలము.

తదర్థము. సం. విశ. (అ. ఆ. అ.) 1. అది ప్రయోజనమైనది; 2. అది యర్థముగాఁ గలది; 3. దానికొఱకైనది; కొఱకైనది. "సీ. నీతదర్థంబుగా నిఖిలలోకంబులు పవిత్రిల్లు లోక పావనము లగుచు." భార. సభా. ౧, ఆ. ౧౭౮. ఆది. ౨, ఆ. ౨౦౮.

తదర్థీయము సం. = తదర్థము.

తదా. సం. అవ్య. అపుడు. ఉదా:—తదాగతుఁడు.

తదాత్వము. సం. వి. అ. న. ఆకాలము.

తదాత్వికము. సం. విశ. (అ. ఈ. అ.) ఆకాలముది.

తదియ వై. వి. (సం. తృతీయా) పక్షమునందలి మూఁడవతిథి. "గీ. విదియనాఁ డేఁబడకున్నఁ దదియనాఁడు, కానఁబడియెడుపని కింత గనల నేల." య. ౫, ఆ. ౬, ఆం. భా. ప్ర. ౭౭.

తదీయము. సం. విశ. (అ. ఆ. అ.) తత్సంబంధమైనది. (వానిది, వారిది, ఆమెది, దానిది)

తద్గతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. దానిని పొందినది; 2. దానియందు లగ్నమైనది.

తద్గుణము. సం. వి. అ. పుం. తనగుణము విడిచి యన్యానుగుణము గొనుటలంకారవిశేషము. విశ. (అ ఆ. అ.) దానిగుణముల వంటిగుణములు గలది

తద్ద. దే. అవ్య. పుక్కిలి. (తద్దయు, తద్దన్ అనురూపములును దీనికిఁ గలవు.) "ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టినయిండ్లను, బెద్దకాల మునికి తద్ద తగదు." భార ఆది. ౪, ఆ. ౬౫. "క...తద్దయు భక్తిన్." భార. ఆది. ౧, ఆ. ౯౨. "సీ. గుదియఁ జేకొని తద్దఁ గుంటిపాటు జముండు..." అచ్చ. బాల. ౬౭.

తద్దినము. సం. వి. అ. న. 1. ఆదినము; 2. ఆబ్దికదినము, "సీ. శాంతులు గండదోషములుఁ దద్దినములు భూసురు లెంతురు భోజనేచ్ఛ." దశా. ౧౦, ఆ. ౧౯; 3. ఆబ్దికము, "ద్వి. తచ్చనఁ దనయింటఁ దద్దినం బనుచు, మునులను నియమించి ముద. మొప్పఁ దెచ్చి" రం. రా. అర. ౧౫౨. పు.

తద్దె=తదియ. (భాద్రపదబహుళమున వచ్చుతదియ ఉండ్రాళ్లతద్దె యనియు ఆశ్వయుజబహుళమున వచ్చుతదియు అట్లతద్దె యనియు వాడుక.)

తద్ధితము. సం. వి. అ. పుం. సుబంతములకు భావార్థమత్వర్థాదులందు వచ్చుప్రత్యయము." విశ. (అ ఆ. అ.) దానికి, ఆమెకు, వానికి, వారికి - హితమైనది.

తన. యు. దే. స. ప. (బ. తమ. రూ. తాను, తాము, తాన, తమను, తన్నుఁగా, తమ్మున్, తనచేతన్, తమచేతన్ మొ.) ఆత్మార్థకము. (ఇది తచ్ఛబ్ద యుష్మదస్మచ్ఛబ్దములయర్థము నిచ్చును. మఱియు, నిది బహుత్వమున నేకవచనరూపమున నుండును) "సీ. పని యేమి పంచినఁ బనుపడి జేసిన ననక తన బంచినయాజ్ఞణంబ, చేయుచు..." భార. ఆది. 3, ఆ. ౧౧౧. "గీ. తమరు పెద్దల రైతిరి." కృష్ణ. ౨, ఆ. ౩౮. "గీ. తన్ను నెఱుఁగక నెగడొందు నన్ను నిరుఁడు." భార. శాం. ౬, ఆ ౧౩౪. "క. విను బీజంబున బీజంబును దేహమునందు దేహమును నింద్రియముల్, దనతనవలనం దానును, మనంబునను మనసు పుట్టు మహిత విచారా." భార. శాం. ౬, ఆ. ౩౦. వై. ప్ర. (సం. త్వమ్) 1. భావార్థమున వచ్చుతద్ధితప్రత్యయము. ఉదా:—సొగసుదనము మొ; 2. క్రియాజన్యవిశేషణములమీఁద వచ్చుప్రత్యయము. ఉదా:—అఁకొన్నతనము; 3. స్వార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:—అసూయతనము. దశ. ౫, ఆ. ౪౫.

తనఖా. హిం. వి. కొంతయాస్తి హామీగా నుంచి కొంతసొమ్ము బదులు పుచ్చుకొనుట.

తనిఖీ. హిం. వి. విమర్శము, పరీక్ష.

తనయ. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. కోలపొన్నచెట్టు.

తనయుఁడు. సం. వి. అ. పుం. కొడుకు.

తనరారు. దే. అ. క్రి. (తనరు+ఆరు. స్వార్థమున.) 1. విజృంభించు. "సీ...దుర్దమగతిఁ దనరారు వారిసత్త్వము లెల్లఁ బోలియ..." రాఘవ. ౪, ఆ. ౬౭; 2. ఒప్పు. "సీ. నెగసినకొన లేచి నింగి యంతంతకు నవులఁ ద్రోవఁగఁ దనరారుదాని." భార. విరా. ౧, ఆ. ౧౬౭.

తనరించు. దే. స. క్రి. (తనరుధా. ప్రే) 1. చేయు, "చ...రావణుఁడు...ఈశపూజ గరిమం దనరింప..." అచలా. ౧, ఆ. ౨౩; 2. కలుఁగఁ జేయు, "మ...సురాంగనలకున్ కూరాహిత

శ్రేణికిన్, దనరించుం దగులంబులు..." కావ్యా. ౫, ఆ. ౧౦౭; 3. సంతోషింపఁజేయు. "ద్వి... నీజవ్వన మనునిధానంబు, రిత్తపుచ్చక తనరించి కైకొనుసె." ద్వి. పరమ. ౫, ఆ. ౪౧౦. పు.

తనరు. వై. అ. క్రి. (సం. తన్.) 1. అతిశయించు, మించు. "క...ఘనుఁ డీతఁడు వీరికంటెఁ గార్ముక విద్యన్, దనరినవాఁ డయి దీనికి, మొనసెం గా కన్యుఁ డిట్లు మొనయం గలఁడే." భార ఆది ౭, ఆ. ౧౮౧; 2. ఒప్పు, విలసిల్లు. "ఉ...తామ రతంపరై తనరెఁ దత్పురిఁ గింపచగేహవాటికల్." పారి. ౫, ఆ. ౪౫; 3. పండు, ఫలించు, "క. దునకయు వెదపెట్టకయున్, దనరె నఖిలసస్యములును..." హరి. పూ. ౧, ఆ. ౧౧౮; 4. ఉప్పొంగు; పెరుఁగు. "క...హాలాయుధుఁడు నసుడెంచిన స్నేహమనము దెలివొందె మూఁపులు, దనరె మొగం బలరె నీమతనయును కథిపా." భార. శల్య. ౨, ఆ. ౨౮. సా. ౨, ఆ. ౧౭౩; 5. వసించు, ఉండు. "సీ...తపసి డెందపుటిండ్లఁ దనరువాఁడు." రామా. 3, ఆ. ౪౫.

తనరుచు. వై. అ. క్రి. (తనరు+చు స్వార్థమున.) తనరు. (చూ. తనర్చు.) స. క్రి. తనరు ధా. ప్రే.) తనరఁజేయు, కలిగించు. (చూ. తనర్చు.)

తనరుపు. వై. వి. (తనరుచు ధా.) తనరుట. (చూ. తనర్పు.)

తనర్చు = తనరుచు. అ. క్రి. 1. (పొంగు.) "మ... రౌద్రరస ముప్పొంగన్ దనర్చన్ భుజాగ్రములు..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౮౮; 2. (వ్యాపించు.) "క...కడల నిరులు తనర్చెన్." నీలా. 3, ఆ. ౫; 3. (వసించు.) "సీ. స్వచ్ఛవృత్తిని దనర్పంగ ముక్తము లగుభాతి నొక్కటద్విజపంక్తు లురుల." దశా. ౨, ఆ. ౧౩౯. స. క్రి. కలిగించు. "చ...భయముం దనర్పనిట్టను నతఁ డొజ్జఁ గన్గొని నిరంతరవిస్ఫురితాధరోష్ఠుఁ డై." నృసిం. ౪, ఆ. ౮.

తనర్పు = తనరుపు. 1. (ఎత్తు.) "చ. అరుదుగ సర్వశైలములయంత తనర్పును..." భార. ఆది. ౨, ఆ. ౧౧; 2. (వెడల్పు.) ఆం. సం. స్థా. 3 3; 3. (పృథుత్వము) "చ. నడు మన దింలిచన్నుల తనర్పున ముందఱ గానరాదు..." కు. సం. ౯, ఆ. ౧౬; 4. (ఆధిక్యము, పెంపు) "భుజంగ ప్రయాతము. వినీతుండవై ధర్మవేదిత్వబుద్ధిం, దనర్పొందు నీవు..." భార. స్త్రీ. ౧, ఆ. ౮౭.

తనాబి. దే. వి. చూరు నిలఁబడుటకై స్తంభముల మీఁద వేసెడుపెద్దకమ్మి. (శ. ర బ్రా. వా.)

తని. వై. విశే. (సం. తనుక.) 1. అల్పము. "గీ... చెమట, పోడము మేనులతనికంపు..." భార. విరా. ౨ ఆ. ౨3౮; 2. చిన్నది. "సీ...తని మొగ్గవిరవాదిదండ..." ఆము. ౨, ఆ. ౬౧; పక్వము. "సీ. తనిపండ్లరస మాని..." భార. అను. ౧, ఆ. ౧౫౧; 4. సమృద్ధము. "సీ... తరుల నెప్పుడు పండ్లు తనిగ నుండు." కృ. శకుం. ౧, ఆ. ౧3; 5. శుద్ధము. (నీరు కలియని ది) "ఉ. ఆరికకూడు...తనిమజ్జిగ..." వేం. పంచ. ౧, ఆ. ౬౮౭.

తనిమ. సం. = తనిమము.

తనిమము. సం. వి. న్. పుం. 1. బక్కతనము; 2. పలుచఁదనము; 3. చులుకఁదనము.

తనియించు. దే. స. క్రి. (తనియు ధా. ప్రే.) తృప్తి పఱుచు. "క. ఉడివోనిసిరుల నిటువలెఁ, దడవెడు నయ్యాల్మ గళ్లఁ దనియింతురు సొంపడర సిరి దామఁ దనునొక, కొడుకును మఱి నీల యనెడు కూఁతు రొకర్తున్." నీలా. ౧, ఆ. ౫౩. బహు. ౧, ఆ. ౯౨.

తనియు. దే. అ. క్రి. తృప్తిపడు. "క. ధనమున విద్యను సంతతిఁ, దనిసినవా రెందుఁ గలరె..." భార. ఆది. ౫, ఆ. ౧౮౯. భార. ఆది. ౫, ఆ. ౯౨.

తనివారు. దే. అ. క్రి. (తనివి+ఆరు) తృప్తినొందు. "గీ. వానిఁ దనివారఁ జూడనివనజగంధి, చూచి తలయూచి మెచ్చని సుందరాంగి." శుక. ౧, ఆ. ౭౬౯. ఇందు. ౫, ఆ. ౯౮.

తనివి. దే. వి. తృప్తి. "ఉ.. లత్మ్మీపరసోక్తులన్ దనివిఁ జెంది ముకుందుఁడు లేచెఁ జెచ్చెరన్." ఉ. రా. ౨, ఆ. ౪౦. ఆం. భా. ౨, ప్ర. ౭౬౧.

తనివిసను. దే. అ. క్రి. (తనివి+చను.) తృప్తినొందు "క. కనుఁగొని సూతుం డరదముఁ, గొనిపోయెం దొలఁగ నపుడు కుంతీతనయుం, ధనిఁ దనివిసనక గుంపులుఁ గొనియున్నెడ లరసెఁ గలయఁ గురుసైన్యమునన్." భార. విరా. ౫, ఆ. ౧౭౭. పారి. ౧, ఆ. 3౫.

తనివు. దే. వి. తృప్తి. "ఆ. కర్ణము ద్రుపదులకాంతల విధవలఁ, జేయుఁవాఁడ నీవు చెప్పు మిగిలి, నగుచు నేఁడు ద్రుపదనందనపీనుల, ధర్మసుతుసిచెవ్వలఁ దనివు నిసుపు." భార. కర్ణ. 3, ఆ. ౬౬౪.

తనివుపడు. ద్వి. అ. క్రి. (తనివు+పడు) తృప్తి నొందు. "గీ. ప్రతిదినంబును జంగమార్చనము లేక, తనివుపడ నొల్ల విజితకందర్ప యనుడు." కాళ. ౧, ఆ. 3౫.

తనివెచ్చ. దే. వి. (తని+వెచ్చ.) గోరువెచ్చ; కవోష్ణము. "ఆ...కదుష్ణనామ, మలరు గోరువెచ్చ నులివెచ్చ తనివెచ్చ, యన..." ఆం. భా. ప్ర. ౭3.

తనివోవు. దే. అ. క్రి. (తనివి+పోవు) తృప్తినొందు. "చ. తమతమయంత నెచ్చెలులు దారును నెప్పటి యట్ల యాటఁ జిత్తము దనివోక..." నిర్వ. ౭, ఆ. ౬3. మార్క. ౧, ఆ. ౧౭౯.

తనిష్ఠము. సం. విశ. (అ. ఆ. అ.) 1. అన్నిటికంటె కృశించినది; 2. అన్నిటికంటె అల్పము; 3. అన్నిటి కంటె విరళము.

తనీయము. సం. విశ. (న. యసీ. న.) 1. కృశతరము; 2. అల్పతరము; 3. విరళతరము.

తను. దే. విశ. వృత్తియందు 'తనుపు' శబ్దమున కంత్య వర్ణము లోపింపగా మిగిలినరూపము. "క. అచటఁ బొలయుచున్నల్లని, తనుగాలిం దేటి లజ్జితస్వాంతుండై." నిర్వ. ౪, ఆ. ౭౭.

తనుకము. సం =తనువు.

తనుకాఁడు. దే. విశ. (తనుపు+కాఁడు) తృప్తినొందించువాఁడు. "సీ. జగములఁ గలయమృతాతల తనుకాఁడు పితృఁ గాంచి పెంచినయొయారి" రా. వి. 3, ఆ. 3.

తనుకు. దే. అ. క్రి. 1. కలుగు, "క...ధరణి కర గ్రహాధియంబు దనుకక యుండెన్." భార. సభా. ౧, ఆ. ౪౨, హరి. ఉ. ౨, ఆ. ౬౪; 2. జ్వలించు, "క. కొని వ్రచ్చుడు లోపల నగ్గలిక్రిమియై తోఁచి చూడ లత్తుకవర్ణంబునఁ బామై విష వహ్నులు, దనుకఁగఁ గురుపీరుఁ గఱచి తక్షకుఁ డరిగెన్." భార. ఆది. ౨, ఆ. ౨౦౦. భార శాం. 3, ఆ. 3౧౭; 3. భయపడు, "ద్వి. అనుటయు నెట్లతం డంబుధిఁ ద్రచ్చెఁ, దనుకక మందర ధర మెట్టు మోచె." ద్వి. భాగ. ల. స్కం. (శ. ర); 4. ప్రకాశించు, "క. మొగమునఁ దని కినకెంపుతోడ మునిపతి యుండెన్." ఉ. హరి. ౪, ఆ. ౭౫. పె. శకు. ౬, ఆ. ౧౯౬; 5. తపించు. "చ...నాథుఁడు పక్షియ కేఁగుపెంజిలిం దనికి ఖుజింప కుక్కి.." పాండు. ౪, ఆ. ౧౭3. పాండు. ౪, ఆ. ౭; 6. అతిశయించు, "క. అనఁ జిఱునవ్వు మొగంబునఁ దనరఁ జకచ్చకితకర్ణతాటంకరుచుల్, దనుకన్.." శశాం. 3, ఆ. ౫౭; 7. ప్రసరించు, "మ. అని గర్వోక్తులు పేర్కుఁ బల్కి వెస నయ్యబ్జాక్షీదృగ్దీధితుల్, దనుకంగాఁ జని కాంచె నంత హిమవంతమ్మున్..." మార్క. ౧, ఆ. ౨౨. అ. క్రి. స. క్రి. తగులు. "క. వినుఁ దేతప్పున దోషము, దనుకక యుండఁగ..." భార. మౌ. ౨౦౨, భార. శాం. ౪, ఆ. ౧౯౨, వి. భయము. "గీ. కులనగములైన ప్రయ్యలై కూలునట్లు, గా నొన ర్చెడికైదు వాకరణిఁ గప్ప, భావ మొంది క్రమ్మఱ వచ్చి పాకశాస, నునికరము సేరె నెంతయుఁ దనుకు సొచ్చి." హరి. పూ. ౪, ఆ. ౧౪౭.

తనుక్షీరము. సం. వి. అ. పుం. అంబాళము ✽. విశ. (అ. ఆ. అ.) అల్పమైనక్షీరము గలది.

తనుగాలి. దే. వి. (తనుపు+గాలి) చల్లనిగాలి. "క... ధనదునూతుఁ దృశని నొకపద్మాకరంబుతటమున నుం బెట్టిన నచటఁ బొలయుచున్నల్లని, తనుగాలిం దేటి లజ్జితస్వాంతుండై." నిర్వ. ౪, ఆ. ౭౭. దశ. ౭, ఆ. ౧౧౧.

తనుచ్ఛదము. సం. వి. అ. పుం. దేహమును కప్పునది-కవచము.

తనుచ్ఛాయము. సం. వి. అ. పుం. తెల్లతుమ్మ ✽. విశ. (అ. ఆ. అ.) అల్ప మగుఛాయ గలది.

తనుజ. సం. వి. ఆ. స్త్రీ. దేహమునుండి పుట్టినది—కూఁతురు; ఇట్లే: తనూజ, తనూభవ మొ.

తనుజుఁడు. సం. వి. అ. పుం. దేహమునుండి పుట్టిన వాఁడు—కొడుకు. ఇట్లే: తనూజుఁడు, తనూభవుఁడు మొ. [కవచము.

తనుత్రము. సం. వి. అ. న. దేహమును కాపాడునది-

తనుత్వక్కు. సం. వి. చ్. స్త్రీ. చిఱుసెల్లి ✽. విశ. (చ్.) పలుచనితొక్క గలది.

తనుపత్త్రము. సం. వి. అ. పుం.-సన్నని ఆకులు గలది గార, ఇంగుది.✽

**తనుపారు.** అ. క్రి. (తనుపు+ఆరు.) 1. తృప్తి నొందు. "చ. ప్రమదము లుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలు వోయి .." హరి. పూ. ౮, ఆ. ౧౬౬. పి. శకుం. 3, ఆ. 3౮; 2. చల్లనగు. "క. కని యాపద్మాకరమునఁ, దనుపారెడునీరు ద్రావి..." ఉ. హరి. ౪, ఆ. 3౧. కు. సం. ౫, ఆ. ౧౪౮.

**తనుపు.** దే. స. క్రి. (తనియుధా. ప్రే.) 1. తృప్తినొందించు. "సీ. పాయసాపూపాదిబహువిధాన్నం బుల జగతీమరుత్సహస్రంబుఁ దనిపి." కాశీ. 3, ఆ. ౨౨౬. ఉ. రా. ౧, ఆ. 3; 2. కాపాడు. "క. మొనయంగనకా కటకట, మొనయం గన కాద్రిధరుఁడే ముదిత నుపవనా, తనుపవనాహతి కొనఁగక, తనుపవనా మదన నీయుందంచిత కదుణన్." వసు. 3, ఆ. ౧౭౬. వి. 1. సంతృప్తి. "ఆ....అర్ఘ్యనాతిమిత్రుఁ దయ్యు నర్ఘ్యనాహి, తమ్మొనర్చుశార్ఙ్గి తముఁ బ్రోవఁ బ్రజ ల్లెల్లఁ, దల్లి మణుగుప్రజలతనుపు గనిరి." సాంబో. ౧, ఆ. ౧౦౭. కు. సం. ౧౨, ఆ. ౧౯౬; 2. పితృయజ్ఞము. "సీ...తనుపు నాఁగను పితృయజ్ఞాఖ్య యొనరు..." ఆం. భా. ద్వి. ౧౭౧; 3. చల్లఁదనము. (చూ. తనుపుసేయు.); 4. తడి. "క జనకునయిన సోదరునైననను సుతునైన నొకపరిఁ గనం దరుణులకున్, దనుపెక్కును లజ్జాపద మని హరితో ద్రుపదపుత్రి యనెఁ గద తొలు తన్." సా. ౨, ఆ. ౨౪౬; 5. ఉపచారము "చ. కనుఁగొని సత్యభామ మదిఁ గంపము నొందక నాటియున్న యాసునిశితబాణము స్నెఆలికి శోణితమున్ గరపల్లవప్రమార్జనమున నొయ్యఁ బాపుచును జామరమారుతసంప్రయుక్తిచేఁ, దను పొనరించి వల్లభుగతవ్యథఁ జేసె ముహూర్త మాత్రలోన్." హరి. ఉ. ౪, ఆ. ౧౬౦. విణ చల్లనిది. "సీ. అరుదారుమేలుక ట్లాయితంబై చూడ నొప్పారి తనుపగుచప్పరములు." భార. ఉద్యో. ౧, ఆ. ౯3. దశ. ౫, ఆ. 3౯.

**తనుపుసేయు.** దే. అ. క్రి. (తనుపు+చేయు.) చల్లఁదనము గల్గించు. "గీ. పతివియోగాన్ని మనములో సంతతంబుదగిలికొని కాల దానికిఁ దనుపుసేయఁ, దలఁచియో ..." కు. సం. 3, ఆ. ౮౭.

**తనుబీజము.** సం. వి. అ. పుం.- చిన్నగింజలు గలది— పెద్దరేఁగు.*

**తనుమధ్య.** సం. వి. అ. స్త్రీ. సన్ననినడుము గల యాఁడుది; ఆఁడుది.

**తనుభస్త్ర.** సం. వి. ఆ. స్త్రీ. దేహమునకు గొలిమి తిత్తివంటిది - నాసిక.

**తనురుహము.** సం. వి. అ. న. 1. రోమము, వెండ్రుక; 2. పక్షిఱెక్క.* విణ. (అ. ఆ. అ.) శరీరమునఁ బుట్టినది. ఇట్లే తనూరుహము.

**తనులము.** సం. విణ. (అ. ఆ. అ.) విస్తరించునది, వ్యాప్తము.

**తనుపడు.** ద్వ. అ. క్రి. (తనుపు+పడు.) చల్లపడు. "క. కనుఁగొని యించుక సేపునఁ, దనుపడు నని పలికెఁ బిదపఁ దనువడుటయును న్, బను పడియె..." భార. శాం. ౬, ఆ. ౧3౫.

**తనువు.** సం. వి. ఉ. స్త్రీ. త్వక్కు, చర్మము. ఉ, ఊ. స్త్రీ; స్. న. దేహము. విణ. (ఉ, ఉ, న్వీ. ఉ.) 1. సన్ననిది; 2. పలుచనిది; 3. చిన్నది.

**తనువొందు.** దే. అ. క్రి. (తనుపు+పొందు.) తెలివందు, తేఱు. "క. తనువొంది యొయ్యనొయ్యనఁ, గనుదమ్ములు విచ్చి చూచి..." చంద్ర. ౪, ఆ. ౯౫.

**తనూకరించు.** సం. స. క్రి. చిన్నదిగాఁ జేయు. "క. తనువుం దనూకరించుచు, హనుమంతుఁడు సురస యుందరమందుఁ బ్రవేశం, బొనరించి వెడలి వర్తిలె..." చం. రా. ౭, ఆ. ౧3.

**తనూనపము.** సం. వి. అ న.- చిక్కనవానికిఁ బుష్టి నిచ్చునది - నెయ్యి.

**తనూనపాత్తు.** సం. వి ద్. త్. పుం. - (తనూనప+అద్ = నెయ్యి త్రాగునది; తనూ+నపాత్ = తనువును నిల్పునది)—1. అగ్ని; 2. చిత్రమూలము.*

**తన్ను.** దే. స. క్రి. 1. ఈఁచు. "సీ. వీఁడెపో బండిత్రోల్వేలుపు నుంకించి పిండిగాఁ దన్నినదండి జోదు." నీలా. 3, ఆ. ౫౨. సాం. ని. మాన. 3౮; 2. గెంటు. "సీ. కర్ణడోలాహూక్తికచ్ఛాయ లెగఁబ్రాకు నురుహారరుచులఁ ద్రస్తరికిఁ దన్ను." ఆము. ౨, ఆ. ౭౫; 3. తాఁకు. "చ. మెలఁతలు మిన్ను దన్ను తెలి మేడలఁ గ్రీడలు సల్పుచుండి.." రామా. ౧, ఆ. ౧3౫; 4. ఆక్రమించు. "మ...మిన్ దన్ని వేఘునసేల్గంగుడు గాంచెఁ బాదసలిలౌఘుంబుల్ మరుత్సప్తమున్." ఆము.

౪, ఆ. ౧౦౫. వి. తాఁపు. "సీ...ఒంటితన్నునఁ గొస గుడిపి యుండిపి." దశ. ౯, ఆ. ౩.

తన్నుఁగోల. దే. వి. (తన్ను+కోల.) ఉపఘ్నము, బోటు. (శ. ర. బ్రౌ.)

తన్నుకొను. దే. అ. క్రి. 1. కాళ్లఁ గొట్టుకొను. "క... అతఁడు గూలి తన్నుకొనుచుం జచ్చెన్." భా. రా. యు. ౯౯౧; 2. గిజగిజ కొట్టుకొను; బాధపడు. "సీ. మూత్రపురీషసంప్లుతగాత్రుఁడై యుంట తన్నుఁ దా నెఱుఁగక తన్నుకొనుట." వా. రా. ౧, ఆ. ౧౧౧. స. క్రి. ఆకస్మికముగాఁ బైఁబడి కాళ్లతోఁ పట్టుకొను. "చ. ఉలుకకయుండఁ గొండవడ నొండొక కొండనఁ గోడెనాగమున్, బులుఁగులఱేఁడు దన్నుకొని పోవ నెఱుం గిటు లాడి చూపెఁ గ్రావలయు ననఁగ..." రామా. ౬, ఆ. ౨౧౯.

తన్నుబల్ల. దే. వి (తన్ను+బల్ల.) ద్వారముయొక్క అరిగాళ్ల మీఁద వేసెడుబల్ల. (శ. ర.)

తన్నుబిల్ల. దే. వి. (తన్ను+బిల్ల) బాలక్రీడా విశేషము. (దీనిరూపాంతరములు-తనుబిల్ల, తన్నుబిళ్ల.) "సీ...వెన్నెలకుప్పలు తన్నుబిల్లను..." కాశి. 3, ఆ. 33.

తన్నులాడు. దే. అ. క్రి. (తన్నులు+ఆడు.) పరస్పరము తన్నుకొను, "సీ...కోడిపుంజులఁ దన్నులాడ నిడుచు" ప్రబంధ. ౬౧౬.

తన్నువడు. ద్వ. అ. క్రి. (తన్ను+పడు.) ఆక్రమింపఁబడు; తాఁపుపడు. "గీ. తరుణి లజ్జాభరంబుచేఁ దన్నువడియు." నైష. ౭. ఆ. ౧౭౦.

తన్పు=తనుపు. 1. (తృప్తిపఱచు) "చ...భక్తి నెప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్గ నోడుదున్." భార. ఆది. ౧, ఆ. ౧౩౯; ౧, ఆ. ౯౦; 2. (రక్షించు) "సీ...ధనం బచ్ఛిదంబు ముఖ్య మైనయట్టిది తన్పు నదియ జేని..." కళా. ౬, ఆ. ౧౬౬. వి: 1. (తృప్తి) "చ విడువనికౌఁగిలింత పురి విచ్చని మచ్చిక తన్పు లేనిసంగడి..." కువల. ౫, ఆ. ౩౮; 2. (శైత్యము) "ఉ...సలిలంబు దప్పివోఁ, ద్రాగిన వారి కింపగునె తన్పును దియ్యఁదనంబు వాసనా, యోగముఁ గల్గెనేని విహగోత్తమ నిర్మల వారి పూరముల్." నైష. ౨, ఆ. ౭౧. విశే. 1. (తృప్తికరము.) "క. గ్రామగ్రామంబున నొక సామంతున కిడినచలువ చప్పరములు తన్పై మేదినిఁ గుంపటిలోఁ, దామరలుం బోలె నట్టితఱి నొప్పారెన్." అహ. ౨, ఆ. ౬౯; 2. (మనోజ్ఞము) "శా. కన్పించున్...తన్పైచక్కఁదనంబు పెక్కుబడగనై తన్వంగి సర్పాకృతిన్." మల్ల. శృం. ౫౨.

తన్మయము సం. విశే. (అ ఈ. అ.) 1. తత్స్వరూపమైనది; 2. దానిలో లయ మైనది.

తన్మాత్రము. సం వి. అ. న. శబ్దస్పర్శరూపరసగంధములలో నొకటి. విశే. (అ. ఆ. అ.) అపరిమితి గలది, అంతటిది.

తన్వి. ఉభ. దే. వి. తృప్తి. "గీ. తన్వి దీఱఁగ నింక సీతన్విఁ జూడి." విజ. ౨, ఆ. ౧౧౧. సం. వి. ఈ. స్త్రీ. 1. పలుచనిదేహము గలస్త్రీ; స్త్రీ; 2. సాలపర్ణి ❀.

తన్విసను=తనివిసను. "సీ. సంగరంబునఁ దన్విసని శాంతిఁ బొందినచిత్తంబుతో..." భార. ద్రో. ౫, ఆ. ౩౨౨.

తన్వు = తనివు (నిండు; ఒప్పైనది) "ఉ...దక్షవాటికా, ధామవిలాసదీర్ఘికలఁ దన్వుగఁ జూచిన హల్లకంబులన్." భీమ. ౫, ఆ. ౪౪.

తపత్. సం. శత్ర. 1. తపించుచున్న; 2. తపింపఁ జేయుచున్న.

తపతప. దే. వి. ఱెక్కలు మొ. కొట్టుకొనుటయందగు ననుకరణము. "గీ. కోడి తపతప ఱెక్కలు గొట్టికొనుచు." కళా. ౭, ఆ. ౨౪.

తపతి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. సూర్యపుత్త్రి.

తపనము. సం. వి. అ. పుం. 1. వేసఁగి; 2. నల్లజీడి ❀; 3. జిల్లేడు ❀; 4. నరకవిశేషము; 5. సూర్యకాంతమణి. న. 1. తాపము; 2. బాధ; 3. శృంగార చేష్టావిశేషము. విశే. (అ. ఆ. అ.) 1. కాఁచునది; 2. కాల్చునది; 3. బాధించునది; 4. ప్రకాశించునది.

తపనాత్మజుఁడు. సం. వి. అ. పుం. సూర్యపుత్త్రుఁడు- 1. యముఁడు; 2. కర్ణుఁడు; 3. సుగ్రీవుఁడు.

తపని. సం వి. ఈ. స్త్రీ. 1. గోదావరీనది; 2. తపతీనది; 3. వేఁడిమి.

తపనీయకము. సం. వి. అ. న. 1. బంగారము; 2. ఉమ్మెత్త ❀.

తపనీయము. సం.=తపనీయకము. విణ. (అ.ఆ.అ.) 1. కాచఁదగినది; 2. కాల్పఁదగినది; 3. బాధింపఁ దగినది; 4 ఆచరింపఁదగినది. (తపస్సు.)

తపనుఁడు. సం. వి. అ పుం. 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు; 3. అగ్ని; 4. అగస్త్యుఁడు.

తపము. సం. వి. అ. పుం. గ్రీష్మఋతువు. స్. న = తపస్సు.

తపశ్చరణ. సం. వి. అ. న. తపోనుష్ఠానము, తపస్సు చేయుట, "ఆ. ధరణిఁ బ్రజఁ గరంబు దయతోడ వర్ణధర్మాభిరక్షఁ జేసి యమలచరిత, నేలి రాజ్య విభవ మిది యేల యని తపశ్చరణ నునికి నీక చనియె ననఘ." భార. ఆది. 3, ఆ. ౨3.

తపశ్చరణము. సం=తపశ్చరణ.

తపశ్చర్య. సం. వి. ఆ. స్త్రీ.=తపశ్చరణ.

తపసి. వై. వి. (సం. తపస్వి.) 1. ఋషి; 2. అగిసె చెట్టు. "చ... చిగురాకుఁజేతులన్, దపసిని గౌఁగిలించె వనితా యిదె రంభ దలంప రంభ దా, నపరిమితానురాగసుమనోలసమై చిగురాకుఁజేతులన్, దపసని గౌఁగిలించు టుచితంబెకదా యన నవ్వె రంభయున్." స్వా. 3, ఆ. ౭౭. (పైరెండిటికి నుదాహరణము.); 3. వనశిగ్రువు, అడవిమునగ♆ ఆం. పదా. నానా. ౫౯.

తపసికన్నాప. ద్వ. వి. (తపిసి+కన్ను+పాప.) అత్రినేత్రజుఁడు-చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౫, ఇట్లే, తపసికన్నుంబాప. ప్రబాధ. ౧౬౨.

తపసు. సం.=తపస్సు.

తపసుఁడు. సం. వి. ఆ. పుం. చంద్రుఁడు.

తపస్య. సం.=తపశ్చర్య.

తపస్యము. సం. వి. అ. పుం-తపోనుకూలమైనది.ఫాల్గున మాసము. న. 1. తపశ్చర్య, 2. మొల్లపువ్వు.

తపస్యుఁడు. సం. వి. అ. పుం. అర్జునుఁడు.

తపస్వి. సం. వి. న్. పుం. 1. ముని; 2. నారదుఁడు; 3. ఒకజాతి కానుగు♆: 4. శిశిరఋతువు; 5 మత్స్య భేదము. విణ. (న్. నీ. న్.) 1. తపస్సుచేయు వాఁడు; 2. కనికరింపఁదగినవాఁడు, దీనుఁడు.

తపస్విని. సం. వి. ఈ. స్త్రీ. 1. తాపసురాలు; 2. దీనురాలు; 3. జటామాంసి♆. కటుకరోహిణి♆.

తపస్విపత్త్రము. సం. వి. అ. పుం. దమనము♆.

తపస్సు సం. వి. స్. న. 1. శరీరశ్రమ కలిగించు కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతము, ఉపవాసము; 2. వ్రతనియమోపాసనాదికము; 3. మనసును నింద్రియములను నేకాగ్రముగా నుంచుట; 4. వర్ణాశ్రమవిహిత మైనధర్మము; 5. తపోలోకము; 6. వేఁడిమి. పుం. 1. మాఘమాసము; 2. గ్రీష్మము; 3. శిశిరఋతువు; 4. అగ్ని.

తపారము. దే. వి. ఒకరకమగుకుళ్లాయ. "గీ. అలఁతి రుదురాకగమికుట్టులందు మెఱయ, వెలిదపారంబు మించ దువ్వలువ గప్పి .." ఆము. ౪, ఆ. ౫౪. ఆం. భా. ౨, ప్ర. ౧౫౫.

తపారు = తపారము. (శ. ర.)

తపించు. సం. అ. క్రి. 1. తాపమునొందు. "మ. అతిలోకం బగుతాల్మితోఁ దపము లిట్లారాక్షసుల్ సల్పఁగా ... ముల్లోకములున్ దపింపఁగని భాషాధీశుఁ డుద్భ్రాంతుఁడై." ఉ. రా. ౧, ఆ ౨౭౬; 2. తపస్సుచేయు. (శ. ర.); 3. ప్రకాశించు. "సీ. దహనుండు వేఁడిమిదళము చూపఁగ లేఁడు పద్మబంధుఁడు తపింపంగ వెఱచు." భా. రా. యు. ౧౫౭౯. స. క్రి. తాపమునొందించు." ఉ. అవిషవహ్నికీలలు సురావళి నంటి తపించునప్డు .."దశా. ౨, అ. ౨౦౭.

తపియించు. సం. అ. క్రి. 1. తాపమునొందు. "సీ. తపియింపఁబోయి తాఁ దపియించె శుచి..." దశా. ౪, అ. ౨౨౫. ఉ. రా. ౧, ఆ. ౨౯౪; 2. తపస్సుచేయు. (శ. ర.) స. క్రి. తాపము నొందించు. దశా. ౪, అ. ౨౨౫.

తపిష్ఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తాపము నొందించువాఁడు; 2. మిక్కిలి తపస్సు చేయువాఁడు.

తపుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

తపుస్సు. సం. వి. స్. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

తపెల. దే. వి. (క. తపలె. తపేలి, త. తవిలై.) వంటగిన్నె. "సీ. పడెడుబియ్యము వండఁ బాటైన తపెల యుంచినచిన్నియసిమిదోస్సీమ వెలయ.." హంస. ౫, ఆ. ౧౫౭.

తపేల = తపెల (వా.)

తపోధనుఁడు. సం. వి అ. పుం. ముని. విణ. (అ. ఆ. అ.) తపస్సే ధనముగాఁ గలవాఁడు.

తప్త. సం. విణ (ఋ. స్త్రీ. ఋ.) 1. తపింపఁజేయు వాఁడు; 2. ప్రకాశించువాఁడు.

తప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాల్పఁబడినది; 2. కరఁగింపఁబడినది; 3. తపింపఁజేయఁబడినది.

తప్ప. దే. వి. గింజలేనిధాన్యము. "సీ. తుచ్ఛ ధాన్యాభిధ తోఁచుఁ దాలు తఱక పొల్లకట్టు తబక పొల్లు పొల్ల. గీ. తప్ప తంకర తూరు నా..." ఆం. భా. ద్వి. ౨౩౯. విణ. బీజములేనిది. (కాయ మొ.) ఉదా. తప్పకాయ. అవ్య. ద్రు. వినార్థకము, కాక. (తప్పు ధాతువు యొక్క తుమున్నాద్యర్థకరూపము. "శా...నీవ తప్ప నికఁపరం బెఱుఁగ..." భాగ. ౮, స్కం ౯౦. జై. ౭, ఆ. ౬౮.

తప్పఁజూచు. దే. స. క్రి. (తప్పన్+చూచు.) అవాద రించు. "క. భూరిగుణు నిట్టికులని, స్తారకు దారకు నుదారధర్మప్రియని, పూర్కరణము తప్పఁజూడఁగ, సారమతీ చను నె నాఁటిసత్యము గలుగన్." భార. ఆది. ౪, ఆ. ౯౨. కు. సం. ౮, ఆ. ౬.

తప్పక. దే. అ. వ్య. (తప్పుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకరూపము) 1. చలింపక, తదేకదృష్టితో. "ఉ. చెప్పలువాల్ప కప్పుడమిఁజేనిమనోహర మూర్తి నిచ్చలుం, దప్పక చూచి చూచి..." శైవ. ౧, ఆ. ౬౫. వి. పు. ౨, ఆ. ౨౮౩; 2. విడువక. "ఉ. ఎప్పుడు భక్తభావమున నిం పలరన్ ద్విజరాజుపాదముల్, దప్పక సేవ సేయు సుకృతంబునఁ గాంచె..." ప్రభా. ౨, ఆ. ౭౩. దశా. ౧, అ. ౮౪; 3. శ్రద్ధతో. "క. తప్పక యాలింపుము నీ విప్పట్టునఁ గినుక లేక యెలమి దలిర్పన్." నీలా. ౨, ఆ. ౫౩.

తప్పకుండ. దే. అవ్య. ద్రు. (తప్పక+ఉండన్.) 1. మానక, విడువక. "గీ. ఉత్సవం బుత్సవము తప్పకుండ సురలు, వత్తు రౌత్సుక్యమున దక్షవాట మునకు." భీమ. ౩, ఆ. ౯౦; 2. సరిగా. "గీ. తప్పకుండ మీయిద్దఱ తారతమ్య, మెంతవారును దెలియంగ నెంతవారు." కాశీ. ౧, ఆ. ౧౦౪. హరి. ఉ. ౭, ఆ. ౧౧౪.

తప్పరము. దే. వి. ఒకవిధమగు కుళ్లాయి. "ద్వి. పట్టు కుప్పసమును బట్టుతప్పరము..." పండితా. మహిమ. ౨౭౯.

తప్పరించు. దే. స. క్రి. తప్పించుకొను. "ఉ... జంకు లేక యెదు రేఁగి శరీరము లంటనీక కాల్, చాఁపుచుఁ దప్పరించి పడిలంబుగ..." చెన్న. ౨, ఆ. ౨౨౪. చెన్న. ౫, ఆ. ౧౫౧.

తప్పించి=తప్ప. దే. అవ్య. (తప్పించు ధా.) వినార్థకము, కాక. "గీ. నిద్ర మేల్కాంచి...తగదు వీక్షింప నరునకుఁ దల్లి వదినె, నత్తగారిని దప్పించి యన్యవిధవ." కాశీ. ౨, ఆ. ౮౩. కాశీ. ౫, ఆ. ౨౩౩.

తప్పించు. దే. స. క్రి. (తప్పుధా.) 1. పోఁగొట్టు "క...ఈ, చోఁ ప్పవివేకులయది యిది, దప్పించుచు సద్గతియు నుదాత్తయశంబున్." భార. భీష్మ. ౧, ఆ. ౧౯౦. పాండు. ౫, ఆ. ౪౧; 2. కడపు, "గీ. రేపు చుక్కలఁ జూచుచు మాపు తిమిర, వైరిఁ జూచుచు సంధ్యవార్వంగవలయు, నట్టివేళలు తప్పించి యాచరించు, నిత్యసంధ్యా విధానముల్ నిష్ఫలములు." వి. పు ౪, ఆ. ౧౨౩; 3. విడుచు, "సీ. తండ్రికి మృతతిథిఁ దప్పించు నతఁ డెట్లు మణ్ణవతిశ్రాద్ధసరణి కోపు." రామలిం. శ. ౫౭; 4. దొరకకుండఁజేయు; దూరమొనర్చు. "క. ఇప్పింతు రాత్మవశులకుఁ, దప్పింతురు పరుల కార్చి తప్పింతురు రా, జిప్పగిది వాఁడె యని వే, చెప్పిన పెఱవారు నమ్మి చేరక యుండన్." ఆము. ౪, ఆ. ౨౨౯.

తప్పిదము. ద్వ. వి. (తప్పు+ఇతము) 1. దోషము, "ద్వి. తనయుఁడు చేసినతప్పిదమునకుఁ, గనలుచు బంధువర్గము దెసఁ జూచి." ద్వి. శ. సా. ౧, ఆ. ౪౩, పు; 2. పొరపాటు. "ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టి తతండు దోల సిగ్గేమియు లేక పాఱు నెడ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్చ్చసం, గ్రామములోనఁ దప్పిదము గల్గినయంతన యింతగర్వమే, లా..." భార. ద్రో. ౪, ఆ. ౨౮౮.

తప్పిదారి. దే. అవ్య. (తప్పి+దారి) 1. గుఱితప్పి. "చ...ఒకబాలశుకంబు రకంబుఁ జూచి వా, బలిమి నదల్చుచున్ విరులబంతి నెలంతుక దాని నేసె నుత్తలమునఁ దప్పిదారి యది తాఁకె నృపాలుని పెన్నురంబునన్." కృ. శతం. ౨, ఆ. ౩౩; 2. పొరపడి, "గీ. ఈపరమగోష్ఠ మోపుత్ర యోపురంధ్రి), తప్పిదారియుం నెఱిఁగింపఁ దగవు గాదు." పాండు ౧, ఆ. ౨౨౧. ఉ. రా. ౧, ఆ. ౧౭౪; 3. చెదరిపడి, "గీ...కడుపు విరి యంగఁ దిని పండుఁ గుడుము లెల్ల, వారికొంత

లకోఁ దప్పిదారి యున్న, వెల్లఁ దిను మని తన తేజి కిచ్చు సెలవు" శుక. ౩, ఆ. ౨౫౪; 4. తలవనితలంపుగా, దైవవశమున. "ఉ...తక్కిన యోజ లావిమలతామరసాక్షికిఁ గల్గ నేర్పునే, యక్కట తప్పిదారి యటులైనను నాహృద, యాంబుజాత మ్మాదిక్కునఁ జిక్కనే..." సా. ౨, ఆ. ౧౯. ఆము. ౨, ఆ. ౨౮.

తప్పు. దే. అ. క్రి. 1. పొరపడు, "సీ. మఱచి తప్పియు నన్యమహిమ విమర్శింపఁ జూడ వీవన్యుని సొబగు వేడ్క." కళా. ౪, ఆ. ౧౨౯. భార. కర్ణ. ౩, ఆ ౩; 2. హానిచేయు, "క. బాణాం తకుఁ డన్సూరుని, ప్రాణార్థంబులకుఁ దప్ప నని శపథం బ్బత్తీణగతి నిచ్చి పిలువఁగ, క్షోణీసురవరులఁ దగినచుట్టలఁ బనిచెన్." వి. పు. ౬, ఆ. ౩౨౩. వరాహ. ౩, ఆ. ౯౫; 3. నిరుపయోగమగు. "క. అగునది యట్టిద దైవము, దగ నిచ్చిన యవ్వరంబు దప్పునె మసకున్." భార. విరా. ౧, ఆ. ౬౩; 4. వెడు. "క...గోరంతాలస్యమ్మునఁ గొందంతప్రయోజనము దప్పు ననఁగా వినమే." కళా. ౨, ఆ. ౧౮౦, హంస. ౫, ఆ. ౮౦; 5. మరణించు. "చ...పాండురాజు దప్పినపిదపం దదాత్మజులు పెల్కుటి..." భాగ. ౩, స్కం. ౧౧. జై. ౭, ఆ. ౯౭; 6. కడచు, దాఁటు. "ఆ. తగదు మిగుల నిచటఁ దడయఁగ సంకేతి, తం బగుసమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరిగెద..." రాఘవ. ౪, ఆ. ౧౯; 7. తప్పుచేయు అపచరించు, "క. ఏమిటఁ దప్పితిమొకొ నా, స్వామికి విశ్వేశ్వరునకు..." కాశీ ౫, ఆ.౧౬౦. భార. ఉద్యో. ౩, ఆ. ౩౯౪; 8. తొలఁగు. "చ. తమతమదుష్కృతంబు సుకృతంబును నాపద యుఁ శుభంబులై, తముఁ దఱియైనఁ బొందునది దప్పునె..." నిర్వ. ౮, ఆ. ౧౫, భా. రా. యు. ౧౪౪౨; 9. చెదరు. "ఉ. చెప్పెడి దేమి బాలికలచిత్తము లంబుతరంగలోలముల్, తప్పినొ తాఁకునో కుసుమధన్వునియేటులు దైవికంబు గాన్." నై. ౨. ఆ, ౬౮. "సీ. భయ మింత లేక తప్పనిచూపుచేఁ జూచుఁ జూచి చూడనియట్టి చూడ్కిఁ జూచు." కవి. రా. ౨, ఆ. ౧౩; 10 ప్రతికూలమగు. "చ...ఎంతయు భీతిఁ బొంది శ్యామారియుం నరుండుఁ గర్ణుపడి కంత విధాతృఁడు దప్పె వానికిన్." భార. కర్ణ. ౩, ఆ. ౩౮౮. హరి. పూ. ౬, ఆ. ౧౪; 11. కల్లయగు. "వ...ఈయంగుళీయకంబు నీ కెట్టు గలిగె నున్నరూపు చెప్పుము తప్పఁ జెప్పితేని భూపాలుసన్నిధిం బెట్టి నిజంబు తెలిపి దండింపింతు" కాశీ. ౪, ఆ. ౧౦౦. కవిరా. ౩, ఆ. ౧౯౦; 12. తప్పు. "మ. బలిమిం జేకొనరాదు సామమునఁ దప్పన్..." జై. ౮, ఆ. ౬౭; స. క్రి. 1. అతిక్రమించు, దాఁటు. "సీ...ధర్మవు నుచితంబుఁ దప్పనివారల సదమలాచారుల..." భార. ఆది. ౩, ఆ. ౧౪, భార. ఉద్యో. ౩, ఆ. ౩౬౬; 2. తొలఁగించుకొను, "క. తనతప్పుఁ దప్పఁ జిత్తిని, వనితా యేత్రోవ త్రొక్కవలయుం జెపుమా." శుక. ౨, ఆ.౧౨౭; 3. విడుచు. "చ...ఏ, యెడల సపత్నితోఁ జెలిమి యించుక తప్పకు మమ్మ..." సా. ౩, ఆ. ౯౬. భార. ఉద్యో. ౩, ఆ. ౨౫౯; 4. మఱచు. "క...చేసినమేలుం, దప్పితివో..." భాగ. ౧, స్కం. ౩౫౫; 5. కోలుపోవు, (ఈయర్థమునఁ బెక్కుచోట్ల నిది కొన్ని నామవాచకములతోఁ గూడి శబ్దపల్లవ మగును. ఉదా:— మతితప్పు, పరువముతప్పు. మొ.) వి. (సం. దుష్కృ.) 1. దోషము. "గీ. భూభుజులతప్పె యది వారిఁ బొందియున్న, ధరణిసామ్రాజ్యభూతంబు తప్పుగాక." కాశీ. ౪, ఆ. ౨౦౨. భార. విరా. ౫, ఆ. ౨౮౫; 2. న్యూనత. "సీ. తలవాఁకిటను రాణి నిలిపి సమ్మతిఁ జెందెఁ దనరాయసమునకుఁ దప్పుగాదె." ఇందు. ౧, ఆ. ౪౫; 3. బొంకు. "ద్వి. తప్పాడవాడినఁ దప్పవు నాకుఁ, దప్పకవరములు దయ నిచ్చితేని..." రం. రా. అయో. ౯౨, పు.; 4. నిష్ఫలత్వము. "గీ. ఐనఁ జెలిపితి నీమనసయ్యె యింక, ధాత వ్రాసినవ్రాతకుఁ దప్పు గలదె." సా. ౨, ఆ. ౭౯. కుచేల. ౧, ఆ. ౯౪. విణ. దోషయుక్తము. "సీ. నరవర్ణములతప్పుసరణిం లుడిపి..." ఆము. ౪, ఆ. ౨౮౦. శుక. ౩, ఆ. ౧౦౯.

తప్పుకొను. దే. అ. క్రి. (తప్పు+కొను. స్వార్థమున) తొలఁగు. "చ. అదె యిదె యంచుఁ దప్పుకొను మంచుఁ దగున్ బళి యంచు..." కళా. ౭, ఆ. ౧౦౦.

తప్పుకోలు. దే. వి. (తప్పుకొను ధా.) తప్పుచేయుట. "సీ. చేయప్పు లడిగి తెచ్చెదనంచుఁ జని కాంచు

గోడెమిండని తప్పుకోలుమ్రొక్కు." శుక. ౨, ఆ. ౩౬౯.

తప్పుచేయు. ద్వ. స. క్రి. (తప్పు+చేయు) తప్పుగాఁ దలఁచు. "చ... నేను గొనితెచ్చినమాత్రన తప్పు చేసి యయ్యయ్యనిమిషభర్త మిమ్ము నిట కంపె నటే..." వి. పు. ౬. ఆ. ౪౦.

తప్పుడు. వై. వి. (తప్పు. ధా.) 1. తప్పుట. (శ. ర.); 2. సరితప్పు. (శ. ర.)

తప్పుతెరువు. దే. వి. (తప్పు+తెరువు) అకమార్గము, పెడత్రోవ. "వ... చెంచువంచనాపరుండై, బొక్కసం బెత్తుకొని తప్పుతెరువునుం గాఁ దన పల్లెకుం బోయి..." కాశీ. ౫, ఆ. ౬౪. ఇట్లే తప్పుత్రోవ. ఆం. భా. తృ. ౩౩.

తప్పుదల. దే. వి. (తప్పు ధా.) తప్పుట. (శ. ర.)

తప్పుదారి. దే. వి. (తప్పు+దారి.) తప్పుత్రోవ, అపథము. (శ. ర.)

తప్పునీళ్లు దే. వి. బ. (తప్పు+నీళ్లు) కల్లు, మద్యము. "సీ. లంకఁ గాల్చినవానివింక మొంతు రదేమొ హెచ్చుమంటలకొండఁ దెచ్చుటరుదా. గీ. యనుచు మది తప్పఁ దప్పునీళ్లాని...పట్టి పగ్గెలు ప్రేలునవ్వారజరత." శుక. ౩, ఆ. ౨౩.

తప్పులువట్టు. దే. స. క్రి. (తప్పులు+పట్టు.) 1. న్యూనపఱచు. "వ...మమత నెదిగి పొదువుజల మాలికాకృతిం బ్రకృతియై యొప్పి విప్పునీలంపు లప్పల చెప్పి తప్పులువట్టు నెఱికప్పుఁగొప్పు..." చంద్రా. ౪, ఆ. ౧౯౯.

తప్పువట్టు = తప్పులువట్టు. "గీ. తననడలు నెమ్మి కొమ్మలఁ దప్పువట్టు." ఉ. రా. ౧, ఆ. ౧౭౮.

తప్పువడు. ద్వ. అ. క్రి. (తప్పు+పడు) తప్పుచేయు. "ఆ. మామ కేల చెప్ప మాను సరోజాక్షి, దనుజతనయఁ బొంది తప్పువడితిఁగామి నయిన నన్నుఁ గరుణింపు.." భాగ. ౯, స్క. ౧౫౪౩.

తప్పునేయు = తప్పుచేయు. స్వా. ౨, ఆ. ౭౩.

తప్పెట. యు. దే. వి. అడవియుఁలవఁపనసపత్త్రము. "గీ:..తప్పెట కారుకొల్లి, మాడి యనఁగ వనజ పత్త్ర మగు మహేశ." ఆం. భా. ద్వి. ౫౭. వై. వి. (సం. తమ్మటః) చర్మవాద్యవిశేషము. "గీ. కవడె యన నురుమ యనఁగఁ గరిడి యనఁగఁ దప్పెట యనంగ వాద్యభేదములు చెలఁగు." ఆం. భా. ప్ర. ౧౨౭. యు. ౪, ఆ. ౧౫౭.

తప్పెల = తపెల (క. తప్పలె-పాదుకలలో దీర్ఘాంత ముగా నున్నది.)

తబక. దే. వి. తప్ప, గింజలేనికాయ. "సీ. తుచ్ఛ ధాన్యాభిధ తోఁచుఁ దాలు తఱక పొల్లకట్టు తబక పొల్లు పొల్ల..." ఆం. భా. ద్వి. ౨౩౭.

తఫావతు. హిం. వి. 1. భేదము; 2. లోపము.

తబము. వై. వి. (సం. తపస్. ప్రా. తబ. తవ. త. తపస్, తవమ్.) తపస్సు. "సీ. గాలి యోగిరము గాఁగను సీటిలోనఁ దబము లొనర్చెడునిరాబారిగ ములు." యు. ౨, ఆ. ౪౩.

తబిసి. వై. వి. (సం. తపస్వీ.) 1 ముని. "చ. తబిసివి గానఁ జావునను దప్పితి నీ కిది వేఁటపంతమా, యబలుఁడవు..." హర. ౭, ఆ. ౫౫. తపతీ. ౪, ఆ. ౪౪; 2. సన్న్యాసి. "సీ...కనుపట్టు సన్న్యాసి కావిగోఁచి. గీ. దారి బోడ తబిసి నాఁగ..." ఆం. భా. ద్వి. ౧౭౬.

తబిసితనము. వై. వి. (తబిసి+తనము.) ఋషిత్వము. "ఆ. గర్వరేఖ మిగులఁ గానంగనయ్యెడు, దాంభికంబు నీదుతబిసితనము." హర. ౭, ఆ. ౬౨.

తబిసీలు. ఉ. వి. (ఉర్దూ. తఫ్సీలు.) వివరము.

తబుకు. దే. వి. తమలపాకులపళ్లెము; పళ్లెము. "సీ... పరఁగుచుండుఁ, దాంబూలపాత్రంబు తబుకం బనంగను గంపె యం చనఁగను..." ఆం. భా. ద్వి. ౧౬౬. "ద్వి. తలఁబ్రాలు బంగరు తబుకుల నునిచి..." రం. రా. బాల. ౭౬. పు. ద్వి. శ. సా. ౨౪, పు.

తబేలా. హిం. వి. గుఱ్ఱపుశాల. (శ. ర.)

తబ్బిబ్బు. దే. వి. (క. తబ్బిబ్బు.) 1. తడఁబాటు. "వ...మంతనంపువేళల మాటలతబ్బిబ్బునం బుట్టు పొలయలుకలం దలలు వంచి..." స్వా. ౩, ఆ. ౨౦. దశా. ౧, ఆ. ౩౩; 2. వంచన, మాయ. "క. అబ్బెబ్బలి గన వచ్చెం, దబ్బిబ్బు లిఁకేమి సేయుదాన ననుచు నబ్బిబ్బోకవతి మనంబున, నబ్బురమును భయముఁ ద్రొక్కులాడఁగ నుండెన్." శుక. ౨, ఆ. ౨౫౩; 3. వ్యత్యస్తవచనము. "గీ. విటునితబ్బిబ్బులకుఁ గేరు వెలమిటారిఁనగవు నేలినడాలు...కలిగి చూడంటి పొడమె నాజలధియందు." దశా. ౨, అ. ౨౨౪. విణ. 1. తడఁబాటు గలది. "సీ. ఒకక్రొంచ మును గొట్టి యుబ్బి తబ్బిబ్బైనపక్షిఘాతకుని

పారుషంబు ఘనమె." రంగా. ౧, ఆ. ౧౦౧; 2. అసత్యము. "వ..అవ్వో యవ్వ కడుపు కూటికి దబ్బరాడితి నని తలంచి యుండావే అది కల్ల గాదు కైలాట గాదు తరకటబరకట గాదు తబ్బిబ్బు గాదు..." వేం. మా. ౫, ఆ. ౩౮; 3. వ్యత్యస్తము. "సీ. చనఁ డెత్తులిడక మజ్జన ముఖ్యవిధులకుఁ జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు" ప్రభా. ౨, ఆ. ౧౦౮. కళా. ౮, ఆ. ౪౦; 4. కలఁతనొందినది. "క. గబ్బున నెదిరించిన నొక్కదెబ్బ గొనుచు .....నెదురఁ ద్రిజగముల నొరుల్, తబ్బిబ్బుగ జంగములకుఁ, బబ్బంబులువెట్టు ముష్టిపరిఘుట్టనలన్." శివరా. ౪, ఆ. ౮౧.

తమంగము. సం. వి. అ. పుం. తమగము,మంచె. (శ.ర.)

తమకపడు. ద్వ. అ. క్రి. (తమకము+పడు.) 1. త్వరపడు. "గీ. వారయాత్రికవిటులకుఁ గౌరవేంద్రు, సూడిగపుఁగొమ్మలకుఁ బొందు లోకటఁ జేయఁ, దమకపడుకంతునకు..." సాంబో. ౫, ఆ. ౨౯౨. భా. రా. యు. ౧౬౮౪; 2. తహతహపడు. "సీ. పొడవైనతెలిమేని పూఁతదావులఁ దావు దరలి ఘాలాక్షంబు దమకపడఁగ." ఉద్భ. ౩, ఆ. ౭౫. సైన్య. ౬, ఆ. ౮౪.

తమకము. ఉభ. దే. వి. 1. తొందర, త్వర. "క... పురుషసింహుఁడు మదం,బెక్క యుధిష్ఠిరుఁ బొదివెదు, నెక్కుడుతమకమునఁ గదిసె నేడ్తెర మెఱయన్."భార. ద్రో. ౧, ఆ. ౨౦౯. ఉ. హరి. ౪, ఆ. ౨౫౩; 2. మోహము. "గీ...వేడ్కసేయుఁదురయ్య వివేక లెవ్వి,ధమున నాబుద్ధి విన వయ్య తమక ముడిగి." భార. విరా. ౨, ఆ. ౭౩; 3. తహతహ,వేడుక. "క. తొలుప్రాయపుమగకొదమల, తలఁపులఁ దమకములు మిగులఁ దను నెదురుకొనన్." కళా. ౧, ఆ. ౨౮. పారి. ౩, ఆ. ౧౪; 4. బాళి, కోరిక. "గీ. బాళియును గోట వెలిమంటపంబుఁ దోఁచుఁ, దమక మనఁ గను." ఆం. భా. తృ. ౫౫; 5. కోటవెలిమంటపము. ఆం. భా. తృ. ౫౫. సం. వి. అ. పుం. శ్వాసరోగభేదము.

తమకి. దే. విశే. (తమకము+ఇ.) తమకము గలవాఁడు, తమకము గలది.) "క. విను గర్భిణి ప్రజబ్రతుకున, కనురూపము లైనయట్టియాహారంబుల్, గొనుగతిఁ బతి ధరణీప్రజమనికికిఁ దగనడచునది తమకిగా కెపుడున్." భార. శాం. ౨, ఆ. ౧౭౯.

తమకించు. దే. అ. క్రి. 1. యత్నించు. "ఉ... ఉక్కేలయి యిట్లు సృష్టిపనికిం దమకింపఁగఁ జన్నె..." హరి. పూ. ౧, ఆ. ౭౨. భార. భీష్మ. ౧, ఆ. ౨౬౭; త్వరపడు. "సీ...తమకస్మదీయప్రాణసంరక్షయందుఁ దగిన. గీ. త్రోవ మాభాగ్యవశమునఁ దోఁచుఁ దాక,నోర్చుటయ కాక తమకింప యుక్త మగునె." ప్రభా. ౪, ఆ. ౩౬. భార. శాం. ౨, ఆ. ౧౩౮; 3. జొంకు. "చ. వలఁ బడి చిక్కు టొండె వల ద్రచ్చుక పోవుట యొండెఁ గాక పక్షులు వలఁ గొంచు భారమునకుం దమకింపక యంబరంబునన్, వల గొని పాఱు టెట్లు..." నా. పంచ. ౨, ఆ. ౧౧; 4. మోహించు. "సీ...పణఁతి విశ్వాచి నా నమరకామిని దివి నరుగఁ జూచి, తమకించి." వాసిష్ఠ. ౩, ఆ. ౨౦. స. క్రి. భయపెట్టు. "సీ. హరునైన దంభోళిధరునైనఁ దమకించు రాజద్ద్యుమణులైన రాజమణులు." కృ. శతం.౧, ఆ. ౫.

తమకు. దే. అ. క్రి. 1. చలించు, కదలు. "సీ తమ కన్నులకు వీఁగి తమకుచందంబునఁ బెల్లుగాఁ గల్వలు తల్లడిల్ల" య. ౩, ఆ ౬౩. (శ. ర. పా.); 2. భయపడు. "క. చెట్ట దను మోపవచ్చిన, పట్టున ధైర్యంబు వదలి పలుమఱు మిగులన్, రట్టుపడి తమకి మదిలో, నట్టిట్టని రేని నవ్వరా సరివారల్." హరిశ్చ. ౪, ఆ. ౧౧౪; 3. దాఁగు. "సీ...తమకన్న మునుమున్న తమకు వారల ముంచి దుముకువారు." చంద్రా. ౬, ఆ. ౯౪. వి. విధము. "వ...వలరాజునెత్తపలకతమ్మకునం గను పట్టువీఁపున..." పాండు. ౩, ఆ. ౧౭౮. (శ. ర. పా. 'తళుకునన్.' ముద్రి.)

తమగమ్ము. వై. వి. (సం. తమంగః. ప్రా. తమగ.) 1. మంచె, "శా...హరి కంసప్రాణహింసార్థియై, లంఘించెం దమగంబు మీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్." భాగ. ౧౦. స్కం. పూ. ౨౩౭౨; హరి. పూ. ౯, ఆ. ౫౯; 2. మండపము; కోట వెలిమండపము. "సీ. నలువంక శోభనంబులతోడ మిన్నంది కొమరారునీలంపుతమగ మైన." రామా. ౬, ఆ. ౧౨౮. "గీ. నడచి తమ్మగపుఁ బైట సన్నాహమెల్ల,నమరఁ బొఁజులుదీర్చి..." కువల.౨,ఆ.౫౧.

తమట. దే. వి. అగ్నిజ్వాల, శేల. "సీ. తమ టనఁ గీల పదం బగు..." అం. శే. ౭౦.

తమటము. దే. వి. చర్మవాద్యవిశేషము, తప్పెట. "సీ. తమ్మటం బనఁగను దమటం బనంగను దమటాభిధానంబు దనరుచుండు." ఆం. భా. ప్ర. ౧౨౭.

తమతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తృష్ణాపరుఁడు.

తమము. సం. వి. అ. న. 1. అంధకారము; 2. పాదము యొక్క అగ్రము; 3. తమోగుణము. పుం. 1. రాహుగ్రహము; 2. చీకటిచెట్టు; స్. న=తమస్సు

తమరము. సం. వి. అ. న. 1. తగరము; 2. సీసము.

తమస. సం. వి. ఆ. స్త్రీ. ఒకనది.

తమసము. సం. వి. అ. పుం. 1. అంధకారము; 2. కూపము. న. 1. చీకటి; 2. నగరము; విణ. (అ. ఆ. అ.) నల్లనిరంగు గలది.

తమస్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు ❦.

తమస్విని. సం.=తమస్వతి.

తమసు. సం. వి. స్. న. 1. సత్త్వరజస్తమోగుణములలో నొకటి; 2. చీకటి; 3. అజ్ఞానము; 4. శోకము; 5. పాపము; 6. బలము; 7. రాత్రి. పుం. న. రాహుగ్రహము.

తమస్సు. సం.=తమసు.

తమాయించు. దే. అ. క్రి. స్తిమితమగు, శమించు. (శ. ర. వా.)

తమాలకము. సం. వి. అ. పుం. 1. చీకటిచెట్టు; 2. వెదురుపైతోలు.

తమాలపత్త్రము. సం. వి. అ. న. 1. తిలకము; 2. చెట్టు; 3. ఆకుపత్రి. ❦

తమాలము. సం. వి. అ. పుం. 1. ఉలిమిరి❦; 2. చీకటిచెట్టు; 3. వెదురుపైతోలు; 4. కత్తి; 5. ఆకుపత్రి ❦; 6. నల్లచంద్ర❦; 7. బొట్టు, తిలకము.

తమాలిక. సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక ❦.

తమాలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. నేలయుసిరిక ❦; 2. తమాలవృక్షములు దట్టముగాఁ బెరిగిన నేల.

తమాసా. ఉ. వి. (ఉర్దు. తమాషా) చమత్కారము. "సీ. నిబ్బరంబుగఁ జూడు నేఁ డిదె నాతమాసా యని చెలరేఁగి చాల నలసి." బళిరకతివేల్పు శతకము. ౭౦.

తమాసు = తమాసా. "సీ. పులితోలు సరిగెపూవుల హెచ్చు కిముఖాబు గొప్ప తమాసుగా నొప్పఁ జేసి." పార్వ. ౫, ఆ. ౧౪౯.

తమి. ఉభ. దే. వి. 1. త్వర. "సీ. పొంగారు మైఁ దోఁచుశృంగారచేష్టలతమిఁ జెచ్చెరఁ గోటమూర్ఖ్యమున డాచి." స్వా. 3, ఆ. ౯౭. కళా. ౫, ఆ. ౮౮; 2. అపేక్ష; కుతూహలము. "క. రం గగు తొడవులఁ బూఁకలు, నంగుగఁ గైసేసి యందు నాడెడు తమిచేఁ, బొంగారెడు వేడుకతో, సింగారపుఁబోఁట కరిగెఁ జెలువలుఁ దానున్." య. 3, ఆ. ౫౨, నీలా. ౧, ఆ. ౧౯; 3. వలపు మోహము; "క. మేను గరుపాఱఁ దమి నృప్మాని జపముఁ దపముఁ దన్న మఱచి యనంగగ్లానిఁ బడి..." స్వా. ౬, ఆ. 3౪. శుక. ౨, ఆ. ౧౦౬; 4. నైపుణ్యము, పారవశ్యము; "గీ. నిదురతమి నైనఁ బడికంపు చదురు లిట్లు, వాసనాబలమునఁ బూసువవజము ఖుల." వసు. ౪, ఆ. ౭౫. సం. వి. ఇ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు. ❦

తమిఁద. దే. వి. చోడిపైరు❦. బ. చోళ్లు. (వృత్తియందు వికల్పముగా బహువచనలోపము.) "గీ. ఆమరికలఁ గల్గి సంకటితమిఁద రొట్టె,వేఁట పొట్ట జెన మినుపపిండి.." ప్రబంధ. ౧౩౨. చెన్న. ౨, ఆ. ౪౭.

తమికొను. దే. అ. క్రి. (తమి+కొను.) 1. త్వరపడు; 2. అపేక్షపడు; 3. కుతూహలపడు; 4. మోహపడు. (శ. ర.)

తమికొల్పు. దే. స. క్రి. (తమికొను ధా. ప్రే.) (మోహపఱచు.) "సీ. వేల్పురాయని ప్రోల వెలయునాడెపుటచ్చరల నెల్లఁ దమికొల్పి కలసినాఁడ." ఆచ్చ. అర. ౫౯.

తమిరె. దే. వి. కాఁడినడిమిచీల,శమ్య. (శ. ర.)

తమిస్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. చీకటిరేయి; 2. రేయి; 3. చిమ్మచీకటి; 4. పసుపు❦. [3. పసుపు❦.

తమిస్రము. సం. వి. అ. న. 1. చీకటి; 2. కోపము;

తముకు. దే. వి. (త. తముక్కు.) చర్మవాద్యవిశేషము. "సీ. బరువులెత్తినయెద్దుపై నొంటితముకురావములును వేణునాదములు పొసఁగ." శుక. ౨, ఆ. ౫౪౯. ఆం. భా. ప్ర. ౧౨౭.

తముకువేయు. దే. స. క్రి. (తముకు+వేయు). తముకు వాయించుచు అధికారుల ఆజ్ఞను ప్రకటించు; ప్రకటించు. "సీ. తముకు వేసినవెన్కఁ దాఁ జరించినఁ బట్టి యుంసుపకుంటఁ దఱార్ల కొసఁగి యొసఁగి." శుక. ౪, ఆ. ౧౧౧.

తములపాకు. ద్వ. వి. (తములము+ఆకు.) నాగవల్లీ దళము. "గీ...ఉత్తరించు, తములపాకునిక్కడు క్రియ దాఁటె నిజ్జీ." ఉ. హం. ౪, ఆ. ౨౮. ప్రభా. ౨, ఆ. ౧౫.

తములపుటాకు = తములపాకు. "చ...లేఁత విడిగాఁ దగుఁ గేదఁగి జేకుటందపుం,దములపుటాకుముద్దు లును..." శశాం. 3, ఆ. ౧౦౫. రాధికా. ౧, ఆ. ౭౯.

తములము. వై. వి. (సం. తాంబూలమ్. ప్రా. తంబోలమ్. త. తంబళమ్. క. దంబుల.) 1. నాగవల్లి, తములపుఁదీఁగ. ('తాంబూలాఖ్యలత' మొదలగు పదములఁబట్టి యీయర్థము గృహీతము.); 2. వీటిక, పోఁకచెక్కలు మున్నగువానితోఁ గూడిన నాగవల్లీదళము. "మ...తములమును బుప్పంబులున్ లోనుగా, లలితద్రవ్యము లెల్ల నా కొసఁగె మేలంబాడుచుం బ్రీతితోన్." దశ. 3, ఆ. ౮౦; 3. తమ్మ,నమలిన నాగవల్లీదళాదికము. "గీ. మృగమదముమించుతములంపుటెరుల మోవి." ఆము. ౪, ఆ. ౧3౫.

తములముసేయు. ద్వ. అ. క్రి. (తములము+చేయు.) తాంబూలమువేయు. "క. తములము సేయని నోరును...హిమధాముఁడు లేనిరాత్రి హీనము సుమతీ" సు. శ. ౫3.

తమోమణి. సం. వి. ఇ. పుం—చీకటిలో మణివోలె ప్రకాశించునది—1. మిడుఁగుఱుఁబురుగు; 2. గోమేదకమణి.

తమోరి. సం. వి. ఇ. పుం.-తమస్సునకు శత్రువు- 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు. 3. అగ్ని.

తమ్మ. దే. వి. 1. చర్వితతాంబూలము, నమలిన తాంబూలము. "సీ. ఎదిరి వీనికి నిర్వహింపనికాళాంజులోరులతమ్మలకు నో రొగ్గకున్నె." కవిక. ౬, ఆ. ౧౯౪. ప్రబోధ. 3, ఆ. ౫౧; 2. తంబ,చమ్మ, "ఆ. చిల్ల చింత మొగలి చీకిరే నూఁదుగు, నిమ్మ తమ్మ తుమికి నెమ్మి జమ్మి,వేగి వేము మొదలుగాఁ గల మ్రాఁకుల..." వేం. పంచ. ౪, ఆ. ౫౨౨.

తమ్మంటులు. దే. వి. బ. (తమ్మె+అంటులు) కుండలములు, "సీ. పునుకతమ్మంటులఁ బోలుచు వీనుల వారు నొసల మిక్కిలిచూపు లెసఁగువారు." పాండు. ౧, ఆ. ౧౬౫.

తమ్మంట్లు = తమ్మంటులు. "సీ. ధాతు మించినమంచి తమ్మంట్లరాగంబు శ్రవణభాగంబుల సందడింప." వరాహ. ౧౧, ఆ. ౮.

తమ్మటము. దే. వి. (త. తంబట్టమ్. క. తమటే, తప్పటే) చర్మవాద్యవిశేషము. ఆం. భా. ప్ర. ౧౩౭. (ఇది సంస్కృత సమాసమధ్యమునను గానఁబడుచున్నది.) "వ. శంఖకాహళభేరీ పటహఝల్లరీ పణవమర్దళ తమ్మటప్రముఖ నిఖిలవాద్యనిర్ఘోషంబులును." కళా. ౬, ఆ. ౬౯, రుక్మా. ౪, ఆ. 3.

తమ్మదసుకు. దే. వి. తమ్మపడిగ. (శ. ర. బ్రౌ.)

తమ్మతొట్టి. దే. వి. తమ్మపడిగ. (బ్రౌ.)

తమ్మపడిగ. దే. వి. తమ్ములము ఉమియుపాత్రము. "సీ. జాళువాచందువ జ్వాలవల్లిక తమ్మపడిగము నైత్తంపుఁబలక..." రసిక. ౪, ఆ. ౪, అచ్చ. సు. 3౫.

తమ్మళి. దే. వి. శివార్చన చేసి బ్రతికెడు నొకజాతి. ఉదా:—తమ్మళివాఁడు, తమ్మళిది. (ఇది ప్రాచీన శాసనము లోఁ గానవచ్చినపదము).

తమ్మళి. దే. వి. తమ్మళిజాతివాఁడు. "సీ. పిల్లలు పోరాడె జల్లి యూరక త్రుళ్లెఁ దమ్మళి పొడసూపెఁ దుమ్మె నెమర." ద్వా. ౧, ఆ. ౨౧3. ఆం. భా. ద్వి. ౨౮౪.

తమ్మి. దే. వి. 1. పద్మము, తామరపువ్వు; "సీ. నలువ నెమ్మోముఁదమ్ములు కేళిగృహములు తళుకుటద్దంబు సత్కవులమనసు." నైష. ౧, ఆ. ౫, ఆం. భా. ప్ర. ౧౬౪; 2. పద్మమువలె నుండునది. పద్మవ్యూహము. "సీ. తమ్మిఁ దాల్చినవానిఁ దమ్మిఁ దొల్చినవానిఁ దమ్మి మొల్చినవానిఁ దారసించు." నరస. ౧, ప్ర. ౬౪; 3. వృక్షవిశేషము. (శ. ర.)

తమ్మికంటి. దే. వి. (తమ్మి+కన్ను+ఇ)-కమలము వంటి కన్నులు గలవాఁడు;కమలమువంటి కన్నులు కలది; 1. అందమైనకన్నులు గలది; స్త్రీ. "సీ. కాఁబోలు నీతమ్మికంటిచిరద్యుతుల్ మించఁ బొల్చినతళ్కు మించుఁదీవ." చంద్రి. 3, ఆ. ౫3; 2. విష్ణువు, కమలాక్షుఁడు. "ఆ...చెదుగురే, ద్రిమ్మరుల నడంచి తమ్మికంటి." నీలా. ౧, ఆ. ౮౦.

తమ్మికెంపు. ద్వే. వి. (తమ్మి+కెంపు) పద్మరాగమణి. "సీ. మగమానికముల క్రొన్నిగనిగల్ దులకింప బలుతమ్మికెంపు మేల్ పసలు నింప." నీలా. ౨, ఆ. ౪౮.

తమ్మిగద్దియ. దే. వి. (తమ్మి+గద్దియ) పద్మాసనము. వేంక. దేవ. ౬.

తమ్మిగద్దియబోటి. ద్వ. వి. లక్ష్మి. సాం. ని. దేవ. ౬.

తమ్మిచక్కిలిగింత. దే. వి. సూర్యుఁడు. "సీ. జెల జోడు తమ్మిచక్కిలిగింత వేవెల్గు కలువలసూడు చీకటులగొంగ. గీ... నాఁ జెల్లె దనరు లోక బాంధవునకు..." సాం. ని. దేవ. ౯.

తమ్మిచుట్టము. దే. వి. (తమ్మి+చుట్టము) సూర్యుఁడు. "గీ. తమ్మిచుట్టము మిహిరతనమ్ము సూర్యుఁ డా..." ఆం. భా. ప్ర. ౯౧, వేంక. దేవ. ౧౨.

తమ్మిచూలి. దే. వి. (తమ్మి+చూలి) బ్రహ్మ. "ఆ. భాగ వతము తెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన." భాగ. ౧, స్కం. ౧౯. చంద్రి. ౨, ఆ. ౪౬.

తమ్మిదాయ. ద్వ. వి. (తమ్మి+దాయ) - కమలవిరోధి- చంద్రుఁడు. "సీ. చిమ్మిన నక్కల ఝుమ్మనఁ జసి వెను అొమ్ము గానటయు రాతమ్మిదాయ." అచ్చ. యు. ౨౬౪. (రాతమ్మిదాయ = రాజ చంద్రుఁడు).

తమ్మిదీవి. ద్వ. వి. (తమ్మి+దీవి; పుష్కరద్వీపము (శ.ర.)

తమ్మిదొర. దే. వి. (తమ్మి+దొర) సూర్యుఁడు. "గీ. అట్లు తా కని మునివేష మధిగమించి, పంపకడఁ దమ్మిదొరచూలి పంప వచ్చి, గాడ్పుకొమరుండు రామలక్ష్మణులఁ గాంచి, పలికె భయభక్తియుక్త తేర్పడఁగ నిట్లు." రామా. ౫, ఆ. ౨౫౯. (తమ్మి దొరచూలి = సూర్యసుతుఁడైన సుగ్రీవుఁడు.)

తమ్మినూలు. దే. వి. (తమ్మి+నూలు) బిసతంతువు, తామరకాఁడతంతువు. "సీ. హాసతమ్మినూల్వంటి యసదులేఁగౌనుపై నొర గాఁగఁ బరుండి యొరగఁ గొంకి." ప్రబంధ. ౭౫౦.

తమ్మిపగతుఁడు=తమ్మిదాయ. (శ. ర.)

తమ్మిపుట్టు=తమ్మిచూలి. భాను. ౧, ఆ. ౩.

తమ్మిమొలక = తమ్మిచూలి. చెన్న. ౧, ఆ. ౮౧౭.

తమ్మియనుఁగు = తమ్మిచుట్టము. అచ్చ. యు. ౪౦౩.

తమ్మియింటిగరిత. దే. వి. పద్మాలయ; లక్ష్మి. ఆం. శం. దేవ. ౧౦.

తమ్మివిందు = తమ్మిచుట్టము. "గీ. సవిధకీర్ణ పరాగాగ్ని సాక్షి గాఁగఁ, దమ్మివిందుకరగ్రహణ మ్మొనర్పఁ, బొలుచుపద్మినికిని నల్లపూసదండ, గట్టినాఁ డన నెలదేఁటిగములు పొదలె." రాజ. చ. ౨, ఆ. ౬౯.

తమ్మిసూఁడు = తమ్మిదాయ. "ఉ... ఈసురుమహో త్తమని నెవ్వడినైనఁ దమ్మిసూఁడల్లునిబారిఁ, ద్రోచి హృదయంబు గలంగ నొసర్చి రేపె నీ, యల్లునిఁ జేసి తెచ్చెద రయంబున నేఁ గనుఁగొంటి పిటికిన్." చెన్న. ౨, ఆ. ౨౩౧.

తమ్ముఁడు. దే. వి. (త. తంబి క. తమ్మ.) 1. దీనికే వృత్తియందు 'డుఙ్' లోపము. భార. ద్రో. ౪, ఆ. ౨౧౯. వెనుకఁ బుట్టినవాఁడు, అనుజుఁడు. "క. అమ్మౌనిఁ జూచి యన్నయుఁ, దమ్ముఁడు నొక్కటి మనోజతాడితులై .." భార. ఆది. ౮. ఆ. ౧౦౬, ఆం. భా. ద్వి. ౧౦౩; 2. వాత్సల్యార్థమునిచ్చును. భా. రా. అయో. ౭౩; 3. తోఁబుట్టు. "గీ. తమ్ములా కొమ్మనెమ్మోముతమ్మి లనఁగ." విక్ర. ౪, ఆ. ౧౮.

తమ్ముఁగుఱ్ఱ. దే. వి. (తమ్ముఁడు+కుఱ్ఱ) తమ్ముఁడు. "క. సితమ్ముఁగుఱ్ఱ రూపస్సీలివిదుఁడు..." భార. ద్రో. ౪, ఆ. ౧౩౬. పాండు. ౩, ఆ. ౩౮.

తమ్ముదోయి. ద్వ. వి. (తమ్ముఁడు+దోయి) తమ్ముల జత; కవలుగాఁ బుట్టినతమ్ములు. "సీ... భీమునిఁ బిల్చి మనుజపతుల, కెల్లను వే పూజ లిమ్మన్న నమ్మ రుత్తనయుండు దగఁ దనతమ్ముదోయి, నెలమిఁ గూర్చుకొని..." భార. ఆశ్వ. ౪, ఆ. ౧౪౩.

తమ్ములపగవాఁడు. దే. వి. పద్మవిరోధి, చంద్రుఁడు. ఆం. సం. దేవ. ౧౫.

తమ్ములము. వై. వి. (సం. తాంబూలమ్. ప్రా. తంబోలమ్. త. తంబళమ్. క. తంబుల.) 1. నాగవల్లి, తములపుతీఁగ, (తాంబూలదళము, తాంబూలాఖ్యలత మొదగుపదములను బట్టి యీయర్థము గృహీతము); 2. పోఁకచెక్కలు మొదలగునవి గలనాగవల్లీదళములు, వీటిక. "గీ. నీవు మున్నేఁగు మని యతనికి విభూష, ణాంబరంబులతోఁ దమ్ములంబుఁ బెట్టి, వీడుకోలిచ్చి పుచ్చిన..." భార. ఉద్యో. ౧, ఆ. ౨౫౭. ఆం. భా. ద్వి. ౧౬౭; 3. చర్వితతాంబూలము, తమ్మ. "గీ. అమ్మెఱుఁగుఁబోఁడి పుక్కిటితమ్ములమున, బుగులుకొనువాసనయుఁ..." ఉ. రా. ౪, ఆ. ౧౮౪.

తమ్ములముసేయు. ద్వ. అ. క్రి. (తమ్ములము+చేయు) తాంబూలము వేయు. "గీ. తమ్ములముసేయుచో నొక్కతలిరుఁబోణి, రాకుమారునిఁ జూచుపరాకు కతన, మఱచి తాంబూలపత్త్రంబు మాఱు

గాఁగఁ, గఱచెఁ గెంగేలినడికేలి కమలదళము." సైష. ౬, ఆ. ౬౩.

తమ్ములయిల్లు. దే. వి. బొ. (తమ్ములు+ఇల్లు) కమలాకరము, సరస్సు. "వ. కని తమ్మికంటి తమ్ములయింటి పొలుపునకు మెచ్చుచు..." భాగ. ౧౦, స్కం. పూ. ౪౯౭.

తమ్మువాఁడు. దే. వి. (తమ్ముఁడు+వాఁడు) తమ్ముఁడు. (శ. ర.)

తమ్మె. దే. వి. (క. తమ్మె.) 1. చెవి అడుగుభాగము. "ద్వి. అని యప్డు కరముల నద్దైత్యుచెవులు, బెనఁచి తమ్మెలతోడఁ బెఱికి రాఁ దిగిచి." రం. రా. యు. ౪౧౭. పు.; 2. పశువుల మెడను తగిలించెడు పలుపు ముందుభాగము.

తమ్మెట. దే. వి. చర్మవాద్యవిశేషము. "వ... భేరులును డోలు గౌరు గుమ్మెట తమ్మెట." హంస. ౩, ఆ. ౨౯.

తయారు. హిం. విశే. సిద్ధమైనది; సంసిద్ధుఁడు. (శ.ర.)

తయిసాతి. హిం. వి. కనిపెట్టుకొనియుండుట. (శ.ర.)

తరంగము. 1. సం. వి. అ. పుం. అల, ఊర్మి; 2. గుఱ్ఱము మొదలగువానిదాఁటు.

తరంగి. సం. విశే. (న్. నీ. న్.) అలలు కలది.

తరంగిణి. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

తరంగితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తరంగములు కలది; 2. చంచలము; 3. పొంగి పొరలునది.

తరండము. సం. వి. అ. పుం. 1. గాలపుదారమునకు గట్టిన కఱ్ఱముక్క లోనగునది; 2. ఓడనడపు త్రెడ్డు; 3. ప్లవము, తెప్ప.

తరంత్రము. సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. జడివాన, ఆసారము; 3. కప్ప; 4. తెప్ప.

తరంతి. సం. వి. ఈ. స్త్రీ. నౌక.

తరంతుఁడు. సం. వి. అ. పుం 1. భక్తుఁడు; 2. రాక్షసుఁడు.

తరంబుజము. సం. వి. అ. న. కరబూజాపండు.

తరఁగ. వై. వి. (సం. తరంగః) 1. అల, కరడు. "మ...నం, దినియన్నేటితరంగలన్ బెనఁగుచున్." భార. ఆది. ౮, ఆ. ౨౯. ఆం. భా. ప్ర. ౧౫౪; 2. వళి, కడుపుమీఁదిముడుత. "చ. సరవియె కాని దంతురత చాలనినన్నుపుమత్తరంగలన్." కవిక. ౩, ఆ. ౧౩.

తరఁగలెత్తు. ద్వ. వి. (తరఁగలు+ఎత్తు) పొంగిపొరలు: అతిశయించు. "సీ. అమృతంబు విష్ణునామాక్షర మధురగాంధర్వరూపంబునఁ దరఁగలెత్త." కవిరా. ౧, ఆ. ౧౦౬.

తరకట. వై. విశే. (సం. తర్కః.) అసత్యము. (ఇది పెక్కుచోట్ల నీయర్థమున "బరకట, ఖురకట" శబ్దములతోఁ గలిసి సోదెకత్తెయాడుమాటలం దుపయోగింపఁబడుచున్నది.) "క. తరకట బరకట గాదే, తరుణీ నామాట నీకుఁ దార్క్యణగునే." దశా. ౭, ఆ. ౨౮౯. వేం. మా. ౫, ఆ. ౩౮.

తరకటించు. వై. అ. క్రి. తర్కించు. "సీ. తనశిరః కోటీర తపనీయమయరుచుల్ తపనాంశురేఖతోఁ దరకటింప." ఇందు. ౫, ఆ. ౪౬. (తరగలింప. ముద్రి.)

తరకటింపు. వై. వి. (సం. తర్కః) తర్కము. "సీ... తరకటిం పనఁగను దర్క మెసఁగు." ఆం. భా. ప్ర. ౧౦౩.

తరకసము. దే. వి. అమ్ములపొది, తూణీరము. "సీ. రాణ నొప్పారు పైఠాణంబు సింగిణి తళుకుల కోరుల తరకసంబు." స్వా. ౪, ఆ. ౨౮. ఆం. భా. ద్వి. ౫౪.

తరకసా = తరకసము. "శా. తైలాంచత్కచపాళిఁ గూర్చి మెలు లొందం జుట్టి మేల్ పాగలం, గీలున్ సింగిణి చేకటిం దరకసాల్ కెంపైనమీసంబు...విరాజిల్ల..." రా. వి. ౨, ఆ. ౫౧.

తరక్షువు. సం. వి. ఉ. పుం. సివంగి, క్షుద్రశార్దూలము.

తరగంపె. దే. వి. ఒకరకము అంపము. "సీ. అంప మనంగను గ్రకచంబు తరగంపె యనఁ గరపత్త్రభేదాఖ్య మీఱు." ఆం. భా. ద్వి. ౩౦౧.

తరగతి. మి. గ్రా. వి. (తరము+గతి.) తరమును దెలిపెడుభాగము, తెగ. వ్యవః—వాఁడు నాల్గవ తరగతిలోఁ జదువుచున్నాఁడు. (శ. ర. బ్రా.) బ. శ్రీకంఠభూషావిశేషము. ఉదా.—తరగతిగుండ్లు.

తరగతిగుండ్లు = తరగతులు. బ. శ్రీకంఠభూషావిశేషము. (శ. ర. బ్రా.)

తరటు. దే = తఱటు. (కళ, కొరడా.) "చ...తరటుల పాలు సేయమి..." విక్ర. ౫, ఆ. ౮.

తరణ. సం. వి. ఆ. స్త్రీ. తరవాణి.

తరణము. సం. వి. అ. న. ఈఁదుట.

తరణి. సం. వి. అ. న. ఈఁదుట.

తరణి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు; 2. కిరణము; 3. జిల్లేడుచెట్టు; 4. రాగి, తామ్రము; 5. సముద్రము. ఇ, ఈ. స్త్రీ. 1. నౌక; 2. చిన్న గోరంటచెట్టు; 3. నది; 4. దాటుట.

తరణీయము. సం. విశే. (అ. ఆ. అ.) దాఁటఁదగినది.

తరత్. సం. శత్రు. దాటుచున్న.

తరతమము సం. విశే. (అ. ఆ. అ.) హెచ్చుతగ్గులు కలది.

తరతరము. దే. క్రి. విశే. (తరము+తరము) 1. క్రమక్రమముగా. "వ...కద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన..." భార. ఆది. ౨, ఆ. ౪, హర. ౬, ఆ. ౯౫; 2. వరుసపెట్టి. "గీ...అతఁడమేయభల్ల, తతుల నన్నింటిచేఁ దునుమాడెఁ దరతరంబ." భార. భీష్మ. ౨, ఆ. ౧౭౭. భార శా. ౧, ఆ ౯౫౭; 3. మిక్కిలి. "గీ. అంతరంగంబులో నాత్మహాననశంక, తరతరమె యుద్భవిల్లఁగఁదల్లడిలుచు."నైష. ౭, ఆ.౧౨౩, పండితా. దీక్షా. ౨, పు; 4. వంశపరంపరగా, "క. చిరకాలంబది మొదలుగఁ, దరతర మక్కార్ముకంబు దగ మాయింటన్...ఒప్పుచు నుండెన్." భా. రా. బాల. ౬౮౮, భార. మహా. ౧, ఆ. ౧౮.

తరపణ్యము. సం. వి. అ. న. ఓడకూలి, పడవకేవు.

తరపు. దే. స క్రి. పోఁగొట్టు; అణఁచు. "సీ. ఈచంపకామోద యాక్రొవ్విరులతోఁటఁ బ్రోచుఁ దుమ్మెదపిండు వాలయకుండ. గీ. తావిక్రొవ్విరి వాసనల్ తరపు ననుచు." చంద్రా. ౪, ఆ. ౯౫౩, "గీ. సత్యభాషణనియమంబు జరపినాఁడు, నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు, దండిలోభాది గుణములఁ దరపినాఁడు, మంచిగుణములు తన యందు మఱపినాఁడు." భాగ. ౬, స్కం. ౯౫.

తరఫు. హిం. వి. పక్షము. వ్యవః—నీవు నాతరఫున పనిచేయుము.

తరబడి. ద్వ. వి. (తరము+బడి) తరము, పరిమాణము. "సీ. దుర్గంబు వెలువడి దూరస్థలంబున సొమ్ముల తరబడి చూచునపుడు" ద్వా. ౧౦, ఆ. ౧౭౫; 2. తెగ, "గీ. అచటియొకపాటి దొరమదహస్తులకును, నెత్తుగున్నలు దిక్కులమత్తకరులు, అచటి లేరాచలాయంపుటలఁటి లేజి, కింతరెండవతరబడి యింద్రహయము." పాంచా. ౧, ఆ. ౩౯. విశే. 1. సాటి, సదృశము. "గీ. సాటి సాటువ తరబడి సవతు...ఈ దనఁగ సదృశాఖ్యలై యొసఁగుచుండు." అం. భా. ద్వి. ౩౦౨; 2 అర్హము. "క. పరికించి పనులవారలఁ, దరబడిపదములకు నిల్పు దానికి రాజ్య, స్ఫురణ దగు మేన సకలా, భరణంబులరీతి పీడుకదకుండ నృపా." చిత్రభా. ౫, ఆ. ౪౯, అవ్య. ద్రు. వెంబడి. "గీ. ఎఱుకగలవారి తరబడి నేగుసపుడు, కతముల సిక్షాలు చేసి ముష్కరతురుష్కు, లవలఁ బోష్మనికొత్వాల కప్పగింతు, రప్పటికిఁ జేరఁ బరులకు నలవి కాదు." కృష్ణ. ౨, ఆ ౧౨౩.

తరమిడి. ద్వ. అవ్య. (తరము+ఇడి) 1. వరుసపెట్టి. "సీ...సహస్రబాహుఁ, బరిమార్చి నృపతులఁ దరమిడి తునుమాడె నిరువదియొక్కమా తెల్లచోట." భార. ద్రో. ౨, ఆ. ౨౧౨, భార. ఉద్యో. ౪, ఆ ౧౫౦; 2. విడువక, "ద్వి. వనజాక్షుఁడు మెచ్చి వరమిచ్చువేళ, నరుల నెన్నక యున్న నాఁటితప్పెల్లఁ, దరమిడి నేఁ డిదే తలకూడె నీకు." రం. రా. యు. ౪౨౧, పు. భాగ. ౨, స్కం. ౧౦౧; 3. తారతమ్య మెంచి (బ్రౌ) "ద్వి. వరుస నార్వురుచక్రవర్తులలోనఁ, దరమిడి మున్నెన్నఁ దగుచక్రవర్తి." ద్వి హరిశ్చ. పూ. ౨౪౦, పం.

తరము. ఉభ. వై. వి. (సం. అంతరమ్. క. తర. త. తరమ్.) 1. జీవితకాలము, "క...ఎడ తెగక యిట్లు వచ్చినవంశం, బురుభుజ నీ వుండఁగ నీతరమున విచ్ఛిన్న మగుట ధర్మమె..." భార. ఆది. ౪, ఆ. ౨౨౧. విజ్ఞా. వ్యవ. ౫౦; 2. పురుషాంతరము. "గీ. ఇవ్వల నేడుదరంబుల నవ్వల నేడు, దరములను బితృవర్గంబు నరుఁడు గంగ,నాడి శుచి జేయు..." భార. అను. ౨, ఆ. ౧౧౦. అం. భా. ద్వి. ౧౧౨; 3. మానము, కొలఁది. "చ. వివిధము లైనయశ్వములు వేలతరంబులు నీరు ద్రావుచున్నవియును బోవుచున్నవియుం నైనవి.." జై. ౨, ఆ. ౧౬, భార. ఉద్యో. ౪, ఆ. ౧౯; 4. సామ్యము, పోలిక. "సీ. నరపుంగవులు కాని నరపుంగవులు గారు తరమెన్న పరధర్మధర్మభృతుల" వసు ౧, ఆ ౪౧, కువల. ౧, ఆ. ౪౪; 5. వరుస, క్రమము. "చ. తరముననఁ గన్న

వల్ పోలయఁ దల్లిముఖాబ్జము సూచు..." కు. సం. ౧౦, ఆ. ౫౧, ష్వా. ౪, ఆ. ౪౦; 6. రకము, "క. కురువీరుల గెలిచి తదం, బరములలోఁ జిత్రవర్ణభాసురములుగాఁ, దర మెఱఁగి లోచనోత్సవ, కరములుగా బొమ్మపొత్తికలకుం డెండీ." భార. విరా. ౪, ఆ. ౪౭, విజ. ౧, ఆ. ౧౪౫; 7. విధము, "మ. బలవిక్రాంతియశంబులన్ బలరిపుం బ్రస్ఫారలక్ష్మీవిభాకలనం బూర్ణశశాంకు శక్తిగరిమన్ గాంగేయు నేభంగివే, ల్పులలోన న్గణుతింతు రాతరముగాఁ బోల్పం దగుం గాక నిన్ను..." హరి. పూ. ౭, ఆ. ౧౪౩, చంద్రి. ౨, ఆ. ౫౯; 8. తత్తఱము, "చ. బలుకుందపు మొగ్గచిల్కుటు, మ్ములు మరుఁ డేయఁ బూనుఁ దరముం దరముం జెలి చెంతఁ జేరినన్." చంద్రి. ౪, ఆ. ౧౨౬; 9. పెద్దదూలములు మున్నగు వానిని మోసికొని పోవుట కుపయోగించుసాధన విశేషము, జడ్డి, "సీ. తరముల నిట్టట్టుఁ దగుశిలల్ దరలించుబలుమానిసుల యార్పుకలకలంబు." పరమ. ౬, ఆ. ౪౦. హరి. పూ. ౫, ఆ. ౭౦; విణ. 1. శక్యము "గీ. తరమె విష్ణునితోఁ బోరఁ దమ్ములార." ఉ. రా. ౨, ఆ. ౧౩, విక్ర. ౪, ఆ. ౧౨; 2. శక్తము, సమర్థము. "సీ. కలికిజక్కవ పిట్టకవఁ గూర్ప విప్పంగఁ దరమైనకనుదోయి దయ దలిర్ప." దశా. ౬, అ. ౪౮, శుక. ౨, ఆ. ౮; 3. సమానము. "గీ. పాటినూత్నహరిద్రావిభంగము నకుఁ, దరము సౌదామనీదామధామమునకుఁ, గరముఁ బోలుపొందు దీనియంగముల కాంతి." నైష. ౩, ఆ. ౧౬౮. ఆం. సం. స్థా. ౩౪; 4. శ్రేష్ఠము, "సీ. రాణించుగొప్పసుప్పాణి యొం టులఁ దాల్చి తరమైనబలుకెంపుతాళి వైచి." వాల్మీకి. ౧, ఆ. ౧౫, ఆం. భా. తృ. ౧౬, సం. వి. అ. పుం; 1. దాటుట; 2. ఓడకూలి; 3. అగ్ని. విణ. (అ. ఆ. అ.) దాఁటునది.

తరల. సం. వి. ఆ. స్త్రీ. 1. గంజి; 2. కల్లు, సుర; 3. ఒకానొకవృత్తము.

తరలించు. దే. స. క్రి. (తరలు ధా. ప్రే.) 1. తొలఁగించు, పోఁగొట్టు. "క. నరునిశరీరమునఁ జరా, తరుణి ప్రవేశించి ప్రజ్ఞఁ దరలించుఁ జుమీ." వాసిష్ఠ. ౧, ఆ. ౧౨౩; 2. లాగుకొనిపోవు, "చ. పరిమిళిత ప్రవాళనవ పట్టపటధ్వజ చూత నూతన, స్మరరథరాజమున్ భ్రమరజాలగుణాంచిత పాంసుచక్రముల్, గెరల మహారథంబుఁ దరలింప లతావనితాళిఋవ్వతే, మరువపుబంతులట్ల శుక మండలి యాడెడిఁ గంటె పైపయిన్." వసు. ౩, ఆ. ౧౩౬. పరమ. ౬, ఆ. ౪౦; 3. బయలువెడలఁజేయు. "గీ. తండ్రిఁ బిలిపించి వార్త యంతయును దెలిపి, వీడు దరలింపు మిప్పుడ వీడ ననిన. చెన్న." ౨, ఆ. ౩౦౪.

తరలిక. దే. వి. (తరలుధా.) ప్రయాణము. "గీ. తరలుడు తరలక యరుగు డరుగడమ్ము,...అనఁగ యాత్ర, తగును..." ఆం. భా. ద్వి. ౨౧౯.

తరలు. దే. అ. క్రి. (క. తెరళు) 1. ప్రయాణమగు. "తరల...క్రక్కునన్ రజతాద్రికిన్, దరలఁగా వలె నంచుఁ జెచ్చెరఁ దమ్మిగద్దియ డిగ్గినన్." దశా. ౨, అ. ౮౬. నీలా. ౩, ఆ. ౧౦; 2. నడచు, చను. "గీ. తరలె నన నడచె ననుట తనరు నభవ." ఆం. భా. తృ. ౭౮; 3. తొలఁగు. "గీ. అచలగతి నుండె దనుజసైన్యంబు మిగులఁ, బరఁగి దైవసైన్యంబుచేఁ దరలదయ్యె." ఉ. హరి. ౧, ఆ. ౧౯. నా. పంచ. ౩, ఆ. ౨౦౦; 4. పోవు, నళించు. "గీ. అనుచు రాముఁడు ఘనరీతిఁ దనప్పషత్క, తతిసహస్రకరస్ఫూర్తిఁ దరలఁ జేయఁ, బఱచె నర్జునభూధరపక్షబలము" దశా. ౮, అ. ౧౨౨. వసు. ౩, ఆ. ౨౦; 5. చలించు, "చ. గరుడసమర్పితాభినవగారు డరత్నమయాంగదంబు భూ, వరభుజపీఠిఁ బొల్చె నగవర్యసుతావరణాభ్యసూయచేఁ, దరలనిభూతధాత్రియన..." వసు. ౬, ఆ. ౯౧. ప్రభా. ౨, ఆ. ౩౪. స. క్రి. విడుచు, వదలు "క. అరయఁగ సంసారాటవిఁ, దరలక యాపుత్త్రమిత్త్రదారాదులనం, బరఁగుచు నుండెడు వృకములు పరువడి నరబస్తములను భక్షించు వడిన్." భాగ. ౬, స్కం. ౧, ఆ. ౧౮౪. వసు. ౧, ఆ. ౪౫.

తరలుఁడు = తరలిక. ఆం. భా. ద్వి. ౨౧౯.

తరళము. సం. వి. అ. పుం. 1. హారమధ్యరత్నము, నాయకమణి; 2. హారము; 3. వజ్రమణి. విణ. (అ. ఆ. అ.) 1. చలించునది; 2. ప్రకాశించునది.

తరళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చలింపఁజేయఁబడినది; 2. చంచలమైనది.

తరవరి. = వై. వి. పట్టాకత్తి. "వ...దరవరులకిచ్చియు." "ఉ. హరి. ౬, ఆ. ౫౦. "క. పినతండ్రిచావుఁ గని యుద్ధపుఁజాఁడు యూపాకుఁడు దంతఁ దరవరిఁ గొనుచుం, దసరథము డిగ్గి సింహధ్వని యెసఁగన్ ద్వివిదుఁ దాఁకె దర్ప మెలర్పన్." భా. రా. యు. ౧౧౯౩.

తరవలి. వై. వి. (సం. తరవారిః. ప్రా తరవారి. హిం. తల్వార్.) పట్టాకత్తి. ఆం. భా. ద్వి. ౨౧౪.

తరవాణి. దే. వి. అన్నముతోఁ గలిపి పులియఁబెట్టిన గంజి. (వా)

తరవాయి. దే. వి. ఔ. (త. తరవాయ్.) వరుస, అనుక్రమము. "గీ. ఒక్కతరవాయి దొరణొని యొకటి నొకటిఁ, బృథుభుజాదండమునఁ బట్టి పెలుచ నూఁచె." హరి. పూ. ౭, ఆ. ౮౧. భార. కర్ణ. ౧, ఆ. ౨౪౯; 2. కాలము. "చ. చెడుతరవాయి నిట్టిపని చెప్పితిఁ గాని ధనంబు కాంక్షకున్,గడపల లేదు..." నా. పంచ. ౧, ఆ. ౧౫౭; 3. చెప్పినదె మరల మరలఁ జెప్పుట, వల్లె. "గీ చెలఁగి తొలుసాఁడు తరవాయిఁ జెప్పి నట్టి, యెల్లపన్నంబు నేకరువిడి పదంబుఁ,గ్రమము గుణియించునైష్ఠికబ్రహ్మచారి, నికరములు గొల్వ వచ్చె శాండిల్యమౌని." రా. వి. ౨, ఆ. ౮; 4. ఉపక్రమము. "క...లాఁతుల, మా తరవాయుండుగ మాటలాడుం డనుచున్." ద్వి. పరమ. 3, ఆ. ౨౨౫.

తరవారి. సం. వి. ఇ. పుం. కత్తి. (చూ. తరవరి, తరవలి.)

తరసము. సం. వి. అ. న. మాంసము. న్. న. 1. వేగము; 2. బలము. విశే. (అ. ఆ. అ.) 1. వేగము గలది; 2. బలము గలది.

తరసానము. సం. వి. అ. పుం నౌక.

తరస్వి. సం. వి. న్. పుం. 1. పులి; 2. వాయువు; గరుడుఁడు; 4. శూరుఁడు; 5. వడిగాఁ బోయి వార్తలఁ దెచ్చుభటుఁడు. విశే. (న్. సీ. న్.) 1 వడి గలవాఁడు; 2. బలిమి గలవాఁడు.

తరస్సు. సం. వి స్. న. 1. వడి; 2. బలిమి; 3. తీరము; 4. క్రోఁతి; 5. తెప్పలు.

తరాజు. దే. వి. (క. త. తరాసు. హిం తరాజూ) తూఁచెడుసాధనవిశేషము, త్రాసు. "ఉ...ఈ, రాజులు రాజులా పెనుతరాజులు కాక ధరాతలంబునన్." అడిదముసూరకవిచాటువు:

తరాసు. దే. వి = తరాజు. "సీ. త్రాసు తరాసు నాఁ దసరును నారాచి..." ఆం. భా. ద్వి. 3౦౦.

తరి. ఉ. ధ. వై. వి. (సం. తరిః.) 1. త్రచ్చుట, మథనము. "క. తరపరము తరువఁ దరువం, దరియం దుదయుంబు నొందె ధన్వంతరి సాగర మునఁ గడు గరగరనై, కరమునఁ గర మమరు నమృతకలశము దానున్." భీమ. ౪, ఆ. ౯౪; 2. కవ్వము. "సీ. గిరిఁ దరిఁ జేసి యాశరథి మథించి సంధిలుసుధారసము సాధించువాఁడు." చమ. ౧, ఆ. ౯. భా. రా. బాల. ౪౭౪; 3. వెన్న. ఉదా.—తరియావు. తరిపాలు. మొ. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. నౌక; 2. బట్టయంచు; 3 పాగ.

తరించు. సం. స. క్రి. 1. (సముద్రము మున్నగు వానిని ఓడ మున్నగుసాధనములచే) దాఁటు. "చ...ఇంతవిపదంబుధి నేకరణిన్ దరింతు..." ఉ. రా. ౬, ఆ. ౧౯౯; 2. (ఆజ్ఞాదులను) అతిక్రమించు, మీఱు "సీ. శాఖామృగస్వామి శాసనంబుఁ దరింప గండమై యుండిన నుండుఁ గాక." చం. రా. ౬, ఆ. ౯౨; 3. కడపు, వెళ్లఁ బుచ్చు. "ఉ...తుషారమహోరహితాసితాబ్జినీ రీతి మెయిం దినంబులు దరించుచు నుండె నితాంతఖిన్నయై." హ. న. ౪, ఆ. ౯౫.

తరికుఁడు. సం. వి. అ. పుం. రేవుపుచ్చు కొనెడి యధికారి.

తరిగంబము. ద్వ. వి. (తరి+కంబము) కవ్వము దగిలించి త్రచ్చుట కుపయోగించుస్తంభము, కుటరము. "క. తరిగాండ్రలోన నొకఁ డేఁట, తరి గడవకుఁ గుదురు నాఁకత్రాడఁట చేరుల్, తరి గంబంబును దానఁట హరిహరి హరిచిత్రలీల హరియే యెఱుఁగున్." భాగ. ౮, స్కం. ౨౦౫.

తరిగట్టు = తరిగొండ. (చూ. తరిగట్టుత్రాడు, తరిగట్టుదారి) [సాం. ని. తిర్య. ౮౦.

తరిగట్టుత్రాడు. ద్వ. వి. (తరిగట్టు+త్రాడు.) శేషుఁడు.

తరిగట్టుదారి. ద్వ. వి. (తరిగట్టు+దారి.) మందరధరుఁడు, విష్ణువు. ఆం. సం. దేవ. ౭.

తరిగడవ. ద్వ. వి. (తరి+కడవ.) పెరుఁగు త్రచ్చెడు కడవ, మంథని. భాగ. ౮, స్కం. ౨౦౫.

తరిగాఁడు. ద్వ. విశే. (తరి+కాఁడు) త్రచ్చువాఁడు, మథించువాఁడు. భాగ. ౮, స్కం. ౨౦౫.

తరిగొండ. వై. వి. (తరి+కొండ.) కవ్వపుఁగొండ, మందరపర్వతము. "సీ తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూడిచిలిఁ దేర్చినట్టి కచ్ఛపము వీవ." పారి. ౧, ఆ. ౪౯. వరాహ. ౧౦, ఆ. ౧౧౮.

తరిగొట్టు. ద్వ. వి. (క. తరిగొట్టు.) ఒకదినుసుకూరాకు, విశల్యకట. "సీ. తనరు విశల్యయై తరిగొట్టు చెన్ను చెఱుకుపొత్తి నాఁగ..." ఆం. భా. ద్వి. ౬౮.

తరిగోల. ద్వ. వి. (తరి+కోల.) కవ్వము, మంథానము. (శ. ర. జై.)

తరిచేట్టు. ద్వ. స. క్రి. (తరి+చుట్టు) (పెరుఁగు దేవతామూలకు) నివేదనముచేయు. (శ. ర.)

తరిటి. దే. వి. రెండుకొనలను రెండుమూటలుగాఁ గట్టి నడుమ బిగించి యెద్దు మున్నగువాని వీఁపుమీఁద వైచెడి గోనెసంచి. (శ. ర.)

తరిటె = తరిటి. (శ. ర.)

తరిణి. సం. వి. ఈ. స్త్రీ. నౌక.

తరిత. సం. వి. ఆ. స్త్రీ. 1. చూపుడువ్రేలు; 2. గంజాయికట. విణ. (బు. త్రి. బు.) తరించువాఁడు.

తరితీపు. ద్వ. వి. (తరి+తీపు.) 1. ఉపేక్ష. "మ... సరసాలాపసుధారసం బయినఁ గాంతుం గ్రోలఁగా నియ్యవే, తరితీ పేల యటంచు రాఘవుఁడు సీతన్ ముంచె రాగాంబుధిన్." ఉ. రా. ౬, ఆ. ౫౧; 2. అతిశయము; 3. మధనమాధుర్యము, తరుచుటచే తనైనమాధుర్యము. "సీ కులములోఁ దరితీపు గలిగి మించినమేటి..." స్వా. ౫, ఆ. ౪౭. (పై రెండర్థములకు నుదాహరణము); 4. మోహము. "సీ. తరితీపుఁ జూపుబిత్తరపుఁజూపులు చూచి..." దశా. ౨, అ. ౩౦౪. ప్రబోధ. ౧, ఆ. ౭౫; 5. విలాసము, శృంగారచేష్ట. "చ...ఇప్పునికిఁ బ్రసూనసాయకుఁడె పైతసువే మన సీక వీనిఁ జెం,దినవలరాచవెట్టితరితీపులచేఁ దలకెక్కఁ జేసెదన్." వైజ. ౩, ఆ. ౧౦; 6. తహతహ, తమకము. "సీ. తమకము తహతహ తమి తత్తఱము చిడిముడి తరితీ పుత్తలమ్ము చిడిముడిపాటు, నాఁగఁ దనరారు." ఆం. భా. ప్ర. ౧౪౦. ప్రభా. ౫, ఆ. ౪౫; 7. అపేక్ష. (శ. ర.) "క...వెండియు దినదినమున దన, దండను పేదండయాన తరితీపువగల్, మెండుకొన నుండఁ గన్నులపండువుగాఁ జూచి కామపరవశుఁ డగుచున్." శశాం. ౨, ఆ. ౯౧; 8. ప్రీతి సంతోషము. (చూ. తరితీపుసేయు.); 9. బాధ. "చ...రథాంగదంపతుల్, తెఱఁ గొదవంగఁ బట్టి తరితీపులఁబెట్టు మృణాళమో యనన్." విక్ర. ౪, ఆ. ౨౦౪.

తరితీపుసేయు. ద్వ. అ. క్రి. గర్వించు. (శ. ర.) స. క్రి. 1. సంతసింపఁజేయు. "గీ. కాన దోషాత్త లయినదుష్కృతులకతన,గరిమ వహియించుఁ గవిరాజకావ్యమహిమ, బహుళపక్షంబు చీకటి బహుళ మగుటఁ, జాయ వెన్నెల తరితీపు సేయుకరణి." పాండు. ౧, ఆ. ౧౪; 2. పీడించు. "ద్వి. పురణించుచును దనపూర్వకర్మంబు,తరువు కాఁడై వెంటఁ దరితీపుసేయ, నిలిచినచోటఁ గాల్ నిలుపంగలేక, నలిరేఁగి చిత్రాంగినగరి కేతెంచె." ద్వి. శ. సా. ౧, ఆ. ౨౦. పు. రం. రా. ఆర ౧౯౦. పు.

తరిత్రము. సం. వి. అ. న. నౌక.

తరిదాల్పు. ద్వ. వి. (తరి+తాల్పు) విష్ణువు. "సీ. తరిదాల్పుపొక్కిటి తమ్మికమ్మనితావి యల్ల నల్దెసలను జల్లి చల్లి." నృసిం. ౧, ఆ. ౫౪.

తరిత్రాడు. ద్వ. వి. (తరి+త్రాడు). మంథరజ్జువు, కవ్వము త్రిప్పుత్రాడు "చ. సురనికరంబు రక్కసులుఁ జుట్టములై యమృతాభిలాష మం,దరగిరిఁ జిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి నిర్భర గతిఁ ద్రచ్చుచో..." పారి. 3, ఆ. ౫౯. చం. రా. 3, ఆ. ౬3.

తరిఫీదు=ఉ. వి. (ఉర్దు. తరిబయతు.) అలవఱుచుట.

తరియించు = తరించు (దాఁటు) "క...అనుపమనో కార్ణవమున, మునిఁగియుం నిజయోగసత్త్వమునఁ దరియించెన్." భాగ. 3, స్కం. ౧౬౨. మార్క. ౧, ఆ. ౧౮౮.

తరివట్టు ద్వ. స. క్రి. (తరి+పట్టు) దేవతల నుద్దేశించి పెరుఁగును త్రచ్చక నిలుపు. "సీ. తోడఁ గాలితఱుల విడుతురా తోడితోడి జన్నెలఁ దరివట్టుజాడ గలదె." ఉ. హరి. ౪, ఆ. 3౦౮.

తరీషము. సం. వి. అ. పుం. 1. నౌక, 2. సముద్రము, 3. పూనిక, కృషి; 4. స్వర్గము, విణ. (అ.ఆ.అ.) సమర్థము.

తరుచు. వై. స. క్రి. (సం. తక్ష. ప్రా. తచ్ఛ) 1. సానఁబెట్టు. (చూ. త్రచ్చు); 2. చిలుకు,మథించు. "చ. వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లె .." భార. ఆది. ౨ ఆ. ౧౫, హరి. పూ. ౫, ఆ. ౨౦౩; 3. పరిశీలించు, బాగుగా నాలోచించు. "సీ తరిచి మున్నదిరెండుతత్త్వంబు లూహించి .." పాండు. ౨ ఆ. ౮. వరా. ౨, ఆ. ౮౨; 4. రాచు, ఒత్తిపెట్టు. "క. కర మొప్పఁగ వేనజనేశ్వరు దక్షిణకరతలంబు సంరంభముతోఁ, దరువంగ నరణి మథనస్ఫురితుం డగుజాతవేదుపోలిక యమరన్." హరి. పూ. ౧, ఆ. ౧౦౮ భార. శాం. ౪. ఆ. ౧౫౯.

తరుణము. ఉభ. దే. వి. యుక్తకాలము. (వ్యవ.)

తరుణము. సం. వి. అ. పుం; 1. ఆముదపుఁజెట్టు; 2. పొట్టిపువ్వుల ఆముదపుఁజెట్టు. విణ. (అ.ఆ ఆ.) నూతనము, క్రొత్తది.

తరుణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుది; 2. యౌవనము గల ఆఁడుది; 3. పిన్నగోరంట✿. 4. నేపాళము✿. పెద్దజీలకఱ్ఱ; 5. చీడ అనుగంధద్రవ్యము.

తరుణిమ. సం. వి. న్. పుం. తరుణత్వము.

తరుణియ. వై. వి. (సం. తరుణీ) యౌవనము గలస్త్రీ; స్త్రీ. "చ. తరుణియ లొప్ప నాడిరి ముదంబునఁ దన్ను జనాలి మెచ్చఁగన్." భార. ఆది. ౮, ఆ. ౧౫౭. కు. సం. ౮. ఆ. ౬౮.

తరుణుఁడు. సం. వి. అ. పుం. యౌవనవంతుఁడు.

తరుతూలిక. సం. వి. ఆ. స్త్రీ. - వృక్షమునం దూఁగునది—గబ్బిలము.

తరునఖము. సం. వి. అ. పుం. ముల్లు, కంటకము.

తరుపు వై. వి. (తరుచేధా.) తరుచుట మథనము. (చూ. తెరుపుఁద్రాడు).

తరుపుఁద్రాడు. ద్వ. వి. (తరుపు+త్రాడు) మంథరజ్జువు, కవ్వము త్రిప్పెడిత్రాడు. "సీ. సర్వసర్వంసహాసంభృతిప్రవణుండు దండశూకస్వామితరుపుఁద్రాడు" హర. ౬, ఆ. ౪౦.

తరుభుక్కు. సం. వి. జ్. పుం. వృక్షాదని, బదనిక✿

తరుభుజము. సం. వి. జ్. పుం.=తరుభుక్కు.

తరుమృగము. సం. వి అ. పుం. కోఁతి.

తరురాగము. సం. వి. అ. న.-చెట్ల కెఱుపు కలిగించునది-లేఁత చిగురు.

తరురాజము. సం. వి. అ..పుం. 1. శ్రేష్ఠమైన చెట్టు; [2. తాటిచెట్టు.

తరురుహ. సం. వి. ఆ. స్త్రీ.-చెట్టుపై మొలచునది - బదనిక✿.

తరువల్లి. సం. వి. ఈ. స్త్రీ. బదనిక. ✿

తరువాయి. దే. వి. ఔ. 1. అనంతరము, పిమ్మట. "గీ. వినుము తరువాతి కథలు సవిస్తరముగ." నిర్వ. ౪, ఆ. ౧౮. కాశీ. ౨, ఆ. ౧౧౯; 2. మిగిలినభాగము, శేషము. "క. తలఁచి యది యపు డోకింతయుఁ, దొలుతటితరువాయి మతియుఁ దోఁచక." పరమ. ౨, ఆ. ౧౧౩, వరాహ. 2, ఆ. ౪౩.

తరువిడు. దే. స. క్రి. (తరువు+ఇడు) 1. ప్రేరేపించు. "క. ఆవేళ దివిజమురజివి, రావము హరి రచితగింపురప్రాంగణవీ, థీవితతంబై గింజా, వైవాహికకలనమునకు నడిఁ దరువిడియెన్." వసు. ౫, ఆ ౧౦౬; 2. తొందరచేయు, (నిర్బంధించు అని సూ. ని.) "ప. అమ్మునిచెంత నున్నపరశురాము విలోకించి నీవైన నీచంచలాత్మఁ ద్రుంచెదవో లేదో యని యడుగ గడగడ వడంకుచు కేలు మొగిచి మీరు నొడివినవడువున నడంచెద ననినఁ దడవుసేయకు మని తండ్రి తరువిడ..." దశా. ౬, ఆ. ౭౫.

తరువిలాసిని సం. వి. ఈ. స్త్రీ.-చెట్టునకు విలాసిని వంటిది - నవమల్లిక ✿.

తరువు. ఉభ. దే. వి. 1. తొందర. (చూ. తరువిడు); 2. ప్రోత్సాహము, ప్రేరేపణము. (చూ. తరువిడు); 3. ఈయవలసినదానాదికము లిమ్మని చేయు. నిర్బంధము. "చ. హారిదవధిక్షమారమణులాతుర గాళినుదుల్లపట్టముల్, తరువులరాయసంబుల విధంబునఁ గన్గొని శ్వేతమానవే, శ్వరునకుఁ దెచ్చి యిచ్చి వసువస్తుపరంపర లెక్కఁగూడుపె, న్వైరసులరీతిఁ దత్సవన వీథిఖురాంకము లొప్పె నుర్వరన్."- వరాహ. ౧౨, ఆ. ౬౦. ద్వి. పరమ. ౬, ఆ. ౪౬౦. పు. విణ. (ఈయవలసినధనాదికము లిమ్మని) నిర్బంధించువాఁడు. "గీ. తరువు పనిచెను తనదుకింకరుల వారు, నేఁగి ధనము వచ్చుటకునై యిట్టునట్టుఁ, బరుసఁదనములు చూపి తద్విరచితావ, మానులై క్రమ్మఱఁగ వచ్చి మనుజపతికి." పరమ. ౪, ఆ. ౧౪౫. ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౦. పం; 2. కావలివాఁడు, "ఉ... కా, మాతురతాతిలేకమున నాణుడిపోకలఁ

బోవఁ జూచినన్, వే తరు వుండి పట్టుకొన నీరజ గర్భునకైన శక్యమే." వేం. పంచ. ౪, ఆ. ౪౩౬. వైజ. ౩, ఆ. ౧౦; 3. బాధకము; బాధించువాఁడు, "క. కొరవులె కొలవులు కేసర, తరువులె తరువులు సమీరతరు శాదరముల్. దర ముల్ కలజాగరములు, గరములు మనవంటవిరహ కాంతల కబలా." రా. వి. ౩, ఆ. ౧౧౧. సం. ౕ. ఉ. పుం. వృక్షము, చెట్టు.

తరువుకత్తె. దే. విణ. (తరువు+కత్తె.) (ఇయ్యవలసిన ధనాదికము నిమ్మని నిర్బంధించునది. "ఉ... గాటపుకాంక్ష యక్ తరువుకత్తెమదిక్ ద్వరసేయ నల్లనక్,మీటిన మ్రోఁతుంబీణెవలెమించు నెలుంగున భర్తతో ననున్." ఉ. రా. ౬, ఆ. ౧౯౭.

తరువుకాఁడు. దే. విణ. (తరువు+కాఁడు.) (ఇయ్య వలసినధనాదికము నిమ్మని నిర్బంధించువాఁడు. "గీ. వెఱఁగునొందుచుఁ దనమీఁది తరువుకాం డ్రఁజూచి యెంతచేసిన నిందు సొమ్ము లేదు, రండు కంచికి మీరు మీ ద్రవ్య మిత్తునగధరుని యాన యని వారి నమ్మఁ బలికి." పరమ. ౪, ఆ. ౧౬౮. వైజ. ౨, ఆ. ౧౪౩.

తరువు సేయు. ద్వి. స. క్రి. (తరువు+చేయు) పురి కొల్పు, ప్రేరేపించు. "చ. చెలువుని వెంటఁ బోఁ దరువు సేయఁ మనోజునిమాట..." కువల. ౪, ఆ. ౫౪. సా. ౩, ఆ. ౧౩౮.

తర్కము. సం. వి. అ. పుం. 1. కాంక్ష, కోరిక; 2. విచారణ; 3. న్యాయశాస్త్రము; 4. మీమాంసాశాస్త్రము; 5. కారణము; 6. అర్థవాదము; 7. వాదము; కలహము. "ఉ...కల్వచెల్వము చూచి వానితోఁ, దర్కము పెట్టఁ బూనిన విధంబున నెక్కువ నిక్కెఁ జుక్కలున్." ద్వా. ౮, ఆ. ౯౧.

తర్కి. సం. విణ. (న్. ఇన్) 1. తర్కించువాఁడు; 2. తర్కశాస్త్రజ్ఞుఁడు.

తర్కించు. సం. స. క్రి. 1. తర్కముచేయు, ఊహించు. "మ...మనలో దృష్టించి యెవ్వాఁడు దొంగవిధం బొప్పఁగఁ ద్రవ్వి చేకొనియెనో కా కంచుఁ దర్కించుచుక్." ద్వా. ౯, ఆ. ౧౨౦. మార్క. పీఠి. ౧౬; 2. తలపోయు. "మ... నృహరీ తర్కింతు ని న్నెప్పుడున్." చంద్రా. ౧, ఆ. ౭౮.

తర్కితము. సం. వి. అ. న. తర్కము, ఊహ. విణ. (అ. ఆ. అ.) 1. పరిశీలింపఁబడినది; 2 ఊహింపఁ బడినది.

తర్చు = తఱచు. (బహుళము) "క. గ్రామగ్రామం బున నొక,సామంతుని కిడినచలువచప్పరములు త్రచ్చె..." ఆము. ౨, ఆ. ౯౫.

తర్జకుఁడు. సం. విణ. (అ.ర్జికా. అ.) = తర్జయిత.

తర్జన. సం. వి. ఆ. స్త్రీ. = తర్జనము.

తర్జనము. సం. వి. అ. న. 1. బెదరింపు, అదలుపు; 2. బెదరించుటకు చూపుడువ్రేలు లల్లలాడించుట.

తర్జని. సం. వి. ఈ. స్త్రీ. చూపుడువ్రేలు, ప్రదేశిని.

తర్జయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) బెదరించు వాఁడు, అదల్చువాఁడు.

తర్జించు. సం. స. క్రి. బెదరించు, అదల్చు. "మ. హరి సర్వాకృతులం గలం డనుచుఁ బ్రహ్లాదుండు భాషింప నత్వరుఁడై యెందును లేఁడు లేఁ డని సుతున్ దైత్యుండు దర్జింప..." భాగ. ౭. స్కం. ౨౭౭. రం. రా. ౧౮౪. పు.

తర్జితము. సం. వి. అ. న. బెదరింపు, అదలుపు. విణ (అ. ఆ. అ.) బెదరింపఁబడినది.

తర్ణకము. సం. = తర్ణము.

తర్ణము. సం. వి. అ. పుం. దూడ; అపుడు పుట్టినదూడ.

తర్పకుఁడు. సం. విణ (అ. ఆ. అ.) 1. తృప్తిపడు వాఁడు; 2. తృప్తినొందించువాఁడు.

తర్పణ. సం. వి. ఆ. స్త్రీ. = తర్పణము.

తర్పణము. సం. వి. అ. న. 1. సంతోషపెట్టుట; 2. తృప్తి; 3. పితృయజ్ఞము; 4. సమిధ. విణ. (అ. ఆ. అ.) తృప్తి కలిగించునది.

తర్పయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.)=తర్పకుఁడు

తర్పిత. సం. = తర్పయిత.

తర్పితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషపెట్టఁ బడినవాఁడు.

తర్బటము. సం. వి. అ. పుం. 1. సంవత్సరము; 2. చక్రమర్దము, తగిరసపు.

తర్షకుఁడు. సం. విణ. (అ. ర్షికా. అ.) 1. దప్పిగొను వాఁడు; 2. దప్పి కలిగించువాఁడు; 3. ఆసగొను వాఁడు; 4. ఆస కలిగించువాఁడు.

తర్షణము. సం. వి. అ. న. 1. దప్పి; 2. ఇచ్ఛ, ఆశ.

తర్షము. సం. వి. అ. పుం. 1. దప్పి; 2. ఇచ్ఛ, ఆశ; 3. సముద్రము; 4. పడవ.

తర్షయిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. దప్పి కలిగించువాఁడు; 2. ఆస కల్గించువాఁడు.

తర్షిత. సం. = తర్షయిత.

తర్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దప్పిగొన్న వాఁడు; 2. ఆశ కలవాఁడు.

తఱఁకించు. దే. స. క్రి. (తఱఁకు ధా. ప్రే.) పోఁగొట్టు. "సీ. దరహాసరుచి మెఱపై తళుకించుఁ దఱఁకించు విభుపరిహాసోక్తి వెరవుఁ బొరవు." కు. సం. ౫, ఆ. ౧౪౬.

తఱఁకు. దే. అ. క్రి. (ఈపద మొక్క కుమారసంభవమునందే కానఁబడుచున్నది) 1. పర్వు, వ్యాపించు. "గీ. ఓలిఁ దాంబూలవల్లీతమాలసాల, భాతి దఱఁకంగఁ బరిపక్వపనసపూగ, భాసురారుణ ద్యుతులు..." కు. సం. ౭. ఆ. ౫౭. కు. సం. ౫, ఆ. ౫౧; 2. తగ్గు. "ఉ. చారునిశీథినీ విమలసాంద్రసుధాకరభాతి రోదసీ, పూరితమై దినంబుల నభోమణిదీప్తిఁ దఱఁక కిమ్ముగాఁ, జేరి ఘనీభవించె ననఁ బ్లెల్లెసఁగన్ సితమేఘహంసపంక్తేరుహాకాశసంహతులు గ్రిక్కిరిసెన్ శరదాగమంబునన్." కు. సం. ౬, ఆ. ౧౧౬. కు. సం. ౭, ఆ. ౬౯. స. క్రి. వీడు, వదలు. "ఆ... ఉగ్రయోధవరులు గురిసి రురువడి శస్త్రాస్త్ర వృష్టి నమరవరులు వీకు దఱఁక." కు సం. ౧౨, ఆ. ౨౭. కు. సం. ౫, ఆ. ౬౪.

తఱక. దే. వి. 1. పొల్లుధాన్యము, "క. తఱకల చొప్పయ చాలున్, మఱచియుఁ దలపోలము దిక్కు మసలెడిపనికిన్..." భో. ౪, ఆ. ౬౧౧; 2. గఱుకుతనము, విషమత్వము. చూ. (తఱతఱకలువాఱు.)

తఱచు. దే. వి. (త. తఱుచు) (దీని కున్మధ్యముగను ప్రయోగములు కన్పట్టుచున్నవి.) 1. సాంద్రత, చిక్కన, "సీ...తూఱరానితఱచుతో నభమున భూరితరమహాంధకార మడరె." కు. సం. ౮, ఆ. ౫౭. భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౧; 2. బాహుళ్యము. "క. అఱిముఱి నడరినరథికుల, తఱచు నకు సుభద్రకొడుకు దలఁకక..." భార. భీష్మ. ౨, ఆ. ౭౭; 3. అతిశయము; "సీ శస్త్రాస్త్రములు రథ్యసారథివర్మాంగతతి నాఁటుతఱచునఁ దల్లడిలక." భార. విరా. ౪, ఆ. ౬౨. విణ. 1. సాంద్రము. "క. మెఱసి యుదయించుగ్రహములు, తఱచుగ్రుక్కిళ్లఁ శ్రేణి సేసి..." భార. విరా. ౪, ఆ. ౧౧౪. కాశీ. ౧, ఆ. ౯౩; 2. బహుళము. "క. రథములు తఱచై చెలువగు, పృథుసైన్యముతోడ..." భార. భీష్మ. ౧, ఆ. ౫౧; 3. అధికము, "క. ఉఱ వగునారుగపంటలు, గొఱియలపాడియును దఱచగు బురుషులకు..." భార. ఆర. ౪, ఆ. ౨౫౯. స్కా ౩, ఆ. ౭౪, క్రి. విణ. 1. సాంద్రముగా, "క. మెఱుఁగారు వారసమ్ములు, దఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౦; 2. అధికముగా, "క. పసిగొనుచు మేయ వచ్చిన, పసిఁ గొనుచుం గోలుపులులు బలిసెన్ నృప నీ, యసియాడు నేని యచ్చట. నసియాడం దఱచు వెఱచు నఱచుం బఱచున్." రామా. ౨, ఆ. ౧౩. ఉ. రా. ౩, ఆ. ౨౧౯; 3. ప్రాయికముగా, "మ... తఱచెందుఁ దల్లిబడికో ల్పెట్టాటయే కా మహిన్." ఆము. ౯, ఆ. ౧౩౨.

తఱచుఁదనము. దే వి. (తఱచు+తనము) సాంద్రత్వము. "ఆ. కఱకుఁదనముఁ జాలఁ దఱచుఁదనంబును...కిసలయాధర కొప్పు..." పాండు. ౩, ఆ. ౨౦౧.

తఱటు. దే. స. క్రి. కొరడాతో కొట్టు. (శ. ర.) వి. కశ, కొరడా. "వ. మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాదరించుపురుషుని నసి పత్త్రవనంబునందు యమకింకరులు తఱట్ల నడుచుచుఁ బరిహాసించుచుం బోలుసెడ..." భాగ. ౯, స్కం ౨, ఆ. ౧౪౨. ఆం. భా. ద్వి. ౧౮౮. విణ. మూర్ఖము. (శ. ర.)

తఱటుగొను. దే. స. క్రి. (తఱటు+కొను.) కశతోఁ గొట్టు. (శ. ర. బ్రా.)

తఱటుచేయు. దే. స. క్రి. (తఱటు+చేయు.) కశతోఁ గొట్టు. "ఉ. చేసిన సూతుఁడుం బదనుచేసిన రశ్మిము లామొగంబుగాఁ, జేసి బళీ యనం దఱటు చేసిననాదును బర్వ..." కళా. ౯, ఆ. ౧౭౦. పాండు. ౧, ఆ. ౧౬౩. స్కా. ౪, ఆ. ౧౧౯.

తఱతఱ. దే. వి. తత్తఱ, తొందర. (శ. ర. బ్రా.)

తఱతఱకలు. దే. వి. బ. (తఱకలు+తఱకలు) మిక్కిలి గఱుకుతనము. (చూ. తఱతఱకలువాఱు.)

తఱతఱకలువాఱు. దే. అ. క్రి. (తఱతఱకలు+పాఱు) గొగ్గియగు, నిమ్నోన్నతమగు. "క.

విఱుగుట గానక సెరయం,దఱతఱకలువాఱఁ గొంత
తడ వది గొఱికెన్... ” వేం. పంచ. ౪,
ఆ. ౫౪౦.

తఱకఱలాడు. దే. అ. క్రి. (తఱకఱలు+ఆడు.) తత్తఱపడు. వ్యవ. వాఁడామాట విని తఱకఱ లాడుచున్నాఁడు. (శ. ర.)

తఱపి. దే. వి. 1. కోడము, పిల్ల. “సీ. మెఱపులో వజ్రంపుటొఱపులో శశిరేఖతఱపులో యీ వటూత్తమునికోఱ,లు... ” పాండు. ౪, ఆ. ౨౮౭; 2. వత్సతరము, ముదురుదూడ; వత్సతరి. “గీ ఎదిరికొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె,తఱపు లను బొడ్చుచుచు...” నీలా. ౨, ఆ. ౪౩. “సీ...తఱపి నాఁగను వత్సతరి దనర్చు.” ఆం. భా. ద్వి. ౨౬౩. విశ. ముదురు. “సీ. తఱపి వెన్నెలలోనిధావళ్య మొకకొంత...” కాశీ. ౧, ఆ. ౧౨౩. భీమ. ౨, ఆ, ౪౬.

తఱపియావు. దే. వి. (తఱపి+ఆవు.) బక్కాయణి, చిరకాలముక్రితమే యీనినఆవు. “గీ. అమరు బక్కాయణి తఱపియా వనంగ.” ఆం. భా. ద్వి. ౨౬౪.

తఱలు = తరలు. 1. (చలించు) “చ. ఒఱగె వసుంధరాస్థలి మహోరగనాథుఁడుఁ గ్రుంగెఁ గూర్మముం,దఱలె...” భా. రా. యు. ౧౨౨౫; 2. (విడుచు.) “ద్వి. తఱలకు ధైర్యంబు...” ద్వి. హరిశ్చ. ఉ. ౭౬౪. పం.

తఱి. యు దే. వి. 1. సమయము; యుక్తకాలము. “క. వినుము తఱి వేచి రిపుమూఁ,పున మోవఁగ వలయుం సమయముం గనుఁగొను క్రక్కునఁ గడవ శిలాస్థలి వై,చినచాడ్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్.” భార. శాం. ౩, ఆ. ౨౭౧. భార. ఆది. ౬, ఆ. ౧౧౪. స్వా. ౨, ఆ. ౩౩; 2. అవకాశము “చ ..సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ దఱి లేమి ..” విక్ర. ౧, ఆ ౭౧. పారి ౫, ఆ. ౩౧ ; 3. అనంతరము, పిమ్మట. “ద్వి. అనుటయుఁ జంద్ర బింబాస్య సీకూర్మి,తనయుల కిద్దఱతఱిఁ బుట్టు వాఁడు” రం. రా. ఉ. ౧౮. పు; 4. త్రాడు మున్నగువానియొత్తుడువలనఁ గలిగినరేఖ. “చ... తీఁగచుట్టు సె,త్తఱు లయి యున్నపాఁప తఱి త్రాటిమలంకల...” కాశీ. ౫, ఆ. ౨౮౪.

రా. వి. ౪, ఆ. ౨౭; 5. తరంగము, అల. “చ. వఱలుజటాటవిం గుసుమవల్లరులై చదలేటినీటినె, త్తఱుల జనించుక్రొన్నురువుతండములై.....” నృసిం. పీఠి. ౪. ౫. వళులు, కడుపుమీఁదిముడుతలు, ముడుతలు. “ఉ ..ముత్తఱుల్, తగ్గక యొప్పెఁ గోమలికిఁ దత్సమయోచితయౌవనం బునన్.” సుద. ౪, ఆ. ౭౭. వసు. ౫, ఆ. ౭౫. వై. వి. (సం. తరసమ్) మాంసము. “శా. ప్రవ్వాల్ గారుచు నీచుకంపుతఱచున్ రోఁతై తఱిం బాసి...” మల్లభూ. నీతి. ౯.

తఱీఁదఱి. దే. క్రి. విశ. ద్వ్ర. పెన్వెంట. “క. తఱిఁ దఱి నిను తోనడవక, పిఱుఁదెక్కినరుచులు దమము బిట్టడరుడు ని,వ్వెఱ నిండ్లలోన డాఁగిన, తెఱగున నుద్దీపదీపదీప్తులు వెలిఁగెన్.” కు. సం. ౮, ఆ ౯౫. పద్మ. ౩, ఆ. ౨౩.

తఱిగించు. దే. స. క్రి. (తఱుగుధా. ప్రే.) తగ్గించు. “సీ. తఱిగించు బుద్ధి నిద్రామహోత్సాహక్షుధా కారతేజోబలాది సెద్ది. గీ. అట్టి చింతాజ్వరంబు నన్నలమికొనియె.” కాశీ. ౧, ఆ. ౧౧౧. చంద్రా. ౩, ఆ. ౭౨.

తఱిగివచ్చు. దే. అ. క్రి. (తఱుగు+వచ్చు) తగ్గు, “సీ. అత్యంతదుర్భిక్షమై దేశములు నొచ్చె ధారణ లెంతయుఁ దఱిగి వచ్చె.” వి. పు. ౬, ఆ. ౩౧౫.

తఱిగొను. దే. అ. క్రి. (తఱి+కొను) యత్నించు, పూను. “క. అఱువదికోటులు కపివరు,లుఱక జగత్త్రయముఁ బెలుచ నువ్వెత్తుగొనన్, తఱిగొన్న యట్లు నడవఁగ, నెఱసి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ గనియెన్.” భార. అర. ౭, ఆ. ౩౬. పారి. ౫, ఆ. ౩౧.

తఱిగొల్పు. దే. స. క్రి. (తఱిగొనుధా. ప్రే.) పూనఁ జేయు. “క. చెఱిచినది గన్న తెఱఁగున, మఱచిన తొలుబాము లెల్ల మదిఁ గని నిష్ఠన్, దఱికొల్పెడు యోగస్థితి, తెఱఁ గంతయు బుద్ధికిం బ్రతీతం బైనన్.” హరి. పూ. ౨, ఆ. ౨౨౫.

తఱిద్రొక్కు. దే. అ. క్రి. (తఱి+త్రొక్కు) (మరణకాలము) సమీపించు, “సీ తఱిద్రొక్కి యున్న యాతల్లిదండ్రులఁ జాల పఱచ వై సంతోషపఱచ వైతి.” పాండు. ౩, ఆ. ౩౬.

తఱిపి=తఱపి. (వి. ముదురుదూడ) “సీ సీల్గల కేటి లోనికి డిగ్గఁగాఁ బెద్దతఱిపి పెయ్యలఁ బట్టి నుఱిసె

నేఁడు." హరి. పూ. ౬, ఆ. ౯. (విణ. ముదురు.) "సీ. తఱిపివెన్నెలవేఁడి తలఁకించెఁ గలికి నీయధరాధరామృతం బొసనిమ్ము." కృ. శకుం. ౨, ఆ. ౧౩౩.

తఱిమించు. దే. స. క్రి. (తఱుముధా. ప్రే.) పలాయితులఁ జేయు. "సీ. ప్రతిఘటించిన నెంతబలవంతులను బటాపంచ గాఁ దఱిమించు ప్రాభవంబు" దశా. ౫, ఆ. ౪౧.

తఱిమెన. దే. వి. కత్తి లోనగువానిని నునుపుచేయుటకును, వానిమీఁద నకిషీపని చేయుటకును వడ్రంగులుపయోగించుసాధనవిశేషము. "సీ. దారునిర్మధనసాధనవిశేషము త్రోపు డనఁ దఱిమెన యన నలరు చుండు." ఆం. భా. ద్వి. ౩౦౧. కళా. ౨, ఆ. ౧౫; 2. పట్టుకాఱు, "సీ. తఱిమెన సంధించి మెఱిమిన క్రియఁ దటద్రుమకోటు లుష్మాలితములు గాఁగ." భో. ౭, ఆ. ౪౪.

తఱిమెనఁబెట్టు. దే. స. క్రి. (తఱిమెనన్ + పెట్టు.) తఱిమెనతో నునుపుచేయు, తఱిమెనతో నకిషీ పని చేయు. (శ. ర.)

తఱిమెనదొడ్డి. దే. వి. తఱిమెనఁబెట్టుట కుపయోగించుసాధనవిశేషము. (బ్రౌ.)

తఱియఁజొచ్చు. ద్వ. స. క్రి. (తఱియన్ + చొచ్చు.) 1. ప్రవేశించు. "మ. మఱియుం జీకటికొండ చంద మయినన్ మా కెల్లఁ బాతాళముం, దఱియం జొచ్చు తెఱంగు దోఁచె నవటన్..." ఉ. హరి. ౨, ఆ. ౪౯, ఉ. రా. ౪, ఆ. ౩౭; 2. దాఁటు, అతిక్రమించు. "గీ...గోపురంబు, దఱియఁ జొచ్చి మహోన్నతగరుడకేతు, రాజి నలరారు హరిహాజారంబుఁ జేరి." ఉ. రా. ౧, ఆ. ౩౧౬; 3. ఎదుర్కొను, ప్రతిఘటించు. "గీ. అతఁడు ఫల్గును నేఁబది శితశరముల, నేసి పేర్చినఁ గౌరవులెల్ల నార్వ నుఱక యాతఁడు గురునేనఁ దఱియఁ జొచ్చె." భార. భీష్మ. ౨, ఆ. ౩౭.

తఱియఁబడు. వై. అ. క్రి. (తఱియన్ + పడు) 1. ప్రవేశించు. "వ...మృగయూథము బిస యొడ్డి సంఘటించిన కానిబోనులన్ బడి బెగడక యద్దారు వీడ్చుకొని యారములఁ దఱియంబడి..." స్వా. ౪, ఆ. ౩౭; 2. తెగించు, సాహసించు. "ఉ. అట్టిద యైననాఁడ తఱియంబడి మూర్ఖతనంబు సేయరే..." భార. విరా. ౪, ఆ. ౨౩౩. (చూ. ౨౩౨.) కువల. ౨, ఆ. ౧౩౬.



యు. వై. అ. క్రి. (సం. తర్.) 1. తొలఁగు. "సీ. అది ధృతి యనుమహాప్రవమున శోభిల్లఁ దమము రజస్సును దఱియఁ ద్రోచి, కొనుచు సత్యము నూఁతగొని చొచ్చి..." భార. అను. ౪, ఆ. ౨౪౧; 2. కూడు, కలియు. "గీ. మెఱుపు మెఱసినచాడ్పునఁ దఱియఁ జొఱుము." భార. విరా. ౫, ఆ. ౧౬, స్వా. ౫, ఆ. ౭౧. స. క్రి. 1. సమీపించు. "గీ. ఇలకుఁ జనియొదునమృతాంశుకళలఁ బోలి, తఱిసి రా రామ శోకనవోద్యాన సీమ." సుక. ౫, ఆ. ౨౨, స్వా. ౨, ఆ. ౭౩; 2. దాఁటు, తరించు. "సీ. ఉగ్రంబు లైనయాయుధముల మొనలపై నుఱుకుట యంభోధిఁ దఱిసి చనుట." భార. అర. ౬, ఆ. ౧౧౧. భార. ఆది. ౧, ఆ. ౧౯; 3. ప్రవేశించు. "గీ...మధుకైటభారి, రత్నసోపానకలితమార్గముల డిగ్గి, కులసతియుఁ దాను వేలుపుఁగొలను దఱిసె." పారి. ౪, ఆ. ౨౭, వరాహ. ౧౨, ఆ. ౩౨; 4. మార్కొను. "సీ. ఆభీలమై క్రాల నడరి పాండవసేనఁ దఱిసి మందాకినీతనయుఁ డేచి." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౮. భార. విరా. ౩, ఆ. ౧౮౦; 5. పరిశీలించు, విమర్శించు. "సీ. తఱియం నథర్వవేదశిరః ప్రపంచంబు లారణ్యకముత్రోవ లరసి చూచు." కాశీ. ౨, ఆ. ౧౫౧.

తఱివడు. ద్వ. అ. క్రి. (తఱి + పడు) ఒత్తుడుపడు, నొక్కుపడు. "సీ. గూనివీపులమీఁద గోడిసై బోదెత్తి తఱివడ్డకంకాళతండములును" కాశీ. ౩, ఆ. ౧౩౯.

తఱుగరి. దే. విణ. (తఱుగు + అరి) క్రయవిక్రయములు గుదిర్చి అందులకై ప్రతిఫలముగా ద్రవ్యము గొనువాఁడు. "సీ. జట్టికాఁ డనఁగను జనుఁ గ్రేత తఱుగరి యనఁగను దత్సహాయాఖ్య యగును." ఆం. భా. తృ. ౧౧.

తఱుగాకు. దే. వి. (తఱుగు + ఆకు) కోయగూర (శ.ర.)

తఱుగు. దే. అ. క్రి. తగ్గు, క్షీణించు. "చ. తఱుగక నే మెలంగినను దామరకంటికి మోముదమ్మితో, నెఱఁ దొవరంగు బొం గిడెడునీటరి సాటి యటంచుఁ బల్కఁగా, నుఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గా దటంచుఁ దానఱపఱ లయ్యెఁ జెమ్మట నొయారపుఁగస్తురిబొట్టు మోమునన్." కాళిందీ. ౨, ఆ. ౯, ఆం. భా. తృ. ౯౬.

స. క్రి. 1. ఖండించు, కోయు. "సీ. తఱిగె నెవ్వఁడు ఖడ్గధారాంచలంబున నగ్ని చాలుక లేఁడు నంటఁ బట్టి." కాశీ. ౩, ఆ. ౩౨, హర. ౨, ఆ. ౯౨౧; 2. తొలుచు, చిల్లిపొడుచు. (చూ. తఱుపు.) వి. అమ్మెడువానికిని కొనెడివానికిని నొక సరకును వెలకుఁ గుదిర్చి వారియొద్ద ప్రతిఫలముగా నూటి కింత యని పుచ్చుకొను ద్రవ్యము. "సీ. వెల్ల మందు లమర్చి విషవైద్యత వహించి తఱుగు బేరముల నేకతయును మించి." శుక. ౩, ఆ. ౩౭౫. చంద్రా. ౪, ఆ. ౨౭౯. విణ. తఱుగరి, అమ్మెడువానికిని కొనెడువానికిని బేరము కుదిర్చి అందుకు ద్రవ్యము పుచ్చుకొనువాఁడు. "మ...తన్మధ్యన కర్పూరపటంబు లందుకొని వేడ్కం గొరక ప్ర్యూహమో, హారముక్తావళిఁ దార్చె నీ తఱుగుగా ద్బ్జాక్షి వీక్షించితే." వసు. ౩, ఆ. ౧౪౨.

తఱుచే = తఱచే. 'తఱచే' ఉన్మధ్యముగాఁ గూడఁ గలదనుట కుదాహరణములు. వి. (బాహుళ్యము). "గీ. ఉడుము గరిమిడికొక్కు దండడియు వెల్ల, యెలుక కల్లెక్కు తఱుచును నేమిచెప్ప." స్వా. ౪, ఆ. ౨౫. భీమ. ౩, ఆ. ౫౭. విణ. (సాంద్రత.) "ఆ. యోధవరుల నెల్లఁ జుఱుక తఱుచు, టంప వానఁ దడిపి..." భార. భీష్మ. ౪, ఆ. ౧౪౯. ఆము. ౨, ఆ. ౬౯. (అధికము.) "సీ. అధ్వరాధికసత్క్రియల్ ప్రవర్తింపక తెక్కలిబాడి యేదిక్కులందు, తఱుచయ్యె..." భార. శాం. ౨, ఆ. ౪౯. క్రి. విణ. (దట్టముగా.) "క. వెఱచ అవనింతకంటెం, దఱుచేగ బాణంబు లేసి..." భార. సభా. ౨, ఆ. ౩౮౫.

తఱుచేఁగన్నులవేల్పు. దే. వి. ఇంద్రుఁడు. "మ... క్రొమ్మెఱుఁగుం జెంద్రికకావిపట్టు సురభూమి జార్పితంబిచ్చె న్నాతఁ డచుగన్నులవేల్పుపట్టి వసుగోత్రామండలస్వామికిన్." వసు. ౫, ఆ. ౯౪.

తఱుపు. దే. స. క్రి. (తఱియుధా. ప్రే.) కూడఁబెట్టు. "సీ. బూసంబు దఱిపి నేర్పున నమ్మికొనుటకుఁ గఱవుఁ గోరెడుదోసకారి బుడుగ." వేం. పంచ. ౧, ఆ. ౭౬౩.

తఱుము. దే. అ. క్రి. 1. కవియు, (శత్రువులపై) పడు. "క...పాండుక్షితీశనందనులను రూపఱనేయం జేయూఁడదు, దఱుమరు నామీఁద సత్యువ్రత వారున్." భార. ఉద్యో. ౧, ఆ. ౭౪; 2. త్వరపడు, "ఆ...నే, దప్పురంబు సొత్తమని తలంచి, తఱిమి నడచితిమి లతాతన్వి యిది పడ, గొనియె మోది తెమ్ము కొంతదవ్వు." భార. విరా. ౧, ఆ. ౧౫౨. ౧, ఆ. ౧౪౭; 3. తొట్రుపడు. "క... తెఱచినకను మూయ కినునిదెస సూచుచు నే, డ్తెఱ నూర్ధ్వబాహుఁడై మతిఁ, దఱుమక శ్రుతి నొడివికొనుచుఁ దప మొనరించెన్." ఉ. రా. ౨, ఆ. ౧౯౪; 4. విజృంభించు; అతిశయించు. "స్రగ్ధర. వేదాడమ్వం స్వాబు మాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినన్ .." భార. ఉద్యో. ౧, ఆ. ౩౨౩. "సీ. ద్వాదశాదిత్యులు తఱిమి కాసిననైనఁ గల్పశతం బేల గ్రాఁగఁ దకఁడు." వాసిష్ఠ. ౨, ఆ. ౨౪౬. స. క్రి. 1. తోలుకొని పోవు. "చ...సూతుఁడు రాజు మేనఁ గ్రమ్మిన పెనుమూర్ఛఁ జూచి తఱిమెన్ వడితోడ రథంబు పీటికిన్." జై. ౪, ఆ. ౫౪, పారి. ౪, ఆ. ౬౬; 2. వెన్నాడి పరుగెత్తించు. "క...మనయోధావళి, ఱిచ్చపడియె వారి మొన దఱిమికొని వచ్చెన్." భార. ద్రో. ౧, ఆ. ౩౦౧. స్వా. ౪, ఆ. ౯౨; 3. బలాత్కరించు, నిర్బంధించు. "గీ. ఇయ్యకొనుమని తఱిమె నిట్లెంత తఱిమి, నను .." భార. అను. ౧, ఆ. ౧౩, మార్క. ౭, ఆ. ౨౭౩; 4. గెంటు, త్రోయు. "సీ. తలుపు గిఱ్ఱనకుండఁ దఱిమి కొంచెం బైనయోరవాకిట దేహ మొయ్యఁ జొనిపి." కాశీ. ౪, ఆ. ౧౨౧. హరి. ౩, ఆ. ౧౨౪; 5. పోఁగొట్టు. "గీ...సొగ సెల్లఁ దఱిమి యొడల..." నీలా. ౧, ఆ. ౧౦౩. ఆం. భా. తృ. ౧౧౯; 6. పురికొల్పు. "క. ఈరథికులు తను నిమ్మెయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను బురికొన కిచటం, గౌరవపతి డాగినగతి .." భార. శల్య. ౨, ఆ. ౩౭, శుక. ౩, ఆ. ౩౩౯; 7. కవియు, మీఁదఁబడు. "గీ. తత్ప్రపవబాణశిఖిశిఖల్ తఱుము నపుడు, మనదుకన్నీరు పన్నీరు మాన్పఁ గలదె." కకు. ౩, ఆ. ౧౨౦; 8. అధిక్షేపించు, నిందించు. "క. మునిమ్రుచ్చులార మీచేసినపని యటు గట్టి పెట్టి చేకొని యేలా, ననుఁ దఱిమితి రిఁక నేమియు, ననకుఁడు నాతోడి కొంగ లైతిరి మీరున్." ప్రభా. ౫, ఆ. ౪౦; 9. తొందరపెట్టు. "ద్వి. సరగున నింటికి జరుగు లెమ్మనుచుఁ, దనవెంట కిపు డిడు తఱుముచు నడవ." ద్వి. హరిశ్చ. ఉ. ౯౦౭. పరి; 10. (చెప్పుటయందు) ఒత్తు, నొక్కు,

"క. అని మఱియుఁ దఱిమి చెప్పఁగ..." రాఘవ. ౪, ఆ. ౧౦౪. భాగ. 3, స్కం. 3౪; 11. తఱిమెనఁబెట్టు. (శ. ర. ప్రా.) వి. 1. నిర్బంధము, బలాత్కారము. "క. తరుణులు తఱుములు పెట్టుచు, సరగునఁ దోలేర..." రాజ. చ. 3, ఆ. ౯౬; 2. త్రోపుడు. (చూ. తఱుములిడు.)

తఱుముడు. దే. వి. (తఱుము. ధా.) తఱుముట. (చూ. తఱుముడువడు.)

తఱుముడుచెండు. దే. వి. (తఱుముడు+చెండు) బాలక్రీడావిశేషము. "సీ. సిరిసింగణాపత్తి తఱుముడు చెండును, వెన్నెలకుప్పలు కన్నుకట్టు." ప్రబంధ. ౬౧3.

తఱుముడువడు. ద్వ. అ. క్రి. (తఱుముడు+పడు) తఱుమఁబడు. "క. తఱుముడువడి మే న్వడఁకన్...చావుపరువెత్తు చహో..." వేం. పంచ. ౧, ఆ. ౬౦౫.

తఱుములిడు. దే. స. క్రి. (తఱుములు+ఇడు.) త్రోయు. "వ...ఏఱులబలిమికలిమిం దొట్టి నిట్టవొడిచిన నెట్టుకొని తఱిమినం దఱుములిడి..." క్రీరం. మా. ౧, ఆ. ౧3౭.

తఱులమొకపుమెకము. ద్వ. వి. కోఁతి, వలీముఖము. "గీ...తఱుల,మొకపుమెకములపై హెచ్చరికల వెడలె." అచ్చ. యు. ౧౯౮. ఇట్లే: తఱులమోరమెకము. అచ్చ. యు. ౮౧.

తఱువు = తఱుగు. (రంధ్రముచేయు, తొలుచు) "క. కరవాఁడిసూదితుదమొన, నర దఱువంబడి ముత్తియంబునుపోలెన్..." నైష. ౮, ఆ. ౬.

తఱుసంటి. దే. విశ. (తఱుసలి అని. శ. ర. ప్రా. 'తఱుచంటి' అని వావిళ్ల పా.) 1. మూర్ఖుఁడు. "క. తఱుసంటి తన్ను నెఱిరిని, నెఱుఁగడు..." కు. సం. ౭. ఆ. ౪౯; 2. ఉద్ధతము. "ఆ. ఎల్లవారు నెఱుఁగ గొల్లనిధర్మువు, బేల నీకుఁ జెప్ప నేలవలనెఁ, జెఱుతవాని కింత తఱుసంటిపలుకులు, సన్న వృద్ధజనము లున్నచోట." భార. సభా. ౨, ఆ. ౨౨౮. (శ. ర. పా.)

తఱ్ఱి. దే. విశ. నీచుఁడు. (శ. ర. ప్రా.)

తఱ్ఱు = తఱ్ఱి. "ఉ. జుఱ్ఱెద రామనామమున జొబ్బిలుచున్నసుధారసంబు నే, జుఱ్ఱెద జుఱ్ఱు జుఱ్ఱుఁగ రుచుల్ గనువారిపదంబుఁ గూర్పవే, తఱ్ఱులతోడిపొత్తిడక..." దాశరథీశ. 3౭.

తల. సం. దే. వి. (క. తలె. త. తలై.) 1. శిరస్సు. "క...పృథివీపతి నీతలన తనకార్యఖడ్గంబుల వేఁ వెక్కించె..." భార. విరా. ౫, ఆ. ౭3. ఆం. భా. ద్వి. ౧౪౪; 2. తలవెండ్రుకలు, శిరోజములు. "క...జేపి తల పట్టి యీడ్చి తిట్టి కొలఁది రోషావేశము వతి యొందిన..." హరి. పూ. ౧, ఆ. ౧౭౨. శుక. ౨, ఆ. ౧౧౫; 3. చివర, కొన. "క. పల దీరే యిది మనకడ, నిలిచినఁ గీడొందు మనల నేఁడెక్కటిలోఁ,పలఁ జేరకున్నఁ గాలము, తలనైనను చేరు నింత తథ్యముసుండీ." కేయూర. 3, ఆ. 3౯; 4. ఎత్తు, ఉద్ది. "క. నా రొకతల యే నొకతల, యీరెండు తెలుఁగులందు నెయ్యది ప్రియము..." భార. ఉద్యో. ౧. ఆ. ౭౫; 5. నుదురు. "సీ. పాపపుదైవంబు పాసెనో మసలచు దలను వ్రాసిన వ్రాలు తప్పు డింక." శశాం. ౪, ఆ. ౨౦: 6. ధైర్యము. (చూ. తలచెడు.); 7. ముందరిభాగము, పురోభాగము. "గీ. నాఁడు సభ నాడినంతయు నేఁడు సేయఁ, బట్టు లున్నాఁడు మొనతల ననిలసుతుఁడు." భార. భీష్మ. 3, ఆ. ౭౪. జై. 3, ఆ. ౯౬; 8. మొత్తము; సమూహము. "క. ఒకఁ డొకఁడ పాండవులఁ దాఁ,కక సైన్యోపేకగాఢగతి నందఱు నొ,క్కొకతల గాఁ దలపడి వ్రాలికదంక యుడుపఁగ పలయుఁ గ్రీడయ పోలెన్." భార. శల్య. ౧, ఆ. ౧౦౦. ౨, ఆ. 3౫౨; 9. ఎడ,పట్టు. "చ...దోర్బలపరాక్రమభీకరులైనవారి నుద్ధురగతి నెట్లు మాఱ్కొని యెదో కడుఁవింతలుపుట్టె నీతలన్." మార్క. ౬, ఆ. ౧౫౦. హరి. ఉ. ౯, ఆ. 3౮; 10. సమయము, తఱి. "క. మెలఁగుదెస మెలఁగి క్రమ్మఱు, తల నొకమరి యేమఱించి దాడిమెఱయిం దోర్బలము మెఱసి పైఁబడి నాఁచలము నెఱపి పోదుమికుఁ జాటితిఁ జుండీ." నిర్వ. ౭, ఆ. 3౧; 11. కూడిక, కలయిక. (చూ. తలయగు); 12. పక్షము, వైపు. "క. ఒకతల సమస్తజగములు, నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొకతల యైనన్." భార. ఉద్యో. ౨, ఆ. 3౧౫. వాల్మీకి. ౨, ఆ. ౧౨౨; 13. అందు అను సప్తమీవిభక్తిప్రత్యయార్థముఁ దెల్పును. "క. మానిత మగుగుదరసమున, మానినతుండీరఫలమొ యొగి తేకొతల్పు

స్నాని మృదు వైనపవడమ్ము,నా నద్రిజతోప్ప మోవి నయమై యొప్పున్." కు. సం. ౩, ఆ. ౬౨. ఉ. హరి. ౫, ఆ. ౨౯౨; 14. (ఎవరి మట్టుకువారు ప్రత్యేకము అనుఅర్థమును షష్ఠీ విభక్తితోఁ గూడి యిచ్చును.) "గీ. మఱియుఁ దలకొకమాటగా మానినాథ,తాళు మన సద్దసేయక తగసి..." చంద్ర. ౩, ఆ. ౧౯; 15. ఒకవిధ మగు జలాశయము. "క...కో,నేఱు బుగ్గ వాఁగు దోన తల,పరిగుండము కాల్వ డిగ్గి బావి దొరు వులన్." హంస. ౪, ఆ. ౨౧౦; 16. కొన్ని ధాతువులమీఁద భావార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:—పట్టుదల, పాఱుదల. మొ.; 17. కొన్ని విశేషణములమీఁద వచ్చు తద్ధితప్రత్యయము. ఉదా.:— కొత్తల. విణ. మొదటివాఁడు, ముఖ్యుఁడు. "గీ. అతిరథుల కెల్లఁ దల దండ్రి యట్టివాఁడ, యసురవిభుఁడు ఘటోత్కచుండు." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬౭. వై. వి. (సం. తలమ్.) చోటు, ప్రదేశము. "ఉ...పంగజగతీ పతి యొక్కనకుంజరంబుఁ బెల్లెత్తి యుదగ్రకుంభ దళనోద్ధతకేళి యొనర్పఁగా నతం, డత్తల దాఁటి యొంతయుం భయాతురుఁడై తొలఁగంగఁ బాఱి నన్." హరి. ఉ. ౩, ఆ. ౧౨౪. భార. భీష్మ. ౨, ఆ. ౨౫౯.

తలంటు. దే. అ. క్రి. (తల+అంటు.) అభ్యంగమునకై తలమీఁద నూనెపెట్టి రాచు. "మ .. అయ్యబ్జుఁడు శేషన్ బెడ్డపీఁట న్వసించె లతా తన్వి తలంటి నల్గిడఁగ సుస్మేరాననాంభోజుఁ డై." ఇందు. ౫, ఆ. ౨౪. వి. అభ్యంగము, తలమీఁద నూనెపెట్టి రాచుట. "వ...పండువతలంటుఁకు నింటికిం దెచ్చు..." ఆము. ౪, ఆ. ౧౯౭.

తలఁకాడు. దే. అ. క్రి. (తలఁకు+ఆడు.) చలించు, తొనఁకు. "క. సురనది దలఁకాడ సుధా, కరరేఖ చలింప..." కు. సం. ౯. ఆ. ౩౫.

తలఁకించు. దే. స. క్రి. (తలఁకు. ధా. ప్రే.) 1. భయపెట్టు. 'సీ. ఘను లైన మనుజవాహను లైన దలఁకించు నార్యాభిజను లైన యర్యజనులు." కృ. శతం. ౧, ఆ. ౫. హరిశ్చ. ౨, ఆ. ౪౧.

తలఁకు. దే. అ. క్రి. 1. కంపించు, వణఁకు. "అప్పు డసున బాణాసురుఁ, డప్పటి కప్పటికిఁ దలఁకె నధికభయమునన్." ఉ. హరి. ౬, ఆ. ౨౦౫. కేయూర. ౩, ఆ. ౧౨; 2. కలఁగు, క్షోభపడు. "గీ. పోవు టనుచిత మెప్పుడు పౌరకునికి, యేమి సేయుదు నని యాతఁ డిచ్చఁ దలఁకె." కాశీ. ౬, ఆ. ౧౦. విప్ర. ౫, ఆ. ౫; 3. జంకు, వెనుదీయు. "క. కురునృప విను సంసారము, దరి ద్రోక్కినవార మింకఁ దలఁకెదమే సం,గరమునకు..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬; 4. సంకోచించు, అనుమానించు. "వ...పరమదయాపరుం డైన పాండవాగ్రజు మఱువు సొచ్చి బ్రదుకం దను మంతలంతలు దప్పులు సేసితి మని తలంక వలవ దెంతలు సేసినను గాంగేయపూర్వజుండు శాంతిసుధానిధి యగుటం జేసి శరణు సొచ్చినం గాచు..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౭౪; 5. విచారించు, దుఃఖించు. "గీ. సమర మొనరించినంతనే చావు రాదు, పాఱిపోయిన యంతనే బ్రదుకు రాదు, జీవితంబును మరణంబు దైవకల్పితములు వానికి ముద మందఁ దలఁక వలదు." మార్క. ౧, ఆ. ౫౪; 6. భయపడు, వెఱచు. "చ. పులిఁ బొడగన్న లేళ్లగమి వోలె సుయోధను నగ్రసైనికుల్, దలఁకి కలంగి నివ్వెఱఁగు దన్కనఁ జేష్టలు దక్క చిత్రరూ,పుల క్రియ నుండిరి..." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౭. రం. రా. అర. ౧౫౯. పు; 7. బాధపడు, శ్రమనొందు. "సీ. మనుపోఁకుమూఁకల మోవ నోపక నేలచేడియ తలఁకి జేజేలఁ గూడి." నీలా. ౧, ఆ. ౭౦. శుక. ౨, ఆ. ౧౭౩; 8. చెదరిపోవు, విరియు. "క...తిమిరోత్కరంబు త,లంకె రఁచ్ఛవియు దివిఁ దొలంకెఁ గడంకన్." బహు. ౨, ఆ. ౧౦; 9. తొనఁకు, పైకిఁ బ్రసరించు. "మ...కన్గోనలం దలఁకెన్ సమ్మదవారి..." కు. సం. ౫, ఆ. ౩౦. నిర్వ. ౬, ఆ. ౫౪. వి. 1. భయము, వెఱపు. "క. క్షోణీవల్లభ విను మేఁ, బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా, ద్రోణునకుఁ గాదు సగణ,స్థాణున కైనను వశంబె తలఁకేమిటికిన్." భార. ద్రో. ౧, ఆ. ౧౨౦. భార. విరా. ౨, ఆ. ౧౦౬; 2. సందేహము. "ఉ... మోక్షముం,బొందినవీరిభక్తిఁ గృతపుణ్యు లెఱుంగ బ్రతిష్ఠ సేయుఁ డీ,శుం దలఁకెల్ల మాని యనుచుం జని రందఱు వారు నంతటన్." కాశీ. ౪, ఆ. ౧౩౪; 3. దుఃఖము; విచారము. "క. పిలిచి

ప్రతివచన మొసవమిఁ,గళవళమున నిల్లు సొచ్చి కానసచరు న,స్నెలవుసఁ గానక వైశ్యుఁడు, నలుమూలలు వెదకి నెమ్మనము దలఁకొందెన్." కాశీ. ౫, ఆ. ౬౬; 4. చాంచల్యము. "చ. తలఁకఱ నిల్చి కాంత మెదఁ దాల్చి...భక్తిఁ దలంచిన ముక్తి చేకుఱున్" కు. సం. ౬, ఆ. ౭౦.

తలఁకుఁబాటు. దే. వి. (తలఁకు+పాటు) కలఁత. "చ. పదములఁ బట్టినం దలఁకుఁబాటొకయింతయు లేక కరారతన్, మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంకఘట్టనం, జెదరఁగఁ జిమ్మె నమ్మకరి చిప్పలు పాదులు దప్ప నొప్పఁగన్..." భాగ. ౮. స్కం. ౫౩.

తలఁకొత్తు. దే. అ. క్రి. (తలఁకు+ఒత్తు) సందేహించు. "క. చిత్తము నీకుఁ బ్రసాదా,యత్తంబై యున్న దేని యడిగెద విను రా,జోత్తమ యొక్కటి నిటుఁ దలఁకొత్తక యని సేయు మనుడు నుర్వీశుండున్." మార్క. ౫, ఆ. ౨౦౭.

తలఁగఁబడు. ద్వ. అ. క్రి. (తలఁగన్+పడు - స్వార్థమున) వెనుదీయు, మరలు. "క. తనదుగుడారము దాఁకను, గనుకని తలఁగఁబడి పచ్చునుసనిజసేనం, గనుఁగొని యోడకుఁ డోడకుఁ, డనుచున్..." కళా. ౮. ఆ. ౫౦.

తలఁగఁబెట్టు. దే. స. క్రి. (తలఁగన్+పెట్టు)తొలఁగునట్లు చేయు. "సీ. తనకేవఁ గనుపట్టుధరణీధ్రములగిట్టు నెలసి కొమ్మునఁ గొట్టుఁ దలఁగఁబెట్టు." దశా. ౧, ఆ. ౨౦౬.

తలఁగించు. దే. స. క్రి. (తలఁగుధా. ప్రే.) 1. పోఁగొట్టు. "సీ. ద్రౌపదిబన్నంబు దలఁగించె నెవ్వఁడాదీనమందారుండు దిక్కు నాకు." పాండు. ౫, ఆ. ౧౩౯. పద్మ. 3, ఆ. ౯౪; 2. తప్పించు. "శా. సామీ దేవరవంటి వీరపురుషుల్ సైతంబు నెల్లప్పుడున్, సాముల్ సేయుట వైరిపోటు దలఁగించన్..." చంద్రా. ౨, ఆ. ౫౩.

తలఁగు. దే. అ. క్రి. (దీనికిఁ బ్రార్థనాద్యర్థమందు 'తలము' తలఁడు' అనురూపములును, ఈయర్థమందే ఆమ్రేడితమున తలతల, తలతలము, తలతలఁడు, 'తలఁడు తలఁడు' అనురూపములును వచ్చును.) 1. పోవు. "క. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడున్, దలరి..." భార. అర. ౨, ఆ. ౬౪. పాండు. 3, ఆ. ౧౮3; 2. తొలఁగు, అపసరిల్లు. "ఆ. క్షత్రబంధుఁ డనఁగఁ గలఁ డొక్కనరపతి, యతఁడు మాలవాని నధికదుఃఖు, భూరిఁ గాంచెఁ గాలిఁ బఱచుచుఁ ప్రక్షేత్ర, తలము రేణుశ్రసకుఁ దలఁగి చనఁగ." భార. అను. ౪, ఆ. ౪౬. స్కా. ౬, ఆ. ౭౯, భో. ౪, ఆ. ౨౭౬. భాగ. ౮, స్కం. ౨౧౭. సా. ౨, ఆ. ౨౭౭. పి. శకు. ౨, ఆ. ౧3౧; 3. అంతర్ధానమగు, కనఁబడకుండు. "క. ఏ నిందెవ్వఁడ నయినం,గాంచ గనులార పరమకారుణికుండన్, మానసబంధుఁడ నిత్యధ్యానము మీకొనఁగవలసి తలఁగితిఁ జుండీ." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౭౯ స. క్రి. 1. విడుచు, త్యజించు. "క...పురుషునకుం దగదు కొంచము దలఁగంగన్." కాశీ. ౫ ఆ ౧౯౮. భాగ. 3, స్కం 3౧౭; 2. పోఁగొట్టు, తొలఁగించు. "క. తనుఁ దలఁచినవారలబం,ధనముల విడఁజేయుచు క్రి తలిదం డ్రులబం, ధనములఁ దలఁగుట చిత్రమె..." సాంబో. ౧, ఆ. ౧౨౭. భార. అర. 3, ఆ. ౬౮.

తలఁగుడు. దే. వి. (తలఁగుధా) తొలఁగుట. "సీ. తొలఁగు డనంగను దలఁగు డనంగను నపసరణాఖ్యలై యలరుచుండు." ఆం. భా. ద్వి. ౨౨౪.

తలఁచు. దే. అ. క్రి. 1. వివేచించు, యుక్తాయుక్త విచారణ చేయు. "క. మతిఁ దలఁపక నాపుత్త్రకు, నతిబాలకు నపరాధు నడిచిరి పెలుచన్." భార. ఆది. ౧, ఆ. ౮౪; 2. విచారించు, యోజించు. "చ...అది మాయ యనాటకుఁ దలంపఁ దదీయము యూరపించితికా, భ్రమణమె సాక్షి..." ఆము. ౨, ఆ. ౬౪. విక్ర. ౧, ఆ. ౨౮. స. క్రి. 1. ఎంచు, పరిగణించు. "క. తన్నుఁ దనతమ్ములను నా, కన్నకొడుకులట్ల తలఁతుఁ గాని విభేదం, బెన్నఁడు నామది లేమికి..." భార. ఉద్యో. 3, ఆ. ౧౯3; 2. చేయు. "చ...ఇట్టితలఁ పాత్మఁ దలంపక..." ఆము. ౫, ఆ. ౪౯; 3. స్మరించు, జ్ఞప్తికిఁ దెచ్చుకొను. "చ. తనునుదువుల్ దలంచుకొని తా నిటు లంచుఁ దలంచె నెంతయున్." ఉ. రా. ౨, ఆ. ౨౦౪. భార. విరా. ౨, ఆ. ౨౦౨; 4. స్తుతించు, పొగడు. "తరలము...దుర్భరతపోవిభవాధికున్ గురుపద్యవిద్యుకు నాద్యుసం,బురుహాగర్భనిభుం బ్రచేతసుపుత్త్రు భక్తిఁ

దలంచుచున్." భార. ఆది. ౧, ఆ. ౨౧; నీలా. ౧, ౮; 5. ధ్యానించు. "క...పొలుపుగ ధర్మం, దలఁపుము మఱి యాతఁడె వేల్పులలోపలఁ బెద్ద ధర్మువైన సత్యమునన్." భార. ఆది. ౫, ఆ. ౯౨. భార. అర. ౪, ఆ. ౨౨౬; 6. ప్రస్తావించు, ప్రసంగించు. 'చ...ఆమ్మతకంపు వేలుపుం బకసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్." పారి. ౧, ఆ. ౮౪; 7. లక్ష్యముచేయు, పాటించు. "క. అరదము వెడఁదనె యుండియుఁ, బసిరపర్తులను నీడపట్టై నిలిచెన్, ధరపై నున్న తులఁనిజాతురతఁ దలంపుమఱె యాశ్రితులఁ బ్రోచు నెడన్." కవిక. ౨, ఆ. ౯౮; 8. కోరు. "చ...ప్రజకోర్కులిచ్చుతన కాత్మఁ దలంచిన యబ్బచే యనన్." ఆము. ౫, ఆ. ౧౪౨. వసు. ౪, ఆ. ౧౩౫; 9. తెలిసికొను, ఎఱుఁగు. "చ. పలుకఁ దలంప దవ్వ లగుభారతరామకథార్థముల్..." కళా. పీఠి. ౬, భార. ఉద్యో. ౧, ఆ. ౧౧.

తలఁదన్ను. దే.స. క్రి. (తలన్+తన్ను) 1. తలమీఁదఁ దన్ను. "మ...తాడిపన్నెడు వానిఁ దలఁదన్నువాఁడు గలఁ డన్వేషింప నం చెంచితిన్." కళా. ౨, ఆ. ౮౭; 2. మీఱు, అతిక్రమించు. "గీ. పుట్టినప్పుడె జవ్వనంబును సమస్త, భామినీకోటిఁ దలదన్ను పాటిచెలువు, గలిగె దీనికి..." శుక. ౩, ఆ. ౬౭. బిల్హ. ౨, ఆ. ౧౬౦.

తలఁపించు. దే.స. క్రి. (తలచు ధా. ప్రే.) 1. స్మరింపఁజేయు, జ్ఞప్తికి దెచ్చుకొనునట్లు చేయు. 'క. మఱచినఁ దలఁపింపఁగ నగు, నెఱుఁగనివాఁ డెల్లపాటు నెఱిఁగింపఁ దగున్." భార. ఆది. ౪, ఆ. ౭౧. భార. శల్య. ౨, ఆ. ౩౯౬; 2. తెలియఁబఱచు. "మ...విహారవిపినశ్రేణివిభాగంబునన్ గలపుంస్కోకిలకంఠ కోమలకుహూకారప్రపంచంబుతోఁ, దలఁపించెన్ రతికాంతమూలరథినీధాటీ సమారంభమున్." భీమ. ౫, ఆ. ౯౮.

తలఁపు. దే. వి. (తలఁచు. ధా.) 1. అభిప్రాయము. "గీ. అధిప యోగీశ్వరేశ్వరుం డైనకృష్ణుఁడును ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెచట, నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు, భూతినిత్యంబు లగు నిది నాతలంపు." భార. భీష్మ. ౧, ఆ. ౨౩౦. భార. శాం. ౫, ఆ. ౧౯౩; 2. కోరిక, వాంఛ. "గీ. ఆత్మమూర్త్యంతరం బైనయగ్నిదేవు, నర్చనము చేసి నియతి నయ్యష్టమూర్తి, బహుతపోవ్రత నియమైకఫలవిధాత, తలఁపుచేసెను మది నొక్క తలఁపుఁ జేసి." హర. 3, ఆ. 33. భార. విరా. ౧, ఆ. ౧౮౭; 3. మోహము, వలపు. "గీ. సౌంభపురవల్లభుం డైన సాళ్వమీఁదఁ, దలఁపు గలదు నా కతఁడును దగులు గలిగి, యుండె..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౭౫. నీలా. ౨, ఆ. ౩౧; 4. చింత, ఆలోచనము. "క్రీ. తలఁపులసందడి దొలఁగించిన తాల్మి కరలుశిరశ్కంపగతుల మెఱయ." భార. అర. ౭, ఆ. ౨౮, ఆము. ౫, ఆ. ౪౯; 5. ఎంచుట, అనుకొనుట. "గీ. మనము గాండీవిఁ బంపుద మని తలంపఁ, దలఁపులోనన వచ్చె నదక్షణంబ... వాసుదేవుఁ డనఘు." జై. ౧, ఆ. ౧౧౬; 6. ధ్యానము. (చూ. తలఁపుచేయు.); 7. మనస్సు, హృదయము. "క. ఓతల్లి కొడవ యొక్కటి, నాతలఁపునఁ దోఁచినది వినన్ వలయు గుణా, న్వితుండు గాసుతుఁడు ప్రసూతుం డగునట్టు యకాలసురతక్రియలన్." కళా. ౪, ఆ. ౧౩౧. ఉ. హరి. ౪ ఆ. ౧౩౮; 8. తెలివి. "సీ. అధరపల్లవ మాన నంగంబు మఱచు దంతక్షతంబునఁ గొంత తలఁపు గలుగు." కాశీ. ౨, ఆ. ౨౦; 9. జాగరూకత, హెచ్చరిక. "క. అలు పైనను బగ తుని దెసఁ, దలఁపు గలుగ వలయు." భార. విరా. 3, ఆ. ౧౦౭.

తలఁపుమాలి. దే.వి. (తలఁపు+మాలు+ఇ) భావజుఁడు, మన్మథుఁడు. "సీ. తలఁపుమాలి మరుండు వలఱేఁడు చిలుకరౌతు మనిచెలి గాడ్పుటరదపు దొర. గీ...మదనాఖ్య లమరు సాంబ." సాం. ని. దేవ. ౮.

తలఁపుచేయు. దే. అ. క్రి. (తలఁపు+చేయు.) ఎంచు, భావించు. "ఆ...ఆతని, తలఁపుఁ దెలిసి తగులఁ దలఁపుచేసె." వి. పు. ౬, ఆ. ౧౮. (శ. ర. పా.) స. క్రి. 1. ధ్యానించు. "గీ. ఆత్మమూర్త్యంతరం బైనయగ్నిదేవు, నర్చనముచేసి నియతి నయ్యష్టమూర్తి, బహుతపోవ్రత నియమైకఫలవిధాత, తలఁపుచేసెను మది నొక్కతలఁపుఁ జేసి." హర. 3, ఆ. 33; 2. జ్ఞప్తికి దెచ్చు. "క. ముంగొలు మొలకవెన్నెల,లం గలఁగంబడుతమంబులం గలగ గనోత్సంగము గంగాయమునా, సంగమముం దలఁపుచేసె సజలాకృతియై." కవిక. ౪, ఆ. ౧౨౮,

తలఁపునఁబాఱు. దే. అ. క్రి. (తలపునన్+పాఱు.) జ్ఞప్తికి వచ్చు. "గీ. నందనమ్మునకును వజ్రసాధ సైన్యుఁడపుడు చేసినకష్టపాటుజ్ఞప్తి, యపుడుఁ దలఁపునఁబాఱినవ్యాప్తియమునను, నధికతర మైన పరితాప మూనహిల్లె" ప్రభా. ౧, ఆ. ౯౩. పాం. పీఠి. ౨౦.

తలపుమానికము. ద్వి. వి. (తలఁపు+మానికము.) చింతామణి. పాం. ని. దేవ. ౧౮.

తలఁపురాయి. దే. వి. (తలఁపు+రాయి) చింతామణి. "సీ. కొలుచువారలపాలిటి తలఁపురాయి, రావణానుజపాయి శ్రీరంగశాయి." వాల్మీకి. ౨, ఆ. ౩౧. రామా. ౫, ఆ. ౧౮౭. ఇట్లే: తలఁపుకెంపు, తలఁపుమిన్న, తలఁపురతనము, తలఁపుఱాయి. మొ.

తలఁపువాఱు. దే. అ. క్రి. (తలఁపు ను పాఱు.) జ్ఞప్తికి వచ్చు. "క. దీపితముక్తాహారముఁ, బాపినపోషంబు తలఁపువాఱినఁ బశ్చాత్తాపమున నొ్ర..." కవిక. ౬, ఆ. ౨౮.

తలఁపుసాకి. = తలపుసాక్షి. (శ. ర.)

తలఁపుసాక్షి. మి. విశే. (తలఁపు+సాక్షి.) స్వాంత సాక్షి, ఈసంగతి నీ వెఱిఁగినదేకదా జ్ఞప్తికిఁ దెచ్చుకొ మ్మని యడుగఁబడుసాక్షి. "సీ. మఱచక యీయర్థ మెఱుఁగు మీ వని యప్తు తలఁచింపఁ బడువాఁడు తలఁపుసాక్షి." విజ్ఞా. వ్యవ. ౧౦౦.

తలఁబ్రాలు. దే. వి. బ. (తలన్+ప్రాలు.) వివాహ కాలమున దోసిళ్లతో వధూవరు లొకరితలపై నొకరు పోసికొను సాధుబియ్యము. "మ .. నాథునిమౌళిన్ దలఁబ్రాలు పోసె నవలా..." స్వా. ౫, ఆ. ౮౪. దశా. ౭, ఆ. ౧౮౨.

తలకట్టు. దే. వి. 1. జుట్టు, శిరోజములు. "సీ. పవడంపుజొత్తులఁ జెవులపై వడఁగంగఁ బాపటఁ దలకట్టుభంగి గప్ప." భార. విరా. ౧, ఆ. ౨౩౮. భార. ద్రో. ౨, ఆ. ౧౩౦.; 2. కిరీటము. "సీ .. కిరీటమ్ము వెలయు, దలకట్టు నాఁగను." ఆం. భా. ద్వి. ౧౪౭.; 3. పాగచుట్టుట. (శ.ర.); 4. పాగ. (శ. ర.); 5. హల్లుమీఁదఁ జేర్చు 'అ' కారచిహ్నము, అకారము. "సీ. పట్టె వట్రువయును బరిపుష్టి తలకట్టు గుడిసున్న కియ్యము సుడియుఁ ముడియుఁ. గీ. కీలుకొన వ్రాయసంబులు వ్రాయ వ్రాయ." పాండు. ౧, ఆ. ౭౧. అప్ప: ౩, ఆ. ౪౫.; 6. స్థానము. "చ... భూతలమున కెక్కినవాఁడఁ దానె తలకట్టున నైనభారము, దక్కలమున చెల్లె..." రామా. ౭, ఆ. ౨౧౩. విశే. ముఖ్యము. "సీ. నన్ను బ్రతికించుటయు నీకునైపుణములు, చెల్లఁ దలకట్టు ..." హరి. ఉ. ౭, ఆ. ౧౪౪. ఆం. సం. స్థా. ౭౭.

తలకడచు. దే. అ. క్రి. (తల+కడచు.) (సంతోష ముచే) పైకిలేచు ఎగయు. "క... నరమహేం, ద్రజ మిత్రార్జున యంచును, భుజములు దలకడవ రాకపోకలఁ జేయన్." భాగ. ౧, స్కం. ౩౭౦. అ. క్రి. స. క్రి. దాఁటు, కడచిపోవు. "క. అమ్ముఖమున సమరము రౌద్రమ్ము పెచె మద్ర విభునిఁ దలకడచి యనీకమ్ము బహులాస్త్రశస్త్రచ, యమ్ముల ధర్మజుని బొదివె నత్యుగ్రమునన్." భార. శల్య. ౧, ఆ. ౨౪౩. "వ .. ఇట్లుభయ సైన్యంబులు...తలపడియు నట్టిసమయంబున. క. తలకడచి నడచుద్రోణుని, యలవుఁ జలంబును సహింపక " భార. భీష్మ. ౨ ఆ. ౩౪౪, ౩౪౫. స. క్రి. ఉల్లంఘించు, మీఱు. "వ... ఇవ్విధంబున సంమోహకటుకుం డాయోధనంబు విడిచి యోధధర్మంబుఁ దలకడచి పాఱిన..." ఉ. రా. ౩, ఆ. ౨౨.

తలకప్ప. దే. వి. జలజంతువిశేషము. (నీరుడుము, జలగోధిక అని బ్రౌ.) "సీ. నీరుకుమ్మరపురువు నీరుఁగ తలకప్ప .." హంస. ౪, ఆ. ౧౮౬.

తలకము. సం. వి. అ. న. కొలను.

తలకాఁడి. దే. వి. బరు వధికమై రెండెద్దులకంటె హెచ్చుగా కట్టవలసినప్పుడు సంతనచేసి మొదటి కాఁడికిముందుఁ గట్టెడిమఱొక కాఁడి, ప్రాసంగము. (శ. ర.)

తలకాయ. దే వి. తల,శిరము. "చ. పులుల వధించుఁ ద్రుంచుఁ గురుపోతుల దుప్పులఁ జప్పరించు మృన్నులఁ బడఁదన్నుఁ బందులఁ దినున్ దలకాయలఁ జీల్చు దంతులన్." సుద. ౩, ఆ. ౧౫౫. వరాహ. ౧౧, ఆ. ౫౭.

తలకుమీఱు. దే. అ. క్రి. (తలకున్+మీఱు.) అతిశయించు, మిక్కుటమగు. "సీ. భీతిఁ బాఱెడి పురుహూతు వెన్కొని బాడుదలఁ బట్టె దర్పంబు దలకుమీఱ." నృసిం. ౨, ఆ. ౧౧౬.

తలకూడు. దే. అ. క్రి. (తల+కూడు). 1. సిద్ధించు, నెఱవేఱు. "ఉ...నా కోరినకోర్కి నేఁడు దల కూడె నరేశ్వర..." భార. అర. ౭, ఆ. ౩౧౬. భార. భీష్మ. 3, ఆ. ౭౪.; 2. ఫలితమిచ్చు. ఫలించు. "ద్వి. వనజభవుఁడు మెచ్చి వర మిచ్చు వేళ, నరుల చన్నక యున్న నాఁటికత పెల్ల, దరమిడి నేఁడిదే తలకూడె నీకు." రం. రా. యు. ౩౭౧. పు.; 3. లభించు. (చూ. తలకూర్చు.)

తలకూర్చు. దే. స. క్రి. (తలకూడు. ధా. ప్రే.) నెఱవేర్చు. "ద్వి. అంతయుఁ బ్రార్థింప నట్లకా కనుచుఁ, బలికెఁ బోఁకునఁ గాని భామినికోర్కి, తలకూర్ప లేక తద్దయు నున్నవాఁడు." రం. రా. ఉ. ౨౦. పు.; 2. లభింపఁజేయు, సమకూర్చు. "సీ. తగినసాహాయ్యంబు దలకూర్చుకొని పగ సాధింపవలయు నుత్సాహలీల." నా. పంచ. ౧, ఆ. ౨౩౪.

తలకెక్కు. దే. అ. క్రి. (తలకున్+ఎక్కు.) 1. నెత్తికెక్కు.(ఇది యవజ్ఞను గర్వమును సూచించును.) "సీ. కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ దలకెక్కఁజాలెనే హాలహాలంబు." వసు. ౪, ఆ. ౭౯. "చ. శివుఁ డిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి తుగ్రవై,భవమునఁ జూచుచో నడుగు వట్టితివి..."విజ. 3, ఆ. ౫౧.; 2. అతిశయించు. వర్ధిల్లు. "సీ. రోహిణి రూపరేఖావిశేషంబున హెచ్చు నచ్చామమీఁది, వలపులు తలకెక్కి కల నైనఁ దమవంకఁ గడకంటఁ జూడమిఁ గడమ సతులు. గీ. విరహితాపభరంబున వేఁగి వేఁగి." వరాహ. ౬, ఆ. ౪౫.; 3. కలుగు. "గీ. అదియుఁ దల్లికి జనియించినది మొదలుగ, సంగమాపేక్ష తలకెక్కి చాలఁ దివురు." హంస. ౪, ఆ. ౧౮౭; 4. బోధపడు. (వ్యవ: నే నెంత బోధించినను వ నికి పాఠము దలకెక్క లేదు.)

తలకెడవు. దే. విణ. (తల+కెడవు.) తలక్రిందయినది. "ఆ. శకటుతలఁ బెఱింగి చయ్యన నాలోనఁ, జరణ మొకటి లీలఁ జాఁచి తాఁచెఁ,దత్క్షణంబ పంది తలకెడవై పాసి,యవ్వలనందు వెడలి యవనిఁ జెదర." హరి. పూ. ౫, ఆ. ౧౭౬. ఉ. హరి. ౧, ఆ. ౫౩.

తలకెడవువడు. ద్వ. అ. క్రి. (తలకెడవు+పడు.) తలక్రిందగు. "క. ఏ మిచటఁ నాడుచుండం,గా మీకృష్ణుండు తనదుకాలుకడఁకతోఁ,నే మీఁది కెత్తి తాఁచిన,నీమెయిఁ దలకెడవువడియె నిబ్బండి వెసన్." హరి. పూ. ౫, ఆ. ౧౮౭.

తలకొట్లమారి. దే. విణ. (తల+కొట్లు+మారి.) 1. శిరశ్ఛేదనము నొందినవాఁడు. (శ. ర.); 2. దుష్టుఁడు; అవినీతుఁడు. "గీ. నందనందనుఁ డబ్బెసా సమవిధాన,ములను దక్కినచందానఁ జెలఁగుఁ జిత్తమామనోహరుఁ బాసి నేఁ దడల వ్రాసె,నౌర తల వ్రాఁత తలకొట్లమారి ధాత." రాధికా. ౨, ఆ. ౬౬.

తలకొట్లమారితనము. ద్వ. వి. (తలకొట్లమారి+తనము.) దౌష్ట్యము, అవినీతి. "సీ. బట్టకూర్చుతనానఁ బుట్టచెండ్లగరీని మఱచెనో తలకొట్లమారితనము." శశాం. 3, ఆ. ౩౭.

తలకొను. దే. అ. క్రి. (తల+కొను) 1. కలుగు, జనించు. "చ. కలకొని సంగమంబున జనించును గామము కామవృద్ధిచేఁ, దలకొనుఁ గ్రోధము..." శేష. ౧, ఆ. (శ. ర.) భార. శాం. ౧, ఆ. ౬౯; 2. యత్నించు. "క. అలజడియె కాక నీ కే, నిలుకడ నొకమేలు కలదె నిజము వినుము మా, పలుకులు సంతతిఁ బడయం, దలకొను మొక తెఱఁగు దైత్యదర్పధ్వంసీ." భార. ద్రో. ౧, ఆ. ౩౪౩; 3. ఉండు. ద్వి. తలఁపులోఁ బాయక దలకొన్నయలుకు, దలుపుచుఁ జంద్రమతీదేవి పలికె." ద్వి. హరిశ్చ. పూ. ౧౧౧౩. పం. హంస. ౪, ఆ. ౨౧౩; 4. తలయందుండు. "క. ఓయి నెఱజాణ తలకొనఁ, జేయుంము విరు లివె జవాది చెయిఁ బట్టుము..." సా. ౨, ఆ. ౧౩; 5. ప్రకాశించు. "సీ. దంతమౌక్తికరుచి దలకొనమఱు మాట పలికినఁ గాదె యుత్పలదళాక్షి." భార. విరా. ౨, ఆ. ౪౫; 6. రేఁగు,రెచ్చు. "క. పోరిఁ బోరి నెగయుచు మ్రొగ్గుచు, ధరణీస్థలిఁ బొరలఁ బడుచుఁ దలకొని శిక్షం, బోరసినవయ్యుహాయం బులు, భరియింపవు కొంతతడవు పల్యాణంబుల్." పారి. ౪. ఆ. ౬౮. రం. రా. 3, కిష్కి. ౨౦౬. పు. స. క్రి. 1. తాల్చు, వహించు. "క. ఇల నీకై కొన్న తెఱఁగు, తలఁపఁగ ధర్మంబో కాదొ దైవ మెఱుంగున్, వలవనిచింత యుండిగి ధృతి, దలకొని పాలింపు యజ్ఞదత్తుఁడ పగుచున్." భార. శాం. ౧, ఆ. ౧౧౩. భార. కర్ణ. ౧, ఆ.

౧౩౭; 2. శిరసావహించు. "ఆ. తండ్రియాజ్ఞ నేను దలఁకొని రాజ్యంబు, విడిచి యిట్లు వైశ్య వృత్తి నున్న, వాఁడ..." మార్క. ౭, ఆ. ౫౩; 3. అంగీకరించు. "క. నరపతితముగఁ బ్రాప్తించితి, ధరఁ బుట్టుం డనుచు దానిఁ దలఁకొనిరి నయన్." భార. భీష్మ. ౨, ఆ. ౨౭౧. భార. ద్రో. ౧, ఆ. 383; 4. అవలంబించు. "క. కుల మెంచ రాఁడి కోల్లదు, వలఁకరు పడి వావి వరుస వలఁపరు నీతిన్, దలఁకొనరు సత్యమాడరు, కలకంఠులు వారి నమ్మఁగా నెటు వచ్చున్." హంస. ౫, ఆ. ౨౬౭.

తలకొనునెంచు. దే. అ. క్రి. (తలకొను+ఎంచు—స్వార్థమున) కలుగు, సంభవించు. "క...బలి, బలితంబు లయ్యె వగరును, వలయేరుచు నుక్కి నయును దలకొనుదెంచెన్." భార. ఆది. 3, ఆ. ౧౯౧.

తలకోలు. దే. వి. (తల+కోలు) 1. శయనావసానము చేయునపుడు తల యందుంచుకొను కోలు. "ద్వి. కొంత యొల్కులలోనఁ బొడవుకోలు, కొంత చిక్కిన కడకోలుపులు దెచ్చి,కుఱుప్రొగుగా నిడి కొడుకున దనిచి, కోలు నొక్కటఁ దలకోలు విడఁ బూని." ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౫౭. పం; 2. గూఢశత్రువు. (బ్రౌ.)

తలకొల్పు. దే. స. క్రి. (తలకొనుధా. ప్రే.) 1. కలిగించు. "క. ఏమీ యిది దేవరకను, దామరలకు నింత వెఱఁగు దలకొలిపెడునే." ప్రభా. ౧, ఆ. ౫౬; 2. నెఱవేర్చు. "ఉ...అంతం దగఁ ద్రోఁచి మత్ప్రతు లుదాత్తమతికి భవదీయవాంఛితంబుం దలకొల్పఁ జాలుదురు..." భార. విరా. 3, ఆ. ౭౨; 3. బోధించు. "క. తెగి చంపరాదు గాక ముఁదగ వని దుర్నీతు లపుడు తలకొల్పఁగ నీ, చగుమంత్రులు నీవును నీ, పగిదిం బడవలసె నిట్టి పాపము గంటే." నా. పంచ. 3, ఆ. ౨౯౦; 4. ప్రేరేచు పురికొల్పు. "క...మును కలఁగి నవీ, మొన లెల్ల నొక్కమొగముగ, నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్." భార. ద్రో. ౫, ఆ. ౪౨, భా. రా. యు. ౬౨౩.

తలకోల. దే. వి. (తల+కోల.) సాధువు కానియావును పిదుకునపుడు కొనను త్రాడు కట్టి దానికొమ్ములకుఁ దగిలించి పట్టుకొనెడుకఱ్ఱ. "ఆ. ఆవుఁ బిదుక బోయి యలివేణి యొక్కతె, దూడవెనుక కాళ్లతోడ నావు, నడుమఁ గట్టి యొక్కి యావుఁ బోతుఁ దలకోలఁబట్టి యమ్ము గట్టి బయలు పిలిచె." వి. పు. ౭, ఆ. ౨౮౨. ద్వా. ౨, ఆ. ౫౫.

తలకోలు. దే. వి. (తలకొను. ధా. తలకొనుట.(శ.ర.)

తలక్రిందు. దే. విశే. (తల+క్రిందు.) అధోముఖమైనది. "సీ...తలక్రిందు లైనరథవ్రజములు." జై. ౨, ఆ. ౧౯. చు. 3, ఆ. ౧౪3. ఇట్లే: "తల్లక్రిందు." సానంపా. ౨. ఆ, ౧౨3.

తలగడ. వ్య. వి. (తల+కడ.) (పండుకొనునప్పుడు) తలయుంచుకొను దిక్కు; తలయుంచుకొను ప్రదేశము. "గీ. తూర్పుదక్షిణములలోన దొరకినట్టి, దిక్కు తలగడ గాఁగ నిద్రించెనేని, మేలు తక్కిన దిక్కులు మేదినీశ,యధికరోగంబుఁ గావించు నని బుధులు." వి. పు. ౪, ఆ. ౨౧౭. "చ. తలగడఁ బాముఁ జేర్చుకొని దయ్యము నెయ్యము నమ్మి..." వాల్మీకి. ౭, ఆ. ౨౮; 2. తలక్రింద నెత్తుగా నుంచుకొనెడిదిండు, ఉపధానము. "వ... భీమసేనుండును దవ్వటవృక్షంబు క్రింద నధికపథశ్రాంతు లయి వయిపుట్టంబులు పఱచుకొని తమ బాహుదండంబులు తలగడలుగా నిద్రితు లయి యున్నసహోదరులం దల్లినిం జూచి .." భార. ఆది. ౬, ఆ. ౧౭౬. ఆం. భా. ద్వి. ౧౬3.

తలగడిగించు. దే. స. క్రి. (తలగడుగు. ధా. ప్రే.) అభ్యంగస్నానము చేయించు. "చ. తలగడిగించి ధౌతపరిధానము గట్టఁగ నిచ్చి..." పాండు. 3, ఆ. ౧౨౭.

తలగడుగు. దే. అ. క్రి. అ. (తల+కడుగు.) 1. అభ్యంగస్నానము చేయు. "క...తలగడిగిననాఁటి నిద్ర తరుణులయెడలన్, బొలయలుకనాఁటికూటమి, వెల యిం తని చెప్పరాదు..." సుమతీశ. ౯౫; 2. అంటినతలకు నీళ్లుపోయు. "చ... తామరకంటి యొకర్తు తేటవెన్నెలపటికంపుబిందియల నించినగొజ్జఁగినీరూపునీటిచేఁ, దలఁగడిగెన్ యయాతికి..." య. ౪, ఆ. ౯౭. చూ. ౯౬. వి. అభ్యంజనము. "చ. తలగడు గంగమర్దనము ధౌతపటావరణంబు..." పాండు. 3, ఆ. ౯. ఆం. భా. ద్వి. ౧౬౦.

తలగాచు. దే. స. క్రి. (తలన్+కాచు.) కాపాడు. "సీ. తగిలి తాఁ జేసినధర్మంబు తలగాచు దైవంబు గొలిచినఁ దన్ను మనుచు," నీతిశ. ౪౩.

తలగాము. ద్వ. వి. (తల+గాము.) రాహువు. "ద్వి. తలగాము మట్టనితరుణేందురేఖ." ద్వి. భాగ. ౮, స్కం. (శ. ర.)

తలగుంజె. ద్వ. వి. (తల+గుంజ.) నిట్రాడు. (శ. ర.)

తలగుడ్డ. దే. వి. (తల+గుడ్డ.) పాగాగుడ్డ, తలకుఁ జుట్టుకొనువస్త్రము. "ద్వి. సన్నంపుఁదలగుడ్డఁ జాటుగాఁ బట్టి..." ద్వి. శ. సా. ౧, ఆ. ౧౨. పు.

తలగొను. దే. స. క్రి. (తల+కొను.) తాల్చు, ధరించు "క. అలశంఖచూడుతలమణి, తలగొని మణిఘటితభోగతతిఁ గలశేషుం, దలపించురోహిణీసుతుఁ, గలసి తిరుగు హరి సగంధకస్తూరిక్రియన్." సాంబో. ౧, ఆ. ౧౦౦.

తలచీర. ద్వ. వి. (తల+చీర.) తలపాగ; తలగుడ్డ. "వ...తక్కినయలంతిమానుసు లెల్లను దలచీర వాటించుతలంపు లేక యొండొరుల నిలు నిలుమని పలుకుచుం..." భార. ద్రో. ౫, ఆ. ౩౨౫. "గీ...చెప్పు పావలు దొడి తలచీర చుట్టి." విజ్ఞా. ఆచా. ౫౩.; 2. అవగుంఠనము, మేలుముసుఁగు; ముసుఁగు. "గీ. అతివమనమున సిగ్గు మోహంబు భయముఁ, బొడమ నునుమంచు నెత్తమ్మిఁ బొదుపుమాడ్కిఁ, బ్రమచింతాభరమ్మునఁ బద్మనయన, కోరి తలచీర వాటింప నేరదయ్యె." భాగ. ౧౦, స్కం. ఉ. ౩౩౧. "గీ. అతఁడు పెండ్లికిఁ బిలిచినయట్లు వికచ, హృదయుఁడై తలచీర యాయితముచేసి, ద్రుపదనందనఁ జూచి నాతోన వెనుక; నల్ల నంతంత నరుగుదెమ్మని కడంగి." భార. విరా. ౪, ఆ. ౩౨౩.

తలచీల. దే. వి. (తల+చీల.) నిట్రాడును వితపుఁ గదురును చేర్చి బిగించెడిచీల. (శ. ర.)

తలచెదు. దే. అ. క్రి. (తల+చెదు.) భయపడు. "క. తలచెడి పాఱక బాహా, బల మొప్పఁగ నాదుదృష్టిపథమున ధృతితో, నిలిచిన..." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౫౫. చంద్రా. ౬, ఆ. ౯౩; 2. వైధవ్య మొందు. "గీ. ఒడ లెఱుంగవొ చచ్చితో యుర్వి లేవొ, చేరఁజాలక తలచెడి జీర్ణమైతొ, కన్నడంబెట్లు చొచ్చెదు గజపతీంద్ర." (పెద్దనచాటువు.)

తలచెమురు. దే. వి. (తల+చమురు.) 1. తలకు రాచికొనెడినూనె. (శ. ర.); 2. నూనె, తైలము. "గీ...తైల మలరుఁ దలచమురు నూనె యన." వెంక. మాన. ౭౨.

తలచావడి. దే. వి. (తల+చావడి.) ఇంటిముందటిచావడి. (శ. ర.)

తలచుంచు. దే. వి. (తల+చుంచు.) ముందటిజుట్టు. (బ్రా.) "సీ. దండ కై దప్పినఁ దప్పుఁ గ్రేళ్లుఱికినఁ దలచుంచుఁ గొన్న నాబలము గొన్న" ద్వా. ౨, ఆ. ౬౦.

తలచుట్ట. దే. వి. (తల+చుట్ట) తలపాగ, ఉష్ణీషము. "సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేఁత చందురులఁ దాలిచినవారు." పాండు. ౧, ఆ. ౧౬౫.

తలచుట్టు. దే. వి. (తల+చుట్టు) 1. తలపాగ, ఉష్ణీషము. "సీ...రారాజు ద్రోణ, తనయుండుఁ జుట్టిన తలచుట్లు నల్లనియవి సూతపుత్త్రుశిరోంబరంబు పచ్చనియది..." భార. విరా. ౫, ఆ. ౨౧౦. ప్రభా. ౧, ఆ. ౫౪; 2. పాగకట్టుట. (శ. ర.)

తలచూపు. దే. అ. క్రి. (తల+చూపు) 1. పొడచూపు, కనఁబడు. "సీ. కనుపట్టె నొకచోట ఘనఘనాఘనరంగవిద్యున్నటీ నాట్యవిలసనములు,... తలచూపె నొకవంక దరదళత్సేవంతికాగంధి నీహారకణభరములు." పారి. ౩, ఆ. ౪౬, పారి. పూ. ౭, ఆ. ౧౯౬; 2. కలుగు, జనించు. "గీ. వేఁకి తలచూపె దాహ మావిర్భవించె." కాశీ. ౩, ఆ. ౧౨౧.

తలడించు. దే. అ. క్రి. (తల+డించు) చలించు, జంకు. "లయవిభాతి... వెలుకుటి జరాసుతుని బలము రణవీథిం, జలితదనుజావలికి బలికి భయభీతసుర, ఫలికిఁ ద్రిజగచ్చలికి హలికిఁ దలడించెన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౬౭.

తలడిల్లు. దే. అ. క్రి. బాధపడు. "చ...విరక్తులు తలడిల్లువేళలు..." భాగ. ౧౦. స్కం.-పూ. ౯౬౨. (శ. ర. పా.)

తలతంత్రము. మి. లి. ఎలగోలుసైన్యము, యుద్ధభూమిలో మొదటిసపరణచేయుటకు పంపఁబడు సైన్యము. "ఉ. ధారలు వట్టఁబంపుతలతంత్రముఁ దావడినంపురత్నభం, డారముతోడ గుజ్జపుదశంబులు ముంగలిపంపుసందడిం, జేరఁగనీకుము..." కు. సం. ౧౧, ఆ. ౫.

తలతల. దే. అవ్య. 1. ప్రతి యనుదానియర్థము నిచ్చును. "చ. తలతలపారుపత్తెములు తద్దయు

"మించె గిరీశుచెంగటన్..." చంద్రా. ౧, ఆ. ౧౪, జై. ౭, ఆ. ౧౬; 2. ప్రత్యక్షముగా. "క. పలుకుల కేమీ రోసము, గలిగినమగవాఁడ వైనఁ గాచి కడంకం, దలతల పట్టిపోనంగా, పలవంటినో చంపి త్రోవవలవంటి నొకో." వేం. పంచ. ౧, ఆ ౨౫౧. వి. 1. మెఱయుటయం దగుననుకరణము. "క. గెలుపు ధ్రువము నీకును మైయిఁ,దలతల మను చాయ దోఁచె దైత్యాంతకుడుం, చెలివొందఁ యున్నవాఁడు..." భార. ద్రో. 3, ఆ. ౧౭. బహు. ౪, ఆ. ౧౮; 2. ఇంచుక మెఱయుటయం దగుననుకరణము. "క. తలతల మనుచీకటితోఁ, చెలతెలవాఱంగ లేచి..." నిరం. ౧, ఆ. ౧౫.

తలత్రాడు. దే. వి. (తల+త్రాడు) పశువులకొమ్ములకుఁ గట్టుత్రాడు. "గీ...గిడ్డి వెడలించెఁ దలత్రాడు కేలఁ దోట్టి, మారి వెడలించువడువున మాణవకుఁడు" పాండు. ౫, ఆ. ౨౪౫. శుక. ౨, ఆ. ౫౪౫.

తలత్రాణము. సం. వి. అ. న. చేజోడు. "వ...తనుత్రాణతలత్రాణంబులు ధరించి..." భార. విరా. ౪, ఆ. ౧౬౮.

తలదండ. వై. విశే. (తల+దండ) హద్దును రక్షించునది. "సీ. ఇలకెల్లఁ దలదండ చెలియలికట్ట యే రాజాజ్ఞ నద్భిపై రాదు గాక." భా. రా. అయో. ౨౬౫.

తలదుడ్డు. దే. వి. (తల+దుడ్డు) తలగలచేతికఱ్ఱ. "సీ. కొడిదిపూసలమొలత్రాడు తలదుడ్డుచీరణంబులపాదిముఁను..." వేం. పంచ. ౧, ఆ. ౯౧౮.

తలదువారము. ద్వ. వి. (తల+దువారము) తలవాకిలి. "సీ. తలదువారంపుఁబొంతల నంటిబోదియలును.." అచ్చ. అయో. ౧౦.

తలదూర్చు. దే. అ. క్రి. నివసించు. (చూ. తలదూర్చుకొను.)

తలదూర్చుకొను. దే. అ. క్రి. (తలదూర్చు+కొను - స్వార్థమున) నివసించు, ఉండు. "గీ.. సురేంద్రుండు జీర్ణపర్ణాశనమున, నొడలు కడుఁ జిక్కి నొగులుచు నున్నతపసి, పడఁతి తలదూర్చుకొను చుట్టుగుడిసెపంచ, జేరె మదనవిమహిమంబుఁ జెప్పఁ దరమె." జాహ్నవీ. ౪, ఆ. ౧౧.

తలద్రొక్కు. దే. స. క్రి. (తల+త్రొక్కు) 1. ఎక్కు, అధిరోహించు. "వ...దరదతుండిరాజ సమేతుండవై యేను ఘరఘరంబు దక్షిణకటకంబుఁ దలద్రొక్కెద..." హరి. ఉ. ౧, ఆ. ౧౪; 2. మీఱు,మించు. "గీ. ఐక్ష్వాకులోకేశ్వరుఁడు రఘువీరుఁ డిట్టు, పరికివత్తు వటంచుఁ జేపట్టినవుడె, భూమణంబులఁ దలద్రొక్కి పూజఁ గొంటి,.." రామా. ౬, ఆ. ౧౮౭.

తలధరించు. ద్వ. స. క్రి. (తలన్+ధరించు) శిరసావహించు. "గీ. బ్రహ్మ లిప్తముఁ దనయాజ్ఞ తల ధరించి." హర. పీఠి. ౨౬, ఇట్లే, తలనిడు, తలఁ దాల్చు. మొ.

తలనట్టు. దే. వి. వేరుపురుగుకొఱుకుటచే మోపు లెండుట. (శ. ర.)

తలపండు. దే. వి. (తల+పండు) తల. "గీ. పలుకుఁ దేనియ గలతలపండు వేల్వఁ, దలఁచి .." ద్వా. ౨, ఆ. ౧౯.

తలపడు. ద్వ. అ. క్రి. (తల+పడు) 1. సిద్ధపడు, తొడఁగు "క. కలుషించి తామ్రకేతుఁడు, వలికె గదాధరునిఁ జూచి పాండవుతోఁ నచ్చలమునఁ బోరఁగ దొమ్మికిఁ, దలపడితివి నీకు వీరధర్మమె యనుచున్." జై. ౭, ఆ. ౧౭౦. రామా. ౭, ఆ. ౨౭౬; 2. సమీపించు. "గీ...కొమ్మ గదలి జల్లు, తలపడకమున్న సంగుల్లఁ జడెనెఁ దరులు." ఆము. ౪, ఆ. ౧30; 3. ఏర్పడు. (శ. ర.) స. క్రి. కవియు, డీకొను. "చ. శలభము వహ్ని మీఁదఁ జనుచందముగాఁ దె నృపాలుఁ దర్జునుం, దలపడఁ బోక..." భార. ద్రో. ౫, ఆ. ౧౧౮. హరి. ఉ. 3, ఆ. ౧౧౫.

తలపాగ. దే. వి. ఉష్ణీషము. "సీ. తలపాగ పొర మీఁదఁ జెలగెడునాయుధార్చన సల్పినట్టిదానవపుఁ బూవు." శుక. 3, ఆ. ౧౫౭. దశా. ౧౦, ఆ. ౧౧౨.

తలపాటు. ద్వ. వి. (తలపడుధా.) యుద్ధమునఁ దాఁకుట, కవియుట. "చ. బలములపాటు దాయ తలపాటును జూచి..." రామా. ౧, ఆ. ౯౮. భాగ. ౧౦, స్కం. ఉ. ౬, ఆ. ౧౨౪. నిర్వ. ౧౦, ఆ. ౧౧.

తలపాలు. దే. వి. 1. తలపుట్టె. "గీ. పుట్టె తలపాలు నాఁ బుర్క పులికయ నాఁగ." అం. సం. మాన. ౨౫, సుద. ౧, ఆ. ౧౧౬; 2. స్త్రీలు పెట్టుకొను నొకవిధ మగుశిరోభూషణము. "సీ. చెక్కు..

క్రేవల సిరపుమించులతోడఁ దలపాలు తళుకులు తడబడంగ." విక్ర. ౭, ఆ. ౧౨౬. పరాహ. ౯, ఆ. ౮౮.

తలపుచ్చె. దే. వి. (తల+పుచ్చె) కపాలము, తలపుఱ్ఱె. "ద్వి. కాయింతెఁ గొనివచ్చు బెటఁగిన నన్నుఁ, బోయినప్పుడె తలపుచ్చెను మ్రింగు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౧౬. పం.

తలపెట్టు. దే. అ. క్రి. ప్రారంభించు. "క. వెఱపొక యింతయు లే కీ, తెఱఁగున మిము నెవ్వఁ డింత తెగి చేసెనొకో, యెఱిఁ గెఱిఁగి యుండి యకటా, కొఱవిం దలఁగోఁకికొనుటకుం దలపెట్టెన్." రాజ. చ. ౨, ఆ. ౪౩, కాశీ. ౩, ఆ. ౨౬. స. క్రి. 1. తలపడఁజేయు, తాఁకించు. "చ...ఉపాయపుఁ బ్రేలరిమాట లాడి ధీ,రులమది కైన నూరక విరోధ మొనర్చుచు నుండురాజులం, బెలుచన రేఁచి తెచ్చి తలపెట్టువినోదపుఁదీఁట వోవఁగన్." హరి. పూ. ౫, ఆ. ౯౨, భార. ఉద్యో. ౬, ఆ. ౨౦౭; 2. ప్రస్తావించు. "క. తలపెట్టకుఁ డీక నెన్నఁడు...ఈకథాస్థితి." కళా. ౫, ఆ. ౫౭. ఉ. రా. ౬, ఆ. ౨౨౨; 3. తలపోయు, చింతించు. "క. ఔదల ధరణీపాలక,యూఁ దలవం పాయె నిప్పు డందఱిలో నెంచోఁ దలపెట్టక నెనరి, చోఁ దలపెట్ట కటు విడువు చూతువు నన్నున్." సా. ౨, ఆ. ౨౩౪.

తలపొలము. దే. వి. (తల+పొలము.) పొలిమేర వెంబడి నున్నపొలము. "క. తఱకలచొప్పయ చాలును, మఱి చియ్యఁ దలపొలముదిక్కు మసలెడి పనికిన్,వెఱతు నని పిఱికితనమున, నెఱి విఱుగుదు గాక సత్యనిష్ఠఁ దలఁపుదే." భో. ౪, ఆ. ౨౧౧. భార. ఉద్యో. ౨, ఆ. ౧౩; 2. ఊర్ధ్వప్రదేశము. "క. తెలతెల వేగిన నగ్గిరి, జలజలఁ బ్రవహించు నెలలచప్పుళ్లు శిఖా,వలకులకల కేకాకల,కలములు గలతలపొలంబు గనుఁగొను వేడ్కన్." స్వా. ౪, ఆ. ౧౨.

తలపోఁత. దే. వి. (తలపోయు. ధా.) 1. ఆలోచన. "సీ. దైన్యంబుతలపోఁతఁ దలకొన్న చెలువ కాననమున వెల్లఁదనంబు గదిరె." భార. విరా. ౨, ఆ. ౧౦౬. పాండు. ౫, ఆ. ౫౦; 2. కోరిక; వలపు. "చ...నన్ను నెత్తెఱఁగుననైనఁ బొందఁగ మదిం దలపోఁత కల్గెనేని క్రచ్చఱ మునివర్గ వాహనుఁడపై చనుదెమ్ము..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭౬. నిర్వ. ౮, ఆ. ౭౬; 3. విచారము, చింత. "గీ. తనయు లందఱుఁ బొలియుట వినిన యెడలు, మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు, వొగులుచును వచ్చె ననుతలపోఁతఁ జేసి,యుల్ల మక్కటికమునఁ జొత్తిల్లుచుండ." భార. స్త్రీ. ౧, ఆ. ౧౧౭. ఆర్ణ. భా. ప్ర. ౧౦౨; 4. ఊహ. "క. కలదో లేదో యనియెదు, తలపోఁతయ కాని నిశ్చితము గాదు సురా,దులకుఁ బునర్జన్మంబున, కలిమియు లేమియును నరులు గానమి తప్పె." భార. అను. ౫, ఆ. ౧౬౨. ఉ. హరి. ౪, ఆ. ౯౩.

తలపోటము. దే. వి. తంగేడు☙. "గీ...తలపోటమగుచు దంగే డన నభవ." ఆం. భా. ద్వి. ౬౨.

తలపోయు. దే. అ. క్రి. (తలఁపు+పోయు.) 1. వివేచించు, యుక్తాయుక్తవిచారణ చేయు. "క. తలపోయ నెందు క్షత్త్రియ,బలమునకంటెఁ గడు విప్రబల మెక్కుడు. భా. రా. బాల. ౫౬౮. స్వా. ౨, ౭౨; 2. సంకల్పించు, కోరు. "ఆ...తపము నిన్నుఁ జేయఁ దలపోసి కీరభృం,గాళిరమ్యమైనయాశ్రమమున." స్వా. ౬, ఆ, ౧౯; 3. విచారించు, ఆలోచించు. "క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని నల్ల నెత్తి దండడి తొరఁగం, జనుదెంచు నశ్రుపూరము,కనుఁగవలో మ్రింగికొనుచుఁ గామిని పలికెన్." భార. విరా. ౨, ఆ, ౭౯. భో. ౫, ఆ. ౨౪౫. స. క్రి. 1. ధ్యానించు. "చ...ఆత్మలో,హరిఁ దలపోసి సౌఖ్యముల నందఁగ..." విక్ర. ౧, ఆ. ౭౧; 2. పరిశీలించు. "గీ. తలవకారంబు శ్వేతాశ్వ తరమున నెడు, నుపనిషత్తులు తలపోయు నొయ్యనొయ్య." కాశీ. ౨, ఆ. ౧౫౧. ఆ. ము. ౬, ఆ. ౩౧; 3. నిశ్చయించు. "చ. చిఱుతతనంబునం దగవు చిత్తమునం దలపోయ లేక..." భార. ఉద్యో. ౩, ఆ. ౩౬౧. భార. ద్రో. ౧, ఆ. ౨౨౫.; 4. ఎంచు, భావించు. "క...కశేబరము నెవ్వఁ డాత్మగాఁ దలపోయున్." ఆము. ౩, ఆ. ౬౮; 5. స్మరించు,జ్ఞప్తికిఁ దెచ్చుకొను. "చ. అపుడు మనంబులోన ననయంబు పతిం దలపోసి..." కళా. ౪, ఆ. ౯౦. భార. విరా. ౨, ఆ. ౨౯౨; 6. కోరు. "క. కనకధరాధర

చాప్రఁడు, తనపతి గావలె నంచుచుఁ దలపోసి మహా,వనమునకుఁ జనియె జననీ,జనకులయనుమతిఁ దపంబు సలిపెడుకొఱకున్." వరాహ. ౬, ఆ. ౧౫.

తలపోసికొను. దే. స. క్రి. (తలపోయు+కొను స్వార్థమున) చెప్పుకొను. "వ... జాంబవదాగు లుపొ్పంగి తప్పు దివి యప్పునసభనమాగమన వేగంబ యగు నతండు దడయక వచ్చుటం భ్రోయినపని పండు కాని కాయ గా దని చాయగాఁ దనమాటయె తలపోసి కొనుచుండ .." రామా. ౭, ఆ. ౬.

తలబీకనకాయ. దే. విణ. కలఁతనొందినది. "క. చిలువపళివారును లప్పుడు, తలబీకనకాయలై యథాయథులై కూ,కులుపత్తులునై మొనతల, నిలువక శేషాహికడకు నెఱిచెడి పాఱన్." జై. ౭, ఆ. ౧౦౨. (శ. ర. తలబీకరకాయ. బ్రౌ.)

తలమాటు. దే. వి. (తల+మాటు) నాశనము. చేటు. "క. అలఘురఘువంశమునకుం, దలమా టించు కయం లేమి కళ్యము గా నీవలన సమస్తంబును నేఁ,దెలిసితి నామనము కలఁతదీఱె మహాత్మా." నిర్వ. ౯, ఆ. ౬౬.

తలమానికము. ద్వ. వి. (తల+మానికము) అలంకారార్థము తలపై పెట్టుకొనురత్నము. "ఆ. కలువ విరులఁజేనిఁ దలమానికము గాఁగఁ, దాల్చినట్టి దొరకు..." చెన్న. ౧, ఆ. ౧౧౭. విణ. శ్రేష్ఠము. "క. కన్నియతలమానిక మగు, నన్నాగఁటిచాలిపేరియతివన్" రామా. ౫, ఆ. ౧౮౯. అచ్చ. యు. ౫౭౧.

తలమానిసి. ద్వ. వి. (తల+మానిసి) ప్రధానపురుషుఁడు, యజమానుఁడు. "ఉ. దాయలు గూడి యెవ్వరు వితా నిను మాతల గాక యుండ ని, మ్మాయలు పన్ని రింత చలమా తలమానిసీ వింట వింట నీ,వేయఁగ నేరవో..." వాల్మీకి. ౨, ఆ. ౧౨౨.

తలమాళిగ. ద్వ. వి. (తల+మాళిగ) పినఁగుకుంభస్థలమునం దలంకారముగా నుంచెడువస్త్రాచ్ఛాదనవిశేషము. "సీ. వలరాజుమదదంతితలమాళిగ యనంగఁ గలికిచన్నులఁ బట్టుకంచె లమర." వాల్మీకి. ౩, ఆ. ౩౦. ప్రబంధ. ౫౩.

తలమాసు. దే. వి. (తల+మాసు.) తలమీఁది మాసి. "క. తానెన్తిత్తిగొంటెరక్కలు, నేనియుఁ దలమాసువోని నెత్తురుపదుముల్, సేనానిఁ జేసిరజ్ఞాన,దానవపతిమీఁదఁ బడఁ బొరుగనే మీఁదన్." కు. సం. ౧౦, ఆ. ౧౬౬. (తలమాసువోని = మాపితోఁడగని, అనఁగా అప్పుడే పుట్టిన అనిభావము.)

తలమించు. దే. అ. క్రి. (తల+మించు) అతిశయించు. "సీ. తలతలమంచుచుఁ బెలమించు వలిమించు వాలించు వలిపపావడలఁగట్టి." రా. వి. ౩, ఆ. ౧౧౭ కళి. ౩ ఆ. ౧౬౦. (శ. ర. పా.)

తలమిగులు. దే. అ. క్రి. స. క్రి. అతిక్రమించు, ముందుకుఁ బోవు,దాఁటు. "క. కని యశ్వత్థామయుఁ గృపుఁడును గృతవర్మఁడును నెక్కుడు బరపసమునన్, మన సేనకుఁ దలమిగిలిన, మనుజేశ్వర కవిసెఁ గ్రీడి మపి మెలరారన్." భార. శల్య. ౧, ఆ. ౨౪౨. "క. వడముడిఁ దలమిగిలి రయం, బడరఁగ సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం, దొడరి..." భార. శల్య. ౧, ఆ. ౩౭౬.

తలమిన్న. ద్వ. వి. (తల+మిన్న) శిరోరత్నము. విణ. శ్రేష్ఠము. "చ. అలరులతీవయాయ్యల యొయ్యారపుటాటలఁ గన్నయి న్నెలం,తలతలమిన్న..." రా. వి. ౩, ఆ. ౯౬, వసు. ౨, ఆ ౪౨.

తలమీఱు. దే. అ. క్రి. ముందటికి వచ్చు. "క. తల పడి తలమీఱినకాల్బలములఁ బొడిచేయ..." భార. విరా. ౫, ఆ. ౩౧. అ. క్రి. స. క్రి. (తల+మీఱు) మించు, మీఱు "క. మీరును గృహస్థధర్మము, మేరకుఁ దలమీఱి చనక..." పాండు. ౪, ఆ. ౨౯౨. "ఉ...బొమ్మ చమూవధూటి నీ, కైవన మైనలెస్స యటు గాక నినుం దలమీఱె నేని...." జై. ౨, ఆ. ౫౧.

తలము. ఉభ. దే. వి. 1. విధము, రీతి. "చ. నెలకొను జూటసోరతటి నీనవకైరవిణీవధూటితో, లలిత సుధాంశుఁ గూర్చినతలంబున..." కుమా. ౧, ఆ. ౩, వి. ఏతాము. (శ. ర.) విణ. శక్యము. "క... అట్లు, ల్లాసముతో మెలఁగఁ గాఁ దలంబె యొరులకున్." భార. ద్రో. ౨, ఆ. ౧౩౯. స్వా. ౨, ఆ. ౧౨. సం. వి. అ. పుం; 1. చాఁచినవ్రేళ్లు గల యఱచేయి, చపేటము; 2. తాటిచెట్టు; 3. చలువ; శైత్యము; 4. గొయ్యి, గర్తము; 5. కత్తిపిడి; 6. చేయి. న. 1. వింటిదెబ్బ తగులకుండ చేతికి తొడుగుకొను అత్తెము; 2. అడవి; 3. పాతాళలోకము; 4. తాటిపండు; 5. మిట్టపల్లములు లేక సమముగా నుండుప్రదేశము; 6. పరిమాణము;

7. కారణము; 8. ప్రదేశము, చోటు. "క... శ్రీస్తనకుంకుమసదృశగ, భక్తిసమూహప్రశస్తి పరిదీపితవక్షస్స్థలపటుతేజోమయ, కౌస్తుభకమనీయలేషిఁ గంసద్వేషిన్." ద్వా. ౪, ఆ. ౧. భార. అను. ౪, ఆ. ౪౩౯; 9. పాదముయొక్క క్రిందిభాగము ఉదా:—పాదతలము) 10. అవసరము. "ఉత్సాహ.. నీవు నలుఁగఁగాఁ, దలము గలదె నన్నుఁ బనుపు దత్తుఁ బట్టి తెచ్చెదన్" కు. సం. ౭, ఆ. ౬౦. పుం. న. 1. కుడిచేతితో వీణతంతులు మీటుట; 2. స్వరూపము; 3. క్రింది భాగము. (ఉదా. తరుతలము.)

తలముదప్పు. దే అ. క్రి. (తలము+తప్పు) 1. అశక్యమగు, శక్తికి మీఱు. "ఆ. అనుడు నకులుఁ డిట్టులను దేవ తమతమ, నేర్పుపనులవెంట నెగడి బ్రతుక, వలయుఁగాక నగరఁ దలముదప్పినమెలఁ, కువలకలుపు లియ్యకొనుట తగునె." భార. విరా. ౧, ఆ. ౨౬౬. హరిశ్చ. ౪, ఆ. ౯౩; 2. మితిమీఱు. "సీ. తనరూపునకుఁ దోడు దలము దప్పినగర్వ మరకంటఁ జూడఁడే నరిగినపుడు." కాశీ. ౭, ఆ. ౭౦. ద్వి. హరిశ్చ. పూ. ౪౪౧. పం.

తలమునుఁగు. దే. అ. క్రి. (తల+మునుఁగు) అతిశయించు, అధికమగు. "క. అని తలమునిఁగిన పగలం దను మఱచి దశాననుండు ధరపై మూర్ఛిల్లిన..." భా. రా. యు. ౧౩౯౭.

తలమునుక. దే. వి. (తలమునుఁగు ధా.) శిరస్స్నానము. (శ. ర. బ్రా.) విణ. 1. తలముంచునది. "క. ఇలఁ జిత్రము తారకకర,తలసంగత మైనఘోరతరవారి పోరన్,నిలుపఁగఁ దనుఁ జొరకడరినఁ దలమునుకయగు న్విరోధితతి కబ్జభవా." కు. సం. ౪, ఆ. ౧౪. నరస. ౫, ఆ. ౯౪; 2. అధికము. "క. ఊహాలు కుత్తుకబంటై, మోహము తలమునుకలగుచు..." హంస. ౨, ఆ. ౩౨. హంస. ౫, ఆ. ౧౨౬; 3. దుర్భరము. "వ...గురుండు మొదలైనయందఱకును నాధనంజయుపోరు దలమునుకలయ్యె..." భార. భీష్మ. 3, ఆ. ౨౧౯. కు. సం. ౪, ఆ. ౧౪.

తలమున్కు = తలమునుక. విణ. 1. తలముంచునది. "ఉ.అత్తరళాయతేక్షణకటాక్షవిలాసరసప్రవాహమున్, కుత్తుకబంటి తామరలకుం దలమున్కలు గండుమీలకున్." విజ. 3, ఆ. ౧౫. కకు. ౧, ఆ, ౭౦; 2. అధికము. "సీ. ముసు దలమున్కలౌ మోహాంధకారంబు పెనుక దీసినరీతి వేణి దవర." దశా. ౭, అ. ౧, ఆ. ౧౭౧; 3. దుర్భరము. "సీ. మద్బాహువీర్యంబు మహితవీర్యంబును దలమున్కలైనసద్ధర్మవృత్తి. గీ. సంగరము సేయఁజాలక శత్రులిట్లు,నొంప సద్గతి వడయుట సొంపు గాదె." భార. శల్య. ౨, ఆ. ౪౦౯.

తలముడులు. దే. వి. బ. (తల+ముడులు) చోరులును వేటకాండ్రును ఉపయోగించు ఒక సాధనము. "చ. వలలును బోటుకోలలు సివంగులబండ్లు ముకుందబల్లెముల్, తలముడు లుర్లుబోనులు... ఆది సాధనంబులు..." ఇందు. ౨, ఆ. ౫౯.

తలముళ్లు = తలముడులు. "క. బలపముఁ గన్నపుఁ గత్తియుఁ, దలముళ్లును..." పరమ ౪, ఆ. ౧౯౪. వేం. పంచ. 3, ఆ. ౧౯౯.

తలమోయు. దే. స. క్రి. (తలన్+మోయు) శిరసావహించు. "సీ...లోకపాలురు నీయాజ్ఞఁ దలమోచి నిఖిలభువనపరిపాలనిపుణులై భాసిల్లుచున్నవారు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౭౬౪.

తలమోసల. ద్వ. వి. (తల+మోసల) మొగసాలయొక్కతల. "ఉ. ముజ్జగమేలువేల్పు తలమోసల నుండి వివాహయత్నముల్,సజ్జ మొనర్ప..." వసు. ౫, ఆ. ౭౩.

తలయంటు. దే. అ. క్రి. (తల+అంటు) అభ్యంగమునకై తలమీఁద నూనెపెట్టి రాచు. "సీ. తలయంటి రతిపుణ్యతాపసాంగనలు నెంతయు నింగుదీఫలతైలమునను." పి. శకుం. ౪, ఆ. ౬౨. పరమ. ౫ ఆ. (శ. ర.) వి. అభ్యంగము, తలమీఁద నూనెపెట్టి రాచుట. (శ. ర.)

తలయంపి. దే. వి. 1. తలగడ, ఉపధానము. "గీ... అట్టిచేఁ దలయంపిగా నవ్విభుండు, దర్భశయనుఁడై వాసరత్రయము నియతి, నుండ..." భా. రా. యు. ౨౧౩. ఆం. భా. ద్వి. ౧౬౪; 2. పండుకొనునపుడు తల యుంచుకొనుదిక్కు. "ఉ. అడుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ దలంపకీవు గాఢ దలయంపి గా నిదుర గైకొన..." హరి. పూ. ౧,ఆ ౯౭. భార. ఉద్యో. ౧, ఆ. ౬౫.

తలయగు. దే. అ. క్రి. (తల+అగు) కూడు, కలియు. "చ. మలసి ఋణానుబంధమహిమన్ హృదయే

శ్వరుఁ డత్త నత్తమా, మలతల గాక యుండఁ బతి మాస్తురు కాంతలు వారి కెన్నఁడున్, గలుఁగవు వన్నెవాసులు..." వేం. పంచ. ౪, ఆ. ౭౭౯. హరి. పూ. ౫, ఆ. ౨౨౮.

తలయూరి = తలవరి. (ఆరెకుఁడు "ఉ. ఆతఁడెఁ గొంచుఁ బోయి తలయూరులు ఘోరవనాంతర స్థలిన్, జేతులు గాల్లు దున్కలుఁగఁ జేసిన..." సా. 3, ఆ. ౧౭౦.

తలయెత్తు దే. అ. క్రి. (తల+ఎత్తు) 1. తల పై కెత్తు. "క. చెలువుఁడు నెప్పుక పోయిన, సొల పున నొకముగ్ధ మున్ను చూడక నుచు నొఁదల వంచి యుండఁ జాలక, తలయెత్తెను మరుఁడు లోనఁ దలయెత్త నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౬౬. ఉ. హరి. ౫, ఆ. ౨౧౭; 2. మొలచు. "చ...తొలుసావిఁ బయోధరభారఁ దోఁగున,య్యలఁ దలయెత్తుకొత్తపులు నేపున జే పులకల్ తమాలతన్, మొలవఁగ నున్న నవ్వి..." పాండు. ౨, ఆ ౫౨; 3. విజృంభించు, చెల రేఁగు. భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౬౬; 4. సాహసించు. "ద్వి. కరమొప్ప నీరక్ష గలిగిన నన్ను, సురరాజు తలయెత్తి చూడంగ వెఱచు." రం. రా. అయో. ౧౦౪. పు.

తలయేరు. దే. వి. (తల+ఏరు) శిరోవేదన, తలనొప్పి. "క...వగరును, దలయేరును నుక్కసయును దల కొను దెంచెన్." భార. ఆది. 3, ఆ. ౯౯౧. స్వా. ౫, ఆ. ౨౨; 2. పశురోగవిశేషము; "ద్వి. తల యేరు తోడకువాతము కల్లవాపు, నలదొబ్బ తెవులును నాదిగా నెన్నఁ, గలపసరాలరోగములకు నెల్ల." నవ. ౧, ఆ. ౪౧, పు.; 3. పొలము దున్నుట కేర్పఱిచిననాఁగళ్లలో ముందు నడచు నాఁగలి. (బ్రా.)

తలయేఱు. దే. వి. (తల+ఏఱు) మందాకినీనది. "గీ. ఆభ్రగంగశిరస్థోద మలరును దల,యే ఱనంగ..." ఆం. భా. కృ. ౬౦. "సీ. తలయేఱు దాల్చిగట్టులు పట్టె నగధన్వి..." రామా. ౫, ఆ. ౩౧౨.

తలరారు. దే. అ. క్రి. (తలరు+ఆరు) ఒప్పు. "క. తలతల మనునవరంజి,దలతలమనుఁ జెలువబల్లిదపు డాల్పులుపెంపు,తలఁ దలరారెడు నమ్మెలఁ, తలతల మానికము నెన్నఁదరమే మాకున్." అచ్చ. బాల. ౧౩౭.

తలరు. దే. అ. క్రి. 1. చలించు, వణఁకు. "ఉత్సాహ. అతులశౌర్యుఁ డధిలశస్త్రుఁ డమితవాహినీ పదా, హతి ధరిత్రి దలర నిట్టు లరిగి..." భార. సభా. ౧, ఆ. ౨౪౪. శ్లో. సకంపయన్నివ మహీం బలేన చతురంగిణా. సం. భార. సభా. ౧, ఆ. ౨౪౪; కు. సం. 3, ఆ. ౧౦౨; 2. జంకు, వెనుదీయు. "క. తలరక మును సౌగంధిక ములు గొని యిప్పుడును పప్పున నిందులపు, వ్వులు గొని మణిమత్పురపతులఁ, బలువుర వధియించె నెట్టిబలియుఁడో యనుచున్." భార. అర. ౪, ఆ ౨౫. మార్క. ౧, ఆ. ౧౫౨; 3. అతిశయించు. "క. పూఁబోఁడులకును విటులకు,వే బోకలఁ దలరుసొంపు వీడ్కొలుపుఁ బురిన్, వేఁబోకఁ బోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁ బొదలినగాడ్పుల్." భీమ. ౧, ఆ. ౯౫ నీలా. 3, ఆ. 3౫; 4. బయలువెడలు. "క. అలుక మెయి మున్న పలికితి,నలుకనినాపలుకు తీక్ష్ణమై యింతకు నుజ్జ్వలదహనాకృతిఁ దక్షుఁడు, దలరఁగఁ బ్రేరేప కేల తానెడ నుడుగున్." భార. ఆది. ౨, ఆ. ౧౭౮; 5. తొలఁగు, చెదరిపోవు. "వ... శౌభద్రుఁడు వడుటయుం వారిబలంబులు రిచ్చవడి భండనంబు దక్కి తలరిన ధర్మపుత్రుండు ప్రబల యోధవీరలోకంబు నాలోకించి యి ట్లనియె." భార. ద్రో. ౨, ఆ. ౧౩౫; 6. దుఃఖించు. "క. నలుఁడును ధరణీరాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడుం, దలరి..." భార. అర. ౨, ఆ. ౬౪. కు. సం. 3, ఆ. ౧౦౨; 7. త్వరపడు. "చ. వెళవెళ మబ్బు బిట్టుఱుము భీతివిదారశిలాంకురచ్ఛటో,త్పులకినియై ప్రియుం న్నిదురవోవుహరి న్వడిఁ గౌఁగిలింపఁగాఁ, దలరి ధరిత్రి సొంపుగరువాల్చినకే లన..." ఆము. ౪, ఆ. ౧౧౧; 8. కలఁతనొందు ; బాధపడు. "చ...తదీయదేశముల్,వలరక యొప్పె రోగభయతస్కరడామరవర్జితంబులై." భార. ఆది. ౮, ఆ. ౮. "క...ఇట్లా,కులతమెయి వనట వెల్లునఁ,దలరవలసె దిక్కుమాలి దైవము చెయిదిన్." భా. ర. స్త్రీ. ౨, ఆ. ౫౨; 9. ఒప్పు. "క. లలి నలరుఁగొమ్మలను వ,త్తిలి సద్ద్విజరాజ సంగతిఁ దగి సువర్ణో,జ్జ్వలమై సుమనోభినుతిం, దలరి పురముకోట తోఁట తనరుభుక్తిన్."

కవిజ. ౧, ఆ. ౪౨. అచ్చ. బాల. ౫౩; 10. తిరుగు, వర్తించు. "క. మలగొంగమొదలు గల వేల్పుల నందఱఁ బొఱఁదఱిమి లోఁగని కడిమిన్ దలడుకొడుదు..." అచ్చ. యు. ౪౭౨. వి భేయము. ఆం. భా. ప్ర. ౧౩౩.

తలవంచు. దే. అ. క్రి. (తల+వంచు) సిగ్గిలు. "సీ. కందర్పచంద్రసంక్రందనసుతులకుఁ దలవంచ వ దెవ్వనిలలితమూర్తి." వి. పు. పీఠి. ౪౬.

తలవంపు. దే. వి. (తలవంచు. ధా.) 1. తలవంచుట. "గీ. వెలయు నాతనిదేవేరి విజితభర్తృసేవ తా జనినికురుంబ తిప్పమాంబ, బహుమహాభోగముల నుంచుభర్తకుఁ దలవంపు లొనరించిచిధరిత్రి పెంపుఁ దెగడి. చంద్ర. ౧, ఆ. ౩౧.; 2. సిగ్గు. "ఉ. పంకజనీలపంకరుహభావము దాలుచుకన్నుదోయి మేల్పొంకము నైఁచు నీదుముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యా, పంకజబృంద మెల్లఁ దల వంపులకుం దగుఁగాక యర్హమే, పంకజనేత్ర నీకుఁ దలవంపులహేతుకలజ్జ మెత్తురే (పైరెండర్థముల కుదాహరణములు) విణ. దుఃఖకరము; లజ్జాకరము. "ఉ. మారునిమాయపంపు దినమానము మేల్ సడ లింపు జారిణీ, జారులకు స్మరింపు జలజంబులకుం దలవంపు కోకసం, సారము మట్టగింపు...." లక్ష్మీవి. ౪, ఆ. ౪౧.

తలవరి. వై. వి. (సం. స్థలవారః. ప్రా. తలారో) ఆరె కుఁడు, రాత్రులందు దొంగతనము మున్నగు నేర ములు జరుగకుండ గస్తులిరిగి కావలి కాచుబంటు. "చ. తలవరు లింతయుం దెలిసి తల్లడమందుచుఁ గుందుచున్నవా, రిలపయి లేనిదొంగ నిపు డెచ్చటఁ దెచ్చెద మంచు..." పరమ. ౩, ఆ. ౫౯. నా. పంచ. ౧, ఆ. ౪౪౮; 2. దండనాధికారి. "క. రం డిదె వేంచేయుం డిదె దండ మిడన్ వచ్చి నాఁడు తలవరి మీకున్." వైజ. ౪, ఆ. ౮౬, మార్క. పీఠి. ౩౫.

తలవాకిటియిల్లు. దే. వి. (తల+వాకిలి+ఇల్లు) పొరు గిల్లు. "ఉ....వానిమద్గృహ, ద్వారముఁ దూఱ నీక తలవాకిటి యిండ్లకుఁ బోదు నెప్పుడున్." కేయూర. ౨, ఆ. ౬౭.

తలవాకిలి. దే. వి. ఔ. (తల+వాకిలి) ఇల్లులోనగు వానిముఖద్వారము. "చ. కలుపలవైరి జక్కవలఁ గావఁగఁ బూనిన దాత,...ముక్తితలవాకిలి...; తామరలవిందు వెలుంగుచు నుండె నయ్యెడన్." ద్వా. ౫, ఆ. ౯౯. భీమ. ౫, ఆ. ౬; 2. నా. తలను వాకిలివంటిది-నోరు. "సీ. వాణి యేమి తనూక్తి వదలదు తలవాకిలి నిజేశుమాట మోచె ననఁ జేసె." వసు. ౧, ఆ. ౩౬, ఇాదు. ౧, ఆ. ౧౪౫. ఈరెండు పద్యములు మొదటియర్థము నకు నుదాహరణములు. ; 3. ఇంటివెలుపలిప్రదే శము. (చూ. తలవాకిటియిల్లు.)

తలవాడె. దే. వి. చెఱకుకొన. ఆం. సం. స్థా. ౯.

తలవారి = తలవరి. (దండనాధికారి) "గీ. ముంద టను గంచుకొమ్ము మిన్నంది మొరయు, జార చోరులగుండియల్ ఝల్లనంగ, వెడలి కోలాహ లంబుగా వేశవాటిఁ, జేరి యప్పట్టణము తలవారి గాంచె." వైజ. ౪, ఆ. ౭౮.

తలఱిడి. దే. వి. తాటిచెట్టు లోనగువాని తలతుండు. (శ. ర. బ్రౌ.)

తలవిల్లు. దే. వి. ఔ. (తల+విల్లు.) వింటిముందటి భాగము? "వ. వలరాజుబలిగృహమహీతలంబులు మొదల గెలిచి పిదప పరపురంబు గుఱిసేసి తల వింట నంటించి తెగ నిండఁ దిగిచినకలువపువ్వు ములికియునుం బోలె..." సాంబో. ౧, ఆ. ౯౩.

తలవీడు. దే. వి. (తల+వీడు) తలవాకిలి, గృహముఖ ద్వారము. "క. కులకన్యకలకు వేడుకఁ, దలవీడులఁ బరులతోడి తగుమాటలకుం, దలకొనఁ దగునే..." భార. అను. ౧, ఆ. ౫౧, దశ. ౬, ఆ. ౧౨౫.

తలవెట్టి. దే. వి. (తల+వెట్టి) పెద్దవెట్టి. "గీ...తల వెట్టి గొని యలగౌతమాంగ, నామణి సురేంద్రు నొకనాఁడు నంటుఁ జేసి, యాపవలఁ జెంది సకలలోకాపవాద, మొందు టెఱుఁగవె యట్లు గాకుండ వలయు." శుక. ౧, ఆ. ౧౬౦.

తలవ్రాత. దే. వి. (తల+వ్రాత) నొసటివ్రాత. "చ. తలవ్రాతకుఁ దప్పులు గల్గ నేర్చునే." శుక. ౨, ఆ. ౫౧౬.

తలశబ్దము. ద్వ. వి. (తల+శబ్దము) చప్పుటులధ్వని. "చ... వేగమ తా నెదురై కడంగి ధ్యేస్తెఁ దలశబ్ద మిచ్చినఁ గడింది వృషాధముఁ డగ్గలంపుఁ దెంపుఱవుగఁ దాఁకెఁ గృష్ణు నతఁ డొడ్డినకొమ్ములు నట్టెఁ బిట్టుగాన్." హరి. పూ. ౮, ఆ. ౪౬.

తలసాల. ద్వ. వి. (తల+సాల) తలవాకిలి. "క... భీతిఁ బులి పులి యనుచున్, దలసాల వెడల

రందొక, హాలికుఁడు శరచాపహస్తుఁ డయి నిశ్శం కన్." వేం. పంచ. 3, ఆ. ౧౧. ద్వి. హరిశ్చ. ఉ. ౯౫౪. పం.

తలసూపు = తలచూపు. (తలపడు, ఎదురగు.) "వ... దేవదానవుల కయిన దుర్జయుం డగునర్జునునకుం దలసూప వచ్చునే..." భార. విరా. ౪, ఆ. ౧౯౫.

తలా- దే. అవ్య. చెఱి, ఒక్కొక్కనికి. "ఉ. అంతటం దలాయొకటి స్వార్థము గల్గుట దోఁపఁ బల్కె." ప్రభా. 3, ఆ. ౮౯. పరమ. ౪, ఆ. ౨౩౬.

తలాఁపి. దే. వి. (తల+ఆఁపి శ. ర.) తలగడ, ఉపధానము. "చ. సిదికిలి పాన్పుపైఁ బలికి నొయ్యనఁ గేలు దలాఁపి చేసి .." ఉ. హరి. ౫, ఆ. ౨౦౫. ఆం. భా. ద్వి. ౧౬౩.

తలాటము. దే. వి. (తల+ఆట) 1. తురాయి, గుఱ్ఱముల తల యందుంచెడిభూషణము. "గీ. నీలికుంతె తలాటంబు బేరజంబు, మణులమొగముట్టు పన్ని సాహిణి యొకండు, కర్త యెదుటికిఁ గొని వచ్చె......సైంధవంబు." స్వా. ౪, ఆ. ౭౮, ఆం. భా. ద్వి. ౧౯౯; 2. (మురుగులు మున్నగువాని యొక్క) నకిషీచేసినముఖభాగము. "సీ. కామసింహము గెల్వఁ గలబిరుదనఁగ సింగపుఁదలాటపునీలికాసె యొసఁగె." సమీర. 3, ఆ. ౭౧౭.

తలాడ. ద్వి. వి. తలగడ, ఉపధానము. "ఉ. పట్టు తలాడమయున్ హాళఁది పచ్చనునుంబఱుపు..." పాంచాలీ. ౫, ఆ. ౧౦. హర. ౪, ఆ. ౧౨.

తలాతలము. సం. వి. అ. న. అధోలోకములలో నొకటి.

తలారి. వై. వి. (సం. స్థలవారక) తలవరి, ఆరెకుఁడు. "శా...డాఁగఁ బోయినఁ దలా రిల్లయ్యో నేఁ డేడకున్, బో నా..." దశా. ౧, ఆ. ౭౯౭. ఆం. భా. ద్వి. ౧౮౩.

తలారించు. దే. అ. క్రి. మరలు. "వ...మక్కువం గ్రేపులం దలంచి తలారింపక తమకంబులం దమ తమయంత సంభారవంబులు సేయుచు..." భాగ. ౧౦..స్కం. పూ. ౧౧౯౬. భాగ. ౧౦. స్కం. పూ. ౯౬౬.

తలి. దే. వి. తల్లి. "క. మొలకలు రాజకుమారులు, తలిదండ్రులు లేనివారు..." జై. ౧, ఆ. ౬౩.

తలికె. దే. అవ్య. ముందు, పూర్వము. ఉదా:— ప్రొద్దుపొడుపతలికె వచ్చినాఁడు. (శ. ర.)

తలిగ. వై. వి. (సం. స్థాలికా.) కంచము, భోజనపాత్రము. "సీ. తెలె హరివాణంబు తలిగ కంచము తట్ట చాకి లనంగఁ గంసంబు దనరు." ఆం. భా. ద్వి. ౭౪౪.

తలినము. సం. వి. అ. న. శయ్య, పఱుపు. విణ. (అ. ఆ. అ.) 1. విరళము, పలుచనిది; 2. స్వల్పమైనది; 3. నిర్మలము; 4. దుర్బలము.

తలిమము. సం. వి. అ. న. 1. మూదిపఱుపు; 2. వితానము,మేలుకట్టు; 3. రాతితోఁ గట్టిననేల; 4. కత్తి.

తలియ. వై. వి. (సం. స్థాలికా.) భోజనపాత్రము, కంచము. "ఆ. తలియ పళ్లెరంబు తెలె హరివాణంబు,తట్టి కంచ మనఁగఁ దనరుఁ బాత్ర." ఆం. సం. మాన. 3౦. వేంక. మాన. ౪౭.

తలిరాకు. దే. వి. (తలిరు+ఆకు) చిగురాకు. "క. తలిరాకుగుత్తిఁ దమిఁ గోయిల చంచునఁ జించి క్రోలురీతిని..." పారి. 3, ఆ. ౪౯. ఉ. రా. ౬, ఆ. ౮.

తలిరించు. దే. అ. క్రి. చిగుర్చు. "ద్వి. తలిరించి కడు నివతాళించుచున్న, యెలమావి క్రిందటికే తెంచి నిలిచి." ద్వి. పరమ. ౨, ఆ. ౫౭. పు.

తలిరు. దే. వి. చిగురు, పల్లవము. "క. కలయంగఁ గరముం జరణంబుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం,బలి వెసఁగినసడమామిడి,చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్." భార. భీష్మ. 3, ఆ. ౨౨౩. ఆం. భా. ద్వి. 3౯. విణ. లేఁతది, తరుణము. "సీ. తలిరు బ్రాయమువాని పలరాజు నలరాజు నలరాజుఁ దెగడుసోయగము వాని." వసు. 3, ఆ. ౪౬. నీలా. ౧, ఆ. ౭౬.

తలిరుఁబోఁడి. దే. వి. (తలిరు+పోఁడి) ఆఁడుది, మనోజ్ఞురాలైనఆఁడుది. "సీ. త్రైలోక్యమునకు జంద్రకళాధరుఁడు తండ్రి తల్లి యోఁగాక యీ తలిరుఁబోఁడి." హర. ౪, ఆ. ౬౪. దశా. ౧, ఆ. ౨౭౨.

తలిరుఁబోణి=తలిరుఁబోఁడి. "గీ. తమ్ములముసేయుచో నొక్కతలిరుఁబోణి, రాకుమారునిఁ జూచి..." నైష. ౬, ఆ. ౬3.

తలిరుగ్రోల్గువ్వ. దే. వి. (తలిరు+క్రోలు+గువ్వ.) కోయిల. "సీ...పిక మరాళ గోవెల కోయిల తలిరుగ్రోల్గువ్వ కెంపు, గీ. కన్నులపులుఁగు పెంపుడు గున్న యనఁగ." వేంక. తిర్య. ౧౦౨.

తలిరుటాకు. దే. వి. (తలిరు+ఆకు) చిగురాకు. "సీ. తలిరుటాకులు కటారులమాడ్కి మెయి సోఁకఁ గర్పూరంబు పెంధూళిగలిని కప్పు." రసిక. ౪, ఆ. ౨౩. రాధికా. ౩, ఆ. ౭౩.

తలిరుదిండి. దే. వి. (తలిరు+తిండి) కోయిల. "సీ. సకి కెందలిరుదిండులకు వందన మొనర్చి చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చె." విజ. ౩, ఆ. ౩౯. ఇట్లే: తలిరుమేఁతరి. సాం. ని. తిర్య. ౭౭.

తలిరువిల్తుఁడు. దే. వి. మన్మథుఁడు...సాం. ని. దేవ. ౮. ఆం. భా. ప్ర. ౪౯.

తలిర్చు. దే. అ. క్రి. 1. చిగుర్చు, పల్లవించు. "మ...వసంతకుండు దమపైఁ గన్నిడ్డఁ గారాకుఁ గెం,దలిరాకయ్యెనో నాఁ దలిర్చె వడిఁ గాంతా కాంతరోర్వీజముల్." కు. సం. ౪, ఆ. ౮౯. భార. ఆది. ౪, ఆ. ౨౦; 2. సంతోషించు. "క. ఆద పట్టువడియె ధర్మజుఁ, డదయుఁడ గు ద్రోణుచేత నక్కట నేఁ డున్మదుఁడై సుయోధనుఁడు దం,డ్రి దలిర్పఁగ నేఁగుఁ గరిపురికిఁ గొని యెలమిన్" భార. ద్రో. ౧, ఆ. ౧౨౦. వసు. ౪, ఆ. ౬; 3. అతిశయించు, అధికమగు. "గీ. కౌతుకము పూని యొండొరుఁ గాంచఁ దివురు, చంచలాక్షికిఁ బతికి నేత్రాంచలములు, గూర్చె వలరాచయొజ్జ కోర్కులు దలిర్ప, నదికదా భావి శోభనవ్యంజకంబు." వసు. ౩, ఆ. ౯౨. భార. భీష్మ. ౧, ఆ. ౧౬౯; 4. ఒప్పు. "సీ. రాగభేదములవర్జ్యములఁ దొలఁగించి లయతాళశుద్ధి నెంతయుఁ దలిర్ప." కళా. ౨, ఆ. ౩౩. భార. ఉద్యో. ౩, ఆ. ౧౧౦; 5. కనఁబడు. "సీ. చేరఁ జేరఁ దలిర్చె వీరలక్ష్మీవాసవనజాతదళముపై వప్రశిఖులు." వసు. ౪, ఆ. ౯౧. భార. భీష్మ. ౧, ఆ. ౧౧౦.

తలిర్పు. దే. వి. (తలిర్చు.-ధా.) అతిశయము, పెంపు. "క. మునివర నాదగుచిత్తం,బునఁ గౌతూహలము సాల మొలకెంచి తలి,ర్పున నెలరారెడు..." భార. అను. ౪, ఆ. ౪౪౭.

తలిమము. వై. వి. (సం. తలిమమ్.) శయ్య, పఱపు. "క. బలునెన రైనవి గూర్పఁగ, బొలివోవనిలేఁత పాయపుఁ బోగరులతోఁ, దలిమము లెక్కెడి వన్నెల, పులుఁగులఁ గని తనదుమదిని బొదలు విరాళిన్." య. ౨, ఆ. ౮౬. (శ. ర. పా.)

తలుఁగు. దే. అ. క్రి. పోవు; తొలఁగు. "సీ. ఇక్ష్వాక్వ్యయతిబాల యిం దుద్భవం బగుదౌహిత్రలాభంబు దలుఁగ నెట్లు. ఆ. దీనిఁ బుత్త్రు..." భార. ఆది. ౬, ఆ. ౨౪౮. "చ. అటు దలుఁ డౌర యెంతటి మహాత్ములు మీరలు..." కళా. ౯, ఆ. ౩౮. స. క్రి. పోఁగొట్టు. "సీ. ఉత్తమక్షత్త్రియుం డౌరులదుఃఖంబులు దలుఁగంగఁ బుట్టినధర్మశీలుఁ, డలయక మృత్యుభయం బైనచో విప్రుఁ గాచి సత్పుణ్యలోకములు వడయుఁ." భార. ఆది. ౬, ఆ. ౨౯౬. భార. అర. ౩, ఆ. ౧౫.

తలుగు. దే. వి. పసులఁ గట్టెడుపలుపు, సందానము. "క. తలుగులపొది యొకవనఁ బెయ్యలదామెన యొక్కవలన ననువై యుండన్, మొలమోవి పెక్కుచుట్లుం, బలుద్రాటం జుట్టి గోపభావం బమరన్." భార. విరా. ౧, ఆ. ౧౨౯, ఆం. భా. ద్వి. ౨౩౧.

తలునము. సం. వి. అ. పుం. వాయువు.

తలుని. సం. = తరుణి.

తలునుఁడు. సం=తరుణుఁడు.

తలుపు. దే. వి. కవాటము, "మ. ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొకచన్నొయ్యారపుస్నీల వీథికిఁ దోఁపన్ దలుపోరగా నొకపురంధ్రీరత్న మీక్షించె రాజకిశోరంబు..." స్వా. ౯, ఆ. ౬౫. ఆం. భా. ద్వి. ౨౧.

తలేరు. దే. వి. (తల+ఏరు) తలనొప్పి. "సీ...తలే రనఁగ శిరస్తోదము నగు...". ఆం. భా. ద్వి. ౧౨౮.

తలోద. సం. వి. ఆ. స్త్రీ. నది, ఏఱు.

తలోదరి. సం. వి. ఈ. స్త్రీ. సన్ననినడుము గల ఆఁడుది; ఆఁడుది.

తల్కము. సం. వి. అ. న. అడవి.

తల్కు. దే. వి. 1. కాంతి. "మ. తననీటుల్ మెఱయించు జేనపాడవుం దాల్మిఁ టెటి యగదంపుఁగుం, దనపుందల్కులు గ్రుమ్మరించుఁ జిఱునవ్వాకత్తిచిమ్మున్..." కువల. ౯, ఆ. ౪; 2 ఒప్పు,ఇంపు. "చ...వానివింతయుం, దముఁలకు వాసియిచ్చుకప్రుఁదల్కులకున్ మఱి వానిమేనిడాల్, కొమరున కేను మేనుపడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్." కువల. ౪, ఆ. ౧౭౬; 3. మెఱయుట కనుకరణము. "చ. తనతనుకాంతి దల్కను సుధారసపూరము గాఁగ..." కు. సం. ౭, ఆ. ౧౪౦.

తల్లు. దే. వి. = తలఁగు.దే. అ. క్రి. (తొలఁగించు టకు: "...ప్రభుక్ష్వమెలర్పఁగఁ దాల్మి యూఁది దుస్తరతరమానస వ్యథలు తల్లుము." భార. అర. ౬, ఆ.) (శ. ర.)

తల్పకుఁడు. సం. వి. అ. పుం. పక్కలు వేయుబంటు.

తల్పము. సం. వి. అ. పుం. న. 1. పఱపు, శయ్య; 2. మేడమీఁదిగది, అట్టాలకము; 3. భార్య; 4. ఓడ ముందటిభాగము; 5. యంత్రము.

తల్పు. దే. వి. కవాటము. "చ. తలఁకునఁ గోటనల్లడలఁ దల్పులు వేల్పులు మూసి..." ఉ. రా. ౪, ఆ. ౨౭౨.

తల్లఁపి. దే. వి. పరుండునపుడు తల యుంచుకొను దిక్కు. "ఉ.కరవీరపుంజాయలదట్టెఁ జుట్టి వేఁతల్లఁపి దిక్కునందు నిడి..." రా. వి. 3, ఆ. ౨౮. (శ. ర. పా.)

తల్లజము. సం. విశ. (అ. ఆ. అ) శ్రేష్ఠము. (ఇది వృత్తియం దుత్తరపదమై ఈయర్థము నిచ్చును. 'ఇతర విశేషణములకువలె విశేష్యాను సారముగ రూపము మాఱ' దని సూ. ని.) "క. పల్లవపేశల శయ్యా,వెల్లస్త్రీతులకుఁ దనిసి విమలధ్వనులం,బెల్లె నయించుఁ బుంస్కోకిల,తల్లజులు వసంతవేళఁ దనరిరి మిగులన్." కాళిందీ. ౪, ఆ. ౨౦.

తల్లడకుడుచే. ద్వ. అ. క్రి. (తల్లడము+కుడుచు) తల్లడము నొందు (శ. ర. బ్రౌ.)

తల్లడపడు. వై. అ. క్రి. (తల్లడము+పడు) చలించు, వడఁకు. "క. అని మొన సాల్వుఁడు ప్రద్యుమ్ను నిశాతశరాలివిద్ధమర్ముం డయి పెల్చన మూర్ఛ వోయి పడియెం,దనరథముపయిం ధరిత్రి తల్లడ పడఁగన్." భార. అర. ౧, ఆ. ౧౬౫. భార. అర. ౬, ఆ. ౨౯; 2. బాధపడు. "క. పల్లటిలిన యుల్లముతోఁ,దల్లడపడుచున్న పిన్నతమ్మునిఁ గని." భాగ. ౧, స్కం. 3౪౬. భార. భీష్మ. ౧, ౨౯.

తల్లడపఱుచే. వై. స. క్రి. (తల్లడపడు ధా. ప్రే.) బాధపెట్టు. "క. దిగవిడువక ప్రాణంబులు,తగ నాకంఠమున నిలిచి తల్లడపఱిచెన్." నా. పంచ. 3, ఆ. ౧౭౯.

తల్లడపాటు. వై. వి. 1. బాధ. "ఉ. తల్లి ధరిత్రివై దొఱఁగి తల్లడపాటునఁ జెంది చిత్తముం,బల్లటిలంగఁ బ్రాణములు వాసిన..." భాగ. ౧, స్కం. ౧౧౯. ఉ. రా. ౬, ఆ. ౯౯; 2. కంపము, వణఁకు. "క. ఇది యేమొ యనిమొద వడఁకుచు వడపై గుండె భగ్గు...... బలుఁకులదీనత,గదురఁగ" సా. ౨, ఆ. ౭౯; 3. భయము. "ఉ...మానమర్దనము..... లాంగుఁడై, తల్లడపాటు చిత్తమునఁ దాల్చక నెరముఁ గట్టిపెట్టి యా,ఖల్లపిభుండు కృష్ణునకు భక్తిమెయిం బ్రణమిల్లి యిట్లనున్." వి. పు. ౬, ఆ. ౨౬౭.

తల్లడపెట్టు. ద్వ. స. క్రి. (తల్లడము+పెట్టు) బాధించు. "క. ఇల్లడగొని యాఁచికొనిన,బల్లిదు లవె యిటియఁ గట్టఁబడి కేటకముల్, పెల్లుగఁ దేల్లం గాకులు, తల్లడపెట్టంగ నొఱలెదరు నో రెండన్." మార్క. ౨, ఆ. ౧౦౭. భార. అను. ౫, ఆ. ౧౦3.

తల్లడము. వై. వి. (సం. తరళం. త. తళ్లాట్టమ్) 1. చలనము, చాంచల్యము. "ఉ. తామరపాకు సీడ వలెఁ దల్లడ మందిరి పౌరు లెల్లరున్." ఉ. హరి. 3, ఆ. 3౫. కళా. 3, ఆ. ౧౪౬; 2. తొందర, సంభ్రమము. "చ. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై,పరువిడఁ బోవు పోవు మని..." భాగ. ౧౦. స్కం. ఉ. ౯౦; 3. కలఁత. "ఉ. తల్లియుఁ గన్నయేవ్వరు నుదాత్త మతుల్ తమయొద్ద వాసినం; దల్లడ మంది యంద ఱును దద్దయు దుఃఖితచిత్తులై రె..." భార. ఆది. ౮, ఆ. ౫3. భార. విరా. ౨, ఆ. 3౦3; 4. భయము. "గీ. వేషభీషణదానవవితతిలోనఁ, దల్లడంబునఁ బెదవులు తడుపుచున్న, సాధ్వీరఘువీర గేహినిఁ జక్కఁ జూచి,యవ్వనో కాదొ కదా యని యనిలసుతుఁడు." రామా. ౬, ఆ. ౧3౦. అం. భా. ప్ర. ౧33.

తల్లడించే. వై. అ. క్రి. 1. చలించు, కదలు. "చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱుక ల్విరియంబడ బోర మోవ నెం,డినవదనంబులం దెఱచి నిక్కిన యట్టులు దల్లడించుటల్,గనఁబడ..." పారి. ౪, ఆ. ౨౧; 2. కలఁతనొందు. "ఆ. బహుళసంకట ములు ప్రాప్తంబులైనచోఁ, దల్లడింపఁ డాత్మ తత్త్వవిదుఁడు, వాయుశీతవర్షపాతకంబులఁ కించుకైన గిరిచలించునట్లు." సీతారా. 3, ఆ. ౧౭3; 3. భయపడు. "సీ ..అనవు వేచి, తల్లడించుచు బొఱఁ దుల్లంబు గలఁగంగఁ దల

చీర వీడి యాదవులు నవ్వ. గీ...పాటి యాత్మ పురము వడిఁ జొచ్చె..." భాగ.౧౦, స్కం. ఉ. ౪౨౪. దశా. ౨, ఆ. ౯౯; 4. దుఃఖించు. "వ. ఇంత దురవస్థ వచ్చునే యని తల్లడించు వారును..." ఉ. రా. ౪, ఆ. ౯౪. స. క్రి. బాధించు. "మత్తకోకిల. తల్లిదండ్రుల నన్న దమ్ములఁ దల్లడించినవారలన్,మల్లడించియు మీర లిప్పుడు మాటిమాటికి సెప్పుడున్,భల్లపంక్తుల పాలు సేయుఁడు..."సానందో. ౨, ఆ. ౩౪. పు.

తల్లడింపు. వై. వి. (తల్లడించు ధా.) భయము. "సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి... య టన నధృతి యగు." ఆం. భా. ప్ర. ౧౩౩.

తల్లడిలు. వై. అ. క్రి. 1. చలించు, కదలు. "చ... లతాంగినేత్రముల్, చటులత లజ్జఁ దల్లడిలె..." స్వా. ౭, ఆ. ౭౧; 2. బాధపడు. "శా... వత్సోజాగ్రద్రమఁ గాంచి తల్లడిలు నీసుం దాపమున్ మీఱఁగాన్." ఆము. ౭, ఆ. ౧౪౯: 3. భయపడు. "సీ. శస్త్రాస్త్రములు రథ్యసారథి వర్మాంగతలి నాఁటుతఱచునఁ దల్లడిలక." భార. విరా. ౪, ఆ. ౬౨. దశా. ౨, ఆ. ౪౩౯.

తల్లడిల్లు = తల్లడిలు. 1. కంపించు, వణఁకు. "ఆ. వచ్చె నకులుఁ డమితవాహినీపదహతిఁ, దల్లడిల్లు చుండ ధరణితలము."భార. సభా. ౧, ఆ. ౨౬౭. నీలా, ౨, ఆ. ౭౩; 2. బాధపడు. "గీ. ఎగ్గతం బునఁ దానుఁ గార్గిఁ గాలె, నటె యనాథయై దీనికి నంతరంగ, మలఁదురక తల్లడిల్లల యారట మున,నుడుక కలమటఁ బడక యెట్లుండుఁ జెపుమ." భార. ఆశ్ర; ౨, ఆ. ౧౬౩; 3. భయపడు. "గీ...దానిఁ జూచి భయము దగిలి మత్సైన్యంబు,దల్లడిల్లి యఁల్గినెఁ బెల్లురేఁగి." భార. అర. ౧, ఆ. ౧౯౧. ఆము. ౪, ఆ. ౨౦౬; 4. దుఃఖించు. "గీ. మలయుఁ నంతంతఁ జేరువఁ బోలయు నింతి,దన్నుఁ జూడమి కెంతయుఁ దల్లడిల్లు." భార. విరా. ౨, ఆ. ౨౭౦. కళా. ౬, ఆ. ౬౨. [శయము.

తల్లము. సం. వి. అ. న. బిలము. పుం. చెఱువు, జలా

తల్లి. ఉభ. వై. వి. (సం. తల్లీ. త. తల్లి.) జనని, మాత. "శా. తల్లిం దండ్రియుఁ నన్నుఁ గా నని మనస్తాపంబునం బొక్కఁగా." స్వా. ౩, ఆ. ౯౭. భార. ఆది. ౧, ఆ. ౧౭౯. విణ. 1. మొదటిది. (శ. ర.); 2. ముఖ్యమైనది. ఉదా.— తల్లికొండ్ర, తల్లిగోడ, తల్లివేరు. మొ.; సం. వి. ఈ. స్త్రీ. జవరాలు, యువతి.

తల్లిక. సం. వి. ఆ. స్త్రీ. తాళపుఁజెవి.

తల్లికొండ్ర. ద్వ. వి. (తల్లి+కొండ్ర) మొదటికొండ్ర. (శ. ర.)

తల్లిగోడ. ద్వ. వి. (తల్లి+గోడ) ఇంటికి ముఖ్యమైన గోడ. (శ. ర.)

తల్లితనము. ద్వ. వి. (తల్లి+తనము) మాతృత్వము. "ఉ. తల్లివి నీవు ధన్యకుఁడు తండ్రి యసంశయ మింతవట్టు నీ,యుల్లమునం దెఱింగియును నొప్పని పల్కులు పల్కె దింక నీ,తల్లితనంబు చాలు..." దశ. ౧౦, ఆ. ౭౯.

తల్లితల్లి. వై. వి. (తల్లి+తల్లి) 1. తల్లిని గన్నతల్లి, మాతామహి; 2. (తనతల్లి యైనగంగకుఁ దల్లి యైన) లక్ష్మీదేవి. "గీ...తల్లితల్లి, కడలికూఁతురు సిరి లిబ్బిపడఁతి తమ్మి,యింటిగరిత తన శ్రీ రొప్పు..." ఆం. సం. దేవ. ౧౦.

తల్లితోడు. ద్వ. వి. ఒకానొక ఒట్టు. వా. విణ. (తల్లి+తోడు) సహాయకము, పోషకము. "సీ. జల్లిముత్తియములు మొల్లపూదండలు, తల్లితోడు భంగిఁ దడఁబడంగ." ద్వా: ౩, ఆ. ౧౩౯. ఆము. ౭, ఆ. ౭౬.

తల్లియ. వై. విణ. (సం. తల్లీ.) ముఖ్యురాలు, శ్రేష్ఠురాలు. "క. అనినఁ బ్రభావతి తనయాత్మని యారా యాఁడువారితల్లియ యని చిత్తినిఁ బొగడి..." శుక. ౨, ఆ. ౧౪౦.

తల్లియిల్లు. ద్వ. వి. (తల్లి+ఇల్లు) 1. పుట్టిల్లు. "సీ. ధనసమృద్ధుల కెల్లఁ దల్లియి ల్లగుటఁ గుబేరుని వీటికిఁ బెద్ద యనియు." నిర్వ. ౧, ఆ. ౪౬; 2. పుట్టింటివలె అడ్డంకి లేక ప్రవేశింపఁ దగిన చోటు......" సీ. ఏమ్రానిమూలంబు లిలకు నాధారమై శేషపడగలతోఁ జెలిమిసేయు..." ఏవృక్షమునఁ గలయి ర్లపూర్ణిశ మంథకమసం బునకు నుండెఁ దల్లియిల్లు." ద్వా. ౭, ఆ. ౬౧.

తల్లియొఱ. ద్వ. వి. (తల్లి+ఒఱ) నూతికి పైని వేయు పెద్దయొఱ. "మ. తరుణుల్ దల్లియొఱన్ గుచాంబులున్నుపన్.. నూతులందు..." ఆము. ౨, ఆ. ౬౬. ఆము. ౧, ఆ. ౭౭.

తల్లివేరు. ద్వ. వి. (తల్లి+వేరు) ముఖ్యమైనవేరు, కూఁకటివేరు. (శ. ర.)

తవణించు. దే. అ. క్రి. ఒప్పు, ఎసఁగు. "క. కమలయహితభవదుదిత, స్తవముదితుఁడ నైతి నీవు పలఁచెడి కార్యం,బపలంబితఫలసిద్ధులఁ దవణించెడు నస్మదీయదర్శనలబ్ధిన్." శ్రీ. రం. 3, ఆ. ౫౯౧.

తవన. దే. వి. (త. తవణై) గడువు మితి. (చూ. తవనతప్పు).

తవనతప్పు. దే. అ. క్రి. (తవన+తప్పు) గడువుమీఱు. "ఆ. తవనతప్పి యంములు దఱుచయ్యె మోమును,బలుకఁ బొఱ..." వరాహ. ౪, ఆ. ౬౫. పరమ. ౨, ఆ. (శ. ర.)

తవరము. వై. వి. (సం. తమరమ్) లక్క, లాక్ష. "గీ. తవర ముప్పొంగుగతి గడిదలలపిండు,బొలయుదుప్పులకదుపులవిలఁబలంబుఁ, గలిగి సురలకై తొల్లి పెక్కులు రణముల, నీకు మార్కొన్న వీరుఁ డిక్ష్వాకుఁ డితఁడు." కు. సం. ౧౧, ఆ. ౯౦.

తవళి. దే. వి. అసత్యము, బొంకు. "ఆ... టక్కు తవళి తవళి,తసుకు నసుకు దుద్దు తటవట తవతవ,సట పులిక్కి నా నసత్య మభవ." ఆం. భా. ప్ర. ౧౧౯; 2. దొంగ. "గీ. తవళి మోసరి యనఁ జెల్లుఁ దస్కరునకు." సాం. ని. మాన. ౧౨.

తవాయి. దే. వి. ఉపద్రవము. (శ. ర.)

తవిఁద. దే. వి. సస్యవిశేషము, చోడి పైరు. బ. చోళ్లు. "మ... ఏనుఁగుకుంభమ్ములలోనిముత్యములఁ గన్గ్రొద్దుల్ విదిర్చి ంచి భిల్లగజేంద్రుల్ వెలిబొమ్మలం దవిఁదచేలం జేయుదుర్ గాపుగన్." కాళ. 3, ఆ. ౭.

తవిడాడు. దే. అ. క్రి. (తడవి+ఆడు-తడవునకు వర్ణ వ్యత్యయముచే తవుడు అనురూపము వచ్చినది.) ప్రాఁకియాడు. "క. తవిడాడ నేర్చెఁ జేవులకుఁ, జవులుఁగఁ బలుకంగ నేర్చెఁ జరణాభరణ,రవములు ఘలుంఘల్లన లివలివ నడుగిడఁగ నేర్చె లీలాగతులన్." సుద. ౨, ఆ. ౨౨౪.

తవిరుదాసరి. ద్వ. వి. ఒకజాతిదాసరి. "వ... పరివారకులు సుద్దులకుమాళ్లు కొమ్మారిదాసళ్లు తవిరుదాసళ్లు..." హంస. 3, ఆ. ౨౯.

తవిలించు. దే. స. క్రి. (తవులుధా. ప్రే) 1. తవులఁ జేయు. "సీ. చెవి బ్రహ్మసూత్రంబుఁ దవిలింప నర్హంబు విట్ప్రసవోత్సర్గవేళలందు. కాశీ. ౫, ఆ. ౧౯౭; 2. బంధించు. "సీ. యుఃమనో మృగరాజుఁ దవిలింపఁ దీర్చినమకరవాగుర లిందుపసన కురులఁ." నైష. ౧, ఆ. ౧౫. 3. నిష్పంటించు. "వ... ఏఱుపిడుకలదాక్లిడి సెల్లికొయ్యలు ప్రచ్చి నుచ్చు లంటించిన స్వచ్ఛు పెరుఁగుచిచ్చు లాత్రంపులం దవిలించి చిముడ నుడికిన వెలుఁగించి..." స్వా. ౪, ఆ. ౬౦.

తవిషము. సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. స్వర్గము; 3. బలము.

తవిషి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాయుసమూహము, వాత్య; 2. ఒకానొకదేవకన్య; 3. భూమి; 4. ఇంద్రపుత్త్రిక.

తవు. దే. అ. క్రి. 1. ఒప్పు, ఎసఁగు. "క. ద్వివిధం బగుసాధర్మ్యము, భువి నుపమానోపమేయముల కొక్కటియై,తవుటయు రెంటికి ద్వివిధం,బవుట యన ద్వితీయగతియు నలరు ద్వివిధమై." నరస. ౫, ఆ. ౨౫. వేం. పంచ. ౧, ఆ. ౭౨౭; 2. అర్హమగు,తగు. "మధ్యాక్కర... అత్తపస్వికవిల గడ్డంబును గవిలజడలును గవిలకన్నులును, దవిన యన్నువ నల్లనైనదీర్ఘపుందనువును జూచి,యఁవిద కన్నుంగవ మొగిచి తెఱపక యుండె భయమున." భార. ఆది. ౪, ఆ. ౨౫౪.

తవుగోల. దే. వి. (తవు+కోల) తవ్వుట కుపయోగించు ఇనుపపనిముట్టు. "గీ. పరఁగుఁ దవుగోల దోఁకుడుపాఱ నాఁగ." ఆం. భా. ద్వి. ౨౩౦.

తవుటిపాము. దే. వి. (తవుడు+పాము) ములుఁగుచేప. (శ. ర.)

తవుడు. దే. వి. బొ. బియ్యముమీఁది మెత్తనిపొట్టు. "గీ. తెలుఁగు మాలి తవుడు దిని చచ్చువానికి, విషము పెట్టువాఁడు వెఱ్ఱివాఁడు." ఉ. హరి. ౪, ఆ. ౬౨, ఆం. భా. ద్వి. ౨౫౪.

తవులఁబడు. ద్వ. వి. (తవులన్+పడు) చిక్కు, లగ్నమగు. "క. వినుసకలభూతములవ,ర్తనములు గనునపుడు బుద్ధి దవులఁబడక యెం,దును బరఁగి దివ్యబోధం,బుల నలవడునట్టి పెంపుఁ బొందు మనింద్యా." భార. శాం. ౨, ఆ. ౧౬౪. ప్రబోధ. 3, ఆ. ౪; 2. (శత్రువులను) తాఁకు, కవియు. "చ. ప్రకటబలాఢ్యు లొక్కట తిరం బయి పల్వురు వీఁక భూమిపాలకునకు నడ్డమైనఁ దవులంబడి హుమ్మని నోరికండ నాఁ,చికొనినమ్రోఁగు బెబ్బులివిశేషము దోఁచఁగఁ బార్థుపట్టి పాయక

ముల నొంచినం బెరలి రంపఁబు లేకులసింపు నా కృతిన్." భార. ద్రో. ౨, ఆ. ౯౫; 3. నిరోధింపఁబడు. "గీ. ఎవ్వఁ డడ్డమునొచ్చిన నించుక యుఁను, దప్పులఁబడక సముద్ధతిఁ దివిరి మనలఁ, దేటి చూచుచుఁ బార్థుఁ డేడిక్కు గవిసె." భార. కర్ణ. 3, ఆ. ౧౭౬. భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౫.

తవులమి. దే. వి. (తవులు ధా.) అంటమి, నిస్సంగము. "చ. ఆవయవసంపదన్ వెలిఁగి యారయ నింద్రియగోచరత్వముం,దవులమి శక్తి తత్త్వమును దత్త్వముఁ దానె యనంగ నొప్పు భై,రవి జగదేకమాత..." దశ. ౧, ఆ. ౮.

తవులము. దే. వి. (తవులు ధా.) ఆసక్తి, కాంక్ష. "ద్వి...గోష్ఠి,తవులంబు గలిగినతజ్జంగమాను,భవమంతయప్పుడు పాయ కుండుదుము." బస. 3; ఆ. ౬౦. పు.

తవులు. దే. అ. క్రి. (త. తగిల్.) 1. ఆసక్తమగు, ఆసక్తినొందు. "చ...ఈలలితాంగియందు నా, హృదయము దద్దయుం దవిలె..." భార. ఆది. ౪, ఆ. ౩౦. నైష. ౪, ఆ. ౯౦; 2. చిక్కు, బద్ధ మగు. "క. భవదాజ్ఞానిగళంబునఁ,దవిలి పరాక్రమము విడిచి ధరణీశ్వర నీ,యపరజు లిడుమలఁ బడి కడుఁ,జిదికిరి చెఱఁ బడినసింహాళిశువుల భంగిన్." భార. అర. ౧, ఆ. ౨౧౧. భార. ఉద్యో. 3, ఆ. ౧౧౬; 3. నిమగ్నమగు. "సీ. నేఁడు పోవనిసాఁడు నిష్ఫలం బిమ్మహా,యత్నమంతయు నని యధిక చింత. ఆ. దవిలియుఁన్న నయ్యుదంకునభిప్రాయ మెఱిఁగి..." భార. ౧, ఆ. ౧౧౫; 4. దొరకు, చేపడు. "వ...సరసీమధ్యంబునం దనసీడం జూచి కంటిఁ గంటి నంటు కాని ననుచు నంటం బోవ నదియునుం దవుల కవలఁ జన..." వసు. ౪, ఆ. ౨౨; 5. కలుగు, ప్రాప్తించు. "గీ ..వసుదేవుదేవి పెనకుఁ,దవులు దేహదుఃఖం బెల్ల నవధిపోవ." హరి. పూ. ౫, ఆ. ౧౦౫. కవిక. ౪, ఆ. ౩౦; 6. విడువకుండఁ బోవు. "సీ ..అహరిణము దిరం బగుపొలుపున, విలసిల్లుచున్నయావేళయందును రాజు దమ్ములు నతులితోత్కర్ష శాలి, బాణాసనకరప్రపంచంబు విస్ఫూర్తిఁ బరఁగంగఁ దవిలి వెంబడి నలసిరి." రాఘవ. 3, ఆ. ౧౭౫; 7. ప్రయత్నించు, కడఁగు. "గీ. తవిలి మృగతృష్ణలో నీరు ద్రావ వచ్చు." భర్త్రృ. ౧, ఆ. ౫, దశా. ౪, అ. ౨౦౪; 8. కలిగించుకొను; సంబంధము పెట్టుకొను. "క. శివధనము ముచ్చిలించిన, శివధన మన్యాయవృత్తిఁ జెడిపోవంగాఁ, దవులక యుపేక్ష సేసిన, శివభక్తిద్రోహ మంద్రు శివభక్తివిదుల్." భీమ. ౫, ఆ. ౧౪౬. స. క్రి. 1. పొందు. "చ. తెవులుతలఁగొన్నవారి కవి దీఱుట కౌషధ మీగి దుర్గతుల్, దవులుజనాళిఁ బ్రోవు... ప్రస్తుతి కెక్కిన మేటిధర్మముల్." భార. అను. ౫, ఆ. ౨౦౪. బిల్హ. 3, ఆ. ౯౨; 2. తఱుము, పాఱఁ ద్రోలు. "గీ. దొడ్డిసట్టుల నీఁగక త్రోవ నెవరి, నెదిరికొమ్ములఁ గ్రుమ్ముచుఁ గడిసి కోడె,తఱపులను బొడ్చుచును వడి దవిలి అంకె, లిడుచు......" నీలా. ౨, ఆ. ౪౩. వరాహ. ౨, ఆ. ౧౦౫; 3. వలచు, మోహించు. "గీ. దత్షపురిసానికాఁతులఁ దవిలినాఁడు." భీమ. ౧, ఆ. ౧౧౦. స. క్రి. అ. క్రి. స్పృశించు, తాఁకు. "క. కవితామధురిమ డెందముఁ, దవులం గొలువుండి సదయత గనుఁ బల్కెన్." స్వా. ౧, ఆ. ౧౩, "క. భువిపుత్త్రస్నేహము మా, నవజాతికె కాక లేదె నరనాయక మీఁదు విచారింపక చేసితిఁ,దవిలెఁగదా నీకు బెట్టిదపుఁబాపము దాన్." భో. ౬, ఆ. ౩౫౭. వి. 1. సక్తత, విషయసంబంధము. "చ...మేల్తవు లయిన స్వైరిణం బయినఁ ద్రాఁ చయిన న్విడు గైనఁ దీర్పు బేలవు తను వూరకే చెడ కిలన్ గృశు నొక్కనిఁ బ్రోచు టొప్పదే." ఆము. ౬, ఆ. ౩౦; 2. అభ్యంతరము, నిరోధము. "చ. రవి యొసఁగెఁ మునీశ్వర తురంగము నీ కిది...ఎందునుం, దవులొకయింక లేక సతతంబుఁ జరించు సముల్లసద్గతిన్." మార్క. ౨, ఆ. ౭౮౦; 3. సంబంధము. "చ...భళి నిద్దురవోవుచు లెక్క మానఁ డీబల కరపుందవుల్ గలుగఁ బక్కనియోగి యటంద్రు తద్భటుల్." వి. ౨, ఆ. ౭౧. విశే. 1. ఇష్టము, ప్రియము. "క. చెవులకుఁ జవులై చల్లఁగఁ,గవులకు దవులై సమస్తకావ్యకళాబ-,ధువులై రససింధువులై, యవురా యనఁ గవిత లవని నలరంగ వలదా." వాల్మీకి. ౧, ఆ. ౧౬; 2. సంబంధము కలది. "మ. బటుపుంజన్నులు చందమామతళుకుల్ ప్రస్ఫానకాంచీలసత్, కటిలీల ల్గలజవ్వనుల్

తవులుగాఁగాఁ గాక తత్వజ్ఞుఁ డుత్కటరాజన్యుల పంచలం బడుచు నిస్త్రాణంపుసంసారపు, ర్యటనక్ గీడ్వడఁ జొచ్చునే..." మల్లభూ. శ్రు ౩౧.

తవులుకొను. దే. స. క్రి. (తవులు+కొను-స్వార్థమున.) వలచు, మోహించు. "గీ...దాని, కోర్కి లిపు రొత్తఁ దవులుకోఁ గూడు నొడయ." నీలా. ౨, ఆ ౧౩.

తవులుకొలుపు. దే. స. క్రి. (తవులుకొను ధా. ప్రే.) ప్రజ్వలింపఁజేయు. "సీ. చతురశ్రకలిత విస్తృత హోమకుండంబుఁ ద్రవ్వించి పావకుఁ దవులు కొలిపి." జై. ౮, ఆ. ౧౧౪.

తవులుచే. దే. స. క్రి. (తవులు ధా. ప్రే.) లగ్నము చేయు. "చ. ఉవిద సదుక్తి కంతఁ జెవి యొగ్గక పోఁ బెనఁగ న్విభుండు కేల్దవిలిచి చుట్టు నించుక యెడక్ భుజముల్ వలగొల్పి పొమ్మనన్." ప్రభా. ౫, ఆ. ౪౧.

తవులుపడు. ద్వ. అ. క్రి. (తవులు+పడు) చిక్కు. "ఆ. పూర్వజన్మశుభభూశిష్యముఖ్యుఁడు, భేక రూపకూపబింబితుండు, ప్రయుంతసుతుఁడు దవులు పడఁడయ్యె భూపాల,తనయసఖులచేత ధాత్రి తనయ." పాండు. ౫, ఆ. ౩౦౭.

తవులుపఱచు. ద్వ. స. క్రి. (తవులుపడు ధా. ప్రే.) చిక్కుకొనఁజేయు. "గీ. యువజనంబులఁ దన యురిఁ దవులుపఱచు, కీలు గలిగిన యొకనీలనీల వేణి...." పాండు. ౫, ఆ. ౩౦౪.

తవెల. దే. వి. నోరు వెడల్పుగా నుండుకుండవంటి లోహపాత్రము. "క. కమ్మనితావులు చల్లఁగఁ, గమ్మనియాజ్యంబు హాటకపుఁదవెలలఁ బోం, కమ్మగ వంచిరి..." రా. వి. ౨, ఆ. ౧౦౩.

తవ్వ. దే. వి. రెండుసోలలకొలఁది గలమానవిశేషము. (శ. ర. బ్రౌ. వా.) "గీ...తూము ముంత ముకు సంబు, బల్ల కుంచము సోల తవ్వ పడి యడ్డ,గరిసె పుట్టి సెలగ మెడా కల మనంగ,ధాన్యములు గొల్చు వానికిఁ దగుకు సాంబ." సాం. ని. స్థా. ౫.౨.

తవ్విఁద. దే. వి. సస్యవిశేషము, చోడిపైరు. బ. చోళ్లు. "క. ఉలవలు చామలు కోద్రవములు కందులు రాజమాషములు నిష్పావంబులు చణ కంబులు దవ్విందలు జొన్నలుఁ గాని గూర్పఁ దగుధాన్యంబుల్." జై. ౪, ఆ. ౯౫, భీమ. ౩, ఆ. ౫౭.

తష్ట. సం. వి. ఋ. పుం. 1. ప్రజాపతి; 2. విశ్వకర్మ. విణ. (ఋ. త్రి. ఋ) చెక్కువాఁడు.

తష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెక్కఁబడినది.

తష్టి. సం. వి. ఇ. స్త్రీ. తక్షణము, చెక్కుట.

తసనా. దే. వి. చిక్కు. (వా.)

తసి. దే. వి. పట్టు పుసనాఱుఁ బురుస, నసి. (శ. ర. బ్రౌ.)

తసుకరి. దే. విణ. (తసుకు+అరి) టక్కులాఁడు; టక్కులాఁడి. "క. జూదరివి సుమాళివి నెఱ, వాదివి తసుకరివి గెలుపఁ గద్పునఁ జేవా, మోదర." ఉ. హరి. 3, ఆ. ౧౧౩. (ముద్రి. పా. 'తస కరివి' శ. ర. పా.)

తసుకు. దే. అ. క్రి. ప్రేమ కలిగినట్లు నటించు. (శ. ర.) వి. టక్కు, మోసము, అసత్యము. "చ. తసుకులు మూల్గు లగ్గలికె తాఁకులు సోఁకులు... గుసగుసమాటలు న్నడిచెఁ గూరిమి నిద్దటికి న్నమంబుగన్." రాధికా. ౨, ఆ. ౧౪౩, అం. భా. ప్ర. ౧౧౯.

తసుకులాఁడి. దే. విణ. (తసుకులు+ఆఁడి) టక్కులాఁడి. (శ. ర.) [దొంగిలించు స్త్రీ.

తస్కరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కోపము గలస్త్రీ; 2.

తస్కరుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

తస్స. దే. వి. దుర్మాంసము. "సీ. పుఱ్ఱెల కీఁగలు వ్రాలఁ బండ్లు బల్లిన రాలఁ గండ్లఁ దస్సలు చీల రొండ్లు వ్రేల." చంద్ర. వి. 3, ఆ. ౪౭, అం. భా. ద్వి. ౧౩౧.

తహతహ. దే. వి. (క. తహతహ. త. తవిప్పు.) 1. కుతుకము; తొందర. "క. శయ్యకుఁ దార్చి యనంగుని, సయ్యాటపుఁ జిట్టకంపుఁజదురుల కపు డాయయ్య దొరకొని ప్రియోక్తుల,నయ్యువతిం గవయుంతహతహం బ్రార్థించెన్." రామా. ౪, ఆ. ౧౬౧. అం. భా. ప్ర. ౧౪౦; 2. దుఃఖము. "క. ఉప్పరమెగసి యజాండము,చిప్పలుఁ దాలంగ మేరుశిఖరంబులపైఁ, గుప్పించి దాఁటికొందునొ, తప్పక నామనసులోనితహతహ తీఱన్." కాశీ. ౧, ఆ. ౧౧౨. హంస. ౧, ఆ. ౧౨౭; 3. అజ్ఞానము, తమస్సు. "సీ. మీ తేజమున నాదు మేనిలో తహతహ కలుపాంబుపటలంబు గ్రాఁగిపోయె." హర. ౪, ఆ. ౫౯.

తహతహపడు. ద్వ. అ. క్రి. (తహతహ+పడు) దుఃఖించు. "వ...వైస్వరసంబునకు సేదనం బగు

శ్రీరామదేవునివదనంబుఁ జూచి యేచందంబునఁ దాళుదు నని తహతహపడుచు..." ఉ. రా. ౬ ఆ. ౩౪౩. దశా. ౪, ఆ. ౧౨౭.

**తహతహపెట్టు.** దే. స. క్రి. (తహతహ+పెట్టు) తొందరపెట్టు. "క. తహతహపెట్టితిఁగా నినుఁ, గుహనామృగవాంఛ ఫలము గుడిచితిఁగా..." రామా. ౯, ఆ. ౩౧.

**తహపడు.** ద్వి. అ. క్రి. (తహతహ+పడు) దుఃఖించు, బాధపడు. "క. మును దాఁచు మూల దాఁచు కుటని భార్యను బొడిచి యూడె నది దీపము చూపినఁ జూచి వీఁడు మఱ్ఱి మనునో యను శంక చేత మది తహపడుచున్." హంస. ౩, ఆ. ౧౦౯.

**తహశీలు.** హిం. వి. పన్ను, సిస్తు. (శ. ర.)

**తహశీలుదారు.** హిం. వి. శిస్తువ్యవహారముఁ జూచు ఉద్యోగి. (శ. ర. వా.)

**తళతళ.** దే. వి. 1. మిఱుమిట్లుకొలుపుకాంతి. (దీనికిఁ గర్మధారయమున నిగాగమము వచ్చును.) "క. తళతళని తరణిమెఱుఁగుల..." స్వా. ౫. ఆ. ౧౦౦. భీమ. ౧, ఆ. ౧౧౭; 2. మిక్కిలి మెఱయుట మొదలగువాని కనుకరణము "సీ. అరుణాంబుజంబుల యంతర్దళంబుల తళతళ యను జిగి దళముకొల్పి." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౪; వరాహ. ౪, ఆ. ౩౨, భార. భీష్మ. ౨, ఆ. ౧౭౪.

**తళత్తళ.** వి. = తళతళ. వ. (మిఱుమిట్లు కొలుపు కాంతి.) "వ......దశముఖుని వీరభటులచేతి విచ్చుకత్తుల తళత్తళల హత్తుకొని..." ఉ. రా. ౪, ఆ. ౧౬౩, రా. వి. ౨, ఆ. ౩౯.

**తళిగ.** వై. వి. (సం. స్థాలికా.) భోజనపాత్రము, కంచము. "వ. నిత్యంబునుం బదివేవురుబ్రాహ్మణులు బ్రహ్మవిదులు బసిండితళిగల నిష్టాన్నంబులు గుడిచి తృప్తు లయినన్..." భార. అర. ౧, ఆ. ౨౧౪; రామ. ౩౬౬.

**తళియ.** వై. వి. (సం. స్థాలికా) భోజనపాత్రము, కంచము. "వ.. మఱి బంగారుభృంగారుకర్కరీ కలాచికలు, తళియలు, పళ్లెరంబులు, తామ్రపాత్రంబు లారకూటంబులు లన్నియుం దాకట్టు వెట్టియుం..." కాశీ. ౪, ఆ. ౧౦౦. భార. శాం. ౧, ఆ. ౯౪; 2. వంట. "సీ. నరమాంసములు దేఁడ నైర్ఋతి దళియకు జలధీశ్వరుఁడు రాఁడ జలకమార్పి." కు. సం. ౧౦, ఆ. ౯౦; 3. దేవునికి నివేదించినయన్నము. "చ. లలనరో... మాకు నిచ్చలుఁ బెరుమాళ్లకోవెలఁ బ్రసాదము కట్టడి సాగి వచ్చునా తళియ ప్రసాదమీవు సతతంబుఁ బసాపడుము..." వైజ. ౨, ఆ. ౧౨౯, (చూ. ౧౩౦.)

**తళుకారు.** దే. అ. క్రి. (తళుకు+ఆరు) మిక్కిలి ప్రకాశించు. "సీ. మొలకనవ్వులవాఁడు తళుకారుతొలుకారు బలుకార్మొగులఁ గేరుపొలుపువాఁడు." అచ్చ. సుం. ౮౩, సానందో. ౨, ఆ. ౩౯, పు.

**తళుకు.** దే. వి. (దీనియామ్రేడితరూపము తళుకుతళుకు. మొ.) 1. అధికప్రకాశము. "క. కలికినిడువాలుఁ గన్నుల, తళుకులు మణిదీపశిఖలుఁ దడఁబడ లక్ష్మీ, నిలయుని కిచ్చిరి కొందఱు, చెలఁతలు మార్తికవిచిత్రనీరాజనముల్." పారి. ౨, ఆ. ౩, విక్ర. ౪, ఆ. ౯౯; 2. మెఱయుటయం దగునను కరణము. "గీ. తళుకుతళుకు కని మెఱయుకుందనపుఁ బసిఁడి, డాలు చిందాడుయోగదండము ధరించి." రామా. ౫, ఆ. ౧౧౪; 3. కిరణము. "సీ. మినుకు తళుకు నిగ్గు మించు కళు కనంగఁ గిరణనామంబులై కెరలుచుండు." ఆం. భా. ప్ర. ౮౨; 4. అతిశయము. (చూ. తళుకొత్తు.); 5. ఒకజాతిడేగ. "గీ. వేస్టమును దళు కాదిగ వేఱ వేఱ, యొప్పుడే గలజత గూర్చుకుండుటయును." ప్రబంధ. ౯౯౧, ఇందు. ౨, ఆ. ౬౦. విశ. మెఱయునది. "గీ... తళుకుటద్దంబు సత్కవులమనసు." నైష. ౧, ఆ. ౫.

**తళుకుచూపు.** దే. అ. క్రి. (తళుకు+చూపు) 1. ప్రకాశించు; బయలుపడు. "సీ. ప్రౌఢసంపుట పరిస్ఫురణావసరముల దంతకోరకకాంతి తళుకుచూప." కాశీ. ౪, ఆ. ౨౬౯; 2. అధికమగు. "గీ. సహజసంభ్రమ తాత్పర్యసంభ్రమములు, దళుకుచూపంగ నవరత్నదర్విఁ గొనుచు, నిందిరాదేవి యేతెంచె యిందుధరుని, హస్తపాత్రిక నమృతభిక్షాన్న మిడియె." కాశీ. ౫, ఆ. ౧౧౯; 3. కలుగు, సంభవించు. "గీ. దక్షిణాయన మొకదీవిఁ దళుకుచూపు నుత్తరాయణ మొకదీవి నుప్పతిల్లు." ౧, ఆ. ౧౨౯.

తళుకుబెళుకు. దే. వి. ఒకజాతిడేగ, శ్యేనభేదము. "సీ. జలకట్టె గిద్దు చెంచడ మన శ్యేనభేదము లివి గాకయుం దళుకుబెళుకు, కంచుమిం చనఁగను గలవు..." ఆం. భా. ద్వి. ౯౦.

తళుకెక్కు. దే. అ. క్రి. (తళుకు+ఎక్కు) స్పష్టమగు. "సీ. తలచూపి మోసులై త్రాసులై తళుకెక్కి నిక్కి నక్కలపతె నెరసి బెరసి." నరస. ౫, ఆ. ౧౧౩.

తళుకొత్తు. దే. అ. క్రి. (తళుకు+ఒత్తు) 1. శోభిల్లు, ఒప్పు. "రగడ...అవీవ్ళకు మణికర్ణాదు లేలికలు, దక్షిణమునఁ గిన్నరపురశతకము దళుకొత్తు విచిత్ర తనవీవ్ళకుఁ, బ్రతీణారులు...... రాజులు." వరాహ. ౪౦, ఆ. ౧౪౪; 2. అతిశయించు. "క. మునివరుఁడు గంధవతినం, దనుండు నా గురుఁడు కరుణ దళుకొత్తఁగఁ జెప్పినవాక్యంబుల యర్థము..." భార. శాం. ౬, ఆ. ౪౭౫; 3. కలుగు,జనించు. "సీ. తళుకొత్తె మదిఁ దిలోత్త మకు నుత్తల పాటు..." నైష. ౩, ఆ. ౩౬ వసు. ౪, ఆ. ౭౭.

తళుక్కు. దే. వి. (దీనియామ్రేడితరూపములు తళుకు తళుక్కుమెు.) 1. అధికప్రకాశము. "సీ మీఱి తళుక్కున మెఱసి నిల్చినయట్టిసోఁగ క్రొమ్మెఱుఁ గులేఁదీఁగవోలె." శుక్ర. ౬, ఆ. ౪౪, అని. ౧, ఆ. ౧౦౦; 2. మెఱయుటయం దగుననుకరణము. "సీ. ఫాలభాగమున వజ్రాలపాపటబొట్టు తళుకు తళుక్కని తాండవింప." శశాం. ౩, ఆ. ౯, చం. రా. ౩, ఆ. ౧౨౪. విణ. మిక్కిలి మెఱయు నది. "మ...అకైలాటపుంబుల్గు గ్రుక్కున మిన్నందిన మేడమీఁదికిఁ దళుక్కుంగాంతితో జారి..." సా. ౧, ఆ. ౧౨౯.

తళ్కు = తళుకు. (మెఱయుటయం దగుననుకరణము; "గీ. మెఱుఁగువలెఁ దళ్కుతళు కను మేనిదాని." ఉ. రా. ౨, ఆ. ౧౨౮. (కిరణము) "శా. క్రీడా మందిరజాలమార్గములచక్కి న్నిక్కి జాబిల్లితా, గోడ ల్నీరుగ జాఱఁ ద్రోచి కెలతళ్కుల్ చొచ్చి వెన్నాడిమై, నాడన్..." వసు. ౪, ఆ. ౨౬. (అతిశయము)(చూ. తళ్కొత్తు.) విణ. మెఱయు నది. "గీ. తళ్కుజెగి చిల్కుపచ్చరాతాళిఁ బోలి." దశా. ౧, ఆ. ౧౧౩..

తళ్కొత్తు = తళుకొత్తు. (మిక్కిలి ప్రకాశించు) "క. చిత్తంబునఁ జైకొనియెడు, నుత్తల మడఁచు ముఖపయోరుహమునఁ దళ్కొత్తెడు వెడ నవ్వునఁ బ్రియుం,చిత్తం బిగుకొత్తఁ జనియెఁ జెలువ యడవికిన్." భార. అర. ౭, ఆ. ౨౧౦. ఉ. రా. ౨, ఆ. ౧౧౦. (అతిశయించు) "సీ. కాంతి తళ్కొత్తునీకడకంటిచూడ్కితోఁ బొంచఁ గానని మేను పొగులుటయును." భార. విరా. ౨, ఆ. ౧౧౮. కు. సం. ౩, ఆ. ౩౩. (కలుగు, జనించు) "శా...నిజదుర్వృత్తిన్ విసర్జించుచున్, పత్తీర్థాంబువు నాడి క్రోలి విగతాతంకాత్ముఁడై శుద్ధిదళ్కొత్తన్ ముక్తశరీరుఁడై కనియె దివ్యత్మెచ్చ నుచ్చస్థితిన్." పాండు. ౫ ఆ. ౧౮.

తళ్లు. దే. వి. బ. 1. చెఱువుమున్నగువానియందు గాలిచే ఉబికి దరిసి మోదెడుచిన్నచిన్న అలలు. (చూ. తళ్లుగొట్టు) 2. బాధలు, కష్టములు. "గీ. చెల్లఁబో నీకు సాధ్వీమతల్లి వైన, తల్లి కేతళ్లు వచ్చె గా..." సా. ౩, ఆ. ౯౫. రామలిం.శ.౮౯.

తళ్లుకొను. దే. అ. క్రి. (తళ్లు+కొను) అతిశయించు. "ద్వి...మురిపంబు నొయ్యారమును దళ్లుకొనఁగ." ద్వి. పరమ. ౫, ఆ. ౩౮౬ పు. ౭, ఆ. ౪౯౭, పు.

తళ్లుగొట్టు. దే. అ. క్రి. (తళ్లు+కొట్టు) 1. చిన్న చిన్న అలలు కలదగు. "ద్వి. తళ్లుగొట్టెడిగుంట దరిఁ జాలఁ బ్రబలి, చల్లఁగా నీడయై చలివెంద్రవోలె, మట్టంపుఁబోడవున మానైనమట్టి, చెట్టుక్రిందటి పుట్టచేకొనియుండె." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭౩; 2. చల్లఁదనము కల్గించు. "సీ. చల్లనిగాడ్పులు తళ్లుగొట్టుసపాల సాలనిరంతరచ్ఛాయలందు." సాంబో. ౪, ఆ. ౨౧౬.

## తా

తాండవము. సం. వి. అ. పుం. 1. పురుషునృత్యము; 2. తృణవిశేషము॥.

తాండవించు. సం. అ. క్రి. నృత్యముచేయు. "సీ. ఘనవళీకాండముల్ కల్లోలతండముల్ మెండుగా నొండొండఁ దాండవింప...గీ. సరసి విహరించు నవ్వు డబ్జాతముఖులు, పాలసంద్రంబులోపల నోలలాడు, వేలుపులవెలఁదులో యన వెలసి రపుడు." కృష్ణ. ౪, ఆ. ౬౭. శశాం. ౩, ఆ ౯.

తాండవితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నృత్యము చేయింపఁబడినది; 2. నృత్యము చేయుచున్నది.

తాండ్ర. దే. వి. 1. విభీతకము, తాడి. "సీ. తాండ్ర పాపయ్య ప్రతాపమై పుణ్యంబు వెఱరాచతాండ్రల పెంపు డింపు." రంగా. ౨, ఆ. ౨౬; 2. చాఁప మొదలగువానిపై రాచి యెండఁబెట్టు తాటిపండ్లయొక్కయు మామిడిపండ్లయొక్కయు రసము. "సీ. మామిడి తాండ్ర యామలకముల్ పానకములు ....." రుక్మా. ౧, ఆ. ౧౩౨. రుక్మా. 3, ఆ. ౬.

తాంతము. సం. వి. అ. పుం. నెల, మాసము. విణ. (అ. ఆ. అ.) 1. మ్లానము, వాడినది; బాధితము.

తాంత్రికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. సిద్ధాంతము నెఱిఁగినవాఁడు; 2. శాస్త్రములు తెలిసినవాఁడు; 3. తంత్రసిద్ధాంతముల ననుసరించువాఁడు; 4. రాజ్యతంత్రము మున్నగువాని నెఱిఁగినవాఁడు.

తాంబాళము. దే. వి. (క. తాంబాళ. త. తాంబాళం) తాంబూలము మొదలగునవి యుంచుకొనుట కుపయోగపడున ట్టిత్తడి మున్నగువానితోఁ జేసిన పెద్దపళ్లెము. (శ. ర. బ్రా.)

తాంబూలము. సం. వి. అ. న. 1. తములపాకు; 2. పోఁకచెక్క, క్రముకము; 3. పీటి, వక్కలు లవంగములు మొదలగునవి కలిపినతములపాకులు.

తాంబూలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తములపాకులతీఁగ, నాగవల్లి.

తాంబూలి. సం. వి. ఈ. స్త్రీ. తములపాకులతీఁగ, నాగవల్లి.

తాఁకించు. దే. స. క్రి. (తాఁకు ధా. ప్రే.) 1. తగిలించు, అంటునట్లు చేయు. "సీ. తాఁకించుకొను జటాస్తబకంబు విరియంగఁ బానవట్టముతోడ ఫాలకలము" భీమ. 3, ఆ. ౧౯౩. దశా. 3, అ. ౧౪౧; 2. శ్రమపెట్టు. "క. ఆఁకొని వచ్చినవిప్రులఁ, దాఁకింపక యశన మిడుము..." భోజ. ౬, ఆ. ౧౬౧.

తాఁకు. దే. అ. క్రి. కలుగు, ప్రాప్తించు. "చ. ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునఁ గాశియందు సంతతముగ నంతరాయములు దాఁకుచునుండు ననంగ నిప్డు డాశ్రుతి నిజమయ్యె నే నిదె యశోకమనస్కత నుండఁగా నతర్కితగతి వచ్చెఁ జూడు మిదె కిన్నరకంఠి మహాంతరాయముల్." కాశీ. ౨, ఆ. ౧౦౧. దశ. ౧౦, ఆ. ౬౫; 2. బడలు; కృశించు, తగ్గు. "క...మగువలచంచల కటాక్ష మార్గణజాలంబు గెలువఁ దాటినఁ దాఁకవె, జగతిం గోవిదులమతులుఁ జదువులుఁ జెలువుల్." ప్రబోధ. ౧, ఆ. ౪౭. స. క్రి. రాచుకొను, ఒరయు. "సీ. జననకాలమునాఁడు జలరాశికుక్షిలోఁ దగిగొండ పొరివోవఁ దాఁకె నేని. గీ. విరహిజను లింత పడుదురే వీనిచేత." నైష. ౨, ఆ. ౧౨౩. స్వా. ౧, ఆ. ౩౭. స. క్రి. అ. క్రి. 1. తగులు, అంటు. "చ. తములము పెంపురన్ మెఱుఁగు దాఁకినచెందిరకావి కోఱలున్." హార. ౧, ఆ. ౧౫. ఆం. భా. తృ. ౧౩౨; 2. (యుద్ధమున) మార్కొను, కవియు. "గీ. ఘోరతుముల, సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ, దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ." భార. కర్ణ. 3, ఆ. ౧౯౨. భార. ఆది. ౨, ఆ. ౨౨; 3. కొట్టుకొను, కొట్టు. "సీ. కులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ దాఁకంగ వీఁకమైఁ దన్నియాడ." భార. విరా. ౨, ఆ. ౧౩౪. హార. ౫, ఆ. ౧౬. వి. 1. (యుద్ధమున) కవియుట. "సీ. సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁ డగు నని తలఁచెద నాతఁడు దక్క నొరులు. గీ. భీష్ముతాఁకోర్వరు..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౦౧. భార. శల్య. ౨, ఆ. ౨౫౫; 2. నిరోధము, అడ్డు. "క. చననిమ్ము రథం బని నను, బనుచుట యుఁను గొంకుదేఱి పఱపితిఁ దే రెం, దును దాఁకుఁ దగులు లేకయ, యనుపమహారు లద్భుతంబులై లీలఁ జనన్." హరి. ఉ. ౫, ఆ. ౭౪; 3. తగులుట, స్పర్శ "సీ. బీరెండతాఁకున బీటలు వాఱినపచ్చిగోడలమాడ్కిఁ బగిలె దిశలు." భార. ఉద్యో. ౪, ఆ. ౧౬. స్వా ౪, ఆ. ౫౯; 4. దెబ్బ, ప్రహారము. "చ. తనువు ఘనాస్త్రశస్త్రములతాఁకున నొప్పిని దప్పి పుట్టె....." భార. శల్య. ౨, ఆ. ౩౩. హార. ౫. ఆ. ౪౫; 5. బాధ. "శా...చాండాలికన్ మీటుచున్, గుండు ల్నీరుగ నెండగాలిపసి తాఁకుం జూడ కాప్రాహ్ణమున్." ఆము. ౬, ఆ. ౭. 6. క్షతము. "గీ. రవిక బిగియింతు నదియును నవల వైచి, కుంకుమపుఁబూఁతఁ జిమచిమ గొనెడు చిన్ని, పచ్చికొనగోటితాఁకులు రచ్చసేయ, గుబ్బ యరగానరాఁ బైఁటకొంగు వైతు." కువల. ౪,

ఆ. ౧౮౮ ; 7. విసుగు. "క. ఆఁకొన్నకూడె యమృతము, తాఁకొందక యిచ్చువాఁడె దాత ధరిత్రిన్." సు. శ. ౯.

తాఁకుడు. దే. వి. (తాఁకు ధా.) తాఁకుట, స్పర్శము. "క. అరుదెంచి యలిగి యుండెడి, యరు దెంచి వితాకు తాఁకుడై..." సా. ౨, ఆ. ౧౯౭. (శ. ర. పా. "మదిన్ వితాఁకుడై" ముద్రి. పా.)

తాఁకుడువేఁకి. దే. వి. (తాఁకుడు+వేఁకి) విడుచుచు తగులుచు వచ్చుజ్వరము, మన్నెపుజ్వరము. (శ. ర. బ్రా.)

తాఁకుదల. దే. వి. (తాఁకు+తల) (యుద్ధమునందు) కవియుట, మార్కొనుట. "ఆ. బంటు లుత్సహించి పగఱ పోయిరి పోయి,రంచుఁ గడఁగి బొబ్బ లార్పు లెసఁగ, నతిరయమున నడరు నట్టుగ దొరసముద్ధతి యొనర్ప వలయుఁ దాఁకు దలల." భార. శాం. ౩, ఆ. ౦. హరి. ఉ, ౨, ఆ. ౩౯.

తాఁకుదెంచు. దే. స. క్రి. (తాఁకు+తెంచు) (యుద్ధమున) కవియు మార్కొను. "ఆ. తరువుఁ బెఱికి కొనుచుఁ దాఁకుదెంచె." భార. ఆది. ౬, ఆ. ౨౯౨. కఠ. ౪, ఆ. ౧౦౫.

తాఁకులాడు. దే. స. క్రి. అ. క్రి. (తాఁకులు+ఆడు) కొట్టుకొను. ఢీకొను. "సీ. సపత్త్రములలీల శైలముల్ దివిఁ బ్రతిధ్వనులతో నొండొంటిఁ దాఁకులాడె." ఉ. రా. ౨, ఆ. ౪౪, భా. రా. యు. ౧౨౪౯.

తాఁకొను. దే. స. క్రి. (తాఁకు+కొను) అంటుకొను, రగులుకొను. "క. ఘూకంబు లున్నగుహకును, వాకిటఁ గాష్ఠములుఁ దృణమువడిఁ గప్పింపక్,లే కవిసి చిరంజీవియుఁ, దాఁకొన దనముక్కునఁ గొఱవిఁ దగిలించి వడిన్." నా. పంచ. ౩, ఆ. ౨౮౬.

తాఁకొలుపు. దే. స. క్రి. (తాఁకొను ధా. ప్రే.) తాఁకఁజేయు, కవియఁజేయు. "వ... అకూపారమెకం బొడుపు దప్పి రొప్పుచు వలవంకం ద్రిప్పి వచ్చి యప్పురుషవతంసు హంసరథదండచండం బగువాలంబునం గేలుమలంగి కొట్టుటయు నాదిట్ట తట్టువ నభిముఖంబుగఁ దాఁకొలిపి కరివెరిం బరిపరియలుగా నాయుధంబునం జేయుటయు..." సాంబో. ౩, ఆ. ౨౯.

తాఁగలి. దే. వి. పల్లపుమడి. శ. ర.)

తాఁచు. దే. స. క్రి. 1. తన్ను; పాదతాడనము చేయు. "గీ. ఒడిసి తలపట్టితిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకు కొస రించుకయు లేక కాలఁ దాఁచె." భార. విరా. ౨, ఆ. ౧౨౮. పారి. ౧, ఆ. ౧౨౩; 2. కొట్టు, తాడించు. "క... మేషయుగళ మత్యుగ్రముగాఁ, ద్రోచియును మస్తకంబులఁ, దాఁచియుఁ దరులోనఁ బోరఁ దా నవ్వేళన్." నా. పంచ. ౧, ఆ. ౧౬౯; 3. విసరు. "చ... దైత్యునో, క్కరునిఁ కయిక్ మఱొక్కరునిఁ గ్రచ్చఱఁ దాఁచి వధించిరి..." భా. రా. యు. ౬౪౩౪.

తాఁట. దే. వి. (క. తాచె.) 1. చెట్టుపెపట్ట. (శ. ర. బ్రా.) 2. చర్మము. "ఆ .. తెడ్డుతోడఁ గూడు తెచ్చి పెట్టి,దానిలోన వీపు తాఁట యెత్తఁగ మోఁదె..." చెన్న. ౪, ఆ. ౧౫౫; 3. జేను. "ఉ... హేమకాంతి యొ,న్నాళుల కుండుఁ గాని యొకనాఁడు పదంపడి సానఁబట్టినన్, దాళుక యుండునే యినుపతాఁటకుఁ జాయలు పోక. భాస్కరా." భా. శ. ౧౦౮; 4. మోసము. "ద్వి. టక్కరి పూఁట తాఁటలు సేసి ధనము, చక్కనఁ గైకొని జరిగినపిదప." ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౨,పరి. విశే. పలుచనిది, దళసరిలేనిది. వ్యవ. ఈగిన్నె తాఁటగా దున్నది.

తాఁటకత్తె. దే. విశే. (తాఁట+కత్తె) మోసకత్తె. "ద్వి. వెడలి పోఁ జూచెదో వేసాలు వన్ని,లోకంబులో లేనిలాటతాఁటకత్తె." ద్వి. హరిశ్చ. ఉ. ౯౦౩, పరి.

తాఁటదమ్మఁడు. ద్వ. వి. జీవనార్థము సన్న్యాసి వేషము ధరించినవాఁడు, లింగి. (శ. ర.) "ద్వి. తాటోటుమాటల తక్కరిగొంటు, తాఁటదమ్మని నమ్మఁదగునె యోయమ్మ." ద్వి. పరమ. ౪, ఆ. ౨౯౯. పు.

తాఁడి. దే. వి. తాండ్ర, విభీతకము. "గీ. తాఁడి యనన్ విభీత,కంబు విలసిల్లుచుండును..." ఆం. భా. ద్వి. ౪౯.

తాఁపు. దే. వి. (తాఁచు ధా.) తన్ను, పాద తాడనము. "చ...మునుపటితన్ను గొమ్మనుచు మోములపై నొకతాఁపు తాఁచినన్." రామా. ౭, ఆ. ౨౪౬. కాశీ. ౭, ఆ. ౬౧.

తాఁబేలు. దే. వి. జా. (క. తాబేలు, తామ్బేలు) కూర్మము, కమఠము. "సీ. నెత్తమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫలశ్రీ లంచుఁ దాఁబేటి చిప్ప లనుచు." ప్రభా. ౨, ఆ. ౬౪. ఆం భా. ప్ర. ౧౬౧.

తాకట్టు. దే. వి. (తాకు+కట్టు. శ. ర) నమ్మకమునకై అప్పిచ్చువానియొద్ద అప్పుతీసికొనువాఁడుంచువస్తువు, కుదువ. "సీ. తాకట్టు కుదువ యుంద్దర హారకం బీ డనంగను నాధి చెలఁగుచుండు." ఆం. భా. ద్వి. ౨౮౯. వరాహ. ౯, ఆ. ౧౨౩.

తాకట్టువడు. ద్వి. అ. క్రి. (తాకట్టు+పడు.) కుదువయుంచఁబడు. "సీ. తాకట్టువడదె యింతకు వైశ్యగృహమున ఘనపుబంగారుభృంగారుకంబు." కాశీ. ౪, ఆ. ౧౦౮.

తాకట్టువెట్టు. దే. స. క్రి. (తాకట్టు+పెట్టు) కుదువయుంచు. "వ......అరకూటిఘటంబు లన్నియుం దాకట్టువెట్టియుం దురోదరక్రీడాపరాయణుండై ..." కాశీ. ౪, ఆ. ౧౦౦.

తాకటుంగరము. దే. వి. ఉంగరము మొదలగునవి జారిపోకుండ బంగారు లోనగువానితోఁ జేసి వేసికొను సన్ననిసాదాఉంగరము. "సీ. కారు మొసళ్ల వాకట్టుమందులు చరణాంగుళంబులఁ దాకటుంగరములు." వేం. పంచ. ౧, ఆ. ౬౧౪. (శ. ర. పా.)

తాఖీదు. ఉ. వి. (ఉర్దు. తాకీద్.) ఆజ్ఞాపత్రిక. (బ్రౌ. వా.)

తాగడించు. దే. స. క్రి. (తాకు+గడించు. శ. ర.) బాధించు. "ఆ. వారికి మామ నగుదు నటమీఁద శ్రీదేవి తండ్రి నూర కేల తాగడింపఁ, గట్టఁ గట్టి వాఁటు కమలాప్తకులనాథ..." భాగ. ౯, స్కం. ౨౮౬.

తాగాఁడి. దే. వి. (తాకు+కాఁడి - శ. ర.) నూతి ముఖమున కడ్డముగ చాలితోఁ గాని మ్రానితోఁ గాని యేర్పఱచుదూలము, పీసాహము. "సీ... పీసాహంబు తాగాఁడి నాఁ జెలంగు." ఆం. భా. ప్ర. ౧౬౨.

తాగాణి = తాగాఁడి. (శ. ర.)

తాగు. దే. స. క్రి. నీళ్లు లోనగునవి పానముచేయు, పీల్చు. (శ. ర.)

తాగుఁబోతు. దే. విణ. (తాగు+పోతు) మితిమీఱి మద్యపానము చేయువాఁడు. (శ. ర.)

తాచు. వై. స. క్రి. 1. ఖచించు,పొదుగు. "సీ. చెలఁగుచు మంచిపచ్చలు దెచ్చి మేలేర్చి దట్టంబుగాఁ గూర్చి తాచి తాచి." య. ౧, ఆ. ౭౫. ఆం. భా. తృ. ౧౩౨; 2. తొలుచు. "సీ. పాథోధిజలయుక్తిఁ బాఁచివట్టినదిశాకరులు నాఁ జనుమరకతపుఁగరుల, గరులతొండము చిక్కఁ గబళించి మ్రింగినహరులు నాఁ దొండమొప్పుగుఁ దదశ్మహరులఁ దాచినతావ లలర".. అము. ౧, ఆ. ౫౩; 3. తాపటముపెట్టు. "సీ. ఇనకరముక్తమై యిలఁ బడునభ మని వలువ తాచినవెండిమొల లనంగ." శివలీలావిలాసము. ౧, ఆ. (శ. ర)

తాజా. ఉ. విణ. (ఉర్దు. తాజా.) నవీనము, నూతనము. (బ్రౌ. వా.)

తాజే. దే. వి. కుల్లాయ. (శ. ర.)

తాట. వై. వి. (సం. తాటంకః) స్త్రీలకర్ణభూషావిశేషము. (వా.)

తాటంకము. సం. వి. అ. పుం. దంతము లోనగువానితోఁ జేయఁబడిన చెవికమ్మ.

తాటంకిని. సం. వి. ఈ. స్త్రీ.-తాటంకములు కలదిసువాసిని యగుస్త్రీ; స్త్రీ. "శా...ఓకర్ణాట తాటంకినీ." క్రీడా. ౬౦. ఇట్లే;తాటంకవతి.' చంద్ర. ౧, ఆ. ౨౩.

తాటక. సం. వి. ఆ. స్త్రీ. ఒకరాక్షసి.

తాటకేయుఁడు. సం. వి. అ. పుం. తాటక కొడుకు, మారీచుఁడు.

తాటన. వై. వి. (సం. తాడనమ్) కొట్టుట. (చూ. తాటనపుచ్చు.)

తాటనపుచ్చు. ద్వి. అ. క్రి. (తాటన+పుచ్చు) కొట్టు; వాయించు. "ద్వి....ఒడ్డణము గుబ్బల గజ్జెయలును, ధ్వనియింప నల్లన తాటనపుచ్చుచును..." బస. ౩, ఆ. ౭౪. పు.

తాటస్థ్యము. సం. వి. అ. న. 1. ఉదాసీనత; 2. సామీప్యము.

తాటాకుచక్రాలు. ద్వి. వి. బాలక్రీడా విశేషము. "సీ...సింగన్నదాఁటులు జేర్కురాతి, జాఱుబ్లి తాటాకుచక్రాలు చక్రాలత్రిప్పుడు..." హంస. ౩, ఆ. ౧౪౬.

తాటాదూటము. దే. విణ. చక్కనిది కానిది, సౌం దర్యహీనము. "క. తోఁటలు లెస్సై యున్నవి, తాటాదూటములు కావు తాపసు లుండన్. బేఁటలు దామోదరుచెఱ్ఱాటలకు న్నెలవులు మధు రాపురిచెంతన్." అప్ప. ౪, ఆ. ౩౮౧.

తాటించు. వై. స. క్రి. 1. ఘట్టనచేయు. "శా... ప్రమథధ్వజిన్యధిపతుల్ కుంభోదరాదు ల్మహా, భూభృత్సన్నిభు లంఘ్రులన్ ధరణి యాస్ఫో టించి తాటించుచున్." కాశీ. ౭, ఆ. ౩౨; 2. కొట్టు. "శా. ఆటోపంబునఁ జిమ్ము బొ మ్మగల వజ్రాభీలదంతంబులం, దాటించున్..." భా. రా. యు. ౧౪౩౬; 3. కదల్చు. "సీ. తమిదాసనముఁ గేలఁ దాటించి తాటించె జలజ మిచ్చట నెట్లు మొలిచె ననుచు." చంద్రా. ౩, ఆ. ౯౮; 4. ఆలోచించు. "సీ. తమిదాసనముఁ గేలఁ దాటించి తాటించె జలజ మిచ్చట నెట్లు మొలిచె ననుచు." చంద్రా. ౩, ఆ. ౯౮; 5. పొడుచు. "క...ఇ, క్కడకున్ వచ్చితె యోరీ, చెడుగా యని యలఁతిముష్టిచేఁ దాటించెన్." ఉ. రా. ౫, ఆ, ౪౬. స్వా. ౪, ఆ. ౧౧౫; 6. నాట్యము చేయు. "క. తాటించి నిటలనయనుఁడు, హాట కగిరిచాపవల్లి నహీశింజిని న్యాస్ఫోటించెఁ దత్క ఠోరమహాటంకృతిఁ గమలజాండ మట పగులం గన్." భీమ. ౪, ఆ. ౧౩౨.

తాటింపు. వై. వి. (తాటించుధా.) 1. తన్ను. "సీ. కాళికాభునిడాకాలి తాటింపులకమలు చేరని నాఁటికుమదహితుఁడు.' పి. శకుం. ౧, ఆ. ౩౯; 2. తాఁకుట, పొడుచుట. 'సీ. మోముత్రిప్పులు బొమ్మముడి బొమ్ముతాటింపు రానిజంకెన కావ రంపుఁబోవరు" శుక. ౨, ఆ. ౪౩౩, హంస. ౫, ఆ. ౨౭.

తాటికట్టెడ. ద్వ. వి. (తాడు+కట్టెడ) తాటిగిఱి పాము. (శ. ర.) [పాము. (శ. ర.)

తాటిగిఱిపాము. ద్వ. వి. తాటిచెట్టుమీఁద నుండు

తాటిచెట్టాట. ద్వ. వి. బాలక్రీడావిశేషము. "సీ. అత్తకోడలియాట యాలుమగలయాట తాటి చెట్టాట కోలాటములును." దశా. ౮, ఆ. ౮౧.

తాటిచెట్లాట = తాటిచెట్టాట. "ఉ...తాటిచెట్లా టలు నిద్దతాంద్రమగనాటలు..." సావి. ౧, ఆ. ౧౧౭.

తాటిటెక్కెమువాఁడు. ద్వ. వి. 1. భీష్ముఁడు. "సీ. తాటిటెక్కెమువానికన్న నెయ్యపుఁబట్టి మించు చీరంబుతో మెఱయుఁవాఁడు." రామ. ౩౩౦; 2. బలరాముఁడు. (వ్య.)

తాటిడాల్దొర. ద్వ. వి. బలరాముఁడు. "సీ.... తాటిడాల్దొర కప్పుటేటిగొంగ... గీ...సా బలుఁడు..." వేంక. దేప. ౭౧.

తాటిదండము. ద్వ. వి. (తాడు+దండము) మల్ల సాధనవిశేషము. "సీ. కంబము కోణత లాగవు డొల్ల తాటిదండములు త్రోయంగ కట్టలగవు కము." ప్రబంధ. ౮౨.

తాటిపండు. ద్వ. వి. (తాడు+పండు) తాళఫలము. "గీ. అసురులోపలఁ దాటిపం డదిమినట్లు,లదుము దునె కాని పాతాళ మఁటికొనఁగ...." కాశీ. ౧, ఆ. ౧౧౪.

తాటిపడగవాఁడు. ద్వ. వి. 1. బలరాముఁడు. "ఆ... తాటిపడగవాఁ డనంగ బలుఁడు రుద్ర." ఆం. సం. దేవ. ౭౯; 2. భీష్ముఁడు.

తాటిబాణము. ద్వ. వి. (తాడు+బాణము) ఒక రకముబాణసంచు. "వ...చక్రబాణంబులు సా కాశచక్రంబులుఁ బిట్టబాణంబులుఁ దాటిబాణం బులు గజబిరుసులు మొదలగుబాణవిద్యలవైఖ రులు..." హంస. ౩, ఆ. ౭౯, ప్రబంధ. ౧౮౧.

తాటిబెల్లము. ద్వ. వి. (తాడు+బెల్లము) తాటికల్లు వండి తయారుచేయుబెల్లము. (వా.)

తాటియాకులచిలుకలు. ద్వ. వి. బ. బాలక్రీడావిశే షము. "గీ. తాటియాకులచిలుకలు తాళ్లపాము, లకట యగచాట్లపోతనై యాడుకొనుచు..." హంస. ౩, ఆ. ౧౪౬.

తాటిరిక్క. వై. వి. (తాడు+రిక్క)- తాటిచెట్టువలె నుండు నక్షత్రము - జ్యేష్ఠానక్షత్రము. (శ. ర, బ్రా.)

తాటిరిక్కనెల. ద్వ. వి. జ్యేష్ఠమాసము. (శ.ర.బ్రా.)

తాటిల్లు. ద్వ. వి. (తాడు+ఇల్లు.) తాటియాకు నేసినయిల్లు. "మ...షక్కణంబునకు వేగం బోయి యేచక్కిఁ జిక్కనితాటింటికి నేఁగి వ్రేక మగు కాఁకన్ వెచ్చగా నూర్చుచున్." వాల్మీకి. ౨, ఆ. ౧౦౩.

తాటిసిడముజోదు. ద్వ. వి. 1. బలరాముఁడు. "వ... నందుండు యశోదయుఁ దాటిసిడంబుజోదును

బుత్తడిదువ్వలుపదాల్పును బయసనం బయి .." నీలా. 3, ఆ. ౫౦; 2. భీష్ముడు. ఇట్లే; తాటి సిడమువాఁడు. ఆం. సం. దేవ. 33.

తాటోటు. దే. వి. (త. తాటోట్టం.) 1. టక్కు, మోసము. "ద్వి. కాటుకకన్నీరు కరమునఁ దుడిచి, తాటోటు లెఱుఁగనిదానిచందమున." ద్వి. శ. సా. ౨, ఆ. ౫౦. పు. ౧౨, పం ; 2. అసత్యము. "సీ ..తాటోటు దబ్బఱయు దబ్బు, బొల్లు టవలి బొంకు కల్ల నా నసృత మా..." వేంక. మాన. ౬౬. విశ. వంచకుఁడు; వంచకు రాలు; వంచకము. "క. కుఱుకుఱ తొలివేల్పులఁ గొం,పఱఁ గూలిచి నిక్కి దేమొ తాటోట నినుం,బిఱుదిక పట్టుకొని రూ,పఱఁ జేసెద..." అచ్చ. యు. 313. శుక. 3, ఆ. ౧౮. వేం. మా. ౫, ఆ. 3౮.

తాడంకము. సం. = తాటంకము.

తాడకాఫలము. సం. వి. అ. న.—నక్షత్రములవంటి పండ్లు గలది - పెద్దయేలకి.

తాడకుఁడు. సం. విశ. (అ. డీకా. అ.) కొట్టు వాఁడు.

తాడన. సం వి. ఆ. స్త్రీ. = తాడనము.

తాడనము. సం. వి. అ. న. 1. కొట్టుట; 2. గుణించుట. (గణిత) విశ. (అ. ఆ. అ.) కొట్టునది.

తాడని. సం. వి. ఈ. స్త్రీ. చబుకు, కొరడా.

తాడనీయము. సం. విశ. (అ. ఆ. అ.) కొట్టఁదగినది.

తాడపత్త్రము. సం. వి. అ. న. తాటిమాకు ; 2. తాటంకము.

తాడము. సం. వి. అ. పుం. 1. కొట్టుట; 2. గుణించుట; 3. చప్పుడు; 4. పర్వతము.

తాడయత్. సం. శత్రు. కొట్టుచున్న.

తాడయమానము. సం. విశ. (అ. ఆ. అ.) కొట్టుచున్నది.

తాడయిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) కొట్టువాఁడు.

తాడయితవ్యము. సం. విశ. (అ. ఆ. అ) కొట్టఁదగినది.

తాడి. యు. దే. వి. తాళవృక్షము. "గీ. తా డనం గను దాడి నా తాలభూరు,హంబునకు నాఖ్యలై యొప్పు నంచికేళ." ఆం. సం. స్థా. ౬, సం. వి. ఈ. స్త్రీ. 1. శ్రీతాళము, పెద్దయాకులు గల ఒకరకముతాటిచెట్టు; 2. చెవికమ్మ.

తాడించు. సం. స. క్రి. కొట్టు, తాడనముచేయు. "గీ. కాలకంఠునిమూళి శృంగాటకంబు, గాండివంబునఁ దాడింపఁ బాండవుండు." హర. 2, ఆ. 2౮, హరి. ఉ: ౯, ఆ. ౨౨౫.

తాడితము. సం. విశ. (అ. ఆ. అ.) కొట్టఁబడినది.

తాడితాల్పు. ద్వ. వి. బలరాముఁడు. "రగడ. కోన ద్రిమ్మరిమూఁక గూరుచుకొన్న నీవును దాడి తాల్పును." అచ్చ. యు. ౬౪.

తాడిల్లుపాము. ద్వ. వి. (తాడు+ఇల్లు+పాము) తాటిచెట్టుమీఁద నుండుపాము. (వా).

తాడు. యు. దే. వి. ఔ. రజ్జువు, పాశము. "గీ. పతగకేతను శ్రీపాదపంకజంబు, గారణంబుగ జన్మించె భూరిమహిమ, గంగనై దోడు రిపుకోటి గళముతాడు, నాలుగవజాతి సమధికోన్నతవిభూతి." కాశీ. పీఠి. ౨౨, వై. వి. (సం. తాళః.) తాళవృక్షము. "గీ. నిట్టతా డనఁ బొడవుచే నిక్కినాఁడు." స్వా. ౪, ఆ. 23. ఆం. భా. ద్వి. 22.

తాడ్యమానము. సం. విశ. (అ. ఆ అ.) కొట్టఁబడు చుండునది.

తాడ్యము. సం. విశ. (అ. ఆ. అ.) కొట్టఁదగినది.

తాణెము. వై. వి. (సం. త్రాణమ్. త. తాణైయమ్) కాపాడుట, రక్షణము. "సీ. సవరణ లేనివికాలదుర్గం బేల గట్టితాణెము లేనిగడి నశించు." నీతి శ. ౮౯, చం. రా. ౫, ఆ. 3౮.

తాణెముసేయు. ద్వ. స. క్రి. (తాణెము+చేయు) రక్షించు. "మ...అపూర్వంబగురత్న మేపగిదిఁ గల్గెన్ మానికిన్ సర్వకా,లనిరాహారత నుండువారలకు నేలా దండు తాణెంబుసే, యఁనరస్వామికిఁ గాక తద్గ్రహణ కృత్యోపాయముల్ సెప్పుమా." వరాహ. ౫, ఆ. ౬.

తాణెముండు. ద్వ. వి. (తాణెము+ఉండు) రక్షకముగా నుండు. "గీ. కొమ్మల నెనర్పుసాలజాలమ్ము లోనఁ, జిలుకసాంబ్రాణి తేజీపజీరుఁ దనుపఁ, దాణెమున్నవసంతునిరాణు వెల్లఁ,గన్నుగుట్టెడుఁ గడుపుంజి గనుటకతన." కువల. 3, ఆ. ౯౬.

తాత. ఉభ. దే. వి. (త. తాతా) 1. తండ్రితండ్రి, పితామహుఁడు. "గీ. తాత ముత్తాత తండ్రులు తరతరంబు,చీమవలెఁ గూడఁబెట్టి యార్జితము సేయు..." పాండు. 3, ఆ. ౧౫; హర. 2.

ఆ. ౧౮౭; 2. తల్లితండ్రి, మాతామహుఁడు. "గీ...లంకాపురాధి, పత్యమున నీవు వెలయుఁ దప్పట్టణంబు, వెలయుఁ నీ చేత నని తాత దెలుపుట యును..." ఉ. రా. ౨, ఆ. ౨౨౪, ఉ. రా. ౨, ఆ. ౨౨౭; 3. వంశమందలిపూర్వపురుషుఁడు. "సీ. కట్టించె నొకతాత కంచి హార్మ్యంబులు హారిణాంకహాళి కేకామ్రపతికి." హరి. ౧, ఆ. ౧౦; 4. అధికుఁడు, మీఱినవాఁడు; మీఱినది. "వ...కల్పాంతకాలాదికరాళకాళవ్యాళఘనాఘనఘటాఘోర దీర్ఘనిర్ఘాతచ్ఛటా పాతంబు నకుఁ దాత యగునాసిర్ఘోషంబు..." కాశీ. ౬, ఆ. ౨౨౭. భా. రా. యుఁ ౩౧౯. వై. వి. (సం. ధాతా.) బ్రహ్మదేవుఁడు. "క. నీ తెఱఁగరయఁగఁ దెమ్మెర,మేతఱపంగడపుతేఁడు మిసిక వాడున్,దాతయు సాతని నాతియు,నేతుర్థె యొక్కించుకైన నిక్కప మొదవన్." అచ్చ. యు. ౫౨౭. ఆం. భా. ప్ర. ౩౯. సం. వి. అ. పుం. తండ్రి. (దీనికి స్త్రీసమత్వము నిత్యము.) "మ. వనితామానససూనసాయకుఁడు జీవత్తాత పాదుండు..." పాండు. ౩, ఆ. ౬. పాండు. ౪, ఆ. ౭౩. హరి. పూ. ౧, ఆ. ౩.

తాతగువు. సం. వి. ఉ. పుం. పితృవ్యుఁడు, పిన తండ్రి. విశ. (ఉ) తండ్రికి హితుఁడైనవాఁడు.

తాతతాత. ద్వ. వి. (తాత+తాత) - బ్రహ్మకు తండ్రియైనవాఁడు - విష్ణువు. సిం. నార. ౨౬.

తాతనము. సం. వి. అ. పుం. కాటుకపిట్ట,ఖంజనము.

తాతలము. సం. వి. అ. పుం. 1. రోగము; 2. పాకము; 3. ఇనుపగుదియ. విశ. (అ. ఆ. అ.) తప్తము; వేఁడియైనది.

తాతవేల్పు. ద్వ. వి. (తాత+వేల్పు) బ్రహ్మదేవుఁడు. "గీ. ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గా దని రాఁ డయ్యెఁ దాతవేల్పు." నైష. ౪, ఆ. ౧౨౯.

తాతుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) కనికరింపఁదగిన వాఁడు.

తాత్కాలికము. సం. విశ. (అ. ఈ. అ.) 1. అప్పటిది, ఆకాలమందలిది; 2. అప్పుడు మాత్రమే యుండునది.

తాత్పర్యము. సం. వి. అ. న. 1. అభిప్రాయము, భావము; ఆసక్తి, తత్పరత.

తాత్త్వికము. సం. విశ. (అ. ఈ. అ.) సత్యమైనది.

తాదాత్మ్యము. సం. వి. అ. న. అభేదము.

తాదృక్కు. సం. విశ. (క్) అట్టిది.

తాదృక్షము. సం. విశ. (అ. ఈ. అ.) అట్టిది.

తాదృశము. సం. విశ. (అ. ఈ. అ.) అట్టిది.

తానకము. వై. వి. (సం. స్థానకమ్.) 1. నెలవు, స్థానము. "చ. ఘనవదనంబు వాక్సతికిఁ దానకమై చెలువొంద .." భో. ౨, ఆ. ౪౯. ఆం. భా. ద్వి. ౧౩; 2. జెట్టి యెలుచుడుటయందలి భేదము. "వ ..వింతతానకంబుల నిచిని కదిసినయప్పుడు." భార. విరా. ౨ ఆ. ౧౪. ప్రబంధ. ౭౧; 3. దండప్రణామము. "ద్వి. తక్కులు నీవట్టి తానకంబులును,గొలుపవు మాయెడఁ గుటిలవిచార" ద్వి. హరిశ్చ. పూ. ౧౨౦౬. పం.

తానము. ఉభ. వై వి. 1. (సం. స్నానమ్) స్నానము. "ఉ. తత్తఱపాటు లేక నదిఁ దాన మొనర్చి .." కాశీ. ౨, ఆ. ౪౯, ఆం. భా. ద్వి. ౧౨౦; 2. (సం. స్థానమ్.) తావలము, చోటు. "క. తానం బాడి మనీషివి,తానంబున కర్థ మిచ్చి తా నంతట సం,తానం బనఁ దగి మగసం,తానంబున నతఁడు ముదము తానం బయ్యెన్." రా. వి. ౨, ఆ. ౧౬; 3. (సం. తానః) తన్నకారముతోఁ బాడెడి పాట. "క. అంతట నాగసరంబుల, నింతులు తానములు మిగుల హెచ్చించుచు..." య. ౪, ఆ ౧౫౭, సం. వి. అ. పుం. విస్తారము. న. గానాంగవిశేషము.

తానవము. సం. వి. అ. న. తనుత్వము, అల్పత్వము. విశ. (అ. ఈ. అ.) శరీరసంబంధమైనది.

తానవరుసలు. ద్వ. వి. బ. (తానము+వరుసలు) తానముయొక్కవరుసలు. "గీ. తానవరుసలు పెంచుగంధర్వగాయ, కులను..." దశా. ౧, ఆ. ౨౬౪.

తను. దే. స. 1. తాశబ్దమునకుఁ బ్రథమైకవచనము, ఆత్మార్థము. "సీ...అమ్మునులకడకు, వచ్చి తానుగ్రశ్రవసుఁ డనుసూతుఁడు, రోమహర్షణి సుపౌరాణికుండు." భార. ఆది. ౧, ఆ. ౨౮; 2. విస్పష్టత. "ద్వి. మానితం బగుమంత్రమధ్య తారములు, దానొంద లయలంకితంబులు నిగుడ." బస. ౩, ఆ. ౯౩౨.

తామారము. సం. వి. అ పుం. నీటిసుడి, జలావర్తము.

తాప. దే. వి. 1. నిచ్చెన, నిశ్శ్రేణి. "లయగ్రాహి... కపిలునిం గలపుఁజూపుసెక్కలం గలయునాసగరు వంగడము మోక్షోత్తుంగమణిసౌధమునకుం గడపు తాప..." పారి. ౨, ఆ. ౮౩, అం. సం. స్థా ౨౪; 2 మెట్టు, సోపానము. "చ. అలమల యాద్రిఁ గుంభభవుఁ డన్కతకంబు శరత్తుకుండ మంౘడలిఁ బ్రతిబింబకై తవమునం దమ కిచ్చిన వారిదేవతల్, తొలఁకులకేలు తాప నిడి తోమఁ గలం కడఁగెన్..." ఆము. ౪, ఆ. ౧౪౬. (శ. ర. పా. తాఁప. ముద్రి.) 3. మణి, రత్నము. "సీ. మేలిచే దొడవుల మెఱుఁగుదాపలు మించు పెఱకేలుకటిఁ జాఁచి మెఱయువాని." శ్రీరం. ౧, ఆ. ౧౮౦, వరాహ. 3, ఆ. ౬౫

తాపకము. సం. వి అ. పుం. 1. జ్వరము. 2. రజోగుణము. విణ (అ. ఏకా.అ.) తాపము కలిగించునది.

తాపనము. సం. వి. అ పుం. 1. వేసవి; 2. జిల్లేడుచెట్టు; 3. సూర్యకాంతమణి. న. 1. తాపము కలిగించుట; 2. బాధించుట; 3. ఒకనరకము. విణ. (అ. ఆ. అ.) 1. తాపము కలిగించునది; 2. బాధించునది.

తాపనీయము. సం. వి. అ. న. ఒకానొక యుంపని వత్తు. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁదగినది. (అ. ఈ. అ.) బంగారుది, సౌవర్ణము.

తాపసుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

తాపము. సం. వి. అ. పుం. 1. వేఁడిమి; 2. బాధ. (తాపత్రయము:—ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము.)

తాపయత్. సం. శత్రు. తపింపఁజేయుచున్న.

తాపయమానము. సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయుచున్నది.

తాపయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) తపింపఁజేయువాఁడు.

తాపయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁదగినది.

తాపరము. దే. వి. మెట్టు, సోపానము. "సీ...తాప మెట్టిక తంతె తాపరంబు, మెటిక మెట్టనఁ గను మెఱయు సోపానంబు..." ఆం. భా. ద్వి. ౨౨.

తాపలువెట్టు. దే. అ. క్రి. (తాపలు+పెట్టు, మెట్టుగట్టు. "సీ. నేలకు నింగికి నెఱయఁ దాపలువెట్టు చెలరేఁగి రోకటఁ జిగురుఁ గోయు...గీ... మదనమాయాకళాధానమదనసేన." మల్హా. ౨, ఆ. ౪౧.

తాపసతరువు. సం. వి. ఉ. పుం. ఇంగుది, గారచెట్టు.

తాపసపత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. దవనముచెట్టు.

తాపసప్రియ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఋషిభార్య; 2. ద్రాక్షచెట్టు; 3. ప్రియాలము, మోరటిచెట్టు.

తాపసి. వై. వి. (సం. తపస్వి.) తపస్వి, ముని. "క. అసమంజససుతుఁ డంతట, వసుమతిఁ బెక్కేండ్లు పూని వలిమలకడఁ దాపసి యై తిరిగియు సురనదిఁ వసుధకుఁ దే నోపఁ డయ్యె..." చం. కా. 3, ఆ. ౧౮. సురా. ౭౦.

తాపసుఁడు. సం. వి. అ. పుం. తపస్వి, ముని. విణ. (అ. ఈ. అ.) తపస్సు చేయువాఁడు.

తాపస్యము. సం. వి. అ. న. ఋషిధర్మము.

తాపి. ఉభ. దే. వి. (తాపుధా. క. తాపు. త. తాప్పు.) 1. రహస్యము, సంకేతము. (చూ. తాపియిల్లు); 2. రహస్యస్థానము, సంకేతస్థలము. "ఉ. రుక్మిణి, కాంతకుఁ దొల్లి తాపి యనఁగా దగునుర్గగృహంబుఁ జూచుచున్." ద్వా. ౯, ఆ. ౧౯; 3. జాడ. (శ. ర. బ్రౌ.); 4. తార్చుట, విటీవిటులను సంధానము చేయుట. (తాపికత్తె, తాపికాఁడు.) 5. ఇటుక, రాయి, మొదలగువానితో గృహాదినిర్మాణము చేయుట కుపకరించు లోహసాధనవిశేషము. (వా.); 5. తాపితో పనిచేయువాఁడు. (శ. ర. బ్రౌ.) సం. వి. ఈ. స్త్రీ. 1. తపతీనది; 2. యమునానది. విణ. (న్. నీ. న్.) 1. తపింపఁజేయునది; 2. తాపము కలది.

తాపించు. వై. స. క్రి. 1. నెలకొలుపు, నిలుపు. "ది...అబ్ధ్యాభిమాధరంబు, నడుచక్కి దేవతానగముఁ దాపించి." విష్ణు. పూ. 3, ఆ. (శ. ర.) 2. చెక్కు, ఖచించు. "క. సురుచిరపల్లవరుచి సుందరతను వగుసేతఁ గదిసి దశముఖుఁ డొప్పన్, బరఁగఁగఁ గాంచనకాంచిన్, వెరవుగఁ దాపించియున్న నీలము పోలెన్." భా. రా. ౫౪, ౨, ఆ. ౧౫౮. సా. ౨, ఆ. ౪౨; 3. మోఁదు. "క. తాపించె ధనదుపదనముఁ, గూపెట్టఁగఁ గాలకంతుకొడు కుత్తరవే, దీపాషాణాంచలమునఁ, బాపుయాగమునఁ దొట్రుపడి రుత్తములున్." కాశీ. ౭, ఆ. ౯౧. సం. అ. క్రి. తాపమునొందు.

"మ...రతికాంతుం జేర నేతెంచెఁ బ్రత్యూల కాంతామణి వారసారసముఖీదుర్వారమారాహ వో్రత్కలికా ఘూర్ణితమానసుం డయి కడుం దాపించుప్రాణేశ్వరున్." నిరం. ౨, ఆ. ౯౯.

తాపింఛము. సం. వి. అ. పుం. చీకటిమ్రాను, తమాలము.

తాపిక. దే. వి. తార్పుకత్తె. "గీ. చతురికకుఁ జేర దూతికి సంది బొంత్రకడెము పరిచారికకు సారికకును రవికె, తాపికకు సొమ్ము వేశ్యమాతకును గాన్కలిచ్చి చెప్పించు రతిసేన కెచ్చుతమిని." హంస. ౫, ఆ. ౧౩౫.

తాపికత్తియ. వ్య. వి. (తాపి+కత్తియ) తార్పుకత్తె, విటీవిటులసంధానము చేయుస్త్రీ. "ఉ...విలాసిను లక్ విటవ్రజంబున్నరహస్యభూములకు నెయ్యునఁ జేర్చిరి తాపికత్తియల్." కవలీ. ౩, ఆ. ౭౫, ఆం. భా. ద్వి. ౧౧౦.

తాపికత్తె=తాపికత్తియ. "చ. ఇలుఁ గలసైన వెల్వడని యీలువుటాండ్రకుఁ దాపికత్తెవై." ఆము. ౫, ఆ. ౭౦.

తాపికము. సం. విశే. (అ. ఈ. అ.) వేసవికాలమందలిది.

తాపికాఁడు. దే. వి. (తాపి+కాఁడు) 1. విటీవిటులను తార్చువాఁడు, సంధానకర్త. "సీ. కాంతకు పదవి నాకతమునం బడసినవాఁడు నమ్మినతాపికాఁడు గాఁగ,...ఆ. చొచ్చి వనితమనముఁ జొచ్చి క్రీడకుఁ జొచ్చి..." దశ. ౬, ఆ. ౧౮౦, చంద్రా. ౫, ఆ. ౩౩; 2. జాడ తెలుపువాఁడు. "ఆ. తాన చోరులకును దాపికాఁడై వేమ,ధారి మిన్నకేని తపముసేయుఁ." భార. ఆది. ౪, ఆ. ౨౬౨.

తాపిచేయు. దే. స. క్రి. సంధానముచేయు, తార్చు. (బ్రౌ.)

తాపిచోటు. దే. వి. (తాపి+చోటు) సంకేతస్థానము, రహస్యస్థలము. "సీ. చీర చాకింటఁ దెచ్చెద నంచుఁ జని చేరుఁ దరుణపల్లవుఁ డున్న తాపిచోటు." శుక. ౨, ఆ. ౩౬౮.

తాపిత. దే. వి. మేలైనపట్టువస్త్రము. "సీ. పచ్చ తాపితదట్టి: బసమించుపచ్చరాచిలుకక్రొంబిడివంకి యలవరించి." చంద్రా. ౨, ఆ. ౬౮, శుక. ౧, ఆ. ౨౪౯.

తాపితము. సం. విశే. (అ. ఈ. అ.) 1. తపింపఁజేయఁబడినది; 2. వెచ్చఁజేయఁబడినది; 3. బాధింపఁబడినది. "క. ఆమ్ముని నుంజూచి యున్న మ్ముఃసమ్మఁడు నొక్కట మనోజతాపితుఁడై..." భార. ఆది. ౮, ఆ. ౧౦౬.

తాపితా = తాపిత. "చ. బటువ్రులు తాపితాపటుపు పట్టుశలాడము మీఁదఁ జల్వదుప్పటి..." శుక. ౪, ఆ. ౨౨, కృ. శత. పీఠి. ౧, ఆ. ౮౦.

తాపియిల్లు. దే. వి. (తాపి+ఇల్లు) సంకేతగృహము. "సీ. నాయకునకు మజ్జనజలంబు ఘటియించి తాపి యింటికి నేఁగి తడవు చూచు." శుక. ౩, ఆ. ౪౪౯. శుక. ౩, ఆ. ౧౯౪.

తాపీ = తాపి. (శ. ర.)

తాపు. వై. స. క్రి. 1. చెక్కుఖచించు. "సీ. పంచగా మగరాలు దాపినలసికుపుగడ మెండెవము నా కాలఁ గ్రాల." రసిక. ౧, ఆ. ౧౪, ఆం. భా. త్రి. ౧౩౨; 2. అదుము, నొక్కు. "సీ. పడఁతి యొక్కతె ప్రియుపదములు ఒరహాస్తితస్తకు చంబులఁ దాపుకొనియె." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౬౦. వి. 1. అవలంబము. ఆధారము. "గీ. ఏమపాతాళముల క్రింది యిఱుకుగొంది, కరికితో యూత్తయై యున్నధరణిఁ జూచి, మొగము దాపుగ నిచ్చి నిర్మదశక్తిగరిమ గడలొత్తఁ గానెత్తెఁ గరుణఁ బ్రభుఁడు." హరి. పూ. ౪, ఆ. ౧౬; 2. తన్ను, పాదతాడనము. "చ...చాల దయ్యోనో, మునుపటి తన్ను కొమ్మనుచు మోములపై నొకతాపు తాచినన్." రామా. ౭, ఆ. ౨౪౬.

తాపురము = తాపరము, మెట్టు. "వ. ఒక్కమీఁక నాకసం బెక్క విశ్వకర్మ నిర్మించినతాపురంబులఁ బోలుగోపురంబులమీఁదికి..." వి. శకు. ౧, ఆ. ౮౬.

తాప్యము. సం. వి. అ. న. మాక్షికధాతువు. విశే. (అ. ఆ. అ.) తపింపఁజేయఁదగినది.

తాబందు. దే. వి. పావడ, గాగర. (శ. ర. బ్రౌ. వా.)

తాబేదారు. హిం. వి. తక్కువపనివాఁడు, క్రింది యుద్యోగస్థుఁడు.

తామసము. సం. వి. అ. పుం. 1. బడలిక; 2. దోషము. విశే. (అ. ఆ. అ.) 1. బడలిక గలిగించునది; 2. భయము గలిగించునది.

తామర. వై. వి. (సం. తామరసమ్. క. తామరె, తావరె. త. తామరై.) 1. పద్మము, తమ్మి. "క. తామరలు ముడిఁగె జక్కవ, చామలకున్ వెతలు పర్వె..." నీలా. 3, ఆ. ౭, ఆం. భా. ప్ర. ౧౬౪; 2. శరీరములో పద్మాకారముగా నుండు షట్చక్రములలో నొకటి. (యోగ.) "సీ. అంతర్గతము లైనయాఱుదామరలకు నభినవోల్లాసంబు ననునయించి." విక్ర. ౨, ఆ. ౨౪౮; 3. చర్మవ్యాధివిశేషము, మండలకము. (ఇది తామరవలె పొక్కులతో శరీరమున గుండ్రముగా నలము కొనును.) "సీ. .. తామర యనఁగ బొడ దామర యన. గీ. మండలక మొప్పు." ఆం. భా. ద్వి. ౧౨౮.

తామరకంటి. ద్వ. వి. (తామర+కన్ను+ఇ) 1. పద్మాక్షుఁడు, విష్ణువు; 2. పద్మాక్షి; స్త్రీ; భార్య. "చ. తఱుగక నే మెలంగినను దామరకంటికి మోము దమ్మితో, నెఱిఁ దొవరంగు పొంగిడెడునీటరి సాటి యటంచుఁ బల్కఁగా, నుఱియలు లోఁగ వైరి యిఁక నుండఁగ నీతము గాదటంచుఁ దా, నఱవఱలయ్యెఁ జెమ్మట నొయారపుఁ గస్తురిబొట్టు మోమునన్." కాళిందీ. ౨, ఆ. ౯. "ఉ. జగంబు లన్నియుం, దల్లడమందఁ జేతుఁ గద తామర కంటిని జూపకుండినన్." అచ్చ. అర. ౧౦౫.

తామరకెంపు. ద్వ. వి. (తామర+కెంపు) పద్మరాగమణి. "సీ. పెద్దతామరకెంపు బిగిపట్టియలచేత సొబగైనముత్యాలసోరణములు." య. ౧, ఆ. ౯౭.

తామరచెలి. ద్వ. వి. (తామర+చెలి) కమలమిత్త్రుఁడు, సూర్యుఁడు. "సీ. చెలిమితోఁ దామరచెలిపట్టి యనిచినచిఱునరంజీ యొక్కఁ చెలఁప పూన." య. ౧, ఆ. ౯౦. (తామరచెలిపట్టి = యముఁడు.)

తామరచూలి. ద్వ. వి. (తామర+చూలు+ఇ) కమలగర్భుఁడు, బ్రహ్మ. "చ... ఇట్టికశిలాంఛనబింబ నిభాస్య నక్కటా, తలఁపయి మోపు మోప నిటు దామరచూలి యొనర్చె నాత్మ నుమ్మలికము లేక..." హరిశ్చ. ౪, ఆ. ౧౫౭.

తామరతంపము. ద్వ. వి. (తామర+తంపము) తామరలసమూహము, కమలషండము. "సీ. తనయిల్లు తామరతంపమైమెఱయ సంపన్నలినాక్షి గాపున్న చోటు." వసు. 3, ఆ. ౧౫౫. చం. రా. ౧, ఆ. ౬౬. విశే. (కమలషండమువలె అలముకొని అధికముగా వ్యాపించినది.) మిక్కిలి యభివృద్ధి నొందినది, అత్యధికము. "గీ. ధరఁ బ్రజావృద్ధి తామరతంప మయ్యె." స్వా. ౬, ఆ. ౧౨౧. వసు. 3, ఆ. ౧౫౫.

తామరతంపర = తామరతంపము. వి. తామరలసమూహము, కమలషండము. "సీ... తనరును తామర తంపర యనఁ, గీ. కమలషండంబు..." ఆం. భా. ప్ర. ౧౬౫. విశే. మిక్కిలి యభివృద్ధినొందినది, అత్యధికము. "గీ. వారు మీరును దగ బాంధవమునఁ బొదలి, యింపు నభివృత్తిఁ దామరతంపరైనఁ, జెలులఁ జుట్టలఁ గలిసి పేరెలమిఁ బొంది, గొల్లలస్సిలఁగఁ గెలమెంత యొప్పునొక్కొ." భార. ఉద్యో. 3, ఆ. 3౫3. "శా. శ్రీవిద్యుత్కలితాజవంజవమహాజీమూత పాపాంబుధారా, వేగమ్మున మన్మనోబ్జసముదీర్ణత్వమ్ముఁ గోల్పోయిలిన్, దేవా నీ కరుణాశరత్సమయ మింతే చాలుఁ జిద్భావనా, సేవన్ తామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా." కాళ. శ. ౧, (ఈపద్యము విశేష్యార్థమునకు నుదాహరణము.)

తామరతూపరి. ద్వ. వి. (తామర+తూపు+అరి) పద్మశరుఁడు, మన్మథుఁడు. (శ. ర.)

తామరపాకు. ద్వ. వి. (తామర+ఆకు) తామరాకు, నళినీదళము. "మ. ఝుటితిస్యూతపలాశపత్త్రపుటికా శాటీప్రదేశంబులన్, ఘటముల్ దామర పాకులన్ గుహాళులన్ గండోలముల్ పూని బ్రాసట వేదంబుఁ బఠించుచుం గదిసి వైశంపాయనాదుల్ సముత్కటభంగిం గొలువంగ నేఁగె ముని భిక్షాకృత్యయాత్రార్థమై." కాశీ. ౭, ఆ. ౧33. పార్వ. ౪, ఆ. ౮.

తామరవిందు. ద్వ. వి. (తామర+విందు) కమలబంధుఁడు, సూర్యుఁడు. "సీ. పూవతామరవిందుఁ బోల్ప నీడై కగు గడితంపునిడుద కెంజడలు వఱల." అచ్చ. యు. ౧౫౪.

తామరసము. సం. వి. అ. న. 1. పద్మము, తామర; 2. బంగారు; 3. రాగి; 4. ఉమ్మెత్త.

తామలకి. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక.

తామసము. ఉభ. దే. వి. ఆలస్యము, జాగు. "ఉ. నావుడు సత్యభామ నిజనాథుని కిట్లను నేల తామసం, బీవిబుధాధినాయకమహీరుహముం బెకలించి లోకసం, భావిత మైననీపలుకుఁబంతము సెల్లమదీయగేహకే, ళీవనవాటి వేడుక దలిర్పఁగ

నిల్పుము జీవితేశ్వరా." పారి. ౪, ఆ. ౧౧. దశా. ౭, అ. ౨౭౯." సం. వి. అ. పుం. 1. సర్పము ; 2. గుడ్లగూబ. న. 1. తమోగుణము; 2. చీఁకటి; 3. క్రోధము. "గీ. అర్జునను కెల్లభంగుల నైనకౌరి,కంటికిని ఱెప్పరీతి నిక్కముగఁ బ్రోవఁనతనితోఁ బార్థుఁ డేల కయ్యంబుఁ జేసెఁ,దామసం బెట్లు పుట్టె నాతనికి ననఘ." చిత్రభా. ౧, ఆ. ౧౯. రం. రా. ఉ. ౧౪౬. పు. విణ. 1. తమోగుణము గలది; 2. అంధకారము గలది ; 3. చీఁకటికి సంబంధించినది; 4. దుష్టమైనది; 5. మూర్ఖమైనది.

తామసి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. చీఁకటి రాత్రి; 3. నిద్ర; 4. కాళి,పార్వతి; 5. తమోగుణము గలస్త్రీ; 6. పసుపు; 7. జటామాంసి.

తామసించు. దే. అ. క్రి. జాగుచేయు. "గీ. చెల్లదొక్కింతయును దామసింప నిచట,సఖులు నీవును లోచనోత్సవము గాఁగ, నాయితము గం డనుచుఁ బల్కి ....." జై. 3, ఆ. ౧౦. శుక. ౨, ఆ. ౧౯౦.

తామసికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. తమోగుణము గలది; 2. చీఁకటి గలది.

తామసుఁడు. సం. వి. అ. పుం. 1. నాల్గవమనువు; 2. రాహువుకొడుకు.

తామిస్రము. సం. వి. అ. పుం. 1. కృష్ణపక్షము; 2. ద్వేషము; 3. తమోమయమైనరకము. విణ. చీఁకటికి సంబంధించినది.

తామెర. వై. వి. (సం. తామరసమ్) తామరపూవు, పద్మము. "మ...నిసున్ దా మామగా నెంచుఁ దా,మెరతూపుందొర యింత మాత్రము నకై మిన్నంటెడే చంద్రమా." కృష్ణ. ౪, ఆ. ౧౫౪.

తామేలు = తాఁబేలు. (కూర్మము) "సీ. మెఱుఁగు మీఁగాళ్లు తామేళ్లను జేసి తత్కాలినత పాలిండ్లఁ గలుఁగ నునిచి." ప్రబంధ. ౩౦౮.

తామ్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. సింహపిప్పలి. 2. తామ్రవల్లి, మంజిటి.

తామ్రకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. పడమటిదిక్కు నందలి అంజన మనుదిగ్గజముయొక్క భార్య.

తామ్రకారుఁడు. సం. వి. అ. పు. రాగిపని చేయువాఁడు.

తామ్రకుట్టకుఁడు. సం.=తామ్రకారుఁడు.

తామ్రకుట్టుఁడు. సం.=తామ్రకారుఁడు.

తామ్రకృమి. సం. వి. ఇ. పుం. ఆరుద్రపురుగు.

తామ్రచూడము. సం. వి. అ. పుం.-ఎఱ్ఱనిజుట్టు గలది. 1. కోడి, కుక్కుటము; 2. కుక్కపొగాకు. 3. అభినయహస్తవిశేషము. [రకము యొక్క.

తామ్రదుగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱనిపాలు గల ఒక

తామ్రద్వీపము. సం. వి. అ. పుం. సింహళద్వీపము.

తామ్రపత్రము. సం. వి. అ. పుం. 1. జీవశాకము. 2. దానశాసనాదికము వ్రాసియున్న రాగిరేకు, రాగిపట్టా. న. 1. ఎఱ్ఱనియాకు. 2. క్రౌంచిపురు.

తామ్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పడమటి దిక్కునందలి అంజన మనుదిగ్గజము యొక్క భార్య, 2. దక్షిణభారతదేశమందలి యొకానొకనది. (ఇది మలబారు, తిరునెల్వేలిజిల్లాలయందుఁ బ్రవహించును.)

తామ్రపల్లకము. సం. వి. అ. పుం. 1. అశోకము. 2. ఎఱ్ఱనిచిగురు. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిచిగుళ్లు కలది.

తామ్రపాకి. సం. వి. న్. పుం. కలుజువ్వి.

తామ్రపాది. సం. వి. ఈ. స్త్రీ. హంసపది.

తామ్రపుష్పము. సం. వి. అ. పుం. 1. రక్తకాంచనము. 2. ఎఱ్ఱనిపువ్వు. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిపూలు కలది.

తామ్రపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆరెధాతకి. 2. కలిగొట్టు, పాటల.

తామ్రపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱతెగడ.

తామ్రఫలము. సం. వి. అ. పుం. 1. కొండగోనుగు. 2. ఎఱ్ఱనిపండు.

తామ్రబీజము. సం. వి. అ. పుం. ఉలవ, కుళుత్థము.

తామ్రము. సం. వి. అ. పుం. 1. కుష్ఠరోగభేదము. 2. రాగివంటి ఎఱుపురంగు. న. రాగి. విణ. (అ. ఆ. అ.) రాగివంటి యెఱుపురంగు కలది.

తామ్రమూల. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁటకసింద. 2. అత్తపత్తి. 3. గంట్లకచోరము.

తామ్రవృక్షము. సం. వి. అ. పుం. 1. రక్తచందనము. 2. ఉలవ, కుళుత్థము.

తామ్రసారము. సం. వి. అ. పుం. రక్తచందనము. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిచేవ గలది.

తామ్రాక్షము. సం. వి. అ. పుం. కోయిల. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనికన్నులు గలది.

తామ్రాశ్మము. సం. వి. న్. పుం. పద్మరాగము, కెంపు.

తామ్రిమ. సం. వి. న్. పుం. ఎఱుపు.

తామ్రిమము. సం. = తామ్రిమ.

తాయనము. సం. వి. అ. పుం. పెంపు, అభివృద్ధి.

తాయము. దే. వి. అరుదగువస్తువు. (శ. ర. బ్రా.)

తాయల్లము = తాయము. (వా)

తాయి. దే. వి. (క. తాయి. త. తాతా) తల్లి, జనని "సీ. కన్నబిడ్డలకేవఁ గాంచిశిశులఁ బ్రోవ బంగారు తాయి నారంగశాయి." పాంచాలీ. ౧, ఆ. ౨౮, అచ్చ. యు. ౪౬౮.

తాయెత = తాయెతు. (రక్షార్థము కాని అలంకారార్థము కాని ధరించువస్తువిశేషము.) "క. తలఁపున నిది గారడ మని,తలఁపకు మాసింగఁ డల్ల తఱిఁగొండ దరిన్,దల మోచి తెచ్చినవి యివి,తల నుంచుము పసిఁడితాయెతల నుంచు నృపా. శంక. ౧, ఆ. ౧౮. ఆ. మ. క. ౧, ఆ. ౪౯. పు.

తాయెతు. దే. వి. (క. తాయిత్తు. త. తాయెత్తు.) 1. రక్షార్థము కాని యలంకారార్థము కాని ధరించు వస్తువిశేషము, "గీ. ఇమ్ముగా మేల్పసిండి తాయెతులు మొల్ల, విరిసరుల్ దట్టముగఁ జుట్టి వేసినట్టి, యోరసిగమీఁదఁ బై చెంగు లునిచి కట్టి, నట్టిబురు సొరుమాల్ హోయల్ బిట్టు దనర." రసిక. ౧, ఆ. ౮౩, స్వా. ౬, ఆ. ౬౪; 2. కేయూరము, బాహుపురి. "సీ. కేయూరనామంబు తాయెతనంగను సందిదండ యనంగ సందికడియ,మన బాహుపురి యన నలరు." ఆం. భా. ద్వి. ౧౫౦.

తాయెత్తు = తాయెతు. (రక్షార్థము కాని అలంకారార్థము కాని ధరించువస్తువిశేషము.) "మ... మంత్రదులతాయెత్తులు గట్టినన్ శబరపుత్త్రుల్ గూడియాడం బురిన్." కాశీ. ౩, ఆ. ౩౨.

తార. ఉభ. దే. వి. సుషిరవాద్యవిశేషము, ఊఁదునట్టి యొకానొకవాద్యము. (శ. ర.) "ఉ...,అద్భుత, స్ఫారతరార్భటిన్ బిరుదుశంఖులఁ దారలు బూర కొమ్ములుం, భేరులుఁ దమ్మటమ్ములును భీషణవృత్తిని బిట్టు మ్రోయఁగన్." కళా. ౮, ఆ. ౧౧౮, మొ. రా. యు. ౩, ఆ ౨౬. సం. వి. ఆ. స్త్రీ. 1. బృహస్పతిభార్య; 2. వాలిభార్య; 3. ముత్యము; 4. కంటినల్లగ్రుడ్డు; 5. నక్షత్రము.

తారక. సం. వి. ఆ. స్త్రీ. 1. కంటినల్లగ్రుడ్డు, 2. నక్షత్రము.

తారకము. సం. వి. అ. పుం. న. పడవ. న. 1. కంటినల్లగ్రుడ్డు, 2. నక్షత్రము, 3. కన్ను, 4. ఓంకారము.

తారకాణ. దే. వి. దృష్టాంతము, ప్రమాణము. ఆం. భా. ప్ర. ౧౦౩.

తారకాణించు. దే. స. క్రి. ఋజువుచూపు, దృష్టాంతీకరించు. "గీ. అనఘునతుఁడార నన్నుఁ జిత్రాంగి యొసఁట, నునిచి తారకాణింపంగఁ గనఁగ నట్టి, కల్ల నాపల్ల గోరంత కలిగెనేని,యాజ్ఞ కే నర్హుఁడను జుమీ యని యనుండు." సా. ౨, ఆ. ౨౬౯.

తారకితము. సం. వి. ణ (అ. ఆ. అ.) నక్షత్రములు కలది.

తారకుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు; 2. ఓడ నడుపువాఁడు. విణ. (అ. ఆ. అ.) 1. దాటించువాఁడు; 2. ఉద్ధరించువాఁడు, ఆపదనుండి కాపాడువాఁడు.

తారకోపనిషత్తు. సం. వి. ద్. స్త్రీ. ఒకానొకయుపనిషత్తు.

తారణ. సం. వి. అ. పుం. ప్రభవ మున్నగుసంవత్సరములలో నొకటి.

తారణము. సం. వి. అ. పుం. పడవ న. 1. దాఁటించుట; 2. ఉద్ధరించుట, ఆపదనుండి కాపాడుట. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటించునది; 2. ఆపదనుండి తప్పించునది. (అ. ఈ. అ.) దాఁటించు సాధనము.

తారణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. పడవ, ఓడ.

తారతండులము. సం. వి. అ. పుం. తెల్లజొన్న.

తారతమ్యము. సం. వి. అ. న. తరతమభావము, న్యూనాధిక్యము.

తారము. ఉభ. దే. వి. 1. నాలుగు కాసులరాగినాణెము. (శ. ర. బ్రా.) "సీ. అమరశైలము చిన్నమంతగాఁ దలపోసి యాశాచలము దార మెత్తుఁ జేసి." నరస. ౫, ఆ. ౧౯౧. బహు. ౫, ఆ. ౧౬౫; 2. నాలుగుకాసులవిలువ గలనగ. "మ... నాతల్లియుఁ దండ్రి బాంధవులు వేడ్కల్ మీఱఁ జేయించి రీ రవణంబుల్ విను వీనిలోన నొకతారం బైన నీఁ జాల..." రుక్మా. ౪, ఆ. ౧౨౨; 3. ఒకరకము ముత్తెము. "సీ... మౌక్తికం బొప్పును ముత్తెము ముత్యము ముత్తియ మనఁ, దద్విశేషాభిధ దనరుఁ దార మనంగ..." ఆం. భా.

ద్వి. ౬౭౬. సం. వి. అ. పుం. 1. పళ్లు, దేవము; 2. పులు గడిగినముత్తెము; 4. ముత్తెముపులు గడుగుట; 4. బిగ్గరగా పాడురాగము; 5. దాటుట, తరణము; 6. తరింపఁజేయుట; 7. కంటి నల్లగుడ్డు; 8. నక్షత్రము; 9. చిత్రవర్ణము. పుం. న. వెండి. న. 1. తామరపుష్పం; 2. ఓంకారము. విణ. (అ. అ. అ.) 1. గట్టిది. (ధ్వని); 2. తళతళ మెఱయునది; 3. నిర్మలము,స్వచ్ఛము, (ముత్తెము మొ.); 4. చిత్రవర్ణము గలది.

**తారసము.** దే. వి. 1. సమీపము. "క. పాలు గల వాఁడు మన కొక,జాలి యిడక తానె తారసానకు వచ్చెన్." ఆము. ౩, అ. ౩౯; 2. తలపాటు, (యుద్ధమున) తాఁకు. "క. ఈరీతి నుభయబల ములుఁ, దారసమునఁ బోరు నెడల .." జై. ౫,అ. ౧౧౫, చంద్రా. ౬, అ. ౭౧. విణ. 1. సమీపించినది. "చ. శ్వసనునిఘోటి ఘోటినతె జంగును దాఁటి పయిం జరంగఁ దారస మయి..." సా. ౧, అ. ౧౦౪, చం. రా. ౬, అ. ౬౬; 2. దట్టమయినది, గుత్తమయినది. "చ... తారస మగుప్రప్పకంచుకము రంజిలఁగాఁ జరియించు వీథులన్." హంస. ౪, అ. ౪౦; 3. సంభవించినది, కలిగినది. "చ... ఈతతి చని పిమ్మటన్ ముదిమి దారస మైన మఱేటెనుద్దులే" విప్ర. ౪, అ. ౨౨, జై. ౧, అ. ౧౩౯; 4. కనఁబడినది. "చ... కటకరవంబు బోరు కలఁగన్ రమణుల్ తెరచీర సంచినన్, ఎటుకున రాజామో మెదుటఁ దారసమైన..." స్వా. ౫, అ. ౮౧.

**తారసారము.** సం. వి. అ. పుం. ఒకయంపనివత్తు.

**తారసించు.** దే. అ. క్రి. స. క్రి. 1. (యుద్ధమున) తాఁకు, కవియు. "క. మోహారములు రెండును స్వస్నాహంబునఁ దారసించినన్ ఫల్గునస్యేనాహం కృతి యుడివో నుత్సాహంబునఁ గౌరి పొంచ జన్యం బొత్తెన్." చిత్రభా. ౭, అ. ౬౬. నరస. ౧, అ. ౬౪; 2. సమీపించు. "సీ. తారసించిన చోట దారునఁ బోరఁబాఱి యొకటి రెంటిని దొబ్బ లురల నడచు." స్వా. ౪, అ. ౪౨.

**తారసిలు.** దే. అ. క్రి. 1. ఎదురుపడు. "సీ. ఎచటి కేఁగెద వని యెవ్వరు నడుగక తంబళి బాఁపడు తారసిలక." ప్రబంధ. ౭, అ. ౬౦; 2. వచ్చు. "గీ. అవధిగతపుణ్యజాలకం బైనఫలము,పుణ్యనిధు లార సాన్నిహితంబునకు మీఱు, తలఁపు గాని తలంపుగాఁ దారసిలుట." హార. ౪, అ. ౫౬; 3. ప్రసరించు. "సీ. తనకరారుణరుచుల్ ఘనల తావులఁ దారసిలి నవ్యకిసలయావళుల నింప" ఉ. రా. ౧, అ. ౧౭౦. కళా. ౨, అ. ౧౭౮; 4. తొడఁగు, మొదలిడు. "గీ. విదుల కొప్పనఁ దుఱిమి యవ్వెలఁది విభుఁడు, తారసిలి దవ్వుడు ప్రసారకంబునకును." కళా. ౭. అ. ౧౫. స. క్రి. స. క్రి. 1. (యుద్ధమున) తాఁకు, కవియు. "ఉ. అత్తటి రెండుసేనలు రయంబునఁ దారసిలెన్ గడంకమై, నుత్తరదక్షిణార్ణవము లొండొకటన్ వడిఁ దాఁకెనో యనన్." కళా. ౮, అ. ౬౨. రా. వి. ౫, అ. ౪౧.

**తారసిల్లు** = తారసిలు, తారసించు. దే. అ. క్రి. 1. వెళ్లు. "ఉ... జేచనే పీకరళాక్షి యప్పుడమి వేలుపువెంటఁ దారసిల్లి హేలాతిశయంబునన్ బలికె సంతసిత ప్రమదానురాగయై." విప్ర. ౩, అ. ౮౧; 2. సంభవించు. "ఆ. మనుజుఁ డెల్ల ప్రొద్దు మానక సేయంగ, దైవయత్న మొకటి తారసిల్లు." కుచేల. ౧, అ. ౮౯. అ. క్రి. స. క్రి. సమీపించు. "చ. జనపతి దారసిల్ల నొకసంపఁగి తావులకొమ్మ రాగపద్మ నసుమనోభిరామ యయి." వసు. ౧, అ. ౧౫౬. ఉ. రా. ౬, అ. ౭౯.

**తారళ్యము.** సం. వి. అ. న. 1. చాంచల్యము,కపలిక; 2. జారత్వము, అంకు.

**తారాచువ్వ.** మి. గ్రా. వి. (తారా+చువ్వ) నక్షత్రముల కంటునట్లుగా పైకెగురు నొకవిధ మగు బాణసంచు. "వ... చెలువార నుదారంబు లగు తారాచువ్వలు తారాపథంబుల కెగసి..." మృ. వి. ౩, అ ౪౩.

**తారాడు.** దే. అ. క్రి. (తారు+అడు-స్వార్థమున) 1. తిరుగు, ఇట్టటు తిరుగు. "క. ఈరీతి నెచట నిలువక, తారాడక నొకరసాలతరుమూలమునన్, జేరి..." రాధికా. ౭, అ. ౮౫. య. ౪, అ. ౧౬; 2. జీరాడు, కదలియాడు. "మ. అల పర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించుచో మేఘమం, డలపున్మద్దెల గ్రుంగ లేవను మరున్మార్దంగికుం దర్శి నెత్తి లలిన్ నేలకు వ్రాలుచు న్మ్రొగయుచుం దారాడు వత్తెల్లజల్లులుఁ గెం

గుచ్ఛులు నమ్మి ధారలును ద[illegible]ంద్రగోపంబులున్." ఆము. ౪, ఆ. ౯౨.

తారాధిపుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. బృహస్పతి ; 3. వాలి; 4. సుగ్రీవుఁడు. (ఇట్లే. తారాపతి. మొ.)

తారాపథము. సం. వి. అ. పుం. నక్షత్రమార్గము, [ఆకాశము.

తారాపీఁట. మి. వి. ఎద్దువెన్నుమీఁద వేయు పీఁట వంటివస్తువు. (శ. ర. బ్రౌ.)

తారాపీడుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

తారామండలము. సం. వి. అ. పుం. న. 1. నక్షత్రమండలము; 2. కంటినల్లగ్రుడ్డు; 3. స్త్రీవస్త్రవిశేషము. "వ...సూరవరంబులును దారామండలంబులును హంసావళులును...అనుపేళ్ల గల పుట్టంబులు గట్టుకొని..." ద్వా. ౩, ఆ. ౧౮౮.

తారామృగము, సం. వి. అ. పుం. మృగశీర్షనక్షత్రము.

తారి. ఉభ. దే. వి. (తారు ధా.) ఆట ఆడించు సూత్రధారుఁడు. "సీ...తారి నాఁగను సూత్రధారకుండు." ఆం. భా. ద్వి. ౨౮౭. సం. విణ. (న్. ణీ. న్.) 1. దాఁటించునది; 2. ఉద్ధరించునది.

తారెక. సం. వి. ఆ. స్త్రీ. తాటికల్లు.

తారితము. సం. విణ. (అ. ఆ. అ). 1. దాఁటింపఁబడినది; 2. ఉద్ధరింపఁబడినది.

తారీఖు. దే. వి.హిం. వి. మాసమందలిదినము, తేదీ.

తారు. దే. అ. క్రి. 1. సంచరించు; ఇట్టట్టు తిరుగు. "సీ. కానలోఁ దారుమృగంబులకై వడిఁ గైకొని యసమాస్త్రకర్మకలన." రాఘవ. ౧, ఆ. ౨౦. ఉ.రా. ౫, ఆ. ౭౯; 2. పోవు, వెళ్లు. "గీ. మోసపోక ముసానమ్మముదదిరాలు, దారె నడి నప్పులేక పాతాళమునకు." కాశీ. ౫, ఆ. ౨౮౯. వాసిష్ఠ ౨, ఆ. ౯౩, 3. తొలఁగు,పాయు. "ఉ... మిమ్ము నహర్నిశముఁ మనంబులం,దారఁగనీక రూపగుణతత్పరులై మిముఁ బొందుకై వడిన్." భాగ. ౧౦. స్కం. ఉ. ౧౧౪౯; 4. కలుగు, జనించు. "ఉ. సారసలోచనామణులు చల్లెడిసేస లోనంగ నెమ్మదిన్, దారెడికోరికల్ పెనఁగొనంగ నఖండు సభార్యుఁడై శుభ, శ్రీరహిఁ దల్లిదండ్రులకుఁ బ్రేమఁ బ్రణామము చేసె వేడుకన్" ఇందు. ౬, ఆ. ౧౧౨. రావి. ౨, ఆ. ౧౧౨; 5. కాంతిహీనమగు; క్షీణించు, తగ్గు, "శా. ఆవేళం బతి సంభ్రమాఘుణగంగాంభోఘురంబుల్వలెన్, ద్యోపీఠం బెలివెన్నెల ల్నిగుడ నిందుం డుండుఁ గ్రీడించుచదే వావాసద్వీప మయ్యెఁ దన్మథితశుభ్రాబ్జంబులై తారెఁ దారావర్గంబులు"...వసు. ౪, ఆ. ౨౧. "సీ... అనన్యజనబుద్ధిఁ జెంది తారని వేడ్కన్." హ. న. ౨. ఆ. ౧౨. స. క్రి. అ. క్రి. చేరు,సమీపించు. "సీ. ఏవిహంగముఁ గన్న నెలుఁగు లిచ్చుచు సారెకును సైకతంబులఁ గూడఁ దారు." స్వా. 3, ఆ. ౧౬. (శ. ర. పా. 'తాఱు'. ముద్రి. పా.) కువల. ౪, ఆ. ౨.

తారుకొను. దే. అ. క్రి. స. క్రి. (తారు+కొను) వ్యాపించు,పర్వు. "చ. అతనికళేబరంబున మహాపురుషుం డొకరుండు నిర్గమించి, తరణిబింబడంబరవిజిత్వరదివ్యశరీరకాంతిసం,తతులు దిగంతరాళములు దారుకొనంగ విమాన మెక్కి..."...వరాహ. ౧౧. ఆ. ౧౧౪.

తారుకొలుపు. దే. స. క్రి. (తారుకొను ధా.ప్రే.) అమర్చు. "సీ. చిగురాకుఁ జేసినఁ జేసెఁ గాకఱుఁ డొందుఁ దాఁ జేటి నేసూటి దారుకొలిపె." చిత్రభా. ౫, ఆ. ౩౧.

తారుచు. దే. స. క్రి. 1. చేర్చు. "సీ. జారుండు పరకాంత శయ్యపైఁ దారిచి వావి గాదని పల్కపదలి చనునె." రామలిం. ౩౦; 2. సంధానము చేయు. "చ...ముద్దుగుమ్మకుం,దటుకున నొక్కపాలసుని దారిచి బిగ్గర నంటఁ గట్టి"...నీలా. ౧. ఆ. ౧౧౦. 3. (యుద్ధమునకు) సిద్ధపఱచు. "మ. అనికిం దారిచి తోడు తెచ్చికొని మిమ్మడ్డంబుగా నొడ్డుచుం, దనమై సోఁకక యుండఁ గాఁ దిరిగెడు న్దవ్వై వ జరాసంధుఁడు"...హరి. ఉ. ౧. ఆ. ౧౧౦.

తారుణము. సం. విణ. (అ. ఆ. అ). తరుణసంబంధమైనది,పడుచువారికి సంబంధించినది.

తారుణ్యము. సం. వి. అ. న. యౌవనము,పడుచుఁ [దనము

తార్కాణ.=తారకాణ.(దృష్టాంతము, ప్రమాణము.) "మ...చిత్రము నీ కిచ్చినదేవివాక్యమునకుం దార్కాణగా నామజన్మములు న్విరంటిగదమ్మ..." ప్రభా. ౩, ఆ. ౧౫. శుక. ౩, ఆ. ౪౨౨.

తార్కాణము.=తారకాణ, "క. అనిన నగి యెందుఁ గలదే, మన నెఱుఁగనికలియు నొడలు మఱచిన సివమున్,గనదేలా మనసునకున్, మనసే తార్కాణ మని కుమారుఁడు వేగన్." సా. ౨, ఆ. ౩౨.

తార్కాణచేయు. దే. స. క్రి. (తార్కాణ+చేయు) ఋజువుపఱచు, నిరూపించు. "గీ... లేమ పబ్బర యంటివా లేచి రమ్ము, నీకుఁ దార్కాణచేసెదఁ నేనె వచ్చి, యట్టిగేస్తుని నెవతె పెండ్లాడఁ దలఁచు." పార్వ. ౪, ఆ. ౧౦౧. కళా. ౨, ఆ. ౧౫౭. 3, ఆ. ౧౦౮.

తార్కాణయగు. దే. అ. క్రి. (తార్కాణ+అగు) తెలియు. "గీ. నాకుఁ దార్కాణ మైనయట్టి యును దిరుగఁ, నడుగఁ జెప్పంగ వలదు దోయ నఘచరిత, యిపుడు మణికంధరుని సహాయ తపము సేయుఁ, జెప్పితిరి పెండ్లాడని యని చెప్ప వలయు." కళా. ౨, ఆ. ౫౯.

తార్కాణించు. = తారకాణించు. (ఋజువుపఱచు.) "వ... తనతలంపు యథార్థం బగుట తార్కాణించె..." ప్రభా. ౪, ఆ. ౧౧౫; 2. (స్పష్టపఱచు) "ద్వి. ఇతరునివలె నది యిది యని కాని, గతులు నీచేతఁ దార్కాణింపఁబడెడు" ద్వి. మారిశ్వ. ఉ. ౨౫౧౨. పం.

తార్కికుఁడు. సం. వి. అ. పుం. 1. తర్కశాస్త్ర పండితుఁడు; 2. తర్కశాస్త్రము చదువుచున్న వాఁడు.

తార్కొను. దే. అ. క్రి. స. క్రి. (తారు+కొను) 1. (యుద్ధమున) తాఁకు, కలియు. "క. తెగగొని బ్రహ్మాస్త్రము లేఁ, వగ నేసిన నొకటి నొకటిఁ దార్కొని రెండున్, గగనం బంతయుఁ దేజ, స్థగితముగాఁ జేసె"...భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౬. ఇందు. ౪, ఆ. ౧౯; 2. పైఁబడు. "సీ. బలిమిఁ దార్కొని కలభాషిణి వేనలి యొక కేలఁ బట్టి"...కళా. 3, ఆ. ౧౯. 3. వ్యాపించు క్రమ్ము. "క. ఘనఘనా మోదయ మంబరమునఁ దార్కొని శ్రుతిమనోజ్ఞఘూరినినాదంబున గర్జిల్లఁగ..." రామా. 3, ఆ. ౨౫. ఇందు. 3, ఆ. ౧౦౭. అ. క్రి. 1. కలియు, మిళితమగు. "వ...కతిపేఁపాకుపరిమళంబుతో సంబంధించుకమ్మకసింధగంధంబును గమ్మకపింద గంధంబుతోడం దార్కొను నేలకులసౌరభంబులును..." కాశీ. ౭, ఆ. ౧౮౫. భో. ౨, ఆ. ౨౦; 2. కలుగు, పుట్టు. "ఉ. వాడి వత్తలై, తగ్గిన మేనులున్ వణఁకు దార్కొనుకానులు...... తాపపించుగన్." విప్ర. ౧, ఆ. ౫౩. ౨. పు. ౬, ఆ. ౧౬౭; 3. ఉండు. "చ. వెలువడి యవ్వఘాపపలవింతలు జేతుకఁ గొంత గన్గొనన్, దలఁచి పిశాళిహాసము ముఖం బలరంగ మెఱుఁగు బంగరుం, దలుపులు ద్రోచి త్రొంబములు దార్కొనుశోకకాంక్షవెంబడిం, బోలిచిరి..." ఇందు. ౬, ఆ. ౧౩౧; 4. ప్రవర్తించు, నడచు. "చ...అవ్విరాసనతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్చు టెట్లు నా తలఁపులబడెం దదాత్మయును దార్కొన కెట్లువి సంఘటిల్లెడున్." ప్రభా. 3, ఆ. 3; 5. పగులుగొను. "శా. అత్యంతనిపలకత్నునిర్మిత మహాహార్యస్థి... తారక మండలంబుఁ గని ముగ్ధస్త్రీలు..." భీమ. 3, ఆ. ౯3. పారి. ౪, ఆ. ౭౨. స. క్రి. చేరు, పొందు. "సీ. ధనవంతుగర్వంబు తార్కొన కేలుండు..." నా. పంచ. ౧, ఆ. ౧3౦. నా. పంచ. ౧, ఆ. ౭౨.

తార్కొల్పు. దే. స. క్రి. (తార్కొను ధా. ప్రే.) పగులుకొనఁజేయు, సక్తమొనర్చు. "మ...తదీయ మూర్తివిభవధ్యానంబు గావించి చిత్తము సర్వాంగవిమర్శనక్రియలకు దార్కొల్పి..." భాగ. 3, స్కం. ౯౭.

తార్చు. దే. స. క్రి. (తారు ధా. ప్రే.) 1. చేర్చు "చ...యథోచితవిధు లాచరించి పువుసెజ్జను నొయ్యన మేను దార్చుచున్." వసు. 3, ఆ. ౯3. భార. శాం. ౫, ఆ. ౩౭౦; 2. నిర్మించు. "మ. పొలఁతీ యూపొనగున్నపొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా, నలరన్ సారెకు నెక్కుచుం దిగుచుఁ జాలై తుమ్మెద ల్మించె నిచ్చలపుం జాయలతావి జాజివిరి సేజాజోదు గైకొన్నక్రొం దలుకుం బచ్చలమేడఁ దార్చుజెలయంత్రంబో యనం గంటివే." కువల. 3, ఆ. ౬౭౦; 3. కదియించు, కూడఁజేయు. "ఉ. ఇరువాయఁగా ముడికిఁ దార్చినవెంద్రుకల న్మిషంబునన్." నైష. ౧, ఆ. ౫3. వసు. ౫, ఆ. ౭౬; 4. ఉంచు. "చ. హరికరుణాకటాక్షమహిమాగత దివ్యవివాహమంపిరో, దరకురువింద వేదియెడఁ దార్చినరిర్మలవజ్రపీఠిపై, ధరసుత నుంచి..." వసు. ౫, ఆ. ౧౦౪; 5. కలుగఁజేయు. "చ... తదీయహేలికాంకరి యతిలోహితాపయవగాఁ

దను సాత్త్వ్రవృదంతరంబులం, దరలక తార్చ్చి వారలకుఁ దార్చు సురీవరణీయవైఖరుల్." వసు. ౧, ఆ. ౪౯. అము. ౪, ఆ. ౨౪౨; 6 పోఁగొట్టు, తొలఁగించు. "ద్వి. భయములు దార్చుశోభనములు గూర్చు, జయముల నిచ్చు దుర్జయము లడంచు." ద్వి. పరమ. ౫, ఆ. 3౬౯. పు. పారి. ౧, ఆ. ౧౧౨; 7. ప్రసరింపఁజేయు. "గీ. మోహమునిచందమున నీఱతెఱచుచూపు, పాండవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు, పలికె నిప్పచ్చరం బైనభాషణములు." హర. ౭, ఆ. ౧౪; 8. అంటు, ఆఘ్రాణించు. "ఉ. పూర్ణేందుని మున్ను గొన్నరుచు లిమ్మని నీటికిఁ దార్చు కైవడిన్." వసు. 3, ఆ. ౧౫౯. అము. 3, ఆ. ౭౪; 9. ఒగ్గు. "సీ. చెవి దార్చి విలి చీమ చిటుకన్న నొకపారి నెలవి వెంపరలాడుచుట్టి లెల్ల." స్వా. ౪, ఆ. ౧౭. అము. ౨, ఆ. ౨౪; 10. ప్రేయు. "చ. కవ పటు డించి యే గుమకఁగా సురెం గొంపల దార్చి కూలుడున్." అము. ౬, ఆ. ౦౧. 11. తాల్చు, ఆవహించు. "గీ. తార్చె నా గొదగొని నసఁ దనరు నావహించె నను మాట గా..." ఆం. భా. తృ. ౧౯.

తార్క్ష్యుఁడు. సం. వి. అ. పుం. కశ్యపుఁడనుఋషి.

తార్క్ష్యము. సం. వి. అ. పుం. 1. రథము; 2. గుఱ్ఱము; 3. మద్దిచెట్టు; 4. పక్షి; 5. ఒకానొకపర్వతము.

తార్క్ష్యుఁడు. సం. వి. అ. పుం. 1. అనూరుఁడు, అరుణుఁడు; 2. గరుడుఁడు; 3. వామనుఁడు, విష్ణువు.

తార్తీయము. సం. విణ. (అ. ఈ. అ.) మూఁడవది.

తార్తీయీకము. సం. = తార్తీయము.

తార్పు. దే. వి. 1. అమరిక, కూర్పు. "సీ. కరికుంభములకు బంగారుతార్పులయొప్పు శకటాంగముల విప్పు జరిగెనేని." పి. శకుం. ౨, ఆ. ౧౭౪; 2. బరణి. "గీ. కలువచెలి దొంగరాయిడి గలుగు తానింక,నసుచు మునుమున్న పద్మిని తనవికాస,ధన మునిచి నీట నిదురాగితార్పు వోలెఁ,బడియెఁ బడమటికనుమలోఁ బద్మహితుఁడు." రామా. ౭, ఆ. ౯౧. జై. ౦, ఆ. ౯౯.

తార్పులాడు. దే. అ. క్రి. (తార్పులు+ఆడు) పొట్టేళ్లు మొదలగునవి దెబ్బలాడు. "చ. గొఱ్ఱె పోతులన్,బెడఁగుగ దార్పులాడఁగను బెట్టు." భల్లా. 3, ఆ. (శ. ర.)

తార్క్ష్యము సం. వి. అ. న. ఓడకేవు, పడవకూలి. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁదగినది; 2. ఉద్ధరింపఁదగినది.

తాఱించు. దే. స. క్రి. (తాఱు ధా. ప్రే.) పోఁగొట్టు. "సీ. దరిసించుచో నెల్లఁ దాఱించుఁదాప మీ యమనీంద్రుచూపు చంద్రాతపంబొ." చంద్రి. ౫, ఆ. ౧౦౪.

తాఱు. దే. అ. క్రి. 1. దాఁగు. "చ. వలదొర మెచ్చఁగా ఘనసువర్ణపలాశకవాససాగతిక్, గలసి రజస్సుఫలింగములు గ్రక్కుచు పిపలి వేగ చేరి రా,నలిసిఖనూనఁ దాఱె"... చంద్రి. ౪, ఆ. ౫౦; 2. నక్కుచుఁబోవు,మఱుఁగుపడియేఁగు. "ఉ. కాంచి కలక్వణత్కనకకాంచికయై యెదురేఁగి యప్పు డక్కాంచనవసకేతకీకుసుమగాత్రి వయస్యల డించి తన్నిజకుంజాంచలవీథిఁదాఱుచు ..." స్వా. 3, ఆ. ౦౯. నీలా. 3, ఆ. ౧౦; 3. వ్రాలు. "ఉ...శలభప్రకరంబు మహీరుహంబుపైఁ, దాఱుతెఱంగు చేసి యతిధైర్యము చూపె నతండు సైరణన్." ఉ. హరి. 3. ఆ. ౫౦. (శ. ర. పా. తారు. ముద్రిం); 4. ప్రవేశించు,చొచ్చు. "ఉ. మాతృసంఘము వసించుగృహంబులోనికిం,దాఱఁడు కావరే యనఁడు తాపము నొందఁడు కంటగింపఁడున్." భాగ. ౭. స్కం. ౧౯౪. హరి. ఉ. ౭, ఆ. ౧౦౨; 5. కృశించు. "గీ రామలక్ష్మణసతతాభిరక్షచేతఁ, బరఁగు నీసాధ్వి యక్కటా భయదరాక్షసీసురక్షితయై భీతిఁ జెంది వగలఁ,దాఱుచున్నది యేమందు దైవగతికి" భా. రా. సుం. ౧౫౬. భార. శా. 3, ఆ. ౯౭; 6. చెడు, పాడగు. "ఉ. తాఱనియొల్పుఁ బప్పును ఘృతంబును దియ్యనిపాయసంబులున్." హర. ౨, ఆ. 3౧.

తాఱుపుఁబెట్టె. దే. వి. (తాఱుపు+పెట్టె) పెట్టె మూఁత. "ఉ. కాంచనతుంగశృంగములు గల్గి ధరిత్రికిఁగోటకైవడిన్,మించినచక్రవాళగిరిమీఁదను దాఱుపుఁబెట్టె మూసిన,ట్లంచితమై బెడంగగునజాండకటాహము...." ఐ. పు. 3, ఆ. ౦౯.

తాఱుమాఱు. దే. వి. (తాఱు+మాఱు) క్రమము తప్పుట, వ్యత్యాసము. (చూ. తాఱుమాఱుపడు) విణ. క్రమముతప్పినది,వ్యత్యస్తము. "ఉ. ఇంత కొలంత యేల విను మేచి జగంబులు తాఱు

మాఱు గావింతునో..." అచ్చ. అర. ౧౦౬.
ఆం. భా. తృ. ౮౯.

తాఱుమాఱుపడు. ద్వ. అ. క్రి. (తాఱుమాఱు+పడు) వ్యత్యస్తమగు. "వ...తటిచ్ఛటులం బగు లోచనప్రభాపటలంబు దిక్తటంబులఁ బర్వఁ దాఱుమాఱుపడ నిడికొనినమొగంబులతో..." స్వా. ౪, ఆ. ౩౭.

తాలంకము. సం. వి. అ. పుం. చెవికమ్మ తాటంకము.

తాలఁబోయు. దే. స. క్రి. (తాలన్+పోయు) పొగచు, తాలించు. "సీ...వలయుసంబారాలు వడియాలు బలియించి దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి." హర. ౨, ఆ. ౧౨౧.

తాలధ్వజుఁడు. సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. బలరాముఁడు.

తాలపత్త్రము. సం. వి. అ. పు. 1. తాటియాకు; 2. కర్ణిక, ఒకరకపుకర్ణభూషణము.

తాలవృంతము. సం. వి. అ. న. వీవన, విసనకఱ్ఱ.

తాలవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) తాలువునఁబుట్టినది.

తాలించు. దే. స. క్రి. 1. కూర మొదలగువానిని తిరుగఁబోయు, పొగచు. (శ. ర. బ్రౌ.); 2. గండించేయు. "వ...వాయ దరుగనీక గడిదల లూని జళిపించియును దాలించియు మించియు." ప్రబంధ. ౭౨౮.

తాలింపు. దే. వి. (తాలించు. ధా.) పొగచుట, తాలించుట. "వ...కర్కంధూఫలాన్నిశ్రశాక పాకంబులతాలింపులకమ్మనికంపు పాంథఘ్రాణంబుల కింపుసొంపును సంపాదించు..." కాశీ. ౨, ఆ. ౪౪. ఆం. భా. ద్వి. ౨౯౨; 2. తాలించినపదార్థము. "మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁ డావారికర్పించుటఁ బావనంబు లగుశాల్యన్నంబులు స్నేతులుఁన్, పరుగుల్ చేరులు పప్పు లప్పడములున్ తాలింపులున్..." పాండు. ౨, ఆ. ౨౪, పాండు. ౪, ఆ. ౧౮౪.

తాలిక. ఉభ. దే. వి. 1. మెలిక. "సీ. నడునెత్తి మట్టిపా లిడి తాలిక లొనర్చి కడలఁగొల్చినగొప్ప జడలదిండు." శుక. ౨, ఆ. ౩౨, భో. ౩, ఆ. ౪౨; 2. చాఱ, రేఖ. "ద్వి. ఉడ వేల కడువఁ బోదము రారె యొడల్లు, కడిగిగోఁ గదరె యొక్కెకలా రనుచుఁ, దాలికల్ గట్టి చెంతలఁ గొంతజాఱ, ఫాలముల్ పచ్చనాఁ బసుపులు పూసి." అ. మ. క. ౫, ఆ. ౬౩౬; 2. క్షమ, తాలిమి. "సీ. తాలిమి యోరుపు తాలిక నాఁగను క్షమ..." ఆం. సం. మాన. ౯. సం. ౭. ఆ. స్త్రీ. 1. చపేటము; 2. నేలతాడి చె.

తాలికము. సం. వి. అ. పుం. 1. చప్పట; 2. చపేటము, చాఁచినవ్రేళ్లు గలయఱచేయి.

తాలిదము. దే. వి. తాలింపు, పోగపు. "మ...తాలిదపుసొంపుల్ నింపువంకాయవేఁపుడుగమ్మందనము..." రా. వి. ౨, ఆ. ౧౦౦.

తాలిపించు. దే. స. క్రి. (తాలుచు ధా. ప్రే.) ధరింపఁజేయు, తొడిగించు. "ఉ. కమ్మనఁ బచ్చికస్తురిని గజ్జవాదిని గుంకుమాంబువు, న్నెమ్మెయికిన్నలుంగు నిడి నిద్దపుఁగండియ దువ్వజిల్గునం, దమ్ముగఁ గట్ట నిచ్చి జిగితం బగునైకను దాలిపించుచున్, సొమ్ములువెట్టె నానుతకు సొమ్ములు పెట్టెడు మేన మేనయున్." పార్వ. ౫, ఆ. ౨౨౫.

తాలిమి. దే. వి. 1. ఓర్పు, క్షమ. "సీ. తాలిమి భూదేవి తగ సాటి యగునేని..." దశ. ౧, ఆ ౧౪, ఆం. భా. ప్ర. ౧౩౪; 2. ధైర్యము, మనస్థైర్యము. "క. పడఁతీ యెట్టట ప్రాణము, విడికిటఁ బెట్టుకొని నేఁడు ప్రియుతో నీ వెప్పుడుబలెఁ బలుకకయించుక, తడవుండుము మాకుఁగాను దాలిమితోడన్." కళా. ౭, ఆ. ౨౦౫. నైష. ౪, ఆ.౩౫.

తాలిమికత్తె. ద్వ. విశే. (తాలిమి+కత్తె) 1. క్షమావంతురాలు, 2. ధీరురాలు. (శ. ర.)

తాలిమికాఁడు. దే. విశే. 1. క్షమావంతుఁడు, ఓర్పరి. "సీ. పరఁగును క్షంత యోర్పరి యనఁ దాలిమికాఁడన..." ఆం. భా. తృ. ౧౧; 2. ధైర్యవంతుఁడు. 3. ధీరుఁడు, పండితుఁడు. "క. వేలుపుబోనఁ దెనుంగున, వాలాయముఁ గబ్బముల నవారిగఁ జేయం, జాలినతొల్లిటియప్పటి, తాలిమికాండ్రనెఱబల్కు దంటలఁ గొలుతున్." అచ్చ. భా. ౧, ఆ. ౨.

తాలిమిడు. దే. స. క్రి. (తాలిమి+ఇడు) క్షమించు. "ఆ. ఉగ్రశాసనుండు నిగ్రహింపకరాజు, తనయుఁదనుచుఁ దప్పు తాలిమిడఁడు." సా. ౨, ఆ. ౨౮.

తాలిశము. సం. వి. అ. న. పర్వతము.

తాలీశపత్త్రము. సం. వి. అ. న. 1. తాళిసపత్త్రి చె; 2. నేలయుసిరిక చె.

తాలు. దే. అ. క్రి. తిరుగు. (చూ. తాలఁబోయు.)
1. వి. ఎన్ను తీయఁబడి ఎండిపోయినపైరు. (శ. ర. ప్రా.) 2. తప్పగింజ, పొల్లు. "సీ. తుచ్ఛ ధాన్యాభిధ దోఁచుఁ దాలు తరక పొల్లకట్టు తబక పొల్లు తప్పు, తంక రన..." ఆం. భా. ద్వి. ౨౩౯.

తాలుకము. సం. వి. అ. న. 1. తాలువు, 2. తాలువు నందు కలుగురోగము.

తాలుచు. దే. స. క్రి = తాల్చు. 1. (వస్త్రాదులను) ధరించు. (ప్రసూనదామము) "గీ. ఇటులఁ దాలిచి సంతుష్టహృదయుఁ డగుచు." దశా. ౨, అ. ౧౯; 2. పొందు. "చ. క్షితి హలకృష్టిఁ బుట్టి యడఁగెఁ క్షితియందున సీత యంచుఁ దత్పతివిరహార్తిఁ బొండిమము దాలిచి రామశరీర మెత్తి..." ఆము. ౪, అ. ౨౯.

తాలుపు. దే. వి. (తాలుచు ధా.) పొగపు, తాలింపు. "ఉ...కమ్మనితాలుపు సొజ్జెపిండితో, నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాకటిచిచ్చు పెచ్చునన్." భీమ. ౨, అ. ౧౩౯.

తాలువ. సం. వి. = తాలువు.

తాలువు. సం. వి. ఉ. న. దౌడ. "సీ. తాలువు తాలువ దవడ దౌడ యనంగ నలరును..." ఆం. భా. ద్వి. ౧౪౩.

తాలూకా. హిం. వి. జిల్లాలో నొకభాగము.

తాలూరము. సం. వి. అ. పుం. నీటిసుడి.

తాలూషకము. సం. వి. అ. న. తాలువు.

తాల్చు. దే. స. క్రి. 1. (వస్త్రాదులను) ధరించు. "ఉ. ఆనవలా వలంతిపసు పాడి దుకూలముఁ దాల్చి..." ఆము. ౫, అ. ౩౯. స్వా. 3, అ. ౧౮౮; 2. మోయు, వహించు. "చ. బహువన పాదపాబ్ధికులపర్వతపూర్ణ సరస్సరస్వతీ, సహిత మహామహీ భరమజస్రసహస్రఫణాళిఁ దాల్చి యుస్స్వాతరమూర్తికిఁ జలధిశాయికిఁ బాయక శయ్య యైనయయ్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్." భార. ఆది. ౧, అ. ౧౦౫. ఆం. భా. తృ. ౧౯౯; 3. అవలంబించు, పూను. "చ. తనరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదితప్రతిజ్ఞుఁ డై." భార. ఆది. ౪, అ. ౨౪౨. "క. తమయ కడు మెఱయుంతొడ వృత్తమరూపము గోరువారు తాల్తురు దానిన్." భార. ఉద్యో. ౨, అ. ౪౦. (ఇది మొదటియర్థమునకు నుదాహరణము.) భార. అర. ౧, అ. ౧౨౭; 4. గ్రహించు, కైకొను. "ఉ. సంచితపుణ్యుఁ డంబురుహాసంభవునంశము దాల్చి పుట్టి..." భార. ఆది. 3, అ. ౪౭. నీలా. 3, అ. 3౫; 5. పొందు. "క. ఏనిద్రఁ జెందునంతకుఁదా నొల్లదు నిద్రఁ దాల్చ..." కేయూర. ౨, అ. ౫౩. జాహ్నవీ. ౧, అ. ౧౧౦; 6. (గుద్దు)పెట్టు. "ఉ. తమ్మిపతంగపల్లి తమిఁ దాల్చినపాండురకోరకాండముల్." వసు. ౪; అ. ౧౩౪; 7. (నూలు మున్నగువానిని) పురియెక్కించు, పేను. "గీ. ఎసఁగు సంతాపభర మున నిట్టునట్టుఁ, బొరలుకయ్యాతలంబునఁ బువ్వుఁ బోఁడి, తిపురు విరహానలంబున దివ్వెలెత్తఁ, జిత్తజాతుండు వత్తిఁ దాల్చినవిధమున." ఉ. హరి. ౫, అ. ౧౩౧. విజ్ఞా. అచా. ౨౫; 8. మెత్తని పిండినుండి నూకను విడఁదీయుటకై చేతితో కోడు. (వా.)

తాల్పు. దే. వి. (తాలిక) "సీ. త్రావుచు నెడనెడఁ దాల్పుగా వండినసంజుడుపొరకలు నంజుసుచు." ద్వా. ౪, అ. ౨౩౪.

తాల్మి. తాలిమి. 1. (క్షమ. ఓర్పు) "గీ. ఇట్లు తమ తమవర్తించునెడల సకలజనములకు హృదయాను రంజన మొనర్చి,తాల్మి పుయిలోట యడఁకువ తగవు మెలపు, నెఱితెఱంగును బాటింప నేర్పు గలిగి." భార. విరా. ౨, అ. 3. ఆం. భా. ప్ర. ౧౩౪; 2. ధైర్యము, మనస్థైర్యము. "క. ఈ తాల్మి లేదు బ్రాహ్మణజాతికి నీ వెవ్వఁడవు నిజం బనపుఁడు..." భార. శాం. ౧, అ. ౨౫. చూ. ౧, అ. ౨౪.

తాల్మింటి. దే. వి. ఆయుధవిశేషము. "మ. తన నీటుల్ మెఱయించు జేనపొడవుం దాల్మింటి యందంపుఁగుం, దనపుందల్కులు గ్రమ్మరించు చిఱుసానాకత్తి చిమ్మున్..." కువల. ౫, అ. ౪.

తావకము. సం. విశ. (అ. ఆ. అ.) నీసంబంధమైనది; నీది.

తావకాల్లు. దే. వి. బ. (తావలము+కాల్లు) ఏత మెత్తువాఁడు కాల్లించుకొనుట కమర్చినకట్టి పట్టెలు. (శ. ర. ప్రా.)

తావకీనము. సం. = తావకము.

తావగొను. దే. అ. క్రి. (తావలము+కొను-ఈపదము కొన్నిచోట్ల కు.సం. లోనే కాని మరెచ్చటను గన్పట్టదు.) 1. నిలుచు, ఉండు. "సీ. విపులవీథి కెడయాడి బిసినికొంగింటిలో నిలఁ దావగొని యున్న వెలఁగుజేఁడు." కు. సం. ౧౦. ఆ. ౫౬; 2. తాళు, ఓర్చు. "వ. అనుచు నతి సంభ్రమంబునం బఱతెంచిన వసంతకుం గనుంగొని రతి మతి నడల నూరడించినం దావగొనక..." కు. సం. ౫, ఆ. ౭౯. కు. సం. ౫, ఆ. ౪౪.

తావడము. దే. వి. (క. తావడ) హారము; రుద్రాక్షలు లోనగునవి గ్రుచ్చి భక్తులుధరించుమాల. "ఉ. దేవి తమోమహిషీరసము తేటఁ బోసంగఁగఁ గట్టిపెట్టి యం,కావళి ప్రాయఁగాఁ దొడఁగె నంబర సంపుట కాంతరంబునన్, బూవిలుకాని శౌర్యగుణముల్ వారిణాంకుఁడు ముత్తియంబులం, దావడముల్ రచించినవిధంబున రుక్షటికాముఖంబులన్." శైవ. ౧, ఆ. ౧౭౦. ఆం. భా. ద్వి. ౧౪౯.

తావరము. వై. వి. (సం. స్థావరమ్) స్థిరమయినది. "చ... శేవగల్లు దా,వరముగ నుండె నయ్యాటజ వాటికఁ దోఁటకుఁ బ్రోదిసేయుచున్." విప్ర. ౨, ఆ. ౩౩.

తావలము. దే. వి. స్థానము, నివాసము. "చ. తలఁ పఁగ సద్గుణంబులకుఁ దావలమై వెనుపొందు సుజ్జ్వలాత్ములు సనిరి..." భార. కర్ణ. ౧, ఆ ౪౯. పి. శకుం. ౨, ఆ. ౧౩౮; 2. ఆధారము, ప్రాపు. "క. క్రమమున శిష్టాచార,క్రమ మెఱుఁగఁగ ధర్మమునకుఁ గడు వాటంబై,విమలం బగుఁ జిత్తము సత్యమును నహింసయును దనకుఁ దావలములు గాన్." భార. అర. ౫, ఆ. ౪౭. శైవ. ౧, ఆ. ౧౦౭; 3. అవకాశము, తెఱపి. "ఉ. నా విని యింక నేమియుం విన్నక రణకోవిద నీ కొకింతయుం,దావల మెద్ది యాకపటదైత్యుఁడు చేర్చున కేఁగుదెంచు నే,మో..." కళా. ౬. ఆ. ౧౧; 4. దృష్టాంతము, ఉదాహరణము. "క. అవికృతి నొంది మది నా,నావిధముల వలచి వచ్చినను ముక్కు సెవుల్,వోవు నని పలుకు గాథకుఁ,దావలమై నిలిచితిం గదా నేఁ దనుఖున్." రామా. ౫, ఆ. ౧౩౯; 5. స్థలము, ప్రదేశము. "సీ. తా వన తా వనఁ దానకం బనఁగను దావలం బనఁగను దలము పేరు." ఆం. భా. ద్వి. ౧౩. విణ. విడువనిది, స్థిరము. "చ. బలరిపుమిత్త్రుఁ డైన యలపార్థివకల్లజపాదపల్లవోజ్జ్వలనఖరేఖ దండనగమండ విఖండనచండిమంబు దా,వలముగ నభ్యసించె నొకొ వజ్రము." వసు. ౧, ఆ. ౧౨౧.

తావళము. = తావడము. "మ...విం,తలుగా వారికిఁ జైత్త్రుఁ డిచ్చుబురుసాదట్టీలు ముత్యాలతా,వళముల్ వోలెఁ దనుం జెగుల్లఁ గలికావారమ్ము లీరమ్ములన్." చంద్రా. ౪, ఆ. ౭౭.

తావి. దే. వి. 1. సువాసన, పరిమళము. "శా. తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువ కేదారంబులీరంబునన్." స్వా. ౨, ఆ. ౨౨. ఆం. భా. ప్ర. ౧౦౬; 2. (దుర్గంధము) పండ్లపాచి. "మ. తలలోఁ బేలును గండ్లలోనఁ బుసి దంతశ్రేణిలోఁ దావి వీనులలోఁ జీవిలి..." శుక. ౩, ఆ. ౪౪.

తావికొను. దే. స. క్రి. వాసనచూచు. "గీ. కలహభూమిలో నాలుక గలయఁ బఱపి, తావికొని త్రిప్పి చాముండిదేవి...రాక్షసుల నెల్ల మ్రింగె." కు. సం. ౧౬, ఆ. ౧౧౨.

తావిగట్టు. ద్వ. వి. (తావి+గట్టు) మలయపర్వతము. "చ...ని,చ్చలమునఁ దావిగట్టుకడ సంద్రము లోపలిదీవి యేలుచున్." య. ౨, ఆ. ౬౧. ఇట్లే: తావిగుబ్బలి. య. ౨, ఆ. ౧౨. తావిమల. అచ్చ. సుం. ౧౬౧. తావులకొండ. వేం. పంచ. ౪, ఆ. ౨౧౧.

తావిచెంగలువ. దే. వి. పరిమళము గలయెఱ్ఱకలువ, కహ్లారము. "సీ. హృదయంగమస్ఫూర్తి నెపుడు నామోదంబు గలిగించు తావిచెంగలువ చెలువ." దశా. ౩, ఆ. ౩౫.

తావితాల్పరి. దే. వి. గంధవహుఁడు, వాయువు. "సీ. తావితాల్పరి పగదాయ కూటపుఁదిండి తెక్కుకట్టెఱపక్కి జక్కిణ్వాఁడ." ప్రబంధ. ౨౧౭. ఇట్లే: తావిమోపరి. (శ. ర.)

తావినూనె. దే. వి. (తావి+నూనె) తావి గలనూనె, అత్తరు. (శ. ర.)

తావివిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు. (శ. ర.)

తావివోవు. దే. అ. క్రి. (తావి+పోవు) పరిమళహీన మగు. "చ. అనఘుఁ డతండు నిత్యము నహర్ముఖకృత్యము లాచరించి పావనమలిఁ జిడ్డు లేక కయిప్రాలక తావివోక పుష్పనివహమెగ్గ

గాక కడసారిని మేలిమి నేర్పరించి గ్రక్కునఁ బరువంపుఁ గ్రొవ్విరులఁ గోయుచు వంశపుటీ తలంబునన్.'' వి ప్ర. ౨, ఆ. ౨౯.

తావిషము. సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. స్వర్గము. న. తేజస్సు.

తావు. దే. వి. (త. తావు) 1. స్థానము, తావలము. ''ఉ... పీతాంబరపాదపంకజము లంటినతావులు ద్రొక్క నోడి పార్శ్వంబుల సంచరింతురు పరస్పరకేళి వచఃప్రసంగతిన్.'' పారి. ౪, ఆ. ౧౫. ఆం. భా. ద్వి. ౧౩ ; 2. కళాస్థానము. ''ఉ. ప్రాయపుదంపతుల్ బెగడుపాటున నొం డొరుఁ గౌగిలించి య్యా,హా యిదె తెల్లవాఱెఁ గద యంచుఁ బునారతివాంఛ నర్మవాచా యుతిఁదావు లంటినవెసం దమిరేఁచి రమింపఁ గొక్కరోకో యని తామ్రచూడములు కూయఁ దొడంగె నడంగెఁ జీకటుల్.'' కవిరా. ౫, ఆ. ౨౧౬.

తావుకొను. దే. అ. క్రి. (తావు+కొను) 1. నెల కొను, వసించు. ''క. నా లిని తమ్ముల నేలెడు. దేవునిగారాపుఁబట్టి తేటమొగమునన్, తీవి నును నగవుసిగ్గులు, తావుకొని మెలంగ నింద్రతనయుని కనియెన్.'' కాళిందీ. ౫, ఆ. ౪౪. ఉ. రా. ౮, ఆ. ౩౬; 2. ఉండు, నిలిచియుండు. ''ఉ. ఇద్దెసం, దాను సహించి యేమిగతిఁ దావుకొను న్నెయిఁ బ్రాణ మర్జునా.'' భార. మా. ౧, ఆ. ౧౭౨. చం. రా. ౪, ఆ. ౩౮.

తాస్సీలు. దే. వి. (హిం. తహసీలు) ఆజ్ఞ. ''సీ. తలఁపు తాస్సీళ్లలో మెలఁగఁ జేసిలిఁగదా శక సింధుఘూర్జరాశ్మంతపతుల.'' రంగా. ౨, ఆ. ౩౯.

తాస్సీల్దారు. దే. వి. (తాస్సీలు+దారు) ఆజ్ఞయిచ్చు అధికారి. (వా.)

తాహతు. హిం. వి. శక్తి, సామర్థ్యము.

తాళకము. సం. వి. అ. న. 1. పర్వతమందలిధాతు విశేషము. 2. చిన్నబీగము. 3. తాడిచెట్టు.

తాళకి. సం. వి. ఈ. స్త్రీ. తాటికల్లు.

తాళగించు. వై. అ. క్రి. తాళమువేయు. ''గీ. ఓర్తు కరతాళ మొనరింప నొర్తు సమద, గీతిఁ బచరింప జతిఁ దాళగింప నొర్తు, మధురమదిరారసోల్లాసమత్త యగుచు, సాడె నొక్కతె లలితాంగివారిగతుల.'' నృసింహ. ౨, ఆ. ౭౨. పద్మ. ౧, ఆ. ౫; 2. ధ్వని చేయు, మొఱయు. ''చ. కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీడఁగ గుబ్బదోయిపై, సర ములు చొకళింపఁ గటిసంగతి మేఖల తాళ గింప .. మరునివినోదముల్ సలిపె మానిని...'' భాగ. ౬. స్కం. ౧౧౧.

తాళగిరి. వై. వి. తాళము వేయువాఁడు. ''సీ. తాళ ధారి చెలంగు, దాళగిరి యనంగ...'' ఆం. భా. ద్వి. ౨౮౭.

తాళధ్వజుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు. 2. భీష్ముఁడు. [చెవికమ్మ.

తాళపత్త్రము. సం. వి. అ. న. 1. తాటియాకు. 2.

తాళపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. మురయనుగంధ ద్రవ్యము ☘ 2. మధురిక, అడవిసదాప ☘.

తాళమానము. సం. వి. అ. పుం. తాళనియమము. ''గీ. ప్రౌఢిఁ బలికించుగీతప్రబంధములకుఁ, గమ్ర కరపంకరుహ రత్నకటకఝుణఝ్ఝు, ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప.'' స్వా. ౨, ఆ. ౨౭, శశాం. ౪, ఆ. ౬౫.

తాళము. ఉభ. వై. వి. (సం. తాళక) 1. మల్లబంధ విశేషము. ''క. పెలుకుఱి తాళం బీమదిఁ, దలఁచి యనువు గాక ధరణితలము గరపుటం, బుల నప్ప ళించె...'' భార. విరా. ౨, ఆ. ౧౯; 2. బీగము. ''సీ. బీగము తాళ మనఁగ న, యోమయార్గళవిశే షోక్తి యొప్పు.'' ఆం. భా. ద్వి. ౨౨. సం. వి. అ. పుం. 1. తాటిచెట్టు; 2. చప్పట; 3. అఱ చేయి; 4. ఏనుఁగుచెవుల అప్పళింత; 5. పాడునపుడు లయానుసారముగ చేతులతోఁ జఱచెడిచఱపు; 6. జేన; 7. తగరము; 8. బాణముపిడి. న. అరి దళము. పుం. న. 1. కంచుతోఁ జేసిన తాళపుఁ జిప్ప; 2. బీగము. (శ. ర.)

తాళమూలిక. సం. వి. ఈ. స్త్రీ. నేలతాడి ☘.

తాళపట్టియ. ద్వ. వి. (తాళము+పట్టియ) పీఠ ప్రక్కను దాళము వేయుటకై యమర్చు తీఁగె. ''ద్వి. తనరుచు మొగచాళమును నవతాణ, మును మఱి నవతాణమును దీపుమెఱయఁ, దాళపట్టి యయు... తలిర్ప.'' బస. ౩, ఆ. ౫౭౨. పం.

తాళవృంతము. సం. వి. అ. న. విసనకఱ్ఱ, వీవన.

తాళి. ఉభ. దే. వి. 1. మంగళసూత్రము. ''ఆ. తాళిఁ గట్టె నపుడె తలిరాకుఁబోఁడికిఁ, బుడమిఱేఁడు వేడ్క గడలుకొనఁగ.'' యు. ౪, ఆ. ౧౦౬.

నిరం. ౨, ఆ. ౧౫౮; 2. హారవిశేషము. "మ... ఖ్యాతితో,మను మంచుక్ హనుమంతుఁ బల్కి- రఘురామస్వామి సుగ్రీవుఁ బాయనివైదూష్యపుఁ దాళిఁ గైకొని తదీయగ్రీవ నుంచెం గృపన్." ఉ. రా. ౫, ఆ. ౩౦౫. అచ్చ. సుం. ౩౪; 3. పతకము. "వ. హృదయసదనుం డగుమదనునకుఁ బోడము బీభత్సరసంబు రుచిరవక్షస్థ్సలంబునం దోఁచినవిధంబున నీలంపు తాళితళుకు సంఘటింప..." చంద్రా. ౫, ఆ. ౧౨౪, ఆం. భా. ద్వి. ౧౪౯. సం. వి. న్. పుం. శివుఁడు. ఇ. ఈ. స్త్రీ. 1. నేలయుసిరిక ♣. 2. శ్రీతాళము, పెద్ద యాకులతాడి♣. ఈ. స్త్రీ. 1. నేలతాడి ♣; 2. కంది ♣; 3. తాళపుఁజెవి.

తాళించు. దే. స. క్రి. జూదమాడునపుడు క్రింద వేయుటకై పాచికలను చేత నుంచుకొని యిటు నటు త్రిప్పు. "వ...తాళించుపాచికలపోలిక..." ఉ. హరి. ౩. ఆ. ౬౪, ఉ. హం. ౩, ఆ. ౧౨౦.

తాళిక. దే. వి. (తాళు ధా.) ఓర్పు, క్షాంతి. "సీ. తాళిక యన క్షాంతి దనరారు..." ఆం. భా. ప్ర. ౧౩౮. విశే. 1. ఓర్వశక్యమైనది. "ఆ. ధనము లే మెవరికిఁ దాళికై యుండదు..." వేమన. ౩, ప్ర. ౧౧౨; 2. చాలినది, సమర్థమైనది. (శ. ర.)

తాళిగోణము. దే. వి. (తాళి+గోణము) పైని పతకము కట్టినగోఁచి, లంగోటి. "సీ. బహుసంకుమద పంకపాణింధమం బైనతాళిగోణపుఁజుంగు నేల చీర." పాండు. ౩, ఆ. ౧౦.

తాళిగోణాము = తాళిగోణము. "సీ. కటిఁ దాళి గోణాము కడచుంగు దరఁ జీర పట్టుదట్టీ డ్రిండు గట్టి..." ఉద్భ. ౨, ఆ. ౧౨౧.

తాళిదము=తాలిదము. "ద్వి. ముప్పిరి సంభారముల మించి నేతఁ,జిప్పిల నగ్గలించిన తాళిదముల." ఆ. మ. క. ౫, ఆ. ౨౪౮. పు.

తాళిబొట్టు. దే. వి. (తాళి+బొట్టు) మంగళసూత్రమునఁ గట్టుస్వర్ణాభరణవిశేషము, పుస్తె. "గీ... తాళి,బొట్టు మూసికతోఁ గూర్చి పొసఁగ నలుతఁ, ద్రాడుగట్టక పొగనెల్లఁ దలిమి యొడల, వ్రేలువలరాచబలుబూచి పీడఁ గలదె." నీలా. ౧, ఆ. ౧౦౩. విప్ర. ౧, ఆ. ౪, ఇట్లే: తాళి పతకము. ప్రబంధ. ౨౭౩.

తాళిపత్త్రిక. వై. వి. (సం. తాళీపత్త్రమ్) ఒకానొకమందుదినుసు. (శ. ర.)

తాళీకుఁడు. దే. విశే. కార్యసాధకుఁడు. పూనినపనిని నెఱవేర్పువాఁడు. "గీ. పరఁగుఁ దాళికుఁ డనఁగఁ దీర్పరి యనంగఁ, గార్యకర్తకుఁ పేరు..." ఆం. భా. తృ. ౪.

తాళు. దే. అ. క్రి. (క. తాళు. త. తాళు.) ఆఁగు, నిదానించు. "సీ. తడవాయె ననుచుఁ జిత్తమున నుంపఁగ నేల యిదె వత్తుఁ దాళుమీ యుంతకడవు." దశా. ౨, ఆ. ౩౬౫. స. క్రి. అ. క్రి. సహించు, ఓర్చు. "ఉ...ధైర్యసంపదం,దాళెఁ బయోజగర్భుఁడు రణంబున..." ఉ. రా. ౨, ఆ. ౨౧. ఇందు. ౨, ఆ. ౧౧౮.

తాళుకొను. దే. అ. క్రి. (తాళు+కొను-స్వార్థమున) 1. ఆఁగు, "వ...ఇందువదనా భవదీయమనోరథంబు సఫలం బయ్యెడు మెల్లి యీప్రొద్దునకుం దాళుకొమ్ము..." విప్ర. ౩, ఆ. ౪౪; 2. సహించు, ఓరిమిచూపు. "సీ. తనభార్య బలిమిఁ బట్టినఁ జూచుకొని తాళుకొన నేను నుతక్ష్యమునిని గాను." దశా. ౨, అ. ౪౧, అహ. ౧, ఆ. ౬౪.

తాళువారము. దే. వి. వసారా,పంచాది. "సీ...పాలు వోసి చాల,నూర్చవచ్చు ననంగ నొనరుచావడి తాళువారంబు చిన్నిగవాక్షు లమరు." శుక. ౩, ఆ. ౪౮౧.

తాళ్లపాములు. ద్వి. వి. బ. బాలక్రీడావిశేషము. "గీ. తాటియాకులచిలుకలు తాళ్లపాము, లకటయగచాట్లపోతనై యాడుకొనుచు .." హంస. ౩, ఆ. ౧౪౬.

తాళ్వారము = తాళువారము. (బ్రా.)

## తి

తింట. దే. వి. (తిను ధా.) తినుట, భక్షించుట. "తరల. కులగురుండు వసిష్ఠుఁ డంత విపక్షి కుందెలు దింట లోఁపల నెఱింగి..." భాగ. ౯, స్కం. ౧౫౮.

తిండాడు. దే. అ. క్రి. (తిండి+ఆడు) బలహీనమగు, కృశించు. "క. తిండాడువైరివీరులఁ,దెండాడుట యేమి దొడ్డు చెండాడుగతిన్, గొండపయిఁ గొండ గూలఁగఁ, గొండికపాయమున నీటుకోల నీటున్." సుద. ౨, ఆ. ౧౨౭.

తిండి. దే. వి. (తిను ధా) 1. భోజనము,తినుట. (చూ. తిండిపోతు); 2. ఆహారము. "సీ. ఉప వాసములఁ దద్దయును గృశింపక మేను తిండిచేఁ బోషించు చుండెనేని..." జై. ౩, ఆ. ౩౪. ఉ. హరి. ౪, ఆ. ౪౬.

తిండికత్తియ. ద్వి. విశే. (తిండి+కత్తియ) మిక్కిలి తినునది, అమితభక్షకురాలు. (శ. ర.)

తిండికత్తె = తిండికత్తియ. (శ. ర.)

తిండికాఁడు. దే. విశే. (తిండి+కాఁడు) 1. మిక్కిలి తినువాఁడు, అమితభక్షకుఁడు. (శ. ర.); 2. దురాశాపరుఁడు,లోభి. "క. విను కొడుకుగొన్న వేడుక,కొని కొట్టినతిండికాఁడు కుటిలుం డతఁ డా, జనపతిచందము ధర్మజు,ననుపమశీలంబు నెఱుఁగు దది యట్లుండెన్." భార. ఉద్యో. ౧. ఆ. ౫౬. భార. స్త్రీ. ౧, ఆ. ౧౯.

తిండిపోతు. దే. విశే. (తిండి+పోతు) మిక్కిలి తిను వాఁడు. "గీ. వాదులానితోడ వాట్లిసితోడను, బూతుతోడఁ దిండిపోతుతోడ, నటమటీసితోడ నడియరితోడను,వెలకు నెత్తమాడ వెరవు గాదు." ఉ. హరి. ౩, ఆ. ౧౧౨. భార. ద్రో. ౪, ఆ. ౭౩౯.

తిండీఁడు. దే. విశే. (తిండి+ఈఁడు) తిండిపోతు, అమితభక్షకుఁడు. "గీ. తిండికాఁ డనఁ దిండీఁడు తిండిపోతు,నంగ భక్షకునకును దనర్చుఁ బేళ్లు." ఆం. శే. ౬౦.

తింతిడీకము. సం. వి. అ. పుం. న. చింతచెట్టు. న. 1. చింతకాయ; 2. చింతపండు.

తింత్రిణి. సం. వి. ఈ. స్త్రీ. చింతచెట్టు.

తింత్రిణీకము. సం. = తింతిడీకము.

తిందుకము. సం. వి. అ. పుం. తుమ్మికి ౘె.

తికతిక. దే. విశే. కలఁగినది, క్షుబ్ధము. "క. తోక తోకల నడికి మిడుకుచుఁ, దికతికలై యొం డొకట్ల దెగుకత్తుల బల్,చకచకలు నెసకమెసఁ గన్, గకవికలుగ హరిబలంబు కళవళ మందన్." ప్రబంధ. ౭౯౬.

తికమక. దే. వి. 1. తొట్రుపాటు. (చూ. తికమక గొను); 2. అవయవములయస్వాధీనత. (చూ. తికమకగుడుచు.); 3. బాధ. "చ. ఒకపరిపోవఁ దోఁకతుద నూడ విదిర్చిన నింతవచ్చెఁ గ్యాయిఁక నొకమాటు పోయి పిల నెక్కుడఁ దోఁకను చుట్టి కొట్టునో, తికమకకోర్వఁ జాల..." సమీర. ౬, ఆ. ౧౭౯. విశే. కలఁగినది, క్షుబ్ధము. "చ. తిక మక గాఁగఁ జేసి నలుదిక్కుల నార్భటిసేయు సారమే,యకములఁ జెల్గి కొట్టి నుఱుమాడుచు నొక్కవరాహ మేఁగె..." సా. ౧, ఆ. ౯౪.

తికమకగుడుచు. దే. అ. క్రి. (తికమక+కుడుచు) వివశుఁడగు. "ఆ...ధరణిఁ ద్రెళ్లి, తిరిగి లేక లేక తికమకగుడువఁగ..." భాగ. ౬, స్కం. ౩౦౮. (శ. ర. పా.)

తికమకగొను. దే. అ. క్రి. (తికమక+కొను) తొట్రుపడు. "క. ఒకమొగముగాక దివిజులు, తికమక గొని వైరు లెల్ల దీకొనఁ దమ్ముం,బికపికలై నక నకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్." భాగ. ౬, స్కం. ౨౭౫. ఇట్లే: తిక మకలుగొను. పి. శకుం. ౩, ఆ. ౨౦౨.

తికమకము = తికమక. (విశే. కలఁతనొందినది, (క్షుబ్ధము) "చ. క్రకచునిభార్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం, డకట యొటేనిఁ బోయి తడవయ్యె విలంబనహేతు వెద్దియో, తిక మక మైతి నానెగులు దీర్పుము నీ వపు డేఁగి చూచి..." వేం. పంచ. ౪, ఆ. ౩౧.

తికమకలాడు. దే. అ. క్రి. (తికమకలు+ఆడు) 1. కలఁతనొందు; 2. తొట్రుపడు; 3. అవయవ ములు) అస్వాధీనతనొందు. (శ. ర.)

తికమకలుసేయు. దే. స. క్రి. (తికమకలు+చేయు) కలఁతనొందించు, బాధించు. "క. మొకమెఱుక గలదు గద వే,మకరాంకునియనుఁగు మేనమామకు నీకుం, దికమకలుసేయవల దను, మకటా మేడ పయి కేఁగునపు డైనఁ జెలీ." విజ. ౨, ఆ. ౧౯౯.

తికము. వై. వి. (సం. త్రికమ్) రెండుపిఱుఁదులును వెన్నెముకయుం గలియుచోటు, ముడ్డిపూస. "గీ...త్రికాభిధాన,మలరుఁ దిక మన ముచ్చు నా నళికనయన." ఆం. భా. ద్వి. ౧౩౯.

తిక్క. దే. వి. ఉన్మాదము, వెఱ్ఱి. (చూ. తిక్కగొను.) విశే. ఉన్మాది, వెఱ్ఱియెత్తినది; తిక్కయెత్తిన వాఁడు. "క. అక్కడఁ దిజోదుముందరఁ, జక్క నిలిచి లేఱిచూడఁ జాలక దివిజుల్, దిక్కుమొకం బులవలె నలుదిక్కులకుం బఱచి రేమి తెలిపెద నధిపా." ఉ. రా. ౪, ఆ. ౩౦౮. "సీ. వెఱ్ఱి వెంబరవిత్తు వెంగలి పీఱఁడి వెడఁగు వేఁదురు

తిక్క వెకలి యనఁగ, నుస్మాదిసంజ్ఞయై యొప్పు చుండును..." ఆం. భా. తృ. ౭.

తిక్కగొను. దే. అ. క్రి. (తిక్క+కొను) వెఱ్ఱియెత్తు (శ. ర.)

తిక్కటమక్కటం. దే. వి. కలఁత, క్షోభము. శ. ర.

తిక్కటి. వై. వి. (సం. త్రికాష్ఠి) ఆయుధవిశేషము. "సీ. నలువుర నేవురఁ దలలరిటఁగొన నేయఁ దిక్కట్లతోడన తిరుగువారు." రామా. ౮, ఆ. ౧౬, ఆం. భా. ద్వి. ౨౧౮. [బ్రౌ.

తిక్కడి. దే. వి. నూలువడికెడి చిప్పకదురు. (శ. ర.)

తిక్కపట్టు. దే. అ. క్రి. (తిక్క+పట్టు.) వెఱ్ఱియెత్తు. "గీ... ప్రజలార మీ కేల తిక్కపట్టె, వీరిబగిసికి మఱి గారవించి వారుఁడు, కాయసిద్ధి యొసంగునే కల్లగాక." శుక. ౩, ఆ. ౬౪.

తిక్త. సం. వి. ఆ. స్త్రీ. 1. కటుకరోహిణి; 2. చిఱుబొద్ది.

తిక్తకము. సం. వి. అ. పుం. 1. చేదు; 2. చేఁతి పొట్ల; 3. నేలవేము; 4. గార; 5. నల్ల చంద్ర. విణ. (అ. తిక్తికా. అ.) చేఁదైనది.

తిక్తఫల. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, ములగ.

తిక్తఫలము. సం. వి. అ. పుం. ఇందుగు.

తిక్తము. సం. వి. అ. పుం. 1. చేదు; 2. కారము; 3. కొండమల్లె; 4. చేఁతిపొట్ల; 5. గుగ్గిలము; 6. ఉలిమిరి; 7. సుగంధము. విణ. (అ. ఆ. అ.); 1. చేఁదైనది; 2. మంచివాసన గలది; 3. కారము గలది. [చంద్ర.

తిక్తశాకము. సం. వి. అ. పుం. 1. ఉలిమిరి; 2.

తిగ. వై. స. (సం. త్రికమ్. క. తిగ.) మూఁడు, "సీ. తిగరేక లేర్పడ దిద్దిననొసలి నుబ్బెలిబూది బొట్టు రంగులు సెలంగ." నీలా. ౧, ఆ. ౬౦, ఆం. భా. ద్వి. ౩౦౬.

తిగకంటి. ద్వ. వి. (తిగ+కన్ను+ఇ.) త్ర్యంబకుఁడు, శివుఁడు. "సీ. పగలింటికడ నాడు తిగకంటి యొకి మాని గడితంపునిరువాలుజడ లనంగ." అచ్చ. అయో. ౧౩.

తిగప్రోలుదాయ. వై. వి. త్రిపురహరుఁడు. "సీ. మేలిమిగట్టువిల్ మేటి పున్కలదారి తిగప్రోలు దాయ విన్నిగ తుపాసి... గీ... ముక్కంటి యనఁగ, శంకరునినామధేయముల్ వేంకటేశ." వేంక. దేవ. ౫.

తిగవంగడము. వై. వి. (తిగ+వంగడము.) వైశ్య కులము. (చూ. తిగవంగడపుఁబుట్టువు.)

తిగవంగడపుఁబుట్టువు. ద్వ. వి. (తిగవంగడము+ పుట్టువు) మూఁడవకులమువాఁడు, వైశ్యుఁడు. "సీ. తొడకొడుకు తిగవంగడపుఁబుట్టువు బచ్చు శెట్టి కోమటి యన నూరుజన్ముఁడు.." వేంక. పూన. ౨౭.

తిగవంచే. ద్వ. స. (తిగ+వంచే) నాలుగు, చతుష్కము. "సీ... తిగవంచ చౌకమ్ము తీపంచ యడ్డ, యనఁగఁ జతుష్కాఖ్య యగును..." ఆం. భా. ద్వి. ౩౦౬.

తిగిచికొను. దే. స. క్రి. (తిగుచు+కొను) ఊడఁ బెఱుకుట, హరించుట. (చూ. తిగిచికోలు.)

తిగిచికోలు. దే. వి. (తిగిచికొను ధా.) "ఉ....ము, వ్వంటులనాఁడు పూతన యవారణ నెత్తికొనంగఁ జన్నుఁబాల్గొంటయుఁ బ్రాణముల్ దిగిచికోలును నొక్కటి గాఁగ నీతఁ డాగొంటునిశాచరిఁ వసుధఁ గూల్చుట వింటిమి కాదె యేర్పడన్." హరి. ఉ. ౪, ఆ. ౨౩౩.

తిగియు = తివియు. దే. స. క్రి. ఆకర్షించు. (శ.ర.)

తిగుచు. దే. అ. క్రి. తగ్గు, తీసిపోవు. "క. వసురాజయ్యెడ బలవ, ద్విసృమరపాదప్రసార దీర్ఘాచలుఁడై, యొసఁగఁగ వసుధాపరికీర్ణ సరిన్నిర్ఝరము తత్క్షణంబునఁ దిగిచెన్." వసు. ౨, ఆ. ౬౪. స. క్రి. 1. ఆకర్షించు, లాగు. "క. స్రోతో వేగము పటుగతి, వీతబలుం దిగుచునట్లు విషయము లీడ్చున్, జేతోబలసంభృత యోగాతిశయుండు గానివాని నంచితచరితా." భార. శాం. ౫, ఆ. ౫౮౧. మార్క. ౩, ఆ. ౩౨౧; 2. చేరఁదీయు. "చ. తిగిచి కవుంగిలించి జగ విభుఁ డక్కమలాయతాక్షి సెమ్మొగము మొగంబునం గదియ నొత్తు..." భార. విరా. ౧, ఆ. ౨౪౭; 3. లాగివేయు, తీసివేయు. "గీ. పట్టుగవుసెన దీసినభావభవుని, పసిఁడివిలుకమ్మియో నాఁగ మును(గు) దిగిచి, పఱపుమీఁదను గూర్చుండఁ బడి కళావతీశిరోమణి యారాజుదిక్కు చూచి." విక్ర. ౮, ఆ. ౧౦౧. సా. ౩, ఆ. ౧౩౯; 4. పోఁగొట్టు. "క. చెలువకు సంపెఁగనూనెం,దలయంటె సుగంధవాసితము లగుచూర్ణం,బుల నలుఁగువెట్టె గంధామలకం బిడి చమురు దిగిచె మజ్జన మార్చెన్."

ప్రభా. ౪, ఆ. ౧౮౯; 5. తెచ్చు. "వ. అట్లు చని పీఠిహోత్రుండు ధాత్రీధవుం గాంచినం గనుంగొని ప్రసంగంబు దిగిచి నీచేత జన్యంబున విమతసైన్యం బశేషంబు భస్మంబుసేయుంబడె నే యని యడిగిన..." జై. ౪, ఆ. ౪౦. ప్రభా. 3, ఆ. ౬; 6. పైకిఁదీయు, ఉద్ధరించు. "చ.. దక్షిణహస్తమునం దదున్నమద్గళదురుఘర్మవారి కణకమ్రకరాబ్జము పట్టి నూతిలో, వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతి తోన్." భార. ఆది. 3, ఆ. ౧౪౪. దశ. ౧౧, ఆ. ౭౬; 7. (నీరు) తోడు. "వ...కొంకి గల నిడుపువెదురునం జేద పుచ్చి నీరు దిగిచి యబ్బాలునిడప్పి దీర్చి..." దశ. ౧౧, ఆ. ౭౦; 8. వెఱుకు. "వ...గంతులిడుగబ్బిబెబ్బులుల నలఁ గుడుల దొడ్డజనంబులు మంత్రించి పారక దిగిచిన నీరుమే పుడిగి గిరులు గ్రక్కదల వాపోవుచు." స్వా. ౪, ఆ. ౩౭.

తిగుట. దే. వి. ఆసక్తి, తమి. "క. తగులు విడి యైనఁ గడు మెచ్చుగ నాడుడుఁ బులులమాటజూడం బులతో, మిగులఁగ నేర్పరి ననఁ దగి, తిగుటన్ సొగటాల నే నతిప్రౌఢుండన్." ద్వా. ౧౦, ఆ. ౯౧.

తిగుళ. దే. వి. దేశవిశేషము. "సీ. తిగుళభూములు తెంకులుగఁ భరించినదొడ్డచెవులపోతుల నెల్లఁ జెండివైచి. గీ. సార్వభౌమునిబిరు దైనసాళు వంబు." జై. ౧, ఆ. ౪౫.

తిగ్మము. సం. వి. అ. న. 1. వేఁడిమి. 2. వజ్రము. విణ. (అ. ఆ. అ.) తీక్ష్ణము, వేఁడియైనది.

తిగ్మాంశుఁడు. సం. వి. అ. పుం. వేఁడివెలుఁగు,సూర్యుఁడు.

తిట్ట. దే. వి. (క. టిట్ట. త. తిట్టై.) 1. రాశి, ప్రోవు. "సీ....ఒక్క, పెట్ట త్రోచిన దూదిలిట్టలపై బ్రాఁకునగ్గిచందంబున మ్రగ్గఁజేయం." భార. ద్రో. ౧, ఆ. ౙ౯౩; 2. గుట్ట, తిప్ప; "ఉ. తీరక పోయి పోయి పలుదెంపల గంపల నేళ్ల బీళ్లఁ బ్రాఁబూరుల దారులం గడిదిపుట్టలఁ దిట్టల... నా, హారమతిం జరించి జఠరానల మాఱక వచ్చి క్రమ్మఱన్." వేం. పంచ. ౧, ఆ. ౪౯౩; 3. సేనాసమూహము. "ఆ. అప్డు దేవదంగి యన్ని సేనలు భీష్ము, రథముపొంత కొదిగె రౌద్రరసవి, నోది యైనయర్జునుఁడు ధనుశ్చలన, దీప్తమూర్తి యగుచుఁ దిట్ట కుఱికె." భార. విరా. ౫, ఆ. ౧౫౪, భార. భీష్మ. 3, ఆ. ౙ౧౯.

తిట్టాట. దే. వి. (తిట్టాడు ధా.) వాక్కలహము, దూషణము. "క. తిట్టాట అంకు మ్రుచ్చిమి, యిట్టివివాదములచోట నెవ్వరినైన, న్నెట్టన సాక్షిగఁ గొనఁ జను, నట్టియెడల్ సాక్షిగుణము లరయరు పెద్దల్." విజ్ఞా. వ్యవ. ౧౦౩.

తిట్టాడు. దే. అ. క్రి. (తిట్టు+ఆడు) వాక్కలహ మాడు, దూషించుకొను. "సీ. ఎవ్వారిఁ బోడ గన్న వెకసక్కెమాడుచు నంగన ల్గలసి తిట్టాడ వినుచు." విప్ర. ౫, ఆ. ౙ౬.

తిట్టు. దే. స. క్రి. 1. దూషించు, నిందించు. "మ... చుట్టంబులున్, జెలులున్ దిట్టరె లోఁతిరాజు లకు మెచ్చే యివ్విధంబు.." భార. ఉద్యో. 3, ఆ. ౯౫, భార. విరా. ౨, ఆ. ౨౨౦; 2. శపించు. "ఉ. అవిధి నుండునంతట నొకప్పుడు నిన్నును జూచుచో మణి, గ్రీవునిపేరు దోఁచె మదికిన్ మణికంధర యేకదేశసా, మ్యావగుణం బుచే నీతని నాతనియన్నను మద్దిచెట్లుగాదైవత మాని తిట్టినవిధంబు మనంబునఁ బాఱె నంతటన్." కళా. ౪, ఆ. ౧౯, భార. ఆది. ౧, ఆ. ౧౩౦.

వి. 1. నింద, దూషణము. "ఉ. తిట్టులఁ బోయి యక్కొలువు లేఁకువ వారలలోని కింతిఁ దా, నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందలపట్టి యీడ్వఁగా, నెట్టు సహించె మామ..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౩౧. స్వా. ౬, ఆ. ౪౯; 2. శాపము. "గీ...అతఁడు, తత్పదద్వంద్వమునకు వందన మొనర్చి,తపసితిట్టునఁ బ్లవమయ్యెఁ దక్ష ణంబ." పాండు. ౫, ఆ. ౙ౦౨, తపతీ. ౪, ఆ. ౪౪.

తిట్టులుపడు. ద్వి. అ. క్రి. (తిట్టులు+పడు) నిందింపఁ బడు. "గీ... జగము,చేతఁ దిట్టులుపడునట్లు చేసి పోయి, తేల..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౩౧.

తిట్టువడు. ద్వి. అ. క్రి. (తిట్టు+పడు.) 1. శాపము నొందు. "గీ. మును కళాపూర్ణుకథ నీవు వినవె ధనదు,పట్టిచే నంత నట్లేల తిట్టువడిరి." కళా. ౪, ఆ. ౧౭౦; 2. నిందింపఁబడు. గీ. తెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక,యెఱుఁగఁ బలుకు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౪౦౫.

తిట్టువాటు. వ్య. సి. (తిట్టుపడు ధా.) నింద, అపవాదము. "ఉ. కొడుకు మాకు నిట్టిధన మిచ్చినవాఁడవు టెల్లలంచికా, మాతకు నీతి గా దుచితమార్గము దప్పుటఁ దిట్టువాటు సి,చేతఁ బరాభవంబు వడి చెప్పుట కష్టము చెప్పకుండ రా, దీతెఱఁగెల్లఁ జెప్పెద మహీశ్వర యెయ్యది యెట్లు వోయినన్." దశ. ౬, ఆ. ౯౮. రం. రా. అయో. ౧౭౫. పు.

తిడిమి. దే. వి (దీనియామ్రేడితరూపము. తిడిమి తిడిమి, తిడిమితిడిమ్మి.) 1. రథము నడుచునపుడు కలుగుధ్వని కనుకరణము. "క. పాదవులకు నింగి చాలని,కడఁకంబల బడమికిం దిగంబడి చెమ్ముల్, పిడువుల్ ద్రవ్వఁగ వెడలెన్, దిడిమితిడిమ్ములు చెలంగఁ దేరులబారుల్." రామా. ౮, ఆ. ౬౬; 2. వాద్యధ్వని కనుకరణము. "వ. ఎద్దలపైఁ దమ్మటమ్ములు తిడిమితిడి మని మ్రోయ వేయుచు." ప్రబంధ ౭౮.

తిణిఁగి. దే. వి. మల్లబంధవిశేషము. "సీ. కన్నాత చాంగణ కండణంబు తిణింగి గొంతుమాఱుచు జేల కమ్మరింపు. గీ...నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియుం రెండువిన్నాణములకుఁ జేట్లు." అం. భా. ద్వి. ౭౦౯, ప్రబంధ. ౭౮.

తిణిఁగించు. దే. అ. క్రి. తిణిగి యనుమల్లబంధము నుపయోగించి పట్టు. "ద్వి. దీకొని వారి వానిఁ దిణిఁగించి వైచి, పైకొని జఠరంబుఁ బట్టి లోఁగించి." అ. మ క. 3, ఆ. ౧౪౧. పు.

తితఉవు. సం. వి. ఉ. పుం. న. జల్లెడ, చాలని.

తితిక్ష. సం. వి. ఆ. స్త్రీ. క్షమ, శీతోష్ణాదిద్వంద్వ సహనము.

తితిక్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=తితిక్షువు.

తితిక్షువు. సం. విణ. (ఉ) తితిక్షావంతుడు, క్షమా గుణము కలవాఁడు.

తితిభము. సం. వి. అ. పుం. ఆరుద్రపురుగు.

తితీర్ష. సం. వి. ఆ. స్త్రీ. తరించుకోరిక.

తితీర్షువు. సం. విణ. (ఉ) తరింపఁ గోరువాఁడు.

తిత్తి. వై. వి. (సం. దృతిః. క. త. తిత్తి) 1. కొలిమి తిత్తి, కొలిమి యూఁదుటకై కమ్మరులు మున్నగువా రుపయోగించుతోలుపనిముట్టు. (శ. ర.) "సీ. కొలిమితిత్తులఁ, బోలు కుచములు పీడించి మరగాళ్లఁ దెగడెడుకరము లంటి." చంద్ర. వి. 3, ఆ. ౧౮౫; 2. చర్మము, తోలు. "వ...వాఁడు లగుకత్తులం దిత్తు లొలిచి..." స్కా. ౪, ఆ. ౬౦, నైష. ౭, ఆ. ౮౧; 3. తోలుసంచి, సంచి. "చ...క్రాంతలతిత్తి గ్రైసకీ, చకు ధరణీ స్థలిం జఱపి చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టుఁడై." భార. విరా. ౨, ఆ. 3౫3. "సీ. విషెదాకొమ్ము వో స్త్రిత్తియు జోడమ్ము మెడమీఁది మొగలాకు గొడుగు దసర." ఆము. ౬, ఆ. ౬; 4. శ్రుతికై యూఁదుచర్మకృతగానసాధనవిశేషము. "గీ. సుతి యనఁగఁ దిత్తి యనఁగను శ్రుతి దనర్చు." అం. భా. ప్ర. ౧౭౯; 5. సారాయి మొదలగుద్రవపదార్థములు తీసికొనిపోవుట కుపయోగించు చర్మపాత్రవిశేషము (శ. ర.; 6. కోశాకారముగా నుండు శరీరాంతరావయవము. ఉదా:—ఊపిరితిత్తి.

తిత్తికాఁడు. వై. విణ. (తిత్తి+కాఁడు) శ్రుతికై తిత్తి యూఁదువాఁడు. (శ. ర)

తిత్తిరము. సం. వి. అ. పుం. తీతువుపిట్ట.

తిత్తిరి. సం. వి. ఇ. పుం. 1. తీతువుపిట్ట; 2. ఒకానొక ఋషి.

తిథము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. కాలము; 3. వర్షాకాలము; 4. కామము.

తిథి. సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. 1. పాడ్యమి లోనగునది. (పక్షము మొదటినుండి క్రమముగా నైదేసితిథులు నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ యనునామములు కలవి యగును. అనఁగా మొదటిది యాఱవది పదునొకండవది తిథులు నంద సంజ్ఞ కలవి ఇట్లే తక్కినవి యూహింపఁదగును.) 2. ప్రాతిసాంవత్సరిక శ్రాద్ధదినము.

తినాసము. వై. వి. (సం. తినిశః) నెమ్మి, తినిశముచూ. (శ. ర.)

తినిపించు. దే. స. క్రి. (తిను ధా. ప్రే.) తినఁజేయు. "మ...క్షణమాత్రలో సమదదేవారాతిరింఛోళిచేఁ, దినిపించెన్ దృణరాజి..." దశా. ౨, ఆ. ౪౦౦.

తినిశము. సం. వి. అ. పుం. తినాసము, నెమ్మిచూ.

తిను. దే. స. క్రి. (త. తిన్. క. తిన్.) 1. భుజించు, భక్షించు. "ఉ...ఎల్లవారి బాధించి మనుష్య మాంసములు దించును క్రొవ్వితి..." భార. ఆది. ౬, ఆ. ౨౯౪, భార. స్త్రీ. ౨, ఆ. ౧౨౧; 2. అనుభవించు, "క. ఏలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, ప్రేలారిచి

తిం ద్రాతని, యోలము గని పిదప భీతి నొందుఁగుదు రోజన్." భార. విరా. ౪, ఆ. ౨౧౯; 3. అపహరించు. "ఉ...ఆయతికాని కీడు మకరాలయ ముఖ్యము లాతఁ డర్థతృష్ణాయుతుఁడై నిజోర్వీ నగునష్టికిఁ దద్ధనముం దొరల్చి రాజాయతనంబుఁ జేర్చు మఱి యట్టి దపథ్యము దాన నొంటిగాఁ డే యధికారి గావలయు నించుక తిన్నను వాఁడె రూపఱున్." ఆము. ౪, ఆ. ౨౧౭; 4. కఱచు. "ఉ...భీషణోరగం, బుప్పలవాయి దిన్న విషముగ్రత నెక్కుడు దృష్టి చీఁకటుల్, గప్పఁగ నోరఁ బెన్నురువు గ్రమ్మ మృతుండయి కూలె మేదినిన్." కేయూర. ౪, ఆ. ౭౫; 5. చంపు, నశింపఁజేయు. "గీ. ముద్దుకొడుకుల నార్వుర ముందు తింటి, వింతపాపంబు నేయుంగ నేమి కలిగె." వి. పు. ౭, ఆ. ౮౦; 6. పీడించు. (వ్యవ.) వాఁడు డబ్బిమ్మని పీకుకొని తినుచున్నాఁడు.

తినుసు. దే. అ. క్రి. (విష్ఠించుట, ప్రసవించుట మున్నగువానియందు) ఊపిరి బిగఁబట్టి ముక్కు. "ద్వి. మును వెళ్ల వేగియుఁ దినికి చాబిడ్డఁ గనిన చందం బయ్యె జనపాలతిలక." బస. ౭, ఆ. ౩౧౧. పం. వి. 1. ముక్కి ముక్కి విష్ఠించుట. (శ. ర.); 2. గుదవేదనము. "గీ...తినుసు, కసఁగ గుదవేదనంబుగాఁ దనరు నభవ." ఆం. భా. ప్ర. ౧౫౦.

తినె = తిన్నెయ. (వేదిక, అరుఁగు) "చ...అమ్మెలఁత గృహాంబుపంచఁ దినెమీఁదను రంగపతిం దలంచుచున్." విప్ర. ౪, ఆ. ౩౨.

తిన్న. దే. విణ. (దీనికిఁ గర్మధారయమందు నిగాగమము నిత్యము.) 1. మనోజ్ఞము. "సీ. కలకంఠములచేతఁ గఱచినవిద్య వీణల కిచ్చునట్టితిన్నని యెలుంగు." భార. విరా. ౨, ఆ. ౬౭, ఆం. భా. తృ. ౧౪; 2. యుక్తము. "సీ...బుధరక్ష తిన్నగాఁ బూనువారు." పాండు. ౨, ఆ. ౧౭౧, భార. విరా. ౨, ఆ. ౨౮౭. (శ. ర. పా. 'బుధరక్షణోన్నతి' ముద్రి. పా.); 3. స్వస్థము. "ద్వి. కన్నులు తెఱవ కుగ్రసమాధిఁ బూని,తిన్నగాఁ బదివేలది వ్యవర్షములు,తపము గావించె..."విష్ణు.పూ. 3, ఆ. (శ. ర.); 4. సౌమ్యము, మంచిది. (చూ. తిన్నఁదనము.); 5. బుజువు, వంకరలేనిది. (వ్యవ.) వాఁడు నామము తిన్నగాదిద్ది కొన్నాఁడు.

తిన్నఁదనము. వై. వి. (తిన్న+తనము) 1. మనోజ్ఞత, చక్కఁదనము. "సీ. మానినిగరువంపుమాటపొం దూహించు దళితాబ్జముఖితిన్నఁదనము మెచ్చు." భార. విరా. ౨, ఆ. ౨౯౨. సమీర. 3, ఆ. 3౫; 2. యుక్తత. (చూ. తిన్న); 3. స్వస్థత. "ఉ...ధాత్రిం దనబాహుపీఠమునఁ దిన్నఁదనంబుగ నిల్పి భోగసంక్రందనుఁడై ..." విరం. ౪, ఆ. ౮౦. "గీ. తుంటవిలుదంటగొంటరి తంటలకును, దిన్నఁదనమఱి విన్ననైఖిన్నవగుచు." ఇందు. 3, ఆ. 3; 4. సౌమ్యత,మంచితనము. "క. నాపలుకు పట్టియాగ్రహ,దీపితుఁ డగు టుడిగి మదికిఁ దిన్నఁదనము నీ,వాపాదింపు..." భార. సౌ. ౧, ఆ. ౧౮౦. స్కా ౫, ఆ. ౨౨; 5. మెలఁకువ, జాగ్రత. "వ. గమనంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చివాని నాక్రమించి..." భార. సౌ. ౧. ఆ. ౧౬. విప్ర. 3, ఆ. ౭౮; 6. బుజుత్వము. (చూ. తిన్న.)

తిన్నన. దే. విణ. 1. "వ...తిన్న నగునడలు నున్న నగుతొడలు మిన్న నగుకొనులు." ఉ. రా. ౫, ఆ. ౨౪౮. వసు. ౨, ఆ. ౫౬. ది. 1. మనోజ్ఞత; 2. యుక్తత; 3. స్వస్థత; 4. సౌమ్యత.

తిన్నియ. దే. వి. 1. దిబ్బ, తిప్ప. "సీ...నిద్దంపుటిసుకతిన్నియలు గాఁగ." నీలా. ౧, ఆ. ౨౭; 2. వేదిక,అరుఁగు. "సీ. తిన్నియ లలికి ముత్తియపు ముగ్గులు వెట్టి..." అచ్చ. అయో. ౧౦.

తిన్నె. దే. వి. (క. దిన్నె. త. తిణ్ణై) 1. దిబ్బ, తిప్ప. "సీ. ఎరియించుమిన్నేటియిసుకతిన్నెలమీఁద... భీమ. ౨, ఆ. ౪౪; 2. కొండ. "గీ. జాతివైరంబు లేక మజ్జాతి గాఁగఁ,గన్నుమిన్నులిదిన్నెజేఁ దున్న కతన." ప్రబంధ. ౩౪; 3. గవనివాకిట వాటముగా నేర్పఱచినమట్టిదిబ్బ, హస్తినఖము. "సీ...తిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు."ఆం. భా. ద్వి. ౨౧; 4. వేదిక,అరుఁగు. "ద్వి. సెలయేటితిన్నెల నీడలఁ దోఁచు,నీలాలకంబాలు..." ద్వి. పారిజా. పూ. ౧౭౩ పం. నీలా. 3, ఆ. 3౯.

తిపిరి. దే. వి. మాఱుపాటు, వ్యత్యాసము. (శ. ర.) విణ. అల్పము. "సీ. అరుదైనతిపిరికిన్నెరతమ్మపడిగంబు వన్నెకోకలచందువాపిరంగి." ప్రబంధ. ౫౨౩. ప్రబంధ. ౭౮.

తిపిరిదండియ. ద్వ. వి. (తిపిరి+దండియ) చిన్నవీణె. "వ...తిపిరిదండియలు గైకొని గాణదండి మెఱయ మంద్రమధ్యమతారస్వరంబులు సుధారసంబులు గురియ గానంబులుసేయువారును." రఘు. రా. ౨, ఆ. ౧౦౫.

తిపిరిదండె = తిపిరిదండియ. "సీ. మత్వాపరక్షయు మావువెన్నెలక గట్టినయోటితిపిరిదండెయంను మెఱయ." ఆము. ౬. ఆ. ౬.

తిపురు. దే. వి. వ్యాపనము. (చూ. తిపురుకట్టు.)

తిపురుకట్టు. దే. అ. క్రి. వ్యాపించు. "ద్వి. తాటంకవజ్రాంశుధాళధళ్యములు, లేటచెక్కులమీఁదఁ దిపురుకట్టఁగను." విష్ణు. ఉ. ౪, ఆ. (శ. ర.)

తిపురుల్గొను. దే. అ. క్రి. (తిపురులు+కొను) వ్యాపించు. "చ...ద్యుతుల్, వొలిచె ననంగఁ గ్రొత్తమెఱుపుల్ తిపురుల్గొన నంతనంతటన్?" ఇందు. ౩, ఆ. ౧౦.

తిప్ప. వై. వి. (సం. ద్వీపః. క. తిప్పె. త. తిప్పై.) 1. రాశి; దిబ్బ. "మ. బలుకప్రంపుటనంటికప్పురపుఁదిప్పల్..." వసు. ౧, ఆ. ౧౩౯. రసిక. ౨, ఆ. ౧౪; 2. గుట్ట,చిన్నకొండ. "గీ... పెన్రాల తిప్పలు వట్టి తిరుగు." ఆము. ౩, ఆ. ౨౪; 3. పర్వతము,కొండ. "మ. పొడుపుందిప్ప తటాలనం దిగినయంభోజాప్తబింబంబునం,గడమై రత్నమరీచి పీచికలు దిగ్వాటిన్ మిటారింపఁగా." సుద. ౫, ఆ. ౭౯. ఆం. భా. ద్వి. ౨, ఆ. ౭౯. వా. ౨, ఆ. ౪౬. బ. కష్టములు,బాధలు. వ్యవ. ఎన్ని తిప్పలు వచ్చినను వాడు న్యాయము తప్పఁడు.

తిప్పకాయ. ద్వ. విశే. (తిప్ప+కాయ) పెంకెవాఁడు;,పెంకెది; ఆకతాయ. "ద్వి. మలయు దుష్మైదలు దిమ్మరి దిప్పకాయ, లిలఁ జందమామయెయ్యోడఁ బఊపాలి." ద్వి. పరమ. ౩, ఆ. ౨౪౭. వు. "గీ. సంధ్యవార్వఁడు వేల్వఁడు చర్చసేయఁ,డాగమంబులఁ దీర్థంబు లాడఁ డుచిత తిథుల నుపవాస ముండఁడు తిప్పకాయ,చందములు తక్క భూసురనందనుండు." ఉద్భ. ౨, ఆ. ౧౨౯. ప్రభులిం. ౨, ఆ. ౫౬. వు.

తిప్పతీఁగె. దే. వి. గుడూచి. "సీ... తిప్పతీఁగె సాఁగను గుళూచి,చెలఁగును..." ఆం. భా. ద్వి. ౨, ఆ. ౫౪. హంస. ౪, ఆ. ౧౦.

తిప్పద్రిమ్మరి. ద్వ. విశే. (తిప్ప+ద్రిమ్మరి) నగచరుఁడు; కోఁతి. "గీ. అప్పు డతికాయుఁ డటకతోఁ దిప్పద్రిమ్మరులఁ బటాపంచలుగఁ దోలి..." అచ్చ. యు. ౨౫౩. కిష్కిం. ౨౮.

తిప్పజెల్లు. ద్వ. వి. (తిప్ప+జెల్లు.) ఇక్షుకము; 4. (శ. ర.)

తిప్పలుగొను. ద్వ. అ. క్రి. (తిప్పలు+కొను) ప్రోగుపడు. "సీ. ఎరువుతిప్పలుగొని యొల్లమందలు గొణుజెక్క మేపులచోటు ద్రొక్కఁబడియె." హరి. పూ. ౬, ఆ. ౫.

తిప్పలుపడు. వై, అ. క్రి. (తిప్పలు+పడు.) బాధపడు. (వ్యవ.) వాఁడు చిన్నప్పటినుండియుఁ దిప్పలు పడుచున్నాఁడు.

తిప్పలుపెట్టు. దే. స. క్రి. (తిప్పలు+పెట్టు)పీడించు, బాధించు (వ్యవ.) ఆబాలుఁ డామెను తిప్పలు పెట్టుచున్నాఁడు.

తిబ్బి. దే. వి. ముందఱికి కుట్టు పోనిచ్చుచు వెనుకకు మరలించి కుట్టెడికుట్టు. (శ. ర. దీనికి 'డిబ్బికుట్టు' అనివాడుక.)

తిమి. సం. వి. ఇ. పుం. 1. నూఱుయోజనములు పొడుగు కలచేప; చేప; 2. సముద్రము.

తిమింగిలము. సం. వి. అ. పుం. 1. తిమిని మ్రింగెడు చేప; 2 ఒకానొకద్వీపము.

తిమింగిలగిలము. సం. వి. అ. పుం. తిమింగిలమును మ్రింగుచేప.

తిమిజము. సం. వి. అ. న. ఒకరకము ముత్తెము.

తిమితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తడిసినది, ఆర్ద్రము; 2. కదలిక లేనిది,నిశ్చలము; 3. కెమ్మదియైనది.

తిమితిమి. దే. వి. ముసురుపట్టుట మొదలగువానియందగుననుకరణము. "సీ. తొలితొలిసన్నంపుఁదుంపుర లొలుకఁగా వెసఁ దిమితిమి యని ముసురు వట్టె." ద్వా. ౩. ఆ. ౯౭.

తిమిరము. సం. వి. అ. పుం. న. 1. చీఁకటి. "క. తిమిరంపువయసుగుబ్బలకొమరులవు..." స్వా. ౪, ఆ. ౮౩; 2. నేత్రరోగవిశేషము, అంధత్వము. (తిమిరంపువయసు = మదముకలయౌవనము.)

తిమిరారి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

తిమిరి. యు. దే. వి. (త. తిమర్.) స్పర్శము తెలియనిరోగవిశేషము. (చూ. తిమిరిమ్రాను) వై. వి.

వి. (సం. తిమిరమ్.) నేత్రరోగవిశేషము, అంధత్వము. "సీ...తిమిరంబు వెలయును దిమిరి యనఁగ." ఆం. భా. ద్వి. ౨౬.

**తిమిరించు.** దే. అ. క్రి. (తిమురు+ఇంచు-స్వార్థమున) 1. త్వరపడు. "ఉ. పాటలు మోము త్రిప్పులును వైఁ దిమిరించుట లోరచూపులున్." హంస. 3, ఆ. ౭౬; 2. అతిశయించు. "సీ. మఱి సంజ గనిపించె విరహులపై వలరాజు గ్రక్కునఁ గోపరస మనంగఁ,దిమిరంబు తిమిరించె దెగి పాంథులను ముంచ మరుఁడు నిర్మించిన మాయ యనఁగ." రాధికా. ౨, ఆ. ౮౭.

**తిమిరిమీను.** ద్వ. వి. (తిమిరి+మీను) ఒకరకము చేప. (ఇది తాఁకిన శరీరభాగము తిమ్మిరి యెక్కును.) (శ. ర.)

**తిమిషము.** సం. వి. అ. పుం. బూడిదగుమ్మడి.

**తిమురు.** దే. అ. క్రి. (త. తిమిర్) 1. త్వరపడు. "క. రమణీజనంబు కల్యాణముపాడఁ బవిత్ర తూర్యనాదము లెసఁగన్,సుముహూర్త మయిన పెద్దలఁ,దిమురువధూవరులనడిమి తెర యెత్తుట యున్." కవిక. 3, ఆ. ౧౮౧. భా. రా. యు. 3౫౦; 2. విజృంభించు,అతిశయించు. "ద్వి భ్రమసి యచ్చటిమునిప్రవరులు పడఁగఁ,దిమిరి దండము కేల ద్రిప్పుచు లేచి." ద్వి. హరిశ్చ. పూ. ౧౧౬౨ పం. చంద్రా. ౬. ఆ. ౯3; 3. ఒడలువిఱుచు. (శ. ర); 4. గర్వించు. (శ. ర. బ్రా.) వి. త్వర,తొందర. "గీ. తపసిడెందంబు వెన్నచందమునఁ గరఁగుఁ,గలయికలమీఁదితిమురునఁ దోలఁగుచుండఁ,జిత్తజునిసేన వెలగోలు సేసినట్లు,కులుకుఁబలుకులఁ జిలుకలకొలికి వలికె." విప్ర. 3, ఆ. ౮౭; 2. గర్వము. "క. తమి యెల్లఁ దీర్చి తమప్రియ,తముఁ డగురా జస్తమింపఁ దఱిగొని వచ్చెన్,దిమురునఁ జండప్రభుఁడని,కుముదంబులు మోము మోడ్చి కుముదము లయ్యెన్." రసిక. ౫, ఆ. ౧౧౮. ఆం. భా. ప్ర. ౧33; 3. స్పర్శ తెలియనివ్యాధివిశేషము, తిమ్మిరి. "సీ. త్రికమున నొక్కింతతిమురు కల్పించె నాఁ బవనుండు తత్తఱపాటుఁ జెందు." పార్వ. ౨, ఆ. ౧౦౧.

**తిమురుకొను.** దే. అ. క్రి. (తిమురు+కొను) ఆగ్రహములో, పెనఁగులాడి వదిలించుకొను. (వ్యవ.) నేను పట్టితిని వాఁడు తిమురుకొని పోయినాఁడు. (శ. ర. బ్రా.)

**తిమ్మ.** దే. వి. స్వస్థత,నెమ్మది. (చూ. తిమ్మవడు 'విశ. స్వస్థము' అని. శ. ర. బ్రా.)

**తిమ్మఁడు.** దే. వి. (క. తిమ్మ. త. తిమ్మన్) కోఁతి, వానరము. "సీ...క్రోఁతి తిమ్మఁ డంచన వానరమ్ము తనరు." ఆం. భా. ద్వి. ౮3, వేంక. విర్య. ౯౫.

**తిమ్మదియ్యము.** దే. వి. (తిమ్మ+తియ్యము) రత్యతృప్తి. (శ. ర.)

**తిమ్మన.** దే. వి. స్వస్థత. (శ. ర.) విశ. చక్కనిది, మంజులము. "సీ. తిమ్మనైనది యన... బెట్ట తనరుచుండు మంజులం బైన దనుటకు." ఆం. సం. మాన. ౫౪.

**తిమ్మనము.** వై. వి. (సం. తేమనమ్) పాలు బెల్లము పిండి మొదలగనవి కలిపి కొంచెము పలుచగా నుడికించినపదార్థము. "వ...పానకంబులతోఁడ దిమ్మనంబులతోడ దధిపిండఖండంబులతోడ..." కాశీ. ౭, ఆ. ౧౮౫, ఆం. భా. ద్వి. ౨౫౧.

**తిమ్మప్పఁడు.** ద్వ. వి. (తిరుమల+అప్పఁడు) తిరుపతి వేంకటేశ్వరస్వామి. "ఉ...అడిగినన్నివరా లిడు కొండమీఁదితి,మ్మప్పని వంటికావ్యపతి యబ్బుట యబ్బుర మబ్బుధాళికిన్." రా. వి. ౧, ఆ. ౨౬, రా. వి. ౧, ఆ. 3౧.

**తిమ్మవడు.** ద్వ. అ. క్రి. (తిమ్మ+పడు) స్వస్థపడు, సేదదేఱు. "సీ. ఇనవంశమణి తమ్ముఁడును దాను బడలికల్ దీఱ గూర్చిండిరి తిమ్మవడియొ, బల మెల్ల..." రామా. ౮, ఆ. ౪౪.

**తిమ్మిరి.** దే. వి. స్పర్శ తెలియని వ్యాధివిశేషము. "సీ. తివిరి యంగమ్మునఁ దిమ్మి రెత్తకమున్న యొడలెల్ల మచ్చలఁ జెడకమున్న." కాశీ. 3, ఆ. ౧౭౭.

**తిమ్ము.** దే. స. క్రి. నిందించు. (శ. ర.) వి. నిందించుట. "క. సొమ్మున్నది నీయొద్దం,దమ్మని సేనదరవైచితే నీతఁడు నన్న మ్మాటలాడి త్రిప్పెం, దిమ్ములకుం జొచ్చి యీడ్చి తెచ్చె న్సభకున్." వేం. పంచ. ౧, ఆ. ౭౨౨.

**తియ** = తియ్య. (మధురము) "క. అద్దంపుమెఱుఁగు చెక్కులు, దిద్దినరాయంచనడలు, తియమోవియును సున్..." సురా. 3౧, బహు. ౪, ఆ. ౨౯.

**తియ్య.** దే. విశ. (త. తీయం) 1. మధురమైనది, తీపి గలది. (దీనికిఁ గర్మధారయమున వికాగమము

వైకల్పికము) "గీ. తివుటఁ దియ్యనితమ్మిపూఁదేనె
గ్రోలు." నైష. ౨, ఆ. ౫, భార. ద్రో. ౪, ఆ.
౨౪ 3. (దీనియామ్రేడితరూపము తియతియ్యని).
"చ. తెగువ మనోభవుండు తియతియ్యనిసింగిణి
వింటికొప్పునన్, దగిలిచె దక్షవాటివని తాచిక
రంబులఁ బోలుశింజినిన్." భీమ. ౫, ఆ. ౯౫; 2.
శ్రావ్యము, వినఁదగినది. "క. అచట్లనితియ్యనిశుక,
వాచావిభవంబు విన్నవాఁడ నయిసుమీ, వాచాల
మదనగుణనా, రాచార్భటి కోర్చినాఁడఁ బ్రాణం
బులతోన్." వసు. ౪, ఆ. ౧౨౦, అచ్చ. బాల.
౧౪; 3. మనోహరము, అందమైనది. "క. పిడి
కిట నడఁగెడునడుమున్, గడుఁదియ్యని మేను భృంగ
కలితగుణాంబున్, విడివడనికొప్పు నేర్పడి, పడఁతుక
గతి యయ్యొ మించి పౌరుషవృత్తిన్." చిత్ర
భా. ౨, ఆ ౭౫; 4. సుగంధి, పరిమళము గలది.
"సీ. కలికిపలుకులు తియ్యకపురంపుఁబల్కులు
పొలఁతిచూపులు నిల్పి పొడలుమెఱపులు..."
చంద్రా. ౬, ఆ. ౧౨౯.

తియ్యఁదనము. ద్వ. వి. (తియ్య+తనము) 1. మాధు
ర్యము, తీపి. "సీ.... వేఁపనారకుఁ దియ్యఁదనంబు
కలదె." చెన్న. 3, ఆ. ౨౭౫, నైష. ౨, ఆ.
౭౧; 2. శ్రావ్యత, "సీ. పాటలమేలిమి మాటల
తియ్యఁదనంబు గంధర్వకన్యకల కమరు." ఉ.
రా. ౪, ఆ. ౯౦.

తియ్యఁబోఁడి. దే. వి. (తియ్య+పోఁడి) మనోజ్ఞురా
లగుస్త్రీ; స్త్రీ. "శా. అయ్యా మీరలు బాడ
బాగ్రణులో శాఖాజన్ములో ద్రోపదిం, దియ్యం
బోఁడి వరింపఁగా వసుధ కేతేఁ జూచునాది
త్యులో." పాంచాలీ. 3, ఆ. ౨౭.

తియ్యకంద. మి. వి. (తియ్య+కంద) దురద లేని ఒక
రకముకంద. (శ. ర.)

తియ్యగూర. ద్వ. వి. (తియ్య+కూర) పులుసు వేయ
కుండ వండినకమ్మనికూర. "వ...చేరులుఁ దియ్య
కూరలుఁ బచ్చడులు బజ్జులు..." కాశీ. ౭, ఆ.
౧౭౫.

తియ్యదానిమ్మ. ద్వ. వి. (తియ్య+దానిమ్మ) తియ్యని
గింజలు గలదానిమ్మ. (శ. ర.)

తియ్యన. దే. వి. తియ్యఁదనము, మాధుర్యము. (శ.ర.)
విశే. మధురము, తీపి కలది. "సీ...చనుఁ దీపు
తియ్యన యన మధురము." ఆం. భా. ప్ర. ౧౦౪.

తియ్యనిమ్మ. ద్వ. వి. (తియ్య+నిమ్మ) కమ్మనిమ్మ. కర్పూ
రాంకము. (శ. ర.)

తియ్యనివిల్లు. దే. వి. (తియ్యని+విల్లు) ఇక్షుధనువు.
"ఉ...తియ్యనివిల్లు ప్రసూనములఁ [illegible]ప్పిన
యస్త్రాలు..." హార. 3, ఆ. ౬౬.

తియ్యమామిడి. దే. వి. (తియ్య+మామిడి) తియ్యని
పండ్లుగలమామిడి, సహకారము. "సీ ..తియ్య,
మామిడి యన నెలమావి యన్నను సహకారనా
మంబు గా మీఱుచుండు." ఆం. భా. ద్వి. ౪౫.

తియ్యము. దే. వి. 1. శ్రావ్యత, ఇంపు. "తే. పిదు
ము విన్నయకౌరవేంద్ర పాండుసంభూత
నూజులచరితంబు వేడ్కఁ బొంచెః, జెవులతియ్యంబు
...సగొత్తఁ జెప్పు మనఘ." భార శల్య. ౧, ఆ. ౪.
2. మనోజ్ఞత. "మ ..తమకుం దియ్యంబులోఁ
దాల్ప నగ్గలమై యుండెడువాని నొందుఁ బోగ
డంగా నేర మాసుందరిన్." కు. సం ౭, ఆ. ౧౧.
నైష. ౫, ఆ. ౧౭; 3. ప్రియవచనము. "ఉ.
తియ్యము లేనిచాగముసు ధీరత లేనియమాత్య
కృత్యముం, గయ్యము లేనిశూరతయుఁ గైకొని
యూరక మెచ్చవచ్చునే." ఉ. హరి. ౫, ఆ. ౩౧;
4. సంతోషము. "మ. తనసౌందర్యము చెప్పఁగాఁ
గరఁగి పద్మాకాంత రప్పించి మోహనకంజంబున
వైచి తియ్య మిడునెయ్యంబొప్పఁ జైకొన్న..."
ఆము. ౫, ఆ. ౪౭. భాగ. ౧౦, స్కం. పూ.
౨౪౯. విశే. 1. సుందరమైనది, మంజులము.
"ఉ. తొయ్యలి విశ్వభూవిభుని దూరమునం గని
రాగసక్తయై, తియ్యపునవ్వు వాతెఱకుఁ దెచ్చె
వడిం గుచమండలంబుపైఁ, బయ్యెద చక్కఁ
జేర్చె..." కావ్యా. ౧. ప్ర. ౭౦, ఆం. భా.
తృ. ౧౪; 2. ప్రియము, ఇష్టము. 'ఉ. తెల్లని
తమ్మిఱేకులకుఁ దియ్యపునెచ్చెలు లైలకన్నులం,
జల్లనిచూపు చూచి..." హరి. పూ. ౫, ఆ. ౪;
3. యుక్తము, మంచిది. "ఉ. వెయ్యన నేల రంగ
పృథివీవర జాగ్రత నొందియుండుటే, తియ్యము
నెయ్య మైన మదుదీరితనీతి గ్రహింపుము..."
రంగా. ౨, ఆ. ౧3.

తియ్యమునగ. ద్వ. వి. (తియ్య+మునగ) ఎఱ్ఱమునగ,
మధుశిగ్రువు. "సీ. మధుశిగ్రునామమై మను
నెఱ్ఱమునగ తియ్యమునగ..." ఆం. భా. ద్వి. ౪౪.

తియ్యమ్రాను. దే. వి. (తియ్య+మ్రాను) చెఱకు, ఇక్షువృక్షి. "సీ. ..ఇక్షునామము ల్దనరుఁ దియ్య మ్రాను కన్నులు గల మ్రాను చెఱ కనంగ." వేంక. స్థా. ౧౨౭.

తియ్యవిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. "వ. ...తీఁగెయుయ్యేలల నాడుచుఁ దియ్యవిలు కానిం బాడుచు .." కళా. ౬, ఆ. ౨౨౪, విక్ర. ౮, ఆ. ౬౪.

తియ్యవిల్కాఁడు = తియ్యవిలుకాఁడు. ఆం. సం. దేవ. ౧౪.

తిరపడు. వై. అ. క్రి. (తిరము+పడు) స్థిరపడు, కుదురుకొను. "ఉ. గరుడుని డిగ్గి పీడ్కొలిపి కంపవిరోధిపురంబులోపలం, దిరపడి దారకుం బనిచెఁ దేరలవాటుగఁ దేర నెక్కి..." ఉ. హరి. ౩, ఆ. ౯౧.

తిరము. వై. వి. (సం. స్థిరః. క. తిర. త. తిరమ్.) నెలవు, ఉనికిపట్టు. "చ. అలికిడి పుట్టనీక నిశితాసి నగల్చి మృగంబు నొంచు బెబ్బులిగతిఁ బొంచి పొంచి చని భూపతి యున్నతిరంబు డాయుచున్." రంగా. ౩, ఆ. ౨౫౩. విణ. 1. స్థిరము, నిశ్చలము; శాశ్వతము. "ఉ. భాగ్యము కాదె నీచరణపద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా, యోగ్యత కల్గెనేని నను నొక్కని నొల్లవా కామసౌఖ్యవైరాగ్యము నీవ నంబునఁ దిరంబొ నిజం బెఱుఁగంగఁ జెప్పు సౌ, భాగ్యము గుందునే. మగలపై నొకయించుక చూడ్కి నిల్పినన్." భార. విరా. ౨, ఆ. ౨౫౨, అను. ౫, ఆ. ౨౮; 2. ధ్రువము, నిశ్చితము. "ఉ. ఎందఱుజం,గమప్రమథు లెత్తఱి నేమిప దార్థ మెంత యే, కందువ వేఁడినం దిరముగా నతఁ డందఱ కాపదార్థ మా,కందువ నేపు ప్రాణ మెడగా నిడిరైన ఘటించి పెట్టు..." హర. ౨, ఆ. ౫, నృసిం. ౨, ఆ. ౧౫౯; 3. నాఁటినది, బోధపడినది. "క. హరిశంశ ప్రమథకథాం, తర మునఁ గలవింత లెల్లఁ దప్పక మదిలోఁ,దిరమయ్యెఁ గదా నర్తవర యేకథలూకో వినం బ్రియ మను డున్." ఉ. హరి. ౧, ఆ. ౩.

తిరముకొను. ద్వ. అ. క్రి. (తిరము+కొను) స్థిరపడు (చూ. తిరముకొలుపు.)

తిరముకొలుపు. ద్వ. స. క్రి. (తిరముకొను ధా. ప్రే.) స్థిరముగా నిలుపు. "గీ. ...రాకుమారు లాగురు నిరూఢిఁ దిరముకొలిపెఁ దదచ్యుత తేజ మిలను." రాఘవ. ౨, ఆ. ౨౭.

తిరముకొల్పు = తిరముకొలుపు. 1. స్థిరముగా నిలుపు. "సీ. ..ఇనమండలంబుపై దృష్టి యత్యంతంబు దిరముకొల్పి." పరమ. ౧, ఆ. ౧౧౨; 2. నాఁటు, స్థాపించు "లయగ్రాహి. నందనములోని హరి చందనముఖద్రుమములం దశముఖుండు నిజ మందిరవనీవాటిం దిరముకొల్పు..." చం. రా. ౨, ఆ. ౨౮. [(చూ. తిరముపఱుచు.)

తిరముపడు. వై. అ. క్రి. (తిరము+పడు) స్థిరపడు.

తిరముపఱుచు. వై. స. క్రి. (తిరముపడు. ధా. ప్రే.) స్థిరపఱుచు, "మహాస్రగ్ధర. ..ఇష్మే దినిదోర్దండదైక పీఠిన్ దిరముపఱిచి." స్వా. ౧, ఆ. ౨౩.

తిరశ్చి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతిర్యగ్జంతువు; 2. అడ్డముగాఁ బోవుస్త్రీ.

తిరశ్చీనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డముగాఁ బోవునది; 2. వక్రము.

తిరసకరించు. వై. స. క్రి. (సం. తిరస్కార.) విడుచు. "క. హరినీదు ప్రతాపాతప, మరరే బ్రహ్మాండ కర్పరావృత మగుటన్,బరులు వడఁకుదురు గొడుగులం, తిరసకరింపుదురు కంటఁ దిమిరము గప్పన్." ప్రబంధ. ౨౫౫.

తిరస్కరము. సం. విణ. (అ. ఈ. అ.) 1. తిరస్కరించునది; 2. అతిశయించునది; 3. మఱుఁగు పఱుచునది.

తిరస్కరించు. సం. స. క్రి. అనాదరముచేయు, అవమానించు. "ఉ. నన్నుఁ దిరస్కరించితి మనం బున నించుక భీతి లేక..." హర. ౬, ఆ. ౨౨.

తిరస్కరిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెర, యవనిక; 2. ఒకమంత్రవిద్య. (ఇది కలవాఁ డితరులకంటికిఁ గనపడకుండును.)

తిరస్కారము. సం. వి. అ. పుం. 1. అనాదరము, అగౌరవము; 2. మఱుఁగుపాటు; 3. నింద, తెగడుట.

తిరస్కారి. సం. విణ. (న్. నీ. న్.) 1. అనాదరము చేయువాఁడు; 2. మఱుఁగుపఱుచువాఁడు; 3. నిందించువాఁడు.

తిరస్కారిణి. సం. = తిరస్కరిణి.

తిరస్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనాద రింపఁబడినది; 2. మఱుఁగుపఱుపఁబడినది; 3. నిం

దింపఁబడినది; 4. న్యాయపఱుపఁబడినది, తక్కువ చేయఁబడినది.

తిరస్కృతి. సం. వి. ఇ. స్త్రీ.=తిరస్కారము.

తిరస్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. = తిరస్కారము.

తిరస్తు. దే. వి. రాజ్యాంగభేదము. "సీ...రాజ్యాంగములు దనర్చు. గీ. సామి ప్రెగ్గడ చెలి బొక్కసము తిరస్తుకోట పౌఁ జనఁగాఁజె..." ఆం. భా. ద్వి. ౧౪౯.

తిరి. దే. వి. (క. త. తిరి.) 1. జట. "ఉ. నీవిగిగుబ్బచన్నులకు నీ నెఱి పెన్నెఱు లున్న కీవికిక్, నీబటువుంబిఱుందులకు నీయెలప్రాయపుఁగల్మి కింతిరో.యీ బసుమంబు కప్పురమె యీతిరివేణియె పట్టుచీరలే, యీ బిసనైనవల్కలము లీతప మిష్టమనోజభోగమే." ఉ. రా. 3, ఆ. ౧౦౬; 2. సుడి, ఆవర్తము. "చ. పొలఁతులకున్...వళులు వీచిపరంపర లయ్యె నిమ్ననాభులు తిరులయ్యె వాలుఁ కలపుంజము లయ్యె నితంబబింబముల్." కవిక. ౪, ఆ. 3౫, భార. శాం. 3, ఆ. 3౯౯; 3. మెలి, పురి. "సీ. నలినాక్షి నను జూచి యలకలు దీర్చె నేఁ దిరివిప్ప నడవనే లేఁటినారి." పి. శకుం. 3, ఆ. ౧౬౫; 4. (చాకిబాసయాటయందు గుండ్రముగాఁ గూర్చుండినబాలురలో నొకని వెనుక భాగమునఁ బెట్టి వాఁడు తెలిసికొనలేకున్న యెడల కొట్టుటకు) మెలిపెట్టినవస్త్రాదికము. "సీ. పంతంబుతోఁ జాకిబానలిర్లకు నంచు బెబ్బులి తిత్తోల్తు రబ్బురముగ." చమ. 3, ఆ. ౧౯౯; 5. మెలిపెట్టినగుడ్డ చివరిభాగము. (చూ. తిరిపెట్టు.); 6. తంత్రము, దుర్బోధ; 7. క్షోభము. కలఁత. (చూ. తిరిపెట్టు). విణ. వక్రము. "సీ. వన్నెలు పింగాణికన్నులు తిరిబొమల్ మిడిడేగచారలు మిద్దెజుట్లు." ప్రబంధ. ౧3౭.

తిరిక. దే. వి. (తిరి+ఇక) మెలిక (శ. ర. బ్రౌ.)

తిరికట్టు. దే. అ. క్రి. (తిరి+కట్టు) మెలికలు తిరుగు, వంకరయగు. "సీ. కరసానఁ దిగిచినకలివెగండపు బొట్టు తిరికట్టుకొని మోము దిరిగియుండ." క్రీడా. ౭౭౬.

తిరిగట్టు=తిరికట్టు. (జడగట్టు, అల్లుకొనిపోవు) "దీర్ఘ...దీర్ఘంబులై తిరిగట్టినడచలు గడచి తూలాడు కెంజడలతోడ." పి. శకుం. ౭, ఆ. 3౦, ఇట్లే: తిరులుగట్టు. విప్ర. ౫, ఆ. ౭౫.

తిరిగించు. దే. స. క్రి. (తిరుగుధా. ప్రే.) 1. మరలు, నివర్తించు. "ద్వి. ఎగసి ప్రేయసిఁ జూచి యిుద్రజితుండు, మొగిఁ దిరిగించె నమ్ములవెల్లి పటపి." రం. రా. యు. 3౬౧. పు.; 2. పరిభ్రమింపఁజేయు. "క. దయ్యఁ దిరిగించి దేవ్రం, డొయ్యన వెడలించె నొరియూపున్న నమ్మెనయ్య మిపన్యఁడు వెలువడి .." హరి. ఉ ౯,౮౯.

తిరిగివచ్చు. దే. స. క్రి. (తిరిగి+వచ్చు) 1. ప్రదక్షిణముచేయు, వలగొను. "క. కని యక్కైలాస తటంబున నమరులు కమవిమానములు క్రిక్కి జనా, ర్దను దిరిగి వచ్చి కొలువ నగ, గనిచ్చె నతండు నియమగతి నెల్లుటయున్." ఉ. హరి. ౬, ఆ. ౧౬౯; 2. చుట్టు, పరివేష్టించు. "మ. జలజాంత స్థితకర్ణికం దిరిగిరా సంఘంబులై యున్న రేకుల చందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ గూర్చుండి వీక్షించుచున్." భాగ. ౧౦, స్కం. పూ. ౪౯౫.

తిరిగొండ. దే. వి. మంగళగిరి. (బ్రౌ.)

తిరిచినాపలి. దే. వి. పురవిశేషము. "ఆ...కంచి నాఁగ నొరుఁగల్లు నాఁగఁ, దిరిచినాపలి యనఁ బురవిశేషము లగు .." ఆం. భా. ద్వి. ౧౧.

తిరితీపు. దే. వి. పెనఁగులట. (చూ. తిరితీపులాడు.)

తిరితీపులాడు. (తిరితీపులు+ఆడు) పెనఁగులాడు. "ద్వి. రట్టఁడై తిరిగి పత్త్రంబులుగొనుచుఁ, బెట్టవచ్చినఁ గల్లపెనపులు పెనఁచి,తిట్టువారును దాను దిరితీపులాడి." ద్వి. హరిశ్చ. ఉ. ౪౦౭.

తిరిప. దే. విణ. బిచ్చగాఁడు. "సీ. పదునైదు దినముల బ్రదుకుకై సరివాని దిననాథు నాసించు తిరిపవీఁడె." పి. శకుం. 3, ఆ. ౧౦౦.

తిరిపగాఁడు. దే.విణ. (తిరిపము+కాఁడు) బిచ్చగాఁడు "ఆ. తిరిపగాని మిగులదీవించఁగా రాదు,వెట్టివాని మాట విన‌గరాదు." వేమన. ౬, ప్ర. ౫౪.

తిరిపగొట్టు. దే. విణ. (తిరిపము+గొట్టు) విరక్తుఁడు కాక బిచ్చమెత్తువాఁడు. (శ. ర. తుచ్ఛభిక్షుకుఁడు. బ్రౌ.) "సీ. అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాల మారి బికాసి బికారి తిట్టిగొట్టు తిరిపగొట్టునా..." ఆం. భా. ద్వి. ౧౭౬.

తిరిపబోగి. దే. వి. (తిరిపము+బోగి) బిచ్చమెత్తు యోగి, ముష్టివాఁడు. "ఆ. తిరిపబోగిఁ దగునె దేవుఁ డనఁగ." వీర. ౧, ఆ. ౧3౫. (శ.ర.పా.)

తిరిపతిండి. దే. విణ. (తిరిపము+తిండి) భిక్షాశనుఁడు, భిక్షుకుఁడు. "ద్వి. దండి దుర్వేషి యెవ్వండేని తిరిప,తిండియ కాక భక్తుండు దా నగునె." పండి. తా. పురా. ౧౩౦. పు.

తిరిపము. దే. వి. భిక్షము. ముష్టి. "క. సరిసెలఁత లెన్నియేనియుఁ, దెరువులధనములు గడించి తెచ్చుకొనఁగ నోశరలాక్షి యొక్కఁడాసరి, తిరిపపుఁ బాపనికి వలచి తిరుగుట యగునే." పరమ. ౩, ఆ. ౨౪౬. ద్వి. హరిశ్చ. పూ. ౫౧౩. పం. విణ. భిక్షుకుఁడు, బిచ్చమెత్తుకొనువాఁడు. "సీ. కడఁ దిరిపంబవై కాంతయు నీవును దేశంబులందెల్లఁ దిరిగి." కవిక. ౫, ఆ. ౧౭.

తిరిపగూడ. దే. వి. (తిరిపము+గూడ) భిక్షాపాత్రము. "చ,..చంక నత్తిరిపగూడ ధరించి నరించి వెంబడిన్." వైజ. ౩, ఆ. ౬౪.

తిరిపమెత్తు. దే. స. క్రి. అ. క్రి. (తిరిపము+ఎత్తు) బిచ్చమెత్తు. "గీ. కొలముకొఱఁత గరాసుల కలవిగాని, దొరతనము గూర్చి కడుబల్లిదుల కదేల, తిరిపమెత్తఁగఁ జేసె..." నీలా. ౧, ఆ. ౧౧౧. వేమన. ౩, ప్ర. ౨౦.

తిరిపరి. దే./విణ. (తిరిపము+అరి) బిచ్చమెత్తువాఁడు. "క. ఇది ధర్మం బనులీనుల, కిది మావిధి మాతాపితృప్రహీణుల కహహా,యిది కట్టడ తిరిపరులకు, నెదిరిం దనుకొఱఁగ కునికి కేలా మాటల్." కాశీ. ౭, ఆ. ౫౨. (శ. ర. పా) దశ. ౬, ఆ. ౧౦౪.

తిరిపె=తిరిప. "సీ. చెల్లరే యీజాడ శివుఁడు నీసాటియే దేశంబు తిరిగెడు తిరిపె కాఁడె." వీర. ౩,ఆ ౧౧.

తిరిపెట్టు. దే. అ. క్రి. (తిరి+పెట్టు) మెలిపెట్టిన వస్త్రాగ్రమును చెవిలోఁ జొనిపి త్రిప్పు. (వా); 2. తంత్రముపెట్టు, దుర్బోధచేయు. (వా).

తిరివెట్టు = తిరిపెట్టు. "భాస్కరపలసిత వృత్తము... వనట తిరివెట్టన్." భార. స్త్రీ. ౨, ఆ. ౪౯. (శ. ర. పా.)

తిరియు. దే. స. క్రి. బిచ్చమెత్తు, భిక్షించు. "గీ. తిఱిసి యేనియు నన్నఁబు దెచ్చిశిథిలు, లైనవిప్రులయాఁకలి యపహరించు, పురుషుఁడు..." భార. అను. ౪, ఆ. ౨౭౨, భార. సౌ. ౧, ఆ. ౨౧౭.

తిరీటము. సం. వి. అ. న. 1. కిరీటము; 2. లొద్దుగు...

తిరు. వై. విణ. (సం. శ్రీః. క. త. తిరు) శుభకరము; పవిత్రము. (దీనికి సమాసముననే ప్రయోగము లుండును." ఉదా:—తిరునామము, తిరుమంత్రము, తిరుమణి. మొ.)

తిరుఁడు. వై. విణ. (సం. స్థిరః) స్థిరుఁడు. (శ. ర.)

తిరుకట్టె. ద్వ.వి. (తిరు+కట్టె) పవిత్రస్థలము లూడ్చుటకుపయోగించుచీఁపురుకట్ట, సమ్మార్జని. వైజ. ౨, ఆ. ౧౧౫.

తిరుకణామధు. ద్వ. వి. పాయసము. వైజ. ౨, ఆ. ౧౩౧.

తిరుకాపు. ద్వ. వి. (తిరు+కాపు) దేవాలయము తలుపు." పరమ. ౩, ఆ. ౨౯౩.

తిరుకాళత్తి. వై. వి. (తిరు+కాళత్తి) శ్రీకాళహస్తి యనుపుణ్యస్థలము. బస. ౩, ఆ. ౯౯౦. పం.

తిరుకొలను. ద్వ. వి. (తిరు+కొలను) పుష్కరిణి, మెట్లు కట్టియుండు కోనేఱు. "క. తిరుకొలను నూయి లోటయుఁ,జెఱువు మడువు..." హంస. ౪, ఆ. ౨౧౦. (శ. ర. పా.)

తిరుకొళము = తిరుకొలను. శుక. ౩, ఆ. ౩౦.

తిరుగ. అవ్య. ద్రు. (తిరుగుధాతువుయొక్కతుమున్నాద్యర్థకము) 1. పునరర్థకము, మరల. "క. తిరుగన్ రెండేండ్లకు నీ,సురుచిరహారోత్తమంబుఁ జూడఁగ నాకున్, దొరకెన్ గనుఁగవ చేసిన, యురుపుణ్యము నేఁడు పెండియుఁను ఫలియించెన్." కళా. ౫, ఆ. ౪, అం. భా. తృ. ౬౯; 2. విరుద్ధముగా, "మ. బహుభాషల్ దిరుగంగ నాడుటలునుం బ్రామాణికత్వంబులే." కాశీ. ౬, ఆ. ౯౧; 3. వేఱుగా,మఱియున్. "క. వినుమాత్మతీర్థసంసేవనము తెఱం గెఱుఁగునట్టివానికిఁ దిరుగం,జనవలయునె పెఱచోటులకు..." భార. శాం. ౫, ఆ. ౧౫౦.

తిరుగఁబడు. ద్వ. అ. క్రి. (తిరుగన్+పడు) 1. ఎదిరించు, ప్రతిఘటించు. "గీ. దనుజసింహనాదములు డెందములు సొరఁగఁ, దిరుగఁబడఁజొచ్చె సమరకుంజరబలంబు." ఉ. హరి. ౧, ఆ. ౧౯. ప్రబంధ. ౯౬; 2. తిరుగు,సంచరించు. "క. కథుసంధిమమునఁ దిరుగం,బడియెద రిది యేమి తెఱఁగు పండువు మీకొ,ల్చెడుదైవ మెద్ది యెయ్యది,పడయంగా వచ్చుఁ దత్సపర్యానియతిన్." హరి. పూ. ౭, ఆ. ౧౨౩; 3. విపరీతమగు. "క. ఏవిధిసుఖ

దము దుఃఖప్రదమై పెను దుఃఖదము సుఖదమై తిరుగఁ బడున్." నృసిం. ౪, ఆ. ౬౯. కాశీ. ౫, ఆ. ౧౫౪; 4. మరలు, వెనుదిరుగు. "క. మనమునక నయ్యె దిక్కులు, పనిగ్రేపు దలంచి తిరుగఁ బడె..." జై. ౭ ఆ. ౧౦౧, కాశీ. ౭, ఆ. ౧౧౩; 5. మాఱు, భిన్నమగు. "సీ. దాని వినియును నపుడు రాధాసుతుండు, దిరుగఁబడకమనంబుతో ధీరవృత్తిఁ, దల్లి కిట్లను నీమాట తథ్యమగునయ్యెన నొక్కటి చెప్పెద నవధరింపు." భార. ఉద్యో. ౪, ఆ. ౬౧.

తిరుగఁబాటు. ద్వ. వి. (తిరుగఁబడు ధా.) 1. మరలుట, నివర్తనము. "సీ. దృఢసంపదల కింకఁ దిరుగఁబాటనియొ స్తనంబులముఖములు నల్లనయ్యె." కవిరా. ౨, ఆ. ౧౭౩; 2. ఎదిరించుట. (వా).

తిరుగఁబాఱు. దే. అ. క్రి. (తిరుగన్ + పాఱు) పాఱిపోవు. "ద్వి. ఆరభసంబున కలిభీతినొంది, వారిధిలోన జీవంబు లన్నియును, బెఱలుచు నొఱలుచుఁ దిరుగఁబాఱుచును, నెఱయుచు నటఁ దలయెత్తి చూచుచును." రం. రా. యు. ౩౧౫. పు.

తిరుగఁబోఁత. దే. వి. (తిరుగఁబోయు ధా.) తాలింపు, కూరలు మున్నగువానికిఁ జేయుసంస్కారము. "క. క్రొంబోగపుకూరవగలిరు, గంబోఁతల మెంతిజీర కంబులవలవుం, దుంబోళ్లతావిసిగరుల, గంబూరజగంబు వొగడఁగా నటు సుడిసెన్." రా. వి. ౨, ఆ. ౧౦౧, ఆం. భా. ద్వి. ౨౫౭.

తిరుగఁబోయు. దే. అ. క్రి. (తిరుగన్ + పోయు) 1. తాలించు. (శ. ర.); 2. సంచి మొదలగువాని లోనిధాన్యాదికము మఱొకదానిలోఁ బోయు. (వా.) [(శ. ర.)

తిరుగడ. ద్వ. వి. (తిరుగు + గడ) మఱపెట్టినగొట్టము.

తిరుగలి. దే. వి. ఔ. (తిరుగు + కలు + ఇ) పిండి మొదలగునవి విసరుశిలాయంత్రము, ఘరట్టము. వి. (తిరుగు + కలి) భ్రాంతి, భ్రమ. "క. అని గద్గదకంఠంబున, వినిపించినఁ గుంభి తాను వికవిక నగుచుం, గనుతిరుగలిగా కాసతి మన పెట్టినచోట లేక మఱి యెం దరిగెన్." భో. ౫, ఆ. ౫౯. (కనుతిరుగలి = దృష్టిభ్రాంతి.)

తిరుగవేయు. దే. స. క్రి. (తిరుగన్ + వేయు) త్రిప్పు, వ్యత్యస్తముచేయు. "క. అని నిశ్చయించి హస్తంబున జలములు పూని తల్లి బొమ్మని ప్రోక్షించిన మాయగోవు పడుచుం, గన గ్రుడ్లం దిరుగ వేసి కాలముచేసెన్." వరాహ. ౧౦. ఆ. ౪౦.

తిరుగాడు. దే. అ. క్రి. (తిరుగు + ఆడు-స్వార్థమున) 1. సంచరించు, తిరుగు. "చ... ఇది ధర్మనందను మఖాశ్వము దీనికి నై ప్రయాస మొందనిమిష రాట్సుతుండు తిరుగాడెడు సేనలతోడ సంచుమున్, వినఁబడు .." జై. ౮, ఆ. ౧౨౫. య. ౧, ఆ. ౧౩; 2. చుట్టుదిరుగు. "ఉ... మూ, కాసురసూకరంబు దిరుగాడె వడిన్ శరఘాతవేదనన్." హర. ౭, ఆ. ౪౬.

తిరుగు. దే. అ. క్రి. (క. తిరుగు. త. తిరుహు) 1. సంచరించు, పరిభ్రమించు. "ఆ... అంతరిక్షమున హంసలెల్లఁ, బిండుగట్టి తిరుగుచుండె జ్యోత్స్నధూత, శారదాభ్రశకలచయముఁ బోలె." భార. అర. ౨, ఆ. ౧౩, విక్ర. ౧, ఆ. ౮౬; 2. ప్రవర్తించు, మెలఁగు. "చ. ధనములు పాలఁ గల్గి సతతంబును నింద్రియవాంఛ సల్పుచున్, మనమున నెన్నఁడున్ సుకృతమార్గముఁ బొందకఁ బోక లోభమోహనిహతబుద్ధులై తిరుగునట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్, గనుటకు నేరరు..." భార. అర. ౪, ఆ. ౧౭౬, కుచేల. ౧, ఆ. ౩౮; 3. వెనుదీయు. "క. సుతులు సమరమునఁ దిరుగక, మృతులై సద్గతికిఁ జనిన మేలిమి యస్మత్స్మృతిఁ దలఁచె వరము క్షత్త్రచరిత మని యప్పనికి వగవఁ బ్రీతియ కలుగున్." భార. ఆశ్ర. ౧, ఆ. ౭౩, ఆం. భా. తృ. ౧౧౪; 4. (చుట్టు) ఆవరించు. "క. చుట్టంబులుఁ జెలులుం దనచుట్టుఁ దిరిగియుండ ముదము సొంపెసలారెన్." నైష. ౨, ఆ. ౮౪, నైష. ౨, ఆ. ౩౮; 5. ఎదుర్కొను, తిరుగఁబడు. "క. పోరానిపట్లఁ బోడుచుట, వైరిబలము దిరుగ జయమొ స్వర్గమొ యగు నానాహుప యంత్రతంత్ర, కారాదులపట్లఁ బ్రజనె కవియింపఁదగున్." ఆము. ౪, ఆ. ౨౫౪; 6. మరలమరల వచ్చు. "సీ. ప్రతియుగంబునకు నేపట్టణంబునకును దివ్యాభిధానంబు దిరుగుచుండు." కాశీ. ౩, ఆ. ౧౦౩; 7. మరలివచ్చు. "చ. హరిహయుఁడాగ్రహోజ్జ్వలితుఁడై యనిఁ బాఱుదిశాధినాథులుం, దిరుగుఁడు పోకు పోకుఁ డని తిట్టి యదల్చి..." పారి. ౫, ఆ. ౮౪, ఆము. ౨, ఆ. ౨౨; 8. (మఱొకదిక్కునకు) తూఱు, పరివర్తన

మొదు. "క. ఊఁదుకొనఁబడుమధూళిక,యోడి కలకుఁ గ్రిందఁ గ్రమ్మియుండెడు తేంట్లన్, నీడలు తిరిగియుఁ దిరుగని,జాడఁ దరు ల్వ్రాలిచె నవ్వ సంతపువేళన్." ఆము. ౫, ఆ. ౧౩౭; 9. చుట్టు దిరుగు, గుండ్రముగా భ్రమించు. "చ. ఉరుజవ శాలియత్తురగము ల్పకచక్రనయావలంబియై, తిరుగురయంబుచేత నెడత్రెవ్వక కుమ్మరిసారె చాడ్పున న్బరఁగె..." ప్రభా. ౨, ఆ. ౩౪, హర. ౬, ఆ. ౦౯; 10. ఏర్పడు. "సీ. కండె దిరిగి యుఁక్కకంబాలతో మాఱుమలయుబాహువుల యుగ్గలికతోడ." పరమ. ౩, ఆ. ౪౦. స. క్రి. 1. పరివేష్టించు. "క. ధరలో జంబూద్వీపము, నరసన్నుత లక్షయోజనమ్ములు దానిం, దిరిగి లవణాబ్ధి యొంతయు, విరివిం గనుపట్టు లోకవిశ్రుతమహిమన్." వి. పు. ౩, ఆ. ౪౫; 2. ప్రదక్షిణముచేయు. "క. ఒకమాట జలకమార్చిన, నొకమా టొకపువ్వు మాళి నునిచిన నొకమా, టకుటిలమతి గుడిఁ దిరిగిన, సకలేప్సితముల నతండు సంపాదించున్." భీమ. ౩, ఆ. ౧౯౬; 3. తప్పు, ఉల్లంఘించు. "ఆ. మాటఁ దిరుగలేరు మానధనులు." భాగ. ౧౦, స్కం. ౫౯౯. వి. పర్యటనము, తిరుగుట. "సీ. త్రిమ్మట త్రిప్పట తిరుగుడు తిరుగు నాఁ బర్యట నాఖ్యయై పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౭౪.

తిరుగఁబోతు. ద్వ. విశే. (తిరుగు+పోతు) 1. తిరుగునట్టి స్వభావము కలవాఁడు. (శ. ర.); 2. వ్యభిచారిణి. "సీ. తిరుగఁబోతుల కేల దేవపూజ." దాశ. ౬౩.

తిరుగుడు. దే. వి. 1. పర్యటనము, సంచారము. ఆం. భా. ద్వి. ౧౭౪; 2. వ్యత్యాసము, మాఱుపాటు. (వ్యవ.)అందులో ఒకతిరుగు డున్నది. (శ. ర.); 3. మర. (శ. ర.); 4. ఒకరకమగుపనిముట్టు. (బ్రౌ. వా.); 5. చక్రము. "గీ. సరకుసేయదు తిరుగుళ్లఁ జామపిఱుఁదు." హ. స. ౪, ఆ. ౪౩. (శ.ర.పా.); 6. ప్రవర్తనము, నడవడి. (వ్యవ.) వాఁడు చెడు తిరుగుళ్లు కలవడినాఁడు.

తిరుగుడుకొను దే. అ. క్రి. (తిరుగుడు+కొను) భ్రమించు, తిరుగు. (చూ. తిరుగుడుకొలుపు.)

తిరుగుడుకొలుపు. దే. స. క్రి. (తిరుగుడుకొను ధా. ప్రే.)భ్రమింపఁజేయు, తిరుగఁజేయు. "ద్వి. తిరముగా ద్వాదశాదిత్యుల నొక్క-తెరువునఁ బోకుండఁ దిరుగుడుకొలిపె." బస. ౩, ఆ. ౪౦౫.పం.

తిరుగుడుచీల. దే. వి. (తిరుగుడు+చీల) తిరుగుడు నొక్కులు గలచీల. (శ. ర.)

తిరుగుడుత్రాడు. దే. వి. (తిరుగుడు+త్రాడు)పక్షులఁ బట్టెడిసాధనవిశేషము. "ద్వి. తిరుగుడుత్రాళ్లను దెఱఁగొప్పఁ గట్టి,యుఁరులొడ్డి జిగురుల నుసురుగాలముల." ద్వి. నల ౩, ఆ. ౩౧౯. పం.

తిరుగుడునొక్కు. దే. వి. (తిరుగుడు+నొక్కు) మేకు మున్నగువానిని కోసి తయారుచేసిన తిరుగుడు మర. (శ. ర.)

తిరుగుడుపడు. ద్వ. అ. క్రి. (తిరుగుడు+పడు) 1. పరిభ్రమించు. (శ. ర.); 2. కలఁతనొందు, క్షోభపడు. "సీ. ఒరుచేతఁ జిక్కక తిరుగుడుపడక యూర్పులేక తగునబ్ధి గలిగెనేని. గీ. ఈడు జోడని పోల్పంగ నెనఁగు మాద, మంత్రిశేఖరు తిమ్మనామాత్యవరుఁడు." చిత్రభా. పీఠి. ౧, ఆ. ౭౭; 3. చుట్టుతిరుగు. "వ...మందరాచలంబు దిర్దిరన్ దిరుగుడుపడి యమ్మహార్ణవంబుజలంబు లన్నియు దిగంతంబులం జెదరి..." వీర. ౩, ఆ. ౨౧౧.

తిరుగుడుపాటు. ద్వ. వి. (తిరుగుడుపడు ధా.)కలఁత, క్షోభము; క్షోభపడుట. "చ. హరిఁ గని దేవదూత చరణానతుఁడై యసురేంద్రసేన నిర్జరనగరంబుపైఁ బెలుచరాకయు సాకము బెగ్గలంబునన్, దిరుగుడు పాటుఁ జెప్పిన..." నిర్వ. ౩, ఆ. ౭.

తిరుగుడుపెట్టు. దే. స. క్రి. (తిరుగుడు+పెట్టు) బాధించు, ఓడించు. "ద్వి. గురుచక్రములఁ దిరుగుడుపెట్టుపిఱుఁదు."ద్వి. పరమ. ౩,ఆ. ౭౭౭. పం.

తిరుగుడుబిల్ల. దే. వి. (తిరుగుడు+బిల్ల) స్త్రీలశిరోభూషణము. (శ. ర.)

తిరుగుడుబిళ్లలత్రిప్పుళ్లు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. హంస. ౩, ఆ. ౧౪౬.

తిరుగుడుతాయి. దే. వి. (తిరుగుడు+తాయి) గిఱ్ఱుమని తిరుగుచుఁ బోయి తగులుతాయి. "గీ. ప్రతిబలము ప్రేయుతిరుగుడుతాళ్లకతనఁ,గుమ్ము లానిన బంగారుగోడ లురలి,పడిన..." కువల. ౩,ఆ.౧౦.

తిరుగుడువడు = తిరుగుడుపడు. ద్వ. అ. క్రి. 1. కలఁతనొందు,క్షోభపడు. "గీ. మందరాచలచటుల విమర్దనమున, ఘూర్ణమానమై గాఢసంక్షోభ

మెసఁగఁ, దలఁకు జలనిధి నాఁ ద్రిగర్తక్షితీశు, బలము తిరుగుడువడియె సంకులము గాఁగ." భార. విరా. ౩, ఆ. ౧౭౮, భా. రా. అయో. ౨౨౧; 2. చుట్టుతిరుగు. "వ...ఆవర్తచక్రంబులయందు గ్రహతారకానక్షత్రంబులు తిరుగుడువడియె..." హర. ౬, ఆ. ౯౫; 3. వెనుదీయు. "గీ...భూపాలకోటిమొగ్గరము లెల్లఁ, గలఁగఁ దిరుగుడువడ నోరగిలఁగఁ బెల్లగిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౮; 4. స్ఖలితమగు,జాఱు. "క. అరయఁగ సంస్పర్శముసన, తిరుగుడువడుశుక్ల మనుట తెలిఁగే సంకల్పరతిం గలదే చోఁకెడఁ,జరింప కుండంగ వలయు సంకల్పంబుల్." భార. శాం. ౮, ఆ. ౩౦౬.

తిరుగుదల. దే. వి. నివర్తనము, మరలుట. వ్యవ. వ్యాధి తిరుగుదలలోనికి వచ్చినది.

తిరుగుపడు. ద్వ. అ. క్రి. (తిరుగు+పడు) కలఁత నొందు,క్షోభపడు. "సీ. అహిరాజదామకం బడరించి మథియింపఁ బుట్టె నుగ్రానలస్ఫూర్తిఁ దొలుతఁ, గాలకూటము దానిగతి కోర్వఁగా లేక దేవదానవు లార్తిఁ దిరుగుపడఁగ." విష్ణు. నా. ౮, ఆ. ౬.

తిరుగుమొగము. ద్వ. విశ. (తిరుగు+మొగము) 1. గమనోన్ముఖము.(వ్యవ.) వ్యాధి కొంచెము తిరుగుమొగముగా నున్నది. (శ. ర. వా.); 2. విముఖము, వెనుదిరిగినది. "గీ. ఉచితనేపథ్య లయ్యు నయ్యురగసతులు, నిఘ్ననిజమాళిమణిఘృణివిఘ్నలబ్ధి, నభికసంకేతములకు రే లరిగి యరిగి, తిరుగుమొగ మైనచిక్కులతెరువు లివిర." పాండు. ౨, ఆ. ౧౭౮.

తిరుగువాఱు. దే. స. క్రి. (తిరుగు+పాఱు) పరివేష్టించు, చుట్టుకొను. "గీ. దివిజకామిను లీరీతిఁ దిరుగువాఱి." స్వా. ౩, ఆ. ౧౦౭, కాశీ. ౮, ఆ. ౨౦౩.

[వాద్యవిశేషము (శ. ర.)

తిరుచిన్నము. ద్వ. వి. (తిరు+చిన్నము) ఊఁదెడు

తిరుచూర్ణము. మి. వి. (తిరు+చూర్ణము.) పసుపు బియ్యము చేర్చి వైష్ణవులు నొసట నుంచుకొనెడి పొడి. "సీ. నడువీథి గలనిల్వునామంబుపట్టెలు శోభితం బగుతిరుచూర్ణరేఖ." వైజ. ౨, ఆ. ౫, పరమ. ౩, ఆ. ౧౬౯.

తిరుచే. దే. వి. (దేవుని నూరేఁగించు) పల్లకి,వాహనము. "సీ. వారికి భూమికి సీళ కర్థికన్యకు నూతనాంబరాభరణమ్ము లర్పణములు, చేసి శృంగారముల్ చేసి హాటకరత్నదీధితు లొప్పినతిరుచయందు, పేంచేపు చేయించి..." వేం. మా. ౨, ఆ. ౧౧౨.

తిరుదండె. వై. వి. (తిరు+దండె) దేవునిసన్నిధియందు దీప ముంచుకఱ్ఱప్రమిద. ' సీ. ఘనపద్మరాగమకరతోరణములు నాఁ దిరుదండెదీపముల్ తేజరిల్ల." ప్రబంధ. ౭౮.

తిరునామము. మి. వి. (తిరు+నామము) వైష్ణవులు నుదటియందు నిడుపుగాఁ బెట్టుకొనుబొట్టు. "ఉ. నల్లనిమేను నిల్వుతిరునామము పచ్చనిబొట్టు నాభిపైఁ దెల్లనితమ్మియుం గలుగుదేవుఁడు..." వైజ. ౧, ఆ. ౬౯.

తిరునామ = తిరునామము. "గీ. పసిఁడిదుప్పటి రింగులువాఱఁ గట్టి,మృగమదంబునఁ దిరునామ పగ నొనర్చి,దివ్యగంధ మలఁది యభినవ్యపుష్ప, మాలికలు దాల్చెమదనగోపాలుఁ డపుడు." శ్రీరాధా. ౫, ఆ. ౨౫౯.

తిరునాళ్లు. ద్వ. వి. బ. (తిరు+నాళ్లు. త. తిరునాళ్) దేవోత్సవదినము, దేవోత్సవము. "గీ. బ్రహ్మ తిరునాళ్ల కరుదెంచి ఫలముఁ గాంచి, కటక కల్యాణ ఢిల్లీనికటజనంబు." రా. వి. ౧, ఆ. ౩౬, స్వా. పీఠి. ౩౯.

తిరునీఱు. ద్వ. వి. (తిరు+నీఱు) శైవులు నొసట నుంచుకొనెడుగోమయభస్మము, విభూతి. (శ.ర.)

తిరుపందేరము. ద్వ. వి. (తిరు+పందేరము) దేవుని నగ లుంచుకొట్టు. "క. ఆరంగవిభునితిరుపందేరంబులు తేరుముట్లు తిన్నియ లలరుం,బేరులు దీర్ఘపుఁజెంబుల్, తోరము లగుగందవడియలుం గని వారల్." విప్ర. ౫, ఆ. ౮.

తిరుపట్టెకురుచే. ద్వ. వి. మల్లసాధనవిశేషము. "సీ. ఒఱపుగఁ దిరుపట్టెకురుచ లెత్తఁగఁ బొంచముల లాడుడింకులు బోరల మెడల. గీ. బలిమి గని పట్టి..." ప్రబంధ. ౮౨.

తిరుపణ్యారము. వై. వి. (తిరు+పణ్యారము) దేవతాదులకు నైవేద్యముచేయు పిండివంట. "క. తూరలు నన్నముఁ దిరుపణ్యారముఁ బచ్చళ్లు..." వైజ. ౨, ఆ. ౧౩౧.

తిరుపతి. మి. వి. 1. విష్ణుక్షేత్రము. "ఆ. వినుము తల్లి నూటయెనిమిదితిరుపతు,లందు సెన్న వేంకటాచలంబు, రంగధామమును గరంబు సన్నుతిఁ గాంచు..." పరమ. ౪, ఆ. ౮౪, ఆము. ౪, ఆ. ౩౫; 2. వేంకటేశ్వరస్వామియుండు పుణ్యక్షేత్రము, తిరుమల. (వా).

తిరుపనిపిళ్లె. ద్వ. వి. (తిరు+పని+పిళ్లె) దేవాలయమందలి సేవకుఁడు. "వ... తిరుపనిపిళ్లెలు పొందళిహాల నమర్చి తెచ్చినబంగారుతీఁగ లిప్పపూరాజనాలు..." ప్రబంధ. ౧౧౨.

తిరుపాట. ద్వ. వి. (తిరు+పాట) దేవతాస్తుతిగీతము. "ద్వి. పరఁగుమహాభక్తచరితలు నాద,భరితమై చనఁ దిరుపాటలు నేసి,పాడుచు నొక్కొక్క భక్తునిచరిత, వేడుకఁ బొగడు..." బస. ౪, ఆ. ౮౭౮. పం.

తిరుపు. దే. వి. (తిరుగుధా) 1. తిరుగుట, భ్రమణము. (చూ. తిరుపుగట్టు.); 2. జక్కిణి యనునాట్యవిశేషమునఁ గలయొకయంశము. "గీ. హొయలు కప్రము సిరములయొఱపు తిరుపు,లాగుమై సరిఝళుకు పల్లటీయుఁ గులుక,జక్కిణి నటించినను మెచ్చి శంభుఁ డిచ్చె, మానితవిమాన మొక్కటి వానరేంద్ర." సమీర. ౩, ఆ. ౨౧౭; 3. లాగుకొను. "క. దొనఁగోల గొనుటవేగం,బున నరిగొల్పుటయుఁ దిరుపుఁ బోరిఁ బోరి విడుపుం, జనుటయుం దనుజులఁ గొనుటయుం, ననిమిషులకునైనఁ గాంచు టరుదయ్యె ననిన్." కు. సం. ౧౨, ఆ. ౧౫౮.

తిరుపుగట్టు. దే. అ. క్రి. (తిరుపు+కట్టు) 1. (నాట్యమున) గిరగిర తిరుగు, చక్రభ్రమణముచేయు. "గీ. మెఱుఁగుమెయిదీఁగ వలగొనఁ దుఱుము బొదలఁ, దెఱవ యొక్కతె బిఱబిఱ తిరుపుగట్టె." చంద్ర. ౨, ఆ. ౧౪౧; 2. తిరుగు, భ్రమణముచేయు. "సీ. వనమదేభముఁ గట్ట: జనెడుమావతులు నాఁ దిరిగినవెంటనే తిరుపుగట్టి." నిరం. ౪, ఆ. ౬౯; 3. వ్యాపించు. "సీ. కఱసి దిఙ్మకురాళి గవిసెనలకుఁ దార్చె దివి దన్ని పెందూళి తిరుపుగట్టె." సాంబో. ౫, ఆ. ౨౦౩.

తిరుపుగొను. దే. అ. క్రి. (తిరుపు+కొను) నాట్యమందు గిరిగిరఁ దిరుగు. "క. ఇరువురు నేసిన బాణము, లిరుబరులును దాఁకి తిరిగె నిరుదెసలక్కన,క్కిరి యిరుమొగముల నట్టువ,తిరుపుగొనెడు క్రమముతో నతిత్వరితగతిన్." కాశీ. ౪, ఆ. ౧౮౪.

తిరుపుటెద్దు. దే. వి. (తిరుపు+ఎద్దు) గానుఁగయెద్దు. "ఉ. ఈనలినాక్షి దాఁ దిరుపుటెద్దుఁ బ్రతోదము మోపి రొప్పుచున్, గానుఁగపట్టెపైఁ దిరుగు..." క్రీడా. ౧౦౩.

తిరుపుట్టము. ద్వ. వి. (తిరు+పుట్టము) పూజ్యుల వస్త్రము. "క. తిరుపుట్టము లుతికి వేగఁ దెచ్చెద దినమున్." వైజ. ౨, ఆ. ౧౧౫.

తిరుపులుఁగట్టు=తిరుపుగట్టు. 1. (తిరుగు, భ్రమణము చేయు.) "గీ... మిట్టి మిసుపీథిఁ దిరుపులుఁగట్టికట్టి, రణహరులు రాఁగ నొకమహానినద మెసఁగె." కవు. ౪, ఆ. ౮౮; 2. వ్యాపించు. "చ. మరువిరితూపు రూపువన మాపు నొయారపుఁజూపు సూరెలం, దిరుపులుఁగట్టె." వేం. పంచ. ౪, ఆ. ౧౪౭.

తిరుప్పుల్లాణి. ద్వ. వి. (తిరు+పుల్లాణి. త. తిరుప్పుల్) దర్భశయనము, దర్భలతో నేర్పఱచినపాన్పు. "మ... జలధిం గాల్నడసేసెదం గపుల కస్సద్దోఃప్రతాపంబు దిక్కులఁ బేరెక్కఁగ నంచుఁ బల్కుచు నతిక్రోధానురోధోద్ధతిం, బొలిచెం గార్ముకపాణి యత్తరిఁ దిరుప్పుల్లాణి నుల్లాసియై." చం. రా. ౮, ఆ. ౩౭.

తిరుబాస. ద్వ. వి. (తిరు+బాస) దేవునిపైఁ బెట్టుకొనునొట్టు. "వ... పట్టినవ్రతంబు చెల్లకుండినం దిరుబాసగా వర్తిల్లుచుండె..." హార. ౧, ఆ. ౧౪.

తిరుమంజనము. ద్వ. వి. (తిరు+మంజనము) అభిషేకము; స్నానము. "వ...వరాహస్వామిముందటి మంటపంబున నుంచి పంచామృతస్నానాది తిరుమంజనంబును...ఆదరించి..." వేం. మా. ౨, ఆ. ౧౧౮, శుక. ౩, ఆ. ౧౬.

తిరుమంత్రము. మి. వి. (తిరు+మంత్రము) నారాయణమంత్రము, అష్టాక్షరి. "క. కరుణాపరుఁడై ద్వయమును, తిరుమంత్రము మున్ను గాఁగ, నిజకావ్యములా, కరణిఁ బరాంకుశమానీశ్వరుఁ డుపదేశించి..." పరమ. ౫, ఆ. ౧౧౯.

తిరుమజ్జనము. మి. వి. (తిరు+మజ్జనము) దేవతావిగ్రహములకుఁ జేయునభిషేకము. "చ...శో,భన మగుమేనివానిఁ దనుఁ బ్రత్యహముం దిరు

మజ్జనంపుసేవ సలరఁ జేయువాని జనపద్యత నొప్పెడు నొక్కనిపుత్రిన్." పరమ. 3, ఆ. ౧౬౮.

తిరుమణి. ద్వ. వి. (తిరు+మన్ను-శ. ర.) వైష్ణవులు నొసట నుంచుకొనుధవళమృత్తిక. "క. నడుముక్కు మోవఁ దీర్చిన,కడుఁ దోరపుఁదిరుమణియును గావి వలువఁ జొ,ప్పడఁ గంఠంబునఁ దిరుమణి,పడములు ధరియించి వైష్ణవపువేషముతోన్." పరమ. 3, ఆ. ౨౦౪, వైజ. 3, ఆ. ౧౮.

తిరుమణిపడము. మి. వి. (తిరుమణి+పడము. త. తిరుమణిపడం) తామరపూసలదండ. "సీ. కంఠభాగంబులఁ గమనీయగతిఁ బొల్చుతిరుమణిపడముల గరిమతోడ." పరమ. 3, ఆ. ౧3, 3, ఆ. ౨౦౪.

తిరుమన్ను. ద్వ. వి. (తిరు+మన్ను) వైష్ణవులు నొసట నుంచుకొనెడిధవళ మృత్తిక. "గీ. పట్టెతిరుమన్ను బెదరుకెంబట్టు చూపు." ఆము. ౬, ఆ. ౬.

తిరుమల. ద్వ. వి. (తిరు+మల) వేంకటాచలము. "క. తిరుమల దేవరను దిరిగి తిరిగి పొగడుచున్." పరమ. ౨, ఆ. ౨౦౭, వేమన. 3, ప్ర. ౨౧౨.

తిరుమాల. మి. వి. (తిరు+మాల) వనమాల, ఆకులు పువ్వులుఁ జేర్చి కట్టినమాల. "చ...హరి దాల్చు వక్షమం,దలితిరుమాల..." ప్రబంధ. ౧౮౧.

తిరుమాళిగ. ద్వ. వి. (తిరు+మాళిగ. క. తిరుమాళిహై.) (వైష్ణవభాషయందు) గృహము, పూజ్యులుండు గృహము. "సీ. హరితిరుమాళిగ గరుడధ్వజాంచలం, బొకకొంత గన్నపుణ్యుండువీఁడు." వరాహ. ౧౦, ఆ. ౧౬.

తిరుమాళిగె=తిరుమాళిగ. "సీ. తిరుమాళిగెకును రాఁ దీరదొ యిన్నాళ్లవలెఁ గాదు మించె నైశ్వర్య మూర." కృష్ణ. ౨, ఆ. ౪.

తిరుమాళిహ=తిరుమాళిగ. "క. తిరుకట్టై సేవఁ జేసెదఁ, దిరుమాళిహ నలికి పూసి తీర్చెద ముగ్గుల్." వైజ. ౨, ఆ. ౧౧౫.

తిరుమాళ్వా=తిరుమాళిగ. "సీ. నే మేల్కనక మున్న తా మేలుకొని దేహశుద్ధియై తిరుమాళ్వా శుద్ధి చేయు." వైజ. ౨, ఆ. ౧౩౬.

తిరుముడి. ద్వ. వి. (తిరు+ముడి) 1. జడలుగట్టిన జుట్టు. "ద్వి. ధరరాజ్య మెల్లఁ దిరుముడి దాల్చి, పరము నమ్మినతిరుపాలునిబంట." బస. ౪, ఆ. ౧౦౧౧, పం; 2. వైష్ణవజనము. "క. అనుదినము వేయుందిరుముడి,కిని మృష్టాన్నముల నారగింపు లిడక యా, యనఘుఁడు భుజియింపఁడు మఱున్నఁగ,దన పనిఁ దయయుఁ దాను సెట్టితాత్పర్యం బో." పరమ. ౪, ఆ. ౧౪3.

తిరుముత్తము. ద్వ. వి. (తిరు+ముత్తము) దేవాలయము. "ద్వి. మ్రొక్కుచు నత్తిరుముత్తంబు వెడలి,చక్కఁ దెరువునఁ బాదచారియై నడవ." బస. ౬, ఆ. ౭౬౧.

తిరులు. దే. వి. (కు. సం. వ్యాఖ్య దీనికి తిరులుమరులు అని సముదాయముగనే ప్రయోగము గన్పడుచున్నది) "క. పరమపతివ్రతలై సురపురములు సాధింప నున్నపుణ్యస్త్రీ లెవ్వరు గలరు చూపు చూతాం, కురకరహతిఁ దిరులు మరులు గొలిపెడ వారిన్." కు. సం. ౪, ఆ. ౪౨ ౬, ఆ. ౧౭.

తిరువంజనము = తిరుమంజనము. వైజ. ౨, ఆ. ౧౫.

తిరువడి. ద్వ. వి. (తిరు+అడి) 1. దాసుఁడు. "క. ఇరవుగొను తెఱవు దోఁచిన వెరవున దేవరను నిన్ను వించితి ననినన్,దిరువడి నుడి హరువిడి మదిఁ, బరువడి రఘువీరుఁ డనియె భానుజుతోడన్." సమీర. 3, ఆ. ౧౯౯; 2. పుణ్యస్థలము. "గీ. ఆట్టితిరువళ్లలో జనరు లెట్టివారు, పుండరీకాక్షు సేవించి పుణ్యమైన, యుభయలోకసుభోగోన్నతి నొందఁగలరు." శ్రీరం. మా. ౨, ఆ. ౩౫.

తిరువడికోలు. ద్వ. వి. (తిరువడి+కోలు) దాసరివాని దీపస్తంభము. "వ...దాసరిగుంపు వారిపాల గోపాలభిక్ష భిక్షించి భక్షింపఁ దిరక్షోణి నిలిచి నతోరంపుఁదిరువడికోలలరంధ్రగోళంబుల నుల్కలంబులై మండుధగధగనిజగజ్జ్యోతి దీపజాలంబుల...." ఆము. ౪, ఆ. ౩౫.

తిరువరంగము. ద్వ. వి. (తిరు+అరంగము) శ్రీరంగము, పుణ్యక్షేత్రవిశేషము. "ఆ. తాను మాధుకరము మానక యెప్పటి,యట్ల వైష్ణవాలయముల కరిగి, రంగవసతిఁ దిరువరంగంబులో వెల,యనుచు భిక్ష మెత్తుకొని భుజించు." వైజ. ౨, ఆ. ౧౩౨, బ. శాలిధాన్యవిశేషము. (శ. ర.)

తిరువాముడి. ద్వ. వి. ద్రవిడవేదము. (దీనియందు విష్ణుస్తోత్రము లుండును). "క. తిరువాముడి పఠియించుచు, హరిభక్తులఁ గన్న భక్తి వడియుడో ననుచున్...." విప్ర. ౨, ఆ. ౩౧.

తిరువాయిముడి=తిరువాముడి. "గీ...దండ,పత్ర్పణా మంబు లిడి తిరువాయిముడిప్ర, బంధసూక్తుల వినుతు లర్పణ మొనర్చి." వైజ. ౪, ఆ. ౧౫౯.

తిరువారాధనము. మి. వి.(తిరు+ఆరాధనము)(వైష్ణవ పరిభాషయందు) దేవతార్చనము. (శ. ర.)

తిరువిళక. ద్వ. వి. (తిరు+విళక) దీపము. "గీ. దీపము తిరువిళకజ్యోతి దివ్వె యనఁగ వెలయు..." వేంక. దేవ. ౮౫.

తిరువీథి. మి. వి. (తిరు+వీథి) దేవుఁ డూరేఁగువీథి. "ఉ. వేంకటశైలభర్త తిరువీథుల రా నిలిచెన్..." ప్రబంధ. ౭౬.

తిరువీసము. ద్వ. వి. (తిరు+వీసము) పలుచనిత్రీరా న్నము. "చ. వినుము రమావిభుండు తిరువీసము నిన్నటిరేయి యారగిం,చినతఱి..." విప్ర. ౫, ఆ. ౧౨.

తిరువు. దే. అ. క్రి. స. క్రి. తిరుగు. (శ. ర.)

తిరువుగట్టు = తిరువుగట్టు. (భ్రమణముచేయు) "గీ. భావిమంథమహీధరభ్రమణరీతిఁ, దెలుపుపోలఁపున గిరగిరఁ దిరువుగట్టైనబ్ధి నేకాంతలీలావిహారలోలుఁ, డైనహాటకకశిపుపాటనవిభుఁడు." దశా. ౧, అ. ౨౨౫.

తిరోగతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మఱుఁగు పడినవాఁడు; 2. అడ్డుగా వెళ్లినవాఁడు.

తిరోధానము. సం. వి. అ. న. 1. మఱుఁగుపాటు, అంతర్ధానము; 2. ముసుఁగు, గవుసెన.

తిరోభావము. సం. వి. అ. పుం. మఱుఁగుపడుట.

తిరోహితుఁడు. సం. వి. చ్. పుం. 1. మృగము; 2. పక్షి. సం. విణ. (అ. ఆ. అ.) మఱుఁగుపడిన వాఁడు. ఆ.

తిర్యక్కు. సం. విణ. (చ్. తిరశ్చ్. చ్.) 1. అడ్డ ముగాఁబోవునది. (జంతువు); 2. వక్రము; 3. అడ్డ ముగా నున్నది.

తిర్యగము. సం. వి. అ. పుం. కన్నుఁగవయందు చేయుం చుంబనము. "సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు నధరోష్ఠమున భ్రాంత మదరఁ గన్నుఁ గవఁ దిర్యగంబును గళదేశంబులఁ బ్రథితంబు చను దోయి నధరకంబు." హంస. ౫, ఆ. ౧౪౮.

తిర్యగ్గము. సం. వి. అ. పుం. 1. మృగము; 2. పక్షి. విణ. (అ. ఆ. అ.) అడ్డముగా నడచునది.

తిర్యగ్యానము. సం. వి. అ. పుం. 1. ఎండ్రకాయ, పీత; 2 మృగము; 3 పక్షి; 4. అడ్డముగా పోవుట. విణ. (అ. ఆ. అ.) అడ్డముగా నడచునది.

తిర్విళక=తిరువిళక. (త. తిరువిళక్కు) 1. దేవతాస ముఖమున పెట్టుదీపము; 2. దీపము. (బ్రా.)

తిలికి. దే. వి. మత్స్యవిశేషము (శ. ర.)

తిట్టి. దే. వి. 1. బుట్టవలె తాటియీనలతో నల్లిన మత్స్యగ్రహణసాధనవిశేషము. "గీ. కొడకు తి ట్టికొడమ ద్రొబ్బుడుపటంబు, చాప యెత్తెల గూడయుఁ జల్లు దూఁడు,లుంటగాలంబు తెరదీము లుసురుగాలము..." హంస. ౪, ఆ. ౧౦౪; 2. అవిరక్తభిక్షుకుఁడు. "సీ. అవిరక్తభిక్షుకుఁ డలరును బికిరాలమారి బికాసి బికారి తిట్టిగొట్టు తిట్టి తిరిపగొట్టు నా..." ఆం. భా. ద్వి. ౧౭౬.

తిట్టిగొట్టు. దే. వి. (తిట్టి+గొట్టు—స్వార్థమున) అవిరక్తభిక్షుకుఁడు. ఆం. భా. ద్వి. ౧౭౬.

తిలక. సం. వి. ఆ. స్త్రీ. 1. హారవిశేషము; 2. వృత్త విశేషము.

తిలకము. సం. వి. అ. పుం. 1. బొట్టుగు చె. 2. నువ్వు మొక్క; 3. ఎఱ్ఱగోరంటచె. 4. పుట్టుమచ్చ; 5. నల్లగుఱ్ఱము. (శ. ర.) పుం. న. బొట్టు. న. 1. కడుపులో కుడిపైపున ఎఱ్ఱగా నుండుమాంసము, క్లోమము; 2. నల్లసౌవర్చలము. విణ. అ. పుం. న. శ్రేష్ఠము. (ఈయర్థమున ఇది సమాసోత్తరపద ముగా నుండును.)

తిలకాలకము. సం. వి. అ. పుం. పుట్టుమచ్చ.

తిలకించు. దే. అ. క్రి. 1. కనఁబడు. "శా. నోరం జేతులు రెండు గ్రుక్కికొనుచున్ మోమెల్ల బాష్పాంబుజస్మేరంబై తిలకింప నేడ్చుచు..." హరి. పూ. ౫, ఆ. ౧౭౦. నృసిం. 3, ఆ. ౯౭; 2. ప్రసన్నతనొందు. "క. కిలకించిత్రరసపూరముఁ, జిలికించి కటాక్షవీక్షచే నలినాక్షుల్, తిలకించి చూచినప్పుడు, పులకించక సరులదేహములు లోహములే." వైజ. ౨, ఆ. ౨౧, విక్ర. ౧, ఆ. ౧౩౩. స. క్రి. చూచు, వీక్షించు. "క...పొసఁ గఁగ, బలుకఁగ నేర్తుగదా యని,-చిలుకం దిలకించి ప్రియము చిలుకం బలికెన్." విక్ర. ౭, ఆ. ౬౮, ఆం. భా. తృ. ౧౨౨; 2. గౌరవించు. "శా... కుకవిప్రణీతకృతి సామాన్యాకృతిం బూని పై, పైపక్షి ల్ఫ చరింప దానిఁ దిలకింపంబోరు

శిరోత్తముల్." వసు. ఆ. ౧౧; 3. చిహ్న, పెట్టు. "సీ. తిలకంబు కస్తూరిఁ దిలకించి చొల్లెంబు చెంగులపాగతోఁ జెన్ను మీఱ గీ...ఒకఁడు వచ్చె..." ద్వా. ౧౧, ఆ. ౧౩౩; 4. విను. "క. ప్రియ మొక్కటి యేఁ జెప్పెద,నయవినయ నిధీ మనంబునను నీవు గడుం, బ్రియముగఁ దిల కింపుము మత్ప్రియుండవు మత్ప్రియముచంమఁ బ్రియ మొంపఁ బగన్." హరి. ఉ. ౭, ఆ ౨౭; 5. చేయుం. "చ. సలిలముఁ జొచ్చినం గనక శైలముఁ జేరిన వైరివీరులం, గెలిచిన రాజసేవఁ దిలకించిన వేదము లభ్యసించినం, గళలతెఱం గెఱింగిన ఖగత్వము దాల్చినఁ గర్మనిన్నుతా, కలన నభావ్య మైనపని గాదు వినాశము లేదు భావికిన్." భర్తృ. నీతి. ౯౯.

తిలకితము. సం. విణ. (అ. ఆ. అ.) తిలకము కలది. సాంబో. ౧, ఆ. ౧౭౨.

తిలఘాతకుఁడు. సం. వి అ. పుం. గాండ్లవాఁడు, తెలిక వాఁడు.

తిలఘాతుకుఁడు. సం.=తిలఘాతకుఁడు.

తిలతండులన్యాయము. సం. వి. అ. పుం. నువ్వులును బియ్యమును గలిపినవిధము, ఒకానొకన్యాయము. (వీనికలయిక సంసృష్టి సంకరమువలెఁ గాక దీని యందు విడఁదీయుట కవకాశము కలదు.)

తిలతండులము. సం. వి. అ. పుం. 1. ఆలింగనవిశేషము; 2. నువ్వుపప్పు.

తిలతైలము. సం. వి. అ. న. నువ్వులనూనె.

తిలపర్ణము. సం. వి. అ. పుం. 1. శ్రీవేష్టముశ్రీ. న. చందనము. [తాంద్రశ్రీ.

తిలపుష్పకము. సం. వి. అ. పుం. 1. నువ్వుపువ్వు; 2.

తిలపేజము. సం. వి. అ. పుం. పొల్లునువ్వుగింజ.

తిలయంత్రము. సం. వి. అ. న. నూనెగానుఁగ.

తిలలు. సం. వి. అ. పుం. బ. నువ్వులు. (ఇది తెలుఁగున నిత్యబహువచనాంతము) "క...రమ్య తిలలు... దుహిత్రాత్మజుఁడుఁ గుతపమును బిత్రుప్రమదకారణముల్." హరి. పూ. ౨, ఆ. ౧౪౩.

తిలాపత్య. సం. వి. ఆ. స్త్రీ. నల్లజీలకఱ్ఱశ్రీ.

తిలిత్సము. సం. వి. అ. పుం. కొండచిలువ.

తిలోత్తమ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక అచ్చెర.

తిలోదకము. సం. వి. అ. న. పితరులకు నువ్వులతో తర్పణము విడుచుజలము.

తిల్యము. సం. విణ. (అ. ఆ. అ.) తిలలు పండునది. (పొలము.)

తిల్వము. సం. వి. అ. పుం. లొద్దుగుశ్రీ.

తివ. వై. స. (సం. త్రికమ్) మూఁడు. "క. తివిరి కరవాలు సేకొని,అవఅవ లెసఁగఁగ నత్తఱివమైఁ జనుచోఁ, దివజడలరేయిద్రిమ్మరి, పుప్పుఁబోఁడి యొకర్తు నెయ్యమున నడ్డంబై." అచ్చ. సుం. ౧౮. (తివజడలరేయి ద్రిమ్మరిపుప్పుఁబోఁడి = త్రిజట.)

తివా. చి. దే. వి. (హిం. తివాసీ) మేలైనచిత్రాసనము. "రగడ. దుప్పుకంబళ్లు పసుపులు తివాచీలు,పద్దుకుఁ గైకొన్నబలుజంబుఖానాలు." హంస. ౫, ఆ. ౩౫౬.

తివాసి = తివాచి. "చ ..మెఱుంగుబంగరపువన్నె జగాబురుసాతివాసిపై, ధరణిజతో వసించె బల తల్పుఁడదూడలఁ జేతు లానుచున్." ఉ. రా. ౬, ఆ. ౧౨౮, హంస. ౧, ఆ. ౬౯.

తివాసీ=తివాచి. "సీ. జాలవల్లికలు పచ్చలగద్దెపేఁట హరాంబట్టుతివాసీలు పట్టెవేళ్ల, సురటీలు..." రసిక. ౧, ఆ. ౬౧.

తివిపించు. దే. స. క్రి. (తివియు ధా. ప్రే.)తీయించు. "గీ...అంతఁ గనుపట్టె దివ్యసింహాసనంబు. క. తద్రూపముఁ గని నృపుఁడు దరిద్రుఁడు ధనరాశి గన్నరీతిం బ్రమదోన్నిద్రితుఁడై తివిపింపఁగ, భద్రాసన మద్రిభంగి బరువై తోఁచెన్." ద్వా. ౧, ఆ. ౧౦౫.

తివియించు. దే. స. క్రి. (తివియు ధా.)అపహరించు. "గీ. కదలి దివియించె నగ్రాంఘ్రికంబు తొడల పెను పు..." ఆము. ౫, ఆ. ౩౦. (తివియు ధా. ప్రే.) 1. త్రిప్పు, మరలించు. "క. అలరుచు లంకకు నిఁకఁ బోవలయుం నని యమాత్యభృత్య వర్గము వినఁగాఁ,బలికి నలుగడల విడిసిన, బలములఁ దివియించి దైత్యపతి పయనంబై." ఉ. రా. ౪. ఆ. ౧౭౭, రా. వి. ౫, ఆ. ౨; 2. పైకిఁ దీయించు, "ఉ...,మడుఁగుపొంతకుఁ బోయి జలంబు ద్రావి యూపట్టున మీఁటఁ గాంచి యొకబావువలం దివి యించి యేపుగన్." ద్వా. ౧, ఆ. ౨౩౯.

తివియు. దే. అ. క్రి. మరలు,వెనుకకుఁ బోవు. "ఆ... అనిసేయుట, విలిచి తివియఁ బంచె బలము వెళ్ల." భార. భీష్మ. ౨, ఆ. ౨౫౩; 2. వెన్నుదీయు,బంకు.

"గీ. అతిరథోత్తముఁ డప్వీటియందు మేటి, కృపుఁడు తనపెంపు నాటించి గెలుచుఁ జచ్చుఁ, గాని నాలుగు తెఱఁగుల సేనలకును, దివియఁ డించుకయును నరదేవముఖ్య." భార. ఉద్యో. ౪, ఆ. ౨౨౬; 3. ఆఱిపోవు, ఎండిపోవు. "గీ. పదను దివిసినకస్తూరి ప్రాఁచి యలరు, పాయఁబాఱిన కూడు నీర్వట్టుమడుఁగు, గళితమణి యగుసొమ్మునైనఁ గానఁబడియె, నుర్విదగ్ధుఁడు గౌరవమూరుఁ డగుచు." పాంచా. 3, ఆ. ౨౨, వరాహా. ౧౦, ఆ. ౨౮. స. క్రి. 1. మ్రింగు. "ఆ. కన్నతల్లి కన్నఁ గరుణలే దోకవేళ, పట్టిఁ బట్టి తివియుఁ బార్థివేంద్ర, గండకముల కిట్టిగండము ల్గలవు..." దశా. ౧, ఆ. ౧౩౭; 2. త్రిప్పు. "మ. శరసంధానముతోనె కొన్నియడుగుల్ జౌజవ్వనంబోయి యుద్ధరణిన్ గాల్ద్రొక్కి ద్రోణముల్ తివియం దోర్దండంబులం జేది యేసిరి బోయల్..." స్వా. ౪, ఆ. ౧౧౧; 3. పైకిఁదీయు, తీయు. "గీ. దోనల నలుఁగులు దివియుట తొడుగుట యును, నేయుటయుఁ గాఁడుటయుఁ బయి కెగయంట యును, గానరాకుండ వజ్రంబు గాఁగ నట్లు, పెనఁగుచుండిరి బీరంబు లినుమడింప." రసిక. ౬, ఆ. 3౪, శంక. ౨, ఆ. ౧౨౬; 4. దించు. "శా. పట్టెం గంఠబిలంబు చెయ్యి దివియన్ రాదయ్యె వారాణసీ, పట్టస్థానమునందు వ్యాసునకు శిష్యశ్రేణి భీతిల్లఁగన్." కాశీ. ౭, ఆ. ౧౦౭. (చూ. ౧౦౬); 5. పెఱుకు, ఊడఁదీయు. "క. విను వల్లభ కన్నుండం, గనుపాపం దివియ నేర్పుగల మునిముచ్చి, వనిత తగ దిచట నుండన్..." కళా. 3, ఆ. ౧౮౮. కవిక. ౨, ఆ. ౪౬; 6. లాగు, ఆకర్షించు. "ద్వి. కన్నులారఁగ నిది కనుఁగొను మనుచు, నన్నీలవేణిపయ్యెదవాయఁ దివిసి." నవ. ౨, ఆ. ౮౧. పు. "క. బలహీనుఁ డైనవానికి, నల విఱె మోపెట్టఁ దివియ నశక్యోర్మికమున్." భార. ఆది. ౭, ఆ. ౨౩౨; 7. గ్రుచ్చు, నాఁటు. "గీ. మాట లేటికిఁ జాలింపుమా తపంబు, వారునిఁ గూర్చి సరోజపత్త్రాయతాక్షి, వధ్యుఁ దివియంగఁ బాఁతిన వాఁడికొఱ్ఱు, యూపసత్క్రియ కర్హమై యున్నె చెపుమ." హర. ౪, ఆ. 3౦.

తివిరించు. దే. స. క్రి. (తివురుధా. ప్రే.) త్వరపెట్టు. "చ. అని చెలి విన్నవించుటయుం బాహితవాక్యము ముచ్చు విన్నయ, న్నినదముకన్నఁ దిన్నవయి నీరజలోచన యున్నకోనకుం, జనఁ దిచియింపఁ దల్ప్రియవచస్థితికన్న విరాళి నించె న, జ్జనపతికిన్ మనోజభుజబాపలతాగుణగుంజితార్భటుల్." వసు. ౨, ఆ. ౯.

త్రివ్వు=తివ్వు. దే. స. క్రి. 1. లాగు. "గీ. కొప్పుఁ బట్టి తివంబోవ నప్పడంతి, ప్రాణభయమునఁ గలఁగి..." కళా. 3, ఆ. ౧౧౭. భాగ. ౧౦, స్కం. పూ. ౪౦౨; 2. మరలించు. "చ. భవదమలాకృతి ప్రతిమఁ బర్విసయప్పుడు చూపు క్రమ్మరన్, దివఁ గదలింప రాక సుదతిన్ గతచేష్టితఁ జేసి... ప్రభా..." ౪, ఆ. ౭3; 3. తొలఁగించు, తీసివేయు. "శా...సర్పశవమున్ నేఁ డుగ్రుఁడై పైచినాఁ, డేరీతిన్ ఫణి గ్రమ్మఱం బ్రతుకునో హింసించునో కోఱలన్, రారే తాపసులార దీనిఁ దివరే రక్షింపరే మ్రొక్కెదన్." భాగ. ౧, స్కం. ౪౭౬, కళా. ౮, ఆ. ౧౯౦; 4. చేరఁదీయు. "సీ. అర్థిఁ దదారోహణాపేక్షితుం డైన ధుర్యునిఁ గనుంగొని తినక యాదరింపకుండుటకు..." భాగ. ౪, స్కం. ౨౧౯.

తివుచు. దే. స. క్రి. 1. పీల్చు. "క. రవి సృజియించును వర్షము, రవియ మగుడఁ గిరణతతుల రసమాత్రయుఁ దాఁ, దివుచును..." భార. శాం. ౬, ఆ. ౯౯౯; 2. మరలించు, వెనుకకుఁ ద్రిప్పు. "సీ. కలయ నేతెంచి నైషధక్ష్మావరుండు, దివుటఁ బురలక్ష్మిపై వ్రాలుదృష్టిఁ దివిచె, నాత్మ నొక్కించుకయుఁ బరాకయ్యెనేని, ప్రాణవల్లభ తన్నేమి యనునొ యంచు." నైష. ౬, ఆ. ౧౬; 3. తొలుకొనిపోవు. "క...మూర్ఛ, భ్రాంతుం డయ్యెన్ బలి దివి, జాంతకునరదంబు సూతుఁ డవలికిఁ దివిచెన్." దశా. ౨, ఆ. ౪౨౬; 4. లాగు, ఈడ్చు. "క. పవనజుగదయును నీగాం, డివమును నెటవోయె నరిగడికిఁ బాంచాలిం, దివిచికొని వచ్చునెడ..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౯౯, ప్రభా. ౨, ఆ. ౬.

తివుట. దే. వి. (తివురు. ధా.) 1. కోరిక. "సీ. వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱి తివుటమైనునుఁగాంతితీపుఁ గ్రోలు." భార. విరా. ౯, ఆ. 3౯౯, హర. ౨, ఆ. ౬౨; 2. శ్రద్ధ. "సీ. జనయిత్రి విను మఱి సకలపదార్థవరిజ్ఞానతత్త్వపారీణ

మగుచు, సామ్నాయవిహితకర్మాచారములు గల్గి తివుటమై వర్తించుదేవగణము." భాగ. ౩, స్కం. ౯౭౯; 3. వలపు. "చ. నవకపుమావిమోకలఁ జెనంగినతీవలు వేడ్కఁ జెంపఁ బల్లవములసెజ్జ లుల్లములలజ్జ లడంపఁగఁ జేటికతండముల్, తివుటల ముంపఁగా సమదలీల మనోజవినోదసక్తలై." నిర్వ. ౯, ఆ. ౩౨; 4. పూనిక. "ద్వి. బవరాన లంకాధిపతిపదితలలు, తివుట నొక్కమ్మునఁ ద్రెళ్లంగ నేసి." ద్వి. పరమ. 3, ఆ. ౨౧౭. పు. రం. రా. కిష్కిం. ౨౨౧. పు. క్రి. విణ. శీఘ్రముగా "గీ... వైళము తివురు తివుట, వేగిరము తుఱు తన శీఘ్రమా గిరీశ." ఆం. భా. ప్ర. ౬౧.

తివురు. దే. అ. క్రి. 1. పూను. "క. తివిరి యభోజ్యం బగుమాంసవమాంసముతోడ భోజనముఁ బెట్టినవాఁ డవు..." భార. ఆది. ౭, ఆ. ౧౧౬. ఉ. రా. ౪, ఆ. ౨౨౩; 2. త్వరపడు. "క. తివురక యిం కొక్కటి విను, కవియు నెడన్ వలయుఁ గన్నుఁ గవయన్ మూయన్." స్వా. ౩, ఆ. ౧౦౧. నీలా. ౩, ఆ. ౯౨; 3. అనుకొను, భావించు. "క. చ్యవనుఁడు గవిజాతుఁడు న,య్యవనీశ్వరుఁ బిల్చి వరము లడుగుము రెండీఁ, దివిరితి మనుడు నతఁడు ..."భార. అను. ౫, ఆ. ౨౯౬; 4. వేడ్క నొందు. "సీ. పడఁతి నీకరములు పట్టంగఁ దివిరి శంకించి వడంకెడు కేలు సూడు." భార. విరా. ౨, ఆ. ౪౭. శుక. ౪, ఆ. ౯౩; 5. మించు, అధికమగు. "గీ. ఎసఁగుసంతాపభరమున నిట్టునట్టుఁ బొరలు శయ్యాతలంబునఁ బువ్వుఁబోఁడి, తివురు విరహానలంబున దివ్వెలెత్తఁ, జిత్తజాతుండు వత్తి దాల్చినవిధమున." ఉ. హరి. ౭, ఆ. ౧౩౧; 6. ఇచ్ఛించు, కోరు. "ఆ. ఏమికారణమున నింద్రు ఖాండవ మగ్ని, దేవుఁ డట్లు గాల్పఁ దివిరె దీని, విప్రముఖ్య నాకు వినఁగ వేడుక యయ్యె, నెఱుఁగఁ జెప్పు మయ్య యుద్ధచరిత." భార. ఆది. ౮, ఆ. ౨౪౨; 7. తిరుగు, సంచరించు. "గీ. తేవ మీఱంగఁ దల్పంబు డిగ్గి డిగ్గి, తేప తేపకు నిట్టట్టుఁ దివిరి తివిరి, పొలఁతిచెలువంబు మాటికిఁ బొగడి పొగడి, వసుధ వ్రాయుఁచు మో మెత్తి వాంచి వాంచి." కృ. శకుం. ౩, ఆ. ౭. రాఘవ. ౪, ఆ. ౧౧౯; 8. కోపించు. "గీ. తివిరి తీక్ష్ణత్రకుల ఘూత్తనివహములకు." హరిశ్చ. ౩, ఆ. ౯౬. అచ్చ. సుం. ౭౯; 9. ధ్వనించు, మ్రోయు. "సీ. ... తివురుచిందములలోఁ ... కలఁగఁబడక." భార. విరా. ౪, ఆ. ౬౨. శు. సం. ౩, ఆ. ౩౦; 10. మాఱుమ్రోయు, ప్రతిధ్వనించు "ఆ. అవనిచక్రరక్షు నైనసత్యాని పత్య, దేవుఁ జూచి సభము తివురు నాస్ఫె." భార. భీష్మ. ౫, ఆ. ౭౪. ఉ. హరి. ౧, ఆ. ౧౪౬; 11. ప్రవర్తిల్లు. "తరలము...సివ్ర హాండవకులంబు వెలుఁగఁబుట్టి దృఢంబుగా నృపలక్ష్మితో, నవని రాజ్యభరంబు దాల్చినయంతనుండి మఖంబులం, దివిరి యిష్టఫలంబు లిచ్చుటఁ దృప్తులైరి మహా ద్విజుల్." భార. ఆది. ౨, ఆ. ౯౨౪. విణ. శీఘ్రముగా. ఆం. భా. ప్ర. ౬౭; 13. కరుణించి. "గీ. పఱవ నోపకయున్న మై మఱచి పెంటి, చెనఁగి యున్నను బ్రసవింప మొనసియున్నఁ, దవులుగొనియున్న మృగములఁ దివిరి యేయ, రెఱచి యాహారముగఁ గొను నెఱుక లఱియ." భార. ఆది. ౭, ఆ. ౭౩; 13. దీక్షవహించు. "సీ. తివిరి సరస్వతీతీరంబునందు నిశ్చింతుఁడై తప మొప్పఁ జేయుచున్న, యాదధీచికడకు నరిగి వేఁడుండు..." భార అర. ౩, ఆ. ౩.

తివ్వ. దే. వి. తీఁగ, లత. "ఉ. నొవ్వ యలంపఁ గూనె దవు నోరోకమాఱును మూయవేలొకో, తివ్వలు కాలఁ జుట్టినను వెంపఁగ లేవు తరత్తునాథ..." కేయూర. ౩, ఆ. ౧౧౬.

తివ్వు. దే. స. క్రి. 1. ఆకర్షించు, లాగు. "శా... దృగ్జాలంబుల్ గలయంగ విచ్చి విటమత్స్యవ్రాత ముం దివ్వుచున్, రోలంబాలక వచ్చి చూచె..." శు. సం. ౯, ఆ. ౭౯; 2. తీసికొనిపోవు. "ఉ... చను దెమ్ము లెమ్మనన్, ప్రాగరిమంబు వాపుచు నొకించుక లేవఁగఁ బూను మాను న్నాలోఁ గొద గొన్నసిగ్గునఁ జెలుల్ బలిమిం దనుఁ దివ్వఁ గోరుచున్." కళా. ౭, ఆ. ౧౧౭; 3. దించు. "క. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబు గానిదృఢ కార్ముకమున్." భార. ఆది. ౭, ఆ. ౨౭. భా. రా. బాల. ౩౦౦; 4. మరలించు, నిగ్రహించు. "మ....లోలోన వే, తెరువుల్ వాఱుమనంబుఁ బట్టిబలిమిన్ దివ్వంగఁ దివ్వంగ దుస్తరదుశ్శాసిక యయ్యెఁ బూర్వవిధిఁ బ్రత్యక్షంబుగా, నిమ్మహా పురుషుం గంటిమి..." హరి. ఉ. ౪, ఆ. ౬౭.

భార. శాం. ౧, ఆ. ౪౬; 5. ఊడఁదీయు,తీయు. "ద్వి. పగలు చూచినసొమ్ము పగలు తేఁగలము, మిగిలినకడిమి నెమ్మెయిఁ దివ్వరాని, తాలముల్ గడియ లుద్ధతి మోవ స్త్రీల, వ్రాలించుపెక్కైన బదనిక ల్గలవు." ద్వి. పరమ. ౭, ఆ. ౯౨౦. పు. కకు. 3, ఆ. ౭౦; 6. కనిపట్టు,తెలిసికొను. "క. కడుమేటి యైనదొరచేఁ,బడినది మీసొమ్ము వెచ్చ పదనోపిన నీ,గడ కొంత దివ్వవచ్చున్, బెడిదపు రొదచే ఘటింప నేర దొకటియున్." పరమ. ౯, ఆ. ౯౨.

తిష్యా. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక♣.

తిష్యకము. సం. వి. అ. పుం. పుష్యమాసము.

తిష్యపుష్ప సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక♣.

తిష్యము. సం. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము; 2. పుష్యమాసము; 3. కలియుగము♣. ఉసిరిక♣. విణ. (అ. ఆ. అ.) 1. శుభమైనది; 2. పుష్యనక్షత్రమునఁ బుట్టినది.

## తీ

తీ. వై. స. వృత్తియందు తిగశబ్దమునకు వచ్చునాదేశము. (చూ. తీవంచ. శ. ర.)

తీంట్రము. దే. వి. దురద,కండూతి. "సీ...తీంట్రమ్ము కని తీఁట,..దురద యనఁగఁ బరఁగు." ఆం. భా. ద్వి. ౧౫౯.

తీండ్ర. వై. వి. (సం. తీక్ష్ణమ్). 1. వేఁడిమి. "గీ. అతివ పూర్ణేందుభీతిఁ దదశ్మసాలఁ, జెండి యతఁ డందు నినుమడితీండ్ర వోఁవ." అము. ౫, ఆ. ౧౪౬; 2. తేజస్సు. "గీ...నిగమకర్మ, తీండ్రఁ బుండ్రేక్షుకోదండుతండ్రిఁ బోలి, పరమధామంబు నకుఁ బోవుపథమునందు." పాండు. 3, ఆ. ౧౧౦; 3. తమి. "శా...మదిక్, దీండ్ర ల్గల్గినవారి కేకరణినేని న్విద్య రాకుండునే." స్వా. ౫, ఆ. ౧౭. పాండు. ౨, ఆ. ౨౦౮; 4. ప్రతాపము. "ఉ...మీ, తండ్రి...పెక్కుండ్రనిశాటులం దఱిమి కౌశికదైత్యుని నుక్కడంచె న్నా,తీండ్ర యొకించుకేని వలదే..."రాజ. చ. ౨, ఆ. ౧౯. నార. 3, ఆ. ౧౯౯; 5. ఉద్వేజనము, ఓషధి విశేషము. "సీ...తీండ్ర యంచనఁగ నుద్వేజనమగు." ఆం. భా. ద్వి. ౬౬. హంస. ౪, ఆ. ౧౦.

తీండ్రము. దే. విణ. (సం. తీక్ష్ణమ్.) 1. తీక్ష్ణము, ప్రచండము. "క. తీండ్ర మగురోషమున మీ, తండ్రినిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్, వేండ్రము విడువఁడు..." భాగ. ౭, స్కం. 3౪౫. ఆం. భా. ప్ర. ౧౪; 2. తరుణము, పదును. "గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కుడిరసజ్ఞుఁ, డీండ్ర నరకని కిటువంటితీండ్రవయసు, టూర చూపులనేరహంతకారిఁ దెచ్చి,యాలుగాఁ గూర్చి పాపాత్ముఁ డాయె నహహా." సురా. ౯౯.

తీండ్రించు. వై. అ. క్రి. 1. ప్రకాశించు, వెలుఁగు. "గీ. ప్రాగ్దిశాకాంత నిండుగర్భంబునందు, సూర్యుఁ డుదయింపఁ బొడ్దులు సొచ్చి యుండ,మొదలఁ దీండ్రించుతేఁతకొమ్మొలకయొండ, నింగియింగిలికాన నర్యంగ మార్చె." కాశీ. ౧, ఆ. ౧౨౪. స్వా. ౬, ఆ. 3౯; 2. ప్రజ్వలించు. (శ. ర.) "సీ. చంద్రనిప్పులువోలెఁ దీండ్రించుకనుమించు లెసఁగ నొండొంటిపై నెక్కుఁబాఱు." స్వా. ౪, ఆ. ౧౭. స. క్రి- మెలివెట్టు, దువ్వు. "సీ. చర్మమెత్తుదుము లోపమున విలాసములుఁ దీండ్రించు ధీరచమూరరిపులనైన." హ. స. ౨, ఆ. ౧౯.

తీండ్రింపించు. వై. స. క్రి. (తీండ్రించు ధా. ప్రే.) ప్రకాశింపఁజేయు. "సీ. అద్దమరేప్రొద్దు ప్రొద్దు తీండ్రింపఁ గుండేటికోదమకుఁ గొమ్మచూప." సుద. ౪, ఆ. ౨౫.

తీండ్రిలు. వై. అ. క్రి. అతిశయించు, పెరుగు. "గీ. ...విజయ,రామరాజు వసుంధరారమణిఁ గాంచి, తాండ్రపాపయకోపంబుఁ దీండ్రిలంగ." రంగా. 3, ఆ. ౨౫౪. భీమ. 3, ఆ. ౯౨.

తీఁగ. వై. వి. (సం. దీర్ఘా. క. తీగె.) 1. లత,వల్లి. "గీ. కన్నె క్రొక్కాఱుమెఱుఁగుఁదీఁగయును బోలె." నైష. 3, ఆ. ౧౧. (శ. ర. పా. తీగ మ్రుద్రి. పా.) దశ. ౯, ఆ. 3౧; 2. స్త్రీలు మెడను ధరించునొకవిధమైనబంగారునగ. "ఉ. శోణితలేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బఱతెంచె నుల్లస,ద్వేణిభరంబుతో మొగపుతీఁగ వలగ్నమునం దమర్చి యొడ్డాణము తీఁగఁగా నిడి మెడన్వలగో నది చాలమిన్ గొనల్,పాణుల నుండఁ గొను మఱి బాగుగఁ గానుకపట్టుకైవడిన్." కళా. ౧, ఆ. ౧3౯. ఆం. భా. తృ. ౫౫; 3. వీణ మొదలగువానితంతి, "సీ. తెలివివెన్నెలవెండితీఁగలు నిగిడించుచదలుకమ్మచ్చుబెజ్జము లనంగ." పారి. ౨, ఆ. 3౬; 4. యోగులు దాల్చురుద్రా

హారాదికంఠమాల. "క. వేళాకోళపుఁదీఁగలుఁ, జేళి కలుఁ కళానములుఁ బిఱజడలు దాఁ,దాలుచు టెట్లో కో మింటక్, లీలాహారిఁ బోల నింత నేర్పరి యయ్యెన్." కళా. ౩, ఆ. ౭౨; 5. మొల నూలు. "ఉ. కట్టిరి సన్నపుందనుపుఁగానిఁ గటీతటి మేటితీఁగపై, నొట్టిరి." విక్ర. ౪, ఆ. ౧౬౦.

తీఁగఁబోఁడి. ద్వ. వి. (తీఁగ+పోఁడి.) మనోజ్ఞురాలగుఆఁడుది; ఆఁడుది. "ఉ. ఈయొలదీఁగఁబోఁడిఁ గృపయించుక కల్గక విక్రయించు టన్యాయము మేదినీపతికి..." హరిశ్చ. ౪, ఆ. ౧౭. ద్వా. ౪, ఆ. ౨౦౩. [(శ. ర.)

తీఁగకానుగు. ద్వ. వి. (తీఁగ+కానుగు) మర్కటిచెట్టు.

తీఁగగలిక. ద్వ. వి. (తీఁగ+గలిక) గండాలి, మహాధూర్వచెట్టు. (అభిధానరత్నమాల.)

తీఁగజాజి. వై. వి. (తీఁగ+జాజి) ఒకజాతిజాజిచెట్టు. (శ. ర.) [(శ. ర.)

తీఁగతుమడి. ద్వ. వి. (తీఁగ+తుమడి.) దీర్ఘమాలచెట్టు.

తీఁగతెంపు. ద్వ. విణ. (తీఁగ+తెంపు.) తెంపులేనిది, అవిచ్ఛిన్నము. "సీ. విశ్వంబు నెవ్వనివిపులక్రియాశక్తిఁ దిరుగుచున్నది తీఁగతెంపు గాఁగ." కాశీ. ౫, ఆ. ౯౪.

తీఁగనవ్వు. ద్వ. వి. (తీఁగ+నవ్వు.) దీర్ఘహాసము. "సీ. పయ్యెద దిగజార్చి పాలిండ్లు సవరించు దిస్సువాఱఁగ నవ్వుఁ దీఁగనవ్వు." క్రీడా. ౭౮. రాధా. ౫, ఆ. ౧౧౨.

తీఁగపాల. ద్వ. వి. (తీఁగ+పాల.) క్షీరావిచెట్టు. (శ.ర.)

తీఁగపేరికల్కిమగఁడు. ద్వ. వి. వల్లీదేవిభర్త, కుమారస్వామి. ఆం. భా. ప్ర. ౪౪.

తీఁగమల్లియ. వై. వి. (తీఁగ+మల్లియ.) ప్రాఁకిపూచునొకజాతిమల్లెచెట్టు. "మ. సోరిదిం జేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులుం బుష్పమం,జరులున్..." ఆము. ౧, ఆ. ౬౬.

తీఁగమల్లె. వై. వి. (తీఁగ+మల్లె.) 1. ఒకజాతిమల్లియ. బ. ధాన్యవిశేషము. "సీ. బలుతీఁగమల్లె లుపార్జించి తిమిచాలఁ గుసుమములఁ జులుకగాఁ గూర్చలేమె." కవిక. ౧, ఆ. (శ. ర.)

తీఁగమెఱుఁగు. ద్వ. వి. (తీఁగ+మెఱుఁగు.) 1. ఊఱుము లేనిమెఱుఁగు, ఉ. విద్యుల్లత; 2. ప్రొద్దు తిరుగుడుచెట్టు. (శ. ర.)

తీఁగమోడి. ద్వ. వి. వ్రాతపని. (శ. ర.)

తీఁగయెలుఁగు. ద్వ. వి. (తీఁగ+ఎలుఁగు) హ్రస్వస్వరము, సన్నని యెలుఁగు. "ద్వి. అని తీఁగయెలుఁగున నా కోమలాంగి, ఘనసారఘుఁ జెక్కుని దా నేమ్ము కొనుచు." ద్వి. నల. ౪, ఆ. ౩౯౩. పు.

తీఁగలువాఱు. ద్వ. అ. క్రి. (తీఁగలు+పాఱు.) ప్రసరించు,వ్యాపించు. "ఉ. తీఁగలువాఱుపార్శ్వశశధరదృష్టిఁ దగం గలయంగఁ జూచినన్." కవిక. ౬, ఆ. ౯౧.

తీఁగవిలుకాఁడు. ద్వ. వి. మన్మథుఁడు. "గీ. తుంట విల్కాఁడు మరుఁ డించువింటివాఁడు, దీఁగవిలు కాఁడు వలరాజు..." ఆం.భా. ప్ర. ౪౫.

తీఁగవిలుతుఁడు. = తీఁగముకాఁడు. (శ. ర.)

తీఁగియ = తీఁగ. (లత,వల్లి.) "గీ. అలరుఁ దీఁగియతో సుద్ది యైనయట్టి, కొమ్మునెమ్మేనువలపులు గొలుపు టరుజు." కవిజ. ౧, ఆ. ౭౮.

తీఁగె = తీఁగ. (లత,వల్లి.) "మ. జిగిమైసొంపును దమ్మిమైమఱుఁగు రాచెంగల్వచేకత్తియుఁ, సిగపూమొగ్గలతాయెతుల్ చిగురుకానెం జెక్కునం జాలఁ బొల్పగుమఙ్ గేదఁగి రేకువంకయును జాయల్ మీఱఁగాఁ బువ్వుదీఁ,గెగుబెం దావలరాచయొంటరి కడుం గేడింపుచుం జిమ్మనన్." య. ౫, ఆ. ౭౪. అని. ౫, ఆ. ౭౦.

తీఁగెచుట్టు. ద్వ. వి. (తీఁగె+చుట్టు.) లతవలె చుట్టుకొనుట. "చ. తొలితొలి కిచ్చుధారల కెదురొక్కని తచ్చుటఁ దీఁగెచుట్టుగా,నలముచు ధాత్రి వేచి బొలుపారె మలీమసబాష్పవల్లు లత్తొలితొలిధారకే వెఱచి తోనె ఘనోఘము వానకాల్గకుం, బలరిపుఁ డాలయాభ్రము లభంగిసె సంకెల లూడ్చె నో యనన్." ఆము. ౪, ఆ. ౧౪.

తీఁగెతెంపు. ద్వ. విణ. (తీఁగె+తెంపు.) అవిచ్ఛిన్నము, ఎడతెగనిది. "గీ. ఇట్లు దిశలెల్లఁ దానయై యెసకమెసఁగు, నమ్మహీరుహవరము డాయంగ వచ్చెఁ, దీఁగెతెంపుగ రజతాద్రిదిక్కునందు,నుండి ఖేచరమిథునంబు లొక్కమొగిని." ఉద్భ. ౧, ఆ. ౧౩౧.

తీఁగెబచ్చలి. ద్వ. వి. (తీఁగె+బచ్చలి.) కలంబిచెట్టు. "సీ...తీఁగెబచ్చలి యనఁగఁ గలంబ్యాఖ్యయలరు." ఆం. భా. ద్వి. ౭౬.

తీఁగెమల్లె = తీఁగమల్లియ. వై. వి. (బ. ధాన్యవిశేషము.) "సీ. మండిగండ్రలం నాగమల్లెలు తీఁగె

మల్లెలు కృష్ణనీలాలు వెలువఁడాలు." హంస. ౪, ఆ. ౧౭౮. ప్రబంధ. ౧౧౭.

తీఁగెమెఱుఁగు. ద్వ. వి. (తీఁగె+మెఱుఁగు.) ఉఱుము లేనిమెఱుఁగు, విద్యుల్లత. "ఉ. పాడితి పాన్పు పైఁబడినపద్మనిదేహముఁ బొందె జీవుఁ డా, చేడెలు చూడ మేఘమును జెందినతీఁగెమెఱుఁగు చాడ్పు నన్." హ. రా. ౨, ఆ. ౯౯.

తీఁగెయిమ్ము. ద్వ. వి. (తీఁగె+ఇమ్ము) పొదరిల్లు, నికుంజము. "సీ. తీఁగెయిమ్ముల నెమ్మి సోఁగలించుక గన్నుమాళిపించు మటంచు మమతఁ బొందు." ముకుంద. ౨, ఆ, ౧౩౨. ఇట్లే తీఁగెమెఱపు. ప్రబంధ. ౧౯౦.

తీఁగెలువాఱు. ద్వ. అ. క్రి. (తీఁగెలు+పాఱు.) అధికమగు, విస్తరించు. "సీ. ముదిమి తీఁగెలువాఱి ముంచినకై వడిఁ గడు మేన నరములు గానిపించు." నీతి. ౯౦.

తీఁగెలుసాఁగు. ద్వ. అ. క్రి. (తీఁగెలు+సాఁగు.) తీఁగ వలె నగు. "చ. నిడుదమధూళికల్ నడుమనే కొని తీఁగెలుసాఁగ..." ఆము. ౫, ఆ. ౧౨౩.

తీఁగెసాఁగు. ద్వ. అ. క్రి. (తీఁగె+సాఁగు.) 1. దీర్ఘమగు, అధికమగు. "ఆ. గబ్బిగుబ్బచన్నుఁగవమీఁది పయ్యెద, జాఱఁ ద్రోచుఁ దీఁగెసాఁగ నవ్వు." వి. పు. ౬, ఆ. ౧౯. య. ౫, ఆ. ౯౨; 2. నిక్కు, నిగుడు. "సీ. కడుఁ దీఁగెసాఁగుచు బడుగునెన్నడుము మిక్కిలి కృశంబుగఁ దత్తఱిలుచు నిక్కి." కళా. ౭, ఆ. ౭౬.

తీఁట. దే. వి. (క. తీటె.) 1. దురద, కండూతి. "మ...హరి కూర్మరూపమున నద్రిం దాల్చెఁ దత్పర్వత భ్రమణవ్యాజత వీఁపుఁదీఁట శమియింపం జేయఁగా నారదా." భాగ. ౨, స్కం. ౧౪౬. ఆం. భా. ద్వి. ౧౭౯; 2. ఒకవిధమైన గజ్జి. (శ. ర.) [దూలగొండి. (శ. ర.)

తీఁటకసింద. దే. వి. (తీఁట+కసింద.) కచ్ఛుర, రేగడి

తీఁటకసివింద. దే. వి. (తీఁట+కసివింద.) కచ్ఛుర, రేగడిదూలగొండి. "సీ...కచ్ఛురాఖ్యగ విరాజిలుఁ దీఁటకసివింద యన..." ఆం. భా. ద్వి. ౫౪.

తీఁటకోవెల. దే. వి. (తీఁట+కోవెల.) దూలగొండి, కండూకరి. "సీ. దూలగొండి యనంగ దురద గొండి యనంగఁ దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ, గండూకర..." ఆం. భా. ద్వి. ౫౪.

తీఁడిరించు. దే. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగు. "గీ. తిమిరపుంజంబుఁ దల్ద్రొక్కి తీఁడిరించుచంద్ర కిరణకుమారకచ్ఛాయ యనఁగ." సాంబో. ౫, ఆ. ౨౫౬. కాశీ. 3, ఆ. ౨౩౪.

తీఁపురము. దే. వి. అగడము, అకృత్యము. "క. దాఁపురము లేక యాక్రియఁ, గాఁపురములు సేయుచున్న గరితలలో నీఁ తీఁపురములు వాక్రుత్తురె, కాఁపుల నినువంటివారిఁ గానవె తులువా." వేం. పంచ. ౪, ఆ. ౪౬౭.

తీపు. దే. వి. భోగము, సుఖము. "ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులం, దీపులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు నూపెడివిష్ణుమాయ .." భాగ. ౬, ఆ. ౪౨౧. ప్రభులిం. ౪, ఆ. ౧౧౪. పు.

తీక్ష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. వస; 2. దూలగొండి; 3. ఒకజాతిఅడవిదబ్బ; 4. మానేరు. సర్పవిష మును బోగొట్టునొక లత.

తీక్ష్ణకంటక. సం. వి. ఆ. స్త్రీ. కందారి.

తీక్ష్ణకంటకము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త; 2. తుమ్మ; 3. గార; 4. వెణుతురు. పుం. న. వాఁడి యైనముల్లు. విణ. (అ. ఆ. అ.) వాఁడి యైనముండ్లు కలది.

తీక్ష్ణకందము. సం. వి. అ. పుం. ఉల్లి.

తీక్ష్ణగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. వస; 2. తెల్లావ; 3. చిట్టేలకి.

తీక్ష్ణగంధము. సం. వి. అ. పుం. 1. మునగ; 2. రక్తతులసి.

తీక్ష్ణతండుల. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

తీక్ష్ణతుండము. సం. వి. అ. పుం. దోమ, మశకము.

తీక్ష్ణదంష్ట్రము. సం. వి. అ. పుం. పులి, వ్యాఘ్రము. విణ. (అ. ఆ. అ.) వాఁడి యైనకోఱలు కలది.

తీక్ష్ణధారము. సం. వి. అ. పుం. కత్తి, ఖడ్గము. విణ. (అ. ఆ. అ.) వాఁడి యైనవాదర కలది.

తీక్ష్ణపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. కేతకి, మొగలి.

తీక్ష్ణపుష్పము. సం. వి. అ. న. 1. గాటైనపువ్వు; 2. లవంగము. విణ. (అ. ఆ. అ.) గాటైనపువ్వులు కలది.

తీక్ష్ణము. సం. వి. అ. పుం. 1. మిరియము; 2. పిప్పలి; 3. నల్లావ; 4. తెల్లదర్భ; 5. యవక్షారము. న. 1. వేఁడిమి; 2. కారము; 3. విషము; 4. ఇనుము; 5. యుద్ధము; 6. మరణము; 7.

ఆయుధము; 8. సముద్రపుటుప్పు. విణ. (అ. ఆ. అ.) 1. వాఁడియైనది; 2. చుఱుకైనది; 3. క్రూరము; 4. సఫలమైనది.

తీక్ష్ణాంశువు. సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

తీగ. దే. వి. చెఱువుకట్టులోపలిపొలము, తోట్టు. "సీ. తోట్టు నాఁ దీగ నాఁ దోఁచుచుండుఁ దటాక పూర్వదేశాభిధ..." ఆం. భా. ప్ర. ౧౬౩.

తీడు. దే. స. క్రి. 1. వాఁడిచేయు, పదునుపెట్టు. "గీ...ఆయశోనిధికి నిడెౕసానఁ దీడినమన్మథాస్త్రములవంటి, హరిణలోచన లమృతదివ్యాశనములు." సాంబో. ౨, ఆ. ౫౩. నరస. ౩, ఆ. ౩౧; 2. మెలిపెట్టు, త్రిప్పు. "స్రగ్ధర...మిథ్యావాసాంకూరోద్గమం బాస్యమున మెఱయ నేత్రాంతముల్ గోరు బాఱన్, మీసంబుల్ దీడి పల్కన్ మృగపరివృఢగంభీరనాదంబుతోడన్." వరాహ. ౩, ఆ. ౨౦. వరాహ. ౬, ఆ. ౧౦౯; 3. చీల్చు. "ఉ. వాఁడిమెఱుంగుగోట జనవల్లభనందనుఁ డొక్కఁ డెంతయున్, దీడెను గేతకీదళము..." ఇందు. ౫, ఆ. ౧౧౭; 4. చిమ్ము, వెదచల్లు. "గీ. వెదకి పుప్పొడిఁ జిదుముతుమ్మెదలఁ గదుము, ఫలరసంబులఁ జీల్చుఁ జిల్కలను బిల్చు, సిరులు నలుదిక్కులను దీడి చెలులఁ గూడి, బాళి నుప్పొంగి చంద్రమతీలతాఁమ." ఉ. హరిశ్చ. ౩, ఆ. ౧౫. కకు. ౫, ఆ. ౧౨౩; 4. (పండ్లు) కొఱుకు. "ద్వి. వాఁడికోఱలఁ దీడి వడి నాడు గఱచి." ద్వి. హరిశ్చ. పూ. ౨౯౬.

తీడుకొను. దే. స. క్రి. (తీడు+కొను.) వాఁడిచేసికొను, పదునుపెట్టుకొను. "గీ. రాజసంబున నలరాచరాచవాఁడు, దేఁటిఱెక్కలఁగఱి యమ్ముఁ దీడుకొనఁగ." నైష. ౬, ఆ. ౬౫.

తీతువ. వై. వి. (సం. తిత్తిరిః.) తిత్తిరిపక్షి. 'సీ. తీతువ యనఁగను దిత్తిరి..." ఆం. భా. ద్వి. ౯౨. హంస. ౩, ఆ. ౧౨.

తీతువు = తీతువ. "సీ. తను నేలుదొర చిత్తమున మెచ్చఁ దీతువుఁ జని పట్టె బిట్టొక్కఁడా రెడ్డేఁగ." స్వా. ౪, ఆ. ౫౯.

తీదీపు. దే. వి. (తీపు+తీపు.) 1. తీవ్రబాధ. (చూ. తీదీపుచేయు; 2. ఒఱయిక, రాపిడి. "మ. గగనద్వీపవతీశుఁ డ్రచ్చుటకుఁ దన్ గైకొన్న తీదీపు పెంపగ వాటిల్లువ్యథాతిరేకముఁ ఘ్రాతొక్కరంబు గాపించుజిహ్వాగభూపల్లభుకోఱల స్నిగ్ధమహామజ్యోతులో నాఁగ..." లక్ష్మీ. ౨, ఆ. ౭౧.

తీదీపుచేయు. ద్వి. స. క్రి. (తీదీపు+చేయు) బాధపెట్టు. "ద్వి. సారంగధరుఁ జేరి సారమేయములు, చిటిలిబిట నఱికట్టి చీకాకుపఱుచు, తెఱఁగున నదలించి తీదీపుఁజేసి, ఘనతరకాలోరగము చుట్టిపట్టు, కొను గారడీఁడులాగున జుట్టి పట్టె." నవనాథ. ౨, ఆ. ౯౯ పు.

తీనియ. దే. వి. అరుఁగు, వితర్దిక. "మ. నెలతా తీనియ మేనుఁ జేర్చి కలకంఠీరత్న మేడ్చెం ..హాసల కాషాయవిలోచనాశ్రుకణముల్ గుప్పించి..." చంద్రా. ౫, ఆ. ౭౦. ఇందు. ౩, ఆ. ౭౭.

తీపాడు. దే. అ. క్రి. (తీపు+ఆడు.) ఇంపగు. "ఉ. సోయగముం దమకంబు పెల్లు తీపాడఁగ దీని వంటియొఱ పైపమిటాని జూడ మొదులన్." విజ. ౨, ఆ. ౧౦౨.

తీపారు. దే. అ. క్రి. (తీపు+ఆరు.) ఇంపారు, మనోజ్ఞమగు. "చ. తెలినవ్వుల్ వెలిదమ్మి నెమ్మొగములుం దీపార..."హరి. పూ. ౭, ఆ. ౧౧౨. భార. విరా. ౨, ఆ. ౧౧౮.

తీపి. దే. వి. 1. మాధుర్యము, మనోజ్ఞత. "గీ. శిష్టజనసూక్తు లవి పెడచెవులఁ బెట్టి, తెఱవ సురత ప్రియోక్తుల తీపిఁ గోరు." విక్ర. ౩, ఆ. ౪౧; 2. ఇచ్ఛ, కోరిక. "క. మదియనిలి రెండు చిక్కను, బ్రదికెదుతీపియును విషయపక్షస్పృహయున్." భాగ. ౯, స్కం. ౫౭౮. సుద. ౨, ఆ. ౫౮; 3. ఒకరుచి. (శ. ర.) విణ. తియ్యనిది, వ్యవ:—తీపిపదార్థము లెక్కువగా తినరాదు.

తీపు. దే. వి. 1. తియ్యఁదనము, ఒకరుచి. "మ. ఉరువజ్రంబు శిరీషపుష్పములచే నూహించు భేదింపఁ దీపు రచింపన్ లవణాబ్ధికిన్ మధుకణంబుం జింద యత్నించు నిద్ధరణిన్ మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్."భర్తృ. ౧, ఆ. ౬. పార్వ. ౫, ఆ. ౧౮౦; 2. మనోజ్ఞత. "వ... సముత్తుంగశృంగాటకనటన్మయూరంబులకోపులతీపులఁ జూపుల నిలుపుచు..."వరాహ. ౩, ఆ. ౬౪; 3. కోరిక, అపేక్ష. "శా... ఇచ్చోఁ బాసి దేహంబుపై దీపుం జీకటి యింతకంటె వర మేదీ యిట్టు మన్నింపవే." కాశీ. ౩, ఆ. ౧౨౩; 4.

(తీయు ధా.) యాతన, వేదన. "సీ. తెల్లగుడ్డులు తేలగిల్లి తీపులు పుట్టి దోషముల్ పొందుగఁ దొట్టగిల్ల." కవిక. ౫, ఆ. ౧౧౧. శుక. ౨, ఆ. ౨౦౫. విణ. 1. తియ్యనిది, రుచ్యము. "గీ. నారి కేళాసవపుఁదీపుటూరు పోలయ." అము. ౨, ఆ. ౬౧. విప్ర. ౫, ఆ. ౧౫; 2. ఇష్టము, ప్రియము. "సీ. నరులకు నధిప ప్రాణంబుకంటెను రూపింప నర్థంబు తీపు వినవె." భార. ఆర. ౬, ఆ. ౧౧౧. భార. భీష్మ. ౧, ఆ. ౧౫.

తీపుఁద్రాడు. దే. వి. (తీపు+త్రాడు) వేఁట కుపయోగించుసాధనవిశేషము. "వ. ఉరులు నురిగోలలు బోనులుఁ జిక్కాంబులు జిగురుఁగండెలుఁ దీపుఁద్రాళ్లు నొడిత్రాళ్లుఁ దలముళ్లును గొని..." కాశీ. ౩, ఆ. ౪౬.

తీపులాఁడి. దే. విణ. (తీపులు+ఆఁడి) మాధుర్యము గలది. "సీ. మోవిపానక మిచ్చి మోహదంభక తృష్ణఁ దీర్పు మిప్పుడు మోవితీపులాఁడి." బిల్హ. ౨, ఆ. ౧౩౨.

తీపులాఁడు. దే. విణ. (తీపులు+ఆఁడు) మాధుర్యము కలవాఁడు. "సీ. తేఁటికదుపులకును దేనెతోఁ బుష్పాఢి, మేపి మరప నేర్చు తీపులాఁడు." ద్వా. ౩, ఆ. ౧౨౬.

తీపులుఁగొను. దే. అ. క్రి. (తీపులు+కొను) వేడుక పడు. "వ. ఎప్పు డాజగదేకమాత సీతం దొడ గాంచెదనో యనుచుం జూపులు తీపులుగొనం జని..." భా. రా. సుం. ౧౩౧.

తీయ. దే. విణ. 1. తియ్యనిరుచి గలది. (దీనికిఁ గర్మధారయమందు నిగాగమము వికల్పము.) "గీ. తీయవిలుఁ జేమగమి దొల్చి లినియొనేని,..., బట్టబయ లగు గర్వరేఖ, విషమసాయక విచ్ఛేయుం విడిదలకును." పి. శకుం. ౩, ఆ. ౧౯౦. చంద్రా. ౩, ఆ. ౫౯; 2. మనోజ్ఞము. "ద్వి. చిఱుత నవ్వులు తీయచెయుఁవ్వలు గల్గు, తెఱవలు వలరాజు దీమంబు లనఁగ." రం. రా. ఉ. ౧౧౦. పు.

తీయన. దే. విణ. 1. తియ్యనిది, మధురము. "క. కమలాక్షి ప్రేళ్లతోడుత, నములుదురే చెఱకు తీయన గదా యనుచున్." రుక్మా. ౫, ఆ. ౧౨౨. అము. ౫, ఆ. ౧౦౯; 2. ప్రియము. "చ... బ్రతు కింత తీయనె..." భా. రా. యు. ౨౮౪.

తీయము. దే. వి. 1. ప్రియత్వము. "క. పీయము వారికి నిట్లు ద, పీయముగా నుండి వచ్చి విపుల శ్రమముల్, దీయ ముదం బొనరిచి కడుఁ, దీయము కనుపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్." విజ. ౩, ఆ ౧౮౧; 2. మనోజ్ఞత. "ద్వి. తీయమై పద్మ మేలిమి చూపువోలెఁ, దీయమై యైరమ్మ దీయమో న్నాఁగ." ద్వి. పరమ. ౧, ఆ. ౧౧. పు.; 3. ఆసక్తి, శ్రద్ధ. "క. ఈయంబరీషచరితముఁ, దీయంబున విన్నఁ జదువ నీసంపన్నుం, డై యుండు..." భాగ. ౯, స్కం. ౧౫౩; 4. సాంత్వనవాక్యము, బుజ్జగింపుమాట. "సీ. సాంత్వన సంజ్ఞయై చనుఁ దీయ మనఁగను..." ఆం. భా. ప్ర. ౧౧౨.

తీయు. దే. అ. క్రి. 1. తగ్గు, క్షీణించు. "మ... శశిబింబస్ఫూర్తి తగ్గె న్నవోత్పలకాంతుల్ రహిఁ దీసె దాఁగె విరు లంత స్తహ్వరాంతమ్ములన్." విప్ర. ౩, ఆ. ౪౯. నా. పంచ. ౧, ఆ. ౩౦; 2. పోవు. "క. పీయము వారికి నిట్లు ద, పీయముగా నుండి వచ్చి విపులశ్రమముల్, దీయ ముదం బొనరిచి కడుఁ, దీయము కనుపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్." విజ. ౩, ఆ. ౧౮౦. స. క్రి. 1. ఈడ్చు. "సీ. కదిసితో మునిగాలు గఱచి వెంబడిఁ దీయుఁ దీసి తోడనె తేవఁ దెరువు గట్టు." చంద్రా. ౨, ఆ. ౯౧; 2. కొను, పుచ్చుకొను. "చ. విటులఁ గలంచి తీయఁ దగువిత్తము లుత్తమ వారకాంతకున్." విప్ర. ౪, ఆ. ౨౩; 3. లాగు, ఆకర్షించు. "శా. చండాశివిషఘోరసాయకము చంచజ్జ్యాసమేతంబుగా, నిండారం దగఁ దీసి లోకములు ఘూర్ణిల్లంగ రామక్షితీశుం డాస్ఫోటన సేసె..." భా. రా. కిష్కిం. ౨౮. సా. ౨, ఆ. ౪౨; 4. తొలఁగించు, లాగివైచు. "గీ. చెలువపయ్యెదఁ బుజకంబుచేత నదిమి, రవికె సడలింపఁ దిలకించి రమణుఁ డెంత, సిగ్గరివె యంచుఁ బైటఁ దీసినను వేగఁ, గరయుగంబునఁ జనుదోయిఁ గప్పుకొనుచు." దశా. ౩, అ. ౨౬. హరిశ్చ. ౪, ఆ. ౧౧౮; 5. డించు. "చ.. మరుండు తుంట విల్, బలువిడి నెక్కుఁదీసె..." నీలా. ౩, ఆ. ౪౪; 6. తెచ్చు. "చ. నెటికలు దీసి యుచ్చకము నేర్చి ప్రసంగము దీసి యప్పటప్పటికి నులించి ..." విప్ర. ౪, ఆ. ౨౩. చం. రా. ౬, ఆ. ౨౨;

7. పట్టుకొను, వశపఱచుకొను. "ఉ...ఎంతయు శక్యము గానిదుర్గ మా,భూవరమాళి గాంచి యొక పూఁటనె దీసెద నంచు నుగ్రుఁడై." కృష్ణ. 3, ఆ. ౧౯; 8. వేఱుచేయు, విడిగా నుంచు. "చ... పచనంబు చేసి యే ర్పడ మఱి యంతలోఁ నతిథి భాగము తీసి లతాంగి భర్తకుం, గుడువఁగఁ బెట్టి..." కుచేల. ౧, ఆ. ౩౪; 9. ఆలాపించు, కొన సాగించు. "గీ. రాగములు దీసి పాడుచు రమణ వచ్చి." భా. రా. బాల. ౬౬; 10. (ప్రేళ్లసంధులను) విఱుచు. "చ. నెటికలు దీసి యుచ్చకము నేర్చి..." విప్ర. ౪, ఆ. ౨౩; 11. తెఱచు. "క...చని దిగ్గనఁ దల్పు దీసి సంభ్రమ మెదవన్." విప్ర. ౪, ఆ. ౬౩; 12. వ్యవ. ఉదా:- వాఁ డాగోయి తీసినాఁడు.

తీరము. సం. వి. అ. న. దరి, గట్టు. పుం. తగరము.

తీరితము. సం. వి. అ. న. తీర్పు, వ్యవహారాదులపరిష్కారము. విణ. (అ. చ. అ.) పరిష్కృతము, తీర్పఁబడినది. (వ్యాఖ్యము. మొ.)

తీరు. దే. అ. క్రి. 1. నెఱవేఱు, సిద్ధించు. "ఆ. వేగ పడుట మేలె వినుము కార్యము దీరుఁ, దీరకుండు..." భార. ఉద్యో. 3, ఆ. ౨౨౦. స్వా. ౪, ఆ. ౭౦; 2. తగు. "క. తగ వెఱుఁగ లేక యిటు వలెఁ, దెగువరివై పలుక నీకె తీరెనొ..." చంద్ర. ౧, ఆ. ౧౪౭; 3. శక్తికమగు. "ఉ. తీరినత త్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించుచాడ్పునన్, దీరనిత త్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించువాఁగెఁ బెం,పార బిగించి..." చంద్రా. ౨, ఆ. ౧౩. ఉ. హరి. ౪, ఆ. ౨౭; 4. పరిష్కృతమగు, కుదురు. "గీ. జ్ఞాతులకు మాకు నేకార్థ సంగతులకుఁ, బాలు తీరనియర్థంబు పంచి యిమ్ము." భాగ. ౮, స్కం. ౩౦౧; 5. పదనెక్కు, మెఱుఁగెక్కు. "ఉ...అవారితసత్కవికల్పనావిభూ,షావహపూర్వవృత్తములు సానలఁ దీరినజాతిరత్నముల్." వసు. ౧, ఆ. ౧౯. సా. ౨, ఆ. ౧౧౩; 6. శక్యమగు. "శా. నాకేశప్రియనందనుఁ జెనకి మానప్రాణముల్ గావఁగా, నీకుం దీర్చునె.." నిర్వ. ౭, ఆ. ౭౬. వి. 1. సౌందర్యము, అందము. "చ...క్రొమ్మొగులువన్నియఁ గేరును గొప్పుతీరు..." నీలా. ౨, ఆ. ౧౯. హరి. పూ. ౯, ఆ. ౮; 2. విధము. "క. వార్తలజగడపుమాటలు, తీ రిది వే

రేమి లేదు జేవి యనఁగ..." కువల. ౪, ఆ. ౧౭౦. వాల్మీకి. ౧, ఆ ౧౩; 3. హద్దు, అవధి. "గీ. అమితేచ్ఛగు గుహ్య యొయ్యారములకుఁ, దీరు..." నీలా. ౭, ఆ. ౨౭. విణ. చక్కనిది, సుందరము. "వ...గీ రయునవరత్నఘటితకవాట వేహళీవిశేషంబులు..." ఉ. రా. ౧. ఆ. ౧౩౮. హంస. ౪. ఆ. ౧౬౩.

తీరుకు. దే. వి. నాట్యగతిభేదము. "గీ. కోపు లన సారు లనఁ దీరుకు లన వెలసిం, నాట్యగతిభేదములపేళ్లు..." ఆం. భా. ప్ర. ౧౩౦.

తీరుచు. దే. స. క్రి. (తీరుధా. ప్రే.) 1. సవరించు, సరిదిద్దు. "మ. అలకల్ కీరిచి ముద్దువెట్టుకొని సయ్యాటంబునన్ జంటివై, జిలుగుంబయ్యెద కొంగు జార్చి..." పళా. 3, అ. ౮౦. విజ. ౧, ఆ. ౬౬; 2. కావించు, చేయు. "చ...చెంతఁ బొసంగెడిగంగలోఁ సమంచితమతి నిత్యకృత్యము లశేషము తీరిచి..." దశా. ౧, ఆ. ౯౨. జై. ౧, ఆ. ౧౩౭.

తీరుపు. దే. వి. (తీరుధా.) 1. అందము. "వ...కను రెప్పలకప్పు దప్పు నుండి బవరిత్తరితీపుచూపు చూపు తీరుపుల..." ప్రబంధ. ౭౮; 2. నృత్తగీతవాద్యములు సమముగా ముగించుట. "సీ. అభినయంబులకోపు లరుదైనతీరుపుల్ వెలయఁగాఁ బద చాళివిధ మొక్కర్తు." ఉ. రా. ౬, ఆ. ౧౩౯; 3. పరిష్కారము. (చూ. తీర్పు.)

తీరుమానము. దే. వి. పరిహారము. "గీ. అన్ని యిటులాడఁ గాంచి మురాసురారి,రమణి దాసరితప్పు దండమునఁ దీరుఁ,దీరుమాన మటరామని తెఱవ పాద,పద్మముల వ్రాలె నళి తమ్మి వ్రాలినటుల." రాధికా. ౪, ఆ. ౯౧.

తీరువ. దే. వి. విహితకృత్యము. "సీ. ఈ రేడుజగములవారలఁ బుట్టించుతీరువ యేవేల్పుపారుపత్తెము.." చంద్రి. ౨, ఆ. ౩౪; 2. కాపులు పంటపొలములకు నీరు పాఱించుకొన్నందుకై ప్రభుత్వమున కొసఁగుధనము, లేక ధాన్యము మొ. (శ. ర. వా.)

తీరువడు. ద్వి. అ. క్రి. తీరు+వడు.) అందమగు. "వ...హారముక్తాతారకంబులు నఖకోరకంబులం గీలి తీరువడం జేయుచు..." స్వా. ౨, ఆ. ౬౧. రం. రా. బాల. ౮౭ పు.

తీర్చు. దే. స. క్రి. (తీరుధా. ప్రే.) 1. నెఱవేర్చు, చేయు. "సీ. దృఢవేది యాతండు దీర్చు నెంతటి పని యైనఁ గైకొని..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౫౧. కాశీ. ౫, ఆ. ౨౧౮; 2. సవరించు, సరిదిద్దు. "సీ. జడలుగట్టియు నింత సక్కనైనది వేణి దీర్చిన నెఱి లెంత ద్రేణి యగునొ." కు. సం. ౭, ఆ. ౭. కవిక. పీఠి. ౨౧; 3. పరిష్కరించు; న్యాయమును నిర్ణయించు. "ఆ. అనియగని పోరు నర్థవిభాగంబుఁజూడ మనెడునట్టివారు పుట్టు, జనులు కోరి వచ్చి సభఁ జెప్పుదురు దీనిఁ, దెలియ నడిగి విభుఁడు దీర్పవలయు." విజ్ఞా. వ్యవ. ౧౭. భార. శాం. ౨ ఆ. ౩౭౪; 4. కనుఁగొను. "క. ఇచ్చెద నని సురశైలముఁ,దెచ్చియు శోధించి విలువఁ దీర్పఁగ నడుగక్, బుచ్చుకొనఁ దిరుగ నమ్మఁగ, నచ్చటఁ గలవైశ్యులందు నధముఁడె చాలున్." నిరం. ౧, ఆ. ౪౮; 5. సమాధానపఱచు. "క. హరివాక్యము వింటిరె యిది యిరువాఱుగులజనములకును హితమును ధర్మో, త్తరమును నై యున్నది యీ,వెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్." భార. ఉద్యో. ౧, ఆ. ౧౮. ఆము. ౩, ఆ. ౬; 6. సిద్ధింపఁజేయు. "ఆ. వేల్పు ప్రాణియందు వేడుకపడుకూర్మి, సతులకోర్కెఁ దీర్పఁ జాలి యపుడు." పారి. ౫, ఆ. ౨౩; 7. (అశ్వాదులను) శిక్షించి వశపఱచుకొను. "సీ. పెనఁగుశూకలములబిరుదుతనంబులఁ జలము డింపక తీర్పఁ జాలుటయును." భార. విరా. ౧,ఆ. ౯౫; 8. (తిలకాదులను) చక్కఁగా నుంచు. "సీ. నిటలభాగమునందు నిడుపోఁగతీరుగా మల్లెపూమొగ్గనామంబు తీర్చి." వైజ. ౨, ఆ. ౪౭. తీఱు. ధా. ప్రే.) 1. ఏర్పాటుచేయు; నిర్మించు. "చ... పెద్దకొల్వుదీర్చె నలువ యంచు నెంచి నడురేయి నిశాంతముఁ జొచ్చి యచ్చటన్." దశా. ౧, ఆ. ౨౬౩. హర. ౩, ఆ. ౬౬; 2. ఒగ్గు, పన్ను. "సీ. యంవమనోమృగరాజిఁ దవిలింపఁ దీర్చిన మదనవాగుర లిందువదనకురులు." నైష. ౫, ఆ. ౧౫; 3. అమర్చు. "గీ. దేవపూజోపకరణముల్ దీర్చుటకును." దశా. ౩, ఆ. ౩౪. కు. సం. ౩, ఆ. ౨౪౮; 4. (ఋణము) పరిహరించుకొను. "సీ. అనుదినంబును నంతకంతకుఁ బెరిఁగెడియధిపలిమన్ననయప్పు దీర్చ." భార. విరా. ౪, ఆ. ౨౦౫. హర. ౨, ఆ. ౧౧౯; 5. తొలఁగించు, పాపు. "మ. సకలస్తుత్యతపః ప్రభావనిధి యీసందేహముం దీర్పవే." ఉ. రా. ౩, ఆ.౭౪. నైష. ౭, ఆ. ౧౫౦; 6. కడపు. "క... తద్వనితయును మదనవేదన, దినశేషము దీర్చె యుంగముఁ దీర్చినభంగిన్." శుక. ౨, ఆ. ౩౭౭; 7. నిరుపయోగ మొనర్చు. "క. సర్పముఖశరము గల దను,దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు హరిపెం,పేర్పడఁగ నదియ కా దట, తీర్పవలయు వాని నెల్ల దీర్చుతరునకై." భార.ఉద్యో. ౨, ఆ ౨౭౩. కుచేల. ౧, ఆ. ౬౫; 8. చంపు. 'క. నిన్న యఱుసచ్చిపోయితి, వున్నయఱుతుం నేడు దీర్చి యుండిపెద నీక,ర్వోన్నతి..." భార. ఉద్యో. ౪, ఆ ౩౪౧. రామా. ౮, ఆ. ౧౬౫.

తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది; 2. స్నానముచేసినది.

తీత్రిపూదెలు. దే. వి. బ. కుండలపై చేయునలంకారవిశేషములు. "గీ. తీత్రిపూదెలు కులుకులు త్రేటగట్టు... మొదలు గాఁగఁ, బనులు నిర్మించు గుండలపై నతండు." హంస. ౫, ఆ. ౧౩.

తీర్థకరుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధుఁడు; 2. ముని; 3. విష్ణువు. విణ. (అ. ఈ. అ.) తీర్థమును నిర్మించినవాఁడు.

తీర్థమాట. మి. వి. (తీర్థమాడుధా.) స్నానము. "చ. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్థమాటకై, యరుగుచు ..కాశీ. ౫, ఆ. ౪౯.

తీర్థమాడు. మి. అ. క్రి. (తీర్థము+ఆడు.) స్నానము చేయు. "చ. పలఫల వేగ శేపకడ పంకజదీర్ఘికఁ దీర్థమాడి నెచ్చెలులును దాను నిందుముఖి శేషవిభూషణుఁ బూజసేయుం ని,చ్చలు..."కాశీ.౫, ఆ. ౧౪౪. జాహ్నవీ. ౧, ఆ. ౧౮.

తీర్థమార్చు. మి.స. క్రి. (తీర్థమాడుధా. ప్రే.) స్నానమాడించు, అభిషేకించు. "ఉ...చంద్రకళాధరఁ దీర్థమార్చు వి,స్రంభమునం గరాంబుకుహసంగత మంగళశాతకుంభకుం,భోంభితగంధసారరసయోగసుగంధనవాంబుధారలన్." కాశీ. ౬, ఆ. ౨౭౦.

తీర్థము. సం. వి. అ. పుం. న. 1. మహర్షులు స్నానాదులు చేసినదేశకటాకాదిపుణ్యోదకము; ఉదకము; 2. శేవు, ఘట్టము; 3. నూతియొద్ద నుండుతొట్టి;

4. పుణ్యక్షేత్రము; 5. యజ్ఞము; 6. శాస్త్రము; 7. ఉపాయము, మార్గము; 8. యోని; 9. స్త్రీరజస్సు; 10. అగ్ని; 11. ఉపాధ్యాయుఁడు; 12. మంత్రి; 13. పాత్రము, అర్హుఁడు.

తీర్థములాడు. మి. అ. క్రి. (తీర్థములు+ఆడు.) స్నానము చేయు. "శా...దుఃఖంబాఱ గోదావరీ వారిం దీర్థములాడి కాంచిరి జగద్వంద్యుం బురారాతి ద,క్షారామాధిపు భీమనాయకుఁ ద్రిలోకాష్టోపసంధాయకున్." భీమ. ౪, ఆ. ౧౫౯.

తీర్థయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. తీర్థసేవకై పోవుట.

తీర్థరాజము. సం. వి. అ. పుం. 1. తీర్థశ్రేష్ఠము; 2. ప్రయాగపట్టణము.

తీర్థవాసి. సం. విణ. (న్. నీ. న్.) 1. పుణ్యక్షేత్రమందు నివసించువాఁడు; తీర్థసేవ చేయువాఁడు. (శ. ర.)

తీర్థవిధి. సం. వి. ఇ. పుం. తీర్థమందు చేయఁబడిన శ్రాద్ధకృత్యము.

తీర్థ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తీర్థమునందుఁ [బుట్టినది.

తీర్పరి. దే. వి. (తీర్పు+అరి.) న్యాయాధిపతి. "సీ. కోరాయములు వచ్చుకొలఁది విచారించి పదియూళ్ల కొకరిఁ దీర్పరిగఁ జేసె." పి. శకుం. ౪, ఆ. ౧౭౬. పండిత. దీక్షా. ౪౨, పు. విణ. 1. తగవరి, ధర్మజ్ఞుఁడు. "సీ...తీర్పరి తగవ రన ధర్మజ్ఞుఁ డలరు." ఆం. భా. ద్వి. ౧౯౩; 2. చారుఁడు, వేగులవాఁడు. (శ. ర.); 3. కార్యకర్త "ఉ. పంచినతీర్పరుల్ సచివుపాలికి నేఁగి కృతప్రణాములై." జై. ౯, ఆ. ౫౭. ఆం. భా. తృ. ౪; 4. మనోహరము. "క. జగడంపుఁ గూటివేలుపు, తెగజడదారిగమికాని తీర్పరిపలుకుం, దొంగడిత నుబ్బెడిసామికి..." అచ్చ. భా. ౧, ఆ. ౪.

తీర్పు. దే. వి. (తీరు ధా.) 1. (సవరించుట, చక్కఁబఱచుట.) "చ...బహుదేశవాసులం,వ డొకటి చేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లు గల్గుని,త్తెఱఁగొకచాలువానిబలుతీర్పునఁ గాక పొసంగ నేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౩; 2. (వివాదముపరిష్కరించుట.) ఆవ్యాజ్యములో తీర్పు చెప్పినారు.

తీర్వ. దే. వి. పంటపొలములకు నీరు పాఱించుకొన్నందుకై ప్రభుత్వమున కొసఁగుధనము లేక ధాన్యము మొ. "సీ...సర్వమాన్యములుగ,గడఁ ద్రోచి న్యాయంబు కొలు దక్కనికోరు వాకతీర్వలవల్ల వచ్చుధాన్యములు..." ఉ. హరిశ్చ. ౧, ఆ. ౬౩.

తీర్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) దాఁటఁబడుచున్నది.

తీఱమి. దే. వి. (తీఱు ధా.) 1. అక్కఱ,అవసరము. "క. వేఱొక తెఱఁగున నొరులకు, మాఱాడక యునికి లెస్స మనకేం మ్రకడం,దీఱమి గలచోటులఁ దా,మీఱక కడఁగి వచ్చి పుత్త్ర మెయికొన వలయున్." భార. విరా. ౧, ఆ. ౧౨౯; 2. ఇబ్బంది, చిక్కుపరిస్థితి. "ఆ. ఎట్టిపుట్టములను నెట్టియాపదలను, నెట్టితీఱములను ముట్టఁబడిన,వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను,నొనరఁ జూడఁ గనినజనుల కెందు." భార. ఆది. ౪, ఆ. ౯౫.

తీఱిక. దే. వి. (తీఱు ధా.) తీఱుబడి,అవకాశము. (శ. ర. వా.)

తీఱిపోవు. దే. అ. క్రి. (తీఱు+పోవు స్వార్థమున.) చచ్చు,గతించు. "గీ. వనము కాపరి రాక్షసవర్గమడఁగె,దీర్ఘజిహ్వుండు నేటితోఁ దీఱిపోయె." మొ. రా. సుం. ౧౫౯.

తీఱు. దే. అ. క్రి. 1. చచ్చు,మరణించు. "సీ. సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి నల్పకాలంబున నతఁడు తీఱె." భార. ఉద్యో. ౪, ఆ. ౨౭౩. కాశీ. 3, ఆ. ౧౨౪; 2. పాయు,తొలఁగు. "క...శ్రమం,బాఱఁగ నెడఁ బరితాపము, దీఱఁగఁ బైవీచె నన్ను దీపవనంబుల్." భార. ఆది. ౪, ఆ. ౧౯. స్వా. 3, ఆ. ౨౩; 3. తయారగు, నిర్మింపఁబడు. "ఉ...దిక్కఁజెట్టివాఁ,డుక్కునఁ దీఱినట్లు కఠినోగ్రశరీరముతోడ మీఱు..." శుక. ౨, ఆ. ౩౫౭. ఉ. రా. ౧, ఆ. ౩౧౭; 4. ఏర్పడు,బయల్పడు. "క. తేఱెం గొలఁకులు... తీఱెం బులినములు..." కు. సం. ౬, ఆ. ౧౧౪; 5. సాధ్యమగు. "క. కృతులు రచియింప సుకవుల, కృతు లొప్పఁ గొనంగ నొరునికిన్ దీఱునె..." దశ. ౧, ఆ. ౯౦. వేం. పంచ. 3, ఆ. ౨౦౯; 6. వీలగు, అవకాశము కలుగు. "గీ...ఇయ్యెడఁ దడవు గాఁగ,నిలువఁ దీఱదు పోయి రావలయు మాకు." భార. ఉద్యో. ౧, ఆ. ౪౨. కాశీ. ౪, ఆ. ౧౦౫; 7. ముగియు,అంతమగు. "ఉ. మీఱి యనేకయుద్ధముల మీరు జయించుట తెల్ల నింత

తో,దీఱె నసం గనుంగొనఁడు..." ఉ. హరి. ౫, ఆ. ౨౨౮. భాగ. ౧౦, స్కం. ఉ. ౧౧౫౭; **8.** సరిపోవు. "సీ. ప్రాగ్జ్యోతిషులకె తీఱు బహు జనాన్నము దీఱ నారుల కొదవుఁ బునఃప్రయత్న, గీ. ము..."ఆము. ౪, ఆ. ౧౨౭; **9.** పరిహృత మగు. "గీ. దేహనాశంబుతోడన తీఱు నెల్ల,ఋణ ములును..." భార. ఆది. ౫, ఆ. ౭౧. నీలా. 3, ఆ. 3౪; **10.** పాడగు. "గీ. తీఱెఁ గతిపయ దినములఁ దేశ మెల్ల,మల్లె పట్టినచేనిక్రమంబు గాఁగ." స్వా ౫, ఆ. ౨౬; **11.** నశించు. "గీ. జ్ఞానమునఁ బూర్వకర్మసంచయము లెల్లఁ,దీఱు..." దశా. ౧, అ. ౧౨౨. వేమన. ౧, ప్ర. ౪౯; **12.** ఇదిక్రియాపదముల కనుప్రయుక్తమై అవ శ్యార్థమును గల్పించును. ఉదా:—వాఁ డాపని చేసితీఱును. (తప్పకచేయు నని భావము) వి. సంధి,ఒడంబడిక. "చ...అది సక్కన రాజ్యము పాలు లేక తీ,ఱున కొడఁబాటు గల్గిన నెఱుం గమి వెట్టరె..." భార. ఉద్యో. 3, ఆ. ౧౦౨. భార. ఉద్యో. 3, ఆ. ౧౧౬.

తీఱుగడ. ద్వ.వి. (తీఱు+కడ) **1.** ముగింపు,అవసానము. "గీ. అనఘ నీదేహ మంటినయట్టిపుణ్య,వశముమై నాకు సురలోకవాస మహిమ,దివ్య దేహంబు శాపంబుతీఱుగడయుఁ,గలిగెఁ బ్రత్యుపకృతి నీకు నెలమిఁజేతు." చిత్రభా. ౫, ఆ. ౪౦; **2.** తీఱిక, తెఱపి. (శ. ర.)

తీఱుచు. దే. స. క్రి. (తీఱు ధా. ప్రే.) పరిహరించు, ప్రతీకారముచే ఉపశమింపఁజేయు. "క...కార్త వీర్యసుతులు తండ్రిని జంపినపగ తీఱుచుకొనవలె నని..." దశా. ౬, అ. ౧౨౮.

తీఱుదల. దే. వి. (తీఱు+తల) ముగియుక,అంతము "గీ. భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ,దీఱు దల యగుఁగా కని..." భార. భీష్మ. ౨, ఆ. ౨౦౩. నిర్వ. ౧౦, ఆ. ౮౪.

తీఱుపడు. ద్వ. అ. క్రి. (తీఱు+పడు) తెఱపియగు. (చూ. తీఱుపాటు).

తీఱుపాటు. దే. వి. (తీఱుపడు ధా.) తీఱిక,అవకా శము. (శ. ర.) [(శ. ర. వా.)

తీఱుబడి. దే. వి. (తీఱు+బడి) తీఱిక,అవకాశము.

తీలగు. దే. అ. క్రి. (తీలు+అగు) అడఁగు,నిస్సత్త్వుఁ డగు. "ఉ. తీలగుకంతు వెంబడిన తెమ్మెరలున్ రవి దీప్తి కల్కి పాతాళముఁ బట్టుచుండు..." ఆము. ౨, ఆ ౬3.

తీలు. దే. వి. అడఁగుట. (చూ. తీలుపడు.) విణ. అల్పము. "గీ. ఒకతె చెక్కులపై మకరికల వ్రాయు నొక్కతెకు మెల్ల జడ తీలు చిక్కుఁ దీయు,నొక్కపని యెప్పుడును గల్గి యుండుఁ గార్య,భరము వేదనఁ గూడ దాబ్రాహ్మణునకు." నిరం. ౨, ఆ. ౨౩.

తీలుపడు. ద్వ.అ. క్రి. (తీలు+పడు) **1.** తగ్గు,క్షీణించు. "గీ. ఇట్టు లత్యుగ్ర మగుగ్రీష్మ మేసరేఁగి,కాల వశమునఁ దనుదానఁ దీలుపడియె." పాండు. ౪, ఆ ౧౮; **2.** నశించు. "గీ. దేశకాలాంతరంబులఁ దీలుపడని,బుద్ధి సౌందర్యమొక్కఁ డద్భుతము గాక,గాత్రసౌందర్య మేరికిఁ గలుగ దనిన,దాని విని విన్ననై యుండె దమనకుండు." వేం. పంచ. ౧, ఆ. ౬౯౬; **3.** దుర్బలమగు,నిస్సత్త్వమగు. "ఉ...మేఁ,దీవ నటింప నెన్నడుము దీలుపడం గటి గుల్క..." వేం. పంచ. ౧, ఆ. ౫౮౧.

తీలువడు. ద్వ. అ. క్రి. (తీలు+పడు) అడఁగు, మఱుఁగుపడియుండు. "సీ. భూమి క్రిందుగఁ బాఱెఁ బోరెఁ బోరెఁ గురువేరు తిమిరంబు గుహ లలోఁ దీలువడియె." ఇందు. ౨, ఆ. ౧౬౫.

తీవ. వై. వి. (సం. దీర్ఘా.) లత,వల్లి. "రగడ. ఎనయు ప్రాణపదంబు నాఁ దలఁ తీవ తీవ తలంగ మెట్టకు."పారి. ౪, ఆ. ౧౬. రుక్మి. ౨,ఆ. ౪3.

తీవనవ్వు. ద్వ. వి. (తీవ+నవ్వు), తీఁగవలె మృదు వుగ నుండునవ్వు,లేనవ్వు. "సీ. తియ్యలేనియ లొలుకు తీవనవ్వులతోడితొక్కుపల్కులు విని చొక్కలేరు." కవిక. ౧, ఆ. 3౯.

తీవఁబోఁడి. ద్వ. వి. (తీవ+పోఁడి) మనోజ్ఞురా లైనస్త్రీ; స్త్రీ. "గీ...,వాట్లు,గావు మని వేఁడు కొనువాఁడఁ దీవఁబోఁడి." అచ్చ. యు. ౪౭౪. పద్మ. ౫, ఆ. ౮3.

తీవయిల్లు. ద్వ. వి. (తీవ+ఇల్లు) పొదరిల్లు,లతాగృ హము. "క. వగ ముట్టుకొనినఁ జిత్తము,వెగడొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతిపోఁ,తగల నొకతీవయింటికిఁ, దగియుండెడు చంద్రకాంతత ల్పము నేరెన్." భార. విరా. ౨, ఆ. 3౦౮.

తీవంచే. ద్వ. స. (తిగ+వంచే.) నాలుగు. "సీ. ఏవేల్పు గుదెతాల్పుతీవంచమోములతులువలబలు

క్రొవ్వు దొలఁగ మీఁదె." నీలా. ౧, ఆ. ౧౭. నిరం. 3, ఆ. ౨౦.

తీవరకత్తె. వై. వి. (తీవరము+కత్తె.) 1. వేగిరపడునది,త్వరపడునది. "చ...త్రాసలఘుజవంబుతోడ నెఱు లార్చుచు మేడకుఁ జేరె చూచెఁ గోసల విభునందనుం జెలిమిచానలు తీవరకత్తె లౌనసన్." ఇందు ౬, ఆ. ౬; 2. ధృష్టురాళ్లు,తీవ్రస్వభావురాలు. "ఉ...రా వది యేమి రా విజయరామ యటం చిలు దూఱి బల్మిమైఁ,దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితి నా కలోదరీ." (అడిదము సూరకవి చాటువు.)

తీవరపడు. వై. అ. క్రి. (తీవరము+పడు) త్వరపడు, వేగిరపడు. (శ. ర.)

తీవరపాటు. వై. వి. (తీవరపడు ధా.) తొందరపడుట. (శ. ర.)

తీవరపెట్టు. ద్వ. స. క్రి. (తీవరము+పెట్టు) తొందరపెట్టు వేగిరించు. "క. వరునెటుట నంతఁ గన్యా, వరణం బొసరించి మంచివైభవ మెసఁగన్, తెర గట్టించిరి హరి మది,తెఱఁగెట్టిదొ మఱియు మరుఁడు తీవరపెట్టన్." ముకుంద. 3,ఆ. 3౮౧.

తీవరము. వై. వి. (సం. తీవ్రమ్. క. తీవరవు. త. తీవరమ్,తీవిరమ్.) 1. తొందర,త్వర. "గీ—ఇంటికినిఁ బోవ మెల్లఁగ హెచ్చరింపఁ,గాని పోవచ్చు మీఁదటికథలు వినుఁడు,దీవరం బేమి యని కేలు దిగిచి మగుడ." పార్వ. ౫, ఆ. ౧. అం. భా. ప్ర. ౬౫; 2. చిరాకు కోపము. "గీ. సంధ్య యన్న శిరోవ్యథ సంభవించు,భస్మధారణ మన్నఁ దీవరము వొడము." నిరం. ౨, ఆ. ౨౫.

తీవరించు. వై. అ. క్రి. చిరాకుపడు,కోపగించు. "సీ. తమకాన ధవుఁడు కందర్పకేళిఁ బెనంగ నెంతసేపని తీవరింప సాగు." శకాం. ౫, ఆ. ౧3. స. క్రి. తొందరపెట్టు,వేగిరించు. "వ...తను వరించి మరులునం దీవరించినయక్కన్యకు గర్భాధానంబుం బ్రసాదించిన." ఉ. రా. ౨, ఆ. ౧3౬. శకాం: ౪, ఆ. ౨౪.

తీవరుఁడు. సం. వి. అ. పుం. 1. సముద్రుఁడు; 2. చేపలఁ బట్టువాఁడు,కైవర్తుఁడు; 3. బోయవాఁడు,వ్యాధుఁడు.

తీవసరులు. ద్వ. వి. బ. ధాన్యవిశేషము. "గీ. తెల్ల నల్లచెన్నంగులఁ దీవసరులు." హంస.౪,ఆ.౧౭౮.

తీవియ. వై. వి. (సం. దీర్ఘా. 1. లత,వల్లి. "క్షీ కార్చిచ్చు సోకిన కంది మ్లానత్వంబుఁ బ్రాపించు తీవియరూపు నొంది,యున్నట్టివనిత .." మార్క. ౧, ఆ. ౨౪౬. పార్వ. ౪, ఆ. ౭౭.

తీవిరము. దే వి. తీఁట,కంపిహాతి. (శ. ర.)

తీవె = తీఁయ. "గీ. ముసుకుఁదీవెల వికుర్రా మొసల గట్టి." హర. ౧, ఆ. ౭౦.

తీవ్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. తిఁగగసుక,మహామార్వకి; 2. కటుకరోహిణి; 3. తెల్లావ; 4. తులసి; ౫. నదిభేదము.

తీవ్రగంధ. సం. వి. ఆ. స్త్రీ. ఓమము.

తీవ్రము. సం. వి. అ. పుం. 1. వాఁడిమి; 2. వేఁడిమి; 3. కారము; 4. ఇనుము; 5. తగరము; 6. అతిశయము; 7. తీరము, ఒడ్డు. విణ. (అ. ఆ. అ). 1. వాఁడిమి గలది, తీక్ష్ణము; 2. మిక్కిలివేఁడిమి గలది, అత్యుష్ణము; 3. అధికము; 4. కారము గలది, కటువు; ౫. భయంకరము, ఉగ్రము.

తీసివేత. దే. వి. (తీసివేయుధా.); 1. తొలఁగించుట; 2. వ్యవకలనము.

తీసివేయు. దే. స. క్రి (తీసివేయు.) 1. ఖండించు, నఱకు. ఉదా:—నీవు నాతల తీసివేయుదువా!; 2. తొలఁగించు. ఉదా:—వానిని ఉద్యోగము నుండి తీసివేసినారు; 3. తగ్గించు, ఒకసంఖ్యనుండి మఱొకసంఖ్య వ్యవకలనముచేయు. (వ్యవ.) పదింటిలో ఆఱు తీసివేసిన నాలుగు మిగులును.

## తు

తుంగ. ఉభ. దే. వి. (క. తుంగ.) తృణవిశేషము. "క. సరసులు చేపట్టినచో,విరసం బగుకావ్య మైన వినిపించిన న్యాదరణీయం బయి వెలయదె,ధరఁ బువ్వులఁ దాల్చి తుంగ తలకెక్కఁ గలేన్." దశా. ౧, ఆ. ౨౦౦. సం. వి. ఆ. స్త్రీ. 1. జమ్మి, శమి; 2. తవక్షీరి.

తుంగకము. సం. వి. అ. పు. పొన్న. పున్నాగము.

తుంగకసవు. దే. వి. (తుంగ+కసవు) తుంగగడ్డి. "సీ. మసకలిత్తులు తుంగకసవుచాపలు పసిగొయ్యలు జనపమోకులును వలలు." చెన్న. ౨, ఆ. ౨౦౪.

తుంగభద్ర. సం. వి. ఆ. స్త్రీ. నదిభేదము. (ఇది కృష్ణానదియుపనదులలోనిది).

తుంగభద్రము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

తుంగము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. పొన్న ♣; 3. కొన; 4. కొబ్బెరచెట్టు; 5. ఖడ్గమృగము; 6. బుధగ్రహము; 7. ఉచ్చస్థానము. (జ్యోతి.) న. కింజల్కము. విశే. (అ. ఆ. అ.) 1. ఎత్తైనది, ఉన్నతము; 2. పొడవైనది; 3. ప్రధానము; 4. ఉగ్రము.

తుంగముస్తియ. దే. వి. (తుంగ+ముస్తియ) తుంగ గడ్డియొక్క దుంప. "గీ... గొట్టె, చెట్లు నింజెట్టుం దుంగముస్తియలు నీత, గుంజు మొదలుగఁ దిన దొరఁకొనిరి జనము." కాశీ. 3, ఆ. ౧౫౧.

తుంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. పసుపు ♣; 2. వాయింట ♣; 3. రాత్రి. విశే. (న్. నీ. న్) 1. ఎత్తైనది; 2. పొడవైనది.

తుంగుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

తుంచు. దే. స. క్రి. (తునియు ధా. ప్రే.) ఉత్తరించు, చించు. "గీ. అలపరించి చతుర్విధాహారములను, దుష్టిచేసి దుకూలము ల్తుంచి తుంచి, కట్ట నిచ్చిన..." ఉ. హరి. ౪, ఆ. ౧౧౫.

తుంట. యుం. దే. వి. 1. తునుక, ఖండము, శకలము. "శా. ఘంటాకర్ణుని మించుకర్మమొకొ నాక ర్మంబు మానీం దులం, దుంట ల్సేయఁడె...." ఆము. ౬, ఆ. ౫౮. ఆం. భా. ప్ర. ౭౯; 2. చెఱకు, ఇక్షువు ♣. (ఈయర్థము తుంటవిల్లు మున్నగు మన్మథధన్వర్థ ప్రసక్తిలోనే కన్పట్టు చున్నది.) "ఉ... గెల్వవె మజ్జగంబు నుద్దండత నొక్క తుంటవిలు దాలిచి యంటినఁ గందుతూ పులన్." పసు. 3, ఆ. ౧౭౪. వై. విశే. (సం. దుష్టః. క. తుంట.) దుష్టుఁడు, తుంటరి. "వ.. వికలంబు లయినదధికుంభశకలంబులఁ బోడగని తుంటకొడుకు వెన్నుఁ దింట యెటింగి..." భాగ. ౧౦, స్కం. పూ. ౩౬౦.

తుంటరి. ద్వ. విశే. (తుంట + అరి - స్వార్థమున) దుష్టుఁడు. "ఉ. తుంటరిమారుబారిఁ బడఁ ద్రోయక ప్రావునఁ దావిపోలె లో, గెంటునిశార్మి నన్ను బ్రతికించి..." పె. శకుం. ౨, ఆ. ౨౨౭. ద్వి. హరిశ్చ. ఉ. ౬౪౯.

తుంటవిలుకాఁడు = తుంటవిలుతుఁడు. ఆం. సం. దేవ. ౧౪.

తుంటవిలుతుఁడు. దే. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. "గీ. ఘనగభీరత సాక్షాత్ప్రాదంబునందుఁ, దనమునో విస్తృతి నితంబతలమునందు, వెలయ నిలుఁ దంతలోఁ దుంటవిలుతుచెలువ, భంగిఁ దులకించునొక మోహనాంగి యయ్యె." ఉ. రా. 3, ఆ. ౪౩3.

తుంటి. దే. వి. పిఱ్ఱు, నితంబము. "సీ. కండూతి శైరాయుఁ గర్కశం బగుతుంటిఁ బీటవెట్టిన మ్రాను పెల్లగిల్ల." స్వా. ౪, ఆ. ౧౭.

తుంటికూర. ద్వ. వి. ఒకవిధ మైనకూరాకు ♣. "ఆ. గోఁగుకూర యీలకూర చెంచలికూర, తుంటికూర పొన్నగంటికూర..." వి. పు. ౪, ఆ. ౨౭౫.

తుండకేరి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. ప్రత్తిచెట్టు; 2. దొండ ♣.

తుండము. ఉభ. వై. వి. (సం. తోండనమ్. త. తుండం.) ఖండము, తునుక. "వ పాండవాగ్రజుం డతని కోదండంబు తుండంబులు సేసిన..." భార. ద్రో. ౨, ఆ. ౬౮. భార కర్ణ. ౨, ఆ. 33౨. సం. వి. అ. న. 1. నోరు; 2. ముఖము; 3. పనిముట్టు మొన; 4 ఏనుఁగుతొండము; 5. దోమతొండము.

తుండి. సం. వి. ఇ. పుం. 1. నోరు; 2. ముఖము; 3. పక్షిముక్కు. ఇ, ఈ. స్త్రీ. 1. దొండ ♣; 2 బద నిక; 3. బొడ్డు, నాభి. న్. పుం. 1. పక్షి; 2. ఏనుఁగు; 3. దోమ.

తుండించు. వై. స. క్రి. ఖండించు, నఱకు. "వ... వాలంబుల నఱకియుఁ దొడలు తుండించియుఁ దొండంబుల ఖండించియు..." భాగ. ౬, స్కం. 3౭౦. ఉ. హరి. ౬, ఆ. ౧౨౯. [నాభి.

తుండిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దొండ ♣; 2. బొడ్డు,

తుండికేరి. సం. = తుండకేరి. [వాఁడు.

తుండిభుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఉబుకుబొడ్డు

తుండిలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉబుకు బొడ్డువాఁడు; 2. వదరుఁబోతు.

తుండీరము. సం. వి. అ. పుం. దొండ ♣ "క. మానిత మగుగుడరసమున, మానినతుండీరఫలము యొగిఁదేనె తల, న్నాని మృదువై నపపడము, నా నద్రిజతొప్ప మోవి నయమై యొప్పన్." కు. సం. 3, ఆ. ౬౨.

తుండు. దే. వి. (క. త. తుండు.) 1. ఖండము, తునుక. "ఆ. తోఁచు శకలసంజ్ఞ తునుక తుండెము తుండె, తుండు తుంట పలియ తునియ ముక్క యన..." ఆం.భా. ప్ర. ౭౯; 2. దారుఖండము, మ్రానితునుక. "ఆ. ఇంకఁ గోమలాంగి నేలకొమ్మని మందు, తుండు దెచ్చి ప్రక్కదండఁ జేర్చి

యిట్టిభోగ మీవు నేకాలము వైన, ననుభవించి యెఱుఁగ వంచు భటులు." సానందో. ౨, ఆ. ౨౭. పు. పాండు. ౫, ఆ. ౨౪౫.

తుందుపడు. ద్వి. అ. క్రి. (తుందు+పడు) మ్రాడు వలె నగు,మొండియగు. "గీ. నల్లనై తుందుపడి బ్రాహ్మణత్వమునకుఁ,దావలం బైనవెడజన్నిదములం దాల్చి." దశ. 3, ఆ. ౪.

తుండె. దే. వి. తునుక. ఆం. భా. ప్ర, ౭౯.

తుండెము. దే. వి. తునుక.ఖండము. "మ...పల్లము గుఱ్ఱమున్ రవుతునున్ వేటారుతుండెంబులై,చెద రంగా వడిఁ బ్రేయు..." విక్ర. ౬, ఆ. ౭౯. రా. వి. 3, ఆ. ౬౪.

తుంతుర్వని. దే. వి. (క. తుంతుర్వని) తుషార,శీక రము. "సీ. ఎలమి లేఁదరఁగల నెలయుతుంతు ర్వని సదమలమా_క్తికాతతలు గాఁగ." కు. సం. ౯, ఆ. ౭౨.

తుందకూపి. సం. వి. ఈ. స్త్రీ. బొడ్డు, నాభి.

తుందపరిమృజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బొజ్జ నిమురుకొనుచుఁ గూర్చుండువాఁడు - సోమరి.

తుందము. సం. వి. అ. న. ఉదరము,బొజ్జ.

తుంది. సం. వి. ఇ. స్త్రీ. న. 1. ఉదరము,బొజ్జ; 2. బొడ్డు,నాభి. విణ. (స్. సీ. స్.) బొజ్జకలవాఁడు.

తుందిభుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెద్దబొజ్జ కలవాఁడు; 2. ఉబ్బుబొడ్డు కలవాఁడు.

తుందిలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అధికము, ఎక్కువైనది; 2. భరితము, నిండినది. "మ... నభోవాహినీ, లవలీశీతలగంధవాహిపరిఖేలన్మంజరీ సౌరభ,గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాం తారసంతానముల్." స్వా. ౨, ఆ. ౪౫.

తుందిలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెద్దబొజ్జ కలవాఁడు; 2. ఉబ్బుబొడ్డు కలవాఁడు.

తుందుడు. దే. వి. తొందర. (చూ. తుందుడుగొను.)

తుందుడుగొను. దే. అ. క్రి. (తుందుడు+కొను) త్వరపడు,తొందరపడు. "ద్వి. త్రొక్కరా దని విని తుందుడుగొనుచు,నతులశేషాంశ మైనట్టియ నంత,పతిశిష్యముఖ్యు లేర్పడఁగ నిట్టనిరి." ద్వి. పరమ. ౮, ఆ. ౬౯౬. పు.

తుందుడుకు. దే. వి. (దుడుకు+దుడుకు) 1. సంతా పము,మనోవ్యథ. "చ. చులుకన నన్నుఁ గన్నమన సున్ లయమందఁగఁ జేసి నన్ను నున్, గెలువఁగఁ బాని యున్న మునికీటములన్ ఏచి వాడిమెగ్గ పే, రలుఁగుల పాలు చేసి జయమందుదు దుందుడు కాఱునట్లుగాఁ, గొలఁకఁ దిర్పుకొనికొనఁ కున్ గొడుకే మదిలోఁ దలంపఁగన్." చంద్రా. 3, ఆ. ౬౨. ఉ. రా. ౬, ఆ. ౨౧౨; 2. మోసము. "క...,మన కీసందడి జూఁజుఁగులఁ జిరునై,తుందు డుకుల సామిసొమ్ము దోఁచకయున్నన్." ప్రబంధ. ౭౭౨; 3. కలఁత, క్షోభము. "గీ...యువరాజు తనినరీతి,దొరల భృత్యుల సఖుల నంపోఱఁ బనిచి,తుందుడుకు డెందమునఁ జాల నంపిపెంప." సా. ౨, ఆ. ౧౪౪. కళ. ౧, ఆ. ౩౫౭; 4. కంపము,చాంచల్యము. "సీ. ఘన జైనదారాపు చనుపోయిరాయిడీఁ దుంపిఫలంబు తుందుడుకుఁ జెంద." స్వా. ౧, ఆ. ౫; 5. అతిశయము, ఆధి క్యము. "చ. నడుఁకక కంసుకారణమునం దనుఁ బొందినశోకవహ్ని తుందుడుకు కప్పు మున్గ సేయుఁ దవఘాతము చేసె మృగేంద్రపీఠికిం,గొడ వయి రత్నకుంభభృతతోయముచే నభిషేక మాడె..." సాంబో. ౧, ఆ. ౧౭౯; 6. తొందరపాటు, అనాలోచితకారిత్వము. "సీ. వెనఁగి చే కడి పించుకొనినసేరమి పోవఁ గెలన నెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ. ప్రియ మెఱుంగక యడ్డపెట్టు తుందుడుకు వోఁ గల్యాణ మెన్నఁడు గలుగు నొక్కొ." విజ. 3, ఆ. ౨౩; 7. ఉత్కంఠ, తహతహ. "చ...మేనితోఁ,గదియఁగ గూడ కున్నను సుఖస్థితిఁ జెందెద వ్యూర్ధ్వలోకమున్, దుది యది గా దటం చనినఁ దుందుడు కేటికిఁ బొమ్ము యింటికిన్. ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౫౩. విణ. తొందరపడి కార్యము చేయువాఁడు. అనా లోచనశీలుఁడు. "సీ. కొడుకు తుందుడుకైనఁ గోడలు దొంగైన సహజుండు తనకు నసాధ్యుఁ డైన." వేణు. శ. ౧౨.

తుందునుకలు. దే. వి. బ. (తునుకలు+తునుకలు) చిన్న చిన్న తునుకలు, అత్యల్పఖండములు. "వ... పరిఘాఘాతంబులఁ బలకలతోడన పునుకలు తుందునుకలై రూపుచెడి వడిసినచోట్లును." కలిక. ౨, ఆ. ౯౯౭.

తుంపర. వై. వి. (సం. తుషారః.) గాలిచేత చెదరి పడునీరు మున్నగువానిబొట్టు,శీకరము. "వ... అలరులయుందుండియుఁ దొరంగుమకరందధారా

బ్బాసంబు వాఁకలం గలసి ప్రవహించుసెలయేటి నీటితుంపరలన్ దొరసి..." ఉ. రా. 3, ఆ. ౧౯౧. ఆం. భా. ప్ర. ౭౫.

తుంపిష్ట. దే. వి. బ. తూరవాన. (శ. ర.)

తుంపురు. వై. వి. (సం. తుషారః.) తుంపర,శీకరము. "సీ. కళుకులై తమ్మిపైఁ గ్రమ్ముమంచులబోలె మొగముసఁ జెమటతుంపురు లెలర్ప." య. 3, ఆ. ౮౪. రా. వి. ౨. ఆ. ౭౦.

తుంపెసలాడు. దే. అ. క్రి. 1. చలించు,కదలు. "చ. తొకతొకమాటలున్ నొసలఁ దుంపెసలాడెడునుంగరంపు వెండ్రుకలును..." కవిరా. ౨, ఆ. ౪3. పె. శతం. ౨, ఆ. ౧3౯; 2. క్రీడించు. "సీ బిసభుక్తిఁ గ్రొవ్వి తుంపెసలాడురాయంచకొదమ వెట్టిన తెలిగుడ్లనంగ." చంద్రా. ౪, ఆ. 3౬. 3. ఒప్పు. "సీ. పదపడి తలిరుజొంపములఁ దుంపెసలాడి పసరు మొగ్గలతీవె సెసకమెసఁగె." కృ శతం. ౧, ఆ. ౭౧.

తుంపెసలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము "వ...మచ్చికలు హెచ్చ నచ్చనగండ్లు వెన్నెల కుప్పలు గుజ్జెనగూళ్లు తుంపెసలు డాఁగిలిమూఁతలు..." భోజసుతా. ౨, ఆ. ౯.

తుంపెసలుగునియు. దే. అ. క్రి. (తుంపెసలు + గునియు) తుంపెసలాడు,చలించు. "సీ. కొలఁకులపైఁ దోఁచునిరులు నాఁ జెలువొంది నొసటిపైఁ గురులు తుంపెసలు గునియ." భాగ. ౧౦, స్కం. ఉ. ౬౯౧.

తుంబ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక ♣; 2. సొఱ♣; 3. ఆవు. [కాయ.

తుంబము. సం. వి. అ. పుం. 1. సొఱ♣; 2. వీణె

తుంబరము. సం. వి. అ. న. వాద్యభేదము, తంబుర.

తుంబి. సం. వి. ఇ.ఈ. స్త్రీ. 1. సొఱ, అనుగు♣; 2. తుమ్మి♣.

తుంబిక. సం. వి. ఆ. స్త్రీ. 1. సొఱ♣; 2. చేఁదిసొఱ♣. [కొత్తిమిరి♣.

తుంబురి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకుక్క,కుని; 2.

తుంబురుఁడు. సం.వి. ఉ. పుం. ఒకానొకగంధర్వుఁడు

తుకతుక. దే. వి. 1. ఉడుకులు గ్రాఁగుట మున్నగువానియందగుధ్వని కనుకరణము. "క. తనచేతనె తనబలమున్,దునిమించుట కింద్రజిత్తు తుకతుక నుడికెన్." శాఘా. ౬, ఆ. ౨౨౫. చంద్రా. ౨, ఆ. ౨౪; 2. సంతాపము. "ద్వి. తుకతుక లేక కీర్తులు మిన్నుముట్ట,సకలరాజ్యము నొకసంయమికిచ్చి." ద్వి. హారిశ్చ. పూ. ౧౭౯౧; 3. కోపము. "ద్వి. నీచభామల నొల్ల నీరాజ్య మొల్లఁ, ద్రోచిపో నిమ్మింకఁ దుకతుక మాని." ద్వి. హారిశ్చ. పూ. ౧౬3౯. శుక, ౧, ఆ. ౧౦౬♣. ఈసు, అసూయ. "క. ఒకనాఁ డాముని సాగర,సికతాస్థలి నొంటి జపము సేయఁగఁ దనలోఁ,దుకతుకఁ దాళఁగ లేకచ,టికి సత్యాత్మజుఁడు చని నొడివెసు మృదూక్తిన్." చంద్ర. ౧, ఆ.౧3౬. చంద్రా. ౨ ఆ. ౫౬.

తుకము. దే. వి. (త. తుకమ్.) నారుమడి. "సీ. పొటివి మేనులఁ దోఁచుపులకాంకురంబులతుకము జాజాలపాలికలు చేసి." అని. 3, ఆ. ౭౬.

తుకాటము. దే. విశే. మిక్కిలిప్రాఁతది (శ. ర.)

తుక్కు. దే. వి. 1. పనికిమాలినగడ్డి మొదలగునది. (వా.); 2. తుప్పు,లోహదోషము. "గీ. బాలఁతికుచయుగళంబుతోఁ బోరుటకును, గాదె చక్కనిసౌవర్ణకలశతతులు, నొక్కలై చిక్కుపడి చాలఁ దుక్కుపట్టి, సుత్తెపెట్లకు లోనయ్యెఁ జోద్యముగను." సీతా. ౨, ఆ. ౧౨3. విశే. పనికిమాలినది, నిస్సారము. (వ్యవ.) వాఁడు వ్రాసిన దంతయు తుక్కువ్రాఁత.

తుక్కుడు. దే. విశే. పనికిమాలినది, నిస్సారము. ఉదా. తుక్కుడుధాన్యము.

తుక్ఖారము. సం. వి. అ. పుం. తుక్ఖారదేశసంబంధమైన శ్రేష్ఠాశ్వము; గుఱ్ఱము, ఘోటకము. "గీ. అల్లడాధీశవేమక్షమాధినాథ, భూరినిష్ఠురధాటీవిహారచతుర,సైన్యనాసీరతుక్ఖారశఫపుటోత్థ, వింధ్యపార్శ్వవసుంధరావిపులధూళి." కాశీ. ౧, ఆ.3౪. నరస. ౫. ప్ర. ౨౪3.

తుక్ఖారుఁడు. సం. వి. అ. పుం. వింధ్యపర్వతమందు నివసించు ఒకజాతివాఁడు.

తుచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

తుచ్ఛము. సం. వి. అ. న. 1. పొల్లు; 2. దుఃఖము. విశే. (అ. ఆ. అ.) 1. అల్పము, చిన్నది; 2. శూన్యము, రిక్త; 3. అసత్యము; 4. దీనము.

తుజోగు. హిం. విశే. త్వరపడువాఁడు. (శ. ర.)

తుటాయించే. దే. స. క్రి. అలక్ష్యముచేయు, నిరసించు. (శ. ర. బ్రౌ.)

తుటారమాడు. దే. స. క్రి. (తుటారము+ఆడు.) నిర సించు, తిరస్కరించు. "ఉ...ప్రభావతి వచ్చె మీనుడాల్, పొందినరాచవానిమొఱ గోనికటారిం దుటారమాడుచున్." శుక. ౨, ఆ. ౯౬.

తుటారము. వై. వి. (సం. తుహారః.) 1. దిట్టతనము, దార్ఢ్యము. "వ...మిటారపుటారెలం బటాలు పటాలునఁ దుటారం బడర నడ్డిచి." అచ్చ. యు. ౩౬౩; 2. పరుషవచనము. "గీ. తొంచెము తుటార మనఁగను దుర్వచన మొప్పు."ఆం. భా. ప్ర. ౧౧౭. విశ. 1. దృఢమైనది, ధైర్యము గలది. "గీ. పసిఁడిగొలుసులు జరతారుపట్టెడలును, మేలిపరొంబట్టుజూలును మెడలగొప్ప, వెండి మువ్వలు పొదలంగ గండుమీఁజే, హాగె వేగఁ దుటారంపుజాగిలములు." రసిక. ౧, ఆ. ౧౦౬. అచ్చ. అయో. ౩౮; 2. పరుషము, నిష్ఠురము. "వ...ఇది యెక్కడిమిటారిం గొనితెచ్చితి వని తుటారంపుమాట లాడుచు..." హరిశ్చ. ౪, ఆ. ౧౯౯.

తుటారి. వై. విశ. (తుటారము+ఇ.) 1. ధృష్టుఁడు; ధృష్టురాలు; దిట్టతనము గలది. "గీ...రాచపు డమి, వేలుపుఁదుటారి తాపసివెంట నరుగు,మరుచు సీరాము నేరీతిఁ బనుచువాఁడ." చం. రా. ౨, ఆ. ౬౫. "గీ. నన్ను నెదిరింప నెట్టిదాన వె. తుటారి." శివలీ. ౨, ఆ. ౧౭౭. నీలా. ౧, ఆ. ౬; 2. ప్రేలరి,వదరుఁబోతు. "క. నా విని యోసి తుటారి దయామావారిధి నధిపుఁ గూర్చి యనకు మొకటిమంచన్." ప్రభా. ౫, ఆ. ౧౬౮; 3. దుష్టుఁడు. "చ. టక్కరు లుక్కివుల్ బలుతుటా రులు క్రూరులు వేషధారులుఁ, రక్కసులౌ..."సమీర. ౪, ఆ. ౨౨. చంద్రా. ౪, ఆ. ౧౮౩.

తుటారించు. వై. స. క్రి. తిరస్కరించు. "దండ కము. జాతినిద్దంపుకెంపుం దుటారించుకెమ్మోవిపై నంద హాసుందహాసంబు చెన్నొందు..." దశా. ౪, ఆ. ౨౩౬. శుక. ౧, ఆ. ౩౧౪.

తుటారికత్తియ. వై. విశ. (తుటారి+కత్తియ.) దిట్ట తనము గలది, ధృష్టురాలు. "చ...గాజులు గలు గల్లనఁ జఱుచూపులచే దెసవర్ణ డెందముల్, గలఁపును రందులన్ బొలముకాపరికాఁపుఁదుటారి కత్తియల్," నీలా. ౧, ఆ. ౩౯౮.

తుటారికత్తె = తుటారికత్తియ. (ధృష్టురాలు.) "ఉ. కంతుదురాపతాపహతిఁ గ్రాఁగుచు నజ్జగవన్నె కాఁడు న,న్నెంతకు...రికత్తె యని యెగ్గులు వల్కెదొ..." రసిక. ౪, ఆ. ౧౭౮.

తుటారికాఁడు. ద్వి. విశ (తుటారి+కాఁడు.) 1. దిట్టతనము గలవాఁడు; 2. ధృష్టుఁడు. (శ. ర.)

తుటుక్కు. దే. వి.(ఆమ్రేడితమున తుటుకుతుటుక్కు.) 1. గుండె అదరుటయందు వగునద్ధుకరణము. "చ... గుండియల్, తుటుకుతుటుక్కునన్ దిగులుకొట్టిన భూభుజుఁ డయ్యె నయ్యెడన్." పాంచా. ౨, ఆ. ౪౨. (శ. ర. పా.)

తుటుము. దే. వి. 1. సమూహము. "గీ. భూరిరవి రోచిఁ గాలెడుపురమి వెడఁద,పెనముపైఁ బడు వెన్నెలపేరి యట్టు,మంట మీఁటినయాఁకట మఱియు మఱియుఁ, బొట్ట నిండించె రేఁజేరి పులుఁగుఁదుటుము." కాళిందీ. ౪, ఆ. ౪౭. అచ్చ. యు. ౪౭౯; 2. మల్లవిద్యాసంబంధ మైనషోడ శోపవీతములలో నొకటి. "వ...వందనిల్కడ కదలు తుటుము...కరళాఘువంబు లాది యాషోడ శోపవీతంబులరీతులు నేర్చి..." హంస. ౧, ఆ. ౨౦౬.

తుటుములుగట్టు. దే. అ క్రి. (తుటుములు+కట్టు.) గుమిగూడు. "వ. గోపిక లోపికలు లేక తమతమ పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునఁ బదుగురు నేగురుఁ దుటుములుగట్టి బిలిబిలిముచ్చటలకుం జొచ్చి..." భాగ. ౧౦. స్కం. పూ. ౭౭౦. జాహ్నవీ. ౧, ఆ. ౫౨.

తుట్టతుద. దే. వి. (తుద+తుద.) చిట్టచివర, కేవలము తుద. "చ. తడఁబడ మింటితుట్టతుద దాఁక రయం బునఁ బోవుచున్..."భా.రా. అర. ౨, ఆ. ౧౪౧.

తుట్టతుది. దే.వి. (తుది+తుది.) చిట్టచివర. "ద్వి. ౫రి తుట్టతుదినుండి క్రిందుఁ జూడఁగ,నరకలోకము గాఁడి యునికికి బెదరి."పండితా. పర్వ. ౩౪౯.పు.

తుట్టతుమర. దే. క్రి. విశ. బొత్తిగా, స్వల్పముగా నైనను. ఉదా:—పిల్లవాఁడు తుట్టతుమర చదు వఁడు. (శ. ర.)

తుట్టియ. దే. వి తుట్టె. (శ. ర.)

తుట్టు. దే. వి. (క. తుట్టిసు.) 1. నష్టి. ఉదా:— ఈవ్యాపారములో నాచేతిసొమ్ము తుట్టుపెట్టు కొన్నాను. (శ. ర. బ్రౌ.); 2. పీడ, బాధ "ఆ.

చాలుఁ జాలు వగవఁ గాలంబు గా దిది, లంక చేరె రాజ్యలక్ష్మి గేహ,గౌఱ త దీఱె నెల్ల కోర్కులు సనుకూలెఁ,దుట్టు వానె నిఁక దొసఁగు లేదు." భా. రా. యు. ౨౫౩. విణ బాధకము, బాధకుఁడు. "చ. చలువలరచ్చపట్టు జలజంబులతుట్టు విరాళికల్కి ప్రోగులకనుకట్టు..." రా. వి. 3, ఆ. ౮.

తుట్టుపెట్టు. దే. స. క్రి. (తుట్టు+పెట్టు.) బాధించు. "ఒకడ. తగిలి పట్టు మనుచుఁ దిట్టుకన్విఁ దుట్టు పెట్టె నొకతె." రా. వి. 3, ఆ. ౧౫౧.

తుట్టె దే. వి 1. సమూహము, ప్రోవు. "వ. అని వనిం జుట్టుకొని తెట్టతెరువు మొకంబులఁ గొట్టి తుట్టెలఁగాఁ బెట్టి..." రా. వి 3, ఆ. ౬౫. ఆము. ౬, ఆ. ౧౭; 2. అడ, అట్ట. "ద్వి. ముంజేకబ్బుల తుట్టె మునుకవెంద్రుకలు, జుంజురింపఁగ విదుర్చుచుఁ జుట్టు మనుచు." అ. మ. క ౨, ఆ. ౮3. పు; 3. తేనెపెర. "గీ...తుట్టె యనఁగఁ, బెర యనఁగ క్షౌద్రపటలంబు పేరు చెల్లు." ఆం. భా. ద్వి. ౫౮౦. విణ. నీచము, క్షుద్రము. (చూ. తుట్టెపురుగు.)

తుట్టెగట్టు. దే. అ. క్రి. (తుట్టె+కట్టు.) 1. పురుగులుపట్టి ఉండలుగట్టు. (శ. ర. వా.); 2. జడలుగట్టు. "వ ..పయింబడి బెడిదము లగునిడుదమొనగోళ్ల గ్రుచ్చినఁ దామును నెదిరి మైకొని కొట్టుతరిఁ దుట్టెలుగట్టినరోమములం దవిలి లివియఁ దీరంబు గాక." చంద్రా. ౨, ఆ. ౮౪.

తుట్టెపురుగు. ద్వ. వి. (తుట్టె+పురుగు.) 1. తుచ్ఛసర్పము. "గీ...క్షుద్రాహిసంజ్ఞ తుట్టెపురుగని పల్కఁగఁ దోఁచియుండు." ఆం. భా. ప్ర. ౧౪౭. రామా. ౮, ఆ. ౪౦; 2. సర్పము. (చూ. తుట్టెపురుగుగుంపుగొంగ.)

తుట్టెపురుగుగుంపుగొంగ. ద్వ. వి. గరుత్మంతుఁడు,సర్పహారి. "గీ...గరుటాలమంతుండు గరుడి తుట్టె, పురుగుగుంపుగొంగ యనఁగ గరుడున కగు..." వేంక. దేవ. ౨౦.

తుట్ర. దే. వి. 1. మంచువంటితూరవాన. "గీ. తుట్ర యన మంచుఁ బోలినతూరవాన." ఆం. భా. ప్ర. ౭౫; 2. ఊఁడ్చి రాసిగాఁ బోసినచెత్త, పెంట కుప్ప." (శ. ర. బ్రౌ.)

తుట్రిలు. దే. అ. క్రి. ఊఱియు, కురియు. "సీ. గుడిసె నెన్నడు చక్కిఁ గుడువవల్సిరిఁ గొన్న గడలు దుట్రిల వడవడవడంక." రా.వి. ౨,ఆ. ౭౦.

తుతారము. సం. వి. అ. పుం. పరుషవాక్యము. "వ... వార లాడినతుతారంబులు కర్ణకఠోరంబు లగుటయు." వరాహ. ౧, ఆ. ౧3౭.

తుడుచు. దే. స. క్రి. 1. ఊడ్చు. "క. వరవృష్ణిఁ గలసి తనయులు, పరువడిఁ దుడువంగఁ గృష్ణఁ బనుచు వగఁగ భా సురరాజ్యవిభవ మొప్ప క్రిందురుఁ జెచ్చెరఁ బంచె దానిఁ దోడ్కొని తేరన్." భార. సభా. ౨, ఆ. ౨౦౦. ఆము. ౪, ఆ. ౫౦; 2. వస్త్రాదికముచే ఒత్తు, ఒత్తివేయు." క...తగవే, యిట్టితెగు వనుచుఁ జెక్కులఁ, దొట్టినకన్నీరు వోవఁ దుడుచుచుఁ బలికెన్." స్వా. 3, ఆ. 3౨. ఉ. రా. ౫, ఆ 3౦౨; 2. కడుగు, క్షాళన మొనర్చు. "సీ. పద్మినికన్నీరు పన్నీటఁ దుడువుము..." నైష. ౨, ఆ. ౧౪౧. పారి. ౪, ఆ. ౧౬; 4. పోఁగొట్టు. "క. నినుఁ గడచినతలిదండ్రులు, విని నాదుందుడుకుఁ దుడిచి విడువం గలదే, యని యే నేరికిఁ జెప్పక, చనుదెంచితి నసఁగ వచ్చె శబరబలంబుల్." కళ. ౪, ఆ. ౫౮. హరి. ఉ. ౯,ఆ. ౨౯; 5. నిమురు,తడవు. "వ...కంఠంబుఁ జఱచి మొగంబుఁ దుడిచి..." స్వా. ౪, ఆ. ౧౧౫.

తుడుపు. దే. వి. (తుడుచుధా.) 1. తుడుచుట,మార్జనము. "సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము డన మార్జనసంజ్ఞ పొలుచుచుండు." ఆం. భా. ద్వి. ౧౬౦; 2. వ్రాసినతప్పును కొట్టివేయుట. (వ్యవ.) తుడుపులు లేకుండ వ్రాయవలయును. విణ. తుడుచునది,తొలఁగించునది. "గీ. పరమదాసవ్రాతపాపంబు లెల్లను గదలకుఁ దుడుపు మోక్షాళ్లముడుపు." ప్రబంధ. ౨౪.

తుడుపుపెట్టు. దే స. క్రి. (తుడుపు+పెట్టు) తుడిచివేయు. "సీ. తనదానపటిమంబు వనదాహరణమిషోద్ధురతమై నుడుపతిఁ దుడుపుపెట్టు." బహు. ౧, ఆ. ౬౦.

తుడుము. దే. వి. 1. మద్దువు,వాద్యవిశేషము. "సీ. కైదువున్ విండ్లును గత్తళంబులుఁ దీర్చి బూరలుఁ దుడుములు బుగ్గిఁ గలిపి." అచ్చ. సుం. ౧౦౮. రసిక. ౧, ఆ. ౮౦; 2. సమూహము,గుంపు.

"క. నడుమొయిడె మదియుం నతనిని,కడలి కై పక ముదడి యొకనగం బిలఁ బడి నం,నడచ్చలుఁ గొండలుఁ గ్రోఁతులు,తుడుములుఁ జెక్కాకక్కాపోయ తుత్తుము రయ్యెన్." రామా. ౮. ఆ. ౧౫౯ చంద్రా. ౨, ఆ. ౮౪.

తుడ్చు = తుడుచు. (నిమురు,తడవు.) "చ. పొరిఁ బొరి నొత్తుఁ గన్నులఁ గపోలయుగంబున నప్పళించు . కోర్కిచే, నురమున నువ్వుఁ దుడ్చుఁ గడు నొప్ప మనోభవభూతశాంతికై." భో. ౫, ఆ. ౧౫౨.

తుణికము. సం. వి. అ. పుం. నందివృక్షము.

తుతినాగము. వై. వి. (సం. తుత్థమ్) లోహవిశేషము. (శ. ర. బ్రా.) [ శెండశీ. (బ్రా.)

తుత్తి. దే. వి. 1. కంగుసీపత్త్రముశీ. (శ.ర.) 2. నూఁగు

తుత్తిరి = తుత్తి. (శ. ర. బ్రా.)

తుత్తుంభిక. సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము. "వ... అతితుములతమ ఢమామికా తమ్మట భేరికా పటహ తుత్తుంభికా వాదిత్రగంభీరఘోషసరంభంబు..." వసు. ౬, ఆ. ౯.

తుత్తునియలు. దే. వి. బ. (తునియలు+తునియలు.) చిన్నచిన్నతునుకలు. "క. కరులును జోదులు డొల్లఁగఁ, దురగంబులు రావుతులును దుత్తునియలు గాన్." భార. భీష్మ. ౨, ఆ. ౯౯, భా. రా. సు. ౪౯౦.

తుత్తునుకలు. దే. వి. బ. (తునుకలు+తునుకలు.) చిన్నచిన్నతునుకలు. "ద్వి. కాల్ల తుత్తునుకలు గాఁ గొట్టి కొట్టి." పండితా. పురా. ౧౦౯, పు. నవ నాథ. ౫, ఆ. ౧౮౮, పు.

తుత్తుమురాడు. దే. స. క్రి. (తుత్తుమురు+ఆడు.) పొడిచేయు. "ఉ...తావకపుత్త్రుఁ డీతండు నేడు...తుత్తుమురాడివచ్చునలదుర్మదు వొండు దలంపకుండుమీ." రాజ. చ. ౨, ఆ. ౩౯.

తుత్తుమురు. దే. వి. (తుమురు+తుమురు.) మిక్కిలి పొడి, "వ...కరిదంతంబులు నరదంబులనొగలు నొండొంటింబ దాఁకి తుత్తుమురు లైనతుములంబు కతన..." భార. భీష్మ. ౧, ఆ. ౨౬౭, ఉ. రా. ౩, ఆ. ౨౬.

తుత్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. చిట్టేలకిశీ.

తుత్థము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. దాయి. స. అంజనవిశేషము, మైలుతుత్తము.

తుద. దే. వి. 1. చివర, కొన. "నాగర. ఎడపిరింకఁ బోలు నీ బింతి రతికళిః నాగరుఁ, బొడలఁ జికురులతుదలఁ జూచియున్నది పొగడ." స్వా. ౩, ఆ. ౮౪, ఆము. ౩, ఆ. ౧౭; 2. మోక్షము. (నూ. తుద ముట్టు.) వి.జ. చివరికి, కడకటికి "శీ. చలము గొనఁగి తూపువుతుదకొప్ప కరటకి యై కాపురించు పూరేకు లనఁగ." పారి. ౨, ఆ. ౩౬. అవ్య. ద్రు. పిమ్మట, అనంతరము. "చ. సుమధురమూర్తిఁ గృష్ణవిభుఁ జూడవియుండు లెటన్న నంద్రు గాని మది నొకింతఁ జెప్ప యతని గనుఁగొన్న తుదకై సుధాంశుహాకము ప్రియమన్న వారు మఱి భావజామే లనువారుఁ గల్గి టుబ్రము..."కళా.శీకి.౯౩.

తుదకు. దే. అవ్య. ద్రు. చఱకు,దాఁక. "క...అని యుండుదు నేఁటికొనకు నది బొం కయ్యెన్." వేం. పంచ. ౪, ఆ. ౫౩౪.

తుదచేరు. దే. అ. క్రి. (తుద+చేరు.) నెఱవేఱు,కొన సాగు. "ఉ ..ధర్మతనూజుఁడు రాజసూయవి, ఖ్యాతి వహించు నయ్యెడల వాఁడుఁడు ప్రాణము తోడ నున్న నేఁలా తుదచేరు నధ్వరము లావున వాఁ డోరు నేల కైకొనున్." ఉ. హరి. ౪, ఆ. ౭౯౪.

తుదమీఱు. దే. అ. క్రి. (తుద+మీఱు.) అధికమగు. "ద్వి. తదవసరమున యుధాజిత్తు ప్రేమ, తుద మీఱఁగా భరతుని మేనమామ." రం. రా. బాల. ౩౪. పు.

తుదముట్టు. దే. అ. క్రి. (తుద+ముట్టు.) 1. సమాప్త మగు,ముగియు. "సీ. ఇప్పటిచునవృత్త మీకథ సర్వంబు తుదముట్ట నేమి సెప్పెదరొ యనుచు." కళా. ౫, ఆ. ౩౯; 2. పోవు, తొలఁగు. "క... వీఁడు జీవితేశ్వరుఁ డైనక, మదిఁ గలసుఖం బెల్లను, దుదముట్టు నటంచు మోహదుర్దశ నొం దున్."హంస. ౪, ఆ. ౭౧; 3. మోక్షమొందు. "సీ. చతురాత్మ విను మాత్మకృతము లైనట్టియు, మంగళభూతకర్మంబు లనెడి, దావాగ్నిశిఖలచే దందహ్యమాను లైనట్టిజీవులు దుదముట్టలేక, పాయక సంసారబద్ధులై యుందురు..." భాగ. ౩, స్కం. ౭౫.

తుది. దే. వి. (క. తుది.) 1. చివర, కొన. "సీ. మది నిగిర్చినమాట మగువ నీవెంపునఁ గుదిసి నానాలుకతుదికి రాదు." భార. విరా. ౩, ఆ.

౪౫. భార. విరా. ౫, ఆ. ౧౩౮; 2. మరణము; వినాశము. "క. నీమాలాం చే నెఱఁగితిఁ,గామము సంకల్పమునను కలిగెను సంకల్పామర్షరహిత మగుచే, తోమ్మిం దాల్తు నేను దుది యగు నికన్."భార. శాం. ౪, ఆ. ౪౫. విణ. 1. చివరిది, కడపటిది. "చ. మదనుఁడు రెండుచేతులను మూర్ఛడ నేయఁగఁ దూపు లైదునుం, బది యయి వేఱు వేఱ పటిపాటి సవస్థలు సంఘటింపఁగాఁ, దుదిదశ రాజునందు వెడఁ దోఁచుచు నున్నది ..."నైష. ౫, ఆ. ౯౦. భార. విరా. ౧, ఆ. ౩౦౧; 2. సర్వోత్తరము, శ్రేష్ఠము. "క. ఆది విప్రుల కిచ్చు టరయఁ,దుది దానంబులను నఱుకు దుది తాటవృలన్." భార. అను. 3, ఆ. ౧౯.

తుదిదాఁకు. దే. అ. క్రి. (తుది+దాఁకు.) 1. నెఱవేఱు, సిద్ధించు. "గీ. నలుని దమయంతితోఁ గూర్పఁ దలఁచి యున్న,ధాత మది యెత్తికోలు తుదిదాఁక కున్నె." నైష. ౧, ఆ. ౮౦. భార. ఉద్యో. 3, ఆ. ౬౫; 2. ప్రసిద్ధమగు. "ఉ. దారుణకార్యవృత్తిఁ దుదిదాఁకినవారును దొల్లి మర్దకల్,సేరినచో నొకం డొకనిచేఁ జెడరై రె ..."కు. సం. ౧౦, ఆ. ౧౮౯. హరి. పూ. ౧, ఆ. ౧౦. రూ. తుదిదాఁకు.

తుదిముట్టు. దే. అ. క్రి. (తుది+ముట్టు.) 1. చచ్చు, మరణించు. "క. ఇది మొదలు వాలి యిచటికిఁ బవపడి చనుదెంచెనేని భగ్నశిరుండై, తుదిముట్టు నవియె..." అధ్యా. కిష్కిం. ౧౦౫. పు; 2. నశించు,పోవు. "ఉ. ముజ్జగ మైనఁ ద్రిప్పఁ దుది ముట్టదు దా ధనకాంత యేరికిన్." కవిక. ౫,ఆ. ౧౨౧; 3. నెఱవేఱు, సిద్ధించు. "వ...నామనోరథంబు తుదిముట్ట వలయు..."భార. విరా. ౫,ఆ. ౨౩౪. విప్ర. ౪, ఆ. ౭; 4. ముగియు, పూర్తి యగు. "మ. హృదయాహ్లాది చతుర్థమూర్తికథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వమట యుద్యోగాదులుం గూడఁగాఁ, బదియేనింటిఁ దెనుఁగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుది ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్." భార. విరా. ౧, ఆ. ౭. భాగ. ౧౧, స్కం. ౬; 5. అయిపోవు,వ్యయమగు. "క. ఇది దైవవిరోధం బని,మదిఁ దా నూహించి ప్రకృతిమార్గణములు బెట్టిదముగ నేయఁగ నవి యుం, దుదిముట్టఁగ రిత్త లయ్యె దోలలు నరేంద్రా." భార. మా. ౧, ఆ. ౧౪౭; 6. దృఢమగు. "క. ఇమ్ముగఁ జెలిమి యొనర్చినఁ, గుమ్మడి పుష్పలవిధంబు కుజనులు చూడన్ ,సొమ్మితురు తుదిముట్టినఁ,ద మ్మితురు నీతిపరులు తగుమిత్రులకున్." కేయూర. 3, ఆ. ౨౮౬.

తుదిరేయి. ద్వ. వి. (తుది+రేయి.) కల్పాంతము, చివరిరాత్రి. (శ. ర. బ్రా.)

తునికోల. దే. వి (తూనిక+కోల - శ. ర. బ్రా.) తూఁచునట్టికోల, తులాదండకము. "క. మును వెండికొండ తూఁచిన, తునికోలగదా మదీయదోర్దండము .."రామా. ౮, ఆ. ౧౨౨.

తునికోలదుడ్డు. దే. వి. (తునికోల+దుడ్డు.) గవుండ్లవాఁడు కల్లబుడ్డి తగిలించుకొని పోవుటకును కత్తి నూఱుకొనుటకు నుపయోగించు తునికోలవంటి దుడ్డుకోల. (శ. ర.)

తునిమించు. దే. స. క్రి. (తునుము ధా. ప్రే.) 1. నఱకించు, ఖండింపఁజేయు. "వ...రాజునుం బఱతెంచి శూలప్రోతుం డయి యున్న మాండవ్యునకు నమస్కరించి నాచేసినయజ్ఞానంబు సహించి నాకుం బ్రసాదింపవలయు ననిన నమ్మునిం బంచుచో నది పుచ్చరాకున్న దాని మొదలు మెత్తన తునిమించినఁ దత్కంఠపార్శ్వంబునందు శూలశేషం బంతర్గతం బై యుండె." భార. ఆది. ౪, ఆ. ౨౬౮; 2. చంపించు. "ఉ...మహాగుణమే యిది నిక్క మైన నీ, మిక్కిలిమూఁక నెల్లఁ దుని మించక చావవు గాని రావణా." రామా. ౮, ఆ. ౧౦౦. రామా. ౬, ఆ. ౨౨౫.

తునియ. దే. వి. (తునియు ధా.) తునుక,ఖండము. "గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి,చేతఁ గవ్వడి వడు నని చూతువేని, వాసుదేవునిచే నది వ్యర్థ లయ్యెఁ, దునియ లయ్యెను బోడి యయ్యెఁ దొరఁగు ధరణి." ఉద్యో. ౨, ఆ. ౨౭౭. ఆం. భా. ప్ర. ౭౯.

తునియించు. దే. స. క్రి. (తునియు ధా. ప్రే.) విఱుచు,త్రుంచు. "చ. అవి నడుమన్ హుతంబుగ రయంబునఁ జేసి సుమిత్రపట్టి విల్లవిరళలీల నొక్కచటు లాస్త్రమునం దునియించి యొక్కటన్, విపథునిఁ జేయ..."శతకం. ౪, ఆ. ౩౦. చం. రా. 3,ఆ. ౧౫.

తునియు. దే. అ. క్రి. 1. విఱుగు, భిన్నమగు. "సీ. కడిఁదివిల్ దునియుం జప్పుడు వీనులకు విందు సేయుం జెప్ప డటంచు సేత దలఁప." ఉ. రా. ౧, అ. ౮౮; 2. తెగు, ఖండితమగు. "సీ. అరిగి సాత్యకి ద్రుపదాత్మజుఁ గనుఁగొని నీజిహ్వ దునియద నీశిరంబు. గీ. వగలదు..." భార. ద్రో. ౫, అ. ౩౬౫. విప్ర. ౪, అ. ౩౯; 3. చిరుఁగు, ఛిన్నమగు. "క. అఱువుడు గానిముసుంగును, విఱిగిన దండంబుఁ దునిసి వ్రేలెడుగోఁచిం, మఱియు లయిన కరకమునై, చుఱచుఱయై వేఁడి తెఱఁగు చూపులతోడన్." ఉ. హరి. ౪, అ. ౭౯. దశా. ౧, అ. ౧౭౮; 4. వికలమగు, చెడు. "ద్వి. కలఁగె గర్భంబులు గలఁగె ధైర్యములు, తొలఁగెఁ బ్రాణంబులు దునిసెఁ జిత్తములు." ద్వి. భార. విరా. ౨, అ. ౪౫ పు; 5. నశించు. "చ. ఘనుఁ డధిక ప్రయత్నమున గంగను దోడ్కొని యాభగీరథుం, డును గపిలాక్షిపావకపటుస్ఫుటకీలలభస్మరాసులై, తునిసిన తాతలం గని సుఖితుఁ డయ్యె..." జాహ్నవీ. ౨, అ. ౧౭౯.

తునిసిపడు. ద్వ. అ. క్రి. (తునిసి+పడు.) చెడు, భగ్నమగు. "గీ. తోడుతోడుతఁ గడఁకలు తునిసిపడఁగ ...ఉసురుతోడిపేసుం గయి యుండుకుచుండె." హరి. పూ. ౮, అ. ౫౭.

తునిసిపాఱు. దే. అ. క్రి. (తునిసి+పాఱు.) తునుకలగు, పొడిమగు. (ఆదివరాహవర్ణనము.) "సీ. తుదమొదళ్లకుఁ జెక్కుఁ దునిసిపాఱఁగ మోరఁ గులశైలములు చిమ్మఁ గొంతతడవు." భాగ. 3, స్కం. ౬౩౮.

తునుఁగు. దే. అ. క్రి. 1. చచ్చు, మరణించు. "గీ. మడిసె యూపాక్షుఁ డట జంబుమాలి తునిఁగె." మొ. రా. సుం. ౧౫౯; 2. తెగు, ఖండితమగు. "చ...దానిశిరంబు గరంబు దాఁకినన్, దునుఁగుఁ జెనుంగు ప్రీలుఁ గడుఁ దూలు జగజ్జనజన్మలక్ష్మ్యముల్." పాండు. ౫, అ. ౧౪౩; 3. విఱుగు. "క. నునుగాలి సోఁకినంతనె, తునిఁగెడు నెర్నడుము..." రాజ. చ. ౨, అ. ౧౦౧. అచ్చ. అర. ౧౦౯.

తునుక. దే. వి. ఖండము, ముక్క. "మ.. ఇంద్రు విలసద్బాణాళిఁ దోడ్తోన నా,బలిక్రవ్యక్ పడి సేయఁ దునుకల్ ప్రస్ఫోటకచూర్ణాక్కృతికిన్, దలప శ్రేణులుపోలె మూఁకె వెసలు .." హరి. ఉ. ౧౦, అ. ౧౭౪. వరాహ. ౭, అ. ౮౦.

తునుచు. దే. స. క్రి. (తునుఁగు శబ్దమున కు ప్రే.) త్రుంచు, ముక్కలుచేయు. "సీ. అనుపమశౌర్యంబు దాల్చి తునిచి నేవెలుచేసి వెన్నెలచాలకు జున్నొనర్చి." య. ౬, అ. ౮౪.

తునుమాడు. దే. స. క్రి. (తునుము+ఆడు - స్వార్థమున.) 1. త్రుంచు, ఖండించు, నఱకు. "గీ. విరథుఁడయ్యును సురథుండు విపులచాపహస్తుడై తూణమున బాణ మందుకొనఁగ, నలుక రెట్టింప నర్ధచంద్రాశుగమునఁ, గ్రీడి తునుమాడె నతని దక్షిణభుజంబు." జై. ౫ అ. ౭౪. భార. భీష్మ. ౨, అ. ౫౩; 2. చంపు. "క. కే ళ్లంగి వ్రేసిన ట్లా, తు ళ్లదమున మోహముఁ బట్టి తునుమాడక యీ, కిల్లలఁ దునుములు కూఁకటి, వేళ్లందక మునిఁడికొనలు విఱుచుట గాదే." ప్రబోధ. 3, అ. 3. భా. రా. అర. ౧, అ. ౨౧౪.

తునుము. దే. స. క్రి. 1. ఖండించు, నఱకు. "క... మునినాయక వేగపడకు మూఢునిఁ బొంద్రా, వని విభుని నీవు చూడఁగఁ, దునుముదు నేఁడెల్లిలోనఁ దుత్తునియలు గాన్." ఉ. హరి. 3, అ. ౭౨, భార. భీష్మ. ౨, అ. ౧౭౯; 2. త్రెంచు. "క... తునుముము సంసారరజ్జు దురితవిదూరా." భార. శాం. ౪, అ. ౨౫; 3. చంపు. "వ...అర్జును ప్రతిజ్ఞయు నభిమన్యువధకుం గ్రుద్ధుండై యర్జునుం డేడక్షౌహిణులబలంబుల నొక్కరుండ చంపి సైంధవుం దునుముటయును..." భార. ఆది. ౧, అ. ౪౬, వరాహ. ౪, అ. ౫౩; 4. కోయు, చిదుము. "సీ. అలరులు దునుమఁ రే యళివిలాసము వాయఁ గలఁకచే భ్రమయనీ చెలువలార." చంద్రి. ౪, అ. ౬౫, వసు. ౫, అ. ౩౦; 5. చీల్చు, చించు. "చ. తునుమఁగరానిజోఁడు నొక తూరియుం వమ్మయి పోనితూపులున్." అచ్చ. యు. ౭౦; 6. చెఱుచు, పోఁగొట్టు. "క. ఈగతిఁ జేర్చిన నఖిల,త్యాగము నీ కబ్బుఁ దెందు పవనీశ తనూ, వాగురయు జన్మమరణో, ద్యోగకరం బైన మనసుఁ దునుమక యున్నన్." భా. రా. ౯, అ. ౧౬౪, రా. వి. ౧, అ. ౩౬.

తునె. దే. వి. తునియ, ఖండము, కణము. "ద్వి. ఆని మిషల్ మిసుమిన్నురం దెడ్డ నిప్పుతునె లన రెక్కలం దోంచెనగ్రమున." ద్వి. తి. సా. ౨౯. పు.

తున్నము. సం. వి. అ. ప్రం. నంది శ్రీ. విణ. (తుద.ధా.)
1. త్రుంపబడినది; 2. కొట్టబడినది.

తున్మాడు. దే. స. క్రి. త్రుంచు, ఖండించు. "ఆ. నిన్నుఁ బట్టి యప్పుడ సీఱఁగ దలలు దున్మాడ నాకు శక్య మగునదైన, జగముచేతినిండఁ జచ్చిన వాఁడవు, మున్న కాన శవము ముట్ట ననిన." నిర్వ. ౪, ఆ. ౧౧, భా. రా. అర. ౨, ఆ. ౨౦౨.

తున్మితూఁటాడు. దే. స. క్రి. (తున్మి+తూఁట+ఆడు)
1. త్రుంచిముక్కలుచేయు. "శా. లోలంబాలక యొత్తు గ్రుంకి బిసవల్లుల్ దున్మితూఁటాడి కెం, గేలం బట్టి కటాలున న్నొగసె..." వసు. 3, ఆ. ౧౬౯; 2. చంపు. "మ. బలిమిన్ వేవురు పార్శ్వ రక్షకు లెదుర్పన్ దున్మితూఁటాడి..." జై. 2, ఆ. ౪; 3. నశింపఁజేయు. "సీ. తతిభక్తిఁ తర్పణం బాచరించినమర్త్యుఁ డఘకోటిఁ దున్మితూఁటాడఁ జాలు." కాశీ. ౬. ఆ. 3౯.

తున్ము. దే. స. క్రి. 1. ఖండించు, నఱకు. "చ. అన పుడు నవ్వుచున్ నృపకులాగ్రణిసింహముఁ దున్మి వైచి..." సుద. 3, ఆ. ౧౬౦; 2. చంపు. "మ. వినుఁడీ సర్వజనంబులుం గడఁగి యీనిప్రున్ దురాలాపు దుర్జనుని ద్దున్మెద..." భార. అర. ౪, ఆ. 3౫౫.

తుపాకి. దే. వి. (క. తుపాకి. త. తుపాక్కి. హిం. తుఫక్కు.) మందుగుండు వేసి గట్టించి కాల్చు ఇనుపగొట్టము గలసాధన. "ద్వి. తమ్మితుపాకి కెందలిరాకువంకి..." ద్వి. నల. ౧, ఆ. ౧౭౧, పం. ఆం. భా. ద్వి. ౨౧౧.

తుపాకిగుండు. ద్వ. స. (తుపాకి+గుండు) తుపాకిలో నుపయోగించుగోళము. "సీ. రటితదిక్తటనట త్పెటపెటార్భటులతో ఘోరమైనతుపాకిగుండ్ల చేత." కృష్ణ. 3, ఆ. ౫.

తుపాకిత్రాడు. దే. వి. (తుపాకి+త్రాడు.) జానకి త్రాడు. "చ... మైకొను చీకటినోఁకమూఁకచే నదరుతుపాకిత్రాటికొడియగ్గి యనం బొడసూపెఁ బారకల్." రాధా. ౨, ఆ. ౪౧.

తుపాకిమందు. దే. వి. (తుపాకి+మందు.) తుపాకు లతో యుద్ధముచేయుసైనికనివహము. "మ... రాతు లొండొక్కరిన్, నడవం జేరి తుపాకి మందిమొదు రెక్కం బాఱి వేట్లాడి క్రాల్వడి మీ ఱగ దమంధమంధిమిధి మిధ్వానంబు మిన్నందఁ గన్." చంద్రా. ౬, ఆ. ౭3, ఇట్లే: తుపాకి మూఁక. రా. వి. ౫, ఆ. ౧౫.

తుపాకీ. దే. వి. తుపాకి. "క. కేడెము కత్తి తుపాకీ, కాఁడియు నిండ్లమ్ము లీటెలం గొని..." ప్రబంధ. ౭౧౨.

తుపాను. దే. వి. (క. తుపాను. హిం. తూఫాన్.) గాలివాన. (శ. ర. బ్రౌ. వా.)

తుపాసి. వై. వి. (సం. ద్విభాషీ. హిం. దుబాసీ. త. తుపాషి.) 1. రెండుభాషలు వచ్చినవాఁడు, ఒక భాషను మఱియొకభాషలోనికి మార్చి చెప్పు వాఁడు; 2. ప్రభువు. "సీ. మన్నె తుపాసి వజీ రుండు పఱు వనఁ బతి..." వేంక. మాన. 3౨, ప్రబంధ. ౨౧౬.

తుపుక్కు. దే. వి. ఉమియుటయం దగుధ్వని కను కరణము. (వ్యవ.) వాఁడు తమ్మ తుపుక్కున నుమిసి నాఁడు. (శ. ర.)

తుప్ప. దే. వి. చిన్నపొద, డొంక. "వ... ఉప్పతిల్లిన చప్పళ్లకు చెప్పరంబైనఁ దుప్పలం దూఱుదుప్ప లును..." ఉ. హరి. ౪, ఆ. ౨౯, నీలా. 3, ఆ. ౨౧.

తుప్పదూలు. దే. అ. క్రి. (తూలు+తూలు - శ. ర. బ్రౌ.) మిక్కిలిచలించు. "ద్వి. జడిగొన్నభావము సాయకనిహతి, దొడరఁ దొప్పఁగఁ దోఁగి ధృతి దుప్పదూలి." నవనాథ. ౨, ఆ. ౭౯ పు.

తుప్పర వై. వి. (సం. తుషారః.) తుంపర, శీకరము. (శ. ర. బ్రౌ.)

తుప్పలుదూలు. దే. అ. క్రి. (తూలు+తూలు. శ. ర. బ్రౌ.) కలఁగు, క్షోభనొందు. "గీ... అతఁడు వెఱచి చాల, దూరముగఁ బోయి తుప్పలుదూలి యుండె." భార. శాం. ౫, ఆ. ౪౭౦.

తుప్పు. దే. వి. 1. ఉమియుటయం దగుధ్వని కను కరణము. (ఆమ్రేడితమున తుప్పుతుప్పు.) "గీ. ఉమిసెఁ దుప్పునఁ మొగముపై నొక్కరుండు." హరిశ్చ. ౪, ఆ. ౧౬౨. రామా. ౧, ఆ. ౧౫౦; 2. పడుటయం దగుధ్వని కనుకరణము. "క. పవి కల్పప్రదరంబున, నవనీపతి దుప్పుతుప్పు రనఁ బడ నేసెన్." వేం. పంచ. ౨, ఆ. ౨౦౨.

తుమికి. దే. వి. (క. తుమకి.) తిందుకము-. "ఆ. ఘల్లు చింత మొగలి చీకిరే నూదుగు; సిమ్మ తమ్మి తుమికి సెమ్మి జమ్మి,వేగి వేము మొదలు గాఁ గల మ్రాఁకులు..." వేం. పంచ. ౪, ఆ. ౯౭౬, ఆం. భా. ద్వి. ౪౬.

తుమురగు. దే. అ. క్రి. (తుమురు+అగు.)- పిఱుగు, ఖండితమగు. "ద్వి. భ్రమ గానక దధీచిపయిఁ బ్రయోగింపఁడుము పైనచక్రంబు తుమురులే సాక్షి." పండితా. వాద. ౨౨౭. పు.

తుమురు. దే. వి. అల్పరేణువు,పొడి. "వ...పలు దఱుగు లైనగదాప్రహతులం దునియలు పఱియలు దుమురుల్లైనై సీసకంబులు కత్తళంబులు ధరాతలంబునం దొరంగె." భార. శల్య. ౨, ఆ. ౨౯౬, ఆం. భా. ద్వి. ౨౨౦.

తుములము. సం. వి. అ. పుం. న. 1. దొమ్మియుద్ధము, సందడికయ్యము; తాండ్ర. - విశే. (అ. ఆ. ఆ.) సంకులమైనది, సందడియైనది.

తుమ్మ. దే. వి. ముండ్లు గల ఒకరకముచెట్టు, అరిమేదము-. "సీ. పుడుకుమ్రాన్వలితావిపువ్వుఁ దేనియ లానుమగ తేఁటి తుమ్మకొమ్మలకుఁ జనునె." నీలా. ౨, ఆ. ౭౬, ఆం. భా. ద్వి. ౪౮.

తుమ్మి. వై. వి. (సం. తుంబీ.) ద్రోణము, ఒకరకము కూరాకు-. "మ. గురుగుం జెంచలిఁ దుమ్మి లేద గిరిసాకుం దింత్రిణీ పల్లవోత్కరముం గూడఁ బొరంటెనూనియలతోఁ గట్టా వికట్టా రుగో, గిరము..." ఆము. ౪, ఆ. ౧౩౪. ఆం భా. ద్వి. ౨౩.

తుమ్మికి. దే. వి. తిందుకము-. "సీ...కలివెపండులుఁ దొడితెందపండ్లుఁ దుమ్మికిపండ్లు జానపండులు గంగ రేనుపండ్లు." కాశీ. ౩, ఆ. ౬౯.ఆం.భా.ద్వి.౪౬.

తుమ్మిపూరాజనాలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. తుమ్మిపూరాజనా లమ్మదుకొణిగెలు జీనువ ముక్కులు చిలుకముక్కులు..." హంస. ౪, ఆ. ౧౭౮.

తుమ్ము. దే. అ. క్రి. క్షుతముచేయు. "ఉ. తుమ్మిన యప్పుడుం బురముల్రోవఁ జరించినయప్డు వారి పానమ్మొనరించినప్పు డశనంబు భుజించినయప్డు... వారువం దగున్." కాశీ. ౯, ఆ. ౨౦౪, భాగ. ౯, స్కం. ౧౯౯. వి. క్షుతము. "ఆ. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ,జులుకపలయుఁ..." భార. విరా ౧, ఆ. ౧౩౭, ఆం. భా. ద్వి. ౧౨౬.

తుమ్మెద. దే. వి. భ్రమరము,తేఁటి. "సీ. తుమ్మెదల తోడఁ గూడికసమివోలె, సెలప్రగాఁ బోఁచె గిరి కన్యసెమ్మొగంబు." హర. ౪, ఆ. ౯౨, ఆం. భా. ద్వి. ౨, ఆ. ౯౫.

తుమ్మెదకంటు. దే. వి. (తుమ్మెద+కంటు.) చంపకము, సంపెంగ-. "ఉ. తుమ్మెదకంటు పూమొగడతోఁ దులమూఁగు లతాంగిముక్కు..." రామా. ౪, ఆ. ౬౬.

తుమ్మెదమామిడి. దే. వి. (తుమ్మెద+మామిడి.) కోశామ్రము కొండమామిడి. - (శ. ర.)

తుమ్మెదరేఁపుళ్లు. దే. వి. బ. (తుమ్మెద+రేఁపుళ్లు.) బాలక్రీడావిశేషము. "సీ...తుమ్మెదరేఁపుళ్లు తుమ్మర సాలెలు బంతా యుబుసకన్ను పత్తికాయ." హంస. ౩, ఆ. ౧౪౬.

తురంగద్విషము. సం. వి. ష. పుం. మహిషము,దున్న.

తురంగమము. సం. వి. అ. పుం. వేగముగాఁ బోవునది-గుఱ్ఱము. [1. గుఱ్ఱము; 2. మనస్సు.

తురంగము. సం. వి. అ. పుం.-వేగముగాఁ బోవునది.

తురంగవదనుఁడు. సం. వి. అ. పుం. కిన్నరుఁడు; ఇట్లే తురంగవక్త్రుఁడు. మొ.

తురంగవల్లు. మి. వి. వస్త్రవిశేషములు. "గీ...పొడలు పచ్చ,లును హారిణవల్లె హంసవళులుఁ దురంగ, వల్లిఁ బొదలును సామంతవళులు ననఁగఁ,దనరెడు పసందుపటములు గొనిరొ వెలకు." హంస. ౯, ఆ. ౩౯౯.

తురంగసాది. సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు.

తురంగారి. సం. వి. ఇ. పుం. 1. మహిషము,దున్న; 2. కరవీరము, గన్నేరు -.

తురంగి. సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. అశ్వగంధ, పెన్నేరు-. విశే. (న్. నీ. న్.) గుఱ్ఱము కలవాఁడు.

తురంగిక. సం. వి. ఆ. స్త్రీ. దేవతాళము, డావరడంగి-.

తురక. వై. వి. (సం. తురుష్కః.) మ్లేచ్ఛుఁడు; ఒకానొకజాతివాఁడు. "క. గోవధము సేయుంతురకల, దైవంబవు నీవు...నీరకవైరీ." స్వా. ౩, ఆ. ౪౨. ఆం. భా. ద్వి. ౨౯౦.

తురకదొగ్గలి. ద్వ. వి. (తురక+దొగ్గలి.) ఒకజాతి దొగ్గలి-. (శ. ర.)

తురకపత్తి. వ్య. వి. (తురక+పత్తి.) ఒకజాతిపత్తిచెట్టు. "సీ. గురిగింజ గురివెంద తురకపత్తియు..." హంస. ౪, ఆ. ౧౦. [(శ. ర. బ్రౌ.)

తురకపికిలి. వ్య. వి. (తురక+పికిలి.) ఒకజాతిపికిలిపిట్ట.

తురకబంతి. వ్య. వి. (తురక+బంతి.) ఒకజాతిబంతిచెట్టు. (వా.) [తాయి. (శ. ర.)

తురకతాయి. దే. వి. బౌ. (తురక+తాయి.) బొంత

తురకవేము. వ్య. వి. (తురక+వేము.) తృణనింబముచెట్టు. (శ. ర.) హంస. ౪, ఆ. ౧౧.

తురగప్రియము. సం. వి. అ. పుం. యవసస్యము. విణ. (అ. ఆ. అ.) 1. గుఱ్ఱములకు ప్రియమైనది; 2. గుఱ్ఱములయం దిష్టము గలది.

తురగము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.

తురగవల్లు. మి. వి. బ. వస్త్రవిశేషములు. "గీ. గరుడ పచ్చలు నేత్రముల్ తురగవల్లు... మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. ౨౭౨.

తురగి. సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు. ఈ. స్త్రీ. 1. ఆడుగుఱ్ఱము; 2. అశ్వగంధ, పెన్నేరుచెట్టు.

తురము. సం. వి. అ. పుం. వేగము. విణ. (అ. ఆ. అ.) వేగము గలది.

తురా. దే. వి. 1. మృదువై విలువైన పక్షియీకల తోను రత్నములతోను గూడిన శిరోభూషణవిశేషము. (దీనిని గుఱ్ఱములతలపైఁ గూడ నలంకారముగా పెట్టుదురు.) "ఉ. మోమున నేతన వ్వొసఁగ ముత్యపుటొంట్లసియాడ మల్కుతో, డామెనపెట్టి కట్టినకడానిజగాజిగి పాగమీఁద నిద్దామెఱుఁగుందురా గులుక తండ్రిపిఱుందు జయంతుఁ డాశ్వికస్తోముఁడు తోడ వచ్చె రవ జోడలరన్ వెలివాజి మీటుచున్." శశాం. ౪ ఆ. ౭. పార్వ. ౨, ఆ. ౭౦; 2. స్త్రీ శిరోభూషణవిశేషము, వాలపాశ్యాభేదము. (చూ. తురాయి.)

తురాయి = తురా. దే. వి. (క. తురాయి. త. తురాయ్. హిం. తురాహ్.) 1. మృదువై విలువ గలిగిన పక్షియీకతోను రత్నములతోడను కూడిన శిరోభూషావిశేషము. (దీనిని గుఱ్ఱములతలయందుఁ గూడ అలంకారముగా పెట్టుదురు.) "శా... కెంపుశ్మాశ్రేణింపుఁదురాయి దీపవదంపుస్వాంగెరయన్ జన్నుచున్, మిస్మాతేజిని దెచ్చినన్..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౨౦; 2. స్త్రీ శిరోభూషణవిశేషము, వాలపాశ్య. "సీ. ..తనరును వాలపాశ్యావిశేషములు సూసక తురాయి..." ఆం. భా. ద్వి. ౧౪౭. శుక. ౨, ఆ. ౩౦౫; 3. కర్ణభూషణము. "చ... తావకయవాంకురపాండు కపోలపాళికన్, బొడలుతురాయి గాఁగ నసఁబోఁడి ఘటించితిఁ గాదె యిచ్చటన్." రఘు. ౭, ఆ. ౧౦౬; 4. వృక్షవిశేషము. "సీ. అల్లిపువ్వులును నంద్యావర్తములు వాడ గన్నేరులు తురాయి గట్టిపూలు." హంస. ౧, ఆ. ౧౧౯.

తురాయీ. దే. వి. ఖడ్గపుఁబిడికొనయం దలంకారముగాఁ గట్టిపూలగుత్తి. "వ... పూలతురాయీల రాణించుచేకత్తులగింగిలలును..." ప్రబంధ. ౩౮.

తురాషాహుఁడు. సం. వి. హ. పుం. - త్వరగా శత్రువుల నణఁచువాఁడు ఇంద్రుఁడు.

తురి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. నాడె, సాలెనానిసాధన విశేషము.

తురికి. వై. వి. (సం. తురుష్కః. క. తుంకి.) 1. తురుష్కదేశపుగుఱ్ఱము; గుఱ్ఱము "సే... దేశభేదహయాభిధలు హరబ్బి దురికి కచ్చి యనంగఁ దోఁచుచుండు." ఆం. భా. ద్వి. ౧౯౬. భా. రా. యు. ౨౭౧; 2. వాహనము. "సీ. చాయ జక్కవ చంటి సాహేబు పాపని తురికి మానిక మగుదుంత యొకటి." ప్రబంధ. ౧౬౨.

తురికీ. వై. వి. (సం. తురుష్కః.) 1. తురుష్కదేశపు గుఱ్ఱము, గుఱ్ఱము. "క. శితికంఠసుతుఁడు ఖచర, స్తుతుఁడై యీయచ్చరూపుతురికీ నాస్కంధిత ధౌరితక ప్లుత రేచిత వల్గితగతులఁ దరటుచేసిన నదియున్." పాండు. ౧, ఆ. ౧౬౩. సాంబో. ౩, ఆ. ౩.

తురితము. వై. క్రి. విణ. (సం. ద్రుతమ్. త. తురితమ్. క. తురిహా. హిం. తురంత్.) శీఘ్రముగా. (శ. ర. బ్రౌ.)

తురీన. వై. క్రి. విణ. ద్రు. (సం. ద్రుతమ్.) తటాలున, శీఘ్రముగా "పంచచామరము... భోల్తుక ల్దలిర్త రచ్చర ల్మలంగలంచ మించుసంద్రునందుఁ బుట్టుచున్, దురీన లేచునట్టిజాడ దోఁపఁ జూప రెన్నఁగన్." య. ౩, ఆ. ౭౨. కువల. ౨, ఆ. ౧౪౩.

తురీయకము. సం. వి. అ. (అ. యికా. అ.) నాలుగవది, చతుర్థము.

తురీయము. సం. వి. అ. న. నాలుగవయవస్థ, సమాధ్యవస్థ. విణ. (అ. ఆ. అ.) నాలుగవది, చతుర్థము.

తురుంజీ. దే. వి. మాదీఫలము. (బ్రౌ.)

తురుసే. దే. వి. ఒకజాతికూరాకు. (శ. ర.)

తురుఫీ. దే. వి. (హిం. తురఫీ.) గుఱ్ఱపుదండు. "ఉ. మందరధీరుఁ డన్యనృపమర్దనుఁ డాపుర మేలు రాజు...హయోత్తమ మొక్క డెక్కి వచ్చెఁ దురుఫీలు కొన్ని తనచేరువ రా నుపలంబుఁ జేరఁగన్." నిరం ౪, ఆ. ౬౯.

తురుఫు = తురుఫీ. (శ. ర. బ్రౌ.)

తురుష్కము. సం. వి. అ. పుం. 1. దేశభేదము, తురకలదేశము (టర్కీ); 2. చిల్లమడ్డి, గంధద్రవ్యవిశేషము.

తురుష్కుఁడు. సం. వి. అ. పుం. తురక, తురుష్కదేశస్థుఁడు.

తుర్క. వై. వి. (సం. తురుష్కః.) మ్లేచ్ఛుఁడు, తురక. "సీ. అదె పాండవులగుడి యట దక్షిణంబునఁ గర్తారుఁ డుండు తుర్కలమసీదు." క్రీడా. ౧౪౯.

తుర్యము. సం. అ. న. బ్రహ్మము. "ద్వి. సతతంబు సురల నాశ్చర్య మొందించు, సతనితుర్యపుభక్తి నరయనికతన." ద్వి. పరమ. 3, ఆ. ౨౨౭ పు. విణ. (అ. ఆ. అ.) నాలుగవది, చతుర్థము.

తుర్వము. దే. వి. తొఱ్ఱి. "ఆ. దోసముల్లువంటి తుర్వమం దాత్మను, జూచి యాసల నటు గోసివేసి, వాసనల్ దెలిసినవాఁడెపో బ్రహ్మంబు." వేమన. ౧, ప్ర. ౨౩౦.

తుఱంగలి. దే. వి. (క. తుఱుగల్, తుఱుంగల్.) 1. కాంతి, ప్రకాశము. "సీ. ధూమంబు వొదివినఁ దుఱంగలిమెఱుఁగులు నలఁగి మాసినదీపకళిక పగిది." భార. విరా. ౧, ఆ. ౨౯౪; 2. అతిశయము. (చూ. తుఱంగలించు.)

తుఱంగలించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు, మెఱయు. "గీ. అవని గంపింప లలితపీతాంబరంబు, చెఱఁగు దూలఁ జక్రాంశులు దుఱంగలింప." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౫. హరి. ఉ. ౬, ఆ. ౧౩౦; 2. అతిశయించు, అధికమగు. "సీ. నాకవిద్యాధరీనాట్యశాలలయందుఁ దూర్యత్రయంబులు దుఱంగలింప." హర. ౭, ఆ. ౧౭౦. విజ. 3, ఆ, ౪౨; 3. ఒప్పు. తనరు. "సీ...క్రాలెన్నపరలెఁ దుఱంగలించె...అలరె నసంగ, నొప్పెన న్మాటగాఁ జెప్పఁబడుచు." ఆం. భా. కృ. ౮౩.

తుఱంగలిగొను. దే. అ. క్రి. (తుఱంగలి+కొను.) 1. ప్రకాశించు. "క. మఱునాఁడ యగుట లెస్సగ, నెఱిఁగె నిసుం డప్పను వేఁడి యొడలిసడిష్టన్, దుఱంగలిగొనఁ బర్వమగిరి, చఱికి నతిసారమున విశదంబై తోఁచెన్." భార. సభా. ౧౬౯; 2. అతిశయించు, అధికమగు. "చ. వెఱపకు మో కుమార పదివేలవిధంబుల నైన నిన్ను నే, మఱవ మజేడకుం జపుట మాని సుఖంబున దక్షవాటికన్, దుఱంగలిగొన్నసమ్మదముతో గమనింపుము..." భీమ. ౨, ఆ. ౧౫౫. కృ. శకుం. 3, ఆ. ౩౬.

తుఱి. దే. వి. గుంపు, ప్రోవు. (చూ. తుఱిగొను.)

తుఱిగొను. దే. అ. క్రి. (తుఱి+కొను.) గుంపుగూడు, క్రిక్కిఱియు. "సీ. తూఱగోలలు నాఁటి తుఱిగొని తనకుంచిపోది నమర్చినకోలపురులు...." కు. సం. ౧౨, ఆ. ౧౪౭.

తుఱుగు. దే. స. క్రి. (క. తుఱుగు. త. తుఱు.) క్రుక్కు, బలాత్కారముగా దోఁపు. "వ. వెంగలులగుప్రుచ్చు లబ్బాలుం బట్టి నోరం జీర దుఱిగి యడవికిం గొనిపోయి యొడలు జల్లించి పసిండిగానక పీనుంగు వైచి పోయిరి..." భార. శాం. ౧, ఆ. ౨౬౩, మార్క. ౨, ఆ. ౧౦౧.

తుఱుము. దే. స. క్రి. (క. తుఱుఱు, తుఱుమ్బ.) 1. తుఱుముపీఁటతోఁ గొబ్బెరచు కోరు. (శ. ర. బ్రౌ.) 2. (జుట్టు) ముడుచు, ముడివేయు. "క. నడిగేలు పట్టికొని నన్, విడువిడు మని పోవునట్టివెరవై నను వెంబడి నేఁ గెడుతలఁపునఁ గ్రమ్మడి యొకచేఁ దుఱుముకొనుచు మో మలరింపన్." య. ౫, ఆ. ౧౧౭; 3. (కొప్పున పుష్పాదులు) చెరువు, పెట్టు. "రగడ. నేర్పుమై నల్లయది నెఱులఁ దొలుపూఁ దుఱిమె." స్వా. 3, ఆ. ౮౪. శుక. ౨, ఆ. ౪౮౬; 4. చక్కఁజేయు, సవరించు. "సీ. పుత్రి కానిర్మాల్యపుష్పదామంబులఁ దొఱ్ఱి కొప్పులలోనఁ దోఁపి తుఱిమి." వైజ. 3, ఆ. ౭౦; 5. తుఱుగు, బలాత్కారముగఁ దోఁపు. "క. విలసిల్లుచు నుండఁగ మ్రుచ్చిలిపట్టి కుమారు నోరఁ జేర తుఱిమి వెంగలు లగుక్రూరులు గొందఱు .." భార. ద్రో. ౨, ఆ. ౯౨. వి. 1. కొప్పు, స్త్రీధమ్మిల్లము. "ఉ. శయ్యకుఁ బార్వఁగాఁ దుఱుము

జాఱె నవంతటఁ జక్కడిద్దఁ భోఁ,బయ్యెదజాఱె నయ్యెదిరిపాటున గ్రక్కున నీవి జాఱె..." విజ. ౧, ఆ. ౧౦౭. ఆ. భా. ద్వి. ౦౪౫; 2. (ప్రయోగం) జుట్టుముడి, శిఖ. "సీ. పువ్వులు తుఱుమున భోగియై తుఱుముఁడు వెఱ పిఁత లేక శేవెలుఁగుఁ గాని." పీఠ. ౨, ఆ. ౨౭౪; 3. పొడి. (శ. ర. ప్రా.)

తుజ్జు. దే. వి. గమనవేగమునందలిధ్వని కనుకరణము. (వ్యవ.) వాఁడు తుజ్జునఁ బరువెత్తినాఁడు.

తుల. సం. వి. ఆ. స్త్రీ. 1. త్రాసు; 2. తులాదండము; 3. నూఱుపలముల పరిమాణము; 4. పోలిక,సాదృశ్యము; 5. ఒకరాశి; 6. తూఁచుట,తోలనము.

తులకరించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు,మెఱయు. "సీ. కీవిగాఁ దిపుప్రకట్టి తటాల్నఁ దివురుచోఁ దొలుకరిమెఱుపులు తులకరింప." పశా. ౭. ఆ. ౧, ఆ. ౨౦౬; 2. ఆనందించు. "గీ. ఆఱుమఱులు దఱ లాలించి యామతించి, కలికితోలికూటమి విభుఁడు తులకరించె." కృ. శకు. 3, ఆ. ౧౫; 3. కలుగు, పొటమరించు. "వ...భావపుంభావసంభావనాపరిచయంబు సంపాదించునొంపునం బింపిల్లుఱుకూయుకలికికోమిరెల మొలకచనుమోసులం దులకరించిన తళుకుసిబ్బెంపుతళతళల దళముకొని యెనో యన..." వసు. ౪, ఆ. ౨౩.

తులకించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు, మెఱయు. "చ...నిశాచరనాథు పాదపుఁ,కరుహములందుఁ గోకములకై పడి నంచలరీతిఁ దేంట్లవై,ఖరిఁ దులకించె నిర్జరశిఖామణిమాళిఁ దనర్చుజాలికిం,పుర వలు..." దశా. ౨, ఆ. ౧౨౭. ఉ. రా. ౧, ఆ. ౯౯; 2. ఒప్పు,అందమగు. "ఉ. విండ్లకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమదోయి బంగరుం, గిండ్లకు మేటిసాటి తులకించుచనుంగవ..." హంస. ౧, ఆ. ౬౧; 3. కనఁబడు, ప్రకటితమగు. "చ. వకుళఫలానుకారు లయి వట్రువలై మెఱుఁగారు క్రొత్తముత్తికములపే రొకింత దులకింపఁగ నిర్మలహేమరత్నకర్ణికలు చలింప..." కాశీ. ౪, ఆ. ౧౪౫, శుక. ౨, ఆ. ౧౦౪; 4. కుతూహలపడు. "ఉ. గుమ్మనుకమ్మతెమ్మెరలతుం దులకించి వసంతవేళలన్, గొమ్మలు కాననాంతరనికుంజములన్ జెలువార నొంటిమైఁ,బమ్మినరక్తిచే నెనయు పల్లవకోటులఁ దూఱ నేల కోఁ,కొమ్మని కూడి క్రొవ్వలపుఁ గూర్చె బళీ సుమనస్సమూహముల్." కృ. శకు. ౧, ఆ. ౭౩; 5. ఆనందించు, సంతసించు. "ఉ. ఈవిరిఁబోఁడిఁ గైకొను మిదేటికి సందియమంచుఁ గూరిమిన్, దేవర యానతిచ్చిన మదిం దులకించుచుఁ బెండ్లి యాడెదన్, రాపలరాజు నన్నును .." య. ౪, ఆ. ౭౦.

తులకింపు. దే. అ. క్రి. (తులకించు ధా.) ప్రకాశించు. "సీ. తళుకుఁజెక్కులవానిఁ దులకింపులు కెంపులుకెంపు లొలయున వ్వోలుకువాని." వసు. 3, ఆ. ౪౬. వి. ప్రకాశము, కాంతి. "క... వాతెఱకు నమృతమే తుల,మేతులకింపులపిసాళి మిసిమికిఁ గ్రమ్మిం,చే తుల..." విజ. ౧, ఆ. ౧౧3.

తులదూఁగు. మి. అ. క్రి. (తుల+తూఁగు.) సమానమగు,పోలు. "చ...నిండు చం,దురునను సోఁగ వెన్నెలలతోఁ దులదూఁగెడు తద్గుణంబులన్." నైష. ౧, ఆ. ౪౮, రామా. ౪, ఆ. ౬౬.

తులన. సం. వి. ఆ. స్త్రీ. 1. పోలిక, సాదృశ్యము; 2. తూఁచుట; 3. ఎత్తుట; 4. మదింపువేయుట.

తులనము. సం. వి. అ. న. 1. తూఁచుట; 2. పోల్చుట; 3. ఎత్తుట.

తులనీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పోల్పఁదగినది; 2. కదలింపఁదగినది.

తులము. దే. వి. పలమునందు మూఁడవభాగము, ఒకరూపాయయెత్తు. (శ. ర.)

తులయత్. సం. శత్రు. 1. పోల్చుచున్న; 2. కదలించుచున్న.

తులయితవ్యము సం. = తులనీయము.

తులసమ్మ. మి వి. (తులసి+అమ్మ.) తులసికోట; తులసీదేవత. "గీ. రాదినగలు సదాచారరతియుఁ దేవ, పూజ నిత్యాన్నదానంబుఁ బూసబొట్టు, చిదురఁ జల్లినతులసమ్మచిన్నితిన్నె కలిగి కనుపట్టు నాతని కాఁపురంబు." శుక. ౨, ఆ. ౧౪౫.

తులసి. సం. వి. ఈ. స్త్రీ. తొళసివృ.

తులసికోట. ద్వ. వి. (తులసి+కోట.) తులసిమొక్కకుఁ గట్టినకట్టడము. (వా.)

తులసిపోఁగులు. మి. వి. బ. (తులసి+పోఁగులు.) కర్ణభూషావిశేషములు. "గీ. తులసిపోఁగులు మొదలుగాఁ గలుఁగువెట్టి, చిక్కుబాకీలు పిదప విశ్వేష పఱిచె." నిరం. ౨, ఆ. ౧౧౬.

తులసివనమాలికలు. మి. వి. ధాన్యవిశేషము. "వ... చిలుకముక్కులు మధురములు చామరాలు ఫెండె

ముడుపులు రాచవన్నెలు తులసివనమాలికలు సింధు కర్పూరాలు..." ప్రబంధ. ౧౧౨.

తులాంబరము. సం. వి. అ. న. పట్టుఁబుట్టము, దుకూలము. "ఉ. ఎల్లరు నంత మేలుకొని యింద ముఖుల్ ముఖమజ్జనాదికం, బల్లనఁ దీర్చి కైకొనఁ దులాంబరముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబులఁ బరిమళంబులు దాలిచి..." రామా. ౨, ఆ. ౧౦౭.

తులాకూటము. సం. వి. అ. న. తప్పుతూనిక.

తులాకూటుఁడు. సం. వి. అ. పుం. తప్పుతూనిక తూఁచువాఁడు.

తులాకోటి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. అందె, నూపురము; 2. త్రాసుదండెకొన; 3. దశకోటిసంఖ్య.

తులాదానము. సం. వి. అ. న. తనయెత్తుతూనిక గల బంగారు రత్నములు మున్నగువానిని దానముచేయుట.

తులాధరుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు, బేహారి.

తులాధారుఁడు. సం. వి. ఆ. పుం. 1. త్రాసుదండె; 2. త్రాసుత్రాడు.

తులాధారుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు, బేహారి.

తులాబీజము. సం. వి. అ. న. గురివెందగింజ.

తులామానము. సం. వి. అ. న. 1. త్రాసునఁ దూఁచెడు తూనిక; 2. తూనికరాయి; 3. త్రాసుదండె.

తులిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుకాటుకపిట్ట, ఖంజనిక.

తులితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తూఁచఁబడినది; 2. పోల్పఁబడినది; 3. ఎత్తఁబడినది.

తులిని. సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

తులుకాడు. దే. అ. క్రి. (తులుకు+ఆడు.) తొణఁకు, చిందు. "ద్వి. తొమ్మిదిరసములు తులుకాడుదాని, యిమ్మడివర్ణనలెసఁగంగ ద్విగుణ, మగునలంకారంబు లసలారుదాని." పండితా. దీక్షా. ౫. పు.

తులుకు. దే. వి. (క. తుళకు.) చలనము, కదలిక. "లయవిభాతి...పూ,ములుకులకు రాచిలుక పలుకులకుఁ దెమ్మెరలబెళుకులకుఁ గ్రొన్ననలతులుకులకు నెమ్మేని; యలపులకు..." య. ౫, ఆ. ౧౦౪.

తులుచే. దే. విణ. వేగముగలది. (దీనికిఁ గర్మధారయమందు నిగాగమము వైకల్పికము.) "ద్వి. తులుచనిగాలిచేఁ దొడిమలు ద్రిదిలి, గలగలరవములఁ గారాకు దుల్లె." ద్వి. భాగ. ౧౦, స్కం. (శ. ర.)

తులుచేన. దే. వి. వేగము. (శ. ర.)

తులుచు. దే. స. క్రి. చెట్టునుండి పండుమొ. రాల్చు. (బ్రా. దులుచు. వా.)

తులుము. దే. స. క్రి. రాల్చు. "మ. ధరఁ బాంథుల్ బెగడొందఁ ద్రిమ్మరియె ధర్మశ్రీమహీభృన్మహా, సరసాలానవసత్యశృంఖలితచంచన్మాదభేధంబు కే, సరసాలానవపత్రముల్ తులుముచున్..." చంద్రి. ౪, ఆ. ౩౨.

తులువ. దే. విణ. 1. తుంటరి. దుష్టుఁడు. "సీ... రాధేయుఁబోఁటితులువ లెల్లను సకలనిసృష్టి యంద్రు." భార. ఉద్యో. ౧, ఆ. ౩౬. య. ౫, ఆ. ౧౦౪; 2. మూర్ఖుఁడు, అవివేకి. "క. మొదల విచారింపక చేయుదు రది తుది నొప్పకున్న నుక్కడఁగి మదుంగుదురు విను తులువ లప్పను, లొదవక చెడు బూది నిడిన హుతములకరణిన్." భా. రా. యుం. ౧౧౧. [(శ. ర.)

తులువకత్తి. ద్వ. వి. (తులువ+కత్తి.) వంపుచురకత్తి.

తుల్యము. సం. విణ. (అ. ఆ. అ.) సాటి, సమానము.

తుల్యయోగిత. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక యర్థాలంకారము.

తువర. దే. వి. 1. తుంపర. (శ. ర.); 2. తువరభూమి, సువాసన గలభూమి (బ్రా.) "ఆ...తువర తుస్సి నాఁగఁ దువరభూమి." ఆం. భా. ద్వి. ౪.

తువరము. సం. వి. అ. పుం. కందిచెట్టు. పుం. న. ఒగరు, ఒకరసము. విణ. (అ. ఆ. అ.) ఒగరైనది.

తువరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కందిచెట్టు; 2. అడవితొగరి తీఁగ; 3. తొగరిమన్ను, పటిక.

తువరుఁడు. సం. వి. అ. పుం. శ్మశ్రుహీనుఁడు.

తువ్వర. దే. వి. 1. తుంపర,శీకరము. "క. అవ్వనముఁ జేరి మవ్వపు, జవ్వనపుల్ రాచకొమరుఁ జల్లని మంచుం, దువ్వరల నివ్వటిల్లెడు, పువ్వుంబొదరింట నునిచి భుజగకుమారుల్." కువల. ౪, ఆ. ౧౩౪. సుద. ౨, ఆ. ౧౦౭; 2. నీరు మొదలగువాని జల్లు. "క. మువ్వురమీఁద మరందపుఁ దువ్వరఁ జల్లుచుఁ బరాగతోయధరంబుల్, ఉవ్వఁగఁ జొచ్చెం దఱుచుగఁ, బువ్వులజడివాన వేలుపులు గురియింపన్." జై. ౪, ఆ. ౨౩౪.

తుషము. సం. వి. అ. పుం. 1. ఊఁక; 2. తాండ్రచెట్టు.

తుషారము. సం. వి. అ. పుం. 1. మంచు,హిమము; 2. తుంపర, శీకరము; 3. కర్పూరవిశేషము. విణ. (అ. ఆ. అ.) చల్లనిది.

తుషితులు. సం. వి. అ. పుం. బ. గణదేవతావిశేషము.
తుష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము; 2. తృప్తి, తనివి.
తుష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషము నొందినవాఁడు; 2. తనివి చెందినవాఁడు.
తుష్యత్. సం. శత్రు. 1. సంతోషించుచున్న; 2. తనివిచెందుచున్న.
తుస్సి = తువరు. ఆం. భా. ద్వి. ౪.
తుస్సు. వై. విణ. (సం. తుచ్ఛమ్.) నీచము (చూ. తుస్సుపెంజెర. శ. ర.) [సర్పము (శ. ర)
తుస్సుపెంజెర. ద్వ. వి. (తుస్సు+పెంజెర.) ఒకజాతి
తుస్సుపోవు. ద్వ. అ. క్రి. (తుస్సు+పోవు.) నీచదశ నొందు, భంగపడు. "క...తుది నీవును దుస్సు వోదు త్రుళ్లి టుడుగుమీ." భార శాం. ౪, ఆ. ౩౯౯. [చంద్రుఁడు.
తుహినకరుఁడు. సం. వి. అ. పుం. హిమకరుఁడు,
తుహినము. సం. వి. అ. న 1. మంచు, హిమము; 2. వెన్నెల, చంద్రకాంతి; 3. కర్పూరము. విణ. (అ. ఆ. అ.) చల్లనిది. [మంచుకొండ.
తుహినశైలము. సం. వి. అ. పుం. హిమవత్పర్వతము.
తుళు. దే. వి. (క. తుళువ.) కన్నడదేశమునకుఁ బడమట నుండు దేశమందలిభాష.
తుళువ. దే. వి. (త. తుళువమ్.) 1. ఒకానొకదేశము. "గీ. ఆదిగాఁ గల్గురాజులు మేదురగతిఁ, దుళువ దొరలును బోతులు దురసుగాఁగ, బ్రతిదినంబును ఘోర మారణ మొనర్ప, నిలిచి పోరాడె గజపతి బలము లపుడు." కృష్ణ. ౩, ఆ. ౫౦; 2. ఒకానొకవంశము. "గీ. ఖానివంశంబు తుళువాన్వవాయ మయ్యె." సాళ్వ ౧, ఆ. ౨౨.

## తూ

తూ. దే. వి. (క. తూ.) 1. ఉమియుటయం దగు ధ్వని కనుకరణము. "చ...తూ, యని పలుమాఱుఁ దూ పొడిచి యల్లనఁ బుప్పొడిరఁష వెట్టి ..."విక్ర. ౮, ఆ. ౬౫; 2. ఊఁదుటయం దగు ధ్వని కనుకరణము. (చూ. తూపొడుచు.); 3. నిందార్థము.
తూఁగాడు. దే. అ. క్రి. (తూఁగి+ఆడు.) ఊఁగు. "సీ. తూఁగాడుహారవంక్తులదీప్తి వెలవెల్ల నగుదీపరుచులను నతకరింప." హరి. పూ. ౮, ఆ. ౧౩౮; 2. చెలించు, కంపించు. "గీ. రయమున మెఱయంగ నొక్క—సారసము ఫాల,దేశమునయందు నాఁటించి తీవ్రశక్తి, నరము వైచినఁ దూఁగాడి యొఱఁగనూఁది, పట్టి యకృత్యవ్రణుఁడు దీర్చె పరశురాము." భార. ఉద్యో. ౪, ఆ. ౩౪౪.
తూఁగించు. దే. స. క్రి. (తూఁగు ధా. ప్రే.) జరిగించు,చేయు. "గీ...ఈవాలఁగంటి, పెండ్లిఁ దూఁగించు టది యెంతపెద్ద మాట." య. ౩, ఆ. ౧౦౧. అము. ౨, ఆ. ౯౪.
తూఁగియాడు = తూఁగాడు 1. ఊఁగు. "చ. గురుకుచకుంభభారమునఁ గోమలగాత్రము తూఁగియాడఁగా." కంధ. ౧౪౩; 2. (చలించు, కంపించు) "వ ..పరివహాపవనఘుంఘుంపాసంపాతంబులం దూఁగియాడుకరళ్లచప్పుళ్లు దిక్పుటంబుల నాస్ఫోటింప." నైష. ౮, ఆ. ౨౭.
తూఁగు. దే. అ. క్రి. 1. ఊఁగు. "మ. తమిఁ బూదీఁగెలతూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుం దూఁగుచున్నా, కొమరుంబ్రాయపుగబ్బిగుబ్బెతలయం ఘ్రిల్..." కళా. ౧, ఆ. ౪౨. చిత్ర. భా. ౨, ఆ. ౧౨౧; 2. చలించు, కదలు. "సీ. తూఁగెడు నుదుఁగురు ల్దొలెంచుఘర్మాంబువులఁ దోఁగి నుదుటిపై మలఁగుచుండ." నిర్వ. ౭, ఆ. ౭౦. (శ. ర. పా. 'తూలెడు.' ముద్రి. పా.); తూనికపడు, తోలనము నొందు. "గీ. వినుము తుల నిడి యెత్తుచో వేయునశ్వ,మేధములకంటె సత్యంబు మిగులఁ దూఁగె." మార్క. ౧, ఆ. ౨౦౭; 4. ఓర్చు, శక్తుఁడగు. "ఉ. ఓమనుజేంద్ర నీవెనుక నుద్దవిడిం బఱతెంచు దాన నీ,శామహనీయవేగమున కంకిలినీయక తూఁగనోపినం,గామితసిద్ధి పొందు..."భో. ౭, ఆ. ౧౭. ఇజ. పీఠి. ౨౫; 5. కూరుకు, కునికిపడు. "ఆ. మేను మ్రానువడఁగ మీలితోన్మీలిత,లోచనాంబుజయుగళుండ వగుచుఁ దూఁగనేల నాదులోడలవై నెమ్మది, నిదురవోదు రమ్ము నృపకుమార." విక్ర. ౨, ఆ. ౨౮. రామా., ౮, ఆ. ౧౧౭; 6. జరుగు, సాగు. (చూ. తూఁగించు); 7. వెడలు, ఉద్గతమగు. "సీ. మెఱుఁగులు దూఁగెడు మృదుకరవల్లిక లల్లాడఁ జల్లు పోరాడి యాడి." నిర్వ. ౮, ఆ. ౪౯; 8. సాటియగు, తుల్యమగు. (వ్యవః—) వారితో మేము తూఁగలేము; 9. దుర్బలమగు, నిస్సత్వమగు. "శా. తూఁగెం జల్లనిగాడ్పు లేమి. ఫణిసం

దోహంబు పేరాఁకటన్." పారి. ౪, ఆ. ౨౦. భార. భీష్మ. ౨, ఆ. ౭౪౭. వి. కూరుకు, కునికిపాటు. "గీ...తూఁగు తందర యనంగ, మకుకు నిద్రావిశేషంబు మాతృభూత." ఆం. భా. ప్ర. ౧౪౧. విణ. ఊఁగునది. (చూ. తూఁగుటుయ్యాల.)

తూఁగుటుయ్యాల. ద్వ. వి. (తూఁగు+ఉయ్యాల.) ఉయ్యాలమంచము, ఊఁగుట కనుకూలముగాఁ గట్టినమంచము మొదలగునది. "సీ. తూఁగుటుయ్యాలఁ దూఁగుచోఁ గొంత చెదరినయరవిరి వన్నెబా గట్లయుండ." కళా. ౨, ఆ. ౧౭. నైష. ౭, ఆ. ౧౪౮.

తూఁగుటుయ్యాల = తూఁగుటుయ్యాల. "సీ. గుజ్జుమావుల నట్టకొని వ్రేలునుఁదీఁగ తూఁగుటుయ్యాలల నూఁగి యూఁగి." కవిరా. ౨, ఆ. ౧౨౭. ఉ.రా. ౬, ఆ. ౧౭౩.

తూఁగుదివియ. ద్వ. వి. (తూఁగు+దివియ.) నిలువున పాఁతినవెదురు మున్నగు నిడుపాటికఱ్ఱ చివర త్రాళ్ల యాధారమున వ్రేలాడుచు ఊఁగుచు వెలుఁగు దీపము. (ఆకాశదీపము మొ.) "క. పగటిసెగ వదలి పడమర, డిగియెన్ రవిమండలము వడిన్ రశ్ములు వై, నిగుడ నలవిష్ణుపదమున, దిగదిగ యని వ్రేలుతూఁగుదివి యపోలెన్." చంద్ర. ౪ ఆ. ౫౪.

తూఁగుపలక. ద్వ. వి. (తూఁగు+పలక.) తాపీపనివాఁడు గోడలమట్టము చూచుటకై వ్రేలఁగట్టిన నిడుపాటి పలక. (శ. ర.)

తూఁగుమంచము. ద్వ. వి. (తూఁగు+మంచము.) తూఁగుటుయ్యాల. "గీ...బంగారుకోళ్ల, తూఁగుమంచముపై వేల్పుదొరయపోలె." య. ౫, ఆ. ౧౩. కాళ. ౩, ఆ. ౬.

తూఁగొమ్ము. దే. వి. (తూ+కొమ్ము.) ఒకవిధ మగుసుషిర వాద్యము. "వ. ఆ నగరంబు వెసనుండి దిమ్ము రేఁగిన యట్లు తూఁగొమ్ములును దప్పెట్లును...మ్రోయ." ద్వా. ౧౧, ఆ. ౨౬.

తూఁచు. దే. స. క్రి. (తూఁగు ధా. ప్రే.) తూనిక వేయు; తోలనముచేయు. "ఆ. అవనినాథ దీని యంత నీమాంసంబు, దూఁచి సాటఁ బెట్టు తొలఁగ కిపుడు." భార. అర. ౩, ఆ. ౨౩౪. నైష. ౩, ఆ. ౧౬.

తూఁట. (యు.) దే. వి. తునుక, ముక్క. "క...కృష్ణుఁ డొకయమ్మున నొ, క్కూఁటున నడిచెమఁ బలుకయు, దూఁటలుగా నేయ వాఁడుఁ దొలఁగక కడిమిన్." పద్మ. ౧౦, ఆ. ౩౨. వై. విణ. (సం. దుష్ట.) తుంటరి, దుష్టుఁడు. (చూ. తూఁటరి.)

తూఁటకట్టు. దే. అ. క్రి. (తూఁట+కట్టు.) ఖండితమగు. (శ. ర. బ్రౌ.)

తూఁటరి. వై. విణ. (తూఁట+అరి - స్వార్థమున.) తుంటరి, దుష్టుఁడు. "ఉ. తూఁటరి దోసకారి పెనుదోసి యజామిళుఁ డంతమొందుచున్." భాగ. ౬. స్కం. ౧౯౭.

తూఁటవిలుకాఁడు. ద్వ. వి. (తూఁట+విలు+కాఁడు.) తుంటవిలుతుఁడు, మన్మథుఁడు. "వ...నొసలి చిట్టంటుఁ జెమట మాటిమాటికిఁ గొనగోట మీఁటుచుఁ దూఁటవిలుకాని మోహనశక్తియుంబోలె నున్నయెడ." పి. శకుం. ౨, ఆ. ౧౩౯.

తూఁటాడు. దే. స. క్రి. (తూఁటు+ఆడు.) శిథిలము చేయు, జర్జరితముచేయు. "మ. మృగరాజున్ గిరరాజు గుంభి మఱి గింభిన్ ద్రుంచి తూఁటాడును, త్వగరిస్థూల్ గల రింత..." మల్ల. శృం. ౭౩. బ్రౌ; ౭, ఆ. ౪.

తూఁటికూర. దే. వి. ఒకజాతికూరాకు. "గీ...ఇటు తూఁటికూరాకుఁ జంద్రహాస, మెత్తుదురె యేల నామీఁద నింత కినుక." పారిజా. ౨, ఆ. ౧౬౬.

తూఁటు. దే. వి. (క. తూతు.) చిల్లి, రంధ్రము. "సీ. తూము తూఁ టనఁగను దూవర మన గను...తగుఁ గందరంబు." ఆం. భా. ప్ర. ౧౪౫. దశా. ౩, ఆ. ౧౭౩.

తూఁటుకట్టు. దే. అ. క్రి. (తూఁటు+కట్టు.) రంధ్రముపడు, తూఁటుపడు. "గీ...తమతమవీరశరంబు లెల్ల, దొరలు నొత్తిరి దివి మ్రోఁతఁ దూఁటుకట్ట." భార. ఉద్యో. ౪, ఆ. ౧౩౧.

తూఁటుపడు. ద్వ. అ. క్రి. (తూఁటు+పడు.) రంధ్రముపడు. (బ్రౌ.)

తూఁటులుపుచ్చు. దే. స. క్రి. (తూఁటులుపోవు ధా. ప్రే.) రంధ్రములుపడఁజేయు. "మానిని... పెంపెక్కినసాధుజనంబులమర్మము లెప్పుడుఁ దూఱఁగ నాడుఖలుల్, ద్రొక్కి ఖగంబులు ముక్కున నంగము దూఁటులుపుచ్చుచు నన్న వోగిన్." మార్క. ౨, ఆ. ౫౪.

తూఁటులుచేయు. దే. స. క్రి. (తూఁటులు+చేయు.) రంధ్రములు పడఁజేయు. "ఉ. తొల్లిదితియుష్మత్...

డనుపఁ దూఁటులుసేసిన సూతుఁ బిల్చి..." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౨.

తూఁటులువోవు. దే. అ. క్రి. (తూఁటులు+పోవు.) రంధ్రములఁబడు. "ఉ...సూతుమైఁ, దూఱఁ దురంగ మాంగములు దూఁటులువోవఁగ శల్యు నెమ్ములన్, గీఱ ఒడంబు గాఁడఁ బరఁగించె సముజ్జ్వలచండకాండముల్." భార. శల్య. ౧, ఆ. ౧౯౭.

తూఁటువోవు = తూఁటులువోవు. భార. ద్రో. ౯, ఆ. ౨౮. [తూఁడరి.,

తూఁడ వై. విశే. (సం. దుష్టః.) దుష్టుఁడు. (చూ.

తూఁడరి. వై. విశే. (తూఁడ+అరి - స్వార్థమున.) దుష్టుఁడు, తుంటరి. "క. నాఁ డెల్లవారు నీపూఁ, బోఁడి వలను మాను మనఁగఁ బుయిలోడక తాఁ, దూఁడరియై తలఁచియుఁబడిన, వాఁ డితనికి నేఁడు వగవ వల దనువారున్." భో. ౬, ఆ. ౧౦౮.

తూఁడి. దే. వి. బొ. ఒకజాతికూరాకుమొక్క. (చూ. తూఁటికూర.)

తూఁడు. దే. వి. బొ. (త. తండు.) తామరపువ్వు మొదలగువాని కాడ, బిసము. "క. ఛందోజ్ఞున కైనను దన, నందన నధ్వరధురీణునకునైనను నా, నందముగ నిచ్చుటం బో, లుం దూఁడుల కట్ట మ్రుచ్చిలుట తలపోయన్." భార. అను. ౨, ఆ. ౨౮౭. ఆం. భా. ప్ర. ౧౬౫.

తూఁడుతీఁగ. ద్వ. వి. తూఁడు. "చ...తూఁడుతీఁ, గలపొది మ్రుచ్చిలించు టని కశ్యపసంయమి వల్కె భూవరా." భార. అను. ౩, ఆ. ౨౩౨.

తూఁడుదిండి. దే. వి. (తూఁడు+తిండి.) హంస. "ఆ. తూఁడుదిండి మావు దోరవంగడంబునఁ, బుట్టి..." అచ్చ. యు. ౩౦. ఇట్లే. తూఁడుమేపుడుపుల్గు. అచ్చ. యు. ౯౬౨.

తూఁతకొమ్ము. దే. వి. (త. తూదనకొంబు.) పిల్లఁగ్రోవి, మురళి. "ఆ. తూఁతకొమ్ము చంకఁ దోఁపిన యెడ మెట్టు..." వేం. పంచ. ౧, ఆ. ౯౮౮.

తూఁపర. వై. వి. (సం. తుషారః.) తుంపర, శీకరము. "సీ. పన్నీటితూఁపరఁ బరఁగించుధారాగృహంబుల ఖేలవాడంబరములు." కళా. ౭, ఆ. ౩౭౦.

తూఁకణి. దే. వి. నాట్యవిశేషము. "ద్వి. డిల్లాయి తూఁకణి దేవణి జంకె." పండితా. పర్వ. ౩౭౮. పు.

తూకము. దే. వి. (తూఁగు ధా.) సమభారము. "శా. మూఁకల్ గట్టినయోధయూథపవారుల్ మొడెంబులై రాలఁగాఁ, దూకంబు ల్వెడి తేరు లాకసమునం దూలంబులై తూలఁగా..." శై. ౭, ఆ. ౪౦. సురా. ౯౮. ౭. బరువు. (వ్యవ:— ఆగిన్నె తూక మెంత?

తూకు. దే. వి. (తూఁగు ధా.) 1. బరువు. (శ. ర.); 2. ప్రమాణము, కొలఁది. "క. వరుణుండు విప్రచిత్తయు, దురమొనరింపంగ నొక్కతూకున కార్యం, బరుదై చెల్లఁగ..." హరి. ఉ. ౧౦, ఆ. ౧౯౩; 3. సమయము, కాలము. "క. పోరులు పుట్టిన దనుజులు, తూరా నతఁ డంగి యలుక దొడరినతూకే, ఘోరాహవకాలం బని, నారాయణుఁ డానతిచ్చె నాఁ డాతనికిన్." కకు. ౯, ఆ. ౧౦౨; 4. తడవ, సారి. 'గీ...ఎద్దువేఁట, మొదలుగాఁ గలవేఁటలయద నెఱింగి, తిన్నఁ డొక్కొక్కతూకు వర్తింపఁ దొడఁగె." కాళ. ౩, ఆ. ౪౭. అచ్చ. కిష్కి. ౮౪.

తూకువ. దే. వి. (తూఁగు ధా.) బరువు, భారము. "ద్వి. హృజ్జన్మభక్తుఁ డిల గుగ్గిలంబు, భావించి ధాతుకప్పడమునఁ గప్పి, కావడి తూకువగా వడిఁ దాల్చె." పండితా. పురా. ౧౨౭. పు.

తూకొను. దే. అ. క్రి. (తూఱు+కొను.) 1. దూఱు, కడఁగు. "ఉ. మీకరుణావలోకనసమేతులఁగా మముఁ జేయఁ జిత్తముల్, దూకొనె నేని మాచనవు ద్రోచుక యీఁ దగు..." భాగ. ౩. స్కం. ౯౩౦. శివధ. ౧, ఆ. ౭౧; 2. కలుగు, పొడము. "ఉ. తూలినమోముచెల్వుఁ బఱఁ దూకొనుఘర్మజలంబు వెల్లువం, దేలిన మేను .." కవిక. ౩, ఆ. ౬౯; 3. చొచ్చు, ప్రవేశించు. "క. ఎఱిఁ గెఱిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీమనంబు దూఁకొనె..." భాగ. ౧౦. స్కం. ౬౩౧. ఆం. భా. తృ. ౧౨౨; 4. అతిశయించు, ఒప్పు. "క. ఆకరిదంతము మూఁపునఁ, గైకొని శ్రీకృష్ణుఁ డమరుఁ గంసచ్యుతికై, తూకొన్న శ్వేతతనువుం, దూకొన్నసభంబుకరణిఁ జిరవిక్రముఁడై." సాంబో. ౧, ఆ. ౧౨౯. వి. పు. ౧, ఆ. ౭౩. స. క్రి. గౌరవించు. "వ...అనూనంబు లగు విమానంబు లెక్కి చచ్చి వచ్చిన సచ్చరిత్రులకుం జెచ్చెర నెదురు చని తూకొని తోకొనిపోవురంభాదికుంభికుంభకుచలకలకలంబులును." భాగ. ౮. స్కం. ౪౯౦; 5. (తూకు+కొను.) గ్రహించు. "ఉ.

కాఁడినయమ్ముచే సొలసి కంసవిరోధి శిరోధి త్రేలఁ జే, యాడక మూర్ఛవోయె భుజగాంతకు తెక్కల కొక్కలాగునం, దోడుగఁ దాలవృంతములఁ దూఁకొని చల్లనిగాలి చల్లె..." ఉ. హరి. ౧, ఆ. ౧౫౫. కవిక. ౧. ఆ. ౫౭.

తూచాతప్పకుండు. ద్వ. అ. క్రి. (తు+చ+తప్పక+ఉండు.) తు,చ అనునవి సంస్కృతభాషలో వ్యర్థమైన పాదపూరకపదములు; వానినిఁగూడ వదలకుండు-పూర్తిగా అనువర్తించు, కొంచెమైనను విడువకుండు. "మ. జనకోక్తోన్నతమైనతత్పురము తూచాతప్పకుండఁగ వ్యర్ణనసేయక వశమౌనె ..." కాశీ. ౧, ఆ. ౭౦. విక్ర. ౧, ఆ. ౧౦౦.

తూడి. దే. వి. కపోతాంఘ్రి*. (అభి)

తూణ. సం. వి. అ. స్త్రీ. అమ్ములపొది.

తూణము. సం. వి. అ. పుం. అమ్ములపొది, నిషంగము.

తూణి. సం. వి. ఈ. స్త్రీ. 1. అమ్ములపొది; 2. నీలిచెట్టు. విణ. (న్. నీ. న్.)–తూణము కలవాఁడు-విలుకాఁడు.

తూణీరము. సం. వి. అ. పుం. అమ్ములపొది.

తూదము. సం. వి. అ. పుం. 1. గంగరావి*; 2. బూరుగు*.

తూనరతుక్కము. దే. వి. బాలక్రీడావిశేషము. (శ. ర. బ్రౌ.) రూ. తూరనతుంకములు.

తూనిక. దే. వి (తూను ధా.) 1. (త్రాసుతో) తూఁచుట, ఉన్మానము. (శ. ర.); 2. పోలిక, సామ్యము. "వ. ఉత్తరావివాహాంబుచందంబునఁ బ్రముదితనరంబై నరసింహునఖరంబులభాతి నాశ్రితప్రహ్లాదగురువిభవప్రధానంబై ననమాలికాకుచంబుపేర్మిని నిరంతరపయోవర్ధకంబై, ధనదునిలయంబు తూనికను సంభృతమకరపద్మమహాపద్మకచ్ఛపంబై ..." భా. ౯, స్కం. ౭౩౦; 3. బలము(?) "ద్వి. వినుండుఁ గోల్పడె మానంబు వాలినెఁ, దూనిక చెడె శివద్రోహంబుఁ దగిలె." బస. ౪, ఆ. ౧౦౪. పు.

తూనికకోల. దే. వి. (తూనిక+కోల.) త్రాసుదండె. "సీ... తూనికకోల నాఁ దూనుకోల,యనఁ దులాదండాఖ్య యలరును..." అం. భా. ద్వి. ౩౦౦.

తూనికవేయు. దే. స. క్రి. (తూనిక+వేయు.) తూఁచు. (శ. ర. వా.)

తూనికి. దే. వి. తూనిక (చూ. తూన్కి.)

తూనిఁగ. దే. వి. పతంగిక, ఒకజాతియీఁగ. (శ. ర.) "క. సాలయక తూనిఁగలం గొ,జ్జులఁ బెట్టితి నీవు నీ చిఱుతకాలము..." భార. ఆది. ౪, ఆ. ౨౭౧. విక్ర. ౪, ఆ. ౭౫. హర. ౭, ఆ. ౧౯.

తూనిగతానిగ. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకముల్ తూనిగతానిగ చిమ్ముబుమ్ముమొగమాట చిల్లకట్టె." హంస. ౩, ఆ. ౧౪౬.

తూనీఁగ. దే. వి. పతంగిక, ఒకజాతియీఁగ. (శ. ర.)

తూను. దే. అ. క్రి. తూఁగు. (చూ. తూన్చు.)

తూన్కి. దే. వి. (తూను ధా.) (త్రాసుతో) తూఁచుట, ఉన్మానము. "గీ...సరకుదూఁచి పెట్టెడుచోటులఁ దూన్కి దరవి, పూర్వభవమున లాభంబుఁ బొందినారు." భార. అను. ౫, ఆ. ౧౦౪.

తూన్చు. దే. స. క్రి. తూఁచు, తోలనముచేయు. "ఆ. సత్య మశ్వమేధశతముఁ ద్రాసునఁ బెట్టి, తూన్ప ముల్లు మూపెఁ దులకు సత్యము..." కృ. శకుం. ౩, ఆ. ౧౩౮. ఆము. ౪, ఆ. ౧౫౧.

తూపరము. ఉభ. దే. వి. 1. చిల్లి, రంధ్రము. (శ. ర. బ్రౌ.); 2. గుహ, కందరము. "సీ తూము తూఁటనఁగను దూపర మనఁగను...కందరంబు." అం. భా. ప్ర. ౧౪౫. విణ. భ్రష్టము, చెడిపోయినది. "క. చూచెదవుగాక యే నిటు,చూచిన నయ్యసురతపము సొంపఱి ప్రకటనిష్ఠాచరణము తూపరమగు, గోచరమై మనసు త్రిప్పుకొని సోలంగన్." నృసిం. ౨, ఆ. ౭. సం. వి అ. న. యూపస్తంభముయొక్క అష్టత మైనముందటిభాగము.

తూపరాణ. దే. వి. నీళ్లు బయటికి వచ్చుతూము, జలదారి. (శ. ర.)

తూపరాణము. దే. వి. తూపరాణ. "సీ. తూపరాణ పుటమ్ము తూ మొప్పరము జలదారి యంచనఁగను దనరును జల,నిర్గమము..." అం. భా. ప్ర. ౧౫౪.

తూపరాణి. దే. వి. తూపరాణ. "వ...గుడిలోఁపల తూపరాణికడ నిలిచి..." ఆము. ౬, ఆ. ౧౦.

తూపి. వై. వి. (సం. స్థూపిః.) గుడిలో మూలవిగ్రహముందుచోటునకు మీఁద విమానమువలె ఎత్తుగాఁ గట్టినకట్టడము. (శ. ర.)

తూపు. దే. వి. అమ్ము,బాణము. "సీ. వనజాక్షిచూపులు వలరాజుతూపులు..." విక్ర. ౧, ఆ. ౧౧౯. భార. ద్రో. ౧, ఆ. ౨౫౩.

తూపురిక్క. ద్వ. వి. (తూపు+రిక్క.) బాణమువంటి ఆకారము గలనక్షత్రము - శ్రవణనక్షత్రము. (శ. ర.) [శ్రావణమాసము. (శ. ర.)

తూపురిక్కనెల. ద్వ. వి. (తూపు+రిక్క+నెల.)

తూపొడుచు. దే. అ. క్రి. (తూ+పొడుచు.) 1. ఉమియు. "చ. చను నెడఁ దాని మన్మథపిశాచము సోఁకిన నొచ్చె నంచుఁ దూ,యని పలుమాఱుఁ దూపొడిచి యల్లనఁ బుప్పొడి రక్షవెట్టి..." విక్ర. ౮, ఆ. ౫౯. హరి. పూ. ౫, ఆ. ౧౪౯; 2. ఊఁదు. "క. వదనము విదుర్చుకొనుచును, దుద నాలుకయెత్తుచేతఁ దూపొడుచుక్రియన్, గద లించుచెవుడ లోరఁగన్, మెదలించుం దగ్గ మొగ్గ మేదినిఁ బోరలున్." ద్వా. ౧, ఆ. ౯౧; 3. నిరోధించు, అడ్డుకొను. "క. ఈపాటి కదల కున్నన్, గోపంబున నన్నుఁ గూడఁ గొట్టును దీనిన్, దూపొడువం గలనే యూ,శాపరమం దుఃఖ మనుచుఁ జయ్యనననె గెన్." సిరం. ౨, ఆ. ౧౪౦. భూ. ౧౩౯.

తూబరము. సం. వి. అ. పుం. 1. యుక్తకాలమున కొమ్ములు మొలవనియెద్దు; 2. ఒగరు, ఒకరసము. విణ. (అ. ఆ. అ.) ఒగరైనది. [మన్ను, పటిక.

తూబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కందిచీ; 2. తొగరి

తూబరుఁడు. సం. వి. అ. పుం. ప్రాయమున మీసము గడ్డము రానిమగవాఁడు, పేడి.

తూము. దే. వి. 1. బండిచక్రమునడిరంధ్రము. (శ. ర. బ్రౌ.); 2. జలదారి, జలనిర్గమమార్గము. "మ. ఘనశృంగారరసోత్తరంగరుచిరంగద్వేణికిం బాసికం,బున దండం బలుగట్టకట్టి విలసన్ముక్తాకలాపచ్ఛలం,బునఁ దూ మేర్పడఁ బెట్టి కోటి గిరిజా భూ్రపుండ్రసౌభాగ్యము,ల్దనరం గస్తురిరేఖ దీర్చ నవకుల్యావై ఖరిన్ మించఁగాన్." వసు. ౫, ఆ. ౧౧౭; 3. నాలుగుకుంచముల కొలతమానము, అఢకము. "క. అచ్చులఁ ద్రాసులఁ దూములఁ, బొచ్చెంబుగఁ జేసి కపటమున నమ్మెడియూ, మ్రుచ్చువణిజులు..." విజ్ఞా. ప్రా. ౭౫. ఆం. భా. ద్వి. ౭౮౦; 4. సూది మొదలగువాని మొదలిరంధ్రము. "ఉ...నీ,విందుధరుండ వేని వర మిచ్చెద వేనియు సూదితూములో, నం దగ దార ముం జొరఁగ సా కిపు డిమ్ము పరంబు సత్కృపన్" పరమ. ౯, ఆ. ౧౬౨.

తూముకాలువ ద్వ. వి. (తూము+కాలువ.) 1. నీరు పోవుట కేర్పఱచినకాలువ. "సీ. అఖిలావనీతలో న్నుఖవృష్టికిని గెంపుఁ దూలుకాలువలనఁ దోఁచు నెవ్వి." సాంబో. ౨, ఆ. ౧౯; 2. జలనిర్గమ మార్గములు గల కాలువ. "క. కెల్లారితూము కాలువ, హల్లకములకమ్మఁదావి నపలాపించున్, సల్లలితలీలఁ దిప్పయ, వల్లభరాయప్రధానవాగ్గం బరముల్." క్రీడా. ౭౯.

తూర. దే. వి. 1. వానబొట్టు. (శ. ర. బ్రౌ.); 2. ధార, జల్లు. "సీ. తూర జల్లనఁ గను ధారాభిధాన మా..." ఆం. భా. ప్ర. ౯౫; 3. మత్స్యవిశేషము; పండుచేప. (శ. ర.) "గీ. తూల యనఁ దూర యనఁగను దోఁచు ఝషము" ఆం. భా. ప్ర. ౧౫౯.

తూరనఁగోలలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. కోలకోఁతులు బిల్లగోల్ల దూరనగోల లందలంబులు మఱి కుందికాళ్లు. గీ. నాదిగా శైశవక్రీడ లాడి రచట." వి. పు. ౯, ఆ. ౭౦౨.

తూరనతుంకములు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకాలు గీరనగింజలు పిల్ల వాలంకి బిల్లగోడు. గీ...ఆది యైనశైశవక్రీడావిహార సరణి." కాశీ. ౩, ఆ. ౩౩.

తూరనెత్తు. దే. స. క్రి. (తూరన్+ఎత్తు.) పొల్లు లోనగునవి పోవునట్లు ధాన్యాదులను గాలికెసురఁ బోయు, తూరుపెత్తు. "అ. పొడవు చూడ మగల పొల్లలునాఁటల, పొల్లలును నిజంబపోలె నుండుఁ, గలనఁ దూరనెత్తఁగాఁ బోరనిప్పుడ,కాని చూచి యెఱుఁగఁ గాదు మున్ను." కు. సం. ౧౧, ఆ. ౪౫.

తూరము. సం. వి. అ. న. వాద్యభేదము.

తూరి. దే. వి. తడవ, మాఱు. (ఇది త్రిపూర్వకంబుగను ఏకాద్యర్థకశబ్దపూర్వకంబుగనే ప్రయోగింపఁబడును.) "సీ. పదిమాఱు లపసవ్యపాణిపల్లవనము నిరుగేలులంటను నేడుతూరు, లంఘ్రిద్వయంబునయం దొక్కమాఱు..." కాశీ. ౫, ఆ. ౧౯౫. ఆం. సం. మాన. ౭౨, ౭౩: సం. వి. ఈ. స్త్రీ. ఉమ్మెత్తచీ.

తూరు. దే. అ. క్రి. చీ. (సన్నగా.) తుంపరరాలు. (శ. ర.) స. క్రి. పొల్లుపోవుటకై ధాన్యాదులను గాలికెసురఁబోయు. (చూ. తూరనెత్తు.) వి.

తుచ్ఛధాన్యము, పొల్లు. "సీ. తుచ్ఛధాన్యాభిధ దోఁచుఁ దాలుతరక...గీ. తప్ప తంకర తూరు నాన్." ఆం. భా. ద్వి. ౨౩౮.

తూరుపాఱఁబట్టు. దే. స. క్రి. (తూరు+పాఱన్+పట్టు.) పొల్లుపోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయు. (శ. ర.)

తూరుపు. దే. వి. సూర్యుఁ డుదయించుదిక్కు, ప్రాగ్దిశ. "ఉ. దయ్యము నెత్తికోలు తుది దాఁకఁగ దూరుపు తెల్లవాఱె తెల్లవయ్యెను .." హర. ౨, ఆ. ౨౪, జై. ౧, ఆ. ౧౩౭.

తూరుపుకొండ. ద్వ. వి. (తూరుపు+కొండ.) ఉదయాచలము, పొడుపుకొండ. "సీ...పొడుపుకొం డనఁ దూరుపుకొం డన నుదయాద్రి యమరు." ఆం. భా. ద్వి. ౨౮. ఇట్లే:-తూరుపుగట్టు, తూరుపు గుబ్బలి. మొ.

తూరుపుదొర. దే. వి. (తూరుపు+దొర.) పూర్వదిక్పతి, ఇంద్రుఁడు. "క...తూరుపుదొర మ్మబ్బర పుతు...అనన్, సురనాథుని పేట్ల..." ఆం. భా. ప్ర. ౪౬. ఇట్లే: తూరుపుఱేఁడు. మొ.

తూరుపెత్తు. దే. స. క్రి. (తూరుపు+ఎత్తు.) 1. గాలి కెగురఁబోయు, గాలికి వాటముగా ఎత్తివిడుచు. "గీ. రట్టుగా నన్ను మగనాలిఁ బట్టి డాసి,తొర మొట్టో యనుచు దుమ్ము తూరుపెత్తు." శుక. ౨, ఆ. ౧౦౫, నిరం. ౪, ఆ. ౦౪; 2. (తల వెండ్రుకలు) దులుపు,జాడించు. "గీ ఎలయు సీత్కారములతోడ నీట్ల గ్రుక్కి,యంటుసంటులు పరికించి యంట్లఁ బొడిచి,గోరుముక్కుల దిగ దువ్వి తూరుపెత్తి,నెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె.", పాండు. 3, ఆ. ౩౦; 3. పొల్లు పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయు.(శ.ర.)

తూర్చు. దే. స. క్రి. (తూఱు ధా. ప్రే.) 1. తూఱఁ జేయు, చొనుపు. "ఉ...లోకపాలదు,ర్వాచిక సూచికాంకురపరంపరఁ దూర్చెదు మాటిమాటికిన్, నాచెవులందు నీకుఁ దగునా..." నైష. ౪, ఆ. ౭౧. ఆము. ౪, ఆ. ౧౦౭; 2.నాటించు,గ్రుచ్చు. "క. అమ్మాద్రీసుతుఁ డేపునఁ, దొమ్మిదివాలమ్ము లొడలఁ దూర్చిన నతిరోషమ్మునఁ గర్ణుండు..." భార. ద్రో. ౫, ఆ. ౧౫౬.

తూర్ణము. సం. వి. అ. న. త్వర,వేగము. విణ. (అ. ఆ. అ.) వడి కలది.

తూర్పాఱ. దే. వి. పవనము, తూర్పెత్తుట. "సీ... తూర్పాఱ యుం చనఁగను బవన మొప్పు." ఆం. భా. తృ. ౩౭. [బట్టుట. (శ. ర.)

తూర్పిడి. దే. వి. (తూర్పు+ఇడి.) తూరుపాఱఁ

తూర్పు. దే. వి. 1. ప్రాగ్దిశ. "గీ. మరువ యీామేడ పను బళ్ళిమమున దూర్పునందుఁ జూపట్టు కాంచనహర్మ్యరేఖ..." సాంబో. ౪, ఆ.౧౭౦. భాగ. ఇవి. ౬, ఆ. ౨౧౩; 2. ఎగురఁబోసి గుంచి ధాన్యాదికము పొల్లునుండి విడఁదీయుట, [illegible]హాణము. "సీ...సద్గ్రహణంబు తూర్పు నా వెల యును..." ఆం. భా. ద్వి. ౨౩౯.

తూర్పుగుబ్బలి. దే. వి. (తూర్పు+గుబ్బలి.) ఉదయాచలము. "గీ. కలుషలయమునుగు తూర్పుగుబ్బలిని బొడమె." అచ్చ. అయో. ౧౮.

తూర్పుదొర. దే. వి. (తూర్పు+దొర.) పూర్వదిక్పతి. ఇంద్రుఁడు. "గీ. తూర్పుదొరవేఁడివేలుపు దుంత రాతు, రేయునడకరిసంద్రంపుఱేఁడు గాడ్పు." భోజసుతా. ౧, ఆ. ౨౫. ఇట్లే: తూర్పు రాయఁడు. మొ.

తూర్పెత్తు. దే. స. క్రి. (తూర్పు+ఎత్తు.) 1. పొల్లు పోవుటకై ధాన్యాదులను గాలి కెగురఁబోయు. "గీ. నుఱిపి తూర్పెత్తి కడలను బిరుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి." శివధ. ౫, ఆ. ౯; 2. గాలి కెగురఁబోయు. "క. వెదకితి నచ్చోఁ గానక,కద యంత్రటఁ బ్రొద్దువోవఁగా భయమున నెమ్మది నింటికిఁ జని తూర్పెత్తెద నని యచ్చోటియిసుము దెచ్చితి గలపన్." శుక. ౨, ఆ. ౫౭౯; 3. ఎగురఁగొట్టు,రేఁగఁగొట్టు. "ఆ. వనరుహాప్తతనయవాహినీవానర, వరులు సహ్యమలయగిరులు గడచి,త్రోవ లంకదెసకు దుమ్ము తూర్పెత్తుచుఁ,జనిరి వెడ మహేంద్రశైలమునకు." రామా. ౭, ఆ. ౩౪; 4. బాధించు, పీడించు. "ఉ. అత్తటి తోడిచెల్వ లహహా యిదిగో వలి గాడ్పు మమ్ముఁ దూర్పెత్తె వసంతుఁ డెంతయుం రహించఁగ నాకులపాటుఁ జూపె..." చంద్రా. ౩. ఆ. ౭౫.

తూర్యఖండము. సం. వి. అ. పుం. వాద్యభేదము.

తూర్యము. సం. వి. అ. పుం. న. వాద్యభేదము.

తూఱ. దే. వి. పంటచేలకు నీరుపాఱించుటకై తాటి పట్టెలు మున్నగువానితో నేర్పఱచిన తూము.(వా)

తూఱఁబడు. ద్వ. అ. క్రి. (తూఱన్+పడు - స్వార్థమున.) తూఱు, చొచ్చు. "సీ. పాఱఁజాలక ముట్టఁబడి జాడ దప్పంగఁ దొలఁగి పెన్గొందులఁ దూఱఁబడియు." నిర్వ. ౪, ఆ. ౭౬.

తూఱిపోవు. దే. అ. క్రి. (తూఱి+పోవు.) తప్పించుకొనిపోవు "గీ... అయ్యాక్కజుండు,పవనుచందంబు గతిఁ బట్టుపడక తూఱి, పోయెఁ దోడియాతఁడుఁ దాను భూపసింహ." హరి. పూ. ౯, ఆ. ౪౮.

తూఱు. దే. అ. క్రి. 1. పైఁబడు, కవియు. "ఉ. చావున కోహటింప కనుపాల్వఁడు సాళ్వము దూఱినట్లు యోధావళి గిట్టి పట్టె నవనాళ్వము విశ్వభయంకరంబుగన్." జై. 3, ఆ. ౯౦. చంద్రా. ౨, ఆ. ౯౯; 2. అధికమగు. (ఈయర్థమున తుమున్నంతరూపమే ప్రయోగములఁ గన్పట్టుచున్నది.) "వ. అనుచు నవుఱులదెసకుఁ దూఱ వగచి దగ్గఱ్తికవెట్టి మఱియును." భార. విరా. ౧, ఆ. ౧౮౨, జై. ౨, ఆ. ౭౯. అ. క్రి. స. క్రి. (క. తూఱు. త. తూరల్.) 1. చొచ్చు, ప్రవేశించు. "ఉ. వేలోకవిల్లు పుచ్చికొనువేగముతోనన కౌరవేంద్రుపైఁ,దూఱ వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం, దూఱిన యట్లుగా..."భార. భీష్మ.౨, ఆ. 3౯౮, జై.౨, ఆ. ౬౮; 2. క్రిందినుండి చొచ్చిపోవు. "క... నాచల్లడముక్రిందఁ దూఱని,మల్లురు లే రెందు ధరణిమండలమందున్." భాగ. ౧౦. స్కం. పూ. ౧3౩౯. కాశీ. 3, ఆ. ౨౪; 3. ప్రార్థించు, వేఁడు. "క. కావునఁ దనయూవాప్తికి, భావమ్మున నమ్మహానుభావుఁడు ధరణీ,దేవుఁడునతగతి శ్రీయో, షావల్లభు దూఱ నతనిస్వప్నమునందున్." నిరం. ౧, ఆ. ౭౧.

తూఱుకొను. దే. స. క్రి. (తూఱు+కొను-స్వార్థమున.) చొచ్చు, ప్రవేశించు. "సీ. పాండ్యునిమధుర లోపలను గొన్నిదినాలు కట్టె లమ్మినసుద్ది కలదొ లేదొ,వారాణసిని గొప్పసొరాయికుండలోపలఁ దూఱుకొన్నది కలదొ లేదొ." పార్వ. ౪, ఆ. ౧౦౦. వేం. పంచ. 3, ఆ. ౨౭౪.

తూఱుచు. దే. స. క్రి. (తూఱు ధా. ప్రే.) తూఱఁ జేయు. (శ. ర.)

తూఱుదండెము. ద్వ. వి. (తూఱు+దండెము.) ఒక రకముగరిడిసాధన. (చూ. తూఱుదండెములాడు.)

తూఱుదండెములాడు. ద్వ. అ. క్రి. (తూఱుదండెములు+ఆడు.) - తూరుదండెములసాధన చేయు- కలిసిపోవు. "సీ. తూఱుదండెములాడు తొడవుల రుచి దీపకళికలు మంగళార్తులుగఁ జేసి...."అని. 3, ఆ. ౭౬.

తూల. ఉ. భ. దే. వి. మత్స్యభేదము, ఝషము. "గీ. తూల యనఁ దూర యనఁగను దోఁచు ఝషము." ఆం. భా. ప్ర. ౧౪౯. సం. వి. అ. స్త్రీ. 1. ప్రత్తిచె. 2. దీపపువత్తి.

తూలఁదోలు. దే. స. క్రి. (తూలన్+తోలు) పాఱఁ ద్రోలు. "చ. పడతుకదేహవల్లికకుఁ బాయపుసంపద కాపువచ్చినన్, నొదువులరాజకీరముల సున్నని పల్కులఁ దూలఁదోలె..." విక్ర. ౬, ఆ. ౪౫.

తూలఁబాఱు. దే. అ. క్రి. (తూలన్+పాఱు-స్వార్థమున.) చలించు. "శా. తూలంబాఱియు బీరువోక సురనాథుల్ చేవ మీఱన్..." కాశీ. ౨, ఆ. ౬౦.

తూలకము. సం. వి. అ. న. దూది.

తూలగించు. సం. స. క్రి. తృణీకరించు. "ద్వి. తాలిమిఁ జెఱుపఁ బండముఁ బూని రేయుఁ, దూలగించుచు వచ్చి తుంటవిల్కాఁడు." నవ. ౪, ఆ. ౧౬౫, పు. నవ. ౧, ఆ. ౫౫. పు.

తూలనాడు. దే. స. క్రి. (తూలన్+ఆడు.) నిందించు, తిట్టు. "చ. అని తనుఁ దూలనాడిన జనాగ్రణి కన్నులు విచ్చి దైత్యునిన్, గనుఁగొని...యిట్టి పరుషంబులు పల్కకు ఖొమ్మ రావణా." ఉ. రా. 3, ఆ. ౧౬౮. కాశీ. ౪, ఆ. ౨౧౫. ఇట్లే: తూలఁబలుకు.

తూలనాళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. దూదిచుట్ట, ఏకు.

తూలపుచ్చు. బ.స.క్రి. (తూలపోవు ధా. ప్రే.)లాఘవపఱచు, అవమానించు. "చ. ఘనభుజవిక్రమోన్నతుఁడు గౌరవకోటికిఁ బట్టుఁగొమ్మ, మ్మనిమొనఁ దూలపుచ్చినమహాత్ముఁడు గర్ణుఁడు..."భార. శాం. ౧, ఆ. ౭. ఉద్యో. 3, ఆ. ౨౯౮; 2. పోఁగొట్టు, హరించు. "సీ. ఇవి వేల్పుజవరాండ్ర నీడ్చి మానము దూలపుచ్చుసంకేతపుఁబువ్వుటిరవులు ..."రామా. ౭, ఆ. ౧౫౭; 3. స్రుక్కించు, నిస్సత్వముచేయు. "గీ. గాలికొమరునిఁ బెక్కింటఁ దూలపుచ్చి, నలువగ్రుద్దుపనఁటులు వగులఁగ నార్చె." అచ్చ. యు. ౧౫౧.

తూలపోవు. వి. అ. క్రి. 1. తూలు,చలించు. "సీ. ఉరవడిసేనలు దెరలఁ దెరలఁ బైఁ దోతెంచుఘూళి వెల్లడరినఁ దూలపోక." భార. విరా. ౪, ఆ. ౬౯; 2. చిన్నపోవు, అవమానమొందు. "గీ. చిన్నవోయి పీకొండుకులు సేయఁగలుగు, దోరలు బిడిచిల కరిగిరి పరఁగ భీము,నేకుకోడుకు నగ్గించుచుఁ జెలఁగి వారు,దెప్పు నొంపారఁ జని రాత్మశిబిర ములకు. వ. అని యిట్లు నాలవనాఁడు ధార్త రాష్ట్రులు తూలపోవుట సెప్పిన విని..." భార. భీష్మ. ౨, ఆ. ౨౫౬, ౨౫౭. కాశీ. ౨, ఆ. ౧౩౮; 3. స్రుక్కు,బడలు. "గీ. భావజునిచేత నొవ్వక పవనుచేతఁ, దూలపోవక యలిచేతఁ దొట్రుపడక ...గాసిగాక శకుంతలఁ గనుట మేలు." పి. శకుం. 3, ఆ. 39. [శము; 2. గంగరావిచెట్టు.

తూలము. సం. వి. అ. పుం. న. దూది. న. 1. ఆకా

తూలాడు. దే. అ. క్రి. (తూలి+ఆడు.) చలించు. "ద్వి. గాలిఁ దూలాడెడుగడ్డంబుఁ బుంక, మూల నుంచినభూతిబుట్టకాయయయును." పర. ౪, ఆ. ౧౮౯ పు. ద్వి. హరిశ్చ. ఉ. ౨౫౭౨ పం; 2. వణఁకు, కంపించు. "గీ. అలసి మేనులు దూలాడ నిలిచి రంత, నంత నయోధ్యాధముఖ్యు లాహవము దక్కి." భా. ర. విరా. ౫, ఆ. ౧౦౪.

తూలి. ఉ. భ. దే. విశే. (తూల+ఇ.) చేపలను బట్టి జీవించు ఒకానొకజాతివాఁడు. (శ. ర.) సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. వ్రత్తి; 2. దీపపువత్తి; 3. సాలె వానికుంచె; 4. చిత్రకారునికుంచె.

తూలించు. దే. స. క్రి. (తూలు ధా. ప్రే.) 1. తొలఁగించు, జార్చు. "సీ. పడఁతుల నెఱిపీఁగుఁ బాలిండ్లు వెడఁదోఁప వీలఁ బయ్యెదలు దూలించుట కును." నిర్వ. ౧, ఆ. ౫౭. భార. విరా. ౨, ఆ. ౬౪; 2. చెదరఁగొట్టు. "వ. మహాబలంబున వాతూలంబు తూలరాశిం బలెఁ దూలించుచు నవిరతశరా సారవర్షంబుతో..." చం. రా. ౮, ఆ. ౭౭; 3. బాధించు. "సీ. పాలచేరులు పట్టి తూలింప బలిమి నీడ్చుకొని డొంకలఁ దూలి చుట్టఁబెట్టు." స్వా. ౪, ఆ. ౪౨. భా. రా. సం. ౧౭౮; చంపు. "మ... శంభునివిల్ ద్రుంచె వరించె సీత భృగురాముం గెల్చె నూల్చెక్ ఖరుక్, దునిమెక్ మాయ మెకంబు నేలె రవిపుత్రుక్ వాలిఁ దూలించె..." రామా. ౭,ఆ. ౧౯౯, 3,ఆ. ౪౫; 5. బోఁగొట్టు, హరించు. "శా...త్వా,ద్రాజంభోకరచామరాని లమ మార్గక్రాంతిః దూలింపఁగన్." పారి. 3, ఆ. ౮. చిత్ర. భా. ౧, ఆ. ౫౬; 6. పడఁ వేయు. "వ...చెంజిరంబుఘూళిఁ దూలించి .." హర. ౬, ఆ. ౧౬.

తూలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిత్తరువు వ్రాయుకుంచె. 2. వ్రాసెడుకలము; 3. చిన్నయాఁక; 4. మూస; 5. నీలిచెట్టు; 6. వత్తి.

తూలికాఁడు. దే వి. (తూలి+కాఁడు - స్వార్థమున.) చేపలఁ బట్టి జీవించు నొకజాతివాఁడు, జాలరి. "గీ...తూలికాఁడు, జాలరి యనంగఁ గైవర్తసంజ్ఞ పరఁగు." ఆం. భా. ప్ర. ౧౪౯.

తూలికొను. దే. అ. క్రి. (తూలు+కొను. స్వార్థమున.) 1. పడు. "చ. పొలయుననోకవల్లిబిరిపుష్పలగుత్తుల మీఁదఁ గ్రోలుకెం,దలిరులా నాఁగ మై నడరి దంచడిపహ్నిశిఖాకలాపముల్, గలోనఁ గ్రేలి తూలికొని కాలె రయంబున..." కు. సం. ౨, ఆ. ౪౫; 2. మత్తు మొదలగువానిచే ఊఁగాడు. "చ....మెఱుంగుఁబోండ్లగుబ్బలపయి చంద్రకాంతి జిగిపయ్యెదకొంగు లెడల్చి యొందు మై, దెలియక తూలికొంచు వలిదెమ్మెరలాహిరికాఁడు త్రిమ్మ రున్." కువల. ౧, ఆ. ౮౮.

తూలిని. సం. వి. ఈ. స్త్రీ. బూరుగుచెట్టు.

తూలిపోవు. దే. అ. క్రి. (తూలి+పోవు.) లాఘవ పడు, అవమానమొందు. (చూ. తూలిపోఁబలుకు.)

తూలిపోఁబలుకు. దే. స. క్రి. (తూలిపోక్+పలుకు.) నిందించు, "ఆ. త్రుళ్లిఁబోత నీవు తూలిపోఁబలి కిన, సార మేమి తఱుగుఁ జక్రమునకు." ఉ. హరి. 3, ఆ. ౧౭.

తూలియాడు. దే. అ. క్రి. (తూలి+ఆడు.) 1.చలించు. "ఆ. గగనమండలమునఁ గాలాయసపుఁదేర, మాల కాకిపడగ దూలియాడ." నైష. ౭, ఆ. ౯౨; 2. మద్యపానాదులచే, ఊఁగాడు. "వ ..క్రొత్త విరియు నెత్తమ్మివిరుల కేసరంబులవాసనలు గ్రోలి మత్తిల్లి యుల్లాసంబునఁ దూలియాడుకొదమ తుమ్మెదకదుపులు..." నైష. ౮, ఆ. ౧౪.

తూలు. దే. అ. క్రి. (క. తూళు.) 1. చలించు, కదలు. "సీ.పరుషకేశజాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోపమానుఁడై చనుదెంచి మానుపాద్యుఁడు." భార, ఆది. ౬, ఆ. ౨౦౧. భార. ఆది. ౪, ఆ.

౪౨; 2. (మత్తు మొదలగువానిచే) ఊఁగాడు. “ఉ...పొల్చు నగమ్యతఁ దూలుచు న్సురో,ద్యానముల న్మదేభములు ప్రాణముతోఁడినగంబుఁగోఁయనన్.” ఆము. ౨, ఆ. ౨౪. 3. (భయముచే)కంపించు, వణఁకు. “ఉ....లోఁ, జేవగొనంగ లేక ధృతి చీలఁగ మానము దూలఁ దూలుచున్.” భా. రా. అయో. ౪౦. హర ౬, ఆ. ౬౪; 4. చెదరు. “క. పెను గాలిఁ దూలు మొగిళులో,యన నిభములు విఱిగి నిజబలావళి నడియన్.” భార. భీష్మ. ౨, ఆ ౨౧౬. ఆము. ౧, ఆ. 3; 5. తొలఁగు, పోవు. “క. తూలెను తనప్రాణమ్ములఁ, దాలిమితోఁ గాచె నేని...” విజ్ఞా. ప్రా. ౩౨. కాశీ. ౧, ఆ. ౩౨; 6. వ్రాలు, పడు. “మ...సురేంద్రుఁడు నెత్తుటఁ జొత్తిల్లుచు మూర్ఛవోయి కరిపైఁ దూలె న్వివైతన్యుఁడై.” ఉ. హరి. ౧, ఆ. ౪౬ వసు. ౬, ఆ. ౧౧; 7. స్రుక్కు, కృశించు. “గీ. గాలి తూలెను ధనపతి ఘనత యణఁగె...” భీమ. ౪, ఆ. ౧౦౭; 8. దుఃఖించు. “క. ఏలయ్య భూసురోత్తమ, తూలెదు నీయట్టివారు దుఃఖాంబుధిలోఁ, దేలుదురే ...” ఉ. హరి. ౨, ఆ. ౧౧; 9. నశించు, చెడు. “ఉ. తూలు సమస్తధర్మములు తొయ్యలి నేఁడిలు సేరకుండినన్. స్వా. ౨, ఆ. ౯౩. పాండు. ౯, ఆ. ౧౪౩; 10. తగ్గు, అణఁగు. “ఉ. దారుణవృత్తి నున్న ననుఁ దక్కులఁ బెట్టఁగఁ జూచెదేని నీ, పేరును బెంపుఁ దూలఁగ శపింతుఁ జుమీ యిఁక నొండు పల్కినన్.” వి. పు ౧, ఆ. ౧౪౪. ఆం. భా. తృ. ౮౮. విశ. పరుషము; దూషణము. (వ్యవః) తూలుమాట లాడకుము.

తూలుచు. దే. స. క్రి. (తూలు. ధా. ప్రే.) 1. చలింపఁజేయు. “క. తూలక తూలిచెఁ బవనునిఁ, దేలక తేలించె జలధిఁ దీవ్రానలునిన్, వ్రేలక వ్రేలిచె నీమొద ,జాలక చాలించెఁ బ్రసవశర మా కడకల్.” కకు. ౧, ఆ. ౧౯౬; 2. చెదరఁగొట్టు. “ఉ...ఘనస్ఫుట నిశ్వసితానిలంబులం, దూలిచె దేవయానములఁ దోరము లైనభుజంగసంఘముల్.” భా. రా. యు. ౧౩౬౮; పోఁగొట్టు, నశింపఁజేయు. “చ. అల వెనయం గజారులవ్రాదంతరముల్ వలి నజ్జుచేసె సం,ధిలుతమి బుత్తసంఘముల తేజముఁ దూలిచెఁ బుండరీకమం,డలిఁ దెగటార్చె...” సా. ౧, ఆ. ౧౦౧, కవిక. ౯, ఆ. ౧౨౧.

తూల్చు. దే. స. క్రి. (తూలు ధా. ప్రే.) 1. జార్చు. “గీ. అద్రిశృంగము లనుశంక నధిగమింపఁ, గోరి యుఁను బోలెఁ బలుమాఱు వారిధరము, లాత్మపవనంబుచేత నయ్యామరసతుల, పయ్యదలు దూల్చి కుచములు బయలుపఱిచె.” కవిక. ౬, ఆ. ౭౬; 2. చెదరఁగొట్టు. “ఉ ..ఆతతపక్షమహానిలంబులం,భోవహాస్థంక్తిఁ దూలములపోలికఁ దూల్పఁగ ...” పారి. ౨, ఆ. ౭౬; 3. స్రుక్కించు, బాధించు. “ఉ...శౌరిచే, సింగిణివింట వెల్లిగొను చిత్రశరంబులు సూతు నొంచి రథ్యాంగకములు ద్ధళించుచు నిజావయవంబులు దూల్ప...” పారి. ౯, ఆ. ౧౬. చంద్రి. ౪, ఆ. ౧౧౦; 3. చంపు. “శా. అమల్లక్షితినాథరత్నకరదీవ్యన్మండలాగ్రాంశుమ, ద్ధామస్థేమరణాగ్రసీమ నరిగోత్రశ్రేణులం దూల్చుచు, ద్ధామప్రౌఢిమఁ గేతువుం దునుము ...” చంద్రి. ౧, ఆ. ౩౭. (ఇవి రెండర్థములకు నుదాహరణము.) [మన్ను, పటిక.

తూవరి. సం. వి ఈ. స్త్రీ. 1. కందిచె. 2. తొగరి

తూష్ణింభావము. సం. వి. అ. పుం. మాటలాడకుండుట, మౌనము. [కుండువాఁడు.

తూష్ణీకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మాటలాడ

తూస్తము. సం. వి. అ. న. 1. జడ; 2. పాపము; 3. ధూళి.

తృ

తృంఢము. సం. విశ. (అ. ఆ. అ.) హింసింపఁబడినది.

తృంహము. సం. వి. అ. న. హింసనము.

తృఖము. సం. వి. అ. న. జాజికాయ.

తృట్టు. సం. వి. ష్. స్త్రీ. దప్పి, తృష. “చ...నన విల్తుసాధననికాయము వేలముపట్టు లంగనాకుల మటు గాన దాని విడఁగొట్టక తృట్టెకదొట్ట వీత రాగుల మని విఱ్ఱవీఁగెదరు...” పాండు. ౯, ఆ. ౧౮౨; 2. అతికాంక్ష. 3. కొబ్బెరచె.

తృణకము. సం. వి. అ. న. 1. గడ్డి,పచ్చిక; 2. పనికి మాలినగడ్డిపోఁచ.

తృణకటి. సం. వి. ఈ. స్త్రీ. పూరిగుడిసె.

తృణకుటీరము. సం. వి. అ. న. పూరిగుడిసె.

తృణకేతువు. సం. వి. ఉ. పుం. వెదురుచె.

తృణగోధ. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతితొండ.

తృణగ్రాహి. సం. వి. న్. పుం. ఇంద్రనీలమణి.

తృణజలూక. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిపురుగు.

తృణత. సం. వి. ఆ. స్త్రీ. 1. తృణభావము; 2. విల్లు.

తృణద్రుమము. సం. వి. అ. పుం.-కొమ్మలు లేకుండఁ బెరుఁగుచెట్టు—1. తాటిచెట్టు; 2. కొబ్బెర♣; 3. పోఁక; 4. మొగలి♣; 5. ఈఁత♣; 6. ఖర్జూరపుచెట్టు.

తృణధాన్యము. సం. వి. అ. న. విత్తక పండెడు గునుకు, నివ్వరి, దూసరి లోనగునది.

తృణధ్వజము. సం. వి. అ. పుం. వెదురు♣.

తృణనింబము. సం. వి. అ. పుం. 1. నేలవేము♣; 2. నేపాలనింబము ♣.

తృణప్రాయము. సం. విశ. (అ. ఆ. అ.) గడ్డిపోఁచతో సమమైనది; అల్పము.

తృణబీజము. సం. వి. అ. న. శ్యామాకము, చామ♣.

తృణము. సం. వి. అ. న. కిక్కసలోనగుగడ్డి.

తృణరాజము. సం. వి. అ. పుం. 1. టెంకాయచెట్టు; 2. తాటిచెట్టు; 3. గిఱకతాటిచెట్టు; 4. చెఱకు; 5. వెదురు ♣.

తృణశూన్యము. సం. వి. అ. న. 1. మల్లె♣; 2. మొగలి♣. విశ. తృణము లేనిది.

తృణశూన్యము. సం. వి. అ. న. 1. మల్లె♣; 2. మొగలి ♣.

తృణసార. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి♣.

తృణావర్తము. సం. వి. అ. పుం. సుడిగాలి.

తృణీకరించు. సం. స. క్రి. నిర్లక్ష్యముచేయు. "శా... మద్వీర్యమున్, సామర్థ్యంబుఁ దృణీకరించి..." మార్క. ౪, ఆ. ౨౧౪. "మ. ప్రియమ మత్తీణము నాకు నీదెస మదిన్ భీతిప్రదోద్వేగసంశయముల్ నేరఁగ నీను నీకు ఘనరక్షాకల్పనాబుద్ధి నిశ్చయ సంపాదిని నాదుతృప్తి నిను సర్వత్రాతముం జోఁకగాఁ, లియ్యఁ, రానీను తృణీకరింపు రిపుదోర్లీలాసముల్లాసమున్." భార. విరా. ౪, ఆ. ౧౫౨.

తృణ్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. గడ్డిమోపు; 2. గడ్డిమేటి; గడ్డిప్రోవు.

తృతీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. తిథులలో మూఁడవది, తదియ; 2. విభక్తులలో మూఁడవది.

తృతీయకము. సం. వి. శ. (అ. ఆ. అ.) మూఁడవది.

తృతీయము. సం. విశ. (అ. ఆ. అ.) మూఁడవది.

తృతీయాకృతము. సం. విశ. (అ. ఆ. అ.) మూఁడు చాళ్లు దున్నినది. (నేల)

తృతీయాప్రకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నపుంసకుఁడు, పేడి; 2. నపుంసకలింగము.

తృప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తనివి; 2. సంతోషము.

తృప్తుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) తృప్తినొందినవాఁడు, తనిసినవాఁడు.

తృప్ణువు. సం. విశ. (ఉ.) తృప్తిశీలుఁడు, తనివి నొందు స్వభావము గలవాఁడు.

తృప్యత్. సం. శత్ర. తృప్తినొందుచున్న.

తృప్యమాణము. సం. విశ. (అ. ఆ. అ.) తృప్తినొందింపఁబడుచున్నది.

తృప్రము. సం. వి. అ. పుం. పురోడాశము.

తృష. సం. వి. ఆ. స్త్రీ. 1. దప్పి; 2. మిక్కుటమైనయిచ్చ "క. జీవితృష దీర్పఁ జూసితె, వా వెలఁదిసహోదరుండ నగునాతృష లీలావతి నీదు సరసనం, భావనమెయిఁ దీర్పఁగనికి పాడియె చెప్పుమా." భార. విరా. ౨, ఆ. ౧౧౨. (ఈ పద్యము పైరెండర్థములకు నుదాహరణము.)

తృషితము. సం. వి. అ. న. తృష.

తృషితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. దప్పిగొన్నవాఁడు; 2. ఆశావంతుఁడు.

తృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. దప్పి; 2. మిక్కుటమైన ఇచ్చ; పేరాస.

తృష్యత్. సం. శత్ర. తృష్ణనొందుచున్న.

తృష్యము. సం. వి. అ. న. మిక్కుటమైన ఇచ్చ; పేరాస. విశ. (అ. ఆ. అ.) కోరఁదగినది.

## తె

తె. అప. 'ఒకఁడు, ఎవ్వఁడు' అను సర్వనామములకు వచ్చు మహతీవాచకప్రత్యయము ఉదా:— ఒకతె, ఎవతె. మొ.

తెంక. దే. వి. (త. తేంకు) భయము. "సీ. మనకుల దైవ మన్మన్నన లేదేని త్రిభువనారాధ్యుఁ డన్ తెంక లేక." కు. సం. ౪, ఆ. ౯౧.

తెంకగు. దే. అ. క్రి. (తెంక+అగు) భీతిచెందు. "ఉ. తెంకగు నోరచూపులును దేఁకువ తప్పిన యెసబోసలున్, ఱంకులబ్రహ్మ యీసమరరాజ్యము నెట్లు సృజించె నక్కటా." (చాటుపద్యమణిమంజరి.) [(శ. ర.)

తెంకాయ. దే. వి. (త. తేంగాయ్.) కొబ్బెరకాయ.

తెంకి. దే. వి. స్థానము, ఉనికిపట్టు. "సీ. తిగుళభూములం దెంకులుగఁ జరించిన దొడ్డచెవులపోతుల నెల్లఁ జెండివైచి." శై. ౧, ఆ. ౪౫, సీ. శకుం. ౫ ఆ. ౩.

తెంకిపట్టు = తెంకి. "సీ. ఇవిగట్టుపుమొగంబు చిప్పరాతుఁ బోఁడులఁ జగి చెట్లుగట్టిన తెంకిపట్టులు..." రామా. ౭, ఆ. ౧౫౭.

తెంచు. దే. స. క్రి. (తెగు ధా. ప్రే.) 1. తెగఁగొట్టు, ఊడ్చు. "ఉ...మన్నియో, గమ్మున నీ ప్రదేశమునఁ గ్రమ్మినమజ్జనజన్యజాడ్యపాశమ్ములఁ దెంపు..." పాండు. ౫, ఆ. ౧౪౧; 2. గిండించు, నఱకు. 'శా...తలిరాకుఁగైదువులఁ దోడ్తోఁ దాల్మి లేదింగలన్, వే తెంచె న్జగదేకవిక్రమ కళాపీఠం డొగిన్.' పి. శకుం. ౨, ఆ. ౧౬౧. వరాహ. 3, ఆ. ౯౭. అ. క్రి. 1. ఇది గమనార్థక క్రియలతోఁ గూడి శబ్దపల్లవమై యాగమనార్థ మిచ్చును. ఉదా:-చనుతెంచు, ఏఁగుదెంచు. మొ; 2. కొన్ని క్రియలకు స్వార్థమందు ప్రయుక్తమగు. ఉదా:- తోఁతెంచు, అరుదెంచు. మొ.

తెండు. దే. అ. క్రి. పరుండు. "ఉ...నెమరు వెట్టుచు నందినియట్టు నాకుచుం, బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలుపుటావుఁ జూచితే." పారి. ౨, ఆ. ౯౫, ఆము. ౫, ఆ. ౧౪౬.

తెండెగ. దే. అవ్య. ద్వ. (తెగ+తెగ) అధికముగా. "క...వనితలు చెలికిం,పొంద నెడ గంద మిడు తఱిఁ,దెండెగఁ బైపైని బూలతేనియ గురిసెన్." ప్రబంధ. ౫3౦.

తెండెప్పు. దే. విశే. (తేప+తేప) అపారము, అసంఖ్యాకము. "క. అందల మందలలే కిప్పుడందలమంద లయి యున్నవయ్య మెకంబుల్, చెందామర కొలనివలెన్,దెండెప్పు లవేమి చెప్ప దేవుఁ డెఱుంగున్." సా. ౧, ఆ. ౬౭. (శ. ర. పా.)

తెండేప = తెండెప్పు. "గీ. అందుఁ దెండేపలుగ సిరుల్ గ్రందుకొనఁగఁ,బుడమి వెలసె హుమాయూపు డమితేఁడు." య. ౧, ఆ. ౧౬.

తెంప. దే. వి. తుప్పు. "క. తెంపలు గలయడవులఁ దగిలింప నిలింపాహితుల్ స్ఫులింగము లెగయన్ దెంపెసఁగఁ బావకుఁడు..." దశా. ౨, అ. ౫౮ వేం. పంచ. ౧, ఆ. ౪౯3.

తెంపరి. దే. విశే. (తెంపు+అరి). 1. సాహసికుఁడు. "క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యొరిపలువ కతినోత్తుల నక్కా,గుంపించెదు చాపునకుం, దెంపరివై పదరువాని తెఱఁగునఁ గుమతీ." భాగ. ౭, స్కం. ద్వా. ౮, ఆ. ౧౮3. ౨౭౦; 2. కూరుఁడు. "సీ. చుఱుకరి యనఁగఁ దెంపరి యన కూరాభిధానంబు గాఁగను దనరుచుండు." అం. భా. ద్వి. ౧౮౫; 3. క్రూరుఁడు. "ఉ. తెంపరివై పొరింపొరిని దేవకిబిడ్డలఁ జిన్నికుఱ్ఱలం, జంపితివి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౪. వేం. పంచ. ౪, ఆ. ౭౮౪.

తెంపాడు. దే. స. క్రి. (తెంపు+ఆడు) నిందించు. "మ. తగునే న న్నిటులాడ నీకు ననవద్యం బైన సద్రత్నా,దిగణౌఘంబుల శుద్ధ నా బెట్టఁగవే తెంపాడ యుక్తంబె..." భా. రా. యు. ౨3౪౮.

తెంపి. దే. వి. విధవ, వితంతువు. "గీ. పఱచు తెంపికి నిత్యసౌభాగ్యమస్తు." క్రీ. డా. ౨౧౪. విశే. తెగినది,భిన్నము. "ద్వి. చింపిగొడ్డలును గుస్సినశరీరములు, తెంపి జన్నిదములఁ దరలను జాల." పండితా. పర్వ. 33౫. పు

తెంపు. దే. స. క్రి. 1. ఖండించు. (శ. ర. బ్రా.) వి. 1. తెగుట. (శ. ర.); 2. తెంచుట. (బ్రా. వా.); 3. సాహసము. "గీ. అధిప నీతనయుండు గయ్యంబు వొడుచు, తెంపు వదలక విభవంబు పెంపుమెఱసె." భార. భీష్మ. ౧, ఆ. ౧౪౨; 4. బలాత్కారము. "ద్వి... పేద ద్రెవ్వులఁ జూపఁ, బోదురే బుణము దెంపునఁ గొనువారు." ద్వి. హరిశ్చ. ఉ. ౭౦౨, పం.

తెంపుబడి. దే. విశే. మూర్ఖుఁడు. "శా. చాతుర్యంబుల చెంతఁ జేంద డు కులాచారంబు గోరండు... రతి తత్త్వప్రౌఢుండు గాఁడు భామా తెంపుబడియైనయావికటవర్త్మం జెప్పఁగాఁ గూడునే." దశ. ౭, ఆ. ౫౯.

తెక తెక. దే.వి. 1. ఉడుకుట, క్రాఁగుట మొదలగువాని యందు దగుధ్వని కనుకరణము. "చ. ఒకయెడఁ జక్రవాకము పయోరుహమిత్రుని వేఁడియెండచేఁ; దెక తెకఁ గ్రాఁగు కమ్మివిరి తేనియ తెక్కులఁ జల్లనార్చి..." పారి. ౪, ఆ. ౨౭. వరాహ. ౨, ఆ. ౬౪; 2. ఎండగాయుట, పరితపించుట, మున్నగువాని కనుకరణము. "క. ఒకకొంతదవ్వు చని చని, తెక తెక నెగ లెగయు నెండ తెరలం బొరలన్." రామా. ౫, ఆ. 3౦. "గీ. చిత్తము తెక తెక నుడికి మెత్తపడియె." పరమ. ౧, ఆ. ౧౧౪.

తెకతేర. దే. క్రి. విశే. (తేర+తేర.) 1. కడు సులభముగా. "సీ. ..తోడియుందిరను గౌస్తుభము నెవ్వఁడధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక తెకతేర యిదియేమి మొకరిపొమ్మె." పారి. ౪, ఆ. ౭౮; 2. వ్యర్థముగా. "గీ. ప్రాణ మేటికిఁ దెకతేర పాపికొనఁగ." వేం. పంచ. ౩, ఆ. ౧౭౨. (శ. ర. పా.); 3. నిష్కారణముగా. "గీ. ఇతని కెక్కుడిసామ్రాజ్య మేడ బ్రదుకు, చెడియెఁ దెకతేర యనుచుఁ గేరడము లాడె." వేం. పంచ. ౧, ఆ. ౩౬౯.

తెక్కరము. దే. వి. విలాసము. "సీ. .. తెక్కు తెక్కరమెమ్మె టెక్కు వేకు...హాయ లనఁగ విలాసమొప్పుచుండు." ఆం. భా. ప్ర. ౧౩౯.

తెక్కలి. వై. వి. (సం. తస్కరః.) దొంగతనము. "క. కొనిపోవ రాదు తెరువునఁ, గనకము తెక్కలి ఘనంబు కాకున్నను మోవను రాదు పెద్ద హేమంబు..." కేయూర. ౩, ౩౧౬. ఆం. భా. ద్వి. ౫౯౨; 2. వంచనము. "ఉ...మహోన్నతపీఠ మలంకరించునినన్, దెక్కలిఁ దాఁకి ధాత యిలఁ ద్రెళ్లెడునట్లుగఁ జేసె..." భార. శల్య. ౨, ఆ. ౪౦౨; 3. పొరపాటు. "క. అక్కట నాగురుపుత్త్రుఁ డెక్కలిఁ గోల్పడితి నెద్ది లెఱిఁగో విప్రుం, డెక్కడి తెక్కడఁ బలఁచెను, దృక్కరణోత్సాద మింత తీవ్రం బగునే." భో. ౪, ఆ. ౨౩౦; 4. బాధ. "ద్వి. నీసతితోఁ బొందు నీతోంటిపెంపుఁ, బడయుం మీ వింక నీపదము దప్పినను, గడపట నీవు తెక్కలిఁ జత్తువు..." ద్వి. మారిశ్చ. ఉ. ౨౭౧౬. పుం. విశే. 1. దొంగ. "చ...ఆత్మ పెంపెవు లయినన్ జలం బయినఁ దెక్కలి యైన మృగాగ్ను లైన...తీర్పు బేలవు తను వూరకే చెడ కిల న్గృశు నొక్కనిఁ బ్రోచుటొప్పదే." ఆము. ౬, ఆ. ౩౦; 2. వంచకుఁడు. "మ. మలయం బెక్కడ నసన్మార్గంబు పాటించి తెక్కలిదైవం బిటు నాకు నీయహితముం గావించునే .." కాశీ. ౫, ఆ. ౧౬౭; 3. రహస్యము. "క. కలలోన నైనఁ బురుషునిఁ, దెలియం జూడని కళావతీతిలకము తెక్కలిగర్భము దాల్చె నె యని, నలుగురు విని నిందచేసి నవ్వఁగ వలసెన్." చెన్న. ౧, ఆ. ౧౩౩. వి. పు. పీఠి. ౪౪; 4. క్రూరుఁడు. "క. అక్కట యంబురు లలిం దగ్గు నికోక్కఁతులమిన్న కిప్పు డిట్టిదొసంగున్, దెక్కలి దయ్యం బింకయు, నక్కటికము లేక యిట్లు హత్తింపనోకో." అచ్చ. సుం. ౧౬౯.

తెక్కలికాఁడు. ద్వ. విశే. (తెక్కలి+కాఁడు.) 1. దొంగ. "తరువోజ. భృతి దూలఁ జన నవి తిరిగ నెన్నుఁడక, తెక్కలికాఁడు పొంతెంచి రాత్రికి" భార. స్త్రీ. ౧, ఆ. ౪౩. వేంక. మాన. ౩౧. అచ్చ. బాల. ౧౫౧; 2. వంచకుఁడు. "క. హితమొనరించెద నంచున్, ధృతరాష్ట్రతనూభవునకుఁ దెక్కలికాఁడై, మృతి యొనరించెం దానును, మృతుఁడయ్యెను భ్రాతృపుత్త్రమిత్త్రయుతముగన్." భార. స్త్రీ. ౨, ఆ. ౧౩౭. చెన్న. ౨, ఆ. ౩౩.

తెక్కలికొను. దే. స. క్రి. (తెక్కలి+కొను.) అపహరించు, బలాత్కారముగా వశపఱచుకొను. "క... ఒక్కరుఁడ యమృతముఁ దెక్కలికొని యాస్వాదింపక..." భార. ఆది. ౨, ఆ. ౧౦౫.

తెక్కలిగొను = తెక్కలికొను. 1. అపహరించు. "సీ. కన్నంబు వెట్టి తెక్కలిగొని యంకంబు పలువురతోనాడి బందివెట్టి." దశ. ౬. ఆ. ౯౫; 2. చంపు. "ఉ. నిక్కము మాకుఁ జిత్తములు నీరగుచున్నవి క్రూరసత్త్వము, దెక్కలిగొన్నఁ బొక్కపడదే మదిలో నినుఁ గన్నతల్లియున్." ఉ. హరి. ౨, ఆ. ౧౩౦.

తెక్కలిపాటు. వై. వి. (తెక్కలి+పాటు.) విపత్తు. "ఉ. ఎక్కడ నెల్లలోకముల నెవ్వరుఁ గోరని కొక్కు నేఁడు మా, తెక్కలిపాటునై తివిరి దేహము వేఁడఁగ వచ్చినారము .." భాగ. ౬, స్కం. ౩౪౯.

తెక్కలీఁడు = తెక్కలికాఁడు. (అపహరించువాఁడు, దొంగ.) "సీ. లంకాధిపతితలలకు గండకత్తెర రేవతీహృదయరాజీవహేళి. "గీ. త్రిపురవనితల యాలువుతెక్కలీఁడు." వరాహ. ౫, ఆ. ౯౯.

తెక్కు. దే. అ. క్రి. మదించు. "క. నిద్దురకుఁ గన్నుమోడ్చుడు, నుద్ధవిడిం దెక్కి యున్నయుం గ్రొరగము, దృద్ధహనజ్వాలావళి, నద్దినకొఱలకు నతని నాప్తునిఁ జేసెన్." ఉద్భ. ౨, ఆ. ౧౬౧.

తెగ. దే. వి. 1. (ఎక్కువెట్టిన.) అల్లెత్రాడు, నారి. "క. అని తెగ నిండ దిగిచి యేసిన నయ్యస్త్రంబు రోదసీకుహరంబునన్, దనమెఱుఁగుల మించుఘను ..." భార. కర్ణ. ౩, ఆ. ౩౬౧. ఉ. భూమి. ౩,

ఆ. ౫౩; 2. వింటినారిని లాగుట, జ్యాకృష్టి. "క. ఇది సీతెగకొలఁదిది వీఁరదనోడము నప్పు దధి కథనము లగుము, ద్విరిధాటోపములకుఁ జ్యాలవు విల్లది నూఱువేలగా వరయంగన్." భార. విరా. ४, ఆ. ౧౦౬. రం. రా. బాల. ౬౬పు. ౫,పం; 3. నిడుపు. "రగడ. తెల్లనిజల్లులు వింజామరములఁ తెగ గలసవరా లేనికకొమ్ములు." కవిక. 3, ఆ. ౧౯౫. భాగ. ౧౦, స్కం. పూ. ౯౯౭; 4. విధము, రీతి. "సీ. మగమీల నగఁజాలు తెగఁ గీలు కొనువాలుకనుఁగవ కొకవింతకాంతి యొదవె." పాం. ౧, ఆ. ౫౬; 5. ఉపాయము. "ద్వి. ఎడ పక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ గొంతైనఁ గాశితుబాణము, కడమక్కు నొక తెగ గల్గు నిల్లి టికి." ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౧ పం; 6. పక్షము, ఉద్ది. "గీ. సీతతోఁ గూడి రఘువీరశేఖరుండు, బాలలు స్వపక్షమున సీతపక్షమునను, జల్లుపోరాడఁ గనుఁగొంచు సరసిఁ దేలె." "క. తన తెగమగువలు రఘురాముని తెగకామినుల మించి ముంచిన..." ఉ. రా. ౬, ఆ. ౬౪, ౬౯; 7. సమూహము. "చ... తనయానవాలు రఘునాయకుఁ డెవ్వరిచేతి కిచ్చెనో, మన తెగలోఁ దలంచికొనుమా యపు డన్నియుఁ గాననయ్యెడున్." రామా. ౬,ఆ. ౧౦. 8. ప్రోవు. అచ్చ. యు. ౨౩౬; 9. జాతి, కులము. "క. విను రక్కసులను వేల్పులు, ననియొడు నీ రెండు తెగల నాళ్ళుకర్తుఁడు నీఁవునుగద నడిపెడు వారు..." య. 3, ఆ. ౧౦౭.

తెగఁగొట్టు. దేశ. క్రి. (తెగన్+కొట్టు.) ఖండించు. "గీ... గట్టు తెగఁగొట్టువజ్రమునను, జంభుసంభేద మేమి యాశ్చర్య మనఁగ." దశా. ౨, ఆ. ४౨౨. కళా. 3, ఆ. ౯౧.

తెగఁగోయు. దే. స. క్రి. (తెగన్+కోయు.) 1. ఖండించు. "ఉ... మానిమానసము తద్ఘనధైర్య కఠోరశృంఖలా, సంతతి యెంతయుం గుసుమశస్త్రికలం దెగఁగోసి వైచుచున్." కళా. 3, ఆ. ౨౦; 2. తొలఁగించు. "శా. అయిక్ష్వాకుఁడు నిట్టు రంగపతి కత్యంతంబు నిత్యోత్సవ, శ్రీయోగంబులు చేయుచుం గుజనులన్ శిక్షించి వర్ణాశ్రమా, పాయంబుల్ దెగఁగోయుచున్." కకు. ४, ఆ. ౨౩.

తెగఁజూచు. దే. స. క్రి. (తెగన్+చూచు.) చంపు. "గీ. వానిఁ దెగఁజూడనై లేని వాయుపుత్త్ర, నీవు గనుఁ గొన నరిదైన నీరసైన... మేను దొఱఁగుదు." భార. విరా. ౨, ఆ. ౨౭. ఉ. రా. 3, ఆ. 3४3.

తెగఁబడు. ద్వ. అ. క్రి. (తెగన్+పడు.) సాహసించు, తెగించు. "క. మొగమున మీసము గల్గిన, మగవాఁడై తేఁ గడింది మగఁటిమి మీఱన్, దెగఁబడి పోట్లాడవలెన్, బిగువేమిర రాచముదుచ విడుతునె నిన్నున్." అహ. ౧, ఆ. ౦౦.

తెగఁబాటు. ద్వ. వి. (తెగన్+పాటు.) సాహసము. "చ. పగతుని నాయితంపుఁదెగఁబాటునఁ బైపడి గెల్వనేర్చెనన్, మగఁటిమి దూలుటే దొసఁగు మాలఁగ దానవుఁ జంపు మెన్మెయిన్." నిర్వ. ౧౦. ౯. (శ. ర. పా.)

తెగఁబాఱు. దే. అ. క్రి. (తెగన్+పాఱు.) 1. సాహసించు. "గీ. నీవు గెల్చినదాస్యంబు నీకు నేను, జేయఁగలదాన నేను గెల్చినను నీవు, నాకుఁ జేయంగఁ గలదాన వీకడిఁది, పన్నిదము సఱు మని తెగఁబాఱి పలికె." భార. అను. ౧, ఆ. ౯౦. భార. ఉద్యో. ४, ఆ. ౨౨; 2. విజృంభించు. "ఉ. పచ్చనివింటివాఁడు తెగఁబాఱక నిన్నిపు డింతదవ్వు రానిచ్చునె..." రాజ. చ. 3, ఆ. ౭౬. భార. ద్రో. 3, ఆ. ౭౯.

తెగగొను. దే. క్రి. (తెగ+కొను.) జ్యాకృష్టిచేయు. "గీ. అన్న రేంద్రుఁడు మఱియుఁ గెంపాఱు చూడ్కి, నిగుడ బ్రహ్మాస్త్ర మరిఁ బోసి తెగ గొనంగ." భా. రా. యు. ౨౨౧. స. క్రి. (బాణము) 1. సంధించు. "క. తెగగొని బ్రహ్మాస్త్రము లేఁగగడనేసిన నొకటి నొకటి దార్కొని రెండున్, గగనం బంతయుం దేజస్థగితముగాఁ జేసె..." భార. ఉద్యో. ४, ఆ. 3४౬. వరాహ. ౧౨, ఆ. 3४; 2. ఎక్కుపెట్టు. "వ... విల్లుం దెగగొని వాలంపవెల్లిం బెల్లుగాఁ జఱపిన..." పి. శకుం. 3, ఆ. ౧౧3.

తెగచు. దే. అ. క్రి. కలఁగు. "గీ. చెన్ను దఱిగిన సొగసుతో విన్ననైన, దేవయానఁ గనుంగొని తెగచి వగచి." య. 3, ఆ. ౦౨. పాండు. 3, ఆ. ౨४.

తెగటార్చు. దే. స. క్రి. (తెగటాఱు ధా. ప్రే.) 1. నశింపఁజేయు. "ఉ. మంటయుఁ బోలిశాత్రవ సమాజము నించుకయేనిశంక లేకంటఁగఁ దాఁకి తెగటార్చి మహోద్ధతశక్తికాలి..." భార. విరా.

౩, ఆ. ౨౨౮; 2. చంపు. "మ. ప్రతిపక్షుం దెగ
టార్చు నంగుళిశిఖాప్రస్ఫోటమాత్రంబునన్."
కాశీ. ౩, ఆ. ౧౯౦. ఆం. భా. తృ. ౧౨౩; 3.
(ఋణము) తీర్చు. "ద్వి. మన కెవ్వ రందు
సంబంధిబాంధవులు, మనయప్పు తెఁగటార్చ మది
వేఁడువారు." ద్వి. హరిశ్చ. ౪. ౯.

తెఁగటార్పు. దే. వి. (తెఁగటార్చు. ధా.) చంపుట,
హింస. ఆం. భా. ద్వి. ౨౬౮.

తెఁగటాఱు. దే. అ. క్రి. (తెఁగటు+ఆఱు.) 1. చచ్చు.
"సీ. బలము నాగాయుతప్రాణసమం బగు
నమ్మహారా జట్టె యడవిచచ్చు. గీ. వలనఁ దెగ
టాఱె నేమనఁ గలదు..."భార. ఆశ్ర. ౨ ఆ.
౧౬౧. మొల్ల. సుం. ౧౫౯; నశించు. "క. లోకం
బులు తెఁగటాఱఁగ, నేకార్ణవ మైనయిచట నిబ్బా
లుఁడు..."భార. అర. ౪, ఆ. ౨౫౪; 3. పూర్తి
యగు "సీ. మాకుఁ జూడంగ సొమ్మసిలి పడ్డది
గాని తెఁగటాఱఁ జచ్చుట తెలియరాదు."వరాహ.
౧౦, ఆ. ౪౫.

తెఁగటు. దే. వి. తృష్ణ, గర్వము. (శ. ర. బ్రా.)

తెఁగడ. వై. వి. (సం. త్రివృతా.) ఓషధివిశేషము.
"సీ...త్రిపుట తెలయుఁ దెగడ యనిన." ఆం.
భా. ద్వి. ౫౭.

తెఁగడిక. దే. వి. (తెఁగడు+ఇక - స్వార్థమున.) నింద.
"సీ...ఈసడింపు తెగడు తెగడిక...రోఁత
రోచ్చు . ఏవగింపు నా నపవాదసంజ్ఞయై యలరు
చుండు." ఆం. భా. ప్ర. ౧౧౫.

తెఁగడు. దే. అ. క్రి. ఉపేక్షింపఁబడు. "క. మిగులఁ
గడగండ్లఁ బడియున్, దెగడక దా రెల్ల నిపుడు
నీ మేనల్లుం,డగుకఱివేలుపుకతమున, నోగి నునుఱుల
తోడ నిల్చి యున్నారు సుమీ." నీలా. ౧, ఆ.
౬౬. (శ. ర. పా. తెఁగయక. ముద్రి.) స. క్రి.
1. నిందించు. "క. తగువార లొరులు దెగడులు,
పొగడుట యగుపలుకుపొంతఁ బోవరు..."భార.
కర్ణ. ౧, ఆ. ౩౧౩. భార. విరా. ౪, ౬౬; 2.
తిరస్కరించు. "సీ. కరువలి సుడియమిఁ గదలక
చెన్నొందునెఱివిరి తమ్ముల నుఱక తెగడి. గీ. తన
విలోచనములు..." భార. విరా. ౨, ఆ. ౭౩.
రసిక. ౧, ఆ. ౯౦; 3. ఉపేక్షించు. "క. అల్లద
తాటక...విల్లెక్కిడి యొకచిల్కునఁ, ద్రెళ్లిం
పుము పొలఁతి యనుచుఁ దెగడక దానిన్." అచ్చ.
బాల. ౧౧౬; 4. పరిహసించు. "గీ. కాంత చే
కాంతవేళలఁ గాంతునెదుటఁ,నగుచుఁ దెగడుచు
చూడుట తగవు గాదె." కాశీ. ౩, ఆ. ౬౭; 5.
ఆక్షేపించు. "సీ. ఇక్ష్వాకులవలె ఘనసిద్ధి మాటా
డవే యెందు దృష్టి యని కాంచి తెగడె." విజ.
౩, ఆ. ౨౯; 6. భయపెట్టు. "క...పరిశ్రాజల
నిధిఁ; దేలుచుఁ గైసేయఁ సఖులఁ దెగడుచుఁ
గంటన్." వసు. ౩, ఆ. ౧౭౧; 7. నిర్ణయించు.
"క. జంభారిహితుఁ డూర్వశి పైఁ,గంభీరుఁ డయి గరుణ
కలిమి రహిఁ దన్నటనా, జృంభణల తారతమ్యము,
సంభావించుటయ కాని చాలఁడు తెగడన్."
విక్ర. ౨, ఆ. ౭౭.

తెఁగదీయు. దే. అ. క్రి. (తెఁగ+తీయు.) జ్యాకృష్టి
సేయు. "శా. చండాశీ విషఘోరసాయకము
చంచజ్జ్యాసమేతంబుగా, నిండారం దెగదీసి లోక
ములు ఘూర్ణిల్లంగ రాముక్షితీశుఁ డాస్ఫోటన
సేసె .." భా. రా. కిష్కిం. ౭౨౮.

తెఁగదెంపు. దే. వి. (తెంపు+తెంపు.) సాహసము.
"ఉ...అత్తఱిఁ జిత్తినిచిత్తవీథిలో, ధీరతఁ బూని
లేని తెఁగదెంపు వహించుచుఁ బల్కె నల్కతో,
నేరము లేనిదానికరణి న్నతి యింపున నాలకింపఁ
గన్." శుక. ౨, ఆ. ౧౩౦.

తెఁగనాడు. దే. స. క్రి. (తెఁగన్+ఆడు.) 1. కఠిన
ముగాఁ బలుకు. "గీ. చెలులఁ దెఁగనాడునీకు నీ
చేత నాపుత్తలిరుఁ బ్రాయంపుముద్దురాచిలుక
తోడు." రసిక. ౩, ఆ. ౯౫. భార. ఆశ్ర. ౧,
ఆ. ౯౫; 2. నశింపఁజేయు. "మ. అగసంస్తం
భనమానిగాలి కటు డాయుంగాక యోర్వాగ్నికిం,
దెగనాడన్ వసపోనిదుర్యశపుటబ్ధిన్ శక్యమా
దాఁటఁగన్." చం. రా. ౬, ఆ. ౯౦.

తెఁగబారెఁడు. దే. విశే. (తెఁగ+బార+ఎఁడు.) మిక్కిలి
దీర్ఘము. "క. తెఁగబారెఁడనఁటి మేలిమి, చిగు
రాకులు పైచి జలము చికిలించుటయుఁన్." రా.
వి. ౨, ఆ. ౯౭, స్వా. ౩, ఆ. ౬.

తెఁగవాపు. దే. అ. క్రి. (తెఁగ+పాపు.) జ్యాకృష్టి
సేయు. "వ. అక్కర్ణుండు .. కార్ముకగుణంబున
సంధించి తెఁగవాపినం గని .." భార. కర్ణ. ౩,
ఆ. ౪౧౯, భా. రా. అర. ౧, ఆ. ౨౦౯.

తెఁగవ్రేటు. దే. వి. (తెఁగన్+వ్రేటు.) నఱకుట, ఖండ
నము. "చ. పలుకువెలందికిన్ మునికిప ట్టగుచాలుఘ

మోముదామరల్, గలిగియుఁ బ్రాఁతపల్కులు చొక్కాటముగా నుడువంగ నేరకోఁతల తెగవ్రేటులం బడియొఁ దా నొకనేరుపుకాఁడె యంచు నన్నలు వను మాటిమాటికిని నవ్వుదు రచ్చటిసేల వేలుఁపుల్." అచ్చ. బాల. 3౯.

తెగవేయు. దే. స. క్రి. (తెగన్+వేయు.) నఱకు. "క. ఆసంకులసమరంబున, వాసవుఁ డో మేలనంగ వసువ్రల్ తుషితుల్, డాసి యసిధారలఁ దెగ,వేసిరి రోసమున నసురవీరులశిరముల్." ఉ. రా. ౪, ఆ. 330, దశా. ౬, ఆ. ౯౫.

తెగించు. దే. అ. క్రి. (తెగు+ఇంచు - స్వార్థమున.) సాహసించు. "సీ. ఇవ్విధంబున నప్పొప్పి మేందు వదన, యన్యసంభోగసుఖ వేళ మబ్బె నేని,యాకసం బైన భేదించి యవల పోవ,నంత్రమఁ దెగించి యున్నయయ్యవసరమున." శుక. ౪, ఆ. ౬3.

తెగింపు. దే. వి. (తెగించు. ధా.) సాహసము. "వ... తెగింపులు నగింపులు... మెఱయన్..." భీమ. ౪, ఆ. ౬౦.

తెగిపోవు. దే. అ. క్రి. (తెగి+పోవు.) భిన్నమగు. "సీ. వలుఁదచన్నులవారి వల్లికల్ దెగిపోవఁ బయ్యెదల్ బలిమిమైఁ బట్టి తిగిచి." ఉ. రా.౪, ఆ. ౯3; 2. ముగియు. "ఉ... ఆట తెగిపోవు భటిన్..." దశ. ౪, ఆ. ౫౧; 3. విడివడు. "సీ. నగరు వెల్వడుదాఁకఁ దెగిపోయి మఱి నిల్చి తోడివిద్యాంసులఁ గూడువారు." ఆము. ౪, ఆ. ౭; 4. చనిపోవు. "క. తెగిపోయినవారేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార మానుఁడు మీఱం,దెగుదురు దడిసిన నావ్రుడు..." భార. శాం. 3, ఆ. 3౬౯; 5. తొలఁగు. "వ...పగవాఁడు బలవంతుం డింతన తెగిపోయెడివాఁడు గాఁ డీళోనన మగుడంబడి యెద్దియేని కిల్బిషం బాపాదించు..." హరి. ఉ. ౧, ఆ. ౧౪౦.

తెగియించు = తెగించు. "ఉ. ఎంతకు నేర రంత తెగియించినవారు..." శుక. ౪, ఆ. ౭౮.

తెగు. దే. అ. క్రి. భిన్నమగు, చచ్చు. "గీ. ఇంద్రు లెందఱు వో రింద్రు లేల బ్రహ్మ, లుండుదురె తటితోఁ దెగుచున్నవారు." భార. శాం. ౪, ఆ. ౪3౬. కాశీ. ౪, ఆ. ౫౮; 2. భిన్నమగు. "మ. బలిమిం ద్రెంపుడుగఁ బోలెఁ బాయవడుచుం బర్యాయభంగంబునన్, గలనూ లెల్లను నంచు మోవఁ దెగి రాఁగా..." ఆము. ౪, ఆ. 3; 3. నశించుపోవు. "చ... పండితుల్, వగతురె యున్న వారికి నవశ్యవిధే యుతఁ జన్నవారికిం, దెగువగలెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౯౫. పార్వ. 3, ఆ. ౪౯; 4. తొలఁగు. "గీ. పట్టి యీతనిఁ జెఱఁ బెట్టి పాండవులకు, దిగులు పుట్టింత మంతటఁ దెగక యొత్తి, వచ్చిరేనియు నిర్జింప వచ్చు .." భార. ఉద్యో.3, ఆ.3౯౦; 5. పూర్తియగు. "క. ఏమని చెప్పుదు నిట్లను, నామాటయుఁ దెగక మున్న హా పుత్త్రా యం,చామునిపత్నియు నప్పుడు, భూమిం బడి యుండె..." భా. రా. అయో. ౨౦3. వరాహ. ౧౦, ఆ. ౮౮. భార. ఉద్యో. ౧, ఆ. ౨౫౪; 6. సాహసించు. "చ...పాండురాజునకు ఒనించితేనిఁ దెగి చూపుము శౌర్యము నస్త్రవీర్యమున్." భార. ద్రో. 3, ఆ. ౧౯౫. దశ. ౧౦, ఆ. ౯౭; 7. సాధ్యమగు. "చ. తనభుజశక్తియుక్ రిపులదర్పము నేర్పడఁ జూచి చూచి యెట్లును దెగకున్నఁ బోక యిది లోకముచక్కటి..." భార. విరా. ౪, ఆ. ౬౧; 8. మాఱు. "మ. అనివారిక్ మగిడించి తాన చని యిన్నాదీవి నెత్తొంటికిక్, గనకం బెత్తులు రెంటి లెక్కఁ దెగినం గైకొంచు నాల్గోడలన్, నిరుపారంగ సువర్ణ మెత్తుకొని .." కేయూర. 3, ఆ. ౧౭౧; 9. పరిష్కృతమగు. "క. తెగ దిప్పుడు తగ వడుగఁగ రండు దీర్చెదను బొండు..." జై. ౮, ఆ. ౨౧౯; 10. పూర్తియగు. "శా...కాశ్మీరఖండంపుఁగే, దారమ్ముల్ తెగ నమ్మఁగా జనునె .." పాండు. 3,ఆ. ౪౦; 11. వాఁడిగల దగు. "గీ. తెగి తెగనిచిఱుకత్తికోఁతగ వధించు,టచిత మని యొాలి నిట్లేచుచున్నయవి యొ." ప్రభా. ౫, ఆ. ౧౭౪. (తెగి తెగని = కొంచెమువాఁడిగల దగు).

తెగుడు. దే. వి. (తెగు. ధా.) తెగుట. (శ. ర. బ్రా.)

తెగుదల. దే వి. అంతము, ముగింపు. "గీ. ఈమనోగ్లాని తెగుదల యెద్ది చెపుమ." నిర్వ. ౯, ఆ. ౫3, భార. అర. ౫, ఆ. 3౪౦.

తెగుదారి. దే. విశే. (తెగువ+దారి.) 1. సాహసికురాలు; సాహసికుఁడు. "చ. ధవు నెడఁబాసి వచ్చు తెగుదారికి నా కిఁక వంత యేల..." ఉ. రా. ౬, ఆ. ౨౪౦; 2. దాత. "చ...కడుసొంపు

లుగాఁ బొగడించుకోఁజుమీ, తలఁపఁగ నిప్పు డింత తెగుదారుల మైలిమి..." ప్రభా. ౧, ఆ. ౧౦౭.

తెగుదెంపు. దే. వి. (తెగు+తెంపు.) తీర్పు. "మ. యమసూనుం డపుఁ గృష్ణుఁ జూచి బకదాల్భ్య వ్యాసకణ్వాదిసం,యము లుండం దెగుదెంపు సేయు కిటు లేలా వారిఁ బొమ్మంటివి..." జై. ౮, ఆ. ౭౧౦; 2. సాహసము. "ఉ...అత్తఱిఁ జిత్తిని చిత్త వీథిలో, ధీరతఁ బాని లేని తెగుదెంపు వహించుచుఁ బల్కె నల్కతో, నేరము లేనిదాని కరణిన్." శుక. ౨, ఆ. ౧౩౦; 3. ఫలితము. "క. నాతో దని నన్నడుగుట, యీ తెగుదెంపు నకు ముగిసె నిఁక నే మనుచున్, రాతికొడుకతఁడు హాలసం,జాతకిణాశ్మాతికఠిన శయమునఁ జఱిచెన్." వేం. పంచ. ౪, ఆ. ౪౭౮; 4. సంబంధరాహిత్యము. ఉదా:-వారికి మాకుఁ దెగదెంపు లైనవి.

తెగుబడి. దే. వి. (తెగు. ధా.) 1. తెగుట. 2. దుక్కి; 3. అమ్మకము. (శ. ర. బ్రా.)

తెగులు. దే. వి. వ్యాధి. (శ. ర.)

తెగువ. దే. వి. 1. సాహసము. "క. పగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొరకున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం, బగ యడఁగించెద..." భార. భీష్మ. 3, ఆ. ౭౮౩. కాశీ. ౧. ఆ. ౧౦౭; 2. దాతృత్వము. (శ. ర.); 3. నిశ్చయము. "గీ. ఇవ్విధంబునఁ దమతమయెఱుఁగు తెఱఁగు, లందఱును జెప్ప విని కురునందనుండు, దగ విచారించి కార్యంబు తెగువ గాంచి, యెలమి వారలఁ గనుఁగొని యిట్లు లనియె." భార. విరా. 3, ఆ. ౧౧౨. భార. ఉద్యో. ౪, ఆ. ౯౪; 4. వాఁడి. (చూ. తెగువరి.)

తెగువతనము. దే. వి. (తెగువ+తనము - స్వార్థమున.) సాహసము. "గీ. తగిలి కార్చిచ్చు మ్రింగిన తెగువతనము." రాజ. శ. ౭౫.

తెగువడు. ద్వ. అ. క్రి. (తెగు+పడు.) విడిపడు. "క. మృగముతు గాకము నెలుకయుఁ, దెగువడి కచ్ఛపము పోక తేటపడిన..." నా. పంచ. ౨, ఆ. ౨౧3. (శ. ర. పా. తెగపడి. ముద్రి.)

తెగువరి. దే. విశ. (తెగువ+అరి). 1. సాహసికుఁడు; సాహసికురాలు. "క. తగ వెఱుఁగ లేక యిటు వలెఁ, దెగువరివై పలుక నీకె తీరెనొ..." చంద్ర ౧, ఆ. ౧౪౭; 2. వాఁడి గలది; 3. దాత. "చ. తెగువరివై చెలంగుభవదీయకృపాణము నైరికోటియుం, దగణితదానకేళిరత మయ్యును జీవనమీ దటన్న లో, భగుణము లేమికిం బలె విపక్షనృపాలుర కెల్ల జీవనం, బొసఁగఁ దృణవృత్తి నిచ్చు విజయోన్నత శ్రీనరసింహభూవరా." నరస. ౫, ఆ. ౭౭. (పైరెండర్థములకు నుదాహరణము.)



తెచ్చికోలు = తెచ్చుకోలు. (కల్పితము.) "క. తెచ్చికోల్నెయ్యముతోడుత..." శుక. 3, ఆ. ౪౭, దశా. ౯, ఆ. 333.

తెచ్చిపెట్టు. దే. స. క్రి. (తెచ్చి+పెట్టు.) కలిగించు. "వ...రుక్మిణ్యాదు లగుమహిషు లెనమండ్రకు వేర్వేఱ యనురూపగృహంబు లమర్చి యన్నిటికిం ద్రిదివవనంబునం గలయొప్పిదంబు లెల్లఁ దెచ్చిపెట్టి..." హరి. ఉ. ౪, ఆ. ౨౧౧. ప్రభా. 3, ఆ. ౪3.

తెచ్చు. దే. స. క్రి. తీసికొనివచ్చు. (దీనికి తేమి, తేరమి, తేక, తేరక, తేక్, తేరక్, తెచ్చుచున్, తెచ్చుచున్, తెత్తును, తే, తెమ్ము, తెందు మున్నగు రూపములు వచ్చును.) "ఉ...వా,రిచ్చటనుండి యీక్షణమ యేఁగిరి కానఁ బండ్లు తేర మీ, వచ్చు టెఱింగి రేని జనవల్లభ వారును వత్తు రింతకున్." భార. ఆది. ౪, ఆ. ౨౭, వసు. ౫, ఆ. ౭౦; 2. కల్గించు,చేయు. "క...దుష్టాచరితమైనజపవిధి, నాచెప్పినసుగతిఁ దేదు నరకము దెచ్చున్." భార. శాం. ౪, ౧3౧. కళా. ౧, ఆ. ౭; 3. వహించు. "ఉ...ఓనిఖిలపావనయంచు నుతించుఁ గాని తాఁ,గన్నుల నీరు తేఁడు భయకంపన మేతుఁడు గాఁడు భూవరా." భాగ. ౭, స్కం. ౧౯3. భాగ. ౨, స్కం. ౧3౦; 4. సంపాదించు. "క. తేరకయుండఁగఁ జేరుం, దేరంగాఁ బోలియు విధియధీనంబులు గాఁ,కారయ విత్తంబులు పురు,షారంభాయత్తములె మహాబుద్ధినిధీ." భార. శాం. ౪, ఆ. 3౭3. రామలిం. శ. ౧౭; 5. సంఘటించు,కూర్చు. "ద్వి. కూటువ మూఁకలు పాటిమై కూడ,చాటించి తెచ్చినసభలును సభలె." పండితా. వాద. ౧౭౩. పు.

తెచ్చుకొను. దే. స. క్రి. (తెచ్చు+కొను-స్వార్థమున.) వహించు. "ద్వి. అంత నాలలితాంగి యంతరంగమునఁ,గొంత ధైర్యము దెచ్చుకొన్నది యగుచు." ద్వి. పరమ. ౫, ఆ. ౪౦3.

తెచ్చుకోలు. దే. వి. (తెచ్చుకొను ధా.) తెచ్చుకొనుట. "చ... రెండుజాఅంగులంటు నొప్పని యది లేదు డాఁగ నగుఁబాటును బ్రాణముచేటుఁ దెచ్చుకోల్." భార. శల్య. ౨. ఆ. ౬౨. విణ. కల్పితము, తెచ్చిపెట్టుకొన్నది. (వృత్తియందు దంత్యాచ్చునకు లోపము) "చ. ఎలమి విమాన మెక్కి చరియించుచు నంబరవీథిఁ దెచ్చుకోలలు కను రంభ వచ్చి పురమందలి మేడలపైఁడిబొమ్మలం, గలసి యుటూరకున్న..." దశా. ౧, అ. ౮౬, రం. రా. అర. ౧౬౬, పు. ౨౭, పం.

తెట్ట. దే. వి. 1. రాశి,ప్రోవు. "క. చుట్టును బసరపు టెమ్ముల, తెట్టలఁ జూచినను మదికి దిగులయ్యెడు..." వాల్మీకి. ౨, ఆ. ౮౬; 2. సమూహము. "మ... పిట్ట తెట్టరొద సన్నగ సద్దు గావింపుచున్." చంద్రా. ౨, ఆ, ౧౦౭.

తెట్టగిలఁబడు. ద్వ. అ. క్రి. (తెట్టగిలక్+పడు.) స్వార్థమున. 1. పైకి కనఁబడు. "గీ. గర్భమున నున్నప్రజలు వెక్కస మగుటయు,నరక తల వాంచి వెడలంగ నుమిసి పిదప,యమునలోపలఁ బడునొక్క యనఁ బురంబు, మిగులఁ గాఁ గెడ వగుచుఁ దెట్టగిలఁబడియె." సాంబో. ౫, ఆ.౨౩౩; 2. అలయు. "వ... అత్తఱిఁ దత్తఱిల్లి చిట్టాడిన గుట్టున నెట్టనం దెట్టగిలంబడి వసుధేశుండు సుప్రలాపవిప్రలాపంబుల నిట్లనియె." సా. ౨, ఆ. ౧౬౯.

తెట్టగిలు. దే. అ. క్రి. 1. పైకిఁ గనఁబడు. "సీ... అంచలు గొంత,సరి గడవఁగఁ బొ అఱి మరలి బోరలు తెట్టగిల నొక్కకడ వంచి మలపు దిరిగి." ప్రభా. ౨, ఆ. ౪౨; 2. తొలఁగు. "వ...మలసి పైకొని చేకొలఁదులఁ బట్టు దప్పక నిట్టట్టు తెట్టగిలక దిట్టలై గుట్టుమట్టు లేక వీఁకఁ దాఁకుచు..." బిల్హ. ౨, ఆ. ౧౫౯; 3. అలయు. (చూ. తెట్టగిలఁబడు); 4. తేరుకొను. "వ... బెట్టునిట్టూర్పు గాడ్పులం గొట్టువడి యెట్టకేలకుం దెట్టగిలి..." రాధికా. ౪, ఆ. ౧౦౨.

తెట్టతెన్ను. దే. వి. (తెన్ను+తెన్ను.) నడివీథి. (శ.ర.)

తెట్టతెరువు = తెట్టతెన్ను. (శ. ర.)

తెట్టి. దే. వి. 1. కల్లుదీయుటకుఁ జెట్టునకుఁ దగిల్చెడు ముంత. "వ...మఱియు నుత్తాలంబు లగుతాలంబులం గిరాతజాలంబులు గీసి మోసులం గట్టిన తెట్ట కోనులతో యందుల నుప్పతిల్లుకల్లు..." చంద్రా. ౨, ఆ. ౮౪; 2. కలశాకారము గలిగి యుండు బోగడ. "చ. చికిలికడానిజీనిపని చిత్తరుపుత్తడు లాడి కెంపుసొం,దిక లిడ మానికంపుసుఁదెట్టుల పట్టెలు పట్టుపట్టెయున్, జెకడపుగొళ్లె మొప్ప జిగి చిప్పిలుచప్పర మొప్పు శయ్యయం,దొకట ననంత భోగగతి నొందఁగ నందు ముకుందుఁ డున్నెడన్." ముకుంద. ౩, ఆ. ౩౧౪.

తెట్టియ. దే. వి. (త. తిట్టై. తిట్టు.) 1. ఇసుకదిబ్బ. "ఉ. దట్టముగా ధరాధరవితానము లొడ్డుచు మీఁద మ్రాఁకులున్, మట్టలు వైచి కప్పుచు సమస్థలి చేయుచు సూత్రమోజకుం, బట్టుచుఁ దెట్టియల్ దరులు బల్వుగఁ జేర్చుచుఁ గట్ట రాపడన్, మట్టుచు యోజనార్ధశతమాత్రము గట్టిరి నాఁడు వానరుల్." భా. రా. యు. ౨౭౨; 2. తేనెపెర. (శ. ర. బ్రా.); 3. తృణకాష్ఠాదిభారము. (శ. ర.); 4. రాశి (శ. ర.); 5. పాలమీఁది మీఁగడవలె కొన్నిద్రవ్యములపై నేర్పడి తేలియుండుపదార్థము. (వా.)

తెట్టు. దే. అ. క్రి. 1. గాలిచేఁ దృణాదులు నీటిపై నొకస్థలమునకుఁ జేరు. "సీ. తరఁగల నానాఁటఁ దఱచుగా నొక్కెడఁ దెట్టినముత్తెంపుఁదెట్టు వనఁగ." వాల్మీకి. ౩, ఆ. ౬; 2. చేరు. "చ. తరువులు చుట్టుచుం బుజముతట్టుచుఁ ఋూఁబోద రిండ్లఁ దెట్టుచున్." బహు. ౨, ఆ. ౨౭. వి. రాశి, ప్రోగు. "ద్వి. మఱునాఁడు దాఁ జని మత్స్యనాథుండు,గుఱుకొని వసియించు గుహావాత నిండఁ, బెనురాళ్లు తెట్టుగాఁ బెట్టి చాలించి,చనక నిశ్చలభక్తిఁ జనుదెంచి యరసి." నవ. ౨, ఆ. ౧౪౧, పు. ౧ పం; 3. సమూహము. "చ. కొడుగులు దప్పఁ బట్టినను గోటగ నేనిక తెట్టువెట్టినన్." ఉ. హరి. ౪, ఆ. ౨౦౮; 4. ఆవరణము, "సీ. కంపతెట్టులును రాకట్టుకుంగిలి మల్లెసాల దేవరయఱచవికె యొకటి." శుక. ౨, ఆ. ౪౦౮.

తెట్టువ. వై. వి. (సం. ఘట్టః) 1. సమూహము. "లయగ్రాహి. పొట్టలును జట్టలును బిట్టు పగిలించి బలు శెట్టులను నొంచి జముపట్టులను బోవన్, బెట్టికదు నేనుఁగుల లొట్టియల కట్టువలఁ తెట్టువలఁ గొట్టుటయుఁ గట్టలుకతోడన్." అచ్చ. యు. ౧౬౯; 2. ప్రోవు. "వ... మొగుళ్ల తెట్టువలలో మఱుఁగుపడి..." ఉ. రా. ౩, ఆ, ౭౮; 3. గాలిచే

నీటియం దొకప్రక్కఁ జేరినతృణాదుల సమూహము. "గీ. అంచితోద్యానవాటికలందు నవని, భాతి విదళితకుసుమవిభాతి యమరె, నప్పు డరయంగఁ జంద్రకరాబ్ధివెల్లి, డొంకి చనఁ దోఁచు నురువు తెట్టువ లనంగ." నృసిం. ౩, ఆ. ౧౧౦. హరి. పూ. ౫, ఆ. ౨౬; 4. స్థానము. "గీ. అంగజవ్యాధిఁ గడుఁ బ్రబ్బినట్టివిటుల, తత్ జలపూరముల తెట్టు వల్లపట్టు, హేయభాజన మెన్నిట నెన్ని జూడ, వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య." వైజ. ౨, ఆ. ౭౫.

తెట్టువకట్టు. ద్వి. అ. క్రి. (తెట్టువ+కట్టు.) నీరు మున్నగువానియందు తృణాదికము గాలి కొక్కప్రక్కకు జేరు. "సీ. క్ష్మాధరోత్తుంగశృంగఘట్టన మునఁ జుక్కలు రాలి తెట్టువకట్టె ననఁగ." వరాహ. ౭, ఆ. ౬౧.

తెట్టువగొను. దే. అ. క్రి. (తెట్టువ+కొను.) తెట్టువలు కలవను. "వ...తనుకరువలిం గదలు విరులం దొరఁగుపుష్పాడిలిప్పలం బొరలి తెట్టువగొంచు..." పాం. ౨, ఆ. ౫౨.

తెట్టువలుగట్టు = తెట్టువగట్టు. 1. నీరు మున్నగువానియందు తృణాదికము గాలి కొక్కవైపునకుఁ జేరు. "వ...చతురంగబలంబులయవయవంబులుఁ జామరచ్ఛత్రకేతుశకలంబులుఁ గోదండాదిహేతిఖండంబులుం గీడ్పెఱసి పాఱునెత్తురుటేఱులఁ దెట్టువలుగట్టె." భార. ద్రో. ౪, ఆ. ౨౬౪. హరి. పూ. ౭, ఆ, ౫; 2. ప్రోగుపడు. "సీ. బెట్టుగాఁ దెట్టువల్ గట్టి పైపై నెకల్ జల్లు నిట్టూర్పుల జాడఁ జూచి." రాజ. చ. ౩, ఆ. ౧౪౬.

తెట్టువలుగొను. ద్వి. అ. క్రి. (తెట్టువలు+కొను.) తెట్టువగట్టు. "వ. తెరలిపాఱురక్తంబులును దెట్టువలుగొన్నమాంసంబులును..." కళా. ౮, ఆ. ౧౨౩.

తెట్టె = తెట్టియ. (రాశి, ప్రోవు.) "సీ...పిండు మొత్తము తెట్టె పైకము దాఁటె లొద్ద. గీ. తులము మొల్లము మొల్లమి తుట్టె వర్గు, వనఁగ వర్గము తగు..." ఆం. భా. ద్వి. ౧౦౦.

తెట్టెము = తెట్టియ. 1. ప్రోవు, "ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయముల౯ వడిఁ దాఁకి పీఁకవ్రాలమ్ముల తెట్టెముల్ వఱుప నడ్డము వచ్చి జయింతు నంద్రు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౫౬.

తెట్టెలుగట్టు. ద్వి. అ. క్రి. (తెట్టెలు+కట్టు.) ప్రోగుపడు. "వ...తెరలి పాఱురక్తంబులును దెట్టువలుగొన్నమాంసంబులును దెట్టెలుగట్టినయస్థిశకలంబులును జూపఱకు సద్యఃకభయానకబీభత్సరసంబు లావహిల్లఁ జేసె..." కళా. ౮, ఆ. ౧౨౩.

తెట్టెలుగొను. ద్వి. అ. క్రి. (తెట్టెలు+కొను.) ప్రోగుపడు. "వ...నెట్టుకొని నెలకట్టియల పైచిన నిట్టట్టు గదలక తెట్టెలుగొనం గూఁకవ కాలుఁబలంబులును..." ఉ. హరి. ౩, ఆ. ౨౭.

తెట్టెలుపెట్టు. ద్వి. అ. క్రి. (తెట్టెలు+పెట్టు.) చిక్కనగు. "చ. స్ఫురణ మొగిళ్లపై మొదలఁ బొల్చు జలస్రుతి నాఁడునాఁటికిం, గరఁగుచుఁ బుట్టుచుండు మణికార్ముకరక్తిమ యెల్ల వెల్లిఁ గ్రొన్నరువులు గట్టినట్టులు గనుంగొన నయ్యె సురేంద్రగోపముల్, గరఁగినవింటియప్పసరుకై వడిఁ దెట్టెలు పెట్టువచ్చికన్." ఆము. ౪, ఆ. ౧౦౦.

తెడ్డు. వై. వి. (సం. తణ్డాక. త. తుడుప్పు.) 1. కొయ్యగరిటె. "క. గేహముల కేఁగి భిక్షాం, దేహి యనక వీట నొకపతివ్రత యైనన్, సౌహార్దంబునఁ దెడ్డెం, డాహారము పెట్టదయ్యె నాదినముల లోన్." భీమ. ౨, ఆ. ౯౭. "ఉ...నేఁడొచ్చెల శూద్రభామినికి నువ్విళులూరి పక్షంబుఁ దప్పఁగా, వచ్చునె తెడ్డు నాఁకి యుపవాసము మాన్పికొనంగ నేటికిన్." విక్ర. ౧, ఆ. ౧౫౦; 2. పడవనడపుసాధనవిశేషము. (శ. ర. వా.) సా: తెగించినవానికిఁ దెడ్డే లింగము, తెడ్డుండఁగాఁ జేయి కాల్చుకొన్నట్లు.

తెడ్డుమూతికొంగ. ద్వి. వి. (తెడ్డు+మూతి+కొంగ.) జలపక్షివిశేషము. (శ. ర.)

తెత్తి. దే. వి. పిశాచము. "సీ...తెత్తులు బూతములు పిసాసములు సొగడులు, కొఱవిదాలుపులు పోకుడులు దయ్యంబులు గాములు బూసులు గాలులనఁగఁ, దనరుఁ బిశాచాభిధానముల్..." వేంక. దేవ. ౨౪.

తెనమఱు. దే. అ. క్రి. శయనించు. "క. పాల్కొని యొక్కకొందఱు, నత్తెరువుం గట్టఁ బనిచి యందఱు క్రియఁ దాఁచి తొక్కటియుఁ గొని తెనమఱి, యుత్తర ముత్తర మటంచు నొకపాద్దు కడప్." ఆము. ౬, ఆ. ౭౨. (శ. ర. పా. 'కొని తేమఱి.' వావిళ్ల. పా.)

**తెనిఁగించు.** దే. స. క్రి. తెనుఁగుచేయు, ఆంధ్రీకరించు. "క. మును సంస్కృతములఁ దేటఁగఁ, దెనిఁ గించెడి చోట నేమి దెలియక యుండన్, దనవిద్య మెఱయఁ గ్రమ్మఱ,ఘన మగు సంస్కృతముఁ జెప్పఁగా రుచి యగునే." రామా. పీఠి. ౧౬, భాగ. ౧. స్కం. ౨౧.

**తెనుఁగు.** వై. వి. (సం. త్రిలింగకః.) (త్రినగః? త. తెన్. దీనివ్యుత్పత్తి యింతవఱకు నిర్ధారకము కాలేదు.) శ్రీశైలము, దక్షారామము, కాళేశ్వరము నను మూఁడుశైవస్థలములమధ్య నుండు దేశమున వ్యవహరింపఁబడుభాష, ఆంధ్రభాష. "క. జనసుత కృష్ణద్వైపాయనముని వృషభాభిహితమహాభారత బంధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీశక్తి మెయిన్." భార. ఆది. ౧, ఆ. ౧౬. నీలా. ౧, ఆ. ౧౬.

**తెనుఁగుచేయు.** ద్వ. స. క్రి. (తెనుఁగు+చేయు.) ఆంధ్రీకరించు. "గీ...కాశికాఖండ మేను దెనుఁగు చేసెద..." కాశీ. ౧, ఆ. ౭.

**తెనుఁగుఁజేయు.** ద్వ. స. క్రి. (తెనుఁగు+చేయు.) ఆంధ్రీకరించు. "మ. పినరక్ నన్నయలిక్కనాది కవు లీయుర్విం బురాణావళుల్, తెనుఁగుం జేయుచు..." భాగ. ౧, స్కం. ౨౧.

**తెనుఁగుపడు.** వై. వి. (తెనుఁగు+పడు.) ఆంధ్రీకృతమగు. (చూ. తెనుఁగుపఱచు.)

**తెనుఁగుపఱచు.** వై. వి. (తెనుఁగుపడు. ధా. ప్రే.) ఆంధ్రీకరించు. "క. ఇది తత్త్వరహస్యార్థము, పదసంగతిఁ దెనుఁగుపఱుపఁ బ్రాజ్ఞులకును బెట్టిద మగు..." వాసిష్ఠ. ౧, ఆ. ౧౧.

**తెనుఁగువాఁడు.** ద్వ. వి. (తెనుఁగు+వాఁడు.) ఆంధ్రుఁడు, త్రిలింగదేశస్థుఁడు. "సీ. ఆంధ్రుఁ డనాఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁ డన..." ఆం. భా. ద్వి. ౧౦౩.

**తెన్ను.** దే. వి. జా. అనా. 1. మార్గము, దారి. "ఉ. తెన్నున కేను గా దనను దేవర మీఱుస మిజ్జగం బునం,దెన్నటికిం దిరం బగు..." య. ౩, ఆ. ౩౨, ఆం. భా. ద్వి. ౮; 2. విధము, ప్రకారము. "సీ. విసమును జేకొద్ది మెసవి త్రేఁచెడువాఁడు దీని కన్నంబు నే తెన్నఁ బెట్టు." పార్వ. ౪, ఆ. ౫౭; 3. కుష్ఠరోగము. "సీ. మార్గకుష్ఠంబులు మునుచుండుఁ దెన్ను నా..." ఆం. భా. తృ. ౯౯.

**తెన్నుండు.** దే. అ. క్రి. పరుండు. "ఆ. నీరినడుము దెంప నేలఁ దెన్నుండి చే,వెల్పఁ గలియుఁ ద్రచ్చి వెన్నఁ గొనఁగ." కు. సం. ౮, ఆ. ౧౩౯, కాశీ. ౯ ఆ. ౨౦౭.

**తెప్ప.** దే. వి. (క. త. తెప్ప.) 1. ప్లవము, నావ. "మ...అంజనాపుత్రుఁ డక్,బలు తెప్పక్ గొని కాద దాఁటితి విపత్పాథోధి..." ఉ. రా. ౯, ఆ. ౭౮, ఆం. భా. ప్ర. ౧౯౭; 2. రాశి,ప్రోవు. "సీ. తెప్పలై నెత్తావికుప్పలై పుష్పాళ్లిరల గంద వాడి త్రోపఁ జిలుక వలదు." వసు. ౧, ఆ. ౧౪౧; 3. మిట్టనేల. "సీ. నెలయేఱులందలి తెలినీటఁ దనుపుసాం పెలసినగిరులఁ దెప్పలకుఁ జేర్చి." భార. శాం. ౩, ఆ. ౩౩౨; 4. నీటిలో నీఁదు నపుడు మనుష్యులు సాధనముగాఁ జేసికొనెడు కొయ్య. (వా).

**తెప్పగట్టు.** దే. అ. క్రి. (తెప్ప+కట్టు.) అధికమగు. "సీ. చప్పరింపఁగ జాఱి తెప్పగట్టుకవచ్చు విమల ఫేనము సుధాసముదయంబు." చంద్రా. ౧,ఆ. ౭౯.

**తెప్పదెరల.** దే. క్రి. విశే. ద్రు. (తెప్ప+తెరలన్.) 1. బహుళముగా. "క...గురుం, డపాండవబలములపైఁ, దెప్పదెరలఁ గురిసె శరతతిం దీవ్రము గాన్." భార. భీష్మ. ౨, ఆ. ౩౮౧. భార. ద్రో. ౯, ఆ. ౧౮౧; 2. వేగముగా. "క. విందాను విందు లేక,స్యందనగతులై కడంగి సైన్యంబులు దా,రుం దెప్పదెరల నాసం,క్రందననందనుని మీఁదఁ గవిసిరి గడిమిన్." భార. ద్రో. ౩, ఆ. ౧౪౩, భార. అను. ౪, ఆ. ౩౧౮.

**తెప్పఱి.** దే. అ. క్రి. తేఱు, స్వాస్థ్యము నొందు. "క.. అనలుఁడు మైమఱచి పడియున్న సఖుఁ దెప్పఱి నొయ్యన పీఁచె నపుడు పవనుఁడు నెమ్మిన్." కు. సం. ౧౦, ఆ. ౧౭.

**తెప్పలఁదేలు.** దే. అ. క్రి. (తెప్పలన్+తేలు). 1. ఓలలాడు, ఈఁదులాడు. "ఉ...పూఁ, దేనియ సోనవెల్లువలఁ దెప్పలఁ దేలెడు మేలిపల్కులన్." పాండు. ౪, ఆ. ౧౧౨. విక్ర. ౧, ఆ. ౧౯౩; 2. సంతసించు. "ఉ. ఇప్పుడ మేలుకాంచెఁ బరమేశుఁడు సాగరకన్యకాంతతోఁ,దెప్పలఁ దేలుచున్నతన తీయపుచూపుల నేని నొందుమైఁ, ద్రిప్పుఁడు..." నృసిం. ౧, ఆ. ౮౪, జై. ౧, ఆ. ౬౬, శకుం. ౪, ఆ. ౯౭.

తెప్పలఁదేలుచు. దే. స. క్రి. 1. ఓలలాడించు. "క. చెప్పెడి దేమె లతాంగీ, యప్పురుషోత్తముఁడు నన్ను నట్టు రసాబ్ధిం, దెప్పలఁదేలిచి నిను విడ, నెప్పుడు నని యూరడించి యొందే నతిగా." కళా. ౬, ఆ. ౨౬౪. విక్ర. ౧, ఆ. ౧౭౮; 2. ముంచు. "గీ. కంచిఁ దెప్పలఁదేల్చె నకాలవృష్టి." హర. ౨, ఆ. ౨౨.

తెప్పలుగ. దే. క్రి. విశే. ద్ర. పుష్కలముగా, అధికముగా. "క. తెప్పలుగఁ జెరువు నిండినఁ, గప్పలు పదివేలు చేరుఁగదరా సుమతీ." సు. శ. ౨౦.

తెప్పలుగా = తెప్పలుగ. "ఉ...పిలిపించి యిచ్చెఁబో, తెప్పలుగాఁ గరుల్ హరులు ధేనువులు ..." రాజ. చ. ౧, ఆ. ౮౯, దశా. ౭, అ. ౨౬౪.

తెప్పించు. దే. స. క్రి. (తెచ్చు. ధా. ప్రే.) 1. తెచ్చునట్లుచేయు. "ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతనుత్రాణము..." భార. విరా. ౪, ఆ. ౬, హర. ౬, ఆ. ౪౯; 2. కల్గించు. "ద్వి. దీనత రప్పించి దిగులు దెప్పించి." ద్వి. హరిశ్చ. పూ. ౧౬౧౩. పం.

తెప్పిర్లు. దే. అ. క్రి. (తెప్పిఱు. ధా.) మూర్ఛనుండి తేఱు. "మ...దశవక్త్రుం డంత మూర్ఛిల్లి యం, తనె తెప్పిర్లి యుగాంతకంతుహరదుర్దాంతక్రుధావంతుఁడై." ఉ. రా. ౩, ఆ. ౩౫౩.

తెప్పిఱిలు = తెప్పిర్లు. (మూర్ఛనుండి తేఱు.) "క. పశ్చిమదిశచందంబున, నిశ్చేష్టుం డయినబాలునిం జూచుడు వాఁ, డాశ్చర్యంబుగ నపుడ పునశ్చైతన్యాగమంబునం దెప్పిఱిలెన్." నిర్వ. ౭, ఆ. ౧౧౫. భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౦౩.

తెప్పిఱు. దే. అ. క్రి. (మూర్ఛ దుఃఖము ఆయాసము మున్నగువానినుండి, తేఱుస్వాస్థ్యము నొందు. "గీ. మూర్ఛఁ దెప్పిఱి యిట్లని మొఱలుపెట్టె." దశా. ౪, అ. ౫౩. "క. చెప్పిన నప్పలుకులు విని, తెప్పిఱి సంమోదవారిధిం జంద్రముఖుల్, తెప్పలఁదేలిరి చెచ్చెలులప్పుడు పల్లవితహృదయలై తమలోనన్." వరాహ. ౪, ఆ. ౪౪. "క... హరు లి, త్తఱి నీటులు ద్రావక తెప్పిఱి పెట్లొకా శత్రుసైన్యభీకరమూర్తీ." భార. ద్రో. ౩, ఆ. ౧౬౦; 2. మేల్కాను, నిద్రనుండి లేచు. "గీ. ఓనుము నిద్రించి తెప్పిఱువేళలందుఁ, గొడరి కలలేమియును లేశ యడఁగినట్లు." వాసిష్ఠ. ౨, ఆ. ౫;

3. ఆవసుఁబాసు. "ద్వి. అప్పుడు శోయ మించు నైనను లేఁ, తెప్పిఱి నిద్రఁ జెందనచంద్రమతివి." ద్వి. హరిశ్చ. పూ. ౭౦౯౦. పం.

తెప్ప. దే. వి. 1. తేలుట క్రిందఁబఱుటఁ మున్నగువానియం దనుకరణము. "సీ. సిమాన్ష్లచే గిరుల్ నీటఁ దెప్పన దేలె గడఁక సముద్రంబు గట్టువడియె." సిం. నార. శ. ౬౬. "సీ. వచ్చియాత్మీయమందిరద్వారసీమఁ, దెప్పనను మూర్ఛ వైచినచప్పుడు విని." శుక. ౨, ఆ. ౩౪౬; 2. కబళించుటయం దనుకరణము. "వ...వా విప్పి తెప్పన కబళించి చప్పరింపుచు నొప్పుపాడదుప్పులును..." ప్రబంధ. ౧౯౬; 3. వెంట, వెనుక. "వ...రాగమంజరి లాజీయలచొప్పు దప్పి వివిధధనంబు లిచ్చుభుజంగకోటి నొల్లక తనవలచువాని నెవ్వనినేనియుం బెండ్లి యగుదు నని ప్రతిజ్ఞ చేసి మాచేత మాన్పరానున్నయది మరులుపనంబున నింక నొక్కని తెప్పనం బడిపోవం గలయది..." దశ. ౫, ఆ. ౪౪.

తెప్పన. దే. క్రి. విశే. ద్ర. 1. శీఘ్రముగా. "ద్వి. తెప్పన నిద్రఁ జెందినయటమీఁద, నప్పద్మలోచన యల్లన లేచి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౫౯. పం. వేఱు. శ. ౬౫; 2. తటాలున, ఆకస్మికముగా. "ఉ. కావున నన్ను నిప్పు డధికం బగుసత్కృప మీఱఁ బ్రోవు మిం, దీవరనేత్ర నీ వనుచుఁ దెప్పన నా చరణద్వయంబుపై, వావిరి వ్రాలి యున్న నిజవల్లభు మస్తము బాయఁద్రోచి..." రుక్మా. ౪, ఆ. ౧౧౦.

తెబక. వై. వి. (సం. స్తబకః.) మొత్తము, సమూహము. (శ. ర. బ్రౌ.)

తెమడ. దే.వి. 1. శ్లేష్మము. (శ. ర. బ్రౌ.); 2. చిక్కు. "వ...నెట్టికొని దగలు తొట్టినం బట్టి యీకలం దెమడ వెడలించి..." కువల. ౪, ఆ. ౨౦౯.

తెమరించు. దే. స. క్రి. 1. తెమలుధా. ప్రే. కదల్చు. "వ...ఒకించుకయుం దెమలింపఁజాలక." దశా. ౨, అ. ౧౬౪. ఉ. రా. ౩, ఆ. ౮౪; 2. లాగు. "సీ. పసిండిగాజులు పైకి వెసఁ ద్రోచి నునుఁదీగఁ దెమలించునరిత్రాడు నెమకుకరణి." స్వా. ౩, ఆ. ౩౧. రంగా. ౧, ఆ. ౬౨; 3. బలాత్కారముగా లాగు, లిగుచు. "ద్వి. తెగువ మత్తేభముల్ దెమలించి తుండ, మగలించి పైజోదు నణఁచు మాస్టీలు." ద్వి. హరిశ్చ. పూ. ౧౫౯. పం. ౪.

కేఁగఁగొట్టు. "సీ. తెమలించి గాలియొక్కఁ మెకంబు నైనను బలుగాలువలఁ దిర్చి కట్టఁగలము." వరాహ. ౪, ఆ. ౭౫.

తెమలు. దే. అ. క్రి. 1. తొట్రుపడు. "చ. నడుమన దింతిచన్నులకసర్పున మ్రుంపఁబు గానరాదు మాకడుగిడుచోటఁ గాల్దెమలినంతన కొనుకు బింద మయ్యెడున్." కు. స. ౮, ఆ. ౧౬; 2. భయపడు. "క. ఆటుములమునకుఁ దెమలక,భూతలము దలంక సలువపుత్రుం డెదుర్చై,యాతెఱఁగున నసురులు నిష్ఠాతసప్పళకరపరంపరలు వడిఁ గురియన్." కాళ. ౨, ఆ. ౪౬. నా. పంచ. ౨, ఆ. ౨౦౯; 3. విడిపోవు, చెదరిపోవు. "చ. తెమలనిచిమ్మచీకటిని గీపములేమిని జూపు లెట్లు దీపము గొని తెమ్ము చూపెదను భద్రముగా నిది నీవె దాచి పెట్టుము." హంస. 3, ఆ. ౧౦౮. విక్ర. ౧, ఆ. ౮౫; 4. అసత్యమగు. "చ...ఇది యేటి మాట నల్లనియెడఁ గానరాజు తెమలం బలుకం బని యేమి నావుడున్." భార. అను. ౧, ఆ.౧౮౬; 5. కదలు. "సీ. తిరిగిన నడుగులు దెమలక లోమ్మప్పళించి యవ్వలికిఁ జండించి దాఁటి." ఆము. ౬, ఆ. ౨౨; 6. జాఱుపట్టుదప్పు. "క. కమలజుశిర మీగ్గై వడిఁ,దెమలి మహిం బడిన వేళఁ ద్రినయన హస్తం,బమరె నపేతమరాళా,క్రమణాం బగు వికచరక్తకమలము భంగిన్." వరాహా ౧౨, ఆ. ౧౮. దశ. ౧౧, ఆ. ౭౫; 7. నశించు. "చ. క్రమమునఁ గప్పె నల్లడ లగాధమహోద్ధతిఁ జిమ్మచీకటుల్, తెమలె దిశావివేకము ధీరతయుం జెస నెల్లవారికిన్." హర. ౭, ఆ. ౧౭౧, వసు. ౨, ఆ. ౧౩౭; 8. మరలు. "చ...అపరాధవేళ మును దాల్పనినీ విపు డెంత మ్రొక్కినం,దెమలదు శాంతిఁ బొందదు మదీయమనం బిఁకఁ జాలుఁ బ్రార్థనల్."నరస. ౨, ఆ. ౩౬, విప్ర. 3, ఆ. ౪౨; 9. వెళ్లు. "చ. తెమలను నిన్నుఁ బాసి సుదతీ యని తీయనినీదు మోవికా, యమృతరసోర్మి యేని సమమా..." హంస. ౧, ఆ. ౭౪౩; 10. బయలు వెడలు. "సీ. వెడఁదగూడులనుండి వెన్నెలపులుఁగులు తెమలెనా నేత్రాంచలముల బెళుక." ప్రబంధ. ౭౯౦; 11. ముగియు. (వా). వానికి పని తెమలంట లేదు; 12. పనిపూర్తి చేసికొను. (వా). వాఁ డెంతకును దెమలి రాఁడు. వి. ప్రవాహము. "సీ. తళుకొత్తుమిన్నేటి తెలినీటి తెమలున ముదురుబెందొవచాలు మొలవఁబెట్టె." పాండు. ౪, ఆ. ౨౫౦.

తెమలుచు. దే. స. క్రి. (తెమలు ధా. ప్రే.) 1. కదల్చు "చ. ప్రమదము పూని నూని రఘురాము కనుంగొను మీశరాసమున్, దెమలుప నేర్తువే యనిన ధీరుఁడు శ్రీరఘువీరుఁ డయ్యెడన్." దశా. ౭, అ ౨౦౦; 2. వెలుకు, వెలికిలాగు "సీ... గుండె,కాయ లాదట మెయిఁ గబళించును గ్రొవ్వు దెమలిచి నమలుచు నెమకయూటు, చవిగొని యూనుచు..." భార. స్త్రీ. ౨, ఆ. ౯.

తెమల్చికొను. దే. స. క్రి. (తెమల్చు+కొను-స్వార్థమున.) ఆస్వాదించు. "ఉ. సమ్మదవారిగన్గడలఁ జాలుగ మై గరుపార నిండుబిం,బమ్మున దృష్టి నిల్పి పయిఁ బ్రాఁకుమరీచులనూఁగుసూఁగులేఁ, గొమ్మలు వట్ట చంచుపుటకోటిఁ గదల్చి తెమల్చి కొంచు సౌ,ఖ్యమ్మ విహంగమ మ్మయినయాకృతి నొందెఁ జకోరమొక్కఁడన్." నిర్వ. ౬,ఆ. ౫౧.

తెమల్చు. దే. స. క్రి. (తెమలు. ధా. ప్రే.) 1. కదలించు. "ఉ. వింటి నపూర్వ మూర్వి నొకవింటి నరుండె జయించువాఁడు ముక్కంటిమిలం దెమల్చిన మగంటిమిజో దిడుతానె మింక..." చం. రా.౫, ఆ. ౫౬; 2. సడలించు. "గీ. అనుచుఁ దగ బుజ్జగించి హస్తాంబుజమున, వలపు గీలు దెమల్చు భూవల్లభుండు" నైష. ౬, ఆ. ౧౭౬; 3. దువ్వు. "గీ. బిగియఁ జనుదోయి రొత్తిన పేరురంబు,నలరు మోవితీ పాననియామసంబుఁ, దనియఁ గురులు దెమల్చియాడినకరంబుఁ, దరుణి మెచ్చుచు నప్పొమ్ముఁ దమ్మి యలర." హరి. ఉ. ౭,ఆ. ౧౨౮; 4. జాడించు. "గీ. బిసము, లాదట నందఱుఁ బెఱికి రొంపి,పోవ నీటఁ దెమల్చి మోపుగ నమర్చి." భార. అను. 3, ఆ. ౨౨౩; 5. పట్టుకొను. "చ. అని కలుషించి వేదవతి యచ్చటు వాసి చనం దలంచినం,గని దశకంధరుం డడరి గ్రక్కున వేనలి పట్టి కొన్న నం,గన యొకవ్రేల ప్రేయ సది కత్తి విధంబునఁ దాఁకి కత్తిరిం,చినక్రియఁ ద్రెంచె వెండ్రుకలు చేతఁ దెమల్చినయంత కివ్వలన్." నిర్వ. ౫, ఆ. ౧౭. భాగ. ౧౦, స్కం. ఉ. ౯౮౯; 6. పట్టుకొని లాగు. "ఉ...అమ్మరో, రమ్మని బోటి కోమలి కర మ్మనివార్యగతిం దెమల్చఁగన్." వసు.

౩, ఆ. ౧౩౦; 7. డీలుపఱుచు. "సీ. ద్రోణుని నిరుపదిబాణంబులఁ దెమల్చి భీముని మున్నాట బెండుపఱిచి." చిత్రభా. ౭, ఆ. ౧౦౯; 8. ఖండించు. "ఉ. గాలికిఁ బోవువాహము నగంబుల పత్త్రములం దెమల్పఁగాఁ, జాలుదువాలు..." దశా. ౬, అ. ౫౬౩. వసు. ౩, ఆ. ౭౮; 9. చీల్చు. "సీ. సింగంబు పఱతెంచె ముంగోఱలఁ దెమల్చి నమలికారోప్పెతుల నుమిసికొనుచు." కళా. ౪, ఆ. ౧౦౫; 10. ముగించు. (వా.-) వేగ పని తెమల్చి రమ్ము; 11. ఆస్వాదించు. (చూ. తెమల్చి కొను.)

తెమ్మ. వై. వి. (సం. తేమః.) 1. తడి. "సీ. వరుణాంగనామనోవల్లీవితానంబు పలుకుఁదెమ్మలచేతఁ బల్లవింప." విక్ర. ౬, ఆ. ౫౬. చెన్న. ౪, ఆ. ౧౬; 2. చెల్ల. "సీ... తెమ్మ నాఁ బెల్లయు తేమయలరు." ఆం. భా. తృ. ౪౫; 3. రాశి, "చ. పొలఁతుకఁ జూడరమ్మ గడివోవని చక్కఁదనంబు మమ్మ..." చంద్ర. ౫, ఆ. ౯౪. విశ. తడిగలది. "ఉ. కమ్మని తెమ్మ తెమ్మెరలు గ్రమ్మఁగ..." నీలా. ౧, ఆ. ౪.

తెమ్మలుగా. వై. క్రి. విశ. ద్రు. అధికముగా. "ఉ. చూచి కిరాతులార బలుసొమ్ములు తెమ్మలుగాఁగ నబ్బె నీ, రాచకుమారు దోఁచుఁడు..." వరావా. ౯, ఆ. ౫౮. విజ. ౩, ఆ. ౦౫౫.

తెమ్మెర. దే. వి. (క. తెమ్బరల్. తెక్ + మెర = దక్షిణపుగాలి.) 1. చల్లగాలి, మలయమారుతము. "ఉ... పొర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి,తిరిగి వేగుఁబోక తెమ్మెర లెలఁదీఁగ,కొనల వంకలొత్తు ననలఁ ద్రోచు." భార. ఉద్యో. ౬, ఆ. ౧౧౭. ఆం. భా. ప్ర. ౫౯; 2. "సీ. చెదరినమకరికాచిత్ర పత్త్రికలతోఁ బరఁగెడునూర్పుఁదెమ్మెరలతోడ." విక్ర. ౫, ఆ. ౫౧. ఇందు. ౩, ఆ. ౧౦౫.

తెర. వై. వి. (సం. తిరః. క. తెరె. త. తిరై.) మఱుఁగుచీర, యవనిక. "చ. తెరయును మేలుకట్టుఁ దగు దీవియలుం జెలువొంద మేటిచప్పరమున..." భార. సౌ. ౧, ఆ. ౧౪౭. ఆం. భా. ద్వి. ౧౫౯; 2. వేఁటకుసాధనముగా నుపయోగించు నొకరకపు జవనిక, అడ్డువల. (శ. ర.) "క. ఇటువలె వేఁటాడెదుతఱిఁదటుకున నొకయిఱ్ఱి తెరలు దాఁటి పడిం తెంగట నుఱుక నెఱుకుదొర లార్పుటయున్ రాజులును దానిచొప్పునఁ జనఁగన్." య. ౬,ఆ. ౩౪. ఆం. భా. తృ. ౫౫; 3. మత్స్యగ్రహణసాధనము. "గీ...చల్లు దూఁడు,లుంటగాలంబు తెర దీము లుసురుగాలము...ఎసఁగుచుండు." హం. స. ౪, ఆ. ౧౮౪; 4. తరంగము. "క. కట్టాతలముకలునై, దట్టపుపరహాస్థి తెరలు తరుణుల సేఁచన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౦౦. ఆం. భా. ప్ర. ౧౫౪: 5. వరుస. "క. పరిపరిధూపము లల నర, ఓరలతెరల రత్నదీపవితతులు నూర్జా, స్తరణములఁ బొలుచు కొవ్వులఁ, బరమబుధులు నృపులు వరుస బంతులు సాఁగన్." జై. ౯, ఆ. ౬౦౧. వసు. ౬, ఆ. ౫౭౩; 6. దిక్కు. "చ... విస్ఫులింగపటుకీలలు నైదువు లీన వేసతో, వెలువడి రార్పులం దెరలు వ్రీలఁగఁజేయుచు నన్ని కొచరుల్." భా. రా. యు. ౯౭౩; 7. తేనెపట్టు. "రగడ. తెఱవ తెరవడిఁ బూని కదలిచి తేని తేనియసోనవానలు, నెఱయు..." రసిక. ౪, ఆ. ౫౪.

తెరచీర. ద్వ. వి. (తెర+చీర.) 1. యవనిక, మఱుఁగు చీర. "క. తెరచీర వట్టి యిరువుర, నిరువంకల నిలువఁబెట్టి యింపు దలిర్పన్, సురయక్షసిద్ధకిన్నర, నరకాంతలు తము భజించి నలిఁ గీర్తింపన్." పద్మ. ౩, ఆ. ౭౬. బస. పు. ౫౪, పు. ౬౬, పం; 2. వేఁటసాధనముగ నుపయోగించునొకరకపుజవనిక. "వ .. తెరచీరప్రోఁగుచుట్టులు దొడ్డివల లేటివల కుందేటివల..." కాళ. ౩, ఆ. ౪౬.

తెరచాప. దే. వి. (తెర+చాప.) నౌకాంగవిశేషము. (ఇది గాలిని బోసికొని నౌకను వడిగా నడపును.)

తెరబొమ్మ. దే. వి. (తెర+బొమ్మ.) తోలుబొమ్మ, తెర మీఁద నాడించుబొమ్మ. "శా... ఉమపీఠిం గొండ్లి యాడించె దైత్యవ్యాధుల్ తెరబొమ్మ లట్ల నిగుడం దా నాటకాఁడుం బలెన్." వి. శకుం. ౩, ఆ. ౧౬౪. రం. రా. ఆం. ౧౫౯. పు. ౧౪, పం.

తెరయాఁక. దే. వి. (తెర+ఆఁక.) తేనెటీగ "క. తెరయాఁకలగతిఁ గవియుచుఁ, బొరిఁబొరిఁ గడుఁ దురులపుగిదిఁ బొదువుచు నెఱనై,వెరవునఁ గాకులు పికములఁ, బరువడిఁ జీకొకుపఱుచు భంగిఁ దలంపన్." భార ద్రో. ౧, ఆ. ౬౫౮. (వెరయాఁకల గతి. పాఠాంతరము.)

తెరల. దే. వి. కవళము, కబళము. (శ. ర. ద్రా.)

తెరలఁబడు. ద్వి. అ. క్రి. (తెరలన్+పడు.) స్వస్థత నొందు. "చ...అన్వితయొడంబడం దగిన వాక్యము గానక కొంతసేపు మెల్లన వినయంబుఁ జేసి తెరలంబడి యాసతితోడ నిట్లనున్." వి. పు. ౬, ఆ. ౨౨౫.

తెరలఁబాఱు. దే. అ. క్రి. (తెరలన్+పాఱు-స్వార్థము.) తొలఁగు. "మ. తెరలంబాఱెఁ గలంగి గోవులు కడున్ దీనంబులై యోలుచున్." హరి. పూ. ౬, ఆ. ౧౩౩.

తెరలించు = తెరలుచు. 1. (జయించు.) "సీ. అని లోన నీటిరాయని గాడ్పుఁ దెరలించి వెతమాట లెల్ల నీకతనఁ గాదె." య. ౩, ఆ. ౯౩; 2. (కలఁచు.) "స్వ. వివిధముఖంబుల వివిధాయుధములఁ, దివిరి రాక్షససేనఁ దెరలించి పఱపు, నఱిమి కొందఱు చచ్చి రాహవక్షోణి." రం. రా. ఉ ౭౭, పు. ౧౧, పం; 3. (నశింపఁజేయు.) "మత్తకోకిల. యాగభోక్తయు ధర్మవక్తయు నైనదేవుఁ డొనర్చెనే, యాగభర్మవిభంజనం బది యద్భుతక్రమ మంచు నా, నాగతుల్దివినుండి పల్కఁగ యాదవాధిపుఁ డాధ్వర్యాగముం దెరలించె వంచకులైన క్రించులు బెగ్గిలన్." సాంబో. ౧, ఆ. ౧౨౩. వసు. ౬, ఆ. ౯.

తెరలించుకొను. దే. స. క్రి. (తెరలించు+కొను. స్వార్థము.) భేదించు. "వ...వానరవరులు శిలాపాదపాదులం జెండాడి గండడంచిన దానవసేనలు కనుకనిం బఱచిన నవుడు గఱచి తరుచరవ్యూహంబు తెరలించుకొని చొరంబడి వజ్రదంష్ట్రుండు..." రామా. ౮, ఆ. ౫౧.

తెరలిక. దే. వి. (తెరలు. ధా.) 1. గుంపు. (శ. ర.); 2. మెలఁకువ. "సీ. కడపపూఁదేనియఁ గడుపారఁ గొని మ్రోసి తిరుగు తేఁటుల తెరలికయును." హరి. పూ. ౯, ఆ. ౬౮. ద్వా. ౮, ఆ. ౨౨.

తెరలు. దే. అ. క్రి. (క. తెరళు. త. తిరళ్.) 1. నీళ్లు మున్నగునవి సలసల కాఁగి పొంగు. "గీ. సరస్సుపై నీరు సలసలఁ దెరలె విపిన, సకలవీథులు నిర్మల గోచ్ఛయము లయ్యె." పాండు. ౧, ఆ. ౧౩౬. రం. రా. యు. ౩౯౫, పు. ౧౧, పం; 2. పాఱు. "క. గిరిజాలలితాంగము పొరిఁబొరిఁ గనుఁగొని సొగసి యసుకబొమ్మ జలమ్ముల్, తెరలఁగ విరిసిన గళిఁ బొద్ది, విరిస మహేశ్వరుమనంబు వికలంబయ్యెన్." కు. సం. ౫, ఆ. ౩౭; 3. పయనించు. "ఆ...ఆఱు యోజనములపయన మొక్కనాఁడె, తెరలి చంపావతీపురి ముందటఁ, గాంచి యోధవరులఁ గలయఁ జూచి." జై. ౮, ఆ. ౫౯; 4. తగ్గు. "గీ ., తెరలక కడవ వంచినట్లు హోరని ధారౌఘ మైక్య మొంది, విన్ను మన్నును నొకటిగా వృష్టి బలసె." ఆము. ౪, ఆ. ౯౧. చంద్రి. ౩, ఆ. ౧౨౮; 5. చెదరు. "మ. మరుదంభోరుహనేత్ర లంబరధునీమధ్యంబు నన్నిల్వ నిష్ఠురతత్పీనపయోధరాహతిజలస్తోమంబు నల్వంకలన్, దెరలన్ నాభిచయంబు లోఁగొనియె..." హరి. ౪, ఆ. ౨౮, ఉ. రా. ౬, ఆ. ౨౭౬; 6. కదలు. "సీ. తిగిచిన నడుగులు దెరలక యొండొరుఁ గ్రమ్మరఁ దిగుచుచు .." భార. విరా. ౨, ఆ. ౩౪౭; 7. పొంగు. "సీ సరసపుష్పపరాగసైకతంబులు దీర్చి తేనియ కాలువల్ తెరలి పాఱ." విక్ర. ౧, ఆ. ౮౯; 8. అధికమగు. "సీ. చాననీకెమ్మోవిపానకం బానిక తెరలెడుబలుదూప తీఱి పోదు." రసిక. ౬, ఆ. ౮౯. మొల్ల. రా. యు. ౩, ఆ. ౪౩; 9. బయలుదేఱు. "వ...శతశృంగనివాసు లగుమును లెల్లం దెరలి వచ్చిచూచి..." భార. ఆది. ౫, ఆ. ౧౪౩. భార. విరా. ౪, ఆ. ౬౨; 10. పైకి వచ్చు. "గీ. దరికొని వహించు నక్కఁ దాళలేక, తెరలి మృగములు మృగతృష్ణ కరిగి పొరుగు." ఉ. రా. ౨, ఆ. ౧౬౧; 11. సందేహించు. "చ. తెరలక కాశికానగరి దేవతరంగిణిఁ దీర్థమాటకై, యరుగుచు నెవ్వఁడేని మృతుఁడౌ భవితవ్యత కారణంబుగాఁ, దెరువున నామనుష్యుఁడును దీర్థఫలం బఖిలంబుఁ గాంచి..." కాశీ. ౫, ఆ. ౪౮; 12. వెనుకకుఁ బోవు. "క...వారలయమ్ములఁ దెరలక భీముఁడు పటుగతిస్యందనుఁడై." భార. భీష్మ. ౩, ఆ. ౧౬౦; 13. ఊడు. "గీ. ఆలిగి పూవైన నలపలే దబల దాను, శోకబలమునఁ జోకినచోటఁ దోలు, తెరలి జర్జరమై పోవఁ గరతలములు, మీఁది కందంద రతి యెత్తి మోఁదుకొనియె." కు. సం. ౫, ఆ. ౯౦.

తెరలుగ. దే. క్రి. విణ. ద్రు. "క. నరవరు లయ్యయి దిక్కులఁ, గరిగి మహీపతులచేత నరిగొని ధనముల్, దెరలుగఁ దెచ్చినమార్గము, బరువడి సెలఁగింపు నాకుఁ బరమమునీంద్రా." భార. సభా. ౧, ఆ. ౨౨౫.

అతిశయించునట్లుగా, మెండుకొనునట్లుగా (శ. ర. పా. తెరలఁగ ముద్రిత పా.)

తెరలుచు = తెరలించు. 1.(చెదరఁజేయు.) "క. చరాచరము లైనభూతజాలము లెల్లం, దరతరము యడ్డపడినం,దెరలిచి పడవైతు సింధుదేశాధిపునన్." భార. ద్రో. ౨, ఆ. ३౧౦; 2. (వెల్లగించు.) "చ. కరకర పండ్లు గీటుచు నెరంబడి ముట్టెయు తుంగ ముస్తలం,దెరలిచి మేయుచున్..." చెన్న. ౨, ఆ. ౨౦; 3. (నశింపఁజేయు). "గీ. అంబుకై పూని వానిమహాబలంబు, జామదగ్న్యుండు తెరలుపఁజాల కలిగె." భార. అను. ౫, ఆ. ४౭౫; 4. (బయలుదేఱఁదీయు) "క. పురజనుల నెల్ల ముందటఁ, దెరలుచుకొని .." జై. ౨. ఆ. ౧౦౫.

తెరలుడు. దే. వి. (తెరలు. ధా.) బయలుదేఱుట, ప్రయాణము. (శ. ర.)

తెరలువుచ్చు. దే. అ. క్రి. అతిశయము కలుఁగఁజేయు. "సీ. లలితంబు లగుచిత్తములచతురతలకు సరసంపునడవడి తెరలువుచ్చ." నిర్వ. ౧,ఆ.౫౫.

తెరలెత్తు. దే. అ. క్రి. (తెరలు+ఎత్తు.) 1. తరంగితమగు, పొంగు. "సీ. తెరలెత్తి సప్తసాగరములుఁ బొరలంగ వరుణుండు గొండిలి పరిభవింప." ఉ. హరి. ४, ఆ. ౨౧౬; 2. అతిశయించు. "వ... కెరలి తెరలెత్తునిరులం జెరలింప ననేకరూపంబులం దీపించుతమోరిత్రయంబునన్..." వసు. ౬, ఆ. ౯, శుక. ౨, ఆ. ౫౫౧.

తెరల్చు. దే. స. క్రి. (తెరలు ధా. ప్రే) 1. (కదల్చు) "సీ. పొన్నలమకరందములు చల్లుపోరాడి తెలిమించుమల్లెమొగ్గలఁ దెరల్చి." విప్ర. ౭, ఆ. ౫౬; 2. ఊడఁదీయు. "ఉ...సి, వ్రాంగులబండ్లు డించి తగ వానికిఁ గన్నులుఁగుల్ దెరల్చి యూ, మంగలఁ బాఱఁజాపుటయు..." య. ౨, ఆ. ౧౬, కళా. ౧, ఆ. ३౮. 3. కలఁచు. "ఉ. ద్రోణునితో శిఖిం బడక ద్రోణ కుటుంబిని యున్న దింట నశ్శీణతనూజశోకవివశీకృతనై విలపించుభంగి నీ.ద్రోణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు నెంతపొక్కునో." భాగ. ౧, స్కం. ౧౬౫.

తెరవల. దే. వి. (తెర+వల.) మత్స్యగ్రహణసాధన విశేషము, ఒకరకపువల. "గీ. తెరవలలు వైచి జాలకుల్ విరిచి దాని,... సేసి..." భార. ఆది. 3, ఆ. ३౭.

తెరవాఱు. దే. అ. క్రి. (తెర+వాఱు.) తరంగితమగు, పొంగు. "చ. ద్రవిడకుటుంబినుల్ పసుపు రాచిన రత్నప్రభాప్రక్రియ ... తెరవాఱఁగా నికుర ... కళ్ళుతతి కప్పువాఱెనన్." ఆము. ౧, ఆ. ౬४.

తెరవేఁట. వ్యా. వి. (తెర+వేఁట.) తెరలెత్తి యూ తెనువేఁట, వేఁటకాండ్రచే మృగము లొక్క చోటఁ గూడియుండునట్లుగఁ జుట్టును తెరవేసి సమకూర్చి యాడువేఁట. "గీ. అప్పు డనల్పక డికకమేఘాళి పొదువు, నచలములపైనె దొడ్డిక ట్టగు మృగాళి,జాడ మాపట్టె మింఁచిపర్జన్యధన్వి, నృపున కగు తెరవేఁట యాయిత మనంగ." ఆము. ४, ఆ. ౧౧౭, రామా. ౨, ఆ. ౭౯.

తెరవేయు. దే. అ. క్రి. (తెర+వేయు.) పొంగు. "క. అని చాల ఖిన్నురాలై,మనమునఁ దెరవేయఁ బుత్రమమతాంబుధి నిల్చినచోట నిలువ నైఁచక, వనితామణి నగరు వెడలి వచ్చుచు నంతన్." సా. 3, ఆ. ౭౮.

తెరువరి. దే. విశ. (తెరువు+అరి.) పథికుఁడు,బాటసారి. "క. కను బ్రమసిన తెరువరి తన,కనపాయం బైనమార్గ మరసి తగ నెఱిఁగినవారు నెప్పఁగాఁ గై,కొననికరణిఁ దగినవెంటను జన వకటా." భార. ఉద్యో. ౨,ఆ. ౨౮౦, ఆం.భా. ద్వి. ౧౮౯.

తెరువాటీఁడు. దే. విశ. (తెరువాటు+ఈఁడు.) తెరువాటుకాఁడు. (శ. ర.)

తెరువాటు. దే. వి. (తెరువు+పాటు.) దొంగలు దారికట్టి కొట్టుట, అభిగ్రహము. "సీ. భోజనార్థులఁ దుష్టిఁ బొందించునతఁడును తెరువాటు వలనఁ దస్కరులచేతఁ,జేటొంది ధనము వాంఛించునతండు..." భార. అను. ౨, ఆ. ౫౯. "గీ. ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క, పచ్చ వైకంబుఁ గాన కప్పుచ్చిపోయి,నేఁటి తెరవాటు పస లేక దాఁటిపోయెననుచు వెన వారిపన మాని యవలి కేఁగి." వాల్మీకి. ౨, ఆ. ౯౬.

తెరువాటుకాఁడు. దే. విశ. (తెరువాటు+కాఁడు.) దారికట్టి కొట్టి దోఁచుకొనుదొంగ. "గీ. పాపకర్మునిఁ గార్ముకబాణపాణిఁ, గ్రూరదృష్టులయొఱ చేరు గుర్తువానిఁ, జెంచు తెరువాటుకాని వీక్షించి

తపసి, తల్లడంబున శ్రీహరిఁ దలఁచి నిలిచె." వరాహా. ౬, ఆ. ౬౩, సాంబో. ౧, ఆ. ౧౦౪.

తెరువాటుగొట్టు. దే. స. క్రి. (తెరువాటు+కొట్టు) దారికట్టి దోఁచుకొను. "గీ. ఇతఁడు కలుద్రాగి యాకాడె నెఱచి తెనియె, నిలిచి పుత్రింపెఁ జండాలలలనఁ గూడెఁ,గూఁతు రమియించెఁ దెరువాటుగొట్టెఁ బ్రజలఁ, జెంచురాజేల సేవించెఁ జెఱిచెఁ గులము." శివరా. ౪, ఆ. ౫౪, కళా. ౬, ఆ. ౨౩.

తెరువు. దే. వి. (క. తెరపు. త. తెరువు.) 1. దారి, మార్గము. "వ...ఇట్లు పన్నగారిసగారి పోరువు తెరువునం జనునప్పుడు..." ఉ. హరి. ౬, ఆ. ౨౪, ఆం. భా. ద్వి. ౪; 2. న్యాయము,ధర్మ మార్గము. "గీ. చంద్రకిరణ భవాప్సరోజాతిఁ బుట్టి,యట్టిపేరొంది వెలయునే నకట యిపుడు, తగ సతుల కెల్ల సామాన్యధర్మ మైన,పతిమనోను కూలతకును బాయఁ దెరువె." కళా. ౬, ఆ. ౫౫; 3. జోలి,సంగతి. "క. నుతియును నమస్కృతి యును లేక తిరిగి శుభ మశుభ మనువగం బొం దక గోష్ఠి తెరువు సోర కుండుట సువ్రతము..." భార. శాం. ౫, ఆ. ౧౩౩; 4. ఉపాయము. "ద్వి. ఈకొలికునిబుణం బీకాళిలోనఁ, దీకొని తీర్పఁగాఁ దెరువు కల్పింపు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦. పం.

తెరువుగట్టు. దే. అ. క్రి. (తెరువు+కట్టు.) మార్గనిరోధము చేయు. "సీ. కదిసితో మునిగాలు గఱచి వెంబడిఁ దీయు దిగిచి తోడనె లేవఁ దెరువుగట్టు." చంద్రా. ౨, ఆ. ౯౧.

తెరువుపెసర. దే. వి. (తెరువు+పెసర.) దారిలో మొలచు పెసరచెట్టు. (ఇది త్రొక్కుడుచే అభివృద్ధి నొందక యణఁగారి యుండి నిష్ఫలముగ నశించును.)"గీ. కాన నిక్కంపుఁగూరిమి గణికయందుఁ, బొరయ దిల బొర్సనే నది తెరువుపెసర." కవిక. ౪, ఆ. ౧౨౨. (క్షణభంగుర మని భావము.)

తెరువువిడుచు. దే. అ. క్రి. (తెరువు+విడుచు.) త్రోవయిచ్చు. "వ...పొలఁతుపెల్లి యైన జలపూరంబు పాయం బుచ్చుచుఁ దెరువువిడువ..." కళా. ౪, ఆ. ౯౩.

తెరువుపెట్టు. దే. అ. క్రి. (తెరువు+పెట్టు.) బయలుదేఱు "గీ...అందఱును గూడి భార్గవు నాశ్ర యించి, తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన, దేవతలమీఁది దాడికిఁ దెరువుపెట్టి." భాగ. ౬, స్కం. ౨౬౦.

తెరువుసాగు. దే. అ. క్రి. (తెరువు+సాగు.) పోవు, పోఁజాలు. "గీ. ఎండపొడ దూరక పగళ్లు నిర్ఘ గవయు, తియ్యమావుల క్రీనీడఁ దెరువుసాగ, కల్ల నల్లనఁ జనుదెంచె నతఁడుభద్ర, వారణం బన సాయం సటారణంబు." వేం. పంచ. ౪, ఆ. ౨౩౧.

త్రెక్కి. దే. వి. తాపము. "క. కొడుకుం గుఱ్ఱుకుఁ జనుఁబ్రాలిడి నీతో రతులఁ బెనఁగ నేతెంచుచు నా,కడ కేలం దాఁకించితిఁ, గడుఁ దెర్లికపుట్టె పోర లఁగా మారెడ్డిన్." వేం. పంచ. ౪, ఆ. ౪౯౧.

త్రెల్లు = తెరలు. "గీ. ఊడుకు సెగ త్రెల్లు నాఁగఁ జెన్నొందుఁ దాప,మునకు నామంబులై..."ఆం. భా. ప్ర. ౪౯.

తెఱ = త్రెళ్లు. (చూ. తెఱప.)

తెఱఁగు. దే. వి. (క. తెఱంగు.) 1. ప్రకారము విధము. "సీ...పలుతెఱంగుల మావిపండ్లతోడ." ఆము. ౨, ఆ. ౬౩. ఆం. భా. ద్వి. ౩౦౩. భార. ఆది. ౧, ఆ. ౧౦; 2. అవస్థ. "క...అప్పడఁతి వేఁడికన్నీ రొలుకం, దన తెఱఁ గెఱిఁగించిన విని, యనుఁగుంజెలు లెల్ల దాని కని-రిట్లనుచున్." నీలా. ౨, ఆ. ౧౦౦. విక్ర. ౧, ఆ. ౧౨౦; 3. పోలిక. "క. శ్రీవల్లభుండు లక్ష్మీ,దేవిని మును బెండ్లి యైన తెఱఁగున..."ఉ. రా. ౧, ఆ. ౨౯. ఆము. ౪, ఆ. ౧౨౧; 4. సమాచారము. "గీ. ఏను నారాక తెఱఁగెల్ల నేర్పడంగఁజెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ." భార. ఉద్యో. ౩, ఆ. ౨౩౬. ఉ. రా. ౨, ఆ. ౨౯; 5. పక్షము, కక్ష. "సీ. వరుసతో వాదించి యిరుదెఱంగులవారి వారించి ..."భీమ. ౪, ఆ. ౧౪౯. హర. ౬, ఆ. ౧౧౨; 6. చిహ్నము, లక్షణము. "గీ. అందు బువ్వులఁ బూజించునట్టి తెఱఁగు, నర్ధచంద్రప్రహారచిహ్నములకలిమి." నైష. ౩, ఆ. ౧౫౯. రాఘవ. ౩, ఆ. ౯౬; 7. స్వభావము. "గీ. ఇట్లు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల, నుల్లమున వెఱఁగందితి నొకటివెనుక, నొకటి రాఁ జొచ్చె మాయ లీయుర్వి మహిమ, తెఱఁగు గాదుగదా యని ధృతిచలింప." కళా. ౩, ఆ. ౨౪౨; 8. పని; కర్తవ్యము. "క. విచ్చి చనకుండఁ బసులం,దెచ్చుట మునుమున్న

తెఱగంటిబోనము. ద్వి. వి. (తెఱగంటి+బోనము.) అమృతము. "సీ. తెఱగంటిబోనంబు దెచ్చినలా వరి చుక్కనుదుటిపెట్టినక్కజేఁడు." వెంక. దేవ. ౨౦. (తెఱగంటిబోనంబు దెచ్చినలావరి = గరుడుఁడు.)

తెఱగంటి యొకిమీఁడు. దే. వి. (తెఱగంటి+ఎకిమీఁడు.) ఇంద్రుఁడు. "సీ. తెఱగంటియొకిమీని తేజిసొంపును గెల్చి పాఁపరాయనిపస పాఱఁ దోలి." రామ. ౩౭౧. ఇట్లే: తెఱగంటి దొర. సమీర. ౩, ఆ. ౯౦.

తెఱగంటిమ్రాఁకు. దే. వి. (తెఱగంటి+మ్రాఁకు.) సురతరువు, కల్పవృక్షము. "సీ. ధేను లెల్లను గామధేనువు లయ్యెను మ్రాఁకులు తెఱగంటి మ్రాఁకు లయ్యె." దశా. ౧, ఆ. ౫౦. ఇట్లే: తెఱగంటిమ్రాను. దశా. ౧, ఆ. ౫౦.

తెఱగంటి రారా. ద్వి.వి. (తెఱగంటి+రాచే+రా.) ఇంద్రనీలమాణిక్యము. "సీ. తెఱగంటిరారాలఁ దీర్చినకంబాలజతఁ గూడియున్న వజ్రంపుబోది." చంద్రి. ౬, ఆ. ౧౧౨.

తెఱచే. దే. అ. క్రి. బయలుపడు. "మ. వివిధామోదకమిశ్రితాళిలమొగి న్వీచెన్...నిధుల్ దెఱచె నుర్విన్ గౌరి జన్మించినన్." కు. సం. ౩, ఆ. ౩౦. స. క్రి. (క. తెరెలు. త. తిఱ) 1. వివృతముచేయు. "క. మే నెఱిఁగి తొంటియను సంధానము చెడి కన్ను దెఱచి దారుణఫణితిన్." స్వా. ౪, ఆ. ౭౧. "గీ. నీవు మాయంగఁ దిమిరంబు నిఖిలలోకచయముఁ గప్పిన భూతముల్ భయముఁ బొందె నీకరంబులు ద్రోవక చీఁకటి యును దెఱచుటకు ఫాలనేత్రంబు దెఱవవలసె." భార. అను. ౪, ఆ. ౪౨౨; 2. వికసింపఁజేయు. "సీ. కమలాగృహకవాట కలితకుంచిక నాఁగ జలజకోరకరాజిఁ గలయఁ దెఱచి." విక్ర. ౧, ఆ. ౯౭. ౩.

తెఱనోరిమెకము. ద్వి. వి. (తెఱనోరు+మెకము.) పంచాస్యము, సింహము. "గీ. పంచముఖసంజ్ఞ పార్వతీపతికిఁ గాక, హరి యనుశుభాహ్వయంబు శ్రీహరికిఁ గాక, యిట్టి తెఱనోరిమెకముల కేల యమరెఁ, గనలి యుగ్రము లైనసింగములఁ గదిసె." రామా. ౨, ఆ. ౫౬, యు. ౨, ఆ. ౪౯.

తెఱనోరు. దే. వి. పా. (తెఱప+నోరు) 1. తెఱచికొని యుండునోరు. "సీ... తెఱనోరఁ ద్రేవుడు తీఁగెసాఁగ." కాశీ. ౬, ఆ. ౪౧, దశా. ౨, ఆ. ౬౦; 2. తెఱచికొని యుండునోరు కలది— పంచాస్యము, సింహము. "సీ. అనరానిపనిఁ గంబ మయ్యెఁ దా నని కాని చఱతుము తెఱనోరి సామినైన." సాంబో. ౨, ఆ. ౧౭౯. చంద్రా. ౨, ఆ. ౪౨.

తెఱప. దే. వి. 1. తెఱచుట; 2. ఉపశమనము. (శ. ర) విశే. (దీనికివృత్తియందు బహుళముగా సంత్యక్తర్ణములోపించి తెఱ, తెట్ట యనురూపములు వచ్చును. ఉదా: తెఱగంటి, తెట్టనోరు. మొ.) మఱుఁగులేనిది, అసంవృతము. "గీ. పసిఁడి గట్టున కొకవింతమిసిమి నించి, నెఱసెఁ గడసావి ముదుసలి తెఱపమొండ." పారి. ౪, ఆ. ౪౩.

తెఱపి. దే. వి. (తెఱచు. ధా.) అవకాశము, సందు. "ఉ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె సాతఁడున్, దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి..." భార. విరా. ౫, ఆ. ౧౪౧. ఉ. హరి. ౩, ఆ. ౬౩. భార. అర. ౬, ఆ. ౩౫౯.

తెఱపిగొను. దే. అ. క్రి. (తెఱపి+కొను.) సందుచేసికొను, అవకాశము కల్గించుకొను. "క. మెఱుఁగులగు వాఁడిమాడ్కులు, కెఱకులు గాఁడఁగొన నగజ కిరవిడిఁ జూడన్, దెఱపిగొనుకతనఁ గాకెదఁ, బెఱనాఁ డమ్మరుశరంబు భేదించు హరున్." కు. సం. ౫, ఆ. ౫౧౦. భార. ద్రో. ౨, ఆ. ౭.

తెఱపు. దే. వి. (తెఱచు. ధా.) 1. (మూర్ఛనుండి) తెలివినొందుట. "క. మఱియుఁ దమఁ బొదువు మూర్ఛల, తెఱపులు గైకొనుచు వారు దెగఁ బోరి..." భా. రా. యు. ౭౧౪; చీలిక. (చూ. తెఱపులుచేయు.)

తెఱపుమఱప్రు. దే. వి. ఒకప్పుడు తెలివితోను నొకప్పుడు విస్మృతితోను నుంట, తబ్బిబ్బు. (శ. ర.) వ్యవ:—వాఁడు సంధివలన దెఱపుమఱపుమాట లాడుచున్నాఁడు.)

తెఱపులుగొను. దే. అ. క్రి. (తెఱపులు+కొను.) వికసించు, వెడలు. "క. మఱపు మసుఁగువడ వేడ్కలు, దెఱపులుగొని నిగుడ రెండుదెఱఁగుల

చేత్రం, బోటివోప్రసెమ్మనంబులు, తెఱ నిసుపుప నలచరింప నేరరు రతులన్." సిర్వ. ౮, ఆ. ౭౯.

తెఱపులుచేయు. దే. అ. క్రి. (తెఱపులు+చేయు.) చీలికలుచేయు, చీల్చు. "చ...మార్గణపర్గములు వచ్చి పక్షముల్, తెఱపులుచేయుచుక్ మెదలు ద్రెంచుచుఁ బొట్టలు సించుచున్..." భా. రా. యు. ౧౦౭౩.

తెఱలు. దే. అ. క్రి. (వాసర) బయలువెడలు. (శ.ర.)

తెఱవ. దే. వి. (క. తెరెవై. తెఱ+వాయి.)—గాంభీర్యము లేనిది—1. ఆఁడుది. "గీ. మెఱయు నాయాడుమాటలు తెఱవపిండు నల్లమునకు నింపారెడునురులు గావె." భార. విరా. ౨,ఆ. ౩౩౫; 2. బయలు. "సీ...తెఱవ నా బయలును స్త్రీ దనర్చు." ఆం. భా. తృ. ౫౪.

తెఱవామెకము. ద్వి. వి. (తెఱ+వాయి+మెకము.) పంచాస్యము, సింహము. "క. మెకములఱేఁ డనఁ దెఱవా, మెకె మన సింగ మన...కరిరిపునామధేయములు..." ఆం. భా. ద్వి. ౮౧. ఇట్లే: తెఱమొగముమెకము, తెఱవాయిమెకము. సాం. ని. తిర్య. ౭౧. అచ్చ. ఆర. ౭.

తెఱవు=తెఱఁగు. వి. (క. తెఱవు.) 1. (న్యాయము.) "క. పిఱుతివియక నాముందఱఁ,దెఱవా యిప్పగిది నాడఁ దెఱవా మేల్ మేల్." అచ్చ. అయో. ౨౨. (శ. ర. పా.); 2. (అవస్థ) "గీ. అమ్మ విను మింక నోకయించుకంత తడవు, నీతెఱవుఁ జూడ నీపేరు నీతెఱుఁగు,నడిగి పరికింప మది యంన్నది..." కళా. ౩, ఆ. ౮౭.

తెఱ్ఱ=తెఱ. (వృత్తియందు తెఱపశబ్దమున కంఠ్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. చూ. తెఱప.)మఱుఁగులేనిది,అసంవృతము. "సీ. బొక్కబోమ్మను నూఁతబొడ్డును మిడిపండ్లుఁ దెఱ్ఱనోరును బాఁచిదేఱుమొగము." భల్లా. ౪, ఆ. (శ. ర.)

తెల. వై. వి. (సం. ధవళః - దీనియామ్రేడితరూపము తెలతెల.) ధవళిమ, తెల్లనికాంతి. "గీ. దండ వాతు లాదవెను వెలతలిరుఁబోండ్ల, తల్లులకుఁ దూర్పు తెలతెలల్ దాయ.నపుడు." రా. వి. ౧, ఆ. ౭౭. విణ. తెల్లనిది. "క. తలయుం జీరయు వొడలును, దెలతెల్గాఁ జడ్డపిండి దిక్కులు గప్పక్, బలపలని వేడ్క తోడుత, నైలపెలనై బ్రాహ్మణుండు విస్మితుఁ డయ్యెన్." భా. పంచ. ౫, ఆ. ౧౯. ద్వి. శ. సా. ౩, ఆ. ౯౯. పు. ౩, పం. క్రి. విణ. 1. తెల్లగా. "చ. లెంతెల వేగ నట్టె..." భార. మా. ౧౪౦; 2. స్పష్టముగా. "ఉ. అందఱు గుంపులై చనఁగ నచ్చట నెన్వని గట్టెఁ దెంట్లిగో, బందుగు లున్నవారో తెలఁ బల్కుము నావుడు.." చెన్న. ౩, ఆ. ౩౫.

తెలగా. వై. వి. (సం. త్రిలింగః.) 1. త్రిలింగదేశ మందలియొకశూద్రజాతి. (వా.); 2. ఆజాతివారు. (వృత్తియందు దీర్ఘమునకు హ్రస్వమగును) ఉదా:- తెలగబలిజెలు. (శ. ర.)

తెలగాణము. వై. విణ. (తెలుఁగు+అణెము.) తెలుఁగు దేశసంబంధమయినది. "సీ. తెలగాణభూములఁ గలమన్నె వారిచే .." వి. పు. ౧, ఆ. ౪౧. (శాసనములలో 'తెలుంగాణెము, అని కనఁబడు చున్నది.)

తెలకు. దే. అ. క్రి. స. క్రి. 1. మ్రొక్కు. "మ. అనలుం డంజలిచేసె నంతకుఁడు సాష్టాంగంబు గావించె మ్రొక్కె నిశాచారి ప్రచేతసుండు తెల చెక్ గేల్మోడ్చె సారంగవాహనుఁడు..." పారి. ౩, ఆ. ౭; 2. స్తుతించు. "గీ. దేవమంత్రి యే తెంచి యాదేవపూజ్యు, నలఘుఫణితుల నిట్లని తెలకెఁ బ్రీతి." పారి. ఉ. ౧౦, ఆ. ౧౫౯; 3. ప్రార్థించు. "క. అసురపతి విప్రునలుక,గాసిబడఁడె తెలచి కడకెఁ గాదె నయనముల్." భార. అను. ౫, ఆ. ౬౮, హరి. ఉ. ౫, ఆ. ౧౯౦.

తెలతెలఁబోవు. ద్వి. అ. క్రి. (తెలతెలన్+పోవు) తెలతెలవాఱు. (శ. ర.)

తెలతెలవాఱు. ద్వి. అ. క్రి. (తెలతెల+పాఱు.) 1. తెల్లవాఱు, వేగు. "క. తెలతెలవాఱెడువేళం, గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౦౨. భీమ. ౨, ఆ. ౪౮; 2. తెల్లఁబోవు, వివర్ణమగు. "క. తొలివేల్పుల మొగములు తెల,తెలవాఱఁగఁ దెల్లవాఱెఁ దెఱవలమోముల్." అచ్చ. బాల. ౮౭.

తెలన. వై. విణ. (సం. ధవళః.) తెల్లనిది, ధవళము. (దీనియామ్రేడితరూపము తెలతెలన.) "క. చెలిమికి నిముందు బలుకర,ములతోఁ జనుదేర మిన్ను ముట్టినయంద,యామ,చలపతికి వేళ వీచిన, తెలివి చోఁపుఁ జెగిఁ దూర్పు తెలతెల నయ్యెన్." ఉ. శా. ౪, ఆ. ౨౪౭. హంస. ౧, ఆ. ౧౩౯.

తెలసాకు. ద్వి. వి. (తెలను+ఆకు.) లేఁతతమల పాకు. "సీ. ఆడపంబు తోయ్యలి మడఁచి యిచ్చిన తెలసాకుఁ జీలిక చేతియందు యుండ." కళా. ౨, ఆ. ౧౭, రామా. ౪, ఆ. ౧౬౯.

తెలవాఱు. దే. అ. క్రి. (తెల+వాఱు.) ఉదయమగు. "క. కలకల పక్షులు బలుకఁగ,జలజాక్షుఁడు విస్మయమున సఖియరో యపుడే,తెలవాఱెనే యొకనిమి షముపలెఁ దోఁచెన్ విలాసవైఖరి వలనన్." దశా. ౮, ఆ. ౨. ౨౪౪, హంస. ౨, ఆ. ౬౮.

తెలాఱు = తెలవాఱు. (ఉదయమగు.) "గీ. ఆఁకటను బోవఁజాలవే యంగడింట,గంట తాకట్టు-గా నుంచి కడుపు నిండఁ,గుడువు మిచ్చట నీడ్గిలఁబడి తెలాఱు,దాఁక నోటులినఁ గలుగదు తక్వ మనిన." చెన్న. ౨, ఆ. ౪౨.

తెలి. యు. దే. వి. 1. పక్వఘృతము, కాఁచిననేయి. 'సీ. తనరును బక్వఘృతంబు తెలి యనంగ..." ఆం. భా. ద్వి. ౨౭౯; 2. జలవిషాదిదివ్యప్రమాణము. (చూ. తెలిగొను) వై. వి. (సం. ధవళిః) ధావళ్యము. తెలుపు. "సీ .. తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల,వెల్లన వెలి నాఁగ వెలయును శుక్లంబు..." ఆం. భా. ప్ర. ౧౦౮; 2. తెలివి, వికాసము. "ఆ. ఉఱికిమంటలోన నుల్లంబు తెలి వోక, యింతయేనిఁ గుంద కిద్ధమూర్తి, దేజరిల్లనున్న ధీరవర్యునకుఁ బ్రత్యక్ష మయ్యె శివుఁడు దయ దలిర్ప." భార. సౌ. ౧, ఆ. ౧౨౪. విణ. తెల్లనిది. "సీ. తెలిగన్నుఁగవ కాంతి సోలుపార నించుక గనువిచ్చి చూచినఁ గాదె యబల." భార. విరా. ౨, ఆ. ౪౭. ఆము. ౧, ఆ. ౮౧; 2. నిర్మలము. "సీ. సెలయేటి తెలినీటఁ జిఱుబంతి పసుపాడి సేసక్రొమ్ముళ్లఁ బచ్చియలు తుఱిమి." హార. ౭, ఆ. ౩౭, భార. ఉద్యో. ౪, ఆ. ౧౨౭.

తెలిక. వై. వి. (సం. తిలకః.) 1. నువ్వులు గానుఁగాడి నూనెయుఁ దెలకపిండియు నమ్ముకొని జీవించు జాతి. "చ. తెలికల మిండగీఁ డొకఁడు తియ్యనినూనెకు ..." (శ్రీనాథునిచాటువు.) 2. బ. తిలలు,నువ్వులు. (శ. ర. వృత్తియం దేకవచనాంతము. శ. ర.)

తెలికడలి. ద్వ. వి. (తెలి+కడలి.) పాలసంద్రము. "సీ. తెలికడలిని గరువలికుడుకరిదొరపఱపుపయి నిదురఁ గొఱలు నఱియు." అచ్చ. అర. ౧౧౪.

తెలికపిండి. వై. వి. (తెలికలు+పిండి.) తిలపిష్టము. "సీ. తిలపిష్టమున కగుఁ దెలికపిండి. గీ. గాన్గ పిండి యనంగ..." సాం. ని. మాన. ౪౭, పద్మ. ౬, ఆ. ౧౧౮.

తెలికవాఁడు. ద్వ. వి. (తెలికలు+వాఁడు.) గాండ్లవాఁడు, తిలఘాతకుఁడు. "సీ... తిలఘాతకుం డొప్పుఁ దెలికవాఁడు, గానుఁగవాఁ డన..." ఆం. భా. ద్వి. ౨౮౭.

తెలిగంటి. ద్వ. వి. (తెలి+కన్ను+ఇ.) ధవళాక్షి, స్త్రీ. "సీ. దౌహృదశ్రీ నిల్చుధవళాంబుజముపోల్కిఁ దెలిగంటినెమ్మోము తెల్లనయ్యె." ఉ. రా. ౨, ఆ. ౧౩౭. దశా. ౧, ఆ. ౧౬౪.

తెలిగాము. వై. వి. (తెలి+గాము.) శ్వేతగ్రహము, శుక్రుఁడు. (శ. ర.)

తెలిగిబ్బ. వై. వి. (తెలి+గిబ్బ.) శివునివాహన మైన వృషభము. "క .. తెలిగిబ్బ యనఁగఁ బరఁగుచు నుండున్, శూలధరుఁ డెక్కు-వృషభము..." ఆం. భా. ప్ర. ౭౪.

తెలిగొను. దే. అ. క్రి. (తెలి+కొను.) ప్రమాణము చేయించు. "క. ముచ్చును బట్టినమాత్రన,చెచ్చెర దండింప కతనిచేఁ దెలిగొని వాఁ, డచ్చైన విడుపు నిక్క-ఫు, మ్రుచ్చైనం దగినదండమును గొనవలయున్." విజ్ఞా. ప్రా. కాం. ౯౧. విజ్ఞా. వ్యవ. కాం. ౧౧౪.

తెలిడాలుమెకము. ద్వ. వి. (తెలి+డాలు+మెకము.) సింహము. "క. అమ్మేడచివర కెంతయు, నెమ్మదితో నెక్కి- కడలు నెమకుచుఁ జెట్టుం, ద్రిమ్మరి తెలిడాలుమెకం బిమ్మున నొకమ్రాని క్రింద నెన సినకడఁకన్." అచ్చ. సుం. ౫౭.

తెలితేజి. ద్వ. వి. (తెలి+తేజి.) ఉచ్చైశ్శ్రవము. "సీ... తెలితేజిఁ దెమ్మన్నఁ గానక తిరుగు సాది." దశా. ౨, అ. ౪౯. ఇట్లే: తెలిబాబా. శశాం. ౨, ఆ. ౨౪.

తెలిదమ్మి. వై. వి. (తెలి+తమ్మి.) తెల్లదామర, పుండరీకము. "సీ. తెలిదమ్మివిరియింటి తెలిగంటికెంపువాతెఱసొంపు పవడంపుఁదీఁగెగుంపు." దశా. ౧, ఆ. ౧౬౭.

తెలిదమ్మికంటి. ద్వ. వి. (తెలిదమ్మి+కన్ను+ఇ.) పుండరీకాక్షుఁడు, విష్ణువు. "చ. అని తెలిదమ్మికంటి మది

నంటి పెనంగొనుతూర్పి సాడినం, గనుఁగొని..." నీలా. ౨, ఆ. ౪౦.

తెలిదీవి. వై. వి. (తెలి+దీవి.) శ్వేతద్వీపము. "సీ. తెలిదీవిపుడమిముద్దులగుమ్మ నిజవలగ్నమునఁ బూసు సువర్ణఘంటి యనఁగ." ఉ. రా. ౧, ఆ. ౩౧౬. నీలా. ౧, ఆ. ౪౫.

తెలిదీవిదొర. ద్వ. వి. (తెలిదీవి+దొర.) విష్ణువు. "సీ. సనకాదులకు లేనిచనవుతోఁ దెలిదీవిదొరచెంగట మెలంగుమురిపె మెల్ల." చం. రా. ౨, ఆ. ౩౦. ఇట్లే: తెలిదీవిమన్నీఁడు. సాం. ని. దేవ. ౪.

తెలిపక్కము. వై. వి. (తెలి+పక్కము.) శుక్ల పక్షము. (శ. ర.)

తెలిపించు. దే. స. క్రి. (తెలుపు ధా. ప్రే.) 1. లేపు, మేలుకొలుపు. "ఉ. కొందలపాటునన్ మనము గుందినఁ గంటికి నిద్ర రాక నేనం దెలిపించి యప్డు పయనంబయి దైత్యవిభుండు వోవ..." నిర్వ. ౬, ఆ. ౭౦; 2. ఎఱిఁగించు, తెలియఁ బఱచు. "వ...అది తనకుమారులఁ బిలిచి తెలిపించిన వార లిట్లనిరి..." కళా. ౪, ఆ. ౧౫౧; 3. వ్యక్తముచేయు. "ద్వి. లీలమైఁ దెలిపించు లే జవ్వనములనోలి వినోదించు చున్నయంగనల." రం. రా. ఉ. ౭౭. పు. ౨౬. పం.

తెలిపులుఁగు. ద్వ. వి. (తెలి+పులుఁగు.) హంస. "సీ ..తొలకరిఁ గల్గుగువ్వలు నల్లజక్కులు తెలి పులుఁగులు...అన హంసముల పేరు లలరు..." వేంక. తిర్య. ౯౯. ఇట్లే: తెలిపుల్గు, తెలిపిట్ట. నీలా. ౧, ఆ. ౬. ఆం. సం. తిర్య. ౧౭.

తెలిమల. ద్వ. వి. (తెలి+మల.) కైలాసము. "గీ. తెలిమల యనంగ రజతాద్రి తేజరిల్లు." సాం. ని. స్థా. ౫౫.

తెలిమిన్న. వై. వి. (తెలి+మిన్న.) వజ్రము, తెల్లని రత్నము. "చ. అని జననేత తల్పి యసఖాగ్రణి కేల్ కయిదండఁ బూని చక్కని తెలిమిన్న మెట్టి కలు గట్టినతో వ నగేంద్ర మెక్కె..." చంద్రి. ౨, ఆ. ౫. [(శ. ర.)

తెలిమెకము. వై. వి. (తెలి+మెకము.) సింహము.

తెలిమొదవు ద్వ. వి. (తెలి+మొదవు.) కామధేనువు. (శ. ర.)

తెలిమోముపక్కి. వై. వి. (తెలి+మోము+పక్కి.) గరుత్మంతుఁడు. సాం. ని. దేవ. ౧౫.

తెలిమ్రాఁకు. ద్వ. వి. (తెలి+మ్రాఁకు.) కల్పవృక్షము. "సీ. తెఱఁగంటిదొరయింటి తెలిమ్రాఁకు తెఁగ బ్రాఁకి..." నీలా. ౧, ఆ. ౪౫.

తెలిమ్రాను = తెలిమ్రాఁకు. నీలా. ౧, ఆ. ౪౫.

తెలియ. వై. వి. (సం. స్థాలి.) భోజనపాత్రము. (శ. ర.)

తెలియఁబడు. ద్వ. అ. క్రి. (తెలియన్+పడు - స్వార్థమున.) తెలియు. (చూ. తెలియఁబఱచు.)

తెలియఁబఱచు. ద్వ. అ. క్రి. (తెలియఁబడు ధా. ప్రే.) వెల్లడించు, తెలియఁజేయు. "సీ. పదిరెండు రాసుల బహుళార్థరాసుల ఫలమిాని మేవేల్పు తెలియఁబఱచు." సాంబో. ౨, ఆ. ౪.

తెలియు. దే. అ. క్రి. 1. ఎఱుకపడు, విదితమగు. "వ...దేవతలకుం దెలియనట్టిది యాత్రనికిం దెలియు .." భార. ఉద్యో. ౨, ఆ. ౧౦౨. ఆము. ౫. ఆ. ౯౭; 2. విశదమగు, తేటపడు. "గీ. అభవ నీకంఠమూలంబునందుఁ దెలిసి, కాన నయ్యెడు నిది యేమి కప్పు సెప్పు." హర. ౬, ఆ. ౫. జై. ౭, ఆ. ౬౩; 3. మేల్కొను. "గీ...అఖునెలల కొకనాఁడు భోజనార్థులకుఁ దెలియునాఁడు వీఁ దజయుఁడు రిత్తనాఁడు దెలుపబలిమిఁ దెలియునాఁ డీతనిబలము దూలు." భా. రా. యుద్ధ. ౭౭౬. వరాహ. ౧౦, ఆ. ౬౦; తెలివి కలిగియుండు. "సీ. చేన నదీసూనుఁ డీ యస్త్రమునకు మా తెఱుఁగుఁ గాన. అనతఁడు తెలిసియుండు నాతనిచెన వోకు..." భార. విరా. ౫. ఆ. ౨౧౦; 5. ప్రసన్నతనొందు. "సీ. ఆకాశవాణివాక్యంబుచే బ్రతికి నీ కెదురుసూచిలిమి సుమ్మిన్నిసాట్లు. గీ. అనుచు మొగములు దెలిసి దేహములు పొంగి, పలుమఱును గౌఁగిలించుచు ..." సా. ౩, ఆ. ౧౬౪. భార. భీష్మ. ౧, ఆ. ౧౦౨; వికసించు. "గీ. వెరవుతోడ వేకువ యను వెజ్జుతూర్పు, నిక్క౦ పనుమందునఁ దీర్చ నొక్కొ, తిమిరకాలాహివిషమూర్ఛనము ననంగ, దెలిసె నెత్తమ్ము లొప్పులు దలకొనంగ." హరి. పూ. ౭, ఆ. ౧౬౯; 7. ప్రకాశించు. "క. ఒక కను తెలియదు రాత్రుల, నొకకను పగరింటఁ దెలివినొందక యుండున్, ఒకకన్ను పొగలు కమ్మిన, దిక నెవ్వతె శివునిఁ జెంద నిచ్ఛించు మదిన్. పార్వ. ౪, ఆ. ౯౩; 8. తేఱుకొను,

స్వాస్థ్యము నొందు. "వ...ఇట్లు తండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధికశోకసమాకులత్వంబు నొంది హాహాకారంబులు సెలంగఁ బొడివి రంత. "ఉ. తెలిసి భార్గవుండు దృఢతీవ్రనారాచ, పంక్తి గురిసి..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౩౪, ౩౩౫. భార. ఆది. ౭, ఆ. ౨౩౭; 9. నమస్కరించు. "వ ..కృతశౌచమందలిపాపహారునకుఁ దెలియుట శ్వేతగిరియందలి సింహాలోచనునకు వెన్నెల..." ప్రబంధ. ౮౮౦.

తెలియేఱు. ద్వ. వి. (తెలి+ఏఱు.) ఆకాశగంగ. "క... తెలియే ఱన్విచు వాఁ కన సౌరగంగ..." ఆం. భా. ప్ర. ౫౫.

తెలిరా. ద్వ. వి. (తెలి+రాయి.) చంద్రకాంతము. "వ... తెలిరాకట్టునెలవ్రులం బవ్వళించి యున్న నాయికానాయకులు..." పారి. ౨, ఆ. ౫౨.

తెలివి. దే. వి. (తెలియు. ధా. క. తిళివు. త. తెళియు.) 1. జ్ఞానము; వివేకము. "చ...దీని కేల యధికం బగు నెవ్వగ నింత నొవ్వని, త్తెలివి మనంబునం జొనుపు ధీరత సారత గూర్పు నేర్పునన్." భార. ద్రో. ౨, ఆ. ౨౧౩. "క. కల దది యూరక కానఁగ, నలవియె శ్రుతి వాక్యసమితియర్థంబులపై, నిలిచినశ్రద్ధం గ్రమమునఁ, దెలివొందినఁ గాక యెట్టిధీమంతునకున్." భార. అను. ౫, ఆ. ౧౬౩; 2. గ్రహణశక్తి. "చ. కనుఁగవ లెస్సఁ గాఁ దెలివి గల్గినవారికిఁ గాక గ్రుడ్డికిన్, గనఁబడు నెట్లు వెన్నెలలు గాయఁగ నంశుకరూపు భాస్కరా." భా.శ. ౪౯; 3. వికాసము. "క. పురహరుఁ డనుమతి సేయఁగ, శరము శరాసనము దివ్యసరసిన యిడి యన్నరుఁడు సను దెంచి యాశం, కరుముఖకమలంబు తెలివి గాంచి ముదమునన్." భార. ద్రో. ౨, ఆ. ౩౭౫. 4. కాంతి, ప్రకాశము. "గీ. ఇనుఁడు తనదీప్తి తన చేత నిచ్చిపోయి, మఱవ కేతెంచి నిజరుచి మగుడఁ గొనినఁ, దెలివిచెడి తెల్లనయి రనుపలుకు జగతి, నిలుపుగతి దీపకళికలు వెలరువాఱె." కు. సం. ౮, ఆ. ౧౮౬. యా. ౨, ఆ. ౭౧; 5. (మూర్ఛాదులనుండి) తేఱుట, స్మృతి. "సీ. పలుమాఱు మూర్ఛిల్లి పలుమాఱు దెలి వొంది తనకళత్రాదులతగులు మిగిలి." కవిక. ౫, ఆ. ౧౧౧. కాశీ. ౩, ఆ. ౨౦; 6. నిర్మలత్వము. "క. కలఁగినపెద్దమడువు వినుఁ, తెలివిఁ బొరయు నెట్లు తా నధికుండ ట్లగ్గలము లయినదురితంబులఁ గలఁగియుఁ దనయంతఁ దేఱు గౌరవ మొప్పన్." భార. శాం. ౩, ఆ. ౩౪, కు. సం. ౮, ఆ. ౧౫౭; 7. అంగీకారము. "సీ. సాధుచరిత్రయుఁ శాంతయు నైనయిగ్గాంధారియును నేను గాఢవినయ, మార మీ తెలివి విట్లు గోరుచున్నారము..." భార. ఆశ్ర. ౧, ఆ. ౯౬. సం. భార. ఆశ్ర. ౧౧, స. ౫; 8. నున్నఁదనము. "సీ... తేట నున్నన నున్న తెలివి నునుప్ర. గీ. నిద్ద మన స్నిగ్ధత కెసంగు..." సాం. ని. స్థా. ౬౦; 9. సన్నత. "గీ. నీకు వీరలఁ దేర్చుట నెఱయ కాదె, సిద్ధమెవ్వారి దెలి వొందఁ జేయ నేర్తు." భార. ఉద్యో. ౩, ఆ. ౨౬౩; 10. సంతోషము. "వ...సకల భూతంబులమనంబులు దెలివిం బొందె..." కాశీ. ౪, ఆ. ౧౦, వసు. ౪, ఆ. ౧౦౬; 11. జాగ్రత. "సీ. తెలివిమైఁ దనకన్నుఁ దెఱచి దృష్టింపఁడు వామాక్షిరుచులు తీవ్రంబు లనుచు." దశా. ౨, అ. ౮౯. విణ. 1. స్పష్టము. "గీ. తెలివియై మీఱు నూగారుదీప్తియొక్క." కువల. ౫, ఆ. ౧౦౯, దశా. ౧, అ. ౧౦౪. 2. దీప్తిమంతము, కాంతిమంతము. "సీ. తెలివివెన్నెల వెండితీఁగలు నిగిడించు చదలు కమ్మచ్చు బెజ్జము లనంగ." పారి. ౨, ఆ. ౩౬.

తెలివికత్తె. దే. విణ. (తెలివి+కత్తె.) వివేకవతి, ప్రాజ్ఞి. "సీ... తెలివికత్తె యనంగఁ దేరుఁ బ్రాజ్ఞి." ఆం. భా. ద్వి. ౧౦౭.

తెలివికాఁడు. దే. విణ. (తెలివి+కాఁడు.) వివేకవంతుఁడు, ప్రాజ్ఞుఁడు. "సీ. తెలివికాఁ డనఁగను వెలయుచుండు నభిజ్ఞుఁడు..." ఆం. భా. తృ. ౩.

తెలివిగొను. దే. అ. క్రి. (తెలివి+కొను.) మూర్ఛాదులనుండి తేఱుకొను. "క. అటువలె నృప నిట లాక్షుఁడు, పటుశరనివహంబుఁ జెంది బాధపడంగా, నటనమున హేల యనియెదు, కుటిలాలక వచ్చెఁ దెలివిగొనఁ జేయుటకున్." హంస. ౧, ఆ. ౭౪.

తెలివిడి. దే. వి. (తెలియు. ధా.) 1. జ్ఞానము. "గీ. తెలివి యనఁగ నెఱుక యనఁ దెలివిడి యనఁ, బరగు జ్ఞానంబు..." ఆం. భా. ప్ర. ౧౦౨; 2. తెలియఁజేయుట; 3. దృష్టాంతము. (శ. ర.)

తెలివిపడు. ద్వి. అ. క్రి. (తెలివి+పడు.) 1. తెలియు, స్పష్టమగు. "వ...ఎఱుంగవలయు నట్టివి యనే కార్థంబులును దెలివిపడు విను మని సుప్రసాద ఘటితుండై." భార. శాం. ౬, ఆ. ౨, వాసిష్ఠ. 3, ఆ. ౬౧; 2. తోఁచు, స్ఫురించు. "గీ మించి భూమండలంబు నిర్మించువేళఁ, దెలివిపడ బ్రహ్మ కడియుచ్చు దెచ్చునొన్న, ద్వీప మనఁ జెల్లు బహురత్నదీప్యమాన, గోపురంబుల నుజ్జయినీ పురంబు." ద్వా. ౧, ఆ. ౬౭. విప్ర. ౫, ఆ. ౫౮. 3. ప్రసన్నమగు. "రగడ. పొలిచె మధులక్ష్మి సురపొన్నలను బొన్నలను, దెలివిపడి పుష్పొడుల తిన్నెలను." రాఘవ. ౨, ఆ. ౬.

తెలివిపఱుచు. ద్వి. స. క్రి. (తెలివిపడు ధా. ప్రే.) బోధించు. "వ...అంతేవాసులకుఁ దెలివిపఱుపన్..." ఆము. ౬, ఆ. ౬౫.

తెలివు. దే. వి. (తెలియు ధా. త. తెలివు.) కాంతి. "సీ. పలుకులముద్దును గలికిక్రొన్నెల్గన్నుల తెలివును వలుఁదచన్నుల బెడంగు." భార. ఆది. 3, ఆ. ౭౭.

తెలుఁగు. వై. వి. (సం. త్రిలింగః? త. తెలి.) 1. ఆంధ్రభాష. "క. తెలుఁగు కవిత్వముఁ జెప్పం, దలఁచినకవి.." నిర్వ. ౧, ఆ. ౬; 2. ఆంధ్రదేశము. "ఆ. తెలుఁగ దేల యన్న దేశంబు తెలుఁగేను, దెలుఁగువల్లభుండఁ దెలుఁగొకండ, యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స." ఆము. ౧, ఆ. ౧౫. (పైరెండర్థములకు నిది యుదాహరణము) 3. బ. ఆంధ్రులు. "సీ. ఆరెలు కన్నడీ లఱవలుం దెలుఁగులు దన బిరుదాదియందగిలి కొలువ." ద్వా. ౧, ఆ. ౪౨.

తెలుఁగుబడి. ద్వి. వి. (తెలుఁగు+బడి.) ఆంధ్రీకరణము, తెలుఁగుసేఁత. "క. అలవడ సంస్కృత, శబ్దము, తెలుఁగుబడి క్షేమణంబు తేటపడంగాఁ, బలుకు నెడ లింగవచనం, బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్." నిర్వ. ౧, ఆ. ౮.

తెలుఁగుభూమి. మి. వి. (తెలుఁగు+భూమి.) ఆంధ్రదేశము. "గీ. బలిమి వాటించి యేలించెఁ దెలుఁగుభూమి." భీమ. ౧, ఆ. ౬౨.

తెలుచు. దే. అ. క్రి. కనఁబడు. (చూ. తెల్చు.) ఆ. క్రి., స. క్రి. నమస్కరించు. "సీ...వసువులఁ జెక్కువిధంబులఁ బ్రియము వుట్టఁ, దెలిచి ప్రార్థించిన వలుకవో విడిచి..." భార. ఆశ్వ. ౪, ఆ. ౮౯. స. క్రి. 1. పొగడు. "ఆ. అతఁడు పుణ్యలోకగతియును మానవత్వంబు ఘోరనరకవాసమును వివరించి పుచ్చువారిఁ దెలిచి మన్నించి భక్షించి పనుపఁ దోడఁ జిగురుఁబోఁడి." భార. అను. ౫, ఆ. ౧౬౭; 2. ప్రార్థించు. "క. కోకిలములఁ దెలిచినఁ బలుగాపలపాపిఁ జొదలునట్టికష్టపు బులుఁగుల్, నాకు సపత్న్యము లని యూహా కూఁతలు మానఁగలవె యని ప్రార్థనలన్." కళా. ౬, ఆ. ౨౭౦; 3. భజించు. "క. దేహస్థు నదేహు నఖిల, దేహిసముల్ నిన్ను భక్తిఁ దెలుతురు దురిత, ప్రత్యూహమ్ము పుణ్యచయమున, మోహాత నిరసించు యోగిముఖ్యులు కృష్ణా." భార. శాం. ౪, ఆ. ౨౩౭; 4. (జలాదులు) తేర్చు. "సీ. రాగహీనత మనోగ్రంథి తెంపఁగ నీళ్ళకలఁక నిండుపు రాచి తెలుచుభంగి, విజ్ఞానవశమున వెలయుఁ స్వభావంబు నిత్యప్రసన్నమై నెగడుచుండు." వాసిష్ఠ. 3, ఆ. 3౨; 5. ప్రసన్నత నొందించు, శాంతిపఱుచు. "క...ద్రోణులచి, త్తము శాంతినొందఁ జేయుట, మముఁ దెలుచుట..." భార. విరా. ౪, ఆ. ౨౨౭. 6. సంతసింపఁజేయు. "చ. అభిముఖతత్త్వశాలి సుకృతాఢ్యుఁడు నాచతురాస్యమానస, ప్రభవుఁడు...ధర్మజుఁ గానఁ బోవ భూవిభుఁ డతఁ డాతని దెలిచె వేయివిధంబుల సాధుపూజలన్." పాండు. ౫, ఆ. 3౫; 7. తేలుచు, ఓలలాడించు. "చ...గమల్ గమ్ములై చనుదెంచి నెత్తుటం, దెలిచిరి తీవ్రసాయకహతిన్ రథవాజిఘటద్విపంబులన్." వరాహ. 3, ఆ. ౪౮; 8. విఱుఁగు. (స్వార్థమున 'చు' వర్ణము) "రగడ. ఇప్పటిప్పటి కింపు నింపెడు నిండు నిండు నిభాస్య నిల్తమె, యప్పయప్పరువంపు మొగ్గలయాస యానతి వల్లఁ దెల్తమె." వాల్మీకి. 3, ఆ. ౧౧౪, శుక. ౨, ఆ. ౫౨3.

తెలుపారు. ద్వి. అ. క్రి. (తెలుపు+ఆరు.) తెల్లనగు. "సీ. దిక్కులన్నింటను దెలుపారువూఁత గావించె నుజ్జ్వలయశోవిభ్రమంబు." భార. విరా. ౫. ఆ. 3౨౦.

తెలుపు. యం. దే. స. క్రి. (తెలియు ధా. ప్రే.) 1. ఎఱిఁగించు, చెప్పు. "క. ఈనారీరత్నము మ్రాలో నెవ్వరి కర్థ మగు దెలుపవే కరుణన్." భో. ౭, ఆ. ౮౧, పారి. ౨, ఆ. ౭3; 2. వివరించు,

స్పష్టముచేయు. "క. ఆరాజసుతులవిద్యా, హారగ కటుచేష్టితముల బరువడి నగ్గాం,ధారీధృతరాష్ట్రుల కతి,ధీరుఁడు విదురుండుసెప్పి తెలుపుచుండెన్." భార. ఆది. ౬, ఆ. ౧౪, భార. శాం. ౧, ఆ. ౩౯; 3. బోధించు,నేర్పు. "క. మఱి యెఱిఁగి యెఱుఁగనొల్లని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే." భార. ఆది. ౪, ఆ. ౭౧; 4. మేలు కొలుపు, నిద్రనుండి లేపు. "క. కలవా రెల్లను మడిసిరి, కలిగియు లేఁడయ్యెఁ గుంభకర్ణుఁడు వీని౦,దెలుపుదునో యేనుఁ గొడుకుం,జల మెడపక రిపులతోడ సరిఁ బెనఁగుదునో." భార ఆర. ౭, ఆ. ౯౩, సా. పంచ. 3, ఆ. ౧౮౬; 5. ఓదార్చు. "కొండొకవగపున కేనియు, నొండొరువులఁ దెల్పనట్టియువిదలు చిత్తం,బొండొండ వనట ముచుఁగఁగ,నొం డెవ్వరుఁ దెలుప లేక యుండి రవశలై." భార. స్త్రీ. ౧, ఆ. ౧౦౦. ద్వి. పారిశ్చ. పూ. ౦౪౫, పం. వి. 1. ఊఱట. (శ. ర.); 2. మేహరోగవిశేషము. (శ. ర.); 3. నమస్కారము. "గీ. వారి యొకండ జగత్కర్త యఖిలధర్త, విశ్వ సంహర్త భోక్త వివేకయోక్త,తలఁపు బలుపును గొలుపును దెలుపు నతని,దెసన శావింప నగు నొండుదిక్కు వోక." నృసిం. ౪, ఆ. ౧౦౩. వై. (సం. ధవళః.) 1. ధావళ్యము, తెల్లఁదనము. "సీ. తెలుపును గప్పును వెలయంగ మెఱుఁగెక్కు తారకంబులఁ గల్కితనము దొడర" భార. విరా. ౧, ఆ. ౨౪౫, ఆం. భా. ప్ర. ౧౦౮; 2. శ్వేతవసనము. "ఉ. ఇందునిభాస్య మైలొడవు లేల ధరింపవు నున్నఁగావు లీ,వెందును మానలేవు తెలు పేటికిఁ గట్టితి..." పారి. ౧, ఆ. ౧౧౫; 3. నైర్మల్యము. "ద్వి. మలుపు లేకన్నుల తెలుపు లనంగ." పండితా. మహిమ. ౨౭౦. విణ. తెల్లనిది. "క. తెలుపు లగుచీరలను బూఁతలఁ బువ్వుల నొప్పి రాజకనయానుగుణో, జ్జ్వలమానసీయ వేషము,లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్." భార. విరా. ౫, ఆ. ౩౧౫, స్వా. 3, ఆ. ౨౭.

తెలుపుడు. దే. వి. (తెలుపుధా.) ఎఱుక. "చ. శిలలను గుప్పచప్పుడును శేతులపోతులు త్రిప్పచప్పుడున్, దెలుపుడు దెల్పుచప్పుడును..." రామా. ౯, ఆ. ౧౮౭.

తెలుపుడుచేయు. దే. స. క్రి. (తెలుపుడు+చేయు.) ఎఱిఁగించు. "క. తెలుపుడుచేయం గలనా,చెలియ మనోవ్యథ శుభస్యశీఘ్ర మ్మనున,ప్పలు కాదరింపఁ గావలె..." కవిజ. ౨, ఆ. ౬౭.

తెలుపుడుసేయు = తెలుపుడుచేయు. రుక్మి. ౧, ఆ. ౧౦౩.

తెలుపువాఱు. ద్వ. అ. క్రి. (తెలుపు+పాఱు.) తెల్లనగు. "సీ కడుపులో నొప్పారుకొడుకు సిర్మల బుద్ధి తెలుపు నాఁ గనఁగవ తెలుపువాఱె." నృసిం. 3, ఆ. ౧౩౧.

తెలుపెక్కు. ద్వ. అ. క్రి. (తెలుపు+ఎక్కు.) తెల్లఁబడు. 1. "సీ. మగరాలచికిలి కమ్మలుదాయఁ దెలుపెక్కెఁ జెక్కు లేమని యొత్తు చెలియ నడిగె." ఉ. రా. ౧, ఆ. ౧౭౪.

తెలె=తెలియ. (భోజనపాత్రము; కంచము.) "క. ఇనుప తెలెన్ మంటి తెలెన్, బెను చేతుల నాకు పెణఁకఁ బీఁటపయిన్ భో,జన మొనరించుట తగదని,మును చెప్పిరి జనుల కాదిమునివరు లెల్లన్." విజ్ఞా. ఆచార. ౭౨, ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౩, ఆం. భా. ద్వి. ౨౪౪.

తెల్గువాఁడు = తెనుఁగువాఁడు. "సీ. ఆంధ్రుఁ డొఁ దెనుఁగువాఁ డనఁ దెల్గువాఁ డన .." ఆం. భా. ద్వి. ౧౦౩.

తెల్చు = తెలుచు. (కనఁబడు.) "వ. పురస్కృత తిరస్కరిణీపరిసరంబుల భాసిల్లులాస్యకీజనంబుల సందుల నందంద తెల్చుచుఁ జెలికత్తియలఁ బిల్చుచు..." విప్ర. ౨, ఆ. ౬౪.

తెల్పారు = తెలుపారు. (తెల్లనగు.) "సీ. దుగ్ధార్ణవంబునందు విశాలరమణీయ మగునొక్కదీవి తెల్పారియుండు." భార. శాం. ౬, ఆ. ౩౬౫. కు. సం. 3, ఆ. ౨౪.

తెల్పు = తెలుచు. 1. (బోధించు.) "చ. కరుణ జనించి శాత్రవుల గాండివి సంపఁగ నొల్లఁడయ్యె నేఁ,బరువడిఁ దెల్పి యైక్యపరిభావనిరూఢము గాఁగఁ జేసినన్." భార. శల్య. ౨, ఆ. ౩౪౫; 2. (మేలుకొలుపు.) "చ...చ,ప్పరమునఁ జాల హృద్య మగుపాన్పున నూఱడి నిద్రవోవున,గ్గురవధకారిఁ గాంచి కడుఁగ్రోధము మోదము సందడింప సుస్థిరతఁ బదప్రహారమునఁ దెల్పెఁ దృణీకరణాభిరాముఁడై." భార. సౌ. ౧, ఆ. ౧౪౭. వి.

(తెల్లఁదనము.) "చ. ఇరుఁ డొడఁగూడి...తను కాంతి మాసె ననఁ దెల్పఱఁ జీకటి కప్పె..." స. సం. ౮, ఆ. ౯౦; 2. (డాలుట.) "సీ. పాల యలుక లనుదెల్పులు నటించుచుఁ గ్రాలునిటుకుల టాపలవిలసనంబు." మార్క. ౧, ఆ. ౧౩౪. విణ. (తెల్లనిది.) "గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయభార్య, లుడుపతికి నందు నొకతె తె ల్పొరె నలుపు." నైష. ౮, ఆ. ౧౮౪.

తెల్ల = తెల. (తెలుపు, ధావళ్యము.) "సీ... తెలి తెల్ల తెల్లన తెలుపు తెల్లన తెలి నాఁగ వెలయును శుక్లంబు..." ఆం. భా. ప్ర. ౧౦౮. విణ. (కర్మధారయమున నిత్యసమము బహుళము.) 1. తెల్లనిది. "సీ. ఉల్ల తెల్లనితురగోత్తమువాలఁబు నల్ల సేసితి రేని .." భార. ఆది ౨, ఆ. ౩౪. ఆము. ౪, ఆ. ౧౭. భా. రా. బాల. ౩౪౮; 2. స్పష్టము. "ఉ. విష్ణువిభూతత్త్వమును వేమఱు నయ్యాయి జన్మకర్మవర్తిష్ణుత లాచరించుటలు దేవకికిన్ వసుదేవసూనుఁడై, కృష్ణుఁ డనంగఁ బుట్టి శిశుఖేలన మాదిగఁ గల్గుభావముల్, ధృష్ణుత నిర్వహించుటలు దెల్లగ వింటి నరేంద్రపుంగవా." ఉ. హరి. ఉ. ౮, ఆ. ౩౦౪.

తెల్లఁటి. దే. వి. (క. తెల్లంటి, తెల్లంటు.) బహుమానము. "గీ. నీర ముంచిన సొరకాయ నెగసి నట్లు, పేరుకొని నైచు తెల్లంటి చీరవోలె." ఉ. హరి. ౪, ఆ. ౨౮.

తెల్లఁబాఱు. ద్వ. అ. క్రి. (తెల్లన్ + పాఱు.) తెల్లనగు; (భయాదులచే) వివర్ణతనొందు. "గీ. తెల్లఁబాఱెను నదె చూడు తెఱవ విధుఁడు." నైష. ౮, ఆ. ౧౬౭. ఆం. భా. తృ. ౧౦౨.

తెల్లకలిగొట్టు. ద్వ. వి. (తెల్ల+కలిగొట్టు.) కాష్ఠపాటలివృ. (శ. ర.)

తెల్లకల్వ. వై. వి. (తెల్ల+కల్వ.) కైరవము, తెల్లని కలువ. "గీ. కైరవాభిధ గాఁ దెల్లకల్వ యనఁగ, వెలయు..." ఆం. భా. ప్ర. ౧౬౪.

తెల్లకాంచనము. వై. వి. (తెల్ల+కాంచనము.) ఒక జాతికోవిదారమువృ. "సీ. తెల్లకాంచనము తుందిల మెట్టికాంచే ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్పు." హంస. ౪, ఆ. ౧౧.

తెల్లకాకి. వై. వి. (తెల్ల+కాకి.) శ్వేతవాయసము, ధూంక్షము. (శ. ర.)

తెల్లకొక్కెర. ద్వ. వి. (తెల్ల+కొక్కెర.) బలాక. (శ. ర.)

తెల్లగన్నేరు. ద్వ. వి. (తెల్ల+గన్నేరు.) అర్జకమువృ. (శ.ర.)

తెల్లగడ్డ. వై. వి. (తెల్ల+గడ్డ.) లశునము, వెల్లుల్లివృ. (శ. ర.)

తెల్లగన్నేరు. వై. వి. (తెల్ల+గన్నేరు.) శ్వేతకరవీరమువృ. (శ. ర.)

తెల్లగఱి. వై. వి. (తెల్ల+గఱి.)—తెల్లని ఱెక్కలు గలది—హంస. "ఉ. బంగరుబొజ్జ పల్కు బడిపై దలి పచ్చనిమేనుతమ్మిపూ, సింగపుఁబెట తెల్లగఱి చిన్నిపటాణి కడానివన్నెముం, గొంగులతండ్రి పాటపెనుకుం దొలుకాచుపు చాలు మోము టెక్కుం గలవేల్పు దనకుం గలనేం జ్ఞోదవించుఁ గావుతన్." పాంచాలీ. ౧, ఆ. ౩.

తెల్లగఱిక. ద్వ. వి. (తెల్ల+గఱిక.) శతవీర్యవృ (శ. ర.)

తెల్లగలిజేరు. ద్వ. వి. (తెల్ల+గలిజేరు.) దీర్ఘపత్త్రము, శ్వేతపునర్నవవృ. (శ. ర.)

తెల్లగినియ. ద్వ. వి. (తెల్ల+గినియ.) సునాభమువృ. (శ. ర.)

తెల్లగిలు. దే. అ. క్రి. జాఱు. "ద్వి. బిగువుచన్నుల జిగిబిగి కొాఁజూచి, తెగడి పయ్యెద లింత తెల్లగిలంగఁ, బదపడి చాఁచిన బాహుమూలముల, నుదిరిబంగరుపొడి యుదిరి మై రాల." ఆ. మ. క. ౨౭౨, పు. ౧౩, పం.

తెల్లగిసె. వై. వి. (తెల్ల+అగిసె.) ముతంగివృ. (శ. ర.)

తెల్లగురిగింజె. ద్వ వి. (తెల్ల+గురిగింజె.) శ్వేతపాకివృ. (శ. ర.)

తెల్లగురిజె. వై. వి. (తెల్ల+గురిజె.) మధుశ్రవవృ. [(శ. ర.)

తెల్లగెంటెన. ద్వ. వి. (తెల్ల+గెంటెన.) అశ్వఖుర, ఓషధీవిశేషమువృ. "గీ. నల్లగెంటెన పూరి తెల్లగెంటెన యుత్తరేణు గుబ్బిరి సంబరేణు..." హంస. ౪, ఆ. ౧౦. ('తెల్లదింటెన.') అని (శ.ర.)

తెల్లగోరంట. వై. వి. (తెల్ల+గోరంట.) సైరేయకమువృ. (శ. ర.)

తెల్లచెన్నఁగులు. ద్వ. వి. బ. (తెల్ల+చెన్నఁగులు.) ఒక రకపుచెన్నఁగిధాన్యము. "గీ. తెల్లనల్లచెన్నంగులు దీవసరులు, నాదియగు పేర్లు గలుగువ ద్గతనియుంట, మందు శతకోటిబారువు లొక్కదినుసు." హంస. ౪, ఆ. ౧౨౮.

తెల్లచెఱకు. ద్వ. వి. (తెల్ల+చెఱకు.) తేజనకము✿. (శ. ర.)

తెల్లజక్కి. ద్వ. వి. (తెల్ల+జక్కి.) ఉచ్చైశ్శ్రవము. "గీ. ..తెల్ల, జక్కి, నిక్కుపీనుల మావు చవలు తేజి, యనఁగ నుచ్చైశ్శ్రవముపేరు లమరు సాంబ." సాం. ని. దేవ. ౧౭.

తెల్లజనుము. వై. వి. (తెల్ల+జనుము) వృత్తపర్ణి✿. (శ. ర.)

తెల్లజిలకఱ్ఱ. వై. వి. (తెల్ల+జిలకఱ్ఱ.) అజాజి✿. (శ. ర.)

తెల్లజిల్లేడు. ద్వ. వి. (తెల్ల+జిల్లేడు) అలర్కము✿. (శ. ర.)

తెల్లటి. దే. వి. (క. తెల్లటి, తెల్లటు.) బహుమానము "క. ఇటమీఁద నెవ్వరికిం దెల్లటిగా నీ విట్టు లునికి లలనా నన్నే, లుట మూఁడుజగంబుల నెక్కటి యేలుం, గాక రామకథ మఱు మింకన్." భా. రా. యు. ౩౧౪. పండితా. పర్వ. ౩౫౧, పు.

తెల్లడాలుమెకము. ద్వ. వి. (తెల్ల+డాలు+మెకము.) సింహము. "క. ఓలిమెయిఁ దెల్లడాలుమెకా లిఱ్ఱులమీఁద నడరుకై వడి..." అచ్చ. యు. ౧౧౫. ఆం. సం. తిర్య. ౧.

తెల్లతుమ్మ. ద్వ. వి. (తెల్ల+తుమ్మ.) విట్టదిరము. "సీ... తెల్లతుమ్మ యనంగ, విట్టదిరాఖ్యయై వెల యుఁను..." ఆం. భా. ద్వి. ౪౧. "సీ. కమలబాంధవునితోఁ గదురుమెర్వుడుపుర్వు దేవతాకుజ ములోఁ దెల్లతుమ్మ." చెన్న. ౫, ఆ. ౭౧.

తెల్లతేజి. ద్వ. వి. (తెల్ల+తేజి.) ఉచ్చైశ్శ్రవము. "గీ. దేవతాశ్వంబు వెలయును దెల్లతేజి, నిక్కుపీనులజక్కి నా నీలకంఠ." ఆం. భా. ప్ర. ౫౬.

తెల్లదమ్మి. ద్వ. వి. (తెల్ల+తమ్మి.) పుండరీకము, తెల్లని తమ్మి. "గీ .. తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్లదమ్మి యనంగను దేజరిల్లుఁ బుండరీకంబు..." ఆం. భా. ప్ర. ౧౬౫. [(శ. ర.)

తెల్లదామర. వై. వి. (తెల్ల+తామర.) పుండరీకము.

తెల్లదీవి. వై. వి. (తెల్ల+దీవి.) శ్వేతద్వీపము. "ఆ. దీవులెల్లఁ దెల్లదీవులై రహిఁ గాంచె..." ఉ. రా. ౫, ఆ. ౧౧౫.

తెల్లన. వై. వి. (సం. ధవళః.) తెలుపు, ధావళ్యము. "సీ... తెలి తెల్ల తెల్లన తెలుపు వెల్ల వెల్లన వెలి పాండ్గ వెలయును శుక్లంబు..." ఆం. భా. ప్ర. ౧౦౧. విశ.

తెల్లనిది. "సీ. దౌహృదశ్రీ నిల్చుధవళాంబుజము పోల్కిఁ దలిగంటి నెమ్మోము తెల్లనయ్యె." ఉ. రా. ౨, ఆ. ౧౩౭. దశా. ౧ ఆ. ౨౬.

తెల్లనగిర. ద్వ. వి. (తెల్ల+నగిర.) వృక్షవిశేషము. "సీ. దేవదారు రుసిరికె తిలకము తెల్లనగిర వేప కరివేప తురకవేప." హంస. ౪, ఆ. ౧౧.

తెల్లనాకు. ద్వ. వి. (తెల్లన+ఆకు.) లేఁతతమలపాకు. "సీ. పొరుగూరిసంతకుఁ బోవు వారలచేతఁ దప్పించుఁ బోఁకలు తెల్లనాకులు..." శుక. ౧, ఆ. ౪౩౪.

తెల్లనార. ద్వ. వి. (తెల్ల+నార.) మత్స్యవిశేషము. (శ. ర.)

తెల్లనిగట్టు. వై. వి. (తెల్లని+గట్టు.) కైలాసపర్వతము. "క. అల్లదె కంటే పోనపోన, తెల్లనిగట్టు ఱుత మబ్బుదేఱెకుపొలవుం, దెల్లెడఁ జూచిన ధరణీవల్లభ సీరాముసేన వాలుమెకంబుల్." స్వా. ౪, ఆ. ౧౬.

తెల్లనితల్లి. ద్వ. వి. (తెల్లని+తల్లి) సరస్వతీదేవి. "చ... వేల్పులు బలుబంటు లాకమలపొల్తుక తెల్లనితల్లి పెద్దకోడ లనుచు నెల్లవారుఁ బొగడం దగునల్లని వేల్పుఁ గొల్చెదన్" ద్వా. ౧, ఆ. ౨.

తెల్లనిదొర. ద్వ. వి. (తెల్లని+దొర) 1 శివుఁడు. "క. పెల్లుసెకఁ జల్లువిన మా, తెల్లనిదొర కుతుక మోవఁ దిని బ్రతుకుట నీచల్లఁదనంబునఁ గాదే, కల్లోలవతీమతల్లి గంగాతల్లీ." విజ. ౧, ఆ. ౫౦; 2. బలరాముఁడు.

తెల్లనిమైదంట. ద్వ. వి. బలరాముఁడు. ఆం. సం. దేవ. ౭౯.

తెల్లనేలగుమ్ముడు. ద్వ. వి. (తెల్ల+నేలగుమ్ముడు) విదారి ✿. (శ. ర.)

తెల్లపులుగుడు. ద్వ. వి. (తెల్ల+పులుగుడు) శ్వేతవాతంగిని ✿. (శ. ర.)

తెల్లమానికము. వై. వి. (తెల్ల+మానికము) వజ్రము. "చ. కనఁదగుఁ దెల్లమానికపుఁగప్పుల నొప్పెడు చప్పరాలతో." య. ౧, ఆ. ౫.

తెల్లమి. దే. విశ. స్పష్టము. "క. మునలి శపియించె నవు డ,య్యసితాక్షతక్షేత్రం, బెనఁగ నళియింప నగు న,ద్దెనఁ బాఱుఁడు నుగుడి గామి తెల్లమియె కదా." స్వా. ౪, ఆ. ౭౧. సీలా. ౧, ఆ. ౫౦.

యుఁన్నఁ, డెప్పలుగొనియున్న మృగములఁ దివిరి చేయ, కెఱచి యాహారముగ మనునెఱుకు లయిన.'' భార. ఆది. ౫, ఆ ౫౩. శుక. ౧, ఆ. ౫౫౫.

తెప్పలుపడు. స్వ. అ. క్రి. (తెప్పలు+పడు) వ్యాధి నొందు. "వ. కొందఱుకులటలు పతిదురవస్థఁ బొందినఁ దెప్పలుపడిన శృంఖలాబద్ధుం డైనను బరిత్యజింతురు..." కాశీ. ౨, ఆ. ౭౯.

తెప్పలపడు = తెప్పలుపడు. "గీ. విశ్వసించిన నీరు ద్రావినను నిద్రపోయినను జూటకొన్నను బొడ్లు చున్న, దెప్పలుపడ్డను గుంటైన దిట్టచెడినఁ, జంపఁ డనుకంప నెట్టిహింస్రుంబునైన." కాశీ. ౪. ఆ ౬౦.

తెప్పగొంటు=తెప్పలుగొంటు. విజ్ఞా. ప్రా. కాం. ౧౬.

## తే

తేంకణము. సం. అ. పుం. దేశవిశేషము. "గీ. తేంకణాంధ్రకళింగాది దేశములకు." నాచి. ౨. ఆ. ౧౬౭.

తేఁకు. దే. వి. (క. తేకు, తేంగు. త. తేక్కు.) క్రకచపత్త్రమువి. (శ. ర.)

తేఁకువ. దే. వి. (తేఁగు ధా.) 1. ధైర్యము. "క. తేఁకువ యలరఁగ నీగతిఁ, దోకొని చని చగల రత్నతోరణపంక్తుల్, ప్రాఁకెడుఘనగృహముల నమ్మూఁకల విడియించె రాజముఖ్యుం డంతన్." భో. ౪, ౧౪; 2. భా. రా. యు. ౧౧౭. సందేహము. "ఉ. అల్లన నింతి యిట్లనియె నారసి వాసవుకల్లేమిరయుం, జెల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చుటొప్పు నా, యంల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౬౫; 3. భయము. "సీ.. భుజబలవిక్రముంబుల ఘనుండు, గురుఁ డట్టివానిఁ దేఁకువ లేక కదిసిరే పాంచాలురు..." భార. ద్రో. ౧, ఆ. ౧౦. భార. ౧, ఆ. ౪౧. భార. ద్రో. ౧, ఆ. ౨౭౩; 4. వివేకము, యుక్తాయుక్తజ్ఞానము. "క. వీఁకమెయిఁ గ్రీడికొడుకుం, దాఁకఁగ నీ కొడుకు కలఁచి తఱిమి కవిసెఁ బే, రాఁకలితో నున్నహరిండే, దేఁకువ నెడి చేరుకరిగలిం గురుముఖ్యా." భార. ద్రో. ౨, ఆ. ౧౯. భార. ద్రో. ౪, ఆ. ౨౫౧; 5. మర్యాద, గౌరవము. "సీ. బోఁటికిఁ దోఁచినఁ బోలియుఁ దేఁకువ యను వాఁడునఁ జెయ్యలు పీడుపడఁగ... గీ...జార పొందు హృదయముఁన కింపుసేయమి..." భార. విరా. ౨, ఆ. ౭౦. భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౭; 6. గర్వము. "ఉ... మున్నడియై యనూరుఁడున్, ధీరత మీఱ నయ్యిరులతేఁకువ మాన్చి.." కృ. శకుం. 3, ఆ. ౫౬; 7. భేదము. "ఉ అసమయుంబున స్మరనియామ్రదుర కన్యలు నాక చొచ్చి ధా, త్రీసురరాజవైశ్యులను దేఁకువ సేయక యెల్ల జాతులుం, గాసిగ నొక్కపెట్టుగఁ బ్రకాశరహస్యవిభేదహీనుఁడై, యాసురవైరి పట్టెఁ జెఱ లడ్డము లేక మృగాయతాత్ములన్." నిర్వ. ౫, ఆ. ౯౮; 8. సంతోషము. "క. అఁనొన్నవారి రమ్మణి తేఁకువ నన్నమిడువాఁడె దేవుఁడు..." ఉ. రా. ౭, ఆ. ౩౦౨. భా. రా. బాల. ౨౧౨; 9. సంకల్పము. "క. దితిసూను దఱిమి మఱియును, దితిజకులము పీఁచమడఁచు తేఁకువ మదిఁ బూనితివేని మమ్ము నేలుట, నతమగు..." హరి. పూ. ౪, ఆ. ౩౧; 10. బింకము. "గీ... తరుణిపొందు, పడయఁ గీడ్పడి తేఁకువ వాపఁ దలఁచు." కు. సం. ౫, ఆ. ౪౫. కు. సం. ౯, ఆ. ౧౪౫; 11. తృప్తి. "క. ఆపాపలవిహారణములు, దీపులు పుట్టింప మరగి తేఁకువ లేకా, గోపాలకులు మక్కువ, నేపనులును మఱచి యుండి రీక్షణపరులై." భాగ. ౧౦, స్కం. పూ. ౭౯౧; 12. పరిపూర్ణత. "క. అఁకలి గాఁబో భక్తిం, దేఁకువ గలవాఁడఁ గానొ తినవేల కృపన్." కాశీ. 3, ఆ. ౧౯; 13. విధము. "వ...గగన పదబిం దెగిపడిన మిక్కుటంపుఁదోఁకచుక్క తేఁకువ మరకతంపుటుప్పరిగ కొణిగ దప్పి యుఱుకుబక దారి పారువామిటారితీరున..." చం. రా. 3, ఆ. ౨౫; 14. ప్రసిద్ధి. "క. బలవిక్రమములఁ గడు మిక్కిలి తేఁకువ గలవు నీవు కినిసిన్న నెదురం, గలరె నిలింపులు..." హరి. ఉ. ౧౦, ఆ. ౧౫.

తేఁగు. దే. అ. క్రి. (త. తేంగు.) వణఁకు. "ద్వి. నీఁగుచుఁ బూఁదేనెఁ దోఁగుచుఁ జలికిఁ, దేఁగుచు నొడలఁ, గ్రాఁగుచుఁ బ్రియుల, కాఁగుచు మదిఁ జెల రేఁగుచుఁ బ్రీతి." పండితా. పర్వ. ౩౫౨.

తేఁజెట్టు. దే. వి. నారికేళమువి. (శ. ర.)

తేఁటి. దే. వి. తుమ్మెద, భ్రమరము. "గీ. ఏల ప్రేలెదు తేటి యింతేటికలుగ, సంశ్రితల సన్నగాలి యో సన్నగాలి, ఫెల్లునే రోపవరన మింత చిలుకఁ జిలుక, సారెఁ గుందింపఁ జందమా చందమామ." రామా. ౬, ఆ. ౨౫. ౨౦. భా. ద్వి. ౯౫.

తేఁటికంటి. దే. వి. (తేఁటి+కన్ను+ఇ.) నల్లనికను దెప్పలు గలిగి యందమైన-స్త్రీ. "గీ. శ్రుతిపుటంబుల కమృతంపుసోన లెసఁగ, మానసాంభోజమధ్వి సవమాకరంద: మాధురులఁ దేల నివేశ సాధురీతిఁ, దేటగీతి వచింపవె తేఁటికంటి." కాళిందీ. ౬. ఆ. ౧౦౩.

తేఁడు. దే. అ. క్రి. పండుకొను "గీ. అతివ ప్రాణేంద్రముఖీతిఁ దవశ్యాకాలఁ,దేఁడి యక్షఁ డందు నియమడితీంద్రఁ బోఁవ,మింటిపై నుంట కా దని యుఁటిమైకిఁ, దెచ్చుకొంటి నటంచు పెక్కెత్చ వెదలు." ఆము. ౫ ఆ. ౧౧౬. ('తెండి' పాఠాంతరము.) కవు. ౫, ఆ. ౧౨౩.

తేగ. దే. వి. తాటిటెంకనుండి బయలుదేఱి భక్ష్య పదార్థముగా నుపయోగపడు మొలక, (శ. ర. వా.)

తేగద దే. విణ. (త. తేయ్ గద్దై.) అఱిగినది. (సాంకేమం. శ. ర.)

తేగము. వై. వి. (సం. త్యాగః.) దానము. "సీ .. దానమాఁ జాగము పెట్టొనఁ గీఁ యీఁవి. గీ. పుడుకురింత పుడిక తేగము పుడు కనఁగ." ఆం. భా. ద్వి. ౧౭౨. వేంక. మాన. ౪౮.

తేగాకత్తి. ద్వ. వి. (హిం. తేఘా.) చురకత్తి. (శ. ర.)

తేగుడు. దే. వి. చొల్లు. "సీ. నోరు తేగుడు గాఱ నారి వేరము మీఱ సారెఁ బయ్యెద జాఱ యోరఁ జేర." చంద్ర. వి. ౩, ఆ. ౧౪౭.

తేజనకము. సం. వి. అ. పుం. కాకివెదురు. శ. ర.)

తేజనము. సం. వి. అ. పుం. 1. వెదురు; 2. ఱెల్లు. న. 1. సానఁబట్టుట, వాఁడిచేయుట; 2. మెఱుఁగు పెట్టుట; 3. జ్వలింపఁజేయుట, రగులుకొలుపుట.

తేజని. సం. వి. ఈ. స్త్రీ. 1. చాఁగ; 2. మానేరు.

తేజపత్త్రము. సం. వి. అ న. ఆకుపత్త్రి.

తేజము. సం. = తేజస్సు.

తేజరిలు = తేజరిల్లు. 1. (ప్రసిద్ధినొందు.) "సీ. అధిక పుణ్యప్రాప్య మైనగంధర్వజాతిని సముద్భవ మంది తేజరిలు." కళా. ౫, ఆ. ౧౦౪; 2. (వర్ధిల్లు.) "క...పుత్త్రోత్సవ మింపొనరఁగఁ జేసి సూతక, దినములు వెడలించె ముదము తేజరిలంగన్." సా. ౧, ఆ. ౪౧.

తేజరిల్లు. వై. అ. క్రి. 1. ప్రకాశించు, జ్వలించు. "సీ. త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁ జేసి క్రతు కృత్యములు వినిర్గతము లయ్యె." భార. ఆది. ౧, ఆ. ౧౪౧. హరి. ఉ. ౧౦, ఆ. ౪౯; 2. ప్రసిద్ధి నొందు. "శా...చతుర్వక్త్రీ యున క్త్రంబునన్, శాశంబొందక తేజరిల్లె నకటాన్మస్త్రంబు సూచించుచున్, ...పట్టణవైభవంబు..." వసా. ౧, ఆ. ౧౯౩. భార. శాం. ౫. ఆ. ౩౪౫.

తేజస్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. గజపిప్పలి; 2. చవికె; 3. పెద్దమానేరు. విణ. (త్. స్వతీ. త్.) తేజస్సు గలది.

తేజస్విని. సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దమానేరు; 2. మానేరు. విణ. (న్. సీ. న్.) తేజస్సు గలది.

తేజస్సు. సం. వి. స్. న. 1. ప్రకాశము; 2. ప్రభుశక్తి, ప్రభావము; 3. పరాక్రమము; 4 రేతస్సు; 5. బలము 6. శరీరకాంతి; 7. నవనీతము; 8. అగ్ని; 9. బంగారు; 10. దిట్టతనము; 11. శక్తి; 12. నీరు; 13. అన్నము; 14. ధర్మము; 15. చైతన్యము; 16. నాయకగుణములలో నొకటి; 17. మజ్జ; 18. పిత్తధాతువు. అ. పుం 1. కాంతి; 2. వాఁడి.

తేజి. దే వి. (క. తేజి. త. తేసి.) 1. గుఱ్ఱము. "క. ఆపురి తేజుల వేగ, వ్యాపారము గెలువ నోప మనసిబ్బితిఁ బో.చాపలవిరహితపౌఖ్యం, బాపాదించుకొను మానవాళిమనముల్." కాశీ. ౧, ఆ. ౭౬. వసు. ౫, ఆ. ౬; 2. మంచిజాతిగుఱ్ఱము. "ఉ. కోమటు లెల్ల సర్థపులు గుఱ్ఱము లెల్లను దేజులప్పురిన్." విక్ర. ౧, ఆ. ౯౯; 3. కవచము తొడిగిన గుఱ్ఱము. "సీ. తేజి నా నున్నతవాజియై విలసిల్లు..."ఆం. భా. ద్వి. ౧౯౭.

తేజిలు. వై. అ. క్రి. ప్రకాశించు, ఒప్పు. "ఉ. అంగుళులే దళంబులు నఖాళులు కేసరముల్ పద ప్రసీ, తాంగణనమ్రదేవమకుటాంచితనీలమణీరుచుల్ చల,ద్భృంగములై చెలంగఁ గడుఁ దేజిలు శౌరిపదాబ్జముల్ ..."కాళిందీ. ౧, ఆ. ౧౯౨.

తేజిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తేజస్సు కలది. "గీ...అద్దనుజవరుని,తనువునందుండి తేజిష్ఠ తనువిలాసుఁ, డైనపురుషుండు వెడలిన నతఁడు సూచి." భార. శాం. ౩, ఆ. ౧౪౧.

తేజీ. తేజి. 1. (గుఱ్ఱము, వాహనము). "సీ. సురకిరీటముల నుంచుపదంబు దైతేయనాథు తేజీ వెంట నడవ నేర్చు." దశా. ౨, ఆ. ౧౧౩, నీలా. ౧, ఆ. ౩౨; 2. (మంచిజాతిగుఱ్ఱము). "క. [illegible]

నిన్నె ధాత్రీవల్లభుఁడసురక్తి సమరవల్లభుమారితో, నల్లసమాడం జాలెదు, తెల్లనియొకకత్తలాని తేజీ హాయమున్." సైమ. ౬, ఆ. ౯౬. రాజ. చ. 3, ఆ. ౧౮౪.

తేజీ. వై. వి. (సం. తేజః.) 1. శోభ ప్రకాశము. "క. జేజేరాజాబాహుజ,గాజిగి నొగిఁ జగడి నెగడఁ గాఁ జాలెదుమేల్, తే జూ కెడుకుత్తుక గల,జేజేవర్గ మొగిలుదారిసి గజేజేకున్." అచ్చ. బాల. ౨౬, సీలా. ౧, ఆ. ౨3; 2. శూరత్వము. "గీ. వెలయ నిరుదచ్చిరాచే జాబిలులలోన, మిక్కుటం బగు తేజున మెఱసినాఁడ." అచ్చ. బాల. ౧౦౧, అచ్చ. యు. ౯౯; 3. ప్రభావము, మహిమ. "ఉ. ఆఱసి తేజు గల్గి యల రారెడునయ్యేకమీఁదు .." అచ్చ. బాల. ౯౬.

తేజీమాలు. వై. వి. (హిం. తేజ్.) వాఁడి. (చూ. తేజుమాల్సేయు.)

తేజీమాల్సేయు. ద్వ. స. క్రి. (తేజుమాలు+చేయు). పదునుచేయు, వాఁడిచేయు. "సీ. మధువశంబున తేజుమాల్సేయ మరుఁ డుంచు నవిరహాస్త్రరక్త శస్త్రచయము." ఉ. రా. ౬, ఆ. ౬.

తేజోమంథము. సం. వి అ. పుం. చిఱునెల్లి*.

తేజోవృక్షము. సం. వి. అ. పుం. క్షుద్రాగ్నిమంథము*.

తేట. దే. వి. (తేఱు ధా. క. తిళి.; త. తేట్టై.) 1. మజ్జిగ లోనగు ద్రవపదార్థమునం దడిగి తేఱిన ప్రశస్తాంశము. "సీ. అలిపలిన్ననిమాట లమృతంపు తేటలు..." విక్ర. ౧, ఆ. ౧౯౯. విజ. ౧, ఆ. ౧౪౯; 2. నైర్మల్యము. "సీ. కలికిరాయంచ ఱెక్కలమించు తెలిచాయ తెరలతేటయు గుఱు తెఱఁగ రాదు." ఉ. రా. ౫, ఆ. ౨౦౭. నరస. ౧, ఆ. ౬౫; 3. ప్రసన్నత. "క. హరిభక్తులతో మాటలు.ధర నెన్నఁడుఁ జెడనిపుణ్యధనముల మూటల్, వరముక్తికాంత తేటలు, నరివడ్వర్గంబు సొరని యరు దగుకోటల్." భాగ. ౬, స్కం. ౧౫3; 4. వికాసము. "చ. చనుఁగవయొప్పు నెన్నడుమునన్నదనంబు మెఱుంగు లీను మోముసఁ గలతేట నెన్నడలముద్దును, మాటలనేర్పు..." శుక. ౨, ఆ. ౫౫౧; 5. రీతి,విధము. "సీ. అర్ధచంద్రుని జేట నవఘళించులలాటకట్టిఁ దీర్చినగంగ మట్టితోడ." స్వా. 3, ఆ. ౭౧, సైవ. ౭, ఆ. ౧౪౬. విశే. 1. నిర్మలము. "గీ. జలజదళములఁ జేటలుఁ జవులు నైనయంబుకణములు వాలిచెఁ బద్మాకరముల." ఆము. ౪, ఆ. ౧౪౬, స్వా. ౪, ఆ. ౬౦; 2. విస్పష్టము. "శా...విశిష్టాద్వైతం బును జేటగాఁ దెలుప మాటాడెక్ ప్రమాణంబు లన్." ఆము. 3, ఆ. ౯, సీలా. 3, ఆ. ౫౧; 4. మనోహరము. "గీ. తేనియలసోన వెదచల్లు తేటమాట, కలికి యమృతంబుకుండలో నడఁగి యుండె,నేల యిటువంటివెల్ల మా కేలతాంగి, యబ్బినను జాలు నని యెంచి రసురు లపుడు." దశా. ౨, ఆ. 3౦౨.

తేటగీతి. ద్వ. వి. (తేట+గీతి). పద్యభేదము. "ఆ. సూర్యుఁ డొకఁడు మీఁద సురరాజు లిద్దఱు,దిన కరద్వయంబు తేటగీతి." కవిజనా. జాతి. ౨3.

తేటగొను. దే. అ. క్రి. (తేట+కొను.) స్పష్టమగు. "గీ. తేటగొనఁ జూపు మీశానుదిక్కునందు, బ్రాహ్మణోత్తమ రుద్రులు పారిషదులు." కాశీ. ౪, ఆ. ౧౬౫.

తేటచేలములు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ... గుజ్జుపుతోకలు తేటచేలము లూఁదుఘటికలు గాజుకడియములు..." ప్రబంధ. ౧౧౨.

తేటతెనుఁగు. ద్వ. వి. (తేట+తెనుఁగు). జానుఁ దెనుఁగు, మృదుమధుర మగు తెనుఁగు. "సీ... సురాభాండేశ్వరం బను,పుణ్యాచరిత్రంబు భూరి మహిమ. గీ. నట్టికథ దేటతెయుఁగున నతులమృదుల, సరసమాధుర్యవాక్యము ల్పంఘటించి... విన్న వింతు." సురా. ౧, ఆ. ౭. "ద్వి. తేటదెనుంగున ద్విపద రచింతు."పండితా. దీక్షా.౧౫,సా.౧,పం.

తేటతెల్ల. ద్వ. విశే. (తేట+తెల్ల.) విస్పష్టము. "సీ. అది తేటతెల్ల గా నడుగంగఁ దలఁచి లజ్జాసాధ్వసంబులు సందడింప." కాశీ. 3, ఆ. ౬౨, అప్ప. ౪, ఆ. ౧3౪.

తేటతెల్లమి. ద్వ. విశే. (తేట+తెల్లమి.) విస్పష్టము. "ఆ. నిన్ను నొవ్వఁ బలికె నీచేఁ బ్రమాణంబు, గొనియెఁ గాని నమ్మకునికిఁ గాదు, తల్లి నీవు తేటతెల్లమి సేసితి,మనమునందు నతనిఁ గినియ వలదు." భా. రా. యు. ౨౪33, సా. 3, ఆ. ౧౯3.

తేటతెల్లము. ద్వ. విశే. (తేట+తెల్లము.) విస్పష్టము. "గీ. దీనికొలఁది యేపాటియో దేవరతను,దెలియఁ బరికించితిర తేటతెల్లముగను." కళా. ౭, ఆ. ౯౭. పరాహ. ౪, ఆ. ౭.

**తేటపడు.** ద్వ. అ. క్రి. (తేట+పడు.) స్పష్టమగు. "ఆ. అట్టిజెట్టి యనిలుపట్టినే విరథుఁడై,పోయి పోయినట్లు పోయెఁ గాని,మరలి కయ్యమునకుఁ జొరఁ డెట్టు లాతని, తెలుఁగు సెప్పు నాకుఁ దేట పడఁగ." భార. ద్రో. ౪, ఆ. ౧౭౪. పఙ. ౭, ఆ. ౭౬.

**తేటపఱుచు.** ద్వ. స. క్రి. (తేటపడు ధా. ప్రే.) స్పష్టముచేయు. "ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన, విబుధ జనులవలన విన్నంత కన్నంత, దెలియవచ్చినంత దేటపఱుతు." భాగ. పీఠి. ౧౯. భార. శల్య. ౨, ఆ. ౩౯౫.

**తేటిక.** దే. వి. తెప్పు, ప్లవము. "సీ. తేప నాఁ దెప్పు నాఁ దేటిక యనఁ గను, బ్లవనామధేయంబు పరఁగు చుండు." ఆం. భా. ప్ర. ౧౫౭.

**తేడా.** దే. వి. 1. భేదము, తారతమ్యము. (వా.); 2. పెచ్చు. (శ. ర.)

**తేది.** వై. వి. (సం. తిథిః.) దినము. (శ. ర. బ్రౌ.)

**తేదీ**=తేది. (వా.)

**తేనియ.** దే. వి. (త. తేన్.) మధువు. "ఉ... తేనియఁ బడ్డయీఁగగతి ధీరతఁ గోల్పడి బిట్టు చొక్కుటిన్." ఉ.శ. ౬, ఆ. ౩౦, పాండు. ౨ ఆ. ౧౦౮.

**తేనియదిండి.** దే. వి. (తేనియ+తిండి.) తుమ్మెద, మధుపము. "సీ. ముఖ మంబురుహ మని ముమ రంబుగ నప్పళించు తేనియదిండి లెంక లనఁగ." పాండు. 3, ఆ. ౨౦౧.

**తేనీఁగ.** దే. వి. (తేనె+ఈఁగ.) మధుమక్షిక, సరఘ. "సీ...మధుమక్షిక తేనీఁగ జుంటీఁగ నా నెసంగు." ఆం. భా. ద్వి. ౯౫.

**తేనె**=తేనియ. "గీ. లిపుటఁ దియ్యనితమ్మిపూఁదేనెఁ గ్రోలు." నైష. ౨, ఆ. ౫.

**తేనెదిండి**=తేనియదిండి. "క. ఇలఁ దనసంకేతంబున, నిలిపినపద మెంచి చూడ నేమార్గం బోబలు తేనెదిండిగమి నగు, నలసాగరకర్ణయాన యలక లనంగన్." నరస. ౪, ఆ. ౭.

**తేనెగద్ద.** ద్వ. వి. (తేనె+గద్ద.) పక్షివిశేషము. (శ. ర. బ్రౌ.)

**తేనెగాజు.** ద్వ. వి. (తేనె+గాజు.) కాచవలయ విశేషము. (శ. ర.)

**తేనెటీఁగ**=తేనీఁగ. (వా.)

**తేనెతల.** దే. వి. (తేనె+తల.) తేనెపట్టు? (చూ. తేనెతలపడు.)

**తేనెతలపడు.** ద్వ. అ. క్రి. (తేనె+తలపడు.) అత్యధికమగు. "గీ. తేనెతలపడఁ బండె ధాత్రీతలంబు, పాడి ధారణ పొంగపఁ బట్టెఁ దమ్మి,నన్ని వంకల దుర్భిక్ష మడఁగిపోయెఁ, బ్రస్తుతింపఁగఁ దగురామరాజ్యమునను." హై. ౬, ఆ. ౯. (తేనె పట్టున నెఱతెఱచి తేనుండ నీఁగలు పట్టినట్లు భూమియంతయు : బుష్కలముగఁ బండె నని భావము.)

**తేనెతొన.** దే. వి. (తేనె+తొన.) భక్ష్యవిశేషము. "గీ. తోఁచు మధుపూరితము తేనెతొన యనంగ, భక్ష్యభేదాహ్వయంబులు పార్వతీశ." ఆం. భా. ద్వి. ౭౫౬.

**తేనెతొల.** దే. వి. (తేనె+తొల.) ౧. భక్ష్యవిశేషము. "సీ. కలవంటకములు బూరెలుఁ దేనెతొలలు చాపట్లు మండెంగ లొబ్బట్లు వడలు." కళా. ౭, ఆ. ౦౧. ౨. ధాన్యవిశేషము. "వ...కందర్ప భోగలు గజవెలిలాగీలు బొందడీలు పునుఁగుఁ దావులు తేనెతొలలు మోసనాలు..." ప్రబంధ. ౧౧౭.

**తేనెదానిమ్మ.** ద్వ. వి. (తేనె+దానిమ్మ.) తియ్యదానిమ్మ. (శ. ర.)

**తేనెనీరు.** ద్వ. వి. (తేనె+నీరు.) పలుచని తేనె. "చ...పుష్పాపడుల్, ననలఁ బొసంగుకప్రపుట నంటిరవ ల్గాని పూవుఁదేనె నీరుఁగఁ బదనిచ్చి నన్నముగఁ గ్రొన్నెలనామముఁ దీర్చి మున్ను గాన్." చమ. ౧, ఆ. ౭౬.

**తేనెపట్టు.** దే. వి. (తేనె+పట్టు.) మధుకోశము. (వా.)

**తేనెపనస.** ద్వ. వి. (తేనె+పనస.) తియ్యనితొనలు గలపనస. (బ్రౌ. వా.)

**తేనెపెర.** దే. వి. (తేనె+పెర.) మధుకోశము. "గీ. దొరయుఁ మధుమక్షికలవీఁకఁ బరులు దాఁకఁ, దేని పెరదారి మధువైరి కానిపించె." ఉ. రా. ౨,ఆ. ౫౦, దశా. ౪, ఆ. ౩౦.

**తేప.** దే. వి. 1. ప్లవము, నదులు మొదలైనవానిని దాటుటకు తేలిక యైనకఱ్ఱలతో నిర్మించినసాధనము. "సీ. తేప నాఁ దెప్పు నాఁ దేటిక యనఁ గను బ్లవనామధేయంబు పరఁగుచుండు." ఆం.

భా. ప్ర. ౧౧౭; 2. తరణోపాయము. (బసవడు.) "ద్వి. సత్యంబుకలను ప్రసాదంబుకోలకు, కృత్యంబుతాపయక కృత్యాధి తేప" బస. ౨, ఆ. 3 ౨, పు. ౧౦, పం. భార. అర. ౭, ఆ. ౨౭౩; 3 విమోచనోపాయము. "ద్వి. చూపించి సీతోడఁ గోపించినట్టి, రయాపాతకమునకుఁ దేప తా నెద్ది." పండితా. పురా. ౧౪౨, పు. 4. తడవ,పర్యాయము. "క. భావమునఁ దలంచునర్థము, నీవే చెప్పితివి తిరుగ నే నవి చెప్పంగా వలెనా పని లేదయినా,విను మొకతేప చూడ ఘనంబా నీకున్." పార్వ. ౨, ఆ. ౧౩౮. (దీనియామ్రేడితరూపము తేపతేప) "గీ. తేప మీఱఁగఁ దల్పంబు డిగ్గి డిగ్గి,తేప తేపకు నిట్టట్టుఁ దిరిగి లేచి.—" కృ. శకుం. 3, ఆ. ౫.

తేమ. వై. వి. (సం. తేమః.) తడి. "ఉ. ఇప్పుడఁ గూరుచుండుటల కేరలె పెద్దలు లేచి రండు మీ, రొక్కరు వంటశాల కడుయోగ్యము మీ కవి తేమ కేమి యీ,ముక్కాలిపీటమీఁది యది మూర్ఖు లచో టిట మే లటంచు స,ద్వాక్కుల నక్కలాధిపులవై దిఫులర దగుచోట నుం చి న న్." పాంచాలీ. ౪, ఆ. ౪౧, చంద్రా. ౨, ఆ. ౧౧. విశ. తడి గలది, ఆర్ద్రము. వ్యవ:-నేల మిక్కిలి తేమగా నున్నది.

తేమగిల్లు. వై. అ. క్రి. తడిగల దగు,ఆర్ద్రమగు.(శ.ర.)

తేమనము. సం. వి. అ. న. 1. తడి; 2. తమపుట; 3. మజ్జిగపులుసు. (శ. ర.)

తేమని. సం. వి. ఈ. స్త్రీ. ప్రొయ్యి.

తేమము. సం. వి. అ. పుం. తడియుంట.

తేమయెక్కు. ద్వ. అ. క్రి. (తేమ+ఎక్కు.) ఆర్ద్రమగు. "ఉ. నీటను దేమ యెక్కి పసి నిల్చి యెకించుక వాఁడుదేటి..." విప్ర. ౨, ఆ. ౨౩.

తేమానము. దే. వి. (క. తేమాన. త. తేయ్మాన.) 1. వడ్డి; "సీ. వడ్డి తేమాన మనఁగను వఱలు వృద్ధి." ఆం. భా. ద్వి. ౨౯౮; 2. ఆలస్యము. "క. మామా యిన్నియుఁ దెచ్చితి,తేమాన మిదేల వేగ దీపము వలదా,యామాఁదము దెమ్ము బొమ్మన, నామందవిచారుఁ డప్పు డంగడి కరిగెన్." శుక. 3, ఆ. ౧౯౦, కళ. ౫, ఆ. ౧౭౭.

తేమ్రాను. దే. వి. నారికేళము. (శ. ర.)

తేయాకు. అన్య. దే. వి. (ఫ్రెంచి. తే.) టీఆకు (బ్రౌ.)

తేయు. దే. అ. క్రి. (త. తేయ్.) అఱుగు.(శ. ర.)

తేర. దే. వి. 1. దృష్టిపూర్ణత. (చూ. తేరకొను. 'తేట.' అని శ. ర.); 2. సంబంధములేమి. విశ అనాయాసముగా లభించినది. (చూ. తేరసొమ్ము.) క్రి. విశ. 1. వ్యర్థముగా. "శా... నానాసుఖో,త్పాంతం బైశవయోనిధాన మిది యయ్యా తేర యీవచ్చునే." భాగ. ౯. స్కం. ౫౫౧, నృసిం. ౨. ఆ. ౯౦; 2. అనాయాసముగా. "సీ. లక్ష్మణ శత్రుఘ్నులకు సహాయుండవై చని తేర తురగ తస్కరులఁ బట్టి." జై. ౬, ఆ. ౨౦౩.

తేరకత్తియ. ద్వ. విశ. (తేర+కత్తియ.) సంబంధము లేనిది, అన్యురాలు. (శ. ర.)

తేరకత్తె = తేరకత్తియ. "ఉ మఱి వారలు వశ్యులై నఁ గా,రెవ్వరి నోర్లు గొక్కుటయు యింద్రుఁడు చంద్రుఁ డటుండ్రు బోటి దా,నివ్వలఁ దేరకత్తె యగు." ఆము. ౫, ఆ. ౫౬.

తేరకాఁడు. ద్వ. విశ. (తేర+కాఁడు.) 1. సంబంధము లేనివాఁడు, అన్యుఁడు. "క. ఉరుబాహుబలము గల్గియు, వెరవేడినై తేరకానివిధమున నకటా,కరుణ యెదఁ గానఁ దలఁపక,దురమున జము వాత నిన్నుఁ ద్రోచితిఁ బుత్రా." భా. రా. యు. ౧౪౦౧; 2. నూతనుఁడు. "సీ. అతఁడు వేటకై యరిగినచో వజ్రి దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు, సనునట్లు సేయ..." భార. అను. ౧, ఆ. ౨౮౭; 3. విటుఁడు. "చ...కటాక్షనీలమణిరోచు లొకానొక తేరకానికిన్, మనసిజకేళి యొక్కయుంప నాఘనకుం గలిగించి..." శుక. ౨, ఆ. ౧౨౬.

తేరకు. దే. క్రి. విశ. 1. వ్యర్థముగా. (శ. ర.) "క. క్రూరుండై శమనుఁ డుఱక, తేరకు మద్వీరభటులఁ దెగటార్చినయ,వ్వైరి నికక్ దెగఁ జూచెద..." ఉ. రా. 3, ఆ. ౩౪౩; 2. అనాయాసముగా. (చూ. తేరకుఁదేర.)

తేరకుఁదేర. దే. క్రి. విశ. (తేరకు+తేర.) 1. వ్యర్థముగా. "మ. సమ్మాధుండు పంకజనేత్రలనైసర్గిక విభ్రమంబులకుఁ జేతప్రీతిఁ గావించి దానలరుక్ దేరకుఁదేరగా"...మల్లభూ. శ్రం. ౪౭; 2. అనాయాసముగా. "మ. బళిరా తేరకుఁదేర దక్కె నిటు లీబంగారుకుం డంచుఁ జంకలు దాటించుచు..." పాండు. 3, ఆ. ౬౭.

తేరకొను. దే. స. క్రి. (తేర+కొను.) తెప్ప వేయకుండు, తేటిపాఱు. "చ. కని యతఁ డెవ్వఁ డంచు

**తేటిమోచు.** దే. స. క్రి. (తేటి+చూచు.) పరికించు, చూచు. "గీ. గగనమధ్యంబునకు వచ్చి ఖరకరుండు, తేటిమాడంగరాక యుద్దీప్తుఁ డగుచు." భార. ద్రో. ౧, ఆ. ౧౪౮. భార. విరా. ౫, ఆ. ౮.

**తేటిమోపు.** దే. వి. (తేటిచూచు ధా.) ఱెప్పవేయక చూచుట. "ఉ. జంకెలు తేటిమోపు లెకసక్కెములున్..." భాగ. ౧౦, స్కం. ఉ. ౬౬౫.

**తేఱు.** దే. అ. క్రి. (త. తేఱు.) 1. కలుగు. "ఉ... పోయగంబుపైఁ, దేఱఁగఁ బ్రౌఢవంపతుల తీరునఁ బెంపెసలారి రెద్దఱున్." హరి. ఉ. 2, ఆ. ౧౮౨. స్వా. ౪, ఆ. ౧౬; 2. కనఁబడు. "ఉ. ఊసర వెల్లివందమున నొక్కొట బీఱునరాలు దేఱఁగా." స్వా. ౪, ఆ. ౭౯. ఇంద్రు. ౪, ఆ. ౯; 3. (మూర్ఛానిద్రాదులనుండి) లేచు, తెప్పిఱిల్లు. "క. తేఱుదురు రిపుల నిప్పుడ, మీఱుదురును గడఁదిమూర్ఛ మెయి నిట్లున్నా,రాఱని తేజంబులతో, నీఱుపయిం గవిసి యున్న నిప్పులఁ బోలెన్." భా. రా. యు. ౫౯౨. భార. ఆది. ౨, ఆ. ౧౫౮; 4. నిర్మలమగు. "క. తేఱెం గొలకులు వేతడి, యాఱె మహీతలము..." కు. సం. ౬, ఆ. ౨౧౪. ద్వా. ౭, ఆ. ౮౯; 5. ప్రసన్నతనొందు. "క. అనిన సుదేష్ణయుఁ దత్పరి,జనములు పెఱఁ బొంది యెన్నిసాంత్వనములు సెప్పినఁ దేఱవ మజ్జనభో, జనములకుం జొరద ద్రుపదసంభవ యొట్లున్." భార. విరా. ౨, ఆ. ౧౬౨; 6. వీడు, త్యజించు. "ఉ... దైవమె యిట్లుసేసిన, న్విన్నఁదనంబుఁ జెందఁదగునే వగపేటికిఁ బామరుండవే,యన్నఁ గలంకఁ దేఱె నతఁ డర్కకులేశ్వర వారిమాటలన్" ఉ. రా. ౨, ఆ. ౬౦౮. స్వా. 3, ఆ. ౨3; 7. తృప్తినొందు. "గీ... వాతెఱచవులఁ దేఱి,విడువఁ బోయిననునుపోకముడికిఁ గాను, కోమలి బెనంగె సిగ్గుచేఁ గొంతతడవు." వశా. 3, ఆ. ౮౪; 8. నేర్పరియగు. "ఉ... అస్త్రవిద్యలః, దేఱిని పిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై." భాగ. ౧, స్కం. ౧౫౪; 9. కృతకృత్యతనొందు. "క. నీవును రా ర మ్మిప్పుడు, దేవసభం దేటి యేఁగుదెంతము..." కళా. 3, ఆ. ౨౨3; 9. మిగియు. (చూ. తేగడ.) వి. ప్రసన్నత "సీ. తేఱనఁ జేటన మీఱఁ బ్రసన్నత..." అం. భా. ప్ర. ౯౦.

**తేఱుకొను.** దే. అ. క్రి. (తేఱు+కొను.) (రోగాదులనుండి) స్వస్థతనొందు. (శ. ర. వా.)

**తేఱుగడ.** దే. వి. (తేఱు+గడ) 1. నేర్పు. "గీ. కన్నె యింద్రాక నే మెఱుంగదు సుమయ్య, తేఱుగడ గాఁగ మెల్లనె దిద్దుకొనుము." విజ. 3, ఆ, ౨౧౧; 2. (మూర్ఛాదులనుండి) తెప్పిఱిలుట, పునస్స్మృతికి వచ్చుట. (శ. ర. బ్రౌ.); 2. అస్తమయము. "మ ..చక్రవాళంపుఁగొండ గడిన్ దేఱుకడైన పట్టఁ దమముల్ మందేహులన్ బోలి వ్రాఁడి గడ లొక్కొన్నతిఁయందు సత్త్వముఁబ్రకాశింపన్..." విజ. పీఠి. ౫; 4. నిర్ణయము. "ఉ. వివేకము లెల్లను వెచ్చఁబెట్టి వీ,రిచ్చుట దొమ్మిగూడి కలహించినఁ దేఱుగ దేల పుట్టు..." అహ. ౧, ఆ. ౧౦౫.

**తేఱుచే** = లేక్క. (శ. ర.)

**తేలఁజూచు.** దే. స. క్రి. (తేలన్+చూచు.) 1. బాగుగాఁ జూచు. "సీ. పలికించువారిమోములు దేలఁజూచుచో వాలుఁజూపులు పూలవానఁ గురియ." కువల. ౨, ఆ. 3౦; 2. ఉపేక్షించు. "గీ. చిన్నివయసుననుండియు నిన్నె కోరి, యున్న నను బోయమరునికి నొప్పగించి, తేలఁజూచి నిన్నునేనేల విడుతు,గోర్కి దీరంగ నీకఁ బైకొందుఁ గాక." శశాం. 3, ఆ ౮౭.

**తేలఁబలుకు.** దే. అ. క్రి. (తేలన్+పలుకు.) 1. తప్పిదముకా దని చెప్పు. "గీ. గడినృపులరాయబారుల యెడఁ గొలువున, సరససల్లాపములు రాజు సలుప వలయు, కార్యఖడ్గము లనుచరు ల్గానఁ బలుక, వలయు నవి మైత్రిఁ దాఁ దేలఁబలుక వలయు." ఆము. ౪, ఆ. ౨౫౯; 2. ఒత్తకుండఁ దేలికగాఁ బలుకు. ఉదా:—తేలఁబలికినయెడల అప్పుడు ఆపుడగును. (బ్రౌ.)

**తేలగింపు.** దే. వి. (తేలగించుధా.) మోహపరవశత్వముచేఁ గనులు తేలవైచుట. "ఉ. మక్కువ తీపులుట్టిపడుమాటలుఁ జొక్కుల తేలగింపులున్." విక్ర. 3, ఆ. ౨౯.

**తేలగిలఁబడు.** ద్వ. అ. క్రి. (తేలగిలన్+పడు స్వార్థమున) గర్వించు. "సీ. పరువంపుఁజిసుకులపసఁ గ్రొవ్వుగొని తేలగిలఁబడువాన కోయిలలయొప్ప." హరి. పూ. ౯, ఆ. ౬౮.

తేలగిలు. దే. అ. క్రి. 1. శ్రమనిద్రాదులచేఁ గన్నులు పైకిఁజేరు, తిరుగుడుపడు. "క...గర్భభరము మెలఁకువఁ జెలికిన్, తేలగిలఁజొచ్చెఁ గన్నులు, నీలకనీనికలఁ గలికినిగ్గులు దెసకన్." సుర. ౨, ఆ. ౯౪. ప్రబంధ. ౭౯; 2. జలాదులపైభాగమున నుండు. "క. ఆసిరధి నెల వింతనఁగా నేరము తేలగిలు మకరములమీఁదన్, మైనాకాదులు తెక్కలతో నిలుచుం గరులమీఁదిదోమల కరణిన్." ద్వా. ౨, ఆ. ౧౬౩, ద్వా. ౧, ఆ. ౧౪౫; 3. గుటిలుగు. "చ...వచో విలాసములకుం జెవి జేలఁగిలంగనీక యాననమర వాంచి..." విప్ర. ౨, ఆ. ౭౦.

తేలగిల్లు=తేలగిలు. 1. (ఆయాసనిద్రాదులచే గన్నులు పైకిఁ దేలు.) "సీ. తెల్ల గ్రుడ్డులు తేలగిల్లి తీపులు వుట్టి దోషముల్ పొందుగఁ దొట్టగిల్లి." కవిక. ౫, ఆ. ౧౧౧; 2. (పరవశమగు.) "ద్వి. మీఱిన మదమున మెయి జేలగిల్ల." ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౯౩. ('తేలగిలఁగ' అని శ. ర. పా.)

తేలనాడు = తేలఁబలుకు. (తప్పిదము లేదని చెప్పు.) "చ...అతఁ డేమియున్, దెలియఁడు సాదుబిడ్డఁడని నేరుపుమాటలఁ దేలనాడి గ్రావిలిసుతు చేతఁ జక్కటులు దిద్దెద వెంతటినంగనాచివో." సా. ౩, ఆ. ౫౫.

తేలవైచు. దే. స. క్రి. (తేలన్+వైచు.) ఆయాసము మున్నగువానిచే కన్నులు మున్నగునవి తిరుగుడుపడఁజేయు. "మ. అనుచున్ రెప్పలు తేలవైచుచు విశువ్యత్క్రాంతయై రుక్మిణీ, తనయామీఁదటనైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ." ప్రభా. ౫, ఆ. ౬, కళా. ౬, ఆ ౨౪౯. ఇట్లే: తేలవేయు. వ్యవ:-వాఁడు కన్నులు తేలవేసినాఁడు.

తేలాడు. దే. అ. క్రి. (తేలి+ఆడు.) 1. (జలాదులపైని) తేలు. "సీ. ఇల్లు మంచము లేక వెల్లిపైఁ దేలాడ శ్రీనాథుఁ డాట వాసింపనేల." చంద్రా. ౧, ఆ. ౨౩, రం. రా. యు. ౩౨౩, పు. ౨౬, పం.

తేలించు. దే. స. క్రి. (తేలుధా. ప్రే.) 1. జలాదులలోఁ బైకిఁ దేలునట్లుచేయు. "సీ. అఘటనప్రఘటనోద్యముఁడ వౌటకు ఱాలు నీటిపైఁ దేలించునేర్పె సాక్షి." ఉ. రా. ౧, ఆ. ౧౫౧; 2. సంతసింపఁజేయు. "గీ. వంత విడు నేఁడు రేపట్ల వత్తు నను చుఁ గొంత లాలించి తేలించి కుస్తరించి.-" సారం. ౧, ఆ. ౩౦, వరా. ౨, ఆ. ౩౬౫; 3. జెల్లించు, వంచించు. "సీ. పెలయించు తేలించె జెల్లించె నూరించె నసుగు నెక్కించె నం చనెడు మాట." ఆం. భా. శృ. ౧౭౪.

తేలింపు. దే. వి. (తేలించు ధా.) 1. వికాసము. "గీ. సొగసు తెలి వాలు నును సోగ సొంపు తళుకు, బెళుకు చికిలి యొయారంపుఁజేరె ముదుటుసొలపు విడియంపుఁ దేలింపు చుఱుకు టోర,కలికి బెడ రెచ్చు చూపులకలికిఁ జూచి." ప్రబంధ. ౧౦౬. విణ. దీనము. "ఉ. చంపకగంధిమోవి సరసంబగు బింబ మటంచు వట్టితే,లింపు తెలుంగుతోఁ దమి దలిర్పఁగఁ బల్కిన..." విజ. ౨, ఆ. ౧౮౫.

తేలిక. దే. వి. (తేలుధా.) లఘుత్వము. (శ. ర.) విణ. 1. లఘువు,భారములేనిది.(శ. ర. పా); 2. మనోజ్ఞము. "చ...ముద్దుగారుపొం, దికఁజిగిపాలబుగ్గలును దేలికచూపులుఁ గోమలంపుటం, గకములు గల్గి యింపొదవుఁగా సుతుబాల్యము తండ్రి కెంత యయున్." కవిరా. ౨, ఆ. ౪౭; 3. గౌరవహీనము. వ్యవ:-అతని నందఱు దేలికచూపు చూచుచున్నారు.

తేలిపోవు. దే. అ. క్రి. (తేలి+పోవు.) 1. జలాదులపైఁ గొట్టుకొనిపోవు. "వ...నెత్తురుటేరులపయి వడిం దేలిపోవుపీనుంగులం జివిచికొని .." భార. భీష్మ. ౩, ఆ. ౬౫; 2. హానిచేయక తొలఁగిపోవు. వ్యవ:-వానికి వచ్చినయాపదలన్నియుఁ దేలిపోయినవి. 3. తప్పిపోవు. "ఉ. బొంగ విడంగ గెంటి యటఁ బెంటిని గానక తేలిపోయి చిత్రాంగి విచిత్రరత్నభవనాంగణ సీమను దేల వ్రాలె నా, బంగరుముద్దుఁ బావురము..." సా. ౨, ఆ. ౪; 4. ఓడిపోవు. "మత్తకోకిల...అసంఖ్యయాదవసేనకున్, తేలిపోవక చక్కనయ్యెడుధీరు లెవ్వరు పోరులన్." భార. ఆది. ౮, ఆ. ౨౦౫. (శ.ర.పా.) 5. నిష్ఫలమగు. "క. రౌద్రం బదరఁగ నేసెను, రుద్రాస్త్రం బతనిమీఁద రూఢిగ నతఁ డా,రుద్రుని యంశం బగుటను,రౌద్రాస్త్రము దేలిపోయె రథసం బొప్పన్." మొ. రా. సుం. ౧౮౪; 6. విషయాంతరమునకుఁ బోవు. "వ...అని పేలంబు సేసికొని తేలిపోఁ బలికి..." ఆము. ౫, ఆ. [illegible]

తేలియాడు. దే. అ. క్రి. (తేలి+ఆడు.) 1. జలాదులపైఁ దేలు. "మహాస్రస్థర చటులగతి జగజ్జాలముల్ దేలియాడఁగ." నైష. ౫, ఆ. ౧౬౧; 2. (జలాదులలో) విహరించు; క్రీడించు. "గీ. అంబికానాయకధ్యానహర్ష జలధిమధ్యమునఁ దేలియాడెడుమనసు మనసు." భీమ. ౩, ఆ. ౧౯౭. నైష. ౩, ఆ. ౧౧౭.

తేలు. దే. అ. క్రి. (క. తేల్.) 1. (జలాదుల) పైనుండు. "వ... ఈసంసారమహాంభోరాశియందుఁ గర్మచోదితము లైనజంతువులు మునుంగుచుఁ దేలుచు..." భీమ. ౫, ఆ. ౧౫౦. ఉ. రా. ౩, ఆ. ౧౨; 2. స్నానముచేయు. "ఉత్సా. లీలమనుజుఁ డెవ్వఁడే దివిష్ఠజాతరంగిణిన్, దేలి శ్రీ త్రిపుట్టపేటఁ ద్రిపురమథను శశికళా, మౌళిఁ బూజసేయు..." కాశీ. ౬, ఆ. ౧౭౮; 3. జలములోఁ గ్రీడించు. "శా. సంసారార్ణవసారమన్మధ సుధాసారంబునం దేలఁగన్." ఉ. హరి. ౫, ఆ. ౭౨. ద్వి. ౧ ఆ. ౫౪; 4. ఆయాసాదులచేఁ గన్ను. మొ. తిరుగఁడు వడు. "ఉ. తేలెడుకన్నదోయి వడవేలెడుముద్దుమొగంబు..." పాండు. ౩, ఆ. ౬౫. పి. శకుం. ౨, ఆ. ౧౯౭; 5. కనఁబడు. "ఉ. బెంగ విడంగ గెంటి యట బెంటిని గానక తేలిపోయి చిత్రాంగి విచిత్రరత్నభవనాంగణసీమను దేల వ్రాలె నా, బంగరుముద్దుఁ బావురము..." సా. ౬, ఆ. ౪; 6. మోసపోవు. "క. కాని యటు లుండి నెఱిఁ బడు, నైన తెఱఁగు దోఁచి మాయ మగునిట్టులఁగిక్, మానసమున కుబ్బవగయుఁ, దేనోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్." భార. శాం. ౩, ఆ. ౨౮; 7. తుష్టినొందు. "చ.. బంభరసభవాసనాపవనపారణఁ దేల నలంచెఁ గస్తురిన్." శుక. ౧, ఆ. ౭౭; 8. కార్యసిద్ధినొందు, విజయ మొందు. వ్యవ:-ఆవ్యవహారములో నేను దేలునుపాయము దొరకినది; 9. పరిష్కృతమగు. వ్యవ:-ఆవ్యవహార మింకను దేలలేదు. వి. వృశ్చికము. "క. తేలువలె మీటి యమ్మును, పాలుఁడు పోవుటయు." సుద. ౪, ఆ. ౧౦౦, నైష. ౬, ఆ. ౧౪౧.

తేలుకొండి. దే. వి. (తేలు+కొండి.) 1. వృశ్చికపుఁ దోఁకకొన; 2. వృశ్చికాళి. (శ. ర.) "గీ. తేలు మొనచె ట్టనంగను దేలుకొండి, నాఁగ మను వృశ్చికాళ్యాఖ్య..." ఆం. భా. ద్వి. ౬౬.

తేలుచు = తేల్చు. (సంతసింపఁజేయఁగ.) "మ. వలీముఖాగ్రణుల కెంతో వేడ్కఁ బుట్టించి... కాకుత్స్థరత్నంబు మన్ననలం దేలిచె వారు నిండిరమితానందాబ్ధి నోలాడుచున్." ఉ. రా. ౫, ఆ. ౭౭౮.

తేలుబాణము. మి. వి. (తేలు+బాణము.) ఒకరకపు బాణసంచు. "వ. తాటిబాణంబులు దేలుబాణంబులు .. మొదలగు బాణవిద్యలవైఖరులు చిత్రవిచిత్రంబులుగాఁ జూపుబాణకారులును..." హంస. ౩, ఆ. ౨౯.

తేలుమణి. మి. వి. (తేలు+మణి.) తేలుకొండి, వృశ్చికాళి. (శ. ర.)

తేలుమీను. ద్వి. వి. (తేలు+మీను.) మత్స్యవిశేషము, చిలిచిమము. (శ. ర.) "ఉ...ముల్, తోల్లిక తేలుమీ నిసుకదొందును బిత్తడికాసు మల్లుమీ, నల్లెయుఁ గండె రొయ్య పర కాదిగఁ జేపలఁ జట్టి బెట్టుగన్." ప్రబంధ. ౧౯౫.

తేలుమొన = తేలుకొండి. ఆం. భా. ద్వి. ౬౬.

తేలురాసి. ద్వి. వి. (తేలు+రాసి.) వృశ్చికరాశి. (శ. ర.)

తేలువాఱు. దే. అ. క్రి. (తేలు+పాఱు.) పుట్టు, కలుగు. "చ. అని వినుతించుచున్న హృదయంబున సత్కృప తేలువాఱఁగాఁ, గనుఁగొని..." రుక్మా. ౧, ఆ. ౩౩.

తేల్చు. దే. స. క్రి. (తేలు ధా. ప్రే.) 1. నీటిపైఁ దేలునట్లు చేయు. "సీ. విస్తారసంసారవిషరాశి దాటించుధీరునకును వార్ధిఁ దేల్చు టెంత." దశా. ౪, అ. ౨౩౦; 2. సంతసింపఁజేయు. "గీ. ఒకతెరతిఁ దేల్చి కాఁక నొండొకతెఁ బ్రేల్చి." ఆము. ౫, ఆ. ౫౪. పారి. ౧, ఆ. ౯౯; 3. అభిషేకించు. "క. చేగానుఁగాడు చెఱకుం, దీఁగెరసంబునఁ బురారిఁ దేల్పక కుడువన్." హర. ౧, ఆ. ౧౮; 4. (జలాదులయందు) క్రీడింపఁజేయు. "శా. ఆడం జిత్రము వాడవాడ ఘనకుడ్యస్వర్ణరత్నద్యుతుల్, చూడం జూడఁగ షణ్ముఖీకరణతేజోరూఢచిత్తేక్షణ, క్రీడాదుస్తరమార్గ సౌఖ్యరసవార్ధిం దేల్చుఁ దత్పట్టన, క్రోడక్రోణి నటన్నన్నపురముల్ గొండాట కర్మాంబులే." కాశీ.

౨, ఆ. ౩౭. స్వా. ౨, ఆ. ౩౨; 2. స్రవించు నది. "ఉ. తొంగలిపవ్వఁ జేసియలఁ దూఁకొని మత్తిలి తుమ్మెదల్ పఱుఁగ్, బొంగుచు వ్రాల..." య. ౪, ఆ. ౧౬; 3. సాంద్రము, దట్టము. "వ...కప్పులు తొంగలులు నగుపక్ష్మపాలికల నొప్పు..."ఆము. ౬, ఆ. ౯౦.

తొంగలించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు. "సీ. ధరాళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని లావణ్య మొదవినలతికభంగి." భార. విరా. ౧, ఆ. ౯౯౪; 2. జనించు. "వ ...సకరకాతుకంబు మొగంబులం దొంగలింప నరిగిరి." భార. భీష్మ. ౧, ఆ. ౯౫. ఉ. హరి. ౨, ఆ. ౭౯; 3. వికసించు. "సీ. కామినీమాన మేఘశ్రేణి విరియఁగఁ దొగ తెల్లుగుంపులు దొంగలింప." పారి. ౨, ఆ. ౪౯; 4. అధికమగు, అతిశయించు. "క...ఒడలార్చట పడఁగ నుండె నపుడ్చ్చట మంగలి తొంగలించు సంత్రాసమునన్." వేం. పంచ. ౧, ఆ. ౨౭౪. మార్క. ౩, ఆ. ౨౭౬; 5. (సంతసముచే) పారవశ్య మొందు. "ఆ. నీముఖాంబుజాత నిర్ముక్త హరికథా, మృతము ద్రావఁ ద్రావ మేను పొదలె, వంత మాని సీరువట్టు నాఁకలియును, దూరమయ్యె మనము తొంగలించె." భాగ. ౧౦, స్కం. పూ, ౧౧; 6. ఉద్గతమగు, బయలువెడలు. "చ. కని యతిభక్తిపూర్వకముగా ధరఁ జాగి నమస్కరించి లేచి నిలిచి ఫాలభాగమునఁ జేతులు సేరిచి సమ్మదాశ్రువుల్, కనుఁగవఁ దొంగలింపఁ బులకమ్ముల సంగము విస్తరింప నత్యనుపమలీలతోడఁ గొనియాడెడు భక్తిరసార్ద్రచిత్తుఁడై." విక్ర. ౨, ఆ. ౨౨౧; 7. విజృంభించు. "వ...ధృష్టద్యుమ్నుఁడు ద్రోణాచార్యుపయిం గవిసిన నతండు. "గీ. సూతు నొక్కవాలమ్మున స్రుక్క నేసి,యశ్వముల నాలుగింట నుగ్బడఁగఁ జేసి,పిడము నడిమికి వెసఁ ద్రుంచె పెడఁదవాలి, దొడ్డతోపునఁ గురుసేన తొంగలింప." భార. భీష్మ. ౨, ఆ. ౪౦, ౪౯; 8. నిక్కు. "ఉ. అన్నువకొనుకీఁగ యసియాడఁగఁ బయ్యెదఁ బిక్కటిల్లుచున్, జన్నులు తొంగలింప..." మై ౧, ఆ. ౧౩౪.

తొంగలిగొను. దే. అ. క్రి. (తొంగలి+కొను.) ప్రకాశించు. "క. తొంగలిఱెప్పలమెఱుఁగులు, తొంగలిగొనుమేను వదనతోయరుహంబున్, రంగారఁ దల్ప ముననయ్యంగన నిద్రింపఁ జూచి యాత్మగతమునన్." షో. ౨, ఆ. ౪౭.

తొంగలిపాట్లు. ద్వ. వి. బ. నమస్కారము. "రగడ. కృష్ణ, యదుక్షేత్రములోని మధుద్విషునకు నిదె తొంగలిపాట్లని." హంస. ౪, ఆ. ౨౧౩.

తొంగలిఱెప్ప. దే. వి. (తొంగలి+ఱెప్ప.) దట్టమగు వెంట్రుకలు గలకంటిఱెప్ప. "సీ. ఘనపక్ష్మసంజ్ఞ దొంగలిఱెప్ప లన మీఱు .."ఆం. భా. ద్వి. ౧౪౫. షో. ౨, ఆ. ౪౭.

తొంగిళ్లు. దే. వి. బ. 1. నీళ్లుపోయుటకై చంటిపిల్లలను బరుండఁ బెట్టుటకు చాచి దగ్గరగా నుంచిన తొడలు. "ద్వి. తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని, నంగన గావించు నభ్యంజనంబు." బస. 3, ఆ. ౬౭, పు. ౧౨, పం. 2. జట్టపింజలు. "ద్వి. అంగిటి ముల్లొత్తువందంద వ్రేలఁ, దొంగిళ్లఁ గార్నీరు తోనెత్తి పిడుచు." బస. 3, ఆ. ౬౭, పు. ౯౯, పం.

తొంగు. దే. అ. క్రి. (క. త. తొంగు.) 1. వంగు, వాలు. "క. అంగన యిన్నాళ్లును మునిపుంగవుకిం బాటి పాటి సేవలు గావింపంగాఁ బోదువు నేఁడటు,తొంగియుఁ జూడ వతఁ డేమిదోసము సేసెన్." విజ. 3, ఆ. ౭౯. భార. అర. ౭, ఆ. ౯౪; 2. పండుకొను,శయనించు. "ద్వి. వంగుచు వ్రాలుచుఁ దొంగుచుఁ జనుచు." పండితా. పర్వ. ౩౭౦, పా. ౩ పం.

తొంగుండు దే.అ.క్రి. (తొంగి+ఉండు.)పండుకొను, శయనించు. "మ. తలపోయక్ దమపంచలిన్నియలమీఁదక్ జంగము ల్వ్రాలె నిచ్చలుఁ దొంగుండెడు కన్నగాండ్రు విని..."కళా. ౪, ఆ. ౫౨. రామలిం. శ. ౧౫.

తొంట. దే. వి. 1. చర్మము, వృక్షచర్మము. "ఆ... తొంట చెక్క తడప యంట త్వగాఖ్య యా." ఆం. భా. ద్వి. ౩౭; 2. వామియొక్క మొదలు. "సీ. వామియటుం చన వఱలును దృణతతి తొంట యనంగఁ దన్ముఖము దనరు." ఆం. భా. ద్వి. ౭౭. 3. కసవువెంటి. (శ. ర, బ్రౌ. వా.)

తొంటచేయి. దే. వి. (తొంట+చేయి.) ఈచవోయిన చేయి. "ద్వి. ప్రాఁకుపం ద్లూడి వెల్వడఁగ నేత్రములు, చీకిలించుచుఁ దొంటచేతులు దాల్చి." అ. మ. క. ౫, ఆ. ౨౩౪, పు. ౨౦, పం.

తొంటచేతివాఁడు. దే. వి. (తొంటచేయి+వాఁడు.) కుచవోయిన చేయి కలవాఁడు. "సీ...కుకరుండు పరఁగుఁ దొంట,చేతివాఁ డన శ్రీమాతృఘాత కింగ." ఆం. భా. ద్వి. ౧౭౧.

తొండ. దే. వి. సరటము, సరీసృపభేదము. "సీ... తోఁచు నాసరవెల్లి తొండ యనఁగ,సరటంబు." ఆం. భా. ద్వి. ౮౭. ఉ. రా. ౩, ఆ. ౧౪౧.

తొండపుఁద్రాడు. ద్వి. వి. (తొండము+త్రాడు.) మోటగూనతోఁకకుఁ గట్టుత్రాడు (దీనిని దొండాపుఁద్రా డందురు. శ. ర.)

తొండపుదోమ. ద్వి. వి. (తొండము+దోమ.) నిడుపు ముక్కు గల ఒకరకపు పెద్దదోమ, ఘోణి. (శ.ర.)

తొండము. వై. వి. (సం. తుండమ్.) 1. గజహస్తము. "ఉ ..బా, ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచ న్గబళింపఁబోయి .." స్వా. ౧. ఆ. ౪, ఆం. భా. ద్వి. ౧౯౪; 2. మోటగూనతోఁక; 3. దోమ తొండము.

తొండముక్కువడు. ద్వి. అ. క్రి. పండఁబాఱు. "వ...వరిగ వెరిగె గసగస యొసక మెసఁగె పెస రుసురుకొనియె దవనిక పొదలె తెక్కుప్రాసంగు దొండముక్కువడియె .." కాశీ. ౩, ఆ. ౨౩.

తొండరూపురిక్క. ద్వి.వి. పుష్యమీనక్షత్రము.(శ.ర.)

తొండాడు. దే. స. క్రి. త్వరపఱుచు. (శ. ర)

తొండి. దే. వి. రంధ్రము. (శ. ర.)

తొండు. దే. వి. తృణవిశేషము. "గీ. వేరు తొణ్ణంగి తొండును మారువెల్లి,కదురు తుంగాకు తుంగలు కలయ విడిచి." హంస. ౫, ఆ. ౪ 2. విణ. సోమరి, ప్రాలుమాలినవాఁడు. "సీ. మదట తొండోరు తొండు మదల మాలుగుఁబోతు చండి సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవాని పే రై..." ఆం భా. తృ. ౬.

తొండోరు. దే. విణ. సోమరి, ప్రాలుమాలినవాఁడు. ఆం. భా. తృ. ౬.

తొండ్లి. దే. వి. వృక్షవిశేషము. "సీ. మఱ్ఱి విరిగి తొండ్లి మఱ్ఱి తూ కిబ్బెడ..." హంస. ౪,ఆ.౧౧.

తొంద. వై. విణ. (సం. తుండీ.) బొజ్జ కలవాఁడు, తుందిలుఁడు. ఆం. భా. ద్వి. ౧౭౦.

తొందర. వై. వి. (తొర+తొర.) (క. తొందరె. త. తొందరై.) 1. మిక్కిలిసంభ్రమము. (వా.); 2. సంభ్రమము; 3. బాధ. (శ. ర.)

తొందరచేయు. వై. స. క్రి. (తొందర+చేయు.) బాధించు. "చ. విలవిల నైర్ఋతిఁ విగతవీర్యునిఁ జేసితి వార్ధిసాధునిఁ, దొలుత జయించితిఁ బవనుఁ దొందరచేసితి .." అని. ౫, ఆ. ౬, (శ. ర. పా.)

తొందరపడు. వై. అ. క్రి. (తొందర+పడు.) 1. సంభ్రమించు. (శ. ర.); 2. వేగిరపడు. (వా.)

తొందరపాటు. వై. వి. (తొందరపడు భా.) తొందర పడుట, సంభ్రమము. (శ. ర.)

తొందళము. దే. వి. రెండుపఁటాఁడు దినుసులకూరలు చేర్చి వండినదప్పళము. (శ. ర.)

తొందు. వై. విణ. (సం. తుండీ.) బొజ్జ కలవాఁడు, తుందిలుఁడు. ఆం. భా. ద్వి. ౧౭౦.

తొంబ. దే. వి. గుంపు,మూఁక. (వా. గ్రా. అని శ. ర.)

తొంబ్రాద్రు. ద్వి. స. బ. తొంబదిమంది. (తొంబదికి మహన్మహత్వార్థకరూపము.)

తొంబగిలు. దే. అ. క్రి. గుమికూడు. "లయగ్రాహి. సంబరము గావలసి తొంబగిలి దానవకదంబము సహాయముగఁ బంచి త్రిదశుల్ దుగ్ధాంబునిధిఁ ద్రచ్చి యమృతంబుఁ గొనఁజాలుసమయంబు దొరకించితి ముదంబున ముకుందా." అప్ప. ౪, ఆ. ౨౫౨.

తొంబది. ద్వి. స. (తొమ్మిది+పది.) తొమ్మిదిపదులు. "సీ...మద్ర, పతిమేన నతఁడు తొంబదితూపు లడరించి యేసె .." భార. కర్ణ. ౧, ఆ. ౧౧౪.

తొంబనూఱు. ద్వి. స. (తొమ్మిది+నూఱు.) తొమ్మిది వందలు. "గీ. తొంబనూఱును దొంబదితొమ్మిది యుఁను, జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి." భీమ. ౬, ఆ. ౭౮.

తొకతొక. దే. వి. జలాదు లుడుకునపుడు కలుగు ధ్వని కనుకరణము. "వ...బాడబానలంబునం దొకతొక నుడుకు నీరునుం గలసి సక్షుంపచంబై..." హర. ౬, ఆ. ౫౯. విణ. 1. స్పష్టము గానిది. (మాట) "చ. తొకతొకమాటల న్నొసలఁ దుంపె సలాడెడు నుంగరంపువెంద్రుకలును గల్గి యింం పొదవుఁగా సుతుబాల్యము తండ్రి కెంతయుఁన్." కవిరా. ౨, ఆ. ౪౭; 2. తడఁబడునది. (మాట) "క. ఒకలాగున మాటలు తొకతొకలై వెడ లంగఁ జొప్పు దడిదడి కొండేతొఁడె పోఁ

దొడఁగెఁ గన్నులు, పెకలించుక చూడసాఁగె భీతి దలిర్పన్." నిరం. ౪, ఆ. ౬౬.

తొక్క. వై. వి. (సం. త్వక్. త. తొక్కు.) 1. చెట్టు మున్నగువానిపట్ట. (శ. ర.); 2. చర్మము, తోలు. "గీ. తొడవసంబు కళాపంబు తొక్క తోలు,చ ట్టనఁగఁ జర్మ మలరు..." ఆం. పదా. నర. ౭౦.

తొక్కట. దే. వి. బాధ; ఒత్తుడు. "సీ. మది నున్న వనజాతియొవ కప్పపైకి పెల్వడె సాఁగఁ జన్మొద ల్లలఁపు మీఱ,రెక్కరాయసిఁ బాయఁ దొక్కట గల్గిన ట్లొక్కట మైకార్శ్య ముప్పతిల్ల." శకాం. ౫, ఆ. ౧౭౧.

తొక్కటపడు. ద్వ. అ. క్రి. (తొక్కట+పడు.) బాధపడు. "గీ. దైన్య మాకార మయినచందమున నున్న,వానిఁ దమయన్నఁ గనుఁగొని వారు వెఱఁగు, పడి భయంపడి తొక్కటపడి కటకట,పడి దిగుల్పడి వడఁకుచు భక్తిఁ జేరి." ఉ. రా. ౬, ఆ. ౨౦౫.

తొక్కటపాటు. ద్వ. వి. (తొక్కటపడు ధా.) బాధ. "చ. వలఁదపిఱుందుభారమున వారనితొక్కట పాటు మీఱఁగా, నిలపయి సాఁగి మ్రొక్కి యిల యీశ్వరి నిట్లని యెంచె ధీరతన్." ఉ. రా. ౭, ఆ. ౪౩౪.

తొక్కటము = తొక్కట. (ఒత్తుడు.) "క. తామరస నేత్రవీనుల,తో మొనసి జయింపలేక తొక్కట మున నెం,తో మలకలఁ బడి స్రుక్కుచు,వేమఱు శష్కులుల త్రాఁగి వేఁగుచు నుండెన్." రసిక. ౨, ఆ. ౮౯. (శ. ర. పా.)

తొక్కిస. దే. వి. మల్లబంధవిశేషము. (శ. ర.)

తొక్కు. దే. స. క్రి. నశింపఁజేయు. "చ. తొలి తొలి యెల్లపాపములు దొక్కుచుఁ బల్కెడు నట్టితియ్యపుం, బలుకుల నచ్యుతాహ్వయముఁ బల్కరుఁ బేర్కొను..." నృసిం. ౩, ఆ ౧౪౮. వి. (క. త. తొక్కు.) ఉప్పును కారమును జేర్చి తొట్టిలో నలఁగఁగొట్టిన మామిడికాయముక్కలు మున్నగువానిముద్ద. "వ...పచ్చళ్లూరుఁబిం డ్లూరుఁగాయలు మామిడి తొక్కులు..." హంస. ౧, ఆ. ౧౦౫, వైజ. ౩, ఆ. ౭౦. విశే. 1. అవ్యక్తమధురము. (పలుకు.) "సీ. తాలిమి రస పేవ పోలి ముద్దాడురాచిలుక నా వెడఁదొక్కుఁ బలుకు లొప్పె." కు. సం. ౩, ఆ. ౭౪; 2. త్రొక్కఁబడినది, పనికిరానిది. "ఉ. అక్కటెనాత్మ కుండు గన వారసి తెమ్మని కూఁతుచేలికిం,జెక్కడు పాఱ యీయ...దినాంతమునందు వచ్చి బ, ల్లొక్కులు సామొగంబున కదుర్చుచు గొన్ని తృణాగ్రఖండముల్." శుక. ౩, ఆ. ౪౧౦.

తొక్కుడు. దే. వి. (తొక్కు ధా. త. తొక్కు.) ఒత్తుడు, సమ్మర్దము. "ద్వి. తొక్కుడు ఘనమంచుఁ దొలఁగి నిల్చుచును,నిక్కి చూచుచు మిట్టు లెక్కి చూచుచును." పండితా. మహిమా. ౨౪౨ పు.

తొగ. దే. వి. 1. కలువ. "సీ. కటికచీకటితిండికర ములగిలిగింత సెప్వాఁడు తొగకన్నె నవ్వఁ జేనను." ఆము. ౧, ఆ. ౧౯. రుక్మా. ౪, ఆ. ౧౩౭; 2. కష్టము, బాధ. "ద్వి తొగలు పెట్టింతుము దుష్టారిసతుల, తొగలు జానకి యింక తొలఁ గంగ వైచు." రం. రా. యుం. ౨౧౩. పు. ౨౯. పం. 3. గుంపు,సమూహము. "చ...ఎ,మ్మెలచెలి మిన్నకన్నుఁగవ మీఁక్ దొగలక్ దొగలం గలంచు..." ప్రబంధ ౩౧౯; 4. రీతి. "గీ. తొగలగముల బ్రదుకుతొగలు రాజిల్లంగఁ,గడలి మిన్ను ముట్టి కడలుకొనఁగఁ,బొడిచె శీతకరుఁడు." భాగ. ౧౦, స్కం పూ. ౧౨౯౫. (శ. ర. పా.) బహు. ౫, ఆ. ౫౬; 5. పక్షివిశేషము. "సీ. కైజు కక్కెర గువ్వ కల్లెడు శేరజ మాడెలు తొగ గిజిగాఁడు కొరడు." సుద. ౩, ఆ. ౧౯౪.

తొగకంటి. దే. వి. (తొగ+కన్ను+ఇ.) స్త్రీ. "క. జగములయేకిమీఁద నిపుం,బొగడఁగఁ బదినూర్ల నోళ్ల ప్రౌఢయుఁ బలుకుం, దొగకంటియుఁ జాల నిచోఁ,దగునే పెఱవార లెన్నఁదగువా రనఁగన్." అచ్చ. బాల. ౬౪, అచలా. ౨, ఆ. ౭౩.

తొగకొమ్మతొలఁగుబావ. ద్వ. వి. సూర్యుఁడు. వెంక. దేవ. ౧౨.

తొగచెలి. దే. వి. (తొగ+చెలి.) చంద్రుఁడు "చ. పగడఁపుఁదీఁగలో తళుకుబంగరు బొమ్మ లో... తొగచెలితున్కలో మరునితూపులో...ఆటచేడి యల్." సీలా. ౧, ఆ. ౪౦.

తొగచెలితాయి. దే. వి. (తొగచెలి+తాయి.) చంద్రకాంతశిల. "చ. తొగచెలితాలిజోతి హిమతోయము జిల్కఁ గిరీటిపచ్చతా, నిగనిగలు..." చం. రా. ౩, ఆ. ౧౧౩.

తొగటవాఁడు. దే. వి. ఒకజాతినేఁతకాఁడు. "సీ. తోఁచుఁ దదృదముల్ తొగటవాఁ డనఁగను

సాలేఁ దనంగను సాటి యనంగ." ఆం. భా. ద్వి ౨౭౩. హంస. ౨, ఆ. ౧౨.

తొగడు. దే. వి. చోపలి కణఁగుట. "ద్వి. తొగ డించుకయు లేక తోరముల్ గాక;మిగుల వట్రు వలునై మించుపెందొడలు."రం.రా.యు. ౩౧౫. పు. (శ. ర.) ("తొగలించుకయులేక..." అని ముద్రిత పా.)

తొగదొర. దే. వి. (తొగ+దొర.) చంద్రుఁడు. "చ. తొగదొరచాయతమ్మివలెఁ దూఁలి ముదుం గఁగఁజేసె మూఁకలన్."అచ్చ. భా. ౪.ఆ. ౭౨.

తొగనెచ్చెలి. దే. వి. (తొగ+నెచ్చెలి.) చంద్రుఁడు. "క. బలములు గెలుపుతలంపులు నలుకలు బంత ములుఁ దలఁప నంతంతకు మిక్కిలిగాఁ బోరఁ దొడంగిరి, తొలివేలుపుఱేఁడు రాచతొగ నెచ్చెలి యున్." అచ్చ. యు. ౫౦౮.

తొగపగదాయ. ద్వ. వి. సూర్యుఁడు. ఉ. హరిశ్చ. ౩, ఆ. ౧౦౨.

తొగమైలు. దే. వి. (తొగ+మైలు.) చంద్రుఁడు. "ఉ. కేలను బోటువాలు దులకింపఁ దలం దొగ మైలుమైనిసా,బాలున నాలు...కల్గుసామికిన్." చెన్న. ౩, ఆ. ౩౮.

తొగర. వై. వి. (సం. తువరః.) ఒగరు. "సీ. ఒగ రనఁ దొగ రనఁ దగును గషాయంబు..." ఆం. భా. ప్ర. ౧౦౪.

తొగరా. ద్వ. వి. (తొగ+రా.) చంద్రుఁడు. "క. నగరాట్కుచపలుసిరి జిగి,నగరా మగరాల జనులు నగరా మొగముం,దొగరా వగరా..." బహు ౫, ఆ. ౫౬. ఇట్లే: తొగరాజే. య.౪, ఆ. ౧౭.

తొగరి. వై. వి. (సం. తువరీ.) 1. కందిచెట్టు; 2. అడవికందితీఁగె;3. సురాష్ట్రదేశపుమన్ను.(వ్యు.)

తొగరించు. దే. అ. క్రి. అనురాగమొందు. "క. నగుచుఁ జెలువ నీ రిడ మదిఁ,దొగరింపఁగ మగఁడు కేల దోయిల్లి వట్టన్,దిగి కుచ్చెలి విడువలువన్, బిగిదడిమొలనూలుబోటి పెంపునఁ గట్టెన్."అచ్చ భా. ౩, ఆ. ౪౩. పు.

తొగరు. దే. వి. 1. ఎఱుపు,రాగము. "ఉ. ఇంగిలికంబు నం దడిపి యొత్తుకసీసపురెంటెమో యనన్,నింగి గరుత్పరంపరల నిగ్గున లేఁ దొగ రెక్క..." ఆము. ౪, ఆ. ౧౦; 2. ఎఱ్ఱనూలు. (శ. ర.) విశే. ఎఱ్ఱనిది. "క. ఆగలుం గుంకుమపువ్వును, తొగరుం జేలుంచు సీతుఁ ద్రోవం గలవే" పాండు. ౪, ఆ. ౯, కాశీ. ౧, ఆ. ౧౭౩.

తొగరుకొను. దే. అ. క్రి. (తొగరు+కొను.) ఎఱ్ఱ నగు. "చ. నగకరయొ దయుండదనిమ్ము వదనమ్ములు పల్కక యుండదనిమ్ము కన్దొగరుకొనంగనిమ్ము..." గంధ. ౧౯౨.

తొగరుకొల్పు. దే. స. క్రి. (తొగరుకొను ధా. ప్రే.) ఎఱ్ఱపడఁజేయు. "చ. గిరికొనుగోపురాగ్రవలభిత పంకజరాగరశ్మిఁ గట్టిఱ యగుచాయఁ బొల్పు దివసేంద్రుఁడు సక్కనిమింటఁ బోవఁచో,మఱచి విధాత పాటలిమమధ్యమసంధ్యకుఁ జేయ లేనిమా, కొఱతయుఁ దీర్పుకోఁ దొగరుకొల్పనకై వడిఁ బట్టణంబునన్." ఆము. ౨, ఆ. ౧౮.

తొగరుమోముపులుఁగు. ద్వ.వి. (తొగరు+మోము+పులుఁగు.) చిలుక. వేంక. తిర్య. ౧౦౧. ఇట్లే: తొగరుముక్కుపులుగు. ఆం. సం. తిర్య. ౧౪.

తొగఱేఁడు. ద్వ. వి. (తొగ+ఱేఁడు.) చంద్రుఁడు. "సీ. తొగఱేనిపరివార మగుతారసంఘుంబు శంఖ రింఖన్మణిఁ జూప." చం. రా. ౩, ఆ. ౨౦. ఇట్లే: తొగలఱేఁడు. ఉ. రా. ౪, ఆ. ౧౭౩.

తొగలగాదిలి. దే. వి. చంద్రుఁడు. "సీ. పొగడొందు మొగమెందుఁ దొగలగాదిలివిందు జిగిలేఁగవునుఁ దీవ మొగులుత్రోవ." నీలా. ౧, ఆ. ౫౬.

తొగలవిందు. దే. వి. (తొగలు+విందు.) చంద్రుఁడు. "సీ.నేలతాలుపురాచమారిగాదిలికందు దొసఁగు చీకటిచాల్పు తొగలవిందు." అచ్చ. బాల. ౭.

తొగలువెట్టు. దే. స. క్రి. (తొగలు+పెట్టు.) బాధించు. "ద్వి. తొగలువెట్టింతుము దుష్టారిసతులఁ, దొగలు జానకి యింకఁ దొలఁగంగవైచు." రం. రా. యు. ౭౮౩ పు. ౨౮. ప౦.

తొగసూఁడు. దే. వి. (తొగ+సూఁడు.) సూర్యుఁడు. "మ. తొగసూఁ డల్గినఁ దమ్మిముద్దియకుఁ జేతు ల్సాచి నిద్దంపుమే ల్జిగి గన్పట్టుమడుంగుదువ్వలువ లిచ్చెం గూర్మి..." అచ్చ. అయో. ౪౩.

తొగసూఁడుఱా. ద్వ. వి. (తొగసూఁడు+ఱా.) సూర్యకాంతశిల. "సీ. చలువమైపరిపచ్చపలకల చేతను తొగసూఁడుఱాజిగి దూలములను." ప్రబంధ ౫౬౬. నీలా. ౩, ఆ. ౪౦.

తొచ్చియము=తొచ్చెము. (శ. ర.)

**తొచ్చెము.** వై. వి. (సం. తుచ్ఛమ్.) తుచ్ఛవచనము. "వ...రఘువరులసచ్చరితోచ్చయంబు లుచ్చరింపుచుఁ దొచ్చెంబుల బొచ్చుసేయుచు..." రామా. ౫, ఆ. ౧౯౯. ఆం. భా. ప్ర. ౧౧౭. విణ హీనము. (చూ. తొచ్చెముచేయు.)

**తొచ్చెముచేయు.** ద్వి. స. క్రి. (తొచ్చెము+చేయు.) హీనపఱచు, తక్కువచేయు. "వ. అముక్తకేశియు నచ్చోట నచ్చవెన్నెలఁ దొచ్చెముచేసి యొసఁగునిసుకదిన్నెలపై నున్నయది యట్లగుటం జేసి .." పాండు. ౨, ఆ. ౧౫౩.

**తొటతొట.** దే. వి. నీరు పువ్వులు పండ్లు మున్నగునవి రాలుటయందలిధ్వని కనుకరణము. "క. కటకెట తొటతొట రాలెడు, బొటబొట చినుకుల ధరిత్రి పొడనట్టువడక్, సొటసొట నాఁకట సోలుచుఁ, దటతట పడు చాతకముల దైన్యము వాపెన్." వైజ. ౨, ఆ. ౧౮౬, వరాహ. ౧౦, ఆ. ౧౨౫.

**తొట్ట.** యు. దే. విణ. స్థూలము. "సీ. అత్యంతగాఢదంష్ట్రాగ్రపీడనమునఁ దొట్టవాతెఱనెత్తు రుట్టిపడఁగ." శైవ. ౭, ఆ. ౮౬. వై. విణ. (సం. దుష్టః.) దుష్టుఁడు. (చూ. తొట్టరి.)

**తొట్టగిలఁబడు.** ద్వి. అ. క్రి. (తొట్టగిలన్+పడు.) తొట్రుపడు. "క. పెట్టకపో నని యాఁకటఁ, దొట్టగిలంబడుచుఁ బడుచు దురదురఁ జని పే, నట్టింటఁ గూరుచుండిన, నెట్టుననం జాల కమ్మగేహిణి ఖిలిన్." పాండు. ౪. ఆ. ౧౬౫.

**తొట్టగిల్లు.** దే. అ. క్రి. అతిశయించు. "సీ. తెల్లగ్రుడ్డులు తేలగిల్లి తీపులఁపుట్టి దోషముల్ పొందుగఁ దొట్టగిల్లి." కవిక. ౫, ఆ. ౧౧౧.

**తొట్టరి.** వై. విణ. (తొట్ట+అరి.) దుష్టుఁడు. "ద్వి. కట్టన నింటిలోనికి నుర్కుఁ దనుచుఁ,దొట్టరులిరువురఁ బట్టి తెం డనుచు." పండితా. దీక్షా. ౮౩. పు; పర్వ. ౩౫౮, పు.

**తొట్టి.** దే. వి. (క. త. తొట్టి.) 1. నోరు వెడల్పును అడుగు సన్నము నైనగంపవంటిపాత్రము. "చ... క్రొమ్మడుఁగున కేఁగుభద్రకరిమాడ్కి సుధన్వుఁడు చొచ్చె బిట్టుగాఁ,నుడికెడినూనెతొట్టి బలియుర్ హరిదాసులు సత్యసంపదన్." జై. ౪, ఆ. ౧౩౩; 2. నీరు నిలుచుటకు గట్టినకుండు. "గీ. గర్భమంటసిఁ గడిసికలఁకబలము లోనికాతొట్టి నిండి కాలువఁగ జాగి." ఆము. ౬, ఆ. ౯; 3. చెట్టుతొఱ్ఱ "గీ...తొట్టి,తొట్రు తొఱ్ఱ తొఱట యనఁ బోఁచు గోట,రమ్ము..." ఆం. భా. ద్వి. ౩౯; 4. గాలిచే నీటిపైఁ గొట్టుకొని వచ్చుతృణాదిసమూహము. "సీ. ఉత్ప్లుతయవసాదికోత్కరమై విలసిల్లుఁ దొట్టి నాఁ దొట్టు నాఁ దొట్టువ యన." ఆం. భా. ప్ర. ౧౫౭.

**తొట్టించు.** దే. స. క్రి. (తొట్టుధా. ప్రే.) స్రవింపఁజేయు. "ద్వి. దట్టించి కట్టించి దర్పంబు బలము, వట్టించి రక్తంబు వాఁతఁ దొట్టించి." అ. మ. క. ౨, ఆ. ౬౭, పు. ౧౯. పం.

**తొట్టికట్టు.** దే. వి. కక్ష్య,రాజగృహముయొక్క అంతరువు. "సీ. దురములోఁ దెఱగంటిదొరను గెల్చిన నాఁటికతలు వ్రాసినతొట్టికట్లు దాఁటి." య. ౪, ఆ. ౭౭౪.

**తొట్టినోరు.** దే. వి. (తొట్టి+నోరు.) తొట్టివంటి నోరు. "సీ. చెలువ నీఱిగిగోము గలమోము మఱి వారితొట్టినోరను ముద్దువెట్టఁ దగునె." హంస. ౧, ఆ. ౬౧.

**తొట్టిమంచేము.** ద్వి. వి. (తొట్టి+మంచేము.) ఊయెల మంచేము. "శా. సీతస్తంభవిజృంభితోజ్జ్వల హిమానీశుభ్రసౌధంబులో, నాలోలం బగుతొట్టి మంచేమున నొయ్యం జేర్చి జోకొట్టి యుయ్యాలో జొంపల యంచు నూఁపుదురు శుద్ధాంతాబ్జపత్రాక్షు లా,బాలుం బాలశశాంకశేఖర కృపాపారీణు గారా మునన్." ఉద్భ. ౩, ఆ.౫౮.

**తొట్టియ** = తొట్టె. (శ. ర.)

**తొట్టియల.** దే. వి. ఊయల. "వ...అపూర్వవైభవంబున నున్నయొక్కరాజును సతనియగ్రభాగంబునఁ బసిండితొట్టియలలోపలఁ బొత్తులలో నున్న యొకచక్కనిబాలికనుం జూచి ." కళా.౫,ఆ.౨.

**తొట్టిలు.** దే. అ. క్రి. (తొట్టు ధా.) వెలికిలు. "వ... నిప్పుఁ ద్రొక్కినచందంబున జట్టిపడి తొట్టిలం బడిన పులుఁగువిధంబున నిట్టట్టు తరలిపోఁగూడక..." సా. ౩, ఆ. ౨౯.

**తొట్టు.** దే. అ. క్రి. 1. వ్యాపించు. "గీ. జనములానందమునఁ దేల జగము లెల్లఁ,దొట్టి నిండారు వెన్నెల నిట్టవొడిచె." నిర్వ. ౬, ఆ. ౫౫,రామా. ౧, ఆ. ౧౩౬; 2. ప్రవహించు. "మహాస్రగ్ధర... శత్రుక్షీరప్రజంబుల్, దునుమం దచ్ఛోణితంబుల్

తొట్టుపడు. ద్వి. అ. క్రి. (తొట్టు+పడు.) తడఁబడు. "క. ప్రాజ్ఞుఁడు రమించు నొక్కెడ, ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁ జేయుం. బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు కలహముసఁ దొట్టుపడక తొలంగున్." భార. శాం. ౫, ఆ. ౫౬౫.

తొట్టువ=తెట్టువ. "వ...తొండంబు లెత్తి తిరుగండ్ల కరణి నురుపడిం దిరుగుచు నొండొంటిం దాఁకు కరులకుంభస్థప్రదేశంబునం దొట్టువగట్టి పొల్లు తోడి యూథకికణరాసులుంబోలెఁ గానుపించు రుధిరపలల కంఠబిత్తాస్త్రాక కీకసవేశకూటంబుల చేర్పున శూర్పంబులనేర్పున నేర్పరింపుచు..." కళా. ౮, ఆ. ౧౧౦, ఆం భా. ప్ర. ౧౫౩.

తొట్టె. దే. వి. 1. నేయువాఁడు నూలుకండె నుంచుకొనుపనిముట్టు, నాడె. "సీ. తొట్టెనాడె యనంగఁ దురిపేరు విలసిల్లు..." ఆం. భా. ద్వి. ౭౯౬; 2. ఉయ్యాల. "ఉ. ఓగుణులార యెక్కుడిదె యుయ్యెలతొట్టెల నింక నిత్తఱిం, జాగొనరింప నేల యని సంతసమొప్పఁగఁ దల్లి నొక్కెడి, వ్యాగమనూనదామమయమై చెలు వొందెడు తొట్టె మంచి వే, వేగమ వీరభద్రపృథ్వీవరుతో నొకతొట్టెలోపలన్." చెన్న. ౫, ౪, ఆ. ౩౮౮.

తొట్టెల. దే. వి. ఉయాల. "చ...క్రొందరఁగల్ గదలించుకల్వతొట్టెలలఁ గుమారుఁ గూఁతు ను ఘటించి భజించునదీలలామకో, మలకుముదాగ తాళికులమంజురవంబున జోలవాడుచున్." వసు. ౩, ఆ. ౭౭.

తొట్రగిల్లు. దే. అ. క్రి. తడఁబడు. "సీ. తొట్రిలుట యనంగఁ దొట్రగిల్లుట యన స్ఖలనసమాఖ్యయై వెలయుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౩.

తొట్రించు. దే. స. క్రి. తడఁబడఁజేయు. "సీ. తొట్రించి గొర్దలోఁ దోడేలు సొచ్చిన ట్టీగబ్బి వెళ్ల నట్టిట్టు సేయు." సా. ౧, ఆ. ౯౭.

తొట్రిలఁబడు. ద్వి. అ. క్రి. (తొట్రిలన్+పడు.) సంభ్రమించు, తొట్రుపడు. "చ...మొగంబున నక్షత్రలు వెల్లిఁగొల్పఁ దొట్రిలఁబడు జల్లనం జెదరు డెందము గూడఁగఁ దెచ్చు నన్నుఁ గేవలము ముట్ట నెవ్వరికి వచ్చు ననున్..." భార. విరా. ౩, ఆ. ౧౦౪.

తొట్రిలు. దే. అ. క్రి. 1. తడఁబడు. "మ...ఆతనిపజ్జ వగఁ దాను నేఁగెఁ బదపద్మంబుల్ పొరిం దొట్రిలన్." భార. ఆర. ౭, ఆ. ౨౧౯. భార. విరా. ౪, ఆ. ౮౦; 2. వ్యాపించు. "ఉ. వట్రువ గుబ్బలుం దొగరువాతెఱయుం జిఱునవ్వువెన్నెలల్, దొట్రిలుముద్దుమోమును..." విజ. ౨, ఆ. ౪౬.

తొట్రిల్లు=తొట్రిలు. (తడఁబడు.) "మ...లోచన పద్మంబులబొమ్మధార లెసఁగఁ గ సంభ్రాంతిఁ బాదద్వయంబును దొట్రిల్లఁగఁ బాఱె గోపికలు నుద్భ్రాంతలై తోఁ జనన్." హరి. పూ. ౫, ఆ. ౨౪౬.

తొట్రు. దే. వి. 1. స్ఖలనము, తడఁబడుట. "సీ. జీరుకు నాఁగను జేరుకుపాటు నాఁ దొట్రుపా టనఁగను దొట్రు నాఁగ... స్ఖలనసమాఖ్యలై వెలయుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౩; 2. తొఱ్ఱికోటరము. "గీ ..తొట్టి, తొట్రు తొఱ్ఱి తొఱట యనఁ దోఁచుఁ గోటరమ్ము..." ఆం. భా. ద్వి. ౩౮; 3. చిన్నకంప. "ద్వి. ఈతఱి శిశువు ఱో లీడ్చినవృక్ష, పాతంబు గలిగె నుత్పాతంబు గాదె, మడువులు పసులకాల్మడి కుప్పు చఱిచెఁ, దొడువు దొట్రును గడుదూరంబు లయ్యె." అ. మ. క. ౧, ఆ. ౪౪, పు. ౨౩. పం.

తొట్రుకొను దే. అ. క్రి. (తొట్రు+కొను.) 1. తడఁబడు. "సీ. కురువేరు గొన వచ్చి కుంతలస్తబకనిస్తులవిలాసశ్రీలఁ దొట్రుకొనుచు." సాంబో. ౧, ఆ. ౧౬౪. కవిక. ౪, ఆ. ౧౬౦. పు. 2. కలియు. "గీ. వలపుగాడుపు లూర్పులఁ గలసి వెలయఁ, దుమ్మెదలు గుంతలమ్ములఁ దొట్రుకొనఁగ." పి. శకుం. ౨, ఆ. ౧౩౫.

తొట్రుకొల్పు. దే. స. క్రి. (తొట్రుకొనుధా. ప్రే.) తడఁబడఁజేయు. "సీ. తొట్రుకొల్పెడుశైబ్య తోడిప్రేమంబున ననపత్యుఁ డయ్యును నన్యభార్యఁ గైకొనక..." భాగ. ౯, స్కం. ౭౦౬.

తొట్రుపడు. ద్వి. అ. క్రి. (తొట్రు+పడు.) తడఁబడు. "సీ. మాటలాడఁ దలంచి మఱచిపోయెడివారు నడవఁ బోవుచుఁ దొట్రుపడెడువారు." కాశీ. ౩, ఆ. ౪౧, కాశీ. ౭, ఆ. ౯౦.

తొట్రుపాటు. ద్వి. వి. (తొట్రుపడు ధా.) తడఁబాటు. "సీ. బెగ డంతకంతకు మిగిలిన నింటికిఁ

ఐనములు నడుం దొట్రుపాటు జెందెనె." భార. విరా. ౨, ఆ. ౧౦౬. నిర్వ. ౮, ఆ. ౮౦.

తొట్రులుపడు. ద్వ. అ. క్రి. (తొట్రులు+పడు.) తడఁబడు. "క. ఏనును శాపభయమున దీనానను డిగి వచ్చి మెయిసమస్తము సోఁకం,గా నెరఁగి యమ్మునీశ్వరు,తో నల్లన యిట్టులంటిఁ దొట్రులు పడుచున్." దశ. ౪, ఆ. ౯౯.

తొట్రువు = తొట్రు. (చూ. తొట్రువగొను.)

తొట్రువగొను. దే. అ. క్రి. (తొట్రువు+కొను.) తొట్రుపడు. "ద్వి. తొలఁగక కలఁగక తొట్రువ పడక." పండితా. పర్వ. ౫౨౨ పే. ౧౩, పం.

తొట్ల. దే. వి. ఉయ్యాల. "శా. ..జోల ల్పాడి యాడింతు రా,లావణ్యాంబునిధుల్ వధూమణులు తొట్లం బెట్టి రాజాత్మజన్." పాంచాలి. ౧, ఆ. ౫౩, విప్ర. ౧, ఆ. ౭౫.

తొడ. దే. వి. (త. తొడై.) గజ్జెకు మోఁకాలికి నడిమిభాగము, ఊరువు. "గీ. తునిసి తొఱఁగిన జోదులతొడలు సామ,జములకరములు నొండొంటి చందములు గనుఁగొనఁగ వింత లగుటను నంగ రాంగణంబు రమణీయమును భీషణంబు నయ్యె." భార. శల్య. ౧, ఆ. ౧౨౬, ఆం. భా. ద్వి. ౧౩౫.

తొడఁకు. దే. అ. క్రి. నీరు మున్నగునవి యొలుకు, తొనఁకు. "గీ. నిగుడునాయుఁవు తొడఁకని నిండు కుండ." చంద్రా. ౧, ఆ. ౫౭.

తొడఁగు. దే. అ. క్రి. (క. తొడగు. త. తొడంగు.) 1. ప్రారంభముచేయు. "మ ..ఆమహీశుఁ డశ్వ దీక్షార్యంబు సేయంగ నేఁల తొడంగెన్ నృపు లెల్లు గల్గి రిల యెల్లం గైకొనం గ్రమ్మరన్." భార. శాం. ౨, ఆ. ౬౬; 2. మొదలుకొను. "వ...పాడ్యమిం దొడంగి పదునాలుగు దివసంబు లొక్కొక్కగింజగాఁ దూమెఁడువడ్లు సమ కూర్చి..." భార. అర. ౬, ఆ. ౧౧౫, భార. విరా. ౧, ఆ. ౬; 3. యత్నించు. "చ. అదియుఁను నెల్లభంగి వెర వారసి చూచితి నొండు లేదు బె,ట్టిదుఁ డగువాఁడు గన్నుమిడి డెప్పర మేమియు లేక యుండ నం;చెద నని పూనెనేఁ దగఁ జేకుఱుఁ గొక్కి తొడంగు దీనికిన్, మదనునిచేత నమ్మగువ మానము దూలకమున్న గ్రక్కునన్." దశ. ౬. ఆ. ౧౩౧, భార శాం. ౬, ఆ. ౫౫౦.

తొడకు. దే. వి. పశువ్యాధివిశేషము. "ద్వి. కలసేయు తొడకు వాదము గల్లవాఁపు, ... చెవ్వలును వారితా నెన్న,గలపరాలుబోగములకు కెల్ల." నవనా. ౧, ఆ. ౪౧, పు. ౫, పం.

తొడగొడుకు. దే. వి. (తొడ+కొడుకు.) దైత్యుఁడు, ఊరుసంభవుఁడు. "సీ. తొడగొడుకు తెగడంగ దాపుఁబుట్టుచు బప్పు ... యుక మూడు జన్ముఁడు..." వేంక. పంచ. ౭౬.

తొడత్రొక్కుడు. దే. విశే. (త్రొక్కుడు+త్రొక్కుడు) సమ్మర్దము. వ్యవ.-జనులు తొడత్రొక్కుడుగా నున్నారు. ఆతొడత్రొక్కుడు లోని పేఁగుట కష్టము.

తొడపాసెము. ద్వ. వి. పరిహాసమునకు పాసె మని యూహించుచు పిల్లలతొడను కలుపుట. (వా.)

తొడపుట్టువు. దే. వి. దైత్యుఁడు. (శ. ర)

తొడబెల్లము. దే. వి. తొడగిల్లుట (శ. ర.)

తొడయు. దే. స. క్రి. 1. కడుగు, ప్రక్షాళించు. "వ ..పెద్దిదొరలు సుగంధోదకములఁ జేతులు ద్రొడసి వార్చి .." నైష. ౬, ఆ. ౧౪౦, కాశీ. ౪, ఆ. ౧౭౩; 2. తుడుచు. "సీ. ఆస్యాంబు దొడసి నీ రంఘ్రిల శిరమునఁ బ్రోక్షించి యోష్ఠ సంపుటము ముట్టి." భార. అను. ౩, ఆ. ౨౮౪, మార్క. ౩, ఆ. ౨౩౬; ౩. తోము. "గీ. కసటు వోవఁ దొడసి కడిగినకనకంపుఁ, బ్రతిమవోలె నొప్పు నలిపమేను." కు. సం. ౭, ఆ ౮౦; 4. నశింపఁజేయు. "స్రగ్ధర. తుంచెం జక్కాడె మోఁదెం దొడసెఁ గెడపె నత్యుద్ధతిం గాశి కాపురీ పుచక్రోశిధరిత్రీపరిధిఁ గరిసుకప్రత్య నీకుండు హేలా,సంచారోదగ్రభంగిన్ జలము కొని వనీసౌధవప్రాట్టవీథుల్." కాశీ. ౬, ఆ. ౧౭౬; 5. స్పృశించు. "సీ... పాణి. గీ. పల్ల వంబున నానన మల్ల నల్లఁ,దొడయుచుచు..." భార. స్త్రీ. ౨, ఆ. ౭౪.

తొడరాడు. దే. స. క్రి. (తొడరు+ఆడు.) ధిక్క రించు, మీఱు. "చ. నిజపదనామితాసితమణీకచ నీలవిభాతివాహాన, ద్విజవరబర్హిబర్హవితతిం దొడ రాడి..." కు. సం. ౧౨, ఆ. ౨౦౪.

తొడరిక. దే. వి. అనుసరణము. (శ. ర.)

తొడరు. దే. అ. క్రి. 1. కలుగు. "చ. కడ్మగి కుమారు పేదరము గబ్బుగ నుబ్బుచు దొంగలింపఁగాఁ,

చెక్కు... గీ. అంట త్వగాఖ్య యౌ .." ఆం. భా. ద్వి. ౩౭.

తొడుకు. దే. అ. క్రి. తెగించు. "ద్వి. తొడప్పలక్కై తెంపుతోఁ బ్రాణములకుఁ దొడికి మద్దులపట్టిఁ దునుమ నేమిటికి." ద్వి. హరిశ్చ. ఉ. ౬౩౮౬.

పం. స. క్రి. 1. త్రావు. "సీ. అందంప వఖో రుహములు బింపులువోవఁ దొడుకనిచ్చుట యెట్లు దుర్ఘరమవ." కాశీ. ౪, ఆ. ౧౮. పాండు. 3, ఆ. ౯౭; 2. పట్టుకొను. "సీ. బెడఁగారు శాలాహిఁ దొడుకనే నూగారు,తొడు సొల్లఁ గాక తాఁ దొడుకు మనిన." పాండు. ౫, ఆ. ౧౮౪. రాజ చ. ౯, ఆ. ౨౭౧. వి. 1. ఆవు. "గీ. పుడమి యానిన తెఱఁగున నడరున కని,తొడుకులం ఖల్లమిగ లెక్క యిడఁగరాదు." నీలా. ౧, ఆ. ౫౦. అచ్చ. బాల. ౮౪; 2. వృషభము. "మ. వడవాలున్ ఘటియింపు మించు దివిజుల్ ప్రార్థింప నవ్వహ్ని యయున్,తొడుకుంద తడిజోడు తేజము సుధాంధో వాహినీవారి నిల్పుడు..." చం. రా. 3, ఆ. ౯; 3. దొంగమేఁత. "క. తొడుకు దినఁ బోవుప సరము,బడిఁ బోకుము..." భో. ౯, ఆ. ౩౪; 4. గోమహిష్యాదులు,పశువులు." సీ. గోమహిష్యా దులనామకుల్ పని తొట్టు తొడుకు పసరము నా నమరు .." ఆం. భా. ద్వి ౨౯౧.

తొడుకుసామి. వ్య. వి. (తొడుకు+సామి.) శివుఁడు. వేంక. దేవ. ౫.

తొడుకొను. దే. స. క్రి. (తొడు+కొను.) 1. తొడుగుకొను. "క. పాపలుఁ జెప్పులు తొడుకొని,దేవ శివాలయములోనఁ ద్రిమ్మరుపాపుల్." శివ. పా. ౮౯౧; 2. వెంటఁదీసికొను. "చ. కడువెర వేది నేఁ బ్రథమగర్భవతిన్ నతిఁ బుట్టినింటికిన్,దొడు కొని వచ్చుచో నిచట దుస్సహ మైన ప్రసూతి వేదనం,బడియెడు .." విక్ర. ౮, ఆ. ౩౫.

తొడుగఱ. దే. వి. ముండ్లకంపమోపు. "క. తడి కంట నెపుడుఁ దఱుఁగక,కడి దఱుఁగఁగ వడిసెఁ దఱిగి గాసిన్ బుడమిన్,బడినఁ గనరాక మంచపుఁ దొడుగఱలై రట్టై రుజులతో నేమం దున్." స్వా 3, ఆ. ౧౩౧.

తొడుగట్టు. = తొడుగఱ. "సీ... తొడుగట్టు యాడిక సుడుమ కంప,యునఁ దనర్చు గంటకాది భారము..." ఆం. భా. ద్వి. ౩౮.

తొడుగు. దే. స. క్రి. 1. (వింటబాణము) సంధించు. "వ...విను బాణంబు లొక్కటఁ దొడిగి..." భార. ఆది. ౫, ఆ. ౨౩౪. చంద్రా. ౧, ఆ. ౭౦; 2. ప్రయోగించు. "క. వారుణవాయవ్యంబుల, నారాయణుమీఁదఁ దొడిగె నరపతిశరముల్, ఘోరశిఖివజ్రశరని,స్ఫారతఁ దద్దీప్తి మాపెఁ బద్మేక్షణుఁడున్." హరి. ఉ. ౧, ఆ. ౧౫౩. భార. భీష్మ. 3, ఆ. ౧౭౫; 3. భూషణాదులు ధరించు. "వ...అయ్యా మదీయధర్మపత్ని యశకుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది మద్వచనంబున వాని నిప్పించుకొమ్మనిన." భార. ఆది. ౧, ఆ. ౯౬. ఉ. రా. ౨, ఆ. ౧౦౧; 4. (భూషణాదులు) ధరింపఁజేయు. "గీ. నీలకు మణివిభూషణపాళిఁ దొడిగి..." ఉ. రా. ౧, ఆ. ౪౪.

- వి. 1. ఆభరణము. "క. ఉడురాజముఖుల కెల్లను, దొడు గయ్యెడు నాకుఁ దొడుగు దొడుగఁగ నేలా,దొడగలు తొడిగినఁ గొఱఁ తని,యుడు రాజోత్తంసుఁ జూడ నొక్కతె వచ్చెన్." వీర. 3, ఆ. ౧౪౭; 2. కవచము. "సీ. తొడుగులు సడలి కుత్తుక వెండి మిక్కిలి వెడరూపులై పడ్డ వీరభటులు." జై. ౨, ఆ. ౭౮. (శ. ర. పా.); 3. బాణము. (శ. ర.); 4. గవుసెన,విండ్లు మున్నగువానికప్పు. (శ. శ.); 5. ముండ్లకంప మోపు. "గీ. కంప తొడు గీడ్చిన ట్లేఁదుగానఁ జన్నఁ,దెరువెఱుఁగుచు .." స్వా. ౪, ఆ. ౫౪.

తొడుపు. దే. స. క్రి. (తొడుగు ధా. ప్రే.) ధరింపఁ జేయు. "సీ నవకుసుమంబుల నానావిధంబుల తొడవులు రచియించి తొడిపి వేడ్క..." కు. సం. ౪, ఆ. ౧౧౫. వి. 1. గదాదండాదులకు వేసెడి యినుపపొన్ను. "సీ. అను నసఁ దొడుపున నాం దోళికాదిదండాగ్రసందేయాఖ్య యలరు చుండు." ఆం. భా. ద్వి. ౨౦౨; 2. కవచము. (శ. ర.); 3. చెప్పినది మరలఁ జెప్పుట. (శ. ర.); 4. ఒకరకమైన కత్తి. "గీ. పాలఋడిగలు వడిసెల ప్రాంతమెట్లు,మలప మందులపొడె బుట్ట మన్నె ముల్లు,తోలుకుళ్లాయి తొడుపును దొడ్డికంపు, చుట్టుచవిరెయుఁ గొమరొప్పఁ బాలయం సతఁడు." హంస. ౨, ఆ. ౭౫.

తొడుపుఁగత్తి. వ్యా. వి. (తొడుపు+కత్తి.) చేతికిఁ దగిలించుకొను నినుపతొడుగు గలకత్తి,ఖడ్గవిశే

తొయ్యొలి = తొయ్యలి. "చ...తొ,య్యొలిపలుకుల్ వినంగఁ బొదరిండ్లకుఁ గోయిలపిండు చేరె..." అహల్యా. ౨, ఆ. ౯౦

తొర. వై. వి. (సం. త్వరా.) 1. వేగిరపాటు. "ఉ. అంతటిలోన సీతఁ డుదయాద్రిపయిం బొడతెంచు పద్మినీ,కాంతు...కనుంగొని పం డటంచు వి,భ్రాంతి వహించి యాఁకటితొరన్ రవిపై కెగసెన్..." ఉ. రా. ౫ ఆ. ౯౭; 2. ఆపద, "ఉ. పూనిక నేను వైకొని ప్రభుత్వము గానఁబడంగ నిల్చి యొ,వ్వానికిఁ లోఁగ కెంతతొర వచ్చినఁ గాచెద నిన్నుఁ గూరిమిన్." హరిశ్చ ౪, ఆ. ౧౦౮.

తొరఁగించు. దే. స. క్రి. (తొరఁగు ధా. ప్రే.) 1. వైచు. "మ. నరకుం డొండుశరాసనంబు గొని యన్యస్యందనం బెక్కి వే,తొరఁగించెన్ శరముల్ మురారిపయి నైదున్..." ఉ. హరి. ౧, ఆ. ౧౭౧. భాగ. ౧౦. స్కం. ఉ. ౫౫౩; 2. పడఁగొట్టు. "క. శరములు బలువిడి నిగుడుచుఁ, బరువడి నయ్యాతుధాన భటముక్తశిలా, తరుశస్త్రపరంపర వెడఁ, దొరఁగించుచు వారిఁ దోన తును మాడునెడన్." భా. రా. అర. ౧, ఆ. ౨౨౪; 3. వర్షింపఁజేయు. "చ. చిటిపొటిమబ్బు లాకసపుసీమ...తటిల్లతా,కుటిలతఁ గొంచెపాటిచినుకుల్ దొరఁగించె ధరాతలమ్మునన్." శుక. ౨, ఆ. ౩౪౦. భా. రా. యు. ౫౭౬.

తొరఁగు. దే. అ. క్రి. 1. పడు. "గీ. దివిజపతి నీకు నిచ్చినతీవ్రశక్తి,చేతఁ గవ్వడి పడు నని చూతు వేని,వాసుదేవుని చే నది వ్యర్థ మయ్యెఁ,మునియ లయ్యును బొడియయ్యెఁ దొరఁగు ధరణి." భార. ఉద్యో. ౨; ఆ. ౨౭౮. స్వా. ౨, ఆ. ౫౫; 2. స్రవించు. "క. క్షతములఁ బెల్లు దొరఁగుశో,ణితధారలు మదమహా వినిర్గళకరియా,కృతిఁ గవిసె యతం డేసెను,శతముఖసుతుఫాలతలము శాత్రశరమునన్." భార. విరా. ౫, ఆ. ౧౯౯. పాండు. ౧, ఆ. ౧౧౭; 3. వర్షించు. "ద్వి. ధారుణీపతి గాధితనయహస్తమున,ధారవోసినజలధారకు మున్నె,తొరఁగెఁ బువ్వులవాన తోడనే మోసె, సురదుందుభులు..." ద్వి. హరిశ్చ. పూ. ౧౪౪౦; 4. ప్రవహించు. "సీ. కరుణారసము వొంగి తొరఁగెడుచాడ్పున శశిరేఖ నమృతంబు జాలువాఱ." భార, విరా. ౧, ఆ. ౧౨. విక్ర. ౧, ఆ. ౭౭; 5. లోఁబడు. "ఆ. దైవయోగమునకు దక్షిణమేలుకీ,ళ్లనుభవింప కెట్టు లరుగ వచ్చుఁ,గాన నార్యు లొక్కగతి నుండుదురు సుఖ,దుఃఖములకు మనము దొరఁగనీక." కుచేల. ౩, ఆ. ౧౯; 6. (పువ్వులు మొదలగునవి) రాలు. "క. ఘనపక్షానిలచలితా, వనిరుహములవలనఁ దొరఁగు వరపుష్పచయం,బు.." భార. ఆది. ౨, ఆ. ౭౯. నిర్వ. ౧౦, ఆ. ౧౪౬. స. క్రి. వీడు,త్యజించు. "ఉ. ..అలపార్శ్వమునఁ బట్టునెవంబు వెట్టి శా,ర్ఙ్గధరుండు నేమము దొరంగు మదిం జను దేర..." సా. ౨, ఆ. ౨౧౭. హరి. ౪, ఆ ౩౨. [(వా.)

తొరపడము. దే. వి. వడ్రంగి బెజ్జములు చేయుసాధన

తొరపడు. వై. అ. క్రి. (తొర+పడు.) వేగిరపడు. "ద్వి...బంతిఁ,గూర్చున్నశశధరార్కుల కమృతంబు,మార్చి తా నిట రాక మసలె నటంచుఁ, దొరపడుచున్నదైత్యులకు..." విష్ణు. ఉ. ౪, ఆ. (శ. ర.)

తొరపణము = తొరపడము. (వా.)

తొరలించు. దే. స. క్రి. చల్లార్చు. (శ. ర.)

తొరలు. దే. అ. క్రి. 1. కలుగు. "వ...పయోధరంబుల నంటుచు విశదాంశుకాంతస్థితి దొరలంగ నతివిపులపులినజఘనారోహంబుల నుత్పలపత్త్రంబుల నెఱపుచు..." వసు. ౩, ఆ. ౧౪౦. సా. ౨, ఆ. ౧౪౦; 2. మార్కొను. "ద్వి. తరమెఱుంగక రామధరణీశుతోడఁ,దొరలితే భస్మమై త్రుంగెదుగాక." రం. రా. సు. ౨౫౧ పు. ౭, పం; 3. చేరు,కూడు. (చూ. తొరలించు); 4. మాఱు. (చూ. తొరల్చు.)

తొరలుచు = తొరల్చు.

తొరల్చు. దే. స. క్రి. (తొరలు ధా. ప్రే.) మార్చు. "ఉ. ఆయతి కాని కీడు మమరాలయముఖ్యము లాతఁ డర్థతృష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముల్ దొరల్చి రా,జాయతనంబుఁ జేర్చు మఱియట్టి దపథ్యము గాన నొంటిగాఁ,డే యధికారి కావలయుఁ నించుకతిన్నను వాఁడె రూపఱున్." ఆము. ౪, ఆ. ౨౧౭.

తొరితొరి. దే. అవ్య. క్రి. విశే. లెస్సగా. (శ. ర.)

తొరుఁగు = తొరఁగు. దే. అ. క్రి. 1. రాలు. "క. వనలక్ష్మి మాధవాగతి,ననువుగఁ బూపీట జలక

మాడుటకై ముం,దనువున నలుగిడఁగా సుర్లిన చిక్కన మనఁగ ధరఁ దొరిఁగెఁ గారాకుల్." చంద్ర. 3, ఆ ౧౦౫. వాల్మీకి. 3, ఆ. ౯3; 2. "క...సుగంధము గలవిరిసోన సురపథంబున దొరుఁగన్." రాఘవ. ౧, ఆ. ౬౮; 3 ప్రవహించు. "సీ. శృంగాగ్రదళితవైరించాండగళితావరణధార లన నిర్ఝరములు దొరుఁగ." దశా. ౨, ఆ. ౨౦౦; 4. జాఱు. "వ...ఖలీనంబుల వినీనంబులైనఫేనంబులు దొరుఁగ నిరుగడలఁ గదలు కొనుకర్ణచామరంబు లినుమడింప..." ఉ. హరి. ౪, ఆ. ౨౮3. స. క్రి. పీడు,త్యజించు. "గీ. దుఃస్థుఁడై యుండియుఁను నొప్ప దొరుఁగ కున్న, యన్నరేశ్వరుఁ గనుఁగొని..." భార. శల్య. ౨,

తొరుపు. దే. స. క్రి. తొరలించు. (శ. ర.)

తొర్లించు. దే. స. క్రి. (తొరుగుధా. ప్రే.) వేడి సీళ్లు చన్నీళ్లు కలిపి చల్లార్చు. (శ. ర.)

తొర్లుగట్టె. స్వ. వి. (తొర్లు+కట్టె.) గొల్లవానియొద్ద నుండుపశువులను దోలు పొడుగైన వెదురుకఱ్ఱ. "సీ. తొర్లుగట్టెయుఁ జలదుబ్బ చిల్కుడుగుంజ పూజెబిందెలు వెన్నపూసచట్టి." హంస. ౨, ఆ. ౭౫.

తొర్లుగోవి = తొర్లుగట్టె. (తొర్లు+కోవి.) "ఆ. తూఁతకొమ్ము చంక దోఁపినయెడయెట్టి,తొర్లుగోవి ధూళిధూసరితములైనపురులు నమర నాకస్మికంబుగా,మందనుండి యింటిమొగఁదు వచ్చె." వేం. పంచ. ౧, ఆ. ౫౮౮.

తొఱ. దే. వి. (క. తొఱె.) 1. చెట్లయందు దేర్పడెడు పెద్దరంధ్రము,కోటరము. "క. తొఱలోపల నొక చెన నొక,యఱగా నొసరించి చిగురుటాకు లడుగునం,బఱచిన నది గడుమెత్తని,పఱపుగ నచ్చోట సాఁడుః బట్టిం గనియెన్." భో. ౪, ఆ. ౧౭; 2. రంధ్రము. "సీ. తో ల్లగి తొఱ లేక తోమంగ ననువైన,తరుకాష్ఠమున దంతధావనంబు, వదనసంశుద్ధికై వలయుఁ గావింపఁగ..." కాశీ. ౫, ఆ. ౨౦౫.

తొఱఁగించు. దే. స. క్రి. (తొఱఁగుధా.) పీడు, త్యజించు. "క. అది యొండె భక్తి యొవతే,నెద విశ్లేషైకభీరువృత్తిఁ బ్రియాలా,భదశఁ మెయి దొఱఁగించునుహృదనన యది కాక యున్న యనివైశికముల్." ఆము. ౫, ఆ. ౮౧.

తొఱఁగు. దే. అ. క్రి. కాఱు, స్రవించు. "చ.. చెక్కులం,దొఱఁగెడుఘర్మములె తనదుదుష్పటి చేఁ దుడిచెన్ నయంబుగన్." దశా. ౨, ఆ. 3౧౬. స. క్రి. పీడు,త్యజించు. "క. సురవరులఁ దొఱఁగి తన్నున్,వరియించితి నన్నుఁ బుత్త్రవతి నేలాగొ చెచ్చెర విడిచె.." భార. అర. ౨, ఆ. ౨౦౮. నైష. ౪, ఆ. ౧౨౪. వి. విడుచుట. "గీ. పిర్పుదాఁటులఁగోఁ దొఱ గెఱఁగఁ బడునె." ఉ. హరి. ౪, ఆ. 3౦౮.

తొఱఁగుచొచ్చు. దే. అ. క్రి. (తొఱఁగు+చొచ్చు.) (పసులు) తప్పించుకొనిపోవు. "క. పుంటిమొదవు లాఁబోతులు,సురభుల నకు విడిచి తెఱఁగు చొచ్చినయవియుం,బరిచిచ్చున బెదరినవి యవి,సరి మేసిన బొందెగొనుట చన దధిపతికిన్." విజ్ఞా. ప్రా. ౧3.

తొఱఁగుపోవు = తొఱఁగుచొచ్చు. "గీ. తొఱఁగు పోకుండ మెకములు గఱవకుండఁ,బాడి దఱుఁగక యుండ నాపాటిగొల్ల,లిచ్చ మెచ్చ సీదృష్టికి నెక్కఁ గదుపు,నరయనేర్తు మ నన్నేలు ధరణినాథ." భార. విరా. ౧, ఆ. ౧౭౮. నవ. ౧, ఆ. ౮౦, పు. ౨3, పం.

తొఱలు దే. వి. తొఱ్ఱ, కోటరము. "చ. జరఠకపిత్థరంధ్రములు సాలబిలంబుల గాఢ నింబకోటరములు మట్టిమ్రానితొఱటల్ పెనురావులతొఱ్ఱలు..." వేం. పంచ. 3, ఆ. ౨౭౮. ఆం. భా. ద్వి. ౭౮.

తొఱటము = తొఱట. "క. తిరుగాడుచుండఁగాఁ గని,కరము భయభ్రాంత మగుచుఁ గరివరకర్ణాం,తరవివరములోనికి నొక,తొఱటము గతి సరట మంత దురదురఁ దూరెన్." కేయూర. ౨, ఆ. ౧౦౧.

తొఱటలువాఱు. దే. అ. క్రి. (తొఱటలు+వాఱు.) రంధ్రములుపడు. "క...,పెక్కులుచీమలు వెలువడి వడిఁ,దొలిచె శరీరాస్థులెల్లఁ దొఱటలు వాఱన్." జై. ౭, ఆ. ౧౦౧. [(శ. ర.)

తొఱతేనె. దే. వి. (తొఱ+తేనె.) పుట్టతేనె.

తొఱపు = తొఱఁగు. (శ. ర.)

తొఱుద్రొక్కు. దే. వి. (త్రొక్కు+త్రొక్కు.) గట్టి త్రొక్కుడు. "వ. వెఱచఱచి పఱచుసెడఁ దెఱపి నుడికినతొఱు ద్రొక్కునం గుక్కలచేఁ ఏ జిపటి యైనయుయుఱుములును..." ఉ. హరి. ౪, ఆ. ౨౦.

తొఱ్ఱ. దే. వి. 1. చెట్లయం దేర్పడు పెద్దరంధ్రము. అం. భా. ద్వి. ౨౮; 2. వృక్షవిశేషము. "గీ. .. సీకాయ మద్ది తొఱ్ఱ, వెలఁగ ... మొదలుగా జగతిఁ గల్గు కంప లన్నియును వేవేగఁ గడచి కడచి." హంస. ౪, ఆ. ౯.

తొఱ్ఱఁబులుఁగు. దే. వి. (తొఱ్ఱ+పులుఁగు.) గుడ్లగూబ. "సీ. నిర్మలు నొకధూర్తు నిందించుఁగాకేమి త్రోవలఁ గూయదే తొఱ్ఱఁబులుఁగు." నీతి. ౬౫.

తొఱ్ఱతేనియ. దే. వి. (తొఱ్ఱ+తేనియ) చెట్టుతొఱ్ఱలోఁ బట్టిన తేనెపట్టుయొక్క తేనె, తొఱ్ఱతేనె. "గీ. పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను, తొఱ్ఱతేనియ గల వందుఁ దోఁచి తోఁచి." కాశీ. ౩, ఆ. ౬౮.

తొఱ్ఱి. దే.వి. 1. ముందటిపండ్లు లేనినోరు. "ఆ. ఊఁత నీరు వెలఁదినేఁతమూటాయిటి, మూవి యొండ పసుపు దొఱ్ఱియక్కరంబు మేను..." ఆము. ౬, ఆ. ౬౨; 2. రంధ్రము. "ఆ. తొఱ్ఱుతోడి పొందు తొఱ్ఱిపెసలమూట, ముచ్చుతోడిపొందు వచ్చు నింద, తల వరింతిపొందు తలతోడఁ దీఱు రా..." వేమన. ౨, ప్ర. ౩౮.

తొఱ్ఱివాఁడు. దే. వి. (తొఱ్ఱి+వాఁడు.) పండ్లూడిన వాఁడు, పతితదంతుఁడు. "సీ...పతితదంతాభిధ తొఱ్ఱివాఁ డన..." అం. భా. ద్వి. ౧౨౭.

తొఱ్ఱు. దే. వి. 1. ఆవు. "సీ. ఆరణోచ్చారణోద్ధతు లయ్యె నీతొఱ్ఱుకంఠహుంకృతు లేణగర్భిణులకు." పాండు. ౫, ఆ. ౨౪౦; 2. గోమహిష్యాదికము. "క. తొఱ్ఱులఁ గాచిననందుని, కుఱ్ఱనిచరితామృతంబు..." భాగ. ౧౦, స్కం. పూ. ౬౩౩. అం. భా. ద్వి. ౨౬౧.

తొఱ్ఱుపట్టు. దే. వి. (తొఱ్ఱు+పట్టు.) గోష్ఠము. "ఆ. ఘనభుజుండు నరుఁడు దనతొఱ్ఱుపట్టుల, విశ్రమించి..." భార. ఆది. ౮, ఆ. ౨౧౦. భార. అర. ౩, ఆ. ౧౧౦.

తొల. దే. వి. 1. పనసపండు మున్నగువాని తొన. "సీ...దళమెక్కు పనస పెందొలలతోడ." ఆము. ౨, ఆ. ౭౩, చంద్రా. ౬, ఆ. ౯౦; 2. కాంతి. (తొలఁకు యొక్కయంతిమవర్ణము లోపింపఁగా మిగిలినరూపము.) "గీ...హేమవంతు నాలోకనమ్ముఁ జేసి, తొలయు నగవును మొగమునఁ దొంగలింప." వీర. ౧, ఆ. ౧౬౭.

తొలఁకఁబాఱు. దే. అ. క్రి. (తొలకన్+పాఱు—స్వార్థమున.) చిందు. 'సీ. చీరలు మురళింప నీరంబు లేలోకో యిల రాల నటునిటుఁ దొలఁకఁ బాఱ." శ్రీ. రం. మా. ౧౦, ఆ. ౩౨.

తొలఁకాడు. దే. అ. క్రి. (తొలఁకు+ఆడు.) 1. తొనఁకు, ఒలుకు. "సీ. ముగ్ధలు తొలఁకాడు ముద్దుమపలుకు లయ్యానమాస్త్రమంత్ర బీజాక్షరములు. విక్ర. ౬, ఆ. ౨౭; 2. ప్రకాశించు. "సీ. తెలిమోముపైఁ బర్వి తొలఁకాడుచాయలో మెలరారు కనఁగవమెఱుఁగు లడరు." కు. సం. ౮, ఆ ౯, నైష. ౪, ఆ ౬౨; 3. అతిశయించు. "చ. అనవుడు సమ్మదంబు తొలఁకాడఁగ..." నిర్వ. ౭, ఆ. ౧౩౨, భార. శల్య. ౧, ఆ. ౩౩౬.

తొలఁకించు. దే. స. క్రి. (తొలఁకు ధా. ప్రే.) అతిశయింపఁజేయు, పెంచు. "క. లేయెండ వేఁడియయ్యుం, దోయజమండమున కింపు దొలఁకించు క్రియన్, నీ పలుక పరుస నయ్యును, నాయెడఁ దకు వేడ్క సేయు నళినదళాక్షీ." నైష. ౮, ఆ. ౪౬.

తొలఁకు=తొనఁకు. దే. అ. క్రి. 1. చలించు. "చ. తొలకరిమించు కందొగలతోఁ గలతోయజతారహారకాంతులఁ దగునవ్వు క్రొన్ననలతో నలతోరపుగుబ్బచన్నులన్, దొలఁకెడికొనుచంచలతతో లతతోఁ దగుమేనితావికిన్, దుల యగుకొప్పు గేదఁగులతోఁ గులతోయదవేణి మించినన్." ఉ. రా. ౬, ఆ. ౧౧౭, ప్రభా. ౨, ఆ. ౪౧; 2. అతిశయించు. "ఆ. ..మత్స్యరాజతనయుఁ డెలమి, నొలఁక నొగలఁ బగ్గములు గట్టి చలి వాని, సెల్లఁ దెచ్చి యరద మెక్కుటయును." భార. విరా. ౫, ఆ. ౨౧౦, య. ౪, ఆ. ౧౩౮; 3. ప్రకాశించు. "సీ. కుఱుమాపుత్రడిమంపుఁగోకలోఁ దొలఁకెడు కంపమాననితంబకాంతిసొంపు." కళా. ౪, ఆ. ౧౦౫, వసు. ౪, ఆ. ౭౮; 4. జనించు, బయలు దేఱు. "గీ. అని సునందమరందబిందువ్యాధిక మాధు, రీధురీణరసప్రౌఢి రీతిగలుకఁ, బలుకుపలుకుల కలరి యక్కలికి వలికెఁ, బులకమొలకలు నెమ్మేనఁ దొలఁక నపుడు." ఇందు. ౨, ఆ. ౮౬, పారి. ౧, ఆ. ౫౬; 5. ప్రసరించు. "గీ. వలువ

మీఁదికిఁ దొలఁకుసువర్ణపులినగురునితంబ ప్రభా పరంపరలతోడ, నమరుప్రాయంపురూపుచిత్రముగఁ దాల్చె." కళా. ౪, ఆ. ౧౨౧, బహు. ౧, ఆ. ౧౦; 6. ఒలుకు. "సీ వికచనీరజపత్రమకరందరస భాతిఁ బసనిచూపులఁ గృపారసము దొలఁక." విక్ర. ౨, ఆ. ౫౭, పారి. ౫, ఆ. ౫౭; 7. పొంగు. "లయహారి...తలమీఁదఁ, దఱలుసుర నది దొలఁకి సెఱఁ జినుకులను గురియ..." కు. సం. ౨, ఆ. ౧౦౦; 8. వ్యక్తమగు. "గీ తొలఁకు సిగ్గున వాల్చూపు బెళుకుఁ జూప." దశా. ౨, ఆ. ౧౯౬. వి. 1. చలనము. "చ. కదుఁ బెనుమంటలై నయుదకంబుతొలంకున వారిబిందువుల్, మిడిసి సమీపభూజములమీఁద వెసం బడి మాడుచుండ నెక్కుడురభసంబుతో దివియకోలలకై వడి భంగ సంగతిన్, బొడమినఫేనముల్ మెఱసె బోరునఁ జల్లినవిప్పులో యనన్." వి. పు. ౭, ఆ. ౧౬౫; 2. తరంగము. "చ . వారిదేవతల్, తొలఁకుల కేలఁ దావ నిడి తోమఁ గలం కడఁగెన్..." ఆము. ౪, ఆ. ౧౪౬, ప్రబంధ. ౭౮.

తొలఁగఁద్రోయు. దే. స. క్రి. (తొలఁగన్ + త్రోయు.) 1. పోఁగొట్టు. "ఆ. కేలియందుఁ బడిన తూలమట్లుగఁ బాతకములు త్రిపథగావగాహనమున, దురితములను దొలఁగఁద్రోయుట కెన్నిభంగులను గంగసాటి గలదె యొండు." జాహ్నవీ. ౧, ఆ. ౧౯; 2. తుడుచు. "సీ. తనువునఁ బైకొన్న తాప మజ్జనచేసి తొరఁగెడుగన్నీరు తొలఁగఁద్రోచి." విక్ర. ౧, ఆ. ౧౫౮; 3. విడిచిపెట్టు. "క. సేవించి రోకటి నోల గంద్రోవక జంబీరరసముతో నూనియతో, నావం బెట్టినకిటిముద్రావలయము లమృత మధురరసఖండంబుల్." నైష. ౬, ఆ. ౧౨౭

తొలఁగఁబాఱు. దే. అ. క్రి. (తొలఁగన్ + పాఱు - స్వార్థమున.) తొలఁగు. "క. బలమఱి భుప్రుఁ డహితునిదోర్బలవిభవము సైఁపలేక పరిభవదైన్యా, కలనమున కోర్చి శత్రులుచెలఁగఁ దొలఁగఁ బాఱె దేవసేనలు గలఁగన్." హరి. ఉ. ౧౦, ఆ. ౫౮.

తొలఁగఁబెట్టు. దే. స. క్రి. (తొలఁగన్ + పెట్టు.) విసర్జించు. "గీ. తపము గావింప వెడలె వత్సర సహస్రములు మహాదేవుఁ డంత నాభూమిధరకుమారి గౌరి ననుగ్రహింపఁగఁ దలఁచి, తొంటితన లాంఛనంబులు తొలఁగఁబెట్టి." వరాహ. ౧, ఆ. ౧౬, నైష. ౬, ఆ. ౧౩౯.

తొలఁగవైచు. దే. స. క్రి. (తొలఁగన్ + వైచు.) పోఁగొట్టు. "ఉ...నపుంసకజన్మ మపశ్యభోగమై, వాఁడిమి గల్గుశాపమున వచ్చెఁ బురాకృతకర్మ భావ్య మెవ్వాఁడును నేర్చునే తొలఁగవైవఁగ నోర్వక పోవవచ్చునే." భార. విరా. ౧, ఆ.౨౩౮.

తొలఁగించు. దే. అ. క్రి. విడిచిపెట్టు. "సీ. రాగభేదముల నిర్జ్యములఁ దొలంగించి లయతాళశుద్ధి నెంతయుఁ బలిర్ప." కళా. ౨, ఆ. ౩౩. స. క్రి. (తొలఁగుధా. ప్రే.) 1. తుడుచు. "చ. వదలిన క్రిందు తొంటికతి వాటముగా బిగియించి మోమునన్, జెదరినఘర్మవారిఁ గొనచేలమునన్ దొలఁగించి పీఁపునన్, బొదు లమరించి మించి పలుముష్టిశరాసనమున్ ధరించి..." జై. ౨ ఆ. ౮౬; 2. పోఁగొట్టు. "సీ. పారసీకునకు దుర్భరమానవత్త్వంబు తొలఁగించె మానవదుర్గసీమ." పారి. పీఠి. ౧౩, పారి. ౧ ఆ. ౬౦, దశా. ౨, ఆ. ౬౩.

తొలఁగు. దే. అ. క్రి. (క. తొలంగు. త. తొలై.) 1 అపసరిల్లు, తప్పుకొను. "సీ. పాయు తొలంగుమం చాయతవేత్రహస్తుల మొత్త మేలొకో తోడరాదు." భార. విరా. ౧, ఆ. ౧౮౬, నైష. ౭, ఆ. ౧౩౦; 2. దూరమగు. "క. ఏర్పడ లోపగతురను వెలార్పక లోకంబునకుఁ దొలంగక కుదురై, నేర్పున మనఃపవనములు, గూర్పక యోగీశ్వరుం డగుసె యెబ్భంగిన్." శివ. ఉ. ౧, ఆ. ౧౭౨. జై. ౪ ఆ. ౮౭; 3. జాఱు. "గీ...అయ్యవిదవలువు, దొలఁగె ననిలంబుచేత విఘాత మగుచు." భార. ఆది. ౪, ఆ. ౧౨౨, దశా. ౨, ఆ. ౩౫౮; 4. ఓసరిల్లు, ప్రక్కకేఁగు. "గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగనుఱికి, కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్లువాఱు, నావృకోదరుపై..." భార. భీష్మ. ౨, ఆ. ౭౦, హరి. ఉ. ౩, ఆ. ౧౭౯; 5. తప్పు, మరలు. "చ. సమరము ఖంబునన్ సవనసైంధవమున్ గొనివత్తు బాహుగర్వమున విరోధి గెల్చికొని గాక తొలంగితినేని బ్రాహ్మణీ, గమనము సేయఁగోరి నజఘన్యబుధున్, బుధువేళలం గుల, ప్రమదఁ బరిత్యజించెడు దురాత్ముఁడు బోయెదుద్రోవఁ

బోవుదున్. జై. 3, ఆ. ౧౦, జై. ౪, ఆ. ౮౭; 6. చెడు. "క...దురితము కావించి తొలఁగుదునె పరమునకున్." ఆము. 3, ఆ. ౪౯; 7. వెడలు. "క. దుర్వాసుఁ డటుల శాపము,సర్వారమ్ముగా నొసంగి తొలఁగిన..." దశా. ౨, ఆ. ౪౬. విప్ర. 3, ఆ. ౭౮; 8. తప్పు,మాను. "క. తత్ఫల మిప్పు డనుభవించితి, తొలఁగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్." శార. ఆది. ౪, ఆ. 9. పోవు,నశించు. "క. లలి గంగాస్నానంబునఁ, దొలఁగం గలపాతకము చతుర్దశభువనం,బులు గూడి చేయఁజాలవు,కొలఁదిరె గంగాతిశయము గుణరత్ననిధీ." జాహ్నవీ. 3, ఆ. ౭౨. కాశీ. ౫, ఆ. ౧౦౦. స. క్రి. వీడు,త్యజించు. "చ. వేద మెల్ల వేల పరమవైష్ణవబును దొలంగితి వేమి నరేంద్రనందనా." వి. పు. ౨, ఆ. ౧౧౦.

తొలఁగుడు. దే. వి. తొలఁగుట. అపసరణము. "సీ. తొలఁగు డనంగను దలఁగు డనంగను నపసరణాఖ్యలై యలరుచుండు." ఆం. భా. ద్వి. ౨౨౪.

తొలఁగుడుపడు. ద్వ. వి. (తొలఁగుడు+పడు.) అపసరిల్లు. "వ. ఇట్లు వెనుకముందట నుభయపార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుదెంచు సేనంగుగములం గానక తెఱంగుదప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తం బైనచిత్తంబు గావుండుటం జేసి తానును దనక రేణుసముదయంబును నొక్కతెరువై పోవుచు." భాగ. ౮, స్కం. 3౮.

తొలఁచు. దే. అ. క్రి. స్నానముచేయఁ. "గీ. శంఖపుష్కరిణిని గ్రుంకి చక్రపుష్కరిణి మునిఁగి దేవతాపుష్కరిణిఁ దొలంచి." హంస. ౪, ఆ. ౨౦౭. స. క్రి. (తొలఁగు ధా ప్రే.) 1. నశింపఁజేయు. "గీ. ..అలమేలుమంగామనోవిభుండు, దొలఁచు జన్మాంతరానంతదుష్కృతములు." రా. వి. ౧, ఆ. 3౮. చంద్ర. ౧, ఆ. ౯౯; 2. కడుగు. "చ. మదమున సోమకాసురుఁడు ముచ్చిలి యచ్చలమారఁ గొన్నప్రాఁ జదువులు తెచ్చి తజ్జఠరసాంద్రతరాంత్రము లంట నంటు బల్,గదురు తొలంగఁ గీర్తి యనుగంగఁ దొలంచి విధాతృవిస్ఫురద్వదనసరోజగంధలలితంబులు చేసితిగా జగన్నిధీ." పాండు. ౨, ఆ. ౫౬. నైష. ౮, ఆ. ౧౯3; 3. ముంచు. "సీ. మంగళతీర్థ సంపర్కమానందించి యమృతవాటికను దేవా మునకు దొలఁచి." వాల్మీకి. ౨, ఆ. 3.

తొలకరి. ద్వ. వి. వర్షాకాలము. "చ. పలికె లలాటలోచనుఁడు ప్రస్ఫుటభంగి మునిప్రజంబుతోఁ, దొలకరిమేఘఘోషములతోఁ బురణించుసమంచితధ్వనిన్." హర. ౪, ఆ. ౪౬. చం. రా. 3, ఆ. ౮. వసు. 3, ఆ. ౧౫.

తొలకరించు. దే. అ. క్రి. 1. వర్షించు. "గీ. సరసమకరందమత్తషట్చరణతరుణ, కలకలోన్నిద్రమైనవకమలకుజంబు,మాటున వసించి పల్కు,నమ్మంత్రిఁ జూచి,పలుఁకుపలుకున నమృతంబు దొలకరింప." సుద. ౫, ఆ. ౪౨; 2. జనించు. "సీ. తొలకరించు మొలకనిగ్గులచేత సుడివడి కడకొత్తుమాపు తోడ." విక్ర. ౮, ఆ. ౮౨; 3. వెదచల్లు. "గీ. తళుకుజాళ్వామెఱుంగులం దొలకరించు,తీఁగ ధరియించె గళమునఁ దీఁగబోఁడి." ఇందు. ౫, ఆ. ౮3; 4. మీఱు, అతిశయించు. "సీ. అలఁతఁబామెదునవ్వుటమృతంపుఁదేటల చిలుకరింపులఁ బ్రేమ తొలకరింప." అని. 3, ఆ. ౯౫. హంస. ౨, ఆ. ౨౧.

తొలకరిదొర. ద్వ. వి. (తొలకరి+దొర.) ఇంద్రుఁడు. (చూ. తొలకరిదొరబిడ్డ)

తొలకరిదొరబిడ్డ. ద్వ. వి. (తొలకరిదొర+బిడ్డ.) ఇంద్రతనయుఁడు,అర్జునుడు. "క...సుభద్ర వచ్చె,జెలియలు వేయాఱులు నిరుచెంతలఁ గొలువన్,దొలకరిమెఱుపో యిది యని,తొలకరిదొర బిడ్డ వెఱఁగుతోడం జూడన్." విజ. ౨, ఆ. ౯౮.

తొలకరిమెఱుపు. ద్వ. వి. (తొలకరి+మెఱుపు.) 1. వర్షాకాలపుమెఱుపు; 2. మల్లయుద్ధగతిభేదము. "వ. విష్ణుచక్రంబును రామబాణంబును నాగబంధంబును తొలకరిమెఱుపును... సర్పాంకుశంబును మొదలుగాఁ గల పదిరెండుగాయమానంబులును..." ప్రబంధ. ౭౮.

తొలకరిసూఁడు. ద్వ. వి. (తొలకరి+సూఁడు.) వర్షాకాలవిరోధి, హంస. (శ. ర.)

తొలకు. దే. వి. మృగమువెనుకటికాలిమొదటిభాగము:నేటకును ప్రక్కకును నడిమిభాగము, ఉపలంభము. "ద్వి...ముత్తియములు,తొలకులు రక్తబిందువులైనపోడలు." రం. రా. అర. ౧౭౨, పు. ౨3, పం. (శ. ర.) బస. ౭, ఆ.-౩౯, పం.

తొలట. దే. వి. తొఱట,కోటరము. "ఆ. ఘూసుగాఁడి యంత భుజగంబు లోని నున్న వెలఁగ మ్రానివెడఁద తొలట సూపి,దీనఁ జేయి పెట్ట లోన నున్నది సవి,శేష,హేమ మనుచుఁ జిలుక చెప్పె." కేయూర. ౪, ఆ. ౭౪.

తొలతేనె. దే. వి. (తొల+తేనె.) పుట్టతేనె. "క. కుం దనపురవలు గుప్పెడు,తుందిలపుంజపున్నఁగవయుఁ దొలతేనెలకున్, విందులొనరించుపలుకులఁ, జం దురునిం బోలుమోము సకియకె యమరున్." హంస. ౨, ఆ. ౧౮౨.

తొలసి. వై. వి. (సం. తులసీ.) 1. తులసిచెట్టు. "సీ. వక్షస్స్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణబిలమున నులి వాడుతొలసియెన్ను." జై. ౭, ఆ. ౧౯౭. నీలా. ౧, ఆ. ౧౦౯; 2. తులసిపేరు. "ఆ. సవతు లేక నీవిశాలవక్షస్స్థలిఁ,దొలసితోడఁ గూడఁ దోయజాక్ష,మనుపు మనుచు నెపుడు మాకాంత నీపాద,కమలరజముఁ గోరుఁగాదె. కృష్ణ." భాగ. ౧౦, స్కం. పూ. ౯౯౧.

తొలి, దే. వి. ఔ. 1. ముందు, పూర్వము. (దీనియా మ్రేడితము తొలితొలి. "చ. తొలితొలి పద్ద పీనుఁగులఁ ద్రొక్కుచు నొండొరుమీఱఁ జూచు నగ్గలిక గడంగి..." నిర్వ. 3, ఆ. ౧౦. నృసిం. 3, ఆ ౭౯. ఆం. భా. తృ. ౭3; 2. రంధ్రము. "సీ. కొప్పరింపఁగ మింటఁ గ్రొవ్వాడి రోమముల్,చొచ్చి వెళ్లినతొలుల్ చుక్క గుంపు." చంద్రా. ౧, ఆ. ౭౫. ఆము. ౪, ఆ. ౧౭౮; 3. కోటరము,తొఱ్ఱ "సీ. తొఱతొలి తొఱ్ఱ నాఁ దరుకోటరం బొప్పు..." సాం. ని. సా. ౫౯, విణ. మొదటిది. (చూ. తొలిచేల్పు మొ.)

తొలిక. దే. వి. రంధ్రము. "క. పలుచని నెత్తురుమడుపులఁ,బొలిచెన్ రథనేమివలయములు హతరణ వీరులు దూఱఁగ,రవిబింబము,తొలికై రుచి దూల నీడ దోఁచినమాడ్కిన్." కవిక. ౨, ఆ. ౧౯౨. (శ. ర. పా. తొలుకై. ముద్రి.)

తొలికూటమి. దే. వి. (తొలి+కూటమి.) ప్రథమ సమాగమము. "గీ. ఆఱుమరలు దీఱ లాలించి యామరించి కలికితొలికూటమి కిభుండు తులక రించె." కృ. శకుం. 3, ఆ. ౫౦.

తొలిగట్టు. ద్వ. వి. (తొలి+గట్టు.) ఉదయగిరి. "శా. ఆందోళింపఁగఁ జేసె ముందు రజతాహార్యంబు లంకేశ్వరుం,డెంకన్ దుర్జయుఁ డింద్రు వీఁ డొరయుచో నేమెంచునో వాఁడు సాం, పొందం గానుక లిత్తునంచుఁ దొలిగట్టుతక్కం తతో నెత్తుమేన్,చందాకొంపు తెఱుఁగునం దనరె భాస్వద్బింబమున్ దూఁగ్సరన్" ఉ. రా. ౪, ఆ. ౨౫౨. ఇక్లే. తొలికొండ. శశాం. ౪, ఆ. ౧౨౫.

తొలిచదువులు. దే. వి. బ. (తొలి+చదువులు) వేదములు. "రగడ. అచ్చుగ నిఁక ఁ దెలియవు తొలి చదువులు." ఉ. రా. ౭, ఆ. ౯౨. సాం. ని. మాన. ౨.

తొలిజాలియొడయఁడు. మి. వి. బ్రహ్మ. "సీ... తొలిజాలియొడయఁడు పలుకులదణి. గీ. తమ్మి గద్దియదళవాయి తాత బొమ్మ...అనఁ బంకజాసను పేళ్లు శ్రీవేంకటేశ." వేంక. దేవ. ౬.

తొలిజాతివారు. మి. వి. బ. బ్రాహ్మణులు. "సీ... నేలవేల్పులు తొలిజాతివారు ..నాఁగ బ్రాహ్మణులకు నామము లగు." సాం. ని. మాన. ౨.

తొలిజేజే. దే. వి. (తొలి+జేజే.) రాక్షసుఁడు. "మ. శివపూజానియమంబు మాని తొలిజేజేపెద్ద మాహిమ్మలీ,భవుఁ డాతండు బళీ కనంబడెడు..." ఉ. రా. 3, ఆ. ౨౨3. అచ్చ. బాల. ౧౭.

తొలిదిక్కు. మి. వి. (తొలి+దిక్కు.) తూర్పు. "ద్వి. అక్కలింపులు వాయు వెక్క నూర్పుటలు, ముక్కువట్టుట తొలిదిక్కు చూచుటలు." పండితా. దీక్షా. ౫౮.

తొలిదేవర. ద్వ. వి. (తొలి+దేవర.) 1. రాక్షసుఁడు. "చ. తెఱవను జూపకున్నఁ దొలిదేవర ప్రేవులు ప్రోవులై పడన్,బెఱికెద..." అచ్చ. కిష్కిం. ౮3; 2. బ్రహ్మ. "ఉ...భారతీ,దేవి ముఖాబ్జముఁ జూచె తొలిదేవర సాదరవీక్షణంబునన్." ఉ. రా. ౭, ఆ. ౨౦౦.

తొలిపన్నగము. మి. వి. (తొలి+పన్నగము.) ఆది శేషుఁడు. "సీ...పన్నగంబులు తొలిపన్నగంబు లయ్యె. గీ...కీర్తిసాంద్రరుచులు,మించి లోక త్రయం బాక్రమించుకతన." దశా. ౮, ఆ. ౫౮.

తొలిపలుకులు. దే. వి. బ. (తొలి+పలుకులు.) వేదములు. (చూ. తొలిపలుకుఁగొనలు.)

తొలిపలుకుఁగొనలు. దే. వి. బ. వేదాంతములు-ఉపనిషత్తులు. "గీ... తొలిపలుకుఁగొనలు, గాంచి మించినజడదారిగములు కైనఁ గనఁబడఁగ రాక యుండునిర్గంటి నేఁడు." అచ్చ. అర. ౧౧౨.

తొలిమబ్బు దే. వి. (తొలి+మబ్బు.) తొలకరి మేఘము. "గీ. విల్లు దెక్కిగంటివి ల్గాఁగ వింటి మ్రోఁత, లుఱుములుగఁ గల్గుమెఱుఁగులు మెఱుఁగుఁ దీవి,యలుంగ నెఱరాచ తొలిమబ్బుపొలసుదిండి, కొండపై నంపజడివాన గురియుచుండె." అచ్చ. యు. ౫౧౮.

తొలివేలుపు. దే. వి (తొలి+వేలుపు.) **1.** రాక్షసుఁడు. "సీ. తొమ్మండ్రుకొడుకులఁ దొలివేలుపులఁ జేయఁ బోడమించు నేదేవుబోడ్డుఁదమ్మి." ఉ. హరి. ౨, ఆ. ౧౪౪. సాం. ని. దేవ. ౧౯; **2.** విష్ణువు. "సీ. తొలివేల్పుఁ జిందంపుఁదొరౌ పురవళిచేఁ గర్ణరంధ్రములందుఁ గవియుఁ జెవుడు." ఉ రా. ౨, ఆ. ౨౧౪.

తొలివేల్పుపగతురు. దే. వి. బ. దేవతలు. "సీ... జేజేలు తొలివేల్పుపగతురు పలుకుటల్లు, మేటులు ...అనఁగ సురాభిఖ్య లా..." సాం. ని దేవ. ౧౮.

తొలు. దే. విశే. వృత్తియందు తొలుతశబ్దమున కంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. ఉదా: తొలువేదువు, తొలుదీవి. మొ.

తొలుఁబలుక్కులు. దే. వి. బ. (తొలుత+పల్కులు.) వేదములు. దశా. ౫, ఆ. ౧౧౫. పారి. 3. ఆ. ౨౮.

తొలుకడ. ద్వ. వి. (తొలుత+కడ.) తూర్పుదిక్కు. "సీ. తొలుకడ రాతపసులు గెబ్బునర్తి జేఁ డెద్దడి గుబురు కాటిర్లప్రొద్దు." అచ్చ. పీఠి. ౮.

తొలుకబ్బము. ద్వ. వి. (తొలుత+కబ్బము.) ఆది కావ్యము, రామాయణము. "సీ. తొలుకబ్బ మొకటఁ గోర్కు లొసంగ సత్క్రియ లొనరించి ప్రజసేమ మొందు..." సమీర. 2, ఆ. 2౯.

తొలుకరి. దే. వి. వర్షాకాలము. "సీ నటియించు నప్సరఃకుటిలాలకలమేని మెఱుఁగులు తొలుకరి మెఱుఁగులు గను." దశా. 2, ఆ. ౧౮. వసు. 3, ఆ. ౧౫. ఆం. భా. ప్ర. ౮౬.

తొలుకరించు. దే. అ. క్రి. వర్షించు. "గీ. తళుకుఁ దేనియ సుదువులఁ దొలుకరింపఁ, గలికిచూపులు పీనుఁగు బలుకరింప, సోలపునకపుల నందియలఁ గిలుకరింప." చంద్రా. 3, ఆ. ౬౨.

తొలుకాడు. దే. అ. క్రి. (తొలుకు+ఆడు స్వార్థము.) అతిశయించు. "సీ. ప్రవహించు నెచ్చోట్టఁ బరిపూర్ణసంపదఁ దొలుకాడుచు నపారదుగ్ధనదులు." కాశీ. ౨, ఆ. ౨౮. భాగ. ౬. స్కం. ౫౦౪.

తొలుకారు. ద్వ. వి. (తొలుత+కారు తొలుశబ్దమునుత్వమున కత్వమును కారుశబ్దమునకు 'కరి' యనురూపమును వైకల్పికముగా వచ్చును. చూ. తొలుకరి; తొలకరి.) వర్షాకాలము. "ఉ. కన్నులు గండుమీలు దొలుకారుమెఱుంగులు గాముబాణముల్." విక్ర. 3, ఆ. ౪౯. కు. సం. ౧౧, ఆ. ౧3౫.

తొలుకు. దే. అ. క్రి. అతిశయించు. "గీ. పులియు మొదలగుమెకములు కలఁక తొలుకఁ, జెదరి నలుదిక్కులకుఁ బాఱె నదరి బెదరి." ఉ. రా. 2. ఆ. ౪౦౮. విజ. ౨, ఆ. ౧౬౧.

తొలుకొను. దే. అ. క్రి. (తొలుత+కొను.) మొదలగు, ప్రారంభమగు. "క. తొలుకొని కుక్కుటరవములు, చెలఁగుడు..." కు సం. ౮, ఆ. ౧౮౪.

తొలుకోడి. ద్వ. వి. (తొలుత+కోడి.) తెల్లవాఱు జామున మొదట కూయుకోడి. "ద్వి. తొలుకోడి కూయంగ బలువిడి నేఁగి." బస. ౪, ఆ. ౧౬౪. పం.

తొలుగట్టు = తొలిగట్టు. "ఉ... శే, గన్నియజేని మేను తొలుగట్టుతుదం బొదవెం గ్రమంబునన్." వసు. ౬, ఆ. ౬.

తొలుగొలము. ద్వ. వి. (తొలుత+గొలము.) బ్రాహ్మణ వంశము. "క. అత్తొలుగొల మలరులసర, మెత్తిన క్రియ... ఉదాత్తం బయ్యెన్." పాండు. ౪, ఆ. ౨౬౬.

తొలుగొరు. దే. వి. (తొలు+గొరు.) ఐరావతము. "చ... తెల్లనితొలుగొరు నెక్కిన యిలాధర వైరియొచుమ్ము..." చంద్రి. ౨. ఆ. ౯.

తొలుచు. దే. స. క్రి. **1.** రంధ్రముచేయు. "సీ. ఇరుమెయిఁ దొలిచి బెట్టిలఁ దూఱునవియును నలువుర నేపుర నాటునవియు." భార. విరా. 3, ఆ. ౧౬౧. ఉ. రా. 3, ఆ. 3౨3; **2.** ఖండించు. "క. పులు మేయఁ గానసాంతర, ములు డాయ నిజళిశుమోహములఁ జనఁ

బాల్గొల్ల లోనఁగ నసిఁ దేనువు విమ, తులతలలఁ దొలుచు ననంతదోస్తంభమునన్." కకు. ౧, ఆ. ౧౯. హరి. ౧, ఆ. ౧౪౪; 3. నాఁటు. "గీ. కాఁడె గుస్సెను దొలిచెను నాఁడె ననఁగ, నాఁటె ననుమాట కర్థమా నాగభూష." ఆం. భా. తృ. ౧౨౨.

తొలుత. దే. వి. శో. అవ్య. ముందు, పూర్వము. (సమాసమున దీనియంత్యాక్షరము కొన్నియెడల నిత్యముగాను కొన్నియెడల వికల్పముగాను లోపించును.) "గీ... ఏనికదిండివార్వమ్ము దొలుత, గాఁగఁ దా నెక్కి నన్నుఁ దాఁకకయ దీని, కటివిభాగంబు నెక్కి రాఁగలవె యబల,వెనుక మరగొమ్ము నూఁతగాఁ గొనుచు ననియె." కళా. 3, ఆ. ౬౨. హర. ౨, ఆ ౬౦. విణ. ముందుది, పూర్వపుది. "వ. తొలుతటిభోలయులక యెడలం జనించినవియోగశిఖి..."పారి. ౧, ఆ. ౫౨. రాఘవ. ౪, ఆ. ౫౪.

తొలుదీవి. ద్వ. వి. (తొలుత+దీవి.) జంబూద్వీపము. "సీ...కల్యాణపరంపరలతొలుదీవి."వసు. ౧, ఆ. ౯౪.

తొలునాఁడు. దే. వి. (తొలుత+నాఁడు.) పూర్వదినము. "గీ. వెలఁగి తొలునాఁడు తరవాయిఁ జెప్పినట్టి, యొల్లపన్నంబు లేకరు విడి..."రా. వి. ౨, ఆ. ౭౫.

తొలునీటిరిక్క. ద్వ. వి. (తొలుత+నీటిరిక్క.) పూర్వాషాఢానక్షత్రము. (శ. ర.)

తొలుపక్కము. ద్వ. వి. (తొలుత+పక్కము.) శుక్ల పక్షము. (శ. ర.)

తొలుపలుకులు. దే. వి. బ. (తొలుత+పలుకులు.) వేదములు. "క. మలవిల్లుఁ జిలువనారియుఁ, బులుఁగుసిడము జోదుముల్కి పుడమియరదమున్, దొలుపలుకు వారువంబులుఁ, జెలఁగఁగఁ దిగప్రోల్చెల్ల గూలిచినబలియుఁ నకున్." అచ్చ. బాల. ౨౨.

తొలుపుట్టువు. దే. వి. (తొలుత+పుట్టువు.) పూర్వజన్మము. "క. తొలుపుట్టువు నీనోముల, ఫలమెట్టిదయో..."వి. శకుం. ౪, ఆ. ౭౧.

తొలుప్రాఁకు. దే. వి. (తొలుత+ప్రాఁకు.) ఉపఘ్నము, నిడుకొయ్య. "క. ఇంతకు మూలము దృష్ణా తంతులతయ పత్ని నినుము దానికి నదరఙ్గాంతాజనంబు దొలుప్రాఁకింత యొఱఁగి తృష్ణ దొఱఁగు టిచ్చు విముక్తిన్..." భా. ర. శాం. ౪, ఆ. ౨౯3.

తొలుబాము. ద్వ. వి. (తొలుత+బాము.) పూర్వజన్మము. "సీ. దుఃఖంబుఁ బొమ్మని త్రోవ సుఖంబు రమ్మని తెచ్చికొని వశమయ్యె వానిఁ, దొలుబామునందలిదుష్కృతంబును సుకృతంబు హేతువులుగఁ దగిలిచేయు."భార. శాం. ౧, ఆ. ౧౮౫.

తొలుమినుకులకడలు. ద్వ. వి. బ. (తొలుమినుకులు+కడలు.) ఉపనిషత్తులు. "వ .. తొలుమినుకుల కడలం గనరానియాజేనిం బలుదెఱంగులం బొగడి..."య. 3, ఆ. 3౧.

తొలుమినుకులు. దే. వి. బ. (తొలుత+మినుకులు.) వేదములు. "క ....తొలుమినుకులు ప్రామినుకులు దొలుపలుకులు ప్రాఁబలుకులు పెనుమినుకులు నా,వెలయుచున్ శ్రుతులకును జేర్లు..." ఆం. సం. దేవ. ౪౧.

తొలుమేను. దే. వి. (తొలుత+మేను.) పూర్వజన్మము. "సీ. తొలుమేనఁ జేసినదుష్కృతశక్తియో..."భార. ఆర. ౨, ఆ. ౧౧3.

తొలురిక్క. ద్వ. వి. (తొలుక+రిక్క.) అశ్వినీనక్షత్రము. శ. ర.)

తొలురిక్కనెల. ద్వ. వి (తొలురిక్క+నెల) ఆశ్వయుజమాసము. (శ. ర.)

తొలువేలుపు. దే. వి. (తొలుత+వేలుపు.) 1. రాక్షసుఁడు. "సీ. తొలువేలుఁపుల వేలుఁపులపనుల్ గొనుటేఁ..."స్వా. ౫, ఆ. ౪౭; 2. బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.

తొలుసంజె. ద్వ. వి. (తొలుత+సంజె.) ప్రాతస్సంధ్య. "సీ. ఒకదీవిఁ దొలుసంజె యుష్మమునఁ బొందు నుదయించు మఱుసంజె యొుండుదీవి." కాశీ. ౧,ఆ. ౧౭౯. ఆము. ౪, ఆ. ౧౫.

తొల్కరి = తొలుకరి "చ....శోభన భుక్తివేళ దొల్కరి సమయంబు పేరెలమిఁ గైకొనకుం డుఁ జెభోక్తృసస్యముల్."సైమ. ౬, ఆ. ౧౨౧.

తొల్కరించు = తొలుకరించు. "చ. జలజాపజ్జనొజ్జ యయి సజ్జగమోములఁ దొల్కరించుఁ దొల్పలుకులమాధురిన్ జిలుకఁ బాడి..."శివధ. ౧, ఆ. ౬.

తొల్కాడు = తొలుకాడు. "సీ. సకలవైభవములు సమకూరఁ దనయంకఁ దొల్కాడుకోర్కుల తోడఁ గూడి." భాగ. ౬, స్కం. ౫౦౪. పండితా. పురా. ౧౦౬. పు.

తొల్కారు = తొలుకారు. "ఉ...లిరం బగురూపుఁ జెందుతొల్కారుమెఱుంగుజీవకళఁ గాంచిన చిత్తరుబొమ్మయాన శృంగారిణియా సుధాసరసిగా నుతిసేయఁగ వచ్చు నెచ్చెలిన్." హంస. ౧, ఆ. ౬౪.

తొల్చదువులు=తొలిచదువులు. "చ...తొల్చదువుల్తగువిన్నపంబులం, బలుమఱు చేయుచుందమున బంగరుటంబి ను లుగ్గడింపఁగన్." పాండు. ౨ ఆ ౩౨.

తొల్చు=తొలుచు. "ద్వి. ఎమ్ములు దక్క మున్నిడి తొల్చి తొల్చి,గ్రమ్మన భక్షింపఁగా లెక్కగొనక." పండితా, దీక్షా. ౩౬. పు. ఉ. రా. ౩, ఆ. ౩౨౩.

తొల్పంది. దే. వి. (తొలుత+పంది.) ఆదివరాహము "గీ...తొల్పందిగున్నమై వానిఁ జేటకోఱ నమన్ను దాల్పవే కోరి నీవు." అచ్చ. బాల. ౧౫౩. అచ్చ. బాల. ౪౬.

తొల్లి. దే. వి. ఔ. 1. పూర్వము,ముందు. "వ... కృష్ణద్వైపాయనుం డను బ్రహ్మర్షి తొల్లి వేదంబులేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామధర్వంబులుగా విభాగించి..."భార. ఆది. ౧, ఆ. ౩౯. నైష. ౩, ఆ. ౧౨౬; 2. రంధ్రము. "చ వఱపున మేను లెండఁ దమవారియెడం బెడఁబాసి జీవముల్, దొఱఁగి ధరిత్రి డిందియలిదుర్దశఁ గాలము వేచియుండఁగా, నుఱపగువానఁ బ్రాణములు నొయ్యన నూర్కొన మన్నుదొల్లి నే,డ్డెఱఁ గనుపట్టు దర్దురతతిన్ గని యంద్యము మొప్పఁ జేయఁగన్." నా.. పంచ. ౨, ఆ. ౧౪౪. (శ. ర. పా.)

తొల్లిక. దే. వి. 1. త్రవ్వట కుపయోగించు పాఱ వంటిచిన్నయినుపపనిముట్టు. "చ. భయద మను తొల్లికన్ విమలభావవసుంధరఁ బెల్లగించి..." కాళ. ౪, ఆ. ౧౨౨; 2. మత్స్యవిశేషము. "సీ. మిసికల్లురుఱు తేటమీను తొల్లిక తాలిగొరక మాపురమును గుంటముక్కు." హంస. ౪, ఆ. ౧౮౭.

తొల్వేలుపు = తొలువేలుపు (రాక్షసుఁడు.) "సీ. కూళతొల్వేలుపు కూటువ గుటంపుటడవుల మేటి పయ్యెర యసంగ." అచ్చ. బాల. ౬౩. అచ్చ. యు. ౮౫.

తొవ = తొగ. (కలువ.) "చ. వనజము లుల్లసిల్లఁగఁ దొవల్ మొగుడన్." మార్క. ౭, ఆ. ౧౨౩. ఆం. భా. ప్ర. ౧౬౪.

తొవకంటి. దే. వి. (తొవ+కన్ను+ఇ.) స్త్రీ. "సీ. తొవకంటికుండలింద్రుఁ డితండు గాఁ డైన సమరభోగికులమే లదయకున్నె." చంద్రా. ౩, ఆ. ౧౧౩. చంద్ర. ౨, ఆ. ౯౦.

తొవరు. వై. వి. (సం. తువరః) ఒగరు. (శ. ర.) విణ. వెగటురుచి గలది,ఒగరుగలది. "సీ. చివురెల్లఁ గసి నొత్తి తొవరాకు గుత్తుక డొక్కని కోటుల వెక్కుచుండు."కు. సం. ౫, ఆ. ౧౬౨.

తొవరాయఁడు. ద్వ. వి. (తొవ+రాయఁడు.) చంద్రుఁడు. "చ. అపుడు రణోత్సుకుం డగుసితాంబుజ సాయకుకంటి సన్నఁ గీరపటలి చల్లగాడ్పు తొవ రాయఁడు..." చంద్రి. ౨, ఆ. ౭౭.

తొవరి = తొగరి. (శ. ర.)

తొవరిమ్రాను. ద్వ.వి. (తొవరు+మ్రాను.) తొగరుచెట్టు. "గీ. తొవరిమ్రా ననఁ దువరిక దోఁపఁబడును." ఆం. భా. ద్వి. ౬౨.

తొవరు = తొగరు. (వఱపు.) "గీ. కావి జాజెఱ్ఱన యెఱుపు జేవురు తొవరుపఁగ రక్తాఖ్య పెలయు..." ఆం. భా. ప్ర. ౧౦౧. సాం. ని. స్థా. ౬౦. విణ. ఎఱ్ఱనిది. "సీ...తొవరుఁ బుట్టములఁ గెంబువులఁ దాల్చి."అచ్చ. యు. ౩,౨౩.

తొవలరాయిడికాఁడు = తొవలసూఁడు. ఆం. సం. దేవ. ౧౬.

తొవలసూఁడు. ద్వ. వి. (తొవలు + సూఁడు.) సూర్యుఁడు. "గీ. పొడుపుమలనుండి పడమటి కడలి కరుగఁ,బవలు నలుజాములును బట్టుఁ దొరలసూఁడు, తత్తడులకు..." నీలా. ౧, ఆ. ౩౮.

తొవవిందు. దే. వి. (తొవ+విందు.) చంద్రుఁడు. "లయగ్రాహి. కోరి తొవవిందు తనకోరికెగె యాశ చన కోరి యని చేరెడుచకోరియు..." కళా. ౩, ఆ. ౧౦౫.

తొస్స. దే. వి. ఉచ్చారణలోపము. (శ. ర.)

తొస్సె. దే. విణ. పండ్లులేనిది,బోసి. (శ. ర.)
తొళక. దే. విణ. పలుచనిది. (శ. ర.)

తో

తో. దే. ప్ర. ద్రు. ఒకానొకతృతీయావిభక్తి ప్రత్యయము. 1. ఇది క్రమముగా సహార్థము, తుల్యార్థము, కరణార్థము, షష్ఠ్యర్థము నిచ్చును. "క. అమృతముతో నుద్భవమై..." భార. ఆది. ౨, ఆ. ౨౭. "సీ. తారకామందారతారాచలంబులతో రాయునెవ్వనిచారుకీర్తి." క్రీడా. ౧౪. "సీ. సాంగంబు లగుచుండ సకల వేదంబులు సదివె వసిష్ఠుతో..." భార. ఆది. ౪, ఆ. ౨౬౦. "చ. మనమున నీవు గోరునృపమన్మథులో నినుఁ బెండ్లిసేయ నీజనకుఁడు సంభ్రమించె..." కవిక. 3, ఆ. ౯౯; 2. వెంబడి. "క. మన మొకయేవురమాయం,గనయుం డో నరుగు దేరఁగా..." భార. విరా. ౧, ఆ. ౫౯; 3. కొలఁది. "సీ. సవినయంబునఁ దనశక్తితో గురునకు దక్షిణ యిచ్చి యాతండు వనుప." భార. శాం. ౫, ఆ. ౧౩౯; 4. వలన. "మత్తకోకిల .....ధౌమ్యుతో,వేదమంగయుతంబుగాఁ జదివెన్ ధనంజయుతో ధనుర్వేద మిమ్ముగ నభ్యసించెను..." భార. ఆది. ౮, ఆ. ౨౨౦; 5. వెనువెంటనే. "క. ఉద్యతులై కవలును ధృష్టద్యుమ్నుఁడుఁ గడఁగఁ దోన సౌభద్రుండున్,మాద్యద్గతిఁ గవియుదు ....." భార. భీష్మ. ౧, ఆ. ౨౩౦. (ఇట్లే ఇతరార్థముల నూహించునది.)

తోఁక. దే. వి. 1. వాలము, పశుపక్ష్యాదులపుచ్ఛము. "క. పీఁక నెడి ఘనగదాహతిఁ,దోఁకయుఁ గదలింపలేకదుస్సహపీడన్,మోఁకరిలఁబడియె నేలను,పోఁకొర్వక దిగ్గజంబు సుడిముడి గొంచున్." భాగ. ౮, స్కం. ౩౬౭. అము. ౬, ఆ. ౨౧. "సీ. పాతాళలోకంబుపాతున శేషుండు వెలయంగ ముప్పదివేలయోజనంబులవెడలుపునకు దోఁకఁ జుట్టఁగాఁ జుట్టుక యుండు..." భాగ. ౫, స్కం. ౨, ఆ. ౧౨౨.

తోఁకగుంజె. ద్వ. వి. (తోఁక+గుంజ.) అడదోఁకగా నేర్పడిన స్తంభము. (శ. ర. బ్రా.)

తోఁకచిచ్చు. ద్వ. వి. (తోఁక+చిచ్చు.) నిప్పులురగిలించినపిడుకలజాలు. (శ. ర. బ్రా.) "గీ. తోఁకచిచ్చైన నార యుద్ధురతఁ గృష్ణరాయ బాహుప్రతాప జాగ్రన్మహాగ్ని." స్వా. ౧, ఆ. ౩౭. అము. ౧, ఆ. ౩౭.

తోఁకచుక్క. ద్వ. వి. (తోఁక+చుక్క.) ధూమకేతువు. "గీ. దేవవిభురాజ్యగర్వతమోవినాశ, సూచకం బయి పడుతోఁకచుక్క యనఁగ." దశా. ౨, ఆ. ౨౧.

తోఁకపీఁకుడు. దే. వి. (తోఁక+పీఁకుడు.) తోఁకపీఁకుచున్నట్లు వెనుకకులాగుట,వెనుదీయుట. వ్యవః- ఈవ్యవహార మేమియు జేల లేదు; తోఁకపీఁకుడుగా నున్నది.

తోఁకపీఁకుడుగాఁడు. దే. విణ. (తోఁక+పీఁకుడు+కాఁడు.) వెనుకకు లాగువాఁడు,వ్యవహారము తెమలనీక నాన్చువాఁడు. (బ్రా.)

తోఁకపురుగు. ద్వ. వి. (తోఁక+పురుగు.) తోఁక గలచిన్నపురుగు. (చూ. తోఁకపుర్వు.)

తోఁకపురువు = తోఁకపురుగు. (చూ. తోఁకపుర్వు.)

తోఁకపుర్వు = తోఁకపురుగు. "చ. హరిఁ బరమేశ్వరుం బ్రభు సమస్తజగత్ప్రియుఁ గీదువల్కుఁడు, ర్నరుఁడవు నీదుజిహ్వ పలువ్రయ్యలుఁ వాయదు నోరఁ బెల్లుగాఁ, దొరఁగవు తోఁకపుర్వులు..." హరి. ఉ. ౬, ఆ. ౧౪౫. (శ. ర. పా. తోఁకప్రువ్వులు' ముద్రి.)

తోఁకమిరియము. ద్వ. వి. (తోఁక+మిరియము.) వాలమరిచము,తోఁక గలమిరియము. (శ. ర. బ్రా.)

తోఁకొను. దే. అ. క్రి. (తోఁక+కొను.) వెనుకనుంచుకొను, వెంటఁబెట్టుకొను. "ఉ. తోఁకొని పోరె నంత నొకతొయ్యలి యయ్యెలనాగ నప్డు పేరాఁకలిగొన్నబెబ్బులి రయంబునఁ గృష్ణమృగార్భకంబుపై,పీఁకయులర్పఁ బెల్లదరి ప్రేయ గలెన్..." భో. 3, ఆ. ౨౯౯. ౪, ఆ. ౦౪.

తోఁగఁదోఁచు. దే. అ. క్రి. (తోఁగన్+తోఁచు.) ప్రత్యక్షమగు. "గీ. ఇత్తెఱంగున వలగొని యెదురనతని,మండలాభ్యంతరమునఁ గాంచి మఱియుఁ జేసె, నాలుగు ప్రదక్షిణంబు లీలఁ దోఁగఁ దోఁచెనో చక్రి యని నారదుఁడు నటింప." కళ. ౨, ఆ. ౫౬.

తోఁగిందు. దే. స. క్రి. (తోఁగు ధా. ప్రే.) ముంచు. "గీ. వెండియును నెత్త నామీఁద వెండికొండ, మించి నెలయేటినీటఁ దోఁగించఁ దొడఁగు,నపుడు పేరాభిషేకవ్రతార్థ మొదవు, పూర్ణకుంభంబు

పొల్పుఁ దెల్పుచుఁ జెలంగు" రామా. ౭, ఆ. ౧౭౦.

తోఁగు. దే. అ. క్రి. 1. మునుఁగు. "ఉ. రేఁగి చకోర దంపతులఁ ద్రెళ్ళినకల్మషపంక మిందులోఁ, దోఁగినఁగాని పాయ దని తోయజబాంధవుఁ డిట్లు చేసెనో, నాఁగ..." భో. ౨, ఆ ౯౮. "క. ఈగంగాదికతీర్థము,లీఁగం గా నీవు దగ సమిద్ధాంబుపులన్, దోఁగెదు వారల గనగన, గ్రాఁగెదు సంగార సింధుకల్లోలములన్." పాండు. ౧, ఆ. ౧౫౦; 2. తడియు. "గీ. . శోణితమునఁ దోఁగి యతఁడొప్పెఁ దలిరాకు నుఱఁగలింప, నెఱయునవ పారిజాతంబు తెఱఁగు దాల్చి." భార. భీష్మ. ౨, ఆ. ౪౩. "ఉ. ..తేనియసోనవానలన్, దోఁగుచు..." కళా. 3, ఆ. ౧౫; 3. స్రవించు. "గీ జాఱుసిక తోఁగుచెమట శ్రమమునఁ జూప." దశా. ౪, ఆ. ౪౭; 4. మిశ్రమగు. "క. ఊఁగెడుపల్లును విసమునఁ దోఁగినవంటకముఁ గుత్సితుం డగుమాత్రిన్, లోఁగక యున్మూలించిన, చోఁగలుగు నఖండ మైనసుఖ మెవ్వరికిన్. వేం. పంచ. ౧, ఆ. 3౪3; 5. నాను. "ఉ. అంతట నొక్కచెంబు కడు నగ్గలికం జని పందిపోటుమైఁ, జెంతనుఁ బోవఁ జూచుటయుఁ జిందఱఁ గొమ్ముల నెత్తఁ బంది నిం, తింతలు చెక్కలై కడఁ బయిం బడి నొంచెఁ బిడేచ దానిక్రొ, వ్వంతయుఁ గాఱి కాఱి యచటాఱక నేతను దోఁగునట్లుగన్." య. ౨, ఆ. ౯.

తోఁచిగాఁడు. దే. వి ఒకరకపుడేగ. "సీ. పాద దూఱు నొక మేఁటిపూరేటి వెలికిఁ బోఁ దోలి కైకొనె నొక్కతోఁచిగాఁడు." స్వా. ౪, ఆ. ౫౯.

తోఁచే, దే. వి. చండాలుఁడు, మాలవాఁడు. ఆం. భా. ద్వి. ౭౮౯.

తోఁచు. దే. అ. క్రి. (సానుస్వార మని చిన్నయసూరి, శ. ర. కాని, నిర్ధారకప్రయోగములు కానరావు.) 1. గోచరమగు. (నేత్రమునకు శ్రవణమునకు మనస్సునకుఁ గావచ్చును.) "క. అచ్చట నంతర్హితుఁడై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి యెల్లిటిజాఁడన్." భార విరా. ౫, ఆ. 3౦౧. ఆము. ౪, ఆ. ౧౧. నైష, ౭. ౫౯. భార. శాం. ౪, ఆ. ౧౪౦ 2. స్ఫురించు. "క. తోఁచినవగ రచియింపెదఁ, దోఁచనిచోఁ జిలువగట్టుదొరతోడై వ్యాఖ్యానకయై యానతీయఁగఁ, దోఁచ దసాధ్యంబు కవనధోరణిపట్లన్." ప్రబంధ. ౨౫. భార. భీష్మ. 3, ఆ. ౧౫౬; 3. పుట్టు. "క. మీతండ్రికి నేమృత్యువు, నై తోఁచినవాఁడ..." భార. ద్రో. ౫, ఆ. ౧౭౮; 4. కలుగు "సీ... తులసిదండకు వాడు దోఁపకుండ." హర. ౬, ఆ. ౪౫; 5. బయటపడు. "క. తులువా నీకులము గుణము తోఁచెం బ్రజకున్." భార. ద్రో. ౪, ఆ. ౭౮౯; 6. వచ్చు. "క.... వేసవి, కై పునడలఁ దోఁచెఁ గారుకాలము దళమై. పాండు. ౪, ఆ. ౧౯. స అ. క్రి. (తోఁగు ధా. ప్రే.) 1. ముంచు, స్నానముచేయించు. "సీ.... ప్రయాగాఖ్యంబునందు దేహంబు దోఁచి." కాశీ. 3, ఆ. ౮౯; 2. తడుపు. "చ. వనరుహమిత్రబింబ మను వర్తులలాక్షికపట్టికం బయోధినడుమఁ దోఁచి..." పారి. ౨, ౪3; 3. మిశ్రముచేయు. "చ. ద్రవ మయి యున్నక్రొత్తవారి తాళమన శ్శిలలం గరంగి పల్లవమునఁ దోఁచి మేనక యలంకరణం బొనరించె గౌరికిన్." హర. ౪, ఆ. ౦౪.

తోఁట. దే. వి. 1. ఉపవనము. "గీ. నాఁటె మందార తరువులు తోఁటలందు." భీమ. ౫, ఆ. ౦౭; 2. గృహారామము. ఆం. భా. ద్వి. 3౪; 3. తపోవనము. "గీ... ఒక్కతలిసి, తోఁట, గాంచి..." య. ౨, ఆ. ౫౦; 4 ఉద్యానవనము. "గీ. తోఁటఁ బగ లుండి మల్లెలు దుఱిమి .." ఆము. ౨, ఆ. ౭౦.

తోఁటకాఁపు. దే. వి. (తోఁట+కాఁపు) తోటమాలి, తోఁటకాపాడువాఁడు (శ ర. వా)

తోఁటకూర. ద్వ. వి. (తోఁట+కూర.) మారిషము, ఒకజాతికూరాకు, (దీనిభేదములు ఎఱ్ఱతోఁటకూర, పెరుఁగుతోఁటకూర, చిలుకతోఁటకూర, కొయ్యతోఁటకూర మొ.) "మత్తకోకిల ..కట తోఁటకూరకుఁ జంద్రహాసముఁ దెత్తురే." విన. శకుం. 3, ఆ. 3.

తోఁటపోఁక. ద్వ. వి. (తోఁట+పోఁక.) భూపూగము, ఒకజాతిపోఁక. ✤ (శ. ర.)

తోఁటమాలి = తోఁటకాఁపు. (వా.)

తోఁటమాలె = తోమాలె. (శ. ర.)

తోఁటమొల్ల. ద్వ. వి. (తోఁట+మొల్ల.) కుందము ❦ (శ. ర.)

తోఁటవాఁడు = తోఁటమాలి. "ఆ. కోరి తోఁట వాఁడు కుసుమఫలంబులు,కోయునట్లు..." భార. శాం. ౨, ఆ. ౩౦౦.

తోఁటా. హిం. వి. ఒకవిధ మగుమందుగుండుసామాను. ('తూటా' అని వాడుక.)

తోఁటి = తోఁచ. (చండాలుఁడు.) "క. నాఁటి కయిదేండ్లవాఁడన,మాట విని కృశంబుఁ దలఁచి మానసమున న,త్తోఁటులమీఁదను బందులు,గీఁటి కొనుచు దుష్టబుద్ధి కృత్రిమబుద్ధిన్." జై. ౮, ఆ. ౬౧. ఆం భా. ద్వి. ౨౪౯.

తోఁటీఁడు = తోఁటవాఁడు. (శ. ర. శ్రా.)

తోఁడు. దే. స. క్రి. 1. నీళ్లు మొ. చేఁద మొ. తో పైకితీయు. (వా.); 2. పెఱుకు. "గీ. వాఁడి గోర్గొండిఁ గన్నులు దోఁడియైన." భీమ. ౬, ఆ. ౯౯. కకు. ౭, ఆ, ౧౨౩; 3. బలాత్కారముగా నపహరించు. వ్యవ:...వానివద్దఱ నున్నసొమ్మంతయు తోఁడివేసినారు; 4. నూలుపోగు తీసి చుట్టు. "గీ. నూలు తోఁడును పేడ్క నవ్వాలుఁ గంటి." హంస ౫, ఆ. ౨౨.

తోఁడుఁబోతు. దే. వి. (తోఁడు+పోతు.) పంపు చేయుట,కార్మాణము. (శ. ర.) విణ. పంపుచేయు వాఁడు,కార్మాణశీలుఁడు. "చ. కలువలవిందు కెన్నడిమికందు నెపంబున నేఁడు బూఁదిలోఁ, గలయుఁమనోజు మేనియొముకలలో గలితువ్వరపేర నీచేతన్,గిలుబుచుఁ దోఁడుఁబోతుగతి గిట్టన వానిఁ బిసాసిఁ జేసిబా,లలపయిఁ బాపుపెట్టి పెతలం బఱపం దగునా సమీరణా." చంద్రా. ౭,ఆ ౧౦౪.

తోఁడుకొను. దే. అ. క్రి. (తోఁడు+కొను.) చుట్టుకొను,బాధనందు. వ్యవ:-నరములు తోఁడుకొని పోవుచున్నవి.

తోఁడుడు. దే. వి. (తోఁడు. ధా.) తోఁడుట,నూలు తీసి చుట్టుట. ఆం. భా. ద్వి. ౨౯౯.

తోఁడెలు = తోఁడేలు. "క....తోఁ,డెలు మొదలగువానిఁ గొన్నిటిని వేఁట కరుల్." స్వా. ౪, ఆ. ౭౦.

తోఁడేలు. దే. వి. అడవికుక్క,వృకము. "క. ఇవి తోఁడేళులభంగిన్,గవియుఁ బురుషు..." భార. శాం. ౩, ఆ. ౪౨౩.

తోఁప. దే. వి. చిక్కఁగాఁ గాఁచినయంబలి,సంకటి. ఆం. భా. ద్వి. ౨౭౬.

తోఁపించు. దే. స. క్రి. (తోఁచు ధా. ప్రే.) కను పఱచు. "మ...అర్థశ్రేణి దోఁపించు పెం,పలరన్ ..." వల్ల. నీతి. ౩౬.

తోఁపిక. దే. వి. (తోఁచు. ధా.) తోఁచుట. (శ. ర.)

తోఁపు దే. వి. 1. ప్రమదవనము.ఉద్యానము. "సీ. .. తోఁపు,నాఁగను బ్రమదవనాభిధ .." ఆం. భా. ద్వి. ౩౪; 2. తోఁట,వృక్షపంక్తి. "ఉ. మామిడితోఁపునం దనరుమల్లిని .." చం. రా. ౨, ఆ. ౩౩. అచ్చ, బాల. ౧౯౯; 3. ఎఱుపు రంగు. "సీ. ధ్వాంతజాలము మీఁద దండెత్తుభాను మంతుని వెలిగొల్లెనతోఁ పనంగ." ప్రభా. ౭, ఆ. ౯౯; 4. ఎఱ్ఱబట్ట. "సీ. అరుణవస్త్రంబు తోఁపనఁ దోఁచుచుండు .." ఆం. భా. ద్వి. ౧౭౪; 5. నల్లతుమ్మచెక్క. ఆం. భా. తృ. ౭౭; 6. బూరె. మొ. వానిపూఁతపిండి. (శ. ర. వా.); 7. (తోఁచు ధా.) కానఁబడుట. "క. తనతోఁపు భవనిరాసం,బునకుం గారణము..." భార. ఆను. ౧, ఆ, ౩౧౨; 8. జన్మము. "క. అనఘ యను యనులోమమునఁ దోఁ,పును బ్రతిలోమమున లయము వొందుటయుఁ గ,ల్గును..." భార. ఆను. ౪, ఆ. ౧౮౪; 9. సంకల్పము. "సీ... తోఁచుతోఁపుల నెల్లఁ దోడ్తో నడంచి..." భార, అశ్వ. ౧, ఆ. ౨౦౨. విణ. ఎఱ్ఱనిది "సీ. క్రొత్త డంబుల కెంపు క్రొత్తడంబులరంగు నింగికిఁ దోఁపు వన్నియలు నింప." య. ౧, ఆ. ౩. రసిక. ౪, ఆ. ౯౪.

తోఁబుట్టినవాఁడు. దే. వి. (తోన్+పుట్టిన+వాఁడు.) సోదరుఁడు. భార. ఆది. ౬, ఆ. ౧౯౭. ఇట్లే:- తోడఁబుట్టినవాఁడు. మొ.

తోఁబుట్టు. దే. వి. (తోన్+పుట్టు.) సోదరుఁడు; సోదరి. అచ్చ. బాల. ౭. స్వా. ౨, ఆ. ౪౩. ఇట్లే: తోఁబుట్టుగు, తోఁబుట్టువు, తోడఁబుట్టినది, తోడఁబుట్టువు. మొ. విణ. సాటియైనది,సదృశము. "వ .. చుక్కలచక్కఁదనంబునకుఁ దోఁబుట్టైన హాయలపనాపాణిపల్లవితీక్ష్ణంబు లైనపచ్చకప్పురంబుపలుకులును..." భీమ. ౭, ఆ. ౧౨౦. ఇట్లే: తోడఁబుట్టువు. "ఉ... వడి వైచెఁ దీప్రని,ర్ఘా

తముతోడఁబుట్టు వనఁగాఁ దగురుజ్జ్వలశక్తి దైత్యువైవెన్." భార. ఆర. ౫, ౨౮౩.

తోకము. సం. వి. అ. న. అపత్యము, బిడ్డ.

తోకొను. దే. అ. క్రి. (తోడు+కొను.) తోడ్కొను, వెంటఁబెట్టుకొను. "క. నాకారణమున బుద్ధిన్ జుట్టిఁ, డేకాంతమ నరకగతికి నేఁగెను నానిం, దోకొని పోయెద నని శుభ, లోకంబున కరిగెఁ ద్రిదశ లోకస్తుతుఁడై." భార. ఆర. 3, ఆ. ౨౯౦. నిర్వ. ౭, ఆ. ౧౪.

తోక్మము. సం. వి. అ. పుం. 1. క్రొత్తమొలక; 2. పచ్చనిరంగు. న. 1. కలిమి; 2. మేఘము. విశే. (అ. ఆ. అ.) పచ్చనిది. [3, ఆ. ౧౪౬.

తోచిదులు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. హంస.

తోటి. దే.వి. (తోడి యనుదాని యపభ్రంశరూపము?) 1. వినోదము, వేడుక. "ఉ...తోటికిఁ జూచు వార లిది దుర్వ్యసనం బన నమ్మవచ్చునే." ద్వా. ౧౦, ఆ. ౧౦౧; 2. (త. తోట్టి.) చండాలుఁడు, మాల. "క. నాఁటికయిదేండ్లవాఁ డను,మాట విని కృతంబుదలఁచి మానసమున న,తోట్టులమీఁదను బండులు, గీఁటుకొనుచు దుష్టబుద్ధి కృత్రిమ బుద్ధిన్." జై. భా. ౮, ఆ. ౬౧. అం. భా. ద్వి. ౨౮౯.

తోడ. దే. ప్ర. ద్రు. తృతీయావిభక్తిప్రత్యయము. "వ...అర్జునుచేత సుప్రతీకగజంబుతోడన భగదత్తుచావును..." భార. ఆది. ౧, ఆ. ౪౬. (ఇది యపాదానపంచమ్యర్థమునను, అలుక్సమాసమున 'ఇ' వర్ణాంతముగను, సహ శీఘ్రముగా మొదలగునర్థములలోను బ్రయోగింపఁబడును. దీనికి 'తోన' యనురూపముఁ గొందఱు ప్రయోగించియున్నారు.) "సీ. ప్రావృడ్ఘననితోడఁ బాసిన బిడ్డలై..." కవిక. ౨, ఆ. ౬౦. (అపాదానపంచమి.) "క. గురుశరపక్షములతోడికులగిరివోలెన్." భార. ఆది. ౨, ఆ. ౪౨. (అలుక్సమాసమున 'ఇ' వర్ణాగమము.) "గీ. స్తంభగతరత్నపుత్త్రిక దనముబోటి,యని విలోకించి తోడ మాటాడ కునికి." రామా. ౪, ఆ. ౧౫౦. "ఉ. నిను నమ్మి యుండినఫలం బిది తోడన దక్కె..." పారి. ౧, ఆ. ౧౨౫. "శా. తోనం దిమ్మయవీర రాఘవముఖుల్ తోఁబుట్టులై..." దశా. ౧, ఆ. ౫౫.

తోడంటు. దే. వి. (తోడు+అంటు.) చేమిరి,తోడు కొనుటకై కాచి చల్లార్చినపాలలోఁ గలుపుమజ్జిగ. "క. తగఁ దోడంటునఁ బా లిం,పుగఁ బెరుఁగయి నది యభోజ్యం బగునే." ద్వా. ౧, ఆ. ౨౬. శుక. ౧, ఆ. ౧౪౯. [3. బాధించుట.

తోదనము. సం. వి. అ. న. 1. విఱుచుట; 2. చీల్చుట;

తోడా. దే. వి. 1. హస్తభూషావిశేషము. (శ. ర.) 2. బిరుదచిహ్నమగు నాభరణవిశేషము. (వా.)

తోడి. దే. వి. 1. ఒకానొకనపుంసకరాగము. "సీ... తోడి వరాళి .."హంస. ౫, ఆ. ౧౨౪; 2. సోదరుఁడు. "చ. అనిమిషనాథుతోడి యని యప్పుడు గంటి ననంతు నాద్యు .."భార. శాం. ౫, ఆ. ౪౦౫. (అనిమిషనాథుతోడి = ఉపేంద్రుఁడు.) విశే. తోడన్ అనుదానివృత్తియందలి రూపము. ఉదా:—తోడికోడలు, తోడియల్లుఁడు, తోడివాఁడు మొ.

తోడిక. దే. విశే. (తోఁడు+ఇక స్వార్థమున.) జంట యైనది. "సీ. హేమకుంభసభూతి యెమ్మెడించిన రీతిఁ దోడిక నవ చన్నుదోయితోడ." ఉద్భ. ౨, ఆ. ౧౭౪. (తోడికె అపముద్రి.)

తోడికోడలు. దే. వి. (తోడన్+కోడలు.) యాత, మగనితోఁ బుట్టినవానిభార్య. నైష. ౭, ఆ. ౯.

తోడిచూలు. దే. వి. (తోడన్+చూలు.) తోడఁబుట్టువు. "క. అకసముతోడిచూలన .."భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౯౨.

తోడిజోడు. దే. విశే. (తోడన్+జోడు.) సమానుఁడు, సాటివాఁడు. "గీ. అతనిపుత్త్రుఁడు గుణనిధి యనెడువాఁడు, దర్పకునితోడి జోడు సౌందర్యరేఖ." కాశీ. ౪, ఆ. ౭౯. ౫, ఆ. ౧౬౫.

తోడితెచ్చు. దే. స. క్రి. (తోడన్+తెచ్చు.) 1. తీసికొనివచ్చు. "క. రామాజ్ఞ లేకయే నను, దీమసమున నిందుఁ దోడితెచ్చితో..."ఉ. రా. ౬, ఆ. ౨౬౨; 2. బంధించి కొనివచ్చు. "ఆ. కన్ను మిడఁగ రాత్రి కన్నచోఁ ద్రుచ్చులఁ, దోడి తెచ్చి కేలు ద్రుంచివైచి, వాఁడికొఱులఁ దిగిచి వారిఁ జంపుట రాజధర్మ మనుచు నూత్నదండి చెప్పె." విజ్ఞా. ప్రా. ౯౯.

తోడితెప్పించు. దే. స. క్రి. (తోడితెచ్చు. ధా. ప్రే.) రప్పించు. "ఆ. దేవ యతనిఁ దోడి తెప్పింపు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౯౬.

తోడిది. దే. విశే. (తోడన్+అది.) 1. సాటిది. "క...న,న్నెయబలలతోడిదిగాఁ, జేఁకుఁ దలంచి తివి తప్పు చేసితి గంటే." భార. విరా. ౨, ఆ. ౩౩౮; 2. విడువకుండునది. "గీ. వానితోడిద లోకమై యేను బోవ,నైతి..." భార. ద్రో. ౨, ఆ. ౧౪౩; 3. అనుసరించునది. "చ. ఘనభుజ యెల్లచందములుఁ గాలముతోడిద..." భార. శాం. ౫ ఆ. ౩౯౫; 4. సంబంధమైనది. (జోలి, ప్రసక్తి అని సూ. ని.) "వ...వీరితోడి దేమి..." భార. ఆది. ౬, ఆ. ౧౯౫. ౩, ఆ. ౧౪౮.

తోడిదొంగ. దే. వి. (తోడన్+దొంగ.) ఒక దొంగతో నుండుమఱియొకదొంగ. "క...నా తోడిదొంగలై తిరి మీరున్." ప్రభా. ౫, ఆ.౮౧.

తోడినీడ. దే. వి. (తోడన్+నీడ.) అనుసరించునీడ. అనుయాయి. "వ...అద్దేవునితోడినీడయుం బోని నరనామధేయుం డగుమహాపురుషుని..." భార. భీష్మ. ౨, ఆ. ౭౬౨. విశే. 1. విడువనిది. "సీ. నెఱి లేక నీతోడినీడయై కెడఁగూడి పరఁగినన న్నింత యెరవు చేసి." కు. సం. ౫, ఆ. ౧౨౩; 2. సహాయమైనది. ఇట్లే: తోడునీడ.

తోడిపొత్తు. దే. విశే. (తోడన్+పొత్తు.) సహవాసము, మైత్రి. "సీ. అంత దేవాహితులు... అమర్త్యులతోడిపొ త్తింతియ చాలు నింకేల యనుచు." భార. ఆది. ౨, ఆ. ౨౧.

తోడియల్లుఁడు. దే. వి. (తోడన్+అల్లుఁడు.) షడ్డకుఁడు, జగిలెడు. ఆం. శే. ౪౭.

తోడివాఁడు. దే. విశే. (తోడన్+వాఁడు.) 1. సాటివాఁడు సమానుఁడు. "గీ. తోడివారలు నవ్వ..." పాండు. ౩, ఆ. ౩౬; 2. తోడ నున్నవాఁడు. "క...తోడివారి వీక్షించి..." నైష. ౩,ఆ. ౬౭.

తోడు. దే. వి. ఔ. 1. సాహాయ్యము. "క. ఆతఁడివి యేటిమాటలు, నీతో డగు టొల్లఁ బొమ్మనిన..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౪౦; 2. సోదరుఁడు. "గీ. తోడివారలు నవ్వ నాతోడ..." పాండు. ౩. ఆ. ౩౬; 3. సోదరి; 4. అన,ఒట్టు. "క. నీతోడు నీసమానులు, భూతావలిలోన నెందుఁ బుట్టరు..." హరి. ఉ. ౮, ఆ. ౪౯. భాగ. ౧౦, స్కం. పూ. ౭౭౪; 5. చేమిరి, తోడంటు. ఆం. భా. ద్వి. ౨౪౯. స. శ. ౪౪. విశే. 1. సహాయము. "సీ...దైవంబు తో డయ్యె..." భార. భీష్మ. ౧, ఆ. ౬౦. భార. ఉద్యో. ౪, ఆ. ౨౫౮; 2. సహాయుఁడు. "ఉ...నారాయణభట్టు...తో డయి నిర్వహింపఁగన్." భార. ఆది. ౧, ఆ. ౨౫; 3. సహాయురాలు. "క. నా తోడులార మీపతి, మీతోడే పనులయెడల మేలే యనుడున్, నాతోడిదె నాతోడిదె తాతా మే లనుచు ననిరి తరుణులు వరుసన్." భాగ. ౯, స్కం. ౧౮౪.

తోడుఁబాలు. ద్వ. వి. (తోడు+పాలు.) 1. పాలు పితుకుటకుముందు పాత్రలో నుంచుకొంచెమునీరు. (శ. ర. వా. శూన్యపాత్రలో పాలు పితుకరు.); 2. పాలకుతోడు. (బ్రౌ.)

తోడుకొను. దే. అ. క్రి. (తోడు+కొను.) తోడు పెట్టిన పాలు గడ్డకట్టి పెరుగగు. (శ. ర. బ్రౌ. వా.) స. క్రి. (తోడు+కొను.) వెంటఁబెట్టుకొను. "గీ...తనయుచు దోడుకొనుచు వైష్ణవపరిషత్తు గొలువ నరిగి." ఆము. ౬, ఆ. ౯౩.

తోడుచల్ల. దే. వి. (తోడు+చల్ల.) పాలు తోడుకొనుటకై కలుపుమజ్జిగ. (శ. ర. వా.)

తోడుత. దే. ప్ర. ద్రు. తోడ. "ఉ...బౌద్ధక్యము తోడుతన్ సమరధర్మము పీసర పుచ్చి..." జై. ౧, ఆ. ౫౬. క్రి. విశే. ద్రు. వెంటనే. "శా... అత్తోడుతన్, ...రాంచత్సదులై తనర్చి..." చంద్రా. ౪, ఆ. ౧౭౧.

తోడుతో. దే. క్రి. విశే. ద్రు. వెంటనే. "గీ. వ్రాసె నొక్కలతాంగి క్రొవ్వాఁడిగోర, వర్ణములు తోడుతో మషీవర్ణములుగఁ,బసిఁడిగేదంగిఱేకునఁ బ్రస్ఫుటముగ, మదనలేఖంబు నర్మమర్మంబు మెఱయ." నైష. ౩, ఆ. ౯౯. భార. భీష్మ. ౩, ఆ. ౧౦౩.

తోడుతోడ. దే. క్రి. విశే. ద్రు. (తోడన్+తోడన్.) 1. వెనువెంట. "గీ. అన్నరుఁడు దోడుతోడ నైదాఱునిశిత,కాండములఁ ద్రుంచి పటుసాయకత్రయంబు, సొనిపె..." భార. శల్య. ౧, ఆ. ౨౧౨; 2. క్రమక్రమముగా. "క. ఈమెయి నిజజనకభుజో,ద్దామబలము దోడుతోడఁ దఱుఁగుటయుం రథ,స్తోమంబుఁ దాను నశ్వత్థామ వెసం దాఁకెఁ బాండుతనయునితోడన్." భార. విరా. ౫, ఆ. ౧౩౮.

తోడుతోడుత. దే. క్రి. విశే. ద్రు. (తోడుతన్+తోడుతన్.) వెనువెంట. "గీ... నీన, తోడుతోడుతఁ

బొంగారి చూడ నొప్పె." భార. భీష్మ. ౨, ఆ. ౧౧౭.

తోడుదొంగ = తోడిదొంగ. రాధా. ౧, ఆ. ౯౪.

తోడుదోన. దే. విణ. (తోడు+దోన.) బాసట, సహాయము. "క. తోడుదోన లేనియప్పటి, క్రీడి కొలఁది యట్టిది..."భార. ఉద్యో. 3, ఆ. ౪౫౧.

తోడునీడ = తోడినీడ. వి. (కూడనుండుఛాయ; అను యాయి.) "వ...అతనితోడునీడలుం బోని తన పుత్త్రులం దలంచి..."భార. ఉద్యో. 3, ఆ. ౧౦౨. విణ. 1. (కూడనుండునది.) "క. నీవెంటఁ దోడునీడై, నే వచ్చెద..."వి. పు. ౬, ఆ. 3౨; 2. (రక్షకుఁడు) "క...వనితలకుం దోడునీడ వల్ల భుఁడెకదా." రామా. ౫, ఆ. 3౫; 3. (సాటి యైనది.) "సీ... ధూమకేతువులకుఁ దోడునీడ్ల. గీ. లు..."శివరా. ౪, ఆ. ౧౪.

తోడుపడు. ద్వ. అ. క్రి. (తోడు+పడు.) సాయపడు. "గీ. భీష్మునకుఁ దోడుపడువారి బెట్టు దాఁక. భార. భీష్మ. ౨, ఆ. 3౭.

తోడుపాటు. ద్వ. వి. (తోడుపడు. ధా.) 1. తోడగుట. "చ. నృపతులు సొచ్చి పోరు నెడ నెయ్యురు బంధులుఁ దోడుపాటు నీ,చపుఁబనియే..."భార. ద్రో. ౪, ఆ. ౨౭౦; 2. అండ, "క...కృపుడు, ద్భాసితవిక్రమముతోడుపాటు గలుగఁగన్."భార. శల్య. ౧, ఆ. ౨౫౦.

తోడుపెట్టు. దే. స. క్రి. (తోడు+పెట్టు.) 1. తోడుగాఁ జేయు. (చూ. తోడువెట్టు.) 2. చేమిరిపెట్టు. (వా.)

తోడువచ్చు. దే. అ. క్రి. (తోడు+వచ్చు.) సాయమగు. "గీ. అట్టివీరుండు దోడు రా..."ఉ. హరి. ౪, ఆ. ౨౨౦.

తోడువడు = తోడుపడు "ఆ...కౌరవపతి ద్రిగర్తునిబలంబుఁ బనిచెఁ దోడువడఁగ." భార. ద్రో. ౪, ఆ. ౧౦౬.

తోడువెట్టు = తోడుపెట్టు. (తోడుగాఁజేయు.) "వ...ఇద్దఱు శిష్యులం దోడువెట్టి..." పిన. శకుం. ౫, ఆ. ౭3.

తోడుపోవు. దే. అ. క్రి. (తోడు+పోవు.) 1. సాయమగు. "వ...నే నాశకంబునకుఁ దోడుపోయిన వాఁడ..."వేం. పంచ. ౧, ఆ. ౪౭౧. 2. సాటియగు. "ఉ. రాతికిఁ దోడుపోయినది రాసుతు డెందము..."సా. ౨, ఆ. ౦౭.

తోడుసూపు. దే. అ. క్రి. (తోడు+చూపు.) 1. సాయమగు. "క...ద్రుపదుఁడు,గడు వేఁడుకఁ దోడుసూపెఁ గౌంతేయులకున్." భార. ఉద్యో. ౧, ఆ. ౨౨౧. స. క్రి. ప్రసరింపఁజేయు. "శా. ...అదిత్యుం డిటఁ దోడుసూపు...మయూఖౌఘమున్." నైష. ౧, ఆ. ౧౦.

తోడెము. దే. విణ. అల్పము. "సీ. సైకంబు కొంచెము సన్నంబు తోడెము...గీ...అనఁగను గొఱలు నల్పము..." అం. భా. తృ. ౧౬. (వి. 'కొంచెము' అని శ. ర. బ్రా.)

తోడ్కొను = తోడుకొను. (వెంటఁగొను.) "మ... అక్కన్యఁ దోడ్కొని తెచ్చెన్." భార. ఆది. ౪, ఆ. ౧౯౧.

తోడ్త = తోడుత. చంద్రి. ౧, ఆ. ౧౦౪.

తోడ్తో = తోడుతో. 1. (శీఘ్రముగా.) "మ... తోడ్తో నారయక బంచినన్." ఉ. రా. 3, ఆ. ౨౯౦; 2. (క్రమముగా.) "సీ. వరుణుఁ డాదిగఁ గలవసువులు దోడ్తోన పుట్టుచు నున్న ..." భార. ఆది. ౪, ఆ. ౧౫౧.

తోడ్తోడ = తోడుతోడ. (శీఘ్రముగా.)"సీ. తోడ్తోడ నెత్తావిఁ దొరయుఁపుప్పొడి రేఁచి కమ్మఁదేనియ సోన గడలుకొలిపె." కృ. శకుం. ౧, ఆ. ౭౧.

తోడ్పడు = తోడుపడు. (సాయమగు.) "క... అనికి నివి తోడ్పడునే."భార. ద్రో. ౫, ఆ. ౧౦౧.

తోడ్పాటు = తోడుపాటు. (సాయము.) "గీ. నీకు నాలావు తోడ్పాటు లేక యుండ,వలయు..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౦౯.

తోతెంచు. దే. అ. క్రి. (తోఁచు+ఎంచు. స్వార్థమున.) 1. కనఁబడు. "క. కేతనకవిభయదంబై, తోతేరఁగ......" భార. కర్ణ. 3, ఆ. ౭౪; 2. క్రమ్ము. "మ...సంతతో,ద్ధుతసంవర్తవలాహకంబులు వెసగ్ దోతెంచు దిక్ప్రీతులన్." భార. అర. ౪, ఆ. ౨౪౬; 3. పుట్టు. "క. ఈ తెరువునఁ జరియించుచు,నే తెఱఁగున నైనఁ దప్పె నేనియుఁ బురుషుం,డాతతనాకసుఖముగఁ గనుఁ,దోతెంచు ను మగఁడ సద్బుధులవంశమునన్." భార. శాం. ౫, ఆ. ౨౨౭; 4. వినఁబడు. "క. చూడ మది యేమి క్రొత్తయొ,తో తా మింట యువతిసమితి

కోలాహలముల్, త్రోతెంచె నంచు భూపతి, చూత లతాగృహము వెడలి చూడం జూడన్." రాజ. చ. ౨, ఆ. ౧౯౪; 5. వచ్చు. "క. అతనిఁ గనుఁగొని భయపడి, త్రోతెంచితి మనుడు..." సాంబో. 3, ఆ. ౯౯; 6. ప్రత్యక్షమగు. "మ. మతి వైవస్వతుచేఁ దలంపఁబడి యమ్మార్త్యాంబు త్రోతెంచె..." భార. అర. ౪, ఆ. 33౭. స. క్రి. (త్రోడు+తెంచు.) 1. తీసికొనివచ్చు. "సీ. అటు గాన నను గోరినట్టిచక్కనిచిన్నవానిఁ దోతెంచి నావాంఛఁ దీర్పు." శుక. ౨, ఆ. ౫౦; 2. తీసికొనివెళ్లు. "గీ... వాగ్భవ యాపుడు, మఱియు నొకమానవేంద్రు సమక్షమునకు, నిందు బింబాస్యఁ దోతెంచి యిట్టు లనియె." నైష. ౫, ఆ. ౧౦౧.

త్రోతెచ్చు. దే. స. క్రి. (త్రోడు+తెచ్చు.) తీసికొని వచ్చు. "క. కాంత్రోదరి నీమాత్రం జూతచు రప్పింపు మనుడు సుదతియుఁ బుత్త్రిన్, దోతెచ్చి యంకపీఠికఁ, జేత్రోమోదమున నిల్ప చెన్నలరారన్." ఉద్భ. ౭, ఆ. ౨౧౬.

త్రోత్రము. సం. వి. అ. న. 1. ఏనుఁగులఁ బొడిచెడి బరిగోల; 2. పసులను దోలుములుకోల.

తోదనము. సం. వి. అ. న. 1. నొప్పించుట; 2. నొప్పి; 3. పసులను దోలుములుకోల. విణ. 1. (అ.ఆ.అ.) నొప్పించునది; 2. (అ. ఈ. అ.) నొప్పింప సాధన మైనది.

త్రోదు. దే. వి. వరుసకట్టు. (శ. ర. బ్రా.)

త్రోదోపాడు. దే. స. క్రి. (త్రోదోపు+ఆడు.) 1. చొచ్చు. "మ. కనఁగాఁ జిత్రము గాఁగఁ జేసు రణరంగక్షోణియం దున్నశత్రునృపాలావళి యర్కమండలముఁ దోదోపాడుచున్ దాఁటి... ..." రామ. ౪౨౩; 2. పరస్పరము త్రోసికొను. (చూ. త్రోదోపులాడు.)

త్రోదోపు. దే. వి. (త్రోపు+త్రోపు.) మిక్కిలి త్రోయుట. "ఉ. అపగిదిన్ ఘటించి యమరాసుర సైన్యము లంత నెంతయున్ ఘోషము లగ్గలింప నెలగోల్జగడంబునఁ జేరి చేరి త్రోదోపుల మీఱి ..." శశాం. ౫ ఆ. ౧౯.

త్రోదోపులాడు = త్రోదోపాడు. (చొచ్చు, ప్రవేశించు.) "క. అపొలఁతితలఁపు వలపున, డాపక త్రోదోపులాడుటయు తరితీపుం, జూపుల కోపుల నేపుల, వైపుల మైపులక లెసఁగె భావము గరఁగన్." శశాం. ౨, ఆ. ౭౭; 2. (పరస్పరము త్రోసికొను.) "ద్వి. త్రోదోపులాడుచుఁ దొలఁగక యంత." ద్వి. పరమ. 3, ఆ. ౧౬౬, పు.

త్రోనికాఁడు. దే. వి. మగడేగ. (త్రోనిగాడు శ్యేన విశేష మని శ. ర.) ఆం. భా. ద్వి. ౯౦.

త్రోపాటు. దే. క్రి. విణ. త్రోడ, సహా. (అవ్య 'వలె' అని శ. ర.) "సీ. తనపుత్త్రుత్రోపాటు చనుబాలొసంగుచుఁ గూరిమిత్రోఁ బెంచెఁ గొన్నినాళ్లు, గీ. ఆత్మసుతుఁ డంచుఁ బరసుతుఁ డంచు మదిని, భేద మింతయు లేక సమ్మోదమునను, బ్రేమ నిరుపుర నొకరీతిఁ బెంపుచుండె, నాఁ యాయమసాటి యెందైనఁ గలదె." బ్రహ్మో. ౨, ఆ. ౭౯౦. వి. (త్రోడు+పాటు.) సాయము.

త్రోపారము. దే. వి. డేగకనుమఱువు. ఆ. భా. ద్వి. ౯౦.

త్రోపి. దే. వి. టోపి, కుళ్లాయి. (శ. ర. బ్రా.)

త్రోపు. దే. వి. త్రోపు. (చూ. త్రోదోపు.)

తోమకము. దే. వి. (తోము. ధా.) తోముట. "వ. పిడుకగొఱపంబు తోమకంబునఁ బుటపుటనై ..." ఆము. ౪, ఆ. 3౫.

తోమరము. సం. వి. అ. పుం. న. 1. చల్లకోల; 2. ఇనుపగుదియ; 3. వృత్తవిశేషము.

తోమాలిక. ద్వ. వి. (తోఁట+మాలిక.) తోమాలియ. "గీ. రంగవిభునకు విప్రనారాయణుండు, చేయుఁ తోమాలికలకుఁ జాంపేయకములు, వేసవి యొసంగె." ... వైజ. ౨, ఆ. ౧౪౧.

తోమాలియ. ద్వ. వి. (తోఁట+మాలియ.) వనమాల, ఆకులు పువ్వులు కూర్చి కట్టినదండ. "సీ. వైచుఁ దోమాలియ పై జయంతీ కాంతి వలయితవక్షఃకవాటునకును." పాండు. ౨, ఆ. ౨౦.

తోమాలె = తోమాలిక. 1. (వనమాల.) "సీ. బాహు మధ్యంబునఁ బవడంపుఁజిప్పులఁ బచ్చలతోమాలె యచ్చుపఱిచి." నైష. ౭, ఆ. ౧౧౨; 2. (మాలిక.) ఆం. భా. ద్వి. ౧౬౩.

తోము. దే. అ. క్రి. మఱికి పోవ రుద్దు. "సీ. నిగనిగఁగాఁ దోమి నిండుబోనముదొంతి భోజనశాల లోఁ బొసఁగఁ జేర్చి." హర. ౨, ఆ. ౧౨౨.

తోముడు. దే. వి. (తోము. ధా.) తోముట. ఆం. భా. ద్వి. ౧౬౦.

తోయకామము. సం. వి. అ. పుం. నీటిప్రబ్బ చె. విణ. (అ. ఆ. అ.) దప్పి గొన్నది;నీరు కోరునది.

తోయకంభము. సం. వి. అ. పుం. నాచు చె.

తోయగర్భము. సం. వి. అ. పుం. కొబ్బెర చె. విశే. (అ. ఆ. అ.) లోపల నీరు గలది.

తోయగాఁడు. దే. విణ. (తోయము+కాఁడు.)- విధము గలవాఁడు-ప్రవర్తకుఁడు. "క. పలుతో యంబులజగములఁ బలుతోయములందు ముంచి భాసిల్లెడియా,పలుతోయగాఁడు వల్లవ,లలనాకర తోయములఁ జెలంగుచుఁ దడిసెంన్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౯౫.

తోయజము. సం. వి. అ. న. పద్మము.

తోయదము. సం. వి. అ. న. నెయ్యి. పుం. మబ్బు. విణ. (అ. ఆ. అ.) జలము నిచ్చునది.

తోయధరము. సం. వి. అ. పుం. మబ్బు. విణ. (అ. ఆ. అ.) నీటిని ధరించునది. [తోయనిధి మొ.

తోయధి. సం. వి. ఇ. పుం. సముద్రము. ఇట్లే:

తోయధిప్రియము. సం. వి. అ. న. లవంగము చె.

తోయపిప్పలి. సం. వి. ఉ. స్త్రీ.నీటిపిప్పలి,లాంగలిచె

తోయపుష్పి. సం. వి. ఉ. స్త్రీ. కలిగొట్టు చె.

తోయము. ఉభ. దే. వి. 1. విధము. "క. పలుతో యంబుల జగములఁ,బలుతోయములందు ముంచి భాసిల్లెడియా,పలుతోయగాఁడు..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౯౫; 2. పర్యాయము. "వ.... రెండవమాఱు జగజ్జనంబుకొఱకు రసాతలగత యయినభూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహ దేహంబు దాల్చె మూఁడవతోయంబున నారదుం డనుదేవర్షియై కర్మనిర్మోచకం బైనవైష్ణవ తంత్రంబు సెప్పె నాలవపరి..." భాగ. ౧ స్కం. ౬౩; 3. పక్షము. "క. చెలరేఁగి రెండు తోయం,బుల పేరంటాండ్రు చిత్రముల నెంతయు వేడ్కలు మీఱఁ జల్లులాడిరి..." కళా. ౭, ఆ. ౭౦; 4. తటి. "క. తోయములు దెమ్ము మా కే, తోయము వేఁటాడ తెరవు దొరకదు..." భాగ. ౧, స్కం. ౪౯౯; 5. పరిజనము. "క.. దప్పి జనించెను,దోయ మువారలును లేరు .." భాగ. ౧, స్కం. ౪౯౯. విణ. ఏకకంఠ్యము,ఒక్కకం ఠము గలది. "దండకము...రుద్రుండు విశ్వాధి కుల డంచు నామ్నాయసంఘాత మామ్రేడిత ప్రక్రియన్ దోయమై యాతనిం జెప్ప..."

కాశీ. ౭, ఆ. ౭౩. సం. వి. అ. న. 1. ఉదకము, నీరు; 2. పూర్వాషాఢ.

తోయముక్కు. సం. = తోయముచము.

తోయముచము. సం. వి. చ్. పుం. నీరు.

తోయరాశి. సం. వి. ఇ. పుం. సముద్రుఁడు.

తోయరుహము సం. = తోయజము.

తోయలి = తొయ్యలి. "క. తోయలి తనతనువు కాచటఁ దొఱఁగెనో యకటా." మొ. రా. సుం. ౩౭.

తోయవల్లి, సం. వి. ఈ. స్త్రీ. కాఁకర చె.

తోయశూకము. సం. వి. అ. పుం. నాఁచు చె.

తోయు = త్రోయు. (చూ. తోపు.)

తోయేశము. సం. వి. అ. పుం. శతభిష. న. పూర్వా షాఢ.

తోరణ. సం. = తోరణము.

తోరణకట్టు. మి. స. క్రి. (తోరణ+కట్టు.) 1. తోరణముకట్టు. "క. ఇలమీఁదికి డిగి వేలుపుఁ, బోలఁతులు మణికంధరునితపోవనమున కిం,పలరఁ జనిరి తమచూడ్కులు,తోలుతగ నీలోత్పలములఁ దోరణకట్టన్." కళా. ౩, ఆ. ౭; 2. వశపఱచు కొను. "సీ. ప్రణుతింప నతఁడు తోరణకట్టు పర సీమ లనురీతి నూత్నతోరణము లెసఁగ." కృష్ణ. ౫, ఆ. ౪౧; 3. తిరస్కరించు. "సీ. కమలకోరక చక్రకనకకుంభములసౌష్ఠవముఁ దోరణకట్టు." వరాహ. ౪, ఆ. ౧౪౯. అ. క్రి. అలముకొను. "సీ. కంధరపటలసంకాశంబు లగునంధకారముల్ తోరణకట్టె దిశల." హరిశ్చ. ౩, ఆ. ౬౮. దశా. ౧, ఆ. ౧౧౦. ఇట్లే: తోరణలుకట్టు. "దండ కము...గాఢతిర్యద్ఘోషంబు మోఘంబుగా మేఘ వీథిన్ ధరాధోజగద్ద్వారసీమన్ దోరణల్ గట్ట..." పాండు. ౪, ఆ. ౭౭.

తోరణము. సం. వి. అ. పుం. న. 1. బహిర్ద్వారము; 2. మంగళార్థము గుమ్మము మొ. వానికి గట్టెడు మామిడాకులు మొ. వానిదండ. "చ. ఇతఁడు తపస్వివేషధరిదేవేంద్రుఁడ తప్పదు గాక యుంన్న నాఁ,డితఁ డరుదేరఁ దోరణము లెల్లెడలందు సమర్చి పేర్చి నృత్తులసుపర్వకార్ముకచయప్రభ నింగి నలంకరింతునో..." రామా. ౩, ఆ. ౪; 2. రాజమార్గము లం దలంకారార్థము కట్టుపత్త్రపుష్పా దులదండ. "గీ. ఘనతరఫలానతాఖండ కదళిక

లను,గీరరాజీకృత సజీవతోరణములు." వసు. ౧, ఆ. ౧౫౧.

తోరమల్లి. దే. వి. వజ్రమువలె తెల్లగా నుండునల్ప మణివిశేషము. (శ. ర. బ్రౌ.)

తోరము. వై. విణ. (సం. స్థూలమ్.) 1. లావైనది ఆం. భా. తృ. ౫౫; 2 అధికము. "ఉ...దు, ర్వ్యాసుఁడు వాసుదేవుఁ గని వైరము తోరము చేసినాఁడు..." ఉ. హరి. ౪, ఆ. ౨౮; 3. దట్టము. "సీ. తోరంబురాఁ బచ్చతోరణంబులు గట్టి..." కనక. ౬, ఆ. ౧౮౯; 4. బలిష్ఠము. "క. ఆరెండుబలములందును దోరంబై యున్న యట్టి తోఁచెం బొండు,త్సారమణసుతుబలమునర, నారాయణు లునికిఁ జేసి నాకుం జూడన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౪౦; 5. సుందరము. "క. తోరపుఁగన్నెల వేపుర,తో రహిం శరిష్ఠ కొలువఁ దులకింపుచు సిం,గారపుఁదోఁటకుఁ జనియెన్,గారవమున దేవయాని..." య. ౪, ఆ. ౧౪. వి. (సం. దోరః.) వ్రతసూత్రము. "సీ. పసిఁడి తోరముతోడిబాహు వల్లన నెత్తి సారెకుఁ బొదల పైఁ జాఁచి చాఁచి." స్కా. ౭, ఆ. ౮౮. బ. కృపాణీరేఖలు. ఆం. భా. ద్వి. ౨౧౪.

తోరహత్తము. వై. వి. ఒకానొకమల్లబంధము. "సీ. ఉపతాయిలోఁ దనకొడవినతోరహత్తము సూపి వ్రేయక..." భార. విరా. ౨, ఆ. ౧౫. హర. ౭, ఆ. ౮౩.

తోరహత్తించు. వై. స. క్రి. (తోరహత్తు ధా. ప్రే.) పూర్ణముగానించు, తృప్తిపొందించు. "గీ. పాండురంగండు భక్తకల్పద్రుశీల, నిష్టఫలసిద్ధిఁ దోరహత్తించు నింటి." పాండు. ౨, ఆ. ౬౮.

తోరహత్తు. వై. అ. క్రి. (తోరము+హత్తు.) పూర్ణమగు, సమృద్ధమగు. (చూ. తోరహత్తించు.) విణ. సమృద్ధము,పూర్ణము. "మ...ఉచితంబుల్ ద్రవ్యముల్ తోరహత్తులుగాఁ గూర్చి..." రామా. 3, ఆ. ౧౫. అచ్చ. యు. ౨౩౧.

తోలనము. సం. వి. అ. న. 1. పైకెత్తుట; 2. తూఁచుట.

తోలము. సం. వి. అ. పుం. న. 1. తూనిక; 2.తులము.

తోలాడు. దే. స. క్రి. (తోలు+ఆడు. స్వార్థమున.) తఱుము;పాఱఁద్రోలు. "సీ.. తోలాడెఁ గొన్ని శార్దూలిమములను." పి. శకుం. ౨, ఆ. ౧౫.

తోలు. దే. స. క్రి. 1. (పశురథాదులను.)నడపించు. "చ...మును దోలె నతండు రథంబు బల్విడిన్." భార. భీష్మ. ౨. ఆ. ౨౫౦. ప్రభా. ౨, ఆ. 3౧; 2. వెడలఁగొట్టు. "చ...పురంబున నుండఁగనీక తోలి..." విక్ర. ౬, ఆ. ౧౬౬; 3. పాఱఁజేయు. "క...అర్జునుండు...,గర్జారావ్రముగఁ దోలెఁ గౌరవబలమున్." భార. భీష్మ. ౨, ఆ. ౧౧౫; 5. కొన్నితుమున్నంతముల కనుప్రయుక్తమై ప్రేరణార్థము నిచ్చును. ఉదా:-పాఱఁదోలు, వెడలఁదోలు,తోలఁగఁదోలు మొ. వి. దే. అన్నా. 1. చర్మము. "క. అసిరశివిమష్ణిదంష్ట్రలు,పవనజు వజ్రమయతనువుపయితోలును నోపవ భేదింపఁగ..." భార. ఆది. ౫, ఆ. ౧౭౬. "మ... జింకతోలున నాచ్ఛన్నుఁడవై..." ఆము. 3, ఆ. ౭౯; 2. హామకాసనము. "క. తోలు దిగ నిడిచి నాగము,లీలఁ బొలుచుమాడ్కి..." భార. శాం. ౪, ఆ. 3౬౮; 3. పట్ట,బెరడు. "సీ. త్రోల్లర్గి తోలు లేక తోమంగ నను వైనతరుకాష్ఠమున దంతధావనంబు." కాశీ. ౫, ఆ. ౨౦౫.

తోలుక. దే. వి. (తోలు+ఉక. స్వార్థమున.) తోలు, బెరడు. ఆం. భా. ద్వి. ౩౭.

తోలుదాలుపు. దే. వి. (తోలు+తాలుపు.) కృత్తివాసుఁడు,శివుఁడు. ఆం. సం. దేవ. ౬.

తోలుపు. దే. వి. (తోలు ధా.) తోలఁబడుట."ఉ... పాకశాసనుం,డాలము... ననుం గదిసి యంత కపాళికిబేరయుత్సుఁడై,తోలుపులం బడెన్..." ఉ. హరి. ౧, ఆ. ౭౧.

తోలువాయిదము. ద్వ. వి. (తోలు+వాయిదము.) చర్మవాద్యము,ఆనద్ధము. (శ. ర.)

తోవ. దే. వి. 1. కలువ. "చ.. చెంగలువలఁ దోవ కాములును..." కుం. సం. ౫, ఆ. ౧౩౭; 2. త్రోవ,దారి. (వా.)

తోషకుఁడు; సం. విణ. (అ. షికా. అ.) 1. సంతోషపడువాఁడు; 2. సంతోషపెట్టువాఁడు; 3. తృప్తిపడువాఁడు; 4. తృప్తిపఱచువాఁడు.

తోషణము. సం. వి. అ. న. 1. సంతోషము; 2. తృప్తి. విణ. 1. (అ. ఈ. అ.) సంతోషసాధనమైనది; 2. (అ.ఆ.అ.) సంతోషము కలిగించునది.

తోషము. సం. వి. అ. పుం. 1. సంతోషము; 2. తృప్తి.

తోషించు. సం. అ. క్రి. సంతోషించు. "సీ. పరమ పావని యంచు బంధువుల్ తోషింప నిత్యవ్రతా చారనియలేఁ బూని." కృ. శ. కుం. పీఠి. ౭౫.

తోషితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. సంతోష - పఱుపఁబడినవాఁడు; 2. తృప్తిపఱుపఁబడినవాఁడు.

తోష్ట. సం. విశ. (ఋ. త్రే. ఋ.) 1. సంతోషించువాఁడు; 2. తృప్తినందువాఁడు.

తోసిరాజను. మి. స. క్రి. (తోసి+రాజు+అను.) చదరంగమున గుఱ్ఱము మొదలగువానిని వేసి కాక బంటును తోసి రాజు తప్పుకోవలయు నను; బంటు చేత రాజును వెనుకకుఁ ద్రోసివేయు; నిరసించు; ఓడించు. "చ. కలికిముఖారవింద మలకల్వల రాయనిఁ దోసిరాజనున్." విజ. ౧, ఆ. ౩౭.

తోస్తానము. దే. వి. తోలుసంచి. "వ. చంకల వ్రేలెడుతోస్తానంపుఁదిత్తులు..." ప్రబంధ. ౬౦౫.

## తౌ

తౌ = తవు. (భ. ర.)

తౌటిపాము = తవుటిపాము. (శ. ర.)

తౌర్యత్రికము. సం. వి. అ. న. నృత్తగీతవాద్యము.

తౌలము. సం. వి. అ. పుం. తులారాశి. న. త్రాసు.

తౌలు = తవులు. (తగులు, అనుసరించు.) "చ...సు, స్థిరు నిను మావిభుం డను మతిఁ వెను దౌలెద మాదరంబునన్." రాఘవ. ౩, ఆ. ౪౧.

తౌలువడు = తవులువడు. (శ. ర.)

తౌల్యము. సం. వి. అ. న. సామ్యము. (శ. ర.)

## త్య

త్యక్త. సం. విశ. (ఋ. క్త్రీ. ఋ.) త్యజించువాఁడు.

త్యక్తము. సం. విశ. (అ. ఆ. అ.) విడువఁబడినది.

త్యక్తవ్యము. సం. విశ. (అ. ఆ. అ.) విడువఁదగినది.

త్యజనము. సం. వి. అ. న. 1. విడుచుట; 2. ఇచ్చుట.

త్యజించు. సం. స. క్రి. 1. విడుచు. "క...మిథిలేశ్వరు న్నను ద్యజింతు ననఁగా, జానకి నెడఁబాయు టెంత..." ఉ. రా. ౬, ఆ. ౨౧౯; 2. ఇచ్చు. "చ. అమరగురుండు పైకొనియె నంబుజలోచనఁ దారఁ దారకా, రమణిముఖుం ద్యజించె నుడురాజును భామిని నెట్టకేలకున్." కాశీ ౪, ఆ. ౨౨౪.

త్యజితము. సం. విశ. (అ. ఆ. అ.) త్యాజితము, విడిపింపఁబడినది. "మ..విస్ఫూర్జద్భుజశ్రీభుజ, త్యజితానేకనరేంద్రవర్గ మతిమత్సంభావ్యసర్గా..." హరి. ఉ. ౫, ఆ. ౨౪౦.

త్యజియించు. సం. = త్యజించు. (విడుచు.) ఉ. రా. ౭, ఆ. ౨౨౦.

## త్యా

త్యాగము. సం. వి. అ. పుం. = త్యజనము.

త్యాగి. సం. విశ. (న్. నీ. న్.) 1. విడుచువాఁడు; 2. ఇచ్చువాఁడు; 3. శూరుఁడు.

త్యాజకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) త్యక్త.

త్యాజ్యము. సం. విశ. (అ. ఆ. అ.) వర్జ్యము, విడువఁదగినది.

## త్ర

త్రంపి. దే. వి. దాలి, తంపి. "షు. ఆసలత్రంపి వెట్టి హృదయం బచుకాఁగున యోగవాసనా, భ్యాసపు నీరు గాఁచుటకు నాగమపావకముం దగిల్చి .." ఉ. హరి. ౪, ఆ. ౭౬. స్వా. ౪, ఆ. ౬౦.

త్రచ్చన. దే. వి. (త్రచ్చు. ధా.) 1. చిలుకుట. (శ. ర.); 2. తఱిమెనఁబట్టుట. (శ. ర.)

త్రచ్చు. దే. స. క్రి. 1. తరుచు, మథించు. "శా... గీర్వాణులుం బూర్వ గీ, ర్వాణవ్రాతము నబ్ధిఁ ద్రచ్చునెడ..." భార. ఆది. ౨, ఆ. ౧౨; ౧౩; 2. తఱిమెనఁబట్టు. "సీ. నఱుము నిస్సందేహ తయుం నొప్ప మురువుగ ద్రచ్చివేసినయట్లు తనరుటయును." పాండు. ౧, ఆ. ౭౧. హరి. పూ. ౧. ఆ. ౧౭౭; 3. ఒరపెట్టు. "వ ..నెల్లి కొయ్యలు త్రచ్చి నుచ్చు లంటించినం బెచ్చు పెరుఁగుచిచ్చులు..." స్వా. ౪, ఆ. ౬౦; 4. మేయు. "చ...... తమతమయిచ్చఁ బచ్చికలు ద్రచ్చి వెసం జనుహోమధేనుసం, ఘములకు గోప బాలకులకై వడి..." వాల్మీ. ౧, ఆ. ౩౪; 5. నఱకు. "చ. అనలము దోఁచునే తరువునందు... తగఁ ద్రచ్చినఁ గాక..." భార. శాం. ౪, ఆ. ౧౭౯.

త్రప. సం. వి. ఆ. స్త్రీ. 1. సిగ్గు; 2. కులట; 3. [కులము; 4. కీర్తి.

త్రపిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) సిగ్గుపడువాఁడు.

త్రపితము. సం. విశ. (అ. ఆ. అ.) సిగ్గు గలది.

త్రపిష్ఠుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి తృప్తి కలవాఁడు.

త్రపుటి. సం. వి. ఈ. స్త్రీ. చిట్టేలకి ✻.

త్రపులము. సం. వి. అ. న. తగరము.

త్రపువు. సం. వి. ఉ. న. 1. తగరము; 2. సీసము

త్రపుసము. సం. = త్రపులము.

త్రప్త. సం. విణ. (పు. స్త్రీ. పు.) 1. తర్పిత; 2. త్రపిత.

త్రప్సు. సం. వి. ఆ. స్త్రీ. బ్రహ్మబిందువు, శ్లేష్మ.

త్రమ్ము. దే. స. క్రి. దుమ్ముచేయు. (శ. ర. బ్రౌ.) వి. దుమ్ము. (శ. ర. బ్రౌ.) విణ. వ్యర్థము. "సీ. పితృఋణము దీర్పెడుసూనుఁ బొందని దౌర్భాగ్య శీలుగో త్రమ్ము త్రమ్ము." రాఘవ. ౧, ఆ. ౪౬.

త్రయము. సం. వి. అ. న. మూఁడింటిసమూహము

త్రయి. సం. వి. ఈ. స్త్రీ. 1. మూఁడు వేదములు; 2. త్రయము. భార. ద్రో. ౨, ఆ. ౩౨౫; 3. కుటుంబము గలయాఁడుది, పురంధ్రి; 4. మంచిమనస్సు గలస్త్రీ; 5. ఏనుఁగుకాలిసంకెల. [త్రయీతనువు.

త్రయీతనుఁడు. సం. వి. ఉ. పుం. సూర్యుఁడు. ఇన్డ్వే:

త్రయీమయుఁడు. సం. వి. అ. పుం.=త్రయీతనుఁడు.

త్రయోదశము. సం. విణ. (అ. ఈ. అ.) 1. పదుమూఁడవది; 2. పదుమూఁడు ఎక్కువగాఁ గలది. (ఇది తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా:-త్రయోదశశతము మొ.)

త్రయోదశి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు పదుమూఁడవతిథి.

త్రవు = త్రవ్వు. (చూ. త్రవుకోల.)

త్రవుకోల = త్రవ్వుకోల. (శ. ర.)

త్రవ్వటము. దే. వి. (త్రవ్వు. ధా.) త్రవ్వుట. "సీ. త్రవ్వటంబులతఱిఁ ద్రవ్వటంబులు పెట్టఁ దగినట్టి కఱ్ఱుగుద్దలి గడించి." కళా. ౪, ఆ. ౭౮.

త్రవ్వటించు. దే. స. క్రి. త్రవ్వు. (శ. ర. బ్రౌ.)

త్రవ్వించు. దే. స. క్రి. (త్రవ్వు. ధా. ప్రే.) 1. త్రవ్వఁజేయు. "సీ. అగడిత లీఁటసీ రలవడఁ ద్రవ్వించి......" ఉ. హరి. ౨, ఆ. ౯౭; 2. పలికించు. "సీ. ఎవ్వరి నేసుద్ది త్రవ్వించి యిచ్చుట నేశాస్త్రమునకల్మి యెఱిఁగికొననో." కళా. ౬, ఆ. ౧౫౬.

త్రవ్వితండము. దే. విణ. (త్రవ్వి+తండము.) చేతులతో లెక్కించి యిచ్చుటకాక రాశిగా నున్న సువర్ణాదికము సాధనాంతరములతోఁ ద్రవ్వి రాసులుగా నిచ్చినది; అసంఖ్యాకము, లెక్కలేనిది. "చ. కొడుకులు కూఁతులుం గలిగి గుట్టము లేనికపిండుఁ బల్లకీల్గాడుగులుఁ ద్రవ్వితండముగఁ గూరిమితో మనుష్య బెక్కులేం డ్లొగిన్." య. ౪, ఆ. ౧౫౦. (శ. ర. పా.)

త్రవ్వితండములు = త్రవ్వితండము. 1. (అసంఖ్యాకము.) "సీ. మోక్షసంపదలు గాశీక్షేత్రమున యందుఁ ద్రవ్వితండంబులై నివ్వటిల్లు." కాశీ. ౨, ఆ. ౫౦. ('త్రవ్వితండంబులై' అపముద్రి. భార. అశ్వ. ౧, ఆ. ౬౨; 2. (అతిసమృద్ధము; మిక్కిలి తృప్తి నిచ్చునది.) "సీ. అనఘ మరుత్తుండు యజ్ఞంబు సేసి మహాధనరాసుల నవనిసురుల, కిచ్చె వారవి గడు నెక్కుడై యుండుటఁ ద్రవ్వితండంబులు దమగృహముల, నిడికొని పెఱఘన మెల్లను నిధియుఁగా నిమ్మైన నెలవున నిడుచు నుండి..." భార. అశ్వ. ౧, ఆ. ౧౫.

త్రవ్వు. దే. స. క్రి. 1. ఖననము చేయు, గ్రొచ్చు. "సీ.....చక్కఁ బ్రాఁక, రానిలిప్పలు చోరఁ ద్రవ్వెడు..." హరి. ఉ. ౧, ఆ. ౮౩. "శా. కొండల్ త్రవ్వినయట్టి కత్తులగతిన్ గొమ్ముంగొనల్ ముంప..." ఆము. ౪, ఆ. ౧౫౫; 2. పెల్లగించు; నశింపఁజేయు. "సీ...నగరంబు గంగలోనఁ, ద్రవ్వి వైచెద నని .." ఉ. హరి. ౧, ఆ. ౯. "ఉ. అవ్వసుధేశ్వరుం డతివహస్తము వట్టినఁ బట్టి ధైర్యముం, ద్రవ్వెడుకన్నులం గొని యదల్చి పదల్చెఁ గరంబు చయ్యనన్." కేయూర. ౪, ఆ. ౨౧; 3. పూర్వోత్తరము లెత్తిచెప్పు. గొప్పలుచెప్పు. "ఉ. గాసటబీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికిన్." నృసిం. పీఠి. ౯; 4. పలుకు. "ఉ... ముచ్చటల్, త్రవ్వుచు నొక్కకోమలి పరాకున నుండఁగ..." నైష. ౬, ఆ. ౧౧౩; 5. పొందు, సంపాదించు. "గీ. ఏల దగ్విశచర్వణ మిట్లు సేయు, దీన నీ వేమి త్రవ్వితి దానిఁ జెపుమ." భార. స్త్రీ. ౨, ఆ. ౧౬౨.

త్రవ్వుకోల. దే. వి. (త్రవ్వు+కోల.) గుద్దలి. (శ.ర.)

త్రసత్. సం. శత్ర. భయపడుచున్న. "ఉ...... దానవుం డత్రసదంతరంగుఁ డయి..." హరి. ఉ. ౪, ఆ. ౧౫౬.

త్రసనము. సం. వి. అ. న. 1. భయము; 2. ఉద్వేగము. విణ. (అ. ఆ. అ.) భయపడినది.

త్రసము. సం. వి. అ. న. 1. అడవి; 2. జంగమప్రాణిసమూహము. విణ. (అ. ఆ. అ.) జంగమము, తిరుగునది.

త్రసరేణువు. సం. వి. ఉ. స్త్రీ. సంజ్ఞాదేవి, సూర్యపత్ని. పుం. ముప్పదిపరమాణువులకొలఁది.

త్రస్తము. సం. విణ. (అ. ఆ. అ.) భయపడినది.

త్రస్తరి. దే. వి. 1. పరిహాసము. ఆం. భా. ప్ర. ౧౩౯. విజ. 3, ఆ. ౭౮; 2. క్రిందు. "సీ. కర్ణడోలా మౌక్తికచ్ఛాయ లెగఁబ్రాఁకునురుహారరుచులఁ ద్రస్తరికిఁ దన్న." ఆము. ౨, ఆ. ౨౫; 3. వెనుక. "ఉ. తూకొని ముందఱం దఱుముదుస్సహరాగ భరంబుడంబునన్, జేకొని త్రస్తరిం దిగుచుసిగ్గున ముంగలికిం బిఱిందికిం, బోకడ రాకడల్ పళము పోవక మన్మథుఁ డానవెట్టిన,ట్లాకలకంఠి నిల్చె నచలాకృతిఁ జిత్తరుబొమ్మకైవడిన్." కృ. శకుం ౨, ఆ. ౫౮

త్రస్తరించు. దే. అ. క్రి. 1. పరిహాసమాడు. "సీ. తావిఁ భరుచితోడఁ ద్రస్తరించెడు మేనుఁ బసిఁడి ముంజియుఁ దగుపట్టుగోడుగు." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౨౫౩; 2. అతిశయించు "చ . కొప్పు వెం, గలువలవల్పుఁ జన్నుఁగవకస్తురితావియుఁ ద్రస్త రింప నం,దెలరొద మీఱ..." స్వా. ౨, ఆ. ౩౧. స. క్రి. 1. క్రిందుచేయు,నిరసించు. "సీ. గిరిగరుత్ఖండనక్రీడాసమారంభదంభోళిరుదితముఁ ద్రస్త రించి." పి. శకుం. 3, ఆ. ౯౩; 2. అభిఘారము చేయు. "మ...పాత్రంబులన్,సురధేన్వాజ్యముఁ ద్రస్తరింపఁ దొడఁగెన్ దూర్వాంకురాగ్రంబు లన్." హర. ౬, ఆ. ౧౧౭.

త్రస్నువు. సం. విణ. (పుం.) భయశీలుఁడు.

త్రస్యత్. సం. = త్రసత్.

త్రస్న. వై. వి. సం. త్రప్సా.) బ్రహ్మబిందువు,వేద శాస్త్రాదు లభ్యసించునపుడు నోటినుండి రాలు తుంపర. "సీ. బ్రహ్మబిందువు మీఱుఁ ద్రస్న యనంగను..." ఆం. భా. ద్వి. ౧౭౫. శ్రీరం. మా. ౬, ఆ. ౨౪.

## త్రా

త్రాఁచు. దే. వి. నాగుఁబాము,ఫణి. "సీ. స్ఫటల మీఱ వాంతమై శ్వేతమై నట్టిత్రాఁ చొక్కటి చుట్టియుండు." ఆము. ౪, ఆ. ౧౯౯. ఆం భా. ప్ర. ౧౮౭.

త్రాఁచుపాము = త్రాఁచు. "గీ...నొప్పింపఁ బడిన త్రాఁచు,పాము పగ సాటి తెగటార్చు భంగి..." భార. స్త్రీ. ౨, ఆ, ౬౧.

త్రాగించు = త్రావించు. (చూ. త్రావించు.)



త్రాగు. దే. స. క్రి. 1. పానముచేయు. "ఉ...సలిలంబు దప్పివోఁ,ద్రాగినవారికి..." నైష. ౨, ఆ. ౮౧; 2. మ్రింగు. "గీ...ఎంతమీ లెంతమీలఁ ద్రాగు." కు. సం. ౪, ఆ. ౬౬; 3. పీల్చు. (ఉదా:-పొగ త్రాగు మొ.)

త్రాగుడు. దే. వి (త్రాగు. ధా.) పానము. "చ... చిట్టకంపుఁద్రా,గుడుఁ గని సన్నలన్ నగిరి కొందఱు పాంథుఁ బ్రపాప్రపాలికల్." ఆము. ౨, ఆ. ౫౯.

త్రాడు. దే. వి. బొ. 1. రజ్జువు. "ద్వి. త్రాడును బామును రజతంబు శుక్తి,చూడికిఁ గొరడును జోడుండు దెలియ కున్న..." పండితా. దీక్షా. ౫౨, పు; 2. దారము. "ఉ. సూదివిఱిందిత్రాటి క్రియ..." విక్ర. ౨, ఆ. ౭౨; 3. జందెము. "ద్వి. పురహరార్చితునకు మున్నెత్తుకేలు,ధర నెత్తఁ గూడునే త్రాటిమాలలకు." బస. ౭, ఆ. ౭౭౨పం; 4. మంగళసూత్రము. "గీ పంచవదనుని కను జేవురించెనేని, తత్క్షణమునంద తమయాండ్ర త్రాళ్లు తెగవె." కాశీ. ౭, ఆ. ౬౦; 5. కిరణము. "గీ. నిడుపుఁద్రాళ్లాని బయల నెప్పుడు దిరుగుచుఁ,బొసఁగ ముప్పొద్దు ముప్పిసములఁ జెలఁగుచు,వెలుఁగు లెల్లెడఁ గాంచుచు నలసునిర్ణ,వేటకాఁ డప్పు డెంతయుఁ దేటమీఱె." అచ్చ. అయో. ౪౨.

త్రాడుదాలుపు. దే. వి. (త్రాడు+తాలుపు.) పాశి, వరుణుఁడు. "సీ. త్రాడుదాలుపు మేలిరతనముల్ గొని తెచ్చు..." అచ్చ. సుం. ౪౧.

త్రాడువడు. ద్వ. అ. క్రి. (త్రాడు+పడు.) 1. త్రాడగు; 2. బలహీనమగు. "సీ. పాథోధివల్లభు పాశవల్లిమతల్లి దర్పంబుఁ దిగఁద్రావి త్రాడువడియె." భీమ. ౪, ఆ. ౧౦౭. (రెండర్థములకు నుదాహరణము.)

త్రాడువాఱు. దే. అ. క్రి. (త్రాడు+వాఱు.) 1. పురికొను; 2. ధైర్యమొందు. (వా.)

త్రాణ. వై. వి. (సం. ద్రవిణమ్.) 1. బలము,శక్తి. "శా. త్రాణల్ తప్పి త్వగస్థిమాత్రులగుచున్ దైన్యంబు నొందన్..." వి. పు. ౨, ఆ. ౧౫౬; 2. జాగ్రత్త,మెలఁకువ. "గీ. భువనసమ్మోహనాకాంతుఁ బుష్పధన్వి, బోన్ను మెట్టియ నెత్తమ్మి పూవు నడుమఁ,ద్రాణమై డాఁచెననఁగఁగట్టాణిము

త్తి, ఖంపుముంగర విలసిల్లె నబ్జముఖికి." సుద. ౫, ఆ. ౧౪౪; 3. గౌరవము,మర్యాద. "వ...పురాణంబులఁ ద్రాణలు సెఱచియు..." సైవ. ౬, ఆ. ౦౦.

త్రాణము. సం. వి. అ. న. 1. రక్షణము; 2. కలుఁగానుగు ✿. విణ. (అ. ఈ. అ.) 1. రక్షణసాధనమైనది. (ఉదా:-తనుత్రాణము,శిరస్త్రాణము మొ. ; 2. (అ. ఆ. అ.) రక్షింపఁబడినది; 3. రక్షించునది.

త్రాత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) రక్షకుఁడు.

త్రాతము. సం. వి. అ. న. రక్షణము. విణ. (అ.ఆ.అ.) రక్షింపఁబడినది.

త్రాపుసము. సం. విణ. (అ. ఈ. అ.) త్రపువుచే జేయఁబడినది.

త్రాయంతి. సం. వి. ఈ. స్త్రీ. కలుఁగానుగు ✿.

త్రాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ )రక్షకుఁడు.

త్రాయమాణ. సం. వి. ఆ. స్త్రీ. కలుఁగానుగు ✿.

త్రావించే. దే. స. క్రి. (త్రావు. ధా. ప్రే.) త్రాఁగఁజేయు. "క. తడయక యబ్బాది శుక్రు ద్రావించి రోగిన్." భార. ఆది. 3, ఆ. ౧౧౪.

త్రావికొను. దే. స, క్రి. (త్రావు+కొను స్వార్థమున.) త్రావు. దశ. ౪, ఆ. ౬౪.

త్రావు = త్రాగు. 1. (పానముచేయు.) "క. ఈ వాయుపుత్త్రుఁ డాజిన్ ద్రావుదు నే దుస్ససేనురక్తం బనియెన్." భార. ఉద్యో. ౪, ఆ. ౯౫; 2. (పీల్చు;మ్రింగు.) "సీ. గతిమ్రుచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాముఁ నిడినకై వడిఁ గాలికదియమమర." పారి. ౫. ఆ. ౭౬.

త్రావుడు = త్రాగుడు. "చ. తనచెలులిండ్లయం దదవ త్రావుడు త్రావుచు..." పాండు. 3, ఆ. ౧౯.

త్రాసకుఁడు. సం. విణ. (అ. సికా. అ.) 1. భయపెట్టువాఁడు; 2. భయపడువాఁడు.

త్రాసనము. సం. వి. అ. న. భయపెట్టుట. విణ. (అ. ఆ. అ.) భయపెట్టునది.

త్రాసము. సం. వి. అ. న. 1. భయము; 2. భయపెట్టుట; 3. ఒకానొకమణిదోషము. రత్న. ౧౪.

త్రాసితము. సం. విణ. (అ. ఆ. అ.) భయపెట్టఁబడినది. భార. విరా. ౫, ఆ. ౬.

త్రాసు. దే. వి. తుల,తూఁచుసాధనము. "సీ. త్రాసులుం బోనిచిత్తంబులతో డుతఁ బ్రజవివాదములేదఁ బక్షముడిగి." భార. శాం. ౨, ఆ. 3౭౫. ఆం. భా. ద్వి. 3౦౦.

త్రాస్యమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భయపెట్టఁబడుచున్నవాఁడు.

## త్రి

త్రి. సం. విణ. (ఇ.) మూఁడు. (ఇది తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా:- త్రిజగము,త్రినేత్రుఁడు మొ.)

త్రింశత్తమము. సం = త్రింశము.

త్రింశత్తు. సం. వి. త్. స్త్రీ. ముప్పది యనుసంఖ్య. విణ (త్.) ముప్పది.

త్రింశము. సం. విణ. (అ ఈ. అ.) ముప్పదవది.

త్రిక. సం. వి. ఆ. స్త్రీ. నూతిగిరక.

త్రికంటకము. సం. వి. అ. పుం. 1. ములుకెమురు✿; 2. పెద్దపల్లేరు ✿; 3. మత్స్యవిశేషము. విణ. (అ. ఆ. అ.) మూఁడుముండ్లు గలది.

త్రికకుత్తు. సం. వి. ద్. పుం త్రికూటపర్వతము.

త్రికటుకము. సం. వి అ. న.-మూఁడుకారపువస్తువులు-సొంటి, పిప్పలి, మిరియాలు.

త్రికటువు. సం. వి. ఉ. న. త్రికటుకము.

త్రికము. సం. వి అ. న. 1. మూఁడింటిసమూహము; 2. మూఁడుదారులు కలియుచోటు; 3. ముడ్డిపూస; 4. సొంటి-పిప్పలి-మిరియాలు; 5. కరక తాండిరయుసిరికలు. పుం పెద్దపల్లేరు ✿.

త్రికరణములు. సం. వి. అ. న. బ. మనోవాక్కాయములు.

త్రికాష్ఠి. సం వి. ఇ. న. త్రిక్కటి.

త్రికూటము. సం. వి. అ. పుం. ఒకానొకపర్వతము.

త్రికేతువు. సం. వి. ఉ. పుం. చిలుక. (కే. ని.)

త్రికోణము. సం. వి. అ. న. 1. త్రిభుజక్షేత్రము; 2. లగ్నమునకు పంచమనవమస్థానములు; 3.మోక్షము; 4. యంత్రవిశేషము; 5. భగము; అఁడుగుఱి, (ఈయర్థము తెలుఁగునసే కలదు చూ. చంద్ర. వి. ౨, ఆ. ౫3; ౫౪.) విణ.(అ.ఆ.అ.) మూఁడుకోణములు గలది. ఉదా:-త్రికోణమండపము.

త్రిక్క = తిక్క. (వెఱ్ఱి.) ఆం. భా. ప్ర. ౧3౬. అవ్య. = తక్క. (వినార్థకము.) ఆం. భా. తృ ౬౯.

త్రిక్కటి. వై. వి. (సం. త్రికాష్ఠి.) 1. ఆయుధ విశేషము. (శ. ర.); 2. మూఁడుకఱ్ఱలతోఁ జేసిన చట్రము. "గీ. కోలదాపునఁ ద్రిక్కటిఁ గూడి యున్న,గచ్చుచేసి చిత్రంపుగద్దెపలక." క్రీడా. ౧౨౯.

త్రిక్కు. దే. అ. క్రి. తక్కు,మిగులు "క. నీవింత యలుగ నేటికి,నావంతయుఁ బౌరజన మనఃఖేద ము నొ,క్కావంత ద్రిక్కకుండఁగ,లావంతులు మత్పతులు గలరు పగదీర్పన్." భార. విరా. ౨, ఆ. ౧౬౧. భార. సౌ. ౧, ఆ. ౨౦౯. వి. త్రిప్పు, బాధ. "ఉ... క్రందునం,ద్రిక్కులు వెట్ట నొల్లఁ జనరే యన..." భా. రా. యు. ౨౬౬. భాగ. ౬, స్కం. ౧౩౭.

త్రిగర్త సం వి. ఆ. స్త్రీ. కాముకి.

త్రిగర్తము. సం. వి. అ. పుం. జాలంధరదేశము.

త్రిగుణ. సం. వి. ఆ. స్త్రీ. మాయ.

త్రిగుణము. సం. వి. అ. న. ప్రధానము. విణ. (అ. ఆ. అ.) 1. మూఁడుగుణములు కలది; 2. మూఁడు రెట్లు కలది.

త్రిగుణాకృతము. సం. విణ. (అ. ఆ అ.) మూఁడు చాళ్లు దున్నినది. (పొలము.)

త్రిగుణి. సం. వి. ఈ. స్త్రీ. మారేడు ♣.

త్రిజగత్తు. సం. వి. త్. న. స్వర్గమర్త్యపాతాళములు.

త్రిజగము. సం. = త్రిజగత్తు. (సమాహారార్థవివక్షలేనపుడు కర్మధారయము. ఉదా.-త్రిజగములు.)

త్రిణయనుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి,శివుఁడు. కాశీ. ౨, ఆ. ౧౯౦; ౫, ఆ. ౨౩.

త్రిణేత్రుఁడు. సం = త్రినేత్రుఁడు. (వాచ.)

త్రితీయము. సం. వి. అ. న. మూఁడింటిసమూహము.

త్రితీయి. సం. వి. ఈ. స్త్రీ. త్రితీయము.

త్రిధా. సం. అవ్య. (త్రేధా అనియుండ నగు.) మూఁడువిధములుగా. (తెలుఁగున సమాసపూర్వపదముగనే యుండును.) "శా. ప్రఖ్యాతం బన మిశ్రబంధమన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా, వ్యాఖ్యాతం బగువస్తువందు మఱి యధ్యాహార మొం జేయఁగాఁ,బ్రఖ్యాతం బితివృత్తమైనకృతి చెప్పన్ వక్తకున్ శ్రోతకున్,విఖ్యాతిం గలిగించు..." పి. శకుం. ౧, ఆ. ౨౮.

త్రిదండము. సం. వి. అ. న. 1. మూఁడుదండములు. 2. మనోదండవాగ్దండకర్మదండము లనుమూఁడు దండములు; పుం. మనోదండాది యగుసన్న్యాసాశ్రమము.

త్రిదండి. సం. వి. న్. పుం. 1. మూఁడుదండములు ధరించుసన్న్యాసి; 2. మనోదండాదిగలసన్న్యాసి.

త్రిదశాలయము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. మేరువు.

త్రిదశుఁడు. సం. వి. అ. పుం.-త్రిదశపరిమాణవయస్కుఁడు—జన్మసత్తావినాశములను మూఁడవస్థలే కలవాఁడు - వేల్పు.

త్రిదళము. సం. వి. అ. పుం. మారేడు ♣. విణ. (అ. ఆ. అ.) మూఁడుదళములు గలది.

త్రిదివ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. ఏలకి ♣.

త్రిదివము సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. ఆకాశము. న. సుఖము.

త్రిదివేశుఁడు. సం. వి. అ. పుం. త్రిదశుఁడు,వేల్పు.

త్రిదివౌకసుఁడు. సం. వి. స్. పుం. త్రిదశుఁడు,వేల్పు.

త్రిదోషము. సం. వి. అ. న. వాతపిత్తశ్లేష్మములవలనఁ గలుగుదోషములు.

త్రిధాముఁడు. సం. వి. న్. పుం. 1. అగ్ని; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. వ్యాసుఁడు; 5. యముఁడు.

త్రిధార. సం. వి. ఆ. స్త్రీ. గంగ.

త్రినయనుఁడు. సం. = త్రిణయనుఁడు.

త్రినేత్రుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి,శివుఁడు. ఇట్లే: త్రిలోచనుఁడు మొ.

త్రిపతాకము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. న. మూఁడురేఖలు గలనొసలు.

త్రిపథగ. సం. వి. ఆ. స్త్రీ. గంగానది.

త్రిపద. సం. వి. ఆ. స్త్రీ. మూఁడుపాదములు గలది.

త్రిపది. సం వి. ఈ. స్త్రీ. 1. = త్రిపద; 2. ఏనుఁగు కాలికిఁ గట్టుత్రాడు.

త్రిపాఠి. సం. వి. న్. పుం. వేదమున పదక్రమ సంహితలను జదువువాఁడు.

త్రిపాత్తు. సం. వి. ద్. పుం. 1. పరమేశ్వరుఁడు; 2. విష్ణువు. విణ. (అ. ఆ. అ.) మూఁడుకాళ్లు గలది.

త్రిపుండ్రము. సం. వి. అ. న. నొసట పెట్టుకొను విభూతి మొదలగువానిమూఁడురేఖలు.

త్రిపుట. సం. వి. ఆ. స్త్రీ. 1. తెగడ ♣; 2. సన్న ఏలకి ♣; 3. మల్లె ♣.

త్రిపుటము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. సెనగలలో నొకరకము; 3. ఏడక్షరముల కాలము గల యొక తాళము; 4. తీరము; 5. పల్లేరు ?.

త్రిపురము. సం. వి. అ. న. మయనిర్మితము లగు మూఁడుపురములు.

త్రిపురాంతకుఁడు. సం వి. అ. పుం. శివుఁడు ఇట్లే; త్రిపురదహనుఁడు మొ.

త్రిప్పట. దే. వి. (త్రిప్పు ధా.) 1. తిరుగుడు, భ్రమణము. "గీ. పాఁపతరిత్రాటఁ ద్రచ్చునిర్బంధము నకు, నోర్చి త్రిప్పట నొందినయంత్రముండు." రాజ. చ. ౨, ఆ. ౪౭; 2. త్రిమ్మట, పర్యటకము. "క. ఇటువలె వెదకియుఁ దమ త్రిప్పట గురువిరహితులమంత్రపఠనం బెటు లట్లటమటమై పోఁ జొచ్చినఁ, గటకటపడి..." రామా. ౬, ఆ. ౫౪. ఆం. భా. ద్వి. ౧౭౪.

త్రిప్పటము దే. వి. (త్రిప్పు ధా.) తిరుగుడు. "వ... వినోదంబునకు బేతాళబాలికలు త్రిప్పు త్రిప్పటం పుబల్లలచందంబున..." వరాహ. ౫, ఆ. ౩౦.

త్రిప్పరి. దే. విశే. (త్రిప్పు+అరి.) త్రిమ్మరి. (శ.ర.)

త్రిప్పికొను. దే. అ. క్రి. (త్రిప్పు+కొనుస్వార్థమున.) కలఁగు, క్షోభపడు. "ఆ. అలరు మొగముతోడ సభిమన్యుఁ డేలొకో, యెదురు రాఁడు నాకు నెట్టి వార్త, చెవులు సోఁకునొక్కొ చేవెట్టి కలఁచిన, భంగిఁ ద్రిప్పుకొనఁ దొడంగె మనము." భార. ద్రో. ౨, ఆ. ౨౩౦.

త్రిప్పియాడు. దే. స. క్రి. (త్రిప్పి+ఆడు. స్వార్థమున.) త్రిప్పు, తిరుగఁజేయు. "ఆ. ఎత్తి త్రిప్పియాడి యిలతోడ వ్రేసి పాదములఁ జదువఁ జూచి దారుణాస్త్రతతులు నిగుడఁ బవనతనయ శిఖండిసాత్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున." భార. శల్య. ౧, ఆ. ౩౧౭.

త్రిప్పు. దే. స. క్రి. (తిరుగు. ధా. ప్రే.) 1. మరలుచు, మగుడఁజేయు. "చ. అపుడు సుబుద్ధిసైన్యముల నన్నియు నొక్కమొగంబుగా నమర్చి పురికిఁ గానికల్ మగుడఁ ద్రిప్పి..." జై. ౫, ఆ, ౧౬౩; 2. సంచరింపఁజేయు. "ఉ. పీఁడఁక నన్ని దేశముల వెంబడిఁ ద్రిప్పునో..." శుక. ౩, ఆ. ౫౭౭; 3. ఇసరు. "త్రిప్పె లతాంగి యొూర్తలా, మజ్జక తాలవృంతము..." శైవ. ౨, ఆ ౧౪౦; 4. గిరగిరఁ దిరుగఁజేయు. "మ... త్రిప్పు

రాట్నంపుగుండ్రలు నా..." ఆము. ౪, ఆ. ౧౫౨; 5. సాచీకరించు. "సీ... మెడఁ ద్రిప్పి..". స్వా. ౪, ఆ. ౪౨: 6. కలఁచు. "చ... మదిఁ ద్రిప్పుచున్నయది..." ప్రభా. ౩, ఆ. ౪. అ. క్రి. 1. వికారముకలుగు. వా:-కడుపులోఁ ద్రిప్పుచున్నది; 2. ఇటునటు కదలు. వా:-ఆమె త్రిప్పుకొనుచు వచ్చుచున్నది. వి. 1. తిరుగుట, సంచరించుట. "ద్వి .. ఆమ్నాయమృగము, త్రిప్పుల నడవులఁ ద్రిమ్మరి యలసి." ద్వి. హరిశ్చ. పూ. ౭౨౦, పం; 2. అనుభవము, కడుపు. "క... ప్రజ్ఞానరహితుండు గామాధీనతమెయిఁ గర్మసమితి త్రిప్పునఁ జిక్కున్." భార. శాం. ౫, ఆ. ౩౨౬; 3. చేష్ట, నియోగము. "చ. మును విదురుండు సెప్పె నతి మూర్ఖునిగతి రైనయీసుయోధనుచరితంబు గీ డఖిలధాత్రిజనంబులకుం బొనర్చు నాశన మని దానిఁ గొంద ఆవిచారులు పాటిగఁ బట్టరైరి న్యాయము మది బోరి కెట్లటుల కుత్సితమయ్యె విధాత త్రిప్పునన్." భార. శల్య. ౧, ఆ. ౩౬; 4. కష్టము, శ్రమ. "గీ .. ఈ త్రిప్పు లేటికిఁ గమలవదన." భార. విరా. ౨, ఆ. ౫౨; 5. సాచీకరణము. "ఉ. పాటలు మోము త్రిప్పులును..." హంస. ౩, ఆ. ౭౬.

త్రిప్పుకొను. దే. అ. క్రి. (త్రిప్పు+కొను.) చిక్కువడు, బాధలందు. "గీ. ఊర్ధ్వలోకనివాసులయుల్లములును, నధికభయమోహవివరంబు లయ్యె ననిన, నల్పధారుణినాథసైన్యములు కలఁగి, త్రిప్పుకొని తల్లడిల్లుట సెప్ప నేల." హరి. ఉ. ౨, ఆ. ౨౪: (రూపాం. త్రిప్పికొను.)

త్రిప్పుకొలుపు. దే. స క్రి. (త్రిప్పుకొను. ధా. ప్రే.) 1. కలఁచు, క్షోభింపఁజేయు. (చూ. త్రిప్పుకొల్పు), 2. మరలించు, పోఁజేయు. "సీ. అల్లన యూఁదెడు నప్పు డక్కొమ్మ నాతెలితావి ధైర్యంబు ద్రిప్పుకొలుప." భార. అను. ౧, ఆ. ౪౦. (ముద్రి. పా. 'త్రిప్పికొలుప' శ. ర. పా.)

త్రిప్పుకొల్పు = త్రిప్పుకొలుపు. (కలఁచు.) "చ... ఇత్తెఱంగు నాహృదయముఁ ద్రిప్పుకొల్పె..." దశ. ౧౦, ఆ. ౧౫౬.

త్రిప్పుడు = త్రిప్పట. (తిరుగుడు, భ్రమణము.) "సీ.... ఒకఁడు త్రిప్పెడు త్రిప్పు డొ అద్భుతమిగిలె." కళా. ౪, ఆ. ౯౩.

త్రిప్పుడుగొను. దే. అ. క్రి. (త్రిప్పుడు+కొను) పరిభ్రమించు,తిరుగు. "ఉ...జటాటవిన్ ద్రిప్పుడుగొన్న నిర్ఝరనదీమణి..." శ్లేష. ౪, ఆ ౨౦౯.

త్రిప్పుడుత్రాడు = తిరుగుడుత్రాడు. "ద్వి. తెగనీలి మబ్బులు త్రిప్పుడుత్రాళ్లు." ద్వి. సల. 3, భా. ౨౩౪, పు.

త్రిప్పుడుపుడుక. దే. వి. (త్రిప్పుడు+పుడక.) రాట్నపు నూలుకదురు. "క....త్రిప్పుడు,పుడుకయుగుం గలుగురాట్నములు గైకొనుచున్." శుక. ౨, ఆ. ౪౧౯.

త్రిప్పుత్రాడు. దే. వి (త్రిప్పు+త్రాడు.) తరిత్రాడు (శ. ర.)

త్రిప్పులాడు. దే. అ. క్రి. (త్రిప్పుల+ఆడు.) తిరుగు, ఇటునటు సంచరించు. "చ...పల్లఋ మేషము త్రిప్పులాడెడిన్." హంస. ౬, ఆ.౨౪౩.

త్రిఫల. సం. వి. ఆ. స్త్రీ. కరక తాడి యుసిరికలు.

త్రిభండి. సం వి. ఈ. స్త్రీ. తెగడ చె.

త్రిభద్రము. సల. వి. అ. న.-దంతక్షతము, ఆలింగనము, మర్దనము వీనివలన సుఖ మిచ్చునది-రతి సంభోగము.

త్రిభుజము. సం. వి. అ. న. గణితక్షేత్రవిశేషము.

త్రిమార్గ. సం. వి. ఆ. స్త్రీ. గంగ. (వై. ని.)

త్రిమ్మట. దే. వి. (త్రిమ్మరు. ధా.) 1. పర్యటనము, సంచారము. "సీ...మున్ను హాలధరుండు తీర్థయాత్ర యొనర్పు త్రిమ్మటమై వచ్చి..." పాండు. ౨, ఆ. ౧౪౦. భార. విరా. 3, ఆ. ౯౫; 2. పరివర్తనము జరగుట. "క. యుగముల త్రిమ్మటఁ గాలం,బగణేయంబై చనంగ..." హరి. ఉ. ౯, ఆ. ౬౨; 3. ఆపద,కష్టము. "క. బిగు వెడలి సీల యూడిన,నగచరుబీజంబు లిఱక నా నొక్కిఁ గడున్,వెగడొంది మొఱలంపెట్టుచుఁ,దెగియెన్ మర్కటము వాని త్రిమ్మట వింటే." నా. పంచ. ౧, ఆ. ౯౨; 4 పరిశ్రమము,పనిపాటు. "ఉ... కడుఁ ద్రిమ్మటచే శ్రమమందినారు కాఁ, బోలును..." కళా. ౪, ఆ. ౧౦౯; 5. నడవడిక, ప్రవర్తనము. "గీ...సీదు,తరుణి కొఱగాని త్రిమ్మటఁ దిరుగఁ జొచ్చె. చెన్న. 3 ఆ. 3 ౭౪.

త్రిమ్మటకాఁడు. దే విణ. (త్రిమ్మట+కాఁడు.) త్రిమ్మరి, తిరుగఁబోతు. "క...అర్థరథుం డాధృతవర్మ్యుడు పిన్ననాఁడు త్రిమ్మటకాఁడై,పులిహీనత శస్త్రాస్త్ర, ప్రతతి పరిశ్రమము లేక పాలసుఁ డగుటన్." భార. ఉద్యో. ౪, ఆ. ౨౬౩.

త్రిమ్మరి. దే. విణ. (త్రిమ్మరు ధా.) 1. త్రిమ్మకాఁడు. (శ. ర.); 2. యథేచ్ఛముగాఁ దిరుగువాఁడు; యథేచ్ఛముగాఁ దిరుగునది."పంచ. ఏర త్రిమ్మరీ." విప్ర. ౪, ఆ. ౫౯. "క. . తత్పతి త్రిమ్మరి యని యెల్లవారుఁ జెగడెడునటుగాన్." భో. 3, ఆ. ౯౨; 3. దుష్టుఁడు. "ఉ...అధ్వరక్రియా,దేవ తపశ్శ్రుతుల్ చెఱుపఁ ద్రిమ్మరు త్రిమ్మరి..." ప్రబోధ. ౪, ఆ. ౨౫.

త్రిమ్మరీఁడు. దే. విణ. (త్రిమ్మరి+ఈఁడు.) త్రిమ్మటకాఁడు. "ఉ. తుమ్మెద త్రిమ్మరీఁడు .." వసు. 3, ఆ. ౧3౮.

త్రిమ్మరు. దే. అ. క్రి. 1. తిరుగు,సంచరించు. "ఉ. అధ్వరక్రియా దేవతపశ్శ్రుతుల్ చెఱుపఁ ద్రిమ్మరు త్రిమ్మరి..." ప్రబోధ. ౪, ఆ. ౨౫; 2. మెలఁగు; ఉండు. "ఉ...సత్యభామకన్నన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై..." పారి. ౧, ఆ. ౬౫. స. క్రి. చుట్టివచ్చు. "ఉ...ఈక్షణమ త్రిమ్మరి వత్తుఁ ద్రివిష్టపంబులన్." భార. ఆది. ౨, ఆ. ౧౧౫.

త్రియంబకుఁడు. సం. = త్ర్యంబకుఁడు. పండితా. పర్వ. 3౨౦, పు.

త్రియామ. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపుచె; 3. నీలి చె; 4. యమున.

త్రిరాత్రము. సం. వి. అ. పుం. 1. యజ్ఞవిశేషము; 2. మూఁడురాత్రులు; 3.మూఁడురాత్రులతోఁ గూడినమూఁడుదినములు.

త్రిలవణము. సం. వి. అ. న. సైంధవబిడరుచకములు.

త్రిలింగము. సం. వి. అ. పుం. శ్రీశైలదక్షారామ కాళేశ్వరము లనులింగములమధ్య నున్న దేశము, తెలుఁగు నాఁడు. విణ. (అ. ఆ. అ.) మూఁడు లింగములు గలది.

త్రిలోకి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడులోకములసమూహము.

త్రిలోచనుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి,శివుఁడు.

త్రివత్సము. సం. వి. అ. పుం. మూఁడేండ్లకోడెదూడ.

త్రివర్గము. సం. వి. అ. పుం. 1. ధర్మార్థకామములు; 2. సత్త్వరజస్తమోగుణములు; 3. స్థితివృద్ధిక్షయములు; 4. త్రికటుకము; 5. త్రిఫల.

త్రివిక్రముఁడు. సం. వి. అ. పుం. మూఁడులోక ములను మూఁడడుగులచే నాక్రమించిన విష్ణువు.

త్రివిష్టపము. సం. వి. అ. న. తృతీయవిష్టపము, స్వర్గము.

త్రివృత. సం. = త్రివృత్త.

త్రివృత్త. సం. వి. ఆ. స్త్రీ. తెగడ ✽.

త్రివృత్తము. సం. వి. అ. పుం. రత్నదోషములలో నొకటి. రత్న. ౧౦.

త్రివృత్తు. సం. వి. త్. పుం. 1. యజ్ఞము; 2. యజ్ఞోపవీతము; 3. మూఁడుపేటలమొలనూలు. స్త్రీ. త్రివృత్త. విణ. (త్.) మూఁడురెట్లు అయినది.

త్రివేణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గంగానది యమునా సరస్వతులతోఁ గలయు చోటు; 2. యమునా సరస్వతులతోఁ గలిసినగంగానది.

త్రివేణిక. సం. = త్రివేణి. (యమునాసరస్వతులతోఁ గలిసినగంగానది.) "చ. జలరుహరాగనీలమణిసంగతహీరమయంపు బాత్రలో, జలరుహనాభ పాద జలజంబులు భక్తిప్రసిద్ధి వారిధా, రలఁ గడిగెన్ దివాకరుఁడు రాణి యొసంగఁగఁ దన్మణిప్రభా, కలనఁ ద్రివేణికాజలముకై వడి పాత్రజలంబుకై వడిన్." కాళిందీ. ౪, ఆ. ౧౧౭.

త్రిశంకువు. సం. వి. ఉ. పుం. 1. హరిశ్చంద్రుని తండ్రి; 2. చాతకము; 3. పిల్లి; 4. మిడుత.

త్రిశిఖము. సం. వి. అ. న 1. త్రిశూలము; 2. కిరీటము. పుం. మారేడు ✽.

త్రిశుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. త్రికరణశుద్ధి. "ఉ .. త్రిశుద్ధిగ నమ్మ భారతీ..." (పోతనచాటువు.)

త్రిశూలము. సం. వి. అ. న. ఒకానొకయాయుధము, ముమ్మొనవాలు.

త్రిశూలి. సం వి. న్. పుం. శివుఁడు.

త్రిషవణము. సం. వి. అ. న. 1. మూఁడుసవనములు; (1. ప్రాతస్సవనము; 2. మాధ్యందినసవనము; 3. సాయంసవనము.); 2. మూఁడుకాలములు. (1. ప్రాతఃకాలము; 2. మధ్యాహ్నకాలము; 3. సాయంకాలము.)

త్రిష్టుప్పు. సం. వి. భ్. స్త్రీ. ఛందోవిశేషము.

త్రిసంధ్యము. సం. వి. అ. న. మూఁడుసంధ్యాకాలములు.

త్రిసీత్యము. సం. విణ. (అ. ఆ. అ.) మూఁడుసారులు దున్నినది.

త్రిసూత్రము. సం. వి. అ. న. బ్రహ్మసూత్రము, జన్నిదము. పుం. వైడూర్యవిశేషము. (శ. ర.)

త్రిస్రోతస్సు. సం. వి. స్. స్త్రీ. గంగానది.

త్రిహల్యము. సం. = త్రిసీత్యము.

త్రిహాయణి. సం. వి. ఈ. స్త్రీ. మూఁడేండ్లపెయ్య.

## త్రు

త్రుంగు. దే. అ. క్రి. 1. తునుక లగు. "మ. తురగస్యందనవారణప్రకరముల్ త్రుంగన్ విజృంభించె దన్." భార. ద్రో. ౪, ఆ. ౩౩౯; 2. రాలు. "క...చుక్కలు త్రుంగున్." పె. శకుం. ౧, ఆ. ౫౪౦; 3. అంతమగు. "సీ. యుగము ద్రుంగెడునాఁడు జగములు వొలియించునంతకమూర్తిపై నింత యగుచు." భాగ. ౬, స్కం. ౩౧౮. నీలా. ౩, ఆ. ౧౭.

త్రుంగుడు. దే. వి. (త్రుంగు ధా.) 1. ప్రళయము. ఆం. భా. ప్ర. ౯౮; 2. వినాశము. (చూ. త్రుంగుడువడు)

త్రుంగుడువడు. ద్వ. అ. క్రి. (త్రుంగుడు+పడు.) 1. చల్లాఱు, శాంతించు. "క. కామోపభోగసుఖములు, వేమాఱును బురుషుఁ డనుభవించుచు నున్నం, గామంబు శాంతిఁ బొందదు, ధూమధ్వజుఁడాజ్యవృష్టిఁ ద్రుంగుడువడునే." భాగ. ౯, స్కం. ౪౮౧; 2. నశించు, రూపఱు. "సీ. తంద్రిసద్గుణసముదయము ద్రుంగుడువడ మెలఁగుపుత్త్రుఁడు హీనుఁడు..." మార్క. ౫, ఆ. ౩౪౦.

త్రుంచు. దే. స. క్రి. (త్రుంగు ధా. ప్రే.) 1. తునుకలుచేయు. "గీ. అనిమిషారాతి వి ల్లెత్త నగజ త్రుంచె." కాశీ. ౬, ఆ. ౫౮౪; 2. నఱుకు. "సీ. తుత్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి." భార. విరా. ౪, ఆ. ౩౪; 3. తెగఁగొట్టు. "చ... నారిఁ ద్రుంచి..." భార. విరా. ౪, ఆ. ౧౪౧; 4. చంపు. "చ. విజయుఁడు వారి నెల్ల నొక వ్రేల్మిడిఁ ద్రుంచియు..." భార. విరా. ౪, ఆ. ౧౭౪; 5. చించు. "గీ . దుకూలముల్ త్రుంచి త్రుంచి కట్ట నిచ్చిన .." ఉ. హరి. ౪, ఆ. ౧౧౪; 6. విభజించు. "గీ. శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల, కంత బహుమార్గములఁ ద్రుంచి యనుమతింపఁ, బెక్కుశాఖలు గలిగె యీపృథివిలోన, నిగమ మొప్పార భూసురనివహ మందు." భాగ. ౧, స్కం. ౭౩.

త్రుంపు. దే. వి. (త్రుంచు. ధా.) 1. ముక్క,శకలము. "గీ. త్రుంపు లైనదామరములుఁ దునుక లైన తొడవులును గల్గి సమరమత్యుగ్ర మయ్యె." జై. ౫, ఆ. ౯౯౨; 2. మేలివస్తువు. "క. త్రుంపుల గని వగునీ వీ,సొం పెడలిన పేదమానిసుల వెంటఁ గటా,దుంపలుఁ గూరలు నమలుచుఁ,గంపలఁబడి తిరుగ నేల కైకొను మమ్మున్." అచ్చ. ఆర. ౬౦

త్రుంపుడు. దే. వి. (త్రుంచు ధా.) త్రుంపు,శకలము. (శ. ర. బ్రా.)

త్రుక్క. దే. వి. 1. గర్వము ఆం. భా. ప్ర. ౨౩౩. పాండు. ౫, ఆ ౧౦౮; 2. చిలుము. ఆం. భా. ద్వి. ౨౮౦.

త్రుటనము. సం. వి. అ. న. తెగుట. భార. విరా. ౪, ఆ. ౨౭౬.

త్రుటి. సం వి. ఇ. ఈ. స్త్రీ. 1. తామరఆకుసందు తీక్ష్ణ మగుసూది దిగుసంతటికాలము; 2. లేశము; 3. సంశయము; 4. చిట్టేలకి ❦.

త్రుటితము. సం. విశే. (అ. ఆ. అ.) తెగినది.

త్రుట్టియ = త్రుట్టె. (శ. ర.)

త్రుట్టె. దే. వి. గుంపు,పోగు. (చూ. త్రుట్టెలుగట్టు.)

త్రుట్టెలుగట్టు. దే. అ. క్రి. (త్రుట్టెలు+కట్టు.) గుంపగు,దగ్గఱఁగాఁ జేరు. "ఉ. త్రుట్టెలుగట్టి నిద్రిలు మరుద్ఖగధీశకులంబు మేల్కనన్." పాండు. ౫, ఆ. ౨౪౯.

త్రుప్పు. దే. వి. 1. అయోమలము,ఇనుపకిట్టము. ఆం. భా. ద్వి. ౨౮౦; 2. కాలుష్యము,దోషము. "గీ. అప్పటప్పటికిని జిహ్వత్రుప్పు దుల్ల." స్వా. ౨, ఆ. ౧౧; 3. దారిద్ర్యము,లేమి. "గీ. సత్కవుల త్రుప్పు దుల్చువసంత వేళ." జై. ౧, ఆ. ౪౫.

త్రుప్పుడు. దే. వి. 1. రోమము. ఆం. భా. ద్వి. ౧౪౬; 2. తునుక. "చ...తత్తురగరథధ్వజాళి నొకత్రుప్పుడు రాలదు..." భార. విరా. ౫, ఆ. ౨౩౯; 3. కాలుష్యము. "వ.. త్రుప్పుళ్లు దుల్లి త్రుళ్లి గంతు లిడుగబ్బిబుబ్బులుల..." స్వా. ౪, ఆ. ౩౭.

త్రుమ్ము. దే. వి. దుమ్ము. ఆం. భా. ద్వి. ౨౨౦.

త్రువ్వ. దే. వి. 1. తువ్వ,దూడ; 2. గిత్త. "క. త్రువ్వఁట బాబాకలపై,పువ్వఁట..." చాటువు.

త్రుస్సు. దే. వి. నీళ్లు చిమ్ముటయం దగుధ్వని కనుకరణము. "ఉ. ఘట్టితరూఢతిం గరిముఖంబునఁ

చీలిచి గొంతమీనదిం, బుట్టినసత్ప్రవాహజల పూరముఁ ద్రుస్సన నూఁదుచున్..." భీమ. ౫, ఆ ౧౧౬.

త్రుళ్లగించు. దే. అ. క్రి. త్రుళ్లు;మిక్కిలి వ్యాపించు. "గీ. దోర్ద తామ్రాలదీప్తులు త్రుళ్లగింప." వరాహ. ౯ ఆ. ౧౩౯.

త్రుళ్లగింత. దే. వి. (త్రుళ్లగించు ధా.) ఎగసిపాటు. "సీ. కుంతలమ్ములత్రుళ్లగింతలు సడలినఁ గెమ్మోవి చుంబనక్రీడ కెలయ." విక్ర. ౪, ఆ. ౨౭౬.

త్రుళ్లగింతలువెట్టు. దే. అ. క్రి. (త్రుళ్లగింతలు+పెట్టు.) 1. గంతులువేయు, దుముకు. "వ...బలిష్ఠంబు లగుతిర్యక్శాఖలపై త్రుళ్లగింతలువెట్టుచు..." భో. ౫, ఆ. ౯౯; 2. ఎక్కువప్రసరించు,మిక్కిలి వ్యాపించు. "సీ. దోర్మూలరోచులు త్రుళ్లగింతలు వెట్టఁ దివ్వటమైఁ దుఱుములు దిద్దుకొనుచు." హరిశ్చ. ౨, ఆ. ౧౨౨. "సీ. త్రుళ్లగింతలు వెట్టు తొడలదీప్తులతోన చనుదోయిమించులు చౌక ళింప." విక్ర. ౮, ఆ. ౩౭. ('త్రుళ్లమింతలు' అని అపముద్రి. ఈయపముద్రితపాఠమునే శ. ర. స్వా. ని. లు గ్రహించుట చిత్ర్యము. చూ. విక్ర. ౪, ఆ. ౨౨౬.)

త్రుళ్లాట. దే. వి. (త్రుళ్లాడు ధా.) క్రీడ,గొండ్లి. ఆం. భా. ప్ర. ౧౪౦.

త్రుళ్లాడు. దే. అ. క్రి. (త్రుళ్లు+ఆడు స్వార్థమున.) 1. ఎగిరిపడు. (చూ. త్రుళ్లియాడు.); 2. నర్తించు. "సీ. బవనీలజవనికపాటల నిల్లాంద్ర రమణఁ ద్రుళ్లాడించురంతుకత్తు." క్రీడా. ౧౭౬.

త్రుళ్లింత. దే. వి. 1. త్రుళ్లు, గంతు. "సీ. తోరంపుఁ జనుపోయి త్రుళ్లింతల నిడంగ..." కళా. ౪, ఆ. ౯౬; 2. గర్వము. (శ. ర)

త్రుళ్లిపడు. ద్వ. అ. క్రి. (త్రుళ్లి+పడు.) 1. మండిపడు. "క. నీమాటకు దుర్యోధనుఁ,డామెయిఁ దాఁ ద్రుళ్లిపడక యవుఁ గా కని నాఁ,డే మేనిఁ గొంత యక్కట,భూమి యొసఁగనేని యింత పుట్టదు సుమ్మీ." భార. శల్య. ౨, ఆ. ౩౭౧; 2. ఉలికిపడు. "సీ. ఎటు దేలునో యని యేమఱుచెలి త్రుళ్లిపడఁ గ్రుంకి పాదంబు లొడియఁనదియోఁ." ఉ. హరిశ్చ. ౩, ఆ. ౩౮. 3. కదలు. "సీ. బీదన రాలతోఁ బెరుఁగువాఁగడుపులో బల్లు నల్లడలందుఁ ద్రుళ్లిపడఁగ." శుక. ౩, ఆ. ౩౦.

త్రుళ్లియాడు = త్రుళ్లాడు. 1. (గంతులువేయు.) "గీ. త్రుళ్లియాడెడుతుమ్మెదపిల్ల లనఁగఁ,బొలుచు కెలఁకులకచూపులు చెలువ మమర" య. ౪, ఆ. ౩౭; 2. (చెలరేఁగు.) "సీ. ఇరువంకలందున విరులతేనియఁ గ్రోలుదొరలు మోదంబునఁ ద్రుళ్లి యాడ." హరి. ఉ. ౬, ఆ. ౫౮.

త్రుళ్లు. దే. అ. క్రి. 1. ఎగిరిపడు, మిడిసిపడు. "సీ. బిగువుపయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ ద్రుళ్లు చన్నుల నొప్పుమాళ్లపేరు." కళా. ౪, ఆ. ౧౦౫; 2. ఉప్పొంగు,ఉత్సాహమందు. "సీ. దుగ్ధపానంబులఁ ద్రుళ్లిపెయ్యలనోరినురువులు..." హరి. ఉ. ౫ ఆ. ౧౬౪; 3. గర్వించు,పొగరెక్కు. "క.... తుది నీవును దుస్సహోదు త్రుళ్లెదు టుడుగుమీ." భార. శాం. ౪, ఆ. ౩౯౮; 4. దైన్యపడు; "మ...సౌఖ్యరసైకస్థితి నుండి కాపరమునన్ గన్గాన కాపత్పరంపర రాఁ ద్రుళ్లెద వేల..." సా. ౨, ఆ. ౧౧౨; 5. చెలరేఁగు. "చ...కుంభజుఁడు.. నొంపఁగాఁ,దలఁపఁడు వీనిఁ బార్థునకుఁ దాఁగడుఁ గూర్చుట సెంత త్రుళ్లినన్." భార. ద్రో. ౨. ఆ. ౪౫ వి. 1. మిడిసిపాటు,ఎగిరిపాటు. (శ. ర.); 2. గర్వము,పొగరు. "మ. దనుజవ్రాతము త్రుళ్లడంచి..." భార. ఉద్యో. ౧, ఆ. ౧౩౦. భార. అర. ౬, ఆ. ౧౭౩.

త్రుళ్లుఁబోతు. దే విశే.(త్రుళ్లు+పోతు.) పొగరుఁబోతు, గర్వి. "ఆ. త్రుళ్లుఁబోత నీవు తూలి పోఁ బలికిన, సార మేమి తెలియఁగుఁ జక్రమునకు." ఉ. హరి. ౩, ఆ. ౧౭.

త్రుళ్లుపిండి. ద్వి. వి. (త్రుళ్లు+పిండి.) స్ఫోటకము కనిపించినప్పుడు పోలేరమ్మకు కొట్టిపెట్టెడుపిండి. (శ. ర.)

## త్రె

త్రెంచికొను. దే. స. క్రి. (త్రెంచు+కొను స్వార్థమున.) ఖండించు,నఱకు. "గీ. నిరుపమధ్యానసుఖవృత్తి నిలిచియున్న,పుణ్యు జమదగ్ని నందఱుఁ బొదుగఁ బట్టి,కుదులకుండంగఁ దలఁ ద్రెంచి కొనుచుఁ జనిరి..." భాగ. ౯, స్కం. ౪౭౮.

త్రెంచు. దే. స. క్రి. (త్రెగు. ధా. ప్రే.) 1. నఱకు. ఖండించు. (చూ. త్రెంచికొను.); 2. తెగఁజేయు,ముక్కలుచేయు. "సీ. ఠక్కుఠక్కున సంఘ)పాశముల్ వెసఁ ద్రెంచి దేగతండముల మింటికిని విడిచి." స్వా. ౪, ఆ. ౧౦౩.

త్రెంపు = త్రెంచు. (కోయు.) "గీ. అంపమున వీని కంఠంబుఁ ద్రెంపి విడుఁడు." కాశీ. ౩, ఆ. ౧౫౨. వి. తెంపు,తెగువ. "ఆ. అరయఁ గర్మరూప మగునవిద్యాజన్మ,మైనహృదయబంధనాదిల తల, నప్రమత్తయోగ మనుమహాచ్ఛురికచేఁ, ద్రెంప వలయు నంత త్రెంపుతోడ." భాగ. ౫, స్కం. ౧, ఆ. ౭౦.

త్రెక్కు = తెక్కు. (చూ. తెక్కు.)

త్రెక్కొను. దే. అ. క్రి. (త్రెగు? త్రెక్కు?+కొను.) 1. కలఁగు,క్షోభించు. "గీ. పెక్కుమాఱులు వెస వీచి త్రెక్కొనంగ,వదలి వారిధిలోపల వైవ .." భా. రా. యు. ౧౩౫౮; 2. అధికమగు,మిక్కుటమగు. "క...త్రెక్కొనుఁ బాపంబు రణము తెరువే వొల్లన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౮౪. అను. ౫, ఆ. ౬౮. స. క్రి. 1. కలఁచు. "ఉ....వియన్నదిశాపవాక్యముల్, త్రెక్కొన నాగ్రహంబుడుపలేక కుమారునిఁ దన్నె..." జై. ౫, ఆ. ౧౬౯. నిర్వ. ౫, ఆ. ౧౨౨; 2. చంపు. "ఉ. అక్కట తండ్రి లేనిపము నష్టెయిఁ,బెంచినతాత సెష్మెయిం,ద్రెక్కొనఁ గాదు..."భార. భీష్మ. ౩, ఆ. ౩౦౭; 3. నశింపఁజేయు. "మ... ఈపాపంబు నిన్ ద్రెక్కొనున్." భార. అర. ౬, ఆ. ౧౯౨; 4. త్రాగు;మ్రింగు. "క...బడబాగ్ని దళం,బై జలనిధి ద్రెక్కొనియెదు, నోజన్..." భార. విరా. ౫, ఆ. ౫౮. మార్క. ౬, ఆ. ౧౬౪.

త్రెక్కొలు. దే. వి. (త్రెక్కొను. ధా.) త్రెక్కొనుట. (చూ. త్రెక్కొలుగొను.)

త్రెక్కొలుగొను. దే. అ. క్రి. (త్రెక్కొలు+కొను.) చంపు. "గీ. దుష్టభుజగంబు లందంద తోలి కలఁచె, క్రూరమృగచయ మెల్లఁ ద్రెక్కొలుగొనియె. వి. పు. ౬, ఆ. ౩౧౫.

త్రెగు = తెగు. (శ. ర.)

త్రెడ్డు = తెడ్డు. 1. (గరిటె.) "గీ. శ్రీవిశాలాక్షి బంగారుత్రెడ్డునందు,నమృతపాయసమొసఁగు సభ్యాగతులకు." భీమ. ౨, ఆ. ౧౧౫; 2. (పడవ నడపుసాధనము.) "చ. కలికవిశాబ్ధిలోన ముఖ

గహ్వర మొడయుఁ జిహ్వాత్రెడ్డు హృత్పవనుఁడు పిలికాఁడు..." శివరా. ౧, ఆ. ౬.

త్రెయ్యు. దే. అ. క్రి. తెగు, ఖండితమగు. "మ... త్రెస్సె నారాయణో, న్నతదోర్దండవిముక్తచక్రనిహతిన్ నాకద్విషన్మస్తక, ప్రతతుల్ ఘోరరణంబునం బడియె..." భార. ఆది. ౨, ఆ. ౨౪. "క. అనిలసుతుం డంతన వే, ల్కని నీల్గుడు నతని వజ్రఘనకాయముఁ బొం, దినలతి కాజాలములెల్లను ద్రెస్సె మృణాళనాళలతికలపోలెన్." భార. ఆది. ౫, ఆ. ౧౭౨.

త్రెవ్వన. దే. వి. చక్కన, సౌందర్యము. (శ. ర.)

త్రెవ్వు. దే. అ. క్రి. 1. తెగు. "క. ఇవి దుస్ససేను వ్రేల్గం, దవిలి నగము త్రెవ్వి పోయి తక్కిన యవి..." భార. ఉద్యో. 3. ఆ, ౧౧౬. కాశీ. ౭, ఆ. ౯౪, 2. విడిపోవు. "క. కవ్వడి యొక్కఁడ కంటిరె, జివ్వనఁ జేరుద మితండు నీడ్పడఁగా నిం, దెవ్వరుఁ గడంగ లే రిది, త్రెవ్వి పడినధనము లెటులఁగిలిమి లోఁ దెల్లన్." భార. వి. ౧౮౧; 3. అంతమగు. "ఉ. త్రెవ్వనిమాయలో మునిఁగి తేలెదుమీలము గామె యీశ్వరా." కవిక. ౬, ఆ. ౧౮౨.

త్రెళ్లించు. దే. స. క్రి. (త్రెళ్లు. ధా. ప్రే.) పడఁ గొట్టు కూల్చు. "క. విల్లెక్కిడి యొకచిల్కనఁ, ద్రెళ్లింపుము పోలఁతి..." అచ్చ బాల. ౧౧౨. శ్రీరం. మా. ౫, ఆ. ౩౭.

త్రెళ్లు. దే. అ. క్రి. 1. పడిచచ్చు. "గీ. కన్నియల తోన నాడుచు నున్నదానిఁ, బాదమరి త్రమ్మె యొక్కపన్నగంబు, గఱచెఁ గన్నియ లందఱు వెఱచి పఱచి, యఱచుచుండఁ బ్రమద్వర యవనిఁ ద్రెళ్లె." భార. ఆది. ౧, ఆ. ౧౪౭. భార. సభా. ౨, ఆ. ౬౯; 2. విఱుగు. "సీ... దిక్చక్రవాళంబు ద్రెళ్లిపడఁగ." కాశీ. ౫, ఆ. ౧౩౦; 3. పడు, రాలు. "పంచ... త్రెళ్లెఁ దార లాఱె నగ్ని..." దశా. ౩, ఆ. ౧౯౮.

## త్రే

త్రేంచు. దే. అ. క్రి. త్రేనుచు, ఉద్గారించు. "గీ... అమ్మునీశ్వరుఁడు, గడుపుఁ దడవికొనుచుఁ గఱ్ఱనఁ ద్రేంచిన, నసుర జీర్ణమయ్యె నాతఁ డంబ." భార. అర. ౨, ఆ. ౩౪౫. స్కాం. ౬, ఆ. ౨౮.

త్రేంపు. రే. వి. (త్రేఁచు. ధా.) ఉద్గారము, త్రేన్పుట. "గీ. భుక్త గొన్నట్టిసారి త్రేఁపులు పొసంగె." కవల. ౨, ఆ. ౧౦౭.

త్రేగుడు. దే. వి. తేగుడు, చొంగ. "చ... నోరఁ ద్రేగుడు దొరగంగ నెంతయును గ్రస్సి..." హరి. పూ. ౬, ఆ. ౪౩.

త్రేణి. దే. విణ. సుందరము, అందమైనది. "సీ. జడలు గట్టియు నింత సక్కనైనది వేణి దీర్చినచెలు లెంత త్రేణి యగునొ." కు. సం. ౭, ఆ. ౭.

త్రేత. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయుగము; 2. మూఁడగ్నులు. (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము.)

త్రేనుచు = త్రేఁచు. (శ. ర.)

త్రేనుపు = త్రేఁపు (శ. ర.)

త్రేన్చు = త్రేనుచు. "ద్వి. త్రేన్పకపోదునే దేవ యే ననుచుఁ, ద్రేన్పఁగ నైనను దెలిపి లే దనుచు." బస. ౭, ఆ. ౬౮౩.

త్రేన్పు = త్రేఁపు. (శ. ర. బ్రా.)

త్రేపుడు = త్రేగుడు. "గీ. ఏవముగ బొమ్మపై నిండఁ ద్రేపు డొలుక." దశ. ౬, ఆ. ౧౪౯.

## త్రై

త్రైగుణ్యము. సం. వి. అ. న. 1. మూఁడుగుణములు కలిగియుండుట; 2. మూఁడుగుణములధర్మము; 3. మూఁడురెట్లు; 4. సత్త్వరజస్తమోగుణముల సమాహారము; 5. శైత్యసౌగంధ్యమాంద్యము లను మూఁడుగుణములు.

త్రైమాతురుఁడు. సం. వి. అ. పుం. కౌసల్యాకైకేయీసుమిత్రలకొడుకు లక్ష్మణుఁడు.

త్రైయక్షము. సం. విణ. (అ. ఈ. అ.) త్ర్యక్షసంబంధి, శివసంబంధమైనది. "శా. త్రైయక్షోణిమభూతి సూక్ష్మకరమధ్యాదేవి వీక్షింపుమా." నైష. ౮, ఆ. ౧౯౪.

త్రైరాశికము. సం. వి. అ. న. గణితమున ప్రమాణరాశి, ఫలరాశి, ఇచ్ఛారాశి యనుమూఁడురాసుల నాధారముగాఁ జేసికొని లెక్కించువిధము. [ము.

త్రైలోక్యము. సం. వి. అ. న. త్రిలోకములసమాహార

త్రైవిధ్యము. సం. వి. అ. న మూఁడువిధములుగా నుండుట. [సంబంధమైనది.

త్రైవిష్టపము. సం. విణ. (అ. ఆ. అ.) త్రివిష్టప

త్రైవిష్టపుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

త్రొ

త్రొక్కాట. దే. వి. (త్రొక్కు. ధా.) తొట్రుపాటు. "గీ. అటు లిటులు చూచి వారి త్రొక్కాటలు చూచి." సావి. ౧, ఆ ౧౭. అచ్చ. సుం. ౭౧. అచ్చ. పీఠి. ౨౪.

త్రొక్కటపడు = తొక్కటపడు (శ. ర.)

త్రొక్కటపాటు = తొక్కటపాటు. (శ. ర.)

త్రొక్కటము = తొక్కటము. (చూ. తొక్కటము.)

త్రొక్కటలాడు. దే. అ. క్రి. (త్రొక్కటలు+ఆడు.) తొట్రుపడు "ద్వి. ఎక్కడ నున్నవాఁ డేఁడేఁడి యనుచుఁ, ద్రొక్కటలాడుచుఁ ద్రోయఁగ రాక, కప్పియుండిన ప్రజఁ గడకుఁ బోఁ ద్రోలి." ద్వి. శ. సా. ౨, భా. ౭౨, పు. ౫, పం.

త్రొక్కడ = త్రొక్కట. (చూ. త్రొక్కడపడు.)

త్రొక్కడపడు. ద్వ. అ. క్రి. (త్రొక్కడ+పడు.) తొట్రుపడు. "చ. అదుగక మున్న నీవు నిఖిలావని తండ్రి యొసంగియుండఁ ద్రొక్కడపడ నేటికి..." చం. రా. ౪, ఆ. ౪౨.

త్రొక్కిడి. దే. వి. (త్రొక్కు. ధా.) త్రొక్కట. (చూ. త్రోపుద్రొక్కిళ్లు.)

త్రొక్కిళ్లు. దే. వి బ. (త్రొక్కు. ధా.) 1. బాలక్రీడావిశేషము. "గీ పింపిళ్ళు త్రొక్కిళ్లు బేడిస తెరుగుళ్లు నచ్చనగండ్లు..." హంస. ౫, ఆ. ౧౫౫; 2. త్రొక్కుడలు.

త్రొక్కు. దే. అ. క్రి. 1. నడచు. "గీ. శతపదంబులు ద్రొక్కఁ బిశాచగణము." దశా. ౨, ఆ. ౪౩౫; 2. పాదముతో నదుము. "క...భూ, జాయకుఁ డను మరలి పటుకోపాయత్తతఁ ద్రొక్కఁ బడ్డయహిగతిఁ గవిసెన్." భార. విరా. ౫, ఆ. ౨౦౬; 3. వర్తించు. "చ. ధృతుఁ పుర సౌక్షిం తయుం దొలఁగఁ ద్రొక్కమి యొంతయు మేలు.." భార. శాం. ౧, ఆ. ౪. స. క్రి. 1. సందర్శించు. "సీ. ఆశ నానాదివ్యదేశముల్ ద్రొక్కనీ మగనాలి సరిపోల్పఁ దగదు విధవ." కాశీ. ౨, ఆ. ౭౩; 2. అణచు. "క... పాపములగమి కాలం, ద్రొక్కెదవు నీవ..." పారి. ౧, ఆ. ౫౦; 3. ప్రసరింపఁజేయు. "క. కనుగడ లెల్లెడలఁ ద్రొక్కఁగా నునుఁగెంపుల్." కవ. ౪, ఆ. ౧౦౩; 4. (త్రోటిలో పోసి.) దంచు. "చ...,కాఁపుఁగూఁతులు తెలియావనాళములు ద్రొక్కఁగ..." హంస. ౧, ఆ. ౧౫౫; వి. 1. త్రొక్కుడు, త్రొక్కట. "ఉ. గోరిజలత్రొక్కునం బ్రిదిలి కుండలిభర్త యొసంగ..." నృసిం. ౩, ఆ. ౩౬. పారి. పూ. ౪, ఆ. ౧౬; 2. ఒత్తుడు; అతిశయము. "క వెల్లి యగువగల త్రొక్కున..." ఉ. హరి. ౫, ఆ. ౧౬౬. భార. కర్ణ. ౧, ఆ. ౩౧.

త్రొక్కుడు. దే వి. (త్రొక్కు. ధా.) 1. త్రొక్కట; దర్శనము. "సీ. వీని త్రొక్కుడు గారవింపుము ప్రాగ్గిరికి సహింపఁజాలుట భారమే దవాగ్ని." వరాహ. ౪, ఆ. ౨౩; 2. ఒత్తుడు (చూ. త్రొక్కుడుపడు.); 3. పశురత్నము. (పక్షిరత్న మని శ. ర.) ఆం. భా. ద్వి. ౧౭౮. విణ. త్రొక్కుడుపడునది. (చూ. త్రొక్కుడుబల్ల మొ.)

త్రొక్కుడుఁగమ్మి. ద్వ. వి. (త్రొక్కుడు+కమ్మి.) కడపక్రిందిపలక, శిల. (శ. ర.)

త్రొక్కుడుపట్టె. ద్వ. వి. (త్రొక్కుడు+పట్టె.) త్రొక్కుడుఁగమ్మి. (శ. ర.) బ. సాలెవాఁడు నేయునపుడు త్రొక్కెడుచెక్కలు. (శ. ర.)

త్రొక్కుడుపడు. ద్వ. అ. క్రి. త్రొక్కుడు+పడు.) ఒత్తిడినందు. "క. జనియించు మొదలు వాయని, తనుజీవము లక్కటా వితావిత స్త్రీ సంవస్తునిరూఢ లాభాలాభంబునఁ ద్రొక్కుడుపడి విభక్తములుగాఁ దలఁచున్." చంద్రా. ౪, ఆ. ౧౭౧.

త్రొక్కుడుపలక. ద్వ. వి. (త్రొక్కుడు+పలక.) 1. జాళ్లపనివానికాలిక్రిందిపలక. (శ. ర.); 2. సాలెపనివానికాలిక్రిందిరాట్నపుఁబలక. "క. వడిదారము చెవులుం ద్రొక్కుడు పలకయు..." శుక. ౧, ఆ. ౪౨౦.

త్రొక్కుడుపాటు. ద్వ. వి. (త్రొక్కుడుపడు. ధా.) ఒత్తుడు, రాయిడి. "సీ. శాఖాయపటములు గటిశటంబుల నూడి త్రొక్కుడుపాటుచేఁ దునియుచుండ." దశా. ౧, ఆ. ౧౭౯.

త్రొక్కుడుబిళ్ల. ద్వ. వి. (త్రొక్కుడు+బిళ్ల.) బాలక్రీడావిశేషము. (శ. ర. ఒంటికాలితో నడచి వెళ్లి త్రొక్కి యది గీసినగీతమీఁద పడకుండఁ ద్రోయుచు నాడెడియాట. వా.)

త్రొక్కుడుబొమ్మ. ద్వ. వి. (త్రొక్కుడు+బొమ్మ.) రాట్నమునందలియొకానొకసాధనము. "క...త్రొక్కుడుబొమ్మయునుం బ్రిప్పుడు, పుడకయునుం

గలుగురాట్నములు గైకొనుచున్." శుక. ౨, ఆ. ౪౨౦.

త్రొక్కుడుపడు = త్రొక్కుడుపడు. 1. (తొట్రుపడు.) "వ... చిక్కులబెయ్యుడ్రొక్కుడు పడి..." హరి. ౨, ఆ. ౫౬; 2. (అదుముడు పడు.) "ఉ. త్రొక్కుడుపడ్డభోగిగతి మ్రోగి..." కవిక. ౨, ఆ. ౧౩౪.

త్రొక్కులాడు. దే. అ. క్రి. (త్రొక్కులు+ఆడు.) 1. కలఁగు. "గీ... మీరలు చేసినకర్మఫలముల నుభవింపుఁడు మఱి త్రొక్కులాడ నేల." శివధ. ౪, ఆ. ౫౪; 2. ఒకదాని నొకటి మించు "క... అబ్ధిబోల్కవతి మనంబున, నబ్బురమును భయమును ద్రొక్కులాడఁగ నుండెన్." శుక. ౨, ఆ. ౨౫౩.

త్రొక్కుపడు = త్రొక్కుడుపడు. (కాలియదుముడు నందు.) "ఆ. పాము ఫణమునందు బలిమి చూపక యున్న, దోఁక యేమి సేయుఁ ద్రొక్కుపడియు." సాంబో. ౫, ఆ. ౬౪. హరి. పూ. ౬, ఆ. ౧౭౯.

## త్రో

త్రోచిపుచ్చు. దే. అ. క్రి. (త్రోచి+పుచ్చు. స్వార్థమున.) 1. విడిచిపెట్టు. "గీ. బలిమి మున్నేల తెచ్చి తిప్పుడఁతి మగుడఁ, ద్రోచిపుచ్చంగఁ దగునయ్య..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౦౬; 2. నిర్లక్ష్యముచేయు. "క. పలుకకయె త్రోచిపుచ్చిన, బిలిచి పిలిచి నోరు నొచ్చి పెల్కురఁ గని..." జాహ్నవీ. ౪, ఆ. ౪౨.

త్రోచు. దే. అ. క్రి. 1. పైఁబడు. "ఉ. త్రోచిరి వీఁక వానరులు దూలిరి రక్కసు లింక నీవు వే, వే చననిమ్ము తేరు శరవృష్టిని ముంచెద శత్రుసేనలన్." భా. రా. యు. ౬౫౭; 2. అతిశయించు. "ఉ. త్రోచిన శోకవేదనలతోడఁ గుమారక నీ ముఖాబ్జమున్, జూచినయప్పు డెల్ల మది చుట్టును దీరనిలజ్జపెంపునన్." జై. ౧, ఆ. ౮౯; 3. వడి గలుగు. "క. ఆదీకటి నొక్కండును, ద్రోచి చనఁగ రామి..." విక్ర. ౫, ఆ. ౧౯౬; 4. స్రవించు. "క. ఈచందంబునఁ జెఱపులు, వేచియుఁ బైఁ బూఁచి లాఁచి వ్రేసియుఁ బైపై, ద్రోచు రుధిరమునఁ బడిసిరి, పూచినమోదుపులతోడఁ బుట్టు లనం గన్." ఉ. హరి. ౩, ఆ. ౬౩. స. క్రి. 1. ఉపేక్షించు. "సీ... ధర్మంబుఁ బెడవాయఁగాఁ ద్రోచి వేదశిరుద్ధదుర్వృత్తి వరగి." హరి. పూ. ౩, ఆ. ౫౪; 2. నశింపఁజేయు. "సీ. సాధుసమ్మతముగా సామజంబు నితండు గాచినాఁ డీతఁడు ద్రోచినాఁడు." ఉ. హరి. ౨, ఆ. ౧౮౦; 3. గెంటు. "ద్వి. తన్ని యంతటఁ బోక తలఁ బట్టి యీడ్చి నన్ను సుద్ధతిఁ ద్రోచె నగరంబు వెడల." ద్వి. హరిశ్చ. పూ. ౭౫౬ పం.; 4. తప్పించుకొను. "ఉ. ఎడ సొచ్చిన దుష్కృతవిశేషముల్ ధృతిం ద్రోచుచు..." భార. అను. ౫, ఆ. ౨౭౬; 5. దాఁటు. "గీ. అచమూరుపు యూథంబుఁ ద్రోచి పఱచె." పాండు. ౫, ఆ. ౧౫; 6. విడుచు. "ద్వి. నీచభామల నొల్ల నీ రాజ్య మొల్లఁ, ద్రోచి పో నిమ్మింకఁ దుకతుక మాని." ద్వి. హరిశ్చ. పూ. ౧౬౩౯, పం; 7. నిరాకరించు. "క... ఈఁ, బొమ్మని త్రోచిన..." వి. పు ౬, ఆ. ౨౫౨; 8. పడవేయు. "ఉ... కృశానుకీలలం, ద్రోయుఁడు వీని నంచుఁ గడుదుష్టమనస్కులఁ బంచె నల్వురన్." నృసిం. ౪, ఆ. ౫౦; 9 దృఢపఱచు. "ఉ... సమయం బై, యూక్యలు ద్రోచి చెప్ప ..." నిర్వ. ౪, ఆ ౭౬.

త్రోటకము. సం. వి. అ. న. 1. నాటకమందలి గర్భసంధికిఁ గలయంగములలో నొకటి; 2. ఒకానొక రూపకము. విణ. (అ. టీకా. అ.) త్రుంచుపది.

త్రోటనము. సం. వి. అ. న. త్రుంచుట.

త్రోటి. ఉభ. దే. వి. బెదరింపు. "క. లాటపతి యెవ్వఁ డాతని, పోటేటిది వానితోడిపొందేమి టికిం, జీటికి మాటికి నీ క్రియఁ, ద్రోటికిఁ బడ నేల వెడలఁ దోలుఁడు పీరిన్." దశ. ౪, ఆ. ౨౮. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. పక్షిముక్కు; 2. ఒకరకపుఁ జేఁప; 3. చేఁప ?.

త్రోద్రోపు. దే. వి. (త్రోపు+త్రోపు.) మిక్కిలిత్రోపు. (చూ. త్రోద్రోపులాడు.)

త్రోద్రోపులాడు. దే. స. క్రి. (త్రోద్రోపులు+ఆడు.) మిక్కిలిత్రోయు. అ. క్రి. స. క్రి. ఒకరినొకరు త్రోసికొను. "సీ. జిగిఁదగద్ధగ యనుబిగువుఁ జన్నుల మీఁదఁ గ్రమ్మించుసరులుఁ ద్రోద్రోపులాడ..." ద్వి. శ. సా. ౧, భా. ౨౨ పు. ౭. పం.

త్రోపడు. దే. అ. క్రి. (త్రోపు+పడు.) త్రోయఁబడు. "సీ. త్రోపడి యిరులు పటాపంచలై పాఱె..." స్వా. ౬౮, ౨౩. ఉ. హరి. ౪, ఆ. ౧౪౫.

త్రోపనంగొఱవి. దే. విశ. (త్రోపు+కొఱవి. శ. ర.) ఉభయభ్రష్టుఁడు; ఉభయభ్రష్టురాలు. "మ .. వనితా నీపతితోడఁ గూడవలతే నాశేల పేరేల నీకని న న్నాయనిరుద్ధుఁ డున్నయెడ కెల్లైంక్ వెలార్తేనిఁ బో,యిన నాతండు కులాభిమానఘనుఁడై యేయూరి కేత్రోవయం,చనుమానించినఁ ద్రోపనం గొఱవి చేయంజూచితే క్రమ్మఱన్." ఉ. హరి. ౫, ఆ. ౧౬౧. (శ. ర. పా.)

త్రోపరి. దే. విశ. (త్రోపు+అరి.) త్రోయువాఁడు. ఆం. భా. తృ. ౧౦. అచ్చ. సు. ౧౯౯.

త్రోపాటు. ద్వ. వి. (త్రోపడుధా.) త్రోపడుట.(శ.ర.)

త్రోపాడు. దే.అ క్రి. (త్రోపు+ఆడు.) 1. త్రోయుచుఁ ద్రోయఁబడుచు నుండు. "క...చెలితోఁ, ద్రోపా డుచునుండె నబల తోరపులజ్జన్." విక్ర. ౪. ఆ. ౨౧౮, నిర్వ. ౧౦, ఆ. ౪౫ స. క్రి. 1. త్రోయు. "మ. మగఁడం గీచకుఁ బట్టి వాఁడును బలోన్మాదంబునన్ బాహుగ,ర్వగరిష్ఠుం డగునాహిడింబరిపుఁ దీవ్రక్రోధుఁడై పట్టి బెట్టుగఁ ద్రోపాడఁగ..." భార. విరా. ౨, ఆ. ౩౪౩. పారి. 3, ఆ. ౧౫; 2. అనుసరించు. "క. మీ పాడినహరిచందము, లేపాడిగఁ దలఁప వచ్చునితఁ డేసతులం,గాపాడినవాఁ డనుఁగై,త్రోపాడిఁ దన్నువలచి తొయ్యలులారా." ఆము. ౫, ఆ. ౪౦; 3. ఒరసికొను. "మ.. త్రోపాడఁజన్నల్." సా. 3, ఆ. ౪౪.

త్రోపించు. దే. స. క్రి. (త్రోచుధా. ప్రే.) 1. వెడలఁ గొట్టు. "క. దూతం ద్రోపించి భుజా,స్ఫీతబలం బమర వెడలి..." భా. రా. బాల. ౭౨౮; 2. గెంటించు. "క. ద్వైపాయనముని వెడలం,ద్రోపించినకోపగాఁడు ధూర్జటి..." భీమ. ౪, ఆ. ౧౩; 3. త్రోచునట్లుచేయు. "క. ఆపవనజు...గంగ మడుపునఁ, ద్రోపించె సుయోధనుండు దురితకరుండై." భార. ఆది. ౫, ఆ. ౧౭౧.

త్రోపు. దే. వి. (త్రోచుధా.) 1. గెంటు. "క. ఆమాపు వలపుత్రోపున, భామాపుష్పాస్త్ర భూమిపతిఁ జేరుట కారామ యరుదేర..." శుక. 3, ఆ. ౧౫౫; 2. కూల్చుట. "సీ. ఘాతనాఘాతంబుఁ జేతనేతర మైనకళటంబుత్రోపును జరణనిహతి." భార. సభా. ౨, ఆ. ౪౧; 3. ముందుకేఁగుట. "ఆ...బల్, త్రోపు లేనిమీను..." భార. శాం. ౫, ఆ. ౫౭౮.

4. యుద్ధము. "క. చెలిమియు సంభాషణముడు, బలిమి వివాహంబుఁ ద్రోపుఁ బాడియుఁ దమయం, తలవారితోన తగు..." భార. ఉద్యో. ౨, ఆ. ౪౬. 5. నిషేధము. "క...నాతికి నిది యే,లా మేటితలం పమత్రో,పేమియు లే దోపి వినుము హితవచనంబుల." భార. అశ్వ. ౨, ఆ. ౬; 6. విడుచుట. "క...దుర్జనుని నిలఁ,దడయక యొఱక మొయిఁ ద్రోపు తగుమా చెందున్." హరి. పూ. ౫, ఆ. ౨౪౦; 7. శేషము, మిగులు. (చూ. త్రోవకు.)

త్రోపుడు. దే. వి. (త్రోచుధా.) 1. త్రోపు. (శ. ర.); 2. చిత్రిక. ఆం. భా. ద్వి. ౩౦౧.

త్రోపుడుపెట్టు. దే. స. క్రి. (త్రోపుడు+పెట్టు.) చిత్రికతో నునుపుచేయు. (శ. ర. బ్రా.)

త్రోపుత్రోపాడు దే.స. క్రి. (త్రోపు+త్రోపు+ఆడు.) ఒకరి నొకరు రాచు; ఒకరి నొకరు గెంటుకొను. "సీ. భూపాలవర్గంబు త్రోపుత్రోపాడుచు గిరికొని రెండుపక్కియల నడవ." రాజ. చ. 3,ఆ.౧౬౩, స్వా. ౫, ఆ. ౭౧, ఇట్టే, త్రోపుత్రోపులాడు. పండితా. పర్వ. ౨౯౭, పు ౭, పం.

త్రోపుద్రొక్కుళ్లు. దే. వి. బ. (త్రోపు+ద్రొక్కుళ్లు.) త్రోపాడుటలు, త్రోసికొనుటలు. (చూ. త్రోపుద్రొక్కుళ్లువాఱు)

త్రోపుద్రొక్కుళ్లువాఱు. దే.అ. క్రి. (త్రోపుద్రొక్కుళ్లు+వాఱు.) త్రోపాడు, త్రోసికొను. "ద్వి. తొడలూఁడికొనుచును ద్రోపుద్రొక్కుళ్లు, వాఱుచు..." ఎడలఁ,బాఱుచు .." పండితా. పర్వ. ౭౬౨,

త్రోపులాడు = త్రోపాడు. [పు. ౯, పం.

త్రోపువడు ద్వ అ. క్రి. (త్రోపు+పడు.) 1. గెంటబడు; పోవు. "చ...మహాత్మ యే,యనువునఁ దృష్ణ త్రోపువడు..."భార. శాం. ౫, ఆ. ౩౭౨; 2. సరకు గొనఁబడకపోవు, నిర్లక్ష్యము చేయఁబడు. 'క...పలికిన నప్పలుకు త్రోపువడ ముని పలికెన్." భార. అను. ౨, ఆ. ౨౭౦, మార్క. ౫, ఆ. ౪౦.

త్రోపుసేయు. ద్వ. అ. క్రి. (త్రోపు+చేయు.) నిరాకరించు, సరకుగొనకపోవు. "క...ఎప్పురుసునం దగ న్యాడిన నతఁడు ద్రోపుసేయక నను గైకొను నెఱుఁగఁ జెప్పు నాకుం గరుణన్." భార. అశ్వ. ౧, ఆ. ౪౩, భో. ౨, ఆ. ౯౬.

త్రోము=తోము. (సూ. ని.)

త్రోయించు. దే. స. క్రి. (త్రోయుధా. ప్రే.) త్రోయఁ జేయు, గెంటించు. "మ ..దానిన్ మెడం, దవులం గట్టి ఖసీథిఁ ద్రిప్పి వడి నాతం డబ్ధిఁ ద్రోయింప..." చంద్రా. ౫, ఆ. ౮౭.

త్రోయు. దే. స. క్రి. 1. పెల్లగించు. "శా... త్రోయుఁడు కోటమేడలు పడన్ వ్రేయుండు డాయుండు .." ఉ. హరి. 3, ఆ. 3౨; 2. తొలఁగించు "చ...కర్ణపాళిపైనలకలుఁ ద్రోయుచున్...." స్వా. ౫, ఆ ౬౭; 3. పడఁగొట్టు. "గీ. ఆసియుఁ బాత్రయుఁ దేఁ బఱపి యాంత్ర వల్లిఁ, గోలగ్గె ర ద్రోయఁ దత్కుజముతోడ, నొరగి .." ఆము. ౬, ఆ. ౨౭; 4. నిరసించు. "ఉ...త్రోయుఁ జిల్మంచుఁ బసిండి..." ఆము. ౧, ఆ. ౧౬; 5. కడపు,జరపు. "క...గుట్టు తప్పక యుండన్, ద్రోయుఁడు దివసములు .." కళా. ౬, ఆ. ౧౪3.

త్రోలు. దే. స. క్రి. 1. తఱుము. "గీ. తొలఁగ కేడ సొచ్చు మానవాదులనుశర్మ, యోధులను బాఱఁ ద్రోలి..." రాఘవ. ౪, ఆ. ౧3౯; 2. చంపు. "సీ. నరమృగాకృతిపై జనశ్లాఘ వ్రాలి ప్రహ్లాదు నేలితి పలలాశిఁ ద్రోలి." వరాహ. ౧, ఆ. ౫౨; 3. నడపించు. "ఉ. దిట్టల సీతగాంద్ర జడధిం బడఁ ద్రోలియు...వెదకించిరి వారిఁ బల్మఱున్." కళా. ౬, ఆ. ౧౦౬.

త్రోవ. దే. వి. (త్రోచు ధా.) 1. దారి. ఆం. భా. ద్వి. ౮; 2. పద్ధతి. "ఉ. నన్నయభట్ట తిక్కకవి నాథులు చూపినత్రోవ పావనంబు..." హరి. పూ. ౧, ఆ. ౪౦; 3. ఉపాయము. "గీ...అధిక, దుఃఖములఁ బొందకుండెడుత్రోవ గలదె." వి. పు. ౪, ఆ. ౧౦౪; 4. గతి. "క. నీమేనల్లుఁడు గావునఁ,గాముఁడు నీకరణి దుండగము చేసెకదా, మామకఘోరాగ్నిశిఖా, స్తోమాహుతి యయ్యె వానిత్రోవయె నీకున్." శశాం. ౫, ఆ. ౯౮; 5. జోలి; సామీప్యము. "ఆ. పద్మనయనుమీఁది భక్తియోగం బెల్లముక్తియోగ మనుచు మొదలెఱుంగు,వారి వారి వారి వారిఁ జేరినవారి, త్రోవ దలఁప వలదు దూతలార." భాగ. ౬, స్కం. ౧౯౧, వరాహ. ౬, ఆ. ౮౫.

త్రోవడు. ద్వ. అ. క్రి. (త్రోవు+పడు) శేషించు, మిగులు. "గీ. పడఁతితనువల్లిఁ జేసి త్రోవడినతావిఁ గనకగర్భుండు పువ్వువాసనలఁ జేసెఁ,గాక లేకున్న నీసొంపు గలఁగు లెట్లు." మల్హా. ౧, ఆ. ౮౫.

త్రోవపెట్టు. దే. అ. క్రి. (త్రోవ+పెట్టు) దారి యిచ్చు దారిచూపు. "ఉ ..పావలలేనియుఁ ద్రోవపెట్టెదన్." కవు ౨, ఆ. ౫౬, ఆము. ౫, ఆ. ౧౧౭.

త్రోవరి. దే. విశే. (త్రోవ+అరి.) 1. దారితెలిసిన వాఁడు. శ. ర.; 2. దారిగడచువాఁడు. సాం. ని. దేవ. ౧౮.

## త్ర్య

త్ర్యంబక. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

త్ర్యంబకుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు,ముక్కంటి.

త్ర్యక్షము. సం. వి. అ. పుం. కొబ్బెరకాయ. విశే. (అ. ఆ. అ.) మూఁడక్షరములు గలది.

త్ర్యక్షుఁడు. సం. = త్ర్యంబకుఁడు.

త్ర్యబ్ద. సం. వి. ఆ స్త్రీ మూఁడేండ్లపిల్ల; మూఁడేండ్ల పెయ్య.

## త్ర్యా

త్ర్యాహణము. సం. వి. అ. పుం. పత్తి.

## త్ర్యు

త్ర్యుషణము. సం. వి. అ. పుం. సొంటి పిప్పలి మిరియాలు.

## త్ర్యూ

త్ర్యూషణము. సం=త్ర్యుషణము.

## త్వ

త్వంగత్. సం. శత్రు. చలించుచున్న. "శా. భంగాక్రీడమహీమలీమసతమ ప్రత్యర్థి సేనాభట,త్వంగత్తిందుక కాననాంతరములన్ వర్తిల్లు సత్పుల్లసత్పుంగిన్..." నైష. ౫, ఆ. ౧౨౧. ('త్వగి గతే కమ్పే' కవికల్ప.)

త్వక్కు. సం. వి. చ్. స్త్రీ. 1. తోలు; 2. చెట్టుపట్ట; 3. దాల్చినిచెక్క; 4. స్పర్శేంద్రియము.

త్వక్సారము. సం. వి. అ. పుం. వెదురుబొంగు.

త్వగ్గంధము. సం. వి. అ. పుం. నారింజపండు.

త్వచము. సం. వి. అ. న. 1. చెట్టుపట్ట; 2. లవంగపు[పట్ట.

త్వచిసారము. సం. = త్వక్సారము.

త్వద్. సం. సర్వ. నీయొక్క మొ.

త్వర. సం. వి. అ. స్త్రీ. తొందఱపాటు.

త్వరణము. సం. వి. అ. న. తొందరపడుట.

త్వరపడు. మి. అ. క్రి. (త్వర+పడు.) తొందర పడు. ఉ. రా. ౧, ఆ. ౫౪.

త్వరమాణము. సం. విశే. (అ. ఆ. అ.) తొందరపడు చున్నది. పాండు. ౫, ఆ. ౨౩౨.

త్వరి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. త్వర.

త్వరితపడు = త్వరపడు. "క... నిన్నుఁ జూడఁ దద్దయు వేడ్కన్, ద్వరితపడుచున్నవారలు, త్వరితము. సం. వి. అ. న. త్వర. విశే. (అ. ఆ. అ.) త్వర గలది. హరివిక్రమ నీసవహోదరాదులు పెరిమన్. వార. ౭, ఆ. ౧౯౯.

త్వష్ట. సం. వి. ఋ. పు. 1. విశ్వకర్మ; 2. ద్వాద శాదిత్యులలో నొకఁడు; 3. వడ్లవాఁడు. విశే. (ఋ. స్త్రీ. ఋ.) చెక్కువాఁడు.

త్వష్టము. సం. విశే. (అ. ఆ. అ.) చెక్కఁబడినది.

### త్వా

త్వాదృక్కు. సం. విశే. (క్) నీవంటివాఁడు.

త్వాదృక్షుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నీవంటివాఁడు.

త్వాదృశము. సం. = త్వాదృక్కు.

త్వాదృశుఁడు. సం. = త్వాదృక్షుఁడు.

త్వాష్ట్రము. సం. విశే. (అ. ఈ. అ.) త్వష్టృసంబంధ మైనది. [సంజ్ఞాదేవి.

త్వాష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిత్రానక్షత్రము; 2.

### త్వి

త్విట్టు. సం. వి. ష్. స్త్రీ. 1. కాంతి; 2. కిరణము; 3. మంట; 4. వాక్కు.

త్విష. సం. వి. అ. స్త్రీ = త్విట్టు.

త్విషాంపతి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

త్విషి. సం. వి. ఇ. పుం కిరణము.

### త్స

త్సరుకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఖడ్గయుద్ధమందు నేర్పరి.

త్సరువు. సం. వి. ఉ. పుం. కత్తిపిడి.

### థ

థ. సం. వి. అ. పుం. కొండ. న. 1. రక్షణము; 2. మంగళము; 3. భయము.

### థు

థుత్కారము. సం. వి. అ. పుం. ఉమియుట మొ. వానియందుఁ జేయుధ్వని.

### థూ

థూత్కారము. సం.=థుత్కారము. "సీ. థూత్కార మొనరించుతొండంబు ముక్కున శీకరాసారంబుఁ జిలుకు చుంతి." కాశీ. ౨, ఆ. ౫౩.

థూత్కృతము. సం. వి. అ. న.=థూత్కారము.

థూత్కృతి. సం. వి. ఇ. స్త్రీ. థూత్కారము.

### ద

ద. ఉభ. ఒకానొకయక్షరము. దే. రమ్ము అనుటకు వాడుసంకేతాక్షరము. "చ. కరమున్ సాఁచి తమిన్ 'ద, యింప,' యని రాగం బొప్పఁగాఁ జేరఁదా,మరమోమంపలిరావి రేక తులకింపన్ జేరి ... సారంగధరుండు ముద్దుగురియం బో తండ్రి యఁప్పొంగఁగన్." సా. ౧, ఆ. ౫౦.

దంగు. దే. అ. క్రి. బియ్యము మొదలగునవి పైత వుడు పోవునట్లు నలఁగు. (శ. ర. బ్రా.)

దంగుడు. దే. విశే. (దంగు. ధా.) ఉదా:-దంగుడు బియ్యము. (శ. ర. బ్రా.)

దంగుళ్లు. దే. వి. బ. చేబియ్యము,అక్షుణ్ణతండులములు. "సీ. అక్షుణ్ణతండులాహ్వయము చేరుళ్లు నా దంగుళ్లు నాఁగను దనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౪౪. పార్వ. ౨, ఆ. ౨౩.

దంచనము. దే. వి. (దీనికిఁ గొన్నియెడల వృత్తియందు మువర్ణలోపము. 1. పెద్దఫిరంగి. (శ. ర.); 2. గుండ్లనుపయోగించుయంత్రము. "సీ. తగు శిలా యంత్రము దంచన మనఁగను..." ఆం. భా. ద్వి. ౨౧౦. హరి. ఉ. ౨, ఆ. ౧౬.

దంచు. దే. స. క్రి. (దంగు. ధా. ప్రే.) 1. దంగఁ జేయు,ధాన్యాదులను పొట్టుపోవునట్లుగా నలఁ గఁజేయు. "చ. హాలమున వచ్చుధాన్యముల నప్పటివప్పుడు దంచుకోఁగ రోఁకలిఁ గయి కొంటి..." దశా. ౮, అ. ౫౭; 2. ధ్వంసము చేయు. "స్రగ్ధర...విఘట్టించె దంచెన్,ద్రుంచెన్ ...కరిసుర ప్రత్యనీకుండు హేలా,సంచారోదగ్ర భంగిన్ జలముఁగొని వనసౌధవప్రాట్టవీథుల్." కాశీ. ౬, ఆ. ౧౭౬; 3. నలఁగఁద్రొక్కు. "క. దంచుక్ జరణాంచలములఁ, గించుఁదనం బంచు ము దలకించుక్ ముంచుక్,మెంచుక్ ఐదళన చుంచూ,చంచచ్చంచూపుటక్షుణ్ణా ఘాతములన్." రామా. ౫, ఆ. ౯౫౪; 4. నశింపఁజేయు,పోఁ గొట్టు. "ఉ. దంచె వతం దనేకజనవంబులఁ జేసిన

పాతకౌఘముల్." కాశీ, ౨, ఆ. ౧౦౮. దా. న. ౬౦.

దంట. యు. దే. వి. జంట, కవ, ద్వయము. "సీ.... దోయి జోడు,జంట జమళికవ దంట యమడ యన ద్వంద్వమై పరగును..." ఆం. భా. ద్వి. ౨౧౦. "గీ. ప్రోవవే యని దైన్యంబు పూని విప్రు,డింతి వెనువెంట దంటగా నేగఁ దొడఁగె." సురా. ౭౨. విణ. జంటయైనది. "గీ. కలశ నాహాద మస్తకాంగములయందు, మించి పటలీలఁ దరళితో దంచితమగు,యువతిలావణ్యము న గన్నుఁగవయు నతను,దంటమీలడెక్కియ మనఁ దనరుఁ జూడ." ప్రభా. ౨, ఆ. ౯౨. వై. విణ. (సం. ధృష్టః.) 1. సమర్థుఁడు,దిట్టతనము గలవాఁడు. "సీ.మాయా మృగము వెంట మగఁడు వోవఁగ దంటమఱఁది నంపిననాఁటిమంకుతనము." కృ. శకుం. పీఠి. ౭౧౦. ఆం. భా. తృ. 3; 2. ధూర్తురాలు. "శా. ఏకాలి న్నినువంటిదంట గలదే యిద్ధాత్రిలో నంచు వి, భ్రాజన్మానధురంధరుండు నృపుఁ డుగ్రవ్యగ్రరోషాత్ముఁడై." శుక. ౧, ఆ. ౩౧౨; 3. ప్రౌఢ. "గీ. తెరయుచౌశీతిబంధంబుటరిదిపటము,లగరు సాంబ్రాణిధూపంబు పొగలునూడి,గమ్ము లొనరించుకేల్బొమ్మగమియుఁ గల్గి,వెలయఁ బడకింట నాదంట విభునిజంట." శశాం. 3, ఆ. ౧౦౩.

దంటగొను. దే. అ. క్రి. (దంట+కొను.) కవియు, మిళితమగు. "గీ. దైత్యుమెఱుఁగుఁదూపులు దళితములుసేయఁ,దత్తనూజచూపులు ఫలితములుచేయఁ, నుదుటుఁదనమును పలపుకొండొంటితోడ,దంటగొని క్రమ్మ నెమ్మనిఁ దాల్చె సత్రఁడు." ప్రభా. ౪, ఆ. ౮౯.

దంటతనము. ద్వ. వి. (దంట +తనము.) 1. సామర్థ్యము. "ఉ. వింటిరె కృష్ణరాయపృథివీపతి యచ్చట శౌర్యలీలచేఁ,గంటకు తౌతురుష్కులఁ గకాపికలై చనఁజేసె నెంతయుఁ,దంటతనంబు మీఱ..." కృష్ణ. 3, ఆ. ౮౦. భా. రా. యు. ౧౪౩౦; 2. ధైర్యము. "గీ. రమ్ము నావెంటఁ గొంతదూరమున నుండి, దంటతనమున నను వెన్నునంటి చూడు,నీకుఁ గైకొన్కఁ జేసెద నేఁడు దానిఁ,దత్తనూజులకంతరక్తంబుఁ గ్రోలు." శుక. 3, ఆ. ౨౮౯. చూ. ౬౮౮.); 3. ధార్ష్ట్యము, గయ్యాళితనము. "క. తొలతొలఁగు తొలఁగు మనుచుఁ,దలతలతల మచుచు పట్టిదంటతనంబుల్, వలదు వల దనుచుఁ బల్కఁగఁ,గలకంతుల కపుడు మిగులఁ గలహాము మునరన్." రాజ. చ. 3, ఆ. ౪౫. సమీర. ౬, ఆ. ౧౬౫.

దంటపడు. ద్వ. అ. క్రి. (దంట+పడు.) దంటగొను. (బ్రా.)

దంటపోరు. దే. వి. (దంట+పోరు.) ద్వంద్వ యుద్ధము. "సీ. దంటపోరనఁ దగు ద్వంద్వ యుద్ధము..." ఆం. భా. ద్వి. ౨౨౯.

దంటమోములదేవర. ద్వ. వి అగ్ని. "గీ. దంటమోములదేవర దనివిదీఱ, బుగులుకొని మెక్కఁ దద్ద యబ్బురము గాఁగ." ఆచ్చ. యు. ౨౮౦. ఇట్టే. దంటమోములసామి మొ.

దంటు. వై. వి. (సం. దండః. క. దంటు.) 1. జొన్నలోనగువానికాడ. "వ...విషవిస్ఫురద్భుజంగములనల్గడల్ గబళించి గొంటకుండ దంటు చప్పరించు గతిం జప్పరించుచు .." స్వా. ౪, ఆ. ౩౭. ఆం. భా. ద్వి. ౭౭; 2. పూరి,అల్పతృణము. (చూ. దంటుకొను.) సా: చొప్పదంటుప్రశ్న = అర్థములేనిప్రశ్న.

దంటుకొను. ద్వ. అ. క్రి. (దంటు+కొను.) పూరి కఱచు. "సీ. చేఁబల్మిచేఁ గ్రమ్మి చిమ్మివైతుము గదా నోరు దంటుకొనంగ నీఁటె మొసల." కృష్ణ. 3, ఆ. ౧౮.

దండ. యు. దే. వి. 1. సమీపము, దగ్గఱ. "ఉ... తాంబూలము తావి బుగ్గరని ముంచుకొనం జెవి దండఁ బల్కనన్." కళా. ౪, ఆ. ౧౦౯, య. 3, ఆ. ౧౬; 2. ప్రాపు,ఆధారము. "ఉ. కోరి తలప సింహమునకున్ మఱి సింహమె కాక దండపెం,పారఁగ జంబుకం బగునె యబ్ధిపరీత సమస్తధారణీ, భారముఁ బూని కీర్తిరమ బాయని యాతని కెందుఁ బ్రాపు కా,శీరమణుండు దేవగణసేవ్యుఁడు శంభుఁడు గాక మర్త్యుఁడే." పారిజా. ౪. ఆ. ౯౨, చంద్రా. ౨, ఆ. ౪౫; 3. స్థానము, చోటు. "గీ. వినుత సుకృతములకుదండ వెండికొండ. భాగ. ౪, స్కం. ౧౩౪; 4 వైపు, పార్శ్వము. "సీ వెనుదండ నుద్దండ వేదండ కాండముల్ సమువమందరయానసరణి నడప." దశా. ౨, ఆ. ౧౯, భాగ. ౧, స్కం. ౪౫౩; 5. అందు, సప్తమీవిభక్త్యర్థకము. "క. అవండ జడలపండను,

లేదండఁ జెలంగఁ జెరివి..." వి. పు. ౧, ఆ. ౧౩౬, చం. రా. ౨, ఆ. ౬౧; 6. ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతోఁ బొడువఁగా నేర్పడుబొరుసు. (శ. ర.)

వై. వి. (సం. దండికా.) హారము, మాల. "గీ. ఇప్పుపూదండఁ గైసేసి నెలమి నొర్తు." హర. ౪, ఆ. ౫౦, వి. పు. ౧, ఆ. ౧౩౬. (సం. దండః. క. దండె. త. దండమై.) 1. బాహువు. "గీ. అలివచన్నులు జక్కవ లగుట కేమి సందియం బింక దండలచాయ సిగిడి, రెక్కలై యుండ పొంపునఁ బిక్కటిల్లి, వలిపెపయ్యెద యతుచిన్ని వలను దగుల." య. ౪, ఆ. ౪౪, శుక. ౨, ఆ. ౪౫౩; 2. మల్లనిసాధనము. "సీ. తగినట్టిమాష్టిని దండపోల్కి మెఱుంగు మెఱయుచుకైవడి బిన మీటినగటి." ప్రబంధ. ౧౫౧; 3. కైదండ, హస్తావలంబనము. "గీ. తమ్మికేలుండఁ బెఱకేల దండయిచ్చు, వేము లడిపెడులేఁ జూపులేమ తోడ" అము. ౧, ఆ. ౧౨; 4. భుజబలము. "గీ. దండ గల్గినబుద్ధిమంతుండు దనకు,బలిమికలిమియుఁ గొనసాగవలసె నేని,శత్రువ్రణుణంబుఁ జిచ్చు నెచ్చరికతోడఁ, గడమ వెట్టక కడముట్ట నడప వలయుఁ." ప్రబోధ. ౫, ఆ. ౪; 5. ముష్టియుద్ధాదిమగతి; మల్లయుద్ధవిశేషము. "వ... పొదలికదండ యడుగడుగుపొదలికదండ మద్దెళ సంచు కుక్కుటపుదండ మొదలుగాఁ గలపదిరెండు దండలును..." ప్రబంధ. ౭౫, అం. భా. ద్వి. ౨౦౫.

దండక. సం. వి. ఆ. స్త్రీ. దండకారణ్యము.

దండకడియము. వై. వి. (దండ+కడియము.) భుజవలయము, కేయూరము. "వ. పులితోల్కాసెల నంట దోపినకిడెంబుల్ నూలిపూఁగ పళెం,బులు బల్సింగపుఁజుంచు దండకడియంబుల్..." సా. ౧, ఆ. ౬౩.

దండకడెము = దండకడియము. "ద్వి. మొలనీలి కాసెలు మోటకత్తులును దలముల్లె బదనికదండకడెంబు." ద్వి. హరిశ్చ. పూ. ౫౬౫. ప.

దండకము. సం. వి. అ. పుం. న. ఒకానొకవృత్తము. (ఛంద); 2. అరణ్యవిశేషము; 3. దేశవిశేషము. విణ. (అ. డికా. అ.) దండించునది.

దండకవిలియ. ద్వ. వి. ప్రాంతలెక్కల పుస్తపుకట్ట. (శ. ర.)

దండకవిలె = దండకవిలియ. (బ్రౌ.)

దండకోల. ద్వ. వి. (దండ+కోల.) ఆధారము,ప్రాపు. "ఉ... నీ వటుపండగొ లగుచు నిల్చినఁ జాలు నగ స్వయమూర్తియై, యావృషకేతనుం డరివమహీశబలాంబుధి నోరఁబట్టెడున్." జై. ౧, ఆ. ౧౦౦.

దండచేయి. ద్వ. వి. (దండ+చేయి.) సందిలిప్రకొండము. "గీ. దండచేలావు గలిగట్టి పండువెదురు, తండములు..." చంద్రా. ౨, ఆ. ౬౧.

దండచేరు. ద్వ. వి. (దండ+చేరు.) వినుగులు మున్నగువానిని వశముచేసికొనుటకై యుపయోగించుతోరము. 'సీ. అలుంగునేనుంగుకై యలుఁగుఁ బూనఁగ నేల యండనీదండచే రుండెనేని."చంద్రా. ౨, ఆ. ౪౩.

దండధరుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు; 2. యముఁడు. విణ. (అ. ఆ. అ.) 1. కఱ్ఱను దాల్చువాఁడు; 2. దండనము చేయువాఁడు.

దండన. సం. వి. ఆ. స్త్రీ. 1. దండించుట; 2. దండుగ విధించుట.

దండనము. సం. వి. అ. న. 1. దండించుట; 2. దండుగు విధించుట.

దండనాయకుఁడు. సం. వి. అ. పుం. 1. సేనాధిపతి; 2. రాజు; 3. నేరస్థునికి శిక్ష విధించు అధికారి.

దండనిల్కడ. ద్వ. వి. మల్లయుద్ధములోని యొకానొక మెలఁకువ. "వ. దండనిల్కడ కదలుదుటు కలయు మెలఁకువ... మొదలగు వితమ్ము లెఱింగి." ప్రబంధ. ౭౫.

దండనీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కామందకీయాద్యర్థశాస్త్రము 2. శిక్షవిధించుట, న్యాయపాలనము.

దండనీయుఁడు. సం. విణ. (అ ఆ అ.) దండింపఁ దగినవాఁడు.

దండపడు. ద్వ. అ. క్రి. 1. సమీపించు. (శ. ర.);2. ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతోఁ బొడుచుట వలన బొరుసుగా నేర్పడు. (శ. ర.)

దండపాటు ద్వ. వి. (దండపడు. ధా.) సమీపించుట. "చ. బలమవలపాటు దాయతలపాటును జూచెదు దండపాటులో,త్తల కొడఁబాటు లెన్న యని లక్ష్మణుఁ డన్నయనుజ్ఞ గాంచి..." రామా. ౫, ఆ. ౫౫.

దండపాణి. సం. వి. ఇ. పుం. 1. యముఁడు; 2. కాశీక్షేత్రమందలి యొకానొక దేవత.

దండపారుష్యము. సం. వి. అ. న. అతికఠినముగా దండించుట.

దండపాశికుఁడు. సం. వి. అ. పుం. చోరోపద్రవము లేకుండ పట్టణమును గాపాడెడియధికారి.

దండపెట్టు. మి. స. క్రి. ప్రహరించు,కొట్టు. "గీ. చూచినప్పుడె విలు పాఱవైచి సరస,తామరస భీమతరగదా దండ మెత్తి, దండహత్తి మనోజుండు దండపెట్టె, నమ్మహీదేవు నెమ్మది రిమ్మ వొడమ." శుక. ౨, ఆ. ౪౧౩.

దండప్రణామము. సం. వి. అ. పుం. సాష్టాంగనమస్కారము. భార. అను. ౨, ఆ. ౩౦౧.

దండము. ఉ. భ. దే. వి. నమస్కారము. "వ... శివా నీకు నవాంజలి భవా నీకు నభివాదనంబు పాండురంగా నీకు దండంబు..." భీమ. ౩, ఆ. ౨౧౧. అం. భా. ద్వి. ౧౭౧. సం. వి. అ. పుం. న. 1. కఱ్ఱ,లగుడము; 2. చెట్టుబోదె,ప్రకాండము; 3. వీణదండె; 4. కవ్వము,మంథనదండము; 5. దమనము,అడఁచుట; 6. దండించుట,రాజశిక్ష; 7. దండుగు,జరిమానా; 8. రాజు శత్రువుల యెడఁ బ్రయోగించు చతురుపాయములలో నొకటి. (ఇది వధించుట, ధనముహరించుట, పీడించుట యని మూఁడువిధములు.); 9 సేన,దండు; 10. అడ్డముగాఁ దీర్చినవ్యూహము; 11. బార, ఒకానొకమానము; 12. అభిమానము; 13. దేహము; 14. మగగుఱ్ఱి; 15. గుఱ్ఱము; 16. సమూహము; 17. ఘటిక,గడియ.

దండయత్. సం. శత్రు. దండించుచున్న.

దండయమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండించుచున్నవాఁడు.

దండయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. రాజాదులు శత్రువులపై దాడివెడలుట,యుద్ధయాత్ర; 2. పెండ్లియందలియూరేగింపు.

దండయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) దండించువాఁడు.

దండయితవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దండింపఁదగినవాఁడు.

దండలాసకము. సం. వి. అ. పుం. నృత్యవిశేషము, కోలాటము. "సీ. కుండలీప్రేరణీదండలాసకముఖ్యనృత్యంబు లచ్చరల్ సెఱపుచుండ." కవిరా. ౧, ఆ. ౧౯౪.

దండలాస్యము. సం. వి. అ. న. నాట్యభేదము. "సీ. జంభారిమ్రోల నచ్చరలట్లు గణికాంబుజాస్యలు దండలాస్యములు సలుప." ఉ. రా. ౩, ఆ. ౨౫౬.

దండవాది. సం. వి. న్. పుం. 1. దండనమును పలుకువాఁడు, ప్రాడ్వివాకుఁడు; 2. ద్వారపాలకుఁడు.

దండవాలధి. సం. వి. ఇ. పుం. ఏనుఁగు.

దండవాహి. సం. వి. న్. పుం. తలారి, ఆరెకుఁడు.

దండవిధి. సం. వి. ఇ. పుం. శిక్షాస్మృతి,దండనమును గుఱించి ఏర్పఱచినశాసనము.

దండసిలు. దే. అ. క్రి. 1. ఇఱుకుకొను. "గీ. వెనుక ముందటిసమ్మర్దమునఁ గరంబు, దండసిలి మధ్యమున నున్నధరణివిభుఁడు." నైష. ౪, ఆ. ౧౨౯; 2. అణఁగు,అదుముడుపడు. "సీ. దండకహూకాధీశు తలలు దండసిలంగఁ దాటింతునే కాలధర మహేశ." కాశీ. ౭, ఆ. ౭౯.

దండసిల్లు = దండసిలు. (ఇఱుకుకొను.) "చ. మగువ కుచద్వయంబునడుమం బడి రాయిడి దండసిల్లి..." నైష. ౩, ఆ. ౧౪౯.

దండహస్తుఁడు. సం. వి. అ. పుం. 1. ద్వారపాలుఁడు; 2. యముఁడు, 3. బ్రహ్మచారి; 4. సన్న్యాసి.

దండాట. ద్వ. వి. (దండ+ఆట.) డేగాట. (శ. ర.)

దండాడించు. ద్వ. స. క్రి. (దండ+ఆడించు.) పెండ్లియైదవనాఁడు వధూవరుల నెత్తుకొని యాటాడించు. (వా.)

దండాడింపు. ద్వ. వి. (దండాడించు. ధా.) పెండ్లిలో ఐదవనాఁడు వధూవరుల నెత్తుకొని ఆడెడుఆట, డేగాట. (బ్రౌ. వా.)

దండాదండి. సం. అవ్య. పరస్పరము దండములతోఁ గొట్టుకొనుచుఁ జేయుయుద్ధము.

దండారము. సం. వి. అ. పుం. 1. బండి మొదలగు వాహనము; 2. కుమ్మరిసారె; 3. మదపుటేనుఁగు; 4. విల్లు.

దండాసనము. సం. వి. అ. న. యోగాసనభేదము.

దండాహతము. సం. వి. అ. న. మజ్జిగ,కాలశేయము.

దండి. ఉ. భ. దే. వి. 1. ప్రతాపము. "ఉ. చండకరాన్వయాంబునిధి చంద్రుఁడు భూరమణుం డతండు తా,గుండియవాఁడు వేలుపులఁ గోటుల సంఖ్యల భూతధాత్రిపై, నుండఁగ నీక కాశిపురి నొక్కఁడు రాజ్యము సేయు టెట్టు లీ,దండికి మెచ్చునారము ప్రతాపవిహీనుఁడు భూమి

పాలుఁడే." కాశీ. ౫, ఆ 300; 2. శౌర్యము, పరాక్రమము. "గీ. కడఁగి హస్తంబులను రెండు కడల నున్న,రెండుతలలును వెసఁ బట్టి దండి మెఱయ, నడిమిశిర మెక్కి కడుఁ గఠినంబు లైన, పాదఘట్టనములచేతఁ బగులఁ దన్నె." వి. పు. ౭, ఆ. ౧౬౫. సమీర. ౧, ఆ. ౬౧; 3. ధైర్యము. "వ...అవ్వేల్పు రాకొమరుండు... మేనెల్ల చెయ్యిఁగాలఁ గొఱఁత డస్సినం గొండవడు వున దండి విడువఁడయ్యె..." అచ్చ. భా. ౪, ఆ. ౫౯. భా. రా. బాల. ౪౧౨; 4. విధము, రీతి. "సీ. కొట్టిపై చినత్రలల్ గుట్టలై కాటుక కొండలదండిని మెండుచూప." దశా. ౬, అ. ౧3౭. విణ. 1. ప్రతాపవంతుఁడు. (శ. ర.); 2. పరాక్రమవంతుఁడు, శౌర్యవంతుఁడు. "గీ. తగునె యర్జున యీపెంటిశనము నీకు, దండిపై లెమ్ము మనసు పేదఱిమి విడిచి." భార. భీష్మ. ౧, ఆ. ౧౯౨, అచ్చ. యు. 3౮3; 3. పూర్ణము. "ద్వి. వామనత్వము దాల్చి వచ్చి యద్దనుజు, భూమి మూఁడడుగులు పొసఁగంగ నడిగి,రెండడుగులనే ధరిత్రియు దివియు, ... గొలిచి యాధన్యు బంధించి" రం. రా. బాల. 3౦,పు; 4. గొప్ప,పెద్ద. "ఉ. దాఁటకమాన రిక్కడలి దాశరథుల్ తమదండిమూఁకతో." రామా. ౭, ఆ. ౭౬, హరి. ఉ. ౨, ఆ. 3౨, సం. వి. న్. పుం. 1. సన్న్యాసి, భిక్షువు; 2. ద్వారపాలకుఁడు; 3. యముఁడు; 4. ఒకానొకసంస్కృతకవి; 5. దవనముచే. విణ. (న్. సీ. న్.) 1. దండము గలవాఁడు; 2. దండించువాఁడు.

దండించు. సం. స. క్రి. శిక్షించు, దండనచేయు. "క. దండధర యిట్టిదారుణ,దండమునకు నేమి దుష్కృతముఁ జేసితి నృగ్రుండ వయి తగనిదండము, దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే నన్నున్." భార. ఆది. ౪, ఆ. ౨౯౯, మార్క. 3, ఆ.౧3౭.

దండింపించు. సం. స. క్రి. (దండించు ధా. ప్రే.) శిక్షింపఁజేయు. "వ...,తప్పఁజెప్పి తేని భూపాలు సన్నిధిం బెట్టి నిజంబు దెలిపి దండింపింతు ననిన." కాశీ. ౪, ఆ. ౯౯.

దండిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దండము, కఱ్ఱ; 2. హారవిశేషము; 3. త్రాడు, రజ్జువు; 4. వాద్యభేదము.

దండితనము. దే. వి. (దండి+తనము - స్వార్థమున.) 1. శౌర్యము, పరాక్రమము. "ఉ. దండితనంబు నీయెడన తక్కెనె నాదెస మైత్రి పెన్పు మిం, కొండొకమాట దక్కుము రణోత్సహనం బొనరింపు గ్రక్కునన్." భార. విరా. ౪, ఆ. 3౭, భార. భీష్మ. ౧, ఆ. 3౭; 2. గొప్పతనము, ఆధిక్యము. "వ... వేల్పుఁ జెట్టుపూదండల దండితనంబున మెండుకొని..." ఉ. రా. ౪, ఆ. ౧౬3, ఉ. రా. ౪, ఆ, ౧3౮. [వాఁడు.

దండితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) శిక్షింపఁబడినవాఁడు.

దండియ = దండె. (పీణ.) "గీ... పిడపఁ జేతిదండియ యటు పెట్టి .."హరి. ఉ. 3, ఆ. 33, నృసిం. ౧, ఆ. ౮౧. (శ. ర.)

దండియము. వై. వి. (సం. దండికా.) వస్త్రములు ఎండవేయుట మొదలగువానికై అడ్డముగా కట్టు కఱ్ఱ,మొ."వ ..పులుం గెఱింగి...పాండు రంగా యతనంబు మధ్యరంగంబుఁ జొచ్చి యచ్చట నిచ్చం దనయిచ్చ నుండు దండియంబుపై వ్రాలన్." పాండు. ౪, ఆ. ౪3౭.

దండివాఁడు. దే. వి. (దండి+వాఁడు.) బలాఢ్యుఁడు. "సీ. బలువిడి యనఁగను బల్లిదుం డనఁగను దండివాఁ డన బలాఢ్యుండు చెలఁగు."ఆం.భా.తృ.౧౧.

దండు. యు. దే. స. క్రి. (ధనాదికమును.) సంపాదించు. "మ ..కానరే యీజపా, కలనాతం ద్రమునీంద్రు, నంచుఁ బొగరెక్కన్ జెక్కసామ్రాణిదం,ట లివక్ ,దాఁటుచుఁ దన్నధనము దండన్ దండ నేతేరఁగన్." చంద్రా. 3, ఆ. ౯౮, వై. వి. (సం. దండః.) 1. సేన. "చ. పొలుపుగఁ జంద్రశేఖరుతపోవన మంగజచక్రవర్తిదో, ర్బలమున ముట్టి చూఱకొనఁ బంచిన దండొకొ నాఁగ..." కు. సం. 3, ఆ. ౧౦౭, ఆం. భా. ద్వి. ౨౧౦; 2. సమూహము. "గీ. తాండవం బాడె మిన్నేటితరఁగదండు." హర. ౭, ఆ. ౮౦, అచ్చ. బాల. ౧౫౨; 3. దండయాత్ర. "వ...వారలు ప్రియంబునం బనిపూని వెడలి దండు సాటించి తగువారల నెల్ల నెఱింగించిపుచ్చిన..." భార. ఉద్యో. ౪, ఆ. ౧3౬, చం. రా. ౫, ఆ. 3౪.

దండుఁడు. సం. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. రాజు; 3. సూర్యునిప్రక్క నుండువారిలో

నొకఁడు. (దండుఁడు, పింగళుఁడు, మాఠరుఁ డను పేరు ముగ్వురు. సూర్యుఁడు దైత్యులకు వర మీయకుండ చూచుటకు రుద్రాగ్నియములు క్రమముగా వయిమూఁడుసామములతో వర్తింతురు.); 4. ఇక్ష్వాకుపుత్త్రుఁ డగుసూర్యవంశపురాజు.

దండుకదలు. ద్వి. అ. క్రి. (దండు+కదలు.) దాడి వెడలు, దండెత్తు. "సీ. గర్వించి సర్వసుపర్వ సామ్రాజ్యంబు గైకొందుననిదండుకదలఁ దలఁచి." వరాహ. ౧౧, ఆ. ౧౨౨, కళా. ౭, ఆ. ౨౪౯.

దండుగ. వై. వి. (సం. దండః.) 1. అధికారి అప రాధివలన అపరాధపరిహారముగా పుచ్చుకొను ధనము, జరిమానా. "గీ. దండు వన దండు గనఁ గను దండమునకుఁ బ్రతినిధిగఁ దీయఁబట్టిద్రవ్యంబు పరఁగు..." ఆం. భా. ద్వి. ౨౯౦, శుక. ౨, ఆ. ౨౧౮; 2. రాజు ధనవంతుని బలాత్కారము చేసి పుచ్చుకొనుధనము. "ద్వి. కలవారిఁ గని దండుగలు వెట్టె నృపుఁడు." విష్ణు. పూ. 3, ఆ. (శ. ర.); 3. నష్టము. వ్యవ:-నా కావ్యవహార ములో దండుగ వచ్చినది.

దండుగయీనాము. దే. వి. (దండుగ+ఈనాము.) అనవసరముగా బాధించినదానికి ప్రతిఫలముగా నిచ్చుభూమి. (బ్రౌ. వా.)

దండుగు = దండుగ. (అపరాధపరిహారముగా పుచ్చు కొనుధనము,జరిమానా.) "క. కొంకక యేనూరు దండుగుం గొనవలయున్." విజ్ఞా. ప్రా. ౧౭౯.

దండుచేయు. ద్వి. అ. క్రి. (దండు+చేయు.) దండెత్తు,దాడిచేయు. "గీ. ఒక్కొకదినంబు తమ యింటియొద్దివారిఁ, దలఁచికొన్నప్పు డోదవుసం తాపభరము,పూనకుండుట యెట్లు భవానిపతియు, వాసిఁ బూని ధరం దండుచేసెనేని." రా. వి. ౨, ఆ. ౭౯.

దండుడిగ్గు. ద్వి. అ. క్రి. (దండు+డిగ్గు.) సేనలతో గూడి బసచేయు. "చ....ఇల యెల్లను ముంచి రసాతలంబుపై, విడియఁగ దండుడిగ్గినసవిద్యు దురుస్తనయిత్నులో యనన్." ఆము. ౪,ఆ.౧౨౮.

దండుదారి = దండుబాట. (బ్రౌ.)

దండుదిగు = దండుడిగ్గు. "గీ. దండుదిగినాఁడు భండ నోద్దండుఁ డగుచు." దశా. ౫, ఆ. ౩౯.

దండుదివియ. వై. వి. దీపపుసెమ్మె. (శ. ర.)

దండునడచు. ద్వి. అ. క్రి. (దండు+నడచు.) దాడి వెడలు, దండెత్తు. "ద్వి. కైకొని యింక నిక్ష్వాకు పల్లభుఁడు,నా కారిపై దండునడచుచున్నాఁడు." రం. రా. కిష్కిం. ౨౧౯, పు. [(శ. ర.'బ్రౌ.)

దండుబాట. వై. వి. (దండు+బాట.) ఘంటాపథము.

దండులంజె. వై. వి. (దండు+లంజె.) దండుతోఁ బోవువ్యభిచారిణి, బజాఱి. "సీ...తగు బజాఱి యనంగ దండులంజె." ఆం. భా. ద్వి. ౧౨౭.

దండువ. వై. వి. (సం. దండః.) అపరాధపరిహార ముగా పుచ్చుకొనుధనము. "చ. వణిజులు తప్పు చేసినను వారలఁ దండువఁ బెట్టఁ బంచి..." దశ. ౬, ఆ. ౧౦౧.

దండువచ్చు. ద్వి. అ. క్రి. (దండు+వచ్చు.) యుద్ధ మునకు వచ్చు. "ఉ. ఇంటికిఁ బొమ్ము క్రమ్మరఁ జెలీ నిలు ని న్నిలుసేర్చి పత్తునో,వెంట నె దండు వచ్చెదవొ వేగమె రా మఱి యేల యందువో." రా. వి. ౨, ఆ. ౫౮.

దండువిడియు. ద్వి. అ. క్రి. (దండు+విడియు.) 1. సేనలతోఁ గూడి బసచేయు. "గీ. దండువిడిసె బలీంద్రుఁ డక్కొండదండ." దశా. ౨, ఆ. ౫౬. కువల. ౧, ఆ. ౩౩; 2. దాడివెడలు,దండెత్తు. "గీ. జానకీనాథ యిటు లద్దశాననుండు, విత్తవిభు వీటిపై దండువిడిసె నపుడు." ఉ. రా. ౩, ఆ ౨.

దండువు. వై. వి. (సం. దండః.) అపరాధపరిహార ముగా పుచ్చుకొనుధనము. "క. కావఁ గొని పోయి యేమఱి, గోవుల దాఁ జెఱిచెనేని గొల్లఁడు పతి కిక్కి,గోవులవెల యరువం దగు,భూవరునకుఁ గొంత దండువును బెట్టఁ దగున్." విజ్ఞా. ప్రా. ౧౧. పి. శకుం. ౪, ఆ. ౧౭౫.

దండువెట్టు. ద్వి. స. క్రి. (దండు+పెట్టు.) దండించు, శిక్షించు. "ద్వి. వెద్దునాగయగారి వెడఁగుపచ్చి లివొ,దసగణసింగయ్య దండువెట్టితివొ."పండితా. మహిమ. ౩౦౬. పు.

దండువెడలు. ద్వి. అ. క్రి. (దండు+వెడలు.) దాడి చేయు, దండెత్తు. "గీ...అలరువింటి, గొనయ మెక్కించి వలరాజు కినుక మీఱి, విరహిజనము లపై దండువెడలె నపుడు." పారి. ౨, ఆ. ౫౯, ఆము. ౪, ఆ. ౨౬౩.

దండువోవు. ద్వి. అ. క్రి. (దండు+పోవు.) దం డెత్తు. "ఉ. పంచశరుండు పాంథజనబంధన

2. దూరస్థము, దూరమందున్నది. "క...దవ్వై దివసమునఁ దిరిగెడు, నవ్విలసత్కనకమత్స్యయంత్రముఁ జేసెన్." భార. ఆది. ౭, అ. ౨౫. దశ. ౧౦, ఆ. ౧౧౭. క్రి. విణ. దూరముగా. "గీ... ప్రోయెద మన్న దవ్వనిచి సిరికిఁ, దగినసత్కృతిఁ జేసి భేదమున మగిడి." ఆము. ౧, ఆ. ౭౮.

దవ్వుగ. వై. క్రి. విణ. దూరముగా. "చ. ఘనదురితానుబంధ కలికాలజదోష తుషార సంహతిం, దనయుందయప్రభావమున దవ్వుగఁ జోపె..." భార. ఆది. ౧, ఆ. ౫, నైష. ౨, ఆ. ౪౭.

దవ్వుపడు. వై. అ. క్రి. (దవ్వు+పడు.) దూరస్థమగు. (మా. దవ్వుపఱచు.)

దవ్వుపఱచు. వై. స. క్రి. (దవ్వుపడు. ధా.) దూరస్థునిగాఁ జేయు. "క. చేయూఁక వాని మొసలకుఁ, బాయఁగ సెలయించి దవ్వుపఱచె నవధ్యో, పాయుఁడు హరి యడుగడుగుం, జేయందినయట్ల యూసనేయుచు వీఁకన్." హరి. ఉ. ౨, ఆ. ౧౩౪.

దశ. సం. వి. ఆ. స్త్రీ. 1. స్థితి, అవస్థ; 2. వర్తి, దీపపువత్తి; 3. చిత్తము; 4. వరుస. పంక్తి. (జ్యోతిష.) సూర్యాదిగ్రహములు ఫలమిచ్చుకాలము. బ. అ. పుం., ఆ. స్త్రీ. బట్టయంచు. విణ. (న్. నీ. న్.) పది. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

దశకంఠుఁడు. సం. వి. అ. పుం. రావణాసురుఁడు.

దశకము. దే. సం. వి. అ. న. పదింటిసమూహము విణ. (అ. శికా. అ.) పదిపరిమాణము కలది.

దశత్. సం. శత్రు. కఱచుచున్న.

దశత్తు. సం. వి. త్. స్త్రీ = దశకము.

దశధా. సం. అవ్య. పదివిధములుగా. (దీనికిఁ తెనుఁగున వ్యస్తప్రయోగములు లేవు.)

దశనము. సం. వి. అ. పుం. 1. పల్లు, దంతము; 2. కొండకొన. న. 1. కవచము; 2. కఱచుట, కాటు.

దశపాతకి. సం. విణ. (న్. నీ. న్.) మహాపాతకములైదును ఉపపాతకములైదును జేసినవాఁడు. "క. పశువధయు సేసె పీఁడుం, దశపాతకి యల్లవాఁడు దాక్షిణ్యకళా, విశదస్వహీనుఁ డీతఁడు, శిశుహత్య యొనర్చె పీఁడు సిద్ధప్రవరా.' సానందో. ౪, ఆ. ౪౦.

దశబలుఁడు. సం. వి. అ. పుం.-పదిబలములు గలవాఁడు-బుద్ధుఁడు. (దశబలములు: 1. దానము; 2. శీలము; 3. క్షమ; 4. వీర్యము; 5. ధ్యానము; 6. ప్రజ్ఞ; 7. బలము; 8. ఉపాయము; 9. ఏకాగ్రచిత్తత; 10. జ్ఞానము.)

దశభుజ. సం. వి. అ. స్త్రీ. దుర్గ.

దశమము. సం. విణ. (అ. ఈ. అ) పదియవది.

దశమి. సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమందలి పదియవ తిథి; 2. నూఱేండ్లలో పదవపది. విణ. (న్.నీ.న్.) మిక్కిలి వృద్ధుఁడు.

దశమిస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి వృద్ధుఁడు; 2. నష్టవీర్యుఁడు; 3. క్షీణరాగుఁడు.

దశరథుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకరాజు. (రాముని తండ్రి.)

దశరాత్రము. సం. వి. అ. న. పదిరాత్రుల సమూహము. పుం. పదిదినములు జరుగుయజ్ఞవిశేషము.

దశార్ణము. సం. వి. అ. పుం. దేశవిశేషము.

దశార్హము. సం. వి. అ. పుం. దేశవిశేషము, యదుదేశము.

దశార్హుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధుఁడు; 2. దశార్హదేశస్థుఁడు.

దశాశ్వుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

దశాహము. సం. వి. అ. పుం. మరణించినది మొదలుకొని పదియవదినము; 2. పదిదినముల సమూహము.

దశేరము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. సర్పము. విణ. (అ. ఆ అ.) హింసించునది.

దశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) కఱవఁబడుచున్నది. [2. కొఱుకఁబడినది.

దష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కఱవఁబడినది;

దసనా. దే. వి. కఱకుఁదనము. "క. అసురగ్రాసకృతాంతక, రసనన్ దసనా ధరించెరమణి యొకతె సారసనేత్రుమోాల దంభో, ళిసహితవర్ణా సమాన లీలావహయై." సాంబో. ౧, ఆ. ౧౧౨.

దసరా. వై. వి. (సం. దశరాత్రమ్.) ఆశ్వయుజశుద్ధప్రతిపత్తు మొదలుకొని విజయదశమివఱకుఁ గల పదిదివసములు. (బ్రా.)

దసిలీ. దే. వి. 1. ఒకరకముపట్టు. "సీ. రత్నంపుఁజిలుకలు రాయంచప్రతిమలు పసిఁడిపువ్వులవ్రాతపనులసొబగు, వివిధంబు లగుచిత్రవిరచనములును దసిలీనూలుపట్టె యల్లిక బెడంగు." కళా. ౨, ఆ. ౧౫, కువల. ౪, ఆ. ౨౧౨; 2. వదలు. (శ. ర.)

దసువంది. దే. వి. గుఱ్ఱములాటకు కట్టులను గూర్చువాఁడు. "సీ. గుఱ్ఱులాటకు కట్లఁగూర్చువానికిఁ

బేరు దసువంది యనఁగను దనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౦౮.

దసెన. దే. వి. ఆయుధవిశేషము. (శ. ర.)

దసెనా. దే. వి. ఆయుధవిశేషము. "క. ధనువు జయం తునిపక్కఁక, మన సాధనరాజవరకుమారుని సెంతం, జొనుపుదుఁ గోరకదశనా,నన దసెనాజోదుపుర మునం బెనఁగుసెడన్." కువల. ౫, ఆ. ౩౮.

దస్కతు. హిం. వి. చేవ్రాలు.

దస్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షీణించినది; 2. త్రోసివేయఁబడినది.

దస్తరము. దే. వి. కాగితములమూట. "వ... సేమసు సూత్రంబులు పన్ని లక్షాంతరంబులు కర్చుచేసి విస్తారంబుగా దస్తరంబులు వ్రాయించి..." ఆనంద పీఠి. ౫౭, (దస్తరంబులువ్రాయించి = మూటల కొలఁది కాగితములపై వ్రాయించి.)

దస్తా. హిం. వి. ఇరువదినాలుగు కాకితములమడత. (బ్రౌ. వా.)

దస్తావేజీ. హిం. వి. (హిం. దస్తవీజ్.) ఒడంబడిక పత్త్రము; సాధకపత్త్రము, ఓచరు. (బ్రౌ. వా.)

దస్తు. హిం. వి. వసూలుచేసినసొమ్ము. (బ్రౌ. వా.)

దస్తూరి. దే. వి. (హిం. దస్తకారు.) వ్రాత, "గీ. దట్ట ముగఁ బెట్టియలలోనఁ బెట్టియున్న,తళుకుబంగారు జిగికాగితములలోన, సారముగ వ్రాసియున్న దస్తూరిఁ జూచి,చదువుకొనె నాత్మలోన విస్మ యము గదుర." కృష్ణ. 3, ఆ. ౧౦౭.

దస్త్రము. దే. వి. కాగితములమూట, దస్తరము. "సీ. సీమమట్టు ఫిరాదు చేసి దస్త్రాల్ వ్రాసి యేతంత్రిక పితాను పెత్తఁగొట్టె." ఆనంద. పీఠి. ౫౯.

దస్మఁడు. సం. వి. అ. పుం. 1. యజమానుఁడు; 2. చోరుఁడు; 3. అగ్ని. విణ. (అ. ఆ. అ.) దర్శ నీయుఁడు, రూపసి.

దస్యుఁడు. సం. వి. ఉ. పుం. 1. శత్రువు; 2. దొంగ; 3. రాక్షసుఁడు; 4. ఒకజాతివాఁడు.

దస్రము. సం. వి. అ. పుం. గాడిద. న. 1. అశ్వినీ నక్షత్రము; 2. శీతకాలము.

దస్రుఁడు. సం. వి. అ. పుం. దొంగ. ద్వి. అశ్వినీ కుమారులు.

దహత్. సం. శత్రు. కాల్చుచున్న.

దహనము. సం. వి. అ. న. 1. కాల్చుట; 2. పులి కడుపు. పుం. 1. పావురము; 2. నల్లజీడి; 3. చిత్రమూలము; 4. కృత్తికానక్షత్రము. విణ. (అ. ఆ. అ.) 1. కాల్చునది; 2. నాశనము చేయునది. (అ. ఈ. అ.) కాల్చుటకు సాధన మైనది.

దహనీయము. సం. విణ. (అ. ఆ. అ.) దహింపఁదగి నది, కాల్పఁదగినది.

దహనుఁడు. సం వి. అ. పుం. 1. అగ్ని; 2. ఏకాదశ రుద్రులలో నొకఁడు.విణ. (అ. ఆ. అ.)దుష్టుఁడు.

దహనోపలము. సం. వి. అ. పుం. 1. సూర్యకాంత మణి; 2. చెకుముకిరాయి.

దహరము. సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. నరకము; 3. హృదయము. "క...రిపుస్వపదహర, ప్రేం ఖదసుగ్రసజతర భృత్యసిఫణికిన్." స్వా. పీఠి. ౪౪. విణ. (అ. ఆ. అ.) 1. సూక్ష్మము. స్వల్పము; 2. చిన్నవయసుది; 3. తెలిసికొనశక్యముకానిది, దుర్బోధము.

దహరుఁడు. సం. వి. అ. పుం. 1. బాలకుఁడు; 2. తమ్ముఁడు; 3. వరుణుఁడు.

దహించు. సం. స. క్రి. 1. కాల్చు. "క. వరసు మనోజనిత మగు, సురభిం బలపంగ భువనశోషక తిగ్మాకరపసుఖుఁడు వడిగఁ దదా, కరవిపినంబులను మిగులఁ గాఁక దహించెన్." కాళింది. ౪, ఆ. ౨౮; 2. నశింపఁజేయు. "వ...యోగికి ముఖ్యా త్మ జయంబు వలయు దానికి నుపాయంబు వినుము ప్రాణాయామంబున దేహదోషంబు దహించు నది." మార్క. 3, ఆ. ౩౧౪.

దహియించు = దహించు. (కాలు.) "మ...మహో, గహనంబుల్ దహియించుదా వశిఖిరేఖల్ మిత్త్ర భూభృత్తులన్, దహియించెఁ నిమిషంబులో భువన మత్యాశ్చర్యముం బొందఁగన్." ఉ. రా. 3, ఆ. ౩౩౯.

దహ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁ బడుచున్నది.

దహ్రము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. కార్చిచ్చు. విణ. (అ. ఆ. అ.) సూక్ష్మమైనది.

దళకొను. దే. అ. క్రి. (దళము+కొను.) అధికమగు. "చ. దళకొనియున్నతొంటి సుకృతంబుకతంబున వచ్చి మీఁదటం, గలిగెడు శోభనంబులకు..." విక్ర. ౫, ఆ. ౫. (శ. ర. హా.)

దళగించు. దే. అ. క్రి. దట్టమగు. (శ. ర.)

దళనము. సం. వి. అ. న. భేదించుట. విణ. (అ. ఈ. అ.) భేదించుటకు సాధనమైనది.

దళము. ఉభ. యు. దే. వి. 1. ఆధిక్యము. "సీ. దహనుండు వేఁడిమి దళము చూపఁగ లేఁడు పద్మబంధుఁడు దపింపంగ వెఱచు." భా. రా. యు. ౧౫౭౮. విజ్ఞా. ప్రా. ౭౪; 2. సమూహము. (చూ. దళముకొను.) విణ. 1. అధికము. "చ. బిలముఖపంక్తి సిధరణిభృత్పతి వారిధి నిర్భరభ్రమిన్, దళముగ ముస్సు ద్రావివసుధారసధారగుణంబునం జుమీ..." స్వా. ౫, అ. ౫౧. శుక. 3, అ. ౨౫౧; 2. సాంద్రము, నిబిడము. "ఉ...ధరాపరాగముల్, దప్పటమైన చీకటి దళంబయి చూడ్కులం గప్పు..." భా. రా. యు. ౬౫౨; 3. పూర్ణము, సమృద్ధము. "గీ. అతనికై ధారవోసితిఁ బ్రాణ మెల్ల, నట్టి ప్రాణేశ్వరునితోడ నలిగియుంటిఁ, జేయఁగల దేమియో యమ్మచెల్ల నాకు, దళముగాఁ జాల వోయమ్మ దైవబలము." గంధ. ౧౧౨. ఆము. 3, అ. ౧౧. వై. వి. (సం. దళః. క. దళవు.) సేన. (చూ. దళవాయి. మొ.) సం. వి. అ. పుం. న. 1. భాగము, పాలు; 2. సగము, అర్థము; 3. ఖండము, తునుక; 4. భేదించుట, విదళనము; 5. ఆకు; పత్త్రము; 6. పుష్పదళము, ఱేకు; 7. సైన్యము. "మ...అత్మమూలబలముల్ జాఱెఁ దళాడంబరం, బఱుగన్..." వసు. ౧, అ. ౪౫. ఉ. హరిశ్చం. 3, అ. ౧3.

దళముకొను. దే. అ. క్రి. (దళము+కొను.) 1. అధికమగు. "గీ. దర్శనప్రీతి వారిపైదగులు మీఱ, వలనియరిత్లిమనమున దళముకొనఁగ." భార. అను. ౨, అ. ౨౮3. ఉ. రా. ౫, అ. ౫౧; 2. గుమిగూడు. "గీ. లలితకలకంఠకోలాహలంబు లెసఁగ, దళముకొని రెండుగెడలఁ గాదంబకోటి, గొల్వ రాచిల్వసొంబ్రాణిగుబ్బమెక్కి, దర్పకుఁడు పాంథజనులపై దండువెడలె." ఉ. రా. ౪, అ. ౧౫౬.

దళముకొలుపు. దే. స. క్రి. (దళముకొను. ధా. ప్రే.) 1. అధికముచేయు, హెచ్చించు. "గీ. తనపెదవిసాంధ్యరాగంబు దళముకొలుప." ఉ. రా. ౫, అ. ౧౫౪; 2. సాంద్రమొనర్చు, దట్టముచేయు. "సీ. పరమసౌఖ్యాయత్తపరిరంభణంబునఁ దనువల్లిఁ బులకలు దళముకొలుప." విక్ర. ౪, అ. ౨౨3; 3. నిండించు, పూరించు. "గీ. నవవిధం బైనహరిభక్తి నలువుమెఱసి, దశదిశలఁ గీర్తివిస్ఫూర్తి దళముకొలిపి." పరమ. 3, అ. 3౪.

దళమెక్కు. దే. అ. క్రి. (దళము+ఎక్కు.) దళసరి కలుగు. "సీ...దళమెక్కు పనసపెందొలలతోడ." ఆము. ౨, అ. ౭3. దశ. ౯. అ, ౯.

దళవరి. యు. దే. వి. (దళము+వరి.) ధాన్యవిశేషము. (బ్రా.) వై. వి. సేనాధిపతి. (శ. ర.)

దళవాయి. వై. వి. (దళము+వాయి.) 1. సేనాధిపతి. "ఉ. వాలుగఁడాలువానిదళవాయి వసంతుఁడు చైత్రయాత్రకై..." శశాం. ౨, అ. ౧౧౨. జై. ౮, అ. ౧౬; 2. సుంకరికి సహాయుఁ డైన యుద్యోగి. (శ. ర.)

దళసంచు. దే. వి. (దళము+సంచు.) దళముజాతి. (శ. ర.)

దళసరి. దృ. వి. (దళము+సరి.) గొప్పతనము. "వ... నందయగోదాదులైన గోపగోపికాజనంబులు వారి దళసరి యెఱుంగక..." భాగ. ౧౦, స్కం. పూ. ౬౪3. విణ. 1 సాంద్రము, పలుచనకానిది. "రగడ. కడుదళసరి కర్పూరము హస్తయుగములఁ దాల్చుచు." చను. ౧, అ. ౬౭; 2. తఱచు. (వ్యవ.) ఆబట్టనేత దళసరిగా నున్నది.

దళాఢకము. సం. వి. అ. పుం. 1. తనంతటఁ బుట్టిన నువ్వుచెట్టు; 2. నాఁచు, పృశ్ని; 3. గైరికము; 4. నురుఁగు; 5. అగర్త, కందకము; 6. నాగకేసరము; 7. మొల్ల, కుందము; 8. దిరిసెనము, శిరీషము; 9. సుడిగాలి; 10. ఏనుఁగుచెవి.

దళారున. దే. విణ. హఠాత్తుగా, ఆకస్మికముగా. "ఉ...వ్రాల్గంటిమెఱుంగుఁజూపులు దళారున వచ్చె మహాద్భుతంబు గాన్." కువల. ౨, అ. ౯౦.

దళించు. సం. స. క్రి. 1. విఱుచు. "సీ. భువనాధికుఁడపాట కవిరతోద్ధతిశరాలివిలు దళించిన బహుబలమె సాక్షి." ఉ. రా. ౧, అ. ౧౫౧; 2. చేల్చు. "ఉ...శౌరిచే, సింగిణివింట వెల్లిగొను చిత్రశరంబులు మూతు నొంచిర, ఖ్యాంగకముల్దళించుచు నిజావయవంబులఁ దూల్చ..." పారి. ౫, అ. ౧౬; 3. నఱకు, తునుకలుచేయు. "గీ. ముసలముల మోఁది కరవాలముల దళించి." కవిక. ౨, అ. ౧౫౪.

దళింపఁబడు. దృ. స. క్రి. (దళింపన్+పడు.) ఖండింపఁబడు, త్రెంపఁబడు. "మ...దళింపంబడియెం

వదు గ్రహీత గానిక్ ఖుల్ల శాశిక్యమున్." పాండు. ౨, ఆ. ౧౦౩.

దళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఖండింపఁబడి నది; 2. వికసించినది; 3. ఇటునటు చిమ్మఁబడినది; 4. సగముగాఁ జేయఁబడినది, అర్థీకృతము.

దళియించు. సం. స. క్రి. ఏయు, కొట్టు. "క. బలుఁడు రథంబును దురగం,బులఁ బాకుఁడు సూతునముచి భూరిశరములన్, దళియించి యింద్రు నంగక,ములు సించిరి మించి యతఁడు మూర్ఛ మునుంగన్." దశా. ౨, అ. ౪౭౯.

## దా

దా. దే. విణ. (దాపలయొక్క లుప్తశేషరూపము. ఇది సమాసపూర్వపదముగానే ప్రయోగింపఁబడును.) ఎడమ, సవ్యము. ఉదా: దాకాలు. మొ.

దాండము. సం. వి. అ. న. 1. కఱ్ఱల మోపు; 2. ఆయుధజీవిసంఘము. విణ. (అ. ఈ. అ.) దండము నకు సంబంధించినది.

దాంతము. సం. వి. అ. పుం. దవనము. విణ (అ. ఆ. అ.) 1. అణఁపఁబడినది; 2. బహిరింద్రియ ముల నిగ్రహించినది; 3. క్లేశాదులను సహించి నది. (అ. ఈ. అ.) దంతములకు సంబంధించినది.

దాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. బ్రహ్మచర్యాదితపఃక్లేశము నోర్చుట; 2. కర్మేంద్రియనిగ్రహము.

దాంపత్యము. సం. వి. అ. న. భార్యాభర్తృభావము.

దాంభికము. సం. వి. అ. పుం. కొంగ, బకము.

దాంభికుఁడు. స. విణ. (అ. ఈ. అ.) దంభము గల వాఁడు.

దాఁక. దే. అవ్య. ద్రు. వఱకు, పర్యంతము. "ఉ. ఈపుట భీమలింగము గుఱించి జపం బొనరించి నిచ్చలున్, మాపటిదాఁకఁ దీర్థముల మజ్జనమాడుచు నుండువాని..." భీమ. ౨, ఆ. ౭౧, సీలా. ౨, ఆ. ౫౨.

దాఁకొను. దే. అ. క్రి. (దాఁగు+కొను-స్వార్థమున.) మఱుఁగుపడు, కనఁబడకుండు. "ఉ. మించిన యామునేనుఁగులమీఁదికిఁ జంగున దాఁటి యాద లల్., చించినగోళ్లలోఁ దవిలి చిందినముత్తెము లెల్లఁ జట్లపై, మంచునఁ జేరి దాఁకొనిన మాటికి నమ్ములఁ ద్రవ్వి త్రవ్వి య,చ్చించు నెలంత లేఱు దురు శింగపుజాడ లెఱింగి యచ్చటన్." య. ౨, ఆ. ౩౭.

దాఁగనమ్ముచ్చులు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు. (శ. ర.)

దాఁగర. దే. వి. వరుగులు మొదలగునవి ఎండఁబెట్టు తట్టుప్రసేవకము. "గీ. వరుగుతో దాఁగరయు నెండవలసినట్లు." ఉ. హరి. ౪, ఆ. ౫౪, చెన్న. ౨, ఆ. ౨౦౪.

దాఁగిలిమూఁతలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము, గుప్తక్రీడ. (శ. ర.) "ఉ. దాఁగిలిమూఁతలాడు తఱిఁ దానొకకెంజిగురాకుజేబులేఁ, దీఁగపొదల్లిల స్నిమకి తెచ్చెద నంచు..." పార్వ. ౨, ఆ. ౨౦, అని. 3, ఆ. ౬౭.

దాఁగిలిమ్ముచ్చులు. దే. వి. బ. బాల్యక్రీడావిశేషము, దాఁగిలిమూఁతలు. "ఉ. చేతులు వ్రేసి పాతి యును జెచ్చెర దాఁగిలిమ్ముచ్చు లాడియున్." వి. పు. ౭, ఆ. ౨౯౯, వి. పు. ౨, ఆ. ౨౦౨.

దాఁగలు. దే. అ. క్రి. దాఁగు, కనఁబడకుండు. "క. బలవంతుతోడఁ బగయును, బలహీనునితోడఁ జేయు బంధుత్వము దాఁగిలి ధన మిచ్చియు నూరక, కలహామునకుఁ గాలు ద్రవ్వఁగా రాదు సుమీ." వి. పు. ౪, ఆ. ౨౪౩.

దాఁగు. దే. అ. క్రి. మఱుఁగుపడు, తిరోహితమగు. "ఉ...కల్లతెల్విలో, నేవలవంత దాఁగఁ జరియించిన డాఁగమిఁ జూచి నెవ్వగన్." ఆము. ౫, ఆ. ౧౫౫.

దాఁగుడుమూఁతలు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు, బాల్యక్రీడావిశేషము: "సీ. పైఁడిమెట్టిక లెక్క పై కేఁగి చేతగట్టాండు దాఁగుడుమూఁత లాడి యాడి." య. 3, ఆ. ౫౫.

దాఁగురించు. దే. స. క్రి. 1. దాఁచు; 2. వంచించు. (శ. ర.)

దాఁగురింత. దే. వి. (దాఁగురించు. ధా.) దాఁగు రించుట. (శ. ర.) వి. బ. దాఁగురుమూఁతలు. "చ...దాఁగురింతలన్, గలకలనవ్వుచుం జెలఁగు కల్హరి వేలుపుసామిఁ గొల్చెదన్." అచ్చ. భా. ౧, ఆ. ౧.

దాఁగురుమూఁతలు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు. (శ. ర.)

దాఁగురుమ్ముచ్చులు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు. "వ...కదిసి విశంకటకోటరకుటీరంబుల దాఁగురు ముచ్చులాడు కిన్నరకన్యకల..." వరాహ. ౧౨, ఆ. ౪౫.

**దాఁచు.** దే. స. క్రి. (దాఁగు ధా. ప్రే.) 1. మఱుఁగు పఱుచు, కనఁబడకుండఁజేయు. "చ...మద్ఘన తరరాజ్యసంపదలు దాఁచక సర్వము నీకు నిచ్చి తిన్." హరిశ్చ. 3, ఆ. ౨౦, వరాహ. ౯, ఆ. ౪౫; 2. పదిలపఱుచు, భద్రముగానుంచు. "ఉ...రెండుపండ్లు నీ వప్పరమేశుచేఁ బడసి యం దొకఁ డిచ్చి యొకండు దాఁచుకొ, నిప్పుడు కాన వచ్చెఁ జనునే యిటు వంచనసేయ..." విక్ర. 3, ఆ. ౨౦.

**దాఁటడుగుపరువడి.** దే. వి. మల్లబంధవిశేషము. "వ. ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలు పరువడి దాఁటడుగుపరువడి...మొదలైన పదు నాలుగు విసరులమర్మంబు జూపి.." హంస. ౧, ఆ. ౨౦౬, ప్రబంధ. ౭౮.

**దాఁటడుగుమొన.** దే. వి. మల్లబంధవిశేషము. "వ... చాటడుగుమొన దాఁటడుగుమొన యరమీఁటమొన...ఆదిగాఁ గలపదిరెండు మొనలు.." ప్రబంధ. ౭౮, హంస. ౧, ఆ. ౨౦౬.

**దాఁటరి.** దే.వి. (దాఁటు+అరి.) కప్పు. "సీ...దాఁటరి చలికాఁపు కప్పు యనఁగ భేక మొప్పు..." సాం. ని. తిర్య. ౮౩.

**దాఁటవేయు.** దే. స. క్రి. (దాఁటన్+వేయు.) తప్పించుకొను; వదలుచుకొను. (బ్రౌ. వా.)

**దాఁటించు.** దే. స. క్రి. (దాఁటు ధా. ప్రే.) దాఁటఁజేయు, ఎగురఁజేయు. "మ. హరి దాఁటించెఁ ఖురోపకంఠమున..." కాశీ. ౧, ఆ. ౫౩.

**దాఁటు.** యు. దే. అ. క్రి. 1. మీఁదికుఱుకు, మీఁది కెగురు. "క...కృతవర్ముని తేరిపైకి లంఘించె నుకల్యాఁడు గిరికి దాఁటుసింగముభంగిన్." భార. భీష్మ. ౧, ఆ. ౭౮౫. ఉ. హరి. ౧, ఆ. ౪౬; 2. (కాలము) కడచు, జరుగు. "వ...పదు నాలుగు సంవత్సరములు దాఁటునంతకుఁ బురు మండు బాలుండు.." భార. ఆది. ౪, ఆ. ౨౭౧. హర. ౭, ఆ. ౧౧; 3. ప్లుతగతిభేదముతో పరువెత్తు. "తే. జోడనవడి యచ్చో నిబ్బరపుఁబర్వ నని దాఁటుఁదొడఁగె గంధర్వకులము." దశా. ౨, ఆ. ౬౦. స. క్రి. 1. కడచు, అతిక్రమించు. "మ...అద్ధరణీనాథునికీర్తి దాఁటెఁ గడు నుద్దండించి బ్రహ్మాండమున్." కాశీ. ౧. ఆ. ౫౩. ఉ. హరి. ౨, ఆ. ౩౭; 2. మీఱు, ఉల్లంఘించు. "వ. తనభార్యకుం గలశివభక్తి విశ్వాసంబులును జంగమారాధననిష్ఠయుం దనయానతిదాఁటమియు ...ఎఱింగి." హర. ౨, ఆ. ౬౫. దశా. ౨, ఆ. ౧౧౮; 3. తరించు. "చ...హాయక చలదూర్మి కానికర మైనమహోదధి దాఁటవచ్చు..." భర్తృ. నీతి. ౪. నీలా. ౨, ఆ. ౪౧. వి. 1. లంఘనము, ఉఱుకు. "ఉ...ము న్గనినమంజులసౌఖ్యరసంబు నిక్కలం, దాఱుచుఁ గోరికల్ గొఱవి దాఁటులు వైవఁగ..." హరి. ఉ. ౭, ఆ. ౧౮౨; 2. అశ్వగతిభేదము. "గీ ..ప్లుతగతిభేదంబు జంగ గంతు, దాఁటు...నాఁ దనరు..." ఆం. భా. ద్వి. ౯౯౮. వై. వి. (సం. దండికి.) సమూహము, గుంపు. "సీ. రాయంచదాఁటులు ప్రోయుఁ లేఁదేఁటులు గృహసరోరుహములఁ గెలిసలుప." విక్ర. 3, ఆ. ౧౦౫. వరాహ. ౮, ఆ. ౧౬.

**దాఁటుకట్టు.** ద్వ. అ. క్రి. (దాఁటు+కట్టు.) గుమిగూడు. "గీ. చినుకుతోఁ గూడుకొని గాలి చెలఁగఁ జూచి, దాఁటుకట్టుచు మృగములు దాఁటుచుండ." నా. పంచ. ౨, ఆ. ౯౯౪.

**దాఁటుకొను.** దే. అ. క్రి. (దాఁటు+కొను.) అందకుండు; ఎగురు. "వ...అజ్జాలపాదంబును నబ్బాల తలం పెఱింగి యొగసియుం దప్పఁ గ్రుంకియు దాఁటుకొనియు..." నైష. ౨, ఆ. ౪౬. కాశీ. ౧, ఆ. ౧౧౨.

**దాఁటుడువల.** దే. వి. (దాఁటుడు+వల.) జాలభేదము, ఒకరకమువల. "క. మెడవల సన్నపువల త్రొప్పుడువల డొంకవల మింటముక్కిడివల దాఁ, టుడువల సింగితమనుకువ, లెడవల కుందెవల లాదు లెసఁగెడివలలున్." హంస. ౪, ఆ. ౧౦౫.

**దాఁటువడు.** దే. అ. క్రి. (దాఁటు+పడు.) దూరమగు. "క. వేఁటమెయి వచ్చి నృప మాఁబోఁ టికిఁ జిట్టంట్ల నంటి పోయినపిదపన్, దాఁటువడుం గులమునకును, మాటయుఁ గణ్వునకు వచ్చు మానులచేతన్." పి. శకుం. ౩, ఆ. ౮౮. ద్వ. అ. క్రి. గుమిగూడు. "క. పదియును బదియేనును నిరువది యును ముప్పదియు దాఁటువడి నిత్యంబున్, గొద గొని తిరిగి వధింపఁగఁ గదలఁగ రాదయ్యె గొల్లగమి కెచ్చోటన్." హరి. పూ. ౬, ఆ. ౮.

**దాట్లమారి.** దే. వి. వ్యభిచారిణి, స్వైరిణి. "క. ఇది దాట్లమారి యగు నని, పదపడి మఱునాఁడె యొంటిపాటున మేకో, లాదవింపఁ దాసెయింటం,

దుద గానని ప్రేమ దానితో రమియించెన్." శుక. 3, ఆ. ౧౨౪.

దాఁపన. దే. వి. (దాఁగు. ధా.) దాఁచుట, గోపనము. (శ. ర.)

దాఁపరము. దే. వి. (దాఁగు. ధా.) దొంగిలించుట. (చూ. దాఁపరించు మొ.)

దాఁపరి. దే. విణ. (దాఁపరము+ఇ.) వంచకుఁడు, మోసగాఁడు. "క. విరితేనెమేపరులకుక్, హరి నీలప్రసరుల కిరుల కజ్జాక్షీకురుల్, గురులై వెడవిలుతునిబెడ, గుఱులై తగుసెమ్మిపురుల కొక దాఁపరులై." చం రా. 3, ఆ. ౭౪.

దాఁపరించు. దే. స. క్రి. దొంగిలించు, అపహరించు. "గీ. ముద్దులాఁడయి వ్రేతల మొఱఁగి పాలు, వెన్నలును దాఁపరింపఁగ." హరి. ఉ. ౫, ఆ. ౨౭.

దాఁపరీఁడు. దే. వి. (దాఁపరము+ఈఁడు.) దొంగ, చోరుఁడు. "సీ. పీఁడటే మందలో వెన్నలు దొంగిలి దర్పించి మెక్కినదాఁపరీఁడు." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౪౯.

దాఁపఱికము. దే. వి. (దాఁపన+ఱికము.) దాఁపు రము, గోపనము. (శ. ర)

దాఁపించు. దే. స. క్రి. (దాఁచు ధా. ప్రే.) దాఁచు నట్లుచేయు. "గీ. బొక్కసమువారిచేత నాభూష ణంబు, లపుడు దాఁపించి రతిరహస్యంబు గాఁగ, వైష్ణవులమీఁద మ్రుచ్చు లన్ వాదు మోఁపి." పరమ. 3, ఆ. ౫౫.

దాఁపు. దే. స. క్రి. (దాఁచు. ధా. ప్రే.) దాఁపించు. "ద్వి. ఆపద వచ్చినయప్పుడే మున్ను, దాఁపినధన మిచ్చి తగుఁ బల్నిఁ గావ." ద్వి. హరిశ్చ. పూ. ౨3౦. పు. వి. దాఁచుట, దాపరము "వ...ఇంక దాఁపేల కోడెగానితోఁ దక్కిరబిక్కిరలాడు కుంటూ కులుక సున్నావె..."మృ. వి. ౨,ఆ. ౪౫.

దాఁపుడు. దే. వి. (దాఁచు. ధా.) దాఁచుట, గోప నము. (శ. ర.) విణ. దాఁచుకొనఁబడునది. "సీ. ఇపుడు గా కిది యుండి యే మంచుఁ దెంపుచేఁ గట్టినదాఁపుడు పట్టుకొక." పార్వ. ౫, ఆ. ౨౧౭.

దాఁపురము. దే. వి. (దాఁచు. ధా.) 1. మఱుఁగుపఱు చుట, గోపనము. "గీ. ఇంతి సిగ్గుగదా యని యెంతదాఁకఁ, దలఁపు దాఁచి లోలోఁ గుమా రిలఁగ వచ్చు, నదియుఁగా కేను లాఁతినే యకట నీకు, రమణి నాపట్టునను దాఁపురంబు వలదు." కళా. ౬, ఆ. ౨౫౦. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౪౦; 2. దాఁచినసొమ్ము. "మ...కావలయు వేళక్ వచ్చి కొంపోదు నేఁడిది నీపెట్టియ నాదుదాఁ పురముగా నిం దుండని మ్మన్నియుఁన్." సా. ౨, ఆ. ౧౫; 3. దాఁచుకొనుట, నిలువచేయుట. "క. అలిసంచయఫల మిది పోఁరలిబోఁటీ వలదు దాఁపురం బన నగుచుం, బలికి సతి వలికె దాఁపక్, గత మేమీ ధాన్య మొదుగుగాలే దిం టన్." వేం. పంచ. ౪, ఆ. ౧౧౦; 4. రహ స్యము. "చ...నీకుఁ దనకల్గినదాఁపుర మిాశ్వ రుండు బాహిరముగఁ జేసెఁ జూడు..."కవు. ౧, ఆ. ౨౨౧; 5. దాఁచుకొనుచోటు. "వ... బుధులకు నవనిధులదాఁపురంబును విపులవిజయ లక్ష్మికిఁ గాఁపురంబును...అగునాపురంబునకు..." రామా. ౧, ఆ. ౧౫3. విణ. దాఁచఁబడినది, గుప్తము. "ఉ . ఎవ్వరిక్, బజ్జకుఁ జేరనీక తన భావములోపల దాఁపురంబుగా, సజ్జకుఁ జేరి యుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేద నన్." పి. శకుం. ౨, ఆ. ౧౬౭.

దాక. యు. దే. వి. వెడలుపునోరు గలచిన్నకుండ. (శ. ర. వా.) వై. వి. (సం. ద్రాక్షా.) ద్రాక్ష. "సీ. దాకతీవను బూవుదండ చేరిచి మెడ యిఱి యఁగ నురి బిగియించుదాన." రసిక. ౪, ఆ. 3౫. ఆం. భా. ద్వి. ౫౭.

దాకలి. దే. వి. (దాయు+కలు.) కాఁచి సాఁగఁగొట్టెడి యినుము బంగారు లోనగువాని కాధారముగా నుంచుకొ నెడియినుపదిమ్మ. "ఉ. దాకటిమీఁదఁ బెట్టి బెడిదంబుగ సమ్మెటవేయ..." రత్న. ౨౬. వసు. ౨, ఆ. 3౨.

దాకల్లు. దే. వి. (దాపు+కల్లు.) బండికంటికడకమ్మి, నేమి. (శ. ర.)

దాకొను. దే. అ. క్రి. (దాపు+కొను.) 1. సమీ పించు. "క. తగువారిఁ బిలిచి యిదిగో, లగనము దాకొనియె..."అచ్చ. అయో. ౦, రామా. ౫, ఆ. ౨౦౨; 2. ఆవరించు, చుట్టువాఱు. "ఉ... పురంబు సర్వమున్, దాకొని కాచుచున్నకుముద ప్రముఖుల్ సతతంబు గొల్వఁగాన్." పరమ. ౧, ఆ. 3౬. స. క్రి. ఎక్కు, అధిరోహించు. "ఉ. కుంకుమపంకశోణ యగుకొండలమండలనాథు

పట్టివ్యామాంకము దాకొనన్ ఘణఘణారవభూరిక పాలమాలికా, లంకృతు లోంక్ర్యతుల్ నొడువులా గడరన్..." పాండు. ౨, ఆ. ౧౯౨. కవిరా. 3, ఆ. ౧౧.

దాకొలుపు. దే. స. క్రి. (దాకొను ధా. ప్రే.) చేర్చు. "చ. అనివిరహాంబుఁ జేరలఁత నాశ్రిత చంద్రశిలాతలంబుమీఁద నొరుగుచున్ సఖిం దిగిచెఁ దన్వి శిరోదిశకై తదంకముం,దనకుఁ దలా డగాఁ గొనఁగఁ దజ్జత బోటియుఁ దల్క్రియా ప్రవర్తనకుఁ పదీశు దాకొలిపి తాఁ దనయింటికిఁ బోయె నవ్వుచున్." ప్రభా. ౫, ఆ. ౧౫౫. రామలిం. 3౧.

దాక్షాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. అశ్విన్యాదులలో నొకటి; 2. సతీదేవి; 3. పార్వతి; 4. కద్రువ, నాగమాత; 5. వినత, గరుడమాత; 6. అదితి,దేవ మాత; 7. దితి,రాక్షసమాత; 8. భూమి; 9. లక్ష్మి.

దాక్షాయ్యము. సం. వి. అ. పుం. గ్రద్ద.

దాక్షి. సం. వి. ఇ. పుం. దక్షునిసంతతి. ఈ. స్త్రీ. 1. దక్షునికూఁతురు; 2. పాణినితల్లి.

దాక్షిణాత్యము. సం. వి. అ. పుం. కొబ్బెరచె.

దాక్షిణాత్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దక్షిణ దేశపువాఁడు. భార. ఆది. ౫, ఆ. ౭౪.

దాక్షిణ్యము. సం. వి. అ. న. 1. కనికరము; 2. సామర్థ్యము; 3. నేర్పు; 4. అనుకూల్యము; 5. దక్షిణదిగ్భవత్వము; 6. దక్షిణనాయకభావము.

దాక్షేయుఁడు. సం. వి. అ. పుం. పాణిని.

దాక్ష్యము. సం. వి. అ. న. 1. నేర్పు; 2. సామర్థ్యము; 3. ఋజుత్వము.

దాఖల. హిం. వి. (హిం. దాఖల్.) నిదర్శనము, రుజువు (బ్రా. వా.)

దాఖలు. హిం. వి. కాకితము ఇచ్చి యిచ్చినట్లు పుస్తకములో వ్రాయించుకొనుట.

దాగలి=దాకలి. (శ. ర.) ('దాఁగలి' అని కొందఱు.)

దాడకము. సం. వి. అ. పుం. దంతము.

దాడి. ఉభ. వై. వి. 1. (సం. దాఢికా.) గడ్డము, శ్మశ్రువు. (శ. ర.); 2. (సం. ధాటీ. క. దాడి.) శత్రుజయార్థమై దండెత్తిపోవుట, దండయాత్ర. "ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారు..." భార. విరా. 3, ఆ. ౧౭౬, హరి. పూ. ౩, ఆ. ౧౭౬; 2. ఉదుటు, ఔద్ధత్యము. "చ. తలిరుజిరావజీరుబలుదాడికి నోడి కడంక నక్క..." నీలా. 3, ఆ. ౧౪. చం. రా. ౫, ఆ. ౨౬. సం. వి. ఈ. స్త్రీ. 1. దానిమ్మచె; 2. దానిమ్మపండు.

దాడింబ. వై. వి. (సం. దాడిమః.) "దండకము... దాడింబపండ్ల న్విడంబించు పాలిండ్లపై..." దశా. ౪, అ. ౨౩౬, ఆం. భా. ద్వి. ౫౦.

దాడింబము. సం. వి. అ. పుం. దానిమ్మచె.

దాడికాఁడు. ద్వ. వి. (దాడి+కాఁడు.) 1. వేగుల వాఁడు. "చ. ఇదె చనుదెంచెఁ జైత్రుఁ డని యెల్లవనంబులకున్ బ్రమోదముల్, పొదలఁగ మేలివార్తఁ గొని బోరన వచ్చినదాడికాఁ డన, న్మృదువనదేవతాముఖసమీర మెదుర్కొన నుల్లసిల్లె నిం,పొదవఁగ దక్షిణానిల మనూనమనోహర ఖేలనంబునన్." నృసిం. ౨, ఆ. ౬౦; 2. దండెత్తు వాఁడు. "చ. తిమిరపుదాడికాఁడు చనుదేరఁ దొడంగెను నా కెదుర్పఁగా, సమయము కాదు. ..." విప్ర. 3, ఆ. ౨౩, కేయూర. ౪, ఆ. ౨౭.

దాడిగొను. ద్వ. అ. క్రి. (దాడికొను.) ఒకదానివెంబడి నొకటి వచ్చు. "తన్వీవృత్తము. పాడి ఐనోదంబులు సలిపిన గోపాలుఁ డటంచును భతనసభా న్యల్, దాడిగొనన్ విశ్వవిరమణముతోఁ దన్వినిఁ జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్." అప్ప. ౪, ఆ. ౨౩౬. పు.

దాడిచేయు. ద్వ. అ. క్రి. (దాడి+చేయు.) దండెత్తు. "వ...పదునెనిమిదవమాఱు దాడిచేసి శత్రులం దోలి విజయంబు చేకొంటి..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౫౯.

దాడినిమ్మ. వై. వి. దాడిమచె. "మత్తకోకిల. పూచె నిమ్మలు దాడినిమ్మలు పొన్నలున్ సురపొన్నలున్." య. ౪, ఆ. ౭. [పాఱిపోవు. (బ్రా.)

దాడిపఱచు. ద్వ. అ. క్రి. (దాడి+పఱచు.) పరుగెత్తు,

దాడిపోవు. ద్వ. అ. క్రి. (దాడి+పోవు.) దండెత్తు. "ద్వి...ఆతనిపై దైత్యులపోక,తల.పుచు వారిపై దాడిపోఁ దగునె." రం. రా. యు. ౨౪౯, పు. ౨౦, పం. ఇట్లే:-దాడివోవు. భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౧.

దాడిమ. వై. వి. (సం. దాడిమః.) దాడిమముచె. "రగడ. దాడి దాడిమగమికిఁ జేరఁగఁ ధగునె తగు నెడ కరిగెఁ గీరము." చంద్రి. ౪, ఆ. ౬౩.

దాడిమపుష్పము. స. వి. అ. పుం. ములుమోదుగుచెట్టు.

దాడిమప్రియము. సం. వి. అ. పుం. చిలుక, శుకము.

దాడిమము. సం. వి. అ. పుం. న. 1. దానిమ్మచెట్టు; 2. ఏలకిచెట్టు. న. దానిమ్మపండు.

దాడిమి. సం. వి. ఈ. స్త్రీ. 1. దానిమ్మ; 2. ఏలకిచెట్టు.

దాడిమ్మ. వై. వి. (సం. దాడిమః.) దానిమ్మచెట్టు. సాం. ని. స్థా. ౫౭.

దాడియాడు. ద్వి. స. క్రి. (దాడి+ఆడు.) 1. ముట్టడించు. (మార్కొను. శ. ర.) "ద్వి. ఈడఁబోవక యింద్రుఁ డీమనవీడు, దాడియాడుచు వస్తుతతిఁ గొల్లవిడిచి." ద్వి. భాగ. ౭, స్కం. (శ. ర.) 2 కొల్లగొట్టు. (బ్రౌ.)

దాడివచ్చు. ద్వి. అ. క్రి. (దాడి+వచ్చు.) దండెత్తివచ్చు,యుద్ధమునకు వచ్చు. "శా. దేవా రక్కసుఁ డొక్కరుం డతిబలోద్రేకంబునన్ దాడిరా." వరాహ. ౧౧, ఆ. ౧౨.

దాడివెట్టు. ద్వి. అ. క్రి. (దాడి+పెట్టు.) దండెత్తు, దాడివెడలు. "వ...హిరణ్యాక్షుండు...తన్ను నెదిరి కదనంబు సేయం జాలినయరివీరుని గానక భూలోకం బెల్లఁ గ్రుమ్మరి దివంబునకు దాడివెట్టి యందు సమరవిముఖు లయినబర్హిర్ముఖులం గనుం గొని..." భాగ. 3, స్కం. ౬౧3, భార. కర్ణ. 3, ఆ. 3౫౬. [3. సమూహము.

దాఢ. సం. వి. ఆ. స్త్రీ. 1. దంష్ట్ర,కోఱ; 2. ప్రార్థన;

దాణ. వై. వి. (సం. ధాన్యమ్. హిం. దానా.)అశ్వాదులకుఁ బెట్టు ఉలవలు లోనగునాహారము. "చ.... ఏ,తతిఁ గలలోననున్ బడేదుదాణ యెఱుంగను..." హంస. ౫, ఆ. ౪౧.

దాణము. దే. వి. శుల్కము,సుంకము. (శ. ర.)

దాణుధోడ. దే. వి. మల్లవిద్యావిశేషము. "వ... అవ్వీరుండు...దాణుధోడ ఝూటు నివి మొదలయిన పదునాలుగు విసరులమర్మంబులుం జూచి. ..." హంస. ౧, ఆ. ౨౦౬.

దాత. సం. విశే. (బు. త్రి. బు.) 1. దానముచేయువాఁడు, ఇచ్చువాఁడు; 2. ఖండించువాఁడు; 3. శుద్ధిచేయువాఁడు.

దాతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. శుద్ధమైనది; 2. త్రుంపఁబడినది.

దాతవ్యము. సం. వి. అ. న. దానము. "క. విను పృథివియును సరస్వతియును గోవును దానవిధికి నొక్కంతలుగా, వినియుండుదు వీనింబోలిన దాతవ్యములు నొండు లే వని విందున్." భార. అర. ౨, ఆ. ౪౧౧. విశే. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁదగినది. భార. అను. ౨, ఆ. ౩౬౭; 2. శోధింపఁదగినది.

దాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఖండించుట; 2. శుద్ధి.

దాతికట్టె. దే. వి. (దాయి+కట్టె) చెక్కడమ్మునకు ఊఁతగా క్రింద నుంచుబల్ల లోనగునది,ఉద్ఘనము. (శ. ర.)

దాతు. వై. వి. (సం. ధాతుః). గైరికాదిధాతువు. "మత్తకోకిల. తమ్మిపూసలపేరు నెట్టినిదాతు బొట్టును జూడ నంగమ్ముపైఁ దగుసొమ్ముగా... చెం చరుదెంచినన్." ద్వా. ౮, ఆ. ౯.

దాత్యుఁడు. సం. వి. అ. పుం. దాత,ఇచ్చువాఁడు.

దాత్యూహము. సం. వి. అ. పుం. 1. వానకోయిల, చాతకము; 2. గుండఁగిపక్షి; 3. నీరుకాకి; 4. మేఘము,మబ్బు.

దాత్రము. సం. వి. అ. న. కొడవలి, లవిత్రము.

దాదాపు. దే. వి. (దాపు+దాపు.) మిక్కిలి సమీపము. (శ. ర. వా.)

దాది. వై. వి. సం. ధాత్రీ. (క. దాది. త. తాది.) పెంపుడుతల్లి,ఉపమాత. "గీ. పతి కళావతి యను దానిఁ బద్మనయన, దమనసహోదరి గారాపుదాది కూఁతు నంతికమునకు రప్పించి..." నైష. ౮, ఆ. ౫౪, దశా. ౪, ఆ. ౧౩౯.

దాదిలి. వై. వి. (సం. ధాత్రీ.) దాది. ఉపమాత. "క. తాదృశపురహర్మ్యములకు, దాదిలి యగును దినకరసుధాకరతేజః, ప్రాదుర్భావని దానము,హాదీధితి తెలియఁ దరమె యాసభమహిమల్." కళా. 3, ఆ. ౧౪.

దాదుంగ. దే. వి. (దాయి+దుంగ) గాతికట్టె,ఉద్ఘనము. (శ. ర.) [కుత్సితదానము.

దానకము. సం. వి. అ. న. 1. అల్పదానము; 2.

దానము. సం. వి. అ. న. ఈవి, ఇచ్చుట. (దశదానములు. గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము లవణదానము; షోడశమహాదానములు – గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్ర

ఖరదానము, రథదానము, గజదానము, అశ్వదానము, ఛాగదానము, మహిషీదానము.); 2. గజకపోలమదము; 3. పాలనము; 4. ఖండనము; 5. శుద్ధి; 6. రాజ్యాంగసంబంధిచతురుపాయములలో నొకటి. (ఇది పంచవిధములు-తనకుఁ గల ధనమునంతయు నిచ్చుట, ఎక్కడనేని ధనము తీసికొన్నచో దానికిఁ దా ననుకూలుఁడై యుండుట, అపూర్వవస్తువుల నిచ్చుట, ఇతరులధనముఁ బుచ్చుకొనఁ బ్రవర్తింపఁ జేయుట, అప్పుతీర్చుట.)

దానవుఁడు. సం. వి. అ. పుం. దనుసంతతివాఁడు—తొలివేల్పు, రాక్షసుఁడు.

దానవురాలు. మి. వి రాక్షసస్త్రీ. రక్కసి. "క. అవివేక మడిగి దైత్య, ప్రవరునియంతిపురమునకుఁ బదమనుచుక్ దానవురాండ్రు వలుకుపలుకుల్ ..." రామా ౬, ఆ. ౧౪౧.

దానవేయుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

దానశౌండుఁడు. సం. విశ. (అ ఆ. అ.) మిక్కిలి యీవి కలవాఁడు, వదాన్యుఁడు.

దాని. సం. విశ. (న్. నీ. న్.) 1. మదము గలది. (గజము.), 2. దానముచేయువాఁడు, దాత. "ఆ... కౌరవవాన్వయంబు, వెలుఁగుచుండఁ బుట్టె వీరాగ్రగణ్యుండు, సంతతార్థ దాని శంతనుండు." భార. ఆది. ౪, ఆ. ౧౪౦.

దానింబ. వై. వి. (సం. దాడిమః.) దానిమ్మచె. "క... గరగర నాపల్వరుసల్, గరగర దానింబవిత్తుగమి నదలించున్." కృష్ణ. ౪, ఆ. ౬౩.

దానిమ్మ. వై. వి. (సం. దాడిమః.) దాడిమచె. "సీ... నందనవనమందుఁ గ్రందన నెరజాజు పొలుపొందు దానిమ్మపూ వనంగ." కృష్ణ. ౪, ఆ. ౧౦౫. సాం. ని. స్థా. ౫౭.

దానీయము. సం. వి. అ. న. దానము. విశ. (అ.ఆ.అ.) 1. ఇయ్యఁదగినది. (ధనాదికము.); 2. దానపాత్రము.

దానువు. సం. వి. ఉ. పుం. 1. సుఖము; 2. వాయువు; 3. యజమానుఁడు. విశ. (ఉ.) 1. పరాక్రమవంతుఁడు; 2. దాత.

దాపనము. సం. వి. అ. న. ఇప్పించుట, దానము [చేయించుట.

దాపరము. దే. వి. (దాయు. ధా.) 1. ప్రాప్తి (శ. ర.); 2. దాఁచుట, మఱుఁగుపఱుచుట. (చూ. దాపరముఁ జేయు.)

దాపరముఁ జేయు. దే. స. క్రి. (దాపరము+చేయు.) మఱుఁగుపఱుచు, గోపనమొనర్చు. "మ. ఉరులజ్జాభరగహ్వరంబునను రాగోద్వృత్తి కీ వేల దాపరముం జేసెదు మర్మముం దెలియుచుసూపజ్జక్ వృథా కాదె..." కాళింది. ౬, ఆ. ౭౮.

దాపరించు. దే. అ. క్రి. ప్రాప్తించు. (శ. ర. వా.) స. క్రి. చేకూర్చు. "కళిక. తటిని సద్గురుసుతుల దాపరించినసదయు, పెటిమె నాగపురంబు పెక్కలించినవిజయ." అప్ప. ౪, ఆ. ౩౩౩.

దాపల. దే. వి. ఔ. ఎడమవైపు. "వ... వలపటఁ గృపాశ్వత్థామలును దాపటఁ గృతవర్మమద్రేశ్వరులును వెనుక బాహ్లికసోమదత్త భూరిశ్రవసులును..." భార. భీష్మ. ౧, ఆ ౧౦౩. కాశీ. ౩, ఆ. ౯౯.

దాపలించు. దే. స. క్రి. 1. ఎడమవైపుగా నుంచు. "వ... బకవైరి దాపలించి తిరిగినం బెరిఁగినఁ యీరసంబున నుల్లసితుండై యాఖభూవల్లభుండు ..." భార. శల్య. ౨, ఆ. ౭౬౭; 2. ప్రాప్తింపఁ జేయు. కు. సం. ౨, ఆ. ౩౮౧.

దాపించు. దే. అ. క్రి. (దాయు. ధా) సమీపించు. (శ. ర.)

దాపితము. సం. విశ. (అ. ఆ. అ.) ఇప్పింపఁబడినది. [(ధనాదికము.)

దాపితుఁడు. స. విశ. (అ ఆ. అ.) దండితుఁడు, దండుగగొనఁబడినవాఁడు.

దాపు. దే. స. క్రి. (దాయు. ధా.) చేర్చు. "క. తమవారిం బిల్చినవై, శమ చని వారందఱుక్ బోలసు మేపరిక్లు మొగక్ దాపినపెచుక్కాయి మొగింబడఁ దన్ని లోని కేఁగి కడంకన్." అచ్చ. యు. ౪౪౬. వి. సమీపము, చేరువ. "సీ. డాకాలిగండపెండారంబుదాపున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల." కాశీ. ౧, ఆ. ౪౫; 2. ఆధారము; అవలంబము. "ఉ... మామనోగతులు నిర్భరహార్దము నొంది నింకన్నెఱపట్టున నేమి ధన్యులము ప్రాపును దాపును నీవు గల్గుటన్." హరి. ఉ. ౧, ఆ. ౧౪౫. హరి. పూ. ౪, ఆ. ౧౬.

దాపుకొను. దే. స. క్రి. (దాపు+కొను.) ఆశ్రయించు, అండగొను. "వ. ఇట్లరుగుదెంచి ప్రాంతరత్న స్తంభంబు దాపుకొని సఖీజనంబులమఱువున లజ్జావనతవదనారవింద యగుసుందరిం గడచి..." కవిక. ౩, ఆ. ౨౦౫.

దాపురమగు. దే. అ. క్రి. (దాపురము+అగు.) ప్రాప్తించు, దాపరించు. "గీ. కారణం బన్నిటికి నల్లహాదుపమె క, దా యదెక్కడ దాపురమాయెం దనను." సా. ౨, ఆ. ౧౪౫.

దాపురము. దే. వి. (దాయు. ధా.) ప్రాప్తి. (శ. ర.) "ద్వి. నీరం జిచ్చోగయింపనేర్చినతల్లి, యెచ్చట నుండి వీ విట దాపురముగ, వచ్చితి చొచ్చితి వాస మీ ననుచు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౦౧, పం.

దాప్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఇప్పింపదగినది.

దాప్యుడు. సం. విణ. (అ. ఆ. అ.) దండ్యుడు, దండుగ గొనదగినవాడు.

దామని. సం. వి. ఈ. స్త్రీ. 1. పెక్కుపలుపులు గల నిడివిత్రాడు, దామెన; 2 పలుపు.

దామము. సం. వి. న్. పుం. న. 1. దామెనత్రాడు, పెక్కుపలుపులు గలనిడివిత్రాడు; 2. త్రాడు, రజ్జువు; 3. పాలు పితుకునపుడు పసులకాలికి గట్టెడిత్రాడు, బంధము; 4. దండ, మాల; 5. పసులం గట్టెడుపలుపు.

దామర. దే. వి. 1. ఉరిత్రాడు. "చ. ఎలమి మనో జలుబుం డెలయించిన జక్కవదీము పెంటి పేరెలం గునం బిల్చి చూడ్కిం గదియించి యెదుర్కొని మేను మేను నిశ్చలగుణసంగతిం బెనంచి చక్రము దామరతెంకిం జేర్పం దత్కలకలశంకం బోలె విహగంబులు వీడెం గులాయకూటముల్." వసు. ౪, ఆ. ౧౩౨; 2. మండలాకారమగుకుష్ఠము. (శ. ర.)

దామాషా. హిం. వి. (హిం. దామాశాహి.) సరియైన పంపకమైన భాగము.

దామెన. వై. వి. (సం. దామనీ.) పెక్కుపలుపులు గలనిడివిత్రాడు; త్రాడు. "గీ. దత్తునల్లుండ్ర మెడల సూత్రములు గట్టి, యూపములసూత్రములతోడ నుద్దిచేసి, దామెనలు గూర్చి నడిపించెం దరతరంబె, వీరభద్రుండు పశువుల వెల్చునట్లు." కాశీ. ౭, ఆ. ౧౮. భాగ. ఉ, స్కం. ౧౬౯.

దామెనకొయ్య. ద్వ. వి. (దామెన+కొయ్య.) దామెన కట్టుస్తంభము. "గీ. తలుగు లాడ్చి పెయ్యల నెల్లం దల్లిచన్నుం, గుడువ విడుచుం గొన్నిటి. నలుంగడలం ద్రోలునుఅక దామెనకొయ్యలు పెఱికి పాఱ, వైచుచు గావళ్ల నుట్లను వ్రచ్చి తెంచు." హరి. పూ. ౫, ఆ. ౨౦౬.

దామెనత్రాడు. ద్వ. వి. (దామెన+త్రాడు.) దామెన. "మ. చనుమా చూతము నీ తెఱం గనుచు నుత్సాహంబుతోం దల్లి దామెనత్రాటం బెను ఱోటితోన ముకు బల్మిం గట్టినన్..." హరి. ఉ. ౪, ఆ. ౨౩౫.

దామెనవేట. ద్వ. వి. (దామెన+వేట.) అచ్చ టచ్చట దామెనలు గూర్చి చేయువేట, మృగ యావిశేషము. "సీ. దీమంబువేటలు దామెన వేటలు తెరవేటలును నేర్పు తెరలికలును." ద్వా. ౧, ఆ. ౨౨.

దామోదరుడు. సం వి. అ. పుం. 1. విష్ణువు; 2. కృష్ణుడు; 3. బుద్ధుడు (ఈశుడు.) "ద్వి. వెలయ ననంగుం గావించె నంగజుని, వెలుంగనిపురములు వెలిగించెం బేర్చి, చెనసి దామోదరుం జేసె దామో దరుని విధి పాలుసేసెను విధిం బట్టి" బస. 3, ఆ. ౭3, పు.

దామ్యత్. సం. శత్రు. 1. అణంచుచున్న; 2. దం డించుచున్న.

దాయ. వై. వి. (సం. దాయాదః. క. దాయ.) 1. జ్ఞాతి, సగోత్రుడు. "ఆ. అనఘ పితృపితామహ ప్రపితామహపూజనములు శిష్టపూర్వకముగం, జేయ వలయుం నియతి దాయ దొడ్డినజన్నిదంబు తోడ భక్తిధామ మగుచు." భార. అను. 3, ఆ. ౧౯౯. ఆం. భా. ప్ర. ౧౧౭; 2. శత్రువు. "మ... ఎట్లయినం మేలగు దాయ గెల్వ మను రేంద్రా యంచు బోధించినన్." ఉ. రా. ౭, ఆ. ౨3౧. భార. ద్రో. ౪, ఆ. 3౧౨.

దాయంగట్టు. దే. స. క్రి. (దాయన్+కట్టు.) బంధము వేయు. (శ. ర.)

దాయకుడు. సం. వి. అ. పుం. జ్ఞాతి, దాయాదుడు. విణ. (అ. యికా. అ.) 1. ఇచ్చువాడు; 2. ఖండించువాడు; 3. శోధించువాడు.

దాయభాగము. సం. వి. అ. పుం. 1. దాయములోని భాగము; 2. పిత్రాదిధనమును బంచుకొనుట, దాయవిభాగము.

దాయము. ఉభ. దే. వి. (క. దాయ. త. దాయం.) 1. గవ్వలాట జూదము మున్నగువానియందలి పందెము. "సీ. ఒకదాయ మాడిన నున్న దాయం బాడు మనక పాటులం రెండు గొని చెలంగి." ఉ. హరి. 3, ఆ. ౧౭౮. పండితా. పురా. ౧౨౫.

పు; 2. విపత్తు, ఇడుమ. "ద్వి. పడి నుక్కు దాయము వచ్చుచో ధైర్య,ముడిగిన దైన్యంబు నొందిన నగరె." ద్వి. హరిశ్చ. ఉ. ౯౯౯, బ. క్రీడా విశేషము. "సీ. దాయాలు సొగటాలు దాట్రాయి చదరంగమును జోటురాళ్లను మూఁతపొంతుపు." హంస. 3, ఆ. ౧౪౬, బ్రహ్మో. 3, ఆ. 3౦. సం. వి. అ. పుం. 1. దానము,ఈవి; 2. అరణము, వివాహకాలమునఁ గన్య కిచ్చుధనము; 3. వివాహకాలమునందు అల్లున కిచ్చుకట్నము; 4. పంచుకొనఁదగినతండ్రి మున్నగువారిధనము; 5. నాశము,లయము; 6. ఖండించుట; 7. ఎత్తిపొడుపు; 8. ఇయ్యఁదగినధనాదికము; 9. తావు,స్థానము; 10. శుద్ధి,స్వచ్ఛత.

దాయపడు. ద్వి. అ. క్రి. (దాయము+పడు.) కష్టపడు. (చూ. దాయపఱుచు.)

దాయపఱుచే. దే. స. క్రి. (దాయపడు. ధా. ప్రే.) కష్టపెట్టు,బాధించు. "క. మాయరవి యేల క్రుంకఁడో,కో యను నిట్టేల తడసెనో యనుఁ గ్రుంకం, బోయెడుఁ జూ యిప్పుడ యను,దాయపఱిచె నను మనోజతాపముపేర్మిన్." భార. విరా. ౨, ఆ. 3౧౨.

దాయాద. సం. వి. ఆ. స్త్రీ. 1. దాయాధికారిణి, జ్ఞాతి; 2. కూఁతురు.

దాయాది. సం. వి. న్. పుం. 1. దాయాదుఁడు, జ్ఞాతి; 2. పుత్రుఁడు. ఈ. స్త్రీ. 1. దాయాధికారిణి; 2. పుత్రిక. విణ. (న్. సీ. న్.) దాయము ననుభవించువాఁడు.

దాయాదుఁడు. సం. వి. అ. పుం. 1. దాయాధికారి, జ్ఞాతి; 2. పుత్రుఁడు.

దాయాద్యము. సం. వి. అ. న. జ్ఞాతిత్వము.

దాయి. ఉభ. దే. వి. ఔ. (దాయు ధా.) 1. సమీపము. "ఉ. ఆతరళాక్షి డెందమున నారటమొందుచు నేమిసేయుందుక్, రాతికిఁ దోడుపోయినది రాసుతుడెందము మెత్త గాదు ద్రా,దాతికి వచ్చియుండ నీకఁ దాలిమి చెల్లునె మారుఁ డంటిమా, ఘాతకుఁ డోర్వరాదు సముఖంబున నేటికి రాయబారముల్." సా. ౨, ఆ. ౧౬; 2. దాకలి. "చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్, హరునయనాగ్ని కొల్మి యంరగాధిపుకోఱలు పట్టుకార్లు ది,క్కరటిశిరంబు దాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం,హరణగుణాభిరాముఁ డగుమైనము భీమనఖడ్గసృష్టికిన్." భీమనచాటుధార. (శ. ర.); 3 చెక్కడు మ్రానిక్రింద ఊఁతగా నుంచుకొనుదుక్క, ఉద్ఘనము. "ద్వి. భామిని నప్పుడ పటఁగొట్టి రెండు,చేతులఁ గట్టి డాచేతఁ దాఁబట్టి, దాతిపై నిడి బాడిశయుంచెత్తి పూఁచి." పండితా. పురా. ౯౬, పు. ప్రబంధ. ౪౪, సం విణ. (న్. సీ. న్.) ఇచ్చువాఁడు, దాత. (ఇది సమాసాంతముగనే యుండును.)

దాయు. దే. అ. క్రి. 1. కలుగు,జనించు. "ద్వి. తగవును ధర్మంబు దలపోసి మాని,పగదాయ నబ్బోయపై నల్క వొడమి." రం. రా. బాల. ౬, పు. ౧3, పం.; 2. తగులు,లగ్నమగు. "క. భూపాల మెఱుఁగుఁబోఁడుల, మాపులకుఁ దాయునీమసొబగట్లుగుటక్, మాపిన్నది యినువింతల,మాపుల నరగంట వెఱచుచు న్నినుఁ జూచున్." నైష. ౧, ఆ. ౬౧, స. క్రి. అ. క్రి. సమీపించు. "ఉ. తక్కులనూలవాలములు దాయుదురే తరుణీజనంబులన్" విక్ర. 3, ఆ. ౭౯, వరాహ. ౬, ఆ. ౧౭.

దార. ఉభ. యు. దే. వి. 1. బాకా,కాహళి. "క. ఓరమణి నీదుపిక్కలు,దారల నగు మోవి పంచదారల నగు..." ప్రబంధ. ౬3౭, కువల. ౨, ఆ. ౧౧౫. వై. వి. (సం. ధారా. క. దారె.) నీటిజాలు,ధార. "రగడ. తమ్మిపువ్వుల మీఁదిజలములదార తారకయుండఁ జల్లుము." పారి. ౪, ఆ. ౧౬. ప్రబంధ. ౬3౭; 2. ధారాపూర్వకముగా నిచ్చుట,దానము. "ద్వి ..విప్రుల కవనివల్లభులు దగినదానము లీరో ధనమీయఁ గొనరో, పగఁగొని యారీతిఁ బట్టి యణఁచిమి, దారలెక్కలకునై తరువులువెట్టి,దారల నమ్మించి ధనములు గొనెడికఠిన చిత్తులు లేరు..." ద్వి. హరిశ్చ. ఉ. ౪౭౯; 3. క్రమము రీతి. "గీ. తప్పనాడక తొల్లింటిదార చెడక." ఉ. హరి. 3, ఆ. ౧౨౪. (శ. ర. పా. దారిచెడక. ముద్రి.); 4. కవిత్వాదుల అవిచ్ఛిన్నగతి. "మత్తకోకిల. దారతప్పక చెప్పనేర్తు వుదారవాక్చతురత్వ మొ,హోరెనాఁగఁ బ్రబంధ మొక్కటి యొక్కనాఁటనె..." సమీర. ౧, ఆ ౧౫, సం. వి. అ. పుం. బ. ఆ. స్త్రీ. పెండ్లాము, భార్య. "శా...ని స్నేహితో,

దారఁ దొంగిలి తంచు నిష్ఠురగతిఁ దండించి ఖండింప మున్ని శెట్టైనను దాఁటివచ్చు నలుకఁ నేఁ డెల్లి శాంతింపుమా." మొ. రా. సు. ౬౨.

దారకము. సం. వి. అ. పుం. ఊరఁబంది.

దారకర్మము. సం. వి. న్. న. పెండ్లి, వివాహము.

దారకుఁడు. సం వి. అ. పుం. 1. పుత్త్రుఁడు; 2. బాలకుఁడు. విణ. (అ. రికా. అ.) చీల్చువాఁడు.

దారణ. దే. వి. (క. దారణె. త. తారకై.) 1. కొనుట, క్రయము. "గీ. కొనుట దర దారణ య నంగ మనును గ్రయము." ఆం. భా. ద్వి. ౨౬౨; 2. (ధాన్యాదుల) వెల, మూల్యము. "క. ప్రాలేడుమానికెలకుం, దైలము మానేఁడు పురమ్ము దారణగలుగఁ, బ్రాలసరి తైల మడిగిన, జాలియ యగుఁ గాని నీకుఁ జము శే లబ్బున్." కేయూర. ౨, ఆ. ౧౦, జై. ౬, ఆ. ౯.

దారణము. సం. వి. అ. న. 1. చీల్చుట; 2. ఇందు పర్యాయ. విణ. (అ. ఆ. అ.) చీల్చునది. (అ. ఈ. అ.) చీల్చుటకు సాధనమైనది.

దారదము. సం. వి. అ. పుం. పాదరసము. పుం. న. 1. విషభేదము; 2. ఇంగిలీకము; 3. సింధుదేశము.

దారపరిగ్రహము. సం. వి. అ. పుం. పెండ్లి, వివాహము. "క. ఘోరవ్రతములు సలుపుచు, దారపరిగ్రహము సేయఁ దా నొల్లక సం, సారపునర్భవ భీతి న, పారవ్యామోహపాశ బాధచ్యుతుఁడై." భార. ఆది. ౨, ఆ. ౧౪౦. (దారపరిగ్రహము సేయఁ = పెండ్లియాడుటకు) ఇట్లే: దారగ్రహణము. మొ.

దారబందము. వై. వి. (సం ద్వారబంధః. క. దార బందవు.) ద్వారబంధము. "వ... ఒరగం ద్రోచిన దారబందములును..." ఉ. హరి. ౧, ఆ. ౫౩, ఆం. భా. ద్వి. ౨౧.

దారము. దే. వి. (క. దార.) 1. నూలిత్రాడు, సూత్రము "సీ... తనరు సూత్రము త్రాడు దార మనఁగ." ఆం. భా. ద్వి. ౨౯౫; 2. చేత్రాడు, త్రాడు. "ద్వి. తామఱి యొకఁడు లేఁ డామల్లినాథ, దార మొసంగరా ధర్మాత్ములార." పండితా. పర్వ. ౩౪౫. పు; 3. నాలుగు కాసుల నాణెము. కాకణీ చతుష్టయము. "సీ. కా సనఁగాను గాకణి పేరు విలసిల్లు... దమ్మ మనంగను దార మనంగను దచ్చతుష్టయసంజ్ఞ దనరుచుండు." ఆం. భా. ద్వి. ౨౭౪, వై. వి. (సం. ద్వారమ్.) ద్వారము. (చూ. దారబందము.)

దారవోఁత. ద్వ. వి. (దారవోయు. ధా.) ధార పోయుట, "మ తలఁపు గర్ణుఁ డపార్థదాతయె యపాత్రత్యాగిమూర్ధన్యుఁ డా, బలి వ్యర్థంబగు గల్పకంబు ఫలియింప న్మేఘుఁడుం దారవోఁ, తల మాత్రంబు ధనం బొసంగఁడుగదా తద్దానము లెత్తునే .." దశా. పీఠి. ౬౪.

దారవోయు. ద్వ. స. క్రి. (దార+పోయు.) 1. దానముచేయు. "క. అని కృతనిశ్చయుఁడై య, ద్దనుజమణికి దారవోసెఁ దనపుత్త్రి మయుం, డనలునిసన్నిధి నతఁడుఁ, దనరుచుఁ బాణిగ్రహణము దగ నొనరించెన్." ఉ. రా. ౨, ఆ. ౨౯౧. స్వా. ౫, ఆ. ౭౯; 2. పెట్టు. "గీ. శాంతి పుంభావ మొందినసౌష్ఠవమున, బంతినడిమికి నేతెంచి భవనభర్త, తపసులకు భక్తి నన్నంబు దారవోసె." కాశీ. ౭, ఆ. ౧౯౬; 3. (ఇచ్చుటకై) సంకల్పించు. "క... విప్రులకుఁ, ధేనువులం బదివేలను, మానసమున దారవోసె మఱి యిచ్చుటకున్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౧౩; 4. వివాహార్థమిచ్చు; పెండ్లిచేయు. "చ. అని శుభలగ్నమందుఁ గమలాసనుఁ డత్రియు సమ్మతింపఁగాఁ, దనయుల నిర్వదేడ్వురను దక్షుఁడు వేడుక దారవోసె న, త్యనుపమవైఖరిఁ, గువలయాప్తునకున్..." శశాం. ౫, ఆ. ౧౩౬.

దారి. ఉభ. వై. వి. (సం. ద్వారమ్. క. దారి.) 1. త్రోవ, మార్గము. "చ... వెఱచి కాననభూమికి పిఱిఁబాఱి దారి జడత నిద్రలోఁ గలవరింప...." నైష. ౫, ఆ. ౧౩౩. ఆం. భా. ద్వి. ౨౯; 2. రీతి, విధము. "సీ. తనదర్శనస్ఫూర్తి తనదర్శనస్ఫూర్తికరణి శ్రీధామైకగరిమఁ బూన... తన దానచాతురి తనదానచాతురిదారిఁ బ్రత్యర్థివర్ధన మొనర్పు." శశాం. పీఠి. ౫౪, ఇందు. ౪, ఆ. ౩౧; 3. స్థానము, ప్రదేశము. "వ... ఒక్కయెడ జాతివిరోధం బైన వెలవెలం బాఱుచు నొక్కచాయ రాశిమిత్రత్వంబు చాలకుండిన బెండు పడుచు నొక్కదారి గణవైపరీత్యంబయిన..." శుక. ౨, ఆ. ౧౬౦. ఇందు. ౪, ఆ. ౭, 4. పార్శ్వము, వైపు. "చ. చరణములందుఁ బావలోకజమ్వని ఘూసుప జామరంబు లిద్ధఱుమఱు

చిక్కటూరు లిరుదారులయం దిడ..." చం. రా. ౨, ఆ. ౫౯; 5. సూత్రధారుఁడు. "సీ... దారి నాఁ దగు సూత్రధారకుండు." ఆం. భా. ద్వి. ౨, ఆ. ౨౮౭. విణ. (సం. ధారీ.) ధరించు వాఁడు. (ఇది కర్మవాచకము పపదముగానుండఁగనే కన్పట్టుచున్నది.) ఉదా. జడదారి, మాయదారి. సం. విణ. (ఇ. ఈ. ఇ.) చీల్చువాఁడు, పగుల్చు వాఁడు.

దారించు. సం. స క్రి. చీల్చు, భేదించు. "మ. తన దంభోళి హతుస్థలిం బెరసియుఁ దారింపలేకుండు టన్, హనుమంతుఁ డను పేర మీఱు నని..." సమీర. ౩, ఆ. ౧౮౪.

దారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. ఆఁడు పిల్ల; 3. ఱంకుటాలు, కులట.

దారికట్టు. ద్వ. వి. (దారి+కట్టు.) మూలికావిశేషము, మార్గమును నిరోధించు మహిమ గలమూలికవృ. "క. ఇదిదారికట్టు మొదలకట్టిది కాంతావశ్యకరణ మిది నీమది కింపొదవించు నోనరేశ్వరపటిలం బని తెల్పి కొన్నిబనరిక లొసఁగెన్." శుక. ౧, ఆ. ౫౪, కువల. ౫, ఆ. ౫౬.

దారికాఁడు. ద్వ. వి. (దారి+కాఁడు.) దారిలో సహాయముగా వచ్చువాఁడు. "ద్వి. నలి దారి కాండ్రునై నడపించుఁ బథము." పండితా. పర్వ. ౩౬౭. పు.

దారికొట్టు. ద్వ. అ. క్రి. (దారి+కొట్టు.) దారిలో నా పి దోఁచుకొను. (బ్రా. వా.)

దారితము. సం. విణ. (అ. ఆ. అ.) చీల్చఁబడినది.

దారిద్ర్యము. సం. వి. అ. న. లేమి, బీదతనము.

దారుక. సం. వి. ఆ. స్త్రీ. కఱ్ఱబొమ్మ.

దారుకము. సం. వి. అ. పుం. దేవదారువృ.

దారుకీటము. సం. వి. అ. పుం. కఱ్ఱను దొలుచు పులుఁగు, ఘుణము.

దారుకుఁడు. సం. వి అ. పుం. శ్రీకృష్ణునిసారథి.

దారుగపాలు. దే. వి. మల్లవిద్యావిశేషము. "వ.. ఠఘాటుధాణు కపాలు దారుగపాలు ధాణు ధారు .. మొదలగుపదు నాలుగువిసరులు..." ప్రబంధ. ౭౮.

దారుణము. సం. వి. అ. పుం 1. భయానకరసము; 2. చిత్రమూలమువృ.; 3. క్రూరకృత్యము. "వ... ఇట వారణావతమ్మున వారెల్ల నిట్టిదారుణంబు దుర్యోధనకారితంబ కా నెఱింగి శోకించి..." భార. ఆది. ౬, ఆ. ౧౬౮; 4. నాశము, హాని. "క...వీరల, కారణమున నెగులుపుట్టు కౌరవ్యు లకున్." విణ. (అ. ఆ. అ.) 1. పరుషము. (మాట మొ.); 2. క్రూరము, కనికరములేనిది; 3. భయంకరము, భీషణము; 4. వాఁడియైనది, తీక్ష్ణము. (ఖడ్గాది.); 5. దుస్సహము. "వ. దాని ధృతరాష్ట్రుండు దాన యనుభవించుం గాని మీ రీదారుణంబుఁ జూడక వీరి విడిచి తపోవనంబున కరుగుం డని చెప్పిన..." భార. ఆది. ౫, ఆ. ౧౬౦, ౧౬౧.

దారుధాణు. దే. వి. మల్లవిద్యావిశేషము. ప్రబంధ. ౭౮.

దారున. దే. క్రి. విణ. ద్రు. 1. శీఘ్రముగా. "వ... అంత నిక్కడ నాశ్రమపదంబున శకుంతలయుం దారున వచ్చినవిప్రునివలన రాజు తనజన్మప్రకారం బడిగినవిధంబును..." పి. శకుం. ౨, ఆ. ౧౮౫, చంద్రి. ౨, ఆ. ౧౩౬; 2. తటాలున, ఆకస్మికముగా. "చ. చని చని యొక్కచో నతఁడు చాలఁగ నక్కజ మందుచుం గనుంగొనఁ దమమేఘరంజిఁ బొదిగొన్నఘనావళిలోన నుండి దారున నెదురైరి వైభవనిరూఢిఁ జెలంగెడికొంద ఱంగనల్..." కళా. ౩, ఆ. ౭౩, శశాం. ౩, ఆ. ౭.

దారుపుత్త్రి. సం. వి. ఈ. స్త్రీ. కఱ్ఱబొమ్మ.

దారువు. సం. వి. ఉ. పుం. శిల్పి. పుం. న. కఱ్ఱ, కొయ్య. న. దేవదారువృ.

దారుహరిద్ర. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపువృ.

దారుహస్తకము. సం. వి. అ. పుం. కొయ్యతెడ్డు.

దార్ఢ్యము. సం. వి. అ. న. దృఢత్వము.

దార్దురము. సం. వి. అ. న. 1. నీరు; 2. లక్క; 3. దక్షిణావర్తశంఖము. విణ. (అ. ఈ. అ.) దర్దుర సంబంధమైనది.

దార్వండము. సం. వి. అ. పుం. నెమలి.

దార్వటము. సం. వి. అ. న రహస్యగృహము.

దార్వాఘాటము. సం. వి. అ. పుం. వడ్రంగిపిట్ట.

దార్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. మ్రానిపసుపువృ.; 2. బెండవృ; 3. దేవదారువృ; 4. పసుపువృ.

దార్వికి. సం. వి. ఆ. స్త్రీ. 1. బెండవృ; 2. మ్రానిపసుపువృ; 3. మ్రానిపసుపున వండిన అంజనవిశేషము.

దార్ష్టాంతము. సం. విణ. (అ. ఈ. అ.) ఉపమేయము. దృష్టాంతముతో వివరింపఁబడినది.

దాలము. సం. వి. అ. పుం. కోద్రవధాన్యము. న. చెట్టు తొట్టిలో నుండు తేనె.

దాలి. ఉభ. దే. వి. పాలు కాఁచుట లోనగువానికై అగ్ని ముట్టించినపిడుకలప్రోవు; అగ్నికుండము. "సీ. పిటకయంత్రాభిధ వెలయు దాలి. గీ. యనఁగఁ దంపి యనంగ...' అం. భా. ద్వి. ౫౪౦, వేం. కంచ. ౪, ఆ. ౪౫౫. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. పొట్టుతోఁ గూడినధాన్యము, శమీధాన్యము. (పెసలు,మినుములు. మొ.); 2. దేవదాలీలత౹.

దాలిగుంట. ద్వ. వి. (దాలి+గుంట.) దాలివేయుట కుపయోగించుగుంట. "గీ...రుబ్బు,ఱోలు పిడు కలకుచ్చెల దాలిగుంత, తనర నిరతంబు వెలయు నాత్రనిగృహంబు." శుక. ౨, ఆ. ౪౦౮.

దాలితోఁక. దే. వి. (దాలి+తోఁక.) తోఁక ఆకార ముగా నుండుదాలి. "చ. పెనిమిటి చేనిపాటుపడి పేర్చుశ్రమంబున నింటి కేఁగుదెంచినతఱి దాలి తోఁకపయిఁ జేర్చినకాఁగులనీరు మజ్జనంబున కమ రించి..."శుక. ౨, ఆ. ౩౩౫.

దాలిమము. సం. = దాడిమము.

దాల్చిని హిం. వి. సుగంధద్రవ్యవిశేషము. (శ. ర.)

దావ. దే. వి. తగవు. (శ. ర.) "ద్వి...నీ సకల రాజ్యంబు, గోడుగుడువఁ బుచ్చుకొని యొకజిత్తి, త్రాడుగా మరువనిదావలఁ బెనఁచి." ద్వి. హరిశ్చ. పూ. ౮౮, పు. ౧౮౭౬, పం.

దావంతము. దే. వి. దుఃఖము. "ద్వి. దైవమా యీ దూఱు తప్పింపు మనుచు, దావంతమున మదిఁ దల పోయుచుండె." ద్వి. శ. సా. ౧, భా. ౩౪, పు.

దావము. సం. వి. అ. పుం. 1. అడవి; 2. కార్చిచ్చు; 3. బాధ.

దావరము. దే. వి. చౌర్యము. "సీ. దావర మనఁగను దావా యనంగను మ్రుచ్చిమి యనఁగను మ్రుచ్చిలి యన, గీ...చౌర్యంబు చెల్లు." అం. భా. ద్వి. ౫౯౭.

దావరి. దే. విశే. వీరుఁడు. "క. దేవరఁ గొలిచెద ననపుడు, నీవిధమున జీత మడుగఁ డెవ్వఁడును గడున్, దావరి కాఁబోలును వీఁ,డేవీరుఁడు మలయు ననుచు హృదయం బలరన్." షోడ. ౫, ఆ. (శ. ర.)

దావరీఁడు. దే. విశే. (దావరి+ఈఁడు - స్వార్థ మున్.) వీరుఁడు. "ఇంద్రవజ్రము. కుఱంగటం గ్రచ్చొడు కుచ్చితంపున్, మెఱుంగుకోకల్ గొని మీఱుచాకిన్, వెఱంగు వీ డొందఁగ వ్రేటు లోనన్, దరిం బడం గొట్టిన దావరీఁడా." అచ్చ. భా. ౪, ఆ. ౭౪.

దావళి. దే. వి. మడికై ధరించు కంబళవస్త్రము. "సీ. దావళి మడి పట్టుదోవతి దేవపూజాపేటి గల మూట..."ఇందు. ౨, ఆ. ౧౧౫.

దావా. దే. వి. 1. చౌర్యము. అం. భా. ద్వి. ౫౯౨; 2. (హిం. దావా.) తగవు, వ్యాజ్యెము. (శ ర. బ్రౌ. వా.)

దావాదారుఁడు. దే. విశే. (దావా+దారుఁడు.) దావాచేసినవాఁడు. (బ్రౌ.)

దావికము. సం. విశే. (అ. ఈ. అ.) దేవికానది యందుఁ బుట్టినది.

దాశపురము. సం. వి. అ. న. కయివడిము స్తె౹.

దాశరాత్రికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. దశ రాత్రసంబంధమైనది; 2. పదిరాత్రులు జరుగునది. (యజ్ఞాదికము.) [యాదవుఁడు.

దాశార్హుఁడు. సం. వి. అ. పుం. 1. కృష్ణుఁడు; 2.

దాశుఁడు. సం. వి. అ. పుం. 1. బెస్తవాఁడు, ధీవ రుఁడు; 2. భృత్యుఁడు.

దాసకాఁడు. ద్వ. వి. (దాసము+కాఁడు.) సేవకుఁడు, దాసుఁడు. "సీ. భాండీరులను గన్నఁ బ్రాణంబు లొసఁగుచు దాసకాండ్రను గన్న నాసపడుచు." మల్హ. ౩, ఆ. ౧౦.

దాసనచెక్క. దే. వి. (దాసనము+చెక్క.) జపా వృక్షత్వగ్భాగము. (ఇది ఔషధములం దుపయో గింతురు. బ్రౌ. వా.)

దాసనము. దే. వి. 1. జపావృక్షము. "గీ. స్ఫటికశిల యందుఁ గలయంగఁ బ్రతిఫలించు, దాసనపుఁ బూవు కెంజాయతళుకు వోలె." ఉద్భ. ౩, ఆ. ౭౦. భీమ. ౨, ఆ. ౫౯; 2. జపాపుష్పము "క. ఎఱసంజదాసనంబుల, తెఱఁ గయ్యెను..." ఉ. హరి. ౨, ఆ. ౨౪.

దాసమయ్య. వై. వి. (దాసము+అయ్య.) దాసుఁడు, సేవకుఁడు. "సీ. షణ్ణవతిశ్రాద్ధచయ మారఁబెట్టు శంకరదాసమయ్య భక్తప్రతతికి." ఆము. ౪, ఆ. ౪౩.

దాసము. వై. వి. (సం. దాస్యమ్.) సేవ. (చూ. దాసమయ్య.)

దాసరయ్య. వై. వి. (దాసరి+అయ్య.) 1. తాఁబేలు. "క. వలఁ జిక్కుక చనె మృగ మిమ్మలఁ జిక్కెను దాసరయ్య వలవనిజాలిన్, దలఁకంగ నేల నేఁ డీకొలఁదికిఁ గూరయ్యె ననుచుఁ గొని పోవుతఱిన్." నా. పంచ. ౨, ఆ. ౨౧౭; 2. విష్ణుభక్తుఁడు. "ఆ. అని తదీయదాస్య మంగీక రించె నన్దాసరయ్య యచట నాసరోజలోచన యును మ్రానిలోఁ జేవ చొచ్చినగతిఁ బ్రవేశ మంది ప్రతిదినంబు." వైజ. ౨, ఆ. ౧౧౭; 3. ముని. "క...అయ్యనియో రెపుఁదిండిదాసరయ్య దెలిపినన్." అచ్చ. అయో. ౧౭౬.

దాసరి. వై. వి. (సం. దాసేరః క. దాసరి.) 1. విష్ణుభక్తుఁ డగుశూద్రుఁడు, విష్ణుభక్తుఁడు "గీ. వాద మే మాయె నన్న భూవరునిపతి, పాత మా దాసరికిఁ గల్గి బ్రతికె ననెను, వారు..." ఆము. ౪, ఆ. ౭, ఆం. భా. ద్వి. ౨౮౫; 2. భిక్షుకుఁడు. (చూ. దాసరిబుట్ట.)

దాసరికొయ్య. ద్వ. వి. (దాసరి+కొయ్య.) మత్స్యవిశేషము. "సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీనులస ముచ్చంగి బేడిస జెల్ల చాఱ మీను." హంస. ౪, ఆ. ౧౮౭.

దాసరిగాఁడు. ద్వ. వి. (దాసరి+కాఁడు-స్వార్థమున.) తాఁబేలు. (శ. ర.)

దాసరిపాము. ద్వ. వి. (దాసరి+పాము.) సర్పవిశేషము. (శ. ర.)

దాసరిపిట్ట. వై. వి. (దాసరి+పిట్ట.) నామాలపిట్ట. (బ్రౌ.)

దాసరిబుట్ట. వై. వి. (దాసరి+బుట్ట.) భిక్ష మెత్తుకొను బుట్ట. "ఉ. వేసరి యేమటన్న నిలువెల్లవడఁ జాలఁడు చేతనంటి మూ, దాసరిబుట్టయుం స్మదుక దావళిదట్టియుఁ గానికానమో, కేసరిమధ్య నీ ప్రతిన గెల్చె .." వైజ. 3, ఆ. ౯౪.

దాసానము. దే. వి వృక్షవిశేషము. "సీ. తాండ్ర చందన మేపె దాసాన మెట్టదాసానము చిందుగ చాఱజొన్న." హంస. ౪, ఆ. ౧౧.

దాసాని. దే. వి. దేశవిశేషము. "ఉ. హురుమంజి పల్ల మింపైనఖలీనమున్ బిరుదుటందియగజ్జెల పేరుఁ బూని దాసానిపటానిఁ దెచ్చెఁ మహీజానికి రాతెఱఁగంటిహేనికిన్." రా.వి. ౨.ఆ. ౪౬.

దాసి. సం. వి. ఈ. స్త్రీ. 1. పరిచారిక, పనికత్తె; 2. కాకికొండ♣; 3. నల్లగోరంట♣; 4. పచ్చగోరంట♣.

దాసికత్తె. మి. వి. (దాసి+కత్తె - స్వార్థమున.) పరిచారిక, దాసిజాతిస్త్రీ. "సీ. దేబెలఁ గనుఁగొన్న వాబల్మిఁ జూపుచు దాసికత్తెల గన్నఁ దార సిలుచు." మల్హ. 3, ఆ. ౧౦.

దాసు. సం. వి. అ. పుం. (ఇది వృద్ధామలలోనిది.) భక్తుఁడు. "ఉ...విష్ణుదా సెక్కుడిభర్త గాఁగ సృజియించె నజుండు..." హంస. ౧, ఆ ౮౯.

దాసుఁడు. సం. వి. అ. పుం. 1. భృత్యుఁడు, వెలకుఁ గొన్నపనివాఁడు; 2. భక్తుఁడు; 3. శూద్రుఁడు; 4. జ్ఞాని; 5. దానపాత్రుఁడు; 6. జాలరి; 7. వృత్రాసురుఁడు; 8. దస్యుఁడు.

దాసేయుఁడు. సం. వి. అ. పుం. 1. దాసుఁడు; 2. జాలరివాఁడు. విణ. (అ. ఈ. అ.) దాసికిఁ బుట్టినవాఁడు.

దాసేరుఁడు. సం. = దాసేయుఁడు.

దాస్టికము. దే. వి. (క. ధాష్టిక.) అధికారమందలి దిట్టతనము. "ఉ. వారు దివాణ మ్మూట బలవంతుల రింతటి కెన్నఁగా జమీంవారులు మీర లట్లగుట దాస్టిక మెల్లను వారిసొమ్ము......" రంగా. ౨, ఆ. ౨౩౧.

దాస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఈయఁబడఁబోవునది; 2. భవిష్యత్కాలమున నీయఁబడునది.

దాస్యము. సం. వి. అ. న. సేవ, దాసత్వము.

దాస్రము. సం. వి. అ. న. అశ్వినీనక్షత్రము.

దాహకము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. చిత్రమూలము♣. విణ. (అ. హికా. అ.) 1. దహించునది, కాల్చునది; 2. తాపము కల్గించునది.

దాహనము. సం. వి. అ. న. కాల్పించుట.

దాహమిచ్చు. ద్వ. స. క్రి. (దాహము+ఇచ్చు.) దాహశాంతికొఱకై యుదకాదుల నిచ్చు. "వ...తక్కువపడ నొకపూట కిన్ని దాహం బిచ్చువారునుం గలరే యని యనేకప్రకారంబుల బోధించి..." సానంపో. ౫, ఆ. ౧౩.

దాహము. సం. వి. అ. పుం. 1. కాల్చుట; 2. దేహమునఁ గలుగు సంతాపము; 3. కాఁక, వెట్ట; 4. దప్పిక. (ఈయర్థము సంస్కృతనిఘంటువులలోఁ గనఁబడదు.) "చ...దప్పిగొన్న హర్మ్యనటమనోహరాంబువులు గ్రోలక మంచున దాహమాఱునే." శైవ. ౯, ఆ. ౨౩౪. దశా. ౨,ఆ.౧౩౬.

దాహారి. వై. వి. (సం. దాహారిః.) విష్ణుభక్తుఁ డగు శూద్రుఁడు, విష్ణుభక్తుఁడు. "వ...కవహకవహ నవ్వి యద్దాహారికి సురద్రోహి యిట్లనియె." ఆము. ౬, ఆ. 3౧. (శ. ర. పా.) ఆం. భా. ద్వి. ౭౭౫.

దాహస్థలము. సం. వి. అ. న. శ్మశానము, వల్లకాఁడు.

దాహి. సం. విశే. (స్. సీ. న్.) 1. కాల్చునది; 2. తాపము కల్గించునది; 3. తాపము కలది.

దాహ్యము. సం. విశే. (అ. ఆ. అ.) కాల్పఁదగినది.

దాళా. దే. వి. 1. తక్కెడలోని హెచ్చుతగ్గు.(శ.ర.) 2. (నెయ్యి నూనె మొదలగునవి తీయుపాత్రలనుగాని అవి యుంచి యున్న పాత్రలనుగాని) సరియెత్తుతూలను దడతట్టనుంచి తూఁచుట. (శ.ర.)

దాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. సెనగలు లోనగువాని పప్పు; 2. దేవదాళీలత.

దాళిమి. సం. వి. ఈ. స్త్రీ. 1. దానిమ్మచె; 2. ఏలకిచె.

దాళిమ్మ. వై. వి. (సం. దాడిమః.) దాడిమచె. (శ. ర.)

దాళీకుఁడు. దే. విశే. కార్యకర్త, పనిచేయు వాఁడు. (శ. ర.)

దాళు. దే. వి. వర్ణలేశము. "ద్వి. రస మెక్కి యీనెలు రయమున బలిసెఁ, బసుపు దాళెక్కి యేర్పడఁ బల్చ లగుచు." భాగ. ౧౦, స్కం. (శ.ర.)

దాళువా. దే. వి. సస్యవిశేషము, శరదృతువు మొదలుకొని నీటిచెయాధారమునఁ బండుపల్లపుపంట. (శ.ర.) ౨. ధాన్యవిశేషము. "సీ. రామబాణాలు రెక్కాములు వెన్నముద్దలు జిల్మబుడుతలు దాళువాలు." హంస. ౪, ఆ. ౧౭౮. ప్రబంధ. ౧౧౯.

దాళువాళించే. దే. అ. క్రి. ఒప్పు, ప్రకాశించు. "వ...దాళువాళించు సన్నసున్నంబుచేత లేతవెన్నెలలు నెమ్మించు క్రొమ్మించులుం గల మేడలును..." వి. శకుం. ౧, ఆ. ౮౬.

దాళ్వా = దాళువా. (శాల్యంతరము.) "సీ. ఒకపరి మొసలివాయొంట్లు దాళ్వావెక్కు నిద్దంపుఁ జెక్కులసీదఁ జూపె." దశా. ౮, ఆ. ౧3.

ది

ది. దే. స. సంబంధముఁ దెలుపునవి డనుప్రయుక్తమగు 'అది' శబ్దముయొక్క ఆద్యక్షరము లోపింపఁగా మిగిలినరూపము. ఉదా:—నాది, నీది, వానిది మొ. "ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన, దేవరాజ్యమహిమఁ దివిరి నీవు." భార. ఆ. ४, ఆ. 3౬, హరి. ఉ. ౫, ఆ. ౧౬౯.

దించు. దే. స. క్రి. (దిగు. ధా. ప్రే.) 1. తగ్గించు, దిగఁజేయు. "గీ. తెగువ నాగ్రహబుద్ధియుం దింపవైతి." భా. రా. యు. ౨౨౦౭; 2. అవరోహింపఁజేయు, క్రిందికి చేర్చు. "గీ. ఈ చెలువ నన్నుఁ జేరిన నింక నెపుడు, బొమ్ము దించక యుందు ముదమ్ము మీఱ." దశా. ౨, ఆ. ౨౭४. ఉ. రా. ౧, ఆ. ౭౮; 3. చెడఁగొట్టు, భ్రష్టము చేయు. "చ. సడికొడిగట్ట లేనికనుచాటు మెలంకువ తీఁగఁబోండ్లకున్, గడుపులు దించ నింతులకుఁ గాంతవశీకరణార్థమంత్రముల్, నొడువఁగ..." శుక. ౨, ఆ. ౭४. చిత్రభా. ౮, ఆ.

దించుకొను. దే. స. క్రి. (దించు+కొను.) చెడఁగొట్టుకొను, భ్రష్టముచేసికొను "ఉ. సిగ్గొకయింత లేక వెలచేడియ కై వడి ధర్మకీర్తులన్, బొగ్గులు సేసి జారు శశిఁ బొంది కటా కడు పేల సేసి కొం, టెగ్గు దలంపఁగా వలదె యిప్పుడు గర్భము దించుకొమ్ము..." భాగ. ౯, స్కం. 3౭౮.

దింటెన. దే. వి. గిరికర్ణిచె. "సీ. తెల్ల దింటెన పువ్వుఁ దెచ్చి తద్రస మిడి కలివె పువ్వులు గోసి నలిచి పిడిచి." కాళ. 3, ఆ ౧౯౦. ఆం. భా. ద్వి. ౫౬.

దిండడ. దే. వి. (దిండు. ధా.) నాఁగలి కడ్డుగా వేసెడికట్టె, తిర్యగారోపితదారువు. "సీ. దిండడ నాఁగను దిర్యగారోపితదారువు .." ఆం. భా. ద్వి. ౨, ఆ. 33.

దిండీఁడు. దే. విశే. (దిండు+ఈఁడు.) కాసె గట్టినవాఁడు. (శ. ర.)

దిండు. దే వి. 1. తలగడ. "ఉ... పెద్దదిండుపై సోలుచు నల్లడ బ్బైగడి చూచుచుఁ గ్రమ్మఱఁ గన్నుమూయుచున్..." చెన్న. ౫, ఆ. ౧3; ప్రబంధ. ౬౦౫; 2. దట్టి, కాసె. "చ. నునుపసుపచ్చపట్టునఁ గనుంగొన నొప్పఁగ దిండుగట్టి నూతన మగుబర్హిబర్హకృతదామము నెట్టెము సుట్టి..." హరి.పూ. ౬, ఆ. ౧౭౯; స్వా. ఆ.४.33. 3. కచ్ఛభేదము, కుచ్చెల. "సీ. కటిమీఁద జాఱిన కనక సూత్రంబుతోఁ బీతాంబరము దిండు బిగియఁ దిగిచి." హరి. పూ. ౫, ఆ. ౯; 4. మెఱుఁగుబిళ్ల లోనగునవి యంటించెడు రాళ్లపనివాని సానతిరుగుడుకొయ్య. (శ. ర.); 5. చుట్ట. "సీ. నడుసెత్తి మట్టిపా లిడి తాలిక లోనర్చి కడలు కొల్చిన గొప్పజడలదిండు." శుక. ౨, ఆ. 3౭; 6. అతి

శయము, ఆధిక్యము. "ద్వి. రాచ ముత్తము లెక్కు రాణువయుక్కు, గోచయంబులపిండు కోమట్ల మొదు." ద్వి. తి. సా. ౧, ఆ. ౩, పు; 7. దీపము. "ఉ...ఆదారిని దానుఁ బేరసము దాల్తు నటంచుఁ దలంచి లంక నెంతే రఘునాథుదూత సరణిన్ నెల కన్పడె దిండుకై వడిన్." చం. రా. ౭, ఆ. ౨౭, (చూ. సం. చం. రా. సుంద. ౧౮, శ్లో.); 8. నూలువడుకురాట్నపుకదురునకు నూలుఁలోనగు వానితో నేర్పఱచుపిడి. "క. వడిదారముచెవులుం ద్రొక్కుడుపలకయు దిండుకదురు..." శుక. ౨, ఆ. ౪౧౯.

దిండుపడు. ద్వ. అ. క్రి. (దిండు+పడు.) సొమ్మసిల్లు, మూర్ఛపోవు. (బ్రా.)

దిండిమ్ము. దే. వి. భేరీమృదంగాదివాద్యధ్వనివిశేషము. "వ...నిస్సాణంబులధణంధణలు ఢమామీలదిండిమ్ములు విజయశంఖంబుల ఘుమంఘుమలు..." ప్రబంధ. ౭౮౮.

దింపు. దే. స. క్రి. (దిగు. ధా. ప్రే.) 1. అణఁచు, పోఁగొట్టు. "వ...మొల్లలతావులఁ గొల్లలాడు భ్రమరదంపతులయింపుసొంపులు దింపుసంపెఁగల సంపదలకు..." ఉ. రా. ౬, ఆ. ౨౪; 2. వీడు, విడుచు. "సీ. వితతభైరవకరావాలిఁ దలంకని నాటిపద్మగర్భప్రతిభాభరంబు. గీ. సత్యభామాధిపతిచేతఁ జలన మొంది, బలిమి దింపనినాఁటి కల్పద్రుమంబు, వితరణంబును దనయంద వెలయ వెలయు, సూరయన్నప్రధానకంఠీరవుండు." ఉద్భ. ౧, ఆ. ౩౮; 3. క్రిందఁబెట్టు. వ్యవ:– నానెత్తిమీఁదిగంప దింపుము. వి. 1. వ్రేలుట, లంబనము. (శ. ర.); 2. కొబ్బరి మున్నగుచెట్లనుండి కాయలు కోసి క్రిందవైచుట. వ్యవ:— కొబ్బరితోఁటలో చాలదింపులు దింపినారు.

దింపులకుఁదెచ్చు. దే. స. క్రి. (దింపులకున్+తెచ్చు.) తిరస్కరించు. "వ...ధనుర్లతలవంపు దింపులకుఁ దెచ్చుకొమరు గలకనుబొమలును..." చం రా. ౩, ఆ. ౯౮.

దింపులువోవు. దే. అ. క్రి. (దింపులు+పోవు.) వ్రేలాడు. "సీ. అందంద వక్షోరుహములు దింపుట వోవఁ దొడుకనిచ్చుట యొట్లు దుగ్ధరసము." కాశీ ౪, ఆ. ౧౮.

దిక్కము. సం. వి. అ. పుం. ఏనుఁగుగున్న, కరభము.

దిక్కుమొకము. వై. విణ. భయాదులచే దిక్కుతోఁచక పాఱిపోవువాఁడు. "ఉ... మేవిగాడ్పుచే, నక్కట నుగ్గులయ్యె జలదాళివిమానచులిక వీనిచే, నెక్కడిపద్మజాండ మని యేఁగిరి దిక్కుమొకంబులై సురల్." సమీర. ౨, ఆ. ౧౩౪.

దిక్కుమొగము=దిక్కుమొకము. "ఆ. ఒక్కమొగము గాక యుఱికిరి సైనికుల్, దిక్కుమొగము గాఁగఁ జిక్కుభటులు, మ్రొక్కి రీఁటెములు దటుక్కునఁ బడవైచి, యక్కిరీటియెదుట నాఁగఁ గలరె." విజ. ౩, ఆ. ౧౫౭, (శ. ర. పా.) రామా. ౭, ఆ. ౧౪౮.

దిక్కరి. సం. వి. న్. పుం. దిగ్గజము.

దిక్కామొకము = దిక్కుమొకము. "సీ. పోయిన పోకలై పోయిరి సిద్ధులు దిక్కామొకములైరి దిగధిపతులు." పారి. ౫, ఆ. ౩౭.

దిక్కామొగము = దిక్కుమొగము. "గీ. గబ్బిమొకములు దిక్కామొగంబు లయ్యె." గ్రా. వి. ౩, ఆ. ౩౬; ఆం. భా. తృ. ౯.

దిక్కు. సం. వి. శ్. స్త్రీ. 1. దెస, దిశ; 2. మార్గము, పద్ధతి; 3. దంతక్షతము; 4. రక్షకుఁడు, శరణము, ఆధారము. "సీ. జగదుద్భవస్థితిక్షయహేతు వెవ్వఁ డా,దేవాదిదేవుండు దిక్కు నాకు." పాండు. ౫, ఆ. ౧౩౯-౧౪౦; భా. రా. అయో. ౧౬౪; 5. ఎడ, విషయము. "క. ఎక్కువ తక్కువమాటలు, నుక్కివములు నెందుఁ గీడులొందించుటలుం, బెక్కు దనయన్నదమ్ముల, దిక్కుల నన్నియును సైఁపఁ దేజము సేయున్." భార. శాం. ౨, ఆ. ౩౫౯. హరి. ఉ. ౩, ఆ. ౨౨౩; 6. వైపు, పక్షము. "ఆ. ఇట్లు దఱిమె నేని యిప్పుడ యాతఁడే, దిక్కువారి నెల్ల నొక్కయొత్తు, గాఁగఁ బిలుకుమార్చి..." భార. ద్రో. ౫, ఆ. ౧౯౬. హరి. పూ. ౩, ఆ. ౧౨౪; 7. స్థానము, నెలవు. "క. రక్కసులగురువు గురునకు, వెక్కసమగుమతికి నిరవు వెరవుల కెల్లన్, దిక్కు నుడికెక్కు లేగురుఁ, జుక్క దివిన్ ఇటులు గడునుచుక్కనఁ బొడిచెన్." విప్ర. ౩, ఆ. ౪౬, భాగ. ౬, స్కం. ౩౩౯.

దిక్కుబిళ్లలు. మి. వి. బ. బాలక్రీడావిశేషము. (బ్రా.)

దిక్కుమాలు. మి. అ. క్రి. (దిక్కు+మాలు.) రక్షాహీనమగు; దుస్థితినందు. క"...కోశంబులు

నటువంగ నిడుదనిదుర,నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడుగదే." భార. అశ్వ. ౨, ఆ. ౧౬౨. భాగ. ౮, స్కం. ౭౧.

దిక్పతి. సం. వి. ఇ. పుం. = దిక్పాలుఁడు.

దిక్పాలుఁడు. సం. వి. అ. పుం. 1. దిక్కులయేలికలలో నొకఁడు. (ఇంద్రుఁడు. మొ. ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, నైరృతుఁడు, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు. వీరు క్రమముగా ప్రాగాదిదిశల కధిపతులు); 2. దిక్కుల యేలికలలో నొకఁడు (సూర్యుఁడు మొ. సూర్యుఁడు, శుక్రుఁడు కుజుఁడు, రాహువు, శని, చంద్రుఁడు, బుధుఁడు, గురుఁడు. వీరు క్రమముగా ప్రాగాదిదిశల కధిపతులు)

దిగ. దే. వి. జూదమాడుట కుపయోగించు పాచికల మీఁది ముద్రావిశేషము. "సీ. మేటిజూదరి యన వాటమై తెవుటమై నాడుచుండుదు నే నహర్నిశంబు, దృష్టి యేమఱక సందియం జాగరంబును దిగయును గరయు నాఁ దేటపడిన, యచ్చులలోన నేయచ్చైనఁ గైకొని మాటలాడినయట్లు వేటు గలుగ." ద్వా. ౧౦, ఆ. ౮౮.

దిగంబరుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. క్షపణకుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. దిక్కులే వస్త్రముగాఁ గలవాఁడు, దిస్సమొలవాఁడు; 2. దరిద్రుఁడు.

దిగఁగాఱు. దే. అ. క్రి. (దిగన్+కాఱు.) కృశించు, దిగజాఱు. "క. మగువలు గరగరనై తగు, మగవానిం జూచి వీఁడు మగఁడైనఁగదా, తెగు దుఃఖం బనుకొంచుం, దిగఁగాఱుదు రెపుడు సొమ్మది స్వగ మిగులన్." శుక. 3, ఆ ౫౧౬.

దిగఁదన్ను. దే. స. క్రి. (దిగన్+తన్ను.) దిగవిడుచు. "చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నిన చీరలు గొఁగిలింతలం, బగఁగొని యడ్డగింపఁగఁ జెమల్చినహారములున్..." వేం. పంచ. ౪, ఆ. ౩౦౯. ఇట్లే దిగఁదాఁచు. నైష. ౩,ఆ. ౯౫౫.

దిగఁదీయు. దే. స. క్రి. (దిగన్+తీయు.) 1. దిగఁదుడుచు. (శ. ర. బ్రా); 2. నిరుత్సాహపఱచు. వ్యవ:—ఆతఁ డావని చేయకుండ వానిని దిగఁదీసినాఁడు.

దిగఁదుడుపు. దే. వి. (దిగదుడ్చు ధా.) దృష్టిదోషాదిపరిహారార్థము ఉప్పు మిరపకాయలు మున్నగువానిని-చుట్టుత్రిప్పుట. వ్యవ:—ఎన్ని దిగఁదుడుపులు పెట్టినను లాభించలేదు.

దిగఁదుడ్చు. దే. స. క్రి. (దిగన్+తుడ్చు.) - దృష్టిదోషాదిపరిహారార్థము ఉప్పు లోనగువానిని చుట్టుత్రిప్పు. "ద్వి. క్రమ్మన భసితంబుఁ గలయంగఁ జల్లి,ముమ్మారు దిగఁదుడ్చి ముట్టె నంతటను." బస. ౬, ఆ. ౧౭౭. పం.

దిగఁద్రావు. దే. స. క్రి. (దిగన్+త్రావు.) 1. విడుచు, పరిత్యజించు. "సీ. చదువులు విడిచి యాచారంబు దిగఁద్రావి..." దశ. 3, ఆ. ౯, భార. అను. ౫, ఆ. ౩౩౮; 2. డిగ్గు. "క. కన్నంతన తనయేనిక, దున్న దిగంద్రావి రథసదోలాయితహా, రోన్నత వక్షస్థలుఁడై, యన్నలినాత్ముసకు వంచె నాత్మ శిరంబున్." హరి. పూ. ౭, ఆ. ౧౯౪.

దిగఁద్రోచు. దే. స. క్రి. (దిగన్+త్రోచు.) విడుచు. "గీ. కలఁక యెంతయు దిగఁద్రోచి చెలువ మెసఁగఁ, జేర వచ్చినప్రియభామ గారవించి." పారి. ౨, ఆ. ౧౫.

దిగఁబట్టు. ద్వ. స. క్రి. (దిగన్+పట్టు.) క్రిందికి లాగు. (బ్రా.)

దిగఁబడు. ద్వ. అ. క్రి. (దిగన్+పడు) 1. (బురద మున్నగువానిలో) కూరుకొను "గీ. పంకము గొరిజ దిగఁబడఁ బఱవలేవు,మన్ను లివ్వేళ రేగటిమన్ను లందు." స్వా. ౪, ఆ. ౨౦, ఆము. ౪, ఆ. ౩౫; 2. అడఁగు, క్రుంగు. "క... పాతాళమునకు దిగఁబడ నయ్యాచలముఁ జరణాంగుష్ఠమున నలఘుగతి నదిమెన్." భా. రా. అర. ౧, ఆ. ౮౪, ఉ.రా. ౨, ఆ. ౧౭౩; 3. మునుఁగు. "వ...శంబరుండనురాక్షసుండు దనమాయాబలంబునం గామరూపియై వచ్చి కొనిపోయి సముద్రంబులో వైచి తనగృహంబునకుఁ జనియె నంత నాశాబకుండు జలధిజలంబున దిగంబడ నొడిసి యొకమహామీనంబు మ్రింగె." భాగ. ౧౦, స్కం. ఉ; 4. జాఱు. "ఆ. గొంతికడుపునందుఁ గొడుకుఁ జూలై నీవు, దోఁపకుండ వైతి తోఁచినట్టి,పిండ మెడలి యైనఁ బిదప దిగంబడ,దయ్యె నింత పుట్ట దట్టులైన." భార. కర్ణ. 3, ఆ. ౬౬; 5. పోవు, తొలఁగు. "చ...ఇప్పు డద్దాస భయంబు దిగంబడ నీవు పోయి పార్థునిఁ గని సింహనాదమున రోదసి నింపుము మాకు నింపుగన్." భార. ద్రో. ౪, ఆ.

౧౩౫. పాండు. ౪, ఆ. ౧౭౭; 6. మాను, నిలుచు. "ఉ. కారణ మైనకర్మములు కాక దిగం బడ వెన్నిగొంకులం,దూరిన వెంతవారలకు..." భా. శ. ౩౩; 7. మిగులు,తప్పిపోవు. "క. వెలఁది కటిచేర నిల నొక,పులినము దిగఁబడియె సింధుపులినపుఁబంక్తిన్, నలువ యది పడఁగఁ గాదే, తెలియుట కం దంచపదము తిరముగ నిలిపెన్." ఆము. ౫, ఆ. ౯౯. [(బ్రా.)

దిగఁబాటు. ద్వి. వి. (దిగఁబడు ధా.) శేషము, మిగులు.

దిగఁబాఱు. దే. అ. క్రి. (దిగన్+పాఱు.) 1. క్షీణించు తగ్గు. "గీ. కాంతి దిగఁబాఱఁ బ్రాచీముఖంబు నందుఁ, బద్మినీముఖవికసనప్రౌఢి సడలె .." కవిక. ౪, ఆ. ౬౩; 2. దిగజాఱు, మీఁదినుండి క్రిందికి జాఱు. "సీ. వెల్లఁబెట్టునో పూర్ణవిధు కాంతి మొగమున దిగఁబాఱునో పైడి తెలివి చేన." నిరం. ౪, ఆ. ౯౧, ౯౩.

దిగఁబెట్టు. (దిగన్+పెట్టు.) 1. విడుచు. వ్యవః- బాలుని బడిలో దిగఁబెట్టి వచ్చినాను; 2.మిగుల్చు. వ్యవః-వాఁ డొకపం డైన దిగఁబెట్టకుండ తిని వేసినాఁడు.

దిగఁబోఁత. దే. వి. (దిగఁబోయు ధా.)మట్టుట; క్రిందికి దిగుట. (వ్యవః ) వానికి పొంగు దిగబోఁతలోనికి వచ్చినది.

దిగజాఱు. దే. అ. క్రి. (దిగన్+జాఱు.) 1. క్రిందికిఁ బడు,చ్యుతమగు. "క. నగుచాయల ముకుముత్యము, జిగితోఁ బలుగంట్లు నిండి చెన్నెసలారెం,దగు మోము చంమవలనం,దిగజాఱుచు నుండు మేలు దివ్యాన్న మనన్." కాళిందీ. ౬, ఆ. ౧౫౦. నిరం. ౨, ఆ. ౬౯; 2. జాఱిపోవు. "గీ. పువ్వుదామంబు దిగజాఱి భూమిఁ బడియె." దశా. ౨, ఆ. ౨౦, నిరం. ౨, ఆ. ౬౯; 3. కాఱు,స్రవించు. "వ...అశ్రుధారా ప్రవాహంబులు...జాళువా మెఱుంగుఁబయ్యెదమీఁదికి దిగజాఱి..." ఉ. రా. ౬, ఆ. ౨౭౬. వరాహ. ౧౧, ఆ. ౪౮; 4. పోవు; తగ్గిపోవు. "రగడ. ఇగురుఁబోం ణ్లెన్నరై రీవులును గీవులును, దిగజాఱ విడిచి రటు శీవులును వావులును." రాఘవ. ౨, ఆ. ౬, వ్యవః-వానికి పొంగు దిగజాఱినది; 5. క్రుంగు,దిగఁబడు. "సీ. ఎలుకలు ద్రవ్వినయింటిచందంబున దిగజాఱి నీ మేను మిగుల డస్సె." వాసిష్ఠ. ౧, ఆ. ౭౬.

దిగటము. దే. వి. (దిగు ధా.) నిలువు? "క. గడగడ నొడలు వడంకఁగ, దడదడ దడమాచు గుండె తల్లడ మందన్,బడిబడి నడ్డము దిగటముఁ,బడిబడి మ్రొక్కుచును బాహి పాహి యనంగన్." దశా. ౨, ఆ. ౧౧౮.

దిగదాఁటు. దే. అ. క్రి. (దిగన్+దాఁటు.) దిగు, క్రిందికి వచ్చు. "సీ. కాంచి యాఁదంకుఁడు గ్రమ్మన దిగదాఁటి వెనుకొనునంతకుఁ గనపపుట్టఁ, జొచ్చె నయ్యురగము..." భార. అశ్వ. 3, ఆ. ౧౦౫. (చూ. ౧౦౪.)

దిగదిగ. దే. వి. 1. విసరుట మెఱయుట లోనగువానియం దగునమకరణము. "గీ. అబ్జరుచిః దూర్వ దిగదిగ యంచు మెఱసె." (శ. ర.) స్వా. ౪, ఆ. ౬౦; 2. నిక్కించుట మొదలగువానియం దగు ననుకరణము. "ద్వి. మృగములు నిక్కించి మెడ లెత్తి చెవులు,దిగదిగ నిక్కించి దిశ లాలకించి." నవ. ౧, ఆ. ౫౦, పు. క్రి. విశ. (శీఘ్ర)ముగా, వడిగా. "క...లేఁ, జిగురరఁటాకులు పెట్టిరి,దిగ దిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్." భీమ. ౨, ఆ. ౧౨౮, ఆము. ౬, ఆ. ౯౪.

దిగద్రొబ్బు. దే. స. క్రి. క్రిందికి త్రోయు,గెంటు. "వ. అని పలికినకొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసులఱేఁడు తనతొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి .."భాగ. ౭, స్కం. ౧౮౪.

దిగనాడు. దే. స. క్రి. (దిగన్+ఆడు.) 1. విడిచిపెట్టు, త్యజించు. "వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన నతండు ప్రజ్ఞాచక్షుండై సంసారంబు దిగనాడి..."భాగ. ౧, స్కం. ౩౧౬, ౩౫౮. కాశీ. 3, ఆ. ౬౩; 2. తిరస్కరించు. "సీ. చల మూని యలమేనుఁ గులసూడు దిగనాడి మగజాలజిగి నేలఁ దగుచు నెగడి." నీలా. ౧, ఆ. ౪౫.

దిగమోపు. దే. స. క్రి. (దిగన్+మోపు.) దిగదుడుచు. "చ...కోర్కెచే, నురమున నుంచుఁ దుడ్చుఁ గడు నొప్ప మనోభవభూతశాంతికై, యరుదుగ రక్షపూస యఖిలాంగములన్ దిగమోపుచాడ్పునన్." భో. ౫, ఆ. ౧౫౦.

దిగమ్రింగు. దే. స. క్రి. (దిగన్+మ్రింగు.) పూర్తిగా మ్రింగు; హరించు. "ఉ. కడతేఱఁగ నిత్తునె యింక వారలన్,మిక్కిలి శక్తి మీఱ దిగమ్రింగెద

నంచుఁ బరిష్వ్కరింపఁగన్." దశా. ౨, ఆ. ౩౩౨, సా. ౨, ఆ. ౧౭౪.

దిగవిడుచు. దే. స. క్రి. (దిగన్+విడుచు.) విడిచి పెట్టు,త్యజించు. "క. తగఁసుమహైశ్వర్యోదయ, మగుగృహమును బ్రబలనిద్ర నందినభార్యన్, దిగవిడిచి యెక్కఁడేనియు,జగతీశుఁడు సనె నిశీథసమయమునందున్." భాగ. ౪, స్కం. ౪౦౭, హరి. పూ. ౫, ఆ. ౨౨౨.

దిగవైచు. దే. స. క్రి. (దిగన్+వైచు.) 1. విడుచు. "క. చెప్పెడి దే మిఁక నొకచో, జెప్పరమగు నుక్కుజేను దిగవైచిన వే,సెప్పొగొని కదల కుండెడు,కప్పలితీరునను దేరు గదలక నిలిచెన్." శుక. ౨, ఆ. ౧౧; 2. పడవేయు. "గీ. చచ్చినవి మున్న యని తాను జంపు టుడిగి, వటముక్రింద నన్నిటి దిగవైచువాఁడు." కేయూర. ౩, ఆ. ౭౦.

దిగసన. దే. క్రి. విశ. ద్రు. దిగువగా. "గీ. భూసురులఁ బ్రోవ వేమి మహాసురారి,యిప్పు డేటికిఁ ద్రుంప నేం డ్లెగసనైన,బుద్ధి దిగవచ్చెనో పాపమహేమి." సిం. నార. ౧౯౯.

దిగాలపడు = దిగాల్పడు. (బ్రౌ.)

దిగాలు. దే. వి. వ్యాకులత. (చూ. దిగాల్పడు.)

దిగాల్పడు. ద్వ. అ. క్రి. (దిగాలు+పడు.) వ్యాకులపడు. "ఉ. భూసురవర్యునందనుఁడు బుద్ధికిఁ దోఁచినయట్లు పల్కు డి,గ్వాసుఁడు కానరామికి దిగాల్పడి దిక్కులు చూచి..." చెన్న. ౩, ఆ. ౧౪౯.

దిగిపించు. దే. స. క్రి. (దిగు ధా. ప్రే.) దిగఁజేయు, దింపు. "ఉ. అందలిసెట్టు లందఱు దయామతి నక్క దిగిపించి యోడలోనం దమయొద్దఁ బెట్టుకొని..." దశ. ౧౦, ఆ. ౫౯. ('దిగి తెచ్చి' పాఠాంతరము.)

దిగు. దే. అ. క్రి. 1. మీఁదనుండి క్రిందికి వచ్చు, అవరోహించు. "క. బృందారకపథమున దిగి, యిందీవరపత్త్రనేత్ర యిరువంకలవారుం దమక తమక రారా, యిందనఁగా రెండుపీళ్లయొడమున విడిసెన్." హర. ౬, ఆ. ౧౦౧. ఆము. ౪, ఆ. ౩౫. 2. (వేఱుతావులనుండి)వచ్చు, "చ...సింహభూధర, ప్రభృతిరునాళ్లకుం దిగుసురప్రకరంబు...స్వా." ౧, ఆ. ౩౭, శుక. ౧, ఆ. ౮౭; 3. జాఱు,దిగఁబడు. "గీ. కడుపు దిగె నంచుఁ జొర్గులు కలఁగఁబడఁగ." భాగ. ౧౦. స్కం. పూ. ౬౨; 4. క్రిందికి వ్రేలాడు. "గీ. కట్టి తోడి పూసి కైసేసి కౌతుకమునఁ, గొన దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగువెట్టి..." హర. ౬, ఆ. ౧౧౯; 5. (ప్రయాణమై పోవుచు దారిలో) విడియు. (శ. ర); 6. చొచ్చు, ప్రవేశించు. "ఉ. అవ్వసుధాసుధాశనకులాభరణం బతిరమ్యమైనరయా, జవ్వన మాజవంజవవిశాలసుఖాశుభవైకయోగ్యమై, నివ్వటిలన్ విరక్తిసరణిం దిగె నిందుముఖుల్ రతీచ్ఛచే,సువ్విళులారు డెందముల నోలిఁ జీవుక్కురటంచు నుండఁగన్." విప్ర. ౧, ఆ. ౮౧, ఆము. ౫, ఆ. ౭౧; 7. (చెట్లకు పిందెలు మున్నగునవి) పుట్టు, ఉత్పన్నమగు. "ఆ. పనసపండ్లు దిగినపతిగ స్వప్నము గన్న, నెతిగ నొసఁగి వెఱఁటపఱచు టొప్పు." ఆము. ౪, ఆ. ౨౭౪; 8. తగ్గు. "సీ. సాంద్రచంద్రికయుజ్జ్వలభావములు దిగ నరుణోదయప్రభాస్ఫురణ లెదుగ." విక్ర. ౨, ఆ. ౧౦౭. ఉ. హరి. ౩, ఆ. ౧౨౫; 9. గ్రుచ్చుకొను. వ్యవః-కాలిలో ముల్లు దిగినది.

దిగుచు. దే. స. క్రి. (దిగు ధా. ప్రే.) గ్రుచ్చు. "క...అట్టివారలఁ, గొఱుల దిగిచి చంపు టొప్పుఁ గువలయపతికిన్." విజ్ఞా. ప్రా. ౯౬.

దిగుజాతి. ద్వ. వి. (దిగుడు+జాతి) హీనజాతి, తక్కువజాతి. "గీ. అలు పతిభక్తి స్త్రీపుంసపాళి వాని, యతివశిత్వము దిగుజాతు లగ్రజాతి, ననుసరించుట .." ఆము. ౪, ఆ. ౨౭౭.

దిగుడు. దే. వి. పల్లపుప్రదేశము. "ద్వి. కొమరు దలిర్ప నెక్కుళ్లు దిగుళ్లఁ దమతమపతులహస్తము లూఁదికొనుచు..." పండితా. పర్వ. ౩౪౩. పు. విశ. (దిగు ధా.) 1. పల్లమైనది, అనతము. వ్యవః-ఎగుడుదిగుడు నేలపై నడచుట కష్టము; 2. హీనమైనది, తక్కువది. "క. ఇటువంటివి యిట లెక్కుఁడు, నిటదిగుడువి యొంద కన్ని యే నిదియును నొక్కటి యొకనాఁటిది కా దొక, త్రుటి గీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయికిన్." ఆము. ౬, ఆ. ౬౦. [(శ. ర.)

దిగుదల. ద్వ. వి. (దిగుడు+తల.) క్రిందిభాగము.

దిగుమతి. దే. వి. (దిగు. ధా.) 1. ఓడ మొదలగువానిలో నున్న సరకును దింపుట. (శ. ర. బ్రౌ. వా.); 2. పరదేశమునుండి స్వదేశమునకుఁ దెచ్చుకొనుట. (బ్రౌ. వా.)

దిగుమతిచేయు. దే. స. క్రి. (దిగుమతి+చేయు.) పరదేశమునుండి సరకులు మొ. తెచ్చు. (బ్రౌ. వా.)

దిగులు. దే. వి. (క. దిగులు.) 1. (గుండె) అదరు, దడ. "ఆ. తలఁకు వుట్టెఁ గొంకు గొలఁదికి మీఱె వెం,బాటు దోఁచె ముట్టుపాటు దొడరె,వెఱఁగుపాటు దనికె నెఱనాడె నొవ్వు నెవ్వగలు వగల నీసె దిగులు వొదివె." భార. విరా. ౨, ఆ. ౧౦౬. నైష. ౫, ఆ. ౬౭; 2. అధైర్యము, భయము. సీ. పులులోటు జలదరింపు దిగులు వెఱ పల్కు... ఉడిల యటన సధృతి యగు." ఆం. భా. ప్ర. ౧౩౩.

దిగులుకొను. దే. అ. క్రి. (దిగులు+కొను.) భయపడు. "క...క్రొన్ననగుంపులకు దిగులుకొని మదిఁ బొగులున్." కువల. ౩, ఆ. ౮౩.

దిగులుపడు. ద్వ. అ. క్రి. (దిగులు+పడు.) భయపడు. "ఆ. ఘోరభంగిఁ దోరణారూఢుఁడై యార్చె, గగన మగల జగము దిగులుపడఁగ." రామా. ౬, ఆ. ౨౦౧. వరాహ. ౨, ఆ. ౧౨౭.

దిగులుపఱచు. ద్వ. స. క్రి. (దిగులుపడు ధా. ప్రే.) దిగులుపడఁజేయు, భయపెట్టు. (బ్రౌ.)

దిగులుపాటు. ద్వ. వి. (దిగులుపడు ధా.) భయము. (శ. ర.)

దిగుల్లు. దే. వి. గుండె యదరుటయం దగుననుకరణము. "క. అని తెలియం బలికి గుండియ దిగుల్లనఁగన్." రాజ. చ. ౩, ఆ. ౨౧౪.

దిగువ. దే. వి. (దిగు. ధా.) క్రిందిభాగము. "గీ. లలిత రుచివక్త్ర శశిమండలంబుదిగువ, దండి మీఱుపయోధరమండలంబు." కాళిందీ. ౬, ఆ. ౧౭౪. భార. స్త్రీ. ౧, ఆ. ౧౫౪. విశే. క్రిందిది. "వ...గదాయుద్ధంబున నాభికి దిగువ యగు శరీరభాగంబు నొప్పించుట ధర్మంబు గాదు..." భార. శల్య. ౨, ఆ. ౨౯౫.

దిగువలోకము. ద్వ. వి. (దిగువ+లోకము) సప్తపాతాళములలో నొకటి, అధోలోకము. "క. నాకంటె మిగులువిటు నీ,లోకమునన కాదు దిగువ లోకంబులఁ బై,లోకముల వెదకఁ బోయిన, నీకుం బడయంగవచ్చునే హరిణాక్షీ." నిర్వ. ౬, ఆ. ౭౧.

దిగువాటు. ద్వ. వి. (దిగుడు+పాటు.) దిగువ, క్రిందిభాగము. "క. మినుకు మినుకనెడిమింటన్, బొనబొన నలతెల్లమబ్బుబొంతన దిగువా,టున నదె

కలదో లేదో, యనుమాత్రము గాఁగఁ గంటివా నృపతనయా." సా. ౧, ఆ. ౧౨౪.

దిగువాయి. దే. విశే. (దిగు. ధా.) తక్కువది, న్యూనము. "ఆ. దీను లయినవారి దిగువాయిగాఁ జూచి, పరము గనక నూతఁ బడును వేమ." వేమన. ౩, భా. ౧౨౬.

దిగువాఱు. దే. అ. క్రి (దిగుడు+పాఱు.) 1. కాఱు, ప్రవహించు. "వ...దృక్కోణంబులం దిగువాఱు కన్నీరు కర్ణద్వయీగోళంబులు నిండి..." స్వా. ౩, ఆ. ౯. కాశీ. ౫, ఆ. ౧౬౭; 2. మీఁది నుండి క్రిందికి పడు. "ఉ. రంగుగ నొక్కరొక్కరిశిరంబుపయిం దలఁబ్రాలు వోసి ర,య్యంగ మరీచినవ్యమణులై దిగువాఱఁగ నవ్వధూవరుల్." అని ౧, ఆ. ౧౦౧. విష్ణు. పూ. ౧, ఆ. (శ. ర.); 3. నిండిపారలు. "క. ప్రాలొక్కటఁ గొని దానవ, తైలము దిగువాఱఁ బోయుదానను నీకుం, బోలిన ప్రాలం గొలువుము..." కేయూర. ౨, ఆ. ౧౩. కువల. ౨, ఆ. ౧౦౮.

దిగ్గజము. సం. వి. అ. పుం. అష్టదిక్కులలో నుండు నేనుఁగులలో నొకటి. (ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము. ఇవి యష్టదిగ్గజములు.)

దిగ్గన. దే. క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా. "క... పొమ్ము దిగ్గన ననుడున్." భార. అశ్వ. ౪, ఆ. ౨౮౧. కాశీ. ౪, ఆ. ౫౪; 2. తటాలున. "గీ. అనుచు దైన్యంబు నొందెడు నాననంబు,తోడ దిగ్గన లేచి యత్తోయజాక్షి, చరణపీఠంబుకడఁ జక్కఁ జాగి మ్రొక్కి యున్న..." భార. విరా. ౨, ఆ. ౭౭. ప్రబంధ. ౪౦.

దిగ్గనాడు. దే. స. క్రి. (దిగ్గన్+ఆడు.) విడుచు. "సీ. పయ్యెదఁ దివనీక పట్టు వింతకు మున్ను సిగ్గు నేసంగతి దిగ్గనాడె." కవిక. ౪, ఆ. ౧౭౮.

దిగ్గాఱు. దే. అ. క్రి. (దిగ్గన్+కాఱు.) కృశించు. "క. గుగ్గిలపుఁబొళ్లు గొని తా,మగ్గిని రగులుకొను రీతి నతివేగముగా, బగ్గుమన మరుఁడు దిగులున, దిగ్గాఱి గిరీంద్రకన్య తేఁకువ దప్పన్." పార్వ. ౩, ఆ. ౫౯.

దిగ్గియ. వై. వి. (సం. దీర్ఘికా.) నడబావి. "గీ. తటిని మొత్తంబు రేపాడి తానమాడి, దిగ్గియలచేరు

వలను బూదియల లందు, కాలమున ..." ఉద్భ. ౧, ఆ. ౫౬. సా. ౧, ఆ. ౧౧౭.

దిగ్గు. దే. అ. క్రి. మీఁదినుండి క్రిందికి వచ్చు, అవరోహించు. "గీ. దేవనిర్మిత మైనట్టిదిగ్గియఁ గని, దిగ్గి యగణితవిభవముల్ దేజరిలఁగ." సా. ౧, ఆ. ౧౧౭. స. క్రి. పైనుండి క్రిందికి వచ్చు, అవరోహించు. "గీ. చేరి యరదంబుఁ దద్గృహద్వారసీమ, దిగ్గి యరుదెంచి ప్రణమిల్లి..." రామా. ౧, ఆ. ౭౩. వి. 1. భయముచే గుండె యదరుట కనుకరణము. "ఆ .. శూల మెత్తికొని కరాళవృత్తి, నడఁచి నెమ్మొగమునఁ బొడిచె నింద్రానుజు, దేవతలమనంబు దిగ్గనంగ." నిర్వ. 3, ఆ. 30; 2. లేచుటయం దగుననుకరణము. "మహాస్రగ్ధర... ఉద్యద్ఘనశక్తిక్ ద్రిష్పఁ గొండల్ గడగడ వణఁకం గల్పనిశ్రాంతివేళా. జనితామర్షాంతకాల స్మరహరుక్రియ నాస్థాని దిగ్గంచు లేవన్." శశాం. ౪, ఆ. ౧౪౩.

దిగ్గుడు. దే. విణ. తక్కువది, న్యూనము. "చ... ఎవ్విధిన్, దెలిసిన నీదు గాఁ గలఁడె దిగ్గుడుమా కని గ్రేణి సేయుచున్..." రామా. ౧, ఆ. ౧3౫. నరస. 3, ఆ. ౧3౦.

దిగ్గున. దే. క్రి. విణ. ద్రు. శీఘ్రముగా. "క. అగ్గజగామిని కాముని, యగ్గరికను బెగ్గడిల్లి యాళిజనముఁన్, దిగ్గునఁ గనుఁగొనుఁగి కడుక్, సిగ్గున నేకాంతసదనసీమకుఁ జనియెన్." విక్ర. ౧, ఆ. ౧౭౬.

దిగ్గోలు. దే. వి. కోయుపైరునకు ముందుపైరు (శ.ర.)

దిగ్దర్శనము. సం. వి. అ. న. 1. పద్ధతిమాత్రము చూపుట; 2. దిక్కులను జూపుయంత్రము.

దిగ్ధము. సం. వి. అ. పుం. 1. చమురు; 2. అగ్ని. విణ. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది, లిప్తము; 2. పూయఁబడినవిషము గలది. (అమ్మ.)

దిగ్భ్రమ. సం. వి. అ. పుం. ఒకదిక్కును మఱొకదిక్కుగా గ్రహించుట, దిగ్భ్రాంతి, భ్రాంతి. "ఉ... నాకెదిరి పోర మదీయధనుర్విముక్తనానావిధ మార్గణోగ్రగహనంబున దిగ్భ్రమఁ బొందకమ్మెయిక్, బోవఁగఁ బోలు నీ కనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె వీఁకతోన్." భార. ఆది. ౪, ఆ. ౯౦౫.

దిగ్భ్రమము. సం. = దిగ్భ్రమ. (ఇట్లే: దిగ్భ్రాంతి, దిఙ్మోహము. మొ.)

దిఙ్నాగుఁడు. సం వి. అ. పుం. కాళిదాససమకాలికుఁడును కుందమాలానాటకకర్తయు నగునొకకవి.

దిఙ్మూఢుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దిగ్భ్రమనొందినవాఁడు.

దిచ్చెరి. వై. వి. (సం దిక్చారిణీ.) వ్యభిచారిణి. "క. తెచ్చి కుసుమములోపలఁ, జొచ్చిన బొజఁగెగసి యొగసి చూడఁగ నపుడా దిచ్చెరి హెచ్చరికఁ బ్రియుం, గుబ్బి రతిక్రియల సొంపుగులుకుచు నుండెన్." వేం. పంచ. ౧, ఆ. ౫౯౬, ౬౯౮.

దిచ్చెరించు. వై. అ. క్రి. వెల్వడు. "సీ. మోము వంచిన నేమి మొలకనవ్వులకాంతి చెక్కుటద్దములపై జీరువాఱెఁ, జూడకుండిన నేమి సొబగు తెప్పలమించి తేటవాల్మెఱుఁగులు దిచ్చరించె." క్రీడా. ౯౫.

దిచ్చు. దే. విణ. జూదరి; మాయలాఁడు. "ఉ...ఏ, యొచ్చెముఁ జూడ కాఁచుచును నోడుచు నిర్ధనుఁడౌచు నున్నయా, దిచ్చున కెల్లకాలము నతిద్రవిణం బొసఁగం దలంపుమా." ద్వా. ౧౦, ఆ. ౧౫౯. ౧౦, ఆ. ౪౦.

దిచ్చుమొగము. ద్వ. విణ. (దిచ్చు+మొగము.) అదృశ్యము. (శ. ర. బ్రౌ.)

దిట. వై. వి. (సం. దృఢమ్.) 1. దార్ఢ్యము, శక్తి. "క. దిట చెడి లోఁబడె దైత్యుఁడు..." భాగ. 3, ఆ. ౬౧౪; 2. ధైర్యము. "గీ. బ్రమసి దిట తప్పి నివ్వెఱపడియె ధాత." కాశీ. ౫, ఆ. ౨౬౭. ప్రబోధ. 3, ఆ ౧౪.

దిటదేఱు. దే. అ. క్రి. (దిట+తేఱు.) సమర్థమగు, గడిదేఱు. "చ...దిన మొకవింత గాఁగ దిటదేఱె వధూమణి కేళిచాతురిన్." సీమం. ౪, ఆ. ౪.

దిటము. వై. వి. (సం. దృఢమ్.) 1. ధైర్యము. "గీ. అతితరాభీప్సితావృతస్వాంత యగుచుఁ, గొంత దిట మూని యున్నయనంతరమున." రసిక. ౪, ఆ. ౨౪. శశాం. ౪, ఆ. ౪3; 2. దార్ఢ్యము, శక్తి "చ. దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి యిడంగను గూటిప్రొద్దుసం, కటితటి వెన్నమజ్జిగలు..." శుక. ౨, ఆ. 3౩౪; 3. అతిశయము. 'సీ. రథచక్రనేమి ఘుర్ఘురరావములు కేతుపటపటాత్కృతులకు దిటము తెలుప."

దశా. ౨, ఆ. ౩౭౭. విణ. 1. దృఢము. "చ... డెందమునఁ జాల దిటం బగుభక్తిఁ బూని య, ప్పుడఁతుక యబ్బురంబుగఁ దపం బొనరింపఁ దొడంగె నెంతయున్." రసిక. ౬, ఆ. ౧౨౩; 2. నిశ్చితము,ధ్రువము. "క. వేయేల నీవె ది క్కని,డాయం జనుదెంచితిమి దిటంబుగ దను జుం,డీయెడ మృతిఁ జెందుటకు ను,పాయంబు ఘటింపవయ్య పరమమునీంద్రా." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౬; 3. స్పష్టము,విశదము. "క. అచంద మెల్ల దిటముగ,నీచెవులకుఁ దనివితీఱ నే నెఱిఁగింతున్."నీలా. ౧, ఆ. ౬౯, సా. ౨, ఆ. ౨౩౦.

దిటవరి. ద్వ. విణ. (దిటవు+అరి.) ధీరుఁడు. "సీ.తగఁ బ్రాంసుదొరలతోఁ దగవుల కేర్పడి యేదిటవరి నిర్వహించి మించె." ఆనంద. పీఠి. ౫౯.

దిటవు. వై. వి. (సం. దృఢమ్.) 1. దార్ఢ్యము, శక్తి. (శ. ర.); 2. ధైర్యము. "వ...ఇట్టివాఁడు మన కేమి త్యాగ మీయఁబోయెడి నెందుకు వచ్చితి మని మంతనంబునం గొంత చింతించి యంతలో నిసుమంత దిటవు దెచ్చుకొని యతనిచెంతం జేరి యాశీర్వదించి..." ఆనంద. పీఠి. ౩౯, విణ. దృఢము. (శ. ర.)

దిట్ట. వై. వి. (సం. దృష్టః.) ధైర్యము. "గీ. తెవులువడ్డను గుండైన దిట్ట చెడినఁ,జంపఁ డను కంప నెట్టెహింస్రంబునైన." కాశీ. ౪, ఆ. ౬౦. విణ. 1. ధైర్యము గలవాఁడు, ధీరుఁడు; ధీరురాలు. "ఉ. దీనినిగారపుందొడలు దీనిమొగంబును దీనికన్నులున్, దీనివిలాసముం గని మదిం గడు సోలరె యెట్టిదిట్టలున్." రసిక. ౩, ఆ. ౫౬. "వ. ఆజ్జోటి దిట్ట గావునం దలంకక..." ఉ. హరి. ౧, ఆ. ౫౬. (చూ. ౧, ఆ. ౫౫.); 2. శక్తి గలవాఁడు, సమర్థుఁడు. "వ. ఆఖండలా యఖండలాఘువాలాపంబులం గోపంబు పుట్టించితి దిట్ట వేని గట్టితనం బేర్పడ నిప్పర్వతశిఖరంబుఁ బెఱుకు మన్న..." పాంచాలీ. ౩, ఆ. ౧౯. పారి. ౧, ఆ. ౪౯; 3. నేర్పరి,చతురుఁడు. "క. వరవర్ణిని యగునీకుం, బురుషుఁడు బలుదిట్ట యతనిఁ బొందుము లీలన్." భా. రా. అర. ౧, ఆ. ౧౪౪. స్వా. ౫, ఆ. ౧౬; 4. పెంకెవాఁడు, ఎదిరించు స్వభావము గలవాఁడు. "గీ. బేరజపుగట్టిజంత పాడూరిసంత,చలము సాధించుదిట్ట రోసాలపుట్ట." శుక. ౩, ఆ. ౨౮, భర్తృ. ౧, ఆ. ౪౭.

దిట్టఁడు. వై. విణ. (సం. ధృష్టః.) 1. ధీరుఁడు, ధైర్యవంతుఁడు. "ఉ...నేదిట్టఁడ నైతి నెల్లవియఁ దెల్లముగా వినవోర్తు సంజయా." భార. భీష్మ. ౧, ఆ. ౬౫, రా. వి. ౫, ఆ. ౨౪; 2. సమర్థుఁడు. "ఉ. గట్టుల మట్టుపెట్టుబలుకైదువుఁ బట్టినయట్టి దిట్టఁడున్,దిట్టతనంబు వాసి బొలదిండికి లోఁబడి గాసిఁ జెందఁగా." ఉ. రా. ౫, ఆ. ౧౧; 3. ఉద్ధతుఁడు,పెంకెవాఁడు. "గీ. పొదుగు దిగజాఱ విడచి పా ల్పొలుపుగాను, బుట్ట నిండింపఁగాఁ జూచి దిట్టఁ డైన,గోపఁ డప్పుడు దనచేతిగొడ్డ లెత్తి,గోవుసడినెత్తిపై మించి కొట్టఁ బోవ." వేం. మా. ౪, ఆ. ౧౬౦.

దిట్టతనము. ద్వ. వి. (దిట్ట+తనము.) 1. నేర్పు,చాతుర్యము. "ఉ. దిట్టతనంబు మీఱ నుపదేశము సేయుచు నుండు బ్రహ్మమున్." కాశీ. ౧, ఆ. ౭౬, విక్ర. ౭, ఆ. ౪౭; 2. ధైర్యము. "ఉ... ఇంద్ర రే,ద్విమరి నొమ్మికయ్యమున దిట్టతనం బఱి పూరిమేసితో..." దశా. ౨, ఆ. ౪౧౩, భార. భీష్మ. ౧, ఆ. ౧౫౯; 3. మహిమ,గొప్పతనము. "వ. అట్టిచుట్టుకైదువజగజెట్టికి విడిదిపట్టయిన పెట్టెఁ బెట్టు దిట్ట గట్టుకట్టుమట్టుదిట్టతనం బెట్టి దనిన." రా. వి. ౧, ఆ. ౨౮.

దిట్టపడు. వై. అ. క్రి. (దిట్ట+పడు.) అలముకొను. "ద్వి. జలజారినడుకప్పుచాయఁ గెంగేలఁ,బులుము కాటుక మొగంబున దిట్టపడఁగ." అ. మ. క. ౧, ఆ. ౨౫. పు.

దిట్టపఱచు. వై. స. క్రి. (దిట్టపడు. ధా. ప్రే.) 1. అధికముగా సమకూర్చు. "వ...ఆసహాయశూరులగుబారుసిపాయీలను గూర్చి తగినజగడంపు సామానుల దిట్టపఱిచిన నమితోత్సాహంబున నెలువడి...." ఆనంద. పీఠి. ౧౦౬; 2. దృఢపఱచు. "వ...చందాసాహేబు న్విడిపించి యాహిరాయితమొహదినీఖాను వెంట నంటి రా దిట్టపఱిచి పుదుచ్చేరి నున్నరజాసాహేబునకు నవాబుతనం బిప్పించె...." ఆనంద. పీఠి. ౧౦౬.

దిట్టము. వై. వి. (సం. దృఢమ్.) 1. నిర్ణయము,నిశ్చయము. "సీ. దిట్ట మంచనఁగఁ గన్పట్టు నిర్ణయముగ..." అం. భా. ప్ర. ౧౦౩; 2. ధైర్యము.

"గీ. కొసర కెఱుఁగనికూరిమి కుదురుపాటెఱుఁ గనిదిట్టంబు నిలుక డెఱుఁగనిమనము." చంద్రా. ౬, ఆ. ౧౪౮. విణ. 1. ధ్రువము,నిశ్చితము. "సీ... దేహికి మరణంబు దిట్ట మగుచు." శివధ. ౫, ఆ. ౮౩; 2. స్థిరము,శాశ్వతము. దండకము...సద్భో గినీపట్టముక్ దిట్ట మానట్టుగా వే ప్రసాదించి తన్మాత్ర రావించి..." భోగినీదండకము.

దిట్టాడు. దే. అ. క్రి. (దిట్ట+ఆడు.) అతిశయించు, ఎక్కువగు. "శా. దేవా కయ్యముతోడివేడుక మడిక్ దిట్టాడుమర్త్యుండు నేత్రోవం జేతుల తీఁట పుత్తు నని కోరున్...."ఉ. హరి. ౫,ఆ. ౭౧.

దిడ్డి. దే. వి. 1. పాలకీ మున్నగువానికి వేయుతెర "ఉ...పైడిపాలకీ, నప్పుడు బోఁడి నుంచి మెఱుఁగారెడుబంగరువ్రాఁతపచ్చడం, బొప్పఁగ దిడ్డి వైచికొని యుబ్బుమెయిం గొనిపోయె నింటి కిన్." పరమ. ౭, ఆ. ౩౮, రామా. ౭, ఆ. ౯౭. విణ. చిన్నద్వారము గలది. "చ...నగరుఁ జొచ్చిరి లోపలిదిడ్డిత్రోవచేన్." య. ౫, ఆ. ౧౫౧. "ద్వి. తిరమగుచున్నట్టి దిడ్డివాకిళ్ల, నురు సత్త్వ లుండు దురోక్కొక్కకోటి." రం. రా. యు. ౩౦౩, పు ౭౫. పం.

దితము. సం. విణ. (అ. ఆ. అ.) నఱకఁబడినది, భేదింపఁ బడినది.

దితి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. దైత్యులతల్లి, కశ్యపుని భార్య. ఇ. స్త్రీ. నఱకుట,ఖండనము.

దితిజుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు. (ఇట్లే: దితి సుతుఁడు. మొ.)

దిత్స. సం. వి. ఆ. స్త్రీ. ఈయవలయు ననుకోరిక, దానేచ్ఛ.

దిత్సువు. సం. విణ. (ఉ.) ఈయఁగోరువాఁడు, దాన శీలుఁడు.

దిదృక్ష. సం. వి. ఆ. స్త్రీ. చూడవలయు ననుకోరిక.

దిదృక్షువు. సం. విణ. (ఉ.) చూడవలయు ననుకోరిక గలవాఁడు.

దిద్దు. దే. స. క్రి. 1. (విద్యాదులను) నేర్పు; శిక్షించు. "గీ. ముదిత వేలుమేలు కొదవ లేకెందు నీ, యనఘుచరితు దిద్దు మనుచుఁ జనియె,జాంబవతియు నొక్క సంవత్సరముదాఁకఁ,బాట నేర్పె మునికిఁ బాటవమున." కళా. ౭, ఆ. ౩౫, ౩౬. య. ౧, ఆ. ౩౯; 2. చక్కఁబఱచు. "శా. అలీలక్ రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱుక్ గేలిభి, న్నాలంకారము లొక్కరొక్కరికి నిం పొన ట్లుగా దిద్దుచున్." కళా. ౩, ఆ. ౧౭౦. ఆము. ౪, ఆ. ౩౫; 3. అలుకు. "క. నునుపగుమృగమద పంకం,బునఁ దీనియ దిద్ది కప్రపుంబొడి ముగ్గుల్, నినిచి..." రసిక. ౪, ఆ. ౮౪; 4. సవరించు, సమర్థించు. "ఉ...ఆనృపతిపాలికిఁ బోయెద వేమొ పొమ్ము నీ,యిచ్ఛకు వచ్చినట్లు రమియింపు మొకానొకమాట పుట్టినక్,నెచ్చెలి లేదు బంతి యనునేర్పున దిద్దుకొనంగఁ జాలినన్." శుక. ౭, ఆ. ౯౭; 5. (అప్పు) తీర్చు. "ఉ. ఏయెడ కేల పోవు నతఁ డెవ్వరికైనను జిక్కువాఁడె తా, నాయన మీకు నీవఱకు నచ్చినయప్పిట దిద్ది తా సుఖో,పాయత నున్నవాఁడు..." వైజ. ౪, ఆ. ౧౬; 6. మార్చు, తప్పులులేకుండఁ జేయు."క... తప్పొప్పు మడిక్, భావించి దిద్దకుండను, దేవానాంప్రియుల మ్రొక్కి తెలతుఁ గుకవులన్." రాఘవ. పీఠి. ౫, (శ. ర. పా.); 7. నియోగించు, ఆనతిచ్చు. "గీ. అనఘ జాత్యభిమాన దేహాభిమాన, లేశములు దాసురాలికి లేవు మాధు,కరము నల వాటె మీవంటిఘనులు దిద్దు,పనులు సేయుంట కంటె శుభంబు గలదె." వైజ. ౭, ఆ. ౧౧౦; 8. త్రవ్వు. "మ. తనశృంగారవనంబులోన గిరిపొంతం జక్కఁగా దిద్ది తీర్చినపూఁదేనియయేటి కాలువ దరిన్...." పారి. ౧, ఆ. ౩౧; 9. ఎఱుఁగు, కనిపెట్టు. "క. తదుపాయము దిద్దుటకుక్, మది నెన్నఁబ్రభావఘనులు మఱి లేరు..." కళా. ౩, ఆ. ౫౬; 10. నెఱవేర్చు. "ద్వి. అట్టివారెన మంద్రు నఖిలకార్యములఁ,బట్టున దిద్దఁ దీర్పను జాలి కొలువ." రం. రా. బాల. ౧౦, పు.; 11. (నేర్చుకొనుటకై) వ్రాసి యిచ్చినయక్షరములపై వ్రాయు. "సీ. గద్దించి వడిఁ దిట్టి దిద్దుమంచును వ్రేలు పెట్టింప నచట నేఁ బెట్టకుందు." హంస. ౩, ఆ. ౧౪౭; 12. విభూతి మున్నగునవి పెట్టు కొను. "సీ. తిగరేక లేర్పడ దిద్దిననొసలినుస్వాలి బూదిబొట్టురంగులు నెలంక." నీలా. ౧, ఆ. ౬౦.

దిద్దుకొను. దే. స. క్రి. (దిద్దు+కొను.) చక్కఁబఱచు. "క. విను వల్లభ కన్నుండం, గనుఁ బొలుం దివియ నేర్పు గలమునిముచ్చు,వనిత తగ దిచట

నుండన్, వెనుకను దిద్దుకొనవచ్చునే యొకరైనన్." కళా. 3, ఆ. ౧౧౫.

దిద్దుగడ. (దిద్దు+గడ.) దిద్దుపాటు. "మ. మిముబోం ట్లాఁడుది పల్కు దిద్దుగడకున్ మే లందురే..." అచ్చ. భా. ౧, ఆ. ౪౧.

దిద్దుడు. దే. వి. (దిద్దు. ధా.) దిద్దుగడ, దిద్దుపాటు. (శ. ర.)

దిద్దుపాటు. ద్వి. వి, 1. సవరించుట; 2. శిక్షించుట. (శ. ర.)

దిద్దుబడి. దే. వి. (దిద్దు+బడి.) దిద్దుపాటు. (శ. ర.)

దిద్దుబాటు = దిద్దుపాటు. (బ్రౌ. వా.)

దిద్దువడు. ద్వి. అ. క్రి. (దిద్దు+పడు.) శిక్షణ మొందు; నేర్చుకొను. "గీ. దేవకులనాథ నాయొద్ద దిద్దువడిన, పొలఁతి యెన్నటికిని నన్నుఁ బోలఁ గలదె." వాల్మీ కి. 3, ఆ. 3౭.

దిధక్ష. సం. వి. ఆ. స్త్రీ. కాల్పవలె ననుకోరిక. "క... లంకాపురీదిధక్షాదీక్షా, రూక్షప్రతాపుఁ గంటే, సాక్షాల్లయసమయపవనసఖు సామీరిన్." రామా. ౭, ఆ. ౧౯౭.

దిధక్షువు. సం. విణ. (ఉ.) కాల్ప నిచ్ఛ గలవాఁడు

దిధిషువు. సం. వి. ఊ. స్త్రీ. 1. మాఱుమనువు చేసి కొనినస్త్రీ; 2. చెల్లెలికి పెండ్లియై తనకు పెండ్లి కాని స్త్రీ. ఉ. ఊ. పుం. మాఱుమనువు చేసికొన్నస్త్రీ మగఁడు.

దిధీర్ష. సం. వి. ఆ. స్త్రీ. ధరింపవలె ననుకోరిక. "మాలినీ. ధరణిధరదిధీర్షాధః కృతాహార్యవర్యా." నైష. ౪, ఆ; ౧౪3. ౬, ఆ. ౧౪౬; 2. పోషింపవలె ననుకోరిక.

దినకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినక్షయము. సం. వి. అ. పుం. 1. తిథితగ్గుట; 2. సాయంకాలము. (ఇట్లే: దినపాతము.)

దినకోరు. మి. వి. (దినము+కోరు.) రోజుకూలి, దిన భృతి. "గీ...దినకో రనంగ, వెలయు దినరోజు ..." ఆం. భా. తృ. 3౨.

దినగోరు. మి వి. (దినము+కోరు.) దినభాగము, దిన మున కొకనికి వచ్చుపాలు. "సీ. తివుటఁ జుక్కల తేనె దినగోరు మెసఁగిరి పండ్లు దుల్చిరి కల్పపాద పంబు." నైష. ౭, ఆ. ౮౧.

దినచర్య. సం. వి. ఆ. స్త్రీ. నిత్యకృత్యము, ప్రతి దినముఁ జేయుపని.

దినచేల్వాలు. మి; వి. బ. (దినము+చల్వాలు.) దినమున కొకటిచొప్పున ఉపయోగించు చలువచేసిన వస్త్రములు. "క. నిద్దంపుమేలిసొమ్ములు, దిద్దినకస్తూరి బొట్టు దినచల్వాలునై, ప్రొద్దొకసింగారముతో, ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁడై." విజ. ౨, ఆ. ౧౪౪.

దినపతి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు; 2. వారాధిపతి, సూర్యచంద్రాంగారకబుధగురు శుక్రశను లలో నొకఁడు; 3. జిల్లేడుచెట్టు. (ఇట్లే: దినపుఁడు. మొ.)

దినబత్తెము. మి. వి. (దినము+బత్తెము.) రోజుకూలి, దినదినము నిచ్చుబత్తెము. "ఉ...వసుధామర నిష్ఠురోక్తు లేలా వచియింప నీకు మొదలన్ దిన బత్తెము నే నొడంబడన్, నీవు గురుప్రయోజనము నెమ్మి నొనర్పఁగ వచ్చి తిమ్మెయిన్." హరిశ్చ. ౪, ఆ. ౧౯౨.

దినమణి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు. "క. అపర్వత మెక్కుఁడు గజరూపం బగుతిమిర మణఁచి లోహిత కాంతి, వ్యాపితకరనఖరుండై, దీపించె మృగేంద్రు కరణి దినమణి కణఁకన్." ద్వా. ౫, ఆ. ౧౪. (ఇట్లే: దివామణి. మొ.)

దినము. సం. వి. అ. పుం. న. పగలు, దివసము. (దీని భాగములు పదునేను. 1. రౌద్రము; 2. శ్వేతము; 3. మైత్రము; 4. కారభటము; 5. సావిత్రము; 6. విజయము; 7. గాంధర్వము; 8. కుతపము; 9. రౌహిణేయము; 10. విరించము; 11. సోమము; 12. నిర్ఋతి; 13. మాహేంద్రము; 14. వరుణము; 15. భటము.); 2. అఱువదిగడియల కాలము, రోజు; 3. తిథి; 4. ప్రతిదినము. "శా... హేరాళంబుగా నద్రికన్యాజానిం భజియించు నిత్యనియతిం దత్కాలపూజాక్రియా, భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినముం బంచాక్షరీమంత్రమున్." విప్ర. ౧, ఆ. ౨౦.

దినముఖము. సం. వి. అ. న. వేకువ, ప్రభాతము.

దినరోజు. మి. వి. (దినము+రోజు.) రోజుకూలి. "సీ. పగటిగ్రాసంబు దప్పక యుండ దినరోజు మాదిరి నొంటరి జోదుమాఁక." రా..వి. ౫, ఆ. ౧3. ౫, ఆ. 3౨.

దినవహి. మి. వి. జమాఖర్చు. "చ...శోభనతర చంద్రదీధితులపంక్తి జమాఖరుచుల్. గణించి

యుం,తనుగొని కాల మర్గగణకుఁ డప్పుడు తీర్చి లిఖించినట్టియా,దినవహి లెక్క వ్రా లనఁగఁ దెల్విగఁ జుక్కలు పర్వె నత్తఱిన్." హంస. ౧, ఆ. ౫౪౨.

దినవారము. వై. వి. ఉత్తరక్రియలు, శ్రాద్ధాదికర్మ. (బ్రౌ. వా.)

దినవెచ్చము. మి. వి. (దినము+వెచ్చము.) దినదినమును జరిగెడివ్యయము. "సీ. దినవెచ్చమునకునై తనమేనఁ గలసొమ్ము కొదుకక బచ్చింటఁ గుదువవైచు." పాండు. 3, ఆ. ౧౬. పీఠి. ౪౯.

దినసరి. దే. వి. సస్యవిశేషము. "వ. దినసరి సరియయ్యె సంభావ లేపుదప్పెఁ గర్పూరభోగి బాగు చెడె..."విష్ణు. నా. 3, ఆ. ౧౮౧ విష్ణు. పు. 3, ఆ. (శ. ర.) బ. ధాన్యవిశేషము. (శ. ర.)

దినసరులు. దే. వి. బ. 1. దినచర్య "చ. వినఁడు ప్రమోదలీలఁ బృథివీవరు లంపిన రాజకార్యపుం, దినసరులన్ జను ల్సనవి దెల్పుకొన న్మఱుమాట వల్కఁడు..."ఇందు. ౨, ఆ ౨౦౯; 2. దినచర్య వ్రాయు పుస్తకము; ఉత్తరము. "క. ఘనతర భేదోపాయం,బునకుం దగినట్టియుక్తిఁ బుట్టించి రయం, బొనరఁగ రాయలపేరిటి, దినసరు లాతు త్రియంలకుఁ దేటపడంగన్." కృష్ణ. 3, ఆ. ౧౦౪.

దినాంతకము. సం. వి. అ. పుం. 1. సాయంకాలము; 2. చీకటి.

దినాంతము. సం. వి. అ. పుం. సాయంకాలము. (ఇట్లే: దినాత్యయము. మొ.)

దినాగమము. సం. వి. అ. పుం. ప్రాతఃకాలము. (ఇట్లే: దినాది. మొ.)

దినారి. వై. వి. (సం. దీనారః.) బంగారము, పైఁడి. "ఉ...ఒకనాఁ డొకచోట సుబుద్ధి గాంచెఁ బెం, పొంద దినారిటంకముల నుంచినకాంచనకుంభ మట్టియా,కుందన మొక్కచోట నిడి కూర్చిన కోమటిఁ జేరి చెప్పినన్." నా. పంచ. ౧, ఆ. ౫౦. (శ. ర. పా)

దినిక. సం. వి. ఆ. స్త్రీ. దినబత్తెము.

దినుసు. దే. వి. 1. ప్రకారము. "సీ. పెనుగట్టు లను బెట్టుకొనునట్టు కనుపట్టు చనుకట్టుపుటముల దినుసు చూప." పార్వ. ౫, ఆ. ౧౪౫; 2. రకము, జాతి. "గీ...తీవసవులు, నాది యగుపేళ్ల గలుగువడ్లతనియుంట, నుండు శతకోటిపుట్టు లొక్కొక్క దినుసు." హంస. ౪, ఆ. ౧౨౮. ప్రభులిం. ౧. విశే. సమము, తుల్యము. "సీ. తాఁబేలు కడుపుఁగోఁ దలఁగ్రుక్కుకొనియెఁ బో తెఱవమీఁగాళ్లతో దినుసుగాక." అచ్చ. అర. ౨౨. బ. అపరాలు. "సీ. కాయధాన్యంబుల కణజముముల్ బియ్యపుగరిసెలు దినుసులు గలకొటార్లు" హంస. ౫, ఆ. ౫౨౯.

దినుసుమీఱు. దే. అ. క్రి. (దినుసు+మీఱు.) నిరుపమాన మగు. "సీ. తెఱగంటిదొర లెల్ల దినుసు మీఱినలెంక లలరువిల్తాలుప్పు ముద్దులమఱంది." అచ్చ. బాల. ౬.

దినుసువచ్చు. దే. అ. క్రి. (దినుసు+వచ్చు.) సరిపోలు, సాటియగు. "సీ. కంటి కింపగురేఖ గల్గియుండుటఁ జేసి మినుకుఁగాటుక కొంత దినుసు వచ్చు. గీ. ఐకచకమలాక్షినుసుసోగ వెండ్రుకలకు." విజ. ౧, ఆ 3౫.

దినుస్సు = దినుసు. (వస్తువు) "చ. పుఱుఁబుఱుఁ బండు కొల్చు విరిపైఁడియుఁ గట్టిదినుస్సు...అన్నవితీర్ణికి వెచ్చపోవఁగా." కళా. ౬, ఆ. ౮౫.

దిన్నె. దే వి. వృక్షవిశేషము. "సీ. సంపాతి తాడియు శరభుఁడు దిన్నెయు నలుఁడు మత్తియు..." అచ్చ. యు. 33౨. (దిన్న. శ. ర. పా.)

దిప్పకాయ. దే. విశే. కొంటెవాఁడు. "ద్వి. తలపోయ నీతుమైనలు కూడగొట్లు, మలయమారుతము ద్రిమ్మరి దిప్పకాయ." ద్వి. పరమ. 3, అ. ౨౪౭, పు.

దిబ్బ. వై. వి. (సం. ద్వీపః.) 1. దుర్గద్వారమున వాటముగా నేర్పఱిచినమట్టిదిబ్బ, హస్తినఖము. "గీ. తిన్నె దిబ్బ యనంగ హస్తినఖ మొప్పు." ఆం.భా. ద్వి. ౮౧; 2. కొండ, పర్వతము. "చ. పులుగుల కబ్బ లోకనకపుంజిగిదిబ్బలొ దానిగుబ్బలో..." శశాం. ౪, ఆ ౬౪. హంస. 3, ఆ. ౨౦; 3. ఉన్నతభూమి; మట్టిమున్నగువానికుప్ప. (శ. ర. వా.); 4. ద్వీపము. "గీ...నేరేడుదిబ్బకుఁ జుట్టువాఱు, తీపచెన్నారు మున్నీరు తెఱవ గాంచి." కవిరా. ౪, ఆ. ౬3. (నేరేడుదిబ్బ = జంబూద్వీపము.)

దిబ్బచూపు. ద్వ. అ. క్రి. (దిబ్బ+చూపు.) దిబ్బగా నేర్పడు. "వ...అస లడుగువడియె కోటి నిసుక

దిబ్బచూపె నిద్ర చవియయ్యె ..." కాశీ. 3, ఆ. ౨3.

దిబ్బడ. దే. వి. శైత్యాదికముచేత ముక్కు చెవులందు కలుగుబాధావిశేషము. (చూ. దిబ్బడవేయు.)

దిబ్బడము. దే. వి. 1. మూఁకుడు. (శ. ర.); 2. దిబ్బడ. (బ్రౌ.)

దిబ్బడవేయు. దే. అ. క్రి. (దిబ్బడ+వేయు.) శైత్యాదికముచేత ముక్కుచెవులం దొకవిధ మగుబాధ పుట్టు. (వ్యవ;-)చెవులు దిబ్బడవేసినవి; ముక్కు దిబ్బడ వేసినది. (బ్రౌ. వా.)

దిబ్బెము. వై. వి. (సం. దీపః.) దీపము. (చూ. దిబ్బెమెత్తు.)

దిబ్బెమెత్తు. ద్వ. అ క్రి. (దిబ్బెము+ఎత్తు.) దీప మెత్తి ప్రమాణము చేయు. "సీ. దిబ్బెమెత్తఁగ వచ్చు నబ్బురం బగుకల్మి షేరమీాఱినరీతి మెలఁగఁ డనుచు." పాండు. ౧, ఆ. 33.

దిమాకు. హిం. వి. 1. గర్వము; 2. అధికారము; 3. ధైర్యము.

దిమికిట. దే. వి. తుడుము మున్నగువాద్యములధ్వని కనుకరణము. "సీ. తటపెటదిమికిటధ్వను లోలిఁ బుట్టింపఁ జాలుగుమ్మెట చంక వ్రేలుచుండ." క్రీడా. ౨౭.

దిమిదిమి. దే. వి. మద్దెలమ్రోఁత కనుకరణము. "ద్వి. దిమిదిమి యనుచు మద్దెలమ్రోయఁ బాట,లమర నారీమణు లాడుచందమున, ఘుమఘుమ మనుచు మేఘుండు గర్జింప." రం. రా. కిష్కిం. ౨౮౯. పు. (శ. ర. పా.)

దిముకు. దే. వి. మద్దెలమ్రోఁత, మృదంగరవము. "సీ.... దిముకు నా మృదంగరవము వెలయు .." ఆం. భా. ప్రే. ౧౨౧.

దిమ్మ. యం. దే. వి. 1. తెలివి,స్పృహ. (చూ. దిమ్మదిరుగు.); 2. భ్రాంతి, పొరఁబాటు. (చూ. దిమ్మగొను.) వై. వి. (సం. ద్వీపః.) 1. దిబ్బ; ప్రోవు. "గీ. తమ్మికొలఁకుల నోలాడి కమ్మపూవుఁ,గొమ్మలు గదల్చి కపురంపుదిమ్మ లెక్కి." అచ్చ. రా. బాల. ౧౨౧. కాశీ. 2, ఆ. ౨౪౪; 2. స్తంభము మంచపుఁగోడు మొదలగువానిక్రింద నుంచు ఱాయి,కఱ్ఱమున్నగువానిఖండము. వ్యవ:- స్తంభము క్రింద దిమ్మ సరిగా లేదు; 3. కంసాలి బంగారు మున్నగువానిని సాఁగఁగొట్టుట కుపయోగించు ఇనుపముక్క. వ్యవ:-బంగారపురేకు దిమ్మపై సాఁగఁ గొట్టుచున్నాఁడు; 4. ఇటుక మన్ను మొదలగువానితోఁ గట్టుస్తంభము. (వ్యవ:) దిమ్మలపై పాక వేసినారు.

దిమ్మగొను. దే. అ. క్రి. (దిమ్మ+కొను.) పొరఁబడు; భ్రాంతినొందు. "గీ. వారి వీరిని నన నేల వీరి వారిఁ,గలగలపు చేయుననన్న నవలయుం గాక, తెఱఁ గెఱుంగక యపు డట్టు దిమ్మగొంటి,తలఁపఁ దన నుండి రానట్టితప్పు గలదె." రాధికా. 3, ఆ. ౪౫.

దిమ్మడుచు. దే. అ. క్రి. (దిమ్మ+అడుచు) దిబ్బడ వేయు. "వ.. గుంటలువడినకన్నులు దిమ్మడుచు కర్ణంబులు గలిగి..." దశా. ౨, ఆ. ౫3. సానంకో. ౨, ఆ. ౨౫.

దిమ్మదిరుగు. దే. అ. క్రి (దిమ్మ+తిరుగు.) స్పృహ తప్పు. వివశతనొందు. (అసాధ్యసాధనము.) "గీ. తొమ్ము గాఁడిన సౌమిత్రి దిమ్మదిరిగి, పుటమెగసి కేలివిలు జాఱ బోరమోవఁ,బడఁగ శేషాంశ మైన యాభవ్యశీలు, ధరణితలఁ దాల్చె మేలు కృతజ్ఞు రాలు." రామా. ౮, ఆ. ౧౨౦; 2, ఆ. ౨౬౬.

దిమ్మపడు. ద్వ. అ. క్రి. (దిమ్మ+పడు.) స్తంభించు, వివశుఁడగు. "ద్వి. నదులు వేగము మాని నలి నట్టె నలిచె, గదలవీవక సదాగతి దిమ్మపడియె, నిను తేరితురగంబు లేఁగక నిలిచె, ఘనుఁ డైనవారి వాంఛికత్వంబుఁ జూచి." సిం. భాగ. ౨, ఆ. ౯౯.

దిమ్మరించు. దే. దే. స. క్రి. ఎక్కువగాఁ బోయు, ద్రిమ్మరించు. (బ్రౌ. వా.)

దిమ్మిస. దే. వి. 1. (నేల) చదును. (శ. ర.); 2. నేల చదునుచేయు సాధనవిశేషము. వ్యవ:-అగది దిమ్మిసతో చదును చేసినారు.

దిమ్ము. దే. వి. 1. సమూహము గుంపు. "వ...కోలలు గుప్పలు గూర నాఁటిననిలువున గతాసులై యమ్ములదిమ్ములుంబోలె వ్రాలుదానవులును..." భా. రా. అర. ౧, ఆ. ౨౦౫, రసిక. 3, ఆ. ౫౧; 2. మాంద్యము,జడత్వము. "మ. అనిసం గాలిన కాలముక్ చెవులలో నంటించినట్లైన నూనిన మెందిమ్మున సొమ్మసిల్లి మగుడక్ వే తేఱి..." సా. ౨, ఆ. ౯౯, ద్వి. పారిశ్చ. పూ. ౧౨౫౬. పం; 3. గర్వము,మదము. "గీ. పాడిదప్పిరి నృపతులు బలిసెఁ గొండెము...,క్రమ్మె దుర్వ్యసనంబులు దిమ్ము రేఁగె." వరాహ. 2, ఆ. 3౧; 4.

తల మున్నగువానియందలి బాధావిశేషము. "గీ. తుమ్మెదలదిమ్మురొద తలది మ్మైనర్ప." ఇందు. ౩, ఆ. ౧౨, విజ. ౨, ఆ. ౧౯౭; 5. గొప్పధ్వని కనుకరణము. "చ. అరుదుగ వాద్యవిద్య బిరుదం దినవాయిదకాఱు లత్తతిక్,గరములు రెండు నొక్కసరిగా మురజంబులు ముట్ట దిమ్మనక్, మొరయఁగఁ జేసి .." వైజ. ౧, ఆ. ౧౨౩; 6. గొప్పధ్వని. "ఉ. ఆమఘువాత్మజన్ము నొక యమ్మున దిమ్మనఁ గూలనేసి..."రామా. ౫, ఆ. ౩౨౬, ద్వా. ౧౧, ఆ. ౨౩.

దిమ్ముగొను. దే. అ. క్రి. (దిమ్ము+కొను.) బాధనొందు. "సీ. శ్రీకృష్ణుచేఁ గొనుచిలుకపల్కులు విని గుమ్ము గుమ్మని చెవుల్ దిమ్ముగొనఁగ...." రాధికా. ౨, ఆ. ౨౦.

దిమ్ముపట్టు. ద్వ. అ. క్రి. (దిమ్ము+పట్టు.) దిమ్మదిరుగు "క. ముక్కున నోరున నెత్తురు గ్రక్కుచుఁ దల దిమ్ముపట్టఁ గడుదీనతతో." వి. పు. ౭, ఆ. ౧౮౨.

దిమ్మువడు. ద్వ. అ. క్రి. (దిమ్ము+పడు.) డిందుపడు. "గీ...దిమ్మువడియె ననఁగ డిందు,పడియె ననుట దోఁచు..." ఆం. భా. తృ. ౧౧౬.

దిమ్మెట = దిమ్ము. (చూ. దిమ్మెట్టుపడు.)

దిమ్మెట్టుపడు. ద్వ. అ. క్రి. చెవుడుపడు. (బ్రా. వా.)

దిమ్మెత్తు. దే. అ. క్రి. (దిమ్ము+ఎత్తు.) బాధనొందు. "మ. తల దిమ్మెత్తెను మోపు మోచుక్రియ డెం దం బేమొ నెజ్జెత్తినట్టుల కానంబడె..." సావి. ౨, ఆ. ౧౦౧. పు.

దిమ్మె. దే. వి. 1. తామరదుద్దు. (శ. ర.); 2. రాళ్ల మొదలగువాని చిన్నగుట్ట. "గీ...,వలపుగ్రమ్మ నిమ్మగుకపురంపుదిమ్మెసుమ్ము." నీలా. ౨, ఆ. ౩౨; 3. కొయ్యబిరడా. (శ. ర.); 4. మద్దెలయంచు. "ద్వి. సంధించి సంధించి సప్తతాళములు, బంధు రగతులు తప్పకయుండ శ్రుతులు,...పరిపాటిగా దిమ్మెపై రాతఁ బొడిచి,కరవేగమున వాద్యకౌశల్య మెసఁగ." ప్రభులిం. ౨, ఆ. ౨౬. పు.

దిమ్మెస. దే. వి. జాతిపనివానిపనిముట్టు. (శ. ర.)

దిరదిర. దే. వి. తిరుగుటయం దగుననుకరణము. "గీ. ధరణి దిరదిరఁ దిరుగుచందమునఁ దోఁచె." ఉ. రా. ౬, ఆ. ౨౩౫.

దిరిసెన = దెరిసెనము. (బ్రా.)

దిరిసెనము. వై. వి. (సం. శిరీషః) శిరీషము✻. "గీ.... సన్న,విరిగి సోమింద గున్నంగి దిరిసెనంబు,మొద లుగాఁ గల్గుబహువిధభూరుహములు." హంస. ౪, ఆ. ౧౧, చంద్ర. ౫, ఆ. ౭౫.

దిరిసెము. వై. వి. (సం. శిరీషః.) శిరీషము✻. "ఉ.... మేదినీశ్వరులమానసముల్ దిరిసెంపుఁబూవులున్." కాశీ. ౫, ఆ. ౩౦౫, ఆం. భా. ద్వి. ౪౯.

దిర్దిర. దే. వి. తిరుగుటయం దగుననుకరణము. "ఉ. అమ్ముని యల్లి చూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీ, ధ్రిమ్ములు వ్రయ్యునయ్యెసుము దక్కఁగ నంబుధు లింకు మూఁడులో,కమ్ములు దిర్దిరందిరుగు..." భార. ఆది. ౪, ఆ. ౩౮, రామా. ౪, ఆ. ౩౯.

దిలాసా. హిం. వి. హెచ్చరిక, ధైర్యము.

దిలీరము సం. వి. అ. న. పుట్టగొడుగు, శిలీంధ్రము✻.

దిల్ల. దే. వి. పిఱికితనము, అధైర్యము. (బ్రా.) విణ. బలహీనము. (చూ. దిల్లవడు.)

దిల్లవడు. ద్వ. అ. క్రి. (దిల్ల+పడు.) బలహీనమగు. "క. ఉల్లము జల్లన దేహము, దిల్లవడఁగ ధృతి దలంక దెప్పర మొందన్." భా. రా. ఆర. ౨, ఆ. ౨౫౬.

దివటి. వి. వై. (సం. దీపయష్టిః.) ఇనుపసలాకకు గుడ్డలు చుట్టి యంటించుదీపము, కరదీపిక. "సీ. దీవటీ దివ్వటి దివటి పంజనఁగను గరదీపికాఖ్యయై పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దివము. సం. వి. అ. న. 1. ఆకసము; 2. పగలు; 3. వనము; 4. స్వర్గము. "చ. దివమునసుండి దేవ తలు దివ్యములైననిజాంశజన్మముల్, భువిఁ గలి గించి..." ఉ. హరి. ౧౦, ఆ. ౩౧౪.

దివసము. సం. వి. అ. పుం. న. 1. పగలు; 2. దినము; అహోరాత్రకాలము.

దివస్పతి. సం. వి. ఇ. పుం. స్వర్గాధిపతి, ఇంద్రుఁడు.

దివా. సం. అవ్య. పగలు. (దీనికిఁ దెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు.)

దివాంధము. సం. వి. అ. పుం. గ్రుడ్డిగూబ,ఉలూకము. విణ. (అ. ఆ. అ.) పగటివేళ గ్రుడ్డియైనది.

దివాకరము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. జిల్లేడు✻; 3. ప్రొద్దుతిరుగుడుపువ్వు.

దివాకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దివాకీర్తి. సం. వి. అ. పుం. 1. మంగలి,నాపితుఁడు; 2. మాలవాఁడు, చండాలుఁడు; 3. గ్రుడ్లగూబ, ఉలూకము. [కా. కి.

దివాటనము. సం. వి. అ. పుం-పగటఁ దిమ్మరుసది-

దివాణము. వై. వి (సం. దేవాయనమ్.) 1. కొలువుకూటము, సభాస్థానము. "ఉ. పాండుఁడు దివాణము న్నెఱయ నించినఁ జేలెడుసుర్మదాంధులక్, బోఁడిమి మాన్చి..." ఆము. ౨, ఆ. ౮౮; 2. రాజభవనము. "చ. చనువులపుట్టినిండ్లు శమసంపదయిక్కలు పుణ్యలక్ష్మికిన్, మొదలిదివాణముల్ ...భూసురోత్తముల భూరిపవిత్ర శరీరవల్లరుల్." పాండు. ౧, ఆ. ౧౦౯. ద్వి. శ. సా. ౧, ఆ. ౩౭. పు.

దివానిశము. సం. వి. అ. న. రేయుంబవలు, అహోరాత్రము. "ఉ...తొయ్యలియుఁ శశియుఁ దివానిశం, బర్యోడ నుండి రిట్లు మదనాహవమోహవశానురక్తులై." శశాం. ౩, ఆ. ౧౧౪.

దివాను. హిం. వి. మంత్రి.

దివాభీతము. సం. వి. అ. పుం. 1. గ్రుడ్లగూబ; 2. కలువకొలను.

దివాభీతుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

దివారాత్రము. సం. వి. అ. న. రేయుంబవలు. అహోరాత్రము. "వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబు తెఱంగు వినియోగించి సూతనందనునకు నారెండు తెఱంగులవారి దివారాత్రప్రవర్తనంబులు గనునట్లును...,వరం బిచ్చి..." భార. భీష్మ ౧, ఆ. ౨.

దివాలా. హిం. వి. (హిం. దివాలా. బెంగాలీ. దేవులియ.) 1. వ్యవహారమందలి నష్టముచే సర్వసంపద పోవుట. (చూ. దివాలాతీయు.); చేసిన యప్పులు చెల్లింపలేనిస్థితి. (బ్రా.)

దివాలాతీయు. దే. అ. క్రి. (దివాలా+తీయు.) వ్యవహారమందలినష్టముచే సర్వధనమును పోఁగొట్టుకొను. (బ్రా. వా.); 2. చేసినయప్పులు తీర్చలేక పోవు. (బ్రా. వా.)

దివి. సం. వి. వ్. స్త్రీ. (ఆంధ్రనామ సంగ్రహమతమునఁ దద్భవము.) 1. స్వర్గము. "గీ. కృష్ణరాయలతో దివి కేఁగలేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు." పెద్దనచాటువు; 2. ఆకాశము. "గీ...నింగి దివి మొగులుదారి గాడ్పుతెంత్రన సభ మొవ్వు..." ఆం. సం. దేవ. ౩౧; 3. దినము, పగలు. ఇ. పుం. పాలపిట్ట.

దివిజుఁడు. సం. వి. అ. పుం. వేల్పు. దేవత.

దివిదారికొమ్ము. ద్వా. వి. రెండిఱ్ఱికొమ్ములు జతగా చేర్చి అఁచి చేసిన ఆయుధవిశేషము, సింగోట. "సీ.జింక కొమ్ములు రెండు చేర్చి యగ్గు లమర్చి డాకేలఁ బూన నొడ్డగనఁ బొడువ,సంగతి గలయది సింగోట యనఁగను దివిదారికొమ్ము నాఁ దేజరిల్లు." ఆం. భా. ద్వి. ౨౦౬.

దివిదాల్కొమ్ము=దివిదారికొమ్ము. "కం. చను సింగోట దివిదాల్కొమ్మన శృంగయుగళికి సమాఖ్యలుగా .." ఆంధ్రపదపారిజాతము. ౫౭.

దివియ. వై. వి. (సం. దీపికా.) దీపము. "చ. నవవికచారవిందరుచి నవ్వెడు కన్నులచాయ చుక్కలఁ, దివియల మాయఁ జేయ నలు దిక్కుల మొక్కులపేర మోడ్చుచు,దవకరకైరవంబుల కతంబునఁ గంటి మురారిభాస్కరున్." ఉ. హరి. ౪, ఆ. ౧౭౦, ఆం. భా. ద్వి. ౧౬౪; 2. కరదీపిక, దివటీ. "క...దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్" సా. ౩, ఆ. ౨౭.

దివియకంబము. వై. వి. (దివియ+కంబము.) దీపస్తంభము. "సీ. సప్తపాతాళనాగేంద్రచంద్రముఖులు, ఫణమణిజ్యోత్స్నచే దివియకంబము లగుదురు." భీమ. ౩, ఆ. ౬౨, విక్ర. ౬, ఆ. ౧౩౮.

దివియకోల. ద్వా. వి. (దివియ+కోల.) దివటీ. "చ. కడుఁ బెనుమంట లైనయుదకంబు తొలంకున వారిబిందువుల్, మిడిసి సమీపభూజములమీఁద వెసం బడి మండుచుండ నెక్కుడురథసంబుతో దివియకోలలకై పడి భంగసంగతిన్, బొడమినఫేనముల్ మెఱసె..." వి. పు. ౭, ఆ. ౧౬౫.

దివియలవాఁడు. ద్వా. వి. (దివియలు+వాఁడు.) దీపము పట్టుకొనువాఁడు. "క...దివియలవారిఁ గొని యపుడు తెగువఁ దలారుల్." సా. ౩, ఆ. ౨౭.

దివివెలయాలు. మి. వి. దేవవేశ్య. "సీ. దివివెలయాలికై దెగునన్నదమ్ములం దగ్గఱగా బ్రోక్కి నట్టిజంత." చం. రా. ౨, ఆ. ౭౪.

దివిషదుఁడు. సం. వి. ద్. పుం. వేల్పు,దేవత.

దివు. దే. అ. క్రి. దిగు, తప్పు. "క...ఘనకీర్తిగ నలరం గలరు ద్రోవ దివ రక్రమతన్." రాఘవ. ౨, ఆ. ౯౯.

దివె. వై. వి. (సం. దీపికా.) దీపము. "ఉ. ఇక్కడఁ గ్రొమ్మెఱుంగుదివె లిక్కడఁ గేతకిగంధవైభవం, బిక్కడ భూరిగర్జితములు..." భర్తృ. ౨, ఆ. ౯౩, ఆం. భా. ద్వి. ౧౬౪.

దివెకంబము. వై. వి. (దివె+కంబము.) దీపస్తంభము. "చ...కుఱంగటఁ బడిగంబుఁ గంచుదివెకంబము గల్గినపట్టెమంచ ముత్యాటరుచి నించ మించురతి ధామము..." శుక. ౪, ఆ. ౨౨, ప్రబంధ. ౬౦౯.

దివెగూఁడు. ద్వ. వి. (దివె+గూఁడు.) దీపముంచు గూఁడు. "సీ. తెల్లజిల్లెడువేఱు పిల్లారిదివెగూఁడు గాజుటద్దము కావుకరవటంబు." బహు. ౫, ఆ. ౧౯౯.

దివెదారికొమ్ము. ద్వ. వి. (దివె+దారి+కొమ్ము.) దాసరులదీపస్తంభము, గరుడగంబము. "సీ. దివెదారికొమ్ము దోల్తిత్తియు జోడమ్ము మెడమీఁది మొగలాకు గొడుగు దనర." ఆము. ౬, ఆ. ౬.

దివెల. వై. వి. (సం. దీపావళిః?) దీపావళ్యమావాస్య. "క. ఎడలేదు దివెల నడుమనె, గడుచున్ మీపురముఁ జేరఁగా లేము..." చెన్న. ౩, ఆ. ౧౬౪.

దివెలపండువ. ద్వ. వి. (దివెల+పండువ.) దీపావళి పండువ. "క. ఓయప్ప నీవు బోవయుఁ, బోయక నాతోడ దివెలపండువ కిటు రమ్మా-" చెన్న. ౩, ఆ. ౧౯౧.

దివోదాసుఁడు. సం. వి. అ. పుం. రిపుంజయుఁ డను మనువంశపురాజు.

దివౌకసము. సం. వి. స్. పుం. 1. పక్షి; 2. వానకోయిల, చాతకము.

దివౌకసుఁడు. సం. వి. స్. పుం. వేల్పు, దేవత.

దివౌకుఁడు = దివౌకసుఁడు.

దివ్య. ఉభ. వై. వి. (సం. దీపికా.) దీపము. (చూ. దివ్వాఱుపుఁబ్రువ్వ.) సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక, ఆమలకి౺; 2. పెద్దజీలకఱ్ఱ౺; 3. కరక, హారీతకి౺.

దివ్యచక్షువు. సం. వి. స్. పుం. 1. కోఁతి, మర్కటము; 2. అలౌకికవస్తుదర్శనసమర్థమైనజ్ఞానము. విణ. (స్). 1. దివ్యదృష్టి గలవాఁడు; 2. గ్రుడ్డివాఁడు, అంధుఁడు; 3. మంచికన్నులు గలవాఁడు.

దివ్యజ్ఞానము. సం. వి. అ. న. అతీంద్రియజ్ఞానము.

దివ్యనది. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ.

దివ్యప్రబంధము. సం. వి. అ. న. వైష్ణవప్రామాణికమగుద్రావిడవేదగ్రంథము. "మ...దివ్య ప్రబంధయుతాస్యల్..." ఆము. ౧, ఆ. ౯౬.

దివ్యము. సం. వి. అ. పు. 1. గుగ్గిలము౺; 2. యవట౺; 3. ఉత్పాతభేదము; 4. లవంగము౺; 5. హరిచందనము౺; 6. తత్త్వనిర్ణయార్థ మొనర్చు పరీక్షారూప దివ్యప్రమాణము. (ఇది. తులాదివ్యము, అగ్నిదివ్యము, జలదివ్యము, విషదివ్యము, కోశదివ్యము, అనిపంచవిధము.); 7. గంగాజలము. (ఇది. ధారాజము, కరకాజము, తౌషారము, హైమము అని చతుర్విధము.) విణ. (అ. ఆ. అ.) 1. స్వర్గమునఁ బుట్టినది; 2. స్వర్గసంబంధమైనది; 3. ఆకసమునఁ బుట్టినది; 4. ఇంపయినది, మనోజ్ఞము; 5. ప్రకాశించునది; 6. లోకాతీతము.

దివ్యవాణి. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశవాణి, అశరీరవాణి. "చ...అని దివ్యవాణి దా, వినిచె ధరాధినాథునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్." భార. ఆది. ౪, ఆ. ౧౦౬.

దివ్యస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతాస్త్రీ; 2. అచ్చర, అప్సరస. మొ.

దివ్వాఱుపుఁబ్రువ్వ. ద్వ. వి. (దివ్య+ఆఱుపు+ప్రువ్వ.) దీపమార్పునొక జాతిపురుగు. "గీ. గువ్వ గ్రద్ద దివ్వాఱుపుఁబ్రువ్వ గూబ యిల్లు సొచ్చిన శాంతి సేయింపవలయు." భార. అను. ౪, ఆ. ౧౧౯.

దివ్యుఁడు. సం. వి. అ. పుం. 1. వేల్పు, దేవత; 2. యముఁడు.

దివ్యోపపాదుకుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

దివ్వటి. వై. వి. (సం. దీపయష్టిః) కరదీపిక, దివటీ. "సీ. నలువంకలను నిండి నవనభోమణికాంతి నెడలేక దివ్వటు లెసకమెసఁగ." ఉ. రా. ౬, ఆ. ౪౪.

దివ్వటీ = దివ్వటి. "సీ. హాటకోన్నతకాంత పాటలద్యుతి మించుదివ్వటీ ల్వేనవేల్ తేజరిల్ల." కృష్ణ. ౪, ఆ. ౧౧౬, విజ. ౩, ఆ. ౧౦౨.

దివ్వటీఁడు. ద్వ. వి. (దివ్వటి+ఈఁడు.) దీపము పట్టుకొనువాఁడు. "ద్వి. జాలవారిని దివ్వటీలను బల్లగోలలవారిని గుడిపూజరులను." బస. ౩, ఆ. ౯౧౦, పం. ౨, ఆ. ౪౬౬. పం.

దివ్విటి = దివ్విటీ. (గ్రా. వా.)

దివ్విటీ. వై. వి. (సం. దీపయష్టిః.) కరదీపిక, దివటీ. "గీ. ఖఱుఁడిపిడి దివ్విటీలు చేఁబట్టి రగులు, కొలుపు

సంతతటిలోన నక్షోటిదివ్విటీలు గూడినమాడ్కిఁ గడించిదిమంట, లాత్మతనుతాప మొనరింప నవని విభుఁడు." చెన్న. ౫, ఆ. ౧౯.

దివ్వియ. వై. వి. (సం. దీపికా.) దీపము. ఆం. భా. ద్వి. ౧౬౪.

దివ్వియకంబము. వై. వి. (దివ్వియ+కంబము.) దీపస్తంభము. "క. అయ్యా యవుఁ గాక యంచును, దియ్యమెసఁగ రాజుఁ జూచి దివ్వియకంబం, బియ్యకొని..." విక్ర. ౬, ఆ. ౪౦.

దివ్వె. వై. వి. (సం. దీపః.) దీపము. "క. నవ్వులు సల్లాపంబులు, నివ్వటిలన్ బంధుమిత్రనివహంబులతో,బువ్వంబులు భుజియించిరి, దివ్వెలు నలుదిక్కులందుఁ దేజము లెసఁగన్." బ్రహ్మో. ౪, ఆ. ౨౧౦. ఆము. ౨, ఆ. ౧౭, విశే. ప్రకాశవంతము. (బ్రౌ.)

దివ్వెకంబము. వై. వి. (దివ్వె+కంబము.) దీపస్తంభము. "గీ. గంట మాకులు గొని దివ్వెకంబ మింత, యొనయఁ గూర్చుండి యాపూర్ణిమేందువదన." శుక. ౪, ఆ. ౩౧, విక్ర. ౬, ఆ. ౩౮.

దివ్వెకోల. ద్వ. వి. (దివ్వె+కోల.) కరదీపిక, దివ్వటీ. "ద్వి. ఆలీల కొఱవిదయ్యంబుల దివ్వెకోలలవారిఁ గాఁ గొని గస్తు దిరిగి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౬౭. పం.

దివ్వెచమురు. ద్వ. వి. (దివ్వె+చమురు.) ఆముదము. "గీ...ఆముదమ్ము దివ్వెచమురనంగ నేరండతైలము దలిర్చు." వేంక. మాన. ౭౨.

దివ్వెటీ. వై. వి. (సం. దీపయష్టిః.) కరదీపిక, దివటీ. "గీ. అదరువ్రేటులరొదల బ్రహ్మాండ మగల,నెందుఁ జూచిన దివ్వెటీ లే వెలుంగ..." దశా. ౭, ఆ. ౧, ఆ. ౨౫౧.

దివ్వెనకోల. దే. వి. కాష్ఠదీపిక. "సీ. జుంజుము దుందురు సురుడు దివ్వెనకోల యనఁ గాష్ఠదీపికాహ్వయము లమరు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దివ్వెల. వై. వి. (సం. దీపావళిః.) దీపావళ్యమావాస్య. "క. మాదాయాదులు బంధువు, లాదివ్వెలకాత్మసుతల నల్లుండ్రను స,మ్మోదమునఁ దోడితెత్తురు..."చెన్న. ౩, ఆ. ౧౬౩.

దివ్వెలపండుగ. ద్వ. వి. (దివ్వెల+పండుగ.) దీపావళి పర్వము. "క. ఒండొరులతోడ దివ్వెలపండుగ యిది వచ్చె నింకఁ బదిదినములకున్, పండుదు రరి సెలుఁ గజ్జపుటుండలు మాయింట ననుచు నొక్కఁడు పలికెన్." చెన్న. ౩, ఆ. ౧౧౫.

దివ్వెలయమాస. వై. వి. (దివ్వెల+అమాస.) దీపావళ్యమావాస్య. "ఉ. మాసరివారు దివ్వెలయమాసకు నల్లర నాఁడుబిడ్డలన్, వాసి యొసంగఁ దోకొనుచు వచ్చుచు నుండిరి..."చెన్న. ౭, ఆ. ౧౪౪.

దివ్వెలెత్తు. ద్వ. అ. క్రి. (దివ్వెలు+ఎత్తు.) దీపములు పెట్టు. "గీ. దినమునను సంజకడ యంచు దివ్వెలెత్తు." శుక. ౨, ఆ. ౫౬౧.

దివ్వెసుడి. ద్వ. వి. (దివ్వె+సుడి.) 1. గోడయందు దీపము పెట్టుగూఁడు. (శ. ర.); 2. దీపము పెట్టుకొనుటకై కొయ్య మొదలగువానితో చేసినసాధనము. (బ్రౌ.)

దిశ. సం. వి. ఆ. స్త్రీ. దిక్కు, కడ.

దిశత్. సం. శత్రు. 1. ఇచ్చుచున్న; 2. ఉపదేశించుచున్న; 3. ఆజ్ఞాపించుచున్న; 4 నిర్దేశించుచున్న.

దిశ్యమానము, సం. విశే. (అ. ఆ ఆ.) 1. ఇయ్యఁబడుచున్నది; 2. నిర్దేశింపఁబడుచున్నది; 3. ఆజ్ఞాపింపఁబడుచున్నది; 4. ఉపదేశింపఁబడుచున్నది.

దిశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. దిక్కునందున్నది; 2. దిక్కునందుఁ బుట్టినది.

దిష్టము. సం. వి. అ. న. 1. భాగ్యము; 2. ఆదేశము, ఆజ్ఞ; 3. నిర్దేశము. పుం. 1. కాలము, సమయము; 2. మ్రానిపసుపు. విశే. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁబడినది; 2. ఆజ్ఞాపింపఁబడినది; 3. నిర్దేశింపఁబడినది; 4. ఉపదేశింపఁబడినది; చెప్పఁబడినది.

దిష్టాంతము. సం. వి. అ. పుం. 1. మరణము, చావు; 2. భాగ్యనాశనము.

దిసంతడుచు. దే. స. క్రి. (దిసంతు+అడుచు.) నిందించు. "మ. అదిగో తల్లిఁ గడుం దిసంతడిచి యూ రాద్యంతముల్ ప్రైపయిన్, వెదకన్ బల్వురఁ బంచి..."పరమ. ౩, ఆ. ౨౭౧ నీలిసీ. ౮౭. (ఇట్లే: దిసంతులడుచు.)

దిసంతు. దే. వి. నింద, అపవాదము. "సీ...దిసంతు నడి శోయి రోఁత...అపవాదసంజ్ఞలై యలరుచుండు." ఆం. భా. ప్ర. ౧౧౫.

దిసంతుకొట్టు. దే. స. క్రి. (దిసంతు+కొట్టు.) నిందించు, దూఱు. "ఉ. పట్టఁగ లేమి కొండొరులఁ

బల్మేఱుఁ జాల దిసంతుకొట్టుచున్." కళా. ౬, ఆ. ౧౦౬.

దిసమొల. ద్వ. వి. (దిస+మొల.) వస్త్రవిహీనమైన మొల. (చూ. దిసమొలవాఁడు.) విణ. దిగంబరుఁడు, నగ్నుఁడు. "వ. రుద్రా నీవు భద్రదేవద్రుమాటవీవాటియందు దిసమొలదూఁబఱ దిండిమిండలజంగంబవై..."భీమ. 3, ఆ. ౨౧౦. ఆం. భా. తృ. ౧౨.

దిసమొలవాఁడు. ద్వ. విణ. (దిసమొల+వాఁడు.) దిగంబరుఁడు, వస్త్రహీనమైనమొల గలవాఁడు. (శ. ర.)

దిసమొలవేల్పు. ద్వ. వి. (దిసమొల+వేల్పు.) 1. శివుఁడు; 2. కాలభైరవుఁడు. "చ. దిసమొల వేల్పు సాహిణపుఁదేజులు పోషక గేహరక్షకుల్." కవిరా. ౨, ఆ. ౮౨. (శ. ర. పా. 'దసమొల వేల్పు.' ముద్రి. పా.)

దిసించు. దే. అ. క్రి. కనఁబడు, గోచరించు. "చ. మునుమును పెందు లేనిప్రియముల్ సవరించి యొకింత లోఁగినన్ వెనుక దిసించి చూడ రవనిన్ మగవారల నమ్మరాదు..."సావి. ౧, ఆ. ౮౫. సా. ౨, ఆ. 3౮. స. క్రి. మీఱు, అతిశయించు. "గీ. కులుకుఁజెక్కులు పసిఁడియాకుల దిసింపద జిన్నికుచములు పోఁకలచెన్ను మీఱ." ముకుంద. ౧, ఆ. ౭౯, పు.

దిసె. వై. వి. (సం. దిశా.) దిక్కు, కడ. "ఆ. పాంచజన్యరవముఁ బండమహాశబ్దరవముఁ జెలఁగె దిసెలు సెవులుపడఁగ." భార. అర. ౧, ఆ. ౧౮౦? (ఈ పాఠము విచార్యము.)

దిస్టి. వై. వి. (సం. దృష్టిః. క. దిష్టి.) 1. "సీ. చూడ్కి, పారువ దిస్టి చూ పన వీక్షణము లొప్పు..."సాం. ని. మాన. ౧౫; 2. కీఁడు దృష్టిదోషము. (బ్రా. వా.) (వ్యవ:-) పిల్లవానికి దిష్టి తగిలినది.

దిస్టికొట్టు. ద్వ. వి. (దిస్టి+కొట్టు.) దృష్టిదోషము కలుగఁజేయు. (వ్యవ:) అందఱు వచ్చి పిల్లవానికి దిస్టికొట్టినారు.

దిస్టితీయు. ద్వ. అ. క్రి. (దిస్టి+తీయు.) దృష్టి దోషముపోవుటకై మిరెపకాయలు మొదలగునవి దిగఁదుడుచు. (వ్యవ:) పెందలకడ దిస్టితీసి పోసిన బాధ తగ్గును.

దిస్టిపిడుత. ద్వ. వి. (దిస్టి+పిడుత.) దృష్టిదోషము తగులకుండుటకై సున్నపుబొట్లు పెట్టి సస్యాదుల యొద్ద నుంచుపిడుత. (వ్యవ:) ఆపాదుదగ్గఱ దిస్టి పిడుత తగిలించుము.

దిస్టిబొమ్మ. ద్వ. వి. (దిస్టి+బొమ్మ.) సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకై మనుష్యరూపముగ చేసి యుంచుబొమ్మ. (వ్యవ:) ఆపొలములో దిస్టిబొమ్మ యున్నది.

దిస = దిస్స.

దిస్స. వై. వి. (సం. దిశా.) దిక్కు. (గీనికివ్యత్యస్తముగా ప్రయోగములేదు. చూ. దిస్సమొల.)

దిస్సమొల. ద్వ. వి. (దిస్స+మొల.) వస్త్రహీనమైన మొల, దసమొల (చూ. దిస్సమొలవేల్పు.)

దిస్సమొలవేల్పు. ద్వ. విణ. (దిస్సమొల+వేల్పు.) వస్త్రవిహీనమైనమొల గలదేవుఁడు. "గీ. వీటిపెద్ద తలారి నిస్సాటికలికి, దిస్సమొలవేల్పు పార్వతీదేవి పట్టిఁ, గాలభైరవుఁ గుర్కురగణపరివృఢుు, ననుచరించిరి ముచులు నాకౌకసులును." కాశీ. ౨, ఆ. 3౮. రామా. ౨, ఆ. ౨౧.

దిస్సు. దే. వి. 1. నవ్వుటయందగుధ్వని కనుకరణము. "సీ. పయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు, దిస్సువాఱఁగ నవ్వుఁ దీఁగెనవ్వు." క్రీడా. ౬౮; 2. పాము బుసకొట్టుటయందగుధ్వని కనుకరణము. "గీ. ఉగ్రతిమి శిరోరంధ్రనిష్ఠ్యూత మగుచు, సెగయుసలిలౌఘ మది యెందు మిగుల నొప్పు, నబ్ధిపేరిటి కుండలితాంగభోగి, దిస్సుననఁ దనపడగ యెత్తెనో యనంగ." కళా. ౪, ఆ. ౧౯౫. (శ. ర. పా.)

దిహాత్. సం. శత్రు. పూయుచున్న.

దిహ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడుచున్నది.

## దీ

దీ. దే. అవ్య. పందెకాండ్రు పొట్టేళ్లను పోట్లాటకై ప్రేరించుమాట. "చ...బగ్గునఁ దాఁకెడుఁ జూడు సెట్టి టిట్టిభ దిదిదీ యనంగను గడిందినదభ్రము లీయురభ్రముల్." క్రీడా. ౨౨౮.

దీకు. దే. వి. 1. ప్రేరణ, పురికొల్పుట. "క. ఏ నపుడు ధర్మపాశాధీనుఁడనై కోపమునకు దీకొనరింపం, గా నేరకున్న మెయిమెయిఁ, బోనయ్యెం గాక యింకఁ బొమ్మా యిచటన్." భార. విరా.

౫, ఆ. ౯౧; 2. భ్రమ, భ్రాంతి. "ఉ. లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి ప్రాణులన్, దీకలఁ బెట్టి యెల్లెడల దీవులు సూపెడివిష్ణుమాయ నేఁ,డేకమతిం ధరించితి..." భాగ. ౬, స్కం. ౪౨౧.

దీకొను. దే. అ. క్రి. (ది+కొను.) ఉత్సహించు; సిద్ధపడు "క. దాకొని ఖడ్గాఖడ్గి నొ,కాకకచాకచినొ బాణకౌశలముననో, నీ కెద్ది యిష్ట మనికిన్, దీకొనుమా యొకట మెచ్చితిమి నృపతనయా" రామా. ౫, ఆ. ౧౪౯. భాగ. ౬, స్కం. ౪౦౦. స. క్రి. అంగీకరించు. "ఉ. ఈకొఱగాని కార్యమిటు లెవ్వఁడొకో యనుకూలశత్రుఁడై, నీకుఁ బ్రియంబుగాఁ బలికె...దీకొనునె కాదన కీదృశమెవ్వఁడేనియున్." భా. రా. అర. ౨, ఆ ౧౪. అ. క్రి. స. క్రి. 1. (పాట్లెల్ల పోరిలోనొండొంటిని) దాఁకు. "గీ. తిరుగఁబడి కురుమతగరుల్ దీకొనుగతి." ప్రబంధ. ౮౬; 2. ఎదిరించు, మాఱ్కొను. "ఉ. తెంపెసలారఁగా మనల దీకొని యున్నది యొక్క లేమ..." కాశీ.౬, ఆ. ౨౩౩. రామా. ౭, ఆ. ౧౪౫.

దీకొలుపు. దే. స. క్రి. (దీకొను ధా. ప్రే.) 1. పురికొలుపు. "క. నగుఁ డన్నపాటు గనుఁగొని, దిగిభనిభద్విపము నలుక దీకొలుపుచు బెట్టగుశక్తి వైవ..." జై. ౬, ఆ. ౧౪౨; 2. ఎదుర్కొనఁజేయు." "క...వారణతిలకంబు నెక్కి వడి బుషభుని పై, ఘోరగతిఁ గాలసంప్రేఁడు, ధీరాటోపంబుతోడ దీకొలుపుటయున్." భా. రా. యు. ౬౮౩. వరాహ. ౩, ఆ. ౫౪.

దీకోలు. దే. వి. (దీకొను ధా.) డీకొనుట. (శ. ర.)

దీక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞాదికర్మలయందు అవలంబించునియమము; 2. పట్టుదల; 3. మంత్రోపదేశము; 4. ఉపనయనసంస్కారము.

దీక్షణము. సం. వి. అ. న. 1. దీక్ష; 2 దీక్షపూనుట.

దీక్షించు. సం. అ. క్రి. దీక్షపూను. "క. వేయేఁడుల వ్రతమునకై, ధీయోగము సిద్ధి నొంద దీక్షించి మనఁగ, కాయవచోనియమము నిరపాయంబుగఁ దొడఁగి రురుతపస్సాధనమున్." హరి. ఉ. ౧౦, ఆ. ౧౭౮. హరి. ఉ. ౬, ఆ. ౨౦.

దీక్షితాయని. సం. వి ఈ. స్త్రీ. దీక్షితునిభార్య.

దీక్షితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. యజ్ఞాదికర్మలయందు దీక్ష వహించినవాఁడు; 2. తలఁచినకార్యము నిర్వహించుటకై పట్టుదలఁ దాల్చినవాఁడు; 3. పట్టాభిషిక్తుఁడు; 4. హవిర్యాగము మున్నగు శ్రౌతకర్మల నాచరించినవాఁడు.

దీక్షిష్యమాణుఁడు. సం. విశే. (అ. ఆ. అ) దీక్ష పొందనై యున్నవాఁడు. "గీ. ఈవు దీక్షిష్యమాణుఁడ విద్ధమహిమ." కాశీ. ౭, ఆ. ౫౭.

దీటు. దే. స. క్రి. 1. సరిచేయు, చక్కఁబఱచు. "చ. తిలకము దీర్చుచున్ గురులు దీటుచు... అద్దముఁ జూచె నొకర్తు వేడుకన్." నృసిం. ౨, ఆ. ౮౬. హంస. ౧, ఆ. ౨౧౭; 2. ఆకర్షించు, లాగు. "మ. అతిశీఘ్రంబుగ శార్ఙ్గమెక్కిడి గుణంబాఖీలతం దీటుచున్." ఉ. రా. ౨, ఆ. ౫౬; 3. (దంతములు మొ.) కొఱుకు. "మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీభాగంబు కంపింపఁగా, రదముల్ దీటుచుఁ గత్తిరించినచెవుల్ గ్రాజిల్ల..." భాగ. ౧౦, స్కం. పూ. ౬౧౭. భా. రా. యు. ౩౨౬; 3. ఊఁపు, చలింపఁజేయు. "పంచచామరము.ఛటచ్ఛటాతరంగపంక్తి సారెఁ బేటిదీటఁగా" ఉ. హరిశ్చ. ౨, ఆ. ౧౨౮. వి. విధము, రీతి. "ఆ. పొన్నపువ్వుదీటు పోల్చులోకులమాట, నోటుచేసి వేల్పుబోటినాభి, విస్తరిల్లె..." రసిక. ౬, ఆ. ౧౦౦. విశే. సాటి, సమానము. "ఉ...నీ,కేసురలైన దీటగుదురే..." ఉ. రా. ౨, ఆ. ౧౯౨. బిల్హ. ౧, ఆ. ౧౦౪. క్రి. విశే. తిన్నఁగా, సూటిగా. "క...దిటమింతయు విడక యతఁడు దీటుగఁ గదుముం,దటికిఁ జని..." నీలా. ౩, ఆ. ౬౪.

దీటుకట్టు. దే. అ. క్రి. (దీటు+కట్టు.) నిండు. "వ... దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబునం దీటుకట్టె..." నైష. ౬, ఆ. ౭౯.

దీటుకొను. దే. అ. క్రి. (దీటు+కొను.) 1. నిండు. "గీ. అంతకంతకుఁ గదిసి సైన్యములు సుట్టు,ముట్టి శస్త్రాస్త్రసంచయమున నభంబు, దీటుకొనునట్లు సేయ..." భార. విరా. ౫, ఆ. ౩౪; 2. వ్యాపించు. "మ...అస్త్రశస్త్రచయశుంభద్దీప్తిజాలంబు సర్వదిశాభాగములందు దీటుకొన..." దశ. ౨, ఆ. ౯౭. భార. కర్ణ. ౩, ఆ. ౩౨౨; జనించు, కలుగు. "క...విధి,త్రిప్పుల కచ్చెరువు పాటు దీటు

కొనంగన్." దశ. ౨, ఆ. ౯౭. స్వా. ౫, ఆ. ౭౧; అతిశయించు. "మ...కని రోషస్ఫురణంబు దీటుకొన హుంకారంబు గావింప..." జై. ౫, ఆ. ౦౬; 5. ఒప్పు. "ద్వి. ద్విగుణార్థభావముల్ దీటు కొనంగc, దేటతెలుంగున ద్విపద రచింతు." పం డితా. దీక్షా. ౧౭, పుట. స. క్రి. సరిచేసికొను. "వ. అప్పు డప్పుతంగపుంగవుండు . మించి చం చూపుటంబు దీటుకొని దాటుని శతకోటిపఖనఖ ముఖతోటిం బరిపాటిం దదంగంబుc భంగంబుc గావించి..." రామా. ౫, ఆ. ౧౯౯.

దీటుకొలుపు. దే. స. క్రి. (దీటు+కొను ధా.) 1. కలి గించు, పుట్టించు. "వ...హాసకుసుమంబులు సాంద్ర తరచంద్రికాకందంబులం దీటుకొలుప..." ఆము. ౪, ఆ. ౭౫; 2. నిందc జేయు. "గీ. దేవదుందుభు లుడువీథి దీటుకొలుప, నమరు లాదంప పుష్పవర్ష ములు కురియ, దత్తు వాటంబు జొచ్చెc గొత్రమత నూజ." భీమ. ౪, ఆ. ౧౯౩. నృసిం. ౧, ఆ. ౭౫, 3. ప్రయోగించు. "సీ...సచరాచరం బైన జగము లెల్ల. గీ. నొక్క మొగమై కడంగినc జిక్కు వఱచు, దివ్యబాణజాలంబుల దీటుకొలిపి." భార. ఉద్యో. ౪, ఆ. ౨౪౯. భా. రా. యు. ౧౭౭౧.

దీటుకొల్పు = దీటుకొలుపు. (అతిశయింపc జేయు.) "శా. స్నిగ్ధాష్టాపదకుంభదీప్తిరవి నాశ్లేషింప శుభ్రాంబుద, ప్రస్థావళ్యముc గేలిc బెట్టు శిఖర ప్రాంశుచ్ఛటాశోభలన్, దుగ్ధాంభోనిధి దీటు కొల్పcగ సుధాంశోనాఘశోచండనవ్యగ్రామాశ్ర యతోరణద్యుతులు నేత్రానందముం జూపcగన్." ఉద్భ. 3, ఆ. ౪.

దీటుపడు. ద్వ. అ. క్రి. (దీటు+పడు.) పోలు, సమాన మగు. (చూ. దీటుపఱచు.)

దీటుపఱచు. ద్వ. స. క్రి. (దీటుపడు ధా. ప్రే.) పోల్చు, ఉపమించు. "సీ...వాణి నీమెతు దీటు పఱుప వచ్చు." పరతత్త్వ. ౧, ఆ. ౩౨.

దీటువచ్చు. దే. అ. క్రి. (దీటు+వచ్చు.) సాటియగు, సమమగు, "సీ. లచ్చికోడలికన్నులకు దీటువచ్చునీ లోత్పలశరపంక్తు లొనరc దాల్చి." ఉ. రా. ౪, ఆ. ౧౫౬. ముకుంద. ౭, ఆ. ౭౭. స. క్రి. పోలు. "చ...వనజదళాక్షుc దత్తనయుం వాని విరోధిని వానిమిత్రుc ద్రౌణినయుగు దీటువచ్చు మఱి యెంతయు సాటగుc జూడ జోడగున్." రామ. ౧౯౬.

దీదివి. సం. వి. ఇ. పుం. స్త్రీ. న. అన్నము. పుం. 1. బృహస్పతి; 2. భవిష్యము; 3. స్వర్గము; 4. అగ్ని.

దీధితి. సం. వి. ఇ. స్త్రీ. 1. కిరణము; 2. కాంతి; 3. వ్రేలు, అంగుళి.

దీన. సం. వి. ఆ. స్త్రీ. ఆడెలుక, మూషిక.

దీనము. సం. వి. అ. పుం. న. 1. సురపొన్న చె; 2. మొగలి చె; 3. నందివర్ధనముచె.

దీనారము. సం. వి. అ. పుం. 1. ఒకజాతిబంగారు నాణెము; 2. బంగారునగ.

దీను. దే. వి. ఒప్పిదము, మనోజ్ఞత. (చూ. దీనుమిగులు.)

దీనుమిగులు. దే. అ. క్రి. ఒప్పు. "గీ. కాన నదియ శరణ్యమై దీనుమిగులు, నైహికాముష్మికాకాంక్షు లగునరులకు." పాండు. ౩, ఆ. ౧౩౨. ౨, ఆ. ౧౪౪.

దీనుడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బీద, దరిద్రుడు; 2. దుఃఖితుడు; 3. భయపడినవాడు; 4. జాలి గొలుపువాడు, శోచనీయుడు; 5. దర్ప ముడి గినవాడు.

దీపకము. సం. వి. అ. పుం. 1. దీపము; 2. డేగ; 3. వేటకాడు పక్షిమృగాదులను బట్టుటకై పెంచినపక్షిమృగము లోనగునది, డేగ; 4. మయూరశిఖి, నెమ్మిజుట్టుచెట్టు. న. 1. రాగ భేదము. (సంగీ); 2. అలంకారభేదము. (అలం.) విణ (అ. పికా. అ.) 1. ప్రకాశింపc జేయునది; 2. రగులుకొలుపునది; 3. విశదపఱచునది, వివ రించునది; 4. జఠరాగ్నిని వర్ధిల్లc జేయునది, దీపన కారి; 5. దీపము కలిగించుటయందు నేర్పరి.

దీపకంబము. మి. వి. (దీపము+కంబము.) దీపస్తంభము. "ద్వి. అపరంజ్యోతిస్స్వరూపంబునకును, దీపకం బంబు లెత్తించినయట్లు." బస. ౧, ఆ. ౬, పు. పండితా. పర్వ. ౩౫౧, పు.

దీపనము. సం. వి. అ. న. 1. ప్రకాశింపc జేయుట; 2. రగులుకొలుపుట; 3. జఠరాగ్నిని వృద్ధిచేయుట; 4. కుంకుమము. పుం. 1. మయూరశిఖిచె; 2. కసిందిచె; 3. నీరుల్లిచె; 4. మెంతికూరచె; 5. డేగము; 6. చిఱుబొద్దిచె. విణ. (అ. ఈ. అ.) 1. రగులుకొలుపునది; 2. జఠరాగ్నిని వర్ధిల్లc జేయునది; 3. ప్రేరేచునది, ఉద్దీపకము.

దీపము. సం. అ. పుం. 1. దివ్వె, దీపిక. "క. నీపుణ్య తనువువలనన, యీపుత్త్రకుఁడుద్భవిల్లి యెంతయు నొప్పున్, దీపంబువలన నొండొక, దీపము ప్రభ వించినట్లు తేజం బెసఁగన్." భార. ఆది. ౪, ఆ. ౯౦. హంస. 3, ఆ. ౧౦౮; 2 మయూరశిఖి.

దీపవృక్షము. సం. వి. అ. పుం. వృక్షాకారముగా నుండుదీపస్తంభము. "ద్వి. శ్రీపర్వతునకు చెచ్చెర నివాళింప, దీపవృక్షంబు లేతెంచుభావమున..." పండితా. పర్వ. 3౬౨, పు.

దీపశత్రువు. సం. వి. ఉ. పుం. మిడుత, శలభము.

దీపశిఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. దీపపుకొన; 2. కాటుక, కజ్జలము.

దీపారాధనము. సం. వి. అ. న. దీపము వెలిఁగించి భగవంతుని సేవించుట.

దీపావళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఆశ్వయుజమాసమునందలి యమావాస్యపండుగ; 2. దీపములపంక్తి.

దీపి. సం. విణ. (న్. నీ. న్.) 1. రగుల్చునది; 2. ప్రకాశించునది; 3. దీపనకారి.

దీపించు. సం. అ. క్రి. 1. అతిశయించు, హెచ్చు. "గీ...అవ్విధంబకలకలంబు, చాల దీపించె పోయింటి ప్రాలవేళ." కాళింది. ౫, ఆ. ౧౭౪. భాగ. 3, స్కం. ౧౧౪; 2. ఒప్పు. "క. అమువ్వురిలో రంగసుధీమణి దీపించె వంశతిలకం బగుచున్." పాండు. ౧, ఆ. 3౬; 3. ప్రకాశించు; మెఱయు. "సీ. నాసీరమై వచ్చునలినబాంధవుటుక్కుయంబు పై దీపించునద్ద మనఁగ. గీ...వేగుఁజుక్క వాడిచె." స్వా. 3, ఆ. ౫౪. భార. శాం. ౪, ఆ. ౭౫; 4. (ప్రసిద్ధమై) ఉండు. "గీ. బ్రహ్మతీర్థంబునకు దండపాణియాశఁ, గులశిఖరిపుత్త్రి దీపించుఁ గలశతీర్థ, మేనుబారల నిడుపున దీపుమిగిలి,యదియ యమృతామహాదేవి కాస్పదంబు." పాండు. ౨, ఆ. ౧౪౪. స. క్రి. (కాంతి) కలుగఁజేయు. "ద్వి. దిక్కుల కెల్లను దెలివి దీపించు, చుక్కల గమికాడు చూపట్టె మింట." రం రా. సుం. ౨౪౩, పు. ౧౪, పం.

దీపిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దీపము,దివ్వె; 2. చిన్న దీపము; 3. దీపమువలె నీతి మున్నగువానిని విశదపఱచుగ్రంథము. ఉదా:-నీతిదీపిక. మొ.

దీపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రగుల్పఁబడినది; 2. కాల్పఁబడినది; 3. ప్రకటింపఁబడినది; 4. ప్రకాశింపఁజేయఁబడినది: 5. ప్రేరేపఁబడినది. "క. ఆపార్థుఁడు గోపానల దీపితుఁడై..." భార. ద్రో. ౧. ఆ. ౨౫3.

దీపిలు. సం. అ. క్రి. ప్రకాశించు. "శా. పైపై దీపిలు నాతపంబు లనుసోపానంబులే ప్రాపుగా. భూపాత్తంసము మేనితోడ దివికిన్ బో..." గాథే. ౪, ఆ. ౭౮. పు.

దీపురము. వై. విణ. (సం. దీప్రమ్.) ప్రకాశించునది. "క. అపురమున నొకఁ డుండును,గాఁ పురముగ బలిజసెట్టిగణదాసుఁ డనన్, దీపురము గాఁగ నయ్యలకాపురమున ధనదుఁ డుండుగతిఁ గడు వేడ్కన్." హంస. ౫, ఆ. ౯3.

దీప్తము. సం. వి. అ. న. 1. ఇంగువ; 2. బంగారు. పుం. 1. సింహము; 2. నిమ్మ. విణ. (అ.ఆ.అ.) 1. ప్రకాశించినది; 2. కాలినది; 3. మండినది; 4. వెలరేఁగినది.

దీప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రకాశము,వెలుఁగు; 2. బయలుపడుట, అభివ్యక్తి; 3. లక్క; 4. కంచు; 5. (దేహాదుల) కాంతి.

దీప్యము. సం. వి. అ. న. 1. ఓమము; 2. జీలకఱ్ఱ; 3. రుద్రజట. విణ. (అ. ఆ. అ.) 1. దీపమున కనుకూలమైనది; 2. జఠరాగ్నిదీపనమున కనుకూలించునది.

దీప్రము. సం. వి. అ. పుం. అగ్ని. విణ. (అ. ఆ.అ.) 1. ప్రకాశించునది; 2. మండునది.

దీమము. వై. వి. (సం. దీపకః.) 1. పక్షిమృగాదులను వశపఱచుకొనుటకై వేఁటకాఁ డుంచుపక్షిమృగాదికము. "క. బలవద్రిపులు ప్రయోజనములకై లోఁబడుట గల్గుఁ బోలముల నేనుంగులు దీమంబులకజ్జఁ దగిలి చెట్టన పట్టువడినక్రియఁ జతురమతీ." భార. శాం. 3, ఆ. ౨౫౯, భా. రా. బాల. ౮3; 2. బోనులో ఎరగా నుంచు పదార్థము. "గీ. మగల నెలయించుమరునిదీమంబు లనఁగ." రుక్మా ౧, ఆ. ౭౧, విక్ర. ౧, ఆ. ౭౯; 3. ఎర యుంచినబోను. "సీ. ఒకమరి దీమంబు లొడ్డి పాదులు దీర్చి ఖగమృగవిహంగంబులఁ బట్టి తెచ్చి." కాళ. 3, ఆ. ౪౭, ద్వా. ౮, ఆ. ౨౨; 4. (సం. ధామ.) గృహము. "సీ. భాసిల్లు గృహసంజ్ఞ దీము దీమం బిల్లు గీ మనంగ." ఆం. భా. ద్వి. ౧3.

దీమసము. దే. వి. 1. ధైర్యము. "గీ. ఎట్టిలా వెట్టి దీమస మెట్టితెగువ...." హరి ఉ. ౩, ఆ. ౯౭. ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౪, పం.; 2. ఉపాయము. "ఉ...అందుఁ జో,నొల్ల ననంగరా దచటి కూరక పోవఁ రాదు సేన్పు సం,ధిల్లఁగ దీనిఁ బాపికొను దీమస మెట్టిదియొక్కొ దైవమా." భార. విరా. ౨, ఆ. ౯౧, పాండు. ౩, ఆ. ౧౩౮.

దీము. వై. వి. (సం. దీపకః.) 1. పశుపక్ష్యాదులను వశపఱచుకొనుటకై వేఁటకాఁ డేర్పఱచుపశు పక్ష్యాదికము. "మ. తరుణు ల్లల్లియొఱఁ గుచంబు లుచుపం దచ్చైభత్యము ల్దీములై, పెరరేఁపం జను బెంచెఁ గాక రవిదీప్తిం గ్రుంకి పాతాళగ,హ్వర ముం దూఱినవాని నీయదుకుఁద్రాళ్లా తెచ్చు నా దీర్ఘత,చ్చిరకృష్టిం గనుసట్టిశైత్య మలరించెన్ నూతులం దత్తఱిన్." ఆము. ౨, ఆ. ౬౬. స్వా. ౪, ఆ. ౨౫; 2. బోనులో ఎరగా నుంచుపదార్థము. "గీ....ఎట్టివారినై న,నొరుల నొకవ్రేలి మిడి దిరుల్ మరులుగొలిపి, దివియ మే దేవి నీ యట్టిదీము గలుగ." కు. సం. ౬, ఆ. ౧౭. నైష. ౩, ఆ. ౯౨; 3. మత్స్యగ్రహణసాధన విశేషము. "గీ...చల్లు డూఁదు,లుంటగాలంబు తెర దీము లుసురుగాలు,ము..." హంస. ౪, ఆ. ౧౮౪. (సం. ధామ.) 1. గృహము. ఆం. భా. ద్వి. ౧౩; 2. స్థానము, నెలవు "ఉ. తామరతూడు పట్టుకొని ధాత యధోముఖుఁడై చనం జనన్, సోమరిపాటు ఖీలియుంను జూచెనె కాని సరోజ మూల మిూ,దిమున నున్న దంచుఁ గను తేఁకువ జాలక నాళ మూఁతగాఁ,దా మొదలింటియట్ల నిజధామసరోజముఁ జేరెఁ జింతతోన్." శ్రీరం. మా. ౩, ఆ. ౧౩౦.

దీముకొను. దే. అ. క్రి. (దీము+కొను.) నెలవుకొను (చూ. దీముకొల్పు.)

దీముకొల్పు. దే. స. క్రి. (దీముకొను ధా. ప్రే.) నెల కొల్పు. "సీ. శాత్రవోత్కరజయోత్సాహసాహస మున భీమార్జునులపోల్కి దీముకొల్పి." రంగా. ౧, ఆ. ౩౧.

దీర్ఘ. సం. వి. ఆ. స్త్రీ. రోలపొన్న, పృశ్నిపర్ణి♣.

దీర్ఘగతి. సం. వి. ఇ. పుం. లొట్టియ,ఉష్ట్రము.

దీర్ఘగ్రీవము. సం. వి. అ. పుం. 1. లొట్టియ,ఉష్ట్రము; 2. ఒకజాతికొంగ.

దీర్ఘచ్ఛదము. సం. వి. అ. పుం. చెఱకు♣.

దీర్ఘజంఘము. సం. వి. అ. పుం. 1. లొట్టియ,ఉష్ట్రము. 2. కొంగ,బకము.

దీర్ఘజిహ్వము. సం. వి అ. పుం. పాము,సర్పము.

దీర్ఘదర్శి. సం. వి. న్. పుం. 1. పండితుఁడు; 2. గ్రద్ద; 3. ఎలుఁగుబంటి. విశే. (న్. నీ. న్.) 1. దూరాలోచన గలవాఁడు; 2. రాఁగలకార్యముల నెఱింగినవాఁడు; 3. దూరము న్దున్నదానిని చూచునది.

దీర్ఘదేహి. సం. వి ఈ. స్త్రీ. పందికొక్కు, మూషిక.

దీర్ఘనాదము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. కోడి; 3. శంఖము; 4. ఘంట. విశే. (అ. ఆ. అ.) 1. దూరముగా వ్యాపించుధ్వని కలది; 2. చాలకాల ముండుధ్వని కలది.

దీర్ఘనిద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. చాలకాలము పోవు నిద్ర; 2. చావు, పెద్దనిద్దుర.

దీర్ఘపత్త్రము. సం. వి. అ. పుం. 1. పెద్దనీరుల్లి♣; 2. ఒకరకముదర్భ♣; 3. తాడిచెట్టు; 4. తెల్లగలిజేరు♣; 5. నల్లతుమికి♣; 6. ఇక్షువిశేషము♣.

దీర్ఘపర్వము. సం. వి. న్. పుం. చెఱకు♣.

దీర్ఘపాదపము. సం. వి. అ. పుం. 1. పోఁక♣; 2. తాటిచెట్టు; 3. కొబ్బెర♣.

దీర్ఘపాదము. సం. వి. అ. పుం. రాపులుఁగు.

దీర్ఘపృష్ఠము. సం. వి. అ. పుం. సర్పము,పాము. విశే. (అ. ఆ. అ.) నిడు పైనవీఁపు గలది.

దీర్ఘము. సం. వి. అ. పుం. 1. ఒంటె ,ఉష్ట్రము; 2. ఒకరకము ఱెల్లు♣. విశే. (అ. ఆ. అ.) 1. దూరమైనది. (ఉదా: దీర్ఘదర్శి. మొ.); 2. నిడుదయైనది; 3. ఎత్తైనది; రెండుమాత్రలకాల ముచ్చరింపఁదగినయచ్చు.(ఆ. ఈ. మొ.వ్యతి.హ్రస్వము.)

దీర్ఘమూల. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁగతుమడి♣; 2. తీఁటకసింద♣; 3. శ్రేంకణము♣.

దీర్ఘమూలము. సం. వి. అ. పుం. 1. ఒకజాతి మారేడు♣; 2. చాఁగ♣; 3. వట్టివేరు♣.

దీర్ఘవక్త్రము. సం. వి. అ. పుం. ఏనుఁగు. విశే. (అ ఆ. అ.) నిడుదయైనముఖము కలది. [పాఁకుర♣.

దీర్ఘవల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. లక్క; 2. పెద్ద

దీర్ఘవృంతము. సం. వి. అ. పుం. దుండిగము♣.

దీర్ఘసూత్రుఁడు. సం. వి. అ. పుం. తలఁచినపని చిరకాలమునకుఁ గాని చేయనివాఁడు,చిరక్రియుఁడు,

దీర్ఘిక. సం. వి. ఆ. స్త్రీ. నడబావి, డిగ్గియ.

దీర్ణము. సం. వి. అ. న. 1. భయము; 2. చీలిక, విదారము. విశే. (అ. ఆ. అ.) 1. భయపడినది; 2. చీల్చఁబడినది.

[(చూ. దీలపోవు.)

దీల. దే. వి. (దీలు. ధా.) బలహీనమగుట, డిల్లపడుట.

దీలపోవు. దే. అ. క్రి. (దీల+పోవు.) డిల్లపడు, బలహీనమగు. "మ. త్తకోకిల...వాతఘాతదవానల, జ్వాలరుక్ వనరాశివేల కసంఖ్యయాదవసేనకున్, దీలపోవక చక్కసయ్యెడుధీరు లెవ్వరు పోరి లోన్." భార. ఆది. ౮, ఆ. ౨౦౫.

దీలు. దే. అ. క్రి. 1. డిల్లపడు, బలహీనమగు. "సీ. అతివ మిక్కిలి దీలె నాలసింపఁగ నేల చల్లఁగాఁ బన్నీరు చల్లరమ్మ." య. ౫, ఆ. ౧౧౫. (శ. ర. పా. 'తూలె.' ముద్రి.) 2. ఊడిపడు, ఊడు. "మ.... కం, జెదరెన్ సైన్యము వ్రాలె బాహువులు డ్రెస్సె న్నాంసముల్ రాలె నం, గదముల్ దీలెఁ గిరీటముల్..." కువల. ౨, ఆ. ౧౪౬. విశే. బలహీనము. (శ. ర.)

దీలుపడు. ద్వ. అ. క్రి. (దీలు+పడు.) బలహీనమగు; కృశించు. "ఉ...అనికి న్బలసూదనుఁ డెత్తివచ్చి నన్, దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్." పారి. ౧, ఆ. ౧౩౫. భీమ. ౪, ఆ. ౧౦౯.

దీలుపాటు. ద్వ. వి. (దీలుపడు ధా.) బలహీనత. "గీ...పండ్లిగుల్చుచు దీలుపాటుఁ, బ్రకటదైన్యంబుఁ దోఁప లోభంబు వచ్చె." నైష. ౭, ఆ. ౫౨.

దీవటి. వై. వి. (సం. దీపయష్టిః.) కరదీపిక. "సీ...వవమాసనూనుండు పగలు దీవటిఁ బూని స్వప్రతాపంబు సాక్షాత్కరింప." దశా. ౭, అ. ౨, ఆ. ౧౭౩.

దీవటీ=దీవటి. "సీ. దీవటీ ఎవ్వటి దివటి వం జనఁగను గరదీపికాఖ్యయై పరఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దీవన. దే. వి. ఆశీర్వాదము. "క. అనుజులుఁ దానును మునిశాసనమున నవ్వేది యెక్కె సమధికవీర్యం, బున నొప్పి బ్రాహ్మణులదీవన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవలీలన్." భార. అర. ౩, ఆ. ౧౨౩. దశ. ౧౨, ఆ. ౯౧.

దీవనఁబ్రాలు. దే. వి. బ. (దీవన+ప్రాలు.) శుభాక్షతలు. "గీ. జగము గెల్వంగ దండెత్తుమగనిమీఁద, లీల రతిచల్లు దీవనఁబ్రా లనంగ." పారి. ౨, ఆ. ౩౬.

దీవనము. దే. వి. 1. ఉద్దేశము, అభిప్రాయము. "క. గోవులకు వెనుకయై వెసఁ బోవుచునున్నాఁడు గడవఁ బోవకయుండం, బోవలయు నడ్డపడియొకు, దీవనమెదఁ గలిగెనేని దేవర కడఁకన్." భార. విరా. ౩, ఆ ౧౩౭; 2. ఉపాయము. "క...తడయక యింకన్, గావింపు కొలఁత కార్యము, దీవనమున నాతలంపు దీర్చెద నేఁడున్." దశ. ౬, అ. ౧౨౭.

దీవి. వై. వి. (సం. ద్వీపః) 1. నీటినడిమిదిబ్బ, ద్వీపము. "ఉ. ఓవనితాలలామ లవణోదధిచక్రపరీత మైనయా, దీవికి రాజజంబువు ప్రదీపితలాంఛనము..." నైష. ౫, ఆ. ౭౯, ఉ. రా. ౫, ఆ. ౨౦౫; 2. లంక, రావణునగరము. "ఆ. అనుచు దానిచందమంతయు నెఱిఁగించి, సుక్కురుండు పనుప సోఁకు ఱేఁడు, మరల దీవి కరిగి మఱియిూఱి కోటలు, గట్టి నేసి మూఁకఁ గాపువెట్టె." అచ్చ. యు. ౪౩౭.

దీవించు. దే. అ. క్రి. (శుభమును) కోరు. "క. అనవుడు జయలక్ష్మిం జేకొను మని దీవించి యింతకుం గేకయసం, దన నన్నుఁ దడవుఁ దడయం, జనదియ్యెడ నని లతాంగి సనియెం బ్రీతిన్." భార. విరా. ౨, ఆ. ౨౯౦. స. క్రి. ఆశీర్వదించు. "వ. అయ్యుదంకుండు...అతిత్వరితగతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీతసత్కారుండై యిట్లనియె." భార. ఆది. ౧, ఆ. ౯౪. రామా. ౬, ఆ. ౧౨౧.

దీవిపుట్టువు. ద్వ. వి. (దీవి+పుట్టువు.) ద్వైపాయనుఁడు, వ్యాసుఁడు. "వ...కవ్వడియునుమనుమనికి దీవిపుట్టువుకడఁ జదువరి యిట్లనియె." అచ్చ. భా. ౩, ఆ. ౩౬. పు.

దీవియ. వై. వి. (సం. దీపికా.) దీపము; కరదీపిక. "క. బలురక్కసు లెత్తినకత్తులతో దీవియలు బలియ దుందుభు లులియన్, వెలిఁ బ్రహరి దిరుగు నెల్లరఁ, జులకఁగఁ గికురించి నగరు చొచ్చి కడంకన్." రామా. ౬, ఆ. ౧౧౨. భార. భీష్మ. ౨, ఆ. ౩౪౨.

దీవియకంబము. వై. వి. (దీవియ+కంబము.) దీపస్తంభము. "క. దీవియకంబంబునకును, జీవము గల్పించి కథలు చెప్పింపంగా...." విక్ర. ౬, ఆ. ౧౪౧.

దీవిరాయఁడు. వై. వి. (దీవి+రాయఁడు.) రావణుఁడు. "గీ...అంత నత్తెఱఁ గంతయు నాల

కించి, దీవిరాయఁడు తద్దయు దిగులు పూని." అచ్చ. యు. ౪౩౩, ఇట్లే: దీవిఱేఁడు మొ.

దీవె. వై. వి. (సం. దీపః.) దీపము. "ఉ. ఆఱనిదీవె యక్షయమహానిధిఁ జూపునవాంజనంబు నూ, రూరికి వచ్చి తోడుపడ నోపినబంధుఁడు...." శశాం. ౨, ఆ. ౩౬, ఆం. భా. ద్వి. ౧౬౪.

దీవెన. దే. వి. (దీవించు. ధా.) ఆశీర్వాదము. "చ... అతిహర్షమునం గొని తృప్తి నొంది దీవెన లొనరించి రిప్పుడుని వేయువిధంబుల సన్నుతించుచున్." శశాం. ౫, ఆ. ౧౫౬, నైష. ౩, ఆ. ౧౦౭.

దీవెనకోలు. దే. వి. నమస్కారము. "రగడ. వృష పురస్థలిని విడియువృషాశ్రయదేవుని కిదుగో దీవెనకోలన." హంస. ౪, ఆ. ౨౧౩.

దీవెసుడి. ద్వ. వి. (దీవె+సుడి.) దీవ ముంచుసాధన విశేషము. "సీ. విను మేము ప్రాలుమాలినదీవెసుడి గాక కిసిసినరెండుగుగ్గిళ్లగాక." విప్ర. ౫, ఆ. ౧౯.

దీవ్యత్. సం. శత్ర. ప్రకాశించుచున్న. "మ. బలవిధ్వంసివరంబునం గొనినదివ్యన్నారుతాస్త్రంబుచే...." హర. ౬, ఆ. ౧౬౯, ౧౩౮.

## దు

దు. దే. అప. 1. యుష్మదస్మదాత్మార్థకములకు షష్ఠీ సమాసమునం దుత్తరపదము పరమగునపుడు వికల్పముగా నగుఆగమము. "క. నీదుకులమునకుఁ దగఁగఁ బ్రతోదముఁ గొని రథముఁ గడపఁ దొడఁగుము ..." భార. ఆది. ౬, ఆ. ౫౪, భార. శాం. ౩, ఆ. ౪౯౬; 2. వ్యతిరేకార్థమున అమహత్కర్తృకము లగుధాతువులకు వచ్చుప్రథమపురుషైకవచన ప్రత్యయము. "క. ఆశివచః కార్పణ్యం, బాలేమకు చెవుల సోఁకదు..." ఆము. ౧, ఆ ౬౩; 3. తద్ధర్మాద్యర్థమున "వు" "రు" మొదలగుప్రత్యయములు పరమగునపుడు ధాతువుమీఁద వచ్చెడియాగమము." ఉదా:-వండుదువు, వండుదురు. మొ.

దుఃఖపడు. మి. అ. క్రి. (దుఃఖము+పడు.) నొగులు, బాధనొందు. "సీ. శుకశారికలుగూడి శోకస్వరంబులఁ బలవింపఁ దొడఁగెఁ దాపంబు గదిరి. గీ. మాసములు దుఃఖపడె మధుమాధవములు." హర. ౩, ఆ. ౮౫, దశా. ౪, ఆ ౧౦.

దుఃఖపఱుచు. మి. స. క్రి. (దుఃఖపడు ధా. ప్రే.) దుఃఖపెట్టు, విచారమునొందఁజేయు. "గీ. బాపురే విధి నను దుఃఖపఱుపఁ దగునె యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టికొనుచు వగల, డెంద మందంద యెరియ నాక్రందనంబు, సేయుచును వచ్చి యావిప్రశేఖరుండు." భాగ. ౧౦, స్కం. ఉ. ౧.౪౮౧.

దుఃఖపాటు. మి. వి. (దుఃఖపడు ధా.) దుఃఖపడుట. "ఉ... ఏనటులు బుద్ధులు సెప్పినభంగియుం గులాచారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ, కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర నీదుసన్నిధిన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩; ౨౫౭. భా. రా. కిష్కిం. ౩౦౩.

దుఃఖపెట్టు. మి. స. క్రి. (దుఃఖము+పెట్టు.) దుఃఖపఱుచు. (శ. ర.)

దుఃఖము. సం. వి. అ. న. వ్యథ బాధ. విశ. (అ.ఆ.అ.) దుఃఖకరము, బాధకము.

దుఃఖాంతము. సం. వి. అ పుం. 1. ముక్తి; 2. కష్టముల ముగియుట. విశ. (అ. ఆ. అ.) దుఃఖ మంతమందుఁ గలది, దుఃఖముతో ముగియునది.

దుఃఖాయమానము. సం. విశ. (అ. ఆ. అ.) దుఃఖించుచున్నది. "వ ..ద్రౌపదిం జూడనోపక లజ్జితులయి దుఃఖాయమానమానసు లయి తలలు వాంచియున్న పాండవులవైక్ల్యం బుపలక్షించి సంతసిల్లి దుర్యోధనుండు..." భార. సభా. ౨, ఆ. ౨౧౨. భార. అర. ౨, ఆ. ౪౬.

దుఃఖి. సం. విశ. (న్. నీ. న్.) దుఃఖము గలవాఁడు.

దుఃఖించు. సం. అ. క్రి. దుఃఖపడు, నొగులు. "శా. దుఃఖింపం బనిలేదు సౌమ్యు బలసందోహమ్ములం దెమ్ము చేతఃఖేద మ్మెడలంగ రమ్ము..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౫౭౬. మార్క. ౧, ఆ. ౨౬౦.

దుఃఖితము. సం. వి. అ. న. దుఃఖము, వ్యథ. విశ. (అ. ఆ అ.) దుఃఖము నొందినది.

దుంక = దుంకము. (బ్రౌ.)

దుంకము. దే. వి. రంధ్రము "గీ. బడిలి యన దుంకమన రంధ్ర మడరు..." ఆం. భా. ప్ర. ౧౪౫.

దుంగ. దే. వి. మ్రాని మొద్దు, స్థూలదారుఖండము. "సీ ...దుంగయనంగను స్థూలదారు, ఖండంబు వెలయు..." ఆం. భా. ద్వి. ౩౮.

దుండగము. వై. వి. (సం. దుండుకః.) 1. దౌష్ట్యము, దుర్మార్గత. "సీ. దుండగంబునఁ బూలగుండాడ వికలితవృత్తిఁ గల్పకవాటి నీటిఁబోయె." వరాహ. ౧౦, ఆ, ౫౧. ప్రభా. ౧, ఆ, ౧౦౫; 2. దుష్ట

కార్యము, చెడుపని. "సీ... ఇటువంటిదుండగ ములమాని కాలప్రాప్తులైనవారల నిర్నిమిత్తంబు మిక్కిలి మీకు నెగ్గు,చేయువారలఁ గాఁచి వధింపుఁ డన్యులతోఁ బోవకుఁడు..." వరాహ. ౬, ఆ. ౬౫; 3. కీడు, ఆపద. "ఆ. ద్రుపదుపీటిలోన దొమ్మికయ్యము రేఁచెఁ, బసులఁ బట్టె విరటుపట్టణ మున, మఱియు నెన్ని లేవు మార్తాండతనయుండు, దొడరి మనకుఁ జేయుదుండగములు." జై. ౧, ఆ. ౯౨. శ్రీరం. మా. ౪, ఆ. ౧౦౫; 4. ధూర్త కృత్యము, కొంటెతనము. "ఆ. పెద్దతోలితోడ బిగువుదామెనతోడఁ, బడినమద్దిచెట్లనడుమ ముద్దు, లైనతొక్కుఁ బలుకులాడుచు నిలుచున్న, కపట బాలుదుండగములు చూచి." వి. పు ౬, ఆ. ౧౪౦; 5. తప్పు, అపరాధము. "గీ... తప్పిదం బాగడంబు, దుడుకు నేరము నేరమి దుండగంబు, తప్పునఁగ నపరాధము తనరు నభవ." అం. భా. ద్వి. ౧౯౧. నిరం. ౪, ఆ. ౧౫.

దుండగాయ = దుండగీఁడు. (బ్రౌ. వా.)

దుండగాయతనము. వై. వి. (దుండగాయ+తనము.) దౌష్ట్యము. (బ్రౌ. వా.)

దుండగించు. ద్వి. అ. క్రి. దుండగముచేయు, అల్లరి చేయు. "ద్వి. మెండిలు మెండిలు దుండగిం పంగ." పండితా. పర్వ. ౩౯౭, పు... 'దుండరిం పంగ'-ముద్రి. పా.) [(శ. ర.)

దుండగీఁడు వై. విశ. (దుండగము+ఈఁడు) దుష్టుఁడు. "శా. తల్లిం జంపిన దుండగీనికి దయాదాక్షిణ్యము లుల్గునే." చం. రా. ౩, ఆ. ౧౪౨ ఉ. రా. ౭, ఆ. ౩౯౨.

దుండతికము. వై. వి (సం. దుండుకః.) దుండగము.

దుండి. దే. వి. 1. దొరసాని. (శ. ర.); 2. ప్రేయసి. "గీ. జంత యిటు లల్లియుండ రా జంత నచట, సరసిచెంత బిసాగ్రంబు నరసి కొంత, మగని కందించుకోర్కి ప్రేమ గని తనదు, దుండియొడఁ దగు లెంచి యందుండి యపుడు." సా. ౨,ఆ. ౧౫౨; 3. స్త్రీ. "సీ. వసధిఁ గ్రోలినమానికినుక చేఁ దనయుండుఁ దానును బోలదిండి యైనదుండి." చం. రా. ౨, ఆ. ౭౫. విశ. పెద్దపొట్టగలది, తుందిలము. (బ్రౌ.)

దుండికము. వై. వి. (సం. దుండుకః.) పెనుమ్రాను, దుండుకము. "సీ... దుండిల మనఁగను దుండిక మునఁ దగు దుండుకంబు." అం. భా. ద్వి. ౪౯.

దుండిలము. వై. వి. (సం. దుండుకః.) దుండికము. అం. భా. ద్వి. ౪౯.

దుండు = దుంగ. (వా.) వాఁడుదుండులాగున్నాఁడు.

దుండుకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) దుష్టచిత్తుఁడు.

దుండుగ. దే. వి. పెనుమ్రాను, దుండుకము. "గీ... పొలఁబు,దుండుగల మళ్లయారులఁ దూలి రాదు, చిక్కనేతాల పాడఱుసీమఁ జనుచు." ఆము. ౬, ఆ. ౧౩. హంస. ౪, ఆ. ౧౦.

దుండుబలి. దే. విశ. సోమరి. "సీ... చండి సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపే రై..." అం. భా. తృ. ౬.

దుంత. దే. వి. దున్న, మహిషము. "సీ. దుగ్గమ్మ కాఱు పోతుల లోనుసేయుఁమీ తోలిముద్దగా నిత్తు దుంత నొకటి." య. ౨, ఆ. ౩. అం. భా. ద్వి. ౨౬౪.

దుంతరౌతు. ద్వి. వి. (దుంత+రౌతు.) మహిషవాహ నుఁడు, యముఁడు. "గీ. తూర్పుదొర వేఁడి వేలుపు దుంతరౌతు, రేయినడకరి సంద్రంపుఱేఁడు గాడ్పు." భోజసుతా. ౧, ఆ. ౨౫ (ఇట్లే: దుంతబామీవజీరుఁడు. మొ.)

దుంతవయాళికాఁడు = దుంతరౌతు. (బ్రౌ.)

దుందిలము. వై. వి. (సం. దుండుకః.) పెనుమ్రాను. "క... ధరణీరమణుం, డత్తలము వైవఁ గని యది, తుత్తుమురుగఁ బొడిచె లేఁతదుందిలము క్రియన్." ద్వా. ౮, ఆ. ౩౭.

దుందుడుకు దే. వి. (దుడుకు+దుడుకు.) 1. గర్వము, ఉద్ధతి. "ఉ. దుందుడు కాఱ క్షాత్త్రపుల దోర్బల సంపదఁ జక్కనేసి ధాత్రిం దనబాహుపీఠమునఁ దిన్నఁగ నిల్పి..." నిరం. ౪, ఆ. ౮౦; 2. మిక్కిలి. తొందఱ. "క. పడఁతుక నతఁ డీగతి లోఁ,బడఁ జేసుక మరిపె ముట్టిపడఁ గడుఁ దమి దుం,దుడు కొనరింపఁగఁ గోరిక,లడరఁగ రతిసేన రతుల కాయ త్తంబై." హంస. ౫, ఆ. ౧౩౮; 3. మిక్కిలి తడఁబాటు. "క. నినుఁ గడచినఁ దలిదండ్రులు, విని నాదుంవుడుకుఁ దుడిచి విడువం గలరే,యని యే నేరికిఁ జెప్పక, చనుదెంచితి ననఁగ వచ్చె శబరి బలమ్మున్." కళా. ౪, ఆ. ౫౮; 4. ఇక్కట్టు, కష్టము. "సీ... విశ్వసింపక మానునో నాకుఁ గడ్డ వంగరానిదుందుడుకు పుట్టె." వరాహ. ౬,ఆ. ౩.

దుందుభి. సం. వి. ఇ. స్త్రీ. పాచికయందలి బిందు త్రికద్వయము, ఇత్తిగ. పుం. 1. భేరి. 2. విషు

ఖేదము; 3. ఒకానొకరాక్షసుఁడు; 4. వరుణుఁడు; 5. ఒకానొక సంవత్సరము.

దుందుము. దే. వి. చక్రాకారపుదివిటీ. (శ. ర.) "సీ. ఎవ్వి గాఢాంధకారేభయూథములకు దుందుములై మహోద్ధురత నిగుడు." సాంబో. ౨, ఆ. ౧౯. కళా. ౮, ఆ. ౧౦.

దుందురు. దే. వి. దివ్వియకోల, కాష్ఠదీపిక. "సీ. ఝంజము దుందురు సురుడు దివ్వియకోల యనఁ గాష్ఠదీపికాహ్వయము చెలఁగు." ఆం. భా. ద్వి. ౧౬౫.

దుందుఱు. దే. వి. ఝంఝూఱుకట్టు. (శ. ర.)

దుంప. దే. వి. 1. మూలము, కందము. "దండకము... కారాకులుఁ దుంపలుఁ మెక్కి." నీలా. ౨, ఆ. ౪౧. హరి. ఉ. ౧౦. ఆ. 3౦౦; 2. గెనుసుగడ్డ. (వా.); 4. వేరు,మూలము. "సీ .. వేరన దుంపన వెలయుం మూలము..."ఆం. భా. ద్వి. 3౭; 4. నాఁగేటిగొడగ, కూటకము. (శ. ర.)

దుంపకూర. దే. వి. (దుంప+కూర.) కూరవండుకొనుటకుఁ బనికివచ్చుదుంప. (బ్రౌ. వా.)

దుంపనాగులు. ద్వ. వి. బ. (దుంప+నాగులు.) సర్పవిశేషము. "సీ. కూఁకవేటులు చిల్లుగులియలు త్రాఁచులు పెరజులు గుఱ్ఱపుఁబెరజు లచటఁ. గీ. గలవు తక్కినజెట్టిపోతులును దుంప, నాగులును." ద్వా. ౮, ఆ. ౧౦౦.

దుంపనాశనము. మి. గ్రా. వి. (దుంప+నాశనము.) సమూలనాశనము, సర్వనాశనము. వా:–నిన్ను దుంపనాశనము చేస్తాను. (బ్రౌ. వా.)

దుంపబచ్చలి. దే. వి. (దుంప+బచ్చలి.) ఉపోదక, మట్టుబచ్చలి. "సీ...దుంప. గీ. బచ్చలి యన నుపోదకి పరఁగుచుండు. ఆం. భా. ద్వి. ౭౨.

దుంపరాష్ట్రము. ద్వ. వి. (దుంప+రాష్ట్రము.) రాస్నావిశేషము; ఒకానొక మందుదినుసు. (శ. ర. బ్రౌ.)

దుంపరాష్టకము = దుంపరాష్ట్రము. (బ్రౌ.)

దుంబోడి. దే. వి. (దుమ్ము+పొడి.) మెంతి జీలకఱ్ఱ చేర్చి చేసిన మెత్తనికూరపిండి. (శ. ర.) "క. క్రొం బొగపుఁగూరవగ తిరుగంబోఁకల మెంతి జీలకఱ్ఱల వలపుం, దుంబోళ్లతావి..."రా. వి. ౨,ఆ. ౧౦౧.

దుకాణము. దే. వి. అంగడి. "చ. తొలకరిమించుదీవగతి దోఁప దుకాణముమీఁద నున్నయ, య్యలికులవేణితోఁ దములపాకులబేరము లాడఁబోయి ..." శ్రీనాథునిచాటువు.

దుకూలము. సం. వి. అ. న. 1. సన్ననివస్త్రము; 2. తెల్లనివస్త్రము; 3. పట్టుబట్ట, క్షౌమము.

దుక్క = దుంగ. (వా.)

దుక్కి. దే. వి. 1. దున్నుట, కృషి. "సీ. కందకంబులు త్రవ్వి గట్టిగా శల్లించి దుక్కులు దున్నింపఁ దోఁట లవును." రామలిం. శ. ౯౪. హంస. ౫, ఆ. 3౫; 2. నాఁగేటిచాలు. "గీ. దుక్కిలో నుండి మనజాచలిక్కజేని, యక్కఱకుఁ బుట్టి నట్టియాయనుఁగుఁబట్టిఁ, బెండ్లియాడఁగ నేతెంచు పిన్న యితఁడు, చూడఁగదరమ్మ కన్నులవాడు చెలియ." బహు. ౪, ఆ. ౮౨. వి. పు. ౪, ఆ. ౧౮3; 3. దుక్కి మునుఁగుటకుఁ దగినవర్షము. (వ్యప:) రెండుదుక్కులవర్షము కురిసినది.

దుక్కికైదువు. దే. వి. (దుక్కి+కైదువు.) నాఁగలి, హలము. "సీ. ఇవిగదా దుక్కికైదువుసంకురవతమ్మి కంటివాల్గెరలు బొక్కసము లయ్యె." ముకుంద. ౧, ఆ 3౪. పు. (ఇట్లే: దుక్కివాలు.

దుక్కిచాలు. దే. వి. (దుక్కి+చాలు.) నాఁగటిచే దున్నఁగా నేర్పడినరేఖ. "సీ. రెండవదుంత లేకుండెఁ గా కినసూతి రొంపిలో దుక్కిచాల్నింపినాఁడె." రా. వి. ౧, ఆ. ౫౧.

దుక్కిటెద్దు. దే. వి. (దుక్కి+ఎద్దు.) దున్నుట కుపయోగించువృషభము. "సీ...కోరినయన్నిదుక్కిటెద్దుల బల్మితోడ నిచ్చు." నీలా. ౧, ఆ. ౪౯. వేం. పంచ.౧, ఆ. ౫౭౭. [చేను. (బ్రౌ. వా.)

దుక్కిపొలము. దే. వి. (దుక్కి+పొలము.). దున్నిన

దుక్కిపోతు. దే. వి. (దుక్కి+పోతు.) పొలము దున్ను దున్నపోతు. (బ్రౌ. వా.)

దుక్కిముచ్చు. దే. వి. (దుక్కి+ముచ్చు.) కర్షకుఁడు, హాలికుఁడు. "సీ...దుక్కిముచ్చనఁగను దోఁచుచుండు. గీ. హాళికాభిధ..."ఆం. భా. ద్వి. ౨౦౯. ఉ. హరిశ్చ. ౪, ఆ. ౧౫.

దుక్కివాలుదాలుపు. దే. వి. హలాయుధుఁడు, బలరాముఁడు. ఆం. సం. దేవ. ౨౯.

దుక్కెద్దు = దుక్కిటెద్దు. "సీ... దుక్కెద్దు దేశాంతర మరిగినట్లగును..." భో. ౨, ఆ. ౧౬.

దుగ. వై. స. (సం. ద్వికమ్. క. దుగ.) రెండు. "మ...ఇత్తిగ బారా దుగ యంచుఁ జిల్కరొద

లుద్దీపింపఁ జూదవుల్వలన్." కళా. 3, ఆ. ౧౩౧. ఆం. భా. ద్వి. ౩౦౫.

దుగమోముదుండగీఁడు. ద్వ. వి. అగ్ని. వేంక. దేవ. ౧౬.

దుగలము. దే. వి. రెండు బేడలు, పరహాలోఁ బడాఱవ పాలు. (శ. ర. బ్రా.) "సీ. దీనారమందు ద్వాత్రింశదంశం బైన బేడ యంచనఁగను వెలయుచుండు. గీ. దుగల మంచనఁగఁ దద్యుగళంబు విలసిల్లు..." ఆం. భా. ద్వి. ౭౭౩.

దుగా. వై. స. (సం. ద్విక్రమ్.) రెండు "ఉ...వినోద లీల బ్వారా పది దచ్చి యిత్తిగ దుగా యని పన్నిద మగ్గడించుచున్." నిరం. ౨, ఆ. ౨౨.

దుగానా. హిం. వి. రెండుదండప్రణామములు.? "ఆ. చనుపకములతావి గొనక రోజాలుండి తేఁటిమలక మల్లెతెల్లవిరుల, చందు చూచి విరహ జయకాంక్షమై దుగానా యొనర్చె నుత్తరాయణమున." సాంబో. ౨, ఆ. ౧౦౩.

దుగినుఁడు. వై. వి. (సం. ద్రుహిణః.) బ్రహ్మ. "ఆ. బమ్మ తాత నలువ తమ్మిచూలి దుగినుఁ, డనఁగ బ్రహ్మపేరు లబ్జమాళి." ఆం. భా. ప్ర. ౩౯.

దుగుణము. వై. స. రెండు. "సీ. దుగుణంబు సేసిన తోడనే మూఁ డని వారించి లే దని వలుము సేసి." ఉ. హరి. 3, ఆ. ౧౭౨.

దుర్గ. వై. వి. (సం. దుర్గా.) శక్తి, పార్వతి. "ఆ. సత్తి సామితల్లి చండి యమ్మిక దుర్గ, యనఁగ నీసెలంత యలరు నభవ." ఆం. భా. ప్ర. ౪౦, య. ౨, ఆ. 3.

దుగ్గాని. వై. వి. (దుగ+కాని.) నిష్కవిశేషము. (రెండు దమ్మిడీలు. శ. ర.) "సీ....టంక మనఁగ నిష్కావ్యయంబు. గీ. తద్విశేషాభిధలు గాను దగును డబ్బులనఁగ దుగ్గాను లనఁగ దుడ్డనఁగ జగతి." ఆం. భా. ద్వి. ౭౭౯.

దుగ్గి. వై. వి. (సం. దుర్గా.) పార్వతి, శక్తి. "సీ. దుగ్గి దేవమ్మకుఁ దొలుబోన మని కాని త్రుంతుము జముఁ జెక్కుగుంత నైన." సాంబో. ౨, ఆ. ౧౭౯.

దుగ్గు. దే. వి. చూర్ణకాకము, తౌక్కు. "సీ. చూర్ణ శాఖాభిధ శోభిల్లు దుగ్గు నా...." ఆం. భా. ద్వి. ౬౪౮. విణ. రూపము చెడినది తృణము. (శ. ర.)

దుగ్ధ. దే. వి. (శ. దుగ్ధ.) అసూయ; ద్వేషము. (బ్రౌ. వా.)

దుగ్ధము. సం. వి. అ. న. 1. పాలు; 2. పాలుపిదుకుట, దోహనము. విణ. (అ. ఆ. అ.) 1. పిదుకఁబడినది; 2. నింపఁబడినది.

దుగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. చిఱుపాలవీ.

దుఘము. సం. విణ. (అ. ఆ. అ.) (ఇది ఉపపదసమాసాంతముగనే యుండును) 1. పూరించునది; 2. ఇచ్చునది. ఉదా:-కామదుఘము. మొ.

దుట్టుపు. దే. వి. అజశృంగి. 'సీ. దుట్టుపు దుట్టవు జుట్టు పనంగను ద్వంద్వ పలాఖ్యయై తనరుచుండు." ఆం. భా. ద్వి. ౬౧.

దుట్టువు=దుట్టుపు. ఆం. భా. ద్వి. ౬౧.

దుడదుడ. దే. వి. మంచె మొదలగువానిని వేగముగా నెక్కుటయం దగుధ్వని కనుకరణము. 'చ. దుడదుడ మంచె యెక్కి నొకదొడ్డమిటారపుఁగమ్మ కూఁతురున్." వీధి. ౩౦.

దుడిదుడి. దే. వి ఏనుఁగులు మొదలగునవి త్వరితముగా నడచుటయం దగుధ్వని కనుకరణము. "ద్వి. అడవి యేనుఁగులు నీరాస నీనదికి దుడిదుడి వచ్చి తత్తోయంబు దొడరి..." రం. రా. అర. ౧౬౩. పు. ౭౦, పం. నిరం. ౪, ఆ. ౬౬

దుడుకఁడు. దే. వి. పిల్లవాఁడు, బాలుఁడు. "సీ.... బాలక నలువుమీఱు, పాప పాపఁడు దుడ్డె పడుచన దుడుకఁడు బుడుత కట్టి కొడుకు బొడిగ లేఁత, చిన్న పిన్న చిఱుత యనఁ జెలఁగుచుండు." ఆం. భా. ద్వి. ౧౧౮, భాగ. 2, స్కం. ౭౫౩.

దుడుకడుచే. దే. అ. క్రి. (దుడుకు+అడుచే.) మునుఁగు. "క. అడుగులమైఁ బడు లేచుం, బడుఁ గమ్మఱ లేచు నిట్లు భక్తిక మును తాఁ, బొడఁ గనిన పెంపుఁ దలఁచుచు, దుడుకనిమహిమాబ్ధి నజుఁడు దుడుకడిచె నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౫౪౬.

దుడుకు. దే. వి. 1. దుష్టత్వము. "ఉ. అందఱఁ జూచి యింతదుడుకా యని దూఱఁగ..." వి. పు. 2, ఆ. ౯, శుక. 3, ఆ. ౭౯; 2. ఉద్ధతి. "ద్వి. మనుజేంద్రసుత యొక్కమునవిఁ గావింతువినఁ దగు దుడుకు గావింపఁగ రాను." ద్వి. శ. సా. ౨, భా. (శ. ర.) భాగ. ౧౦, స్కం. పూ. ౭౮౫; 3. తొందర, త్వర. "ఉ...పంతము దీఱ నోటు కైకా యను సేర యిట్టు దుడుకా యనుఁ బాయఁగఁ గోరికా యనున్." అచ్చ. అయో. ౫౦; 4. చెడ్డపని, దుశ్చర్య. "క. ఆవార్త లెల్ల నారదుచే వీని వీఁ డెంతదుడుకుచేసె నటంచున్." దశా. ౧, ఆ. ౭౪౫. భాగ. ౧౦, స్కం. పూ.

౧౬౧౭. విశ. దుష్టము. "క. ఈదుడుకుఁ గోతిఁ గొని చని,మీఁదిట్టతనంబు లెల్ల మెఱయఁగ నిపుడాఁ, గాదనక తోఁకఁ గాలిచి..." అచ్చ.సుం. ౧౬౪; 2. వేగము కలది,సత్వరము. "గీ...వడి నేయుఁ కఱివేల్పు కొడుకుదుడుకు,టంప జడివాకసోనల యలజడికిని,మిగుల నెద నోడి యూఁకనమ్మించుఁ బోఁడి." నీలా. 3, ఆ. ౧౫.

దుడుకుచేయు. దే. అ. క్రి. (దుడుకు+చేయు.) తొందరపడు. "సీ. దుడుకుచేసినను బుద్ధులు దెల్పు నొకవేళ మక్కువ మద్దిచ్చు నొక్కవేళ." రాధా. ౨, ఆ. 3౦, హంస. 3, ఆ ౭౪.

దుడుకునడక. దే. వి. (దుడుకు+నడక.) దుష్ప్రవర్తనము. "వ...కడలిరాముద్దుకొడుకు మేనల్లుని దుడుకునడకల మిడుకులకు నెగులుపడి .." ఇందు ౪, ఆ. 3౭.

దుడదుడ = దొడదొడ. (బ్రా. వా.)

దుడ్డు. యు. దే. వి. 1. ఒకరకమురాగినాణెము. "సీ. టంక మనఁగ నిష్కాహ్వయంబు. గీ. తద్విశేషాభిధలుగాను దగును డబ్బు,లనఁగ దుగ్గాను లనఁగ దుడ్డనఁగ జగతి." ఆం. భా. ద్వి. ౬౭౭. శుక. 3, ఆ. ౧౧౫; 2. ధనము. (వ్యవ:-)దుడ్డులేనిచో ఏపనియు జరుగదు. వై. వి. (సం. దడః) లావుకఱ్ఱ;కఱ్ఱ. "ద్వి. దుడ్డున వీఁపు కంతులు గట్ట మోఁది." ద్వి.హరిశ్చ. ఉ. ౧౫౦3,పం."ద్వి... గొఱ్ఱెల కాచికాచి,యలరుచుఁజేతి దుడ్డటు పాఱవైచి." పండితా. మహిమ. ౪౦, పు; 2. గద, "గీ. గుదె యనఁగ దుడ్డనంగను గదకుఁ బేర్లు." ఆం. శే. ౧౭; 3. ముద్గరము,గునుపము. "గీ. గుదె గుదియ దుడ్డు గునుపము గుదుప యనఁగ,ముద్గరము..."ఆం. భా. ద్వి. ౨౧౬. విశ. 1. మోటుకాఁడు. "క. దుడ్డునకుఁ బోయునట్లొక,త్రెడ్డుదుకుంబాయసంబుఁ దెచ్చి యతనిచే,నిడ్డ నడిచి పడి కనలెడి,గ్రుడ్డులు తెలియంగఁ దెఱచికొని కనుఁగొనుచున్." భో. 3, ఆ. ౭౨. (శ.ర.పా.); 2. లావైనది,స్థూలము. (చూ. దుడ్డుఁగఱ్ఱ.)

దుడ్డుఁగఱ్ఱ. ద్వ. వి. (దుడ్డు+కఱ్ఱ.) లావుకఱ్ఱ. (శ. ర. బ్రా.)

దుడ్డుగోల. ద్వ. వి. (దుడ్డు+కోల.) లావుకఱ్ఱ. (శ. ర.)

దుడ్డుమంగి. దే. వి. వృక్షవిశేషము. హంస. ౪,ఆ.౯.

దుడ్డె. యు. దే. వి. బాలకుఁడు. (విశ. అని శ. ర.)"క. దుడ్డెలు రా కటు మసలిరి,జడ్డున నున్నారటంచుఁ జనుదెంచి గురుం,డొడ్డెన యడవినిఁ బొడఁగని, దొడ్డున మన్నించు టెఱుఁగుదువు గద మనలన్." కుచేల. ౨, ఆ. ౯౧. వై. వి. (సం. ధూర్తః.) విటుఁడు; విటి. (చూ. దుడ్డెకాఁడు. దుడ్డెతనము.)

దుడ్డెకాఁడు. ద్వ. వి. (దుడ్డె+కాఁడు స్వార్థమున.) "చ. అటువలె నేఁగుచుండి మగఁ డత్తయు మామయు నింట లేమి వెల్పటికి హుశారునం జని గుబాదెబ వీథులవెంట జంటలై,చిటిలినపూఁత గంధముల సిస్తగుపాగల నిండుచెల్వదు,ప్పటుల విభూషణావళుల బాగుగ నేఁగెడుదుడ్డె కాండ్ర లోన్." హంస. ౫, ఆ. ౧౬౦.

దుడ్డెతనము. ద్వ. వి. (దుడ్డె+తనము.) విటీత్వము. "గీ. పసిమిఁ జిక్కుడుముంజేతిపచ్చ లమర,దుడ్డెతనమునఁ దిరుగు నారెడ్డిసాని." హంస. ౪, ఆ. ౧3౭.

దుత్త. దే. వి. 1. చిన్నకుండ. "గీ. కడవ ముంత గరిగ దుత్త పిడుత గురిగి" హంస. ౫, ఆ. ౧౧; 2. పాలకుండ. "సీ. దుత్త యనంగను దుగ్ధభాండం బొప్పు..." ఆం. భా. ద్వి. ౨౪౭; 3. చాఁపఁ బడినబొటనవ్రేలి చూపుడువ్రేలి నడిమికొలఁత, ప్రాదేశము. "చ...లేటివెంటఁ బడి దుత్తెడు మేరన పట్టువేగదం,తులఁ గని మెచ్చి లేనగవు తోడ నభీష్టములెల్ల నిచ్చుచున్." వరాహ. ౪, ఆ. ౭౬.

దుత్తాయి. దే. వి. చిన్నచోక్కా, కూర్పము. "సీ... కూర్పాఖ్య యలరును దుత్తాయి యరచట్ట కుప్పసం బంగి కుబుస,మనఁగ..."ఆం. భా. ద్వి. ౧౫౬.

దుత్తూరము. ఉభ. దే. వి. కపటము. (శ. ర. బ్రా.) సం. వి. అ. పుం. ఉన్మత్తః.

దుత్తె. దే. వి. తాళము. (బ్రా.)

దుద్దు. దే. వి. 1. తామరపువ్వులోనిదిమ్మె, కర్ణి. "గీ. పొలుచుఁ గర్ణిక దుద్దు నా ముద్దె యనఁగ." ఆం. భా. ప్ర. ౧౬౬; 2. చెవికమ్మ,కర్ణిక. "సీ. కర్ణిక దుద్దనఁగాఁ జెలఁగు .." ఆం. భా. ద్వి. ౧౪౭; 3. తాటియాకుబాబుమీఁది చెంద్రిక. (శ. ర.); 4. వ్రాఁతకుఁ బనికివచ్చు తాటియాకులకట్ట. "చ.... రాయసపుటార్యులగంటము లాకుదుద్దులున్, వద లక మోసి చూచె నొకపట్టునఁ బొట్టకు లేక

తక్కినన్." హంస. ౪, ఆ. ౩౦; 5. అసత్యము. "ఆ. తనుకు ననుకు దుద్దు టటపట టవటవ, సట పుటకిక్కి నా నసత్య మభవ." ఆం. భా. ప్ర. ౧౯౯; 5. అతిశయము. (చూ. దుద్దెక్కు); 6. మూలస్థానము. "ద్వి. జపసమాధులప్రొద్దు తపములదుద్దు.. శివభక్తి శిఖరంబు శ్రీనగేంద్రంబు" పండి. పర్వ. ౩౧౩. పు.; 7. మోసము. (చూ. దుద్దువెట్టు.)

దుద్దుకంబళి. దే. వి. (దుద్దు+కంబళి.) ఒకవిధమైన దట్టపుజేఁతకంబళి. "గీ. సన్నజాదపునేఁతమంచంబు దుద్దుకంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు, మగనిఁ గూర్కకు మరుచు నమ్మాయలాడి" వేం. పంచ. ౪, ఆ. ౪౫౬. హంస ౫, ఆ. ఇట్లే: దుద్దుగంబడి, దుద్దుగొంగడి. మొ. (బ్రౌ.)

దుద్దువెట్టు. దే. స. క్రి. (దుద్దు+పెట్టు.) మోసగించు. "ఉ. అత్తలమామలన్ మగల నన్నలఁ దమ్ములఁ దల్లిదండ్రులన్, జిత్తుల దుద్దువెట్టుచును జీటికి మాటికి నన్నె చేరఁగా,వల్తురు..." దశా. ౯, ఆ. ౩౫౫. సా. ౨, ఆ. ౧౧౪.

దుద్దెక్కు. దే. అ. క్రి. (దుద్దు+ఎక్కు.) అతిశయించు. "ద్వి. పెద్ద యౌప్రమదంబు భీతియుం భక్తి,దుద్దెక్కి తనరారఁ దొట్రిలొనంగ." బస. ౧, ఆ. ౫౮౬, పం.

దుద్రుమము. సం. అ. పుం. పచ్చనీరుల్లి.

దునీఁడు. దే. వి. (దునె+ఈఁడు.) ఱేఁడు, ప్రభువు. "సీ. కతుబంతముల నేలఁ గలవేలుపుదునీలు సమయము లేక మోసలను గాయు." పార్వ. ౧, ఆ. ౧౮. సాం. వి. దేవ. ౩.

దును. దే. స. క్రి. దున్ను. "సీ. ఇందుఁ బుట్టినజను లెల్లను దుదిఁ ద్రిదివంబున కరుగంగవలయు నని మనంబునఁ గోరి యన్నరపతి దున్నంగ నింద్రుఁడు సనుదెంచి యేల యిచటఁ, దునియెద వనిన..." భార. శల్య. ౨, ఆ. ౨౧౫. "మ. హాలికుం డెంతయు నోజతో దునఁగ సీరాగ్రంబునం జోఁకి ప్రాణు లనేకంబులు సచ్చు..." భార. అర. ౫, ఆ. ౫౭.

దునుకు. దే. వి. 1. బాధ. (శ. ర.) "మ. తనఘోరధ్వనికిం గలంగఁబడుశత్రుసైన్యంబు దైన్యంబునన్, దును కొందం బరిఘంబు పై విసరుచున్ దుర్వారుఁడై..." ఉ. హరి. ౫, ఆ. ౨౨౫; 2. భయము. "క. అనిలజు సారథియును గురుతనయుని రథ చోదకుఁడు నతని నాతనినిం, గొని యుల్లంబుల బలితపు, దునుకు సొరఁగ నరికిఁ దొలఁగఁ దోలిరి రథముల్." భార. కర్ణ. ౧, ఆ. ౧౧౦.

దునె. దే. వి. చిన్నసేన. (చూ. దునెదారి.)

దునెదారి. వ్య. వి. (దునె+దారి) అల్పసేనాపతి. "చ...మన్నెవారలు దునెదారులున్ దొరలు రాజులు మంత్రులు శిష్టబాంధవావళులు పురోహితుల్ పనులవార లనేకులు నిండి యుండఁ గన్." సా. ౩, ఆ. ౧౫౭. ప్రబంధ. ౨౧౦.

దునెసరి = దునెదారి. (శూరుఁడు. బ్రౌ.)

దునే = దునె. (చూ. దునేదారి.)

దునేదారి = దునెదారి. "సీ. ఈహజారముచెంత నెంతయుం భేటికై చేరి నిల్వనిదునేదారు లెవ్వరు..." ఆనంద. పీఠి. ౧౬౬. ప్రబంధ. ౨౧౬.

దున్న. దే. వి. (దున్ను ధా.) 1. మహిషము. "ఉ. కాలునిదున్న నంది నయి గంటలు దున్నక మంటి నామహాకాలునినంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటినా,వాలికులు..." ఆము. ౪, ఆ. ౧౨౪. ఆం. సం. తిర్య. ౧౦; 2. పురుషమృగము, పశువులలో మగది. "క. కన్నంతన తనయేలిక, దున్న దిగంబ్రావి..." హరి. పూ. ౭, ఆ. ౯౯౪. (ఏనికదున్న = మగయేనుఁగు.) బస. ౪, ఆ. ౯౧, పం.

దున్నపోతు. దే. వి. (దున్ను ధా.) దున్న, మహిషము. "సీ. చదువు చుండెడివేళ సభలోనఁ గూర్చుండి దున్నపోతులకొడు కెవ్వఁడప్పు." వేణు. శ. ౩౬. (ఇట నిందార్థకము.)

దున్నించు. దే. స. క్రి. (దున్ను ధా. ప్రే.) దున్నఁ జేయు. "గీ. జనకజననాయకుఁడు యాగశాల గట్టు,చోట దున్నింప..." ఉ. రా. ౩,ఆ. ౧౩౦.

దున్ను. దే. స. క్రి. దుక్కిచేయు. "వ... దానిఁ గురుం డనురాజు దున్నుటం జేసి దానికి గురుక్షేత్రం బను నామంబు గలిగె..." భార. శల్య. ౨, ఆ. ౨౧౪, ౨౧౫.

దున్వత్. సం. శత్ర. 1. తపించుచున్న; 2. తపింపఁ [జేయుచున్న.

దుపటము. దై. వి. (సం. ద్విపటీ.) దుప్పటి, వెలగల సన్నపువస్త్రము. "క. శిరసుతడి యొత్తి దుపటపుం, జెఱఁగునెత్తు గట్టి వారినిలయము వెడలెన్." లం. వి. ౫, ఆ. ౩౬.

దుప్పటము. వై. వి. (సం. ద్విపటీ.) 1. ఉత్తరీయము. "ఉ. బంగరుదుప్పటంబు వలెవాటుగ నొప్పు..." చమ. 3, ఆ. ౭౭. వరాహ. ౪, ఆ. ౪౬; 2. సన్నని వస్త్రము. "గీ. ఒకచకోరాక్షి నిజకరద్యుతులు మీఁద,గప్పి చెంద్రికవన్నియ గాఁగ దుప్పటమునఁ దడియొత్తె..." వరాహ. ౪, ఆ. ౧౫౪. బ్రహ్మో ౧, ఆ. ౨౦; 3. కవచము. "గీ. తనరుఁ దేల్లె తనుత్రాణమునకుఁ గత్తళంబు జోడు జిరాదుప్పటంబు బొందఁగం బనఁగ..." ఆం. సం. స్థా. ౬౬. సాం. ని. మాన. ౪౫.

దుప్పటి. వై. వి. (సం. ద్విపటీ.) 1. వస్త్రము. "గీ.. ..విష్ణుండు వచ్చెఁ, బక్షిపతి నెక్కి పైడిదుప్పటి చెఱఁగు, దూలఁగా బిట్టు వాగెలఁ దోలుకొనుచు." వరాహ. ౬, ఆ. ౧౧౪. ఉ. రా. ౬, ఆ. ౧౯౦; 2. కప్పుకొనుటకు పక్కమీఁదఁ బఱచుటకు నుపయోగించుమెతకబట్ట, నిచోళము. "చ. బటువులు తావితోపఱుపుప్పట్టె తలాడమమీఁదఁ జల్వదుప్పటి పయిఁ జప్పరంపుజిగి బంగరువ్రాతకురాళమున్..." శుక. ౪, ఆ. ౨౭. ఆము. ౪, ఆ. ౩౫.

దుప్పటీ = దుప్పటి. 1. (ఉత్తరీయము.) "గీ. తమ్మిదోదుమ్మిజోదుసాదనలహారువు, వ్రాతపనిదుప్పటీ వలెవాటు వైచి." కువల. ౨, ఆ. ౪; 2. (వస్త్రము.) "గీ. మిసిమిబంగారుతళుకులమేలిదుప్ప, టీచెఱఁగులు..." ఉ. రా. ౬, ఆ. ౭౦.

దుప్పి. దే. వి. 1. మచ్చలు గలహరిణము, పృషతము. "సీ...పృషతాఖ్య యడకు దుప్పి యనంగ..." ఆం. భా. ద్వి. ౧౫. స్వా. ౪, ఆ. ౭౧; 2. పెద్ద దుప్పి, రామము. "సీ... దుప్పి. గీ. యనఁగ రామంబు చను..." ఆం. భా. ద్వి. ౧౫. (మృగ విశేషవాచకములు మృగసామాన్యవాచకములుగా కవులు వ్యవహరించియున్నారు.) "వ...ఒక దుప్పికిం గవియఁ బ్రేలి భయజ్వరతప్తచిత్తమై. "గీ. ఆచమూరువుయూథంబుఁ ద్రోఁచి పఱచె." "ఉ. ఆరురు పీగతిం బఱచి..." పాండు. ౫, ఆ. ౧౪, ౧౫, ౧౬. మార్క. ౫, ఆ. ౨౩౧.

దుబారా. హిం. వి. రెండుమారులు. విణ. వ్యర్థము; అమితమైనది. (వ్యయము. 'దూబరా' అనియు వాడుక.)

దుబాసి. వై. వి. (సం. ద్విభాషీ.) భాషాంతరము చేయువాఁడు, రెండుబాసలువచ్చినవాఁడు. (చూ. దుబాసితనము.)

దుబాసికుఁడు. వై. వి. (సం. ద్విభాషీ?) దుబాసి. "క. ఆరాయబారి వచ్చిన, దూరాగమనంబుఁ జూచి దొడ్డో నడిగెన్, నీరాక కేమి కత మని, గోరుందొర తనదుబాసికులమూలమునన్." రంగా. ౨, ఆ. ౧౧౬.

దుబాసితనము. వై. వి. (దుబాసి+తనము) భాషాంతరముచేయు ఉద్యోగము. "గీ. కుంఫినిదుబాసితన మీయ సొంపు మీఱి, రహి చెలఁగ మీఱి యానందరంగశౌరి." ఆనంద. పీఠి. ౭౬.

దుబాసీ. వై. వి. (సం. ద్విభాషీ.) దుబాసి. "క. మూసావారిదు, బాసీ లక్ష్మణసమాఖ్యఁ బరఁగు ఘతఁడు..." రంగా. ౨, ఆ. ౬౧.

దుబ్బ. దే. వి. 1. అఁడుగుటి "సీ...పాపలఁ గను తావు పత్త బుయ్య, మగునిల్లు దుబ్బన మదన మందిర మొప్పు..." సాం. ని. మాన. ౧౯. వేంక. మాన. ౪౨; 2. పాత్రవిశేషము. "సీ. తొర్లు గట్టెయుఁ జల దుబ్బ చిల్కుడు గుంజ పూజ బింబెలు వెన్నపూసచట్టి." హంస. ౨, ఆ. ౭౫.

దుబ్బు. దే. వి. తృణమూలము. "సీ...నలు సన నలరు శుష్క. గీ. తృణము దుబ్బనఁగా మూల మెసఁగు..." ఆం. భా. ద్వి. ౭౬.

దుమగతికేతు. వై. వి. (సం. ధూమకేతుః.) అరిష్టమును సూచించునక్షత్రవిశేషము, తోఁకచుక్క. "సీ. దుమగతికేతు నా ధూమకేతువు దోఁచు." ఆం. భా. ప్ర. ౯౮.

దుమదుమ. దే. వి. కోపాదులు కలిగినప్పటి చేష్టావికారమున కనుకరణము. (చూ. దుమదుమలాడు.) విణ. 1. బాగుగా తడిసినది. "క. తమపాటఁ జినుకుచినుకుల దుమదుమగాఁ దడిసినట్టిదువ్వాలు వలతో, ఘుమఘుమ యను పరిమళబృందముతో ..." కళా. ౩, ఆ. ౬౮. "క. సమదగజదాన ధారల, దుమదుమలై యున్న పెద్దతోవల తోడన్, రమణీయమయ్యె నప్పురి..." భాగ. ౯, స్కం. ౩౭౭; 2. కలిసినది, మేళగించినది. "చ. అమృతరసంబు లుట్టిపడ నాలతిఁ జేసినపీణ లోపలన్, దుమదుమగా వచోమహిమ దోఁపఁగ గీతముఁ బాడుచున్న..." నిరం. ౨, ఆ. ౩౦.

దుమదుమలాడు. దే. అ. క్రి. కోపాదులవలనఁ జిరచిరలాడు. (బ్రౌ. వా.)

దుమాదూళి. వై. విశే. ఏకమొత్తము, ఒక్కుమ్మడి. "మ. వడిసెన్ గారెనుపోతు లేవ లిరిగెన్ మ్రగ్గెన్ వృకవ్రాతముల్, గడుతుల్ చిక్కె గజాళి చొక్కె నపుడక్కాఁకన్ దుమాదూళి గన్." సా. ౧, ఆ. ౧౦౭.

దుమారము. దే. వి. 1. దుమ్ము. "గీ. అనుచు నింగించి వలవంత యినుమడింప, నవ్వరారోహవిదళితపల్లకముల, కమ్మపుప్పొడిపైదుమారమ్ము రేఁచుచు,మలయమందరపవనుపై నలుకవొడమి." స్వా. 3, ఆ ౪౯, ౫, ఆ. 3౯; 2. (ఆకాశమున వ్యాపించు) పెద్ద దుమ్ము, పెంధూళి. "చ. తెలిపువు నీటివర్షము లుద్దీర్ణములై యొనరంగ నత్తఱిన్, మలయఁగఁ జొచ్చెఁ బుప్పొడిదుమారము లెల్లెడల న్నిరంతరా, కలన వహించి దట్టమయి కానఁగనయ్యెను యోగదూరతం, గలఁగెడు దంపతిప్రతతి,గాంచుమహోష్మపుటార్పు గాడ్పులున్." కాళిందీ. ౪, ఆ. ౨౧. చంద్రా. ౨, ఆ. ౨౯.

దుమాలు. దే. విశే. సమూలము. (శ. ర.) "ద్వి. కొండొక నీపులోఁ గొట్టెదుమాలు,బెండుగా నాశూద్ర బృందంబుకలలు." ద్వి. భాగ. ౬, స్కం. (శ.ర.)

దుమికించు. దే. స. క్రి. (దుముకు ధా. ప్రే.) (అశ్వాదులను) ఉఱికించుచు నడిపించు. "క...రాజు వేడుకతోడన్,గోడా దుమికింపఁగ జత,గూడిరి భటు లెల్ల భటులగుమి వెనుకొనియెన్." ఉ. రా. ౭, ఆ. 3౯౯. దశా. ౨, ఆ. ౧౯.

దుమికియాడు. దే. అ. క్రి. (దుముకు+ఆడు.) (గుఱ్ఱము.) వల్గితగతితో పోవు. "సీ. గండురానిగ్గ చొకాటంపుమోముట్టు తొగరీఁకలపటాణి దుమికియాడ." ఉ. హరిశ్చ. 3, ఆ. ౧3౧.

దుము. దే. వి. దుమ్ము. (శ. ర.)

దుముకు. దే. అ. క్రి. 1. ఉఱుకు. "మ...కరిణీఘాలంబుపై సింహ మర్భకమయ్యుగ్ దుముకున్ స్వభావమిది శూరశ్రేణికిన్..." మల్లభూ. నీతి. 3౦, చంద్రి. ౪, ఆ. ౯౪; 2. పడు,వ్రాలు. "చ. చెమటలు దొప్పఁదోఁగుఁజిగిచెక్కులు పువ్వులు రాలమూపులం, దుమికెడికొప్పులు న్నొసటఁ దుంపెసలాడెడుచేరుచుక్కలున్." రా. వి. 3, ఆ. ౦౯; 3. ఉట్టిపడు. "గీ. దూదిపాటలఁ దేనియల్ దుముకుచుండ..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౨౪, వి. 1. గంతు,ఉఱుకు. "క. దుముకులు వైచుచు నాయా సమయంబుల జలము లెత్తి చల్లుచు వలల, శ్రమలీల వైవ..." వేం. పంచ. ౧, ఆ. ౬౧౯; 2. మల్లవిద్యావిశేషము. ప్రబంధ. ౭౯౪.

దుముకులాడు. దే. అ. క్రి. (దుముకులు+ఆడు.) గంతులువేయు. (శ. ర.)

దుముక్కు. దే. వి. ఉఱుకుటయం దగుధ్వని కనుకరణము. "గీ. ముక్కు గొఱికికొని దుముక్కునఁ దననేన,సరస కుఱికి రామచంద్రుఁ గాంచె." రామా. ౯. ఆ. ౧౪౯.

దుముదారు. దే. వి. 1. (అశ్వాదుల) గతివిశేషము. "సీ. మూపురంపు గఱికి నేపరిముకుమచ్చ త త్తడి వడి దుముదారుఁ జూప." ఉ. హరిశ్చ. 3, ఆ. ౧3౧; 2. ముందటిసైన్యములకు రక్షకముగా వెనుక నుండుసేనానాయకుఁడు. "గీ...సరసమన్నీలు దుముదార్లు చతురవితత, సకలసేనాసమేతులై సందడింప,రమణఁ జెలువొంద రాజమార్గమున వచ్చె,రమ్యగుణపాళి శ్రీకృష్ణరాయమాళి." కృష్ణ. ౨, ఆ. ౧౪౯; 3. సేన,దండు. "సీ... ఏడిక్కుఁ జూచిన నెలదేటిదుముదారులు..." శశాం. ౪, ఆ. ౬౪, స్వా. 3, ఆ. ౭౪. విశే. ఒక్కుమ్మడి; సంకులము. "గీ.హైమరథములఁ దోలి గంధాంధభద్ర,కరులఁ గాలాడి దుముదారుగా హయాళిఁ,జేరువకు నూకి భటులకుఁ జేయి వీచి, యభ్యమిత్రీయ దేవసైన్యంబుఁ గదిసి." దశా. ౨, ఆ. ౪౭౬. "క. వారలసేనలపై దుము,దారుగను మురాసురుండు తనయులు దానుం భోరునఁ బోరొనరించెను..." సత్యా. సాం. ౪, ఆ. ౧౧౧. (బ్రౌ.)

దుముదుము. దే. విశే. (దుము+దుము.) దుమ్మయినది, ఛిన్నాభిన్నమయినది. "క తల్లీ నిను వెఱపించుచు,వి ల్లే రెత్తించుకొనెడు వెఱబొమ్మల నీ, కల్లరిరక్కసిజంతల, త్రుళ్లడఁతునె వనము వెఱుకుదున్ దుముదుము గాన్." రామా. ౬, ఆ.౧౯౯. (శ. ర. పా.)

దుమ్మరము. దే. వి దుమ్ము. "సీ. ఒకపరి మైఁ గ్రమ్ము కుసుమపరాగము మైఁజల్లుకొన్న దుమ్మరమ్ముగాఁగ." సుదంశా. ౨, ఆ. ౧౨౬.

దుమ్మరమాడు = దుమ్మాడు. "సీ. కమ్మపుప్పొడిలోన దుమ్మరం బాడించి చలువగొజ్జఁగినీటఁ జల్లుకొలిపి." రాధికా. 3, ఆ. ౧3౦.

దుమ్మాడు. దే. అ. క్రి. (దుమ్ము+ఆడు.) ధూళి చల్లుకొను. "గీ. కొమ్మ లందఱు రతనంపుసొమ్ము లూడ్చి సూనరజములు సోఁకినసొలపు మేను లమరగంటలు గీసి దుమ్మాడినట్టి, మరునిమద వేఁదుఁగులరీతి సరసిఁ జొరఁగ." కృ. శతకం. ౨, ఆ. ౧౬౨.

దుమ్ము. దే. వి. 1. ధూళి,పరాగము. "సీ. పువ్వుఁ బుప్పొడిదుమ్ము పొదలె నిప్పొదలలో సిద్ధాళు లెపుడు వసించుచున్నేమొ." ఉ. రా. 3, ఆ. ౬౫, ఆము. ౪, ఆ. ౮౧; 2. ఎముక. "సీ. పొట్టలు చట్టలు బొమ్మలు దుమ్ములు మోవులు ప్రేవులు పొలలు దలలు." అచ్చ. యు. ౧3౫. (ముద్రి. పా. 'దొమ్ములు.' శ. ర. పా.)

దుమ్ముదూళి. ద్వ. విశే. (దుమ్ము+దూళి) పిండిపిండియైనది; ఛిన్నాభిన్నమైనది. "ఉ. కొన్నిటిహస్తముల్ సదియఁ గొన్నిటికొమ్ములు దుమ్ముదూళి గాఁ, గొన్నిటికుంభము ల్వగుల..." భార. భీష్మ. ౨,ఆ. ౨౧౧.

దుమ్ములగొండి. దే. వి. (దుమ్ములు+గొండి.) —ఎముకలు తినుజంతువు—మృగవిశేషము, కొర్నవగండు. (శ. ర. బ్రౌ.)

దుయుంముడి. దే. వి. (దుయుం+ముడి) సులభముగా నూడఁదీయఁ దగుముడి, జాఱుముడి. "సీ. జాగి లాలపసిండిసరి పెనల్ సడలించి పట్టెడల్ దుయుంముడిఁ గట్టువారు." చంద్ర. ౨, ఆ. 3౨.

దుయుం=దూయు. (చూ. దుయుంముడి.)

దుయ్యు. దే. అ. క్రి. 1. వెడలు. "వ...నిన్ను శపియింప నే మెంతవార మని యుపచారోక్తులు పలుకుచు దుస్సి పోయిరి..." భో. ౭, ఆ. ౯౪; 2. (బాణము మొ.) రంధ్రము చేసికొని పోవు. "క. వీరుద్ధ్రమిథునవేళనకై రతిపతి యేయ దుస్సి హరితద్యుతిఁ బై,నా రెగయఁ బొటమరించిన, నారసములమైన లనంగ నన లవి మించెన్." ఆము. ౫, ఆ. ౧౧౫. స. క్రి. 1. త్రెంచు. "గీ. పూసద్రాడు దుయ్యను లేసు పొలఁతిమెడకుఁ, బెరువు పా లింట నేడ్చినబిడ్డకైన, మిడువ లే డెల్లదానను జెడితి మొల్లఁ,బోయితిమి ప్రాలు గల పట్టి పుట్టఁబట్టి." హరి. పూ. ౫, ఆ. ౨౮౯; 2. (ఉఱనుండికత్తి. మొ.) పైకితీయు. "క. అని మరుబాములఁ బడలేనని కైదువు దుస్సి దాఁటు నాయితముబలెన్, బెనఁగునల యుఱితీయచేసురి, యు నులిమి బలిమి విడిపించి యను ననురక్తిన్." సా. ౨, ఆ. ౨3౬, సీతావి. 3, ఆ. ౭౭.

దురంగి. దే. వి. (హిం. దురంగీ.) రెండురంగులు కలిసినరంగు. "వ...మెల్దురంగిచందువలు......" శశాం. ౪, ఆ. ౨౦౨. (బ్రౌ.)

దురంతము. సం. వి. అ. పుం. దుఃఖకరమైనపర్యవసానము. విశే. (అ. ఆ. అ.) 1. తుదిలేనిది, అనంతము; 2. దుఃఖముతో ముగియునది; 3. దాఁటరానిది.

దురటిల్లు = దురపిల్లు. భా. శాం. ౨, ఆ. ౧౦౯. ౫, ఆ. ౨౮3. ఉ. రా. ౮, ఆ. ౯౪.

దురతిక్రమము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అతిక్రమింపరానిది; 2. దాఁటరానిది; 3. గెలువరానిది; 4. నివారింపరానిది.

దురత్యయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నాశములేనిది; 2. దాఁటరానిది.

దురద. దే. వి. (శ. ర.) 1. కండూతి. "గీ. దూలజిల నవ నవ గాఁడు దురద యనఁగఁ,బరఁగుఁ గండూతి..." ఆం. భా. ద్వి. ౧౨౯; 2. కసరు. (శ. ర.)

దురదకంద. ద్వ. వి. (దురద+కంద.) కసరు గల కంద, మహాకందము. (శ. ర)

దురదగొండి. దే. వి. దూలగొండి. "సీ. దూలగొండి యనఁగ దురదగొండి యనఁగఁ దీఁటకోవెల యనఁ దేజరిల్లుఁ గండూర..." ఆం. భా. ద్వి. ౫౪.

దురదగోవెల. దే. వి. దూలగొండి. (శ. ర.)

దురదపెట్టు. దే. అ. క్రి. (దురద+పెట్టు.) దురద కల దగు. (వ్యవ) కాలు దురదపెట్టుచున్నది.

దురదుర. దే. క్రి. విశే. ద్రు. వడిగా, శీఘ్రముగా. "చ...దుస్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు గన్నుల నిప్పు లొల్కఁగా, దురదురవచ్చి తాఁకె రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్." భాగ. ౧౦, స్కం. పూ. ౧౧౪౨, రుక్మి. ౫, ఆ. ౭౬.

దురదృష్టము. సం. వి. అ. న. దౌర్భాగ్యము, అదృష్టహీనత.

దురపిలు. దే. అ. క్రి. 1. శోకించు, దుఃఖించు. "ఉ. ఆహరిపాటి కంతఁ గడు నల్లుచు వట్టివిభుఁ

దథావిథా,లాపవిచిత్రతం దురపిలంగ వియోగద
హాత్వమున్, జూపుచుఁ జేర వేఁడు వివశుం గయి
శోక కఠోరవృత్తిఁ బె,న్నాపపముఁ గట్టుకొన్నగత
భాగ్యుకు నా కివి షాట్లు నెచ్చెలీ." ప్ర. భా. ౫,
ఆ. ౧౭౩; 2. పరితపించు. "క. నరునిశరీరమున
జరా,తరుణి ప్రవేశించి ప్రజ్ఞఁ దరలించుఁ జూమీ,
పరకాంతగృహముఁ జేకొని, దురపిలునిల్లాలి వెడలఁ
ద్రోచినభంగిన్." వాసిష్ఠ. ౧, ఆ. ౧౨౩.

దురపిల్లు = దురపిలు. 1. (శోకించు, దుఃఖించు.)
"క. గురుసుతుఁడు పాండవులకుక్, గర మల్గును
వారిఁ బొదువఁగా నతఁ డీప్రా,ద్దురవడిఁ గదియును
బోయెద, దురపిల్లకు మయ్యా మది విధూత
కళంకా." భార. శల్య. ౨, ఆ. ౩౭౫. దశ.
౧౦, ఆ. ౧౬౫; 2. (పరితపించు.) "గీ. ద్రుపద
నందన పరిభవదుఃఖమునకు, నుల్లమున దురపిల్లుచు
నున్నసరసి, వేఁడినిట్టూరుపో యన..." భార.
విరా. ౬, ఆ. ౨౩౭; 3. (కలఁతనొందు.)
"ఉ...సామనంబు చే,పెట్టి కలంచినట్లు దుర
పిల్లెడు..." జై. ౬, ఆ. ౫౫. భార. ద్రో. ౪,
ఆ. ౨౬౭. వి. (వ్యథ, దుఃఖము.) "సీ...పందురు
దురపిల్లు కొందలంబు, సలుపు నోవి యనంగ చను
వ్యథ..."ఆం. భా. ప్ర. ౧౫౦.

దురభివేశము. సం. విణ. (అ. ఆ. అ.) చొర శక్యము
కానిది. "శా. ప్రాంతాదిప్రవిభాగబోధరహిత
ప్రాగ్ద్వారముం గాశర, స్వాంతత్రాసకరంబు నై
దురభివేశం బైనయాలోను నిశ్చింతుండై సతికీలు
పట్టికొని చొచ్చెక్ భీముఁ డత్యుగ్రతన్." భార.
విరా. ౨, ఆ. ౩౨౭.

దురము. వై. వి. (సం. ఉదరమ్.) 1. యుద్ధము.
"క. అరివీరుల ఘోరం బగు, దురమున వధియించు
జేల వోసం బయ్యెన్." భార. శాం. ౧, ఆ.
౧౧౨. ఉ. రా. ౧, ఆ. ౧౫౫; 2. వేగము.
"చ. రమణి క్రమక్రమంబున దురంపువగక్ నటి
యించె వింతగా." శశాం. ౩, ఆ. ౧౧౦.

దురమెక్కు. ద్వ. అ. క్రి. (దురము+ఎక్కు.) విజృం
భించు, చెలరేఁగు. "సీ. సెరసాని దొరసాని హరి
సెక్కి దురమెక్కి వగ వింత జోడైన వగపుఁ
జూపు." శశాం. ౩, ఆ. ౧౧౨. [ఆ. ౧౩౬.

దురవస్థ సం. వి. ఆ. స్త్రీ. చెడ్డస్థితి. భార. విరా. ౩,

దురవాపము. సం. విణ. (అ. ఆ. అ.) పొందరానిది.

దురస్తు. హిం. వి. బాగు; మరమ్మతు. (బ్రౌ.)

దురస్తుచేయు. మి. స. క్రి. బాగుచేయు, మరమ్మతు
చేయు. (బ్రౌ.)

దురా. దే. వి. దురాయి, ఆజ్ఞ. (చూ. దురాపెట్టు.)

దురాకృత్యము. సం. వి. అ. న. అకృత్యము, చెడ్డపని.

దురాగ్రహము. సం. వి. అ. పుం. 1. చెడ్డపట్టుదల,
చలపాదితనము. "ఆ. ఏను ధార్తరాష్ట్రహిత
మాచరించుట,కై వెనంగి చెవుల కప్రియంబు,
లైన నిన్నిమాట లాడిన నాబుద్ధి,విని దురా
గ్రహంబు విడువవలయు." భార. కర్ణ. ౨, ఆ.
౩౭; 2. చెడ్డకోపము. విణ. (అ. ఆ. అ.) చెడ్డ
ఆగ్రహము గలది. [గలవాఁడు.

దురాత్ముఁడు. సం. విణ. (న్. నీ. న్.) చెడ్డమనస్సు

దురాధర్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎదిరింప
రానివాఁడు; 2. వినయము లేనివాఁడు.

దురాపము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందరానిది;
2. చేరరానిది.

దురాయి. దే. వి. ఆజ్ఞ, శాసనము. "సీ. జగదధిష్ఠాన
భాస్వజ్జ్యోతి యగువాఁడు బ్రహ్మాదు లదరు
దురాయివాఁడు." కృష్ణ. ౧, ఆ. ౨.

దురారోహ. సం. వి. 1. బూరుగుచె; 2. శీవల్లిచె.

దురారోహము. సం.వి.అ.పుం. 1. కష్టముతో ఎక్కుట;
2. కొబ్బెరచె; 3. తాడిచెట్టు; 4. ఖర్జూరముచె;
5. తొండ, సరటము. విణ. (అ. ఆ. అ.) ఎక్కు
టకు శక్యము కానిది. భార. ఆర. ౩, ఆ. ౧౫.

దురాలభ. సం. వి. ఆ. స్త్రీ. తీఁటకసిందచె.

దురాలభము. సం. విణ. (అ. ఆ అ.) పొందరానిది.

దురాలాపము. సం. వి. అ. పుం. 1. చెడ్డమాట; 2 తిట్టు

దురాలోకము. సం. విణ. (అ. ఆ. అ.) చూడ
శక్యము కానిది.

దురాపెట్టు. దే. స. క్రి. (దురా+పెట్టు.) శాసించు,
ఆజ్ఞాపించు. "క. నుదురా జిగిక్రొన్నెలచె,న్ను
దురాగత మనును దేంట్లను దురాపెట్టు,న్నదురా
యని ముంగురు లెన్నదురా నెఱివేణి జీవనదు
రాజసమున్." శశాం. ౩, ఆ. ౪౧.

దురాశ. సం. వి. ఆ. స్త్రీ. పేరాస.

దురాసదము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొంద
రానిది; 2. ఎదిరింపరానిది; 3. చొరరానిది.

దురితము. సం. వి. అ. న. 1. పాపము; 2. కష్టము,
బాధ. "క. వెడలుసెడ గాఢపీడం, బడి నసుడిపడి

యూని నొత్తువడి యొకభంగిన్, వెడలఁగ గ్రహ భూతము లప్పుడు దొడఁగి యనేకదురితములు గల్పించున్." భార. స్త్రీ. ౧ ఆ. ౩౭. దశ. ౨, ఆ. ౭౬. విశే. (అ. ఆ. అ.) 1. పాపమును గలిగించునది; 2. పాపముతోఁ గూడినది.

దురిష్టము. సం. వి. అ. న. 1. శాపము; 2. ఒకనికి కీడుగావించుతలఁపుతోఁ జేయుయజ్ఞము, అభిచారక్రతువు.

దురీన. దే. క్రి. విశే. ద్రు. తటాలున, అకస్మికముగా. "పంచచామరము...పొల్తుక ల్దలిర్తు ర,చ్చరల్ మలం గలంచ మించుసంద్రునందుఁ బుట్టుచు,న్దురీన లేచునట్టిజాడవోఁపఁ జూప రెన్నఁడున్." య. ౩, ఆ. ౭౧.

దురుక్తము. సం. వి. అ. న. చెడ్డమాట. విశే. (అ. ఆ. అ.) పరుషముగాఁ బలుకఁబడినది.

దురుక్తి. సం. వి. ఇ. స్త్రీ. చెడ్డమాట.

దురుత్తరము. సం. వి. అ. న. 1. చెడ్డయుత్తరము; 2. కష్టముతో దాఁటుట. విశే. (అ. ఆ. అ.) 1. దాఁటరానిది; 2. బదులు చెప్ప శక్యము కానిది.

దురుపదములు. మి. వి. బ. (దురుసు+పదములు.) త్వరగా వేయుపాదవిన్యాసములు. "గీ. దురుపదంబులు సొక్కుమై పిరులు వాసఁగ, సరిగనిరుఁగేలఁ గుంచియల్ సవదరించి, పెక్కువగ జక్కిణీకొప్పు ద్రొక్కెనొక్క, చక్కనిమిటారి ..."దశా. ౭, అ. ౧, ఆ. ౨౮౭.

దురువరము. దే. వి. నీచజాతి. "సీ. పొసఁగినఘన విధంబులవా రటుండఁగా దురువరంబులవారిమురువు హెచ్చె." కువల. ౧, ఆ. ౪౦.

దురుసు. దే. వి. 1. వేగము, తొందర. "సీ. దురుసుగా వెడలెడి బిరుసులపూవులు భూనభోంతరములఁ బొదివికొనఁగ." దశా. ౭, అ. ౧, ఆ. ౨౫౩. ఉ. రా. ౫, ఆ. ౨౩౯; 2. కాఠిన్యము. "ద్వి...ఇంత, దురుసు గైకొనుట నీదోషంబు గాదు." విష్ణు. పూ. ౨, ఆ. (శ. ర.) ఉ. రా. ౮, ఆ. ౧౧౧; 3. విధము, రీతి. "వ...చట్టంబున సెగయు సాతాళబాణంబుల దురుసున..." ప్రబంధ. ౭౮౮. విశే. 1. కఠినము, గట్టిది. "సీ. దారుశిలాయంత్ర తతి కొమ్మకొమ్మలఁ దొరంబు గావించి దురుసుసేయు." ఉ. హరి. ౪, ఆ. ౨౭౮. ఉ. హరివ. ౪, అ. ౧౩; 2. బిగువు సడలనిది. "సీ. దురుసుగాఁ బై కొంగు ద్రోసి కట్టినవాలుచనుదోయి బిగిచూపు జంట రవికె." దశా. ౮, అ. ౩౭౮; 3. క్రూరము. "గీ. దురుసుదండనలతో ధర యేలు దొరఁ గన్న హింసాపరుం డని యెంచ రతని." ఉ. రా. ౬, ఆ. ౧౯౮. కువల. ౪, ఆ. ౩౧; 4. అధికము, హెచ్చైనది. "క. పరహితుఁడు మిన్నుఁ గనుఁగొని,దురుసౌ నీకమీఁద వానతూరల్ నిజమం, దరు లెదురెదురే చూతురు..."శుక. ౨, ఆ. ౩౪౫. ఇందు. ౨, ఆ. ౫.

దురేషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. చెడ్డకోరిక; 2. శాపము.

దురోదరము. సం. వి. అ. న. 1. జూదము; 2. పందెము; 3. పాచిక, అక్షము.

దురోదరుఁడు. సం. వి. అ. పుం. జూదరి.

దుర్గ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. నీలిచెట్టు; 3. నల్లపిచ్చుక.

దుర్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దౌర్భాగ్యము, దుస్థితి; 2. పేదఱికము; 3. ఆపద; 4. నరకము; 5. చెడుత్రోవ. విశే. (ఇ) దుర్మార్గుఁడు. "క. క్రతుఫలములు వడయఁగ దుర్గతులకు దొరకొనదు తీర్థగమనంబునఁ ద,త్క్రతుఫలము లందుదురు దుర్గతులును నిది మునులమతము కౌరవవృషభా." భార. అర. ౨, ఆ. ౨౪౩.

దుర్గతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. దీనుఁడు; 2. బీద, దరిద్రుఁడు; 3. ఆపదనొందినవాఁడు.

దుర్గమము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పోవుటకు కష్టమైనది; 2. పొందుట కష్టమైనది; 3. తెలిసికొనుట కష్టమైనది, బోధపడనిది. "వ...కాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును వనభ్యస్తశాస్త్రంబునుంబోలె దుర్గమంబును...నర్తనాగారంబుముఖభాగస్థలంబు సేరి..."భార. విరా. ౨, ఆ. ౩౨౫. (ఇది మొదటియర్థమునకు నుదాహరణము.)

దుర్గము. సం. వి. అ. పుం. న. 1. వనపర్వతప్రవాహాదులయందు కష్టముగా నుండుత్రోవ; 2. కోట; 3. ఒడుదొడుకుభూమి; 4. కష్టము, ఆపద. "సీ. కుంభసంభవునకై ఘోరదుర్గముల లోపాముద్ర యలజడిపాలుం గాదె."భార. విరా. ౨, ఆ. ౨౩౪. భార. శాం. ౬, ఆ. ౨౯౯.

దుర్ఘటము. సం. విణ. (అ. ఆ. అ.) ఘటింపరానిది.

దుర్ఘోషము. సం. వి. అ. పుం. 1. దుష్టధ్వని; 2. ఎలుఁగుబంటి. విణ. (అ. ఆ. అ.) దుష్టమైనధ్వని కలది. [జయుఁడు.

దుర్జనుఁడు. సం. వి. అ. పుం. ఖలుఁడు,దుష్టుఁ డగు

దుర్జయుఁడు. సం. వి ఇ. (అ. ఆ. అ ) గెలువ శక్యము గానివాఁడు. "వ...ఇట్లు దుర్జయుం డగునర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు..." భార. విరా. ౫, ఆ. ౧౩౩.

దుర్జాతము. సం. వి. అ. న. 1. కష్టము, ఆపద; 2. అయుక్తత. విణ. (అ. ఆ. అ.) 1. చెడ్డపుట్టుక గలది; 2. అనుచితము.

దుర్జ్ఞేయము. సం. విణ. (అ. ఆ. అ.) తెలిసికొన శక్యము గానిది.

దుర్ణయము. సం. వి. అ. పుం. దుర్నీతి. "క. కర్ణుండు రేఁచి పెట్టఁగ,దుర్ణయపరు లైనశకుని దుశ్శాసను లీ,నిర్ణయమె మే లనఁగ నీ,కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్." భార. ఉద్యో. ౨, ఆ. ౨౮౦. విణ. (అ. ఆ. అ ) దుర్నీతి కలది,దుర్నీతితోఁ గూడినది. "క. కర్ణునిసారథినైనను,నిర్ణయమున నేను బార్థునిం గాచెద నా,దుర్ణయవిచారు నెమ్మెయిఁ,గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్." భార. ఉద్యో. ౧, ఆ ౧౧౨.

దుర్దమము. సం. విణ. (అ. ఆ. అ.) అడఁపరానిది. "చ. మనబల మెంత యుంకయు సమగ్రసముద్యమ దుర్దమంబుగా,మునుమును గూర్చి..." భార. విరా. 3, ఆ. ౧౦౯.

దుర్దాంతము. సం. వి. అ. పుం. 1. దూడ; 2. కలహము. విణ. (అ. ఆ. అ.) 1. గర్వించినది; 2. అడఁపరానిది. భార. విరా 3, ఆ. ౧౮౨.

దుర్దినము. సం. వి. అ. న. 1. మబ్బు క్రమ్మినదినము; 2. చెడ్డదినము; 3. కటికచీఁకటి, అంధకారము; 4. వర్షము. "శ్లో. ద్విషాం విషహ్య కాకుత్స్థ స్తత్ర నారాచదుర్దినమ్, సన్మంగళస్నాతఇవ ప్రతిపేదే జయశ్రియమ్." రఘువంశము. ౪, సర్గము. ౪౧. శ్లో.

దుర్దురూటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నాస్తికుఁడు. (ఇది కర్మధారయసమాసోత్తరపదముగనే యుండును. ఉదా:-మీమాంసక దుర్దురూటుఁడు = నాస్తికుఁడైన మీమాంసకుఁడు.)

దుర్దైవము. సం. వి. అ. న. దురదృష్టము,దౌర్భాగ్యము.

దుర్ధరము. సం. వి. అ. పుం. 1. పాదరసము; 2. నరకవిశేషము; 3. నల్లజీడివి. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపరానిది; 2. భరింపరానిది.

దుర్ధర్ష. సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పివి.

దుర్ధర్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎదిరింపరానివాఁడు; 2. దరి చేర రానివాఁడు.

దుర్ధీ. సం. విణ. (ఈ) దుష్టబుద్ధి కలవాఁడు (వ్యతి. సుధీ.)

దుర్ధీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)=దుర్ధీ.

దుర్నయము. సం.=దుర్ణయము.

దుర్నామ. సం. వి. ఆ. స్త్రీ. ఏఁనుగుజలగ.

దుర్నామము. సం. వి. న్. న. 1. చెడ్డపేరు; 2. మూలవ్యాధి. విణ. (న్. ఆ, మ్నీ, న్.) చెడ్డపేరు కలది.

దుర్నిమిత్తము. సం. వి. అ. న. 1. అపశకునము; 2. దుష్టహేతువు.

దుర్నీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. చెడ్డనడవడి; 2. దుష్పరిపాలనము. విణ. (ఇ). చెడ్డనడవడి కలవాఁడు.

దుర్నీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుర్నీతి గలవాఁడు.

దుర్నిరీక్ష్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడ శక్యము గానివాఁడు; 2. తెలియ శక్యము గానివాఁడు. "వ...కృపాచార్యభీష్ములు పార్థుబాణపాతప్రకారంబులు ప్రణామకుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గనుంగొని సంతసిల్లిరి ధనంజయుండును దక్కినవారికి దుర్నిరీక్ష్యుం డగుచు నమోఘాకారంబునను నసాదరంబు సేసి గోవుల పజ్జం బోవుచుండె..." భార. విరా. ౪. ఆ.౨౫౪.

దుర్బలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొలఁది బలము కలది; 2. బక్క,కృశము; 3. శిథిలము, బిగి లేనిది.

దుర్భగ. సం. వి. ఆ. స్త్రీ. 1. మగఁడొల్లనియాఁడుది; 2. గయ్యాళి, ధూర్తస్త్రీ.

దుర్భగుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అదృష్టహీనుఁడు, దురదృష్టవంతుఁడు; 2. అందము లేనివాఁడు. [లేమిడి.

దుర్భిక్షము. సం. వి. అ. న. 1. కఱవు,క్షామము; 2.

దుర్మంత్రము. సం. వి. అ. పుం. 1. చెడ్డమంత్రము; 2. చెడ్డయాలోచన; చెడ్డసలహా. "వ...కర్ణశకుని

దుర్మంత్రంబు పట్టి గాంగేయునివచనంబు లప్ర మాణంబులు చేసి..." భార. విరా. ౫, ఆ. ౩౬౭.

దుర్మతి. సం. వి. ఇ. పుం. ఒకానొకసంవత్సరము. స్త్రీ. చెడ్డబుద్ధి. విణ. (ఇ) 1. దుష్టబుద్ధి గలవాఁడు; 2. మూఢబుద్ధి గలవాఁడు.

దుర్మనసుఁడు. సం. విణ. (స్). 1. చెడ్డమనస్సు గల వాఁడు; 2. వ్యాకులమైన మనస్సు గలవాఁడు.

దుర్మనుఁడు. సం. = దుర్మనసుఁడు.

దుర్మరణము. సం. వి. అ. న. (విషభక్షణాదులచేఁ గలుగు) చెడ్డచావు; అకాలమృతి.

దుర్మరము. సం.=దుర్మరణము. [కాఁడు 2. శత్రువు.

దుర్మిత్రుఁడు సం. వి. అ. పుం. 1. కుచ్ఛితపుచెలి

దుర్ముఖము. సం. వి. అ. న. దుష్టమైనముఖము. పుం. 1. గుఱ్ఱము; 2. ఒకానొకసంవత్సరము (దుర్ముఖి అని వాడుక.)

దుర్యశము. సం. వి. స్. న. దుష్కీర్తి,అపకీర్తి. "వ.... నేను నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింపకుండ వ్రతంబు పూనినవాఁడం గావున నంగనాపూర్వుం డగు శిఖండి నాకు ఖండనంబునం గోదండపాండిత్యంబు మెఱసి ననుఁ జంపను నొంపనుఁ గడంగినయేని నింతకంటెను దుర్యశంబు గలదె..." భార. ఉద్యో. ౪, ఆ. ౪౦౦. [గానిది.

దుర్లక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) చూడ శక్యము

దుర్లభము. సం. వి. అ. పుం. 1. కచోరము*; 2. గంట్లకచోరము*. విణ. (అ. ఆ. అ.) 1. పొంద శక్యము గానిది; 2. అతిప్రశస్తము; 3. ప్రియము.

దుర్వచము. సం. విణ. (అ. ఆ. అ.) చెప్ప శక్యము గానిది.

దుర్వర్ణము. సం. వి. అ. న. 1. వెండి; 2. నూఁగు దోసమ*; 3. కుష్ఠభేదము. పుం. చెడ్డరంగు. పుం. న. దుష్టమైనయక్షరము. విణ. (అ. ఆ. అ.) 1. చెడ్డ రంగు కలది; 2. చెడ్డయక్షరములు గలది.

దుర్వసము. సం. విణ. (అ. ఆ. అ.) వసింపరానిది.

దుర్వహము. సం. విణ. (అ. ఆ. అ.) మోయ శక్యము గానిది.

దుర్వాదము. సం. వి అ. పుం. 1. అపకీర్తి; 2. అప్రియ ములు పలుకుట; 3. నింద,అపవాదము; 4. అశా స్త్రీయ మైనవాదము.

దుర్వారము. సం. విణ. (అ. ఆ. అ) వారింపరానిది.

దుర్విదగ్ధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గర్వితుఁడు; 2. మూర్ఖుఁడు "వ. అనిన విని కీచకుండు...తల పోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున నమ్మ గ్గకుం దనసన్నిధిఁ గామవికారంబు పుట్టుట గలుగ భావించుచు..." భార. విరా. ౨, ఆ. ౭౨.

దుర్విధుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దరిద్రుఁడు; 2. దుర్జనుఁడు; 3. నీచుఁడు, అధముఁడు; 4. మూర్ఖుఁడు.

దుర్వినీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. వినయము లేనివాఁడు; 2. విద్యలయందు శిక్షితుఁడు కాని వాఁడు; 3. చెడ్డనడవడి కలవాఁడు.

దుర్విపాకము. సం. వి. అ. పుం ఈజన్మమునఁనో పూర్వజన్మమునఁనో చేసినకర్మములయొక్క చెడ్డ ఫలము, చెడ్డఫలము.విణ. (అ. ఆ. అ.) చెడ్డఫలము కలది.

దుర్విభేదము. సం. విణ. (అ. ఆ. అ.) భేదింపరానిది. "వ... ప్రతిపక్షదుర్విభేదప్రమాణ విచార్యమాణ వేదార్థమీమాంసకగోష్ఠీవివాదనాదంబులనుం జేసి మ్రోయుచు..." భార. ఆది. ౪, ఆ. ౨౨.

దుర్వివేకము సం. వి. అ. పుం. అజ్ఞానము, వివేకము లేమి. "గీ. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు, పరసతీసంగమము ధర్మపథమునందుఁ,బరఁగువారలు పరిహరింపంగ గనియు,వినియుఁ దెలియనె యిది దుర్వివేక మగుట." భార. విరా. ౨, ఆ. ౯౯.

దుర్విషహము. సం. విణ. (అ. ఆ. అ.) సహింప రానిది. "మ. జలదాకారత నొంచెఁ దే రితఁడు పర్జన్యాకృతిం బొల్చె దోర్జలతీవ్రారినిదాఘదుర్వి షహగర్వస్ఫూర్తి నిర్మూర్తి గాన్." భార. విరా. ౪, ఆ. ౧౫౧, భార. ద్రో. ౧, ఆ. ౩౪.

దుర్వేదము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలిసికొన రానిది; 2. పొందరానిది.

దుర్హార్దుఁడు. సం. వి. ద్. పుం. పగవాఁడు. విణ. (ద్) చెడ్డమనస్సు గలవాఁడు.

దులదుల. దే. వి. 1. వెడలుట మొదలగువానియందలి శైఘ్ర్యానుకరణము. (సంభ్రమము అని శ. ర.) "క తెలతెలనయ్యెను దిక్కులు,పలపల నుడుగ ణము మాయఁబాఱెను బక్షుల్,కలకలనఁ గూయఁ జొచ్చెను,దులదులఁ దుమ్మెదలు తమ్మితుటుముల వెడలెన్." హంస. ౧, ఆ. ౧౩౮. యు. ౪, ఆ. ౨౨; ?. పొడి. (చూ. దులదులనగు.)

**దులదులనగు.** దే. అ. క్రి. (దులదుల+అగు.) పొడి యగు. "గీ. కాలి దులదులనై పిండిపోలె రాలి, నట్టియింజేట్లు గలవు నీ వారగింప." కాళ. 3, ఆ. ౬౮. పద్మ. ౯, ఆ. ౨౨౬. [శాఁదేలు.

**దులి.** సం. వి. ఇ. పుం ముని. ఇ, ఈ. స్త్రీ. ఆఁడు

**దులుచే** = దులుచు. (బ్రా.)

**దులుపు.** దే. స. క్రి. 1. దులుచు, రాల్చు; (ప్రక్కల నంటుకొన్న గింజలు మొదలగునవి.) ఊడిపడఁ జేయు. "గీ. గాదె తెఱచి చూచి కలబియ్య మన్నియుఁ, దెగిన నందుఁ జొచ్చి తిరుగువాఁ, దుడిచి దులిపి యొక్కదోసెఁ డుండినఁ దెచ్చి, వారిజాక్షి వండి వారమోపె." భో. ౬, ఆ ౧౧౫. (శ. ర. పా.) "గీ. అగదాదండ ముద్దండ మగుచుఁ దాఁకి, తోఁకవెండ్రుక లైనను దులు పదయ్యె." దశా. ౧, అ. ౭౯౯; 2. జాడించు. విదిలించు. "సీ. జడముడు ల్వీడిన సవరగా ముడు చుచు జిలుఁగువన్నియలబొంతలు దులుపుచు." చెన్న. ౫, ఆ. ౩౭౮; 3. మేలుకొనఁజేయు. "శా. మూలం గూర్కెడుపాఁపకన్నె దులుపన్ మూర్ధాభిషేకంబునన్." పి. శకుం. ౨, ఆ. ౧౧౪; 4. నిందావాక్యములు పలుకు. వ్యవ:—వానిని పట్టుకొని బాగుగా దులిపి విడిచిపెట్టినారు. (బ్రా. వా.)

**దులుము.** దే. స. క్రి. సంఘటించు, కూర్చు. (బ్రా.)

**దువ.** వై. స. (సం. ద్వ.) రెండు. (శ. ర.)

**దువారము.** వై. వి. (సం. ద్వారమ్.) వాకిలి, ద్వారము. "సీ. కదళికా స్తంభముల్ కనకకుంభంబులు దల దువారంబులఁ దగులుపఱచి." రసిక. ౬, ఆ. ౧౮౯. అచ్చ. అయో. ౧౦.

**దువాళము.** దే. వి. వేగమున అంతమేరయు సమముగా పాఱెడిఅశ్వధారాప్లుతము. "సీ....దువాళి మన దు. గీ. వాళి యనఁగను బ్లుతముగా వఱలుచుండు." అం. భా. ద్వి. ౧౯౧. నిరం. ౨, ఆ. ౧౯.

**దువాళి.** దే.వి. 1.అశ్వధారావిశేషము, ప్లుతము. "శా. స్వచ్ఛాయన్ సుముఖిక్ సహస్రకరుఁ గొల్వం బెట్టి హేలావిహారేచ్ఛన్ గోడిగ యై దువాళిఁ జనియెన్..."వరాహ. ౫, ఆ. ౯౦; 2. పరుఁగు. "క. వాలిసుఁడు నీవా యనుచుం, జలిబిడిచి ప్రవాస మెసఁగ శయములఁ గాళ్లం,బిలకిల నెదు రుగఁ బఱచిన, నలగాడిదయున్ దువాళి నటిలెకి వచ్చెన్." వేం. పంచ. ౩, ఆ. ౫౦; 3. బోయలు పాలకీ మోయుచు పలుకుమాటలలో నొకటి. "వ...బెస్తలు ..పదిలము మించదుగు దువాళి ...అన విని సంతసిల్లి కంసారి ."ప్రబంధ.౬౦౫.

**దువాళించు.** దే. అ. క్రి. 1. ప్రసరించు. "మ... కొలువుం జాలించి తాఁ బోయి భూపరశీకుఁడు మనంబు హేమవతిపై బాళిం దువాళింపఁగన్." హంస. ౧, ఆ. ౬౭. నీలా. ౨, ఆ. ౪౮; 2. వేగమునొందు. "శా. సంపెంగ ల్పరు వంది క్రొవ్విరులచే శంపాలతాలక్ష్మి నొందింపం బాద పము ల్ఘనంబు లయి పూఁదేనె ల్దువాళించి వర్షిం పన్ వల్విరి చల్లి .."పి. శకుం. ౨, ఆ. ౧౨౭. స. క్రి. 1.(అశ్వాదులకు)ప్లుతగతివిశేషముతో నడి పించు, దువాళము చేయించు; పరుగెత్తించు. "ఉ...జుమాయించిన నేల గ్రక్కదల నిట్టటుగా పడిఁ ద్రొక్కుచున్ దువాళించిన గట్టు గు ట్టనక లెక్కకు మిక్కిలిదవ్వు వాఱుచున్." య. ౧, ఆ. ౧౭౬. వరాహ. ౫, ఆ. ౧౧౧; 2. ప్రస రింపఁజేయు, వ్యాపింపఁజేయు. "మ...మించుల్ దువాళించుక్రొమ్మెఱుఁగుంజొద్రికకావిపట్టు సుర భూమీజార్పితం బిచ్చె .."వసు. ౫, ఆ. ౯౪. కాళ. ౨, ఆ. ౬.

**దువాళిసేయు.** దే. స. క్రి. (దువాళి+చేయు.) పరు గెత్తించు, తఱుము. "శా. ప్రాలేయంబు దువాళి సేసిన భయభ్రాంతంబులై యూష్మముల్, వాలా యంబుగఁ బ్రాఁకె నంధ్రవనితావక్షోజశైలాగ్ర ముల్." క్రీడా. ౪౮. ప్రబంధ. ౨౪౨.

**దువ్వ.** దే. వి. ధూళి, దుమ్ము. "శా. ప్రువ్వుల్ గాఱుచు నీచుకంపు తఱచున్ రోఁతై తఱిం బాసి పెన్,దువ్వన్ బ్రుంగినగర్దభాస్థిఁ దినుచున్..." మల్లభూ. నీతి. ౯. అం. భా. ద్వి. ౭౯౯; 2. పుప్పొడి, పరాగము. "చ...వచ్చెఁ గ్రొవ్విరి రవదువ్వచాల్ గొని దివిన్ మలయాచలవాతపోత ముల్."చంద్రా. ౪, ఆ. ౧౦. అహల్యా. ౨, ఆ. ౧౧; 3. కణము, పలుకు. "చ. కపురపుఁదట్క దువ్వల సగంబున కెమ్మవ గాసె కూర్చి గంధ పొడివితానఁ దావులు కనంబడఁజేర్చిన సర్వభస్మము ..."పార్వ. ౨, ఆ. ౫.

**దువ్వటము.** వై. వి. (సం. ద్విపటీ.) విలువగలసన్నని వస్త్రము. "సీ. బంగారుసరిగంచుఁరంగు సుగ్గడితంపుఁ

జలిదువ్వటము బెళబెళల సీన." ఘటికా. ౧, ఆ. ౧౬. బహు. ౫, ఆ. ౧౧౯.

దువ్వలువ. వై. వి. (దువ+వలువ.) 1. విలువగల సన్ననివస్త్రము. "గీ. వనితయొక్కర్తు మేలుదువ్వలువఁ దెచ్చి. సొరిదిఁ గట్టంగ..." కాళిందీ. ౫. ఆ. ౯౫. పారి. ౧, ఆ. ౧౨; 2. వస్త్రము. "సీ. వైష్ణవి తోలుదువ్వలువ మడిఁచె." హర. ౪, ఆ. ౮౭. (తోలుదువ్వలువ = చర్మాంబరము.)

దువ్వాటము. దే. విణ. డోలాందోళితము; ఇటునటు పాలుపోనిది. (మనస్సు. బ్రౌ.)

దువ్వాళి. దే. వి. పరుగు. "ద్వి. బారుగా నిలిచిన పారసీకము ల,వారణంబులును దువ్వాళి సేతేర." ప్రభు. ౫, ఆ. ౧౪౩, పు.

దువ్వి. వై. వి. (సం. ద్వీపీ.) 1. పెద్దపులి. (శ. ర.); 2. చిఱుతపులి. "సీ. దువ్వులు రేచులు చివ్వంగు లడిదపుమెకములు సవరపుమెకము లిర్లు." రసిక. ౧, ఆ. ౯౬.

దువ్వు. రూం. దే. స. క్రి. జుట్టు. 1. చిక్కుదీయు, చక్కఁజేయు. "గీ. చెలువ చిత్రాళి పాళిగాఁ జికురభరము, సరసత భరించెఁ జంపకచ్ఛాయ డాయ, ననుచు నఖరోచు లంతట నలరుచుండఁ, గొప్పు దువ్వెను గోవిందుఁ డొప్పు మీఱ." కాళిందీ. ౬, ఆ. ౫౯. ఆము. ౫, ఆ. ౩౮; 2. వాత్సల్యముతో స్పృశించు, నిమురు. "క. అన సొర మెఱుఁగ నేర్చితె. తనయా యని చుంచు దువ్వి తద్దయుఁ బ్రేమం,బున..." దశా. ౪, ఆ. ౧౫౬; 3. (వలపుచే) స్పృశించు, పుణుకు. "గీ. అమరికకు మెచ్చి కెమ్మోవి యాన నిచ్చు, నాని కల నిచ్చు సరిపల్కు మని యదల్చుఁ,గేళిఁ బడలితి పని నవ్వుఁ గేల దువ్వు, బాల గిఱికొన్న బాళి పుంభావకేళి." శశాం. ౩, ఆ. ౧౧౨; 4. బుజ్జగించు, మంచిమాటలాడు. వ్యవ:—వానిని దువ్వి తనపనిఁ జేయించుకొనుచున్నాఁడు. వై. వి. (సం. ద్వీపీ.) 1. పెద్దపులి. "ఆ. ఈశువరము చేత నెవ్వఁడే నిప్పాట, శూరుఁ డైన దువ్వుఁ జూచి నక్క, యొడలు గాల్చుకొన్నవడువున మీా రంత,లావుమాటలాడ లజ్జ గాదె." ఉ. హరి. ౪, ఆ. ౧౬౫; 2. చిఱుతపులి. "సీ... ఒకదువ్వ వైరమేర్చి, గీ. కఱవ వచ్చిన నమ్మునికదకుఁ బొఱు,తెంచె నాతుక్క..." భార. శాం. ౩, ఆ. ౯౨.

దువ్వెన. దే. వి. (దువ్వు. ధా.) దువ్వుట కుపయుక్తమైనసాధనము, కంకతిక. "క... కుంతలము దీర్పఁగఁ గొను, దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్." స్వా. ౩, ఆ. ౨. కువల. ౪, ఆ. ౮౩౭.

దుశ్చరము. సం. వి. అ. పుం. 1. ఎలుఁగుబంటి; 2. కప్పచిప్ప, శంబూకము. విణ. (అ. ఆ. అ.) 1. చేయరానిది; 2. చొరరానిది; 3. దుష్టముగా చరించునది.

దుశ్చేష్టితము. సం. వి. అ. న. తప్పుపని, దుండగము. విణ. (అ. ఆ. అ.) దుష్టమైనచేష్ట కలది.

దుశ్చ్యవనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు. "సీ. పొమ్ము దుశ్చ్యవన నీపోయెడు తెరు వన్న సొతండు నవ్వుచు నతనిఁ జూచి." భార. శాం. ౪, ఆ. ౩౯౨. [సాధ్యము కానిది.

దుశ్శకము. సం. విణ. (అ. ఆ. అ.) అశక్యము,

దుశ్శకునము. సం. వి. అ. న. అపశకునము.

దుష్కరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేయుటకు శక్యము కానిది; 2. చేతి కందనిది. "చ... ఇట్టి మీారు దుష్కరముగ నూతిలోఁ బడిన కాంచనపీటఁ గొనంగ నేర కొం,డొరుల మొగంబు సూచి నగుచుండఁగఁ జన్నె యుపాయహీనతన్." భార. ఆది. ౫, ఆ. ౨౧౦.

దుష్కీర్తనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అపకీర్తి గలవాఁడు. "ఉ... దుష్కీర్తను నెల్లచేటులును గిట్టి హరించు ననండె తొల్లి భక్తార్తిహరుండు నాఁ బరఁగునంబుజసూతి జగద్ధితంబుగన్." భార. అర. ౭, ఆ. ౭౯౪.

దుష్ట. సం. వి. ఆ. స్త్రీ. 1. దుష్టస్త్రీ; 2. లంజె.

దుష్టము. సం. వి. అ. న. దోషము. విణ. (అ. ఆ. అ.) 1. చెడ్డది; 2. అధమము, తక్కువైనది; 3. దోషముతోఁ గూడినది; 4. దుడుకైనది, దుండగము గలది.

దుష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. దోషము; 2. చెడుట.

దుష్పంకము. సం. వి. అ. పుం. దుష్ట మగుపాపము, అధికపాపము. "ఉ... వి,జాంకముఖ విలాసదర హాసనుఖంబుల కిచ్చ నొంది దుష్పంకము లాచరించి తుది బాధలఁ బొందితి మేమి చెప్పెడిన్." సానందో. ౧, ఆ. ౧౪.

దుష్వృతమము. సం. వి. అ. న. కృష్ణము. "క. వినురేఖా మాత్రపుఁ జం,దు్రనియట్టులజీవుఁ డతనిదుష్వృతముంబో,లినయజ్ఞానము..." భార. శాం. ౫, ఆ ౧౩౦.

దుష్పత్రము. సం. వి. అ. పుం. 1. దుష్టమగు పత్రము; 2. నల్లకచోరము. విశ. (అ. ఆ. అ.) చెడ్డ యాకులు గలది.

దుష్వృషమము. సం. వి. అ. పుం. అధర్మము, అన్యాయము. "వ...దుష్వృషవర్తను లగుదుర్యోధనాది కుమారుల వారించి..." భార. భీష్మ. ౧, ఆ. ౧౨. భార. ఆర. ౩, ఆ. ౭౪.

దుష్ప్రారంభము. సం వి. అ. పుం. దురుద్యమము, దౌష్ట్యము. "క. కౌరవసభఁ దానాడిన, గౌరవ వాక్యములు కార్యఖడ్గక్రమవా,క్పూరములు సుబోధనుదు,ష్ప్రారంభము నల్పవచనపద్ధతిఁ జెప్పెన్." భార. ఉద్యో. ౪, ఆ. ౧౦.

దుష్ప్రీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దుష్ట మగు ప్రేమ, కూడనిప్రేమ; 2. అసంతుష్టి.

దుష్యత్. సం. శత్రు. చెడుచున్న, నీచులగుచున్న. "ఉ...ఉచితంపుఁబనుల్ దగఁ జేయఁ గాక దుష్యత్పరివారయోగ్యపరిచారముమైఁ జనునట్టిదానవే." భార. విరా. ౨, ఆ. ౯౩.

దుసరులు. దే. వి. బ. అతిశయము. (చూ. దుసరులు వాఱు.)

దుసరులువాఱు. దే. అ. క్రి. (దుసరులు+పాఱు.) శ్రేష్ఠించు, అతిశయించు. "ద్వి. మిసిమిసిలంపులు మేసి తాఁ గ్రొవ్వి, దుసరులువాఱె గంతులుగొను లేళ్లు." నవ. ౧, ఆ. ౪౭, పు.

దుసికిలఁబడు. ద్వ అ. క్రి. (దుసికిలన్+పడు.) జాఱు. "క. కలకంఠకమ్రగాత్రలు, గలవంటకుఁ జవులు తెలుపఁ గలకంఠమునన్, బెలుకంటఁ జెలఁగఁ జెలి బం,తుల కెంటఁ బయంటచెఱఁగు దుసికిలఁ బడియెన్." బహు. ౪, ఆ. ౩౨.

దుసికిలఁబాఱు. ద్వ. అ. క్రి. (దుసికిలన్+పాఱు. స్వార్థమున.) జాఱిపోవు, నశించు. "చ. దుసికిలఁ బాఱ చీఁకటులు, దూఁకొనుచుండెడు కీలుగంటుపైఁ బసపొనరించి..." హంస. ౪, ఆ. ౫౫.

దుసికిలు. దే. అ. క్రి. (దుసుకు ధా.) 1. జాఱు. "గీ... కెంగేలఁ జెఱకువిల్లుఁ, బూవుటమ్ములు దుసికిలి భూమిఁ బడిన,నుగుడఁ డెంపురఁ గైకొను మరునిఁ జూచి." పార్వ. ౩, ఆ. ౩౭. పిరం. ౨, ఆ. ౨౧.

దుసుకు. దే. అ. క్రి. జాఱు. "చ. ఒసపరి గబ్బిగుబ్బ గవయుబ్బునఁ గొనసియాడఁ గ్రొమ్ముడిగా, దుసికి పిఱుందుపై సరులు తుంపెసలాడ..." ముకుంద. ౩, ఆ. ౨౪౩. వి. ఉదుటు, ఔన్నత్యము. "సీ. ఉసికొల్పి వంచించి దుసుకులచనుదోయి చే నంట..." రాధికా. ౧, ఆ. ౧౨౪.

దుస్తరము సం. వి. అ. పుం. ఆపద. "చ...ఇట్టి దుస్తరంబునఁ దగులావు సేయ మముబోఁటులు లేరె చలంబు డింపు మీ,వని పలితోడఁ జెప్పి సరిదాత్మజుఁ డప్పుడు ప్రాభవంబునన్." భార. భీష్మ. ౩, ఆ. ౧౩౮. విశ. (అ. ఆ. అ.) 1. తరింప శక్యము గానిది, దాఁట రానిది; 2. మీఱ రానిది.

దుస్తు. దే. వి. 1. వస్త్రము, బట్ట. "సీ. శుభశోభనముల దుస్తు లొసంగ వెన్క ముందులకు నట్టెలుసేయఁ గలరు గాక." చంద్రా. ౩, ఆ. ౪౫; 2. అందము. (శ. ర) విశ. అధికము. "శా. అస్తోకక్రతు హోమధూమములచాయల్ తీర్థకుండంబులన్ దుస్తైతోఁపఁగఁ జూచి..." చంద్రా. ౩, ఆ. ౭౯.

దుస్త్యజము. సం. విశ. (అ. ఆ. అ.) విడువఁ గూడనిది.

దుస్సంచరము. సం. వి. అ. పుం. చెడ్డసంచారము. విశ. (అ. ఆ. అ.) సంచరింప సాధ్యము కానిది. "క. ఇరువాఁగునకుం గయ్యము,కర మద్భుతభంగి నమరెఁ గరిహయసుభట, స్ఫురితాంగశకలచయదం,తురమై ధరిత్రి దుస్సంచర గాన్." హరి. పూ. ౪, ఆ. ౧౩౯. రూ. దుస్సంచారము.

దుస్సర. దే. వి. సుదర్శనలత. "సీ. దుస్సర యనఁగ సుదర్శనలత పేరు దనరుచుండు." ఆం.భా. ద్వి.౬౫.

దుస్సాధము. స. విశ. (అ. ఆ. అ.) సాధింప శక్యము గానిది. "శా. నాకుఁ బరమోత్సాహంబు సంధిల్ల దుస్సాధం బైనవిరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘటించె,తే..." భార. విరా. ౨, ఆ. ౨౭౫, ౪, ఆ. ౨౦౩.

దుస్స్థము. సం. వి. అ. పుం. 1. కోఁడి; 2. కుక్క. విశ. (అ. ఆ. అ.) 1. నిలుకడ లేనిది. 2. ఆరోగ్యము లేనిది; 3. చెడ్డస్థితిలో నుండునది.

దుస్స్మరము. సం. విశ. (అ. ఆ. అ.) స్మరింప శక్యము గానిది.

దుహిత. సం. వి. ఋ. స్త్రీ. కూఁతురు, పుత్త్రిక.

దుహిలీ. దే. వి. హస్తాభరణవిశేషము. "ద్వి. తోరంపు వజ్రాలదుహిలీలడాలు, పేరెంపుఁ గెంపులపిడిమీఁదఁ దిరుగఁ, గరపద్మమున మించుగమకించుగచ్చు, సురటువట్రువ గాలి సుడియంగఁ ద్రిప్పి" నవనాథ. ౧, ఆ. ౬౩, పు.

## దూ

దూఁకలి. వై. వి. ఔ. (సం. దుఃఖమ్.) బాధ. "క. ఆఁకొంటి రిన్నిదినములు, పోఁకంతయు భిక్ష వీటఁ బుట్టకయునికిన్, ఆఁకటిదూఁకట కలఁగితి, రేఁకఁట వాయంగ భిక్ష లిడియెద రండీ." భీమ. ౨, ఆ. ౧౨౪. ద్వి. శ. సా. ౧, ఆ. ౩౦, పు.

దూఁకు. దే అ. క్రి. ఊఁకు, గంతువేయు. "చ... జెట్టి వగ దూఁకొని మింటికి దూఁకె దూఁకినన్, గెలువు కవుత్థ్స యీయసుర గెల్వకమున్న..." కవు. ౫, ఆ. ౧౯౦. దశా. ౪, అ. ౨౩౨.

దూఁకుడు. దే. వి. (దూఁకు ధా.) 1. అశ్వగతివిశేషము, వల్గితము. "సీ. చౌకళిం పనఁగను దూఁకు డనం గను వల్గిత మ్మగును..." అం. భా. ద్వి. ౧౮౯; 2. త్వర, తొందర. వ్యవ:—నీవు దూఁకుడు తగ్గించుకొనవలెను. విణ. ఎగుడుదిగుడు. (శ. ర.)

దూఁకొను. దే. అ. క్రి. (దూఁటు+కొను.) 1. కలుఁగు, జనించు. "చ. శిలలు గరంగెఁ దర్వులను జేవ ఱేఁ బల్లవలక్ష్మిభక్తిపం,క్తులఁ గలబొమ్మలం గరము దూఁకొనె జీవిత మద్భుతంబుగన్." ఉద్భ. ౨, ఆ. ౧౫౩. పరమ. ౫, ఆ. ౨౦౬; 2. అతిశయించు. "క... రమా వరుఁ డంబుదగంభీరమ,ధురభాషలఁ బల్కెఁ బ్రియము దూఁకొనుచుండన్." భాగ. ౪, స్కం. ౮౦౪; 3. తలఁచు, భావించు. "ఉ. మీకరుణావలోకనసమేతులఁగా మముఁ జేయఁ జిత్తముల్, దూఁకొనెనేని... దానఁనె శుభం బగు మీఁదిమదీయజన్మముల్." భాగ. ౩, స్కం. ౫౩౧; 4. లోనికిఁజొచ్చు, "చ. దుసికిలఁబాఱు చీఁకటులు దూఁకొనుచుండెడు కీలుగంటువైఁ, బస పొనరించు..." హంస. ౪, ఆ. ౪౦. స. క్రి. 1. పొందు, ప్రాపించు "మ...మమ్ము మ్మాదురితం బింతకుఁ దెచ్చె మీఁద శుభముం దూఁకొందు మే మారయన్." భాగ. ౩, స్కం. ౫౨౮. హరి. ఉ. ౬, ఆ. ౧౦; 2. ఆవరించు. "చ. పొగ సొగయంగ ముద్దుచెలిపొందిక కాటుకకంటికొనలన్, దిగిమొఁడునశ్రుబిందులయుఁదీర్ఘరుచుల్ దలపించు నీలపున్, జిగిబిగిఁ గాంచుముత్తియపుఁజిప్పల లోపలనుండి వచ్చువేఁ,తుగుణము లైనముత్యముల దూఁకొనుకప్పుమెఱుంగు పొంగునన్." కాళిందీ. ౫, ఆ. ౧౩౦; 3. స్వీకరించు, గ్రహించు. "చ. అహిమరుచిప్రతాపుఁ డగునాకుశనాభుఁడు బ్రహ్మదత్తుకై, దుహితృశతంబు నీ నతఁడు దూఁకొని వారిఁ గ్రమంబునం గరగ్రహణముసేయు..." భా. రా. బాల. ౩౨౨. [వా.)

దూఁట. దే. వి. అరఁటియూచ, దవ్వ. (శ. ర. బ్రా.

దూఁటిపుచ్చు. దే. స. క్రి. (దూఁటి+పుచ్చు) తిరస్కరించు. "సీ. తేఁటిమొత్తము నేపు దూఁటిపుచ్చఁగ నొప్పుకమనీయనీలాలకములు చూచి." పి. శకుం. ౨, ఆ. ౧౪౦.

దూఁటు. దే. అ. క్రి. 1. చొచ్చు, ప్రవేశించు. "చ. జలనిధిలోన దూఁటి కులశైలము మీఁటి ..." దా. శ. ౩౩; 2. తప్పించుకొను. "శా. తానే దొంగిలి గిన్నె శిష్యవరుచేతం బంపి చౌర్యంబు బైలైనం దూఁటి చనంగ నేరమిని..." విప్ర. ౫, ఆ. ౬౨. సా. ౧, ఆ. ౧౦౨. స. క్రి. 1. పొడుచు. "వ. తల్లులం దూఁటి కుడుచుతరపి దూడలు..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౯౬. దశా. ౭, అ. ౩౨౪; 2. దాఁటు, లంఘించు. "గీ. ఏడు పాతాళములు దాఁటి యిలయుం దూఁటి, యంబరము దాఁకె నవ్వరుణాంబుధార." కాశీ. ౫, ఆ. ౧౩౯. వి. పొడవు. "సీ. పొడుగుదూఁటులు మాని యొదిగి క్రేపులగుంపు జననీనికాయంబుచాటుఁ జేర." శుక. ౨, ఆ. ౩౪౨.

దూఁటుకట్టు. దే. అ. క్రి. (దూఁటు+కట్టు.) నిండు, వ్యాప్తమగు. "సీ. కంఖాణతురగరింఖాపూజితక్షమాధూళి నభ్రపథంబు దూఁటుకట్టె." వరాహ. ౫, ఆ. ౨౭. కు. సం. ౧౨, ఆ. ౧౪౦.

దూఁటుకొను. దే. అ. క్రి. (దూఁటు+కొను.) ఎగురు, వ్యాపించు. "వ ... వానివదననిశ్శ్వాసపవనంబు భువనంబున ధూమదహనజ్వాలాభీలంబై సంవత్సరంబున కొక్కమాఱు వెలువడి భూనభోంతరం బెల్లను నిరంతరసికతారజఃపటలంబు దూఁటుకొనం జేయు." భార. అర. ౪, ఆ. ౩౯౪.

దూఁబిడి. దే. వి. (దూయు+పిడి.) నూలు తోడు నపుడు చీడు తగిలించుటకు నిలిపెడిపీఁట మమర్చిన కొయ్య." (శ. ర.)

దూగఱ. దే. వి. 1. కఱదూపము. (శ. ర.); 2. ధాన్యాదులలో నుండుదుమ్ము. (బ్రౌ. వా.)

దూగిలాట. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. గోట దొర్లుడుకాయగొబ్బిళ్లు మోపిళ్లు నీగపోగిస బంతి దూగిలాట." హంస. 3, ఆ. ౧౪౬.

దూచి. దే. వి. బాలక్రీడావిశేషము. 'సీ. దూచియు జాబిల్లి బూచి కన్నులకచ్చి గుడుగుడుగుంచాలు కుందెనగిఱి." హంస. 3, ఆ. ౧౪౬.

దూడ. దే. వి. 1. పశుశిశువు,లేఁగ. "చ. అలయక లేడి దూడగుమి నాఁగెడుక్రోల్పులులన్ వధించు..." ఉ. రా. ౭, ఆ. ౪౧౭. సా. పంచ. ౫, ఆ ౧౧; 2. ఇది నిందయందు మనుష్యశిశువులకుఁ బ్రయుక్తమగును. "సీ. పడుచుదూడలచేత పనియానె వీ రేల యనసూయఁ దో తేరఁ బనుపరమ్మ." కువల. ౨, ఆ. ౨౬. బ. పశువులు. "క. • తలి దండ్రులయనుమతి దూడలఁ గాయఁగఁ బూని ..." చెన్న. 3, ఆ. ౩౧.

దూడలపోలిగాఁడు. దే. వి. పక్షివిశేషము. (బ్రౌ.)

దూడపాల. దే. వి. (దూడ+పాల) గోవిక, వృక్షవిశేషము. "సీ...దూడ,పాల యన గోవికాఖ్యయై పరఁగుచుండు..." ఆం. భా. ద్వి. ౫౭.

దూడుగ. దే. వి. వృక్షవిశేషము. (బ్రౌ.)

దూత. సం. వి. అ. పుం. 1. రాయబారి. "క. తన కడకు వచ్చి మొగమోడనివాఁ డగుదూత పల్కుటకుఁ గోపింపంజనదు..." భార. శాం. ౨, ఆ. ౩౭౮. శశాం. ౪, ఆ. ౨౦౦; 2. కుంటెనకాఁడు. "గీ. అనిలుఁ డనుదూత వోయి తోడ్తో నియ్యం వచ్చె ... అతిపరిశ్రాంతుఁ డైనయయాతి నంత." భార. ఆది. 3, ఆ. ౧౫౬.

దూతము. సం. వి. అ. న. పరితాపము.

దూతి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాయబారము చేయు స్త్రీ; 2. కుంటెనకత్తె.

దూతుఁడు. సం. = దూత. (రాయబారి.) "చ. అనుటయు దేవదూతుఁడు రయంబున నిర్జరనాథుపాలికిం, జని తెలియంగఁ జెప్ప..." భార. స్వర్గా. ౨౯. భార. శాం. ౨, ఆ. ౩౭౮.

దూత్యము. సం. వి. అ. న. 1. రాయబారము; 2. దూతధర్మము.

దూది. దే. వి. విత్తు తీసినప్రత్తి,తూలము. "శా... పిచ్చెక్ గాడ్పు దాఁకన్ దిశల్,దూదుల్ దూలిన యట్ల తూలుటయు నింద్రుం డాదిగా దిక్పతుల్." రామా. ౮, ఆ. ౮౧. స్వా. ౪, ఆ. ౮౯.

దూదిదబ్బ. దే. వి. (దూది+దబ్బ.)తోలు దళసరిగా నుండుదబ్బ. (శ. ర.) [(శ. ర. బ్రౌ.)

దూదినిమ్మ. దే. వి. (దూది+నిమ్మ) మాతులుంగము.

దూదిమడుఁగు. దే. వి. (దూది+మడుఁగు.) భక్ష్యవిశేషము. "సీ. అప్పడాలకొటారు లమృతఫలాదులు వడలకుప్పలు దూదిమడుఁగు గిరుట." శ్రీరం. మా. ౬, ఆ. ౧౧౦.

దూదేకు. దే. వి. (దూది+ఏకు) తురకలలో నొక జాతి; ఆజాతివాఁడు. "గీ. ఎసఁగు బింజారి నాఁగ దూదేకువాఁడు." ఆం. భా. ద్వి. ౨౮౪.

దూనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతాపము నొందినది; 2. బడలినది,పరిశ్రాంతము.

దూప. దే. వి. 1. దప్పి,తృష్ణ. "క. అదె కొలను దూర్పుదెసఁ జెన్నొందవెడు నట కేఁగి దూప యుఁడుగఁగఁ జెలినీరు దగన్ గ్రోలిట్టురమ్మా..." అచ్చ. యు. ౪౧౫. ఆం. భా. ద్వి. ౨౬౦; 2. శ్రమము. "సీ. వికటంపుటెఱకలవిసరున నుప్పొంగు తుప్పరడెందంబు దూ పడంగ." హరి. ఉ. ౫, ఆ. ౧౪౯; 3. పరితాపము; "గీ. తనయునుఁగూఁగూన చెఱనుంటఁ వలఁచి వెతలఁ,దూలు నేలపాలంతుకదూప యడఁప,మొగిలుకడవలజేజేలు ముంచి నించు,వలిచదలువాఁకనీ రన వాన లెసఁగె." అచ్చ. కిష్కి. ౬౨.

దూపటించు = దూపటిల్లు. (బ్రౌ)

దూపటిలు. దే. అ. క్రి. 1. దప్పిగొను. "ద్వి. కడు దూపటిలి యుదకంబులు గ్రోలఁ, దడయక యవ్వేటిదరి కేఁగుదెంచి..." నవనాథ. 3, ఆ. ౨౦౮. పు. రామా. ౬, ఆ. ౨౪౯; 2. శ్రమపడు,అలసటనొందు. "వ...పతులప్రార్థనంబులంబుంభావసురతాడంబరంబునకుం దోడుసూపి దూపటిలి..." స్వా. 3, ఆ. ౨౮. రామా. ౮, ఆ. ౧౩౫; 3. పరితపించు. "వ. విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి విసికి విసిమాలి వేసరి యలసి యూరటఁ బొంది సొలసి జాఁకించి తూలి దూపటిలి యుల్లంబునఁ గ్రోధం బుద్భవించిన." భీమ. ౨, ఆ. ౧౦౧.

దూపటిల్లు = దూపటిలు. (దప్పిగొను.) "చ...సుస్థిరముగ దూపటిల్లె మునిశిష్యుఁడు నేఁడు భన

ఘృమండలాం,తరకమనీయ దివ్యజలధారల జీవముఁ బ్రోతువేని..." కంచిశరభకవి మారిశ్చంద్రో పాఖ్యానము. 3, ఆ. ౧౦౫.(బ్రౌ.)

దూపట్టు. దే. అ. క్రి. (దూప+పట్టు.) అలయు, శ్రమపడు. "సీ. దూరంబు వచ్చిన వారిట సైన్యంబు ప్రజలెల్లఁ జాల దూపట్టినారు." పి. శకుం. ౧, ఆ. ౧౭3.

దూపము. వై. వి. (సం. దూపః.) పొగవేయు సుగంధ ద్రవ్యము. "సీ. తఱచుగాఁ బెట్టినతావి దూపపుఁ బొగల్ గుంపులై మెలఁగుమొగుళ్లు గాఁగ." య. ౪, ఆ. ౧౫3.

దూపాడు. దే. అ. క్రి. తాటించు. (బ్రౌ.)

దూపాత్రి. వై. వి. (దూపము+ఆత్రి.) దూపము వేయు పాత్రవిశేషము. (శ. ర. బ్రౌ.)

దూపించు. యం. దే. అ. క్రి. అలయు,శ్రమనొందు. "క. క్రేపుఁ దలఁచి పసిమేయుచుఁ,జేపిన పాల్గలయ సెండచేఁ బొంధజనుల్,దూపింపమి కఱఁ డంపిన,యూపాగా యనఁగ నదుల నంచలు మెఱసెన్." ఆము. ౪, ఆ. ౧౬౦. వై. అ. క్రి. ధూపము వేయు. "ద్వి. అగలు దూపించిన నల రులు దుఱిమి,మృగమదపంకంబు మెయినిండ నలఁది." నవనాథ. ౨, ఆ. ౭౪. పు.

దూపిడు. దే. స. క్రి. (దూప+ఇడు.) అలయించు, శ్రమపెట్టు. "ద్వి. తొమ్మిదియమ్ముల దూపిడ్డవానిఁ, గొమ్మని గిరిమెత్తుకొని వైచె నతఁడు." రం. రా. యు. 3౫౫.

దూపిలు. దే. అ. క్రి. 1. దప్పిగొను. "ఉ...తాపస పుత్త్రుఁ డాత్మవి,ద్యాసముదగ్రులై నతలిదండ్రులు దూపిలి యుండ వారలన్,గాసిలకుండఁ గుండ నుదకంబుల ముంపఁగ..." రామా. ౨, ఆ. 3౬. చమ. 3, ఆ. ౧౭౦; 2. అలయు,శ్రమనొందు. ఉ. దూరము వోయి యెండఁ బడి దూపిలి వచ్చిన ప్రాణనాథునిన్,ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని దీర్ఘమార్చి యాహారము పెట్టి..." కాశీ. ౨, ఆ. ౮౧; 3. పరితపించు. "గీ బెదరుఁ గన్నీరు నించు దూపిలుఁ గృశించుఁ,బంచశరఘోరశితమాత భల్లభగ్న;మానసాంభోజ యగుచు నమ్మంబువాణి." రసిక. ౪, ఆ. ౮.

దూపుకొను. దే. అ. క్రి. దూపించు. (బ్రౌ.)

దూబ. దే. వి. 1. నపుంసకుఁడు,మందుఁడు. "సీ. పంద యనంగ దూబ యనంగఁ బేడి నా మండనామం బుగాఁ జనును..." ఆ. భా. తృ. ౪౫; 2. అవలక్షణము. "సీ. అవలక్షణభగాఖ్య లలరు దూబ యనంగ..." ఆం. భా. తృ. ౪౫; 3. ఆఁడుగుఱి, భగము. ఆం. భా. తృ. ౪౫; 4. దిబ్బ, ఎత్తుప్రదేశము. "సీ ఎలమావిజొంపముల్ బలసిన నెత్తమ్మికొలనిలోపలిదూబ నెలమిఁ బొదలి." కు. సం. ౫ ఆ. ౧౪౦. విణ. అధముఁడు. "సీ. భృతికి వేదంబు నెప్పెడిదూబ వేదనిందకుఁడు వివామోహి పాతకుఁబు గనుట. గీ. చూచి దశకంథరుఁడు ఖల లూది మఱియుఁ." ఉ. రా. 3, ఆ. 3౨౫.

దూబఱ. దే. విణ. వ్యర్థము; అధికము. వ్యవ:— దూబఱఖర్చు చేయరాదు.

దూబఱదిండి.(దూబఱ+తిండి.) 1.ఎక్కువగా వెచ్చించి తినువాఁడు. "సీ. ఓగు దూబఱదిండి యోచవాఁ డపలక్షణములాఁడు గోలవ్రాత్యము బజారి." హంస. ౫, ఆ. ౧౧3. ద్వి. భల్లా. ౨, ఆ. 3౦. పు. 2. అశ్రమముగా లభించినతిండి తిని జీవించువాఁడు, తేరదిండికాఁడు. "వ...రుద్రా నీవు భద్రదేవద్రుమాటవీ వాటియందు దినమొల దూబఱదిండిమిండజంబవై ... భిక్షాటనక్రీడను నటించితి..."భీమ. 3, ఆ. ౨౧౧.

దూబూచి. ద్వి. వి. (దూయు+బూచి. 'దోబూచి' అని బ్రౌ.వా.) 1 బాలుర నాడించుటయం దనెడు మాట కనుకరణము. "గీ కనుమొఱంగి చెలుల్ మఱుఁగున నడంగి,తొంగి చూచి దూబూచి యన్నం గికాకిక న్నగఁ గుమారుఁ గొఁగిట గార వించి." సా. ౧, ఆ. ౪౯. 2. బాలక్రీడావిశేషము, (శ. ర.) "సీ. పచ్చతాజినుఁగుఁగ్రొంబనులసోరణ గండ్ర బుడిబుడిఁ బొదవి దూబూచు లాడి." చంద్రా. ౧, ఆ. ౪౨.

దూముడి. దే వి. (దూయు+ముడి.) జాఱుముడి. "ఉ. కంగులదాల్ చెలంగుఱవికల్ సడలించి చెఱంగుబంగరుల్, రంగు లెసంగుపల్వలు తెర ల్చుచుఁ బావడదూముడిన్ గళల్, సింగపుఁజిన్ని కౌనులను జిక్క గదించి బిగించి కాంతు లుప్పొంగెడి మేనులం దుదుటుభూషలు గొన్ని దొలంగఁ జేసినన్." ఉ. హరిశ్చ. 3, ఆ. 3౪.

దూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తపించుచున్నది; 2. తపింపఁజేయఁబడుచున్నది. "వ ఇవ్విధంబున మదనవేదనాదూయమానమానసుం డగుచు నిట్లని వితర్కించు." భార. విరా. ౨, ఆ. ౧౫౪.

దూయించు. దే. స. క్రి. (దూయు ధా. ప్రే.) దూయఁజేయు వా:-చాప దూయించుచున్నాను.

దూయు. దే. అ. క్రి. 1. రంధ్రిముపడు. "ఆ. షణ్ముఖుండు దివ్యశరమున ఘనశితంబుగాబు దూయనేయఁ బాలకొల్లిగరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప..." భాగ. ౫, స్కం. ౨౬౫. 2. చొచ్చు, తటాకించు "గీ. తూకొనెను జొచ్చెఁ జొరఁబాఱెఁ దూఱె దూసెననఁ దటాకించె ననుమాట కర్థమగును." ఆం భా. తృ. ౧౨౨; 3. వెల్లు. "ఆ... కల్లపనులు చెప్పక యొండొరుల్ దూసి రిండ్ల కాకు దూసినట్లు." రుక్మి. ౫, ఆ. ౧౧౧; 4.(బాణము మొ.) నాఁటి వెడలు. "చ. చతురుల లోన నెంతయును జాణ వటంచును నేను గొంగలించితి నిటు మాఱుమో మిడఁగఁ జెల్లునె యోరసికాగ్రగణ్య యద్భుత మగునట్టి బంగరపుబొంగరపుంగవఁ బోలునీకుచద్వితయము బొమ్మ నాఁటి యలమీఁపున దూసె నటంచుఁ జూచితిన్." (కూచిమంచితిమ్మకవిచాటువు.); 5. రాచుకొని పోవు. వ్యవ:—ఆతాయి వానిప్రక్కనుండి దూసికొనిపోయినది; 6. చాప మొ. అల్లు. వా:—చాప దూయుచున్నాఁడు; 7. గుప్పిలితోఁ గోయు. వా:—చింతాకు దూయుచున్నాఁడు.

దూయుఁదీఁగ. ద్వ వి. (దూయుఁ+తీఁగ.) సుదర్శనలత. "సీ. దూసర యనంగ దూయుఁదీఁగ యనంగ దుస్సర యనంగ సుదర్శనలత పేరు దనరుచుండు." ఆం. భా. ద్వి. ౬౫.

దూయుఁముడి. దే. వి. (దూయుఁ+ముడి.) జాఱుముడి. "సీ. బ్రహ్మాస్త్రబంధంబు పట్టుఁదొరపుదూయుముడియె యనాయాసమునను విడువ." రామా. ౭, ఆ. ౭.

దూరదర్శి. సం. వి. న్. పుం. 1. పండితుఁడు; 2. గ్రద్ద. విణ. (న్. నీ. న్.) 1. దూరమందలివానిని జూచువాఁడు; 2. దూరాలోచన కలవాఁడు.

దూరనగోలలు. దే, వి. బ. బాలక్రీడావిశేషము, తూరనతుంకాలు. (బ్రా.)

దూరపాతనము. సం. వి. అ. న. దూరమునుండి పడఁగొట్టుట?. "క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాతనాభిలుఁడు వ్యర్చస్త్రాసితరిపుఁడు ధనుశ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్." భార. విరా. ౫, ఆ. ౬.

దూరము. సం. వి. అ. న. 1. దవ్వు; 2. దవ్వున నున్నది.

దూరించు. సం. స. క్రి. దూరముగాఁ జేయు, లేకుండఁ జేయు. "క. ధారాధరగళదురురసధారానిర్ఘరము నందుఁ దత్త్వజ్ఞులకున్, దూరించెను సమవిషమా, కారజ్ఞానములు రూపకం బొక్కటి గాన్." కాళింది. ౪, ఆ. ౬౩. రుక్మా. ౪, ఆ. ౭౩.

దూరితము. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగాఁ జేయఁబడినది; పోఁగొట్టఁబడినది. "చ. ప్రతిహతరాగకోపభయుఁ బంకరుహప్రభవప్రభావు దూరితదురితున్ మునీశ్వరవరిష్ఠు వసిష్ఠుమహామునిన్. ..." భార. ఆది. ౭, ఆ. ౧౩.

దూరీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) దూరముగాఁ జేయఁబడినది.

దూరీభూతము. సం. విణ. (అ. ఆ. అ.) దూరమైనది.

దూర్యము. సం. వి. అ, న. 1. మలము, విష్ఠ; 2. గంట్లకచోరము✻.

దూర్వ. సం. వి. ఆ. స్త్రీ. గఱిక✻.

దూఱనాడు. దే. స. క్రి. (దూఱు+ఆడు.) నిందించు. "క. ఈకరణి దూఱనాడి న,నూకృష్ణమృగంబు పల్కులు ..తనమనంబు నెఱియం జేయన్." స్వా. ౬, ఆ. ౧౭. కువల. ౪, ఆ. ౧౧౦.

దూఱు. దే. స. క్రి. నిందించు. "క. పీటఁడితనంబు వెట్టుచు, దూఱం బని లేదు నిన్ను." భా. రా. యు. ౨౨౫. వరాహ. ౩, ఆ. ౪౭; 1. నింద, అపకీర్తి. "గీ. అనుజ తనుజులుఁ జెలులు వియ్యములు నడుగు,మాలి పోదురు నీకుఁగా మనుజనాథ, దొరకుఁ గులనాశనుం డనుదూఱు మేలె." భార. ఉద్యో. ౩, ఆ. ౩౪౧. హరి. ఉ. ౬, ఆ. ౧౭౬; 2. తగవు. (చూ. దూఱుచెప్పు, దూఱుచేయు.) విణ. నింద్యము, గర్హింపఁదగినది. "ఉ.... దూఱగునాఱడిచావుమాన్పఁగాఁ, జూచుట మేలొ ..." దశ. ౩, ఆ. ౧౪౦.

దూఱుచెప్పు. దే. అ. క్రి. (దూఱు+చెప్పు.) తగవు వెట్టు. "గీ. అమరపతికొల్వునకు వచ్చె సుమశ

రుండు, గలుగుచుఁ బాలిండ్లగయ్యాళితలిరుబోండ్ల, యారజపుబేరజపుఁ జేఁత లపుడు జూచి, కచ్చుకొని దూఱుచెప్పంగ వచ్చుకరణి." చంద్రా. 3, ఆ. ౨౭.

దూఱుచేయు. దే. అ. క్రి. (దూఱు+చేయు) తగవు పెట్టు. "ఉ. ఎవ్వరిఁ గీడుపల్కితిమొ యెవ్వరిఁ జూడఁగ నాడినారమో, యెవ్వరి దూఱుచేసితిమొ యెవ్వరిమేలు సహింపమైతిమో..." మల్హ. ౧, ఆ. ౪౧. పు.

దూఱుదుంకములు. దే. వి బ. బాలక్రీడావిశేషము. "సీ. వక్షోజములు జాఱి వ్రాలిపో మోఁగాళ్ల కడదాఁక దూఱుదుంకంబులాడ." విప్ర. ౪, ఆ. ౧౯.

దూఱుదుంకెనలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తొంగలిఱెప్పల దూఱుదుంకెనలాడుసోలు జూపులు మరు మేలుఁకొల్ప." విక్ర. ౮, ఆ ౧౦౧.

దూఱపడు. ద్వ. అ క్రి. (దూఱు+పడు.) నిందింపఁబడు. "వ. కావున సత్యవ్రతనిష్ఠుం డగుయుధిష్ఠిరుండు పౌగద్ధతుం డగువాఁడు గాని దూఱుపడ నర్హుండు గాఁ డని పెండియు ని ట్లనియె." భార. విరా. ౨, ఆ. ౧౮౨;

దూఱెక్కు. దే. అ. క్రి. (దూఱు+ఎక్కు.) నింద నొందు, అపకీర్తినొందు. "ఉ...బంధుసుహృజ్జనంబు లాదిక్కున నున్నవారు గణుతింపక సంపదకై వధించి దూఱెక్కుట దోష మండ్రు టను సీదురవస్థల కోర్వవచ్చునే." భార. ఉద్యో. 3, ఆ. ౧3.

దూల. దే. వి. దురద, కండూతి. "గీ. దూల జీల నప నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి ..." ఆం. భా. ద్వి. ౧౭౯.

దూలగొండి. దే. వి. కండూర, వృక్షవిశేషము. "సీ. దూలగొండి యనంగ దురదగొండి యనఁగ దీఁటకోపెల యనఁ దేజరిల్లుఁ, గండూర..." ఆం. భా. ద్వి. ౫౪.

దూలగోపెల. దే. వి. దూలగొండిచె. "సీ. మామెన యంను నేలమామెన యటీకమామిడి దూలగోపెల మేఁకమేయు. గీ. నాకు..." హంస.౪, ఆ.౧౦.

దూలగొను. దే. అ. క్రి. (దూల+కొను.) దురద పెట్టు; కండూతికలదగు. "ద్వి. తూటుగట్టిన కన్ను దూలగొన్నున్న." పండితా. మహిమ. ౧౦౯. పు.

దూలపోతు. దే. వి. పామనుఁడు. ఎప్పుడును దూల గలవాఁడు అని (శ. ర.) "గీ ..పామనుండు, దూలపో తన సిలసిల్లు దురితదూర." ఆం. భా. ద్వి. ౧౨౨.

దూలము. వై. వి. (సం. స్థూలమ్) ఇ టిగోడలపై అడ్డుగా వేయు పెద్దకఱ్ఱ. "క. విమలమణిమయము లగుదూలములం గంబముల గోడలను వేదులఁ గుట్టిమములఁ బుట్టినప్రాకారములను గర మొప్పుచుండ రచియించె సభన్." భార. సభా. ౧, ఆ. ౧౧. దశా. ౪, అ. ౪౯

దూషకుఁడు. సం. విణ. (అ. షి. ఆ.) 1. తప్పు చేయువాఁడు; 2. నిందించు వాఁడు, 3. దుష్టుఁడు.

దూషణ. సం. వి. ఆ. స్త్రీ. దూషించుట, దూషణము.

దూషణము. సం వి. అ. న. 1. నిందించుట; 2. ఆక్షేపించుట, ప్రతివాదముచేయుట; 3. తప్పు, దోషము; 4. పాపము; 5. భంగపఱచుట. విణ. (అ. ఆ. అ.) 1. భంగపఱచునది, అవమానపఱచునది; 2. నిందించునది; 3. తప్పుచేయునది.

దూషణీయము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁదగినది. [చెఱుచుచున్న.

దూషయత్. సం. శత్రు. 1. దూషించుచున్న; 2.

దూషయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. దూషించువాఁడు; 2. చెఱుపువాఁడు.

దూషించు. సం. స. క్రి. 1. నిందించు. "సీ... దూష్యులఁ దుదిదాఁక దూషించు." భార. ఆర. ౬, ఆ. ౧౫౭; 2. వీడు, త్యజించు. "వ... ఒక్కనికారణంబునఁ గులంబున కెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట ధర్మంబు..." భార. సభా. ౨, ఆ. ౧౯౯.

దూషిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కంటిపుసి; 2. కుంచె, తూలిక; 3. సాలెపురుగు.

దూషిత. సం. వి. ఆ. స్త్రీ. చెఱుపఁబడినస్త్రీ. "సీ... మసనంబులోఁ బడ్డమహితపవ్వుమాలికయును బోలె మదిరాక్షి దుర్జనుకతమున దూషిత గాక మున్న..." భార. ఆర. ౬, ఆ. ౨౦౧.

దూషితము. సం. వి. అ. న. తప్పు. విణ. (అ. ఆ. అ.) 1. చెఱుపఁబడినది; 2. నిందింపఁబడినది; 3. అంతుమోపఁబడినది, అభిశస్తము.

దూషితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁదగినది.

దూష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) దూషింపఁబడుచున్నది.

దూష్యము. సం. వి అ. న 1. గుడారము, డేరా; 2. వస్త్రము; 3 విషము; 4. చీము. విణ. (అ. ఆ. అ.) 1. నింద్యము; చేయరానిది. "క. విను ప్రద్యుమ్నాదిథవ, త్తనయులయెడ నైన నేకతంబున నేకా,సనమున నుండుట దూష్యం,బని యెఱుఁగుము సతులచరిత లతిదుష్కరముల్." భార. ఆన. ౫, ఆ. ౩౨౦; 2. చెఱుపఁదగినది.

దూష్యుఁడు. సం. వి. అ. పు. రాజద్రోహి, రాజ్యోపఘాతకుఁడు. విణ. (అ. ఆ. అ.) దూషింపఁదగినవాఁడు. "సీ. రాజ్యపదస్థుం డరాజ్యపదస్థులఁ, బక్షబలాఢ్యుఁ డపక్షబలుల, విపులార్థవంతుండు విగతార్థసార్థుల నవసరం బెఱిఁగి వాఁ డశ్రమమున, దూష్యులఁ దుదిదాఁక దూషించు..." భార. అర. ౬, ఆ. ౧౫౭.

దూసర. దే. వి. సుదర్శనలతవి. "సీ...దూసర యనఁగ, దూయుఁటీఁగ యనంగ దుస్సర యనఁగ సుదర్శన లతపేరు దనరుచుండు." ఆం. భా. ద్వి. ౬౫.

దూసరి. దే. వి. 1. అపవాదము. (చూ. దూసరికాఁడు.); 2. తృణవిశేషము. (శ. ర.) బ. ధాన్యవిశేషము. "సీ...తృణధాన్యములు చెలంగు,గునుకలు దూసరుల్ గొలివె లనంగను..." ఆం. భా. ద్వి. ౨౩౯.

దూసరికాఁడు. దే. విణ. (దూసరి+కాఁడు.) అపవాదము వేయువాఁడు. "ఆ. దోసకారి యైన దూసరికాఁడైనఁ, బగతుఁడైన వేదబాహ్యుఁడైన, వట్టిలేని పేదవానికిఁ దగు దీవి, ధనికునకు నొసంగఁ దగదు వేమ." వేమన. ౨౫౬౧.

దూసరిబియ్యము. దే. వి. (దూసరి+బియ్యము) అడవిలో పండుధాన్యవిశేషము. "వ...ఒడిసెప్రాలు దూసరిబియ్యంబు నివ్వరివడ్లు గునుకు లూదరు లాదిగాఁ గలుగువన్యధాన్యంబులు..." పి. శకుం. ౩, ఆ. ౧౨.

దూసలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ...లేటచలములు నూఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు దూసలు భీమగుడెలు నేడాకు మొలకలు గుజ్జరులు..." ప్రబం. ౧౧౨.

దూళి. వై. వి (సం. ధూళిః.) రేణువు పరాగము, దుమ్ము. "క. ఆ దూళితోడఁ గుడిచిన,నీదుర్జన్మంబు వచ్చె నిది యెఱిఁగెదుసం,వేదనను పూర్వపుణ్యాఘ,లోదయమునఁ గలిగె..." భార. అను. ౪, ఆ. ౫౦. మార్క. ౬, ఆ. ౧౦౭.

## దృ

దృంభువు. సం. వి. ఊ. స్త్రీ. పాము,సర్పము. "శా. జంబూద్వీపములోన నెంతయుఁ బ్రశస్తం బైన దీనిక్ నట,ద్దృంభూమండలజూటకోటరకుటీభృత్స్వర్ధునీవీచికా,లంబిస్వీన్న నవేందుకందళసుధాలంకార వాగ్వైఖరిక్, జంబూకావ్యము చేసెదన్ బుధజన శ్లాఘానిరాఘాటతన్." జై. ౧, ఆ. ౧౦. పుం. 1. వజ్రాయుధము. 2 సూర్యుఁడు; 3. యముఁడు; 4. రాజు.

దృక్కు. సం. వి. శ్. స్త్రీ. 1. కన్ను; 2. చూపు, దృష్టి; 3. బుద్ధి.

దృఢగాత్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పటికబెల్లము, కండచక్కెర; 2. దృఢశరీరము గలస్త్రీ.

దృఢనీరము. సం. వి. అ. పుం. కొబ్బెరవి.

దృఢము. సం. వి. అ. న. 1. ఇనుము; 2. అతిశయము అధిక్యము. విణ. 1. కఠినము, గట్టిది; 2. పూనిక విడువనిది,పట్టు గలది; 3. బలము గలది; 4. లావైనది,స్థూలము.

దృఢీకరణము. సం. వి. అ. న. దృఢపఱచుట.

దృఢీకరించు. సం. స. క్రి. దృఢపఱచు, నిశ్చయించు. "క...మేనక కొంతసేపు యోజన,ప్రకటించి దృఢీకరించి పచరించి వెసన్." సావి. ౧, ఆ. ౩౨.

దృఢీకారము. సం. = దృఢీకరణము.

దృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆదరింపఁబడినది.

దృతి. సం. వి. ఇ పుం. స్త్రీ. 1. కొలిమితిత్తి; 2. తోలు; 3. చేప; 4. మేఘము.

దృప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. హర్షించిన వాఁడు; 2. గర్వించినవాఁడు.

దృబ్ధము. సం. వి. అ. న. 1. భయము; 2. గ్రుచ్చుట, గ్రథనము. విణ. (అ. ఆ. అ.) 1. భయపడినది, భీతము; 2. గ్రుచ్చఁబడినది,గ్రథితము.

దృబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. గ్రుచ్చుట, గ్రథనము.

దృశ. సం. వి. ఆ. స్త్రీ, కన్ను.

దృశానుఁడు. సం. వి. అ. పుం. 1. ఉపాధ్యాయుఁడు; 2. ఆచార్యుఁడు; 3.బ్రాహ్మణుఁడు; 4.సూర్యుఁడు; 5. లోకపాలకుఁడు.

దృశి. సం. వి. ఇ,ఈ. స్త్రీ. 1. కన్ను; 2. శాస్త్రము; 3. ప్రకాశము; 4. చూపు, దృష్టి.

దృశించు. సం. అ. క్రి. కనఁబడు,ప్రత్యక్షమగు. "ఉ. ఆతప మిచ్చ మెచ్చి శివుఁడు... జగదద్భుతభంగి దృశింప నమ్మధుం,డాతతభక్తియుక్తి నతుఁడై నుతియించె ననేకరీతులన్." ఉ. రా. ౭, ఆ. ౩౬. [చున్నది.

దృశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడు

దృశ్యము. సం. వి. అ. న. కనఁబడువస్తువు విణ. (అ. ఆ. అ.) 1. చూడఁదగినది; 2. కంటికి కింపయినది; 3. తెలిసికొనఁదగినది.

దృషత్తు. సం. వి. ద్. స్త్రీ. 1. ఱాయి; 2. సన్నెకల్లు.

దృష్టము. సం. వి. అ. న. 1. రాజునకు తనబలము వలనఁ గాని పగవారివలనఁ గాని పుట్టుభయము; 2. దర్శనము,చూపు; 3. సాక్షాత్కారము; 4. దృష్టాంతము. "చ...మీ రెఱుంగరె యనంతఫలప్రద మన్నదానమే,తెలుపఁగనేల వేఱె యొక దృష్టము చెప్పెదఁ జిత్తగింపుఁడా." భో. 3, ఆ ౨౭౫. ౧, ఆ. ౧౭౨. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁబడినది; 2. అనుభవింపఁబడినది; 3. తెలియఁబడినది. "వ...ఇవ్విధం బెఱుంగుదో యెఱుంగవో యని దృష్టంబు గావించుటకై..." హరి. ఉ. ౨, ఆ. ౧౩౨.

దృష్టరజ. సం. వి. ఆ. స్త్రీ. సమర్తాడినపడుచు.

దృష్టాంతము. సం. వి. అ. పుం. 1. ఉదాహరణము; 2. శాస్త్రము; 3. చావు; 4. ఒకయర్థాలంకారము. నరస. ౫, ఆ. ౧౫౫-౧౫౬.

దృష్టాంతీకరించు. సం. స. క్రి. ఉదాహరించు. "వ. ఓరాజవదన రాజపాణిగ్రహణంబు దృష్టాంతీకరించి పలికిన నీసుభాషితంబులకు నర్థం బెయ్యది..." నైష. ౬, ఆ. ౮౫.

దృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. కన్ను; 2. చూపు, చూచుట; 3. అభిప్రాయము; 4. ప్రకాశము; 5. ఎఱుక,జ్ఞానము; 6.దృష్టిదోషము. "సీ. తెలియఁ జూచినయెడల దృష్టి తాఁకునో యని వేడ్క దీఱఁగఁ జూడ వెఱతు నిన్ను." సా. 3, ఆ. ౧౦౦. భార. ఆది. ౮, ఆ. ౧౦౬; 7. మెప్పు. "గీ...నాపాటిగొల్లలిచ్చ మెచ్చ నీదృష్టికి నెక్కఁగదుపు,నరయ నేర్తు..." భార. విరా.౧, ఆ. ౪౭౯.

దృష్టించు. సం. స. క్రి. 1. చూచు. "క. శతవర్షంబులనుండియు,క్షితి వర్షము లేనికతన శిథిలంబగుచో,నతివృష్టి మించె జలనిధి,గతి దృష్టించితివె ముజ్జగంబులు ముంచున్." దశా. ౧, ఆ. ౧౭౩. నైష. ౭, ఆ. ౧౬౦; 2. పరిశీలించు,పరికించు. "ద్వి. దృష్టికి దాఁటినతేజంబువాఁడు దృష్టించి చూచినఁ దెలుపఁగువాఁడు." బస. ౧౪౫. పు.

దృష్టిదండ. మి. వి. (దృష్టి+దండ.) దృష్టిదోషము తగులకుండుటకై వేయుదండ. "ఉ...పూదెలగొల్సును బెద్దగంటసిం,గారపుదృష్టిదండ మెడగజ్జల పేరులు నందె లొప్ప .." హంస. ౫,ఆ ౯౬.

దృష్టిదీయు. మి. అ. క్రి. (దృష్టి+తీయు.) దృష్టిదోషపరిహారార్థము దీపము. మొ. చుట్టుద్రిప్పు. "చ. వల నగునబ్జరూపములఁ బాత్రము జ్యోతిర్గుంఁ గాఁగఁ జేసి యవ్వలపులతేనితండ్రి మొగవానికి వాసిగ దృష్టిదీసినన్." రాధికా. ౨, ఆ. ౫౩.

దృష్టిపట్టు. మి. అ. క్రి. (దృష్టి+పట్టు.) కన్నట్టు. "క. ఒకనరునివిక్రమము మాటికిఁ బొగడెద వింత కడుఁ గడిందిగ మనయోధులకుఁ గలయోధవీర, ప్రకరము నీకేల దృష్టిపట్టదు చెపుమా." రాఘవ. ౪, ఆ. ౫౭.

దృష్టిపిడుత. మి. వి. (దృష్టి+పిడుత.) సస్యాదులకు దృష్టిదోషము తగులకుండుటకు సున్నముతోను మసితోను బొట్లు పొడిచి తగిలించుపిడుత. "సీ. నగలపేరింటిసున్నపుబొట్లతో దృష్టిపిడుతలచందాన పీను లొప్పు." చంద్ర. వి. ౧, ఆ. ౬౮.

దృష్టిబొట్టు. మి. వి (దృష్టి+బొట్టు.) దృష్టిదోషము తగులకుండుటకై పెట్టుకొనుబొట్టు. "మ. తొలుగెం పన్నలఁ గింపుమై నలఁది తోడ్తో బ్రాద్దిశాతన్విగ్రొన్నెలయచ్ఛాపని దానమార్చ మును గస్నీరుబ్బైనా నూత్నర,శ్ములు మించెన్ పిదపన్ నిరుద్ధ సలిలంబుల్ పర్వె నా వెన్నెలల్ నలువొందెం బయి దృష్టిబొట్టనఁగఁ జిహ్నం బొప్పె నీలద్యుతిన్." చంద్ర. ౪, ఆ. ౭౩.

## దె

దెంగు. దే. స. క్రి. సంభోగించు. చంద్ర. వి. ౨, ఆ. ౪౯. వి. సంభోగము. క్రీడా. పీఠి. ౫౩. పు.

దెంచేనము = దంచేనము. (కోటలు మున్నగునవి బద్దలుకొట్టుట కుపయోగించు ఆయుధవిశేషము.)

"సీ. క్వథితతైలములఁ బక్వముసేయఁబడువారు డెంచనంబుల వ్రేయఁ ద్రెళ్లువారు." కవిక. ౫, ఆ. ౧౧౩.

డెందము. దే. వి. డెందము,మనస్సు. "ఉ...విప్ర మాత్రుఁగా,డెందమునం దలంచితివొ డెప్పర మప్పుని..." దశా. ౨, ఆ. ౭౯.

డెపగుప. దే. వి. (బాణములు.) తాఁకుటయందు దగు ధ్వని కనుకరణము. "చ. అపుడు యుంగంధరో జ్జ్వలశరాసనముక్త శరప్రదానముల్, డెపగుపఁ దాఁకి వక్షములఁ ద్రెంచి డొనల్ డెగటార్ప..." చంద్రా. ౬, ఆ. ౧౦౬.

డెప్పము. దే. వి. బాణాదుల కెదుట నిల్పినకృత్రిమ లక్ష్యము. "చ. అలికులవేణి డెప్పయిడ కానర పాలుఁడు సూచుచుండె నిశ్చలమతిఁ గాము తూపులకు జానుగ నిల్పినడెప్పమో యనన్." పాండ. ౮, ఆ. ౪౫. భో. ౭, ఆ. ౭౦.

డెప్పరము. దే. వి. 1. ఆపద. "క. డెప్పర మప్పురు షాగ్రణి,కెప్పాటను గలుగనేర దెందును..." భా. రా. ఆర. ౨, ఆ. ౭౧. భా. రా. కిష్కి. ౨౬౭; 2. దురుక్తి, చెడుమాట. "చ. పరమపతి వ్రతన్ సభఁ దపస్వినిఁ బాఁడవధర్మపత్ని ధర్మ రత నయోనిజం బ్రకృతిమానవభామినిగాఁ దలంచి డెప్పరములు వల్కఁగాఁ దగునె..." భార. సభా. ౨, ఆ. ౨౫౫; 3. అతిశయము, ఆధిక్యము. "గీ. దినదినంబును గసికాటుచెనకువలన, దప్పితీఱని తమకంబు డెప్పరంబుఁ,బాప సమకట్టి జారుఁ డప్పాటుఁ దపతి,నెత్తుకొనిపోవ నిందందు నెడరు వేచె." పాండు. ౩, ఆ. ౭౨; 4. విధము,రీతి. "వ...ఊఁతలు గ్రమ్మినలీలను పొంగుపాటినచరి యను వలలువేసినపొందికను సుడిగాలివీచుడెప్ప రంబున..." ప్రబంధ. ౭౮౮. విశ. 1. అధికము. గొప్పది. "ఉ. దిగ్గన వచ్చె శంకరుఁడు డెప్పర మైనవడిం జెమర్చుచున్." మార. ౧, ఆ. ౨౧. రంగా. ౩, ఆ. ౧౩౧; 2. విషమము. "క.... అరుల తెఱంగరయుచు వా రెదుర్కొనడచునట్టి దయిన డెప్పరపుం దెరువున డప్పిం, బోరసినయెడ విడియుంచోటఁ బొడుచు టురవగున్." భార. శాం. ౩, ఆ. ౪. భో. ౫, ఆ. ౯౮; 3. అపకారము, అనర్థదాయకము. "ఉ...విప్రుమాత్రుఁగా,డెంద మునం దలంచితివొ డెప్పర మప్పుని నన్ను విన్న

గోవిందభృతాబ్జరోచిరరవిందభవాదులు దల్లడిం పరే." దశా. ౨, ఆ. ౯౯. మార. ౨, ఆ. ౫౧.

డెప్పరించు. దే. స. క్రి. ఆపదనొందించు, చంపు. "చ...చంద్రిణి నేక్రియ వాంఛదీరనే, పరిణయ మాడు నాకుటిలభావునినేక్రియ డెప్పరింతు నే, సరణిఁ ఘటించునో శరభసాళ్వమూర్తి." చెన్న. ౫, ఆ. ౧౪౨.

డెప్పరిలు. దే. అ. క్రి. బాధనొందు. "క. అప్పుడు సాందీపని మన,చొప్పరయుచు వచ్చి వానసోఁకు నను వలిం,డెప్పరిలుటఁ గని ఖేదం, బుప్పతిలం బలికె..." భాగ. ౧౦, స్కం. ఉ. ౧౦౦౩. (శ. ర. పా. 'తెప్పిఱిలంబలికె' అని ముద్రి.)

డెప్పఱికము. దే. వి. (డెప్పరము+ఱికము.) బాధ. "క. పఱతెంచి కరిమదమునే,డ్తెఱఁ దొండం బెత్తి వ్రేయ డెప్పఱికమునం, గొఱనంది దాఁకి నేలకు, నొఱఁగినసింగంపుఁగొదమయై వ్రమరంగన్." నిర్వ. ౧౦, ఆ. ౭౯.

డెప్పు. దే. స. క్రి. 1. నిందించు. "ఆ. వాలుఁగన్నుఁ గవయు వలిచన్నుఁగవయుఁనే, కాని యొండు రూపు గాన రాక, యిగురుఁబోఁడి యుండె నిఁకఁ జిక్కినయవస్థ చెప్పనేల విధిని డెప్పనేల." రామా. ౬, ఆ. ౧౩౬. చంద్రా. ౪, ఆ. ౧౮౯; 2. ఎత్తి పొడుచు. "వ...మోమోటము లేక చుల్లరపు వాతల డెప్పి చెప్పి సరబదులకు చేరువారును..." ప్రబంధ. ౭౮౮. కాశీ. ౪, ఆ. ౧౨౫.

డెబ్బ. దే. వి. 1. వేటు, పెట్టు. "క...నేనొక,డెబ్బం బరిమార్తు ధరణి నొబ్బునఁ గూలన్." దశా. ౨, ఆ. ౪౨౪; 2. గాయము, గంటు (వ్యవ:—)అతని డెబ్బకు మందు రాచి రమ్ము; 3. నష్టము. (వ్యవ:-) ఆవ్యాపారమున దానికి పెద్దడెబ్బ తగిలినది.

డెబ్బగొను. దే. అ. క్రి. (డెబ్బ+కొను.) కొట్టు. "క. గబ్బున నెదిరించిన నొక, డెబ్బగొనుచు." శివరా. ౪, ఆ. ౮౧.

డెబ్బలాడు. దే.అ.క్రి. (డెబ్బలు+ఆడు.) 1. యుద్ధము చేయు,పోరు. "సీ. సరిడెబ్బలాడుచో జాంబవం తునిగ్రుద్దు కోరెక్కలోఁ గుట్టు పోరెనొక్కొ." సిం. నార. ౩౩, 2. తగవులాడు, కలహించు. (వ్యవ:—)ఆసోదరు లెప్పుడును డెబ్బలాడుకొను చుందురు.

దెబ్బసలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ దెబ్బసల్ నీరుకావులు గాజుకప్పెరల్ కురువ డాల్ కంటసరులు." హంస. ౪, ఆ. ౧౨౯.

దెబ్బాటు. దే. వి. (దెబ్బ+ఆటు.) బలిష్ఠమైనవాన. (శ. ర.)

దెబ్బు. దే. వి. శీఘ్రము. "సీ. కటిసూత్రమే పాటి గట్టి బాపఁడ యని దెబ్బున మొలత్రాడు ద్రెంచె నొకతె." మృ. వి. ౨, ఆ. ౭౨.

దెస. వై. వి. (సం. దిశా.) 1. దిక్కు. "సీ. పణవ వీణావేణురణితానుసారమై రసగీతరవ మెల్ల దెసల నెసఁగె." భార. ఆది. ౭, ఆ. ౧౭౨. భార. ద్రో. ౨, ఆ. ౫౭; 2. పైపు, పార్శ్వము. "క. తెరువి మ్మని యటు లడుగుము, సరభసగతి నుదక మిరు దెసలఁ బాయఁ గడున్, బరువునఁ బోవఁగ నయ్యెడుఁ, దరుణీ యరుగు మఱకాలు తడి గాకుండన్." భో. 3, ఆ. ౨౩. వసు. ౧, ఆ. ౬; 3. శరణము. "చ. జితదనుజాన్వయుండు యదుసింహుఁడు వెన్నుఁడు ముట్టి నిన్ బరిక్షతబలుఁ జేయ నాకు దెస గల్గు టెఱింగెదు గాక యత్తఱిన్." భార. అర. ౬, ఆ. ౧౯౫. భార. అశ్ర. ౨, ఆ. ౧౬౧; 4. చోటు, ప్రదేశము. "గీ. అట్టికలధౌతశిఖరిఁ బుష్పాపచయము, సేయు వేడుకఁ బొదరిండ్లచాయలందుఁ, దిరుగుచుండి యొకానొకదెసఁ దృణంబు, దళముగా వాత మొలచినబలమునందు." స్వా. ౪, ఆ. ౭౪. కు. సం. ౧౦, ఆ. ౧౫౭; 5. పక్షము, తెగ. "క... ఇది కల్యాణాభ్యుదయనిధానము మా కని హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెసవారల్." హర. ౬, ఆ. ౧౦౭. భార. భీష్మ. 3, ఆ. 3౧; 6. పంచమీవిభక్త్యర్థకము, (వలన). "గీ. రాజవర రాజుదెసఁ బ్రతిగ్రహము విషము." భార. అను. 3, ఆ. ౨౧౫. భార. విరా. ౨, ఆ. ౧౦౯; 7. సప్తమీవిభక్త్యర్థము. (దీనికాయాయెడల మీఁద, విషయము, ఎడ మొ. అర్థములు వచ్చును.) "ఉ. ఎక్కుడిమాట గొల్లతన మించుకయేనియుం లేదు నీదెసన్." భార. విరా. ౧, ఆ. ౨౯౧. నైష. 3, ఆ. ౧౨. (సం. దశా.) 1. అవస్థ, స్థితి. "క. కీచకుఁడు ప్రేటువడి తన, నీచపుదెస యొరులెఱుఁగ నేరక యుండన్, లేచి..." భార. విరా. ౨, ఆ. ౧౩౦; 2. దుర్దశ, దురవస్థ. "క. ఈ దుస్స్వప్నము నెపమున, నీదుర్దశకంటె నింక నేదెస యగునో." మార్క. ౧, ఆ. ౨౪౦. భార. విరా. ౧, ఆ. ౧౯౨; 3. విధము రీతి. "క... నీ నెమ్మొగ, మీదెస సొంపెడలి యుంట నెటు లోర్వనగున్." అచ్చ. యు. 3౬౫. దశా. ౧, అ. ౧౫౪.

దెసకట్టు. ద్వ. వి. (దెస+కట్టు.) చోరసాధనవిశేషము. "సీ. ములుదోరణము బట్టమొలత్రాటికుఱువాఁడి కైదువు దెసకట్టు కావుబొట్టు." వేం. పంచ. 3, ఆ. ౧౬౬.

దెసచెడు. ద్వ. అ. క్రి. (దెస+చెడు.) దిక్కుమాలు, గతిలేకుండు. "వ... నరనారాయణు లపారపరాక్రములై యసురవీరులఁ బెక్కండ్రం జంపిన నుక్కుడంగి దెసచెడి యసురులు... సముద్రంబు సొచ్చిన..." భార. ఆది. ౨, ఆ. ౨౫. ఉ. రా. ౧, ఆ. ౨౯౫.

దెసపడు. వై. అ. క్రి. (దెస+పడు.) 1. దుస్స్థితి నొందు. "క. వడి నొడిసి పట్టుకొని దెసపడ నొడలుం దొడలు బడలు పడ నొక్కి ముదం, బడర దిగమ్రింగి వలసినకడ కరిగెన్..." వేం. పంచ. 3, ఆ. 3౭౫; 2. బాధపడు. "క. ఈ దుర్భిక్షార్ణవమున, నేదరియుం జేర లేక యిదిగో చీకాకై దెసపడుచున్నారము, పైదలి యిఁక నెన్నిపాట్లఁ బడుదుమొ మీఁదన్." విష్ణు. నా. 3, ఆ. ౧౯౬.

## దే

దే. ఘే. వి. గుఱ్ఱము లోనగువానిని దోలుటయం దగు ననుకరణము. "శా. రా జండన్ బలుపైనవేఁట తమిచే రాగిల్లి కెంగేలిపై, నేజా ద్రిప్పుచు లాగి వాగె బలిమిన్ దే యంచు నొత్తుమడిన్, దేజీఁ దోలిన..." య. ౨, ఆ. ౨౭.

దేంద్ర. దే. వి. సాలీలలో నొకతెగవాఁడు, తంతువాయభేదము. "సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన నేఁతకాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్... దేంద్ర యనంగను జేంద్ర యనఁగ." ఆం. భా. ద్వి. ౨౯3.

దేఁకు. దే. అ. క్రి. పిఱ్ఱలతో జరుగు. (శ. ర.)

దేదీప్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించునది. "ఆ. తేజ మప్రమేయ దేదీప్యమానని, ర్వ్యాకృతిమహిమ దుర్నిరీక్ష్య మయ్యె." భార. భీష్మ. ౧, ఆ. ౨౧౧.

దేనము. వై. వి. (సం. ధ్యానమ్.) ధ్యానము. "ఆ. దాన మొసఁగుకన్న దేనంబు మఱి హెచ్చు, దేన మొసఁగుకన్నఁ దెలివి హెచ్చు, తెలివికన్న నాస దెగనేసినది హెచ్చు..." వేమన. ౧, భా. ౮౭.

దేబె. దే. విణ. 1. మూర్ఖుఁడు. అధముఁడు. "సీ. దేబెలఁ గనుఁగొన్న వాబల్మిఁ జూపుచు దాసి కత్తెలఁ గన్నఁ దారసిలుచు." మల్హ. 3, ఆ. ౧౦; 2. వికృతము. "ద్వి...వయసుదిగిపోయి పల్లిక దేబెరూపమున, పగమాలి బ్రతికె యెవ్వరి నుద్ధరింప." ద్వి. శ. సా. ౨, ఆ. ౬౯. పు.

దేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఈయఁదగినది.

దేరిజె. దే. వి. ఒకవిధమైనగుడారము. "ఉ. పంత మతో హుటాహుటినిఁ బొంజులలోపలఁ జొచ్చి సైన్య మింతింతలు గాఁగ ఖడ్గహతిఁ ద్రెంచెద దేరిజత్రాళ్లు మీర లీ,చెంతనె యుండి కన్గొన్నుఁడు..." కృష్ణ. 3, ఆ. 3౬. కువల. ౨, ఆ. ౮౪.

దేరిజెము. దే. వి. ఒకవిధమైనగుడారము. "క... అతఁడు దేరిజెపుఁద్రాళ్లు దెగఁగోసి వెసన్." కృష్ణ. 3, ఆ. 3౬.

దేరీజు. దే. వి. ఒకవిధమైనగుడారము. "మ. చలమొప్పన్ మరుపాదుసాహిజగముల్ సాధింప దండెత్తి మత్తిలి బ్రహ్మాండపుఁగెంపుఁ డక్కుఁటురుకా దేరీజు లెత్తింప నందలియస్తాచలపూర్వ శైలశిఖరస్తంభాగ్రభాగంబులం, గలమాణిక్యపుబిళ్లలో యనఁదగెం గంజాప్తచంద్రాకృతుల్." భాను. ౪, ఆ. ౫౪.

దేవ. సం. వి. ఆ. స్త్రీ. మెట్టతామరచె. ఋ. పుం. మగనిసోదరుఁడు, దేవరుఁడు.

దేవకన్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అప్సరస; 2. దేవతాకన్య.

దేవకీయము. సం. విణ. (అ. ఆ. అ.) దేవసంబంధమైనది, దివ్యము.

దేవకుఁడు. సం. విణ. (అ. విశే. అ.) 1. ప్రకాశించువాఁడు; 2. దేవతాతుల్యుఁడు; 3. జూదమాడువాఁడు; 4. క్రీడించువాఁడు.

దేవక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి. (సంగీ.) "సీ. దేవక్రియాందోళి దేవగాంధారియు గౌళ గుండక్రియాహార..." హంస. ౪, ఆ. ౧౨3.

దేవఖాతము. సం. వి. అ. న. 1. గుహ; 2. అఖాతము; 3. కోనేఱు.

దేవగణిక. సం. వి. ఆ. స్త్రీ. స్వర్వేశ్య. అప్సరస.

దేవగాంధారి. సం. వి. ఈ. స్త్రీ. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి. హంస. ౫, ఆ. ౧౨3.

దేవగృహము. సం. వి. అ. న. 1. గుడి; 2. రాచనగరు.

దేవటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) శిల్పి.

దేవత. సం. వి. ఆ. స్త్రీ. 1. వేలుపు; 2. దేవత్వము; 3. జ్ఞానేంద్రియము.

దేవతరువు. సం. వి. ఉ. పుం. 1. రావి, అశ్వత్థము; 2. కల్పవృక్షము; 3. రచ్చమ్రాను.

దేవతాడి. మి. వి. దేవతాళము, డావరడంగిచె. "సీ. డావరడంగి నా దేవతా డన... దేవ. గీ. తాళ నామంబు..." ఆం. భా. ద్వి. ౫౧.

దేవదత్తము. సం. వి. అ. పుం. 1. ఆవులింతను గలిగించునొకఉపవాయువు; 2. అర్జునునిశంఖము. విణ. (అ. ఆ. అ.) 1. దేవతలచేత నీయఁబడినది; 2. దేవతలకు సమర్పింపఁబడినది.

దేవదారి. మి. వి. దేవదారువుచె. "గీ. దేవదారి యనం జను దేవదారు." ఆం. భా. ద్వి. ౪౭.

దేవదారు. సం. వి. ఉ. న. ఒకానొకవృక్షము.

దేవదారువు. సం. వి. ఉ. పుం. ఒకానొకవృక్షము.

దేవదేవుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.

దేవధాని. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రపురి, అమరావతి.

దేవన. సం. వి. ఆ. స్త్రీ. 1. జూదము; 2. క్రీడ; 3. సేవ, కొలువు; 4. విలాసము, పరిదేవనము.

దేవనము. సం. వి. అ. పుం. పాచిక. న. 1. క్రీడ; 2. జూదము; 3. వ్యవహారము; 4. జిగి, దీప్తి; 5. గెలువనిచ్ఛ, జిగీష; 6. పొగడ్త, స్తుతి; 7. విలాపము, పరిదేవనము; 8. తామరపువ్వు, పద్మము; 9. గతి, గమనము.

దేవనాగరి. సం. వి. ఆ. స్త్రీ. దేవభాషాలిపి.

దేవపతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు.

దేవపథము. సం. వి. అ. పుం. 1. ఆకాశమందలి ఛాయాపథము; 2. దేవయానము, అర్చిరాది మార్గము.

దేవపర్ణము. సం. వి. అ. న. మాచిపత్త్రిచె.

దేవబ్రాహ్మణుఁడు. సం. వి. అ. పుం. దేవపూజవలన జీవించువాఁడు, పూజారి.

దేవభవనము. సం. వి. అ. న. 1. దేవాలయము, గుడి; 2. స్వర్గము; 3. రావిచె.

దేవభూతి. సం. వి. ఇ. స్త్రీ. గంగ.

దేవభూయము. సం. వి. అ. న. దేవత్వము. నైష. ౨, ఆ. ౭౬.

దేవభోజనము. సం. వి. అ. న. అమృతము.

దేవమణి. సం. వి. ఇ. పుం. 1. విష్ణువక్షమందలి రత్నము,కౌస్తుభము; 2. సూర్యుఁడు; 3. గుఱ్ఱము మెడయందలిసుడి; 4. దేవతలలో శ్రేష్ఠుఁడు; 5. శివుఁడు; 6. చింతామణి.

దేవమాతృకము. సం. విణ. (అ. ఆ. అ.) వాననీళ్ల చేత పండెడుసస్యము గలదేశము. (వ్యతి. నదీమాతృకము)

దేవమాసము. సం. వి. అ. పుం. 1. గర్భము కలిగినది మొదలు ఎనిమిదవమాసము; 2. దేవతామానము ననుసరించినమాసము.

దేవము. సం. వి. అ. పుం. 1. క్రీడ, ఆట; 2. పాదరసము. న. ఇంద్రియము.

దేవయజనము. సం. వి. అ. న. యజ్ఞముచేయు స్థానము,వేది.

దేవయజ్ఞము. సం. వి. అ. పుం. గృహస్థులు నిత్యము చేయవలసినహోమరూప మగుయజ్ఞము. (ఇది పంచమహాయజ్ఞములలో నొకటి.)

దేవయానము. సం. వి. అ. పుం. అర్చిరాదిమార్గము. న. విమానము.

దేవర. వై. వి. (సం. దేవః.) 1. దేవుఁడు. "సీ. కన్నులు చల్లఁగాఁ గనుఁగొందు నేను మిమ్మిరు పుర దేవిదేవరనుభోలె." నైష. ౨, ఆ. ౭౬. శుక. 3, ఆ. ౪౯; 2. ప్రభువు రాజు. "క. కైవడిమెకములఁ గ్రమ్మెడి కైవడి మాయాపచేవ కనఁబోయెదుగా,దేవర మాదేవరవలె,వేవేగ మెసామి వేఁటవిచ్చేయవయా." సా. ౧, ఆ. ౭౯. య. ౫, ఆ. ౧; 3. యుష్మదర్థకము. (ఇది గొప్పవారియెడనే ప్రయుక్త మగును. దీనిక్రియ తఱచు బహువచనమం దుండును.) "మ. మొదలం దేవర యానతిచ్చితిర మేమును జిత్త మందెంతయు......" భార. ౨, ఆ. ౧౩౧. భార. ఉద్యో. ౨, ఆ. 3. విణ. శ్రేష్ఠుఁడు. (ఇది పురుషులయెడనే ప్రయుక్తము.) "ఉ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస వట్టది.గ్రాజమనో భయంకరుఁడు రాజులదేవర రాజరాజు......" కాశీ. ౬, ఆ. ౪౨.

దేవరవారు. ద్వ. వి. (దేవర+వారు) = దేవర. (యుష్మదర్థకము.) "చ...మీరు త్రిలోకవేదులీ,దృశమహిమంబు మీకె తగు దేవరవారికవేద్య మెద్ది యీ,దిశలఁ జరించుశ్వేరు గలదేవబుధుల్ మిముఁ బోల రెవ్వరున్." రంగా. ౧, ఆ. ౭౭.

దేవరుఁడు. సం. వి. అ. పుం. మగనితోఁబుట్టినవాఁడు.

దేవలుఁడు. సం. వి. అ. పుం. 1. పూజారి; 2. ధార్మికుఁడు; 3. నారదుఁడు; 4. మగనితోఁబుట్టినవాఁడు.

దేవళము. వై. వి. (సం. దేవాలయః.) కోవెల,దేవాలయము. "క. కాలేయక మిట్లనియెను,గాలాంజన మనెడిగిరిని గలదేవళముం,బాలింప నితని బనుపుము..." ఉ. రా. ౭, ఆ. ౨౧. జాహ్నవీ. ౧, ఆ. ౬౨.

దేవళ్లపెట్టె. వై. వి. (దేవళ్ల+పెట్టె) దేవతార్చనపుఁబెట్టె,దేవవిగ్రహము లుంచుపెట్టె. "సీ. నట్టింట దేవళ్లపెట్టెఁ బెట్టినతిన్నెఁ గొట్టించి వెసఁ బంది గూడు సేసె." శుక. 3, ఆ. ౫౦.

దేవవర్త్మము. సం. వి. న్. న. 1. దేవతలమార్గము. 2. ఆకాశము.

దేవవాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆకాశవాణి,ఆకాశాదులనుండి వినఁబడుదేవతలవాక్కు; 2. సంస్కృతభాష.

దేవవాహనుఁడు. సం. వి. అ. పుం. దేవతలకు హవిస్సును గొనిపోవువాఁడు - అగ్ని.

దేవశిల్పి. సం. వి. న్. పుం. విశ్వకర్మ.

దేవసభ. సం. వి. ఆ. స్త్రీ. 1. దేవతలసభ,సుధర్మ; 2. రాజసభ; 3. జూదమాడుచోటు.

దేవసాయుజ్యము. సం వి. అ. న. దేవుఁడగుట,దేవభూయము.

దేవాంగి. సం. వి. న్. పుం. బట్టలు నేసి జీవించునొక జాతివాఁడు, సాలెవాఁడు. (శ. ర. బ్రా.)

దేవాజీవి. సం. వి. న్. పుం. పూజారి.

దేవాజీవుఁడు. సం. వి. అ. పుం. పూజారి.

దేవానాంప్రియము. సం. వి. అ. పుం. మేఁక.

దేవానాంప్రియుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) యజ్ఞములయందు దేవతలకు ప్రియమగుపశువువంటివాఁడు; బ్రహ్మజ్ఞానము లేక యాగము చేసి దేవతలకుఁ బ్రియముచేయఁజూచువాఁడు-మూర్ఖుఁడు. "క. ఈవిధి నభీష్టసిద్ధికి,దైవతకవి నుతిఘొనర్చి

కవుల్వాప్పు మదిన్,భావించి దిద్దకుండఁగ,దేవానాం ప్రియులఁల మ్రొక్కి తెలతుఁ గుకవులన్." రాఘవ. ౧, ఆ. ౫.

దేవాయుధము. సం. వి. అ. న. 1. దేవతలఆయుధము; 2. ఇంద్రధనుస్సు; 3. రాయి, రప్ప లోనగునది. "సీ. పస లేదు నిల రోయి పాతకులారనిదేవాయుధంబులు బూవువారు." ఆము. ౭, ఆ. ౧౩. [దేవళము,గుడి.

దేవాలయము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2.

దేవి. సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతాస్త్రీ; 2. దేవపత్ని; 3. పార్వతి; 4. సరస్వతి; 5. పట్టపురాణి; 6. ఆఁడుఊరఁబిచ్చుక,చటక; 7. చాఁగ౯.

దేవిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. ప్రకాశించువాఁడు; 2. క్రీడించువాఁడు; 3. జూదరి.

దేవిడీ. హిం. వి. 1. కోటగుమ్మము; 2. రాచనగరు. (శ. ర.)

దేవు. దే. స. క్రి. 1. వెదకు. "సీ. మందసంబులు దేవి మాడువుల్ పొడఁగని కొత్తడంబులు చూచి......" అచ్చ. సుం. ౧; 2. నీళ్లు పాళ్లు మున్నగువానినుండి తడవి తీయు. "శా. ఆరంగాఁగినపాలమీఁగడల వాస్త్రాజ్యంబులం దేవి లీ,లారమ్యంబుగఁ దోడిబాలురకు నెల్లం బెట్టి తానుం గొనున్." హరి. పూ. ౫, ఆ. ౨౦౪.

దేవుఁడు. సం. వి. అ. పుం. 1 దేవత. (ఈయర్థమున బహువచనము లేదు.); 2. ఇంద్రుఁడు; 3. మేఘుఁడు; 4. ప్రభువు; 5. ఈశ్వరుఁడు.

దేవురించు. దే. అ. క్రి. దైన్యముఁనొందు. "సీ. దేవురించుచు వాజ దేఱెడుమొగమును బడఁబాఱుచుండెడుబడుగటొడలు."హరిశ్చ. ౪, ఆ. ౧౦౩; 2. విలపించు. (చూ. దేవురింపు.)

దేవురింపు. దే. వి. (దేవురించు. ధా.) 1. దీనుఁడగుట, దేవురించుట; 2. విలపించుట,పరిదేవనము. "సీ... దేవురింపనఁగను దేవు రనఁగఁ. గీ. బరఁగుఁ బరిదేవనము." ఆం. భా. ప్ర. ౧౧౬.

దేవురు. దే. వి. దైన్యము. "క. ఈవఱదనుకను రోఁతల,దేవుళ్లం బడితి......" వేం. పంచ. ౪, ఆ. ౪౩౨. ఆం. భా. ౧, ఆ. ౧౧౬.

దేవురుగొట్టు. దే. విణ. దీనుఁడు. (శ. ర. వా.)

దేవులాడు. దే. స. క్రి. 1. పెనఁగులాడు?. "వ .. ఒకటొకటి మత్సరంబునఁ బెచ్చుపెరుఁగుచు దేవులాడ నెడసొచ్చి నడుములు గంఢ్రింపుచు గుండ్రింతలుపెట్టునవియు .. చకోరంబులు..." శ్రీరాధా. ౪, ఆ. ౧౦౩; 2. వెదకులాడు. (శ. ర.)

దేవేరి. దే. వి. రాజమహిషి; భార్య. "క. అవిభునవంతరంబ ధ,రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా,దేవియు శుభమతి తిరుమల, దేవియునుం దనకుఁ గూర్చుదేవేరులు గాన్."స్వా. ౧, ఆ. ౩౩. ఆం. భా. ద్వి. ౧౦౫.

దేవేశ్వరుఁడు. సం. వి. అ. పుం. దేవతలకధిపతి, ఇంద్రుఁడు. "సీ. సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోరతపము సేయుచు నున్నఁ దత్తపమున, కెంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరోగణములలో నగ్రగణ్య యైన,దాని మేనక యనుధవళాక్షిఁ బిలిచి......తదీయ. ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన,దేవరాజ్యమహిమఁ దివిరి నీవు,గావు మనిన..."భార. ఆది. ౪, ఆ. ౩౬.

దేశకుఁడు. సం. విణ. (అ. శికా. అ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. ఉపదేశించువాఁడు.

దేశము. సం. వి. అ. పుం. 1. చోటు,ప్రదేశము; 2. అనేకపట్టణములు,గ్రామములు గలభూభాగము. (దేశములు. ౫౬. అంగము, వంగము, కళింగము, కర్ణాటము, కేరళము, కామరూపము, గౌడము, వనవాసము, కుంతలము, కొంకణము, మగధము, సురాష్ట్రము, మాళవము, లాటము, భోటము, వరాటము, శబరము, కుకురము, కురువు, అవంతి, పాండ్యము, మద్రము, సింహళము, ఘూర్జరము, పారశీకము, మిథిలము, పాంచాలము, శూరసేని, గాంధారము, బాహ్లికము, హైహయము, తౌళవము, సాల్వము, పుండ్రకము, ప్రాగ్జ్యోతిషము, మత్స్యము,చేది, బర్బరము, నేపాళము, గౌళము, కాశ్మీరము, కన్యాకుబ్జము,విదర్భము, ఖురసాణము, మహారాష్ట్రము, కోసలము, కేకయము, అహిచ్ఛత్రము, త్రిలింగము, ప్రయాగము, కరహాటకము, కాంభోజము, భోజము, చోళము, హూణము, కాశి. దేశములు మఱియు ననేకములు గలవు; వానిలో నివి ముఖ్యములు. శ. ర.); 3. భాగము.

దేశరూపము. సం. వి. అ. న. 1. న్యాయము, పాడి; 2. ప్రశస్తదేశము.

దేశి. సం. వి. ఈ. స్త్రీ. 1. సంగీతవిశేషము. (సంగీతములో వేఱొకభేదము మార్గము.) "ద్వి. లాలిత శుద్ధసాళగములు బెరయఁగ్రాలుచు దేశిమార్గంబులు, వెలయ." బస. 3, ఆ. ౯33. పం; 2. ఇరువదినాలుగుస్త్రీరాగములలో నొకటి. "సీ.. దేశాక్షి ఘూర్జరి దేశి తోడి. గీ. వెలయు నారాయణియుఁ జతుర్వింశతివిధములను దనరారుస్త్రీరాగములును మఱియు." హంస. ౫, ఆ. ౧౨3; 3. దేశభాషాకవిత్వము. "క. మును మార్గకవిత లోకంబున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుంగు నిలిపిరి..." కు. సం. ౧, ఆ. ౨3; ౧, ఆ. ౨౮; 4. నాట్యవిశేషము. "మ. శనివారోత్సవ వేళఁ గన్గొనియె నాస్థానంబునన్ రాజనందనయుం దానును దేశిమార్గమున గంధర్వాప్సరోనృత్తములే." కాశీ. 3, ఆ. ౧౯. కాశీ. ౬, ఆ. ౬౬౯; 5. తెనుఁగుదేశమున వాడఁబడునొక భాష. 'గీ. వెలఁది చిగురెల్లి వేనలి వేనవేలు, నాఁగఁ, జనుశబ్దములు దేశినామకములు, పీనఁ జెప్పినకవితల వినుచు మెచ్చు." కావ్యా. ౯, ఉ. ౧౭. ద్వా. ౧, ఆ. 3౨. విణ. (న్. నీ. న్.) 1. దేశము కలవాఁడు; 2. దేశకుఁడు.

దేశికాకు. సం. వి. ఉ. పుం. ఒకానొకస్వరస్థాయి. బస. 3, ఆ. ౯౦. పు.

దేశికుఁడు. సం. వి. అ. పుం. 1. గురువు; 2. బాటసారి, పథికుఁడు. [౯, స్క౦. ౧౬౭.

దేశిని. సం. ది. ఈ. స్త్రీ. చూపుడువ్రేలు, తర్జని. భాగ.

దేశీయము. సం. విణ. (అ. ఆ. అ.) దేశమందుఁ బుట్టినది, దేశమందైనది.

దేశ్యము. సం. వి. అ. న. (వాదమున) పూర్వపక్షము. విణ. (అ. ఆ. అ.) 1. దేశమునఁ బుట్టినది, దేశమందైనది; 2. దేశమునకుఁ దగినది; 3. ఉపదేశింపఁదగినది.

దేష్ణువు. సం. విణ. (ఉ.) 1. దాత, ఇచ్చువాఁడు; 2. శుద్ధిచేయువాఁడు; 3. లొంగనిది, దుర్దమము.

దేసము. వై. వి. (సం. ద్వేషః.) పగ, వైరము. "గీ. సూడు పగ దేస మనఁగఁ బొల్చును విరోధ, నామములు..." సాం. ని. మాన. 3౧.

దేసి. యం. దే. విణ. అందమైనది, మనోహరము. "ఉ. వాసనగా శివాగమము పర్ణనకెక్కఁ ద్రయీ సదర్థముల్, దేసిగ శాస్త్రశిష్యులకుఁ దెల్పుచు ..." కు. సం. ౮, ఆ. ౧౬. పండితా. దీక్షా. 3౫౭. పు. వై. వి. (సం. దేశీ.) = దేశి (సంగీతవిశేషము) "ద్వి. దేసియు మార్గంబు దీటుకొనంగ;...తుంబురు నారదాదులు ప్రీతిఁ బాడ ..." పండితా. పర్వ. 3౭౭. పు.

దేసిక. వై. వి. (దేసి+క-స్వార్థమున.) సంగీతవిశేషము. "ఉ. దేసిక కాసిమార్గములఁ దిన్ననిరీతులఁ బాడి పాడి యాశ్వాసము నొంది..." హర. 3, ఆ ౬౨.

దేహకరుఁడు. సం. వి. అ. పుం. జనకుఁడు, తండ్రి.

దేహకుఁడు. సం. విణ. (అ. హి. కా. అ.) పూయువాఁడు. [2. తోలు, చర్మము.

దేహకోశము సం. వి. అ. పుం. 1. ఱెక్క, పక్షము;

దేహత్యాగము. సం. వి. అ. పుం. చావు, మరణము.

దేహధారణము. సం. వి. అ. న. 1. దేహముదాల్చుట; 2. జీవనోపాయము; 3. మనుగడ, బ్రదుకు.

దేహధారి. సం. విణ. (న్. నీ. న్.) దేహము ధరించినవాఁడు, ప్రాణి. [పూయుట.

దేహము. సం. వి. అ. పుం. న. శరీరము, మేను. పుం.

దేహయాత్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. జీవనోపాయము; 2. చావు, మరణము.

దేహారము దే. వి. (క. దేహము = దేహళి.) నివాసము. "చ. విలసితకీర్తిశాలి యగువీరమహేశ్వరు దేహరంబు శ్రీనిలయమునం ద్రిసంధ్యమును నిర్మల సౌధసువర్ణజాలకంబుల వెడలున్...మంగళధూపధూమముల్." కాశీ. ౧, ఆ. ౪౯.

దేహళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ఇంటిగడప, గృహావగ్రహణి.

దేహి. సం. వి. న్. పుం. 1. జీవుఁడు; 2. ప్రాణి, విణ. (న్. నీ. న్.) 1. దేహము గలవాఁడు; 2. పూయువాఁడు.

దేహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూయఁదగినది; 2. శరీరమునకు హితమైనది.

## దై

దైతేయుఁడు. సం. వి. అ. పుం.. దితిసంతతివాఁడు-రాక్షసుఁడు.

దైత్య. సం. వి. ఆ. స్త్రీ. కల్లు, సుర.

దైత్యారి. సం. వి. ఇ. పుం. 1. వేలుపు; 2. విష్ణువు.

దైత్యుఁడు. సం. వి. అ. పుం. అసుర, రాక్షసుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. దితిసంబంధమైనవాఁడు; 2. దితిసంతతివాఁడు.

దైనికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దినమున నుండునది; 2. దినమందలిది.

దైన్యపడు. మి. అ. క్రి. (దైన్యము+పడు.) విచారించు, దీనతనొందు. "చ...అలిమాటలు విని యన్గఁబట్టి నకటా తెగటార్తురె యంచు నామె పెద్దలఁ గని పుత్త్రమోహమున దైన్యపడెన్..." సా. 3, ఆ. ౮౦. చెన్న. సీ. ౧, ఆ. ౨౭.

దైన్యపాటు. మి. వి. (దైన్యపడు ధా.) దీనత్వము. "సీ. వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు లోభంబ యది కామరోషలతయును, క్రోధంబు మత్సరద్రోహంబులును బరధనదారవాంఛలు దైన్యపాటు...కలిగించి..."భార. శాం. 3, ఆ. 3, ౯౯.

దైన్యము. సం. వి. అ. న. 1. దీనత్వము, దారిద్ర్యాదులచేతఁ గలుగుదురవస్థ; 2. పేదఱికము: 3. బలహీనత; 4. హీనత్వము, నైచ్యము.

దైర్ఘ్యము. సం. వి. అ. న. దీర్ఘత్వము, నిడుపు.

దైవజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. 1. సోదెకత్తె, సోదే చెప్పునది; 2. బల్లి. (శ. ర.)

దైవజ్ఞుఁడు. సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు, జ్యోతిశ్శాస్త్రము తెలిసినవాఁడు; 2. త్రికాలవేది, భూతభవిష్యద్వర్తమానము తెలిసినవాఁడు.

దైవతము. సం. వి. అ. న. 1. వేలుపు, దేవత; 2. దేవతాసమూహము.

దైవప్రశ్నము. సం. వి. అ. పుం. 1. శుభాశుభకర్మఫలము తెలియఁగోరుట; 2. జోస్యము; 3. ఆకాశవాణి; 4. సోదె.

దైవము. సం. వి. అ. న. 1. అదృష్టము, భాగ్యము; 2. వేలుపు, దేవత. దశా. ౨, అ. ౨౪౭. పుం. వివాహభేదము. విణ. (అ. ఆ, ఈ. అ.) 1. దేవసంబంధమైనది; 2. దేవునివలనండి వచ్చినది; 3. ఆకాశమునఁ బుట్టినది.

దైవసాక్షి. సం. క్రి. విణ. దైవము సాక్షియగునట్లుగా. "క...దైవసాక్షిఁ బ్రతినలువట్టెన్." దశ. ౯, ఆ. ౧౪.

దైవాకరి. సం. వి. ఇ. పుం. 1. శని; 2. యముఁడు; 3. సుగ్రీవుఁడు; 4. కర్ణుఁడు. ఈ. స్త్రీ. యమునానది.

దైవాఱించు. దే. స. క్రి. (దైవాఱు ధా. ప్రే.) పొంగిపొరలఁజేయు. "క. దైవాఱించితి, భువనముల ననింద్యకీర్తి భూమామృతమున్."భా. రా. యు. ౨౩౩౬.

దైవాఱు. దే. అ. క్రి. 1. అతిశయించు, అధికమగు. "క...కొమ్మమెకపుఁబోటరి యత్తావునఁ దరలి మెల్లమెల్లనఁ, జని యొకచో మిగులస్వంతసము దైవాఱన్." అచ్చ. సుం. ౨౪. రూ. దైలువాఱు. ఘటికా. ౨, ఆ. ౧౯౦; 2. ఒప్పు. "మ...భూవరసేనాజన మాయితం బగుచు దైవాఱెన్ రణోత్సాహతన్." చంద్రి. 3, ఆ. ౧౦౬; 3. పొంగిపొరలు. "వ. దైన్యరసంబు మొగంబుల నిండి దైవాఱన్..." రం. రా. యు. (శ. ర) "గీ. సాటితూమున రసముదైవాఱఁ గొలిచి, కొమరుజంగంబునకు నిచ్చెఁ గోర్కెతీఱ." హార. ౧, ఆ. ౨౩.

దైవికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. దేవతలకు సంబంధించినది; 2. దైవవశమునఁ గలిగినది.

దైవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) దేవసంబంధమైనది.

దైశికుఁడు. సం. వి. అ. పుం. ఉపదేశించువాఁడు, దేశికుఁడు.

దైహికము. సం. వి. అ. పుం. ప్రాణిద్యూతము, పొట్టేలు కోడి మున్నగువానితో నాడుద్యూతము. విణ. (అ. ఈ. అ.) 1. దేహసంబంధమైనది; 2. దేహభవము.

## దొ

దొంకెన. దే. వి. ఆయుధవిశేషము. "ద్వి. వడిగొని యడి దాన వైచి కందాసఁ, దుడుచు రౌతులు కత్తి దొంకెనఁ బొడిచి, పోటుగంట్లనె తూఱి పోవుసద్భటులు." ద్వి. హరిశ్చ. పూ. ౧౩౪. పం.

దొంగ. దే. వి. (దొంగు ధా.) 1. చోరుఁడు. "సీ. ప్రామినుకులదొంగఁ బాతాళకుహరంబుఁ జొఱఁ బాఱి చీఱినచోఱ వీవ." పారి. ౧, ఆ. ౪౯. స్వా. 3, ఆ. ౮౪; 2. అరఁటిపువ్వులలో నుండు గట్టికాడ. (శ. ర.) విణ. వంచకము. ఉదా:—దొంగనిద్ర. (ఇది కొన్నిపట్ల విశేషార్థముల నిచ్చును. ఉదా:—దొంగకూడు = తన్నొరు తెలియఁగకుండఁ బోయి కుడుచుకూడు.

దొంగగొడ్డు = దొంగమేఁత మేయుపసరము.

దొంగనేల = మోసము చేసి యపహరించిన నేల.

దొంగబీగము = మాఱుతాళము.

దొంగమాట = అసత్యవాక్యము, కల్పితవాక్యము.

దొంగమేఁత=పసరము తప్పించుకొనిపోయి పొలములందు మేసెడిమేఁత. [వ్యాపించెడ్డుఇసుక.

దొంగయిసుక = క్రింద నీళ్లు తెలియకుండ మీఁద

దొంగకేయి = దొంగిలించుట కనుకూలమయినయర్ధరాత్రము. (శ. ర.)

దొంగరోగము = దొంగవలె దాగియుండి స్పష్టముగాఁ దెలియనిరోగము మొ. ఇట్లే యితరము లూహించునది.

దొంగతనము. ద్వ. వి. (దొంగ+తనము.) చౌర్యము, దొంగిలించుట. "గీ...విదు మెంతవానికైన, దొంగతన మన్నయప్పుడె దొడరు భయము." దశా. ౧, ఆ. ౨౭౯.

దొంగపని. దే. వి. (దొంగ+పని.) 1. చౌర్యము. (శ. ర. వా.); 2. సరిగా చేయనిపని. (వా.)

దొంగమేపు. దే. వి. (దొంగ+మేపు.) లంపు. "గీ. లంపు నా దొంగ మేపు చెలంగు సభిన." ఆం. భా. తృ. ౩౫.

దొంగర్కము. దే వి. (దొంగ+అకము.) "మ. దుర ముక్ దుర్గము రాయబారము మఱిక్ దొంగర్కముక్ వైద్యమున్..." కాళ. శ. ౧౧౧.

దొంగతికము. దే. వి. (దొంగ+అకము.) చౌర్యము, దొంగతనము. "క. రంగప్పసొమ్ము మేము తినం గను సుతుల మయి పుట్టినారము నిజమైనం గలదే మావలనను, దొంగతికంబులును వింతద్రోహము లెందున్." వి. ప్ర. ౫, ఆ. ౧౮.

దొంగసొమ్ము. ద్వ. వి. (దొంగ+సొమ్ము.) దొంగిలించి తెచ్చినసొమ్ము. "శా...దొంగసొమ్ములకునై యిట్లేల ప్రాల్మాలితే." వి. ప్ర. ౫, ఆ. ౩౫.

దొంగిలించు. దే. స. క్రి. ముచ్చిలు, అపహరించు. "సీ. సీధుపానక్రీడఁ జెంగల్వపూచాయ దొంగిలించెడుకన్నుదోయివాఁడు." పి. శకుం. ౧, ఆ. ౫. కు. సం. ౭, ఆ. ౧౦౪.

దొంగిలు. దే. స. క్రి. 1. దొంగిలించు, దొంగతనముచేయు. "వ...ఉదరపూరణమాత్రంబు దొంగిలినవానిం దండింపక..." భాగ. ౭, స్కం. ౪౪౫. చంద్రా. ౪, ఆ. ౧౩౮; 2. వంచించు మోసగించు. "ఉ. ఎక్కడి కేఁగుదెంచితి వహీన విహారచికిత్స సీకు నేఁ జక్క నొనర్చెదం దెలుపఁ జంపితి దొంగిలి ము న్మదీయులక్, రక్కసులన్..." పాండు. ౫, ఆ. ౧౦౭.

దొంగు. దే. అ. క్రి. 1. దాఁగు. (శ. ర.); 2. అపహరించు, ముచ్చిలు. (చూ. దొంగిలించు.)

దొండ. వై. వి. (సం. తుండీ.) ఒకరకముతీఁగ, బింబిక. "గీ. సకలదిశలకుశాఖోపశాఖ విడుచుఁ, బొదలి ఫలియించుదొండయుఁ బోలి ప్రబలి..." ప్రభా. ౧, ఆ. ౧౯. ఆం. భా. ద్వి. ౬౦.

దొండపండు. ద్వ. వి. (దొండ+పండు) బింబఫలము. "వ... తెలిగన్నులు శ్రీసతియిండ్లు వాకెర,ల్ని జముగ దొండపండ్లు..." శశాం. ౨, ఆ. ౨౧. నీలా. ౨, ఆ. ౨౭.

దొండముక్కువడు. ద్వ. అ. క్రి. దొండపండువలె గింజలకొన లెఱ్ఱఁబడు-బాగుగాఁ బండు. "వ... గసగస యొసకమెసఁగె, వెస రుసురుకొనియె దవనిక పొదలె, ఱెక్కప్రాసంగు నొండముక్కువడియె..." కాళ. ౩, ఆ. ౨౩. శివరా. ౪, ఆ. ౧౯.

దొండి. దే. వి. 1. చిల్లి, రంధ్రము. "సీ. జలజాతభవశివాదులుగూడ భ్రమయుట దుర్గంధ మగుసుచ్ఛదొండికెగద." వేణుశ. ౭౯, ఆం. భా. ప్ర. ౧౪౫; 2. ఆఁడుగుఱి. "సీ. చినిఁగినదొండి బల్సేఁతకు వెఱచునా వెస నూత్న బాలిక వెఱచుఁగాక." వేణు. శ. ౨౪.

దొండివోవు. దే. అ. క్రి. (దొండి+పోవు.) చిల్లిపడు. "సీ. పోరమాయఁసు రేల పోసికొనెదవురా తోరంపునీ మేను దొండివోను." బిల్హ. ౨, ఆ. ౬౪.

దొండు. దే. వి. మత్స్యవిశేషము. హంస. ౪, ఆ. ౧౮౭.

దొంతర. ద్వ. వి. (దొంతి+తరఁగ.) 1. ఒకదానిపై నొకటిగా నుంచినవస్తువులవరుస. "క. వెస లలనామణి బంగరు, వెసలలదొంతరలు డించి వినయము మది కిం,పొసఁగఁగ గంకణరవములు, పొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్." విజ. ౨, ఆ. ౧౫౨. ఆం. భా. ద్వి. ౩౪; 2. వరుస, పరంపర. "గీ. సంతసంబునఁ బాటవలంతి వేల్పు, దొంతరగ నన్నకటివేల్పు వింత లెల్ల,మంతనంబునఁ దలఁచుచు నంతఁ బొగిలి. నీలా. ౧, ఆ. ౧౦౧. విజ. ౧, ఆ. ౪౮.

దొంతరలుగొను. ద్వ. అ. క్రి. (దొంతరలు+కొను.) దొంతులుగాఁ జేరు. "...పదతాడనంబు గావించు కించువెలయాంద్ర చరణనఖకాంతులపై దొంతరలుగొను..." ఉ. రా. ౪, ఆ. ౧౬౩.

దొంతరముద్దు. దే. వి. (దొంతర+ముద్దు.) చుంబనవిశేషము. "గీ. ముద్దు నాఁగను ఱుంబనం బొప్పు

చుండుఁ, బొల్చుచుండును దొంతరము ద్దనంగఁ, దద్విశేషంబు." ఆం. భా. ద్వి. ౧౭౦.

దొంతి. దే. వి. 1. ఒకదానిపై నొకటిగా నుంచిన వస్త్రపులవరుస. "సీ. పోలించి యొకమాటు భువనంబు లన్నియుఁ దనయింటిలో దొంతు లని తలంచు" భాగ. ౭, స్కం. ౨౬౫. ఆం. భా. ద్వి. ౩౮; 2. వరుస, పరంపర. "సీ. సరసాన్నపానముల్ శాకపాకంబులు వింతవింతగఁ జేసి దొంతి నునిచి." శశాం. 3, ఆ. ౫. నృసిం. ౮, ఆ. ౧౮౧. విణ. 1. ఒకదానిపై నొకటిగా నున్నది. "క. కరసరసిరుహంబున నొక, సరసిరుహం బమర వదనసరసిరుహమునన్, బరిమళవశమున మోపిన, ధరణీధరతనయ దొంతితామరఁ జూపెన్." ఉ. హరి. ౫, ఆ. ౬౦; 2. అధికము. "క. మొదలఁ గుల మెల్లఁ ద్రుంచుట, యదయత గురులయెడఁ గల్లలాడుట యది శాంకిదియును జేయఁ దలంచినఁ, గొద లే దీవేళ దొంతికొల సిద్ధించున్." జై. ౧, ఆ. ౬౯.

దొంద. వై. వి. (తుందీ) స్థూలకాయుఁడు, తుందిలుఁడు. "సీ. దొం దన దొందు నా దొద్దు నాలందనాఁ దుందిలనామమై తోఁచుచుండు." ఆం. భా. ద్వి. ౧౨౦.

దొందడి. ద్వ. వి. (దొందు+దడి.) 1. సంఘర్షము, ఒత్తిడి. "ఉ...ఇద్దఱున్, దుర్జయశత్రుసైన్యముల దొందడి నేమయిరొక్కొ..." భార. ద్రో. ౮, ఆ. ౧౨౯. భార. కర్ణ. ౨, ఆ. ౩౫౮; 2. వేగము, త్వర. "ఆ. రాజుఁగొడుకుఁ జూచె రాజీవదళనేత్ర, రాజవదనఁ జూచె రాజుపట్టి, దొంగకాముఁ డంత దొందడిఁ జిగురాకు,వాలు వెఱికి యుఱికి వారి మొత్తె." భాగ. ౯, స్కం. ౨౬. ప్రబంధ. ౬౭౭. విణ. సంకులము. "క. ఇందాఁక నీ వొనర్చిన, దొందడిపని మెచ్చ నేను దొదరితిపుడు లొ,వుం దాల్మియుఁ జూపి కదా,యొందుఁ బొగడుగనుట నిలువు మించుక యాజిన్." హరి. ఉ. ౭, ఆ. ౧౯౬.

దొందడించు. దే. అ. క్రి. కలిసిపోవు. "సీ. తెగిరాలుపొరమార్తికములు నశ్రుబిందువు లేర్పఱుప రాక దొందడింప..." హరి. పూ. ౯, ఆ. ౧౫౩.

దొందము. వై. వి. (సం. ద్వంద్వమ్.) ద్వంద్వరోగము, వాతపిత్తశ్లేష్మములలో నేరెంటిప్రకోపమువల్లనైనను గలిగినరోగము. "సీ. ద్వంద్వరోగంబు లివ్వటిలు దొందమనంగ..." ఆం. భా. ద్వి. ౧౨౫.

దొందు. వై. వి. (సం. ద్వంద్వమ్.) జత. (శ. ర.) విణ. (సం. తుందీ.) 1. స్థూలకాయుఁడు. ఆం. భా. ద్వి. ౧౨౦; 2. స్థూలము. "వ...కొందఱు దొందుమేనుల నిటునటు కదలలేక చీనిపందుల పొందికను..." ప్రబంధ. ౬౭౭.

దొంపు. దే. వి. 1. చేను. "సీ. లేఁతనివ్వరిదొంపు లేటిపిల్లల కింపు కాచియుండెద నంచుఁ గదలె నొర్తు." కృ. శకుం. 3, ఆ. 33; 2. వేరుపురుగుకొఱుకుటవలన మోవు లెండుట. (శ. ర.)

దొంబరి. దే. వి. దొమ్మరవాఁడు. "వ...శంబరారి యనుదొంబరి విడంబంబునం దూఱ నంబరంబునం బన్నినవలయంబు లనం బొలుచునవలగ్నంబుల విలగ్నంబు లగునొడ్డియాణంబుల..." వరాహ. ౧౧, ఆ. ౨౯.

దొంబులిగొట్టు. ద్వ. వి. (దొందు+పులి+గొట్టు.) వ్యతిరేకలక్షణచే పిఱికి, భీరువు. (రెండుపులులను గొట్టువాఁ డని శబ్దార్థము.) "గీ. పంద కొఁచ, పిఱికి దొంబులిగొట్టన భీతుఁ డభవ." ఆం. భా. ద్వి. ౨౨౧.

దొగ్గలి. దే. వి. రక్తబొమ్మము ❦. "చ...దొగ్గలి పొన్నగంటి దే,దరి..." హంస. ౮, ఆ. ౧౩౨. ఆం. భా. ద్వి. ౬౩.

దొగ్గడు. దే. వి. వ్యాపనము. (చూ. దొగ్గడుకొను.)

దొగ్గడుకొను. సే. అ. క్రి. (దొగ్గడు+కొను.) వ్యాపించు. "వ...మంటల గెంటించి యగ్గి దొగ్గడుకొన మొదలంటఁ బొదివి యొదవనీకున్న యగ్గికోలజగ్గు బొగ్గయ్యె నంత." అచ్చ. భా. ౫, ఆ. ౭౬.

దొటదొట. దే. వి (నిప్పులు మొ.) రాలుటయందగుధ్వని కనుకరణము. "చ. దొటదొట రాలుమిన్నవిసి తోరపునిప్పులవాన లొక్కటన్." సానందో. ౨, ఆ. ౫. ద్వి. నల. ౨, ఆ. ౬౩౭.

దొడదొడ. దే. వి. 1. (నీరు మొ.) కాఱుటయందగుధ్వని కనుకరణము. "ద్వి. దొడదొడ నోటనెత్తురు గ్రక్కుకొనుచు." రం. రా. యు. ౩౬౫. పు; 2. మంచె మొదలగువానిని వేగముగా నెక్కుటయం దగుధ్వని కనుకరణము. "చ..దొడదొడ

మించె యెక్కొ నొకదొడ్డమిటారపురెడ్డికూఁతు రున్." వీథి. ౩౦. విణ. దోడదోడ యనుధ్వని కలది. "క. ఉడుపీథిఁ గొండశిలపైఁ, బిడుగెగసిన వడువు దోఁప బిట్టెగసి వడిక్, బెడతల గుప్పునఁ దన్నినఁ,బడియెం దోడదోడలు గాఁగఁ బదిమకు టంబుల్." రామా. ౭, ఆ. ౨౪౩.

దోడవ. దే. విణ. నీచుఁడు. "క. మగక్రోఁతి యైన దోడవకుఁ,దగునే కన్నియ దొసంగ ధరణీశు నకున్." షోడ. ౭, ఆ. ౯౦.

దోడిదోడి. దే. వి. జనులు వేగముగా నడచుట మొద లగువానియం దగుధ్వని కనుకరణము. "క. దోడి దోడి వెడలెడుమీ రెక్కడపోయెద రెవ్వ రేమి కార్యం బని చే,నడిగిన నూరక దురదుర నడిచిరి నామాట వినివిననిచందమునన్." వరాహ. ౧౦, ఆ. ౮౧. శుచల. ౩, ఆ. ౭౫.

దొడ్డ. దే. విణ. 1. పృథువు, గొప్పది. "గీ...కడుదొడ్డ లగుచుఁ, దోడమె మొగ్గలగము లగ్గిబొబ్బలట్లు." ఆము. ౨, ఆ. ౫౬. భాగ. ౧౦, స్కం. పూ. ౮౩; 2. కఠినము, గట్టిది. "గీ. సిడము నడిమికి వెసఁ ద్రుంచె వెడఁదవాతి, దొడ్డతూపునఁ గురు ఘన దొంగలింప." భార. భీష్మ. ౨, ఆ. ౪౯; 3. ప్రశస్తము. "సీ...సాత్యకి వానిగుణము బాణాసనంబుఁ, దులిమె నంతట వాఁడు దొడ్డ కోదండంబుఁ గొని శరంబుల నొంచె శినిమనుమని." ఉ. హరి. ౩, ఆ. ౫౭; 4. కష్టము, దుస్సాధ్యము. "వ...ఇప్పరమపావని తపోవనంబులు దాసి గాసి కోర్చి ప్రాణంబులు ధరించుట దొడ్డను వారును..." ఉ. రా. ౮, ఆ. ౮౧; 5. మనోజ్ఞము. "గీ. అట్టియఖుపట్టి కెదురుగా నరిగి పురికిఁ, దోడుకొని తెచ్చి రతనపుదొడ్డనగ రొ,కటి విడిది చేసి..." చం. రా. ౩, ఆ. ౧౦౫.

దొడ్డకొంచెము. దే. వి. హెచ్చుతగ్గు. "సీ. దొడ్డ కొంచెము లేక తుద నెట్టివరమైన ననువున నిచ్చు ..." చిత్ర. భా. ౪, ఆ. ౧౨౦. హంస. ౧, ఆ. ౧౦౧.

దొడ్డతనము. ద్వ. వి. (దొడ్డతనము.) గొప్పతనము, ఘనత. "క...దీన నగుదొడ్డతన మేదియొకో." భో. ౫, ఆ. ౯౦. వరాహ. ౫, ఆ. ౧౦౦.

దొడ్డపని. దే. వి. (దొడ్డ+పని.) ఘనకార్యము. "చ. చలనవిహీనవృత్తి నడిసున్నపరాశరుఁ డాది యైన య,య్యల యలరాయివంటిహృదయంబులు నీరుగఁ జేయుపూ,విలుతున కెంతదొడ్డపని... బాలురచిత్తము మెత్తచేయఁగన్." పాండు. ౫, ఆ. ౨౧౨.

దొడ్డవయసు. ద్వ. వి. (దొడ్డ+వయసు.) పడుచుఁదనము, ప్రౌఢవయస్సు. "గీ దొడ్డవయసున శీతాంగుఁ డొడ్డగిల్లెఁ,దఱపిచంద్రాతపము నేల చఱచి కాయ." భీమ. ౨, ఆ. ౪౬.

దొడ్డవాఁడు. దే. విణ. (దొడ్డ+వాఁడు.) ఘనుఁడు. శుచల. ౪, ఆ. ౧౦౬.

దొడ్డి. వై. వి. (సం. ద్రోణీ) 1. పసులు మేయుబీడు. "వ...నలుదెసలం బొడువుగా నమర్చినబలితంపు ములువెలుంగులం గరంబు జతనంబులై యొప్పు పెనుదొడ్లం గ్రమంబునం బ్రమోదంబున వేఁకువం బోకు మేసి వచ్చి .." హరి. పూ. ౫, ఆ. ౧౪౨; 2. పసులకొట్టము; పెరడు. "సీ. పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు దొడ్డిఁ బెట్టినవేల్పు గిడ్డి కాఁపు." స్వా. ౧, ఆ. ౬౬. హరి. పూ. ౬, ఆ. ౨౫; 3. ఇల్లు. (చూ. దొడ్డివేల్పు.)

దొడ్డికట్టు. ద్వ. వి. (దొడ్డి+కట్టు.) చుట్టుకొలారము, నడుమబయలును చుట్టును కట్టడములును గల యిల్లు. "సీ. దొడ్డికట్టై యఁన్నతోరంపుటీరంబుఁ జొరఁ జొచ్చి వెనువెంటఁ దిరిగి తిరిగి." భా. రా. అర. ౨, ఆ. ౫౧. ఆము. ౪, ఆ. ౧౧౫.

దొడ్డికాళ్లు. ద్వ. వి. బ. (దొడ్డి+కాళ్లు.) వంగటి కాళ్లు, ఎడముగా నుండుకాళ్లు. "గీ. దొడ్డికాళ్లను నల్లనిచెడ్డయొడలు,గలిగి.." హరిశ్చ. ౪,ఆ. ౧౬౮.

దొడ్డికాళ్లవాఁడు. ద్వ. విణ. ప్రష్ణుఁడు, వంగటి కాళ్లవాఁడు. "సీ...తోఁచును బ్రష్ణుండు దొడ్డి కాళ్లవాఁ డన..." ఆం. భా. ద్వి. ౧౨౨.

దొడ్డికొను. ద్వ. అ. క్రి. (దొడ్డి+కొను.) నిండు, నెలవుకొను. "ఆ. విని విరించునకును వినతుఁడై ధర్మవ్రతుండు పలికె ముదము దొడ్డికొనఁగ." శైవ. ౪, ఆ. ౨౦.

దొడ్డిపట్టు. ద్వ. వి. (దొడ్డి+పట్టు.) గోష్ఠస్థానము. "గీ. దొడ్డిపట్టుల నిల్వక త్రోవ నెవరి, నెదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ గదిసి కోడె,తఱపులను బొడ్చుచును..." నీలా. ౨, ఆ. ౪౩.

దొడ్డివల. ద్వ. వి. (దొడ్డి+వల.) ఒకవిధమైనవల, జాలవిశేషము. "గీ. లేటివలలును మేటికుందేటి

వలలు, నెలుకవలలును సవదండవలలు దొడ్డి, వలలు...మొదలుగఁ గలిగినవలలు." య. ౧, ఆ. ౧౧౦. కాశీ. 3, ఆ. ౪౬.

దొడ్డివేల్పు. ద్వ. వి. (దొడ్డి+వేల్పు.) ఇలువేల్పు, కులదైవము. "సీ. గెలుపుపేరువజీరుఁ గినిసిన కప్పుతైదువ రాచనెంచు మాదొడ్డివేల్పు." ప్రబంధ. ౧౬౦.

దొడ్డు. దే. వి. మాలిన్యము, కాలుష్యము. "ఆ. మొదమునను గురునిముఖ్యకరుణచేత, తొమ్మిదిస్థలముల దొడ్డు వాయ .." వేమన. ౧, భా. ౨౭౯; 2. ఆధిక్యము. "మత్త...మీ కొకఁ డెద్దియేన్,గౌరి చేసెద నందు దొడ్డును గొంచెమును దలపోయకుం, డేరి కిందు నసాధ్యమైనది యిత్తు నుత్తములార. ..."నా. పంచ. ౧, ఆ. ౪౬౫. పరతత్త్వ. ౧, ఆ. ౭౯; 3. ఘనకార్యము. "గీ...క్రీడిఁ బ్రతికించు టే దొడ్డు కేశవునకు." జై. ౭, ఆ. ౧౬. చం. రా. ౨, ఆ. 3౫. విణ. 1. ప్రశస్తము, శ్రేష్ఠము; శ్రేష్ఠురాలు. "వ...క్షణభంగురమై చను మేటిభాగ్యమును, దలఁతురె దొడ్డుగా జగతిఁ దావకభక్తులు మానసంబునన్." చెన్న. ౪, ఆ. ౧౦౧. భాగ. ౧౦. స్కం. ఉ. ౨౨౪; 2. అధికము, గొప్పది. "తరలము...ఆద్యసన్నము దొడ్డునై, అడఁగి తారణకార్యరూపము నైనయా సకలంబు నీ,కడుపులోనిదె గాదె పాపఁడఁ గాక నే మఱి యెవ్వఁడన్." భాగ. ౧౦, స్కం. పూ. ౫౫౧.

దొడ్డుకట్టి. ద్వ. వి. (దొడ్డు+కట్టి.) పెద్దచాఱ. "ద్వి. అడ్డంపుముక్కర యసియాడునడుము, దొడ్డుకట్టులచీర తూఁగుఁబయ్యెదయు." పండితా. దీక్షా. ౪౫. పు.

దొడ్డువాఱు. దే. అ. క్రి. (దొడ్డు+పాఱు.) అధికమగు. (శ. ర.)

దొత్త. దే. విణ. వ్రేలాడునది. (శ. ర.)

దొత్తు. దే. స. క్రి. తన్ను. "ద్వి. భోరున దూఱి తెప్పున నెత్తి దొత్తి,క్రూరత మెదడు ముక్కుల గ్రుచ్చి మ్రింగ." అ. మ. క. ౫, ఆ. ౨౨3. పు.

దొద్ద. దే. వి. కొల్ల, దోఁపిడి. "సీ. తొలఁగి పొం దడి యూన దొద్దకుఁ జొచ్చినఁ దల లేటి యఁ ర్విక్రి బలి యొసర్తు." భార. మౌ. ౧౧౫. పండితా. పురా. ౧౧౪. పు.

దొద్దకత్తె. ద్వ. విణ. (దొద్ద+కత్తె.) కొల్లపెట్టునది. (శ. ర.)

దొద్దకాఁడు. ద్వ. విణ. (దొద్ద+కాఁడు.) కొల్లపెట్టువాఁడు. "సీ. కని కని మానినీజనమనోధనములు తొలితొలి గిలుబాడుదొద్దకాఁడు." ద్వా. 3, ఆ. ౧౨౬. ఉ. హరి. 3, ఆ. 3౪.

దొద్దగొను. దే. స. క్రి. (దొద్ద+కొను.) కొల్లగొట్టు, దోఁచు. "గీ. తక్కుఁగలయింటిగముల నాదస్యులడరి,పట్టుకొని యేచి పీడెల్ల బన్నపడఁగ, దొద్దగొని..." భార. మౌ. ౧౮౮. కేయూర. ౪, ఆ. ౧3౪. (ఇష్టే: దొద్దలుగొను. పండితా.పురా. ౯౭. పు.)

దొద్దయిచ్చు. దే. స. క్రి. (దొద్ద+ఇచ్చు.) కొల్లగా నిచ్చు, అంతయు నిచ్చు. "సీ. శశిరవిగ్రహజపస్నానాదికము లెల్ల దొరలవాకిండ్లకే దొద్దయిచ్చి ..." ఆము. ౬, ఆ. ౬౯.

దొద్దలాడు. దే. స. క్రి. (దొద్దలు+ఆడు.) కొల్లగొట్టు, దోఁచు. "మ. కరమూలంబున మించుఁ బొంచు లిడి కాంతుం గ్రోలుఁ గప్పారుమం, గురు లర్థిం గబళించు వాతెఱమెఱుంగుల్ దొద్దలాడున్...ధాత్రీశుచూడ్కుల్-వెసన్." కేయూర. ౪, ఆ. ౧౮.

దొద్దలువుచ్చు. దే స. క్రి. (దొద్దలుపోవు ధా. ప్రే.) కొల్లపుచ్చు. "ఉ. నిద్దము లైనభూషణమణిప్రకరద్యుతు లన్నిదిక్కులం, దొద్దలువుచ్చి తల్లిచనుదోయి నడిం దలకట్టు మించఁగా, ముద్దులు చూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁద నాఁడునా,ముద్దుగ జేశునిం దలఁచి మ్రొక్కెద నీకృతి కార్యసిద్ధికిన్." ద్వా. ౧, ఆ. ౫.

దొద్దలుసేయు. దే. స. క్రి. (దొద్దలు+చేయు.) కొల్లగా నిచ్చు, అంతయు నిచ్చు. "ఉ. పెద్దల నర్థులన్ హితులఁ బెద్దగ నందఱిఁ గూర్చి యర్థమున్, దొద్దలు సేసె దాననిరతుం డనఁ బైకము సిక్కకుండఁగన్." ద్వా. 3, ఆ. ౯౬.

దొద్దవోవు. దే. అ. క్రి. (దొద్ద+పోవు.) కొల్లపోవు. (శ. ర.) [ఆం. భా. ద్వి. ౧౨౦.

దొద్దు. వై. విణ. (సం. తుందీ.) స్థూలకాయుఁడు.

దొన. వై. వి. (సం. తూణమ్.) 1. అమ్ములపొది. "గీ. మరల దొన సొచ్చె రఘువీరవరుశరంబు, శరము దొన సేరు టెంతు సాజంబు గాదె."

రామా. ౫, ఆ. ౨౯౯. భార. ఉద్యో. ౨, ఆ. ౧౩౦; 2. (సం. ద్రోణీ.) కొండమీఁదినీటిగుంట, నీటితోఁ గూడినకొండమీఁదిపల్లము. "ఆ. దుర్గమంపుఁజోటు దొనదొన గుహాగుహ,యాది గాఁగ కొందు నరసి యరసి." భార. విరా. 3, ఆ. ౭౨. రామా. ౫, ఆ. ౨౯౯; 3. (సం. ద్రోణిః.) చెఱువు; మడుగు. "ద్వి. పనిపడి మబ్బులోపలి నీళ్లు నమ్మి,దొననీళ్లు తెగఁగొట్టుదురె వెఱ్ఱులైన." ద్వి. శ. సా. ౧, ఆ. ౨౯. పు; 4. కంద్రవాఁడు కత్తు లుంచుకొనెడుపొది, తోలుసంచి. "క. మోకును నిచ్చెనయును దాఁటాకులబందంబు మెత్తనగువడదోలుక్, జోకగుకత్తులదొనయును, దూకంబునఁ బూని నిల్చెఁ దొయ్యలి యెదుటన్." సురా. ౫౭.

దొనదొన. దే. వి. ఈఁగలు, ముసురుటయం దగు ధ్వని కనుకరణము. "ఆ. తనువుమీఁద ముసరె దొనదొన నీఁగలు, వేగిరంబె పెద్దరోగమునను." వరాహ. ౯, ఆ. ౭౯. ఆము. ౬, ఆ. ౧౭.

దొనయుప్పు. ద్వ. వి. (దొన+ఉప్పు.) సంభరిదేశ మందలి 'రుమ' యనెడిగనియందు కట్టెలవలనఁ గలుగుఉప్పు, రౌమకము. (చవుటియుప్పు అని కొందఱు. శ. ర.)

దొన్నియ. వై. వి. (సం. ద్రోణీ.) దొన్నె. "సీ. చేపట్టుఁ జేసి మ్రోల్చి వర గల్గినచిగురరఁటియాకులదొన్నియలు ఘటించి." ఘటికా. ౨, ఆ ౧౫.

దొన్నె. వై. వి. (సం. ద్రోణీ.) నీళ్లు మొ. త్రాగుట కుపయోగించుదొప్ప, పత్త్రచషకము. "గీ. పత్త్రచషకంబు దొన్నె దొప్పన మను భవ." ఆం. భా. ద్వి. ౨౮౪.

దొప్ప. దే. వి. దొన్నె, పత్త్రచషకము. "సీ. నునుఁబోఁకపొత్తిఁ గుట్టినదొప్పగమితోడ రంభాపిశాల పర్ణమ్ము వఱచి." ఆము. ౧, ఆ. ౭౬. ఆం. భా. ద్వి. ౨౮౪.

దొప్పలుఁగట్టు. దే. అ. క్రి. (దొప్పలు+కట్టు.) మడుఁగులు గట్టు. "క. తిరుగక విఱుగక యాభీ,కర మేషము లాహవంబు గావింపంగా, సరి రెంటి నడుమ నెత్తురు, దొరఁగెం బ్రవహించి నిండె దొప్పలుఁగట్టన్." వేం. పంచ. ౧, ఆ. ౨౩౩.

దొప్పు. దే. వి. పడుట మొదలగువానియం దగుధ్వని కనుకరణము. "ద్వి. విని రుద్రుఁ డలికొపవిశాత్ముఁ డగుచుఁ, దప్పక చూచుచుఁ దరణియు ధరణి,దొప్పునఁ బడి శివస్తుతులు చేయుచును." పండితా. దీక్షా. ౩౯. పు.

దొప్పుదొప్పు. దే. వి. నోరడిచికొనుటయం దగు ధ్వని కనుకరణము. "క. వ్రేతెడువెంద్రుక లిరుగడఁ,దూలఁగఁ దలయూఁచు దొప్పుదొప్పున నోరుం,గేలనడిచికొను సెలవుల,లాలలు దొరఁగంగ సన్నలా యని యొఱలన్." ఉ. హరి. ౪, ఆ. ౩౦౭.

దొబ్బ. దే. వి. 1. గడ్డకట్టిననెత్తురు. "సీ. పొలసు దొబ్బల నుబ్బుపులుల పెనొబ్బలఁ గడలియుఁ బలు మాఱు గలఁగి పొరల" య. ౧, ఆ. ౧౧౬. దశా. ౪, అ. ౨౩౨; 2. మాంసఖండము. "సీ. తారసించినచోట దారునఁ జొరఁబాఱి యొకటి రెంటిని దొబ్బ లురల నడుచు." స్వా. ౪, ఆ. ౪౨. ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౦౮ పం.

దొబ్బు. దే. స. క్రి. 1. సంభోగించు. రమించు. (గ్రా.); 2. దొంగిలించు, అపహరించు. (వ్యవ:-) వి. బ. నింద, ఉపాలంభము. (చూ. దొబ్బులు పెట్టు.)

దొబ్బులుపెట్టు. దే. స. క్రి. నిందించి బుద్ధిచెప్పు.

దొమ్మ. దే. వి. పశురోగవిశేషము. (శ. ర. వా.)

దొమ్మడోలు. దే వి. అశ్వగంధ, పెన్నేరుగ. "సీ. పెన్నేరనంగను బెన్నె రనంగను దొమ్మడో లనఁగను దోఁచు నశ్వ,గంధ..." ఆం. భా. ద్వి. ౬౩.

దొమ్మర. దే. వి. గడకట్టి యాడి జీవనము చేయు నొకజాతి. ఉదా:—దొమ్మరవాఁడు, దొమ్మరది. (శ. ర.)

దొమ్మరి. దే. వి. (దొమ్మర+ఇ.) దొమ్మరవాఁడు; దొమ్మరది. "వ...కొందఱు దొమ్మరులగుటెఱుతున నహహా యని బడిఁదీఁగెలవెంబడి నెగఁబ్రాకువారును..." ప్రబంధ. ౭౮౮. ఆం. భా. ద్వి. ౨౮౭. "క. దొమ్మరికొమ్మఁ దగులొ్క్కని ద్రిమ్మరె ననులోకనిందఁ ద్రెళ్లకుము..." చెన్న. ౬, ఆ. ౩౦౩.

దొమ్మరీఁడు. దే. వి. (దొమ్మర+ఈఁడు.) దొమ్మరి. "సీ. అంతట చామయ్య యనుదొమ్మరీల మేఁతరి తనవీడును దాను గదలి." చెన్న. ౨, ఆ. ౨౦౩.

దొమ్మి. వై. వి. (సం. తుములమ్.) 1. అందఱుఁ గలియఁబడి చేయుయుద్ధము, సంకులసమరము. "ఉ. అంధకకాలకేయమహిషాదులు దైత్యులు

బాహుశైలద,ర్వాంధులు గూడి యొక్కు-మొగమై వడి దొమ్మి యొనర్చి..." హర. ౬, ఆ. ౯౭. భీమ. ౪, ఆ. ౯౬. ఆము. ౯౫; 2. జగడము, వివాదము. "ద్వి. మితితోడ నొసఁగుము మేకొన్నగాథి, సుతునిఋణం బెల్లఁ జొప్పడఁ దీర్చి,పొమ్మన దీవించి పోదు నీతోడ, దొమ్ములు రేఁపక దొసఁ గెల్ల మడిఁగి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౩౭. పం; 3. సమ్మర్దము, రాయిడి. "సీ. అలరు పుప్పొడికుమ్ము కెలనఁ జల్లుచుఁ గ్రమ్ముచలువ తెమ్మెర దొమ్మి సొలసి సొలసి." సమీర. 3, ఆ. ౧౯. పరమ. ౪, ఆ. ౧౦౭; 4. సమూహము, గుంపు. "క. నెమ్మిగదా నడ దుమ్మెద దొమ్మిగదా బెడఁగుఁ గురులు..."కువల. 3, ఆ. ౭౯. విణ. 1. దట్టము. "సీ. గ్రుచ్చి చేతుల మేను ముచ్చుట్టు రాఁ బుట్టి దొమ్మియూర్పుల తావి గ్రమ్మరించి." కవిక. ౪, ఆ. ౧౬౬; 2. సంకులము. "ఉ...,రే,ద్రిమ్మరి దొమ్మికయ్యమున దిట్టతనం బటి పూరిమేసితో." దశా. ౨, అ. ౪౧౩. హై. ౧, ఆ. ౯౨.

దొమ్మిగూడు. ద్వ. అ. క్రి. (దొమ్మి+కూడు.) కలియు. "గీ. తమ్మిపూమిద్దెగద్దెమై గమ్మవిల్తు, నిమ్ముగా నిల్పి యెమ్మెను గొమ్మ లెల్లఁ,గ్రమ్ముకొని పెక్కులాగుల దొమ్మిగూడి, పూజ లొనరించి యిట్లని పొగడి రపుడు." నీలా. 3, ఆ. ౩౭.

దొమ్ములాడు. ద్వ. అ. క్రి. (దొమ్ములు+ఆడు.) 1. దొమ్మియుద్ధముచేయు. (శ. ర.); 2. పెనఁగులాడు, కలహించు. "ఉ...,రోషముఁ బ్రణయ సంభ్రమముఁ మది దొమ్ములాడ..."నరస. 3, ఆ. ౧౧౮.

దోయి. వై. వి. (సం. ద్వయీ.) జంట, యుగ్మము. "క...,చేయిదోయిఁ మొగిడిచి జోహారు లిడి చను నెడలన్." అచ్చ. సుం. ౧౫౩.

దొర. దే. వి. 1. రాజు, ప్రభువు. "మ ..తముఁ, దొర క్రీఁగంటఁ గనుంగొనంగ నొకసందోహం బుగా వచ్చి మ్రొక్కిరి..." రామా. ౨, ఆ. ౮౦. రం. రా. అయో. ౧౨౭. పు; 2. సామంత రాజు. "క. కురుపతి పడవాళ్ళం దగు, దొరల కడకు సత్వరముగ దురమునకు భటోత్కరము నను వు నేయుంటకై, పరవసము దలిర్పఁ బనిచెఁ బార్థివముఖ్యా." భార. శల్య. ౧, ఆ. ౯౮; 3. అధిపతి; సేనానాయకుఁడు. "ఆ. దొరలు పడిన నేన దూలక యస్వీరుఁ, జుట్టుముట్టుటయును..." భార. ద్రో. 3, ఆ. ౧౪౯. హరి. ఉ. ౨, ఆ. ౪౧; 4. సామ్యము,పోలిక. "క. దొర యెఱిఁగి కోరవలదే..." కు. సం. ౬, ఆ. ౯; 5. రీతి, పద్ధతి. "చ. తులువలుగాక యిట్టిదొర దుర్ణయ వృత్తికిఁ జొత్తురయ్య..." భార. ఉద్యో. 3, ఆ. ౩౩౧. విణ. 1. సమానుఁడు, సాటియైన వాఁడు. "మ...ఇద్ధతేజంబునఁ,దొర సప్తార్చికి లావునం బవనుతోఁ దుల్యుండు..." భార. కర్ణ. 3, ఆ. ౭౯. నిర్వ. ౬, ఆ. ౧౬; 2. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు. "వ. అంతఁ బెఱకంటిదొరలు వేడుక రక్కసులం గూడుకొని కలశజలనిధి మథియించునమయంబున."దశా. ౨, అ. ౨౮౭. హరి. పూ. ౬, ఆ. ౧౩౦; 3. పెద్దవాఁడు, గొప్పవాఁడు. "క...,ఇంక జననాయకుఁ డెప్పరుసున నానతి యిచ్చెను, దొర లేమని రట్లుచేయఁ దుది గార్య మగున్."భార. విరా. 3, ఆ. ౧౨౨. విక్ర. 3, ఆ. ౭౩.

దొరకొను దే. అ. క్రి. 1. యత్నించు,పూను. "క. తను నూరార్పఁగ సఖి దొరఁకొనమికి వెను బడుచుఁ గీచకు డాసతితోన్."భార. విరా. ౨, ఆ. ౬౦. భాగ. 3, స్కం. ౯౯౧; 2. సిద్ధపడు. "శా. పుట్టం బుట్ట శరంబునఁ మొలవ సంభోగయానపాత్రంబునఁ, బెట్టం గల్గను గాలిఁ గొల్వను బురాణింపం దొరంకొంటి మీఁదెట్టే వెంటఁ జరింతు..." భాగ. ౧, స్కం. ౭. భార. శాం. 3, ఆ. ౨౦౫. స. క్రి. 1. ప్రారంభించు, మొదలిడు. "క. దొరఁకొని పుణ్యము పాపము, నరుఁ డర్థిం జేయుచుండ .." భార. ఉద్యో. 3, ఆ. ౨౪౦. పరమ. 3, ఆ. ౬౩; 2. పొందు, ప్రాపించు. "ద్వి. జననాథ నీచేత సమరంబులోనఁ, దునియలై పడి ముక్తి దొరఁకొందు ననుచు,ఘన బాహుఁ డనుపు క్తికంటుఁడు నీతఁ,గొనిపోయె..." రం. రా. ఉ. ౧౦౪. పు.

దొరకించు. దే. స. క్రి. (దొరకు ధా. ప్రే.) 1. లభింపఁజేయు, దొరకునట్లుచేయు. "ఉ...నిన్ను నల్లంతన చూచి దైవ మకటా దొరకించెనె యిట్టి నిర్దయ,స్వాంతునిచేతి కీభువనసారము నంచుఁ గడుం గలంగితిన్." కళా. 3, ఆ. ౧౫. నా. పంచ. ౨, ఆ. ౧౧౧; 2. కలుగఁజేయు, సంభ

వింపఁజేయు. "సీ. పఠియించువారికిఁ బ్రాతిభస్ఫుర ణంబు దొరకించుఁ జాటుతోటకములు." కాశీ. ౪, ఆ. ౨౫౫. కృ. శతం. ౨, ఆ. ౧౨.

దొరకించుకొను. దే. స. క్రి. (దొరకించు+కొను.) 1. పట్టుకొను. "సీ. దుర్యోధనాదులు దొరకించు కొనువేళ విశ్వరూపముఁ జూపువింత యేల." సిం. నార. శ. ౩౭. మృ. వి. 3, ఆ. ౫౦; 2 సంపాదించు. "సీ. పూని తా నిచటికి రా నొక్కనెపమున గురునాజ్ఞ దొరకించుకొనుట యెపుడు." ప్రభా. 3, ఆ. ౧౨౪.

దొరకు. దే. అ. క్రి. 1. చిక్కు, లభించు. "గీ. పెక్కు లేటికి నిందొక్కటక్కులాఁడి, యిపుడు దొరకినఁగద యిన్ని యిం పొనర్చు." ఉ. రా. ౪, ఆ. ౧౭౨. ఆము. ౪, ఆ. ౧౨౩; 2. కలుగు, సంభవించు. "గీ...సీతోడ నడరి పోర,సిగ్గు గది రెడు నైన నిస్సీమవృత్తి, దొరయవలసెను దల పాటు దొరకుకతన." భా. రా. యు. ౨౦౮౬. రాఘవ. ౨, ఆ. ౮౧; 3. వీలగు, సాధ్యమగు. "క...పాతాళమహా,లోకముకంటెను లోఁ తెం, తో కల దాపరిఖ యెఱుఁగ దొరక దొకరికిన్." భాగ. ౧౦. స్కం. పూ. ౧౫౯౩. దశా. ౨, ఆ. ౧౧౨; 4. పట్టువడు. "ఆ. చిక్కువడియె దొరకెఁ జేపడె నగపడెఁ, దవిలెఁ బట్టువడియె దగులువడియె, నబ్బె నన గృహీత మయ్యె ననం దగు..." ఆం. భా. తృ. ౧౧౫. వి. లభించుట, ప్రాప్తి. "గీ. గాఙుఁబూస నిరీక్షింపఁ గడఁగువాని, కరయ నవపద్మరాగంబు దొరకు నాఁగ." ఉద్భ. ౨, ఆ. ౧౦౯.

దొరకుపడు. ద్వ. అ. క్రి. (దొరకు+పడు - స్వార్థమున.) చిక్కు, వశమగు. "క. అరుదెం డన నిక టంబున, కరిగిన దధికర్ణుఁ డంఘ్రిహతి నారెం టిన్, దొరకుపడఁ బట్టుకొని కంధర విరియం గొఱికి చంపి తగ భక్షించెన్." వేం. పంచ. 3, ఆ. ౧౩౩.

దొరకుసన్న్యాసి. ద్వ. వి. (దొరకు+సన్న్యాసి.) నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొనిపోయెడి దొంగ. "గీ. యతి ననుచు వేషభాషల నటమటించి,పొంచి తఱి వేచి కన్నియఁ గొంచు నరిగె, దొరకుసన్న్యాసి యనఁ మాట తిరము గాఁగ, నర్జునుం డద్దిరా యెంత దురనుష్ఠుఁడు." విజ. 3, ఆ. ౧౬౧.

దొరకొను. దే. అ. క్రి. (దొరకు+కొను - స్వార్థమున.) 1. లభించు, చిక్కు. "చ...అరదంబు దగం గడపంగ నెవ్వరుం, దొరకొనకున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్." భార. విరా. ౪, ఆ. ౭౭. భార. శాం. ౫, ఆ. ౩౭౬; 2. సంభవించు, కలుగు. "ఉ. పుత్త్రుల కేల భేద మగు భూసుత యేచును నీవు జాహ్నవీ, పుత్త్రుఁడు నుండఁగా నహితముల్ భయముల్ దొరకొన్న..." భార. సభా. ౨, ఆ. ౧౩౩. కాశీ. ౭, ఆ. ౧౩౯; 3. సాధ్యమగు. "క. క్రతుఫలములు వడయఁగ దుర్గతులకు దొర కొనదు..." భార. అర. ౨, ఆ. ౨౪౨. భార. ఆది. ౪, ఆ. ౧౮౮; 4. నెఱవేఱు, సిద్ధించు. "క. తనవగచిన కార్యముఁ దొరకొన్నటకు ధృత రాష్ట్రపుత్త్రకుఁడు పొంగి పురోచనుఁ బిలిపించి ...నెయ్యమున నిట్లనియెన్." భార. ఆది. ౬, ఆ. ౧౩౭. భార. శాం. ౧, ఆ. ౫౦; 5. తోఁచు, స్ఫురించు. "క. కురువంశము ద్రుంచుటకుం,జొరఁ జాలక నా మనంబు సుడి వడియెడు నే,వెరవును దొరకొనదు గదే, సరసీరుహనాభ పొందు సంపాదింపన్." భార. ఉద్యో. ౪, ఆ. ౮౬; 6. సిద్ధపడు, లొంగు. "క. చని మదనాగ్ని జ్వాలలు,దను కఁగ నిట్టూర్పు గాడ్పు దందడి నిగుడం,దను నూరార్పఁగ సఖి దొరకొనమికి వెనుబడుచుఁ గీచకుం డాసతితోన్." భార. విరా. ౨, ఆ. ౬౦.

దొరకొల్పు. దే. స. క్రి. (దొరకొనుధా. ప్రే.) దొరకొనఁజేయు, సంపాదించు. "క. సుర లోక మహాధ్వర మ్మాచరింపఁ దలంచి ద్రవ్యసంపద మిగులం, దొరకొల్పి." భార. సౌ. ౨, ఆ. ౧౧౭. దశ. ౭, ఆ. ౯౪.

దొరకోలు. దే. వి. (దొరకొనుధా.) లభించుట, ప్రాప్తి. "మ...నీయాజ్ఞం బ్రవర్తిల్లఁగా, దొరకో లల్పమె యెల్లకార్యముల సంతోషంబ మాబుద్ధు లన్, శరణం బాపదలందు నీవ యనువిశ్వాసంబు భాసిల్లఁగన్." హరి. పూ. ౭, ఆ. ౧౪౦. భార. ద్రో. 3, ఆ. ౧౮౫.

దొరకోలుసన్న్యాసి. ద్వ. వి. నమ్మించి మోసపుచ్చి దొంగిలించి పోయెడిదొంగ. "గీ. వేసములు వేసి నమ్మించి వెనుక నాఁచుకొనిన దొరకోలుసన్న్యాసి

యనఁగ వెలయు." ఆం. భా. ద్వి. ౨౯౧. ప్రబంధ. ౭౯౪.

దొరపు. దే. స. క్రి. (దొరయుధా. ప్రే.) 1. కలుగఁజేయు. "సీ. నెరసినచో నెల్ల దొరపుదేవత్వ మీయరిభేదిమాట నవ్యామృతంబొ." చంద్రి. ౫, ఆ. ౧౦౪; 2. ఉంచు. "వ...మంజీరశింజారవంబులు కర్ణస్థాని మాన్పనొరదొరపిన వలదొరపరువంపుఁ గైదువు తెఱఁగున..." చంద్రి. ౪, ఆ. ౧౦౭.

దొరయించు. దే స. క్రి. (దొరయుధా. ప్రే.) 1. కలిగించు. "సీ. చికిలిచూపులవాని సిరిమించుదొరయించుదొరయించుకాంచనాంబరమువాని." వసు. 3, ఆ. ౪౬; 2. ఉంచు. "క. భరతాగమపర్యంతము, ధరణీపాలకుని మేను తైలద్రోణిక్, దొరయింపఁ దత్ప్రధానుల, నరుంధతీప్రాణబంధుఁ డాజ్ఞాపించెన్." చం. రా. ౪, ఆ. ౮౬.

దొరయు. దే. అ. క్రి. 1. తగులు, అంటుకొను. "చ. అలరుమొగంబుతోడఁ గడు నర్మిలి సాకెదురేల తావు చేతులు పచరించుచుం దనువుధూళి మెయిం దొరయంగ నేల త్వన్నెలమిని గౌఁగిలించుకొనవు..." మార్క. ౧, ఆ. ౨౫౧; 2. సమానమగు, సాటియగు. "మ...రాజీవపత్త్రాక్షుతో, దొరయంగా శరుఁ డెట్టివాఁడును సమర్థుండే..." వరాహ. ౧, ఆ. ౧౩౯. భార. కర్ణ. ౧, ఆ. ౨౫౧; 3. కలుగు, జనించు. "గీ. దెసల దొరలకు నిటువంటిదెసలు దొరయఁగలరె పరులింక నతనితోఁ గలని కెదుర." దశా. ౧, ఆ. ౨౩౮. ఉ. రా. ౧, ఆ. ౨౭౨; 4. జరగు, ప్రవర్తిల్లు. "మ...గంభీరాప్సరోనృత్యముల్, దొరసెంగన్నులపండువై జనులు సంతోషించి ఘోషింపఁగన్." విక్ర. ౧, ఆ. ౧౮౦. రామా. 3, ఆ. ౧౧౭; 5. ఒప్పు, శోభిల్లు. "చ. హరి కిరుగేలుఁ దామరలయందును జక్రము పాంచజన్యముక్, దొరయుఁగలిన్..." రామా. ౧, ఆ. ౮౨. కళా. ౧, ఆ. ౧౮; 6. చిక్కుకొను, సంసక్తమగు. "క. మరుఁ డను మేటికిరాతుఁడు, సరభసముగ ముగ్ధమతుల జనవిహాగముల౯, దొరసి పడ నడఁప నొగ్గిన,యురులుసుమీ సంయమీంద్ర యువిదలు తలఁపన్." వాసిష్ఠ. ౧, ఆ. ౧౮౯; 7. తగు. "చ. సరనుతు నిమ్మహేంద్రగిరినాథు పరింపుము రూపసంపదక్, దొరయు నితండు నీకు..." శైవ. ౫, ఆ. ౧౩౨. రాఘవ. ౨, ఆ. ౯౫; 8. ఉండు. "సీ. పులకలు నిండారఁ బొడమినదేహంబు ధూళిధూసరితమై దొరయుచీపు." హంస. ౨,ఆ. ౧౦౮. రా. వి. ౫, ఆ. ౯; 9. వచ్చు. "సీ...సరిదొరల్ సంధింప దొరయువేళ." శుక. ౧, ఆ. ౨౫౩. స. క్రి. 1. పోలు. "క. అరయఁగ నాలుగువిధములఁ,బరఁగుఁ జతుష్పాదవృత్తిఁ బరఁగినగోవ్రజ౯, దొరయుచు నందొకఁ డెడలిన, నరవర సద్ధర్మవర్తనము గుంటువడున్." భార. అను. ౪, ఆ. ౨౮౫. కాశీ. ౪, ఆ. ౧౦౧; 2. తాఁకు, స్పృశించు. "వ...మరందధారాబృందంబువాఁకలం గలసి ప్రవహించునెలయేటినీటితుంపరల౯ దొరసి మందగతులం దిరుగుమందపవనంబుల౯ దార్కొని..." ఉ. రా. 3, ఆ. ౧౯౧; 3. (ముక్కుతో) పొడుచు. "శా. శ్రీరాధాధరబింబముం దొరయుకొంచిల్క౯ నిజోరస్థలిన్, రారాజన్మణికాంతి రాఁ బిలిచి..." ఉ. రా. ౧, ఆ. ౧; 4. చొచ్చి, ప్రవేశించి. "మ. అని బోధింపఁ గలంకదేఱి రఘువంశాంభోధిచంద్రుండు తమ్మునిసెమ్మోము ప్రసన్నదృష్టిఁ గని సమ్మోదంబువాటిల్లె నీ,యనవద్యోక్తి హజారముక్ దొరసి యన్నా నాల్గునాళ్లయ్యె భూ,జనసంరక్షణ మెల్లి కైన ఘటియించఁ౯ బోఁదగుక్ వేడుకన్." ఉ. రా. ౬, ఆ. ౩౫౧.

దొరలకయుండు. దే. అ. క్రి. (దొరలక+ఉండు.) ఊరకొను, ఉదాసీనుఁడగు. "క. ఇరువదియేడులు తనపాల, మొరుఁడు గుడుచుచునికి యెఱిఁగియున్నెనియుఁ దా,దొరలకయున్నెనియుఁ దత్పరిభోగము గుడిచినతనిపాలై పోవున్." విజ్ఞా. వ్యవ. ౪౬. శ్లో. పశ్యతోఽ బ్రువతో భూమే ర్హానిర్వింశతివార్షికే. యాజ్ఞ. వ్యవ. ౨౪.

దొరలించు. దే. స. క్రి. (దొరలు ధా. ప్రే.), 1. రాలు,పడు. "సీ. భానూష్మభీతి మున్ పడినచుక్కలభంగి దొరలె వేకువగాలిఁ దరుల మంచు." స్వా. ౫, ఆ. ౪౦. కవిక. ౪, ఆ. ౧౧౧; 2. తిరుగు, పరిభ్రమించు. "క. మరల౯ గర్భము జన్మము,మరణము నిరయమును మఱియు మఱియు నటు నిరంతరసంస్కృతిచక్రంబున, దొరలి నరుం డొందు సర్వతోదుఃఖములన్." కవిక. ౫, ఆ. ౧౧౬; 3. కలుగు, సంభవించు. "సీ. వెఱ, వెఱుం

గఁడు వైరిహీరులఁ బొడఁగన్న వెఱచు బొం
కేయెడ దొలఁకునొ యని." మొ. రా. బాల.
౨౦. అచ్చ. యు. ౪౩౫; 4. కలియు,కూడు.
"గీ. ద్రోహు లగు వేలుపులలోన దొరలి యున్న,
పనియునొక్కం డ్రుద్రుఁడు బాఱ విడిచె." కాశీ.
౭, ఆ. ౧౫. ద్వి. హరిశ్చ. పూ. ౧౫౬౪. పం:
5. అతిశయించు. "మ. మదనమనోహరాంగమణి
మండన నీగురువాన యంచుఁ బ్రేమ దొరల విన్న
వించి నృపుమన్ననఁ గాంచి..." శుక.౧, ఆ.౩౪౦.

దొరల్చు. దే స. క్రి. (దొరలు ధా. ప్రే.) 1. కలుపు.
"సీ. నిగరంపు మోవి తేనియలతోన దొరల్చి చెలువ
లిచ్చిన సంతసించుఁ గొన్ని." వేం. పంచ. ౪, ఆ.
౨౪౧; 2. మార్చు. ఒకదానికిమాఱుగా చేయు.
"ఉ. ఆయతికాని కీను మమరాలయముఖ్యము
లాతఁ డర్థతృష్ణాయుతుఁడై నిజోర్వి నగునష్టికిఁ
దద్ధనముం దొరల్చి రాజాయతనంబుఁ జేర్చు..."
ఆము. ౪, ఆ. ౨౧౮.

దొరవచ్చు. దే. అ. క్రి. (దొర+వచ్చు.) సాటియగు,
సమానమగు. "సీ. దొరవచ్చు ననవచ్చుఁ దోయ
జాక్షునిమూర్తి కభిరామలక్ష్మీసమగ్రమహిమ."
భీమ. ౧, ఆ. ౧౦౬. భోజసుతా. ౨, ఆ. ౩౪.

దొరవి. దే. వి. కొలను. "క. క్రీడి వెఱఁగంది కనుఁ
గొనఁ,గేడించుచు నొండుదొరవికిం జని యచ
టన్,జాడ భయంకర మగుచును, గోడిగ తద్రూప
ముడిగి క్రోల్పులి యయ్యెన్." జై. ౫, ఆ. ౯౭.

దొరసాని. ద్వ. వి. (దొర+సాని.) రాజ్ఞి, రాణి. "గీ.
సామి మాదొరసాని సాష్టాంగముగను, తావకీన
పదాంబుజద్వంద్వమునకు, వినుతులను జేసి నా నని
విన్నవించె, నన్య్య లింకెవ్వరును లేరె యవల
వినుము."(?) ౬, ఆ. ౧౦౫. శశాం. 3, ఆ.
౧౧౨. ఆం. భా. ద్వి. ౧౦౭.

దొరసెము. దే. వి. నిరుటికి వెనుకటిసంవత్సరము. "చ.
దొరసెమునందు చుట్టుకొని తోరణకట్టె నురో
విభాగమున్, నిరుడు పయోజకోశరమణీయతఁ
దాల్చెను వర్తమానవత్సరమున నొప్పె హేమ
కలశంబులబాగున ముందటేఁటికిన్, గరినిభయాన
చన్నుఁగవ కౌఁగిలిపట్టులు గాకయుండునే."
క్రీడా. ౨౮౭.

దొరాదొర. దే. వి. పెద్దదొర. "సీ. చేకొన్నయది
మొదలు చెలఁగి భర్తకు దొరాదొర లెల్ల స్వప

శులై పరఁగువాత." ఆనంద. పీఠి. ౭౩. రాధికా.
౧, ఆ. ౩౨.

దొరుగండి. దే. వి. (దొరువు+గండి.) నిండిననీళ్లు వెలు
పటికిఁ బోవుటకై యేర్పఱచినదొరువుతూము.
"సీ. మడువులు పసులకాల్మడిఁ బుచ్చె దొరు
గండిప్రంతలు పెనుఱొంపిప్రంత లయ్యె." హరి.
పూ. ౬, ఆ. ౫.

దొరువు. దే. వి. 1. నడబావి, ఒకవిధమైనచెలమ. "క.
తిరుకొళము నూయి లోటయుఁ, జెఱువు మడువు
లొండుకుంట చెలమ పడియ కో,నేఱు బుగ్గ వాఁగు
దొన తల పరిగుండము కాల్వ డిగియ బావి దొరు
వులన్." హంస. ౪, ఆ. ౨౧౦. రాఘవ. ౨, ఆ.
౬; 2. కొలను,చెఱువు. "గీ. తోఁచె హరిణాంక
బింబంబు నాఁచుతోడి, దొరువుగతి నంబరము
మడికరణి నుండె." వరాహ. ౪, ఆ. ౧౪౭.

దొరువుపట్టెడ. దే. వి. గంతయొద్దులతోఁకక్రింద తగి
లించెడుపట్టెడ. (శ. ర.) ఎద్దుముడ్డికితగిలించెడు
పట్టిక. (బ్రౌ.)

దొఱయు. దే. అ. క్రి. కలియు, కూడు. "చ. ఎదు
రుగ వచ్చి పాండ్యధరణీశ్వరుఁ డర్జునుఁ గాంచి
నేఁడు గా, సుదినము మీరు రాఁ గలుగుశోభన
మెన్నఁడు గల్గుఁ బ్రోలికిం,బదఁ డని యిద్దఱుం
దొఱసి భద్రగజంబుల నెక్కి వచ్చిరి..." విజ.
౧, ఆ. ౧౫౫. శుక. ౧, ఆ. ౪౮౬. స. క్రి.
1. పొందు, ప్రాపించు. "చ. ఉఱికి తొలంగ
దాఁటియును నూరక తోఁకలువట్టి దవ్వుగాఁ, బఱ
పియుఁ గొమ్ము లూడి పెడఁబాయఁగఁ ద్రోచియుఁ
గేల లీలమైఁ,జఱచి కలంగఁజేసియును జంపఁగ
నొల్లక గోస్వరూపతన్, దొఱసినరాక్షసాంగనలఁ
దోలె నతండు నిమేషమాత్రలోన్." హరి. పూ.
౬, ఆ. ౪౯. (దొఱఁగిన. అపముద్రి.) చంద్రి.
3, ఆ. ౪౫; 2. రమించు. "క. గొఱకై బ్రాహ్మణ
కన్యక, దొఱసినశూద్రుండు ప్రీతితో నొక్క
టియై, వెఱపక పుట్టించినయా,జఱభికిఁ బుట్టిన
యతండు చండాలుఁ డగున్." విజ్ఞా.ఆచా. ౧౩౯.

దొలుక. దే. వి. గుల్ల, అంతస్సారహీనమైనవస్తువు.
"క. పలుచని నెత్తురుమడుఁగులఁ,బొలిచెన్ రథ
నేమివలయములు రణహతవీరులు దూఱఁగ రవి
బింబము, దొలుకై రుచి మాలి నీడఁ దోఁచిన
మాడ్కిన్." కవిక. ౨, ఆ. ౧౯౩.

దొలుచు. దే. స. క్రి. దొరలించు. "సీ...అన్యోన్య సంఘట్టనారవంబు, లెసఁగంగ సంగ్రామ మేర్పడఁ జేయక యక్షముల్ దొలిచి యే నశ్రమమున." భార. సభా. ౨, ఆ. ౧౪౨.

దొలుపు. దే. స. క్రి. దొరలించు. "ఉ. కమ్మని యూర్పుగాడ్పు చలకమ్రకుచమ్ములపూఁత యూఁతగా, నెమ్మెయి ఘర్మముల్ దొలుప..." పాంచా. ౯, ఆ. ౨౮. శ్రీరం. మా. ౬, ఆ. ౭౨.

దొల్చు. దే. స. క్రి. పొడుచు; రంధ్రముచేయు "చ. వడిఁ దలఁ ద్రొక్కి ముక్కున నవారణఁ గన్నులు దొల్వఁ బొల్పుబల్విడిఁ దమకించువాయసములీల మదీయసమీపవర్తియై, యుసుగళ కీడు నాకుఁ గడు నుగ్రముగా నొనరించె.." హరి. పూ. ౮. ఆ. ౬౨. నరస. ౧, ఆ. ౬౪.

దొల్లు. దే. అ. క్రి. దొరలు. "ద్వి. లాలాసుధార సోల్లసిదమై చంద్రు పోలిక ముఖబింబమును తేజరిలఁగ, దొల్లుబండియను దైత్యుని ద్రొక్కి నేల, డొల్లంగఁ దన్ని..." అ. మ. క. ౧, ఆ. ౨౮. పు.

దొసఁగు: దే. వి. 1. హాని, చిక్కు. "క. అసురుల కమృతము పోయుట, పొసఁగదు పాములకుఁ బాలుపోసినమాడ్కిన్, దొసఁగగు నంచును వేఱొక, దెసఁ గూర్చుండంగఁ బెట్టె దేవాహితులన్." భాగ. ౮, స్కం. ౩౧౬. భర్తృ. ౧, ప్ర. ౯౦; 2. పాపము. "సీ. దోస మనంగను దొసఁగు దొసంగు నాఁ గసటు నాఁ బాపంబుగాఁ దనర్చు." ఆం. భా. ప్ర. ౯౭; 3. విఘ్నము, ఆటంకము. "గీ. కవదొనలు పూని వెంట లక్ష్మణుఁడు నడవ, రామభద్రుండు నావెంట రా నియోగ, మొసఁగితివ యేని ధ్రాకాసిదొసఁగు మాని, యవభృథస్నాత నగుదు నోయధిప వినుఁడు." చం. రా. ౨, ఆ. ౬౧. అచ్చ. పీఠి. ౨; 4. బాధ, పీడ. "ఆ. కొఱఁత తీఱె నెల్లకోర్కులు సమకూరెఁ, దుట్టువానె నింక దొసఁగు లేదు." భా. రా. యు. ౨౨౯౨. భార. ఉద్యో. ౪, ఆ. ౯౯; 5. సంబంధము. "సీ. చదువుతోడిదొసంగు చాలించె మునుమున్న తీర్థమాడెద నన్న తెక్వ వదలె." రుక్మా. ౪, ఆ. ౧౦౨.

దొసవు = దొసఁగు. (శ. ర.)

దో

దో. సం. వి. స్. పుం. న. బాహువు. "ఉ...తదీయ దంతములు దోల నమర్చినఁ జూడనొప్పి రా, చెంగటఁ గాలవండములు చేకొని యున్న యమద్వంబనన్." వి. పు. ౭, ఆ. ౪౦౭.

దోఁకిస. దే. వి. దోఁకుట. (శ. ర.)

దోఁకు. దే. అ. క్రి. ఇంకు, తగ్గు. "సీ. ఉద్వేలమగుచుఁ బెల్లుబ్బెడురాగవార్ధులు లేశమైనను దోఁకవయ్యె." పి. శకుం. 3, ఆ. ౨౧౯. స. క్రి. నేలను ఎదురుగా చెక్కు. (శ. ర. వా.)

దోఁకుడు. దే వి. (దోఁకు ధా.) దోఁకిస, దోఁకుట. (శ. ర.)

దోఁకుడుపాఱ. దే. వి. (దోఁకుడు+పాఱ.) దోఁకు సట్టిపాఱ, తవుగోల. "గీ. పరఁగుఁ దవుగోల దోఁకుడుపాఱ నాఁగ." ఆం. భా. ద్వి. ౨౩౦.

దోఁకుడుబార. దే. వి. బాలక్రీడావిశేషము, గూఢమణి. (శ. ర.)

దోఁగాడు. దే. అ. క్రి. (దోఁగు+ఆడు.) బిడ్డలు నేలపైఁ జేతు లాని మోకాళ్లతో నడచు, ప్రాఁకు. "క. బొరగిలి పొట్టజీరలు, నేరిచి దోఁగాడి లేచి నిలుచుచుఁ బడుచున్, నేరమివలెనే మేనక, కోరిక చిచ్ఛక్తి కొంత కొనసాగించెన్." పార్వ. ౨, ఆ. ౧౨.

దోఁగియాడు. దే. అ. క్రి. (దోఁగి+ఆడు.) ప్రాఁకు. "గీ. దోఁగియాడంగ నేర్చె దైత్యులు కృశించి, తొంటిమద మేది మేదినిఁ గుంటువడఁగ." రామా. 3, ఆ. ౧౪3. చంద్రా. ౨, ఆ. ౪.

దోఁగు. దే. అ. క్రి. 1. (మేని)తో లొలియు, చర్మము ఊడు. "సీ...చెక్కుఁ బోయినవాఁడుఁ బ్రక్కయొముక, మురిసినవాఁడును మొగము దోఁగినవాఁడునై నొచ్చి..." రామా. ౮, ఆ. ౧౩౨; 2. ప్రాఁకు. "వ...నొచ్చియుఁ జొచ్చియుఁ దెరలియుఁ బొరలియు దోఁగియు డాఁగియు... కృతాంతుసన్నిధికిం బోయిరి." శివరా. ౪, ఆ. ౮3.

దోఁగురు. దే. వి. చౌర్యము, దొంగతనము. "సీ. దోఁగురు నాఁగను దోఁపడ మనఁగను దోఁప్రుడు నాఁగను దోఁపు నాఁగ, దొంగఱిక మనంగ దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు..." ఆం. భా. ద్వి. ౨౯౨.

దోఁచు. దే. స. క్రి. 1. కొల్లగొట్టు. "సీ...కుశస్థలి యుంగ్రులైన. గీ. రాక్షసులు దోఁచికొనుటయుం రాజసూను, లఖిలదిశలఁ జెల్లాచెద రైరి భీతి." హరి. పూ. ౨, ఆ. ౧౨. పరమ. ౪, ఆ. ౨౦౦; 2. దొంగిలించు. "ఉ...నేఁ డిదె ప్రొద్దు దోఁచుకో,

నిక్కడ వాట మంచు మది నెంచఁగ వారికి నక్కడక్కడన్." కాశీ. ౪, ఆ. ౬౬. య. ౪, ఆ. ౩; 3. (అధికముగా మోసముచే) గ్రహించు, పుచ్చుకొను. "సీ. అన్నదాతల మంచు యాయజూకుల మంచు దొరలచే రూకలు దోఁచువారు." దశా. ౧౦, అ. ౧౦౫. కళా. ౧, ఆ. ౧౯; 4. లాగు, ఆకర్షించు. "గీ. వల్కలంబులు దోఁచిన వంగువారుఁ, జెఱలు వోయినవారలఁ జేరువారు." ఉ. హరి. ౧, ఆ. ౧౦౨. రాఘవ. ౩, ఆ ౨౦; 5. అపహరించు. "క. ప్రాణముల కెక్కుడగునా ప్రాణేశ్వరి దోఁచికొనెను..." భా. దా. కిష్కిం. ౧౦౭.

దోఁటమ్ము. ద్వ. వి. (దోఁటి+అమ్ము.) దోఁటివలె వంపైనఅలుఁగు గలబాణము, కర్ణిశరము. (శ. ర.)

దోఁటి. దే. వి. అందనిపండ్లు మొదలగువానిని కోయుట కుపయుక్తముగా వంకరచిల్ల దోఁపినకోల, చివర వంకరగా చిన్నకఱ్ఱముక్క కట్టినగడ. "రగడ. గుమగుమనివాసనల గేఁదగి కొమ్మ కొమ్మకు నందె దోఁటికి." పారి. ౪, ఆ. ౧౬. భా. శ. ౧౦౫.

దోఁటిముక్కర. దే. వి. దోఁటివలె వంపయిననాసాభరణము. (శ. ర.)

దోఁపరి. దే. విశే. (దోఁపు+అరి.) 1. దొంగ, తస్కరుఁడు. "సీ. దొంగ తెక్కలికాఁడు దోఁపరి ముచ్చు జారకాఁడనంగఁ దస్కరుఁడు వెలయు." ఆం. భా. ద్వి. ౨౯౧; 2. కొల్లకాఁడు. (శ. ర.)

దోఁపిడి. దే. వి. (దోఁపు+ఇడి.) 1. దోఁచుకొనుట, అపహరించుట; 2. కొల్ల. (శ. ర.) బ. బాలక్రీడావిశేషము. "సీ. పెంచులబేరి దోఁపిళ్లు గాలిపటంబు సరిబేసి పుటచెండు చాకిమూట." హంస. ౩, ఆ. ౧౪౬.

దోఁపిడికాఁడు. దే. విశే. (దోఁపిడి+కాఁడు.) 1. దొంగ; 2. కొల్లకాఁడు. (శ. ర.)

దోఁపిడియాటలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకముల్ దోఁపిడియాటలు..." ప్రబంధ. ౬౧౩.

దోఁపు. దే. స. క్రి. (పుష్పాదులను తలలో) పెట్టుకొను, చొప్పించు. "ద్వి. తెలిమోము లరదోఁపుఁ దిగిచినకావి, జిలుఁగుముసుంగులోఁ జెంగల్వరేకు, లాసపఱిగా దోఁచి యున్నకల్హారకుసుమగంధంబు లాగుబ్బుగా నొలయ." ద్వి. హరిశ్చ. పూ. ౯౨౮. పం. చిత్రభా. ౫, ఆ. ౬౯. వి. 1. కొల్ల, దోఁపిడి. "గీ. కలవి మామూఁక నిప్పింతుఁ దొలఁగుఁడో కటికి, యాఁడుదానిఁ జేసంటకుఁ డనుచుఁ బెద్ద, తనము నభిమానమును దెంపు గనఁగఁ బలికి, నిలిపి దోఁపిచ్చువారునై తొలఁగి రపుడు." ఆము. ౬, ఆ. ౭౭. దశా. ౭, అ. ౪౧౦; 2. పూర్ణ్ణానకము, సర్వస్వము నిచ్చుట. "గీ. లాస్య మొనరించె నక్కమలాస్య యపుడు, కోపుకోపున దొరలెల్ల దోఁపు లొసఁగ." వైజ. ౧, ఆ. ౧౨౯. దశా. ౭, అ. ౪౦౯.

దోఁపుకాఁడు. దే. విశే. (దోఁపు+కాఁడు.) 1. దొంగ; 2 కొల్లకాఁడు. (శ. ర.)

దోఁపుమారు. దే. వి. (దోఁపు+మారు.) అరుఁగులు మున్నగువానికి జల్లుకొట్టకుండుటకై తాటియాకులు మున్నగునవి దోఁపి పెంచినచూరు, అంతశ్ఛది. "సీ. దోఁపుమారనఁగను దోఁచు నంతశ్ఛది..." ఆం భా. ద్వి. ౨౧.

దోఁపుడు. దే. వి. (దోఁపు ధా.) 1. దోఁచుకొనుట; 2. కొల్ల. (శ. ర.)

దోఁపుడుకాఁడు. దే. విశే. (దోఁపుడు+కాఁడు.) 1. దొంగ; 2. కొల్లకాఁడు. (శ. ర)

దోఁపుడుపడు. ద్వ. అ. క్రి. (దోఁపుడు+పడు.) కొల్లగొట్టఁబడు. "సీ. భవదూరుసంభవబహువైశ్యకోటికా తురకలచే నిట్టు దోఁపుపడుట." సిం. నార. ౪౮.

దోఁపువోవు. దే. అ. క్రి. (దోఁపు+పోవు.) నులివడు. "ఆ. దోఁపువోయె ననుట దోఁచు నులివడెననంగ..." ఆం. భా. తృ. ౧౧౬.

దోగ్ధ. సం. వి. ఋ. పుం. 1. గొల్లవాఁడు; 2. దూడ; 3. స్తుతించుచు కవిత్వముచెప్పి ధనము సంపాదించి జీవించుకవి; 4. పనిపాటులు చేసి ధనము సంపాదించి దానిచే బ్రదుకువాఁడు. విశే. (ఋ. గ్ధ్రీ. ఋ.) పాలు పిదుకువాఁడు.

దోగ్ధ్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. పాఁడియావు; 2. గొల్లది; 3. పాలిచ్చుదాది.

దోణము. దే. వి. 1. భుజములకు బలము వచ్చుటకై త్రిప్పెడు జెట్టివానియుపకరణవిశేషము; 2. ప్రాను సుకరముగాఁ జీల్చుటకై యక్కడక్కడఁ జెక్కిన కొయ్యమేకులను దిగఁగొట్టు ఉపకరణవిశేషము. (శ. ర.)

దోదసి. వై. వి. (సం. ద్వాదశీ.) పక్షమందలిపండ్రెండవతిథి, ద్వాదశి. (శ. ర.)

దోదుమి = దోదుమ్మి. (శ. ర.)

దోదుము = దోదుమ్మి. (చూ. దోదుముదారి.)

దోదుముదారి. దే. వి. (దోదుము+దారి) ఆయుధవిశేషము; ఖడ్గవిశేషము. "సీ. కలువవెన్నెలి కాని బలిమిఁ దామరజేసు చికిలిదోదుముదారి చెఱఁగఁ జూచి." చంద్రా. ౩, ఆ. ౧౧౭.

దోదుమ్మి. దే. వి. ఆయుధవిశేషము, ఖడ్గవిశేషము. "గీ. మోపెముస నైదుతూపులపాదుపాహి,తమ్మి దోదుమ్మిఁ గొంచి..." ఉ. రా. ౭, ఆ. ౪౧౬.

దోదుమ్మిదారి. దే. వి. (దోదుమ్మి+దారి.) దోదుముదారి. "గీ. తిమ్మరగసాలుచికిలిదోదుమ్మిదారి,బలిమిఁ జెగటారి సురపురప్రాంగణమున, వఱలెడుకటారి రాహుత్తవరులచేతఁ, గీడుసేయుదె మడియలతోడి చెలిమి." కువల. ౧, ఆ. ౩౯.

దోదూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తపించుచున్నది; 2. మిక్కిలి తపింపఁ జేయుచున్నది.

దోదూయ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తపింపఁ జేయఁబడుచున్నది.

దోధూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి కదలుచున్నది; 2. మిక్కిలి కదల్చుచున్నది.

దోధూయ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి కదల్పఁబడుచున్నది.

దోనమ్ము. ద్వ. వి. (దోని+అమ్ము.) చిన్నబాణము. "సీ. దోనమ్ము లం చన నా నల్పశరములు..." ఆం. భా. ద్వి. ౨౧౩.

దోని. వై. వి. (సం. ద్రోణీ.) 1. దొన, నీరు నిలుచుట కేర్పఱచినపల్లము. "సీ. కటికంపుదోనులఁ గరఁగుగొజ్జెంగపూనీటిబల్లకక్కర ల్దాఁటి దాఁటి." రసిక. ౨, ఆ. ౭౧. ద్వి. తి. సా. ౧, ఆ. ౯. పు; 2. అరిణ, ఎత్తుడునీరు పోయుటకై తొలిచి కాలువమొదట నుంచుతాటిమ్రాను మున్నగునది. "వ...అర్యోత్తంబు ముంగిసమ్రానికి వెదురునకు నంటఁగట్టినవాఱుపరిమళం బాఘ్రాణించి దోనిం బడి చని..." హంస. ౧, ఆ. ౧౯౨; 3. నీరు పాఱుట కేర్పఱచినచిన్నకాలువ,దోనె. "గీ. కైరవములకు వెన్నెలనీరు పఱపఁ,బూని చేర్చినకటికంపుదోను లనఁగ." పారి. ౨, ఆ. ౩౯. భాను. ౩, ఆ. ౪౬. విణ. చిన్నది. (చూ. దోనమ్ము.)

దోనె. వై. వి. (సం. ద్రోణీ.) 1. చిన్నపడవ, ద్రోణి; 2. కాష్ఠాంబువాహిని. "గీ. ద్రోణి యగు దోనె యనఁగను..."ఆం. భా. ప్ర. ౧౫౭; 3. జెలగడుగువానిసాధనము. (శ. ర.); 4. సాలెవాఁడు చాఁపు చుట్టెడుమ్రాను. "సీ. కుంచెమగ్గపుగుంత గుూటంబు పగ్గంబు పరఁటెద్రొక్కుడుపట్టెపలక దోనె" హంస. ౨, ఆ. ౧౧.

దోనెడొగ్గు. ద్వ. అ. క్రి. (దోనె+ఒగ్గు.) క్రిందికి మోకరించుకొను. "సీ. కరఘాతపతదబ్ధఘుటఁ గొమ్ముకొనఁ జిమ్ముకమి దోనెడొగ్గి చౌదంతి డిగియె." వసు. ౫, ఆ. ౬.

దోమ. దే. వి. మశకము. "క. ఆసీరధి నెల వింతనఁ,గా నేరము తేలగిలుమకరములమీఁదన్,మైనాకాదులు తెక్కలతో నిలుచుం గరులమీఁది దోమలకరణిన్." ద్వా. ౨, ఆ. ౧౬౩. ఉ. రా. ౩, ఆ. ౩౦౪.

దోమటి. దే. వి. అన్నము. "సీ. దోమటీఁ దొడుకునే ప్రేమఁ గోకిలములు పాటలసహకారపల్లవముల."చంద్ర. ౩, ఆ. ౧౧౩. వేం. పంచ. ౪, ఆ. ౨౪౧.

దోమతెర. ద్వ. వి. (దోమ+తెర.) దోమలు చొరకుండ మంచముచుట్టు వేయువలగుడ్డ, చతుష్కి. "ఉ...క్రమ్మంబున ఘర్మశంకమై, నుప్పతిలంగ దోరుతెర లుప్పర మెత్తిరి..."ఆము.౫, ఆ. ౧౦౪.

దోము. దే. వి. 1. ఆహారము దేహమున పట్టక పసులు పాఱుకొనుట. (శ. ర.); 2. కడుపువాపు, ఉదరశోఫము. "సీ. ఔదరశోఫమై యలరు దోము." ఆం. భా. ద్వి. ౧౨౬.

దోయము. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. "సీ. అచ్చనగండ్లు దోయాలును దాఁగిలిమూఁతలు నాలుగుమూలలాఁట."దశా. ౧, అ. ౧౧. ఇందు. ౨, ఆ. ౧౪౩.

దోయి. వై. వి. (సం. ద్వయీ.) 1. జత, జోడు. "క. నీయుపదేశముఁ దనచే, దోయిబలువుఁ దోడుగాఁగ ద్రోణుఁ గడచి...సైన్యము...పఱవఁగఁ జేసెన్." భార. ద్రో. ౨, ఆ. ౨౭౧. కాళిందీ. ౫, ఆ. ౧౨౩. ఆం. భా. ద్వి. ౧౦౦; 2. కలయిక, సాంగత్యము. 'గీ. మన్మథాధీనపరతంత్ర

మానసులును, నగుచు పేశాసనాసీను లైరి తగ వధూవరులు సౌఖ్యరసములదోయి వోలె." దశ. ౪, ఆ; ౫౭; 3. సామ్యము, పోలిక. "ఉ. ఎక్కడిదోయిపో యలమృగేక్షణమేనికి నక్కడానికిన్." విజ. 3, ఆ. ౧౪. విణ. సహాయము, తోడు. "సీ. యమునాజలానీల మాచిమ్మచీఁకటి పెల్లున జగ మెల్ల నల్లనైన, నీరాన మతి గానరా దని హరి లక్ష్మి దోయి గా నమృతాబ్ధిఁ బాయ కుండ." ద్వా. ౪, ఆ. ౧౦౨.

దోయికట్టు. ద్వ. అ. క్రి. (దోయి+కట్టు.) రెండు భాగములుగా చీలు. "వ..తక్కినవారును దమలోన దొరయుంభంగి దోయికట్టిరి." హరి. పూ. ౭, ఆ. ౯౨.

దోయిడి. దే. విణ. (దోఁచు ధా.) రిక్త,శూన్యము. "గీ. అనిన వృషకేతుఁ గనుఁగొని యనిలసుతుఁడు, పలికినారము తురగసంబంధమైన, ప్రతిన లెస్సేని ధర్మసంభవునియెదుర, మనము దోయిడిచేతుల మగుడు టెట్లు." జై. ౨,ఆ. ౧౫. శేష. ౫,ఆ. 3౧.

దోయిలి. వై. వి. ఔ. (సం. ద్వయీ.) 1. దోసిలి, అంజలి. "క. పువ్వులదోయిటికయ్యం, బవ్వనితా వరుల నలఁత నందించెఁ గడున్." కాళిందీ. ౫, ఆ. ౧౨౫. భార. స్త్రీ. ౨, ఆ. ౮; 2. నమస్కృతివిశేషము. "వ...అయోధ్యయందలి రఘూద్వహునకు దోయిలి మధుర నున్నబాల కృష్ణునకు సాఁగిలి..." ప్రబంధ. ౮౮౦.

దోయిలించు. వై. స. క్రి. 1. దోసిలితోఁ బట్టుకొను. "క. అసమభయభక్తి లలరఁగఁ, గుసుమంబులు దోయిలించి కోమలి నించెన్...మృదుని యడుగులమీఁదన్." పార. 3, ఆ. ౭౪. నైష. ౬, ఆ. ౧౦౨; 2. (చేతులను) జోడించు, అంజలిగాఁ గూర్చు. "వ...అద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె." భాగ. ౬,స్కం. ౪౧౮. అచ్చ.యు. ౫3.

దోయిలితీర్చు. ద్వ. అ. క్రి. (దోయిలి+తీర్చు.) నమస్కరించు. "రగడ. ఒప్పుగ నుండుయథోక్తస్థలము యథోక్తకారునకు దోయిలి తీర్చుచు..." హంస. ౪, ఆ. ౨౧3.

దోర. దే. వి. 1. రాశి. (శ. ర.); 2. దొంతర,ఉత్పంక్తి. "ఉ...గద్యపద్యములన్, దొరలు పేర్చినట్లు మది దోఁచఁగఁ జేయుట..." మార్క. పీఠి. ౫, ౬౦ భా. ద్వి. 3౪; 3. పండఁబాఱిన కాయ. "వ... పండ్లకు నందమ్మును గాయలకు సోయగంబును, దోరలకు గౌరవంబును, బంధులకు మెండును గలిగించి కలాయిత హేమంతరంబుగ వసంతం బయ్యె నయ్యెడ." ఉద్భ. ౧, ఆ. ౮౮. విణ. 1. ఎఱ్ఱఁబాఱినది. "ఉ. కన్నులదోరచాయ లలికంబున లేఁజెమరు...కల్గునట్లుగాఁ,గన్నియ నిన్నుఁ గూడి రతికాంక్షలు మీఱి సుఖించు టెన్నఁడో." చంద్ర. ౪, ఆ. ౧౧౧. రం. రా. ఉ. ౯3. పు; 2. ఒఱఁగినది. (చూ. దోరగల్లు.)

దోరగలు = దోరగల్లు. (చూ. దోరగలుపడు.)

దోరగలుపడు. ద్వ. అ. క్రి. (దోరగలు+పడు.) ఒడ్డగెడవగు. "క. తగులువడి యపుడు వడి నెడి, గగనమణిరథంబు దోరగలువడి నిలిచెన్." కాశీ. ౧, ఆ. ౧33.

దోరగల్లు. దే. వి. (దోర+కల్లు.) ఒకప్రక్క క్రిందికొఱఁగి మఱియొకప్రక్క పైకి లేచి యుండుట, ఒడ్డగెడవు. "చ. కనుఁగవ దోరగల్లులవికారపుఁ జూపులఁ గోపులానుతో,డనె దశ మెక్కునాలుక తడంబడుమాటల..." శుక. 3, ఆ. ౧౯౯. విణ. ఒడ్డగెడనైనది. "సీ. ఒకదిక్కు దోరగ ల్లొఱఁగి పైఁబడుదునో లొలఁగి కమ్మలు మ్రోయ నిల చలింప." హరి. పూ. ౫, ఆ. ౧౭౨.

దోరగల్లుపడు = దోరగలుపడు. "అ. సాంధ్యనటన చండచండీశుపదహతి,ధరణిచక్ర మొఱఁగి శరధి గ్రుంగ, దోరగల్లువడియె భూరథేతరభాగ,చక్రమనఁగ నపుడు శశియుఁ దోఁచె." స్వా. ౫, ఆ. 3౫. పీ. శకుం. 3, ఆ. ౨౮౬.

దోరగాయ. దే. వి. (దోర+కాయ.) పండఁబాఱిన కాయ. "గీ. కల్పవృక్షాలఁ గలదోరగాయఁ గూడఁ,గోసి యిట తెచ్చి నిల్పినవాని యనుచు." పార్వ. ౨, ఆ. ౧౨౦. భాగ. ౮,స్క. ౪౪౭.

దోరగించు. దే. స. క్రి. దోరగిల్లఁజేయు. (శ. ర.)

దోరగిలఁబాఱు. దే. అ. క్రి. (దోరగిలన్+పాఱు.) పండఁబాఱు. "వ...దోస దోరగిలంబాఱె." కాశీ. 3, ఆ. ౨3.

దోరగిలు. దే. అ. క్రి. ఎఱ్ఱఁబాఱు. "క...శశిపైఁ, గినిసి కనుంగొనలు దోరగిల నిర్దయుఁడై." వరాహ. ౭, ఆ. ౪౯. హ. న. ౪, ఆ. ౪.

దోరణపుఁగమ్మి. వై. వి. (దోరణము+కమ్మి.) ద్వారము మీఁదియడ్డకమ్మి (శ. ర.)

దోరణపుఁబట్టె. వై. వి. (దోరణ+పట్టె.) కపిలెబల్ల క్రిందియడ్డపట్టె (శ. ర.)

దోరణపుసాటిరిక్క. ద్వ. వి. (దోరణము+సాటి+రిక్క.) అనూరాధానక్షత్రము. (శ. ర.)

దోరణము. వై. వి. (సం. తోరణమ్.) 1. వంగశార్థము ద్వారములు లోనగువానికిఁ గట్టుమామిడాకులు లోనగువానివండ, తోరణము. "సీ. తోరంపుముత్యాలదోరణంబులకాంతి చొక్కమాచుక్కలటెక్కు మాప." దశా. ౧, అ. ౨౬౨. య. ౪, ఆ. ౧౫౪; 2. బహిర్ద్వారము. "సీ... దోరణ మనంగ నవు బహిర్ద్వారము..." ఆం. భా. ద్వి. ౨౧.

దోరపండు. దే. వి. (దోర+పండు.) పండఁబాఱిన కాయ. "చ. క్రమమునఁ బిందెలుం బసరుఁగాయలుఁ గాయలు దోరపండులుం, గమిసిన పండులుం గెలలుగట్టి తదున్నతశాఖ లన్నియున్." హరి. పూ. ౬, ఆ. ౯౨. శుక. ౧ ఆ. ౩౭౭.

దోరపాక. దే. వి. (దోర+పాక.) ఓరపాక. "సీ. దోరపాకననగను బాదలి యంచనఁ బరఁగుచుండు, భిత్త్యధఃకృతగృహాభిధ..." ఆం. భా. ౨, ఆ. ౧౬.

దోరము. యు వై. వి. (సం. ద్వారమ్.) ద్వారము. (శ. ర.) సం. వి. అ. పుం. తోరము, వ్రతాదులందు చేతికిఁ గట్టుకొనుదారము.

దోరవాఱు. దే. అ. క్రి. (దోర+పాఱు.) ఎఱ్ఱఁబడు. "ద్వి. పరిపక్వమై దోరవాఱి కన్నులకు,నరుదైన వరుఁగులు నప్పడంబులును." అ. మ. క. ౫, ఆ. ౨౪౦.

దోరసి. సం. వి. అ. న. ఆయుధవిశేషము? "చ... నిశాచరేశ్వరుఁడు గ్రందుగఁ దాఁకి రణంబు సందడిం, దొడిఁబడ నేసెఁ దీవ్రతరదోరసినిం దను నీడఁబోక కో,ఱడమున బిట్టు గిట్టినమఱంది నెఱుంగక దుర్మదాంధుఁడై." నిర్వ. ౫, ఆ. ౭౭.

దోరు దే. అ. క్రి. 1. చచ్చు. "మ...లింగముల్, కడగొట్టైఁ మనుబిడ్డ గంతుగొనె జింకల్ బద్ద దోరెం గిటుల్,మడిసెన్ గారెనుపోతులు..." సా. ౧, ఆ. ౧౦౭, ఆం. సం. మాన. ౫౩; 2. వ్రాలు. (చూ. దోర్చు.)

దోరువా. ద్వ. వి. (దోరు+వాయి) పక్షివిశేషము. "సీ. కొంజులు పూరేళ్లు కన్నెలేళ్లు నెమళ్లు లావుకద్దోరువా ల్లకుముకలును" రసిక. ౧, ఆ. ౬౭.

దోరెము. దే. వి. దేకలకుఁ గట్టెడుత్రాడు. "వ... బర్హిబర్హనిబద్ధాగ్రంబులై కొమరారు దోరెపుఁద్రాళ్లతోడన్ దిరుగుడుల విడంగుపడి..." స్వా. ౪, ఆ. ౨౯, ప్రబంధ. ౨౩౩.

దోర్గ్రహము. సం. వి. అ. పుం. 1. బాహువునఁ బట్టుకొనుట; 2. రోగవిశేషము. విణ. (అ. ఆ. అ.) 1. బాహువులతో పట్టుకొనునది; 2. బలిమి కలది.

దోర్చు. దే. స. క్రి. (తెల.) 1. ఇటునటు కదల్చు, పంకించు. "క. ఇలఁ జదికిలఁబడి పలుమఱుఁ,దల దోర్చుచు వికృతముగ వదనమున లాలా,జలములు తీఁగెలుసాఁగఁగఁ,బలుకు నతం డాలిగుఱిచి పరిచితరక్తిన్." పాండు. ౩, ఆ. ౯౨. భార. స్త్రీ. ౧, ఆ. ౯౭; "గీ...దొంతులు నేసి నాయి, దోర్ప నేర్చుఁ గా కది యేమి నేర్ప,నేర్చు." కు. సం. ౧, ఆ. ౨౯.

దోర్మధ్యము. సం. వి. అ. న. 1. బాహువులమధ్యభాగము; 2. మోచేయి.

దోర్మూలము. సం. వి. అ. న. చంక,కక్షము.

దోల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆందోళిక,అందలము; 2. ఉయ్యాలతొట్టి; 3. నీలచెట్టు; 4. ఊఁగుట; 5. ఉయ్యాల,దోలనయంత్రము; 6. డోలి,ఉయ్యాలవంటియానము.

దోలము. సం. వి. అ. పుం. 1. ఊఁగులాట; 2. పల్లకి; 3. ఉయ్యాలతొట్టి.

దోలి. సం. వి. 1. డోలి; 2. ఉయ్యాల.

దోలిక. సం. = డోలిక.

దోవతి. దే. వి. మగవారికట్టుబట్ట, పరిధానము. "క. వెడవీడెడు దోవతియుఁను, బెడతలచేతుల..." ఉ. హరి. ౨, ఆ. ౭, భాగ. ౧౦, స్కం. ఉ. ౪౬౯.

దోవి. దే. వి. ఎఱ్ఱనివస్త్రము. "సీ. కటితటీహాటకపటము తోఁ బచ్చచెఱంగు పల్లవపుదోవి రంగు నిల్ప." రా. వి. ౫, ఆ. ౭౯.

దోష. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. భుజము.

దోషకము. సం. వి. అ. పుం. ఆవుదూడ,గోవత్సము.

దోషగ్రాహి. సం. విణ. (న్. నీ. న్.) దోషములనే గ్రహించువాఁడు,తప్పు లెంచువాఁడు.

దోషజ్ఞుఁడు. సం. వి. అ. పుం. 1. పండితుఁడు; 2. వైద్యుఁడు. విణ. (అ. ఆ. అ.) దోషముల నెఱుఁగువాఁడు.

దోషము. సం. వి. అ. పుం. 1. తప్పు, పొరపాటు; 2. పాపము, ప్రత్యవాయము; 3. కావ్యదోషము. (ఇది పదదోషము, వాక్యదోషము, అర్థదోషము అని మూఁడువిధములు. అందు పదదోషములు. 17-అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయోజకము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము, అన్యార్థకము, అప్రతీతికము, అవిమృష్టవిధేయాంశము, విరుద్ధమతికరము, అశ్లీలము పరుషము. వాక్యదోషములు 24: శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తి, వ్యాకీర్ణము, వాక్యసంకీర్ణము, అపూర్ణము, వాక్యగర్భితము, భిన్నలింగము, భిన్నవచనము, న్యూనోపమము, అధికోపమము, భగ్నచ్ఛందము, యతిభ్రష్టము, అశరీరము, అరీతికము, విసర్గలుప్తము, అస్థానసమాసము, వాచ్యవర్జితము, సమాప్తపునరాత్తము, సంబంధ, పతత్ప్రకర్షము, అధికపదము, ప్రక్రమభంగము. అర్థదోషములు 18: అపార్థము, వ్యర్థము, ఏకార్థము, ససంశయము, అపక్రమము, భిన్నము, అతిమాత్రము, పరుషము, విరసము, హీనోపమము, అధికోపమము, అసమోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, నిరలంకృతి, అశ్లీలము, విరుద్ధము, సహచరచ్యుతము); 4. వాతపిత్తకఫములలో నొకటి; 5. వాతపిత్తకఫముల వికారము; 6. రాగద్వేషమోహాదికము; 7. ఆవుదూడ, గోవత్సము; 8. దూషణము, ఖండనము. వి. న్. పుం. న. చేయి, భుజము.

దోషలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దోషయుక్తుఁడు.

దోషాకరుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. దుష్టుఁడు.

దోషాచరుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. రాక్షసుఁడు.

దోషి. సం. విణ. (న్. నీ. న్.) దోషము కలది, దోషయుక్తము.

దోషించు. సం. అ. క్రి. దోషము కలిగించు.

దోషికము. సం. వి. అ. పుం. రోగము. విణ (అ.ఆ.అ.) దోషము కలది.

దోస. దే. వి. కర్కటి, ఊర్వారుఫలీ. "ఉ. ... కాసరగాపె దోస దోఁగిలంబాటె..." కాశీ. 3, ఆ. 83. (దీని భేదములు:—వేఁటిదోస, నక్కదోస, ములుదోస మొ.)

దోసకాయ. దే. వి. (దోస+కాయ.) కర్కటీశలాటువు. (ఆని. సూ. ని. దోసపండ్లనుఁ గూడ దోసకాయ లని నాడుక.) "ఉ. ...మూడెఁగ దోసకాయలె విశుద్ధయశోఘన యుష్మచ్చిత్తముల్." హర. 4, ఆ. 64.

దోసకారి. వై. విణ. (దోసము+కారి.) 1. దుష్టుఁడు; పాపాత్ముఁడు. "సీ. అదోసకారిసన్యాసి దవ్వులఁ గాంచి యోలాఁబుగను దారి యొదిగియుండు." నైష. 2, ఆ. 130 స్వా. 3, ఆ. 42; 2. కొఱంత గలవాఁడు, లోపము గలవాఁడు. "గీ. ...నీఱు నీ ... రేదవు నన్ను జలధిశరి దోసకారి." శశాం. 3, ఆ. 71.

దోసము. వై. వి. (సం. దోషః) 1. పాపము. "క. ఎసఁగ గుదురగుబత్తిని గొల్చెదఁ బలుపుట్టువులఁ గూరిచినదోసంబుల్, చిదుమంగ..." నీలా. 1, ఆ. 17, నైష. 4, ఆ. 96; 2. తప్పు, అపరాధము. "క. చేసినదానికి మాఱుగఁ, జేసినఁ బగ యంతతోడఁ జెడుఁగాక గుణుల్, డాసినయప్డెలు విడిచి, దోసముఁ బట్టుదురె యెట్టివుచ్చలుఁ జతురా." భార. శాం. 3, ఆ. 492. భీమ 3, ఆ. 11; 3. హాని, కీడు. "క. ...ఆసామ్రాణికిఁ జూపుల, దోసము పాయంగ నగరుధూపంబు మహోల్లాసంబుగ నిడి పూజలు, చేసి .." చిత్ర భా. 4, ఆ. 20; 4. లోపము, కొఱంత. "ఉ. ఆమదిరాక్షిఁ జూచి పరిహాసము మీఱ బలీంద్రుఁ డిప్డు డోలికోమలి నీవు చే నమృతకుంభము పూనినఁ జూచి గోపబాలామణి వంచుఁ బాల్గొనఁ దలంచెద మన్నను నవ్వుచు న్మృగాక్షీమణి బావ నీవు దధిఁ జిల్కఁగ గోపికనైన దోసమే." దశా. 4, ఆ. 393.

దోసి. వై. విణ. (సం. దోషీ.) పాపాత్ముఁడు. "ఉ. ఏటికి జాలిఁ బొంద నరు లీక్రియఁ గృష్ణునికీర్తనంబు పాపాటవులన్ దహింపఁ గల దొంటకు నందియ ఘేల యిప్పు డీశ్రూఁటరి దోసకారి పెనుదోసి యజామిళుఁ డంత్య మొందుచుం, బాటిగ విష్ణు.

నామసుతుఁ బల్కుచుఁ గేవలము క్తి కేఁగఁడే." భాగ. ౬, స్కం. ౧౮౧.

దోసియ. దే. వి. అట్టు,భక్ష్యవిశేషము. "వ...అపూపంబులు...జిల్లేడుకాయలు దోసియలు సేవియలు..." కాశీ. ౭, ఆ. ౧౮౨.

దోసిలి. వై. వి. (సం. ద్వయీ.) 1. అంజలి. "సీ. అమృతంబువెల్లువ యవి నిలింపాదులు ముకుళించి దోసిళ్ల ముంచి క్రోల." విక్ర. ౬, ఆ. ౬౯; 2. నమస్కారవిశేషము. "గీ. మ్రొక్కు లిదె నీకు సూనసమ్యక్కృపాణ,యిదిగో దోసిలి నీకు లోకైకవీర, యోముకారికుమార ప్రణామమయ్య." ఇందు. 3, ఆ. ౮౭.

దోసిలించు. వై. స. క్రి. = దోయిలించు. (శ. ర.)

దోసె. దే. వి. భక్ష్యవిశేషము, అట్టు. "ఉ. గారెలు బూరె లిడ్డెనలు గమ్మనిదోసెలు జక్కిలంబులు, జారులు గూరలు..." సానంబో. ౧ ఆ. ౧౪౨. భీమ. ౧, ఆ. ౬౦.

దోస్తి. దే. వి. (హిం. దోస్తీ.) అధికపరిచయము, సఖ్యము. "వ...తరుతమము స్త్రీమలతో సిస్తుగా దోస్తిని జుట్టుముట్టి కోపాటోపంబున." ప్రబంధ. ౭౮౮.

దోస్యము దే. వి. ప్రసంగము. "చ. తెరువరు లైన యట్టిపరదేశమహీసురు లర్థవాంఛఁ దత్పురమున కేఁగుదేర వెడదోస్యములం బచరించి వారిని,ర్భర గతి నోడఁ గూడము..." శుక. ౨, ఆ. ౪౩౮.

దోష్ణము. సం. వి. అ. పుం. 1. క్రీడ; 2. సేవ.

దోష్ణుఁడు. సం. వి. అ. పుం. 1. సేవకుఁడు,భృత్యుఁడు; 2. ఆటకాఁడు. విణ. (అ. ఆ. అ.) బాహుబలమున దుండువాఁడు.

దోహజము. సం. వి. అ. న. పాలు. క్షీరము. విణ. (అ. ఆ. అ.) పిదుకుటవలనఁ బుట్టినది.

దోహత్తనారాయణుఁడు. ద్వ. వి. ద్విబాహునారాయణుఁడు, అపరనారాయణుఁడు. (ద్విబాహు రపరోహరిః అనుదానిభావము, ఒకబిరుదముగా నుపయుక్తము.) "సీ. పేమణిహనుమంత బిరుదాంకు లగురాచవారికి నెయ్యంపువరసుతుండు, చౌహత్తమల్లుండు దోహత్తనారాయణుండు ఖాడియరాయచండబిరుద. గీ. మంత్రి..." నైష. ౧, ఆ. ౩౨, దశ. ౧, ఆ. ౬౪.

దోహదము. సం. వి. అ. పుం. న. 1. గర్భిణికిఁ గల కోరిక వేవిళ్లు; 2. తరుగుల్మలతాదులకు అకాలమందు పుష్పములను బుట్టించు స్త్రీలపాదతాడనాదిక్రియ (అశోకమునకు దోహదము పాదతాడనము,పొగడకు ముఖసీధువు, గోరంటకు ఆలింగనము,బొట్టుగునకు వీక్షణము,మామిడికి కరస్పర్శము సంపెఁగకు ముఖరాగము, కొండగోఁగునకు స్తావము,నావిలికి ఊర్పు, మోరటికి పాట, సురపొన్నకు నవ్వు. అని శ. ర.—ప్రేంకణమునకు కరస్పర్శము, పొగడకు మద్యగండూషము, అశోకమునకు పాదతాడనము, బొట్టుగునకు వీక్షణము, గోరంటకు ఆలింగనము మందారమునకు నర్మవాక్యము, చంపకమునకు మందహాసము, మామిడునకు వక్త్రవాతము, సురపొన్నకు గానము, కొండగోఁగునకు పురోనర్తనము. అని మేఘదూత. ౨, స. ౧౭, మల్లినాథవ్యాఖ్య.)

దోహదలక్షణము. సం. వి. అ. న. 1. గర్భలక్షణము; 2. స్త్రీలయౌవనసంధి; 3. ఎరువు; 4. చూలు, గర్భము; 5. గర్భలక్షణము; 6. ఇచ్ఛ. 7. తీవ్రవాంఛ.

దోహదవతి. సం. వి. ఈ. స్త్రీ. వేవిళ్లు గలయాఁడుది, శ్రద్ధాళువు.

దోహనము. సం. వి. అ న. 1. పిదుకుట; 2. కోరికల నిచ్చుట; 3. పాలుపిదుకుపాత్రము.

దోహని. సం. వి. ఈ. స్త్రీ. పాలుపిదుకుపాత్రము.

దోహము. సం. వి. అ. పుం. 1. పాలుపిదుకుట; 2. పాలు, దుగ్ధము; 3. పాలుపిదుకు పాత్రము; 4. కోరికలను పూరించుట, ఇచ్చుట.

దోహరి. దే. వి. చండాలుఁడు. "సీ. దీపింప నున్నాఁడు తెలిసి దోహరిబంటుఁ జెవి నఱమాలికఁ జేరిచి ద్వ్యజుఁడు." కాశీ ౭, ఆ. ౨౪౦.

దోహలము. సం. వి. అ. పుం. 1. దోహదము; 2. "ఉత్సాహము. గీ. అధిప సాలకటంకటు లనఁగఁ జనిన,నాఁటివారుఁ బౌలస్త్యులు నాఁగఁ బరఁగు, నేఁటివారు సమానులు నిక్కమరయ, బాహుబలమున సాహసదోహలమున." నిర్వ. 3, ఆ. 3౮, భార విరా. 3, ఆ. ౨౫,౫ ఆ. ౭౫; 3. ఆసక్తి "ఉత్సాహ. ధరణినాథ విను మధువు భార లెల్ల ప్రొద్దునుం,దొరుఁగుచుండ నతఁడు వానిదోహలమున నానుచుం,బొరయఁ డెప్డు తృప్తి..." భార.

స్త్రీ. ౧, ఆ. ౪౮, హరి. పూ. ౯, ఆ. ౧౮౩; 4. ఆదరము; గౌరవము. "క. భార్యాసహితము గా న య్యార్యవర ని కనుగుణంపుటర్చనవిధిన, చ్చర్యాపూర్వముగ వినయ,ధుర్యత కెలయంగఁ జేసె దోహల మమరన్." భార. అను ౨, ఆ. ౭౯౨.

దోహలి. సం. వి. ఈ. స్త్రీ. అశోకము. విణ. (న్. నీ. న్.) 1. దోహలము గలవాఁడు, ఉత్సాహము గలవాఁడు. "ఉ ...అంత నిర్ఘాతనిరోధి వైరి వధదోహలియై వడివైచె దీవ్ర నిర్ఘాతముతోడఁ బుట్టు వనఁగాఁ దగునుజ్జ్వలశక్తి దైత్యుపైన్." భార. అర. ౫, ఆ. ౨౮౩. భార. శాం. ౬, ఆ. ౩౦౦.

దోహలుఁడు. సం. విణ. (అ. ఆ. అ) దోహలము గలవాఁడు, ఉత్సాహము గలవాఁడు. "గీ... ధర్మసంచితబహుధనధాన్యములును, గలుగుసత్క్షీణ పుణ్యుదోహలుఁడు ధర్మసూనుఁ డున్న దేశంబున మానవులకు." భార. విరా. ౩, ఆ. ౧౦౩.

దోహి. సం. విణ. (న్. నీ. న్.) 1. దోహనశీలుఁడు, పిదుకువాఁడు; 2. (కోరికలను) పూరించువాఁడు; ఇచ్చువాఁడు.

దోహ్యము. సం. వి. అ. న. పాలు. విణ. (అ.ఆ.అ.) పిదుకఁదగినది.

దోళనము సం. వి. అ. న. కదలించుట. "చ. అను పలు కంతశంబున క్రియం గుదియించిన నిల్చి భూరుహంబున దెస వోక మత్తగజపుంగవు చంద మునన్ సమీరసంభవుఁడు శరీరదోళనవిధా పరి శోభితవిక్రమోద్యమంబున విలసిల్లి..." భార. విరా. ౩, ఆ. ౨౯.

దౌ

దౌ=దవ్వు. వి. దూరప్రదేశము. "సీ. తమరాక ప్రియుల కెంకరయు దౌల వినరాఁ బిసాళించుకిట్టుఁబాగాలు మెట్టి." వై జ. ౨, ఆ. ౪౫, ఆము. ౪, ఆ. ౧౫౮. క్రి. విణ. దూరముగా. "శా. మేయుం బచ్చిక మచ్చికం గదిసి నమ్మించుం దనుం బట్టఁబోఁ, బాయున్ బిట్టలయించు దౌ దిగుచు నప్పాటన్ మృగం బీగతిన్." రామా. ౫, ఆ. ౧౬౩. (దీని యామ్రేడితరూపము. దౌ. దౌ. భా. రా. యు. ౬౪౯.)

దౌకూలము. సం. వి. అ. న. సన్ననివస్త్రము, దుకూలము, విణ. (అ. ఈ. అ.) దుకూలసంబంధమైనది.

దౌడ. దే. వి. 1. చెక్కిలిలోపలిభాగము. "సీ. దౌడ లొండొంటితోఁ దాటించి నెలవుల జివ్వా యార్చుచు నగ్నిశిఖలు నెదర." హరి. ఉ. ౯, ఆ. ౨౨౫; 2. చెక్కిలి, చెంప. "గీ. ఉమిసెఁ దుప్పున మొగముపై నొక్కరుండు, బెట్టు నవ్వుచు దౌడలఁ గొట్టె నొకఁడు." హరిశ్చ. ౪, ఆ. ౧౬౨, ఉ. హరి. ౨, ఆ. ౧౨౨.

దౌడు. దే. వి. 1. అశ్వగతివిశేషము; 2. దండయాత్ర; 3. పరుగు. (శ. ర)

దౌత్యము. సం. వి. అ. న. 1. దూతభావము; 2. దూతకర్మము.

దౌదౌవు. దే. వి. దౌవుయొక్క ఆమ్రేడితరూపము. "ఉ. నావుడు వాయునందనుఁడు నందన భామ్మ చమూవధూటినీ,కైవసమైన లెస్స యటుగాక నిసుం దలమీఁదెనేని దౌదౌవుల నిల్చి మద్భుజగదా పటువిభ్రమతాడనంబులన్, జీవ యడంతు నెందు గురుశిక్షఁ గదా మతిగాంతు రంగనల్." జై. ౨, ఆ. ౫౧.

దౌరాత్మ్యము. సం. వి. అ. న. చెడ్డతనము.

దౌరు. దే. వి. 1. రుచి. "ఆ. చిగురుచెట్టుమీఁదఁ జింతపూవులు పూసి,నిమ్మపండు పండునిమునము నను,దౌరు చెడక యఁండ దానిని దినవలె..." వేమన చాటువు; 2. కాంతి గలహారము. "క. శౌరులు జయవెట్టఁగఁ బరిచారకు లరచట్ట దౌరు సవరింపఁగ దుష్కారతురగంబు నెక్కె యొ, య్యారంబులఁ జొక్కఁ జైత్రయాత్రోన్ముఖుఁడై." రా. వి. ౨, ఆ. ౪౭౩; 3. కాంతి (దీనిమొదటిరూపము దవురు. రా. వి ౫, ఆ. ౩౫. (శ. ర.)

దౌర్జన్యము. సం. వి. అ. న. చెడ్డతనము.

దౌర్బలము. సం. వి. అ. న. బలహీనత.

దౌర్బల్యము. సం.=దౌర్బలము.

దౌర్భాగ్యము. సం వి. అ. న. 1. దురదృష్టము; 2. దుర్భగాత్వము, మగఁడొల్లనిదాని ధర్మము.

దౌర్భ్రాత్రము. సం. వి. అ. న. దుర్భ్రాతృభావము. (వ్యతి. సౌభ్రాత్రము.)

దౌవారికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ద్వారపాలకుఁడు.

దౌవు. దే. వి. దవ్వు,దూరప్రదేశము. (చూ.దౌదౌవు.)

దౌశ్శీల్యము. సం. వి. అ. న. చెడ్డనడవడి, దుశ్శీలత. (వ్యతి. సౌశీల్యము.)

దౌష్ట్యము. సం. వి. అ. న. చెడ్డతనము.
దౌహిత్రము. సం. వి. అ. న. 1. కూఁతుయొక్క సంతతి, దుహితృపత్యము; 2. తిలలు; 3. కపిల గోవు నెయ్యి.
దౌహిత్రి. సం. వి. ఈ. స్త్రీ. కూఁతుకూఁతురు, మనుమరాలు. [మనుమఁడు.
దౌహిత్రుఁడు. సం. వి. అ. పుం. కూఁతుకొడుకు,
దౌహృదము. సం. వి. అ. న. గర్భిణీలక్షణము, వేవిళ్లు.
దౌహృదిని. సం. వి. ఈ. స్త్రీ. చూలాలు, గర్భిణి.

ద్యా

ద్యావాక్షమలు. సం. వి. ఆ. స్త్రీ. ద్వి. ఆకాశమును భూమియును. [మును భూమియును.
ద్యావాపృథివులు. సం. వి. ఈ. స్త్రీ. ద్వి. ఆకాశ

ద్యు

ద్యు. సం. దివ్ శబ్దము సమాసపూర్వపద మగునపుడు వచ్చురూపము (ద్యుమణి మొ.)
ద్యుగము. సం. వి. అ. పుం. ఖగము,పక్షి.
ద్యుచరము. సం. వి. అ. పుం. 1. గ్రహము; 2. పక్షి.
ద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. 1. దీప్తి, తేజస్సు; 2. కిరణము, వెలుఁగు; 3. రూపయౌవనాదిప్రయుక్తమయిన దేహకాంతి, శోభ.
ద్యుతితము. సం. = ద్యోతితము.
ద్యుధుని. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ, మందాకిని. (ఇట్లే ద్యునది. మొ.)
ద్యుమణి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.
ద్యుమ్నము. సం. వి. అ. న. 1. ధనము; 2 బలము; 3. ప్రతాపము, పరాక్రమము.
ద్యులోకము. సం. వి. అ. పుం. స్వర్గము.
ద్యువు. సం. వి. ఉ. న. 1. దినము; 2. ఆకాశము; 3. స్వర్గము; 4. కాంతి. పుం అగ్ని.

ద్యూ

ద్యూతకరుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) జూదమాడువాఁడు, జూదరి.
ద్యూతకారుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) 1. జూదమాడువాఁడు; 2. జూదమాడించువాఁడు.
ద్యూతబీజము. సం. వి. అ. న. జూదమాడుగవ్వ.
ద్యూతము. సం. వి. అ. పుం. న. జూదము.
ద్యూతి. సం. వి. ఇ. స్త్రీ. జూదము.
ద్యూనము. సం. వి. అ. న. 1. క్రీడించుట; 2. స్తుతించుట; 3. సంతోషించుట; 4. నిద్రించుట; 5. మదించుట. విశే. (అ. ఆ. అ.) 1. క్రీడించినది; 2. స్తుతింపఁబడినది; 3. సంతోషించినది; 4. నిద్రించినది; 5. మదించినది.

ద్యో

ద్యో. సం. వి. ఓ. స్త్రీ. (దీనికి తెనుఁగున వ్యస్తముగా ప్రయోగము లేదు.) 1. స్వర్గము; 2. ఆకాశము.
ద్యోతకము. సం. విశే. (అ. తికా. అ.) 1. ప్రకాశించునది; 2. ప్రకాశింపఁజేయునది; 3. స్ఫురింపఁజేయునది.
ద్యోతనము. సం. వి. అ. పుం. దీపము. న. 1. ప్రకాశించుట; 2. ప్రకాశింపఁజేయుట; 3. స్ఫురింపఁజేయుట; 4. వెలుతురు.
ద్యోతమానము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రకాశించుచున్నది; 2. స్ఫురించుచున్నది.
ద్యోతము. సం. వి. అ. పుం. 1. ఎండ, ఆతపము; 2. కాంతి; ప్రకాశము.
ద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు. "క. ఆతతమణిరుచిరనభము, ద్యోతింపఁగ..." కు. సం. ౨, ఆ. ౧౪.
ద్యోతితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. స్ఫురించినది, తోఁచినది; 2. ప్రకాశించినది; ప్రకాశము గలది; 3. స్ఫురింపఁజేయఁబడినది; 4. ప్రకాశింపఁజేయఁబడినది.

ద్ర

ద్రంక్షణము. సం. వి. అ. న. తులము, పండ్రెండు మాషములయెత్తు.
ద్రఢిమ. సం. వి. న్. పుం. దిట్టతనము,దార్ఢ్యము.
ద్రఢిమము. సం. = ద్రఢిమ.
ద్రబ్బెడ. దే. వి. భత్యవిశేషము. "సీ. ఒకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని తాలింపు లొకకొన్ని విధముల రొట్టెచేరులు..." పాండు. ౪, ఆ. ౧౨౪. కాశీ. ౭, ఆ. ౧౭౫.
ద్రమిళము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.
ద్రవంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. స్రవంతి, నది; 2. ఎలుకజీడి ౘ.
ద్రవత్. సం. శత్రర్థ. 1. కాఱుచున్న; 2. కరఁగుచున్న; 3. పరుగెత్తుచున్న.
ద్రవము. సం. వి. అ. పుం. 1. గమనము,పోక; 2. పరుగెత్తుట; 3. కరఁగుట; 4. కాఱుట; 5. పరిహాసము; 6. వేగము; 7. తడి; 8. రసము; 9.

కషాయము. న. తోడు పెట్టినకుండలోని యడుగు పెరుఁగు. విణ. 1. పరుగెత్తునది; 2. కారునది; 3. కరఁగునది; 4. నీటివలెపలుచనైనది.

ద్రవించు. సం. అ. క్రి. 1. కారు; నీరుకారు. "గీ. కారణము లేక దాపలికను ద్రవించు." భార.శాం. ౬, ఆ. ౧౨౯; 2. కరఁగు, నీటివలె నగు. (వ్యవ.) ఆవార్త విన్న నాహృదయము ద్రవించినది.

ద్రవిడము. సం. =ద్రమిళము.

ద్రవిణము. సం. వి. అ. న. 1. సొమ్ము, ధనము; 2. బంగారము; 3. శరీరబలము; 4. పరాక్రమము; 5. కోరిక,వాంఛ.

ద్రవ్యము. సం. వి. అ. న. 1. ధనము; 2 ఇత్తడి; 3. విలేపనవస్తువు; 4. విలేపనము, పూఁత; 5. మందు,ఔషధము; 6. వినయము; 7. లక్క; 8. మద్యము; 9. బంక,నిర్యాసము; 10. పృథివ్యాది. (ఇవి తొమ్మిది. పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు.) విణ. (అ. ఆ. అ.) 1. ద్రువికారము, వృక్షవికారము; 2. భవ్యము, యోగ్యము (ఈయర్థమున నిది నిత్యనపుంసకము. "శ్లో. ద్రవ్యం జిగీషుమధిగమ్య జడాత్మనోపి నేతుర్యశస్వినిపదే నియతా ప్రతిష్ఠా." ముద్రా. ౭, అం. ౧౪.

ద్రష్ట. సం. విణ. (బు. స్త్రీ. బు.) 1. చూచువాఁడు; 2. మనస్సుచే కనుఁగొనువాఁడు. (మంత్రద్రష్ట.); 3. పరిశీలించువాఁడు.

ద్రష్టవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁదగినది; 2. చూచుట కింపైనది; 3. మనస్సుచే కనుఁగొనఁదగినది.

## ద్రా

ద్రాక్. సం. అవ్య. (దీనికి తెలుఁగున వ్యస్తప్రయోగములు లేవు.) తోడనే, వెంటనే. "గీ. ద్రాగ్విదావాచ్ఛిదావినిద్రాణమదవదంజనాలానమూలశయ్యావిధాన, వారుణాధోరణాకల్పితోరుకోణ, మృత్తికారాశియో యన మెఱసె సంధ్య." స్వా. 3, ఆ. ౮౭.

ద్రాక్ష. సం. వి. ఆ. స్త్రీ. దాక, మృద్వీక.

ద్రాక్షారసము. సం. వి. అ. పుం. 1. ద్రాక్షపండ్లరసము; 2. ద్రాక్షసారాయి.

ద్రాఘిమ. సం. వి. న్. పుం. నిడివి, దైర్ఘ్యము.

ద్రాఘిమము. సం.=ద్రాఘిమ.

ద్రాఘిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి దీర్ఘము, అన్నిటికంటె పొడువైనది.

ద్రాఘీయము. సం. విణ. (స్. యసీ. స్.) దీర్ఘతరము, ఒకదానికంటె పొడువైనది.

ద్రాణము. సం. వి. అ. న. 1. నిద్ర; 2. పాఱిపోవుట, విణ. (అ. ఆ. అ.) 1. పాఱిపోయినది, పలాయితము; 2. నిద్రించినది, సుప్తము.

ద్రాప. దే. వి. కవిత్వదోషములలో నొకటి. "ద్వి. ద్రాప ఛందోవిరుద్ధం బాది యగున,లాపప్రలాపోక్తిశ్లాఘుపం బనక,పసిఁ గూర్చుకృతులు నాపద్దును బెరుఁగుఁ, బిసుకుచందపుబిలిబిలికృతుల్ కృతులె." పండితా. దీక్షా. ౬, ప్రు.

ద్రాపము. సం. వి. అ. పుం. 1. అడుసు, పంకము; 2. ఆకాశము, మిన్ను.

ద్రాపుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. విణ. (అ. ఆ. అ.) మూర్ఖుఁడు.

ద్రాబ. వై. వి. (సం. ద్రాపః.) అసారోక్తి. "గీ.ద్రాబ యనఁగ నసారోక్తి దనరుచుండు." ఆం. భా. ప్ర. ౧౧౭. "చ...దుష్కవితలు లక్షణం బెఱుఁగఁజాలక ద్రాబలు గూర్చి యల్లుచున్." కవిసర్ప. ౧, ఆ. (శ. ర.) విణ. మూర్ఖుఁడు. "క. మీబుద్ధిబలముప్రాపున, నాబాహుపరాక్రమమున నడచితిమి తుదిన్, గూబలచే నిట్లైతిమి,ద్రాబలమై మీఁదికార్యతంత్రము చెప్పుఁడీ." నా. పంచ 3, ఆ. ౨౧, ఆ. పు. ౪, ఆ ౨౪౦.

ద్రావకము. సం. వి. అ. పుం. 1. వెలిగారము; 2. చంద్రకాంతమణి; 3. రసగంధకపాషాణాదులనుండి తీయు రసవిశేషము. న. మైనము. పుం. న. సూదంటురాయి, అయస్కాంతము. విణ. (అ. ఇకా. అ.) 1. కరఁగునది; 2. కరఁగించునది; 3. పరుగెత్తించునది; 4. మనస్సును హరించునది.

ద్రావకుఁడు. సం. విణ. (అ. ఇకా. అ.) 1. దొంగ; 2. మోసగాఁడు; 3. నేర్పరి,విదగ్ధుఁడు. 4. జారుఁడు.

ద్రావణము. సం. వి. అ. న. 1. పాఱఁద్రోలుట; 2. కరఁగించుట; 3. ఇందుగుకాయ. విణ. (అ.ఆ.అ.) 1. పాఱఁద్రోలునది; 2. కరఁగించునది.

ద్రావము. సం. వి. అ. పుం. 1. పోవుట, గతి; 2. కారుట; 3. కరఁగుట; 4. పశ్చాత్తాపము; 5. పరుగెత్తుట.

ద్రావిడము. సం. వి. అ. పుం. కచోరము❦. న. ద్రవిడ దేశస్థులభాష. విశే. (అ. ఈ అ.) 1. ద్రవిడ దేశసంబంధమైనది; 2. ద్రవిడదేశమునఁ బుట్టినది.

ద్రావిడి. సం. వి. ఈ. స్త్రీ. 1. ద్రవిడదేశస్త్రీ; 2. చిట్టేలకి❦.

ద్రావితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పాఱఁద్రోలఁబడినది; 2. కరఁగింపఁబడినది.

ద్రావితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పాఱఁద్రోలఁబడినవాఁడు. "ఉ...పటుబాహులు దివ్యమహాస్త్రకోవిదుల్,ద్రావితవైరు లుర్వీ భగదత్తపురస్సరులైనవీరులై" భార. అర. ౬, ఆ. ౪౫.

ద్రావ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పాఱఁద్రోలఁదగినది; 2. కరఁగింపఁదగినది.

## ద్రి

ద్రిండు దే.వి. 1. దిండు, దట్టి. "క. తలచుట్టు చుట్టెఁ గూడల,ములు వెట్టెను ద్రిండు గాఢముగఁ గట్టె. ..." భార. విరా. ४, ఆ. ౧౬౫. నైష. ౭, ఆ. ౬౩; 2. చుట్టు. "సీ. ముసలాగ్రములు సొన్పి మొదలిపాఁ తగలించి దీర్ఘపాశంబుల ద్రిండు సుట్టి, పెకలించి..." భాగ. ౮, స్కం. ౧౮౩.

ద్రిమ్మరించు. దే. స. క్రి. (ఎక్కువగా.) పోయు, క్రుమ్మరించు. "సీ. అంటే మాచెలి తాన మాడు మంచు ఘటంబు వంచి నీర్తల ద్రిమ్మరించెనొకతె." మృ. వి. ౨, ఆ ౭౨.

## ద్రు

ద్రుగ్ధము. సం. వి. అ. న. ద్రోహము. విశే. (అ.ఆ.అ.) ద్రోహము చేయఁబడినది.

ద్రుఘణము. సం. వి. అ. పుం. 1. పరశువు, గండ్రగొడ్డలి; 2. ఇనుపగుదియ, లోహముద్గరము; 3. నేలసంపెంగ ❦.

ద్రుడ్డు. వై. వి. (సం. దండః.) ముద్గరము. "గీ... ఆలెంక లినుప,ద్రుడ్డగుదియలఁ బిడికిళ్ల రోఁకళులను,మొత్తి..." అచ్చ. యు. ౨౭, ४౫౫.

ద్రుణ. సం. వి. ఆ. స్త్రీ. అల్లెత్రాడు,వింటినార

ద్రుణము. సం. వి. అ. పుం. 1. తేలు; 2. తుమ్మెద. న. 1. కత్తి; 2. విల్లు.

ద్రుణి. సం. వి. ఇ, ఈ, స్త్రీ. 1. కఱ్ఱతొట్టి, ద్రోణి; 2. తెట్టె; 3. ఆఁడుతాఁబేలు.

ద్రుణుఁడు. సం. వి. అ. పుం. దుష్టుఁడు.

ద్రుతము. సం. వి. అ. పుం. 1. తేలు; 2. చెట్టు; 3. సిల్లి; 4. ప్రత్యయాగమాత్మకమైన 'ను' వర్ణము. (వ్యాక. దీనియుకారమునకు లోపము బహుళము. ఉదా:-వచ్చును, వచ్చున్. మొ.)

ద్రుతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కరఁగుట,ద్రవణము; 2. ద్రవము; 3. పోవుట,గమనము; 4. గమనము, నడక. "క. నాయొద్ద నుండు దేని మ,దీయరథాశ్వములకును ద్రుతిని శిక్షముగాఁ,జేయుము నావ్రడు నట్టుల,చేయుదు నని నలుఁడు వాని సేవించెఁ దగన్." భార. అర. ౨, ఆ. ౧౩౧; 5. పలాయనము, పాఱిపోవుట.

ద్రుపదము. సం. వి. అ. న. 1. బొండకొయ్య; 2. కొయ్యతోఁ జేసినపాదుక,పావకోడు.

ద్రుమనఖము. సం. వి. అ. పుం. ముల్లు,కంటకము.

ద్రుమము. సం. వి. అ. పుం. 1. వృక్షము; 2. పారిజాతము ❦.

ద్రుమామయము. సం. వి. అ. పుం. లక్క,లాక్ష.

ద్రుమి సం. వి. ఇ. పుం. ఆకాశము? "సీ. ధూత్కారమొనరించు ద్రుమిచండపతివేను దొండంబు తుప్పరఁ దొప్పదోగ." కాశీ. ౬, ఆ. ౧౭౮.

ద్రుమిక. సం. వి. ఆ. స్త్రీ. ఆకసము? "గీ. ద్రుమికయూఁడ్చినవాఁడు భర్గునికిరీట,కోటికాభరణంబైన కువలయాక్షు,మిగులజక్కనికొడుకంద్రు..." కాశీ. ४, ఆ. ౧౯౧.

ద్రుముఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

ద్రువయము. సం. వి. అ. న. మానము, పరిమాణమును దెలుపుసాధనము.

ద్రువు. సం. వి. ఉ. పుం. 1. కొమ్మ,శాఖ; 2. చెట్టు; 3. కఱ్ఱ, మ్రాను. ఊ. పుం. బంగారు.

ద్రుహిణుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.

## ద్రూ

ద్రూణము. సం. వి. అ. పుం. తేలు.

## ద్రే

ద్రేక్కాణము. సం. వి. అ. పుం. రాశిలో మూఁడవ భాగము. (జ్యోతి.)

## ద్రొ

ద్రొబ్బించు. దే. స. క్రి. (ద్రొబ్బు ధా. ప్రే.) పడఁద్రోయించు. "ఉ...ముంచితి వార్ధులం గదల

మొత్తితి శైలకటంబులందు ద్రొబ్బించితి..." భాగ. ౭, స్కం. ౨౦౧, య. ౪, ఆ. ౫౬.

ద్రొబ్బు. దే. స. క్రి. 1. పడఁద్రోయు, పడఁగొట్టు. "మ. పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ ద్రొబ్బి..." భాగ. ౧౦. స్కం ఉ. ౩౯౮, ఆము. ౪, ఆ. ౧౦౭; 2. వెడలఁగొట్టు. "క. తరుణుఁ డగుశీతకరునిన్, మరఁగి వియల్లక్ష్మి దన్ను మాని ముదుకఁడున్, ఖరకరుఁడు ననుచు ద్రొబ్బిన,కరణిన్ రవి పశ్చిమాద్రి కడఁగ్రుంకె నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౮౮, వీర. ౨, ఆ. ౨౮౪; 3. త్రోయు, గెంటు. "క. మెడఁ బట్టి వెడలఁ ద్రొబ్బినఁ, గడు నతఁ డీడిగిలఁ బడఁగఁ గ్రమ్మఱఁ దపసిం,బుడిసిటిపట్టుగఁ బట్టుచు ..." విప్ర. ౪, ఆ. ౩౦, భా. రా. బాల. ౬౭౬.

వి. త్రోయుట. (చూ. ద్రొబ్బులాడు)

ద్రొబ్బులాడు. దే. అ. క్రి. (ద్రొబ్బులు+ఆడు.) త్రోపులాడు. "సీ. పరఁటెఁ ద్రిప్పఁగ బాఱుపైఁటలోఁగస్పట్టుగుబ్బలమిసమిసల్ ద్రొబ్బులాడ." హంస. ౨, ఆ. ౨౨.

## ద్రో

ద్రోగ్ధ. సం. విణ. (ఋ. గ్ధ్రీ. ఋ.) ద్రోహము చేయువాఁడు. [ఆవు.

ద్రోణదుగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. తూమెడుపాలిచ్చు

ద్రోణదుఘ. సం.=ద్రోణదుగ్ధ.

ద్రోణము. ఉభ. దే. వి. 1. భుజములకు బలము కలుగుటకై త్రిప్పెడిజెట్టివాని సాధనవిశేషము. "మ .. ద్రోణముల్ దివియఁ దోర్దండంబులం జేది యే, సిరి బోయల్..." స్వా. ౪, ఆ. ౧౧౧; 2. చాపకర్షణబలసాధనము. "సీ...చాపకర్షణబల సాధనంబు ద్రోణ మనంగను దోఁచు..." ఆం. భా. ద్వి. ౨౧౨; 3. తాడిచెట్టు మొదలగునవి చీల్చుటకై అక్కడక్కడ కొట్టినచీలలను దిగఁగొట్టు సాధనవిశేషము. (శ. ర.) సం. వి. అ. పుం. న. 1. తూము; ఆఢకము; 2. నాలుగుతూములపరిమాణము. న. 1. కుండ; 2. కట్టతొట్టి; 3. బొక్కెన. పుం. 1. పర్వతవిశేషము; 2. మడుఁగు; 3. ఎఱ్ఱతేలు; 4. తేలు; 5. మాలకాకి; 6. తుమ్మి ❀.

ద్రోణాము. దే. వి.=ద్రోణము. (శ. ర.)

ద్రోణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. చిన్నయోడ; 2. ఊదు? పసులు మేయుభూమి; 3. రెండుపర్వతములనడుమ పల్లముగా నుండుప్రదేశము; 4. దొన్నె,ఆకు మున్నగువానితోఁ జేసినదొప్ప; 5. అరిఁౙె; 6. జలగడుగువానిసాధనము; 7. దేశవిశేషము; 8. నీలి ❀; 9. అరఁటి❀; 10. జలాధారము; 11. కట్టబొక్కెన; 12. నదీవిశేషము. ఈ. స్త్రీ. ద్రోణునిభార్య.

ద్రోణుఁడు. సం. వి. అ. పుం. ద్రోణాచార్యుఁడు.

ద్రోవది. వై. వి. (సం. ద్రౌపదీ.) ద్రుపదునికూఁతురు, ద్రౌపది. "చ. తడిసినయేకవస్త్ర పరిధానముతోడ విముక్తకేశియై, తొడరుచు దుఃఖభావమున ద్రోవది వోయె. .." భార. సభా. ౨, ఆ. ౩౦౮, భార. విరా. ౪, ఆ ౨౧౧.

ద్రోహము. సం. వి. అ. పుం. 1. కీడుచేయు తలఁపు; 2. హింస; 3. హింసింపనిచ్ఛ; 4. మోసముచే చంపుట. [వాఁడు.

ద్రోహి. సం. విణ. (న్. నీ. న్.) ద్రోహము చేయు

ద్రోహుఁడు సం. విణ. (అ ఆ. అ.) ద్రోహము చేయువాఁడు. "క. తనుఁ బాండుతనయులకు ద్రోహునిగా నక్కుంభజన్ముఁ డూహించుచు న,మ్మనులట్టు సెప్పి రటు గా వునఁ గాకేమి యది దగ వవుం బొమ్మనుచున్." భార. ద్రో. ౫, ఆ. ౩౧౯.

ద్రోహితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ద్రోహబుద్ధి గలవాఁడు.

## ద్రౌ

ద్రౌణి. సం. వి. ఇ. పుం. అశ్వత్థామ.

ద్రౌణికము. సం. విణ. (అ. ఈ. అ.) 1. ద్రోణపరిమితి గలధాన్యము చల్లుటకుఁ దగినది. (పొలము); 2. ద్రోణపరిమితి గలధాన్యాదులచేఁ గొనఁబడినది.

ద్రౌపది. సం. వి. ఈ. స్త్రీ. ద్రుపదునికూఁతురు, ద్రోవది.

## ద్వ

ద్వంద్వచరము. సం. వి. అ. పుం. జంటగా చరించునది. చక్రవాకము.

ద్వంద్వభావము. సం. వి. అ. పుం. 1. విరోధము; 2. దాంపత్యము; 3. జతయగుట.

ద్వంద్వము. సం. వి. అ. న. 1. స్త్రీపురుషులజత; 2. జత, కవ; 3. ఇద్దఱొకరొకటితోఁ జేయు కలహము; వివాదము. 4. రహస్యము; 5. పరస్పరవిరుద్ధమైనరెంటి జంట. (శీతోష్ణాది.); 6. సందేహము; 7. కోట,దుర్గము. పుం. 1. సమాసభేదము; 2. రోగవిశేషము; 3. మిథునరాశి.

ద్వంద్వయుద్ధము. సం. వి. అ. న. ఇద్దఱకు పరస్పరము జరుగుయుద్ధము.

ద్వయము. సం. వి. అ. న. జత, యుగ్మము.

ద్వయాతిగుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) రజస్తమో గుణములను విడిచినమనస్సు గలవాఁడు.

ద్వయి. సం. వి. ఈ. స్త్రీ. జత,కవ.

ద్వా

ద్వాఃకవాటము. సం.వి. అ. పుం. వీథిద్వారము తలుపు. "గీ. ద్వాఃకవాటంబుఁ దెఱవదు వనిత యొకతె." కాశీ. 2, ఆ. ౧౩౭.

ద్వాదశ. సం. విశ. (న్.) పండ్రెండు. (తెనుఁగున సమాసపూర్వపదముగనే యుండును. (ద్వాదశ వత్సరములు.)

ద్వాదశకము. సం. వి. అ. న. పండ్రెండు. విశ. (అ. ఇకా. అ.) పండ్రెండు పరిమాణము కలది.

ద్వాదశము. సం. విశ. (అ. ఈ. అ.) పండ్రెండవది.

ద్వాదశాంగుళము. సం. వి. అ. న. జేన, వితస్తి.

ద్వాదశాత్ముఁడు. సం. వి. న్. పుం. సూర్యుఁడు శ్లో. ధాతా మిత్రో౽ర్యమా రుద్రో వరుణస్సూర్య ఏవచ, భగో వివస్వాన్ పూషాచ సవితా దశమ స్స్మృతః, ఏకాదశ స్తథాత్వష్టా విష్ణుర్ద్వాదశ ఉచ్యతే, అరుణో మాఘమాసేతు సూర్యోవై ఫాల్గునే తథా, చైత్రేమాసి చ వేదజ్ఞో వైశాఖే తపనస్స్మృతః, జ్యేష్ఠేమాసి తపే దింద్ర ఆషాఢే తపతే రవిః,గభస్తి శ్శ్రావణే మాసి యమో భాద్ర పదే తథా, ఇషే హిరణ్యరేతాశ్చ కార్తికేచ దివాకరః,మార్గశీర్షే తపేచ్చిత్రః పౌషే విష్ణు స్సనాతనః, ఇత్యేతే ద్వాదశాదిత్యాః కాశ్య పేయాః ప్రకీర్తితాః. (వాచ.)

ద్వాదశాదిత్యులు. సం. వి. అ. పుం. బ. పండ్రెండు గురు సూర్యులు,

ద్వాదశాహము. సం. వి. అ. పుం. పండ్రెండవదినము.

ద్వాదశి. సం. వి. ఈ. స్త్రీ. పండ్రెండవతిథి.

ద్వాపరము. సం. వి. అ. పుం. న 1.కృతత్రేతాద్వాపర కలియుగములలో మూఁడవయుగము. విజ ౧, ఆ. ౨౩; 2. సంశయము, సందేహము.

ద్వారవట్టము. సం. వి. అ. పుం. 1. తలుపు,కవాటము; 2. కవాటపుతెర.

ద్వారపాలకుఁడు. సం. వి. అ. పుం. వాకిటికావలి వాఁడు, పణిహారి.

ద్వారబంధము. సం. వి. అ. పుం. ద్వారమున కమర్చిన మ్రానిచట్టము.

ద్వారము. సం. వి. అ. న; ర్. స్త్రీ. 1. వాకిలి; 2. ఉపాయము; 3. దేహమందలిరంధ్రము. (చెవి, నోరు, ముక్కు మొ.); 4. ప్రవేశము; 5. మూలము.

ద్వారా. సం. అవ్య. (ద్వార్శబ్దతృతీయావిభక్త్యంత రూపము. సంస్కృతమున దిష్ట్యా,చిరేణ మొదలగు వానివలెనే యిది యవ్యయముగా గ్రహింపఁ దగును) మూలమున. ఉదా-వానిద్వారా యీ వార్తవింటిమి.

ద్వారి. సం. వి. న్. పుం ద్వారపాలకుఁడు.

ద్వారికుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

ద్వాస్థితుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

ద్వాస్థుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

ద్వి

ద్వి. సం. విశ. (ఇ) రెండు. (ఇది తెనుఁగున వృత్తి యందు పూర్వావయవముగనే యుండుట యుక్తము. ఉదా:—ద్విగుణము మొ. దీనికి 'దశ', వింశతి, త్రింశత్,శబ్దములు పరమగునపుడు నిత్యముగా'ఆ' కార మంతాదేశ మగును. "చత్వారింశత్,పంచా శత్, షష్టి, సప్తతి, నవతి" శబ్దములు పరమగు నపుడు వికల్పముగా 'ఆ'కార మంతాదేశ మగును.)

ద్వికము. సం. వి. అ. న. ద్వయము,రెండు. పుం. 1. కాకము,కాకి; 2. జక్కవ, కోకము.

ద్విగుణము. సం. విశ (అ. ఆ. అ.) రెండురెట్లు గలది.

ద్విగుణాకృతము. సం. విశ. (అ. ఆ. అ.) రెండు చాళ్లు దున్నఁబడినది. (నేల.)

ద్విగుణితము. సం. విశ. (అ. ఆ. అ.) రెట్టింపఁబడినది.

ద్విగుణీకృతము. సం. విశ. (అ.ఆ.అ.) రెట్టింపఁబడినది.

ద్విగువు. సం. వి. ఉ. పుం. సమాసభేదము.

ద్విజ. సం. వి. ఆ. స్త్రీ. 1. బారంగిచెట్టు; 2. రేణుక యనుగంధద్రవ్యము. చెట్టు

ద్విజన్మము. సం. వి. న్. పుం. 1. పల్లు,దంతము; 2. పక్షి, పాము,చేప మొదలగునది. విశ. (న్.నీ.న్.) రెండుపుట్టుకలు కలది.

ద్విజన్ముఁడు. సం. వి. న్. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. క్షత్రియుఁడు; 3. వైశ్యుఁడు.

ద్విజబంధువు. సం. వి. ఉ. పుం. అపకృష్టబ్రాహ్మణుఁడు, జాతిమాత్రబ్రాహ్మణుఁడు.

ద్విజన్మము. సం. వి. అ. పుం. 1. పల్లు,దంతము; 2. పక్షి, పాము, చేప మొదలగునది.

ద్విజరాజు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. గరుడుఁడు; 3. శేషాహి; 4. ఉత్తమద్విజుఁడు.

ద్విజాతి. సం. వి. ఇ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. క్షత్రియుఁడు; 3. వైశ్యుఁడు; 4. పల్లు,దంతము; 5. పక్షి, పాము,చేప మొదలగునది.

ద్విజిహ్వము. సం. వి. అ. పుం. పాము. విణ. (అ. ఆ. అ.) రెండునాలుకలు గలది.

ద్విజిహ్వుఁడు. సం. వి. అ. పుం. 1. కొండెగాఁడు, సూచకుఁడు; 2. దొంగ, ఖలుఁడు.

ద్విజుఁడు. సం. వి. అ. పుం =ద్విజన్ముఁడు.

ద్వితయము. సం. వి. అ న. జోడు,ద్వయము. "చ. అతిశయరూపయౌవన గుణాధికసుందరమైన యాసతీ, ద్వితయమునందు సంతతరతిన్ వివశుండయి..." భార. ఆది. ౪, ఆ. ౧౧౫.

ద్వితయి. సం. వి. ఈ. స్త్రీ. ద్వయము, జోడు.

ద్వితీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. రెండవతిథి,విదియ; 2. రెండవవిభక్తి; 3. భార్య,పత్ని. "ఉ...అంగభూపతా, కాయత్రయంత్రమత్స్య మిపు డల్లనఁ ద్రెళ్ళఁగ నేసి యేలుకో,తీయఁగఁ బంచదార వెనుదీయఁగఁ బల్కు నను ద్వితీయగన్." విజ. ౧, ఆ. ౫౪.

ద్వితీయాకృతము. సం. విణ. (అ. ఆ. అ.) రెండుచాళ్లు దున్నినది. (నేల)

ద్వితీయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. రెండవవాఁడు; 2. సహాయుఁడు.

ద్విత్వము. సం. వి. అ. న. 1. రెంటిధర్మము,సంఖ్యావిశేషము; 2. ద్విరుచ్చారణము, ఒకదానిని రెండుమాఱులు పలుకుట. "గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాతభావనా భావితద్వి,రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ,సూక్తి యన నొప్పుఁ గస్తూరిచుక్కబొట్టు." కాళిందీ. ౬, ఆ. ౬౭. (పైరెండర్థములకు నుదాహరణము.)

ద్విధాగతి. సం. వి. ఇ. పుం. 1. మొసలి; 2. కర్కటకము, ఎండ్రి.

ద్విపక్షము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. మాసము, నెల.

ద్విపటి. సం. వి. ఈ. స్త్రీ. 1. దుప్పటము,వెలగల సన్ననివస్త్రము. శ్లో. పట్టసూత్రమయీసాపి ద్విపటీ క్వ నృపార్పితా. సం.కాశీ. ౧౩, స. ౮౫; 2. దుప్పటి, నిచోళము.

ద్విపద. సం వి ఆ. స్త్రీ. రెండుపాదములు గలఋక్కు. ఆ. న. తెనుఁగున రెండుపాదములు గలపద్యభేదము. అప్ప. ౨, ఆ. ౨౭౫.

ద్విపము. సం. వి. అ. పుం. రెండింటితో త్రాగునది. ఏనుఁగు.

ద్విపాత్తు. సం. వి. ద్. పుం. 1. మనుష్యుఁడు; 2. పక్షి.

ద్విపాద్యము. సం. వి. అ. పుం. న. ఇనుమడిశిక్ష, ద్విగుణదండము.

ద్విపాయి. సం. వి. న్. పుం. ఏనుఁగు.

ద్విభాషి. సం. విణ. (న్. నీ న్.) రెండుభాషలు తెలిసినవాఁడు, దుబాసి.

ద్విముఖ. సం వి. ఆ. స్త్రీ. జలగ.

ద్విరదము సం. వి. అ. పుం. రెండు దంతములు గలది. ఏనుఁగు.

ద్విరసనము. సం. వి. అ. పుం. పాము, సర్పము.

ద్విరుక్తము. సం. వి. అ. న. రెండుమాఱులు చెప్పుట, పునరుక్తి. విణ. (అ. ఆ. అ.) రెండుమాఱులు చెప్పఁబడినది.

ద్విరుక్తి. సం. వి. ఇ. స్త్రీ. పునరుక్తి.

ద్విరేఫము. సం. వి. అ. పుం. తుమ్మెద,భ్రమరము. విణ. (అ. ఆ. అ.) రెండు రేఫములు గలది. "గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాతభావనా భావితద్వి,రేఫవైఖరి గల్గి త్రిలింగదేశ, సూక్తి యన నొప్పుఁ గస్తూరిచుక్కబొట్టు." కాళిందీ. ౬, ఆ. ౬౭.

ద్విశీర్షుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

ద్విషత్. సం. శతృ. 1. విరోధించుచున్న; 2. ఏవగించుచున్న.

ద్విషత్తు. సం. వి. త్. పుం. శత్రువు,పగవాఁడు.

ద్విషాణము. సం. విణ. (అ. ఆ. అ.) ద్వేషించునది.

ద్విసీత్యము. సం. విణ. (అ. ఆ. అ.) రెండుచాళ్లు దున్నినది. (పొలము.)

ద్విహల్యము. సం. విణ. = ద్విసీత్యము.

ద్విహృదయము. సం. వి. ఆ. స్త్రీ. చూలాలు,గర్భిణి.

ద్వీ

ద్వీపము. సం. వి. అ. పుం. న. 1. రెండువైపుల నీళ్లు కలది, దీవి. (సప్తద్వీపములు - జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలము, పుష్కరము.) పులి, వ్యాఘ్రము. న. పులితోలు.

ద్వీపవంతము. సం. వి. త్. పుం. 1. సముద్రము; 2 నదము.

ద్వీపవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. నది; 2. భూమి.

ద్వీపి. సం. వి. న్. పుం. 1. పులి; 2. చిఱుతపులి; 3. సముద్రము.

ద్వీపిని. సం. = ద్వీపవతి.

ద్వే

ద్వేషకుఁడు. సం. విణ. (అ. షి కా. అ.) 1. విరోధించువాఁడు; 2. ఏవగించువాఁడు.

ద్వేషణము. సం. వి. అ. న. 1. పగ విరోధము; 2. ఏవ.

ద్వేషణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విరోధింపఁదగినది; 2. ఏవగింపఁదగినది.

ద్వేషణుఁడు. సం. వి. అ. పుం. శత్రువు.

ద్వేషపడు. మి. అ. క్రి. (ద్వేషము+పడు.) ద్వేషించు "వ...ఇట్టియతిరహస్యం బగుసాంఖ్యయోగప్రకారంబు ఖలునకు నవినీతునకు...విష్ణుదాసులయందు ద్వేషపడువానికి నుపదేశింపవలవదు..." భాగ. 3, స్కం. ౧౦౨.

ద్వేషము. సం. వి. అ. పుం. 1. పగ,వైరము; 2. ఏవ, రోఁత.

ద్వేషి. సం. వి. న్. పుం. శత్రువు. విణ. (న్.ణీ.న్.) ద్వేషించువాఁడు.

ద్వేషించు. సం. అ. క్రి. విరోధించు, పగగొను. స. క్రి. ఏవగించు.

ద్వేష్ట. సం. వి. ఋ. పుం. శత్రువు. విణ. (ఋ. త్రీ.ఋ.) ద్వేషించువాఁడు.

ద్వేష్టవ్యము. సం.=ద్వేష్యము.

ద్వేష్యము. సం. విణ. (అ. ఆ. అ ) 1. విరోధింపఁదగినది; 2. ఏవగింపఁదగినది.

ద్వేష్యుఁడు. సం. వి. అ. పుం. శత్రువు.

ద్వై

ద్వైతము. సం. వి అ. న. 1. రెండుగా నుండుట; 2 జీవాత్మ పరమాత్మలకు భేదము చెప్పెడిమతము; 3. ఒకానొకవనము.

ద్వైతి. సం. విణ. (న్. నీ. న్.) ద్వైతమతావలంబి.

ద్వైధము. సం. వి. అ. న. 1. రెండువిధములు; 2. భేదము; 3. సందేహము; 4. రాజులసంధ్యాది షడ్గుణములలో నొకటి,శత్రువులయెడ లోపల నొకవిధముగాను వెలుపల నొక విధ ము గా ను నుండుట. (ఇది చతుర్విధము. 1. బలాఢ్యు లగు నిరువురుశత్రువులనుండి ప్రత్యేకము నీవాఁడ నని యిరువురతోను ఒండొరు లెఱుంగకుండఁ జెప్పుట; 2. అధికబలునితో సంధించి దుర్బలునితో విరోధించుట; 3. శత్రునియొక్కమంత్రిసామంతాదులతో సంధిచేసికొని యాతనితోఁ గలహించుట; 4. శత్రువుతో సంధివిగ్రహముల నొనరించుట కనువైనకోట నాశ్రయించుట. అవ్య. రెండు విధములుగా; రెండుభాగములుగా.

ద్వైధీకృతము. సం. విణ. (అ. ఆ. అ ) 1. రెండు విధములుగాఁ జేయఁబడినది; 2. సందిగ్ధము,ఎట్లును తోఁచకుండఁ జేయఁబడినది. (మనస్సు )

ద్వైధీభావము. సం. వి అ. పుం. 1. రెండువిధములుగా నుండుట; 2. భేదము; 3. సందేహము; 4. రాజులసంధ్యాదిషడ్గుణములలో నొకటి,ద్వైధము.

ద్వైపము. సం. వి. అ. పుం. పులితోలుచే కప్పఁబడిన రథము. న. పులితోలు. విణ. (అ. ఈ. అ.) 1. ద్వీపమందలిది; ద్వీపమునకు సంబంధించినది; 2. పులికి సంబంధించినది.

ద్వైపాయనుఁడు. సం. వి. అ. పుం. ద్వీపము ఉత్పత్తిస్థానముగా గలవాఁడు-వ్యాసమహర్షి.

ద్వైప్యము. సం. విణ. (అ. ఆ. అ.) ద్వీపమందలిది.

ద్వైమాతురుఁడు. సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు; 2. జరాసంధుఁడు.

ద్వైమాతృకము. సం. విణ. (అ. ఈ. అ.) వర్షజలము చేతను నదీజలముచేతను పండునది.

ద్వైవిధ్యము. సం. వి. అ. న. 1. రెండువిధములుగా నుండుట; 2. భేదము.

ద్వ్య

ద్వ్యణుకము. సం. వి. అ. న. రెండు పరమాణువులు కారణముగాఁ గలపదార్థము, రెండుపరమాణువులు కలియఁగా నేర్పడినపదార్థము. "ఉ...తప్పక యిందఱఁ జూడవమ్మ శృంగారరసైకసర్గరసిక ద్వ్యణుకోదరి యాదరంబునన్." నైష.౫,ఆ.33.

ద్వ్యర్థము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రెండర్థములు కలది. (శబ్దాది); 2. రెండుప్రయోజనములుగలది. (కార్యము.)

ద్వ్యర్థి. సం. విణ. (న్. నీ. న్.) రెండర్థములు కలది. (కావ్యాది.)

ద్వ్యష్టము. సం. వి. అ. న రాగి,తామ్రము.

ద్వ్యహము. సం. వి. అ. పుం. రెండుదినములు.

## ధ

ధ. సం. ఒకానొకయక్షరము. వి. అ. పుం. 1. ధర్మము; 2. కుబేరుఁడు; 3. బ్రహ్మ. న. ధనము. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ధగధగ. దే. వి. ప్రకాశించుట మున్నగువానియందగు ననుకరణము. "క. తొలుకారు మెఱుఁగుకై వడిఁ, దళతళ మని మేను మెఱవ ధగధగ మనుచున్, గలుముల నీనెడిమాపుల..." భాగ. ౮; స్కం. ౨౬౫, కళా. ౨, ఆ. ౭౮. విణ. ధగధగ యను కాంతి గలది. (కర్మధారయమున నిగాగమము). "లయవిభాతి. ధగధగనిదేహరుచి నిగనిగనికుంద నపుఁ దగడు ఢెగడన్...." స్వా. ౪, ఆ. ౧౧౭. పారి. ౨, ఆ. ౮౭.

ధగధగద్ధగ. దే. వి. ధగధగ మనిమెఱయుకాంతి. "గీ. ధవళతరదేహధగధగద్ధగలు మెఱయఁ, గదియ నేతెంచునొకభుజాగంబుఁ గనిరి." దశా. ౧, అ. ౨౦౬.

ధగద్ధగీయము. సం. విణ. (అ. ఆ. అ.) ధగధగ ప్రకాశించునది. "మ. పటువేగంబున శాతభీల పత్రసంపాతంబునన్ మింట మిక్కుటమై పర్వ దగద్ధగీయ మగుచుం గోపంబు రూపంబులై, చటుల క్రీడఁ జరించునట్లు..." నిర్వ. ౬, ఆ. ౯౮.

ధగిడి. దే. వి. (హిం. ధగడా) నీచపురుషుఁడు, దుష్టుఁడు "సీ... ఖరాబు కూళ బందెలమారి ముందఱి పాపాలముద్ద ధగిడి." హంస. ౫, ఆ. ౧౨౩.

ధగిడీ=ధగిడి. "చ. చెనఁటి గరాస యీసభను జెప్పినటుల్ మఱి నీవు సేయకుం, డిన విడ రాచకోచ ధగిడీ=యని దిగ్గున లేచె వీఁకతోన్." అహ. ౧, ఆ. ౯౫.

ధట. సం. వి. ఆ స్త్రీ. త్రాసు, తక్కెడ, తుల.

ధటకము. సం. వి. అ. పుం. 1. త్రాసు; 2. నలువది రెండు గురిగింజలయెత్తు.

ధటము. సం. వి. అ. పుం. త్రాసు; తక్కెడ, తుల.

ధటి. సం. వి. ఈ. స్త్రీ. 1. దట్టి; 2. గోఁచి. న్. పుం. వర్తకుఁడు.

ధటిని. సం. వి. ఈ. స్త్రీ. 1. నూలిమొలత్రాడు; 2. ధటి.

ధట్టము. సం. వి. అ. పుం. సమూహము. "చ. తదవసరంబునన్ దొర లుదగ్రత ద్రోచినవజ్రఘట్టముల్, మదమున నొక్కపెట్ట బలమర్దనసూనురథంబు గ్రక్కునం, బొదివె..." భార. విరా. ౫, ఆ. ౩౮, హరి. ౪, ఆ. ౨౨౩.

ధట్టించు. దే. అ. క్రి. యత్నించు. "సీ... మృత్యుదేవతనోరు ధట్టించి యఱకాలఁ దన్నినాఁడు." భీమ. ౧, ఆ. ౧౧౦. స. క్రి. అదలించు, తర్జించు. "మ... కల్పాంతసంహారరుద్రకఠోరాకృతి దుర్నిరీక్షుఁ డగుచున్ ధట్టించి దుర్వాసుఁ డుగ్రకటాక్షంబున నింద్రుఁ జూచి పలికెన్ గాఢాగ్రహవ్యగ్రతన్." హర ౬, ఆ. ౧౭. య. ౧, ఆ. ౧౦౨.

ధణంధణ. దే. వి. శంఖభేర్యాదిధ్వనుల కనుకరణము. "గీ. అందు భేరీధణాంధణల్ క్రందుకొనియె." ఉ. రా. ౮, ఆ. ౧౬౫, దశా. ౨, అ. ౧౬౨.

ధత్తూరము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త.

ధత్రము. సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు. న. 1. గృహము; 2. ఆకాశము.

ధత్రుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ధనంజయము. సం. వి. అ. పుం. మద్ది, అర్జునము; 2. చిత్రమూలము; 3. సర్పవిశేషము.

ధనంజయుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. అగ్ని; 3. ఇంద్రుఁడు.

ధనదుఁడు. సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు; 2. అగ్ని విణ. (అ. ఆ. అ.) ధనము నిచ్చువాఁడు.

ధనపతి. సం. వి. ఇ. పుం. 1. కుబేరుఁడు; 2. కోశాధ్యక్షుఁడు.

ధనము. సం. వి. అ. న. 1. విత్తము, సొమ్ము; 2. ఆవుల మంద. (శ. ర.); 3. మూలద్రవ్యము, సంచిమొదలు; 4. ధనియాలు, ధాన్యాకము.

ధనహరి. సం. వి. ఈ. స్త్రీ. 1. బలురక్కెస; 2. నల్లకచోరము. (శ. ర.); 3. చోర మనుగంధద్రవ్యము.

ధనాధిపుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

ధనాసరి. దే. వి. 1. ఒకానొకరాగము. "ఉ... వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరి బేగడా, యారభి ...తగురాగము లింపు మీఱఁగన్." చెన్న. ౨, ఆ. ౨౩౬; 2. గోఁగులలో నొకభేదము. (వా.)

ధని. సం. వి. న్. పుం. 1. కుబేరుఁడు. ఈ. స్త్రీ. జవరాలు, యువతి. విణ. (న్. నీ. న్.) ధనము కల వాఁడు. [భార్య.

ధనిక. సం. వి. ఆ. స్త్రీ. 1. యువతి; 2. వర్తకుని

ధనికము. సం. వి. అ. పుం. న. ధనియాలు, ధాన్యాకము.

ధనికుఁడు. సం. వి. న్. పుం. కుబేరుఁడు. విణ.(అ.ఆ.అ.) 1. అధికమైనధనము కలవాఁడు; 2. వర్తకుఁడు; 3. ధనము వడ్డి కిచ్చువాఁడు, ఉత్తమర్ణుఁడు.

ధనిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనక్షత్రము.

ధనుఃపాండిత్యము. సం. వి. అ. న. విలువిద్యయందలి నేర్పు. "శా. కాండత్రీణత సాయిషుచ్ఛటలకుం గల్గెం గదే సాధనుః, పాండిత్యం బెటువోయె నొక్కొ..." హర. ౭, ఆ. ౭౭.

ధనుర్ధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విలుకాఁడు. "ఉ. నీయనుజుల్ ధనుర్ధరులు..." భార. అర. ౨, ఆ. ౩౦౯.

ధనుర్మాసము. సం. వి. అ. పుం. సూర్యుఁడు ధనూరాశియం దుండునెల.

ధనుర్యాగము. సం. వి. అ. పుం. యాగవిశేషము. "వ...ధనుర్యాగంబుపేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన .." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౦౭.

ధనుర్వేదము. సం. వి. అ. పుం. విలువిద్యను బోధించు ఒకానొక ఉపవేదము.

ధనువు. సం. వి. ఉ. పుం. 1. విల్లు; 2. ఒకరాశి; 3. వింటినారి. ఉ. స్త్రీ. 1. విల్లు; 2. ఉత్తమస్త్రీ; 3. వింటినారి. ఊ. స్త్రీ. 1. విల్లు; 2. వింటినారి.

ధన్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆమలకి♣; 2. దాది,ఉపమాత; 3. దనియపుమొక్క.

ధన్యాకము. సం. వి. అ. న. దనియపుమొక్క, కొత్తిమిరి ♣.

ధన్యాసి. దే. వి. ఇరువదినాలుగు స్త్రీరాగములలో నొకటి. "సీ...బిలాహరి కురంజి ధన్యాసి పూర్వగౌళ వరాటి నాట భల్లాతకి..." హంస. ౪, ఆ. ౧౨౩, ప్రబంధ. ౯౪.

ధన్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. శ్లాఘ్యుఁడు, పొగడఁదగినవాఁడు; 2. సుఖము గలవాఁడు; 3. సుకృతి,పుణ్యాత్ముఁడు, 4. ధనము నొందినవాఁడు; 5. కృతార్థుఁడు, ఇష్టకార్యము నెఱవేర్చుకొన్నవాఁడు.

ధన్వంతరము. సం. వి. అ. న. నాలుగుమూరలకొలఁది కలపరిమాణవిశేషము.

ధన్వంతరి. సం. వి. ఇ. పుం. 1. దేవవైద్యుఁడు; 2. సూర్యుఁడు.

ధన్వధి. సం. వి. ఇ. పుం. వింటిగవుసెన.

ధన్వము సం. వి. న్. పుం. న. 1. నిర్జలభూమి, ఎడారి; 2. విల్లు.

ధన్వి. సం. వి న్. పుం. 1. అర్జునుఁడు; 2. మద్ది♣; 3. ధనూరాశి. విణ. (న్. నీ. న్.) 1. విలుకాఁడు; 2. నేర్పరి, విదగ్ధుఁడు.

ధమనము. సం. వి. అ. పుం. న. నాసానాళము, పుం. కిక్కసకసవు ♣.

ధమని. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. నాడి, నరము; 2. అగసాలెవాని ఊఁదుగొట్టము,కొలిమితిత్తి; 3. కంఠము, మెడ; 4. పసుపు,హరిద్ర♣; 5. నఖ మనుగంధద్రవ్యము♣.

ధమనుఁడు సం. అ. పుం. అగ్ని. విణ. (అ. ఆ. అ.) 1. కొలిమితిత్తి నూఁదువాఁడు; 2. క్రూరుఁడు.

ధమామీ. దే. వి. వాద్యవిశేషము. "వ...నిస్సాణంబులఢణంఢణలు ధమామీలదిందిమ్ములు..." ప్రబంధ. ౭౮౮.

ధమ్మిల్లము. సం. వి. అ. పుం. కొప్పు, సంయతకేశములు.

ధర. ఉభ. దే. వి. మూల్యము. (బ్రా. వా.) సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. స్త్రీలగర్భాశయము; 3. రక్తనాళము; 4. మేదస్సు, ఎముకలలోనిక్రొవ్వు.

ధరణము. సం. వి. అ. పుం. 1. హిమాలయపర్వతము; 2. లోకము; 3. స్థలము; 4. సేతువు; 5. ధాన్యము; 6. చన్ను, స్తనము; 7. జిల్లేడు♣. న. 1. ధరించుట, తాల్చుట; 2. ఆధారము; 3. నలువదియెనిమిది యవలయెత్తు; 4. పదునాఱు మాషములయెత్తు.

ధరణి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. నేల,భూమి; 2. నాడి, రక్తనాళము; 3. బూరుగు ♣.

ధరణిజ. సం. వి. ఆ. స్త్రీ. సీత.

ధరణీజాని. సం. వి. ఇ. పుం. రాజు. "క. దాని కహింసయ మూలము,దానన వారి ప్రీతుఁ డగు సతండన ధరణీ,జానీ క్షేత్రజ్ఞుం డనఁ,గా నొక్కఁడ యగుట దెలియఁగా వలయుం గడున్." భార. శాం. ౬, ఆ. ౪౯౯.

ధరణీజుఁడు. సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.

ధరణీధరము. సం. వి. అ. పుం. 1. కొండ,పర్వతము, 2. దిగ్గజము; 3. ఆదికూర్మము.

ధరణీధరుఁడు. సం. వి. అ. పుం. 1. ఆదిశేషుఁడు; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. రాజు.

ధరణీపతి. సం. వి. ఇ. పుం. రాజు.

ధరణీభృతము. సం. వి. అ. పుం. పర్వతము,కొండ.

ధరణీభృతుఁడు. సం. వి. త్. పుం. 1. రాజు; 2. విష్ణువు; 3. ఆదిశేషుఁడు.

ధరణీభృత్తు. సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు; 3. విష్ణువు; 4. ఆదిశేషుఁడు.

ధరణీరుహము. సం. వి. అ. పుం. వృక్షము.

ధరణీసురుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

ధరణుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ధరత్. సం. శత్రు. ధరించుచున్న.

ధరమాణము. సం. విణ. (అ. ఆ. అ.) ధరించుచున్నది.

ధరము. సం. వి. అ. పుం. 1. కొండ,పర్వతము; 2. ప్రత్తి. విణ. (అ. ఆ. అ.) ధరించునది.

ధరాభుక్కు. సం. వి. జ్. పుం. రాజు.

ధరాభృత్తు. సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు.

ధరామరుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

ధరించు. స్వం. స. క్రి. 1. తాల్చుకట్టు. "వ. ఇట్లు వర్జితాశేషవిభూషణుండై తరువల్కలంబులు ధరించి యన్నరేంద్రుండు..." మార్క. ౧, ఆ. ౧౬౬; 2. గ్రహించు, పట్టుకొను. "క. చంచలగయనాచంచల, చంచలవీణన్ ధరించి చతురతచే వాయించెదవో..." కాళిందీ. ౬, ఆ. ౧౦౩

ధరిత్రి. సం. వి. ఈ. స్త్రీ. నేల, భూమి.

ధరియించు = ధరించు. 1. ధరించు. "ఉ...సాధులు నీరి నెమ్మిగ నిజస్థిరవృత్తము దుష్టకోటిచే,బాధలఁ బొందకుండఁ దమపాల వసించినఁ బెద్దవారు ది, క్కై ధరియించి వారి శోకయాపద పుట్టక యుండఁ గాచు టొప్పై ధరఁ గీర్తి కెక్క దె..." భార. విరా. ౨, ఆ. ౯౫, మార్క. ౧, ఆ. ౧౧౬; 2. ఓర్చు, సహించు. "ద్వి. ధరియింప రానివేదనలతో రామ,ధరణివల్లభుఁడు గౌతమి చేరఁబోయి." రం. రా. అర. ౧౮౭, పు బస. ౪, ఆ. ౪౮౪. పం; 3. తాల్చు, పూను. "వ... పాండవులును రథంబు లెక్కి యాయుధంబులు ధరియించి..." భార. అర. ౧, ఆ. ౧౯౯; 4. పఠించు. "వ...ఎట్లనిన వేదంబులు ధరియించి విప్రులు వేదచోదితంబులైనపుణ్యకర్మలు విధియించుటంజేసి..." భార. అర. 3, ఆ. ౧౫.

ధరుఁడు. స్వం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. వసువులలో నొకఁడు.

ధరుణము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. అగ్ని; 3. లోకము; 4. స్తనము. న. ఉదకము. విణ. (అ. ఆ. అ.) 1. ధరించునది; 2. సమ్మతము.

ధరుణుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ;2.సూర్యుఁడు.

ధర్త. సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) ధరించువాఁడు.

ధర్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధరింపఁదగినది.

ధర్తూరము. సం. వి. అ. పుం. దుత్తూరము. ఉమ్మెత్త.

ధర్మకవిలె. మి. వి. (ధర్మము+కవిలె.) ధర్మములపుస్తకములోని దానముల ననుభవించువాఁడు. "ద్వి. అవుదలల్ వంచుచు నయ్యా మీధర్మ,కవిలెల మను చును గడు దైన్యపడుచు." బస. ౭, ఆ. ౩౯౭. పం. ౪, ఆ. ౧౦౨౨. పం.

ధర్మచారిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ధర్మ మాచరించు స్త్రీ; 2. పతివ్రత యైనభార్య.

ధర్మజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధర్మములు తెలిసినవాఁడు.

ధర్మదార. మి. వి. (ధర్మము+దార.) యుద్ధము పూర్తియైనట్లు సూచించుటకై యూఁదుబాకా. "ఉ. మంచన వింటివో వినవొ మన్మథుఁ డేకశిలాపురంబులోఁ,జంచలనేత్రలం బతులశయ్యలపై రతికేళి రాత్రి పోరించి ప్రభాతకాలము పరిస్ఫుట మైనను ధర్మదార వట్టించుచునున్నవాఁ డవె కుటీగతకుక్కుట కంఠనాదముల్." క్రీడా. ౫౪, దశా. ౭, అ. ౧, ఆ. ౧౪౫.

ధర్మధ్వజి. సం. వి. న్. పుం. ధార్మికవేషధారి, కపట ధార్మికుఁడు.

ధర్మధ్వజుఁడు. సం. వి. అ. పుం.=ధర్మధ్వజి.

ధర్మభాగిని. సం. వి. ఈ. స్త్రీ. భర్తచేసినధర్మములో భాగము నొందునది-భార్య.

ధర్మము. సం. వి. అ. పుం. న. 1. పుణ్యము, మంచి కర్మములు చేయుటచేఁ గలుగు అపూర్వము; 2. న్యాయము; 3. ఆచారము; 4. స్వభావము; 5. గుణము; 6. అహింస; 7. యజ్ఞము; 8. వేదాంతము, ఉపనిషత్తు; 9.దానాదికము; 10.సామ్యము, ఉపమ; 11. శ్రుతిస్మృత్యాదివిహిత కృత్యము. (ఇది దశవిధము. శ్లో. ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః, ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్. మను. ౬, ప్ర. ౯౨, పుం. విల్లు.

ధర్మయుగము. సం. వి. అ. న. కృతయుగము.

ధర్మరాజు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. యుధిష్ఠిరుఁడు; 3. బుద్ధుఁడు; 4. ధర్మపాలన మొనర్చు రాజు.

ధర్మశాల. సం. వి. ఆ. స్త్రీ. ధర్మమునిమిత్తము అన్నాది దానముల కొఱకుఁ గట్టఁబడినయిల్లు, సత్త్రము.

ధర్మశాస్త్రము. సం. వి. అ. న. ధర్మములను చెప్పునట్టి శాస్త్రము.

ధర్మసంహిత. సం. వి. ఆ. స్త్రీ. ధర్మశాస్త్రము.

ధర్మాత్ముఁడు. సం. విశే. (న్.) పుణ్యాత్ముఁడు.

ధర్మాధికృతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) న్యాయము విచారించునధికారి.

ధర్మాసనము. సం. వి. అ. న. ధర్మనిర్ణయమునకై ధర్మాధికారి కూర్చుండుపీఠము.

ధర్మి. సం. వి. న్. పుం. విష్ణువు. విశే. (న్. ణీ. న్.) ధర్మము కలది.

ధర్మిష్ఠుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి ధర్మాత్ముఁడు.

ధర్ముఁడు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. బుద్ధుఁడు; 3. సోమయాజి.

ధర్మువు. సం. వి. ఉ. పుం. న. ధర్మము. "చ. అవని యరాజకం బయినయప్పుడ భూప్రజయందు సర్వ ధర్మువులుఁ దొలంగు..." భార. ఆది. ౪, ఆ. ౨౫౦, భార. శాం. ౧, ఆ. ౪.

ధర్మ్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ధర్మానపేతము, ధర్మయుక్తము. "క. పంబి యజనాధ్యయనదా, నంబుల వర్తిల్లె బ్రాహ్మణప్రియ మయి ధర్మ్యం బయి క్షత్రియవైశ్యకులం బవిరతపుణ్యకర్మలాలస మగుచున్." భార. ఆది. ౧, ఆ. ౧౫; 2. ధర్మము చేత పొందఁదగినది; 3. న్యాయ్యము, న్యాయము నుండి తొలఁగనిది. "ఉ. నీవచనంబు ధర్మ్యము వినీతము నీతియుతంబు నిష్టసిద్ధ్యావహము..." భార. అర. ౧, ఆ. ౨౫౭.

ధర్షకుఁడు. సం. విశే. (అ. ర్షికా. అ.) 1. తిరస్కరించువాఁడు; 2. ప్రగల్భుఁడు; 3. ఓర్పు లేని వాఁడు; 4. నటుఁడు; 5. స్త్రీలను చెఱపువాఁడు, దూషకుఁడు.

ధర్షణము. సం. వి. అ. న. 1. ప్రాగల్భ్యము; 2. తిరస్కారము; 3. ఓర్వలేమి, అసహనము; 4. సురతము; 5. శాపరము; 6. చెఱపుట, దూషణము. విశే. (అ. ఆ. అ.) ధర్షణము చేయునది.

ధర్షణి. సం. వి. ఈ. స్త్రీ. కులట, అంకుటాలు.

ధర్షణీయము. సం. విశే. (అ. ఆ. అ.) ధర్షింపఁదగినది.

ధర్షము. సం. వి. అ. పుం. 1. ప్రాగల్భ్యము; 2. తిరస్కారము; 3. ఓర్వలేమి; 4. హింస; 5. చెఱుపుట, బలిమిచే స్త్రీలోనగువారిని చెఱఁబట్టుట.

ధర్షించు. సం. స. క్రి. 1. తిరస్కరించు; 2. ధర్షణముచేయు. (శ. ర.)

ధర్షిణి. సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, కులట.

ధర్షిత. సం. వి. ఆ. స్త్రీ. కులట, అంకుటాలు. విశే. (బు. త్రీ. బు.) ధర్షణము చేయువాఁడు.

ధర్షితము. సం. వి. అ. న=ధర్షణము. విశే. (అ.ఆ.అ.) 1. తిరస్కృతము; 2. చెఱుపఁబడినది.

ధర్షితవ్యము. సం.=ధర్షణీయము.

ధర్షుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురపు కావలివాఁడు, కంచుకి.

ధవము. సం. వి. అ. పుం. 1. కంపనము, కదల్చుట; 2. కదలుట; 3. చండ్ర [illegible].

ధవళ. సం. వి. ఆ. స్త్రీ. 1. తెల్లనిరంగు గల స్త్రీ; 2. తెల్లయావు.

ధవళపక్షము. సం. వి. అ. పుం. 1. హంస; 2. శుక్లపక్షము.

ధవళము. సం. వి. అ. పుం. 1. తెలుపు; 2. చండ్ర [illegible]; 3. అఁబోతు. "ద్వి. ఏను ధర్మజునకు నీరాజ్య మిచ్చి, యేనున్నపుర మిచ్చి యిభకోటి నిచ్చి, ధన ధాన్యములనిచ్చి ధవళంబులిచ్చి, సను వచ్చి సేవించు నాథుల నిచ్చి." ద్వి. భార. విరా. ౪, ఆ. ౫౭. పు. స. స్త్రీలు వివాహాదులందు పాడునొకవిధ మగుపాట. "మ. ధవళాంశూజ్జ్వలపీఠిపై నునిచి యంతన్ జోడుగాఁ గూడుచున్, ధవళం బింపుగఁ బాడుచున్..." రాధి. ౫, ఆ. ౫౧, య. ౪, ఆ. ౧౦౧.

ధవళాంగి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లనిశరీరము గలది-సరస్వతి.

ధవళాక్షి. సం. వి. ఈ. స్త్రీ. "మ... ధవళాక్షుల్ సని కాంచి రంత..." భార. ఆది. ౨, ఆ. ౩౦.

ధవళితము. సం. విశే. (అ. ఆ. అ.) తెల్లఁగాఁ జేయఁబడినది.

ధవళిమ. సం. వి. న్. పుం. తెలుపు.

ధవళిమము. సం.=ధవళిమ.

ధవిత్రము. సం. వి. అ. న. కృష్ణాజినములోఁ జేసిన విసనకఱ్ఱ.

ధవుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. భర్త, మగఁడు; 3. ప్రభువు, రాజు; 4. మోసగాఁడు, వంచకుఁడు.

ధళ. దే. వి. ప్రకాశము; దానియనుకరణము. "మ... న్నాథునిమాళిన్ దలఁట్రాలు వోనె నవలా దోర్మూల కూలంకష, స్తనవిస్ఫూర్తికి సందిదండలధళళ్ సాహోసినాదం బిడన్."స్వా. ౫, ఆ. ౧౪. (దీని యామ్రేడితరూపము, ధళధళ. కళా.౧, ఆ.౩ ౬.)

ధళుధళుక్కు. దే వి. మెఱయుటయం దగుననుకరణము. "సీ. ధళుధళుక్కున నింగిఁ దాటించె బలు బోఁటు నీరాల్గొందిఁ గన్నిసు మెఱుంగు."పాండు. ౪, ఆ. ౨౧, చంద్రా. ౪, ఆ. ౨౦౧.

ధా

ధాకము. సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. అన్నము; 3. ఆశ్రయము; 4. స్తంభము, కంబము.

ధాటి. సం. వి. ఈ. స్త్రీ. దాడి, దండయాత్ర.

ధాణు. దే. వి. మల్లవిద్యను సంబంధించిన పదునాలుగు విసరులలో నొకటి. "వ ..అవ్వీరుండు... ధాణు ...ఝాటు నివి మొదలయిన పదునాలుగు విసరుల మర్మంబులుం జూచి..." హంస. ౧, ఆ. ౨౦౬.

ధాణుధారు. దే. వి. మల్లవిద్యకు సంబంధించిన పదునాలుగు విసరులలో నొకటి. "వ...ధాణుధారు కధాకు ధాణుదారు ఝాటు మొదలగు పదునాలుగువిసరులు." ప్రబంధ. ౭౧, హంస. ౧, ఆ. ౨౦౬.

ధాత. సం. వి. ఋ. పుం. 1. బ్రహ్మ; 2. ఆత్మ; 3. ఒకానొకసంవత్సరము; 4. ఒకానొక ఆదిత్యుఁడు. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. ధరించువాఁడు; 2. రక్షించువాఁడు; 3. సృజించువాఁడు.

ధాతకి. సం. వి. ఈ. స్త్రీ. ఆరె, ఏఱుజాజి ❀.

ధాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపఁదగినది; 2. పోషింపఁదగినది; 3. సృజింపఁదగినది.

ధాతువు. సం. వి. ఉ. పుం. 1. దేహమునకు ఆరంభకమైనవస లోనగునది. (వస,అసృక్కు, మాంసము. మేదస్సు, ఆస్థి,మజ్జ,శుక్రము అని ఇవి ఏడు.పక్షాంతరమున రోమ, త్వక్, మాఁస ఆస్థి,స్నాయు, మజ్జా, ప్రాణములు.); 2. వాతము లోనగునది. (వాతము, పిత్తము. శ్లేష్మము); 3. గైరికాది ధాతువు; 4. పృథివి లోనగునది. (భూతము.); 5. శబ్దము లోనగునది. (గుణము.); 6. త్వక్కు లోనగునది. (ఇంద్రియము.); 7. లోహము (బంగారు. వెండి, ఇనుము లోనగునది.); 8. ఎముక; 9. ధనము; 10. రేతస్సు; 11. స్వభావము; 12. క్రియావాచక మగు భూ ధా తువు లోనగునది. (వ్యాక.)

ధాత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. భూమి; 2. దాది, ఉపమాత; 3. తల్లి; 4. ఉసిరిక ❀.

ధాత్రేయి. సం. వి. ఈ. స్త్రీ. 1. దాదికూఁతురు; 2. భూమి. "క. పోయెదుఁబో యిప్పుడు ధాత్రేయికి..." నైష. ౭, ఆ. ౧౧౧ (శ.ర.పా.)

ధాన. సం. వి ఆ. స్త్రీ. 1. దనియము, కొత్తిమిరి ❀. 2. మొగ్గ; 3. యవాదులపిండి; 4. క్రొత్తమొలక. బ. వేఁపుడు యవలు.

ధానము. సం. వి. అ. న. 1. స్థానము; 2. ధారణము, ధరించుట; 3. పోషించుట, పోషణము; 4. ఉంచుట. "గీ. తరుణపాథోరుహోద్భో విధానమునను, ధరణినాథకిరీటాగ్రధానమునను,నూర్ధ్వ మయ్యెడు నిని యంచునొకొ విధాత,తత్పదం బూర్ధ్వరేఖాంకితంబు సేసె." నైష. ౧, ఆ. ౬౫.

ధాని. సం. వి. ఈ. స్త్రీ. 1. స్థానము; వాసస్థానము; 2. గోఁగు ❀; 3. దనియము, కొత్తిమిరి ❀.

ధానుష్కుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విలుకాఁడు.

ధాన్యము. సం. వి. అ. న. 1. కొలుచు. (నవధాన్యములు: గోధుమలు, యవలు, పెసలు, సెనగలు, కందులు, బొబ్బరలు, నువ్వులు, మినుములు, ఉలవలు.); 2. దనియాలు.

ధాన్యాకము. సం. వి. అ. న. దనియాలు.

ధాన్యామ్లము. సం. వి. అ. న. కలి, పులికడుగు.

ధామనిధి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

ధామము. సం. వి. న్. న. 1. ఇల్లు; 2. చోటు, స్థానము; 3. వెలుఁగు, కిరణము; 4. కాంతి; 5. ప్రభావము, శక్తి; 6. శరీరము; 7. పుట్టుక, జన్మము; 8. ప్రతాపము; 9. అన్నము; 10. ఆకాశము; 11. సారము; 12. ధనము; 13. చిహ్నము; 14. సమూహము. "శా. చండాలీప్రజగీతరావముల కుత్సాహంబుతో నొక్కచో, దండస్వామి కుదంబు సేసెఁ గరిణీధామంబు లట్టాడఁగన్."కు. సం. ౧, ఆ. ౧౬, అ. న. 1. తిలకము; 2. తేజస్సు.

ధామార్గకము. సం. వి. అ. పుం. 1. ఆవడ, చేతి బీఱకి; 2. ఉత్తరేను, అపామార్గముకి.

ధాయకము. సం. విణ. (అ. యికా. అ.) 1. ధరించునది; 2. పోషించునది.

ధాయము. సం.=ధాయకము.

ధాయ్య. సం. వి. ఆ. స్త్రీ. యాగమునం దగ్నిని ప్రజ్వలింపఁజేయునపుడు పఠించుమంత్రము, సామిధేని

ధాయ్యుఁడు. సం. వి. అ. పుం. పురోహితుఁడు.

ధార. సం. వి. ఆ. స్త్రీ. 1. పైనుండి పడెడినీరు లోనగు వానిచాలు; 2. కత్తి లోనగువానివాదర; 3. కుండ లోనగువానిచిల్లి; 4. జడివాన,ముసురు; 5. దండుముందఱిభాగము. సేనాగ్రభాగము; 6. కొన, అంచు; 7. రథచక్రము; 8. ఉత్కర్షము; 9. సమూహము; 10. కీర్తి; 11. వాక్కు; 12. కింవదంతి, జనప్రవాదము; 13. భోజమహారాజు పాలించినపట్టణము; 14. అశ్వగతి విశేషము. (ఇవి అయిదు: ఆస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము.); 15. వరుస, పరంపర; 16. పోలిక. "మ. నటదీశానశిరస్తటత్రుటితరత్నచ్ఛాయఁ గల్లోలినీ,విటమధ్యంబున వ్రాలె నభ్రమణి తద్వేగాభిపాతోన్నమ,త్పటుపాథోలవధారఁ దార లెగసెం దద్బిందుసంధానితో,త్కట సంధ్యానలధూమకందళములై కన్పట్టెఁ గ్రొంజీకటుల్." వసు. ౪, ఆ. ౧౦.

ధారకము. సం. వి. అ. పుం. పాత్రము, కలశము.

ధారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) 1. ధరించువాఁడు; 2. పోషించువాఁడు; 3. అప్పు పుచ్చుకొన్నవాఁడు, అధమర్ణుఁడు.

ధారగొను. ఖి స. క్రి. (ధార+కొను.) ధారాపూర్వకముగా దానముపుచ్చుకొను. "చ. అనవుడు నాతఁడి ట్లనియె నాతనితో నిపుడేను దీని నీ,జనపతిచేత ధారగొని సాధుగతిం జన నీది యంట యె,ట్లనిన నతండు నేనును ధరాధిపుచే మును ధారగొన్న యా,వని వినిపింప నిద్దఱకు నయ్యె నపారవివాదమచ్చటన్." భాగ. ౧౦, స్కం. ఉ. ౪౬౯.

ధారణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ధరించుట; 2. పోషించుట; 3. జ్ఞప్తియందుంచుకొనుట; 4. జ్ఞాపకశక్తి, స్మరణపటుత్వము; 5. కుంభక మనెడిప్రాణాయామభేదము; 6. స్థైర్యము, నిలుకడ; 7. అప్పుపడుట; 8. భగవంతునిఁ దప్ప మఱొకటిని యెఱుఁగమి.(ఇది యోగాంగములలో నొకటి.); 9. రాజులన్యాయ్యమార్గస్థితి,మర్యాద; 10. ధర,మూల్యము? "రగడ ...ధాత్రి ధాన్యముల ధారణ నిక్కెన్..." బహు. ౨, ఆ. ౧౩.

ధారణము. సం. వి. అ. న. 1=ధారణ; 2. ఉదకము. పుం. 1. స్తనము; 2. లోకము. విణ. (అ.ఆ.అ.) 1. ధరించునది; 2. పోషించునది. (అ. ఈ. అ.) 1. ధరింప సాధనమైనది; 2. పోషింప సాధనమయినది.

ధారణి. సం. వి. ఈ. స్త్రీ. 1. వరుస,బంతి; 2. నరము, నాడి; 3. నిలుకడ; 4. భూమి,ధరణి. "ద్వి. అమర వేవేగ చిత్రాంగి నంటఁ గన్నెరక్కసివలెనె ధారణి పిక్కటిల్ల..." ద్వి. శ. సా. ౧౦౬ పు.

ధారణుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. సూర్యుఁడు.

ధారము. సం. వి. అ. పుం. 1. వడగల్లు, వర్షోపలము; 2. అప్పు, ఋణము; 3. లోఁతైనచోటు. న. వర్షపునీరు. విణ. (అ. ఆ. అ.) ధరించునది.

ధారయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ధరింపఁజేయువాఁడు.

ధారవోయించు. మి.స. క్రి. (ధారవోయు ధా. ప్రే.) ధారాపూర్వకముగా దానముచేయించు. "క.దేవబ్రాహ్మణభూములు, భూవరునకుఁ జెప్పి ధారవోయించె, బళీ." భీమ. ౧, ఆ. ౭౩.

ధారవోయు. మి. స. క్రి. (ధార+పోయు.) ఉదకధారాపూర్వకముగా దానముచేయు. "క... సదక్షిణం సతాంబూలం తుభ్యమహం సంప్రదద యిదం, నమమ యనుచు ధారవోసె నలినాక్షునకున్."దశా. ౫,ఆ. ౧౦౯;వరాహ. ౧౦,ఆ.౪౮.

ధారాంకురము. సం. వి. అ. పుం. 1. శీకరము, వాన తుంపర; 2. వడగల్లు; 3. ముందుగాఁ బోవుసేన, నాసీరము.

ధారాటము. సం. వి. అ. పుం. 1. వానకోయిల, చాతకము; 2.గుఱ్ఱము; 3. మేఘము; 4.మదపుటేనుఁగు.

ధారాధరము. సం. వి. అ. పుం. 1. మేఘము; కత్తి, ఖడ్గము.

ధారాళము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతతధారలు గలది. "సీ... ప్రచండమేఘకులములు...గీ... వచ్చి దివినుండి ధారాళవారిఁ గురిసె సస్యములఁ

బ్రోచి పసికిఁ బోషణ మొసర్చి, యఖిలజంతువు లకుఁ బ్రీతి యావహించు." హరి. పూ. ౭, ఆ. ౧౨౯. విక్ర. ౪, ఆ. ౩౦; 2. అప్రతిహతము, అడ్డుపాటు లేనిది. "మ...ఆరాజు స్వారదుఁ దర్హాసనభాసియై పలికె ధారాళ్ప్రశంసోక్తులన్." కళ. ౪, ఆ. ౬; 3. ఋజువైనది. నిష్కపటము. (వ్యవ).

ధారాసంపాతము. సం. వి. అ. పుం. జడివాన,ఆసారము.

ధారిక. సం. వి. ఆ. స్త్రీ. ముహూర్తము, రెండుగడియలకాలము.

ధారిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. భూమి; 2. బూరుగుచెట్టు.

ధారితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ధరింపఁజేయఁబడినది; 2. అప్పుగా తీసికొనఁబడినది. (ద్రవ్యాదికము.)

ధారు. దే. వి. మల్లవిద్యాసంబంధమైనపదునాలుగు విసరులలో నొకటి. "వ...అప్వీరుండు...ధారు...ఝాటు నివి మొదలయిన పదునాలుగువిసరుల మర్మంబులం జూచి..." హంస. ౧, ఆ. ౨౦౬.

ధారుణి. సం. వి. ఈ. స్త్రీ. భూమి. "చ. గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడుభక్తుఁడవై సమస్తధారుణిప్రజ గూర్పఁగా విగతరోషుఁడవై సుఖముండు మింక..." భార. ఆది. ౭, ఆ. ౧౨౪. కు. సం. ౧౧, ఆ ౧౩౫.

ధారుణీధ్రము. సం. వి. అ. పుం. పర్వతము. "ఉ. అమ్ముని యల్గిచూచుడును నాక్షణమాత్రన గోత్రధారుణీధ్రమ్ములు వ్రయ్యు నయ్యుసుము దక్కఁగ నంబుధు లింకు..." భార. ఆది. ౪, ఆ. ౩౪.

ధారుధాణం. దే. వి. మల్లవిద్యాసంబంధ మగుపదునాల్గువిసరులలో నొకటి. "వ...ధారుధాణం... మొదలగు పదునాలుగువిసరులు..." ప్రబంధ ౭౪, హంస. ౧, ఆ. ౨౦౬.

ధార్తరాష్ట్రము. సం. వి. అ. పుం. నల్లనిముక్కును కాళ్లును కల తెల్లనిహంస.

ధార్తరాష్ట్రుడు. సం. వి. అ. పుం. 1. ధృతరాష్ట్రుని కొడుకు; 2. సర్పవిశేషము.

ధార్మము. సం. విశే. (అ. ఈ. అ.) 1. ధర్మసంబంధి; 2. వింటికి సంబంధించినది.

ధార్మికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) 1. ధర్మశాస్త్రముఁ జదివినవాఁడు; 2. ధర్మ మాచరించువాఁడు; 3. పుణ్యాత్ముఁడు; 4. విలుకాఁడు.

ధార్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ధాయ్య; 2. కొరిందచెట్టు.

ధార్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ధరింపఁదగినది; 2. జ్ఞాపక ముంచుకొనఁదగినది.

ధార్ష్ట్యము. సం. వి. అ. న. పొగరుఁబోతుఁదనము, వైయాత్యము.

ధాలు. దే. వి. వీణాధ్వనివిశేషము. "శా. అఝ్ఝారే లీనము చాగురే స్ఫురితము న్సాబాసు ధా లంచు న.త్యారూఢప్రమవోన్నతిన్ మురహారుండాలించి వర్ణించుచున్." చంద్ర. ౧, ఆ. ౧౨౭.

ధావకుఁడు. సం. వి. అ. పుం. చాకలి,రజకుఁడు. విశే. (అ. ఏకా. అ.) 1. పరుగెత్తువాఁడు; 2. వేగముగాఁ బోవువాఁడు; 3. వస్త్రాదికము శుద్ధిచేయువాఁడు.

ధావత్. సం. శత్ర 1. పరుగెత్తుచున్న; 2. శుద్ధిచేయుచున్న; 3. ప్రవహించుచున్న. "సీ. అభియాతి తనుధావదసృగాపగాకోటి యహరహంబును ద్రావు నావుపాలు." కళ. ౧, ఆ. ౮౯.

ధావన. సం. వి. అ. న. పరుగెత్తుట. "శా. ధారాపంచకధావనం జెలఁగుగంధర్వంబుఁ ద్రొక్కించు బల్ బీరంపున్నెఱకౌతు..."ఆము. ౪, ఆ. ౩౧.

ధావనము. సం.=ధావన. 1. శుద్ధముచేయుట; 2. పరువెత్తుట; 3. వేగముగాఁ బోవుట.

ధావని. సం. వి. ఈస్త్రీ. 1. కోలపొన్నచెట్టు; 2. చాకిత, రజకి.

ధావనీయము. సం. విశే. (అ.ఆ.అ.) శుద్ధిచేయఁదగినది.

ధావమానము. సం. విశే. (అ. ఆ. అ.) పరుగెత్తుచున్నది.

ధావము. సం. విశే. (అ. ఈ. అ.) 1. పోవునది; 2. పరుగెత్తునది; 3. శుద్ధిచేయునది.

ధావళి. దే. వి. మడికట్టుకొనుటకు వాడు నొకజాతి బట్ట. "గీ. ధాతశాటియుఁ బరిపాటిధావళియును, వటుల వేదాంతశాస్త్రంబు వ్రాసినట్టి, తాళదళపుస్తకము చంకఁ దనరఁ బూనిచనియె గడిదేఱి యాబ్రహ్మచారి మీఱి." హంస. ౧, ఆ. ౧౫౭. శుక. ౨, ఆ. ౪౪౭.

ధావళ్యము. సం. వి. అ. న. తెలుపు,ధవళత్వము.

ధావించు. సం. అ. క్రి. పరువెత్తు. "శా...వెన్వెంటన్ దివ్యకరేణువభ్రముపు ధావింపంగ దర్పోద్ధతిన్." కాశీ. ౩, ఆ. ౧౫౪.

ధావిత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.)=ధావకుఁడు.

**ధావితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. శుద్ధము చేయఁబడినది; 2. పరువెత్తినది; 3. పరువెత్తింపఁబడినది. "ఉ...,తనూజులన్, ధావితశైరిపీరుల సుధాకరనిర్మలకీర్తిహారులన్." కకు. ౧, ఆ. ౭౫.

**ధావ్యము.** సం.=ధావనీయము.

**ధాళధళ్యము.** సం. వి. అ. న. ధళధళమను కాంతి. "సీ. ముఖచంద్రునకు దృగంబుజధాళధళ్యంబు సరిగాఁగ నుభయచామరలు వైవ." దశా. ౨, ఆ. ౨౭౩.

## ధి

**ధింధిం.** దే. వి. వాద్యధ్వనివిశేషమున కనుకరణము. "శా...వాద్యముల్, ధింధింధిక్కధిమిక్క..., అంచు మ్రోసెన్ వెసన్." ద్వా. ౧, ఆ. ౧౨౯, కకు. ౧, ఆ. ౨౧౯.

**ధింధిమి.** సం. వి. ఇ. పుం. మద్దెలధ్వని కనుకరణము. "దండకము...తోడ్తో మృదంగావళీధింధిమిధ్వానముల్..." దశా. ౪, ఆ. ౨౩౨, ౧ ఆ. ౨౬౫.

**ధిక్కరించు.** సం.స. క్రి. 1. ఎదిరించు, ప్రతిఘటించు. "వ. అనిన విని సైరంధ్రి సైరణదక్కి ధిక్కరించి యిట్లనియె." భార. విరా. ౨, ఆ. ౫౭; 2. నిందించు. "గీ. కాన సాధుల దూఱంగఁ గాదు వినుము, నతికిఁ దాసెంతవడియును సభలలోన, దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి, శంక సెడి ధిక్కరింపంగఁ జనునె చెపుమ." భార. విరా. ౨, ఆ. ౧౪౮, నైష. ౭, ఆ. ౧౩౦; 3. తిరస్కరించు, అగౌరవపఱచు. "గీ. మొక్కి వేఁడెద నను మీరు ధిక్కరింప, కాదరింపుఁడు..." భార. శాం. ౧, ఆ. ౩౬౫, మార్క. ౧, ఆ. ౧౮౬.

**ధిక్కారము.** సం. వి. అ. పుం. 1. తిరస్కారము, అగౌరవము; 2. ప్రతిఘటనము, ఎదిరించుట; 3. నింద, నిరసనము. "క. ధిక్కారంబులు చరణద, ళిక్కారంబులును మెఱయ...ఉద్దీర్ణులై పోరు సెడన్." భార. శల్య. ౧, ఆ. ౧౭౫.

**ధిక్కారించు.** సం. స. క్రి.=ధిక్కరించు (బెదరించు, భయపెట్టు.) "మ...భక్తులం, గనిచక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో దుర్జనుల్." భాగ. ౭, స్కం. ౧౦౦.

**ధిక్కృతము.** సం. వి. అ. పుం. ధిక్కారము. విణ. (అ. ఆ. అ.) ధిక్కరింపఁబడినది.

**ధిక్కృతి.** సం. వి. ఇ. స్త్రీ.=ధిక్కారము.

**ధిక్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ.=ధిక్కారము.

**ధిగధిగ.** దే. వి. ప్రకాశించుటయందగు ననుకరణము. "క. గగనపథంబున రాఁగా, ధిగధిగమనునొక్క దివ్యతేజము నభో,లగనంబై పొడకట్టెన, బెగడి దివౌకసులు చనిరి భీతిం గడలన్." శ్రీరం. మా. ౪, ఆ. ౬౯.

**ధిగద్ధిగ**=ధిగధిగ. "సీ. దివ్యతేజము ధిగద్ధిగ వెలింగె." వసు ౫, ఆ. ౩.

**ధిగుల్లు.** దే. వి. గుండెయదరుట కనుకరణము. "క... వేగ భుజించితి నన విని,తా గుండె ధిగుల్లుమనఁగఁ దలపోసె మదిన్." చెన్న. ౧, ఆ. ౧౨౩, ౨ ఆ. ౩౦౨.

**ధిప్స.** సం. వి. ఆ. స్త్రీ. మోసముచేయునిచ్ఛ.

**ధిప్సువు.** సం. విణ. (ఉ) మోసముచేయు నిచ్ఛ గలవాఁడు.

**ధిమిధిమి.** దే. వి. భేరి మొదలగువానిధ్వని కనుకరణము. "క...విరులసోన గురిసెన్ మొరసెన్,ధిమిధిమిని దివ్యదుందుభు, లమరమనోహర్ష హేతువగునవ్వేళన్." విప్ర. ౧, ఆ. ౭౪, ఆము. ౪, ఆ. ౩౫.

**ధిమ్ము.** దే. వి. 1. మద్దెలధ్వని కనుకరణము. (దీని యామ్రేడితరూపము ధింధిమ్ము). "గీ. ధిమ్మనెడి మద్దెలల మ్రోఁత గ్రమ్ముకొనియె." కుచే. ౨, ఆ. ౧౦౯; 2. ఫిరంగులధ్వని కనుకరణము. "వ... ఫిరంగులధింధిమ్ములు జబురుజంగులఖంగురింగులు ...." ప్రబంధ. ౭౮౮.

**ధిషణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. బుద్ధి,మనీష; 2. వాక్కు; 3. స్తోత్రము; 4. గౌరి; 5. భూమి; 6. స్త్రీచిహ్నము.

**ధిషణుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధి కలవాఁడు–బృహస్పతి.

**ధిష్ణ్యము.** సం. వి. అ. న. 1. స్థానము; 2. గృహము; 3. నక్షత్రము; శక్తి.

**ధిష్ణ్యుఁడు.** సం. వి. అ. పుం. 1. శుక్రాచార్యుఁడు; 2. అగ్ని; 3. ప్రాణాభిమానిదేవత.

## ధీ

**ధీ.** సం. వి. ఈ. స్త్రీ. 1. బుద్ధి, మతి; 2. ఊహ, భావన; 3. ఆలోచన.

**ధీంద్రియము.** సం. వి. అ. న. జ్ఞానేంద్రియము.

**ధీత.** సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. మనస్సు; 3. కన్య.

ధీతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రాగఁబడినది, పీల్వఁబడినది; 2. అనాదరింపఁబడినది; 3. ఆరాధింపఁబడినది.

ధీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పీల్చుట, త్రాగుట; 2. అనాదరము; 3. ఆధారము; 4. వ్రేలు.

ధీమంతుఁడు. సం. వి. త్. పుం. 1. బృహస్పతి; 2. విద్వాంసుఁడు. విణ. (త్. మతీ. త్.) శ్రేష్ఠమైన బుద్ధి కలవాఁడు.

ధీయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపఁబడుచున్నది; 2. పోషింపఁబడుచున్నది.

ధీర. సం. వి. స్త్రీ. 1. ధీరురాలు; 2. స్పష్టముగా చెప్పక వ్యంగ్యముగా భర్తయందలికోపము ప్రకటించునాయిక.

ధీరము. సం. వి. అ. న. కుంకుమపువ్వు⚘. విణ. (అ. ఆ. అ.) 1. గంభీరము. (ధ్వని. మొ.); 2. మందము. (గాలి మొ.)

ధీరలలితుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు; ధీరుఁడును కళాసక్తుఁడునగు నాయకుఁడు; మృదుచిత్తము కళాసక్తియుఁ గలిగి సమస్తభోగములు ననుభవించుచు నిశ్చింతుఁడై యుండునాయకుఁడు. (అలం.)

ధీరశాంతుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు, ధీరుఁడును శాంతుఁడు నగు నాయకుఁడు.

ధీరాధీర. సం. వి. ఆ. స్త్రీ. తప్పుచేసిననాయకునియందలికోపమును వ్యంగ్యముగాను అవ్యంగ్యముగాను ప్రకటించునాయిక.

ధీరుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధుఁడు; 2. బలిచక్రవర్తి; 3. సముద్రుఁడు; 4. చిదాత్ముఁడు. విణ. (అ. ఆ అ.) 1. ధైర్యము కలవాఁడు; 2. నిర్వికారచిత్తుఁడు; 3. పండితుఁడు; 4. స్వతంత్రుఁడు, స్వైరుఁడు; 5. బలము కలవాఁడు; 6. మూర్ఖుఁడు; 7. సాహసవంతుఁడు, తెగువ గలవాఁడు; 8. వినీతుఁడు, సుశిక్షితుఁడు.

ధీరోదాత్తుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు, ధీరుఁడు నుదాత్తుఁడు నైన నాయకుఁడు.

ధీరోద్ధతుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధనాయకులలో నొకఁడు, ధీరుఁడు నుద్ధతుఁడు నైన నాయకుఁడు.

ధీవరము. సం. వి. అ. న. ఇనుము.

ధీవరుఁడు. సం. వి. అ. పుం. 1. జాలరి, కైవర్తుఁడు; 2. బుద్ధిమంతుఁడు.

ధీవుఁడు. సం. వి. న్. పుం. 1. శిల్పి; 2. జాలరి; 3. దేవుఁడు. విణ. (న్. వరీ. న్.) ఆలోచన కలవాఁడు; యుక్తిమంతుఁడు.

ధు

ధుంధుమారము. సం. వి. అ. పుం. 1. పట్టుపురుగు; 2. ఆరుద్రపురుగు; 3. కఱదూపము; ఇంటిపొగ.

ధుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలింపఁబడినది; 2. ఎగురఁగొట్టఁబడినది; 3. విడువఁబడినది, త్యక్తము.

ధుత్తూరము. సం. వి. అ. పుం. ఉమ్మెత్త⚘.

ధుని. సం. వి. ఈ. స్త్రీ. నది.

ధున్వత్. సం. శత్ర. 1. కదలుచున్న; 2. కదలించుచున్న.

ధుర. సం. వి. ఆ. స్త్రీ. భారము, బరువు.

ధురంధరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాఁడిని మోయునది; 2. బరువు మోయునది. (ఎద్దు, గుఱ్ఱము మొ.)

ధురంధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కార్యభారము వహించువాఁడు; 2. శ్రేష్ఠుఁడు, అగ్రేసరుఁడు.

ధురీణము. సం. వి. అ. పుం. 1. ఎద్దు, వృషభము; 2. గుఱ్ఱము.

ధురీణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. బరువు మోయువాఁడు; 2. కార్యభారము వహించువాఁడు; 3. అగ్రేసరుఁడు, శ్రేష్ఠుఁడు.

ధుర్యము. సం. వి అ. పుం=ధురీణము. విణ. (అ.ఆ.అ.) వహించునది. "క. సూర్యోదయావసరమున, దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా ధుర్యగతి నడచె..." భార. విరా. ౪, ఆ. 3.

ధుర్యుఁడు. సం=ధురీణుఁడు.

ధువనము. సం. వి. అ. న. కదల్చుట. పుం. అగ్ని. విణ. (అ. ఆ. అ.) కదల్చునది.

ధూ

ధూంక్ష్ణ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లకాకి.

ధూకము. సం. వి. అ. పుం. 1. వాయువు; 2. కాలము; 3. కామిలారోగము.

ధూకళి. దే. వి. నృత్యవిశేషము. "ద్వి. లలియు భ్రామంబు ధూకళియుం ఝుంకళియుం, మఱియుం శేవరుం విభ్రమమును రేఖచూపుచు,నెఱయంగ నీరీతి నృత్యంబు సలుప..." బస. 3, ఆ. ౬౨. పు.

ధూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది, త్యక్తము; 2. అదల్పఁబడినది, భర్త్సితము; 3 వీవనతో విసరఁబడినది; 4. తిరస్కరింపఁబడినది; 5. తర్కింపఁబడినది; 6 కంపితము; వడఁకింపఁ బడినది. "శా. క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప నత్యంతచిం, తాధూతాత్ముఁడ నైననాఁడు .." భార. విరా. ౨, ఆ. ౨౭౫.

ధూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కదల్చుట; 2. వడఁకించుట; 3. వీవనతో విసరుట.

ధూననము. సం. వి. అ. న. కదలించుట, చాలనము. పుం. వాయువు. విణ. (అ. ఆ. అ.) కదలించునది.

ధూనము. సం. విణ. (అ. ఆ. అ.) కంపితము, కదల్పఁ బడినది.

ధూపనము. సం. వి. అ. న. 1. ధూపము వేయుట, పొగవేయుట; 2. సంతాపము కల్గించుట.

ధూపము. సం. వి. అ. పుం. 1. సుగంధిద్రవ్యముల నుండి వచ్చుపొగ; 2. పొగకు సాధన మగుసుగంధిద్రవ్యము. విణ. (అ. ఆ. అ.) 1. పొగవేయునది. 2. సంతాపముకలిగించునది.

ధూపాయితము. సం.=ధూపితము.

ధూపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధూపము వేయఁబడినది; 2. తపింపఁజేయఁబడినది.

ధూమకేతనము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. తోఁకచుక్క.

ధూమకేతువు. సం. వి. ఉ. పుం. ధూమకేతనము.

ధూమధ్వజుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

ధూమము. సం. వి. అ. పుం. 1. పొగ; 2. ఆవిరి; 3. తోఁకచుక్క; 4. అజీర్ణపుత్రేనుపు.

ధూమయోని. సం. వి. ఇ పుం. 1. మబ్బు, మేఘము; 2. తుంగముస్తె ♣.

ధూమలము. సం. వి. అ. పుం. నలుపుకలసినయెఱుపు, పొగవన్నె. విణ. (అ. ఆ. అ.) పొగవన్నె కలది, ధూమ్రము.

ధూమవేధి. సం. వి. న్. పుం. లోహాదులను సువర్ణముగా మార్చుఔషధవిశేషము. "వ...పంచలోహాయుతంబై యొప్పునప్పుడమిఁ జేని కొలఁపు చవిఁ జెం దనచేతిధూమవేధి యనునౌషధంబుచేత శుద్ధసువర్ణంబు గావించి..." భో. ౧, ఆ. ౭౭.

ధూమాంకితము. సం. విణ. (అ. ఆ. అ.) ధూమము కలది.

ధూమి. సం. విణ. (న్. నీ. న్.) ధూమము కలది.

ధూమిక. సం. వి. ఆ. స్త్రీ. పొగమంచు.

ధూమ్యా. సం. వి. ఆ. స్త్రీ. ధూమసమూహము.

ధూమ్యాటము. సం. వి. అ. పుం. కూఁకటిమూఁగపక్షి.

ధూమ్రకము. సం. వి. అ. పుం. లొట్టియ, ఉష్ట్రము.

ధూమ్రపత్త్ర. సం. వి. ఆ. స్త్రీ. పొగాకు ♣.

ధూమ్రము. సం. వి. అ. పుం. 1. పొగవన్నె; 2. కూఁకటిమూఁగపిట్ట. విణ. (అ. ఆ. అ.) పొగవన్నె కలది.

ధూయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదల్పఁ బడుచున్నది; 2. వడఁకింపఁబడుచున్నది.

ధూర్జటి సం. వి. ఇ. పుం. బరువైనజటలు గలవాఁడు-శివుఁడు.

ధూర్తకము. సం. వి. అ. పుం. వంచకము, నక్క.

ధూర్తము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త ♣; 2. చోరకము ♣. న. 1. బిడలవణము; 2. ఇనుపత్రుప్పు.

ధూర్తు. సం.=ధూర్తుఁడు. (వంచకుఁడు, టక్కరి.) "ద్వి. వేవేగ నాలోనివెఱ పెల్ల మాన్పుమని వేఁడుకొనుటయుం నవ్వుటుధూర్తుమనసులో వేఱొక్కమతము చింతించి." ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౨౩ పం.

ధూర్తుఁడు. సం. వి. అ. పుం. 1. వంచకుఁ డైనసాయకుఁడు, శఠుఁడు. (అలం.); 2. శివుఁడు. విణ. (అ. ఆ. అ.) 1. వంచకుఁడు; 2. జూదరి; 3. హింసకుఁడు.

ధూర్వహము. సం.=ధురంధరము.

ధూర్వహుఁడు. సం.=ధురంధరుఁడు.

ధూళి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. దుమ్ము.

ధూళించు. సం. స. క్రి. చిలుకు, స్రవించు. "క. కాళాంజి పూఁత నొకసతి, నాళీకదళాక్షు మ్రోల నన తేనియలన్, ధూళించుపువ్వుగుచ్ఛము, దాలుచునుద్యానదేవతయునుం బోలెన్." సాంబో. ౧, ఆ. ౧౮౧.

ధూళిఁగలపు. మి. స. క్రి. (ధూళిఁగలయు. ధా. ప్రే.) దుమ్ములోఁ గలపు; నశింపఁజేయు. "గీ. దొరతనము నీతినియమంబు ధూళిఁగలపు, నంగనాజనలోలుఁ డైనట్టినరుఁడు." రుక్మా. ౫, ఆ. ౧౪౮.

ధూళిఁగలయు. మి. అ. క్రి. (ధూళిక్ +కలయు.) దుమ్ములోఁగలయు,నశించు. "సీ. ఊరక విరఁబడు మారనారాచంబు దుండగంబునఁ దన్ను ధూళిఁ గల్పెయ." వరాహ. ౪, ఆ. ౨౧.

ధూళిక. సం. వి. ఆ. స్త్రీ. పొగమంచు, కుజ్ఝటి.

ధూళిధ్వజుఁడు. సం. వి. అ. పుం. ధూళి జెండాగా గలవాఁడు -వాయువు, గాలి.

ధూసరము. సం వి. అ. పుం. 1. బూడిదవర్ణము; 2. గాడిద; 3. లొట్టియ; 4. పావురము. విణ. (అ. ఆ. అ.) బూడిదరంగు కలది.

ధూసంతము. సం. విణ. (అ. ఆ. అ.) బూడిదరంగు కలదిగాఁ జేయఁబడినది. "మ ..కృతాంతాకారు నిశ్వాసధూ, మశిఖాధూసరితోగ్రదుర్గతరుగుల్మవ్రాతు హారిద్రవర్ణశరీరున్." భార. అర. ౪, ఆ. ౧౦౫. విరా. ౨, ఆ. ౧౫౬.

ధూసరీభూతము. సం. విణ. (అ. ఆ. అ.) ధూసర వర్ణము కలది అయినది. "సీ. భూరేణుధూసరీ భూతవిగ్రహులఁగా..." భార. ఆర. ౧,ఆ.౨౧౦.

ధూసరుఁడు. సం. వి. అ. పుం. గాండ్లవాఁడు, తెలిక వాఁడు.

## ధృ

ధృతము. సం. వి. అ. న. 1. పతనము, పాటు; 2. ఉనికి, స్థితి; 3. తాల్పుట, ధారణము; 4. గ్రహణము, పట్టుకొనుట. విణ. (అ. ఆ. అ.) 1. ధరింపఁబడినది; 2. పట్టుకొనఁబడినది, గృహీతము.

ధృతరాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. 1. దుర్యోధనాది కౌరవులతండ్రి; 2. సర్పవిశేషము; 3. రాజు; 4. ఒకానొకగంధర్వుఁడు.

ధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తాల్చుట, ధరించుట; 2. గ్రహించుట, పట్టికొనుట; 3. ధైర్యము; 4. స్థిరత్వము; 5. సంతోషము; 6. సుఖము; 7. విష్కంభాదియోగములలో నొకటి. (జ్యోతి.); 8. ఒకానొకఛందస్సు; 9.మాతృకాభేదము.పుం.యజ్ఞము.

ధృత్వుఁడు. సం. వి. న్. పుం. 1. విష్ణువు; 2. బ్రాహ్మణుఁడు. విణ. (న్. నీ. న్.) 1. బుద్ధిమంతుఁడు; 2. ధరించువాఁడు.

ధృవ. సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న చె.

ధృషువు. సం. వి. ఉ. పుం. గుంపు, సంఘాతము. విణ. (ఉ) 1. ప్రగల్భుఁడు, దిట్ట; 2. సమర్థుఁడు, దక్షుఁడు; 3. నేర్పరి, నిపుణుఁడు.

ధృష్ట. సం. వి. ఆ. స్త్రీ. కులట, ఱంకుటాలు.

ధృష్టి. సం. వి. ఇ. స్త్రీ. దిట్టతనము, ధార్ష్ట్యము.

ధృష్టుఁడు. సం. వి. అ. పుం. శృంగారనాయకులలో నొకఁడు, తప్పు చేసియుం జంకనివాఁడును బెదరింపఁబడియు సిగ్గునొందనివాఁడును, చేసినతప్పు ప్రత్యక్షముగా కనఁబడుచున్నను అసత్యమాడువాఁడు నగునాయకుఁడు. (అలం.) విణ. (అ. ఆ. అ.) 1. ప్రగల్భుఁడు, దిట్టతనము గలవాఁడు; 2. సిగ్గులేనివాఁడు; 3. కనికరము లేనివాఁడు, నిర్ఘృణుఁడు; 4. గర్వితుఁడు,అహంకారము గలవాఁడు.

ధృష్ణి. సం. వి. ఇ. పుం. కిరణము.

ధృష్ణువు. సం విణ. (ఉ) 1. ధృష్టుఁడు; 2. కంచుకి.

ధృష్యము. సం.=ధర్షణీయము.

## ధే

ధే. దే. వి. గుఱ్ఱము మొదలగు జంతువులను తోలుట యందలిధ్వని కనుకరణము. "క. నింగికి ధే యని కదలిc,బెం గడువడి గలుగుతనదు సింగము..." కళా. 3, ఆ. ౬౫, జై. ౪, ఆ. ౭౭.

ధేనుక. సం. వి. ఆ. స్త్రీ. 1. లేఁగటియావు; 2. ఆఁడేనుఁగు; 3. పార్వతి.

ధేనుకము. సం. వి. అ. పుం. 1. చీరపేను; 2. రతిబంధవిశేషము.

ధేనువు. సం. వి. ఉ. స్త్రీ. 1. ఆవు; 2. లేఁగటిగూవు.

ధేనుష్య. సం. వి. అ. స్త్రీ. 1. తాకట్టుపెట్టినపాఁడియావు; తాకట్టుపెట్టినపాఁడిబఱ్ఱె (బాదెవడ్డయావు అని కొందఱు. శ. ర.)

## ధై

ధైనుకము. సం వి. అ. న. 1. ధేనుకలసమూహము; 2. రతిబంధవిశేషము. విణ. (అ. ఈ. అ.) ధేనుకాసంబంధమైనది.

ధైర్యము. సం. వి. అ. న. 1. ధీరత్వము; 2. నిర్వికారచిత్తత; 3. గాంభీర్యము; 4. ధృష్టత్వము, అవిధేయత. మేఘ. ౧, స. ౪౦. శ్లో.

ధైవత్యము. సం. వి. అ. న. నేర్పు.

## ధో

ధోరణము. సం. వి. అ. న. 1. ఎక్కఁదగు ఏనుఁగు లోనగు వాహనము; 2 అశ్వాదులగతి.పుం.హంస.

ధోరణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. పంక్తి,పరంపర; 2. రచనాపద్ధతి.

ధోరితము. సం. వి. అ. న. వి. చంపుట, వధము; 2. గతి.

## ధౌ

ధౌతము. సం. వి. అ. న. 1. ప్రక్షాళనము, కడుగుట; 2. శుద్ధిచేయుట; 3. వెండి. విణ. (అ. ఆ. అ.) 1. కడుగఁబడినది, ప్రక్షాళితము; 2. పరిశుద్ధము చేయఁబడినది; 3. తెల్లగాఁ జేయఁబడినది.

ధౌరంధర్యము. సం. వి. అ. న. ధురంధరత్వము. కాశీ. ౫, ఆ. ౧౮౯. నైష. ౬, ఆ. ౭౯.

ధౌరితకము. సం. వి. అ. న. ఆస్కందితముకంటె నధికమై చతురమైనయొకయశ్వధార, అశ్వగతి భేదము.

ధౌరితము. సం.=ధౌరితకము.

ధౌరేయము. సం.=ధురీణము.

ధౌరేయుఁడు. సం.=ధురీణుఁడు.

ధౌర్త్యము. సం. వి. అ. న. వంచన,ధూర్తత్వము.

## ధ్మా

ధ్మాత. సం. విణ. (ఋ. త్రి. ఋ.)=ధ్మాయకుఁడు.

ధ్మాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఊఁదఁబడినది; 2. కాల్పఁబడినది, దగ్ధము; 3. ఉబికినది.

ధ్మాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ). 1. ఊఁదఁదగినది; 2. ఉబికింపఁదగినది.

ధ్మానము. సం. వి. అ. న. 1. ఊఁదుట; 2. ఉబ్బుట; 3. కాల్చుట. భార. ఆది. ౧, ఆ. ౧౧౧.

ధ్మానీయము. సం.=ధ్మాతవ్యము

ధ్మాపనము. సం. వి. అ. న. 1. ఉబికించుట; 2. కాల్పించుట.

ధ్మాపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఊఁదింపఁబడినది; 2. ఉబికింపఁబడినది; 3. కాల్పింపఁబడినది.

ధ్మాయకుఁడు. సం. విణ. (అ. యి కా. అ.) 1. ఊఁదువాఁడు; 2. ఉబికించువాఁడు.

ధ్మాయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఊఁదఁబడుచున్నది; 2. ఉబికింపఁబడుచున్నది.

## ధ్యా

ధ్యాత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. ధ్యానించువాఁడు; 2. చింతించువాఁడు.

ధ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధ్యానింపఁబడినది; 2. చింతింపఁబడినది.

ధ్యాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధ్యానింపఁదగినది; 2. చింతింపఁదగినది.

ధ్యానము. సం. వి. అ. న. 1. పరమాత్మనుచింతించుట, అద్వితీయవస్తువునందు అవిచ్ఛిన్న మగునంతరింద్రియవృత్తిప్రవాహము; 2. చింతించుట, తలపోయుట.

ధ్యానించు. సం. స. క్రి. ధ్యానముచేయు, తలపోయు. "సీ. జనహృదయాకాశమునఁ బికాసముహు నుంచి ధ్యానించి...గీ. వీరహోమంబుఁ గావించె విస్మయముగ." ఉ. రా. ౬, ఆ. ౧౬౭.

ధ్యానికము సం. విణ. (అ. ఈ. అ.) ధ్యానముచేఁ గలుగునది. స్వా. ౬, ఆ. ౮౬.

ధ్యానీయము. సం.=ధ్యాతవ్యము.

ధ్యామము. సం. వి. అ. న. 1. దవనము*; 2. కామంచిగడ్డి *.

ధ్యాయకుఁడు. సం. విణ. (అ. యికా. అ.)=ధ్యాత.

ధ్యాయత్. సం. శత్రు. ధ్యానించుచున్న.

ధ్యాయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్యానింపఁబడుచున్నది.

ధ్యాయి. సం. విణ. (న్. నీ. న్.) ధ్యానముచేయువాఁడు. "మాలిని. త్వరితవిహిత గాఢధ్యాయి సమ్మోదవాదా." భార. అను. ౪, ఆ. ౪౫౧ "ఉ...విష్ణుస్వరూపాయ నమశ్శివాయ యని పల్కెఁడుభక్తజనంబు వైదికధ్యాయిత కిచ్చు మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్." భార. విరా. ౧, ఆ. ౧. (ధ్యాయిత=ధ్యానము.)

## ధ్యే

ధ్యేయము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్యానింపఁదగినది. భార. సభా. ౧, ఆ. ౧౦౬.

## ధ్రి

ధ్రియమాణము. సం. విణ. (అ. ఆ. అ) 1. ధరింపఁబడుచున్నది; 2. ధరించుచున్నది.

## ధ్రు

ధ్రువ. సం. వి. ఆ. స్త్రీ. 1. గీతివిశేషము; 2. స్రుగ్భేదము, యజ్ఞపాత్రభేదము; 3. గుఱ్ఱపుసుడి; 4. గుఱ్ఱపుసుడి యుండుచోటు; 5. మంచియాఁడుది, సాధ్వి; 6. ముయ్యాకుపొన్న*.

ధ్రువము. సం. వి. అ. పుం. 1. ధ్రువనక్షత్రము; 2. విష్కంభాదియోగములలో నొకటి. (జ్యోతి); 3. మ్రోడు; 4. గసిక; 5. తాళవిశేషము; 6. బాతు, శరారి; 7. మఱ్ఱి*; 8. ఒకతకపుగుఱ్ఱపు

సుడి; 9. యజ్ఞపాత్రభేదము. న. 1. ఆకాశము; 2. తర్కము; 3. నిశ్చయము.

ధ్రువుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. అష్టవసువులలో నొకఁడు; 5. ఉత్తానపాదునికొడుకు.

## ధ్వ

ధ్వంసకుఁడు. సం. విణ. (అ. సీ. అ.) 1 ధ్వంసమగువాఁడు, నశించువాఁడు; 2. భ్రష్టుఁడు; 3. ధ్వంసము చేయువాఁడు.

ధ్వంసనము. సం. వి. అ. న. 1. నాశము; 2. నశింపఁజేయుట; 3. భ్రంశము.

ధ్వంసనీయము. సం. = ధ్వంసయితవ్యము.

ధ్వంసమానము. సం. విణ. (అ. ఆ. అ.) నశించుచున్నది.

ధ్వంసము. సం. వి. అ. పుం. 1. నాశము; 2. భ్రంశము. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయునది.

ధ్వంసయత్. సం. శత్రు. ధ్వంసము చేయుచున్న.

ధ్వంసయమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయుచున్నది.

ధ్వంసయితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నశింపఁజేయువాఁడు.

ధ్వంసయితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయఁదగినది.

ధ్వంసితృ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. నశించువాఁడు; 2. భ్రంశమునొందువాఁడు.

ధ్వంసితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. భ్రంశము చేయఁబడినది; 2. నశింపఁజేయఁబడినది.

ధ్వంస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్వంసము చేయఁబడుచున్నది.

ధ్వంస్యము. సం. = ధ్వంసయితవ్యము.

ధ్వజము. సం. వి. అ. పుం. న. 1. టెక్కెము, పతాక; 2. ధ్వజస్తంభము; 3. గుఱుతు, చిహ్నము; 4. గర్వము; 5. మంచముకోడు, ఖట్వాంగము; 6. మగగుఱి. పుం. 1. చెట్టు; 2. తాడిచెట్టు.

ధ్వజి. సం. వి. న్. పుం. 1. తేరు, రథము; 2. కొండ; 3. పాము; 4. నెమిలి; 5. గుఱ్ఱము; 6. బ్రాహ్మణుఁడు. విణ. (న్. నీ. న్.) 1. జెండా పట్టుకొని పోవువాఁడు; 2. గుఱుతు కలవాఁడు.

ధ్వజిని. సం. వి. ఈ. స్త్రీ. 1. సేన; 2. సేనాభేదము.

ధ్వజుఁడు. సం. వి. అ. పుం. కల్లు అమ్మెడివాఁడు, శౌండికుఁడు.

ధ్వనత్. సం. శత్రు. ధ్వనిచేయుచున్న.

ధ్వననము. సం. వి. అ. న. 1. ధ్వనిచేయుట; 2. వ్యంగ్యము. (అలం.); 3. అవ్యక్తధ్వని.

ధ్వనము. సం. వి. అ. పుం. 1. శబ్దము; 2. అవ్యక్తధ్వని.

ధ్వని సం. వి. ఇ. పుం. 1. శబ్దము, చప్పుడు; 2. వ్యంజనావృత్తితో తోఁచెడియర్థము; 3. వ్యంగ్యప్రధానకావ్యము. (అలం.)

ధ్వనించు. సం. అ. క్రి. శబ్దించు, మ్రోయు. (శ.ర.)

ధ్వనితము. సం. వి. అ. న. 1. శబ్దము; 2. మేఘగర్జనము, ఉఱుము. విణ. (అ. ఆ. అ.) 1. మ్రోసినది, ధ్వనిచేసినది; 2. వ్యంజితము, సూచితము. (అలం.)

ధ్వన్యమానము. సం. విణ. (అ. ఆ అ.) ధ్వనిచే తెలుపఁబడుచున్నది, సూచితము.

ధ్వస్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నాశము నొందినది; 2. భ్రంశము నొందినది.

ధ్వస్తి. సం. వి. ఇ. స్త్రీ. = ధ్వంసము.

## ధ్వా

ధ్వాంక్షము, సం. వి. అ. పుం. 1. కాకి; 2. కొంగ, బకము.

ధ్వాంక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1 అఁడుకాకి; 2. కారుకొల్లి.

ధ్వాంక్షుఁడు సం. వి. అ పుం. 1. భిక్షుకుఁడు; 2. వడ్రంగి, తక్షకుఁడు.

ధ్వాంతము సం. వి. అ న. చీఁకటి, అంధకారము.

ధ్వానము. సం. వి. అ. పుం. ధ్వని.

## న

న. ఉ. భ. ఒకయక్షరము. దే. అవ్య. 1. ఉదంతములకును ఋకారాంతములకును ఏకత్వమున కు కైకయి ప్రత్యయములు పరమగునపు డుఁగాగమముగా వచ్చును. "క. నీవిజయోత్సాహమునకు..." భార. ఆది. ౭, ఆ. ౧౦౭. "చ...విధాత్రునకైనను నేరఁబోలునే." భార. ఆది. ౧, ఆ. ౧౯. "చ...అట్టికర్ణునకయి నీకు నేటికి మనోవ్యథ..." భార. శాం. ౧, ఆ. ౩౮; 2. కంటె అను వర్ణకములు ద్వితీయైకవచనమును పరమగునపుడు ఉదంతజడవాచకములకు ఆగమముగా వచ్చును. "చ...తక్రతుశతంబునకంటె సుతుండు మేలు..." భార. ఆది. ౪, ఆ. ౯౩. "చ. అనఘ గృహస్థధర్మమునయందు..." భార. అను. ౧,

౪౩. "మ. అనురాగంబునఁ బొందుచుండె నొకఁ డేకాంతప్రదేశంబునన్." దశ. ౧౦, ఆ. ౧౦; 3. షష్ఠీసప్తమీతత్పురుషములయందు ఉదంతజడ వాచకములకు వచ్చు ఆగమము. "చ ... తామ రసాకరంబునవిధంబున ..." భార. అర. ౬, ఆ. ౫౯. "క ... భిన్నకుంభమునఁగోయము లట్టు ల యథువంబు లగు .." భార. ఆది. ౭, ఆ. ౧౭౪; 4. గుణవాచకములగు నల్ల ఎఱ్ఱ మున్నగు శబ్దములకు భావార్థమున వచ్చుతద్ధితప్రత్యయము. ఉదా:—నల్లన, ఎఱ్ఱన. మొ; 5. కొన్నిధాతువులమీఁదవచ్చుకృత్ప్రత్యయము. ఉదా:-గడన, దట్టన మొ; 6. భూతకాలక్రియకు విశేషణవివక్షయందు వచ్చుప్రత్యయము. ఇది పరమగునపుడు తుదియుకారమున కికార మాదేశ మగును. "ఉ. పంచినకోపమున్ ..." భార. విరా. ౨, ఆ. ౮౩౯. ప్ర. ద్రు. 1. ఉదంతజడవాచకములకు వచ్చు సప్తమీవిభక్త్యేకవచనము. "చ ... అన్యులకా, మనమున నేనియుం దలఁప ..." భార. ఆది. ౪, ఆ ౧౩౭; 2. ఉదంతజడవాచకములకు వచ్చుతృతీయైకవచనము. (ఒక్కొక్కచో అజడవాచకమునకును గానఁబడుచున్నది.) "సీ. గమనవేగంబున ద్రుమలతాజాలసంచాలన సేయుచు ..." భార. అర. 3, ఆ. ౩౧౭. "ఉ. వీపున గిట్టె యేనుఁగున నేనుఁగు వైచుచు ..." భా. రా. యుం ౯౨౦; క్రియలకు చేదాద్యర్థమందు వచ్చును. (ఇది పరమగునపుడు తుదియుకారమున కికార మాదేశముగా వచ్చును.) "చ. తెగమొదలెత్తిపోవఁ బగఁ దీర్పఁగ వచ్చినఁ గ్రొర్వ్య మొందు .." భార. ఉద్యో. 3, ఆ. ౨౧; 4. క్రియావిశేషణత్వవివక్షయందు కొన్నియెడల నుదంతములకను ప్రయుక్త మగును. "వ ... కుంతిని బ్రియపూర్వకంబున సంభావించి ..." భార. ఆది. ౫, ఆ. ౧౫౭. సం. వి. అ. పుం. 1. మార్తికము; 2. విఘ్నేశ్వరుఁడు; 3. ధనము; 4 బంధము; 5. యుద్ధము; 6. బుద్ధుఁడు విశ. (అ. ఆ. అ.) 1. పలుచనిది; 2. శూన్యము. అవ్య. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) 1. భిన్నము, వేఱైనది. ఉదా:—నాత్యుష్ణము, నాతికఠినము మొ; 2. అభావము, లేమి. "శా ... రాజ్యము గిజ్యముగా సతతమే కాయంబు నాపాయమే." భాగ. ౮, స్కం. ౫౮౨.

నంకు. దే. స. క్రి. నేలను కోరాడు. (శ. ర.)

నంగ. = నంగనాచి. (శ. ర.)

నంగనాచి. దే. వి. వర్లచిలుక. విశ. సాహసకృత్యము లొనరించియు పైకేమియుఁ దెలియనిదానివలె నటించువాఁడుది. "చ ... నిక్కము గాఁగను నాతఁ డేమియుగా, దెలియఁడు పాదుబిడ్డఁ డని నేరుపుమాటలఁ దేలనాడి గా,దిలిసుతుచేతఁ జక్కులు దిద్దెద నెంతటినంగనాచివే." సా. 3, ఆ. ౫౫. స్వా. 3, ఆ. ౨౮.

నంగి. దే. విశ. 1. ముక్కుతో పలుకఁబడునది. (మాట. శ. ర.); 2. అస్పష్టము. (మాట.) వ్యవ:- నంగినంగిమాటలుపలుకకుము.

నంగు. దే. అ. క్రి. ముక్కుతో మాటలాడు. (శ.ర.)

నంచు = నంజు. (చూ. నంచుకొను.)

నంచుకొను = నంజికొను. (నంచు+కొను.) (కూరలు లోనగువ్యంజనములు తిను.) "గీ. జంగరసకుంభి తార్ద్రికశకలములును, సర్షపామ్రాదికోపదంశక శతంబు,నంచుకొంచు నొకించుక దించఁ బోక, లోపలికిఁ దించె దాపసద్వీపిచయము." బహు. ౪ ఆ. ౫౦.

నంజి. దే. వి. 1. మాగాణిభూమి. (శ. ర బ్రౌ.); 2. (నంజుధా.) నంజుకొనువస్తువు, ఉపదంశము. "వ .. కెంజిగురాకుమోవినంజలం జవిగొనుచుఁ గ్రోలి సోలి .." పారి. ౨, ఆ. ౫౨. దశ. ౧౦, ఆ. ౧౮.

నంజికొను. దే. స. క్రి. (నంజు+కొను.) 1. కూరలు లోనగువ్యంజనములుతిను; ఆస్వాదించు. "ఉ ... గుజ్జువెన్నెలల నంజికొన నచ్చికలఁ బుజ్జగింపుచుఁ గూరిమిమీఱఁ జేరి ..." ఘటికా. ౨, ఆ. ౧౪౬; 2. తిను, భుజించు. "వ. బాహ్లీకదేశమునవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు చేసి ..." భార. కర్ణ. ౨, ఆ. ౧౦౯.

నంజిలి. దే. వి. సంకోచము. (చూ. నంజిలిపడు.)

నంజిలిపడు. ద్వి. అ. క్రి. (నంజిలి+పడు.) సంకోచించు, వెనుదీయు. "క. రంజిలి తామును మున్నుగ, నంజిలిపడ కిచ్చె నేని నయముగ వారుం, గొంజక యిత్తురు ..." కుచేల. ౧, ఆ. ౧౦౮.

నంజు. దే. అ. క్రి. భక్షించు; నంచుకొను. "సీ. కార్తెఁ బాయస మబ్జగర్భునితార మాషములు మాంసంబు నంజంగఁ గలుగు, నన్నంబు..." భార. అను. ౨, ఆ. ౩౭౮. భాగ. ౧౦. స్కం. ఉ. ౮౮౩. వి. 1. కూర, పచ్చడి మొదలగువ్యంజనము. "ఉ... నాలుగునైదునంజులుఁ, లప్పలతోడఁ గ్రొంబెరుఁగు లక్షణవజ్జలయింట తూకకున్." క్రీడా. ౧౬౭; 2. విషము. "ఉ. నాలుకబంతి వ్రేలఁబడి నంజునఁ దోఁగి..." స్వా. ౫, ఆ. ౫౦.

నంజుకొను = నంజికొను. (కూర లోనగువ్యంజనములను తిను; ఆస్వాదించు.) "ఉ. వెన్నెలగుజ్జు నంజుకొని వెన్నెలప్రోవు భుజించి...చకోరదంపతుల్..." కాశీ. ౪, ఆ. ౯౩. కళా. ౬, ఆ. ౧౨౭.

నంజుడు. దే. వి. (నంజుధా.) 1. మాంసము. "క. శతవర్ష దుష్కరతపస్కృతి నంజుడు దినమి నగు సుకృతము..." భార. అను. ౪, ఆ. ౨౯౯. భో. ౩, ఆ. ౨౦౩.

నంజుడుదిండి. దే. వి. (నంజుడు+తిండి.) రాక్షసుఁడు. "క. కడయెుడయలఁ దఱిమెడునంజుడు దిండులు మిమ్ము మనుపఁ జూతురె..." అచ్చ. సుం. ౧౫౫. విశే. మాంసము తినువాఁడు. (శ. ర.) ఇట్లే:-నంజుడుమేపరి అచ్చ. యు. ౩౭౨.

నంటు. దే. వి. 1. స్నేహము. "గీ. తొలుదొలుతఁ గృష్ణవర్త్మకుఁ గళ యొసంగి,నంటు గావించు టెల్ల ననాథయువతి, జనతనూదాహసాహాయ్యమునకుఁ గాక, కానవా వారి నెవ్వారిఁ గమలవైరి." వసు. ౪, ఆ. ౩౬. ఉ. హరిశ్చ. ౪, ఆ. ౪౫; 2. సంపర్కము, సంబంధము. "సీ. రేలెల్ల నమృతమరీచినంటున నంటఁగరఁగి నిర్మలపయోర్ఘురులఁ దొరఁగి." వసు. ౨, ఆ. ౨౧; 3. శ్రద్ధ. "గీ. కడునొయారంబులైన సీనడలకరణి, నడువఁగ నేఱుంగ వంచు నో నంటుతోడ, నంచబోదల నడిపించి పెంచ వేల." సా. ౨, ఆ. ౨౦౦; 4. బంధువు; ప్రియుఁడు. "మ. తొవకుందూరపు నంటు రేమగువ పొందుం బూర్వపక్షంబు..." వసు. ౪, ఆ. ౧౨౯. శకాం. పీఠి. ౩౩.

నంటుకత్తె. దే. విశే. (నంటు+కత్తె.) ప్రియురాలు. "శ్రీ. నంట్లుకత్తెలు తమపక్షునంబు సమ్మతించ కాడినపగఁ జెప్పుకొంచు మించి,యుత్కళపునల్ల మందులయెుంటికాండ్రు." కువల. ౨, ఆ. ౧౧౪.

నంటుకాఁడు. దే.విశే.(నంటు+కాఁడు.) ప్రియుఁడు, వలపుకాఁడు. "చ. అటువలె నంటుకాఁడు చనినంత నెలంత దురంతచింతచేఁ, బోటపాట బావ్రముల్ దొరుఁగఁ బొక్కుచు..." శకాం. ౪, ఆ. ౨౭ శుక. ౩, ఆ. ౨౩.

నంత. సం. విశే. (బు. త్రీ. బు.) 1. నమస్కరించువాఁడు; 2 వంగువాఁడు

నంతవ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁదగినవాఁడు; 2. పూజింపఁదగినవాఁడు.

నంద. సం. వి. ఆ. స్త్రీ. 1. మృణ్మయపాత్రము, ముంత; 2. సంపద, కలిమి. 3. మగనిసోదరి, ఆఁడుబిడ్డ; 4. ఆనందము; 5. తిథివిశేషము, ప్రాడ్యమి, షష్ఠి, ఏకాదశి అనుతిథులలో ఏదో యొకటి; 6. దుర్గామూర్తిభేదము.

నందకము. సం. వి. అ. పుం 1. విష్ణుఖడ్గము; 2. కత్తి; 3. కప్ప; 4. ఆనందము. విశే. (అ. దికా. అ.) 1. సంతోషించునది; 2. సంతోషపెట్టునది.

నందన. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు. అ. పుం. ఒక సంవత్సరము.

నందనము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. యజ్ఞసాధనవిశేషము. న. 1. ఇంద్రునియుద్యానవనము; 2. ఉద్యానవనము; 3. సంతోషించుట; ఆనందము. విశే (అ. ఆ. అ.) 1. సంతోషించునది; 2. సంతోషపెట్టునది; 3. (అ. ఈ. ఆ.) సంతోషమునకు సాధనమైనది.

నందనుఁడు. సం. వి. అ. పుం. కుమారుఁడు కొడుకు.

నందము. సం. వి. అ. పు 1. హర్షము, సంతోషము; 2. కప్ప; 3. కుబేరునినవనిధులలో నొకటి.

నంది. సం. వి. న్. పుం. 1. కుమారుఁడు, కొడుకు; 2. నందికేశ్వరుఁడు; 3. శివునివృషభము; 4. మఱ్ఱిచెట్టు; 5. కలుజువ్విచెట్టు. ఇ. పుం. స్త్రీ. ఆనందము. పుం. నందికేశ్వరుఁడు. విశే (న్. నీ. న్.) 1. ఆనందించువాఁడు; 2. ఆనందింపఁజేయువాఁడు.

నందించు. సం. అ. క్రి. 1. సంతోషించు, ఆనందించు. "క. అందఱు హరిదెసఁ బ్రణయస్యందిమనోజ్ఞులును లబ్ధనంతానలునై, నందించిరి..." హరి. ఉ. ౪, ఆ. ౨౫౫. భా. రా. కిష్కిం. ౨౮౩. స. క్రి. 1. స్తుతించు, పొగడు. "క.

వందిజనంబులు లోకము,లందును బరిశిష్టకర్మ లగు భూపతులకా, నందించుట వశ్యంబై,నం దగదు నుతింప శిశుజనంబులపగిదిన్." భాగ. ౪, స్కం ౪౪౮, ౪౫౨; 2. కటాక్షించు, కరుణించు. "గీ. ఒడయఁడిప్పుడు నందించియో తలంప. నర్థి నిందించియో మత్కృతైకదండ,మునకు సంకోచమందియో యనుచు సంశయాత్ము లగుచు వివేకించి యంతలోన."భాగ. 3, స్కం. ౫౬౭.

నందిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇంద్రుని కేళీవనము; 2. ముంత; 3 మగనిసోదరి, ఆఁడుబిడ్డ; 4. తిథివిశేషము, నంద.

నందికుఁడు. సం. వి. అ. పుం. శివపార్శ్వచరుఁ డగు సేవకుఁడు, నంది.

నందిని. సం. వి. ఈ. స్త్రీ. 1. కూఁతురు; 2. ఆఁడుబిడ్డ, మగనిసోదరి; 3. కామధేనువుకూఁతురు; 4. గంగ; 5. దుర్గ; 6. కరకవీ; 7. ఏలకివీ.

నందివర్ధనము. సం. వి. అ. పుం. 1. పక్షాంతము (అమావాస్య లేక పూర్ణిమ.); 2. స్వర్గము; 3 ఒకానొకపూలచెట్టు. (దీనిపూవులు శివప్రీతికరములు.) "సీ. బొండుమల్లె లశోకములు మంకెనలు నందివర్ధనములు విరవాదివిరులు." ఉ. రా. 3, ఆ. ౨౦౧. సానందో. 3, ఆ. ౫౬

నందివృక్షము. సం. వి. అ. పుం వృక్షవిశేషము.

నందివాహనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

నందుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు, పరమాత్మ; 2. కృష్ణునిపెంచినతండ్రి.

నంద్యావర్తము. సం. వి. అ పుం. న. నందివర్ధనమువీ.

నంబరు. ఆం. వి. సంఖ్య.

నంబి. దే. వి. 1. వైఖానసుఁడు, వైఖానససూత్రానుసారముగ విష్ణ్వాలయమునఁ బూజసేయువాఁడు. "ఆ. పద్మనయనుఁ దతనిపయనంబుఁ దూఁగింపు, మనుచు నంబితోడ నానతిచ్చె." ఆము. ౨, ఆ ౭౪. ద్వి. పరమ. ౭, ఆ ౫౩౪. పు; 2. శివార్చకుఁడు, దేవలుఁడు. "గీ. తమ్మలి యనఁ,దంబళి యనఁగఁ నంబి నాఁ దనరుచుండు, దేవలుని పేరు..." ఆం. భా. ద్వి ౨౭౪. శుక. 3, ఆ. ౪౪౨; 3. దైవభక్తుఁడు. "ఉ. నంబి శివార్థము న్మనసునమ్మిక శంక యొకింతయేని చిత్తంబున యందు లేక వనితామణియూరువు దాపుఁజేసి తీక్ష్ణంబగుకత్తి మోపు .."హర. ౨, ఆ. ౧౧౭;

4. భగవంతుఁడు. "చ. ఇతరులు నీకు నీడె... గురుంగుడినంబికృపావలంబికిన్."ఆము.౬,ఆ.౪౯.

నంబెరుమాళ్లు. దే. వి. బ (నంబి+పెరుమాళ్లు.) శ్రీరంగనాయకులు. "ఉ. నంబెరుమాళ్లు చిత్తమొకనాఁడు ప్రసన్నతఁ జేసి..." చమ. ౧,ఆ. ౧3.

నకనక. దే. వి. 1. ఆఁకలితో నున్నపుడు కడుపులోఁ గలుగుబాధ కనుకరణము. (చూ. నకనకఁబడు.); 2. కృశత్వము, కార్శ్యము. "వ...ఇప్పుడూ మొగ్గలం బోనిబుగ్గలం దగ్గలిక సూపుకమ్మపంజుల వజ్రపుంజకచకలనకనకలు వీడుకొని..." స్వా. 3, ఆ. ౨౦; 3. బడలిక, అలయిక. "గీ. ఉదర గతపద్మనాభతల్పోరగేంద్ర, జనితఫూత్కృతియ లోనాఁగ నిమడించె, నొడలియలసత నకనక లొదవఁ బొదలు, బెట్టునిట్టూర్పు లాచంద్రబింబ ముఖికి." రామా. 3, ఆ. ౯. అ. ౭౮. 1. సన్ననిది కృశము. "సీ. ఒకవిలాసిని నకనకనై నకొను గంపింపంగ నంటె నంపెంగనూనె." వరాహ. ౪, ఆ. ౧౨౪. కవిక. ౬, ఆ. ౦౪; 2. కలఁతనొందినది, క్షుబ్ధము. "క. ఒకమొగము గాక దివిజులు, తికమకగొని వైరులెల్ల దీకొనఁ దమ్ముం,బికపికలై నకనకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్." భాగ. ౬, స్కం. ౨౫౭; 3. అలసినది, బడలినది. "వ . పువ్వుల రువ్వుచుఁ గ్రొవ్వుల నవ్వుచు వికవిక నగుచు నకనక నగుచుఁ దలతల మనుచుఁ గొలకొల మనుచు ..విహరించిరి..." రా. వి 3, ఆ. ౧౧౪; 4. మందము. "సీ. నక నకలైనకన్నుడల యొక్కులతాంగి చొక్కపుఁ జెంగల్వసురటి విసరె." ప్రబోధ. ౫, ఆ. ౫౯.

నకనకఁబడు. ద్వ. అ. క్రి (నకనక+పడు.) ఆఁకలిచే బాధనొందు, కృశించు. "క. ఇక్కపదుపు పెను కరుక్, జడిసెఁ గబళింప నొల్లక, కడుపులు నకనకఁబడంగఁ గొరవముఖ్యా." భార. శాం. 3, ఆ. ౫౦౨. ఆము. ౬, ఆ. ౫౨.

నకనకలాడు. దే. అ. క్రి. (నకనకలు+ఆడు.) 1. ఆకలిచే బాధపడు వ్యవ:-పిల్లికడుపు నకనకలాడుచున్నది. (శ.ర.); 2.కృశమగు."ద్వి. నకనకలాడు చెన్నడు ముప్పై బికిలి,పికిలిపూదండ తుంపెసలాడు చుండ." ఆ. మ. క. ౧, ఆ. ౪౩. పు.

నకనకలుగుడుచు. దే. అ. క్రి. (నకనకలు+గుడుచు.) అలయు. "సీ. నడుము లేదీనియ నకనకల్ గుడువ

నిం;పునఁ దగుమోపులు మోసి మోసి." కళా. ౪, ఆ. ౧౬. [(వ్యతి-అసలు, మాతృక.)

నకలు. హిం. వి. ఒకదానిని చూచి వ్రాసినది, ప్రతిక.

నకాసి. దే. విణ. (హిం. నకాశీ.) నకిషీపని చేసినది. "చ. నకి నెలపట్టిమంచమునఁ జాయనకాసిలివాసిపై ..."హంస. ౧, ఆ. ౬౫.

నకిషీ. దే. వి. హిం. (నకాశీ.) చెక్కడపుఁబని. "చ...వింతనకిషీ గలమంచము మించుమంచిచెం, గలువలపాన్పుపై నృపశిఖామణి నందనుఁ డుండు నంతటన్." ఇందు. ౬, ఆ. ౧౨౬.

నకీబు. దే. వి. వేత్రధరుఁడు, చోపుదారుఁడు. "వ. ఇట్లతివైభవంబున సకలరాజాధిరాజులు నదురుగైకొని భేటికి వచ్చునెడ నతనినగరివాకిలి నీవు ముందు నేను ముం దని చొరవసేయం బోయి యచ్చటినకీబులు మహాలుదార్లచే నిలువరింపఁబడి వెలవెలఁ బోయి..."ఆనంద. పీఠి. ౧౧౫, ౧౧౬. వరాహ. ౧౦, ఆ. ౫.

నకులము. సం. వి. అ. పుం. ముంగి.

నకులి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుముంగి; 2. కోడి పెట్ట; 3. కుంకుమపువ్వు.

నకులుఁడు. సం. వి. అ. పుం. 1. పాండవులలో నాలవవాఁడు; 2. కొడుకు; 3. శివుఁడు.

నక్క. దే. వి జంబుకము. "సీ. నుడిగాడ్పు తేరి నల్చట్టఁ జుట్టలువెట్టెఁ గడిఁదిమాటలు వెళ్లఁ గ్రక్కె నక్క." ఉ. రా ౬, ఆ. ౨౩౫. భీమ. ౪, ఆ. ౩౩. విణ. చిన్నది, క్షుద్రము. (చూ. నక్కదోస.)

నక్కకొమ్ము. దే వి. (నక్క+కొమ్ము.) వనమూలికా విశేషము. "ఆ. ఒక్కయొఱుకుఁడేఁడు నక్క కొమ్ము నిల్జి,గోరజంబు జున్నుఁ జాఱపప్పు... శాను కిచ్చి కరయుగంబు మొగిచి." స్వా ౪, ఆ. ౧౪. [(బ్రా.)

నక్కజిత్తులు. దే. వి. (నక్క+జిత్తులు.) మోసములు.

నక్కతోఁక. దే. వి (నక్క+తోఁక.) తృణవిశేషము. 'చ. గునుకును సొంటి చిప్పరయుం గోఁగడ యూదర నక్కతోఁకయుఁన్" ప్రబంధ. ౨౦౦. హంస. ౫, ఆ. ౪౪.

నక్కతోఁకపొన్న. దే. వి. నేలపొన్న. "సీ .. నేలపొన్న, నా నక్కతోఁకపొ న్నన...రూఢి కెక్కు." ఆం. భా. ద్వి. ౫౫.

నక్కతోఁకబియ్యము. దే. వి. ధాన్యవిశేషము. (శ.ర.)

నక్కదోస. దే. వి. (నక్క+దోస.) చిన్నదోస, క్షుద్రోర్వారుకము. "ఆ...పుచ్చ,కాయ నక్క దోసకాయ వట్రువసొర,కాయ గాదు శ్రాద్ధకర్మములకు."వి. పు. ౪,ఆ. ౨౭౪. ఆం.భా. ద్వి.౭౧.

నక్కనరము. దే. వి. ఒకదినుసువేరు. (శ. ర.)

నక్కనేరెడు. దే. వి. (నక్క+నేరెడు.) కాకి నేరెడు. (శ. ర.)

నక్కమోరు. దే. వి. (నక్క+మోరు.) కుదురని కంతి. "సీ. మందుమాఁ కిది గండమాల మాన్పఁ గలండె చక్కఁజేయఁ గలండె నక్కమోరు." రామలిం. శ. ౭౩.

నక్కరేను. దే. వి. (నక్క+రేను.) గజనిమ్మల కుచము. "గీ...లకుచాఖ్య కమ్మరే ననఁగనక్క, రే ననఁగ వెలయును .." ఆం. భా. ద్వి. ౪౫.

నక్కవిరిగి. దే. వి. (నక్క+విరిగి.) క్షుద్రశేలువు. "సీ. క్షుద్రశేల్వాఖ్య యగును నక్కవిరిగి నా ..." ఆం. భా. ద్వి. ౪౫.

నక్కిళ్లు. దే. వి. బ. (నక్కు+కిళ్లు - శ. ర.) అంకిళ్లు, దౌడకీళ్లు. (చూ. నక్కిళ్లుపడు.)

నక్కిళ్లుపడు. ద్వ. అ. క్రి. (నక్కిళ్లు+పడు.) దౌడ కీళ్లుకదలకుండు, నిరుత్తరుఁడగు "సీ....ధరణీశరాజులో ధరణిసురులో. ఆ. యెక్కు డనిన వినియుం నక్కిళ్లుపడియున్న, నతనితోడ..."భార. అను ౫, ఆ. ౩౪౫. బస. ౬, ఆ. ౯౭౫. పం.

నక్కు. దే. అ. క్రి. ఒదుగు, దాఁగు. "ఉ. నాలితనంబు నేర్చుకొని నక్కుచు నక్కుచు వాడవాడ వ్రేలాలవలీలతావలికెలంకులనుం డిటు వచ్చి వచ్చి దం,భోళియుఁ బోలె మీఁదఁ బడిపోయెడు ..."రామా. ౭, ఆ. ౪౭. వి. 1. ప్రానియతుకు. ఉదా:—ఇది నక్కుదూలము. (శ. ర.); 2. బంగారు నఱకఁగా నడుమ కనుపట్టెడినిగ్గు. "ఆ. నక్కుటెక్కుఁ జెక్కు నాఁటుకచెక్కులు, మించు సంచు మించుమెలఁతమేను." చంద్రా. ౪, ఆ. ౬౪౫. బస. ౪, ఆ. ౩౫౪. పం; 3. (బంగారు) తునుక, ఖాడము. "ద్వి. వేడుక మదిఁ దులకాడ వేయేసి, మాడలయొత్తుగాఁ గూడ ఖండించి, యున్నజంగమకోటి కొక్కొక్కనక్కు,చెన్నుగా నర్పణచేసి మ్రొక్కుడును." బస. ౫, ఆ. ౩౯౩. నరస. ౫, ఆ. ౧౧౩; 4. నాఁగటికఱ్ఱు. (శ.ర.)

నక్కెర. దే. వి. కంది, తొగరిచె. (శ. ర.)

నక్కెఱు. దే. వి. (నక్క+ఏఱు.) వృక్షవిశేషము. (శ. ర.)

నక్తంచరము. సం. వి. అ. పుం. గ్రుడ్లగూబ. విణ. (అ. ఈ. అ.) రాత్రియందు తిరుగునది.

నక్తంచరుఁడు. సం. వి. అ. పుం. 1. రేద్రిమ్మరి, రాక్షసుఁడు; 2. దొంగ.

నక్తంచారి. సం. వి. న్. పుం. = నక్తచారి.

నక్తందివములు. సం. అవ్య. బ. రేయుంబవళ్లు. "దండకము...సురూపప్రశస్తుల్ మహాశక్తి నక్తందివంబుల్ ప్రవేశించియున్నారు...." భోగినీదండకము.

నక్తకము. సం. వి. అ. పుం. 1. చినిఁగినబట్ట; 2. తుండుగుడ్డ; 3. నల్లగ్రుడ్లగూబ.

నక్తచారి. సం. వి. న్. పుం. 1. గ్రుడ్లగూబ; 2. పిల్లి; 3. రాక్షసుఁడు; 4. దొంగ. విణ. (న్. ణీ. న్.) రాత్రి తిరుగువాఁడు.

నక్తమాలము. సం. వి. అ. పుం. కానుగుచె.

నక్తము. సం. వి. అ. న. 1. రాత్రి. "గీ. సోమవారవ్రతం బతిశుభద మగుచు, నొనరు నుపవాసయుక్తుఁ డౌనసఘమతికి, నక్తము ననేకభుక్తి యొనర్చెనేని, శివుఁడు సుప్రీతుఁ డగు నిజం బవనినాథ." శేష. ౬, ఆ. (శ. ర.); 2. రాత్రిమాత్రము భోజనముచేయువ్రతము. "సీ. భాను వారంబునఁ బ్రారంభ మొనరించి క్రమమున భాను వారంబు లేడు, నక్తంబు నియతితో నడపి యేడవ వారమున యథాశక్తి జాంబూనదమున, రవిఁ జేసి రక్తవస్త్రద్వయంబును జుట్టి..." వరాహా. ౧౨, ఆ. ౫౫.

నక్రము. సం. వి. అ. పుం. భూమిపైఁ జరింపనిది. 1. మొసలి, కుంభీరము; 2. మకరరాశి. న. 1. ద్వారబంధమునకుఁ బైనుండుఅడ్డకమ్మి; 2. ముక్కు, నాసిక.

నక్షత్రపంక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఇరువదియేడు ముత్యములు గ్రుచ్చినయొంటిపేటహారము; 2. ఇరువదియేడుపద్యములతో నేర్పఱచినక్షుద్రప్రబంధవిశేషము. "సీ...నక్షత్రపంక్తి యిరువదియేడు..." అప్ప. ౧, ఆ. ౧౩౪.

నక్షత్రమాల. సం. వి. ఆ. స్త్రీ. = నక్షత్రపంక్తి.

నక్షత్రము. సం. వి. అ. న. నశింపనిది. అశ్విని మొ. రిక్క. (ఇవి యిరువదియేడు. అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి. అభిజిత్తు అనువే ఱొకనక్షత్రము గలదు. మంత్ర. అభిజిన్నామనక్షత్రమ్, ఉపరిష్టాదషాఢానాం, అవస్తాచ్ఛ్రోణాయై.); 2. చుక్క, తార; 3. ముత్యము; 4. ఇరువదియేడుముత్యములహారము, నక్షత్రమాల.

నక్షత్రేశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

నఖంపచము. సం. విణ. (అ. ఆ. అ.) గోరువెచ్చనిది.

నఖక్షతము. సం. వి. అ. న. గోటినొక్కు. [క్షతము.

నఖన్యాసము. సం. వి. అ. పుం. గోటినొక్కు, నఖ

నఖము. సం. వి. అ. పుం. న. గోరు. నఖమను సుగంధద్రవ్యము. పుం అంశము, భాగము.

నఖముఖము. సం. వి. అ. న. నఖాగ్రము.

నఖరము. సం. వి. అ. పుం. న. 1. గోరు, నఖము; 2. ఆయుధవిశేషము.

నఖరాయుధము. సం. వి. అ. పుం. నఖములే ఆయుధముగాఁగలది—1. సింహము; 2. పులి; 3. కోడి.

నఖాంకము. సం. వి. అ. పుం. నఖక్షతము.

నఖానఖి. సం. అవ్య. ఒకరి నొకరు గోళ్లతో గిల్లికొనుచు చేయుపోరు.

నఖాళి. సం. వి. ఇ. పుం. 1 నత్తగుల్ల, క్షుద్రశంఖము; 2. గోళ్లవరుస, నఖపంక్తి.

నఖి. సం. వి. న్. పుం. 1. సింహము; 2. పులి.3. నఖమను గంధద్రవ్యవిశేషము. విణ. (న్. నీ. న్.) 1. పెద్దనఖములు కలది; 2. ముండ్లుకలది. (వృక్షాది.)

నగ. దే. వి. 1. భూషణము. "సీ. నగనాడెములు చూచినావుగాదె కుబేర యాకిరీటము వెల యేమిచేయు." పార్వ. ౫, ఆ. ౧౫౯. నృసింహా. ౭౧; 2. లోహపాత్రము. (శ. ర.); 3. దూది మొదలగువానికంట్లపుమూట. (శ. ర.); 4. సిద్దెల జోడు. (శ. ర.)

నగజ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

నగధరుఁడు. సం. వి. అ. పుం. గట్టుతాలుపు, విష్ణువు.

నగము. సం. వి. అ. పుం. గమనము లేనిది. 1. కొండ; 2. చెట్టు. 3. ఏడు అనుసంఖ్య.

నగరము. సం. వి. అ. న. పట్టణము, పురము.

నగరాలు. దే. వి. బ. 1. పౌరులు. "ఉ...దొంగ బ్బేరానకుఁ బాలుపడ్డ నగరా నగరాలు దురాత్మ నావుడున్." వేం. పంచ. ౧, ఆ. ౭౧౧; 2. ఆంధ్రదేశమండలికూర్ద్రులలో నొక తెగవారు.

నగరి. సం. వి. ఈ. స్త్రీ. నగరము.

నగరు. దే వి. ఔ. (బ. నగరులు, నగర్లు, నగళులు, నగళ్లు.) 1. అంతఃపురము; రాజభవనము. "క. మానవపతి న న్నెక్కుడి,దానవు నీ వనియె నేని ద్రౌపదికడ సన్మానంబు వడసి మెలఁగుదు, నానగ ళుల నృత్యగురువ ననఁగలవాఁడన్." భార. విరా. ౧, ఆ. ౯౦. "గీ. కమలనాభుఁడు కక్ష్యాంతర ములు గడచి, యలబలము లేనినగ ళ్లె నరసి చూచి." పారి. ౧, ఆ. ౧౦౫; 2. సభాగృహము, కొలువుకూటము. "క...రాజతనయానుగుణో, జ్జ్వలమానసీయ వేషము,లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్." భార. విరా. ౫, ఆ. ౩౧౫. శుక. 3, ఆ. ౩౫౬; 3. గుడి, దేవాలయము. "గీ. నగరితోఁ గూడ నేకామ్రనాథుమంచెఁ, గంచిఁ దప్పులఁ జేర్చె నకాలవృష్టి." హర. ౨, ఆ. ౨౨. ఆము. ౪, ఆ. ౩౫.

నగవరి. దే. విశ. (నగవు+అరి.) 1. నవ్వుకలవాఁడు. (శ. ర.); 2. పరిహాసకుఁడు. "క. నగవుల నవిద్య బోఁడిమి, నగుబాటుగఁ జేయనేర్చునగవరి యంతర్, నగుమొగముతోడ మెల్లన, నగుమొగ ములసతులఁ జూచి నగ నేర్చె నృపా." భాగ. ౧౦, స్కం. పూ. ౯౩.

నగవు. దే. వి. (నగు ధా.) 1. నవ్వు, హాసము. "సీ. నగవులు నురువులు నడలు రాయంచలు..." నీలా. ౨, ఆ. ౧౭. నైష. ౪, ఆ. ౧౪౦; 2. పరిహాసము, పరియాచకము. "క. తదనంతరంబ బోటులు, చదురుల నగవులను బ్రొద్దు జరిగినఁ గేళీసదనము ...వెడలుటయు..." స్వా. ౬, ఆ. ౭, భార. అర. ౫, ఆ. ౩౧౧; 3. వింత, ఆశ్చర్యము. "క. ఈజలముపట్టె చూడ మృణాళగమఁట కప్పు ప్రువ్వులఁట యందుఁ బ్రజల్, పూజింప వాని కెల్లన్, రాజఁట యొకకప్ప యట్టినగవులు గలవే." కేయూర. 3, ఆ. ౨౫౮. విశ. పరిహాస పాత్రము. "ఆ...నాడుసతులఁ, బుణ్యశీలయుఁ తలఁ బోకార్చుకొన్నట్టి, నాకుఁ బుత్త్ర లనుట నగవు కాదె." కళా. ౬, ఆ. ౭౫.

నగవుటీగి. దే. వి. (నగవు+ఈగి.) పరిహాసమున కిచ్చినధనము. "సీ. మఱపునఁ గొన్నసొమ్మఱఁ గొన్నలంచంబు తగనివాఁ డిచ్చిననగవుటీగి. గీ. మగుడ నీకుంట యింతయుఁ దగవు గాదు." విజ్ఞా. ప్రా. ౨౮.

నగవులాడు. దే. అ. క్రి. (నగవులు+ఆడు.) నవ్వు. "ఉ. అప్పుడులాడుచున్ నగవులాడుచు బారలు చాఁచి చాఁచి..." చంద్రా. ౨, ఆ. ౬.

నగవైరి. సం. వి. ఇ. పుం. గట్టుదాయ, ఇంద్రుఁడు.

నగారా. హిం. వి. పెద్దఢంకా. "సీ. కదలికరళ్ల చప్పుడుల నాటిడి సేయుఁగొప్పనగారాలకుంజరములు." రంగా. ౧ ఆ. ౧౫౬.

నగించు. దే. స. క్రి. (నగు ధా. ప్రే.) 1. నవ్వునట్లు చేయు, నవ్వించు. "చ. వెలికిలి సెజ్జమీఁదఁ గడువి ప్పగుకన్నులచాయ లొప్పఁ జెక్కిలిగిలి గించి ప్రేతలు నగింపఁగ నుండుట యాది గాఁగ ..." హరి. పూ. ౮, ఆ. ౧౩౪. వరాహ. ౪, ఆ. ౧౬౧; 2. సంతసింపఁజేయు. "ఉ...విపంచి వాయించి తనుక్ నగించి యొలయించిన ప్రేయసి నల్ల దించి మోదించి...మించినవిరించి మముం గరుణించి ప్రోవుతన్." వాల్మీకి. ౧, ఆ. ౭; 3. పరిహసింపఁజేయు. "చ...చెప్పినయది పో కవిత్వ మనిసించు నగించుటు గాకయుండినన్." వేం. పంచ. ౧, ఆ. ౧౮.

నగింపు. దే. వి. (నగు ధా.) నవ్వించుట. "వ... తెగింపులు నగింపులు నింపులు సొంపులు..." భీమ. ౪, ఆ. ౬౦.

నగిపించు. దే. స. క్రి. (నగు ధా. ప్రే.) నవ్వించు. "మ... నాలుకతుదక్ ముక్కంటికొమ్మా విలాసిని యే నమ్మెద నంచు బ్రహ్మ నగిపించెక్ మేలు మాటల్ సలెన్." కళా. ౫, ఆ. ౫౯.

నగియించు = నగించు. (వికసింపఁజేయు.) "సీ. ముత్తొంటిపలుకులు మొన నయం వేసమువాఁడు తమ్ముల నగియించుతళుక్కుఁ జేఁడు." కాళిందీ. ౫, ఆ. ౨౩.

నగు. దే. అ. క్రి. 1. నవ్వు, హసించు. "వ... రాచూలిం జూచి చెలులు గలకలం జే చఱచి.

నగిరి." శైవ. ౨, ఆ. ౪౬. పారి. ౧, ఆ. ౧౦౧; 2. ఆనందించు. "క. అని పంటవలఁతి జేజే, విని పించిన నాలకించి ప్రేఁతలమేల్వాఁ,డెన లేని కోర్కి లెదలో, ననలొత్తఁగ నతనిఁ జూచి నగుచుం బలికెన్." నీలా. ౨, ఆ. ౩౩; స. క్రి. 3. పరిహసించు, గేలిసేయు. "చ నగియును బొంకు నందు వచనంబు నధర్మమునందుఁ జిత్తముం,దగు లదు నాకు నెన్నఁడును..." భార. ఆది. ౮, ఆ. ౨౪౨. కాళిందీ. ౬, ఆ. ౬౬. వి. పరిహాసము. "చ. మృగమదచిత్రకానుగతి మేలగుఫాలము పిల్లతేఁటికిం, దగు లగుకేతకీదళము దా నగనం చొగి నెంచి కొప్పుపో,రగపడుతేఁటిగుం పెడసి యాడెడునందపుఁదేఁటిపిల్లల న్నగు నగు గాదు ముంగురులు నవ్యపయోరుహపత్రలోచనా." కాళిందీ. ౬; ఆ. ౬౬. ౨౭౬. అచ్చ బాల. ౧౧౨.

నగుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు

నగుఁబాటు. ద్వ. వి. (నగు+పాటు.) అపహాస్యత, నింద. "గీ. యజ్ఞభవుకూఁతు రైనయహల్య మొదలు,నేర మొనరించె ననినచో నేర్చి నడువ, నొకరితరమానె మగవార లోర్వవలయుఁ,గానిచో వట్టినగుఁబాటు గాదె మీకు." శశాం. ౪, ఆ. ౨౦. భార. అర. ౬, ఆ. ౩౦. విణ. ఎగతాళి చేయఁదగినది, అపహాస్యము. హాస్యాస్పదము. "ఉ...ఇ ట్లసం,భావితుఁ డైనవానితలపా టర యక్ నగుఁబాటు గాదె రా,మావనిసాధుతమ్ము లకు..." నిర్వ. ౧౦, ఆ. ౧౧.

నగుపించు. దే. స. క్రి. (నగు ధా. ప్రే.) నవ్వించు. "క. తెప్పించి తోడుగు మీ వని, యొప్పించిన నిట్టునట్టు నొఱవలుగా మైఁగప్పికొని యాబృహ న్నల, యప్పుడు నగుపించె నచటియబలాజన మున్." భార. విరా. ౪, ఆ. ౩౯. శాం. ౬, ఆ. ౨౧౮.

నగుసేయు. దే. స. క్రి. (నగు+చేయు.) అపహ సించు. "చ. వదన మపత్రపాలిమిరబంధతఁ గాంచినఁ జిమ్మచీఁకటిం, జిదిమెడుచందమామ నగు సేయక యుండునె." కాళిందీ. ౬, ఆ. ౮౮.

నగౌకము. సం. వి. న్. పుం. 1. పక్షి; 2. కాకి; 3. సింహము; 4. శరభమృగము.

నగౌకసము. సం. = నగౌకము.

నగ్న. సం. వి. ఆ. స్త్రీ. 1. దిసమొలయాఁడుది; 2. రజస్వలకానిపడుచు. (పది పండ్రెండుసంవత్సర ములవయసు కలది.)

నగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దిసమొలయాఁడుపి, దిగంబరస్త్రీ; 2. సమర్తాడనిపడుచు, కన్యక.

నగ్నుఁడు. సం. వి. అ. పుం. 1. దిగంబరసన్న్యాసి; 2. దిగంబరబౌద్ధుఁడు; 3. బట్టువాఁడు; 4. వేద మభ్యసించియు వేదమార్గమును విడిచి యప మార్గమున వర్తించువాఁడు; వేదదూషకుఁడు. "ఉ. ధీమతిఁ జిన్ననాఁ డఖిలదేవతలక్ భజియించి ఋగ్యజుస్సామము లభ్యసించి బహుశాస్త్రపరా యణుఁడై మహీసురుం, డేమియు బుద్ధిలేక శ్రుతు లెంతయు నింద యొనర్చు వానిఁ బో,పామరుఁ డైన నగ్నుఁ డని పల్కిరి వేదవిదుల్ మునీశ్వరా." వి. పు. ౪, ఆ. ౨౭౦. "ఆ. వేద మభ్యసించి వేదమార్గంబులు, విడిచిపెట్టి దుర్వివేకబుద్ధి, బహు మతముల నడుచుపాషండుఁడే నగ్నుఁడు..." వి. పు. ౪, ఆ. ౨౭౧.

నచికేతసుఁడు. సం. = నచికేతుఁడు.

నచికేతుఁడు. సం. వి. న్. పుం. 1. ఉద్దాలకునికొడుకు, నాచికేతుఁడు; 2. ఒకానొకఅగ్నిహోత్రుఁడు.

నచ్చిక. దే. వి. (నచ్చు ధా.) నమ్మిక. "క. నిను గీతి సాహితీమో,హనవాణులు చెవులువట్టి యాడిం పంగాఁ,గని యుండి కాముకుఁడఁ గా,నని వల్కిన నాకు నచ్చి కొనె నృపాలా." విజ. ౧, ఆ. ౯౦. వసు. ౩, ఆ. ౧౧౯.

నచ్చికము. దే. వి. కొఱఁత, లోపము. "క. అకటా నన్నితఁ డేలిన, నొకటా నచ్చికము లేక యుం డఁగవచ్చున్." విజ. ౧, ఆ. ౬౮. రామ. ౧౮౭.

నచ్చు. దే. అ. క్రి. 1. ప్రియమగు. ఇష్టమగు; రుచించు. "చ...ఆలలితాంగి నాకు న,చ్చినచెలి..." మార్క. ౫, ఆ. ౨౧౯. భీమ. ౧, ఆ. ౩౦; 2. నమ్మకము కలుగు. "క. నీవింక నేఁటినుండియు, నావచనము లాదరించి నచ్చినమదితో, దేవతల కైన దొరకని,యావారుణిసేవ సేయు మతులితభక్తిన్." వి. పు. ౭, ఆ. ౩౯. నిర్వ. ౮, ఆ. ౬౫; 3. లగ్నమగు, సక్తమగు. "గీ. అట్టినీయందు నాచిత్త మనవరతము, నచ్చియున్నది నీయాన నానలేదు,కరుణఁ జూడుము కంసారి ఖల్లవిదారి." భాగ. ౧౦, స్కం. పూ. ౧౮౦౨. స. క్రి.

1. నమ్ము, విశ్వసించు. "వ...కీచకనివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద వెనంగ నొల్లక నామనంబున న న్నెవ్వరికి నేమి సేయ వచ్చు నని మీాలావు నచ్చి సూతునింటికి సురకుం బోయిన." భార. విరా. ౨, ఆ. ౧౬౩. ఆం. భా. తృ. ౩, ఆ. ౧౩౩; 2. పీడించు, బాధించు. "గీ. కాననము చొచ్చి శార్దూలఖడ్గ సూకరప్రముఖజంతుసంతతి వ్రచ్చి నచ్చు,నార సంబున మృగవేషధారి యైన, యతికులస్వామిఁ గూలనేసితివి నీవు." వరాహ. ౨, ఆ. ౪౮; 3. ఎఱుఁగు. "ఉ....కౌంతేయులు మన,మెలమి కలిమి నచ్చి యిట్టు లేమఱి నగునే." భార. విరా. ౩, ఆ. ౧౦౩. వి. మాంద్యము, అలస్యము. "క. జడ కుచ్చును మెడహెచ్చును, నడనచ్చును గచ్చు లేనినలు పశుమేనున్."చంద్ర. వి. ౧, ఆ. ౬౧; 2. బాధ. (శ. ర.)

నచ్చుకాఁడు. దే. విశే. (నచ్చు+కాఁడు.) 1. మందుఁడు, అలసుఁడు; 2. బాధకుఁడు, పీడించువాఁడు. (శ. ర.)

నచ్చుకుప్ప. దే. విశే. (నచ్చు+కుప్ప.) బాధకుఁడు. (శ. ర.)

నచ్చుగొట్టు. దే. విశే. (నచ్చు+గొట్టు.) బాధించు స్వభావము గలవాఁడు (శ. ర.)

నచ్చుపెట్టు. దే. స. క్రి. (నచ్చు+పెట్టు.) తొందర పెట్టు, బాధించు. (శ. ర.)

నజరు. హిం. వి. కానుక. "క. అని యిట్లు సకలజనములుఁ,గొనియాడ ననర్ఘ రత్నఘోటకమదవా,రణ భూషణాంబరంబులు, ఘనమోదము మీఱ నజరు గైకొని వేగన్." ఆనంద. పీఠి. ౧౧౧, రంగా. ౨, ఆ. ౭౪.

నజ్జు. దే. వి. చిన్నముక్క, నలి. "చ. ఒకపెనుఁ బాఁపఱేఁడు చలమొప్ప రసాతలసీమకుఁ జకో, రకములు భూతధాత్రికి సురల్ దివికిన్ బగదీఱ నట్లుగా, మెకమెకపాటుతోడ నిను మ్రింగకపోరెపుడున్ త్రిలోకకంటకుఁడవు గాన నీయొడలు నజ్జుగఁ జేసి కురంగలాంఛనా." స్వా. ౩, ఆ. ౬౭. ప్రబంధ. ౧౭౬. విశే. మిక్కిలి నలఁగినది. "ఉ. వాడినమేను నజ్జయినవాతెఱయున్ గడు విన్నఁబాటుతోఁ, గూడినసెమ్మొగంబు..."సమీర. ౩, ఆ. ౨౪౬. (దీనియామ్రేడితరూపము నజ్జు నజ్జు. కవిక. ౪, ఆ. ౧౭౧.)

నజ్జుచేయు. దే. స. క్రి. (నజ్జు+చేయు.) నలఁగఁగొట్టు, ముక్కముక్కలుచేయు. "చ. అల వెనయంగ జారులహృదంతరముల్ నలి నజ్జుచేసె సంధిలుతమి బుఖసంఘముల తేజముఁ దూలిచె ..."సా. ౧, ఆ. ౧౦౧. (ఇట కలఁతనొందించె నని భావము.) "సీ. రథ్యసారథికేతురథికాంగనిర్ఘోశనప్రౌఢిఁ దేరులు నజ్జుచేసి." మార్క. ౭, ఆ. ౧౦౪. (ముద్రి. పా. 'నగ్గుచేసి' అని. శ.ర. పా.)

నటకుఁడు. సం. = నటుఁడు.

నటత్. సం. (శత.) నాట్యముచేయుచున్న. ఆని. ౪, ఆ. ౪౨.

నటన. సం. వి. ఆ. స్త్రీ. విలాసము, నటనము. "ద్వి. బొట్టు మిక్కిలి నొఱపుగ సవరించి, నటనగాఁ జిన్నారినామంబుః దీర్చి." ద్వి. పరమ. ౨, ఆ. ౫౪. పు.

నటనమిగులు. మి అ. క్రి. (నటన+మిగులు.) విలసిల్లు, అధికముగా నుండు. "సీ. అర్థంబు కాశీ పురాంగణంబునయందు నానాప్రకారమై నటన మిగులు." కాశీ. ౨, ఆ. ౫౦.

నటనము. సం. వి. అ. న. 1. నాట్యము; 2. అభినయించుట, నర్తనము; 3. కపటప్రవర్తనము; 4. విలాసము. "క. అటు లున్నకొమరుఁబ్రాయపుఁ, గుటిలాలకఁ జూచి మదనగుంఫితమాయా,నటనంబో యది గంగా,ఘటనంబో యని విచారఘటనాశయుఁడై." విజ. ౧, ఆ. ౬౬.

నటనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నటింపఁదగినది.

నటము. సం. వి. అ. పుం. 1. దుండిగముచెట్టు; 2. అశోకముచెట్టు; 3. కిక్కసచెట్టు.

నటవాలు. దే. వి. అశ్వగతివిశేషము. (శ. ర.)

నటాంతిక. సం. వి. ఆ. స్త్రీ. సిగ్గు, లజ్జ.

నటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె, నట్టువురాలు; 2. సూత్రధారునిభార్య యగునర్తకి; 3. వేశ్య; 4. కాకిదొండచెట్టు.

నటించు. సం.అ. క్రి. 1. నాట్యముచేయు, నర్తించు. "క...దివి దివిషజ్జలజముఖులు దలిసి నటింపన్." స్వా. ౪, ఆ. ౧౧౭. ఇందు. ౨, ఆ. ౨౩౫; 2. కపటముగా ప్రవర్తించు. "సీ. పలికినమ్ముఖమ్మునఁ బలుమాటల నటించుపరసిజాసనురాణి సాటి.

యగునె." ఇందు ౧, ఆ. ౧౧౨; 3. ఉండు, వర్తించు. "శా. ఏకవ్యాపకమై సమస్తగతమై హేవాకమై శ్రీకరం,బై...పరమార్థతత్త్వము నటించుఁ నిత్యశుద్ధస్థితిన్." వి. పు. 3, ఆ. ౩౩౭; 4. తోఁచు. "క. పతయాళితురగనిభృతోన్నత కర్ణద్వయమునందునం గెంపుల మేల్పతక మమరె రవికిరణాం, బతిరయమున ననుపవచ్చుసనువు నటింపన్." కువల. ౨, ఆ. ౪౦. స. క్రి. 1. అభినయించు, నిజముగా లేనిలజ్జాదికము నున్నట్లు కనఁబఱచు. "చ...పల్కుఱు పొరుగిండ్ల కేఁగు నొక మట్టున నిల్వదు చంటి మోఁదముం,జెఱఁ గెడలించు వైశికపుసిగ్గు నటించుచు జార ధారుణిన్." జై. 3, ఆ. ౨౮. భార. ద్రో. ౧. అ. ౯౭; 2. అనుసరించు. "మ. మును తఱ్ఱ గూడినసీల్లకుఁ నిజ గుణంబుల్ పా లిడుఁ పాలు గ్రాఁగు నెఱఁ వాని నటించి యజ్జలము గ్రాఁగున్..." మల్లభూ. నీతి. ౬౬.

నటిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నటించువాఁడు.

నటితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నటించినది; 2. నటింపఁబడినది; 3. నటనము.

నటితి. సం. వి. ఇ. స్త్రీ. నాట్యము.

నటియించు. సం.=నటించు. (అభినయించు) "సీ. కుటిలత్వ మలకల ఘటియించి వనితలై నటియించు శశికళాపటల మనఁగ... గీ. అలరుదురు... అచటి చక్కనిమిటార్లుమరుచేతి చిక్కుటార్లు." శశాం. ౨, ఆ. ౨౨; 2. (నర్తించు, ఆడు.) "క. నిటలంబునఁ గుటిలభ్రూకుటి నటియింపంగ మొగ మిగుర్పఁగ మేనం, జోటచోట నెత్తురు గాఱఁగ ..." వరాహ. ౨, ఆ. ౧౮౯.

నటుఁడు. సం. వి. అ. పుం. 1. నర్తకుఁడు, నాట్యము చేయువాఁడు; 2. అభినయించువాఁడు; 3. ఒక జాతివాఁడు.

నటేశ్వరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. (ఇట్లే: నటరాజు మొ.)

నట్ట. దే. వి. పాచిక,సారె. "ఉ. నట్టలు రెండుఁ దాన జతనంబునఁ జేకొని యున్నయిందులం, గట్టి నృపాలు సారెలకుఁ గాలిడ నెందును జోటులేక యున్నట్టుగఁ జేసి..." భో. ౭, ఆ. ౧౩౦.

నట్టకనడుము. దే. వి. (నడుము+నడుము.) సరిదైన మధ్యము. (చూ. నట్టకనడురేయి.)

నట్టకనడురేయి ద్వ. వి. (నట్టకనడుము+రేయి.) సరియైన అర్ధరాత్రము. "క. కట్టి తనమాఱుగా నీ, దిట్ట గృహస్తంభమునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడనియా బెడిదపు నట్టకనడురేయి మబ్బునం జెలి చనియెన్." వేం. పంచ. ౧, ఆ. ౨౪౯.

నట్టకోఁతి. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. నాల్గు కంబాలాట నట్టకోఁతి." హంస. 3, ఆ. ౧౪౬.

నట్టడవి. ద్వ. వి. (నడుము+అడవి.) అరణ్యమధ్యము. "క...నీపాదంబుల్, వట్టికొనఁగ వచ్చినమము, నట్టడవిని డించి పోవ నాయమె కృష్ణా!" భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౯౪. చం. రా. ౫, ఆ. ౬.

నట్టనడుము. దే. వి. (నడుము+నడుము ) సరిదైన మధ్యము. "చ. మలచపువేణి నట్టనడుమన్ దెగి చేతికిఁ దున్క చిక్కె..." ఉ. రా. 3, ఆ. ౧౨౩. భీమ. ౪, అ. ౧౧౦.

నట్టనడురేయి=నట్టకనడురేయి. విప్ర. ౪, ఆ. ౬౫.

నట్టాడు. ద్వ. అ. క్రి. (నట్టువ+ఆడు-శ. ర.) 1. నాట్యముచేయు, నర్తించు. (శ. ర.); 2. చలించు. "క...మిఱుమిఱుచూడ్కుల్, నట్టాడునడుముఁ దేనియ, లుట్టెడు మోవియును మనము నూరింపంగన్." భాగ. ౯, స్కం, ౬౦౮; 3. ఇటు నటు తిరుగు. వ్యవ:—వాఁడు నట్టాడుచుండగాఁ జూచితిని.

నట్టించు. దే. అ. క్రి. నటించు, ఆడు. "వ...దారకులునుంబోలె నట్టించి పనిఁ దిరుగు వెరవరులునుం బోలె మసల కలవడి..." ఉ. హరి. ౪, ఆ. ౨౯౬.

నట్టిల్లు. దే. వి. ఔ. (నడుము+ఇల్లు.) గృహమధ్యభాగము. "గీ. వినుతదానంబు లొనరించి యనుఁగుఁ జెలుల,యట్ల నట్టింటఁ బగవారి నాదరించి, నగర దైవతముల నర్చనాసమృద్ధిఁ,దనిపె సుతజన్మదినమున ధరణివిభుఁడు." ఉద్భ. ౪౧, పాండు. ౪, ఆ. ౧౬౫.

నట్టు. యు. దే. అ. క్రి. అడ్డు, అఁగు. వ్యవ:—వాఁడు చదువుచు నట్టుచున్నాఁడు. వి. 1. ఆలస్యము. వ్యవ:—ఏల నట్టు చేసెదవు, వేగపొమ్ము. (శ. ర.); 2. ఆటంకము, అభ్యంతరము. (చూ. నట్టుపడు); 3. తృణవిశేషము, గఱికగడ్డి. ఉదా:— కుందురునట్టు, గఱికనట్టు. (బ్రౌ.); 4. గఱికవలె నిస్సార మగుట, కుష్కించుట. "గీ. ఇట్టిబెట్టగువెట్టకు నట్టుఁ జెంది, జడలఁ [illegible]

"దాలిచెఁ జంద్రమౌళి." ధర్మ. ౨, ఆ. ౭౬; 5. మార్పు; వికృతి. (చూ. నట్టువడు.); 6. సస్య రోగవిశేషము. (శ. ర.); 7. గ్రామము, నివాస స్థానము. "గీ. నెట్టుకొని గొల్లవ్రేతలనట్టులందు, గుట్టు లరయుచు మెలఁగునప్పట్టి..." నీలా. ౧, ఆ. ౭౫, ఆం. భా. తృ. ౪౫; 8. స్థానము, ప్రదేశము. "సీ. పొదరింటిపట్టులఁ జదరంపు నట్టులఁ బంతుగా గోరంటబంతు లాడు." ఉ. హరిశ్చ. 3, ఆ. ౧౫, అచ్చ. యు. 3, ఆ. ౨౭; 9. పొలము, క్షేత్రము. "ఉ. పూని వసంత పాళికుఁడు పొంగెడురాగరసంబుచేఁ గడున్, సానుజనాళిమానసపునట్టులు దున్నిమనోజకందళిం, గానఁగఁ జేసి..." చంద్ర. ౯, ఆ. ౧౦3; 10. దేశము. "గీ. అతఁడు దరుగనియూరును నతని చేత, నడుగఁబడనిమానవుఁడును నతఁడు చొరని, తోఁటయును జూడ లేదు మందునకునైన, నగవు గా దిది నిక్క మానట్టునందు." భో. ౨, ఆ. ౫. 11. ఇంటిపట్టు, గృహప్రదేశము. "గీ. నట్టు నా గేహాత్ర్మదేశనామ మెసఁగు." ఆం. భా. తృ. ౪౫, వై. వి. (సం. నటః) 1. నటుఁడు, నర్తకుఁడు. "వ. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం జుట్టు మెట్టాడు చిట్టివడుగుల నానట్టు నగవునుం గోపంబుఁ గదుర నదలించుచు..." ప్రభా. ౧ ఆ. ౧౦౭, ఆం. భా. ద్వి. ౧౭౮; 2. నాట్యము. (చూ. నట్టాడు.)

నట్టుకొట్టు. దే. అ. క్రి. (నట్టు+కొట్టు.) 1. అలసించు. (శ. ర.); 2. సంకోచించు, వెనుదీయు. "క. పలికిన నినుఁ గాదన భీతిలి యిటునటు నట్టు కొట్టు తెలివ తెలఁగు భూతలవిభుఁడు చూచి యిదియే, మలికుంతల తెలుపు మనుచు నడిగెఁ బోరిఁబోరిన్." కళా. ౭, ఆ. ౯౦. పరమ. 3, ఆ. ౨౮. స. క్రి. ఆటంకపఱచు, నిరోధించు. "రగడ. తగిలి పట్టు మనుచుఁ దిట్టు తన్విఁ దుట్టు పెట్టె నొకతె, మగుడి పెట్టు కాని యొట్టు మాన్ప నట్టుకొట్టె నొకతె." రా. వి. 3, ఆ. ౧౨౧,

నట్టుకొను. దే. అ. క్రి. (నట్టు+కొను.) నెలకొను నివసించు. "ద్వి. కొలిచెదయ్యము నట్టుకొని యున్న కరణి, నున్న భేతాళపటోర్వీరుహంబు." ద్వి. హరిశ్చ. పూ. ౨౦౦౮, పం. హర. 3, ఆ. ౧౫.

నట్టుగాఁడు. వై. వి. (సం. నటః.) నట్టువకాఁడు, నట్టువుఁడు. (శ. ర.)

నట్టుపడు. ద్వ. అ. క్రి. (నట్టు+పడు.) నిరుద్ధమగు. (చూ. నట్టుపఱుచు.)

నట్టుపఱుచు. ద్వ. స. క్రి. (నట్టుపడు ధా. ప్రే.) ఆటంకపెట్టు, నిరోధించు. "గీ. నట్టడవిలోన న న్నిట్టు నట్టుపఱిచి, గొట్టుమిట్టాడ నేటికి..." కృ. శతకం. ౨, ఆ. ౭౪.

నట్టుపులుఁగు. ద్వ. వి. (నట్టు+పులుఁగు.) నాట్యము చేయుపక్షి, నెమలి. (శ. ర.)

నట్టువ- వై. వి. (సం. నర్తకః.) 1. నటుఁడు, నటి. "క. ఇరువురు నేసినబాణము, లిరుబరులును దాఁకి తిరిగె నిరుదెసలకు నక్కిరి యిరుమొగముల నట్టువతిరుపుఁ గొనెడుక్రమముతో నతిత్వరిత గతిన్." కాళి. ౪, ఆ. ౧౮౧. దశా. ౧, ఆ. ౨౪౬; 2. నాట్యము. "వ. మఱియు విరితేనియ లాని పూని మత్తిలి తత్తరంబునం దిరుగు తేఁటి మొత్తంబులయొఱకలనన్నుం గరువలి గట్టి నట్టువ గఱపు నామనిరాజేనికడ నాడుతీవపాతరల ముందఱ..." య. ౪, ఆ. ౧3.

నట్టువత్రొక్కు. దే. అ. క్రి. (నట్టువ+త్రొక్కు.) నాట్యముచేయు, చలించు. "చ. నొసలను ముంగురుల్ చెదర నూల్కొని ముక్కెరఁడాలు మోవిపై, వెసఁ గొనసాఁగఁ జన్నుఁగవ నిక్కుచు నట్టువ త్రొక్కి హారముల్,మునరి పెనంగులాడ నగు మోము చెమర్ప నొకర్తు..." జాహ్నవీ. ౧, ఆ. ౧౪౬.

నట్టువకాఁడు. ద్వ. వి. (నట్టువ+కాఁడు.) నర్తకుఁడు, ఆటకాఁడు. "సీ. పంచాంగమయ్యవారుఁ బాగ సమర్పించు నట్టువకానికిఁ బెట్టు మురువు." హంస. ౫, ఆ. ౧3౪.

నట్టువడు. ద్వ. అ. క్రి. (నట్టు+పడు.) వికారము నొందు. "వ..., వెన్నెలచేత నట్టువడినమణికుట్టి మంబులు తుడిచి..." ఉ. హరి. 3, ఆ. ౧3౫.

నట్టువపక్కి. వై. వి. (నట్టువ+పక్కి.) నాట్యము చేయుపక్షి - నెమలి. "క. కొక్కును నట్టువ పక్కియు, నెక్కుడులంగ నమరుకొమరులిక్షుపుర మోలిలన్,నిక్కుచు నాడఁగ నెలమిన్,జొక్కెడు శేలుపులరాయ సోఁకుడురాయా." అచ్చ. యు. ౫౮౮. (ఇట్లే: నట్టువపిట్ట మొ.)

నట్టువాఁడు. ద్వ. వి. (నట్టువ+వాఁడు.) నటుఁడు, నట్టువుఁడు. "సీ. బండలు బూతులు పరిహాసకులు నట్టువా రాదిగాఁ గలవారు దక్కఁ, బెఱవారి దూలు తాఁ బ్రియుఁడు వారింపంగఁ బరువోడఁ బల్కఁడ బణవశతము." విజ్ఞా. ప్రా. ౧౧౬.

నట్టువుఁడు. వై. వి. (సం. నర్తకః.) నాట్యముచేయు వాఁడు, నర్తకుఁడు. "మ...నాలిగాఁష్పుల పేరం గలనట్టువుల్ గఱపఁ గోపుల్ చూపు లేఁదీవపా, త్రల కయ్యాముని పూలముత్తైపుసరుల్ దాల్పంగ నిచ్చెం గడున్." య. ౪, ఆ. ౧౨, ఆం. పదా. నర. ౨౮.

నట్టువొజ్జ. ద్వ. వై. వి. (నట్టువ+ఒజ్జ.) నృత్యము నేర్పువాఁడు, నాట్యోపాధ్యాయుఁడు. "గీ... ఇన్ని తెఱఁగుల శ్రమము సేయింతుఁ జతుర, తావిహీనము లైనపాత్రములనైన, నట్టువొజ్జనై మెలఁగుదు నగళులందు." భార. విరా. ౧, ఆ ౨౪౨.

నట్టెండ. దే. వి. (నడుము+ఎండ.) తీక్ష్ణముగా కాసిన యెండ. "మ...నట్టెండల్ వెనం గాయుం వే, సవులన్...." పి. శకుం. ౨, ఆ. ౧౧౨.

నట్టెము. దే. వి. భిక్షాపాత్రము. "ద్వి. కప్పెర నట్టెంబుఁ గక్షపాలయును, నొప్పుగా బిగిసిన యోగపట్టెయును." ద్వి. పరమ. ౨, ఆ. ౧౭౭. పు.

నట్టేఱు. దే. వి. (నడుము+ఏఱు.) నదీమధ్యము. "సీ. నట్టేట దాశకన్యకకు నువ్విళులూరి జాలిఁ బొందిన పరాశరువిరాళి." నైష. ౭, ఆ. ౧౫౧. విప్ర. ౪, ఆ. ౪౪.

నట్య. సం. వి. ఆ. స్త్రీ. నటులసమూహము.

నట్లొట్టు. దే. వి. బ. జలధార లోనగునని నిరంతరముగా పడి ఉడిగినవెనుక అచ్చోట నిలిచి నిలిచి పడెడుబొట్లు; చూరునుండి పడునీటిబొట్లు. "సీ. నవమాలికలతేనె నట్లొట్లుపడుచోట మాణిక్యదీపముల్ మలయుచోట." స్వా. ౩, ఆ. ౧౧౧. ఆం. భా. ప్ర. ౭౫.

నట్వాలు. దే. వి. అశ్వగతివిశేషము. (శ. ర.)

నడ. దే. వి. (నడచు ధా.) 1. నడక, గమనము. "సీ. లలితంబు లగుమట్టియలచప్పుడింపార సంచకై వడి నడ నల్ల వచ్చి." భార. విరా. ౨, ఆ. ౬౪. స్వా. ౧, ఆ. ౭౬; 2. అశ్వగతివిశేషము. "చ. జవమున భంజళిక్ మఱలిఁ జౌకముసక్ నడ నైదు ధారలన్...రూఢికెక్కి యాహవజయశీలముల్ గలుగునశ్వము తెన్నుఁగఁ దెక్కు లక్ష్యరిన్." భా. రా. బాల. ౩౦.

నడక. దే. వి. (నడచు ధా.) 1. గమనము. "గీ. ఇపుడు ఘటికాద్వయం బయ్యె నినుఁడు పొడిచి, దవ్వు చాల దిచ్చోటికి దక్షవాటి, కేవలము మంచినడ కైనఁ గీసవెల్లి, రెండుజాములు నిట నూరకుండ నేల." భీమ. ౪, ఆ. ౪౬; 2. ప్రవర్తనము, నడవడి. "క...ఈ, యనుచితపునడక నాయుంపు, కొనసాగమి నెందు నీకుఁ గొఱగాదంటిన్." రామా. ౬, ఆ. ౧౬౨. పండితా. పురా. ౯౨. పు; 3. జీవనోపాయము, వృత్తి. "సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి." ఆం. భా. ద్వి. ౨౨౮.

నడకొండ. దే. వి. (నడ+కొండ.) నడక గలకొండ. "వ...నడచునడకొండగమియుసుం బోనిగజరాజితో రాజు రథారూఢుండై..." భార. భీష్మ. ౧, ఆ. ౧౩౦, ౨. ఆ. ౨౪౦.

నడకొలఁకు. దే. వి. (నడ+కొలఁకు.) దిగుడుబావి. "క. ఒడికపుఁదనసొబగునకెక్కుడు చెన్నులు గలుగఁ జూచి కొల నాయన్నల్, నడకొలఁకు లంచు వారికిఁ, గడువేడుకఁ దమ్మితావి కానుకఁ జేసెన్." య. ౩, ఆ. ౫౭.

నడగఁడు. దే. వి. (నడచు ధా.) అశ్వవిశేషము; అశ్వము, గుఱ్ఱము. "క. ఆలోనఁ జంద్రహాసుఁడు, మేలంకనుచు నపుడు తత్సమీపసరఃప్ర, క్షాళితముఖుఁడై నడగని,బోలెమునఁ గదల్చి నగరముఁ బ్రవేశించెన్." జై. ౮, ఆ. ౭౯. ద్వా. ౩, ఆ. ౧౪౧.

నడగొండ. = నడకొండ. స్వా. ౪, ఆ. ౪౭.

నడగొట్టు. దే. అ. క్రి. (నడ+కొట్టు.) నిలుచు, ఆఁగు. "క. పోక నడగొట్టితేనియు, రాకింతుఁ బూమి మొగంబు రాచట్టుపయిన్, శ్రీకాళిక నిందించిన, నీ కింతట నేల పోవు నీచచరిత్రా." భీమ. ౨, ఆ. ౧౫౩.

నడగోట. ద్వ. వి. (నడ+కోట.) నడక గలకోట. "సీ. రంగదుత్తుంగతరంగసంఘాతంబు నడగోటలో తెఱంగు నడుపుచుండ." ప్ర. భా. ౧, ఆ. ౬౪.

నడచియాడు. దే. అ. క్రి. (నడచి+ఆడు.) ప్రవర్తించు, ఉండు. "సీ. ధర్మంబు కాశికాస్థాన

మధ్యంబున నాల్గుపాదంబుల నడచియాడు." కాశీ. ౨, ఆ. ౧౦.

నడచు. దే. అ. క్రి. 1. గమనముచేయు, చరించు. "వ...మార్తాండుండు కొండప్రక్కం జిక్కి కడలిమొగయక్కలిం దగులంపడినజోగునుం బోలె నెదురు నడవ మఱలం బఱవలేక చీకాకుపడి యున్నవాఁడు..." కాశీ. ౨, ఆ. ౯౭. ఉ. హరి. ౬, ఆ. ౬౬; 2. నడచుకొను, ప్రవర్తించు. "క. ఇది చెప్పినట్లు చేయుండు, మిది వంచినయట్లు నడతు మిది కల్యాణాభ్యుదయనిధానము మా కని, హృదయంబులం దలంచుచుండి రిరుదెసవారల్." హర. ౬, ఆ. ౧౦౭. ఆము. ౪, ఆ. ౨౨౮; 3. వెడలు. "క. సేనమొగ మీతఁడైనం, బూని మహీశ్వరులు నీకుఁ బోడిచెదరే దుర్మాని యని కాదె యీతనితో నడచుట కొల్లనైతి దురమున కధిపా." భార. ఉద్యో. ౪, ఆ. ౭౪౪. కాశీ. ౧, ఆ. ౧౨౬; 4. చెల్లు. "క. దేవా క్రమక్రమంబునఁ, బావనులై సృష్టి కలుగు ప్రజలీకరణిక్, గైవల్యంబున కేఁగెదు, భావశిచే మాకు నడవ నధికారంబుల్." వరాహ. ౧౦, ఆ. ౧౭; 5. నెఱవేఱు, సిద్ధించు. "గీ. నాముఖంబునఁ గార్యంబు నడవ దేమి, సేయువాఁడ .." భార. ఉద్యో. ౩, ఆ. ౩౨౬; 6. జరుగు. "క. మున్నొక్కపట్టణంబున, సొన్నారిమిటారి నేర్పు కూరత్వము గై, కొన్నదియై నడచినకథ, చెన్నుగ విని పొమ్ము కడువిచిత్రము కొమ్మా." హంస. ౨, ఆ. ౧౭౭; 7. (గ్రాసము) కడచు, సాగు. "గీ. తగిన వేషంబు దనుఁ దాన పొగడుకొనమి, నొచ్చియుండు గీడువలుకమి యిచ్చి వగవకునికి దన కెంత నడవకయున్నఁ బథమునఁ దప్పకుండుట నడవడి కొప్పు సేయుఁ." భార. ఉద్యో. ౨, ఆ. ౪౫; 8. ఉండు. "సీ. ఇఁకఁ గావు మన్నింతు నే నోయఖండదయాసముద్రుండ నాయందుఁ గరుణ, నడవఁగట్టి పగఱ నడగించితే నేమి చెప్ప నమోఘవాంఛితుఁడ నగుదు." రాఘవ. ౪, ఆ. ౭౧; 9. కవియు. "ఆ. స్వశ్శిఖనికురంబవనశిఖి మేఘనాదాభిధానుఁ డాబలాధ్యుమీఁద, నడచి దుర మొనర్చె ..." రాఘవ. ౪, ఆ. ౨౧౬.

నడజోదు. ద్వ. వి. (నడ+జోదు.) కాలిబంటు, పదాతి. "వ...అడిదంబులఁ బోడిపోడిగా నడుచు నడజోదుభటులును..." ఉ. హరి. ౪, ఆ. ౨౭౫.

నడత. దే. వి. (నడచు ధా.) 1. నడవడి ప్రవర్తనము. "సీ. కామపాలాఖ్యుఁడై గరిమ సర్వజ్ఞుఁడై నరవరోచిత మైననడత యెఱిఁగి." నరస. ౧, ఆ. ౭౦. శకాం. ౩, ఆ. ౯౧; 2. జీవనోపాయము, వృత్తి. "సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనఁగను నడరు వృత్తి." ఆం. భా. ద్వి. ౨౭౮.

నడతాడి. ద్వ. వి. (నడ+తాడి.) నడక గలతాడి. "క. పొడియును బోడియునై యిల, నడతాడిం బోలి..." ప్రబోధ. ౩, ఆ. ౨౦.

నడతెంచు. దే. అ. క్రి. (నడచు+తెంచు.) 1. వచ్చు. "సీ. అడుగునఁ బడక రత్నాకరంబునఁ దేలి నడతెంచుజీవరత్నంబు లనఁగ. గీ...ముద్దు, చిలుకునచ్చరచిలుకలకొలుకు లపుడు, కడలి వెలువడి వచ్చుశృంగార మమరె." దశా ౨, ఆ. ౭౪౫. భా. రా. యు. ౫౦; 2. పోవు. "చ...దిగంతభాగములు వగుల్పఁగా నెదురుగా నడతెంచిరి వైరికోటికిన్." హరి. ఉ. ౯, ఆ. ౧౬౪. ప్రభా. ౧, ఆ. ౫౩; 3. సంచరించు, తిరుగు. "చ...భూరిపరాక్రమశాలి భీష్మునకు జముగఁ దాకి యద్దెస నకంపితు లై నడతెంచుశల్యకుంభజకురురాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁ జేయుమీ." భార. భీష్మ. ౨, ఆ. ౩౩.

నడతెగు. దే. అ. క్రి. (నడ+తెగు.) నడక తెగిన దగు, డస్యు, అలయు. "వ...మందరము దూరంబుగా వచ్చితిమి నడఁగఁడు నడ తెగె మానిసి మత్రచిట్టాడనియాచిట్టడవి నెట్లు చననేర్తు..." పి. శకుం. ౨, ఆ. ౯.

నడదివియ. ద్వ.వి. (నడ+దివియ.) కరదీపిక, కాగడా. "సీ. నడదివియలు నేసె నగరికి మాణిక్యమకుటముల్ పూనినమనుజపతుల." భార. విరా. ౫, ఆ. ౩౨౦. స్వా. ౫, ఆ. ౭౧.

నడదీఁగె. ద్వ. వి. (నడ+తీఁగె.) నడక కలతీఁగె. "ద్వి. నడదీఁగెలో యన నవకంపుఁగాంతి, కడు నొప్పు మేనులు ఘనసితంబులు, చిఱుతనవ్వులు తీయచెఱువ్వులు గల్గు, తెఱవలు పలరాజుదీమంబు లవఁగ." రం. రా. ఉ. ౧౧౦. పు.

**నడదీవ.** = నడతీఁగె. "చ...భూమిభృత్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి లేఁజిగురుల్ ధరించి వచ్చిననడదీవపోలె నలిచెం దరుణేందుకిరీటసన్నిధిన్." హర. ౩, ఆ. ౬౯.

**నడపందిరి.** దే. వి. (నడ+పందిరి.) ప్రయాణకాలమందు రాజాదుల కుపచారమునకై పరిచారకులు మోసికొనిపోవుపందిరి. "ద్వి. ఉడువీథి గప్పి సమున్నతలీల, నడపందిరులు వెలిగొడుగులు దనర." బస. ౨, ఆ. ౧౬౨. పం.

**నడపాడు.** దే. అ. క్రి. (నడపు+ఆడు.) నడచు, తిరుగు. "క. కూర్చుండ సురమునం జన, నేర్చును విద్దెంబు సేయనేర్చును భీతిం, దార్చుచుఁ దప్పటడుగు లొడఁగూర్చ జననిచెట్టపట్టుకొని నడపాడున్." ద్వా. ౩, ఆ. ౪౯. కు సం. ౩, ఆ ౩౨.

**నడపించు.** దే. స. క్రి. (నడచు ధా. ప్రే.) 1. నడవఁజేయు, చరింపఁజేయు. "సీ. పూరియుఁ గట్టియల్ నీరును గలపథంబున నీన నడపించుభూరిశక్తి." ఉ రా. ౪, ఆ. ౧౪౬. నైష. ౪, ఆ. ౭; 2. ప్రవర్తిల్లఁజేయు. "గీ...నీయభ్యనుజ్ఞ, ననుమతింపుము...రాజు నడపింప కెట్లు ధర్మంబు నడచు." కాశీ. ౬, ఆ. ౩౧.

**నడపీనుఁగు.** దే. వి. (నడ+పీనుఁగు.) నడచుశవము. "ఆ...అర్థంబు సుమ్మీ సకలధర్మకారి, యొడమె లేనివాఁడు నడపీనుఁ గనునహా, సోక్తి వినమె దాని నూఁదవలదె." భార. శాం. ౧, ఆ ౧౯. సు. శ. ౪౩.

**నడపు.** దే. స. క్రి. (నడచు ధా. ప్రే.) 1. గమనింపఁజేయు, నడవఁజేయు. "ఆ. మూలబలముతోడ మోహరంబుగఁ దీర్చి, సుమతిసుతుఁడు సైన్యసమితి నడపె." విక్ర. ౫, ఆ. ౧౪. ఉ. రా. ౨, ఆ. ౩౨౯; 2. ప్రవర్తిల్లఁజేయు. "వ...పూజ్యులయందెల్లఁ బూజ్యుండవై వేదచోదితవిధానంబులయందు విప్రసహాయుండవై భువనంబుల నడపు మని విశ్వగురుండు వైశ్వానరుం బ్రార్థించి." భార. ఆది. ౧, ఆ. ౧౪౪. హరి పూ. ౧, ఆ. ౧౦౩; 3. జరుపు, సాగించు. "సీ. వెలివెలివస్తువుల్ విడిచెం బో నరుఁడు కర్తృత్వం గాదె శరీరయాత్ర, నడపువాఁడది మోక్షణంబు కానేరదు..." భార. శాం. ౧, ఆ. ౧౪. అను. ౪, ఆ. ౧౯౦; 4. ఆచరించు, అనుష్ఠించు. "గీ. వరుస నడపిరి వీరశైవవ్రతంబు." హర. ౨, ఆ. ౧౧౯. భార. అను. ౪, ఆ. ౪౦౧; 5. పోషించు. "చ. పడసితి నిమ్మహాత్ముల నపాయము నొందకయుంటఁ బెంచుచున్, నడపుమటంచు నన్ను మునినాథుఁడు మీజనకుండు పంచి.." భార. ఆది. ౧, ఆ. ౩౦౫. చంద్ర. ౪, ఆ. ౯౬; 6. సమకూర్చు. "క. కోడండ్రకు సొమ్ములు, కోకలు ననులేపనములు కొదయించుకయున్, లేక ప్రవర్తిల నడపెన్, నాకులతం గొమరుడెంద మలరారుటకై." కళా. ౬, ఆ. ౧౧.

వి. 1. గమనము, నడక. "సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁ జూచు నడపు కాంతికి వింత తొడవు గాఁగ." భార. విరా. ౧, ఆ. ౨౪౫. ఉ. హరి. ౫, ఆ. ౫౧; 2. ప్రవర్తనము. "ద్వి. నడచె నీశ్వరుఁ బ్రసన్నతఁ జేయఁబూను, నడ పిట్టిదని చూప నడచినయట్లు." పండితా. పురా. ౯౨. పు.

**నడపుకొను.** దే. స. క్రి. (నడపు+కొను.) పోషించు. "గీ. అరమరలు లేక మీయుపాధ్యాయు వలెను, నడపుకొనువార లెవ్వ రున్నారు గనుక." విప్ర. ౪, ఆ. ౬౫.

**నడబావి.** దే. వి. (నడ+బావి) నడచిపోవుటకు మెట్లేర్పఱచినబావి, దిగుడుబావి. "సీ. విమలంబులై నకూపములు నూఱిటికంటెఁ బరికింప నొకనడబావి మేలు." కృ. శకుం. ౩, ఆ. ౧౧౭. తపతీ. ౩, ఆ ౯.

**నడమామిడి.** దే. వి. (నడ+మామిడి.) నడక కల మామిడి. "క. కలయఁగ గరములఁ జరణం, బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం, దలిరెసఁగిన నడమామిడి, చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్." భార. భీష్మ. ౩, ఆ. ౨౨౩.

**నడయాడు.** దే. అ. క్రి. (నడ+ఆడు.) 1. సంచరించు. "చ...కొమ్మమాత్రమా, యలరెడుముద్దుగుమ్మ నడయాడెడుబంగరుబొమ్మ గాక..." దశా. ౨, ఆ. ౩౧౫. "సీ. నడయాడుకొండలవడువున వేదండతండంబు లొండొండ మెండుకొనఁగ." కృష్ణ. ౩, ఆ. ౭౧; 2. వీచు. "క...ప్రాణులపై నడయాడెం బలుసెకలగాడు పక్కాఱమునన్." సమీర. ౨, ఆ. ౯౩. దశా. ౨, ఆ. ౩౭౯; 3. ఉండు, నివసించు. "క. వచ్చెఁగదభేదంభ మన కిఁక, నిచ్చట నడయాడఁ గూడ దెట

కేనిత్రము నేవచ్చెద రమ్మటులైన, న్వీచ్చలవిడి నడవవచ్చు వెఱవకు మదిలో." శుక. 3, ఆ. ౫౦౨; 4. చలించు. "ద్వి ..సరులు, నడయాడు చున్నకిన్నరపతుల్ నడవ..." అచ్చ. యు. ౨౪౮. పు.

నడవ. దే. వి. 1. తలవాకిటికిని నడిమివాకిటికిని నడిమి చోటు, అళిందము. వ్యవ:-ఆతఁడు నడవలో నున్నాఁడు; 2. సేతువు. "గీ. నడవ గావించు చున్నయన్నలునిసేతు, కర్మకౌశల మీక్షించు గగనచరుల, కనిమిషత్వంబు చరితార్థ మయ్యె నపుడు." భా. రా. యు. ౨౫౨; 3. మార్గము. "ఆ...మార్గంబు,తెరువు త్రోవ దారి తెన్ను సరవి,చనుప నడవ చొప్పు జాడ డొంక యనంగఁ, బొలుచుచుండు..." ఆం. భా. ద్వి. ౮. "వ... కూలినబావి తెలంగున నడవ లేక..." కవిక. ౪, ఆ. ౧౧౩.

నడవడి. దే. వి. 1. గమనము, నడక. "సీ. నడవడి గలదివ్యనాగదంతములట్లు...గీ...పెలసి రన్న లువు రంత." చం. రా. ౨, ఆ. ౫౩. సీతారా. ౧, ఆ. ౧౮౦; 2. ప్రవర్తనము. "చ. నడవడి మంచిదైనను జనంబులు పెద్దఁగఁ జూతు ర త నిక్, నడవడి చక్కఁగానినరు నచ్చినచుట్టము లైనఁ జేర నీ,కెడ గలుగంగఁ దోలుదురు .." నా. పంచ. ౧, ఆ. ౧౦౬. భార. ఉద్యో ౨, ఆ. ౩౯; 3. ధర్మము, న్యాయము. "గీ. మఱియు మఖములు మహితకర్మములుఁ దంత్రములును నడవళ్లు నాశ్రమములుఁ దదీయముఖచతుష్కము నందునఁ బొడమె ననిన." భాగ. ౩, స్కం; ౭౮౭. భార. శాం. ౨, ఆ. ౨౫౭; 4. జీవనోపాయము, వృత్తి. "సీ. నడక యనంగను నడత యనంగను నడవడి యనగను నడరు వృత్తి." ఆం. భా. ద్వి. ౨౨౮.

నడవడిక. దే. వి. ప్రవర్తనము. (శ. ర.)

నడికించు. దే. స. క్రి. (నడుఁకు ధా. ప్రే.) వడఁకించు. "సీ...తురగచయము. ఆ నాల్గుసాయకముల నడికించి సారథి, నొక్కమార్గణమున నుబ్బణంచి, యార్చుటయును ద్రోణుఁ డలిగి .." భార. ద్రో. ౪, ఆ. ౭.

నడికట్టు దే. వి. (నడుము+కట్టు.) కాసె, దట్టీ. 'సీ అరచట్టమయి కంఠమాంబువునడికట్టు చెంగావిమై జెగఁ జికిలిసేయ." రా. వి. 3, ఆ. ౧౨౫. దశా. ౧౦. ఆ. ౧౧౨.

నడికట్టుత్రాడు. దే. వి. ఏనుఁగు మొదలగువానినడుమునకుఁ గట్టెడుత్రాడు. "క ...తద్వే,దండము నడికట్టుత్రాళ్లఁ దగ బంధించెన్." కళా. ౮, ఆ. ౮౬.

నడికలను. దే. వి. (నడుము+కలను) యుద్ధరంగము యొక్కనడిమిభాగము. "వ ..నడికలన నాటి వారిం దలంచుకొని..." ఉ. రా. ౪, ఆ. ౨౮౧.

నడికిరే. ద్వ. వి. (నడుము+రే.) అర్ధరాత్రము. "సీ. అతఁడును దద్భావ మరయంగ మదిఁ గోరి రూపించి యొకపరి రేప వత్తునని పోయి నడికిరే యర్థితోఁ జనుదెంచు..." భా. రా. అర ౭, ఆ. ౩౨౨. స్వా. ౧, ఆ. ౫౬.

నడికిరేయి. ద్వ. వి. (నడుము+రేయి.) అర్ధరాత్రము. "గీ. ఈనడికిరేయి నొంటిమై యింతదూర,మేమి కార్యంబు మదిఁ గోరి యేఁగుదెంచి,తి..." హర. ౭, ఆ. ౧౨౩.

నడిగండి. దే. వి. (నడుము+గండి.) ఆఁడుగుఱి, యోని. "సీ. తొడపల్చ నగునింతినడిగండి కడుఁ బెద్ద రిత్తునిమనసుకోరికలు పెద్ద." వేణు.శ. ౨౦.

నడితల. దే. వి. (నడుము+తల.) శిరోమధ్యము. "చ. నడితల యూరుజానుజఘనప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ, బిడుగులఁ బోలుపెన్గదలఁ బెట్టుగ వ్రేయుచు..." భాగ. ౧౦, స్కం. ఉ. ౭౩౬. హరి. ఉ. ౨, ఆ. ౬౧.

నడిలి. దే. వి. ప్రవర్తనము. (బ్రౌ. శ. ర.)

నడిపించు. దే. స. క్రి. (నడుచు ధా. ప్రే.) 1. గమనింపఁజేయుట. "గీ. ఘల్లుఘల్లునఁ బెండెంబు గందు మూలు,గదల నల్లన నడిపించి పాదివి తెచ్చె,నెచ్చెలులవిందు యుంవతి నాన్నపతికడకు." స్వా. ౬, ఆ. ౫; 2. జరిగించు, సాగించు. "గీ. అనినఁ జెలు నవ్వ నవ్వి యజ్జనవరాగ్ర,గణ్యుఁ డతనికిఁ గట్టు వర్గంబు లొసఁగి, మంచి దటువలెనే నడిపించు కొంద,మంచు వీడ్కొల్ప నాదైత్యుఁ డరుగుట యును." కువల. ౨, ఆ. ౧౦౪; 3. తోలు. "క. అరదము దశముఖుమీఁదం, బరువడి నడిపింపు వేగ మాతలి యనుచున్." ఉ. రా. ౪, ఆ. ౩౩౪.

నడిప్రొద్దు. ద్వ. వి. (నడుము+ప్రొద్దు.) మధ్యాహ్నము. "క. కరికలభంబులు నిర్ఝర, సరిదంబులు పెల్లి చిమ్మి శ్రమ మఱఁజేయం,గ రథంబు నిలిపి

యప్పురి, తెరువున నడిప్రొద్దు ప్రొద్దు తిరమై నిలుచున్." రామా. ౧, ఆ. ౧౩౩.

నడిమికట్టు. దే. వి. (నడుము+కట్టు.) నడుమునకు కట్టుకొనెడికట్టు. "సీ. కటిమండలంబునఁ గరకంచు పుట్టంబు మడఁచి కట్టినమేలినడిమికట్టు." హర. ౨, ఆ. ౯౩.

నడిమిలోకము. ద్వ. వి. (నడుము+లోకము.) భూలోకము. "గీ. కారణం బేమి నడిమిలోకమున నుండి, నరపతులు రాక మునువోలె నాకమునకు." నైష. ౩, ఆ. ౮.

నడిరాతిరి. ద్వ. వి. (నడుము+రాతిరి) నిశీథము. "సీ ..నడిరాతిరి యన, నడిరేయి యనఁగ..." నిశీథాఖ్య దగు..." ఆం. భా. ప్ర. ౮౪.

నడిరేయి. ద్వ. వి (నడుము+రేయి.) అర్ధరాత్రము. "ఉ . కొక్కొరోకొయని కూయఁడే యతఁడు గుక్కుటమై నడిరేయి గౌతమప్రేయసిఁ బొందఁ గోరి..." నైష. ౮, ఆ. ౭౯. భార. సౌ. ౨ ఆ.౩.

నడివ్రేలు. దే. వి. (నడుము+వ్రేలు.) నడిమివ్రేలు, మధ్యమ. "గీ. నడివ్రేలన మధ్యమ నెగడు..." ఆం. భా. ౭౨. ౧౩౯.

నడుఁకఁబడు. ద్వ అ. క్రి. (నడుఁకన్+పడు స్వార్థమున.) నశించు. "వ...నిజదాసజనపాపతాపత్రయచయమ్ముల నడుగక నడుఁకఁబడఁజేయుఁ నడుగుతండంబులును .." ఘటికా. ౨, ఆ. ౬౫.

నడుఁకు. దే. అ. క్రి. 1. ఒదుఁగు, వంగు. "గీ... అధిపసుతుఁడు, నడికి నడికి యల్లల్లన నడిచి పట్టెఁ, బాణిపద్మద్వయంబునఁ బసిఁడియంచ." నైష. ౧, ఆ. ౧౦౨. భాగ. ౬, స్కం. ౩౫; 2. లొంగు, లోఁబడు. "గీ. బ్రతుకఁ దలఁ తేని వినుము నాపనుపు సేసి, చక్రమాదిగ విడిచి మత్సంజ్ఞ యందిగి, నడికి చనుదెమ్ము నాశరణమ్ము సొరఁగ." హరి. ఉ. ౬, ఆ. ౧౯౦; 3. వడఁకు, కంపించు. "గీ. అమరుబృంహితహేషితఘుమఘుమితభుజాసమాస్ఫాలితంబులజడికి నడికి కులకుధరమండలము కలఁగుండువడియె." వసు. ౨, ఆ. ౧౫౨; 4. భయపడు; వెనుదీయు. "క. పెఱవార లధికభీతిన్, విరిగి చనిరి భీష్ముఁ డేచి వీర రథికులం, దఱఁ జూచి రాచకొడుకుల, నఱుమాడెడు భీముఁ డిట్లు నడుకం దగునే." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౭. కాశీ. ౨, ఆ. ౧౪౪; 5. నశించు. (చూ. నడుఁకఁబడు.); 6. బాధపడు. "చ...సుకుమారమూర్తులన్, గడుసుఖులైన వారలను గట్టెడినై వెసఁ గట్టి త్రోచితిన్, నడుఁకుచు వార లెవ్విధమునన్ దురపిల్లుచు నున్నవారొకో." వి. పు. ౫, ఆ. ౧౬౩. వి. భయము; కంపము. వ్యవః-నన్ను చూడఁగనే వానికి నడుఁకు పుట్టినది. (శ. ర.)

నడుఁకొత్తు. దే. అ. క్రి. (నడుఁకు+ఒత్తు.) భయము లేకుండు, నిర్భయుండగు. "సీ. దేవర మువ్వురే తెంచిరి వారిలో నడుఁకొత్తి కొంతసైన్యము వధించి. గీ. పవనహరిఁ గొంచు నెగసె నద్దివికి నొక్కఁడు..." జై. ౨, ఆ. ౪౧, ౩, ఆ. ౯౦.

నడుఁగు. దే. అ. క్రి. వడఁకు, కంపించు. "క. వాలు వయి నడచున ట్లబ్బాలిక నడునడుంగి భయమున నియమాభీలుఁ డగుపతికిఁ బవళుల్, రేలును నేమఱక పరిచరించుచు నుండెన్." భార. ఆది. ౨, ఆ. ౧౫౬, ౫, ఆ. ౨౧.

నడుకొన. దే. వి. (నడుమ+కొన.) నడిమిప్రదేశము. "వ...ఒక్కమోహారంబుగా నమర్చి యందగ్రభాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామసౌబలుల నునిచి నడుకొన శల్యు నిలిపి యన్నరేంద్రుండు వెన్ను దన్ని నిలుచునట్లు సేసె ననుటయు..." భార. ద్రో. ౫, ఆ. ౧౪౨. భార. విరా. ౪, ఆ. ౮౪.

నడుగడ్డ. ద్వ. వి. (నడుము+గడ్డ.) ద్వీపము, నలుదిక్కుల జలము గలభూభాగము. "సీ. కావేరి నడుగడ్డఁ గాపురంబుండును దివసాంతమున నీటఁ దిరిగివత్తు." కకు. ౧, ఆ. ౨౧౫. భోజ. ౫. ఆ. ౩౪౬.

నడుగాలు దే వి. (నడుము+కాలు.) గుఱ్ఱములశరీరలాఘవమునకై వెనుకకాళ్లకును ముందుకాళ్లకును గట్టెడుసాధనము. "గీ. కట్టుఁగొయ్యలతో నడుగాళ్లతోడ...పంచవర్ణరజ్జువులతోడ బహుముందరలు జనించె." వరాహ. ౪, ఆ. ౧౧౪

నడుగుంట. ద్వ. వి. (నడుము+గుంట.) తలనడిమిపల్లము, బ్రహ్మరంధ్రము. "సీ. చము రూర నడుగుంట నిమురుచుఁ దలయంటి యంగంబులెల్లఁ గక్కుఁగ దీటి." చంద్రా. ౨, ఆ. ౩.

నడుచు. = నడచు. 1. గమనముచేయు, సంచరించు. "చ. అడిగితి నొక్కనాఁడు గమలాసను తేరికి

వాఁడువంబనై, నడుచుచు...” నైష. ౨, ఆ. ౫౯. ఆము. ౧, ఆ. ౫౬; 2. వెడలు,పోవు. “సీ. నగజామనోనాథునగరికి నడుచువా రెడపక క్రొన్నెల ముడుచువారు.” భల్లా. ౨, ఆ. (శ.ర.) భీమ. ౨, ఆ. ౧౦౧; 3. ప్రవర్తించు, నడచుకొను. “వ...ఇంత విచారించి రుచించినట్లు నడువుము.” ఆము. ౬. ఆ. ౩౧; 4. కలుగు,పుట్టు “క. కామం బనుపురుషార్థము, సామము వినియు నిది దక్క నలినానన యే,నేమియుఁ నెఱుంగఁ జెపుమా,యేమిట నది నడుచు సిద్ధి యెమ్మెయిఁ బొందున్.” దశ. ౫, ఆ. ౨౬; 5. అనుభూతమగు, భుక్తమగు. “క...మన్నెవజీర్ణకు, నడుచు ముఖాసాలు గాక...”ఉ. హరిశ్చ. ౧, ఆ. ౬౬; 6. సరిపడు, అనుకూలించు. వ్యవ:-ఆమం దాతనికి నడువదు; 7. చేరు, అందు. “సీ. పని గల్గి యుండినఁ దనకు మంత్రులకు లేఁజిగురుబోఁడుల చేతఁ జేట్లు నడువ.” కువల. ౪, ఆ. ౧౦౧.

నడుజాము. ద్వ. వి. (నడుము+జాము.) అర్ధరాత్రము. “ద్వి. వారక నడుజాము వచ్చి పేఁడినను, కోరినధనములు కొండు కొం డచుచు” ద్వి. హరిశ్చ. ఉ. ౪౭౫. పం.

నడుతల. దే. వి. (నడుము+తల.) శిరోమధ్యభాగము. “సీ. నడుతల యందంద పిడికిట మెదళులు గలఁగంగఁ బొడిచి మోఁకాల నురుము,దాఁకింప..” హరి. పూ. ౯, ఆ. ౧౩౭. మార్క. ౩, ఆ. ౩౪౯. ఇట్లే: నడుదల, నడునెత్తి. భార. స్త్రీ. ౧, ఆ. ౯౯. ఉ. రా. ౩, ఆ. ౨౬.

నడుదిన్నె. దే. వి. (నడుము+తిన్నె.) ద్వీపము. “గీ. ద్వీపమున కగు నడుదిన్నె దీవి యనఁగ:” వేంక. మాన. ౪౬.

నడుదెస. ద్వ. వి. (నడుము+దెస.) మధ్యప్రదేశము. “క. వెలయుఁ బెనుబైలు నిషధాచలకూటము నందు నడుదెసన్...”వరాహ. ౧౦, ఆ. ౧౩౫.

నడునడు. దే. వి. వడఁకుటయం దగుననుకరణము. “సీ...భండనమున, వారిహేతిచ్ఛత్రవాహన ధ్వజములు నఱికిన నడునడు నడఁకి వార,ల భయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి...” భార. ద్రో. ౨, ఆ. ౨౦౬. భార. ఆది ౨, ఆ. ౧౫౬.

నడునీరు. దే. వి. (నడుము+నీరు) నీటినడిమిభాగము. “క. వననిధినడునీటఁ గలము, మునిఁగిన బెగడందుచిత్తములు గలిగినతజ్జనుల క్రియ నున్న సేనలు ..” భార. ద్రో. ౧, ఆ. ౨౬.

నడుపాడు. దే. అ. క్రి. (నడుపు+ఆడు.) నడుచు, సంచరించు. “సీ. నడుపాడ నేర్చినవకంపునునుఁదీఁగమురి పెంపుఁ బూనినవిరులయెత్తు.”కేయూర. ౪, ఆ. ౩౦.

నడుపు దే. స. క్రి. (నడుచుధా. ప్రే.) 1. ప్రవర్తింపఁజేయు. “క. పెక్కండ్రు గూడి సమయం, బొక్కటి కల్పించి నడుపుచుండుదురేనిన్, నిక్కముగా నాసమయము, పక్కని చెల్లించుట యును ధర్మము పలికిన్.” విజ్ఞా. ప్రా. ౩౯; 2. ఆచరించు,చేయు. “సీ. నైజంబు లగునిత్యనైమిత్తికంబులు నడుపుచో బ్రహ్మార్పణంబు చేసి” కాశీ. ౧, ఆ. ౨౩. శేష. ౪, ఆ. ౨౬; 3. పోషించు. “క. ఇడ నని విడువం జెల్లునె, నడుపవలయు నేర్చినట్లు నమ్మకయె కృపన్.” ఆము. ౪, ఆ. ౨౩౩; 4. తోలు. “గీ. అమరవిభుతేరు మాతలి యపుడు నడిపె.” ఉ. రా. ౪, ఆ. ౩౨౧. వి. గమనము, నడక. ‘గీ. మురిపముల నుజ్జగించిన ముగుదనడుపు, కలికిమాపుల పీడొన్నకన్నుఁగవయుఁ.” ఉ. హరి. ౧, ఆ. ౧౭. కళా. ౬, ఆ. ౨౫౦.

నడుమంతరము. మి. వి. (నడుము + అంతరము - శ. ర.) 1. కౌను, అవలగ్నము; 2. మధ్యకాలము. (చూ. నడుమంత్రము.) విశ. మధ్యకాలమునఁ గలిగినది. “గీ. చక్రభావనచేఁ గాంచి శక్తిఁ దనకుఁ,బ్రాపు గలుగుటనో లేమిఁ బాపుకొనియొ, వెలఁది నడుమ్మంతమాత్ర నే విఱ్ఱవీఁగె, నహహ నడుమంతరపుఁగల్మి కది నిజంబు.” అనీ. ౩, ఆ. ౧౦౦. (విశేష్యవిశేషణార్థముల కిదియే యుదాహరణము.)

నడుమంత్రము. మి. వి. (నడుము+మంత్రము ?) 1. కౌను, అవలగ్నము. “క. నడుమంత్రము కుచభారము, నడుమంత్రము సైఁపదు...”శృంగార రసాలవాలము. ౨, ఆ. (శ. ర.); 2. మధ్యకాలము. “మ. నడుమంత్రంబున బల్మిఁ దెచ్చుకొని యన్యాయంబునన్ మూర్ఖుఁ డెవ్వఁడు వారిన్ దొడరంగఁ బోయి మడియున్...” ఉ. రా. ౨, ఆ. ౯. విశ. మధ్యకాలమునఁ గలిగి

నది. "చ. అతివచుచంబులుక్ మెఱుఁగుటారుచు వేనలియుక్ ధరాధిపోన్నతియు నహీనభూతి కలనంబు ఘనాభ్యుదయంబు నిప్పు డొంద,దితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగె డుక్,క్షితి నటుగాదె యొక్కొకరికిక్ నడుమంత్రపుఁగల్మి కల్గినన్." విజ. ౧, ఆ. ౩౪. వి. పు. ౭, ఆ. ౧౫౬.

నడుము. దే. వి. ఔ. (వృత్తియందు వికల్పముగా 'నడి, నడు' అగును.) 1. కౌను, అవలగ్నము. "సీ. ఘనమైనరారాపుచనుదోయిరాయిడి నిఱుపేదనడిమికి వెఱపుఁ జూప." కాశీ. ౧, ఆ. ౯౦. పి. శకుం. ౨, ఆ. ౮౦; 2. మధ్యభాగము, మధ్యప్రదేశము. "చ...ఎదిర్చినదుస్ససేనువిల్, నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల..." భార. కర్ణ. ౧, ఆ. ౨౦౨ భార. ఆది. ౬, ఆ. ౮౧; 3. మధ్యకాలము. "క. అనఘా యీ యజ్ఞమువిధి, సనాథబుత్విక్ప్రయోగసంపూర్ణం బయ్యెను గడచన నేరదు నడుమన యుడుగును భూసురోత్తమవిత్తమునన్." భార. ఆది. ౨, ఆ. ౨౦౯. కళా. ౫, ఆ. ౩౨. విణ. మధ్య నుండువాఁడు; మధ్య నుండునది. "ఆ. పూర్వదత్తయైనభూమి నెవ్వఁడు పుచ్చికొనియె నతఁడు తనదుకులమువారి, నిరువదొక్కతరము నరకవాసులఁ జేయుఁ,దాను నడుమ గాఁగ ధర్మనిరత." భార. అను. ౨,ఆ. ౩౬౫. విక్ర. ౮,ఆ. ౯౫.

నడుముకట్టు. దే. అ. క్రి. (నడుము+కట్టు.) సిద్ధపడు. వ్యవ:- ఆకార్యమున కందఱు నడుముకట్టి పనిచేయవలయును.

నడుముకొను. దే. అ. క్రి. (నడుము+కొను.) సన్నద్ధమగు. "లయవిభాతి. కడలుకొనురౌద్రమునఁ గడఁగి సమరోత్సవము వెడపడకయుండ నొగి నడుముకొని శక్తిం,దడఁబడక వేర్చి పడి నడుగులిడు వేగమున..." భా. రా. యు. ౧౮౪౩.

నడుముదాఁకు. దే. స. క్రి. (నడుము+తాఁకు.) ఎదిరించు, ఎదుర్కొను. "సీ. నల్లచీమలబారు నడుముదాఁకినవీఁక నున్నదీచెలువంపుఁగన్నెయారు." విజ. ౨, ఆ. ౧౦౬.

నడురాతిరి. ద్వ. వి. (నడుము+రాతిరి.) అర్ధరాత్రము. "ఉ. అతరళాక్షి యొక్కతియ యానడురాతిరి పెక్కుమోసలల్, వేతఱియంగఁ దూరి..." వాసిష్ఠ. ౬, ఆ. ౧౭౭.

నడురే. ద్వ. వి. (నడుము+రే.) అర్ధరాత్రము. "క. అప్పృష్టివరుం డాత్మజు, నావిర్భావం బెఱింగి యంతర్గృహముక్, వేవేగఁ జొచ్చి నడురే, యాపనజాపుఁడు పొడిచినట్లై యుండన్." హరి. పూ. ౫, ఆ. ౧౧౮. అము. ౧, ఆ. ౧౮౪.

నడురేయి. ద్వ. వి. (నడుము+రేయి.) అర్ధరాత్రము. "క. నడురేయి సంధ్యలందును, నడవఁగ నోడుదు రశక్తనరులు..." భార. ఆది. ౭, ఆ. ౩౯.

నడులేఁత. దే విణ. (నడుము+లేఁత.) మిక్కిలి లేఁత ముదురు కానిది.

నడ్కిరేయి = నడికిరేయి. (అర్ధరాత్రము.) "ఉ. ఒక్కటఁ బిక్కటిల్లి యిరులో యన నో యను నడ్కిరేయిఁ బెం,పెక్కిన తెంపునం బురి మహేశ్వరధామముఁ జొచ్చి." ఉద్భ. ౨, ఆ. ౧౩౭.

నడ్డి. దే. వి. నడుము, అవలగ్నము. "గీ. పెటికయే చాలు నానడ్డి విఱుగఁ జేయ,దానిపైఁ దాను నెక్కు నింతయును గాక..." శుక. ౩, ఆ. ౪౦౬. విణ. చప్పట. "ద్వి. నరసినగడ్డంబునడ్డినాసికయు." సభా. ౩, ఆ. ౪౩౧.

నడ్డిగుంట. ద్వ. వి. (నడ్డి+గుంట.) నడ్డిక్రిందగుంట, కుకుందరము. (శ. ర.)

నడ్తి = నడిలి. (శ. ర.)

నడ్ము=నడుము. దే. వి. (మధ్యభాగము.) "గీ...వారలకు మనకుఁ, బొసఁగునే నడ్మఁ బెట్టినఁ బూరిగాలు." ఉ. హరి. ౫, ఆ. ౧౫౯. (శ. ర. పా.)

నడ్వా. సం. వి. ఆ. స్త్రీ. కిక్కసవామి.

నడ్వంతము. సం. విణ (త్. ద్వ. తీ. త్.) కిక్కస కసవు అధికముగాఁ గలది. (దేశము.)

నడ్వలము. సం. విణ. (అ. ఆ. అ.) = నడ్వంతము.

నతము. సం. వి. అ. పుం. నందివర్ధనముచెట్టు. విణ. (అ. ఆ. అ.) 1. నమ్రము, వంగినది; 2. నమస్కరించునది; 3. వంకరైనది; 4 అణఁగినది; లోఁతైనది. "మ...నతనాభిక్ నవలా నొకానొకమురున్నారీ శిరోరత్నమున్." స్వా. ౬, ఆ. ౨౫.

నతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వంగుట; 2. వంపు, వంకర; 3. నమస్కారము, మ్రొక్కు. "గీ. సత్త్వగుణమున హరివై రజస్తమోగుణముల శంభుఁడ వగుచు నీకు నతి విరించి." కాశీ. ౨, ఆ. ౫.

నత్త. దే. వి. క్షుద్రశంఖకీటకము. "గీ... నత్త నాఁ జెలఁగు క్షుద్రశంఖకీటంబు..." ఆం. భా. ద్వి. ౮౨.

నత్తగుల్ల. ద్వ. వి. (నత్త+గుల్ల.) క్షుద్రశంఖము, కీటకవిశేషము. "సీ... నత్తగుల్ల చుట్టుడుగుల్ల పరిమిఁద... గీ. అది కొఱగానిజంతువులు..." హంస. ౪, ఆ. ౧౮౬.

నత్తి. దే. వి. తడఁబడుచు మాటలాడుట కలవ్యాధి విశేషము. (వ్యవ.)

నత్తివాఁడు. దే. వి (నత్తి+వాఁడు.) నత్తి కలవాఁడు, లోహాలుఁడు. "సీ... నత్తివాఁ డన లోహాలవాచక మగు." ఆం భా. తృ. ౧౨.

నత్తు. దే. అ. క్రి. తడఁబడుచు మాటలాడు. (శ.ర.) వి. ముక్కుపోఁగు, నాసాలంకారవిశేషము. "ఉ. కెంపులఁ జేసె మోవి నునుఁగెంపుచొక్కాటపునత్తు ముత్తెపుం, గుంపులఁ జెక్కుటద్దములఁ గూర్చిన కస్తురివ్రాఁతగంబురా, సొంపొనరించె... ఇంతికిన్..." ముకుంద. ౨, ఆ. ౧౯.

నదపతి. సం. వి. ఇ. పుం. సముద్రము.

నదము. సం. వి. అ. పుం. 1. పడమరగా పాఱెడి యేఱు. (సింధువు, శోణము, భిద్యము, బ్రహ్మపుత్రము, భైరవము, దామోదరము. మొ. నదములు. పడమరగా పాఱెడివానిలో నర్మదానది తప్ప తక్కినవి నదములు; తూర్పుగా పాఱెడివి నదులు.)

నది. సం. వి. ఇ, ఈ. స్త్రీ. ఏఱు; ఆమడకు మీఱి పాఱెడియేఱు.

నదిసుతుఁడు. సం. వి. అ. పుం. భీష్ముఁడు. "క. మదమున రణమొనరించిరి, నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్." భార. అది. ౧, ఆ. ౬౯.

నదీదోహదము. సం. వి. అ. పుం. ఏఱుదాఁటుటకై పడవవాని కిచ్చుకూలి, ఓడకేవు.

నదీమాతృకము. సం. విశే. (అ. ఆ. అ.) ఏటిసీళ్ల చేత పండెడుపైరు కలది.

నదీముఖము. సం. వి. అ. న. ఏఱుసముద్రములో కలియుచోటు.

నదీశుఁడు. సం. వి. అ. పుం 1. సముద్రుఁడు; 2. [వరుణుఁడు.

నద్ధము. సం. వి. అ. న. ముడి, బంధము. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది, బద్ధము; 2. కూర్పఁబడినది; 3. పైకెత్తఁబడినది, ఉద్వృత్తము. (నిక్కినది అని కొందఱు.)

నద్ధి. సం. వి. ఇ. స్త్రీ. కట్టుట, బంధించుట.

నద్ధ్రి. సం. వి. ఈ. స్త్రీ. గుఱ్ఱమునకు కట్టెడువాఱు, టంగువాఱు.

నన. దే. వి. 1. పువ్వు, పుష్పము. "మ. వనితల్ నవ్వఁగఁ గొఁగిలింపఁ గన నిశ్వాసింప గానం బొనర్ప నదల్పన్ బలుకన్ ముఖాసవము గూర్పన్ దన్న నంట న్ననల్, మొనపుల్ బొన్న... మావియుఁన్." రామా. ౧, ఆ. ౧౯౦. పారి. ౪, ఆ. ౧౬; 2. చిగురు, పల్లవము. (చూ. ననలెత్తు.); 3. మొగ్గ, కోరకము. "క. గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ,గర మలుకన్ మావి యపుడు గఱచిన నునువా,తెరమీఁదఁ గాననగుపలు,వరుసయన న్ననలు పల్లవముపై మొనసెన్." పారి. 3, ఆ ౪౮. ఆము. ౫, ఆ. ౧౧3; 4. అంకురము, మొలక. (చూ. ననలెత్తు.)

ననంద. సం. వి. ఆ. స్త్రీ. మగనితోడఁబుట్టినస్త్రీ, ఆఁడుపడుచు.

ననఁబోఁడి. దే. వి. (నన+పోఁడి) పువ్వువలె మనోజ్ఞురాలగుస్త్రీ, స్త్రీ. "చ. పురుషుఁడ కాంచి చూడ ననఁబోఁడివి గావు.." బ్రహ్మో. 3, ఆ. ౨౬౧. నీలా. ౧, ఆ. ౮౯.

ననఁబోణి = ననఁబోఁడి. "సీ. నుడువుల ననఁబోణి జడియకు మని వెన్నుసఱచుప్రాణేశు రిచ్చపడి చూచె." దశా. ౨, ఆ. ౫౫. [(శ. ర.)

ననకారు. ద్వ. వి. (నన+కారు.) వసంతకాలము.

ననతేనియ. దే. వి. (నన+తేనియ) పూఁదేనె, మకరందము. "సీ. నునుఁగావిజిగిమోవి ననతేనియల బావి..." నీలా. ౧, ఆ. ౫౬

ననసీరు. ద్వ వి. బొ. (నన+సీరు.) పూఁదేనె, మధువు. "సీ. ననసీట గుప్పలించెను గళావతి యొత్తు జిగిమోవి బీఁటిక లెగయకుండ." భాను. ౨, ఆ ౭౪.

ననయు. దే. అ. క్రి. 1. పూచు; 2. చిగిరించు. (శ.ర.)

ననలెత్తు. దే. అః క్రి. (ననలు+ఎత్తు.) 1. మొలకలెత్తు. "గీ. పడినగింజలు ననలెత్తి పండె ధరణి." ఉ. రా. ౫, ఆ. 3౧౮; 2. చిగిరించు, పల్లవించు. "సీ. గంధర్వకలకంఠకంఠులు స్థాణువుల్ ననలెత్త మధురగానంబుసేయ." దశా. ౨, ఆ. ౨౪౮. కృ. శతక. ౧; ఆ. ౭౧.

ననలొత్తు. దే. అ. క్రి. (ననలు+ఒత్తు.) అంకురించు, పుట్టు. "చ... రోమశుండు తత్ప్రియంటికి లేక

నవ్వు ముఖపద్మమునన్ ననలొత్త .." హ. వరాహ. ౧, ఆ. ౩. పు.

ననవిలుకాఁడు. దే. వి. (నన+విలు+కాఁడు.) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు. "చ. ననముకాఁడ మన్మథ యనాథవధూవధపాతకంబు నీకొ, గొని మునిఁగించె..." నైష. ౨, ఆ. ౧౩౯.

ననవిలుకానన్న. దే. వి. బ్రహ్మ. వేంక. దేవ. ౬.

ననవిలుకానిపోరు. దే. వి. షో. అనా. మన్మథక్రీడ, సురతము. "చ...ఇద్దఱు నేరకాంక్షతో, ననవిలుకానిపోరునఁ బెనంగెడువేళ నిజేశ్వరుం డొగిన్." హంస. ౩, ఆ. ౧౦౩.

ననవిల్తుఁడు. దే. వి. (నన+విల్తుఁడు.) పుష్పధన్వుఁడు మన్మథుఁడు. "సీ. ననవిల్తుశాస్త్రంపుమి ను కులావర్తించుపని వెన్నతోడఁ బెట్టినది మాకు." స్వా. ౨, ఆ. ౪౩. భీమ. ౩, ఆ. ౨౧౧.

ననాంద. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుఁబడుచు.

ననుఁబ్రాయి. దే. వి. (నాను+ప్రాయి.) బాగుగా నుడుకనిబియ్యము. (చూ. ననుఁ బ్రాయిచూపు.)

ననుఁబ్రాయిచూపు. దే. అ. క్రి. (ననుఁబ్రాయి+చూపు.) సరిగా నుడుకకుండు, నడిమిపలుకగు. "సీ. నడుములు నులియక ననుఁబ్రాయిచూపక... గీ...స్వాదుతర మైనచొక్కపు టోదనమ్ము." సాంబో. ౯, ఆ. ౨౯౯.

ననుఁబ్రాయివడు. ద్వ. అ. క్రి. (ననుఁబ్రాయి+పడు.) ననుఁబ్రాయియగు. "క. బిరుసింత గాక నడిమికి, మురియక ననుఁబ్రాయివడి నిముడఁబాఱక యే, బెరికిరాను లేక మిక్కిలి, గరగర నగునేయుఁ బాలకలమాన్నంబుల్." జై. ౭, ఆ. ౯౯౭.

ననుచు. దే. అ. క్రి. 1. పూచు. "చ. తరుణుల కౌఁగిటన్ ననుచుతమ్ము వృథా విరులెత్తి చేసె మోపరులుగఁ జైత్రుఁడు .." ఆము. ౯, ఆ. ౧౨౬. నైష. ౩, ఆ. ౪౭; 2. చిగిరించు, చిగుర్చు. "ఆ. పీచి ననిచి పూచి కాచి పండిన .." య. ౧, ఆ. ౩౫; 3. మొగ్గయెత్తు. "గీ...కోరకితం బొప్పు ననిచిన దన." ఆం. భా. ద్వి. ౩౯; 4. వికసించు "చ. అనిన మహాప్రసాద మిపు డానతి యిచ్చితిరే కదా యికం, గనఁబడఁ దెల్ప నేమిటికిఁ గార్యముఖంబున స్వామిచిత్త మే,ననుచు నదేల కావలసినన్ దనుజున్ వధియింపఁజాలరే, నన్నుఁ గరుణావలోకనమునన్ ఘనుఁ జేయఁగఁ గాక వచ్చుటల్." కువల. ౨, ఆ. ౪౪. ఆం. భా. తృ. ౧౦౧; 5. అనురాగమొందు, ప్రీతినొందు. "క. ననిచినప్రియుఁడవు భర్తవు, ననుసమబంధుఁడవు నాకు .." భా. రా. కిష్కి. ౩౪౦. భీమ. ౨, ఆ. ౯౨; 6. అతిశయించు. "వ...ననిచిన కుతుకంబునం గపటనటనపరిచయంబునం గాని వీనిఁ జొక్కింపరా దని వితర్కించి..." విప్ర. ౨, ఆ. ౭౯. అచ్చ బాల. ౫౩; 7. ఇంపగు. (శ. ర.); 8. అంకురించు, జనించు. "చ. అనఘుఁడు యాజ్ఞవల్క్య గురునంఘ్రులకుం బ్రణమిల్లి నామదిన్, ననిచినభక్తితోఁ బలికినాఁడను..." వి. పు. ౪, ఆ. ౭౫. పాండు. ౧, ఆ. ౧౪౯.

ననుపు. దే. స. క్రి. (ననుచు ధా. ప్రే.) వికసింపఁ జేయు. "సీ. కళలీను నెలకూన కాదేని యీచాన నయనోత్పలంబుల ననుపు టెల్లు." దశా. ౨, ఆ. ౩౦౬. వి. 1. అనురాగము. "క...ననుపునఁ జని రతని వేణునాదంబునకున్." వి. పు. ౫, ఆ. ౨౫౭. దశ. ౬ ఆ. ౧౮౦; 2. ఇంపు, ఒప్పు. "ఉ. చామని మేనులున్ ననుపుఁ జల్లెడు మోములలోనఁ గల్గుబల్, గోములు మానపుంబొడవులుం బిడికింట నడంగుకౌనులున్." శుక. ౨, ఆ. ౩౩౧. విశే. 1. అధికము. "గీ. మనములో నిండియున్నది ననుపుఁగూర్మి, యింక లజ్జాభయమ్ముల కెడము గలదె." నైష. ౫ ఆ. ౯౯౧; 2. అనురాగము కలవాఁడు. "క. అని యొడఁబడుటయు నమ్ముని, యనురాగము చెంగలింప నంబురుహానిభా, ననతోడి సురతసుఖముల, ననుపై పెక్కేడులు నటనంబులు చేసెన్" వి. పు. ౨, ఆ. ౨౨౦ ప్రబోధ. ౨, ఆ. ౬౯.

ననుపుకత్తె. ద్వ. విశే. (ననుపు+కత్తె) 1. ప్రియురాలు. (శ. ర.); 2. విటురాలు. (శ. ర.)

ననుపుకాఁడు. దే. విశే. (ననుపు+కాఁడు.) వలపుకాఁడు, విటుఁడు. "సీ. ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి మహిమఁ గోల్పడియె నే మాందకర్ణి." స్వా. ౨, ఆ. ౫౩. ఉ. రా. ౪, ఆ. ౧౩౬.

ననుపుపడు. ద్వ. అ. క్రి. (ననుపు+పడు.) అనురక్తమగు. "వ...మార్గాంతరంబున వెదకుచుం బెక్కు దినంబులు ననుపుపడియుండు నెదరు గలిగిన నొండొక్కనిం గూడుకొనునది స్వభావగుణంబు..." కవిక. ౪, ఆ. ౧౨౦.

ననువు: దే. వి. 1. ఒప్పు, ఇంపు. "సీ. మొగలివాకిలిఁ దాఁటి దిగువ శాక్వరరాజునగరిపై వెన్ను నిననువుఁ జూచి."భీమ. ౧,ఆ. ౧. నరస. ౨; ఆ. ౯౯; 2. అందము. "ద్వి. ననువు మిటారుల నాలిచేష్టలను, మనసొగ్గివలచు దుమారంబుసేయ."రం. రా. సుం; 3. నర్మవచనము "చ... నెచ్చెలుల్, ననువులు వల్కఁ గన్గొనల నవ్వుధరాసుత మమ్ముఁ బ్రోవు తన్." వైజ. ౧, ఆ. ౨. చిత్రభా. ౨, ఆ. ౮౫.

నన్ను. దే. విణ. కుఱుచ. (శ. ర.)

నన్నడుమము. దే. వి. ఔ. (నడుము+నడుము) సరియైనమధ్యభాగము. "గీ నడచురవి తేరు మింటి నన్నడుముచక్కిఁ, బ్రగ్గనఁగఁ దాఁకె వింధ్యపర్వతముచరుల" కాశీ. ౧, ఆ. ౧౩౨.

నన్ను = ననువు. వి. (అనురాగము.) "చ. నయమున భీతి వాపి మది నన్నునఁ దేకువ వాపి .." కు సం. ౯, ఆ. ౧౪౫. విణ. (అనురక్తుఁడు.) "చ... తమి దీటినర్గ నిదురవోయిరి నన్నుబోజుంగులత్తఱిన్." కువల. ౨, ఆ. ౧౧౦.

నన్నుకాఁడు = ననువుకాఁడు. (విటుఁడు.) "సీ. చని చూడఁగల్గినఁ జాలుఁ జేయును నన్నుకానిగాఁ బూవిలుకానినైన."య. ౧, ఆ. ౧౩. జాహ్నవీ. ౪, ఆ. ౩౪.

నస్ప్రాయి = నసుఁబ్రాయి. "సీ. రాగిలోహాండి నస్ప్రాయి లేకుండఁగ వండి దించినయివ్వుర్వంట కంబు." కాశీ. ౩, ఆ. ౧౨౧.

నపుంసకము సం. వి. అ. న. 1. నపుంసకలింగము; 2. నపుంసకలింగశబ్దము.

నపుంసకుఁడు. సం. వి అ. పుం. న. పేడి, షండుఁడు.

నప్త. సం. వి. ఋ పుం. 1. మనుమఁడు, కొడుకు కొడుకు, కూఁతుకొడుకు; 2. ప్రపౌత్త్రుఁడు, ముని మనుమఁడు.

నప్త్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొడుకుకూఁతురు; కూఁతుకూఁతురు, మనుమరాలు.

నఫా. హిం. వి. లాభము.

నఫెరి. దే. వి. (హిం నఫీరీ.) ఒకవిధమైన ఊఁదెడి వాద్యము. (మి బ్రౌ.)

నఫెరిసేయు. దే. స. క్రి. (నఫెరి+చేయు.) బాకా మో. ఊఁది ప్రకటించు; చాటు. "క. మానసయుత నాళమాననమానస గ్రేంకార మొక్కహంస మొనర్చెన్, మానిను లట రా జలఖగ, సేనల కెలఁగింప నఫెరి సేసె ననంగన్."చంద్ర. ౪, ఆ. ౭౮.

నబాబు. దే. వి. (హిం. నవాబ్.) 1. మహమ్మదీయ ప్రభువు. "చ. అపుడు శ్రీకాకుళాఖ్యపురమందు వసించునబాబుగారు ..." రంగా. ౧, ఆ. ౧౧౮; 2. ప్రభువు. "సీ. ఆర్కాడు మొదలైనయట్టి కర్ణాటకసుబకు నబాబుగాఁ బ్రబలుశక్తి. గీ... విజయానందరంగ;ఘునుకే కాక యొరులకుఁ గలదె ధరను." ఆనంద. పీఠి. ౧౦౮.

నభము. సం. వి. స్. పుం. 1. వర్షాకాలము; 2. ముక్కు, ఘ్రాణము; 3. బిసతంతువు, తామర తూఁటిదారము; 4. తమ్మపడిగము; 5. నరసినతల, పలితశీర్షము. స్. అ. పుం. శ్రావణమాసము. స్. అ. న. 1. ఆకాశము. "చ...బంధురతరభంగి నల్గడలఁ దోఁచె నభోదితసాంధ్యతారకల్." సానందో. ౫, ఆ. ౧౩౭; 2. మేఘము. విణ. (అ. ఆ. అ.) 1. కాంతి లేనిది; 2. నక్షత్రములు లేనిది; 3. హింసకము, హింసించునది.

నభశ్చరము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. సూర్యాది గ్రహము. విణ. (అ. ఆ. అ.) ఆకాశమున సంచరించునది.

నభశ్చరుఁడు. సం. వి. అ. పుం. 1. వేల్పు, దేవత; 2. విద్యాధరుఁడు.

నభస్యము. సం వి. అ పుం. మేఘముల కనుకూలమైనది. భాద్రపదమాసము.

నభస్వంతుఁడు. సం. వి. త్. పుం. గాలి, వాయువు.

నభోమణి. సం వి. ఇ. పుం. సూర్యుఁడు.

నభ్రాట్టు. సం. వి. జ్. పుం. కారుమబ్బు, నల్లని మేఘము విణ. (జ్) ప్రకాశింపనిది.

నమత్. సం. (శత్రు.) 1. వంగుచున్న; 2. నమస్కరించుచున్న.

నమతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది, నమ్రము; 2. వంకరైనది, కుటిలము; 3. పొట్టిది, హ్రస్వము.

నమతుఁడు. సం. వి. అ. పుం. 1. నటుఁడు; . ప్రభువు; 3. సూర్యుఁడు.

నమనము. సం. వి. అ. న. 1. వంగుట, నమ్రమగుట; 2. నమస్కారము, మ్రొక్కు. విణ. (అ. ఆ. అ.) 1. వంగునది; 2. వంచునది; 3. మ్రొక్కునది; 4. మ్రొక్కించునది.

నమనీయుఁడు. సం. = నమ్యుఁడు.

నమయత్‌. సం. (శతృ.) 1. వంచుచున్న; 2. నమస్కరింపఁజేయుచున్న.

నమయమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంచుచున్నది; 2. నమస్కరింపఁజేయుచున్నది.

నమలఁబెట్టు. దే. స. క్రి. (నమలక్‌ + పెట్టు.) నమలించు. "సీ. భూపాలనందన పుత్రెంచె నీ కని నాతమ్మ యింపార నమలఁబెట్టి." దశ. ౬,ఆ.౧౨౫.

నమలి. దే. వి. (త. జమలి. క. నవల్‌.) మయూరము. "ద్వి. నాకాధినాథుఁడు నమలియై జముఁడు,కాకరూపం బైనఁ గడు భీతి నొంది." రం. రా. ఉ. ౩౮. పు.౧౭. పం. ౩౯. పు. ౧౭.పం.

నమలు. దే. స. క్రి. 1. తిను, భక్షించు. "ఆ. బ్రదికియున్న నేఁ దపంబున విద్యను, బాచికొనఁగ నేర్తుఁ జాతకంబు, నట్టు లగుట జీవితాధార మైనయా, నంజు డిప్పు డెట్లు నమల కుదుఁగ." భార. శాం. ౩, ఆ. ౫౯౩. భార. అర. ౫, ఆ. ౩౩; 2. (తినెడిపదార్థమును) దంతములతో నలఁగునట్లు చేయు. "ఆ. నమలి మ్రింగఁ గేలఁ జమరి మొగంబునఁ, బూసికొనఁగ..." కు. సం. ౧౦, ఆ. ౧౭౨, ౪, ఆ. ౪౫౩; 3. ఆస్వాదించు. "క. విని చెవుల ముట్టి శోలం,గని కన్నుల నమలి నాలుకను మూర్కొని ముక్కున..." కు. సం. ౬, ఆ. ౬౭, భా. రా. బాల. ౭౦.

నమసము. సం. వి. అ. పుం. 1. బెత్తము, వేత్రము; 2. నమస్కారము.

నమసితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అర్చితుఁడు; 2. నమస్కరింపఁబడినవాఁడు.

నమసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అనుకూలుఁడు.

నమస్కరణము. సం. వి. అ. న. వందనము.

నమస్కరించు. సం. స. క్రి. వందనముచేయు,ఎఱఁగు. "గీ. విష్ణుఁ బ్రభవిష్ణు నచ్యుతు విగుణు సగుణు, హరిఁ జతుర్వ్యూహు నవ్యయు నభవుఁ బరము, నెలమిఁ దమచిత్తముల నావహించి హర్ష,మగ్నులగుచు నందంద నమస్కరించి." మార్క. ౧, ఆ. ౧౦౭. [నము.

నమస్కారము. సం. వి. అ. పుం. చేమోడ్పు, వంద

నమస్కారి. సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుఁదామరవి. విణ. (న్‌. నీ. న్‌.) నమస్కరించువాఁడు.

నమస్కార్యము. సం. విణ. (అ. ఆ. అ.) నమస్కరింపఁదగినది. "వ...సౌరభేయీశులం బాకమలాసను నిర్దేశించినట్టివై సురాసురప్రముఖనిఖిలజనంబులకు నమస్కార్యంబును సపర్యాభాజనంబును నయి రాజిల్లు..." భార. అను. ౩, ఆ. ౫౭.

నమస్కార్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నమస్కరింపఁదగినవాఁడు. "క...అలోలురు బోధనులు నమస్కార్యు లద్రిధర విను నాకున్‌." భార. అను. ౨, ఆ. ౧౩౪.

నమస్కృతి. సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము.

నమస్కృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁబడినవాఁడు; 2. పూజింపఁబడినవాఁడు.

నమస్య. సం. వి. ఆ. స్త్రీ. 1. నమస్కారము; 2. పూజ.

నమస్యితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁబడినవాఁడు; 2. పూజింపఁబడినవాఁడు.

నమస్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁదగినవాఁడు; 2. పూజింపఁదగినవాఁడు; 3. నమస్కరించువాఁడు; 4. పూజించువాఁడు.

నమస్సు. సం. వి. స్‌. న. నమస్కారము. "గీ. నత మృడాదికసుమనస్సునకు నమస్సు." ఆము. ౬, ఆ. ౯౯.

నమాజు. హిం. వి. మహమ్మదీయులదైవప్రార్థనము. "సీ. పాశ్చాత్త్యులనమాజుపై బుద్ధిపుట్టెనో మానుల జపముపై మనసు రోసి." సిం. నార. ౮.

నమించు. సం. స. క్రి. నమస్కరించు. "ఉ...,వా, ల్మీకిఁ దలంతు వ్యాసుని నమింతు నుతింతును గాళిదాసునిన్‌." శశాం. ౧, ఆ. ౧౮.

నమిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. వంచువాఁడు; 2. నమస్కరింపఁజేయువాఁడు.

నమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది; 2. వంపఁబడినది; 3. నమస్కరింపఁబడినది.

నమిలి. దే. వి. మయూరము. "క. కలవాణి యొకతె చెవి కింపలరింపుచు మేఘరంజి యని జలదశ్రీ, నెలకొలిపి సౌధవీథుల, నలిఁ దా నాడించె బ్రోది నమిలికొదమలన్‌." శ్రీరాధా. ౪, ఆ. ౧౨౨, భీమ. ౩, ఆ. ౨౮.

నముచిసూదనుఁడు. సం. వి. అ. పుం.-నముచి అను అసురను జంపినవాఁడు ఇంద్రుఁడు.

నమురు. దే. వి. ఆము, మదము. "వ...జలగ్రహంబు లొండొండ నటునటుఁగ నొరసి...కలహంబు నకుఁ దిముఘుచు నమురు గవిసి యుప్పుటప్పటికి

జిఱిబిఱిం ద్రిప్పి వేయుంచటులవాలఘాతంబుల..." శ్రీరం. ౧, అ. ౧౩౭.

నమూదు. హిం. విణ. కనుపఱచఁబడినది. వ్యవ:— అపోలమలెక్కలలో నీపేర నమూదైనదా?

నమూనా. హిం. వి. మాదిరి. వ్యవ:— శుభలేఖకు నమూనా వ్రాసిపెట్టుము.

నమేరువు. సం. వి. ఉ. పుం. సురపొన్న చె. (దీనికి దోహదము స్త్రీహసితము.)

నమోనా=నమూనా. (వా)

నమోవాకము. సం. వి. అ. పుం. 1. నమో అని పలుకుట, వాగ్రూపనమస్కారము; 2. నమస్కారము, వందనము. "క. వాకిటికి వచ్చుసతులన్ గైకొని వినయావలోకగతి నలరించున్, శ్రీకార్య పరులకు నమో,వాకం బొనరించి వికచవదనాంబుజయై." ఘటికా. ౨, అ. ౭౨.

నమ్మకము. దే. వి. విశ్వాసము. వ్యవ:— నాకు నీపై నమ్మకము లేదు.

నమ్మదుంప. దే. వి. గొట్టిగడ్డ, కశేరుకము చె. (శ. ర.)

నమ్మి. దే. వి. మయూరము, నెమలి. "లయగ్రాహి. నమ్ములంగొప్పులు ఘనమ్ము లని సైజనదనమ్ములను బొంగి నటనమ్ములఁ దగన్ యానమ్ములకు లోఁగి పులినమ్ములను హంసమిథునమ్ము లతిమందగమ నమ్ములను రా..." చంద్రా. ౩, అ. ౯౬, కు. సం ౩, అ. ౭౧౦.

నమ్మించు. దే. స. క్రి. (నమ్ము. ధా. ప్రే.) విశ్వసింపఁజేయు. "శా...మచ్చికం గదిసి నమ్మించుం దనుం బట్టఁబోఁ, బాయన్ బిట్టలయించు దౌ దిగుచు నప్పాటన్ మృగం బీగతిన్." రామా. ౫, అ ౧౬౩, భార. ఆది. ౫, అ. ౫౬.

నమ్మిక. దే. వి. 1. విశ్వాసము. "గీ. ప్రజకు నమ్మికగా నిన్నుఁ బట్టబద్ధుఁ, జేసెఁ గాని పదంపడి చెల్లనీడు" దశ. ౮, అ. ౫౧, హరి. ఉ. ౭, అ. ౧౮౮; 2. నమ్మకము గలిగించువాక్యము; ప్రమాణము. "ఉ. నాకు మనంబు నిండ నొకనమ్మిక సేయుము..." శివరా. ౩, అ. ౭౯, దశా. ౭, అ. ౧, అ. ౧౩౭.

నమ్మిగ. దే. వి. నమ్మకము, విశ్వాసము. "క. తగుమాట లొంబికేయుం,డగు నని కైకొనుచు నె రొన్నఁడైనను గొడుకున్, మగఁటిమి గలఁ డని దొడుసున్నమ్మిగఁ జూచుచునుండు విషము మ్రింగెన యేనిన్." భార. ఉద్యో. ౧, అ. ౩౧౫, హరి. పూ. ౫, అ. ౨౨౭.

నమ్మినవాఁడు. దే. విణ. (నమ్మిన+వాఁడు.) 1. ఆప్తుఁడు. "సీ. నమ్మినవాఁ డన నచ్చినవాఁ డనఁ జనవరి యనఁగను దనరు నాప్తుఁడు..." ఆం. భా. ద్వి. ౧౮౭; 2. విశ్వసించినవాఁడు "ఉ...హరిం బతి సేయుమమ్మ నిన్, నమ్మినవారి కెన్నఁడును నాశము లేదుగదమ్మ యీశ్వరీ" భాగ. ౧౦, స్కం. పూ. ౧౭౪౨, నీలా. ౧, అ. ౭.

నమ్ము. దే. స. క్రి. 1. విశ్వసించు. "సీ...ఇతని మాటలు నమ్మఁబెట్టు లనక." ఉ. రా. ౧, అ. ౩౦౬, భార. ఆది. ౪, అ. ౩౦; 2. ఆశ్రయించు. "సీ. నమ్మితి మన్న నెంతటిదరిద్రుల నైన శ్రీలచే జెల్వొందఁ జేయుఁ గరుణ." దశా. ౧, అ. ౪౧.

నమ్యమానము. సం. విణ. (అ. ఆ అ.) 1. వంపఁబడుచున్నది; 2. నమస్కరింపఁబడుచున్నది; 3. పూజింపఁబడుచున్నది.

నమ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నమస్కరింపఁదగినవాఁడు; 2. పూజింపఁదగినవాఁడు; 3. వంపఁదగినవాఁడు.

నమ్రము సం. విణ. (అ ఆ. అ.) 1. వంగినది,నతము; 2 అడఁకువ గలిగినది, విధేయము; 3. మ్రొక్కినది; 4. లోఁతైనది లోపలికి అణఁగినది.

నమ్రితము. సం. విణ. (అ. ఆ. అ.) నమ్రముగాఁ జేయఁబడినది.

నయ. దే. వి. మనోజ్ఞత, అందము. "సీ. నయ కల ప్రేళ్లమట్టియలుఁ బిల్లాండ్లిడి పాయపట్టముఁ బెట్టెఁ బై నొకర్తు." ఆము. ౬, అ. ౧౨౮.

నయగారము. దే. వి. (నయము+కారము.) 1. మృదుత్వము. "క. ప్రియమై రమణీయమణీ, మయమై యతిచిత్రభిత్తిమంజిమ నయమై,నయ మైనచిలుక పలుకుల,నయగారమునం జెలంగినయగారమునన్." సా. ౧, అ. ౧౩౫; 2. సొంపు, మనోజ్ఞత. "సీ. చెలిమాటనయగారముల నెన్నికొనియెదే గోణిఁగె దేల తపస్వికులవతంస." చంద్రా. ౩, అ. ౧౦౩; 3. విలాసము. "సీ. పలుకుఁదీయములకు పెలి గొడుగులు గావె నయగారములలోనినగవుపసలు." రామా. ౨, అ. ౭౮. ౩; 4. ప్రియవాక్యము. "ఆ. సక్కవినయములకు నయగారములఁ బల్కి,"

కుడువ కెల్లధనము కూడఁబెట్టు." వేమన. ౧, ఆ. ౪౮; పాండు. ౩, ఆ. ౪౩; 5. అలంకారము, నగ. "చ...అన్నృపాలునిం, గలయఁ దలంచి మేన నయగారము గీల్కొనఁ జేసి చేరె నిర్మల గుణశాలి యైనశుకమండలమాళి సమీపభూమికిన్." శుక. ౧, ఆ. ౩౪౩. విణ. కపటమైనది. "ఉ. ఈనయగారపుంబ్రియము లీపస లీమొగ మిచ్చుమాట లేలా..." పారి. ౧, ఆ. ౧౨౫, శుక. ౨, ఆ ౧౮౭.

నయగారి. దే. విణ. (నయగారము+ఇ.) మార్దవము గలది; మనోహరము. "ద్వి. నయగారిమాటల నటనచూపులను బ్రియముల నయములఁ బెల్లించి పొంది." అ. మ. క. ౩, ఆ. ౧౬౯. పు.

నయగారితనము. ద్వ. వి. (నయగారి+తనము.) మనోహరముగా మాటలాడుట. "సీ. నయగారితనమున నాథుఁ డాశ్లేషింప లోఁగక యెదురొత్తి కౌఁగిలించు." చంద్రా. ౬, ఆ ౧౫౦.

నయత్. సం. (శత్రు). 1. కొనిపోవుచున్న; 2. నడపించుచున్న; 3. పొందించుచున్న.

నయనచ్ఛదము. సం. వి. అ. పుం. కంటిఱెప్ప.

నయనము. సం. వి. అ. న. 1. కొనిపోవుట; 2. యాపనము, జరపుట; 3. ప్రాపణము, పొందించుట; 4. కన్ను, నేత్రము.

నయని. సం. వి. ఈ. స్త్రీ. కంటినల్లగ్రుడ్డు.

నయనించు. సం. అ. క్రి. (దృష్టిని.) నిలుపు. "ఆ. నాసికందు దృష్టి నయనించుయోగికి, వాసివన్నె లేల వసుధలోన." వేమన. ౧౩౩౬.

నయనీయము. సం.=నేతవ్యము.

నయనోపాంతము. సం. వి. అ. పుం. కడకన్ను, అపాంగము.

నయపీఠి. సం. వి. ఈ. స్త్రీ. జూదమాడుపలక.

నయమానము. సం. విణ. (అ. ఆ. అ.) పొందించుచున్నది.

నయము. ఉభ. దే. వి. 1. అందము, మనోజ్ఞత. "గీ. సొలపు నలపును గొలుపునిచ్చలపుఁదెలుపు, నగవు మల్లెల కొకవింతనయము దెలుప." య. ౧, ఆ. ౭౪, కవిరా. ౫, ఆ. ౧౭౩; 2. రీతి, విధము "గీ...శిబిసంగతి మాంధాతనయమునను య, యాతికరణి దిలీపునియట్లు..." హంస. ౧, ఆ. ౪౨, ప్రభా. ౨, ఆ. ౩౪; 3. లాభము. "గీ. నయము పేదకు సరిఁ గోరునను నోనంగ, ప్రబలఁ జేసిన నర్థధర్మములు పెరుఁగు." ఆము. ౪, ఆ. ౨౩౬; 4. నేర్పు, కౌశలము. "క. పదపడి నయమున మెయిమెయిఁ, గదియించి లతాంగి చిక్కఁ గౌఁగిటఁ జేర్పం, గదలనిచిత్తము గలిగియు, మదమేమియు లేక యతఁడు మ్రానై యుండెన్." భార. అను. ౨, ఆ. ౧౪, పారి. పీఠి. ౫; 5. ఆసక్తి. "చ....ముగ్ధ యొక్కతె వికాసినియై నవకంపుఁదీఁగెఁ బ్రాసినయెలగోమ్మగు త్తిసవి చేరి నయంబునఁ బట్టి కోయఁ జాఁచిన..." నిర్వ. ౮, ఆ. ౩౬, భార. భీష్మ. ౩, ఆ. ౧౭౦; 6. స్వస్థత. "గీ. నయ మొకించుక యైనఁ గానంగ రాదు, చలువమందుల శైత్యంబు సంభవిలక, నినుఁడు గుడిచిన నీరయ్యె నింతిమేన, సంతకంతకు సంతాప మగ్గలించె." వి. శకుం. ౩, ఆ. ౪౪. విణ. 1. అందమైనది. "క. ప్రియమై రమణీయమణీ, మయమై యలిచిత్రభిత్తిమంజిమ నయమై, నయమైనచిలుకపలుకుల, నయగారమునరి జెలంగి నయగారమునన్." సా. ౧, ఆ. ౧౩౬, కుచేల. ౧, ఆ ౨౩; 2. మృదువు, సుకుమారము. "చ... చెక్కులం, దొఱఁగెడుఘర్మముల్ దనదుదుప్పటిచేఁ దుడిచెఁ నయంబుగన్." దశా. ౨, ఆ. ౩౧౬; 3. చౌక. (శ. ర.); 4. మేలైనది. "ద్వి. కల్లిబోటియిమాట నయం బయి..." వి. పు. ౨, ఆ. (శ. ర.) ప్రబంధ. ౬౨; 5. సున్నమైనది. (శ. ర.) సం. వి. అ. పుం. 1. కొనిపోవుట, తోడ్కొనిపోవుట; 2. నడపుట; 3. పొందించుట; 4. నీతి; 5. ధర్మము, పాడి; 6. ద్యూతవిశేషము; 7. పాచిక. న. సాంత్వనము, అనునయము. విణ. (అ. ఆ. అ.) 1. కొనిపోవునది; 2. నడపునది; 3. పొందించునది; 4. న్యాయమునుండి తొలఁగనిది.

నయించు. సం. స. క్రి. 1. నడుపు, ప్రవర్తిల్లఁజేయు. "చ...బుధ్వైజుల్, సపనము లుక్తమార్గము ప్రశంసకు నెక్క నయించి వేదవాక్యవిహిత వృత్తిమై నభినవాభ్యుదయం బొనరించిరి..." భార. అశ్వ. ౪, ఆ. ౧౭౪. భార. శాం. ౧, ఆ. ౧౦౮; 2. ఉపాసించు, సేవించు. "వ...కపర్ది శంకరుండు రుద్రుం డుమాపతి యను పేళ్లం బరఁగునద్దండదేవుని నతులధర్మంబున నయించు భూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు."

భార. శాం. ౩, ఆ. ౧౨౦; ౩. పొందించు. "మ...అమలజ్ఞానత దానధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సరత్వములన్ యజ్ఞతపోనసూయలఁ గడున్ దర్పించుధాత్రీసురోత్తము కంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోర్థప్రాణవాక్కర్మముల్, సమతన్ నిన్ను నయించెనేని నిజవంశ శ్రీకరుం డౌఁ దుదిన్." భాగ. ౭, ఆ. ౩౫౧; ౪. చేయు, కావించు. "క. రథికులపైఁ దరు లావహ, పథికులు కపు లెత్తఁ బుష్పఫలములు రాలెన్, బ్రథ సాధిదేవతకు నవి, ప్రథమసపర్యలు నయించెఁ బార్థివుఁ డనఁగన్." రామా. ౭, ఆ. ౨౮౨.

నర. దే. వి. 1. ముదిమిచే వెండ్రుకలు తెల్లనగుట, పలితము. "క. అలయక యేండ్లు గడుం బెక్కులు జీవించుట నర గలుగుటయుం దగు వృద్ధులలక్షణమే జ్ఞానము, గలఁడేనిన్ బాలుఁ డయినఁ గడు వృద్ధు మహిన్." భార. అర. ౩, ఆ. ౨౪౮; 2. ముదిమిచేఁ దెల్లఁబాఱినవెండ్రుక. "క..ఆవ్విభు, తల నొకనర యున్నఁ జూపి తరళాక్షి యనున్." మార్క. ౭, ఆ. ౧౩౮. విణ. ముదిమిచేఁ దెల్లఁబాఱినది. "ఉ. వేనలిపాట పాట నరవెండ్రుకతోఁ దిలతండులాన్వయ, శ్రీ నటియింప...ఒకమంజులభాషిణి వచ్చె వీథికిన్." కాశీ. ౭, ఆ. ౧౫౯. కళా. ౩, ఆ. ౮౩.

నరంగము. సం. వి. అ. న. 1. మగగుఱి; 2. మొగమున లేచు బొబ్బ.

నరంజీ = నరాజీ! "సీ. చెలిమితోఁ దామరచెలిపట్టి యనిచిన బలునరంజీ యొక్క చెలువ పూన." య. ౧, ఆ. ౮౮.

నరకఁడు. వై. విణ. (సం. నారంగః.) మోటువాఁడు, మొద్దు. "గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడి రసజ్ఞుఁ, డింద్రనరకని కిటువంటితీంద్రవయసు, టోఱచూపుల నెఱిహింతకారిఁ దెచ్చి, యూలుగాఁ గూర్చి పాపాత్ముఁ డాయె నహహా." సురా. ౫౯, శుక. ౨, ఆ. ౩౪౭; 2. దుష్టుఁడు, క్రూరుఁడు. "క...నను, నిచ్చల్, నిరసింతువు యోగివి గన, నరకా నీవాకె తాఁకె నాకుం జూడన్." హంస. ౩, ఆ. ౨౩౪.

నరకము. సం. వి. అ. పుం. న. నిరయము, పాపఫలము ననుభవించులోకము. (నరకములు. 21. తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్రము, తాపనము.)

నరగ. దే. వి. (హిం. నగారా.) వాద్యవిశేషము, భేరి. (శ. ర.)

నరగజెము. దే. వి. భేరి, వాద్యవిశేషము. "గీ. తుడుమనంగను దమకు నా గిడియ యనఁగ, నరగజం బనఁ దద్భేదనామము లగు. ఆం. భా. ప్ర. ౧౨౭.

నరద. దే. వి. చీఁట, పగులు. (వ్యవ.)

నరదము. సం. వి. అ. న. వట్టివేరు*.

నరనారాయణులు. సం. వి. ఉ. పు. ద్వి. ధర్ముని కుమారు లగునిద్దఱుఋషులు. (వీరిలో నరుఁ డర్జునుఁడుగాను నారాయణుఁడు కృష్ణుఁడు గాను నవతరించి రని పురాణప్రసిద్ధి.)

నరపు. దే. వి. పలితము, ముదిమిచే వెండ్రుకలు తెల్లనగుట. "ఆ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద, కాల మున్నఁ జెంపకడలనుండి, కలయ నరపు వచ్చి గడ్డంబు మీసలు, గప్పుఁగొరుబాగు కానవచ్చె." కకు. ౪, ఆ. ౨౪, ఆం. భా. ద్వి. ౧౧౮. విణ. ముదిమిచేఁ దెల్లనైనది, నరసినది. (వృత్తియందు ఉత్వమున కత్వాదేశము.) "సీ. వింజామరము విచ్చి వ్రేలవైచినమాడ్కి డాలొందునరపగడ్డంబుతోడ." వి. శకుం. ౨, ఆ. ౨౮, విక్ర. ౨, ఆ. ౧౧౭.

నరబలి. సం. వి. ఇ. పుం. దేవతలకు వేయు మనుష్యరూప మగుబలి.

నరభుజుఁడు. సం. వి. జ్. పుం. రాక్షసుఁడు.

నరము. ఉ. భ. వై. వి. (సం. నాలమ్. త. నరము. క. నర.) 1. నాడి. "క. ఇరువురును సందుసూడక, వెర వెడలినయాగ్రహముల వ్రేసిన గదలొం,డొరుల మెడల కెలఁకుల బ్రల్నరములు దాఁకుటయుం వా రిలం బడి రధిపా." భార. శల్య. ౧, ఆ. ౧౮౦. ఆం. భా. ద్వి. ౧౩౨; 2. పీతనాడి. "గీ...బీఱ, నరము నాఁగను దగుఁ బీతనాడి..." ఆం. భా. ద్వి. ౧౩౨. సం. వి. అ. పుం. గుల్మము. న. 1. రామకర్పూర మనుతృణము*; 2. నీరు, ఉదకము.

నరమేధము. సం. వి. అ. పుం. మనుష్యుని యజ్ఞపశువుగాఁ జేసి జరుపుయాగ విశేషము.

నరయు. దే. అ. క్రి. ముదిమిచే వెండ్రుకలు తెల్లనగు. "చ. నరసినవెండ్రుకల్ జనపసారతెఱంగున విప్రమాళికిన్." శేష. ౧, ఆ. (శ. ర.) హర. ౨, ఆ. ౪౮.

నరవ. దే. వి. కొండత్రోవ. "వ...మురువులై సింగపు జంగిలి కిరవులై విరువు లగునరవలం గరువలి మేపుడు దొరపడగలరంగులు తొంగలించి మీఁదికిం బచరించె నన మించుతలిరుమ్రాఁకులును..." య. ౨, ఆ. ౪౦, ఆం. భా. ద్వి ౯.

నరవండు. దే. వి. ఓషధివిశేషము. "సీ. కుప్పి సూర్యక్రాంత ముప్పుడు నరవండు గాడిసగడపర కన్నెకొమర." హం. స. ౪, ఆ. ౧౦

నరవాహనుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

నరసింగము. మి. వి. మల్లవిద్యావిశేషము, ముప్పదిరెండు విన్నాణములలో నొకటి. "సీ...నరసింగము సరిబిత్తరము కిల్లి ..గీ...నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియురెండు విన్నాణములకుఁ బెల్లు." ఆం. భా. ద్వి. ౨౦౯.

నరసింహుఁడు. సం. వి. అ. పుం. 1. నరసింహరూపుఁడగువిష్ణువు; 2. నరులలో శ్రేష్ఠుఁడు.

నరాంగము. సం.=నరంగము.

నరాజి. వై. వి. (సం. నారాచః.) కత్తి, ఖడ్గము. "సీ...తరవలి నరాజి పిరంగి యడిద,మన ఖడ్గనామమై యలరుచు నుండును..." ఆం. భా. ద్వి. ౨౧౪, కృష్ణ. ౪, ఆ. ౪౨.

నరాధిపుఁడు. సం. వి. అ. పుం. రాజు. (ఇట్లే. నరదేవుఁడు. మొ.)

నరాశుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

నరి. ఉభ. దే. వి. మర్యాద, హద్దు "ద్వి. పెరిమెఁ బోనిమ్మని ప్రియము గావింప, నరి మీఱి పల్కెదునత్తుచందమున." ద్వి. పరమ. ౩, ఆ. ౧౨౨, పు. ౩, ఆ. ౧౫౬. పు. సం. వి. ఈ. స్త్రీ. నరుని భార్య.

నరిడి. దే. వి. పశువ్యాధివిశేషము; గుండెయుబ్బరము. "ఆ. నరిడి పుప్పి కప్పునావురు కడుపుబ్బ యదురు దిక్కు యనఁగ నదరి మఱియుఁ, దెవులు లెన్నియేని..." హరి. పూ. ౬, ఆ. ౪౫.

నరియఁడు. దే. వి. సర్పవిశేషము. "సీ. నరియఁడు చెరువాఁగె గరుడియుఁ బాలయు నెడమనుండియుం వచ్చి కుడిని నిలిచె." ఉ. రా ౬, ఆ. ౨౩౫.

నరియకొక్కు. దే. వి. సర్పవిశేషము. "గీ. కలవు తక్కెనజెట్టిపోతులును దుంప, నాగులును గొంటి గాఁడులు నరియకొక్కులు..." ద్వా.౮,ఆ.౯౮.

నరియు. దే. అ. క్రి. 1. మ్లానమగు, వాడిపోవు. "క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్ దొండములు విరిసె మోములు నరిసెన్, బొరిఁబొరి నఖిలాంగంబులు, నెరిసెం జిత్తంబు లురిసె నిరిసె జగంబుల్." లక్ష్మీ. ౪, ఆ. ౪౮. (శ. ర. పా. 'విరిసెన్.' ముద్రి.); 2. నరయు. (శ. ర.)

నరుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. మగవాఁడు; 3. అర్జునుఁడు; 4. ఒకఋషి. (నరనారాయణులలో మొదటివాఁడు.) బ. పదాతులు, కాల్బలము. "మ. కరులం గూల్చుచుఁ దేరులన్ నరతుచున్ గర్జిల్లి ఘోటమ్ములన్,నరులన్ నెత్తుటఁ దేల్చుచున్ దొరల నానారూపఖండంబులై, తొరఁగం జేయుచు." భార. ద్రో. ౫, ఆ. ౩౦౩.

నరుదకన్ను. దే. వి. పశువులనేత్రరోగ విశేషము. "ద్వి. నరుదకన్నును నీరునాలుకచేర్లు, గురుసు దెవులు .." నవనాథ. ౧, ఆ. ౪౧. పు.

నరుపు=నరపు (శ. ర.)

నరేంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. నరశ్రేష్ఠుఁడు; 2. రాజు; 3. విషవైద్యుఁడు, పాములవాఁడు; 4. భూతవైద్యుఁడు, పిశాచములను బోఁగొట్టువాఁడు.

నర్కు=నఱకు. (ఖండించు.) (ఖండించు.) "ద్వి. వీఁగుదెంచిన కాళ్ల నిల నర్కివైచి, కౌఁగిలింపఁగఁ గోరుకరములు దునిమి." పండితా. పురా. ౧౪౪. పు.

నర్తకము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2. మయూరము, నెమలి.

నర్తకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; 2. ఆఁడేనుఁగు; 3. ఆఁడునెమలి; 4. గువ్వగుత్తికవి.

నర్తకుఁడు. సం. వి. అ పుం. 1. నటుఁడు; 2. శివుఁడు; 3. రాజు; 4. కీర్తిసంచారకుఁ డగునటుఁడు, చారణుఁడు; 5. (రంగులువేయువానికి వేశ్యయందు పుట్టిన) సంకీర్ణజాతివాఁడు. విణ. (అ. ఆ. అ.) నాట్యమాడువాఁడు. [యూరము.

నర్తనప్రియము. సం. వి. అ. పుం. నెమలి, మ

నర్తనప్రియుఁడు. సం. వి. అ. పుం. శివ్వుఁడు. విణ. (అ. ఆ. అ.) నాట్యమం దిష్టము కలవాఁడు.

నర్తనము. సం. వి. అ. న. నృత్యము.

నర్తనుఁడు. సం.=నర్తకుఁడు.

నర్తము. సం. వి. అ. పుం. నృత్యము, ఆట. విణ. (అ. ఆ. అ.) నర్తించునది, ఆడునది.

నర్తయిత. సం. వి. ఋ. పుం. నాట్యగురువు, నట్టువ యొజ్జ. విణ. (ఋ. త్రీ. ఋ) నర్తింపఁజేయు వాఁడు, ఆడించువాఁడు.

నర్తించు. సం. అ. క్రి. 1. నర్తనముచేయు. (శ.ర.); 2. ఎగురు. "మ. నలువంకన్ మలయానిలాంచల ముచే నర్తించుపూధూళితో్...సుఖ కరంబుల్ కేలికాంతారముల్." వరాహ. ౪, ఆ ౧౧౬.

నర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నర్తించునది, ఆడునది; 2. నృత్యముచేయింపఁబడినది, ఆడింపఁ బడినది.

నర్తిలు. సం. అ. క్రి. నటించు, కదలియాడు. "ఉ. అం:దముల్ వెలుంగ మణిహారము లక్కున నర్తిలంగ మేల్బంగరురావిరేక నొసలన్ మస లంగ... సారసలోచన క్రీడసేయఁగన్." రుక్మి. ౧, ఆ. ౮౭.

నర్తిల్లు = నర్తిలు. "మ...వక్షస్స్థలిక్, నవలీలన్ వన మాల యుజ్జ్వలరుచిన్ నర్తిల్ల.." హరి. పూ. ౮, ఆ. ౧౧౨.

నర్తువు. సం. వి. ఊ. స్త్రీ. నటి.

నర్దనము. సం. వి. అ. న. 1. అర్చుట; 2. కూఁత. విణ. (అ. ఆ. అ.) 1. ధ్వనిచేయునది; 2. అఱచు నది, బొబ్బరించునది.

నర్దము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అర్చునది,బొబ్బ రించునది; 2. ధ్వనిచేయునది, మ్రోఁగునది.

నర్దితము. సం. వి. అ. న. 1. అర్పు. బొబ్బ; 2. శబ్దము, మ్రోఁత. పుం పాచికలు వేయుఁవిధము లలోఁ నొకటి. విణ. (అ. ఆ. అ.) మ్రోఁగినది.

నర్మఠము. సం. వి. అ. పుం. 1. గడ్డము, చిబుకము; 2. చను మొన, చూచుకము.

నర్మఠుఁడు. సం. వి. అ. పుం. 1. మేలమాడువాఁడు, పరిహాసకుఁడు; 2. కాముకుఁడు.

నర్మద. సం. వి ఆ. స్త్రీ. ఒకనది. (వింధ్యపర్వతమునఁ బుట్టి పడమట అరేబియా సముద్రములో పడు చున్నది.)

నర్మదుఁడు. సం. వి. అ. పుం. నర్మసఖుఁడు. విణ. (అ. ఆ. అ) 1. పరిహాసము చేయువాఁడు; 2. వినోదము నిచ్చువాఁడు.

నర్మము. సం. వి. న్. న. 1. వినోదము, క్రీడ; 2. పరిహాసము, మేలము, స్త్రీపురుషులపరస్పర పరి హాసము.

నర్మర. సం. వి. ఆ. స్త్రీ. 1. గుహ, దరి; 2. కొలిమి తిత్తి, భస్త్ర; 3. ముట్టుడిఁగిన ఆఁడుది.

నర్మిలి. దే. వి. అపేక్ష, అర్మిలి. "ఉ...నీసుతఁ బెండ్లియాడఁగా, నాయము నాకుమారునకు నర్మిలి హత్తఁగ నత్తవావిచే, నాయువు గల్గు వాఁడవు నటంద్రు శుభం బగు దీన నెంతయున్." విజ. 3, ఆ. ౧౨౬.

నర్యము. సం. విణ. (అ. ఆ. అ.) నరునకు హితమైనది.

నఱకించు. దే స. క్రి. (నఱకుధా. ప్రే.) నఱకఁ జేయు, ఖండింపఁ జేయు. "వ...పాంద్రభూపా లుండు యదువీరునగరంబు కలుకోట వికటంబుగా పలుదటంకంబుల నఱకించియు..." ఉ. హరి. 3, ఆ. 3౬.

నఱకు. దే. స. క్రి. 1. ఖండించు, తెగఁగొట్టు. "గీ. అతివ యతఁ డొందుకోదండ మందికొన్న, నఱకె వేఱె విల్లెత్తిన విఱుగఁ నేసె." హరి. ౧, ఆ. ౧౬౪. వరాహ. ౯, ఆ. ౧౪; 2. చంపు, సంహరించు. "క. పెఱవారిసెల్లఁ దరమిడి, నఱకుడుఁ బొందు క్షితీశనందనులను రూపఱసేయం జేయాదదు ..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౫౦. భార. భీష్మ. ౨, ఆ. 3౯; 3. పోఁగొట్టు, తొలఁగించు. "మ...దైత్యాంతకుం డుద్ధతిన్, నఱకెం దత్తిమి రంబు..." ఉ. హరి. ౨, ఆ. ౪౯. వి. కత్తిదెబ్బ, క్షతము. (చూ. నఱకుపడు.)

నఱకుడు. దే. వి. నఱకు, కత్తిదెబ్బ. (చూ. నఱకుడు పడు.)

నఱకుడువడు. ద్వి. అ. క్రి. (నఱకుడు+పడు.) ఖండిత మగు. "ద్వి. నరనాథ మొదలంట నఱకుడువడిన, తరువున ట్లొరగినదశకంఠుఁ జూచి." రం. రా. ఉ. ౨౨. పు.

నఱకువడు. (నఱకు+పడు.) 1. తొలఁగు, నశించు. "గీ. సాగరమునీరు పేరుట శైలకులము, తెఱవ యిచ్చుట చీఁకటి నఱకువడుట,..." ఉ. హరి. ౨, ఆ. ౫౬; 2. ఖండితమగు. "సీ. అరటి

కంబము లెట్లు సరి యనవచ్చు నీ,ధవళాయతాక్షి యందంపుఁ దొడల." "గీ...ఫలకాలంబె నఱకు వడుట, సరసు లగువార లొక్కించు కెఱుఁగ లేక...." సురా. ౩౨, రామా. ౬, ఆ. ౧౦౧.

నఱమ. దే. విణ. కృత్రిమ మైన,కపటము గల. "గీ. ఇంక నెన్నండు దయఁ బరమేశ్వరుండు, గన్న దెఱచునో యని దన కున్నరూపు, నెఱయఁ జెప్పిన విని కేలు చఱచికొనుచు, నఱమపాఱుండు ప్రక్కలు విఱుగ నగుచు." కు. సం. ౭, ఆ. ౧౫.

నఱిముఱి. దే. వి. విలాసము. "ద్వి. నందనవనతరుల్ నఱిముఱి విఱిచి, తందంద బాధించి తఖిలసుమ ములు." రం. రా. ఉ. ౩౦౦. పు.

నఱుకాడు. దే. స. క్రి. (నఱుకు+ఆడు.) (శత్రువు లను.) సంహరించు. "సీ. రాజులమంచు బొట్టులు లివిరినఁ గాద,యని మొనలో నఱుకాడవలయు." వేణు. ౫౭.

నఱుకు = నఱకు. దే. స క్రి. ఖండించు. "క... ఓడితి పోపో, పిఱికి యని పలికి నుఱుముగ, నఱికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్." భార. ద్రో. ౧, ఆ. ౧౭౩. భాగ. ౬, స్కం. ౩౭౦. వి. 1. కత్తిదెబ్బ. "సీ. కొంగవాల్ నఱుకు లంగుళులఁ బట్టుక జబ్బ లంటఁ గుట్టిడ వెజ్జు సరయువారు." ఆము. ౬, ఆ. ౮౫; 2. శస్త్ర విద్యావిశేషము. "వ...లో వెలి గజ్జదుముకు చూరణ నఱుకు మొదలగునఱుకులఁ దగులుం గనుంగొని..." హంస. ౧, ఆ. ౨౦౬. ఆం. భా. ద్వి. ౨౦౫.

నఱుకుడు = నఱకుడు. (చూ. నఱుకుడువడు.)

నఱుకుడువడు. ద్వ. అ. క్రి. (నఱుకుడు+పడు.) ఖండితమగు "క. పడుతలలు తఱుచున ఱుకుడు, వడుచేతులు...పంక్తిముఖునిభటులకుఁ గలిగెన్." ఉ. రా. ౪, ఆ. ౨౯౨.

నఱుకుబియ్యము. దే. వి (నఱుకు+బియ్యము.) నసుఁ బ్రాయి,సరిగా నుడుకని బియ్యము. (శ. ర.)

నఱుకులాడు. దే. స. క్రి. (నఱుకులు+ఆడు.) ఒకరి నొకరునఱుకుకొను. (శ. ర)

నఱుక్కు. దే. వి. గుండె యదరుట కనుకరణము. "క...ముప్పిరిగొని యొదువగతో, నప్పాఱునిఁ జూచి గుండియ నఱుక్కనఁగన్." చంద్రా. ౩, ఆ. ౨౫.

నఱుజు. దే. వి. అల్పత్వము. "క. ఉల్లమున నఱుజుఁ జూపని, తల్లడమున నడుగుడోయి తడఁబడ..." అచ్చ. అర. ౫౨. విణ. అల్పము. "క. నఱుజు మెయి పూని యూన, బ్బఱపొలఁతుక లోనఁ దూఱి పరువడి వెలికిన్, బఱచి కటాలున దాని, బఱియలు గావించి యెలమి పరఁగం జనియెన్." అచ్చ. కిష్కిం. ౧౦౪.

నఱుమాడు. దే. స. క్రి. (నఱుము+ఆడు.) పొడి చేయు. "క. పెఱవార లధికభీతిన్, విఱిగి చనిరి భీష్ముఁ డేచి వీరరధికులం దఱఁ జూచి రాచకొడు కుల, నఱుమాడెఁ భీముఁ డిట్లు నడుఁకం దగునే." భార. భీష్మ. ౨, ఆ. ౨౩౭.

నఱుము. దే. స. క్రి. పీడించు. "కళిక. మఱియుఁ బెఱయ వెఱయ నుఱివుముధునిఁ గూల్చినట్టి హరికి, నఱిమి తఱిమి చఱిమి నుఱిమి నక్ర గెల్చినవితకరికి." అప్ప. ౪, ఆ. ౩౨౭. వి. నలి, పొడి. "చ...అస్త్రఘట్టనన్, నఱు మఘురూపులుం బృథురణంబున నగ్గలమయ్యె నయ్యెడన్." కు. సం. ౧౧, ఆ. ౧౩౦, భార. ద్రో. ౩, ఆ. ౨౧౦.

నఱువు. దే. వి. పొడి,నలి. "వ ..తుత్తుము ళ్లయిన యత్తళంబులును నఱువు లైనమైమఱువులును నందఁబు చెడినచిందంబులును..." జై. ౫, ఆ.౨౦.

నల్లి. దే. వి. 1. పాలు పిదుకనీయనియావు, పెంకె యావు. "సీ. నల్లులనైనను నలువైనవెరవున ముట్టె యంటఁగఁ బట్టి కట్టి విడువ. గీ...నేర్తు..." భార. విరా. ౧, ఆ. ౧౦౧; 2. ప్రయాసము చేత బండి మొ. వానికి పూన్పఁదగినయెద్దు, పెంకె యెద్దు. "క. గుఱ్ఱములపరువు మెచ్చని, నల్లులఁ గట్టినరథముల నందప్రముఖుల్, గుఱ్ఱలయార్పులు సెలఁగఁగ, దొఱ్ఱులగమి వెంటనంటఁ దోలి రిలేశా." భాగ. ౧౦, స్కం. పూ. ౮౯౪, నవ నాథ. ౧, ఆ. ౩౦. పు.

నల. ఉ. భ దే. విణ. నల్లనిది. (చూ. నలమేనిదొర.) సం. వి. అ. పుం. ఒకానొక సంవత్సరము.

నలఁక. దే. వి. 1. నలఁకువ. (శ. ర.); 2. రేణువు. వ్యవ:—నాకంటిలో నలక పడినది.

నలఁకన. దే. విశే. (నలఁగుధా.) అల్పము, సూక్ష్మము. "సీ. నలఁకనై తోఁచునెన్నడుమించు నూగారు మాటున నొక్కింత మఱుఁగుపడఁగ." కావ్యా. ౩, ఆ. ౩౭.

**నలఁకువ.** దే. వి. (నలఁగుధా.) 1. ఆపద, ఇడుము. "వ. కావున నలుక నలఁకువలకు నిలుకడ యగుట దాని. విడువవలయు..." య. 3, ఆ. ౧౧. ద్వి. హరిశ్చ. పూ. ౩౬౯. పం; 2. శ్రమ, ప్రయాస. "క. ఏనుఁగుపల్లము వాజికి, నేనుఁగునకు హాయముపల్ల మిడి పల్లింపం, బూని యవి పొంకపడమికి, నానావిధవిహృతి నొకఁడు నలఁకువఁ బొందెన్." సాంబో. ౧, ఆ. ౧౨౧౩; 3. బాధ, పీడ. "వ ..పశుశిశుదాసదాసీజనంబులఁ దినవారింగా మెలఁగించి నలంకువలం దొలంగించుచు..." పాండు. 3, ఆ. ౨౪, చంద్రా. ౪, ఆ. ౭౧.

**నలఁగించు.** దే. స. క్రి. (నలఁగుధా. ప్రే.) పీడించు, బాధించు. "సీ. విమలసంధ్యారాగ సముదితనవ చంద్రు నలఁగించు రాహుమండల మనంగ." భాను. 3, ఆ. ౮, రాఘవ. ౪, ఆ. ౨౧౯.

**నలఁగు.** దే. అ. క్రి. 1. నలియగు, ముక్కలను. "ఉ. ఆవనజాక్షి కాఁకఁ బొరలాడ నలంగినసొమ్ముఁ జేరలుఁన్, వేలిన నూడ్చి యూడ్చి..." ఆము. ౭, ఆ. ౧౭౭; 2. పీడితమగు. "చ. పొదివి నభోవిహారమునఁ బువ్వుబోలె నలంగకుండ న, మ్మదనసమానుఁ బట్టికొని..." ఉ. హరి. ౭, ఆ. ౧౯౦; 3. ముడుతలుపడు. "సీ. బలుకట్ల దద్దు లేర్పడుభుజార్గలలతో నలఁగినచలువదువ్వలువ తోడ." ఉ. రా. ౭, ఆ. ౨౦; 4. నశించు, చెడు. "సీ. ధూమంబు వొదివినఁ దుఱఁగలి మెఱుఁగులు నలఁగి మాసినదీపకళికపగిది." భార. విరా. ౧, ఆ. ౨౯౪. ఉ. హరి ౨, ఆ. ౨౧౧; 5. శ్రమపడు; బాధనొందు. "చ...ఇడుముపాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నెక్కుడు తమకంబుతోడఁ దలక్రుచ్చి కవుంగిటఁ గూర్చె నంతటన్." కళా. ౪, ఆ. ౯౯, వి. పు. ౧, ఆ. ౧౦౧.

**నలఁగుడు.** దే. వి. పీడ, బాధ. "వ...గంతువిడు గబ్బి దెబ్బలులనలఁగుడుల..." స్వా. ౪, ఆ.౩౮.

**నలఁగుడుపడు.** ద్వి. అ. క్రి. (నలఁగుడు+పడు.) బాధపడు, పీడనందు. "క. అయిందుమఃఖులచేఁ బడి, రాయిడిఁబడి నలఁగుడువడి రావణుఁడు వడిన్, గాయము నొచ్చినఁ దొలఁగును, హాయము మఱి లేక యొకతె హాణిఁ గఱచినన్." ఉ. రా. ౭, ఆ. ౨౨౧.

**నలఁగుడువెట్టు.** దే. స. క్రి. (నలఁగుడు+పెట్టు.) బాధించు. "చ. అలయక నిట్లు ద్రిమ్మరుచు నద్దశ కంధరుఁ డూర్ధ్వలోకముల్, నలఁగుడువెట్ట నెంచి ..." ఉ. రా. ౭, ఆ ౨౧౮. (శ. ర. పా. 'నలఁకువఁబెట్టు.' ముద్రి. పా.)

**నలఁచు.** దే. స. క్రి. (నలఁగు ధా. ప్రే.) నలఁగఁ జేయు. "ఆ. మందు నలఁచి కన్నులం దిడి ముక్కునఁ, బిడిచి చెవులఁ బోసి..." దశ. ౭, ఆ. ౯౯; 2. బాధించు. "మ. గెలిచెం బూర్వ నరేంద్రులం బఱపె నాగ్నేయావనీనాథులన్, నలఁచెన్ దక్షిణరాజపంక్తి..." ఉ. హరి. ౭, ఆ. ౧౬; 3. చంపు, నశింపఁజేయు. "ఉ. ఓడక వచ్చి నాయెదుర నూరక ప్రేలెడుఁదీని మత్కృతిధా, బాడబకీలలన్ నలఁచి హాఱఁగవైచెద నంచు నుగ్రుఁడై." రాజ. చ. 3, ఆ. ౭౬; 4. కలియఁ గలుపు, మెదుపు. "గీ. అనుచుఁ దనపాదమున నున్నయట్టిమన్ను, నలఁచి యుండఁగఁ జేసి..." పరమ. ౧, ఆ. ౧౧౯.

**నలఁత.** దే. వి. (నలఁగుధా.) 1. పురాణించినరోగము. (బ్రౌ.); 2. అల్పరోగము. (వ్యవ) ఇంకను ఆతని నలఁత తగ్గలేదు. విణ. అల్పరోగము గలవాఁడు. (వ్యవ) వాఁ డింకను నలఁతగనే యున్నాఁడు.

**నలఁపు.** దే. స. క్రి. (నలఁగుధా. ప్రే.) 1. నలఁగఁ జేయు, మృదితముచేయు. "గీ. అలిగి పూవైన నలఁపలే దబల దాను." కువల. ౭, ఆ. ౭౬౯. భార. అను. ౪, ఆ. ౧; 2. బాధించు. "ఉత్సాహము...ఘనాలిచండకాండవృష్టి న్నలంపవచ్చు జగదజేయదండచుండుమా,యన్న బ్రాహ్మణునకు విరచితాంజలి యగుభక్తితోన్." రాఘవ. ౨, ఆ. ౧౦౭, విప్ర. 3, ఆ ౭౬.

**నలకీలము** సం. వి. అ. పుం. మోఁకాలు.

**నలకూబరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరునికొడుకు.

**నలదము.** సం. వి. అ. న. 1. వట్టివేరు, ఉశీరము; 2. పూఁదేనె, మకరందము.

**నలము.** సం. వి. అ. పుం. కిక్కసకసవు✽. "క. నలసారము సంసారము..." భార. ఆది. ౬, ఆ ౨౪౧. (తృణమువలె నిస్సారము అని భావము.) న. తామరపువ్వు, పద్మము.

నలమేనిదొర. దే. వి. కృష్ణుఁడు, విష్ణువు. "సీ. లీలమై శూలంబుఁ గేలఁ బూనినవాఁడు నలమేనిదొర తూఁపు గలుగువాఁడు." కృష్ణ. ౧, ఆ. ౨.

నలవడు. దే. అ. క్రి. (నలఁగు+పడు.) నలఁగు. "చ...మీరు వేగఁ జని యచ్చటిశూరుల వాని తోడుతన్, నలవడఁ జెండి పీచము లణంచి ననుం బ్రమదాత్ముఁ జేయరే." వీర. ౪, ఆ. ౪౭.

నలి. ఉభ. దే. వి. 1. పొడి. "ద్వి. నలి యైన మాంస ఖండములు మొండెములు, గలిసి లోకైకభీకర మయ్యె రణము." రం. రా. అర. ౧౬౩. పు. ఆము. ౧, ఆ. ౩౬; 2. ఎండుగడ్డి, శుష్క తృణము. "సీ...నలి యవ నలు సన నలరు శుష్క. గీ. తృణము." ఆం. భా. ద్వి. ౭౬, 3. చిఱుదిండి. "సీ...నలితిండి యొప్పును నలి యనఁ దగు..." ఆం. భా. తృ. ౪౫; 4. ఒప్పు, అందము. ఆం. భా. తృ. ౪౫; 5. ప్రేమ, అనురాగము. "సీ...మావి మోకఁ కల నెల దీవలఁ జెన్నొందుతోఁటలకడ నలితోడఁ జెంది. గీ... కేలిసలిపెడు నీదగులీల మఱవ, నావశంబె..." భార. శాం. ౩. ఆ. ౩౩౨; 6. ఉత్సాహము. "మ. విను నేఁ డర్జునుఁ డన్యసైన్యముల నుర్విం గూల్చుచున్ బ్రేతభూ, తనికాయంబులు మాంస భక్షణము రక్తముసై ర్వరపానంబుచేసి నలిం గ్రాలఁగఁ గ్రీడ సల్పు.." భార. ద్రో. ౩, ఆ. ౧౫; 7. లాఘవము, నేర్పు. "క. ఉరగాంగన నలిఁ బట్టెను, గరుడునిక్రియ శక్తి పట్టి క్రమ్మఱ వైచెన్, నరసుతుఁడు శల్యసూతుని ..."భార. ద్రో. ౧, ఆ. ౧౭౬; 8. శక్తి, సమర్థత. "ద్వి. నాకేల రాముఁడు నాకేల సంధి, నాకేమిటికి వేఁడ నలి దూలి యొకని." రం. రా. కిష్కిం. ౨౧౦, పు 9. బాధ. (చూ. నలిపెట్టు) విణ. సన్ననిది. "కవిరాజవిరాజితము. కరములఁ గంకణముల్ మొరయన్ నలికౌ నసియాడ ..."భాగ. ౧౦; స్కం. ఉ. ౪౮౮. క్రి. విణ ద్రు. 1. అత్యంతము. మిక్కిలి. "క. సరి సైదై దేయఁగ న్నన్నరుఁ డందఱు రెంటరెంట నలి నొప్పించెన్." భార. ద్రో. ౧, ఆ. ౨౪౧; 2. తగునట్లుగా, యుక్తముగా. "ఆ. నాదు ప్రశ్నము లకు నలి నుత్తరము లిచ్చి, వారిఁ గొనుము నీకు వలసినట్లు." భార. అర. ౭, ఆ. ౩౯౩; 3. నిశ్చలముగా. "ద్వి. నదులు వేగముమాని నలి నట్టె నిలిచెఁ, గదల వీవక సదాగతి దిమ్మపడియె." సిం. భాగ. ౨, ఆ. ౨౯. సం. వి. ఈ. స్త్రీ. 1. గువ్వగుత్తిక; 2. మణిసిల. [వా.]

నలికండ్లపాము. దే. వి. నలికీఁచు, రక్తపుచ్ఛిక. (శ.ర.

నలికము. ఉభ. దే. వి. సన్నఁదనము, తనుత్వము. "ద్వి. పొడవైనయట్టిమూఁపులును జానువులు, గడచుచేతులు నలికము కలనడుము." నవనాథ. ౨, ఆ. ౧౦౩, పు. విణ. సన్ననిది; అల్పము, చిన్నది. "క...ఎంతయుఁ బొల్పారుఁ గడు నలికమై సుకుమారికి మధ్యంబు సింహమధ్యము వోలెన్." కు. సం. ౩, ఆ. ౫౧. "ద్వి. నలి కంపుఁబూపలై నలి నొగరెక్కి, కాయలై..." నవనాథ. ౧, ఆ. ౧౧, పు. సం. వి. అ. న. ధనుస్సు లోనగువానికవచము.

నలికిరి. దే. వి. నలికండ్లపాము. (శ. ర.)

నలికీఁచు. దే. వి. నలికండ్లపాము. (శ. ర)

నలిగులి. దే. విణ. (నలి+గులి.) 1. మిక్కిలి నలఁగినది, అతిమృదితము. "సీ. తోరంపుగోరిజల త్రొక్కున నొడలెల్ల నలిగులియై సర్పనాథుఁ డోడుగ." హరి. పూ. ౪, ఆ. ౧౬; 2. బద్దలైనది, బీఁటలువాఱినది. "క...దిక్కులు, నలిగులిగా నతఁడు సింహనాదము చేసెన్." భార. భీష్మ. ౩. ఆ. ౧౧౭; 3. క్షీణించినది, తగ్గినది. "క. కలియుగమున ధర్మంబును, నలిగులి యగు నని సుధీజనంబులవాక్యంబుల విందు..." హరి. ఉ. ౯, ఆ. ౩౫.

నలిగొట్టు. దే. విణ. సన్నమగునది. "ద్వి. అడవికి నీ వేఁగునపుడు గన్నీరు, వెడలెడు నీవాలువెడఁద కన్నులును, విన్ననై పెదవులు విఱిచి దైన్యమున, నన్ను రమ్మని పిల్చునలిగొట్టుపలుకు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౭౬, పం.

నలిగొను. దే. అ. క్రి. (నలి+కొను.) ఉత్సాహపడు. "ద్వి. వలపటిదెస సుమావరభక్తరాజి, నలిగొన సింహాసనస్థులఁ జేసి." పండితా. వాద. ౧౭౬, పు.

నలితిండి. దే వి. చిఱుదిండి. (చూ. నలితిండికాఁడు.)

నలితిండికాఁడు. దే. విణ. (నలితిండి+కాఁడు.) "సీ...సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవానిపే రై..." ఆం. భా. తృ. ౬.

నలినము. సం. వి. అ. పుం. సారసపక్షి. న. 1. పద్మము, తామరపూవు; 2. నీరు

నలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీగ, పద్మిని; 2. తామరకొలను; 3. తామరతంపర, పద్మసమూహము; 4. నది; 5. గొబ్బెరకు, 6. వృత్తభేదము. (ఛందస్సు)

నలిపెట్టు. దే. స. క్రి. (నలి+పెట్టు.) బాధించు "రగడ. విటపాళుల నీవేనలిఁ బెట్టుదు, విటపాళుల నీవే నలిపెట్టుదు." శశాం. ౨, ఆ. ౧౧౮. దశ. ౪, ఆ. ౮౨.

నలిబలి. దే. విశ. క్షతము, గాయపడినది. "సీ. ఈ మోవి యిఁకమీఁద నా మోము మునిపంటిఘాతచే నలిబలి గాకయున్నె." కువల. ౩, ఆ. ౯౪.

నలియు. దే. అ. క్రి. 1. నలఁగు, పొడియగు "ఉ. కొన్నిటిఁ బార్శ్వములే నలియఁ గొన్నిటి వీపులు పిండుపీఁచుగా, నన్నిటి భీముఁ డద్భుతగదాహతి నేసికవేఁట లాడఁగన్." భార. భీష్మ. ౨. ఆ. ౨౧౧. హరి. ఉ. ౧, ఆ. ౧౦౧; 2. విఱుగు,ముక్కలగు. "వ...ఎమ్ములు నలియఁ బొడిచియు..." ఉ. హరి. ౩, ఆ. ౧౭౦. నైష. ౭, ఆ. ౧౩౦; 3. నలఁగు, మృదితమగు. "మ... శిరోజాతముల్, బలిమిం బట్టి వెసంబడం దిగిచి లీలన్ వక్షమున్ మస్తమున్, నలియం బెట్టుగఁ గుప్పిగంతుగొని విన్నాణంబు గావించినన్." వి. పు. ౭, ఆ. ౪౧౪; 4. చచ్చు. (చూ. నలిసిపోవు.); 5. చిదుకు. "సీ. క్రతురక్షకులఁ దాఁకి ...బలిమి సదస్యుల నలియ మోఁది." కు. సం. ౨, ఆ. ౬౯.

నలిరేఁగు. దే. అ. క్రి. (నలి+రేఁగు.) విజృంభించు. "క...కాంపిల్యనగరమున జను లెల్లన్, నలిరేఁగి యార్చి కౌరవ, బలసుభటులఁ బొడిచి రాజి బయలువడంగన్." భార. ఆది. ౯, ఆ. ౭౨. ౭, ఆ. ౧౦౮.

నలిసిపోవు. దే. అ. క్రి. (నలియు+పోవు.) చచ్చు. "సీ. ఈఁగలు వడ మూఁగు నీడేర వెంతైన నల్లులు జనియించి నలిసిపోవు." నీతిసీ. ౯౮.

నలుఁగిడు, దే. అ. క్రి. (నలుఁగు+ఇడు.) ఉద్వర్తనము చేయు, తలంటుకొనునప్పుడు మఱికిపోవుటకై దేహమున పిండి మొ. రాచి నలుచు. "సీ. చెలి యొత్తు కుంకుమ నలుఁగిడె భసిత్రావలిప్తదేహము

హైమదీప్తి మెఱయ." దశా. ౬, అ. ౨౭. స్వా. ౯, ఆ. ౯౬.

నలుఁగు = నలఁగు. (కృశించు, తగ్గు.) "క. అని తలఁచి కదలి కతిపయ దినముల ననుజపురి చేరు తెరువున డస్సెన్, దనువు మును పేదయై నలిఁ, గినమానముకంటె మిగులఁ గృశమై యుండన్." కేయూర. ౩, ఆ. ౩౧౧. వి. (తలంటుకొనునప్పుడుమఱికిపోవుటకై దేహమునకు రాచు పిండి. మొ.) "సీ. అలఁదు నలుంగు దేహమున వేణ్ణీళ్లార్చుఁ దడిరొత్తు మెత్తనిధవళవస్త్రమున..." కాశ. ౪, ఆ. ౧౧; 2. ఉద్వర్తనము, తలంటుకొనునప్పుడు దేహమున మఱికి పోవుటకై పిండి రాచి నలుచుట, "మ. అలమన్నానెఁ దలంటు గందము నలుంగందంబు పన్నీటిచే, జలకంబున్ ..." దశా. ౯, అ. ౬౫. ఆం. భా. ద్వి. ౧౬౦.

నలుఁగుడు. దే. వి. (నలుఁగు ధా.) బాధ. (చూ. నలుఁగుడుపడు.)

నలుఁగుడుపడు. ద్వ. అ. క్రి. (నలుఁగుడు+పడు.) "క. నీమగని నంధుఁ జేసెద, నామాటన్ వినుమతండు నలుఁగుడుపడ ర్యాదోమగువ యతని కన్నము, ప్రేమంబునఁ గంచ మరసి పెట్టుము దినమున్." శుక. ౩, ఆ. ౩౬౩.

నలుఁగువెట్టు. దే. స. క్రి. (నలుఁగు+పెట్టు.) నలుచు, ఉద్వర్తనముచేయు. "సీ. పసుపుతోఁ గూడఁ గప్రము చాల మేదించి నలుఁగువెట్టెను కూర్మి మెలఁత యొొర్తు." య. ౪, ఆ. ౮౮. నైష. ౮. ఆ. ౫౬.

నలుకాలు. దే. వి. (నాలుగు+కాలు.) నాల్గుకాళ్లు. "క...ధర్మము పొదలి చరించుఁగాత మహి నలుకాలన్." హరి. పూ. ౪, ఆ. ౧౮౯. హరి. పూ. ౪, ఆ. ౧౩౯. ఇట్లే: నలుగాలు. కావ్యా. ౯, ఆ. ౩౦.

నలుకు. దే. వి. (నలియు. ధా.) ముక్క. "గీ... కలబందనలుకుల భక్షణమునఁ, బ్రాణములు నిల్పికొనుచుఁ దపంబుచేసె." సీమం. ౧, ఆ. ౨౨.

నలుగంబాలాట. ద్వ. వి. బాలికాక్రీడా విశేషము. "మ...కనుమూసిగంత నలుగంబాలాట లోనైన ఖేలనముల్ ..." కళా. ౬, ఆ. ౨౦౨.

నలుగడ. ద్వ. వి. (నాలుగు+కడలు.) నాలుగు దిక్కులు, "గీ. బలము లిదిరేమి నలుగడఁ బొఱఁ

జొచ్చె." భార. ద్రో. ౫, ఆ. ౩౭౯. శు. సం. ౬, ఆ. ౧౪౩. ఇట్లే: నలుగడలు. నైష. ౮, ఆ. ౧౨.

నలుగాలిది. దే. వి. (నలుగాలు+అది.) నాలుగుకాళ్లు గలజంతువు, చతుష్పాత్తు. "గీ. అనిన నలుగాలి వాన గోవును నశేష,శబ్దముల మంత్రమును లోహ జాతిఁ గాంచ, నమును మనుజుల విప్రుండు సమధి కత్వ,భాజనము లంద్రు. వేదప్రపంచవిదులు." భార. శాం. ౧, ఆ. ౭౧, అశ్వ. ౪, ఆ. ౧౮౧.

నలుగురు = నలువురు. (అందఱు.) వ్యవ:—ఆమాట నలుగురును జెప్పుకొనుచున్నారు.

నలుగేలు. దే. వి. (నాలుగు+కేలు.) నాలుగుచేతులు. "చ. సరసపుటల్కఁ దీర్చుతఱి శార్ఙ్గసుదర్శన నందకాబ్జసం, భరణగుణాప్తి సెన్నడుముపైఁ గటిపైఁ జడపై గళంబుపై,హరి నలుగేలుఁ బైకొన. ..." పారి. పీఠి. ౫.

నలుచు. దే. స. క్రి. (నలియు ధా. ప్రే.) మర్దించు, మృదితముచేయు. "గీ. కోటిఁ దెచ్చితి నఁబోయి కొఱవిఁదెచ్చి, నాఁడ నవుడు ముక్కులు నలుచుకొనిరి, కొలువువా రెల్ల నవుడు పక్కునను నగుచు." దశా. ౭, ఆ. ౨, ఆ. ౯౮.

నలుజాములు. ద్వి. వి. (నాలుగు+జాములు.) నాలుగు జాములు. "గీ. పొడుపుమలనుండి పడమటికడలి కరుగఁ, బవలు నలుజాములును బట్టుఁ దొవల సూఁడు, తత్తదుల కని..." నీలా. ౧. ఆ. ౩౪.

నలుతుము. దే. వి. (నాలుగు+తూము.) నాలుగు తూములు, ద్రోణము. (చూ. నల్తుము.)

నలుదిక్కు. ద్వి. వి. (నాలుగు+దిక్కు.) నాలుగు దిక్కులు. "క...శివుఁడు....న, ల్దిక్కుఁ దిరిగి నిలిచి తూఁవులించుచు నుండెన్." ఉ. హరి. ౬, ఆ. ౧౬౮. ఇట్లే: నలుదిక్కులు." నైష. ౩, ఆ. ౮౮.

నలుదెసలు. ద్వి. వి. (నాలుగు+దెసలు.) నాల్గు దిక్కులు. "వ...తారు దిగ నిమ్ము లేక బిమ్మిటి గొని నలుదెసలుం జూడ..." ఆము. ౪, ఆ. ౩౫.

నలుపలము. ద్వి. వి. (నాలుగు+పలములు) "సీ... నలుపలం బనఁ జటు,పలము దనరు." ఆం. భా. ద్వి. ౨౬౮.

నలుపు. దే. స. క్రి. (నలియు ధా. ప్రే.) నలుఁగఁ జేయు, మర్దించు. "రగడ. నలిపిపైపకే నవకలి కావలి యలినీలాలక యది మాకావలి.", రాజ. చ. ౨, ఆ. ౧౫౮. వి. 1. నీలవర్ణము. "సీ. పాలు పారునారుల నలుపుతోడనుగూడ నలుపు చక్కైన లందు నాటుకొనఁగ." విక్ర. ౧, ఆ. ౧౬౬. నైష. ౫, ఆ. ౧౭౮; 2. కళంకము, దోషము. "గీ. ఇంతనాఁడు కరగ్రహవంతురాలిఁ, జేసి తోడ్కొని వచ్చితి చెప్పినట్లు, చేయుచుంటిని గోత్రంబు మీయనుజ్ఞ, నలుపు నా కేయెడల నైనఁ దెలుపఁగలరె." నిరం. ౨, ఆ. ౫౫. విణ. నల్లనిది, కృష్ణము. "గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయభార్య, లుడుపతికి నందు నొకతెద లొప్పిరు నలుపు,తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁబోలుఁ, దెలుపు నలుపును నగుమేను సెలఁత యిణఁడు." నైష. ౮, ఆ. ౧౮౪, హర. ౬, ఆ. ౬.

నలుపుగింటెనదాల్పు. దే. వి. బలరాముఁడు. వేంక. దేవ. ౨౧.

నలుపెక్కు. దే. అ. క్రి. (నలుపు+ఎక్కు.) నల్ల వాఱు, నల్లనగు. "గీ. రోమరాజి తమాలవల్లివ తల్లి,పగిది నలుపెక్కి మెఱసె నాపడఁతి నడుమ ..." వరాహా. ౩, ఆ. ౩. జాహ్నవీ. ౧, ఆ. ౮౭.

నలుబది. దే. స. (నాలుగు+పది.) నాలుగుపదులు. కృష్ణ. ౨, ఆ. ౭౩.

నలుమడి. దే. వి. నాలుగురెట్లు. (చూ. నలుమడించు)

నలుమడించు. దే. అ. క్రి. నాలుగురెట్లగు, చతుర్గుణమగు. "ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నా, లింగనంబుసేసి..." భార. విరా. ౫, ఆ. ౩౪౧, కవిక. పీఠి. ౩౯. స. క్రి. నాలుగురెట్లు చేయు, చతుర్గుణితముచేయు. (చూ. నలుమడించుకొను.)

నలుమడించుకొను. దే. స. క్రి. (నలుమడించు+కొను-స్వార్థమున) చతుర్గుణితముచేయు, నాల్గురెట్లు చేయు. "ఆ. అస్థి గలిగి హీన మగుజంతువైనఁ ద, ద్విగుణవృత్తి వలయుఁ బ్రగుణజంతు, వునకు నలుమడించుకొనునది...నరమాత్ర, హింస యష్ట గుణకృతిహఁ బాయు." భార. అను. ౩, ఆ. ౭౯౭.

నలుమాఱు. దే. వి. (నాలుగు+మాఱు.) నాల్గు పర్యాయములు. "క. కలయఁగ నంబుద్ధలత..."

ముల నుపుడఁగ వలయు నందముగ జయజీవో, జ్వలనేవాదిపదంబులు, నలి నిడుచతురు త్తరంబు నలుమాత్రైవన్." కావ్యా. ౪, ఆ. ౩౮.

నలుమోములపాదుసా. ద్వ. వి. బ్రహ్మ. వేంక.దేవ.౬.

నలువ. ద్వ. వి. (నాలుగు+వా.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ. "సీ. నలువనెమ్మోముఁదమ్ములు కేళిగృహములు తళుకుటద్దంబు సత్కవులమనసు. గీ. ఎపుడు నేదేవి కాదేవి...మామకస్వాంతవీథి, నిండు వేడుక విహరించుచుండుఁగాత." నైష. ౧, ఆ. ౫, ఆం. భా. ౧, ఆ. ౩౯.

నలువచూలి. ద్వ. వి. నారదుఁడు. దశా. ౪, ఆ. ౬౦. (ఇట్టే. నలువపట్టి. మొ.)

నలువతమ్ముఁడు. ద్వ. వి. (నలువ+తమ్ముఁడు.) మన్మథుఁడు. "గీ. నలువతమ్ముఁడు ముక్కంటి గెలువ నెంచి." ప్రబంధ. ౪, ఆ. ౮౩.

నలువతూపు. ద్వ. వి. (నలువ+తూపు.) బ్రహ్మాస్త్రము. "సీ. నలువతూ పరివోసి బలిమిమై నద్దోసకారి రక్కసు మేలిగానిమీఁద, నేసిన..." అచ్చ. యుం. ౨౬౭. [అర. ౨౬.

నలువతేజీ. ద్వ. వి. (నలువ+తేజీ.) హంస. అచ్చ.

నలువపాగా. ద్వ. వి. (నలువ+పాగా.) హంసల సమూహము. చం. రా ౩, ఆ. ౮.

నలువప్రోలు. ద్వ. వి. (నలువ+ప్రోలు.) సత్యలోకము "గీ. లలి నిరాబారులే యుండునలువప్రోలు, బలసి విసదారు లుండుపెంజిలువప్రోలు." అచ్చ. బాల. ౩౧.

నలువబాబా. ద్వ. వి. (నలువ+బాబా.) హంస. "సీ. పాలసంద్రము లయ్యె నోలి నే ర్లన్నియు నలువబాబా లయ్యెఁ బులుఁగు లెల్ల." అచ్చ. అయో. ౨౦, అచ్చ. కిష్కిం. ౬౯.

నలువరాణి. ద్వ. వి. (నలువ+రాణి.) సరస్వతి, వాణి. "గీ. నలువరాణి మదాత్మలో వెలయుఁగాత."స్వా. ౧, ఆ. ౫. రాజ. చ. ౩, ఆ. ౯౨.

నలువంక. దే. వి. (నాలుగు+వంక.) నాలుగుదిక్కులు. "మ...నలువంకన్ మలయానిలాంచలముచే నర్తించుభూధూళితోఁ, గొలఁదుల్ మీఱ ఫలావళుల్ మెసవుచున్ గ్రీష్మావులం బల్కుచు, ల్కలతో..." వరాహ. ౪, ఆ. ౧౧౬.

నలువంద్రు. ద్వ. స. బ. (నలువదికి మహన్మహత్త్వార్థకరూపము.) నలువదిమంది. "వ... కేళి దుర్మ యాదు లైనదానవులు నలువంద్రు పుట్టిరి..." భార. ఆది. ౩, ఆ. ౬౩.

నలువందు. దే. అ. క్రి. (నలువు+అందు.) ఒప్పు. "సీ. నాలుగువాకిళ్ల నలువంద వేఘకల్ సవరించు ముత్యాలచవిక లైన." రామా. ౬, ఆ. ౧౨౮.

నలువది ద్వ. స. ఔ. (నాలుగు+పది.) నాలుగు పదులు. "సీ. వెసఁ జేర్చి నలువది వేలయక్షౌహిణుల్ నడచువేగంబునఁ బుడమి వడక..." ఉ. రా. ౪, ఆ. ౧౩౩.

నలువదఱువది. ద్వ. స. ఔ. (నలువది+అఱువది.) నూఱు. "సీ. నలువదఱువదిజన్నములు చేసిన ప్రోడ." వేంక. దేవ. ౧౪.

నలువదుగురు. ద్వ. స. (నలువదికి మహన్మహత్త్వార్థకరూపము.) నలువదిమంది. "సీ ..భద్రమతి యను విప్రోత్తముఁ డొకండు.. అతనికిభార్య లార్వురు నందను లిన్నూటనలువదుగురు." దశా. ౫, ఆ. ౧౦౬.

నలువమరు. దే. అ. క్రి. ఒప్పు. "సీ....గాయక సంగీతగాంధర్వగానముల్ ద్విజవరాశీర్వాదవేదఘోష. గీ. నలువమరు వజ్రసింహాసనప్రదీప్త శారదాసక్తుఁడై ..." ఉ. హరిశ్చ. ౬౦.

నలువారు. దే. అ. క్రి. (నలువు+ఆరు.) ఒప్పు. "సీ. వరియించు టెన్నఁడో వరమనోమోదంబు నలువార రాజకన్యాలలామ." చంద్రి. ౪, ఆ. ౩.

నలువు. దే. వి. 1. అందము, సౌందర్యము. "సీ. ఎలతుమ్మెదలదిమ్ము వెలిఁ జిమ్ముచెలువమ్ము గలవేణి కొకకొంత నలువు మీఱె." పారి. ౧, ఆ. ౫౬, హరి. పూ. ౮, ఆ. ౮; 2. సామర్థ్యము, శక్తి. "వ...వలచుట్టునం జెట్టు దండగొని నిలువ నలువు గలపుళిందులఁ గొందఱ నిలిపి..." స్వా. ౪, ఆ. ౩౨, రం. రా. ఉ. ౨౬. పు; 3. విధము, రీతి. "చ. నలువమొగంబు లెట్లు సృజనప్రథమాహమునం దలిర్చు న్నన్నలువున సిద్ధసాధ్యనరనాగమరుద్వరయోగిమండలీ, కలకలగుంఫితంబు లయి కాంచనచారువు లైనసాల్గువా, కిళుల వెలుఁగు నున్నతనికేతనరాజమునం బ్రసన్నుఁడై." పాండు. ౨, ఆ. ౩౨. దశా. ౫, ఆ. ౧౧౫. విణ. 1. చక్కనిది, ఒప్పిదమైనది. "సీ. నఱ్ఱులైనను నలువైన వెఱవున ముట్టె యంటుఁగఁ బట్టి కట్టి విడువఁ గీ...నేత్తు..." భార. విరా. ౧, ఆ. ౧౦౧; 2.

శక్తికలది, సమర్థము. "చ....నరపాల నిజాంబు సమిల్పి ౧యుండనై, నలువుగ నర్జునచ్ఛిద యొన ర్పఁగ వచ్చితి నంచు రాముఁడున్" దశా. ౬, ఆ. ౧౧౯.

నలువొందు. దే. అ. క్రి. (నలువు+ఒందు.) ఒప్పు. "సీ. నలువదనంబుల నలువొందుశివుఁ డెందుఁ గలిగె నంచు విరించిఁ గనిరి మునులు." దశా. ౧, ఆ. ౨౨, ఉ. రా. ౭, ఆ. ౧౪౩.

నలుసాల. ద్వ. వి. (నాలుగు+సాల.) నాలుగిండ్ల బవంతి, చతుశ్శాలము. "సీ. కనుఱెప్ప లరవంచి కర్ణాంతములు దాఁట నలుసాల నృత్యంబు దొలుకఁ జూచి..." నిరం. ౧, ఆ. ౫౦, ఆం. భా. ద్వి. ౧౪.

నలుసు. దే. వి. (నలఁగు.) 1. శుష్కతృణము. "సీ...నలి యన నలు సన నలరు శుష్క. గీ. తృణము." ఆం. భా. ద్వి. ౭౬; 2. తృణము మున్నగువానిలేశము, రేణువు. "చ. సురలకు గుండె ల్లడము ఘోరులడెందములోనిగొల్లు ఖే,చరతతి కంటిలో నలుసు...." భా. రా. యు. ౨౪౧౯.

నల్గడ=నలుగడ. "మ...వారిద, ప్రతతుల్ సాల్పడి నల్గడం జెదరఁగాఁ బాఱెన్ మనోవేగుఁడై, పత గేంద్రుండు..." భార. ఆది. ౨, ఆ. ౯౧. ఉ. హరి. ౩, ఆ. ౫౮.

నల్గడలు = నలుగడలు. ఉ. రా. ౨, ఆ. ౧౪౮.

నల్తుము. ద్వ. వి. (నాలుగు+తూము.) నాలుగు తూములు. "సీ. చతురాఢకీసంజ్ఞ చనును నల్తు మనంగ..." ఆం. భా. ద్వి. ౨౭౧.

నల్దెస=నలుదెస. హరి. ఉ. ౨, ఆ. ౧౨౮.

నల్పుదేఱు. దే. అ. క్రి. (నల్పు+తేఱు.) నల్లనగు. "ఉ. మిక్కిలి నల్పుదేఱుబలుమేనులు జుంజురు గడ్డముల్...వన్నెలు చూప నెంతయున్." ఇందు. ౨, ఆ. ౪౬.

నల్బది=నలువది. "గీ. భటులు వెయ్యింటి కెన్న నిర్వదియునాల్గు, వేలుగా లక్షయర్వదివేల ప్రజకు, జెల్లు నల్బదిలక్షలజీత మనఘ." కృష్ణ ౨, ఆ. ౭౩.

నల్మ్గణు. దే. విశ. (నాలుగు+మణుఁగు.) నాలుగు రెట్లు గలది, చతుర్గుణము. "సీ. ముమ్మ్గణు పుష్కరంబునకు నల్మ్గణు పంపకు నిది యనఁ దగుఁ బ్రకట మహిమ." పాండు. ౩, ఆ. ౧౩౭.

నల్ల. యు. దే. వి. 1. నెత్తురు, రక్తము. "సీ. బలు పచ్చిపాలనుండి నెలవులదిగజాఱు నల్లనాలుక సాఁచి నాఁకికొనుచు." ఉ. రా. ౭, ఆ. ౧౨౦. ఆము. ౪, ఆ. ౧౯౩; 2. రక్తవిశేషము, గట్టి పడిన నెత్తురు. "సీ. రక్తవిశేషంబు రాజిల్లు నల్ల నా..." ఆం. భా. ద్వి. ౧౩౨. వై. వి. (సం. నైల్యం. త నల్లం.) 1. నలుపు, నీలవర్ణము. "గీ. అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు,నల్ల గలిగిన నీ విప్డు నాకు దాసి, వగుము మఱి యందు నల్ల లేదయ్యెనేని, నీకు నే దాసి నగుదుఁ బన్నిదము సఖియు." భార. ఆది. ౨, ఆ. ౩౨, భార. ఆశ్వ. ౧, ఆ. ౨౬౬; 2. కళంకము. "వ. కని కద్రువ వినతం జూచి చూడవె యల్ల యతిధవళం బైన యశ్వంబునందుఁ బూర్ణచంద్రునందు నల్లయుం బోలె వాలప్రదేశంబునందు నల్లయై యున్నది." భార. ఆది. ౨, ఆ. ౩౧; 3. తప్పు, దోషము. "గీ అహహ యలచంద్రుఁ డనువాఁ డహంక రించి, రోహిణీదేవి నొల్లక రోసి యుండఁ, బాపిన తని క్షయవ్యాధిబాధితునిగఁ, గినిసి శపియింపనే నల్లఁ గనిన నోర్వ." కాశీ. ౭, ఆ. ౫౧; 4. బొగ్గు. "సీ. అళిసమూహంబు నల్లలు మందపవ నుండు చర్మభస్త్రిక మావిచయము తలిరు, టూకు జొంపములు తీవ్రానలజ్వాలలు .." ప్రబంధ. ౪౪, ఆం. భా. ద్వి. ౨౪౨. విశ. నల్లనిది, కృష్ణము. (దీనికి వృత్తియందు వికల్పముగా నిగాగమము.) "సీ. ఉల్ల తెల్లనియురగోత్తము వాలంబు నల్ల సేసితిరేని నాకు దాసి, యగు మన వినత..." భార. ఆది. ౨, ఆ. ౩౪, భాగ. ౧౦, స్కం. పూ. ౧౦౨౦.

నల్లఁబాఱు. ద్వ. అ. క్రి. (నల్ల+పాఱు.) నల్లనగు. "గీ...లజ్జించె ననఁగ మొగాలు నల్లఁబాఱుగుర విందపూసలపేరు వైచు." వరాహ. ౨, ఆ ౧౧౫, ౩, ఆ. ౪.

నల్లకచోరము. ద్వ. వి.(నల్ల+కచోరము.) చోరము శి. (శ ర.)

నల్లకాచి. వై. వి. (నల్ల+కాచి.) ఒకరకము మొక్క. "సీ. కామజీలుగు మెట్టదామర జెట్టిసెనఁగ జంబరము కాఁచి నల్లకాఁచి." హంస. ౪, ఆ. ౧౦.

నల్లగగ్గెర. ద్వ. వి. (నల్ల+గగ్గెర.) కటింజరము శి. (శ. ర.)

నల్లగఱిక. ద్వ. (నల్ల+గఱిక.) నీలదూర్వ. (అభిధానరత్నమాల.)

నల్లగల్వ. ద్వ. వి. (నల్ల+కల్వ.) నీలోత్పలము, ఇందీవరము. "చ. అవనిజచూపులుల్ రవికులాగ్రణిమై జిగి నల్లగల్వలున్, గువలయనేత్రనవ్వులు రఘుప్రభుచూపులుఁ దెల్లగల్వ లైక్యమువ యయి నిండె నీట మును గోసినపువ్వులకంటె రెట్టిగా." ఉ. రా. ౬, ఆ. ౧౧౦, ఆం. భా. ప్ర. ౧౬౫.

నల్లగింటెన. ద్వ. వి. (నల్ల+గింటెన.) నీలపుష్పి✿. "సీ. నల్లగింటెన పూలి తెల్లగింటెన యుత్తరేణు గుబ్బిరి సంబరేణు..." హంస. ౪, ఆ. ౧౦. (శ. ర. పా.)

నల్లగినియ. వై. వి. (నల్ల+గినియ.) గినియ✿. (శ. ర.)

నల్లగిసియ. వై. వి. (నల్ల+అగిసియ.) అతసి✿ (శ. ర.)

నల్లగురిగింజ. ద్వ. వి. (నల్ల+గురిగింజ.) కృష్ణగుంజ.✿ (శ. ర.)

నల్లగూబ. ద్వ. వి. (నల్ల+గూబ.) కృతమాలకము.✿ (శ. ర.)

నల్లగెనుసు. ద్వ. వి. (నల్ల+గెనుసు.) కృష్ణాలువు✿. (శ. ర.) [(శ. ర.)

నల్లగొలిమిడి. ద్వ. వి. (నల్ల+గొలిమిడి.) నీలదూర్వ✿.

నల్లగోరంట. వై. వి. (నల్ల+గోరంట.) ఆర్తగళము✿. (శ. ర.)

నల్లగ్రుడ్డు. ద్వ. వి. (నల్ల+గ్రుడ్డు.) కంటిగ్రుడ్డులోని భాగము, కనీనిక. (శ. ర.)

నల్లచీమ. ద్వ. వి (నల్ల+చీమ.) మర్కటపిపీలిక. (శ. ర.)

నల్లచెన్నంగులు. ద్వ. వి. బ. (నల్ల+చెన్నంగులు.) ధాన్యవిశేషము. "గీ. జిలిలొంగలరాజనమ్ములు నలవరులును, దెల్లనల్లచెన్నంగులు దీవసరులు నాది యగుపేరు గలవడ్లు..." హంస. ౪, ఆ. ౧౫౦.

నల్లచెఱకు. ద్వ. వి. (నల్ల+చెఱకు.) నిజమయినచెఱకు గాక దానివలె మధురరసము గలఒకరకము తెల్లు, అనిక్షువు✿. (శ. ర.)

నల్లచేమ. ద్వ. వి. (నల్ల+చేమ.) ఒకజాతిచేమ, కృష్ణాలుకము✿. (శ. ర.)

నల్లచ్చికాఁడు. ద్వ. వి. (నల్ల+లచ్చనము+కాఁడు.) పక్షివిశేషము. "సీ... నల్లచ్చికాఁడును జల్లపిట్ట. గీ. యనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు." ఆం. భా. ద్వి. ౯౦.

నల్లజీలకఱ్ఱ. వై. వి. (నల్ల+జీలకఱ్ఱ.) ఒకరకముజీలకఱ్ఱ సుషవిక." ఆం. భా. ద్వి. ౨౪౯.

నల్లతీఁగె. వై. వి. (నల్ల+తీఁగె.) సర్పాక్షి✿. "గీ... సర్పాక్షి ప్రబలు నల్ల, తీఁగ్గె నా..." ఆం. భా. ద్వి. ౫౯, హంస. ౪, ఆ. ౧౦.

నల్లతుమికి. ద్వ. వి. (నల్ల+తుమికి.) ఒకజాతితిందుకము, కాకతిందుకము✿. (శ. ర.)

నల్లతెగడ. వై. వి. (నల్ల+తెగడ.) ఓషధివిశేషము, కాలమేషిక✿. (శ. ర.)

నల్లతొగ. ద్వ. వి. (నల్ల+తొగ.) నీలోత్పలము, నల్లకలువ. "సీ. కస్తూరి వ్రాసినకరణి మీసల నల్లతొగరేకుల జయించుమొగము మెఱయ." పి. శకుం. ౨, ఆ. ౮౦.

నల్లత్రాఁచు. ద్వ. వి. (నల్ల+త్రాఁచు.) కృష్ణసర్పము. "గీ. నల్లత్రాఁచులు మేనుల నెల్ల నిండఁ, దగిలి కొని వానరులపోక మొగులుఁదీవ, లలమినసు మేరు శృంగంబులట్ల యుండి, రేసె సౌపర్ణ బాణంబు రాసుతుండు." రామా. ౮, ఆ. ౨౧౪.

నల్లదట్టిసబిల్ల. ద్వ. వి. చోరసాధనవిశేషము. ప్రబంధ. ౭౫౯.

నల్లదాసరిగాఁడు. ద్వ. వి. (నల్ల+దాసరి+కాఁడు.) తాఁబేలు. "సీ. తామే లసంగను దాఁబే లనఁగ నల్లదాసరిగాఁ డనఁ దగుఁ గమఠము." ఆం. భా. ప్ర. ౧౬౧, ఆము. ౫, ఆ. ౪౧.

నల్లదేవర. వై. వి. (నల్ల+దేవర.) కటివేల్పు. విష్ణువు. "సీ. నల్లదేవర మోచినాఁడు నాఁ డని కాని మలఁతుము గరుటాలమంతునైన." సాంబో. ౨, ఆ. ౧౭౯. నరస. ౫, ఆ. ౨౨.

నల్లద్రావరి. దే. వి. (నల్ల+ద్రావరి.) రాక్షసుఁడు. "శా... ప్రేపల్లెంగ, గాలం గోడిఁయు నల్లద్రావరి నడంగం జేయుమేల్వోరిటరీ." అచ్చ. భా. 3, ఆ. ౧౧౧.

నల్లద్రావుడు. దే. వి. (నల్ల+ద్రావుడు.) రాక్షసుఁడు. "గీ. పూతన యనుపేర నడరుబెరసు, నల్లద్రావుడుఁబడఁతి మత్తిల్లి చేరి..." నీలా. ౧, ఆ. ౭౨, అచ్చ. ఆర. ౧౨.

నల్లన. వై. వి. (సం. నైల్యం.) కృష్ణవర్ణము. "సీ... నల్లన నల్పు కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణ, వర్ణంబు..." ఆం. భా. ప్ర. ౧౦౮. విణ. నల్లనిది, కృష్ణము. "సీ. మేరుశృంగములపై మేఘ

ముల్ డిగురీతి నాలిచూచుకములు నల్ల నయ్యో." ఉ. రా. ౨, ఆ. ౧౩౭, దశా. ౨, ఆ. ౨౨౦.

నల్లనయ్య. వై. వి. (నల్లని+అయ్య.) కృష్ణుఁడు, విష్ణువు. "సీ. మాయచే నిన్నుఁ గ్రమ్మఱ నుండఁ జేసెనో నలువొందు మీయయ్య నల్లనయ్య." ఇందు. ౪, ఆ. ౪౮.

నల్లనాఁగు. వై. వి. (నల్ల+నాఁగు.) కృష్ణసర్పము; నల్లత్రాఁచు. "సీ.కన్నులు మిణుఁగురుల్ గ్రమ్మఁగా మ్రోఁగుచు బుస్సనుచో వేఁడిపొగలు నిగుడఁ, బ్రల్లదంబునఁ ద్రుళ్లి నల్లనాఁగులు నాఁగ పెంజెర లును బొట్టపెంజెరలును." ద్వా. ౮, ఆ. ౧౦౦.

నల్లనైదువ. ద్వ. వి. (నల్లని+ఐదువ.) పార్వతి. చూ. (నల్లనైదువగేస్తు.)

నల్లనైదువగేస్తు. ద్వ. వి. (నల్లనైదువ+గేస్తు.) శివుఁడు. "సీ. నల్లనైదువగేస్తు నాపకుత్తుకదంట కిత్తికంటివలంతి మిత్తిగొంగ...గీ...శంకరుని నామధేయముల్ వేంకటేశ." వేంక. దేవ. ౫.

నల్లపజే = నల్లప్రజ. (నల్ల+పజే.) 1. కిరాతకసంఘము; 2. కోకిలలసమూహము. "చ. కలరవ మూన్చు నల్లపజ కప్పక రా వెనువెంట రాజమం,డలి నడ తేరఁ జైత్రబలనాథునిఁ గూడి..." చంద్రి. ౪, ఆ. ౮౫. (ఉభయార్థములకు నదియే యుదాహరణము.) [శ. ౫౨.

నల్లపని. ద్వ. వి. (నల్ల+పని.) రతి, సంభోగము. రాజ.

నల్లపాము. ద్వ. వి. (నల్ల+పాము.) కృష్ణసర్పము. "సీ....హరినీలసోపానసరణి కాఁబోలును బగటు చున్నది నల్లపాఁపపేరు." ప్రభా. ౧, ఆ. ౬౩.

నల్లపూస. ద్వ. వి. (నల్ల+పూస.) నల్లనిగాజుపూస. (వివాహములో నాగవల్లిసమయమున వరుఁడు వధువుమెడలో సౌమంగల్యమునకై నల్లపూసల పేరు కట్టును.) "శా...దురా, చారాగ్రేసరుఁ డాధరాసురుఁడు కాంక్షన్ నల్లపూసాదిగా, నారామామణిసొమ్ము నాఁచికొని వేశ్యావాటి కేఁగెన్ నృపా." నిరం. ౨, ఆ ౧౦౬, రాజ. చ. ౨, ఆ. ౬౯.

నల్లపేటిపండు. ద్వ. వి. నల్లనిచర్మము గలతాటి పండు. "సీ. తాళీవనము మించుఁ దఱచు నున్నతమునై పెరిఁగి యందలి నల్లపేటిపండ్లు, కస్తూరి కాలిస్తఖచరాంగనాఘన స్తనకుంభసఖ్యంబుసలుపు చెపుడు." వరాహా. ౧౦, ఆ. ౧౨౮.

నల్లప్రజే. మి. వి. (నల్ల+ప్రజ.) కిరాతసంఘము. "ఉ. కొమ్ములు మ్రోయ మంటికమకుల్ వెసఁ బోరుకలంగఁ బార్శ్వభాగమ్ముల నల్ల నల్ల ప్రజ గ్రమ్ముకొనన్ వెస జాగిలంపుమొ, త్తమ్ములు ముంగల న్నడువ దర్పమెలర్పఁగఁ జెంచుపాళెగాఁ, డమ్మనుజేంద్రుకొల్వునకు నచ్చెఱువందఁగ వచ్చెఁ జెచ్చెఱన్." శుక. ౧, ఆ. ౨౪౪. ఆము. ౬, ఆ. ౭౬.

నల్లబలుసు. ద్వ. వి. (నల్ల+బలుసు) వృక్షవిశేషము. "సీ. బండచింత్రయు నల్లబలుసు సురభి చీకి రేసు తూఁకుడు నెమ్మి ప్రేంకణమ్ము." హంస. ౪, ఆ.౧౧.

నల్లబల్లెడ. ద్వ. వి. (నల్ల+బల్లెడ.) వృక్షవిశేషము. "రగడ. నల్లబల్లెడలతో నడగారడవిభంగి..." పి. శకం. ౩, ఆ. ౨౨౫.

నల్లమందు. ద్వ. వి. (నల్ల+మందు.) అభిని. "గీ. నల్లమందును గంజాయిఁ గల్లుఁబోతుఁ, బిచ్చుకల మెక్కి..." చంద్ర. వి. ౨, ఆ. ౬౭.

నల్లమడుఁగు. ద్వ. వి. (నల్ల+మడుఁగు.) మిక్కిలి లోఁతు గలమడుఁగు. (శ. ర.)

నల్లమునురు. ద్వ. వి. (నల్ల+మునురు.) మేఘములచే చీఁకటి కలుగునాఁటిమునురు. "ద్వి. మొగులు గార్గ్రమ్ముచు ముంచె నల్గడల ముంచి నల్గడ నల్గ మునురుగాఁ బట్టి." ద్వి. పరమ. ౪, ఆ. ౨౯౦. పు.

నల్లమేఁకతప్పు. వై. వి. జారత్వము. "సీ. బలభేది గౌతముభార్య నహల్యఁ మించి చేయఁడె నల్ల మేఁకతప్పు." ప్రబోధ. ౧, ఆ. ౫౦. నల్లమేఁక= చింబోతు. దీనికి కామ మెక్కువ.)

నల్లలుదయు. ద్వ. అ. క్రి. (నల్లలు+తీయు.) (బొగ్గులు. మొ.) దిగదుడుచు "ఉ...గ్రహంబు వెన్కఁ గనుపట్టఁగ నల్లలుదీసి యంకటన్." కువల. ౪, ఆ. ౨౧౭.

నల్లవడు. వై. అ. క్రి. (నల్ల+పడు.) నల్లనగు. "క.. చను మొనలు నల్లవడియెన్..." స్వా. ౩, ఆ. ౧౧౯.

నల్లవలువదాల్పు. ద్వ. వి. బలరాముఁడు. "సీ. నల్లవలువదాల్పుఁ దెల్లనిబలుదీవిఁ గన్నులుచెవులుగాఁ గలుగుతేని." రామ. ౨౧౩.

నల్లవేల్పు. ద్వ. వి. (నల్ల+వేల్పు) కృష్ణుఁడు, విష్ణువు. "చ. ఖోలుపుగ నల్లవేల్పునుఁబొక్కిటి తామర పువ్వుముద్దుఁగో, డలిచెలువంబుఁ జూచి ఫాగడక్

ముఖపంకజ మొక్క బెట్టు నాకలవడు నంచు ..." చిత్ర. భా. ౧, ఆ. ౪.

నల్లవో. దే. అవ్య. ఓహో. "ఉ. నల్లవో నిక్కమాడె నృపనందనుముందట ద్రోణుం డొక్కడున్." భార. విరా. ౩, ఆ. ౯౯. (అట్లే: నల్లవో. భార. విరా. ౫. ఆ. ౧౩౬.)

నల్లసేనము. ద్వ. వి. (నల్ల+సేనము.) ఒకజాతిజొన్న. "గీ. నల్లసేనపుగుండులు నడచినట్లు, మంపుగొని మే యెఱుంగక మలసి మలసి,...మన్నుఁ, బోతు లెడచొచ్చె...." ఉ. హరి. ౪, ఆ. ౭౬, ద్వి. పరమ. ౭, ఆ. ౫౧౪. పు.

నల్లి. దే. వి. (నల్ల+ఇ.) మత్కుణము. "గీ. చెలఁగి యీర్పేను మశకంబు చీమ నల్లి, యల్ప మను బుద్ధి హింససేయంగఁ దగదు, వానిహృదయం బులం దున్నవాఁడు, జీవుఁ, డాతఁ డల్పుండె యితరజీవాత్మకంటె." కాశీ. ౬, ఆ. ౭౯, ఆం. భా. ద్వి. ౦౦.

నల్లింద. దే. వి. వృక్షవిశేషము. "వ...మఱియును బెదపిచ్చి పినపిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కప్పర మద్ది .. మొదలగు పెక్కు తెఱంగులమ్రాఁకులు. ..." పి. శకుం. ౨, ఆ. ౧౪.

నల్లిక. దే. వి నలికండ్లపాము, రక్తపుచ్ఛిక. "సీ... నల్లి కంచన నలికిరి యన మిండ యంచనఁ గను మీఱు రక్తపుచ్ఛి .." ఆం. భా. ద్వి. ౦౭.

నల్లిల్లు. దే. వి.—హోమధూమముచే పవిత్రమైన గృహములు గలది-అగ్రహారము. "ఆ. నంద నుండు వనమ్ము నల్లిల్లు నిధి సురగృహము చెఱువు మేలుకృతి యనంగ జగతి వెలయు సప్తసంతాన ములు..." కేయూర. ౧, ఆ. ౦, భార. సభా. ౨, ఆ. ౧౨౧. పి. శకుం. ౧, ఆ. ౧౬.

నల్లె. దే. వి. చతురంగుళపరిమాణము. "క. నేలకు నల్లెడఁబొడవునఁ, గ్రాలుచు మును మెఱయు గురునిరథచక్రము లక్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంటసిలఁబడియె నృపా." భార. ద్రో. ౫, ఆ. ౩౧౭. శ్లో. తస్యపూర్వం రథః పృథ్వ్యాశ్చతురంగుళముచ్ఛ్రితః, బభూవైవంచ తేనోక్తే తస్యవాహాః స్పృశన్మహీమ్. సం. భార. ద్రో. ౯౧, స. ౫౫. కకు. ౫, ఆ. ౦౧.

నల్లెరు = నల్లేరు. (శ. ర.)

నల్లేరు. దే. వి. ఒకదినుసుతీఁగ, వజ్రవల్లి. "సీ. వజ్రవల్ల్యాఖ్యయై వఱలు నల్లే రన..." ఆం. భా. ద్వి. ౭౦, హంస. ౪, ఆ. ౧౦. సా. నల్లేరుపై బండిసాగినట్లు (నిరాతంకముగా.)

నల్వ = నలువ. "ఉ. వేలుపుఱేఁడు నల్వయును వెన్నుఁడుఁ గొల్వఁగ మంచుఁగొండరా, చూలిని గూడి వేడుకలఁ జొక్కెడు లేసెలతాల్పుఁ గొల్చెదన్." నీలా. ౧, ఆ. ౧, ప్రబోధ. ౧, ఆ. ౫.

నల్వగ్రుడ్డు. ద్వ. వి. (నల్వ+గ్రుడ్డు.) బ్రహ్మాండము. "చ. పగ లిరు లెల్లెడన్ గలియఁబర్వవె సంద్రము లింకఁబాఱవే, రగులదె నల్వగ్రుడ్డుగమి రాముని కించుకకీడు గల్గినన్." అచ్చ. అర. ౪౦.

నల్వజక్కి. ద్వ. వి. (నల్వ+జక్కి.) హంస. "సీ... నల్వజక్కులు తెలిపులు, గులు ..హంసముల పేరులు..." వేంక. తిర్య. ౯౯.

నల్వము. సం. వి. అ. పుం. నాలుగువందలమూరల పరిమాణము.

నవ. ఉభ. దే. వి. దురద, కండూతి. "గీ. దూల జిల నవ గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి. ..." ఆం. భా. ద్వి. ౧౧౯. సం. వి. ఆ. స్త్రీ. ప్రత్తిచెట్టు. విశే. బ. (న్) తొమ్మిది. (తెలుఁగున సమాసపూర్వపదముగానే యుండును.) ఉదా:- నవరత్నములు. మొ.)

నవఁత. దే. వి. (నవయుధా.) 1. శ్రమ, కష్టము. "ద్వి. పట్టంబు నామీఁదిభక్తిపై మాని, నార చీరలు జడల్ నవఁతమైఁ దాల్చి, నారాక గోరు చున్నమహామహుండు." రం. రా. అర. ౧౫౩. పు. ౨౩. పం. రం. రా. ఉ. ౧౩౩, పు. ౨౪, పం.; 2. క్షయరోగము. "సీ...క్షయము నవఁత నాఁగ విలసిల్లు..." ఆం. భా. ద్వి. ౧౨౭౩. నాశము. "ద్వి. తెవులును నవఁతయుం దీవ్రవేదనయు, నవఁత్రయుం లేనిప్రాణంబులు గాన .." రం. రా. కిష్కిం. ౨౩౧. పు.

నవకము. ఉభ. దే వి. మృదుత్వము. "గీ. నవశిరీష సుమంబుల నవకమునకు, నన్నదమ్ములఁ వోని నీయడుగు దమ్ములు..."నైష. ౪, ఆ. ౭, హరి. ఉ. ౪, ఆ. ౭౫౦; 2. అందము, ఒప్పు. "సీ. నన లంకురమునొంది నవకంబులోఁ గూడఁ బలసి లేఁదావులకలిక లయ్యె" పి. శకుం. ౨, ఆ. ౧౭౬. విశే. 1. మృదులము, కోమలము.

"క. ముల్లు తలకొననినవకపుఁ, బల్లవములతోడ ..."ఆము. ౪, ఆ. ౧౯౫. స్వా. 3, ఆ. ౭౯; 2. సుందరము. "సీ. ధవళతరచ్ఛాయ నవకంబు లైనపచ్చసరాలు విపులవక్షమున వైచి." వరాహ. ౬, ఆ. ౪౦. నిర్వ. ౮, ఆ. 3౨. సం. వి. అ. న. తొమ్మిది.

నవకమెక్కు. దే. అ. క్రి. (నవకము+ఎక్కు.) సుందరమగు. "సీ అళికులంబులకప్పు గలయంత యును ఖుచ్చి నాఱువోసినభంగి నవకమెక్కి." భార. విరా. ౨, ఆ. ౫౨.

నవకారిక. సం. వి. అ. స్త్రీ. 1. క్రొత్తపెండ్లికూఁతురు, నవోఢ; 2. నూతన మగుకారిక; 3. నూతన మగు కృతము.

నవక్షారము. సం. వి. అ. పుం. నవాసారము. (శ. ర.)

నవగోజే. దే. వి. గొప్పగుడారము. "సీ...నవగోజ యనఁగను గొప్పగుడార మై యొప్పుచుండు." ఆం. భా. ద్వి. ౧౫౯.

నవగ్రహములు. సం. వి. అ. పుం. బ. సూర్య చంద్రాం గారక బుధ బృహస్పతి శుక్ర శని రాహు కేతువు లనుతొమ్మిది గ్రహములు.

నవత్. సం. (శత్ర) నూతనమగుచున్న. "చ...అన్న పదరవిందచక్రమిథునంబు లసహ్యావళాంగజా గ్నిచే,రవులుకొనంగ..."శివరా. 3, ఆ. ౧౨౨.

నవతము. సం. వి. అ. పుం. 1. కంబళము; 2. ఏనుఁగు పైని బఱచుకంబళి. విశే. (అ. ఈ. అ.) తొంబది యవది.

నవతి. సం. వి. ఇ. స్త్రీ. తొంబది. విశే. (ఇ) స్త్రీ. తొంబదియవది. [౧. ఆ. ౪౦

నవద్వయము. సం. వి. అ. న. పదునెనిమిది. నైష.

నవద్వారము. సం. వి. అ. న. దేహము. విశే. (అ. ఆ అ.) తొమ్మిదిద్వారములు కలది.

నవధాతువులు. సం వి. ఉ. పుం. బ. తొమ్మిదివిధము లగుధాతువులు. (బంగారు, వెండి, ఇత్తడి, సీసము, రాగి, తగరము ఇనుము, కంచు, కాంతలోహము.)

నవనము. సం. వి. అ. న. స్తోత్రముచేయుట.

నవనవమను. దే. అ. క్రి. (నవనవ+అను.) కోమల మగు. "క. నవనవమను కెమ్మేనులు..."చమ. 3, ఆ. ౧౦౮.

నవనవలాడు. దే. అ. క్రి. (నవనవలు+ఆడు.) కోమలమగు, మృదువగు. "ద్వి. నాఁటికి నాఁటికి నవనవలాడు, తనువున కొకకొంతతళు కుప్పతిల్ల, వనిత కంతంత జవ్వన మంకురించె." పృ. వి. ౧, ఆ. ౮.

నవని. సం. ఈ. స్త్రీ. వెన్న, నవనీతము.

నవనీతకము. సం. వి. అ. న. 1. నెయ్యి; 2. వెన్న.

నవనీతము. సం. వి అ. న. వెన్న. విశే. (అ. ఆ. అ.) 1. క్రొత్తగాఁ దీయఁబడినది; 2. క్రొత్తగాఁ బొందింపఁబడినది.

నవనీయము. సం. విశే. (అ. ఆ. అ) నుతింపఁదగినది

నవప్రసూత. సం. వి. అ. స్త్రీ. క్రొత్తగా ప్రస వించినస్త్రీ, పురుటాలు.

నవప్రసూతి. సం. వి. ఇ. స్త్రీ = నవప్రసూత.

నవఫలిక. సం. వి. అ. స్త్రీ. 1. క్రొత్తగా రజస్వల యైనపడుచు; 2. క్రొత్తగా పెండ్లి యైనబాలిక, నవోఢ.

నవమము. సం. విశే (అ. ఈ. అ.) తొమ్మిదవది.

నవమల్లిక. సం. వి. అ. స్త్రీ. విరజాజిచె.

నవమాలిక. సం. = నవమల్లిక.

నవమి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు తొమ్మిదవతిథి.

నవము. సం. వి. అ. పుం. 1. స్తోత్రము; 2. ఎఱ్ఱగలి జేరుచె, విశే. (అ. ఆ. అ.) 1. క్రొత్తది; 2. లేఁతది.

నవయించు. దే. స. క్రి. (నవయు ధా. ప్రే.) బాధ పెట్టు. "చ. ఎలఁబొఱవోని మేని నవయించియు ...తుదిఁ దపంబున నయ్యెడిదేమి సెప్పుమా."కు. సం. ౭, ఆ. ౪౧.

నవయు. దే. అ. క్రి. 1. (రోగాదులచే) కృశించు, చిక్కు, "క. నాగాయుతసత్త్వుఁడు, దిఙ్నాగాయతహస్తుఁ డనిలనందనుఁడు మహోద్వేగాత్ముఁ డగుచు డస్సిన, నాగముక్రియ నుండకున్నె నవసి వనమునన్." భార. ఆర. ౫, ఆ. 33౦. "సీ. వెడలు నిట్టూర్పుల వేఁడిమి నవసిన యధర పల్లవము కారాకుఁ బోల." భార. ఆర. ౭, ఆ. ౨౮. వరాహ. ౭. ఆ. ౫౨, 2. క్షీణించు, తగ్గు. "క. మండలము నవయ నరి కోది, గుండినసింహా సనంబు లుర్విన్ వినమే." ఆము. ౪, ఆ. ౨౧౬; 3. కష్టపడు, శ్రమపడు. "సీ. వసుమతీ రాజ్యంబు వలననిరస్తులై మునివృత్తి నత్యుగ్రవసములోన, నవ యుచుఁ బాండుభూనాథనందను లున్నవా రని విని .."భార. ఆర. ౧, ఆ. ౧౨౨; ౪, ఆ. ౧౯౯.

నవరత్నములు. సం. వి. అ. న. బ. 1. మౌక్తికము, మాణిక్యము, వైడూర్యము, గోమేధకము, వజ్రము, విద్రుమము, పుష్యరాగము, మరకతము, నీలము అను తొమ్మిదివిధముల రత్నములు; 2. ధన్వంతరి, క్షపణకుఁడు, అమరసింహుఁడు, శంకువు, బేతాళభట్టు, ఘటకర్పరుఁడు, కాళిదాసుఁడు, వరాహమిహిరుఁడు, వరరుచి అను విక్రమాదిత్యుని యాస్థానపండితులు.

నవరసములు. సం. వి. అ. పుం. బ. శృంగార వీర కరుణాద్భుత హాస్య భయానక బీభత్స రౌద్ర శాంతములు అను తొమ్మిదిరసములు.

నవరసు. దే. వి. ఒకవిధ మగుబంగారునాణెము, కాసు. విణ. శ్రేష్ఠము; శ్రేష్ఠురాలు. "క. కేళిక కెవ్వతె నవరసొ్యాయాలేమం బిలువు మనిన యధికార్యర్థో, త్తాలధిలోన సరసోస్మిలరుఘళంఝళిత కింకిణీ నిక్వణమై." బహు. ౫, ఆ. ౬౨.

నవరాత్రములు. సం. వి. అ. న. బ. తొమ్మిదిరాత్రులు (1. వసంతనవరాత్రములు. చైత్రశుద్ధప్రతిపత్తు మొదలు తొమ్మిదిరాత్రులు; 2. గణపతినవరాత్రములు. భాద్రపదశుద్ధచతుర్థి మొదలు తొమ్మిది రాత్రులు; 3. దేవీనవరాత్రములు ఆశ్వయుజశుద్ధప్రతిపత్తు మొదలు తొమ్మిదిరాత్రులు.)

నవరు. దే. వి. రాజగృహము. బ నవళులు, నవళ్లు. "క. వివిధోత్పాతంబులకున్‌, నవళులలోఁ దోఁచు కీడునకుఁ దోడ్తో శాంతివిధానంబున నిరసన, మవును బురోహితునిచేత ననవద్యముగన్." భార. శాం. ౨, ఆ. ౩౦౮.

నవల. దే. వి. 1. ఆఁడుది. "క. అన్నవలముద్దు మోమును..." విక్ర. ౫, ఆ. ౭౩. (శ. ర. పా. 'అన్నాతి' ముద్రి. పా.); 2. (Novel) గద్య కథాకావ్యవిశేషము. (వా.)

నవలా. దే. వి. స్త్రీ. "క. వెండియు బహువిధనిహరణ, పాండిత్యము నెఱపి నెఱపి బడలిక నవలా, పిండు తలిరాకుఁ బానుపుఁ, దండంబున నిదురసలుపు తదవసరమునన్." రామా. ౨, ఆ. ౧౦౧ శకాం. ౧, ఆ. ౨౩.

నవశ్రాద్ధము. సం. వి. అ. న. మరణదినము మొదలు కొని బేసిదినములందు చేయఁదగినశ్రాద్ధభేదము.

నవాతు. దే. వి. శర్కరాభేదము. "సీ. శర్కరాభేద సంజ్ఞలు నవాతు ఖామాఖా పులకండ మనఁగను బొలుపు కాంచు." ఆం. భా. ద్వి. ౨౫౧. విజ. ౩, ఆ. ౫౬.

నవాబు = నబాబు. (చూ. నవాబుతనము.)

నవాబుతనము. ద్వ. వి. (నవాబు+తనము.) రాచఱికము; మహమ్మదీయ రాజత్వము. "వ...పుదుచ్చేరి నున్నరజాసాహెబునకు నవాబుతనం బిప్పించి..." ఆనంద. పీఠి. ౧౦౭.

నవారు. హిం. వి. పట్టెడ, పట్టెమంచమునకు నేయు పట్టెడ. "సీ. తగటిరుమ్మీ తాపుతా నవారు కసీదు నిస్తుబందరుచీటిల స్తరీలు." షాంస. ౫, ఆ. ౩౫౦. ఆం. భా. ద్వి. ౧౬౪.

నవాసారము. వై. వి. (సం. నవక్షారః.) ఒకదినుసు ఉప్పు. (శ. ర.)

నవి. దే. వి. కరగోడ పెట్టుటకు నిడుపున త్రవ్వి యెత్తినమట్టిపల్లము. (శ. ర.)

నవిత. సం. విణ. (బు. త్రీ. బు.) నుతించువాఁడు.

నవితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁదగినది.

నవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి క్రొత్తది నవతమము.

నవీనము. సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్తది, అధునికము.

నవీయము. సం. విణ. (స్. యసీ. స్.) నవతరము, రెండింటిలో క్రొత్తది.

నవుకరి. హిం. వి. కొలువు, సేవ.

నవుకరు. హిం. వి. సేవకుఁడు, కొలువుకాఁడు.

నవుకు. దే. విణ. నిమ్నము, పల్లము. "సీ...పల్లము నవుకుఁ బల్లనఁగ నిమ్నంబు దనరు." ఆం. భా. ప్ర. ౧౫౮.

నవుడుకొట్టు. దే. అ. క్రి. మిణకరించు. "ద్వి. అని యిట్లు దేవేంద్రుఁ డాడినమాట, వినియును విననట్లు విస్మయం బంది, చ్యవనుఁ డూరకయుండె శార్ఙ్గరవుండు, నవుడుకొట్టెను నీల్గి నమలెఁ గళ్యపుఁడు." ద్వి. హరిశ్చ. పూ. ౨౧౬. పం.

నవుబత్తు. దే. వి. చర్మవాద్యవిశేషము. "సీ...రాజా బహాదరు, మొదలైన బిరుదులు ముఖ్యా మాహెల్ల జెండా నవుబత్తును ఢక్కా యాది, గలిగినరాజ చిహ్నా లొసంగఁబడె..." రంగా. ౧, ఆ. ౧౧౬.

నవురు. దే. విణ. మృదువు, మెత్తనిది. (శ. ర.)

నవోఢ. సం. వి. ఆ. స్త్రీ. క్రొత్తగా పెండ్లియైన బాలిక.

నవోద్ధృతము. సం. వి. అ. న. వెన్న. విణ. (అ. ఆ. అ.) క్రొత్తగా ఎత్తఁబడినది.

నవ్యము. సం. వి. అ. న. స్తుతి. ఎఱ్ఱగలిజేరుఁగీ. విణ (అ. ఆ. అ.) 1. నుతింపఁదగినది. 2. క్రొత్తది, ఆధునికము.

నవ్వారు. దే. అ. క్రి. (నవ్వు+ఆరు) నవ్వుతో ఒప్పు. "ఉ. జారెడుపైఁటతోఁ గులుకు జక్కువ గుబ్బలతో మిటారిన,వ్వారెడు మోముతో..." దశా. ౨, అ. ౩౧౦.

నవ్వించు. దే. స. క్రి. (నవ్వుధా. ప్రే.) నవ్వునట్లు చేయు. "గీ. విభుఁడు పరిహాసమాడి నవ్వించుఁ గాని..." నైష. ౭, అ. ౧౭౩. స్వా. ౫. అ. ౯౮.

నవ్వు. దే. అ. క్రి. 1. హసించు, హాసముచేయు "చ...నిమురు మావి నవ్వ సురపొన్న ముఖాంబుజ మెత్తఁ జంపకం,బు . పూచు..." పారి.౪, అ. ౧౦. రామా. ౨, అ. ౧౦౦; 2. సంతోషించు, ఆనందించు. "క. అని కుంభజుఁ డెఱిఁగించిన, విని నవ్వుచు రాముఁ డవల వింశతిభుజుఁడున్, ధనవిభుఁడును బోరినవిధ, మనఘా వినవలతుఁ దెల్పు మని యడుగుటయున్." ఉ. రా. ౨, అ. ౩౩౨; 3. అపహసించు, మేలమాడు. "గీ. బహువిధంబులఁ బగతురఁ బరవసమున, నిత్తెఱంగునఁ గలుగు క్రం దెల్ల నోర్చి నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁగాక, దవ్వుదవ్వుల నిట్టిన నవ్వ రెట్లు." భార. విరా. ౪, అ. ౬౨. భార. అశ్వ. ౧, అ. ౧౭౦. స. క్రి. 1. పోలు. "గీ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక..."విజ. ౧, అ.౧౪. స్వా. ౬. అ. ౧౪; 2. పరిహసించు, మేలమాడు. "చ. వనిత యొకర్తు...హారిఁ జూచెఁ గేకిసలుకొట్టుచు బోటులు దాని నవ్వఁగన్." పారి. ౩, అ ౧౨. దశా. ౨, అ. ౪౧౮. వి. 1. హాసము, నగవు. "ఉ...కాకవి పల్కెడుశాస్త్రవాగ్విసం,వాది దురుక్తుల న్వినఁగఁ బండితమాళికి మోముఁ దామరం,బోదిగ నవ్వుఁ దేనియలు పుట్టును రూఢ మంగితం గొనన్." కాళిందీ. ౧, అ. ౩౮. ఆము. ౨, అ. ౨౦; 2. పరిహాసము, మేలము. "క. అన్నృతము పాతక మగు నైనను వనితలమొదను బెండ్లి నవ్వున వృత్తి వచ్చిన సర్వధనముఁ జెడుచో, విను మది పాపంబుగాదు విమలచరిత్రా." భార. శాం. ౩, అ. ౪౩౮; 3. వింత, ఆశ్చర్యము. "క. ఒకటి గలదు వత్తురు వేఁటలోకగర్భంబునకు మృతులు నుక్కిన వాొన, క్కటకు నేటిబుద్ధి పీఁగుఁగు,నకు బ్రదుకఁటె గలుగు నిట్టినవ్వులు గలవే." భార. శాం. ౩, అ. ౩౭౬.

నవ్వుఁబాటు. ద్వ. వి. (నవ్వు+పాటు) 1. అపహాస్యత, నింద. "గీ. నాకతంబున వచ్చిన నవ్వుఁబాటు, మాటువడఁ జేసి నీకూర్మిమగనిఁ దెత్తు." ఉ. హరి. ౫, అ. ౧౪౧. ఉ. హరి ౧, అ. ౧౦౭; 2. మేలము, పరిహసింపఁబడుట. "గీ. నాఁడు గోమంతనగమున నన్ను నాజిఁ,గదిసి చూచినవాఁడవు గావె నీవు, నాఁటివాఁ డన నేనును నవ్వుఁబాటు,గాదె యిట్లంట యీ వితర్కంబు వలదు." హరి. ఉ. ౨, అ. ౨౧.

నవ్వుకొను. దే. అ. క్రి. (నవ్వు+కొను.) నవ్వు. "చ...మాటమాట జగడంబులు చూపి యతండు పోయినన్, గలకల నవ్వుకొంద్రు తఘకాళల మాతఁ డెఱుంగలేమికిన్."శుక. ౨, అ. ౩౩౭.

నవ్వుటాల. దే. వి. (నవ్వులాటపదమునకు వర్ణవ్యత్యయముచేఁ గలిగినరూపము.) 1. పరిహాసము, మేలము. "ఉ. నావుడు నవ్వుటాల కనినం బవనాత్మజ యింత యేటికిన్.....,సీ,చేవయు లావు నీవు మును చేసినభంగులు నే నెఱుంగనే." భార. ఉద్యో. ౩, అ. ౬౧. నైష. ౨, అ. ౧౬౯; 2. లీల, అవలోక. "మ...రామస్వామి తానవ్వుటా, లటు లొక్కమ్మునఁ దక్కరద్వయము వ్రయ్యంజేసె......"అధ్యా. అర. ౬౮. పు.

నవ్వుపఱుచు. ద్వ. న. క్రి. నవ్వుఁబాటునొందఁజేయు. "ఉ...అయుక్తద,ర్పమ్మున నిష్టు నవ్వుపఱుపన్ సమకట్టె నితండు విప్రవం,శమ్మువారి సెల్ల..." భార. ఆది. ౭. అ. ౧౭౯.

నవ్వులఁబెట్టు. దే. స. క్రి. (నవ్వులన్+పెట్టు) పరిహసించు. "ఉ. ఇవ్విధ మెల్ల సెప్పులల కేర్పడఁ జెప్పిన దిట్టతాళవై, నవ్వులఁబెట్టి యందఱు వినం గడుసాముసఁ ద్రుళ్లకొంచు..." రసిక. ౪, అ. ౧౧.

నవ్వులబండి. దే. విణ. నవ్వెడుస్వభావము గలది. (శ. ర.)

నవ్వులాట. దే. వి. (నవ్వులు+ఆట.) పరిహాసము, గేలి. "ఉ. మోదముతో సుభద్ర చెలిముద్దుల గండతలంబునందు సా, మోదనిశాకకర్దమము ఖ్యాందుగ నించెను నవ్వులాటకై, నీదుకపోలభాగమున నిండి తొలంకెడు లేటమిన్న యో, కా దిపుడే నొసంగు నిశకాంతులు మేలె యటన్న కైవడిన్." కాళిందీ. ౫, ఆ. ౧౩౫, విప్ర. ౪, ఆ. ౭౧.

నవ్వులుపడు. ద్వ. అ. క్రి. (నవ్వులు+పడు) పరిహాసమునొందు, నవ్వులపాలగు. "సీ. దీని దగ్గఱనేల దీని కోడఁగ నేల పరులచే నవ్వులుపడఁగ నేల." మొ. రా. బాల. ౭౫.

నశకము. సం. విణ. (అ. ఆ. అ.) నశించునది.

నశించు. సం. అ. క్రి. నాశమొందు. "దండకము. ...లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీమహాదేహముం దుల్లసించు న్వసించు న్నశించున్..." భాగ. ౧౦, స్కం. పూ. ౧౨౩౩. మార్క. ౧, ఆ. ౧౯.

నశిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నశించువాఁడు.

నశియించు = నశించు. "వ...అనావృష్టిదోషంబున జగంబు నశియించు..." మార్క. ౨, ఆ. ౧౯౬.

నశ్యత్. సం. (శత్ర) నశించుచున్న.

నశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నశింపఁదగినది.

నశ్వరము. సం. విణ. (అ. ఈ. అ.) నశించుస్వభావము కలది, శాశ్వతము కానిది.

నష్ట. సం. వి. ఆ. స్త్రీ. సంస్పృష్టమైథున యగుస్త్రీ.

నష్టము. సం. వి. అ. న. 1. నాశము; 2. మఱుఁగుపడుట, అదర్శనము; 3. చెడుట. విణ. (అ.ఆ.అ.) 1. నశించినది; 2. మఱుఁగుపడినది; 3. చెడినది.

నష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. నాశము; 2. అదర్శనము; 3. చెడుట; 4. నష్టము, లోటు. "ఉ. అయుతి కాని కీడు మమరాలయముఖ్యము లాతఁ డర్థత్వ, ప్తాయతుఁడై నిజోర్వి నగునష్టికిఁ దద్ధనముం బొరల్చి రా, జాయతనంబుఁ జేర్చు..." ఆము. ౪, ఆ. ౨౧౮, నైష. ౭, ఆ. ౧౦౨.

నస. ఉభ. దే. వి. 1. దురద, కండూతి. "సీ... తీంట్రమ్ము కసి తీఁట తీపరమ్ము. గీ. దూల జిల నస నస గాఁడు దురద యనఁగఁ, బరఁగుఁ గండూతి ..." ఆం. భా. ద్వి. ౧౨౮; 2. కాముము "గీ. కూకలాశ్వంబు నస లేఁచఁ జొచ్చినవ్వు, డనుమతింపఁడె యత్తఱి వైనబడబ." శివరా. ౩, ఆ. ౯౯; 3. ఉపద్రవము. ఉదా:—ప్రొద్దున లేచిన నీనస నాకుఁ బెద్దదిగా నున్నది. (శ. ర.) సం. వి. ఆ. స్త్రీ. ముక్కు, నాసిక.

నసకించు. దే. స. క్రి. మోహింపఁజేయు. "ద్వి. ముసిముసినగవులు మురిపెంపునడలు, నసకించు నేర్పులు నాగరకములు, కల్లమోహంబులు కపటకృత్యములు." ప్రభులిం. ౪, ఆ. ౧౪౩. పు.

నసగూఁటి. దే. విణ. (నసగూఁడు+ఇ.) కామోద్రేకముకలది; కామోద్రేకము కలవాఁడు. "సీ. పిసవెట్టి కసరెత్తి యెసరేఁగునసగూఁటిపూఁబోండ్లు తమయిండ్లపొంత కరుగ." హంస. ౧, ఆ. ౧౩౭.

నసగూఁటితనము. ద్వ. వి. (నసగూఁటి+తనము.) కామోద్రేకము. "ఉ...నా, కూరిమిపట్టి నిట్టి నసగూఁటితనంబున బేలుపెట్టి తో, రార గణింప నన్ను వినవా మఱి యిప్పురిలోనితక్కరిన్." విప్ర. ౪, ఆ. ౨౪.

నసగూఁడు. దే. వి. డొ. కామోద్రేకము. "ఉ... నసగూఁటన్ జపలస్వభావలై, నారులు రూప యౌవనమునన్ నిలుపోపక యివ్వలవ్వలన్, జారహితంబు సేయ..." నా. పంచ. ౩, ఆ. ౨౩౬.

నసగొంటు. దే. వి. (నస+గొంటు.) కామోద్రిక్తుఁడు; విటుఁడు. "గీ. కుచ్చితం బింత యెఱుఁగ దమ్మచ్చెకంటి, కంటి విఖ్యాతినాటిఁ గైకొంటి వంచు, నచటిజాఁటలు నసగొంటు లతనివేఁడి, వేఁడిమీఁదనె దోఁచిరి వెట్టి రేఁచి." బహు. ౫, ఆ. ౧౧౮.

నసగొట్టు. దే. వి. (నస+గొట్టు.) కామోద్రేకము గలవాఁడు, విటుఁడు. "క. నసగొట్టుబాపనయ్యా, పిసవెట్టికిఁ దగులువడి తపింపఁగ నేలా, బసపెద్ద గదలకుండెదు, పసలికి రమ్మచటి కేను వచ్చెదఁ బొమ్మా." శుక. ౨, ఆ. ౪౭౯.

నసనస. దే. వి. తడిసినచర్మము మొ. వానిధ్వని కనుకరణము. "క. విసమును మెసవుచు విసువక, నస నస యనుకళవసంబునం దాలుచున, మ్మసనంపు రుద్రుతోడుత, నసియింపఁగ నీమె సత్తిప్రాణా బోటీ." పార్వ. ౪, ఆ. ౯౬.

నసిమిరి. దే. వి. 1. దురద, కండూతి. (శ. ర.); 2. జలజంతువిశేషము. "సీ. గులకరింతయుం నీదుగుట్టు

శంఖనఖంబు పులుకాసి నసిమిరి ఖంగపురుపు." హంస. ४, ఆ. ౧౦౬.

నసుకు. దే. వి. అసత్యము. "ఆ. జల్లి బుహద బొంకు పొల్లు దబ్బఱ కల్ల... తసుకు నసుకు... నా నసత్య మభవ." ఆం. భా. ప్ర. ౧౧౯, విణ. అసత్య మైనది, సత్యము కానిది. (శ. ర.)

నసుగు. దే. వి. అ. క్రి. స. క్రి. అస్పష్టముగాఁ జెప్పు. (వా.) వి. అస్పష్టముగాఁ జెప్పుమాట (వా.) [(వా.)

నసుగు. దే. వి. (నసుగు ధా) అస్పష్టముగాఁ జెప్పుట

నస్త. సం. వి. ఆ. స్త్రీ. 1. వృషభాదులకు కుట్టిన ముక్కురంధ్రము; 2. ఆభరణాదు లుంచుటకు కుట్టిననాసికారంధ్రము.

నస్తము. సం. వి. అ. న. ముక్కుపొడి, నస్యము. పుం. ముక్కు, నాసము.

నస్తితము. సం. వి. అ. పుం. ముకుఁద్రాళ్లు పోయుంటకై ముక్కు కుట్టినయెద్దు.

నస్తోతము. సం. వి. అ. పుం. ముకుఁద్రాళ్లుపోసినయెద్దు.

నస్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. ముక్కు; 2. పశ్వాదుల ముకుఁద్రాడు.

నస్యము. సం. వి. అ. న. 1. ముక్కునందలివెండ్రుక; 2. ముక్కుపొడి. విణ. (అ. ఆ. అ.) 1. నాసికకు హితమైనది; 2. నాసికయందుఁ బుట్టినది; 3. నాసికయం దున్నది.

నస్యోతము. సం.=నస్తోతము.

నహి. సం. అవ్య. (అభావమును దెలుపును.) లేదు; (లేదు, లేవు, లేరు) "చ. నిలుకడ సున్న వావి నహి నేస్తము నాస్తి..." శశాం. ४, ఆ. ౧౭, సా. ౨, ఆ. ౦.

నహుషుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. చంద్రవంశపురాజులలో నొకఁడు, యయాతి తండ్రి. (ఇతఁడు స్వర్గరాజ్యమును పాలించి అగస్త్యమహామునిశాపమున సర్పజన్మ మెత్తి యుధిష్ఠిరునివలన శాపవిముక్తి నొందినవాఁడు)

## నా

నా. దే. స. అస్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేక వచనముల 'నేను, నేన్, నన్ను, నను, నన్, నాచేత,' మొదలగురూపములును, బహువచనముల 'మేము, నేము, వీము, మమ్ము, మము, మాచేత,' మొ. రూపములును అగును.) "వ. నావిష్ణువింపం బూనునాముక్తమాల్యదాఖ్యాశీ ప్రబంధమునకు: గథాక్రమం బెట్టి దనిన." ఆము. ౧, ఆ. ౫౦. "ఉ. నేము భవన్ని యోగ సరణిం జరించుచు..." శ్రీరం. 3, ఆ. ౯౧. దే. అవ్య. ద్ర. "అను" ధాతువునకు తుముఁన్నా ద్యర్థకరూపము. "సీ. దక్షిణ గంగ నాఁ దద్దయు నొప్పినగోదావరియు..." భార. ఆది. ౦, ఆ. ౧౩౯. నైష. 3, ఆ. ౧౦.

నాంచారు. దే. వి. (త. నాచ్చియార్.) 1. దేవత, అమ్మవారు. "గీ. తోడు శ్రీరంగనాంచారు తోడఁ గూర్చి,లీల నోరయూరునాంచారు నేలె సరణి." శ్రీరం. మా. ౧౦, ఆ. ౧౧౬. ప్రబంధ. ౨౦౫; 2. స్త్రీ, ఆఁడుది. "గీ. పాలు వోయించుకొని యాకృపాళుమూర్తి, శూలినాంచారు పాలిండ్లమూచుకములు, పాలచేఁపున గిలిగింత వాఱుటయును, మెత్తమెత్తన నఱచేత నొత్తుకొనుచు." హార. ౨, ఆ. ౯౫.

నాంది. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆనందము, సంతోషము; 2. పెంపు, సమృద్ధి; 3. కర్మారంభమున చేయుదేవతాస్తోత్రము; నాటకముముందు మంగళార్థము పఠింపఁబడుపద్యాది; 4. దేవతలు బ్రాహ్మణులు లోనగువారు చేయునట్టి యాశీర్వాదము; 5. భేరి. (శ. ర.)

నాందీకరుఁడు. స. వి. అ. పుం. 1. నాందీశ్లోకాదులను పఠించువాఁడు, సూత్రధారుఁడు; 2. భేరి మొదలగుమంగళవాద్యములను వాయించువాఁడు.

నాందీముఖము. సం. వి. అ. న. వివాహాదులకు పూర్వము పిత్రాదులను గూర్చి చేయఁబడువృద్ధి శ్రాద్ధము.

నాందీవాది. సం. వి. న్. పుం. = నాందీకరుఁడు.

నాందీశ్రాద్ధము. సం. = నాందీముఖము.

నాఁగటిచాలుకూర. ద్వ. వి. (నాఁగటిచాలు+కూర.) తఱిగొట్టు, లాంగలికి. (శ. ర.)

నాఁగటిచాలుపేరియతివ. ద్వ. వి. సీత, జానకి. "క. కన్నియతలమానిక నన్నాఁగటిచాలుపేరి యతివను సిరికిం, బెన్నుద్ది సెత్తుకొని చని, యన్నీచుఁడు రథముమీఁద నపు డిడుకొనియెన్." రామా. ౫, ఆ. ౧౦౯.

నాఁగటిచిప్పు. ద్వ. వి. (నాఁగలి+చిప్పు.) నాఁగటి కఱ్ఱు, నాఁగటిగొడగ. (శ. ర.)

నాఁగటిజోదు. వై. వి. (నాఁగలి+జోదు.) హాలాయుధుఁడు, బలరాముఁడు. "ఉ. లాలసరీగజాంకుశుఁడు లావున నాఁగటిజోదు సైనఁ గెం, గేలఁజె గీటడంచి బలుగెల్పుఁ బయింౘినెలంత నేలుకోఁ, జాలినవాఁడు..." య. ౧, ఆ. ౪౯.

నాఁగటివాల్జోదు. వై. వి. బలరాముఁడు. వేంక. దేవ. ౨౦.

నాఁగలి. వై. వి. ఔ. (సం. లాంగలః.) దున్నెడు సాధనము, లాంగలము. "ఉ. అక్షఁడు నాఁగట నెత్తినయంతనుండి, యేటిదిక్కున కంతయు నెగసియుండు, హస్తినాపురి..." ఉ. హరి. ౧, ఆ. ౧౦, పరమ. ౨, ఆ. ౧౦౪.

నాఁగు. దే. వి. ధాన్యమునకు వడ్డిగా నిచ్చుధాన్యము "సీ. అచటిరెడ్డికొమాళ్ల నలహాలాయుధపాణి నాఁగున కడుగుధాన్యంబు కొంత." పాంచా. ౧, ఆ. ౩౯.

నాఁగురు. దే. వి. నాగిని, వృక్షవిశేషము. "గీ... నాగిని నావురు నాఁగు రనఁగఁ, గేరు .." ఆం. భా. ద్వి. ౬౨.

నాఁగెలు. వై. వి. ఔ. (సం. లాంగలః.) హాలము "క. ఆయనయాజ్ఞానుస్మృతిఁ, డాయుచు నాగరమణుల్ జడత దోలఁగంగా, నాయత నవసుధ నాఁగెటి, చాయను బుషభమ్ము లమర సవరించు తఱిన్. అచలా. ౨, ఆ. ౫, చంద్రా. ౪, ఆ. ౧౯.

నాఁగేలు = నాఁగెలు. "సీ...ఓపి దున్న, నాఁగేటి మొనఁ జచ్చు నానావిధప్రాణు లన్నరుఁ బొందు నే యఘము..." భార. అను. ౫, ఆ. ౫౮, ఆం. భా. ద్వి. ౨౩౨.

నాఁచారు = నాంచారు. (స్త్రీ, అఁడుది.) "క. ఆచూతము చెంగటఁ గని, నాంచారును దోడుక చెలులు నయమార్గాతి, ప్రాచుర్యప్రౌఢోక్తి, శ్రీచాతురి మనముఁ బొదలఁజేయుచు డాయన్." ప్రబంధ. ౨౭౮.

నాఁచికొను. దే. వి. (నాఁచు+కొను-స్వార్థమున) 1. అపహరించు; ఎత్తికొను; లాగుకొను. "చ. ఉలుకకయుండఁ గొండవడ నొండొకకొండనఁ గోడెనాగముల్, ఖులుఁగులరేఁడు దన్నుకొని పోవుతెఱం గిటులాడి చూపెఁ గావలయుం జనంగఁ దేరిపయి వ్రాలి దశాననునందనుం బదంబుల నిఱికించి నాఁచికొని పోయె విహాయసవీథి కుద్ధతిన్." రామా. ౬, ఆ ౨౧౯. భార. ద్రో. ౨, ఆ. ౨౫; 2. వశపఱచుకొను. "ఉ. రంగదుదారకీర్తి యగురక్కసగంగనఁ బెంజలంబుమై, భంగమొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాఁచికొన్నరాజ్యాంగము లెల్ల నిచ్చి..." నిర్వ. ౧, ఆ. ౪౧; 3. అణఁచు. "క. ము న్నేను మేన నలఁదిన, ప్రసన్నిభసితంబు నణఁచి శ్రమవారి కడుఁ, జెన్నెసఁగె మంచుమలసంగమున్నాఁచికొని ప్రవహించు సురనదిపగిదిన్." పాండు. ౫, ఆ. ౧౩౧.

నాఁచికోలు. దే. వి. (నాఁచికొను ధా.) అపహరించుట. "ఉ...ఫల్గునుఁ డందఱ మీఱి సైంధవ, ప్రాణము నాఁచికోలు నరపాల తలంపఁగ మర్త్యకృత్యమే." భార. శల్య. ౧, ఆ. ౪౯.

నాఁచు. దే. స. క్రి. అపహరించు. "ఉ. వీఁడుగదమ్మ నాహృదయవిత్తము నాఁచినవాఁడు నుగ్మలీ." అని. ౨, ఆ. ౧౩౬. దశా. ౨, అ. ౪౦౧. వి. దొంగ. "సీ ..నాఁచు నా దొంగయుఁ బ్రాఁచి యమరు." ఆం. భా. తృ. ౪౫; 2. నీటిలోఁ పుట్టెడుతీఁగ. శైవాలము. "సీ. డెంఫుజడపెంపు నాఁచుతీవలగుంపు కలికికన్గవడాలు గండుమీలు" నీలా. ౧, ఆ. ౫౬. ఆం. భా. ప్ర. ౧౬౫.

నాఁచుఁదీఁగ. ద్వ. వి. (నాఁచు+తీఁగ.) శైవాలలత. "సీ. సడలిననిడుద కెంజడలును ముదురఁ బండినఁ నాఁచుఁదీఁగలుఁ బెనగొనంగ." హరి. ఉ. ౭, ఆ. ౭౪. ఇట్టే నాఁచుదీఁగె. నైష. ౨, ఆ. ౫.

నాఁచుఁద్రాఁచు. దే. వి. (నాఁచు+త్రాఁచు.) నాఁచులోఁ నుండుఒకజాతిసర్పము. 'వ...సరీసృపనారీపరివారంబులతో మసకముల దనివిసనక సంచరించునాఁచుఁద్రాఁచులఁ గాంచి మేను లుప్పొంగ..." ప్రబంధ. ౧౮౬.

నాఁచుడు. దే. వి. క్షుద్రజలజంతువిశేషము "సీ... నత్తగుల్ల చుట్టుడుగుల్లకురువింద నాఁచుడు .." హంస. ౪, ఆ. ౧౭౯.

నాఁచువన్నె. ద్వ. వి. (నాఁచు+వన్నె) నాఁచు రంగు కలవస్త్రవిశేషము. "సీ. ముత్తేలపందిళ్లనుత్తరగోగ్రహణంబులు కరకంచు నాఁచువన్నె, నిండువన్నెలు...గీ. మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. ౨౭౨.

నాఁటించు. దే. స. క్రి. (నాఁటు. ధా. ప్రే.) 1. గ్రుచ్చు. "క. అందఱమేనుల గంగా, నందనుఁడు శరత్రయములు నాఁటించెను శల్యుం డాఁకె నుత్తరుఁడు..." భార. భీష్మ. ౧, ఆ, ౨౮౧. భార. ఆర. ౭, ఆ. ౩౨; 2. పాఁతించు. "గీ. పెరటిచెట్టుగ నాఁటించుతుఁ బెంపు గనుము." పారి. ౧, ఆ. ౧౩౬. ప్రభా. ౧, ఆ. ౧౨౦.

నాఁటు. దే. అ. క్రి. 1. గ్రుచ్చుకొను. "ఉ. దాఁటకమాన రిక్కడలి దాశరథుల్ తమదండి మూఁకతో, దాఁటినదాఁక చూడక...పొమ్మిది మంచిది పోనినాటికిన్, నాఁటకపోవు నీయురమునన్ రఘువీరకఠోరబాణముల్." రామా. ౭, ఆ. ౭౬. భార. ఉద్యో. ౪, ఆ. ౪౦౭; 2. పాదుకొను, స్థిరపడు. "క. మనమున నాఁటిన మానులు,విను మెన్నియుపాయములను వెడలునె యధిపా." భార. ఉద్యో. ౨, ఆ. ౬౨. భాగ. ౧౦. స్కం. పూ. ౧౦౪౫; 3. కలుఁగు, జనించు. "చ...వెక్కస మగునెవ్వగల్ వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మానసమున విన్నఁబా టొదవె నాఁటెఁ గడుం బరితాపవేదనల్." పారి. ౧, ఆ. ౧౦౦. హంస. ౩,ఆ. ౧౪౭; 4. అంటు, తగులు. "ఉ...వాని కెన్నిజన్మంబులనైనఁ బాపములు నాఁటవు పుణ్యపరుండు గావునన్." వి. పు. ౩, ఆ. ౧౩౮. దశా. ౪, ఆ. ౧౫౯. స. క్రి. 1. గ్రుచ్చు. "సీ...ఆతఁ డతని, ఘనశరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి నారాచ మొక్కటి నాఁటె వేన." భార. భీష్మ. ౧, ఆ. ౨౫౬. ఉ. హరి. ౩, ఆ. ౬౦; 2. (భూమిలో మొక్కలు లోనగు వానిని) పాఁతు. "గీ. నాఁటె మందారతరువులు తోఁటలందు." భీమ. ౫, ఆ. ౮౭. వసు. ౫, ఆ. ౬౪; 3. లగ్నముచేయు. "ఉ ..అనంత కేవలానందము దానియందు మది నాఁటుము మానుము నీచభోగముల్." భర్తృ. వై. ౪౦. నైష. ౪, ఆ. ౬౩; 4. కలిగించు. "చ .. అహార్యకూటములు నాటిన నాటులవెంబడింబడిం,బడిఁ బడునీరధారలు సుపర్వులు నించిన పుష్పవృష్టికై వడి వెలయించుదంభకిటివర్యుని మస్మది నాశ్రయించెదన్." చంద్రా. ౧, ఆ. ౭౭. వి. 1. రంధ్రము, గండి. చంద్రా. ౧, ఆ. ౭౭; 2. క్షతి, దెబ్బ. "సీ. ఫలుమొన నాఁటు లేర్పడినకెమ్మోవితోఁ జిఱుచెమ టంటు ముంగురులతోడ." మృ. వి. ౩, ఆ. ౯౧; 3. నాట్నము, మొక్కలు మొదలగునవి పాఁతుట. (వ్యవ.) ఆచేనియందు నాఁటు ముగిసినది; 4. భూమిలో దిగినపర్వతము లోనగువానియడుగు భాగము, కుదురు. "గీ. నడుమ చతురశ్రవృత్తమౌ నాఁటు గలిగి, ధగధగాయితకనకరత్నప్రతాన, కిరణములు వాలుకలు గోయుంకీలములుగ, సురనగంబు విధూమాగ్నికరణి మెఱయు." వరాహ. ౧౦, ఆ. ౧౦౭.

నాఁటుకొను. దే. అ. క్రి. (నాఁటు+కొను.) 1. పాదుకొను, స్థిరపడు. "సీ. పాపంబు లోకభంగిఁ బ్రక్షయం బందిన నామీఁద దృఢభక్తి నాఁటుకొనును, నామీఁద దృఢభక్తి నాఁటుకొన్నప్పుడు ధర్మంబు వర్తించుఁ దరతరంబు." భీమ. ౫, ఆ. ౧౫౭. వి. పు. ౭, ఆ. ౭౪; 2. కలుగు, సంభవించు. "గీ. ఈక్షణంబున నాఁటుకొనిన, పాటు మదిఁ జిత్తగింపవే పార్థివేంద్ర." వసు. ౨, ఆ. ౧౪౫. వి. పు. ౧, ఆ. ౧౫౬; పాఁతుకొను, వేళ్లు పాఱు. (వా.)

నాఁటుకొలుపు. దే. స. క్రి. (నాఁటుకొను ధా. ప్రే.) 1. అతుకుకొనఁజేయు. "గీ. తెగువ దక్షునికంఠంబుఁ ద్రెవ్వనేసి, ప్రేల్చెఁ దలనధ్వరాగ్నిని వీరభద్రుఁ,డా ప్రజాపతి మెడపైని సాక్షణాజ,నగుచుఁ బొట్టేలి తలఁ దెచ్చి నాఁటుకొలిపె." భీమ. ౬, ఆ. ౫౯; 2. పుట్టించు, కలిగించు. "సీ. అయ్యాంతికడ నిల్చి యనువునఁ గాంతకు నకు మది రాగంబు నాఁటుకొలిపి." దశ. ౬, ఆ. ౧౨౧; 3. పాదుకొనఁజేయు. "క...నామీఁదం గనికరంబు నాఁటుకొలుపుచున్." అచ్చ. సుం. ౯౧.

నాఁటుకొల్పు = నాఁటుకొలుపు. 1. (గ్రుచ్చుకొనఁజేయు.) "వ...సూటిగ నీఁటెయలు నాఁటుకొల్పి యుసురు వెడల మీఁటుచు .."అచ్చ. యు. ౩౬౪; 2. (పాదుకొనఁజేయు.) "ఉ. నావుడుఁ గన్యకామణి మనంబునఁ గూరిమి నాఁటుకొల్ప నా,భావజుబాణముల్ మిగులఁ బజ్జఁ జరించిన ..."ద్వా. ౫, ఆ. ౧౨౬.

నాఁటుతీఱు దే. అ. క్రి. (నాఁటు+తీఱు.) మొక్కమొదలగునవి పాఁతుకొని చక్కఁగా వ్యాపించు.

“చ. కరిశిర మాడ పఙ్క్తిఖుడుఁ గైపున వ్రేయుండుఁ గుంభమౌక్తికో, త్కర మసిధారఁ బొల్పెసఁగెఁ దారకుభంగము చూచి నవ్వుచుం, దరజయకాంత కాంతిరకాంతియొ కాదని నాఁటుచీఱి విస్ఫురదవదాతఖడ్గలత పూచెనొ నా జయచైత్రసంపదన్.” కు. సం. ౧౨, ఆ. ౧౮౨.

నాఁటుదేఱు. దే. అ. క్రి. (నాఁటు+దేఱు.) జనించు, పుట్టు. “చ. ఘనవదనాలవాలమునఁ గ్రమ్మవచస్సుధ నాఁటుదేఱి చిన్నినగవువెన్నెలం గలసి చిక్కనయప్పవడంపుమోసులో, యన రదనాళి యింపొనరె...” కాళిందీ. ౧, ఆ. ౩౧౦.

నాఁటువడు. ద్వ. అ. క్రి. (నాఁటు+పడు.) తెగు, నఱకుడువడు. “చ. చిరముగ నొల్వవడ్డ నరసింహునికంటెను బెద్దవే శిరంబురలఁగ నాఁటువడ్డజల జోద్భవుకంటెను బెద్దవే...” కు. సం. ౪, ఆ. ౨౬.

నాఁడిక = నాఁడు. (నాఁడు+ఇక—స్వార్థమున.) దేశము. “క. అన్నాతియయు నొడయఁడు నటు, లన్నా రని నీవు కోన కరుదెంచినచో, నన్నా యన్నాఁడిక యన్నన్నా యాఁగుకొనఁ జాలు నట్టిద చెపుమా.” అచ్చ. అయో. ౧౧౦.

నాఁడు. దే. వి. పుం. (బ. నాళులు, నాళ్లు.) 1. దివసము, రోజు. “క. మీఁటు గలరాజరథికుల, నాఁటికి నేవుర పధింతు నరుశరములు నో,నాఁటి పడవైచునంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబువీరుల నెల్లన్.” భార. ఉద్యో. ౪, ఆ. ౪౦౨, భార. ఆది. ౧, ఆ. ౮; 2. ఆదినము. “గీ. నాఁడు సభ నాడినంతయుం నేఁడు చేయుం, నట్టులున్నాఁడు మొనతల ననిలసుతుఁడు.” భార. భీష్మ. ౩, ఆ. ౨౪, భో. ౨, ఆ. ౧౨౮; 3. సమయము, కాలము. “వ...కని పుట్టిననాఁడ చూచినవాఁడు గావున నప్పు డెఱుంగనేరక...” భార. ఆది. ౪, ఆ. ౧౬౬, భాగ. ౯, స్కం. ౬౬౯; 4. ఆసమయము, ఆకాలము. “ఉ. వేఁడినవేఁడి మాట నృపవీరుఁడు సైపక కర్ణరంధ్రముల్, సూఁడినభంగి దాఁకుటయు స్రుక్కి మనంబున నొచ్చి నిన్ను నే, నాఁడు నృపాలపుత్త్రి వని నమ్మి వరించితిఁ గాక యిష్టయిన్, నేఁ డొక కాలసర్పమయి నీవిటు నేయుంట సాకు దోఁచెనే” భా. రా. అయో. ౨౩, కళా. ౪, ఆ. ౧౩౨; 5. ఎడల, చేవర్థకము. “సీ. నేఁడు పోవనినాఁడు నిష్ఫలం బిప్పపోయత్న మంతయుం నని...” భార. ఆది. ౧, ఆ. ౧౧౫, నైష. ౫, ఆ. ౯౧; 6. దేశము. “ద్వి. నాఁడెల్ల నేగెడు నాఁడు నాపిన్న, నాఁడొక్కనాఁ డేను నడురేయిఁ బోయి...” రం. రా. అయో. ౧౨౩. పు. కు. సం. ౧, ఆ. ౫౩; 7. ప్రదేశము. “ద్వి. పురములు దేశముల్ పుణ్యతీర్థములు, నరసుతం బగునాళ్ల నాళ్లను గడచి.” ద్వి. హరిశ్చ. పూ. ౨౨౧౬. పం; 8. జనపదము, పల్లె. “సీ. నాఁడు నా జనపదనామధేయం బగు...” ఆం. భా. ద్వి. ౭.

నాఁడునాఁడు. దే. వి. పుం. (నాఁడు+నాఁడు.) దినదినము, ప్రతిదినము. “ఉ...అత్తతురగంబుల కెల్లను నన్ను యుక్తుఁగా, నర్మిలి నిల్పి యీఁగియుఁ బ్రియంబును నామొద నాఁడునాఁటికిం, బేర్మి వహించుచుండ నడపెం దనతమ్ములలోనివానిఁ గాన్.” భార. విరా. ౧, ఆ. ౨౬౭. కాశీ. ౨, ఆ. ౫౨. “క. భావించి నాఁడునాఁటికి, వేవిధముల మిగులభక్తివినయంబులతో, దైవోపచారముల భూదేవోత్తముఁ గొల్చెఁ గుంతిదేవి నియతయై.” భార. ఆది. ౭, ఆ. ౩౨౨.

నాఁడెకాఁడు. ద్వ. వి. (నాఁడెము+కాఁడు.) వైశ్యుఁడు. సాం. వి. మాన. ౨, విశ. నాఁడెము కలవాఁడు. (శ. ర.)

నాఁడెము. వై. విశ (సం. నాణకమ్.) శ్రేష్ఠమైనది, మేలైనది. “ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి పంకవిహీనమనోహరాంబువుల్, వేఁడిన నెల్లచోటఁ బ్రభవింపఁగ భానుఁడు శీతభానుఁడున్, గాఁడినమేఘకాళిమవికారము దూరము సేయనెంతయున్. నా.డెము చూపె శారదదినంబులు నిర్మలమూర్తికాకృతిన్.” పాండు. ౪, ఆ. ౪౩, అచ్చ. బాల. ౨౮.

నాఁపతాయి. దే. వి. (నాము+తాయి.) నాముపలె నున్నగా నుండుతాయి. (వా. విషశిల. దీనిని త్రొక్కిన ఆచోట నొప్పి కలుగును అని శ. ర.)

నాశ. దే. స. క్రి. (అనుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకరూపము) అనక. “చ. కొలఁది యెఱుంగ కిట్టిపలుకుల్ పలుకం దగు నాశ...” భార. ఆది. ౫, ఆ. ౨౦౩, కాశీ. ౯, ఆ. ౧౦౧.

నాకబలి. సం. వి. ఇ. పుం. నాగవల్లి, వివాహాంగమగు ఐదవరోజున చేయుసంస్కారవిశేషము. "సీ. ఫాలంపు మీఱఁగ నాకబలికృత్యములు సల్పి." కళా. 2, అ. ౧౫.

నాకము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. ఆకాశము.

నాకవనిత. సం. వి. ఆ. స్త్రీ. 1. దేవతాస్త్రీ; 2. అప్సరస.

నాకసదుఁడు. సం. వి. ద్. పుం. వేలుపు. ఇట్లే. నాకౌకసుఁడు. మొ.

నాకి. సం. వి. న్. పుం. వేలుపు, దేవత.

నాకిని. సం. వి. ఈ. స్త్రీ. దేవతాస్త్రీ.

నాకు. దే. స. క్రి. 1. లేహనముచేయు,నాలుకతో రాఁచి లోఁగొను. "సీ. సనకాదిదివిజమస్కరి ఫాలగోపిచందనపుండ్రవల్లికల్ నాకి నాకి." ఆము. ౧, అ. ౪౧. స్వా. ౪, ౬౦; 2. తాఁకు, స్పృశించు. "క...ధగధగ లర్చిస్తుంగత నింగులు నాకెడు,నింగలములు నాల్గుదెసల నిడుకొని కడఁకన్." స్వా. ౬, అ. ౨౧.

నాకులము. సం. విశే. (అ. ఆ. అ.) నకులసంబంధమైనది.

నాకులి. సం. వి. ఈ. స్త్రీ. 1. సర్పాక్షీ*; 2. తెల్ల వాఁకుడు*.

నాకువు. సం. వి. ఉ. పుం. 1. పుట్ట, వల్మీకము; 2. కొండ, పర్వతము.

నాకేశుఁడు. సం. వి. అ. పుం-స్వర్గాధిపతి,-ఇంద్రుఁడు.

నాక్రము. సం. వి. అ. పుం. మొసలిమూతినక్ర. విశే. (అ. ఆ. అ.) నక్రసంబంధమైనది.

నాగ. వై. విశే. (సం. నాగః.) 1. పూజ్యము. (చూ. నాగబెత్తము); 2. పెద్దది. (శ. ర)

నాగఁడు. వై. వి. (సం. నాగః.) శేషుఁడు. (శ.ర.)

నాగకేసరము. సం. వి. అ. పుం. ఒకానొక మొక్క.

నాగకేసరులు. వై. వి. బ. (సం. నాగకేసరాః.) ధాన్యవిశేషము. "సీ. నాగకేసరులు చెన్నంగులు కురువులు భోజనప్రియములు రాజనములు... శాలి. గీ. ధాన్య మెసఁగును......సాం. ని. మాన గీ.

నాగకస్నెరు. ద్వ. వి. ఒకజాతిగన్నేరు*. "సీ... నాగగన్నెరులు మూనాళ్లపొలకు." భల్లా. 3, అ. (శ. ర.)

నాగచూడుఁడు. సం. వి. అ. పుం.—నాగములు శిరస్సునందు భూషణములుగాఁ గలవాఁడు - శివుఁడు.

నాగజము. సం. వి. అ. న. 1. సిందూరము; 2. తగరము, వంగము.

నాగజిహ్విక. సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

నాగదాళి. దే. వి. ఒకజాతిముండ్లచెట్టు. (శ. ర.)

నాగనేరెడు. ద్వ. వి. పెద్దనేరేడు*. (శ. ర)

నాగప. దే. వి. నాగవల్లి. (శ. ర.)

నాగపడగలదండ. మి. వి. స్త్రీకంఠభూషావిశేషము. "ద్వి. భాసురం బగునాగపడగలదండ,యాసలఁ జేర నీయతివ నీదండ." ద్వి.భాగ.౧౦. (శ. ర.)

నాగపడగలు. మి. వి. బ. పాముపడగవలె నుండు కర్ణభూషావిశేషము. ఆం. భా. ద్వి. ౧౦౫.

నాగపసాని. వై. వి. (నాగప+సాని) నాగవల్లి నడపెడిముత్తైదువ. (శ. ర.)

నాగపుష్పము. సం. వి. అ. పుం. 1. పున్నాగము, పొన్న*; 2. సంపెంగ, చంపకము*; 3. నాగకేసరము*.

నాగపెంజెర. ద్వ. వి. ఒకజాతిసర్పము. "సీ. ప్రల్లదంబునఁ ద్రుళ్ళునల్లనాగులు నాఁగ పెంజెరలును బొట్టపెంజెరలును." ద్వా. ౫. అ. ౧౦౦.

నాగప్ప. వై. వి. నాగవల్లి నడపెడిముత్తైదువ. "సీ. నాగప్పసాని నాపసాని యనంగ నాకబలిచి రంటి నామ మెసఁగు." ఆం. భా. ద్వి. ౧౦౫.

నాగబంధము. సం. వి. అ. పుం. 1. అభినయహస్తవిశేషము; 2. చిత్రకవిత్వములోని సర్పాకారబంధము; 3. మల్లబంధవిశేషము; 4. వస్త్రవిశేషము. "వ...నాగబంధంబులు బూజాబంధంబులును...అనుపేళ్లఁ గలపుట్టంబులు గట్టుకొని..." ద్వా. 3, అ. ౨౦౬.

నాగబెత్తము. వై. వి. పొన్ను వేసిన మంత్రపూతమైనచిన్న పేము. "చ. కరమున నాగబెత్తమును గాత్రమున న్నునుబూది యొప్పఁగా, నరుదుగ జోగురా లొకతె యచ్చటికిం జనుదెంచె గ్రక్కునన్." శకుం. ౪, అ. ౯౫. కళా. ౨, అ. ౪౫.

నాగభూషణుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

నాగమల్లె. వై. వి. ఒకజాతిమల్లె*. ఆం. భా. ద్వి. ౧౦. బ. ధాన్యవిశేషము. "సీ. మందిగంత్రలు

నాగమ్మల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు. గీ. అది యగుపేర్లుగలుగువ ద్దతని యింటనుండు......" హంస. ౪, ఆ. ౧౨౮. ప్రబంధ. ౧౧౭.

నాగమసాని = నాగప్పసాని. "మ. నరలం గూర్చిన కొప్పుతోఁ బసుపుమిన్నల్ వేఱునెమ్మోముతో, గరిమన్ నాగమసాని ప్రోలు దిఱుగంగా అంతువై దూర్యముల్, మొరయంగాఁ గడు నొప్పె నాకబలి..." వేం. పంచ. ౪, ఆ. ౩౭౦.

నాగము. సం. వి. అ. పుం. 1. పాము, త్రాఁచు; 2. పాతాళలోకమున వసించు దివ్యసర్పజాతివిశేషము (అష్టనాగములు—అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు కుళికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు. కర్కోటకుఁడు.); 3. ఏనుఁగు; 4. కొండ; 5. మేఘము; 6. చిలుకకొయ్య; 7. దేహమందలి ఉపవాయువులలో వాగ్ద్వారమందుండు ఉపవాయువు; 8. గ్రహము; 9. నాగకేసరముచె; 10. పున్నాగము, పొన్న చె; 11. ముస్తెచె. న. 1. తగరము; సీసము; 3. ఒకానొక కరణము. (జ్యోతి.); 4. ఆశ్లేషానక్షత్రము. విణ. (అ. ఈ. అ.) 1. కొండలకు సంబంధించినది; 2. క్రూరము; 3. (సమాసమం దుత్తరపదమై నప్పుడు) శ్రేష్ఠుఁడు. (ఉదా: పున్నాగము, పున్నాగుఁడు. మొ.)

నాగముస్తె. వై. వి. భద్రముస్తకముచె. (శ. ర.)

నాగరంగము. సం. వి. అ. పుం. నారింజచె.

నాగరకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) 1. నగరమందు పుట్టినవాఁడు; 2. నేర్పరి, ప్రవీణుఁడు; 3. నగరదురభ్యాసములు అలవడినవాఁడు; 4. దొంగ; 5. శిల్పి.

నాగరము. ఉభ. దే. వి. స్త్రీ శిరోభూషావిశేషము. (వా.) సం. వి. అ. పుం. 1. నారింజచె; 2. కపటము, మోసము; 3. గోరఁటచె న. 1. సొంటి; 2. ఒకజాతిముస్తెచె; 3. రతిబంధవిశేషము; 4. ఒకానొకలిపి. (సంస్కృతభాష యీలిపిలో వ్రాయఁబడును.) "గీ. పటములందు నాగరలిపి ప్రస్ఫుటముగ, వరమషీతూలికారేఖ వ్రాసినట్టి, యర్హతాగమగ్రంథ మత్యాదరమున, జట్టు పఠియింప బోధించు సద్గురుండు." కాశీ. ౬, ఆ. ౪౪. విణ. (అ. ఈ. అ.) 1. నగరమునఁ బుట్టినది; 2. నగరమున నున్నది; 3. నగరమునకు సంబంధించినది.

నాగరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకలిపి; 2. పట్నవాసపుస్త్రీ.

నాగరికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. నగరరక్షణమందు నియుక్తుఁడు; 2. నగరమును రక్షించువాఁడు.

నాగరుఁడు. సం. వి. అ. పుం. 1. పౌరుఁడు; 2. మగనిసోదరుఁడు, దేవరుఁడు.

నాగరుకము. సం. వి. అ. పుం. నారింజచె.

నాగలోకము. సం. వి. అ. పుం. పాతాళము.

నాగవడిగలు. వై. వి. బ. కర్ణభూషావిశేషము. "సీ. మొనపాటముత్తె ముంచిననాగవడిగలు బిగువొప్పఁ దొడిగిన బిళ్లచెప్పు. గీ. లానర..." రా. వి. ౨, ఆ. ౪౪.

నాగవలి = నాగవల్లి. (పెండ్లిలో తుదినాఁడు చేయు సంస్కారవిశేషము. కొందఱు దీనిని ఐదవనాఁడు కొందఱు నాలవనాఁడు. జరిగింతురు.) "ఆ. అటుల దినచతుష్టయం బైనయంత నాగవలిగూను నొనర్చె త్మావరుండు." ఇందు. ౬, ఆ. ౬౬. ఆం. భా. ద్వి. ౧౭౮.

నాగవల్లరి. సం. = నాగవల్లి.

నాగవల్లి. ఉభ. దే. వి. (సం. నాకబలిః.) పెండ్లిలో కడపటినాఁడు చేయుసంస్కారవిశేషము. "క. తగఁ బ్రాకెనయంను దీఱిచి, నగవులపను లైన వెనుక నారవనాఁ డొప్పుగ నాగవల్లి సేయఁగఁ, బగడపుటుప్పరిగెలోనఁ బడఁతుక లెల్లన్." య. ౪, ఆ. ౧౧౪. రాజ. చ. ౩, ఆ. ౧౭౪. సం. వి. ఈ. స్త్రీ. తమలపాకుతీఁగ, తాంబూలిచె.

నాగవాసము. ఉభ. దే. వి. 1. గంటలోనిచీల, ఘంటాప్రతీకము. "గీ. నాగవాస మన ఘంటాప్రతీకమునకు వేశ్యలకును బేరు విశ్వనాథ." ఆం. సం. నానా. ౨౪; 2. గొండ్లెము తగిలించుటకు రెండు కొనలు వంచి బిగించిన యినుపకమ్మి. "చ. కులుకు మెఱుంగుఁ గెంపుతతిగోళ్ల నమర్చిన నాగవాసపుం, గొలుకుల జాళువా గొలుసుగోళ్లఁ దగుల్కొని ..." చంద్ర. ౧, ఆ. ౯౧; 3. వేశ్యాసమూహము. "సీ. ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి మహిమ గోల్పడియె నే మాందకర్ణి." స్వా. ౨, ఆ. ౬౩. ఆం. సం. నానా. ౨౪; 4

భోగము మేళము. "ఆ. నాగవాస మనఁగ నామ మా వేశ్యాజనంబు మేళమునకు నంబికేశ." ఆం. సం. మాన. ౧. ఆము. ౪, ఆ. ౩౪. సం. వి. అ. పుం. నాగలోకము.

నాగవ్రేలిమి = నాగవల్లి. "క...ముదముల, వ్రేలి మిగుల నవల నాగవ్రేలి మొనర్పన్." ముకుంద. ౩, ఆ. ౨౯౬.

నాగసంభవము. సం. వి. అ. న. సిందూరము.

నాగసరము. వై. వి. (సం. నాగస్వరః.) 1. పాముల వాఁ డూఁదెడిబుఱ్ఱ. "గీ మిహిపదంబుగఁ బాముల మెంగఁ దూదె, భోగిరాజులు న ర్తింప నాగ సరము." క్రీడా. ౨౨౪; 2. పాముల కానం దము గలిగించుస్వరవిశేషము. "గీ...ఆలకించి చనిరొ, నాగసరముల మ్రోఁత యన్నాగరి కుఁడు." క్రీడా. ౨౧౯. ఆం. భా. ప్ర. ౧౨౯; 3. సన్నాయి. "ద్వి. కంచుకొమ్ములు బూరగలు నాగసరము, లంచితపటహకాహళములు సరుమ." ద్వి. నల. ౨, భా. ౭౪౯. య. ౪, ఆ. ౧౭౧.

నాగస్వరము సం. వి. అ. పుం. 1. పాముల కానం దముఁ గలుగఁజేయు గానవిశేషము; 2. పాముల వాఁ డూఁదెడిబుఱ్ఱ. "క. నాగస్వరసుషిరసర, న్నాగవరాళ్యాది వివిధ నానారాగ, ప్రాగల్భ్య ప్రకటఫణా, భోగములై యాడఁజొచ్చె భోగీం ద్రంబుల్." క్రీడా. ౨౨౦.

నాగాంతకము. సం. వి. అ. పుం. 1. గరుడపక్షి; 2. నెమిలి; 3. సింహము.

నాగారి. సం. వి. ఇ. పుం. 1. గరుడపక్షి; 2. నెమలి; 3. సింహము. [నెమలి.

నాగాశనము. సం. వి. అ. పుం. 1. గరుడపక్షి; 2.

నాగి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. పాతాళ లోకము; 3. ఆఁడుసర్పము; 4. నాగజాతిస్త్రీ. "క. నీగుణములు దొల్లియు నాగిగీతములందు విని..." భార. ఆది. ౧, ఆ. ౧౩౧. పుం. శివుఁడు. విశే. (స్. నీ. న్.) పాములు కలది. (పుట్టమొ.)

నాగిని. ఉభ. వై. వి. (సం. నాకినీ.) లోకాంతర గతయై దేవత యైనముత్తైదువ. (శ. ర.) సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లబిడ్డుశీ. "గీ...నాగిని యగు, గొల్లబిడ్డన..." ఆం. భా. ద్వి. ౬౬; 2. నాఁగురు, నాపురుశీ. "గీ...నాగిని నాపురు నాఁగు రనఁగ." ఆం. భా. ద్వి. ౬౨.

నాగు వై. వి. (సం. నాగః.) పాము. "ఆ: నంది యెక్కు గిత్త నాగులు సొమ్ములు..." చెన్న. ౩, ఆ. ౩౯. ఆం. భా. ప్ర. ౧౪౬.

నాగుఁబాము. ద్వ. వి. (నాగు+పాము.) త్రాఁచు. "సీ ..నాగుఁబా మనఁ ద్రాఁచ నఫణి దనర్పు." ఆం. భా. ప్ర. ౧౪౭. అచ్చ. సుం. ౭౭.

నాగువడిగెప్రోగులు. వై. వి. బ. పాముపడగపోలిక గలకర్ణాభరణ విశేషము. "గీ...చెవులనాగు, ప్రోగులు మెలిగొన్నపచ్చడములు నమర..." వేం. పంచ. ౧, ఆ. ౬౧౪.

నాగులపడగలు. వై. వి. బ. పాముపడగపోలిక గల కర్ణభూషావిశేషము. "చ....వెన్నునం,దోలకెడు నె త్తిజుట్టు తెలిదుప్పటి వీనులమానికంపునా, గులపడగల్ రహిం దగ నొకొం డగుయింటరి బోయఁ డుద్ధతిన్." కువల. ౪, ఆ. ౨౦౨.

నాగువు. వై. వి. (సం. నాగః.) పాము. "గీ. కుబుస మూడ్చెడిమేటినాగువును బోలె." భీమ. ౭, ఆ. ౭౦, నైష. ౭, ఆ. ౧౭౪.

నాగేంద్రము. సం. వి. అ. పుం. 1. సర్పరాజము; 2. శేషాహి; 3. గజశ్రేష్ఠము; 4. ఐరావతము.

నాగోదము. సం. వి. అ. న. ఉదరత్రాణము.

నాచి. శే. వి. (త. నాచ్చి.) స్త్రీ. "గీ. కలికి పల్లిక దేబెలఁ గన్నతల్లి, వాసి కెక్కినయట్టిపోలాస యిల్లు, చక్కమెప్పులమాహురమ్మక్క నాచి." క్రీడా. ౧౨౯.

నాట. సం. వి. అ. పుం. రాగవిశేషము. "శా... వాలారుం గొనగోళ్ల నీ నలసతల్ వాయించుచో నాటకుల్, మేళం బైనవిపంచి నిన్న మొదలుల్ నీవంటమిం జేసి..." స్వా. ౩, ఆ. ౭౭, హంస. ౭, ఆ. ౧౨౪.

నాటకము. సం. వి. అ. న. 1. శృంగారవీరరసములలో నొకరసముప్రధానముగా నుండి ప్రఖ్యాతచరిత్ర మును దెలుపుచు అయిదు మొదలు పదివఱకు అంకము లుండుదృశ్యప్రబంధము; 2. నర్తనము. "దండకము...గోవర్ధనక్షోణి భృత్కందరక్షోణిఁ గ్రీడించువిన్నాణి పెన్నాటకం బైనక్రాల్గన్నుల్ గల్గుపెన్గబ్బులల్ పల్గడల్ జెల్కు నెమ్మోముబాలిల్లి శోభిల్ల..." పాండు. ౪, ఆ. ౭౭; 3. చరిత్రము. "గీ. పుండరీకాక్షునకు కాలిపూజ లిచ్చి, సంయములు చూడ [illegible]

శాస్త్రమమునందు, నాఁగ విందు మయ్యెరువుర నాటకంబుఁ, జెప్పి చెవులకుఁ బండువు సేయు వనఘ." ఉ. హరి. ౨, ఆ. ౭౦; 4. కపటో పాయము. "ఉ...నామెఁగ వోటకై వలని నాటకముల్ ఘటియించి రుక్మిణీ, కామిని మీఁదటం గలుగుగౌరవముం గృపయుం బ్రియంబుఁ దా, నేమియుఁ గాననీక యిట నిన్ని దినంబులు నన్నుఁ దేల్చె..." పారి. ౧, ఆ. ౮౯.

నాటకసాల. వై. వి. (సం. నాటకశాలా.) నాట్యశాల. "చ...ఒకచేడియ నాటకసాలమేడపై, నిలువున నాడుచుండి..." స్వా. ౫, ఆ. ౬౩.

నాటకీయము. సం. విశే. (అ. ఆ. అ.) నాటకసంబంధమైనది.

నాటకుఁడు. సం. విశే. (అ. టీకా. అ.) నటుఁడు.

నాటనము. సం. వి. అ. పుం. నృత్యము.

నాటి. సం. విశే (న్. నీ. న్.) నటించువాఁడు.

నాటిక. సం. వి. ఆ. స్త్రీ. ఉపరూపకము లనెడిదృశ్యకావ్యములలో నొకటి (ఇది నాలుగంకములు కలిగి స్త్రీపాత్రబహుళముగా నుండును. ఇందలి కథ కల్పితమై యుండును. నాయకుఁడు ధీరలలితుఁ డగురాజు. నాయిక అంతఃపురసంబంధ గాని సంగీతవ్యాపృత గాని అయి నవానురాగ యగురాజకన్యక, ప్రౌఢయు నృపవంశజాతయు నగుపెద్దభార్య యుండవలెను. ఇందు వృత్తి కైశికి.)

నాటితము. సం. విశే. (అ. ఆ. అ.) అభినయింపఁబడినది.

నాట్యము. ఉభ. దే. వి. మల్లవిద్యయందలి విసరులలో నొకటి. "వ...అంత్రటీక టీక నాట్యము ...మొదలగుపదునాలుగు విసరులు..." ప్రబంధశేఖ, సం. వి. అ. న. 1. నృత్యము; 2. నృత్తగీతనాద్యాత్మక మగులాస్యము; 3. నాటకాది దశరూపకాభినయము.

నాడము. సం. = నాళము.

నాడా. హిం. వి. సన్ననినూలుపట్టె. (శ. ర.)

నాడి. సం. వి. ఈ. స్త్రీ. 1. నరము; 2. గడియకాలము; 3. నారికుటుపు; 4. ఈనె; 5. కాడ, నాళము; 6. గొట్టము, క్రోవి; 7. మోసకాని నడక, మారియు; 8. ఒకజాలిగతికళ; 9. వాతపిత్తశ్లేష్మనాడులలో నొకటి; 10. ఇడ, పింగళ, సుషుమ్న అనుమూఁడునాడులలో నొకటి (యోగ.)

నాడింధముఁడు సం. వి. అ. పుం.—గొట్ట మూఁదు వాఁడు-కంసాలి, స్వర్ణకారుఁడు.

నాడికేలము. సం. = నారికేళము.

నాడీవ్రణము. సం. వి. అ. పుం. నారికుటుపు.

నాడు. దే. అ. క్రి. 1. నాఁటు, గ్రుచ్చుకొను. "గీ. కాఁడె గ్రుస్సెను దొలిచెను నాడె ననఁగ, నాఁటె ననుమాట కర్థ మా నాగభూష." ఆం. భా. తృ. ౧౨౨; 2. విఱుగు, ఖండితమగు. "చ. జనపతి వేఁడితూపుల భుజంబులు వ్రచ్చి యఁరంబులుచ్చి యాసనములు వాఁడి చాపములు నాడి శతాంగము లాడి యుగ్రకేతనములు నూడినన్. ..." కళా. ౨, ఆ. ౧౦౦. స. క్రి. బాధించు, పీడించు. "చ. అనలునిఁ గాఁడుచుం జమునినాడుచు రాక్షసు నాడుచుం గపర్దినొసలు చూఁడుచుం ధనదుప్రేవులు దోఁడుచు..." కళా. ౫, ఆ. ౧౨౩.

నాడె. దే. వి. నడుము నూలికండె నుంచి నేసెడు సాలెవానిసాధనవిశేషము, తురి. "సీ...పరిపరి యచ్చులు చరికుండ యూడిత చీడుదబ్బలు దండె నాడె క్రోలి." హంస. ౨, ఆ. ౧౧.

నాణకము. సం. వి. అ న. రూపాయ లోనగు నాణెము.

నాణెకత్తె. వై. విశే. (నాణెము+కత్తె.) నాణెము కలది. (శ. ర.)

నాణెగాఁడు. ద్వ వి. (నాణెము+కాఁడు.) నాణెము కలవాఁడు. 'సీ. చేరెఁడుబియ్యాలయోరెముల్ దినువానిఁ గోణంగిసేవలనాణెగాని." ఘటికా. ౨, ఆ. ౧౭౬.

నాణెము. వై. వి. (సం. నాణకమ్.) 1. శుద్ధదీనారము. (ముద్రింపఁబడినరాగివెండి బంగారముల బిల్ల అని శ. ర.) "గీ. నాణె మనఁగను శుద్ధదీనారమొప్పు" ఆం. భా. ద్వి. ౨౭౩, శుక. ౧, ఆ. ౫౧౦; 2. మంజులత. "చ. అడలుచుఁ దాళరాని విరహార్తిమెయిం దురపిల్లుదాని...అంచరా, నడుపులుదాని మోవిరుచినాణెము దానినుస్పైడఁగును..." శుక. ౧, ఆ. ౨౦౧; 3. ద్రవ్యము, ధనము. "చ. నడవడి గల్గువాఁడు కడునాణెము ఛేఁ గలవాఁడు..." హంస. ౫,

ఆ. ౨౧౬; 4. నాగరకత. (శ. ర.); 5. (వస్తువుల) యోగ్యత (ఇచ్చి పుచ్చుకొనుట యందలి యోగ్యత. (శ. ర.) విశే. 1. మంజులము, మనోహరము. "సీ...నాణెము చొక. గీ. గొనబు తియ్యంబు జాను తిన్ననిది బాగు, చొక్కటంబన వెలయు మంజులసమాఖ్య." ఆం. భా. తృ. ౧౪; 2. శ్రేష్ఠము. "గీ. కంచిలో నేడువాడలఁ గలిగినట్టి, నాణెపుంగోమటులతోడ నంబిసెట్టి, భాసురస్ఫూర్తి నేఁగెఁ గైలాసమునకు." హర. ౫, ఆ. ౧౪౧.

నాణ్యము = నాణెము. (బ్రౌ. వా)

నాతము. దే. వి. బత్తెము. "ఉ...కొల్చినపేదసావలన్, దప్పునిచేతనాతములఁ దస్పుట భూషణ మయ్యెఁ బుత్త్రకా." రా. వి. ౫, ఆ. ౩౪.

నాతి. దే. వి. 1. స్త్రీ. "క. జ్ఞాతులపోరితమును గో, వ్రాతముగాక్రమము విప్రవర్గముచనవున్, నాతులఁ గారించుటయును, బ్రీతిం జననిచ్చునతని పెం పొప్పు నృపా." భార. ఉద్యో. ౫, ఆ. ౧౬. చూ. సం. భార. ఉద్యో. ౩౬, స. ౬౧, అను. ౫ ఆ. ౪౫; 2. భార్య. "క. అతండు పుష్కరిణియను, నాతికి వీరణసమాఖ్యనందనుఁ గనియెన్." హరి. పూ. ౧, ఆ. ౭౧; 3. కన్య. "గీ. సాత్త్వికస్వేదమకరందసహిత మయిన, హారికరాబ్జంబు ధారోదకాలిసిక్త, మగుచు నాత్మకరస్పర్శ నతిశయిల్ల, నాతి రవి యిచ్చె బ్రహ్మార్పణ మ్మటంచు." కాళిందీ. ౫, ఆ. ౧౧౧.

నాతుక = నాతి. (నాతి+ఉక-స్వార్థమున.) స్త్రీ. "ఉ. జాతరపేరు చెప్పి రభసంబునఁ దల్లియుఁ దానుఁ గూడి యా, నాతుక త్రోవ చూపఁగ వనంబునకుం జని... అవశీకృతమానసరై పడంకుచున్". భో. ౫, ఆ. ౫౧౭. ఆం. భా ద్వి. ౫౦౮.

నాథము. సం. వి. అ. పుం. (ఎద్దు మొ. వాని) [ముకుద్రాఁడు.

నాథుఁడు. సం. వి. అ. పుం. 1. స్వామి, యజమానుఁడు; 2. భర్త, పెనిమిటి; 3. ప్రభువు, ఏలిక; 4. ఇంద్రుఁడు.

నాదనామక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక రాగము. (సంగీ.) "సీ...శంక, రాభరణము మేఘరంజి తోడి వరాళి నాదనామక్రియ నాట..." హంస. ౫, ఆ. ౧౫౪.

నాదము. సం. వి. అ. పుం. 1. ధ్వని, మ్రోఁత; 2. ప్రణవనాదము, ప్రాణవాయువు నాడుల యందు సంచరించుటవలనఁ గలిగినధ్వని.

నాదారు. దే. విశే. (హిం. నాదార్.) 1. బీద, దరిద్రుఁడు. (వా.); 2. చిక్కినవాఁడు, కృశించినవాఁడు. (వా.)

నాదించు. సం. అ. క్రి. మ్రోఁగు, నాదముచేయు, "గీ. గంట నాదించినవితాన గండుతేఁటి, మొఱయుచుండాన..." శశాం. ౫, ఆ. ౫౩.

నాదు. వై. వి. (సం. నాదః.) ధ్వని, చప్పుడు. "గీ. నాదు మొలనూలిగంటలనాదు వినక, చంట నీయుర మానక చంట దగునె." సా. ౫, ఆ. ౯. ర. శశాం. ౫, ఆ. ౫౩.

నాదుకొను. ద్వి. అ. క్రి. (నాదు+కొను.) ధ్వనిచేయు. (చూ. నాదుకొల్పు.)

నాదుకొల్పు. ద్వి. స. క్రి. (నాదుకొను ధా.)(పిరంగులు లోనగువానిని) ప్రేల్చు. ధ్వనింపఁజేయు. "మ. జిలిసీ దీర్చి పిరంగుదారులు సమిత్తిస్తోం శుకస్తోమ్ములై, యనలజ్వాలలు కోలల న్గమిచి హాహారావ ముప్పొంగఁ ద, ద్ఘనవప్రోరుకవాటపాటనకళాగాఢోద్యముల్ హృద్యదృష్టిని యొక్కుమ్మడి నాదుకొల్పిరి దిశాశ్రేణుల్ కదుం బెగ్గిలన్." రంగా. ౩, ఆ. ౫౩.

నాదేయము. సం. వి. అ. పుం. 1. తెల్లు, కాశము; 2. కైవడిముస్తె☘; 3. వానీరము, ప్రబ్బ☘. న. 1. సైంధవలవణము; 2. సౌవీరాంజనము. విశే. (అ. ఈ. అ.) 1. నదీసంబంధమైనది; 2. నదియందు పుట్టినది; 3. గ్రహింపఁదగనిది; 4. ఆదేయము కానిది, ఇయ్యఁదగినది.

నాదేయి. సం. వి. ఈ. స్త్రీ. 1. తక్కలి☘; 2. నీరుప్రబ్బ☘; 3. నేలనేరేడు☘; 4. నారింజ☘; 5. దాసనము☘; 6. కాకినేరేడు☘.

నాథము. సం. వి. అ. పుం. ముకుద్రాఁడు.

నాధుఁడు. సం. = నాథుఁడు.

నాన. వై. వి. (సం. జ్ఞానమ్. క. త. నాణ్.) 1. సిగ్గు, లజ్జ. "ఉ...నలినానన గోలతనాన నేల లో, నానఁ జలంబు నీకు మఱునాన సుమీ విడు నానయుం కిటన్." విజ. ౫, ఆ. ౫౭. ఆం. భా. ప్ర. ౧౩౫; 2. సంకోచము, వెనుదీయుట. "ఉ.వలలుఁ డనన్ విరాటుకడ వంటలవాఁడయి భీమసేనుఁ

బృహన్నల యన నాఁడు పేడి వయి నాన యొకింతయుం లేక నీవు న గ్గల మగుధైర్య మొంది..." భార. ఉద్యో. ౪, ఆ. ౨౦౦. భార. ఆది. 3, ఆ. ౧౩౭; 3. అవమానము. "ఆ. పట్టువడ్డ నచ్చుపగిదిఁ బాంచాలభూనాయ కుండు దనకు నాన చేటు,రాక కుమ్మలించి..." భార. ఉద్యో. ౪, ఆ. ౩౮-౨. ౪, ఆ. ౨౪౦.

నానఁబ్రాలు. దే. వి. (నాను+ప్రాలు.) 1. నాన బియ్యము. "గీ ..ఆర్ద్రతండుల మ్మమరు నానఁ బ్రాలు నాఁగ..." ఆం. భా. ద్వి. ౨౫3; 2 భక్ష్యవిశేషము. "చ. కొబ్బెరపప్పు నానఁబ్రా, లడుకులు దేనెపండులు... నీ కొసంగెదన్." చెన్న. 3, ఆ. ౭3, కాశీ ౭, ఆ. ౧౮౫.

నానగండ. వై. విణ. (నాన+గండ.) సిగ్గుమాలిన వాఁడు. "చ... పీతరాగుల మని విఱ్ఱవీఁగెదరు కొందఱుబోడలు నానగండలై." పాండు. ౫, ఆ. ౧౯౨. పారి. ౫, ఆ. ౨౦.

నానబియ్యము. దే. వి. (నాను+బియ్యము.) నానఁ బ్రాలు. (శ. ర. వా.)

నానా. సం. అవ్య. (తెలుఁగున సిద్ధసమాసపూర్వ పదముగానే యుండును.) 1. అనేకము. "క. నానావిధ పాకములుఁగ, నానాలుఁగఁ జేసి..." హర. ౨, ఆ. ౧౨౨; 2. వివిధము, పెక్కు తెఱఁ గులు కలది. వి. ఆ. స్త్రీ. 1. సరస్వతి; 2. తల్లి, జనని; 3. కూఁతురు.

నానాఁడు. దే. అవ్య. నాఁడునాఁడు ప్రతిదినము. "క..,ఇది, నానాఁటి కనంతనాంచనంబులు గురి యంన్."వసు. 3, ఆ. ౧౨, కాశీ. ౧, ఆ. ౧౧౫.

నాను. దే. అ. క్రి. తడియు, ఆర్ద్రమగు. "ఆ. తడిసె నానె ననఁగఁ దనరు నార్ద్రం బయ్యె ననుట నాఖ్య..." ఆం. భా. తృ. ౯౧, ఆమ. ౪, ఆ. ౧౨౬; 2. చిరకాలము తడియు. "శా. దాన త్యాగపత్రమై దొలుపత్త్రం బంబుధారక్షిదా, నానందల్పితకీర్తిహాంసి చను మింటన్..." ఆము. ౨, ఆ. ౪౨. భా. రా. కిష్కిం. ౩౯3. 3. ఇంకు, ఇగురు. "సీ. చిట్టాముదమ్మున శిర సంటి నును మేన నాన మానియ నించి నలుఁగు పెట్టి." ఇందు. ౨, ఆ. ౧౫, వి. స్త్రీ. కంఠభూషా విశేషము. "సీ...కంఠభూషావిశే. గీ. నాను

గులికంటు మెడనూలు నాను తీఁగె, కంటసరి కంటె యం చనఁగాను..."ఆం. భా. ద్వి. ౧౪౮.

నానుకోళ్లు దే వి. బ. (నాను+కోళ్లు.) స్త్రీలకంఠా భరణవిశేషము. (వా.)

నానుక్రోవి. దే. వి. (నాను+క్రోవి.) కంఠాభరణ విశేషము. (శ. ర.)

నానుచు. దే. స. క్రి. (నాను ధా. ప్రే.) నానఁజేయు, చిరకాలము తడుపు. "గీ. అలరుఁదేనియ నానిచి మొలక గట్టి, శర్కరాబీజములు సుధాశాద భూమి, భావజుఁడు విత్త మొలచిన పైరు పేర, పెదవిలాసంబు పూఁబోఁడిపెదవి పదవి." పాండు. 3, ఆ. ౧౯౧. శేష. ౪, ఆ. ౫3.

నానుచుట్టు. దే. వి. (నాను+చుట్టు.) స్త్రీకంఠాభరణ విశేషము. "సీ...సన్నకాటుకరేకలు నాభి నామంబులు నానుచుట్టు." శుక. ౨, ఆ. 33౨.

నానుడి. దే. వి. (నాను+నుడి) 1. జనశ్రుతి, కిం వదంతి. "సీ. నానొడి నాఁగను నానుడి నాఁ గను నబ్బు నాఁగను జనశ్రుతి దనర్చు." ఆం. భా. ప్ర. ౧౧౨; 2. సామెత, లోకోక్తి. "చ. వింటలేదె యింట గెలిచి రచ్చ గెల్వు మను నానుడి నానుడి నానుడి నానుఁడీ చెవిన్." సా. ౨, ఆ. ౭౫౯. భో. ౭, ఆ. ౮3.

నానుడు. దే. విణ. తడిసినది. ఉదా:—నానుడు నేల. (శ. ర.)

నానుడువాన. దే. వి. (నానుడు+వాన) విడువక కురిసెడిపొడిపొడిచినుకులవర్షము. (శ. ర.)

నానుపు. దే. స. క్రి. (నాను. ధా. ప్రే.) చలువ చేయు. (శ. ర.)

నానుపుఁగొండ. ద్వ. వి. (నానుపు+కొండ) హిమవ త్పర్వతము. "వ.నానుపుఁగొండరాచూలివాలిక చూపునివాళికలు దనరె......" కాశీ. ౪, ఆ. ౧౨౪.

నానుపుడు. దే. వి. నాన్పుట. (వా.)

నానుబోర. దే. వి. మాంసము కలఱొమ్ము. (శ. ర.)

నానొడి = నానుడి ఆం. భా. ప్ర. ౧౧౨.

నాన్చు = నానుచు. (ఎక్కువగా తడుపు) "చ... గొడుగుల గాలిఁ దూల్చి మఱి కోలలతోడన పాఱ నాన్చి చేఁద్పడ జడిమేఘుఁడు..." ఆము. ౪, ఆ. ౧౭౯.

నాస్తె. దే. వి. జంతికలు ఒత్తుచున్నపుడు జాఱెడి పిండికాడ. "మ. పొలఁతీ చూచితె తేఁటి ఱెక్కరవ గాడ్పుంబోద లేఁదాఁకు జొక్కలచే జాఱు మెఱుంగుఁ బుష్పాదులరేకల్ మీఱె గుత్తంబులై, యలరుం బెజ్జపు మ్రానిజంతికలఁ జెన్నారన్ వనీదేవతా, కలకంఠీమణు లొత్తునాస్తెల గతిన్ గన్విందు గావింపుచున్." చంద్రా. ౪, ఆ. ౨౦౯.

నాన్పు = నాన్చు. (నానఁజేయుం, తడుపు.) "క. నినుఁ బాసి నిముసమైనను, వితు జీవము పట్టఁజాల విప్రోత్తమ నే నసనృతంబు పలుక నిజ మిది, ననుఁ బ్రీతి వరింపు కరుణ నాన్పు మనంబున్." మార్క. ౪, ఆ. ౨౪౭. ఆము. ౨, ఆ. ౨౧; 2. క్రొత్తబట్టలు చలువచేయుం. (బ్రౌ.)

నాప = నాగప్పు. (చూ. నాపసాని.)

నాపకుత్తుకదంట. ద్వ. వి. శివుఁడు. వేంక. దేవ. ౫.

నాపసాని. వై. వి. (నాప+సాని) నాగవల్లి నడపెడి ముత్తైదువ. "సీ. తెలయఁ విద్యాలంది పీడు కోల్ల గుడిచి నరఁ బువుల్ ముడిచిన నాపసాని." కళా. ౭, ఆ. ౮౩. ఆం. భా. ద్వి. ౧౦౮.

నాపితుఁడు. సం. వి. అ. పుం. మంగలవాఁడు

నాపిత్యము. సం. వి. అ. న. మంగలవృత్తి

నాభజావళి. దే. వి. గీతవిశేషము. "క. క్రమ మొంద నాభజావళి, గమకముగా శుద్ధసాళగములును సంకీర్ణము లోగిఁ బుంఖింపఁగ మంద్రము మధ్యము తార మత్యుదారత మీఱన్." సమీర. ౬, ఆ. ౨౦౫.

నాభి. సం. వి. ఇ. పుం. ఇ, ఈ. స్త్రీ. బొడ్డు. ఇ. కస్తూరి, మృగనాభి. ఇ. పుం. 1. బండికంటి నడిమితూము; 2. వృక్షవిశేషము; 3. బొట్టు, తిలకము. "ఉ. ఆనవలా యలంతిపసు పాడి దుకూలముఁ దాల్చి గుబ్బచన్, గోనలఁ దావు లుప్పతిలఁ గుంకుమ తేటల నిగ్గు దేఱఁ గప్రాసన నాభిఁ దీర్చి..." ఆము. ౫, ఆ. ౮౯; 4. నడిమి చోటు, మధ్యభాగము; 5. క్షత్రియుఁడు; 6. చక్రవర్తి. విణ. (ఇ.) శ్రేష్ఠుఁడు.

నాభిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బొడ్డువలె నుండు రంధ్రము; 2. మాణేరుశి.

నాభిజుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ. (ఇట్లే నాభిజన్ముఁడు. మొ.)

నాభిమూలము. సం. వి. అ. న. పొత్తికడుపు.

నాభిలుఁడు సం. విణ. (అ. ఆ. అ.) పెద్దబొడ్డు కలవాఁడు.

నాభీలము. సం. వి. అ. న. 1. కష్టము; 2. పెద్ద బొడ్డు; 3. కస్తూరీపరిమళము.

నామకము. సం. వి అ. న. నామము, పేరు. "సీ ..వాసు, దేవాశ్రయుఁడు వాసుదేవపరాయణుఁడుతునగు మర్త్యుఁడవ్విసుతనామ. ఆ. కము నుపన్యసించి కల్మషంబుల నెల్లఁదొఱఁగి... బ్రహ్మపదము నొందు." భార. అను. ౫, ఆ. ౩౨౭.

నామకరణము. సం. వి. అ. న. 1. పేరుపెట్టుట, 2. బిడ్డలకు పేరుపెట్టుటకు చేయుసంస్కార విశేషము.

నామకుఁడు. సం. విణ. (అ. మి గా. అ.) 1. వంగు వాఁడు; 2. వంచువాఁడు; 3. నమస్కరించు; 4. ప్రసిద్ధుఁడు

నామగుంట. ద్వ. వి. (నామ+గుంట.) గళగర్తము. (శ. ర.)

నామనీయుఁడు. సం. = నమ్యుఁడు.

నామమడఁచు. మి. స. క్రి. (నామము+అడఁచు.) పేరులేకుండఁ జేయు, చంపు. "ఆ...వేఱ యొక్కదొడ్డవిల్లు రయము, మెఱయఁ గొని యతండు మెఱుఁగులు గిరికొను నారసమున వాని నామమడఁచె." భార. ద్రో. ౪, ఆ. ౧౨౪. భార. సౌ. ౨, ఆ. ౩౭; 2. నాశముచేయు. "గీ. ఏడునూరురథంబుల నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నాటి నామ మడఁచె, నతనియను జుండు..." భార. విరా. ౩, ఆ. ౨౬౩.

నామమణఁగు. మి అ. క్రి. (నామము+అణఁగు) చచ్చు, మరణించు. "గీ. నీసహోదరి నని చెప్ప నీసుతోడ, నుఱక నన్నొకఁ డిమ్మెయిఁ బఱచి నామమణఁగ కున్నాఁడు నేఁడు .." భా. రా. అర. ౧, ఆ. ౨౬౩.

నామము. ఉభ. దే. వి. (క. నామ. త. నామం.) బొట్టు, తిలకము. "గీ బవిరలును గొప్పువల యంను బడఁతి రొూర్తు, దిద్దెఁ గస్తురినామంబు దీర్చె నోర్తు." య. ౪, ఆ. ౯౦. చంద్రా. ౪, ఆ. ౨౭౨. సం. వి. న్. న. 1. నామధేయము, పెట్టినపేరు; 2 ప్రాతిపదికము; 3. వాచకము, ఒకవస్తువునకు జనులు వాడుకొను పేరు.

నామరుల్లు. దే. వి. బ. (నాము+మరులు) పాచికలు. "చ. బలితపుఁ బద్మజాండ మనుపాళిఘుటించి చటమీఁదఁ బడ్డజీవు లనెడుసారె లుంచి రహి 'పుట్టఁగ నష్టిహి'రెందు నామముల్, కలిగిన నామరుల్ గొని యలౌకిక చిత్రదురోదరంబుగా, నలరమతోడ నాడుకమలాత్మునడు మైకొనెఁ గంటె జూదమున్." చమ. ౧, ఆ. ౯౮,

నామవాచకము. సం. వి. అ. న. సంజ్ఞావాచకము, ఒకదాని పేరు చెప్పుశబ్దము. విణ. (అ.చి కా.అ.) నామమును చెప్పునది. (శబ్దము.)

నామశేషము. సం. విణ. (అ ఆ. అ.) చచ్చినది, మృతము.

నామానుశాసనము. సం. వి. అ. న. నిఘంటువు.

నాము. దే. వి. (దీనిమువర్ణమునకు వృత్తియందు పజ్వర్ణము ఆదేశ మగును.) జొన్న లోనగువాని కొయ్యగాలున చిగురించిన మొలక. (దీనిని పశువులు మేసినచో మృతి నొందును అని శ. ర. లేకగా, నుండుజొన్నపైరు. దీనిని మేసినపశువులకు ఉంగిడిరోగము తగులును అని. బ్రా.) "ద్వి. కుమతులై కర్మశాస్త్రముల వెంబడిని, భ్రమసియో యిలఁ గుక్కపాలు ద్రాగుటనో, మఱి నాము మేసియో మలిమాలినట్టి, యఱవ పాఱులమాట లవనీశ వినకు." బస. ౫, ఆ. ౮౫౫, పం. స్వా. ౫, ఆ. ౨౬; 2. గింజలేనివరి మొ. వాని ఎన్ను. (బ్రా.; 3. వడ్రంగి కత్తినాముతో కట్టిపై నూటిగా తీర్చురేఖ." (చూ. నాములు తీయు.)

నాములుతీయు. దే. స. క్రి. (నాములు+తీయు.) వడ్రంగి బల్లమొదలగువానిపై గీతలేర్పఱచు. (వా.)

నామూషీ. హిం. వి. అవమానము. (వా.)

నాయఁకరము. ద్వ. వి. (నాయకుఁడు+కరము— శ. ర.) ఆధిపత్యము. "గీ. నీవు తలమావి పీడని నిసువువయసు, నాఁడె జేజేలదళవాయి నాయఁకరపుఁ, బట్టమున నిల్చి తారకుఁ గిట్టి చాఁద, తరరణక్రీడ యొనరించుతఱి మహాత్మ." పాండు. ౨, ఆ. ౧౪౫.

నాయఁకవాడీ. ద్వ. వి. సేనాధ్యక్షుఁడు. "వ .. రాహుత్తులును రాహుత్తులకుం దోడు తుపాకి వేట్లకు నిల్లుపోషక గుఖులుగుఖుల్లనం బరిఖాక్రోడంబునం బడి...ఒడ్డునకుం దేలిన మెండొడ్డు నాయఁకవాడీలును..." రా. వి. ౫, ఆ. ౩౨.

నాయఁకవాళి=నాయఁకవాడీ. (శ. ర.)

నాయఁకుఁడు. వై. వి. (సం. నాయకః.) 1. అధిపతి. "గీ....అలరఁ గఱకునా నెఱకునాయంకుఁ డొకఁడు, పాడగనఁగ వచ్చెఁ గొలువున్నపుడ మితేని." చంద్రా. ౨, ఆ. ౩౮, ప్రబంధ. ౧౬; 2. స్వల్పసేనకు అధిపతి. (పన్నిద్దఱుభటుల కధిపతి అని శ. ర.) "చ. వికలరథప్రయత్నుఁ బృథివీపతిఁగన్గొని ద్రోణపుత్ర కర్ణకృపులుఁ దక్కనుం గలుగునాయఁకులున్ రయమార వచ్చి..." భార. కర్ణ. ౧, ఆ. ౧౮౫, భార. ద్రో. ౨, ఆ. ౯౬; 3. ఉద్యోగి, మణియగాఁడు. "వ... ద్వారవతి నామకం బగుపురం బతిమనోహరంబుగా నిర్మించి పురవాస్తవ్యులు బంధుమిత్రులు సేనాపతులు నాయంకులుం దగు నెలవుల నిలువం దాను నభినవం బగురాజమందిరంబున వసియించె..." హరి. ఉ. ౨, ఆ ౧౦౭.

నాయఁకురాలు. ద్వ. వి. (నాయఁకుఁడు+ఆలు.) శ్రేష్ఠురాలు. "ద్వి. నాతల్లి నాయకన్నా యంకురాల, యేతవం బొనరించి యీపుత్త్రుఁ గంటి." ద్వి. సిం. భాగ. ౧, ఆ. ౯, పు.

నాయఁడు. వై. వి. (సం. నాయకః.) 1. ప్రభువు. "గీ వినుమ నాయఁడ నామాట పీను లలర." నీలా. ౧, ఆ. ౯౩, ప్రబంధ. ౨౧౬; 2. శూద్రులలో కొందఱునామాంతమున నుండు బిరుదు. ఉదా:— రామయ్యనాయఁడు మొ; 3 ప్రియుఁడు; భర్త. "ఉ. తోయధిరాజుకుం బోడమి తోయజవాసినితోడఁ బుట్టి యూ, తోయరుహాప్తుజం టగుచు తోయజనేత్రునకున్ మఱదివై, త్రోయఁగ రానిచీఁకటులఁ ద్రోయుచుఁ జల్లని తెల్వి చెందియున్, నాయమె నీకుఁ జెంగలువనాయఁడ నాయెడ నింత సేయఁగన్." రాధికా. ౨, ఆ. ౯౦. విణ. శ్రేష్ఠుఁడు. "ఉ. గొల్లలనాయఁడై పరఁగుకుంభకుమంద నదేమి వింతయో, కల్లరి గిబ్బ లేదు పొడగట్టి కుజం గడుగాసిఁ బెట్టుచున్." నీలా. ౨, ఆ. ౫౪, శా. వి. ౩, ఆ. ౩౬. చూ. నాయఁడు.

నాయకము. సం. వి. అ. పుం. హారమునడిమిరత్నము.

నాయకుఁడు. సం. వి. అ. పుం. 1. ప్రియుఁడు, భర్త; 2. ప్రభువు; అధిపతి; 3. శృంగారరసాలంబన పురుషుఁడు. (వీరు మువ్వురు: పతి, ఉపపతి, వైశికుఁడు. అందు పతి అనుకూలుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని నలు తెఱఁగులవాఁడు; 4. సాధారణ నాయకుఁడు. (అలం. వీరు ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు అని నలువురు.); 5. సేనాధిపతి. విణ. (అ. యి. శా. అ.) 1. పొందించువాఁడు, ప్రాపకుఁడు; 2. నడుపువాఁడు; 3. ముఖ్యుఁడు, ప్రధానుఁడు; 4. శ్రేష్ఠుఁడు.

నాయన. దే. వి. (నా+అన.) తండ్రి, జనకుఁడు. "సీ. అబ్బ నాయన యయ్య యనఁ దండ్రి యన నప్ప యన జనకాఖ్య కా నగని వేళ్." ఆం. సం. మాన 3. భార. ఆది. ౧, ఆ. ౩౬౨. వా? 2. ఇది వాత్సల్య సంబోధనమందును సంబోధ్యశబ్దమునకు మాఱుగాను ప్రయోగింపఁబడును. (శ. ర. వా.)

నాయము. ఉభ. వై. వి. (సం. న్యాయః. క. నాయ.) పాడి, ధర్మము. "చ...భవదీయ సంగమం, బని శముఁ గోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి నేను గోరఁగా, నను జనయిత్రి వంచు నొకనాయముఁ బల్కెదు వక్రభావలన్." భార. అర. ౧, ఆ. ౩౬౨. నైష. ౪, ఆ. ౯౯. విణ. న్యాయయుక్తము. (వ్యవ.) సం. వి. అ. పుం. 1. నడపుట; 2. పొందించుట; 3. ఉపాయము; 4. నీతి, నయము.

నాయి. ఉభ. దే. వి. (క. నాయి. త. నాయ్ ) కుక్క. "గీ... దొంతులు చేరి నాయి, దోర్ప నేర్పుఁ గాకది యేమి నేర్ప నేర్చు." కు. సం. ౧, ఆ. ౨౯. సం. వి. ఈ. స్త్రీ. దిక్కు.

నాయిక. సం. వి. ఆ. స్త్రీ. 1. భార్య; 2. రాణి, ప్రభ్వి; 3. శృంగార రసాలంబన స్త్రీ. (ఈమె స్వీయ, పరకీయ, సామాన్య అని మూఁడు తెఱఁగులది. అష్టవిధనాయికలు:—స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.)

నార. దే. వి. 1. వల్కలము, నారబట్ట. "ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో, భారమునం గృశుం డయినబ్రాహ్మణుఁడు. .." భార. అర. ౨, ఆ. ౩౬౬. ఆం. భా. ప్ర. ౧౩౧; 2. చెట్టుపైచర్మము. "క. వీరుద్ధ్రుమిథున వేళన, కై రతిపతి యేయ దుస్సి వారితద్య్వలీఁ బైనారెగయఁ బొటమరించిన, నారసములమొన లనంగనన లవి మించెన్." ఆము. ౪, ఆ. ౧౧౯, కుచేల. ౨, ఆ. ౪౩; 3. తాటిమట్ట, జనుము మొ. వాని తడప. "క...పసికిఁ దలుగు లమరించుటకై, నారలు గావలె నవి..." శుక. ౨, ఆ. ౩౩౮. శివ. సా. ౯౯౩.

నారంగము. సం. వి. అ. పుం. నారింజచెట్టు. న. 1. పిప్పలిరసము; 2. ముల్లంగిచెట్టు; 3. నారింజపండు.

నారంగుఁడు. సం. వి. అ. పుం. 1. విటుఁడు; 2. కవల పిల్లలలో నొకఁడు.

నారకము. సం. వి. అ. పుం. నరకము. విణ. (అ. ఈ. అ.) నరకసంబంధమైనది.

నారకీయము. సం. విణ. (అ. ఆ. అ.) నరకసంబంధి.

నారచీర. ద్వ. వి. (నార+చీర.) నారతో చేసినబట్ట. "సీ. రంగారుబంగారు చెంగావులు ధరించు శృంగారవతి నారచీర లూనె." ఉ. రా. ౬, ఆ. ౩౨౦. (ఇట్లే నారబట్ట.)

నారశెల్ల. దే. వి. (నార+శెల్ల.) మత్స్యభేదము. "ఆ. చీరచింపు శెల్ల నారశెల్ల...బంటు వారి కెల్లఁ బంచి యిచ్చె." ద్వా. ౧, ఆ. ౨౪౦.

నారట్టము. సం. వి. అ. పుం. బీఁటికనేల. (శ. ర.)

నారణపక్కి. వై. వి. (సం. నారాయణపక్షి.) పక్షి విశేషము. (శ. ర.)

నారదబ్బ. దే. వి. (నార+దబ్బ.) 1. నారంగముచెట్టు. "సీ...నారద బ్బనఁగ నారంగాభిధానమై ప్రబలుచుండు." ఆం. భా. ద్వి. ౪౬; 2. ఒకదినుసుదబ్బచెట్టు. (శ. ర. వా.)

నారదము. సం. వి. అ. పుం. 1. నారంగము, నారింజచెట్టు. "రగడ. తనుమధ్య దగె నారదమున నీనఖరములుఁ ఘనకురంటకకంటకములు చానఖరములు." ఉ. రా. ౬, ఆ. ౬౧. ద్వి. పరమ. ౪, ఆ. ౨౬౯. 2. పర్వతవిశేషము. "వ. ఇవ్విధంబున వసుదేవ నందనుండు నేమును...నారదంబుఁ బరిభ్రమించి ...హిమాచలం బెక్కి హేమకూటంబు ద్రొక్కి నిషధం బతిక్రమించి నిమిషంబున." ఉ. హరి. ౧, ఆ. ౩౭.

నారదుఁడు. సం. వి. అ. పుం. ఒకానొక దేవర్షి. విణ. (అ. ఆ. అ.) 1. జ్ఞానమునిచ్చువాఁడు; 2. జలమునిచ్చువాఁడు.

నారపాచే. దే. అ. క్రి. (నార+పాచు.) (భయాదికముచే) కట్టుబట్ట తొలఁగు. "పంచచామరము. అలంతులయ్యె కూర్మమస్తకాదు లైనజోదు ల, బ్బలారివెన్ను జూచి నారపాచినాఁడ కాని నేఁ, డలంఘ్యబాహుశక్తిఁ దావకాజిలోన నంచు..." కకు. ౨, ఆ. ౧౨౬.

నారమడి. దే. వి. (నార+మడి.) నారతో నేసినబట్ట. (శ. ర. ఇది మడికి పనికివచ్చును. వా.)

నారము. సం. వి. అ. పుం. 1. జలము; 2. అప్పుడు పుట్టినదూడ, తర్ణకము. న. 1. నరులసమూహము; 2. జ్ఞానము. విశే. (అ. ఆ. అ.) నరసంబంధమైనది.

నారళ్లు. దే. వి. బ. ధాన్యవిశేషము. "వ... వెన్న ముద్దలు దాళువాలు నారళ్లు రామబాణాలు..." ప్రబంధ. ౧౧౨.

నారసము. వై. వి. (సం. నారాచః.) 1. శరము, బాణము. "క. చేరి వికర్ణునికరి నొక, నారసమునఁ గూల్చి కదిసి నరపతి నొంచెన్." భార. విరా. ౫, ఆ. ౨౯౭. భార. భీష్మ. ౨, ఆ. ౩౭; 2. బాణవిశేషము, అచ్చయినుపబాణము. "వ... శరంబుల శిరంబులఁ ద్రుంచియు... నారసంబుల నీరసంబులు చేసియు..." విక్ర. ౪, ఆ. ౯౦, ఉ. రా. ౩, ఆ. ౩౫౪; 3. చోరసాధనవిశేషము. "చ... కొంకి నారసము నాదిగఁ గల్గినసాధనంబు ల, న్నియు సమకూరఁ జేసికొని నేర్పున నేఁగితి ముచ్చుప్రొద్దునన్." దశ. ౯, ఆ. ౭౨.

నారసింహుఁడు. సం. వి. అ. పుం. నరసింహావతారము ధరించిన విష్ణువు.

నారాచము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. ఇనుపబాణము; 3. గంటము, తాటియాకులమీఁద వ్రాయుసాధనము; 4. నీటియేనుఁగు; 5. దుర్దినము.

నారాజీ=నరాజీ. (కత్తి, ఖడ్గము.) "శా. ఘోరాజిం దన తేజిఁ దోలి విమతక్షోణీశ లాధీశులన్, నారాజిం దెగటార్చి వీరభటసన్నాహంబుతోఁ జేరు..." బహు. ౧, ఆ. ౫౧, చంద్రా. ౨, ఆ. ౬౯.

నారాయణగౌళ. సం. వి. ఆ. స్త్రీ. ముప్పదిరెండు నపుంసకరాగములలో నొకటి. "సీ. గౌళ నారాయణగౌళ వసంతవరాళి పున్నాగవరాళి శంక, రాభరణమును..." ప్రబంధ. ౯౭, హంస. ౫, ఆ. ౧౨౪.

నారాయణపక్షి. సం. వి. న్. పుం. పక్షివిశేషము.

నారాయణము. సం. వి. అ. న. 1. ఒకానొకతైలము; 2. తైత్తిరీయోపనిషత్తులలో కడపటిది.

నారాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. లక్ష్మి; 2. దుర్గ, పార్వతి; 3. శక్తి; 4. ఒకానొకస్త్రీరాగము. "గీ... నారాయణియును, గ్రమత నిరువదినాల్గు స్త్రీరాగములును." ప్రబంధ. ౯౫, హంస. ౫, ఆ. ౧౨౩.

నారాయణీయము. సం. విశే. (అ. ఆ. అ.) నారాయణ సంబంధమైనది

నారాయణుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు. "క. నారము లనఁగా జలముల పే రయనం బనఁగ నెలవు ప్రీతిగ నాకున్, నారము లయనం బగుటను, నారాయణుఁ డం డ్రు జనులు నన్నుఁ గిరీటీ." భార. శాం. ౬, ఆ. ౪౨౧; 2. నారాణఋషి. (నరనారాయణులలో నొకఁడు.)

నారాశంసము. సం. వి. అ. పుం. 1. మంత్రభేదము; 2. పితృదేవతలసోమపానార్థ మగు చమస పాత్రము; 3. అగ్ని, నిప్పు.

నారాశంసులు. సం. వి. అ. పుం. బ. పితృదేవతలు.

నారి. ఉభ. వై. వి. (సం. నాడీ. క. త. నారి.) వింటియల్లెత్రాడు. "గీ. అపుడు విల్లెక్కు పెట్టి వాలారు దూపు, నారిఁ గూర్చి నిశాచరనారిఁ గూర్చి, కాఁడ నేసెఁ దదీయవక్షస్థలంబు, రాఘవుఁ డమోఘతరశరలాఘవుండు." రామా. ౪, ఆ. ౩౩, ఆం. భా. ద్వి. ౨౦౧; 2. నరము. (చూ. నారికుఱుపు.) సం. వి. ఈ. స్త్రీ. 1. మానవస్త్రీ, ఆఁడుది; 2. భార్య. "సీ. తా నారి యై యుండఁగా నజుం డాత్మజఁ గవిసె భారతి చేర్పుకలిమి యొంత." కు. సం. ౭, ఆ. ౧౨౫. [(వా.)

నారింజే. వై. వి. (సం. నారంగః.) నారంగముచే.

నారికడము. వై. వి. (సం. నారికేళః.) 1. కొబ్బెర చెట్టు. "గీ. నారి కడమపనులు నారికడమునీడఁ, జేయఁ దలఁచె దేమొ చిగురువాలు, శంబరాసురారి జళిపించుచున్నాఁడు, తగునె నీకు డాఁగఁ దలవరెదుట." సాంబో. ౪, ఆ. ౨౧౭; 2. కొబ్బెరకాయ. (చూ. నాల్కడము.)

నారికాయ. ద్వ. వి. (నారి+కాయ.) అల్లెత్రాటి తాఁకుడువలన చేతులయందు కలిగెడు కాయ, కిణము. (శ. ర.)

నారికుఱుపు. ద్వ. వి. (నారి+కుఱుపు.) నరముమీఁద వేసెడికుఱుపు, నాడీవ్రణము. (శ. ర. వా.)

నారికేడము. వై. వి (సం. నారికేళః.) కొబ్బెరచెట్టు. "చ......అరుణింపు బొండ్లములనారికేడంబులు వజ్రకుట్టిమం,బగుపథముం జెలంగుభవనావృత శేషితరత్నరశుక, భృగతరుసంతతిం బ్రథమభార్యఁ బురిం గిరవుంచి వార్ధి నాన్." ఆము. ౧, ఆ. ౫౪, అచ్చ. సుం. ౨౫.

నారికేళము. సం. వి. అ. పుం. కొబ్బెరచెట్టు.

నారుచేయు. దే. స. క్రి. నాఁడఁజేయు. (శ. ర.)

నారువ. దే. వి. వృక్షవిశేషము. "సీ. నారువ సుర పొన్న వారిజమును బొన్న నెల్లి మూలుగుబిల్లు నెమిలియడుగు." హంస. ౪, ఆ. ౧౧.

నాఱు. దే. వి. నాఁటుటకై విత్తనములు ఒత్తుగా చల్లి మొలిపించిన మొలకలసమూహము. "సీ. కల్ప వృక్షమునాఱుకై పడి యున్నది..." శ్రీరాధా. ౩, ఆ. ౫, ఆం. భా. ద్వి. ౩౫.

నాఱువోయు. దే. అ. క్రి. (నాఱు+పోయు) నాఁటుటకై ఒత్తుగా విత్తనములు చల్లి మొలకలు మొలిపించు. "ఉ...తత్తనూ, వల్లికతోన మైఁ బులకపర్గము కాముఁడు నాఱువోయఁగన్." నిర్వ. ౮, ఆ. ౩౧, భార. విరా. ౨, ఆ. ౫౨. (ఇట్లే: నాఱుపోయు. శివరా. ౧, ఆ. ౭౫.)

నాలవకొలము. ద్వ. వి. (నాలుగు+కొలము.) చతుర్థకులము, శూద్రజాతి. "సీ. కోయిల నాలవ కొలముదోయాదుల కేలుకోఁ జిగురాకు నేల యొసఁగు." కువల. ౩, ఆ. ౯౬.

నాలవకొలమువాఁడు, ద్వ. వి. శూద్రుఁడు. "సీ. శూద్రనామంబులు శోభిలు నాలవకొలమువార లన గాపు లని పల్క..." ఆం. భా. ద్వి. ౨౮౨. (ఇట్లే నాలవజాతివాఁడు. భార. విరా. ౧, ఆ. ౨౧౮.)

నాలవవాఁడు. దే. వి. (నాలుగు+వాఁడు.) 1. చతుర్థుఁడు, నాల్గవవాఁడు; 2. శూద్రుఁడు. "ఉ. పాలితసత్యధర్మ మగుబ్రహ్మకులంబునఁ బుట్టినట్టి నన్, నాలవవానిఁ జేయఁ దగునా యనఁబోకు దిగీశ్వరాళిలో నాలవవాఁడవై బహుధనస్థుఁడవై మనుమంచు మన్ననన్, లాలనచేసి ధాత యొక నవ్యవిమాన మొసంగి యెంచియున్." ఉ. రా. ౧, ఆ. ౪౨౮. (వైరెండర్థములకు నిది యుదాహరణము.) ఆం. సం. మాన. ౨; 3. నాలుగవతరము వాఁడు. "ద్వి. బ్రహ్మనాలవవాఁడు పరమసాహసుఁడు, బ్రహ్మచే వరములు పడసినవాఁడు." రం. రా. బా. ౨౩. పు.

నాలాయకు. హిం. విణ. తగనిది, లాయకుకానిది.

నాలి. దే వి. అల్పకృత్యము; నీచపు బని. "ఆ. కూలి నాలిఁ జేసి గుల్లాపుఁబని చేసి, తెచ్చిపెట్టు నాలు మెచ్చనేర్చు, లేమిఁ జిక్కువిభుని వేమాఱు దిట్టును..." వేమన. ౧, భా. ౬౩, పాండు. ౩. ఆ. ౬౫; 2. కపటము. "రగడ. ననలు వేఁడిన మొఱఁగి తప్పడు నాలి నాలికుచంబు ముట్టకు." పారి. ౪, ఆ. ౧౬; 3. పరిహాసము, వేళాకోళము. "సీ. సతిమోమునకుఁ దమ్మి సరియంటిమా భువనంబులోఁ మిగులంగ నాలియయ్యె." చమ. ౨, ఆ. ౪౯. విణ. 1. కుత్సితము, అల్పము. "గీ. కుటిలవర్తనంపుఁగులమున జన్మించి చెడుగులకును బుద్ధి చెప్పఁ గాని, పుణ్యనిధివి నిన్నుఁ బొందొందుభాగ్యంబు నాలిదైవ మేల నాకు నిచ్చు." మల్హ. ౩, ఆ. ౧౨౮. స్వా. ౩, ఆ. ౫; 2. నిజము కానిది, కల్లయైనది. "వ...రొద లేనినాలియేడ్పు లేడ్చుప్రియల ననునయింప... చెక్కుటద్దంబులు నొక్కి..." స్వా.. ౩, ఆ. ౨౮, విప్ర. ౫, ఆ. ౫౫, క్రి. విణ, తేలికగా. "సీ. బ్రహ్మాండ మనుచిప్పఁ బ్రాణికందుకముల నాలి యాడుదు నొంటిప్రేలఁ బట్టి." ప్రబోధ. ౩, ఆ. ౩౮.

నాలిక. దే. వి. జిహ్వ, నాలుక. "వ...నాలికలు పేలికలవిధంబునందూలందూలుట గనుంగొని..." జై. ౭. ఆ. ౧౦౦. రాజ. చ. ౨, ఆ. ౧౪౫.

నాలికచేఱు. ద్వ. వి. (నాలిక+చేఱు.) 1. తృణవిశేషము. (శ. ర); 2. పశువులజిహ్వరోగవిశేషము. "ద్వి. నరుదకప్పను నీరు నాలిక చేర్లు... ఆదిగా నెన్నఁగలపసరాలరోగములకు..." నవ. ౧, ఆ. ౩౦.

నాలిగాలి. దే. వి. మందమారుతము. "క. అని వనిత నాలిగాలిం, గనలుచు బోనాడి తుహినకరకిరణ ఝరిన్, మునుఁగఁ జనఁ జెలులు గని హా, యని వనరుచు..." వసు. ౪, ఆ. ౫౧. (ఇట్లే నాలిగాడ్పు, నాలితెమ్మెర. మొ.)

నాలితనము. ద్వ. వి. (నాలి+తనము.) నైచ్యము, అల్పత్వము. "ఆ. ఇదియనాకు మీఁకు నిక కేవర

ద్వేష, హేతు వనుచుఁ దోఁచె నేకతన్వి, భూతి జెరపునేను ఋంవ్యక్తులకు నాలి, తనముతో సమాఖ్య మనుచు బెట్టు." రాఘవ. ౨, ఆ. ౯౩; 2. వంచనము. "గీ. నాలితనములు మానవె నాలి యేల, యేలవాడుదు చూడుమా యేలలీల." రాజ. చ. ౨, ఆ. ౧౮౩; 3. మాంద్యము. "ఉ. నాలితనంబు నేర్చికొని నక్కుచు నక్కుచు వాడవాడ వే లాలవలీలతావలికెలంకులనుం డిటు వచ్చి వచ్చి రంభోళియుఁ బోలె మీఁదఁ బడి పోయెదు..." రామా. ౭, ఆ. ౮౭ (ఇది రెండవయర్థమునకు నుదాహరణము.)

నాలిజాతము. ద్వ. విశే. (నాలి+జాతము) కుత్సితుఁడు; కుత్సితురాలు. ఆం. సం. మాన. ౧౧.

నాలిముచ్చు. దే. విశే. (నాలి+ముచ్చు.) 1. కుత్సితము; 2. మందము. "ఆ. తగినమాట యొకటి మొగమెత్తి సేయక యంచలార యాలకించి వినుఁడు, తెలివి గలుగువారికెలన నుండెడు మీకు, నాలిముచ్చునడక నడక గాదు." చంద్రా. ౮, ఆ. ౫౫. (పైరెండర్థములకు నిది యుదాహరణము.)

నాలుక. దే. వి. 1. జిహ్వ. "మత్తకోకిల. నావుడు న్నటుమాటలాడఁగ నాలు కాడుకయుండె..." భార. స్త్రీ. ౧, ఆ. ౧౭౫. భా. రా. యు. ౭, ఆ. ౮౨; 2. అగ్నిజ్వాల, మంట. "గీ. నాలుకల గ్రోయుసర్వసానలము దడిసి, యెరగొనంగని సంతృప్తి యొసకమెసఁగు." భార. ఉద్యో. ౮, ఆ. ౧౨, భార. ద్రో. ౫, ఆ. ౨౫౯. ఇ. సర్పజిహ్వకలు. "గీ. అప్రమత్తుండ వగుచుఁబద్మాక్ష నీవు, మ్రింగుదువు చాల నాఁకట వ్రేగుచుండి, నాలుకలు గ్రోయుభూరిపన్నగము వాతఁ, బడిన యెలుకను భక్షించుపగిది ననఘ." భాగ. ౮, స్కం. ౭౨౯. భా. రా. యు. ౧౩౬౯.

నాలుకబెల్లము. దే. వి. (నాలుక+బెల్లము.) మాటల తీపి, వాఙ్మాధుర్యము. "క. వికచముఖుఁ డగుచు శాత్రవులకు హితులగునట్టివారలం గని భూపా, లకుఁ డెడ్డకత్తెరయు నాలుకబెల్లమునై మనంబు లుం గనవలయున్." భార. శాం. ౩, ఆ. ౨౬౯.

నాలుగు. దే. స. వి. మూఁడునొకటి. (దీనికివృత్తియందు 'నాల్గు, నాల్, నలు, నల్' అనురూపములు కలవు.) "చ...పది మోనియందుఁ గ్రిక్కిఱియఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్..." భార. విరా. ౩, ఆ. ౨౧౫. కాశీ. ౫, ఆ. ౩౩౩. విశే. అల్పము, కొంచెము. "గీ. ఎఱిఁగినవి నాల్గు నొడువ నెట్లని లెస్స." ఆము. ౮, ఆ. ౬౯.

నాలుగుమూలలాట. దే. వి. బాలికాక్రీడావిశేషము. "సీ. అచ్చనగండ్లు దోయాలును దాఁగిలిమూఁతలు నాలుగుమూలలాట." దశా. ౯, ఆ. ౯౧.

నాలువు = నాలుగు. "క. ధ్రువమండల మాదలగా, రవిమండల మడుగు గాఁగ రాజిలుపదునాల్గు లక్షలయోజనముల, భువనము త్రిదివ మిది భోగ భూమి నృపాలా." కళా. ౩, ఆ. ౬, విక్ర. ౧, ఆ. ౧౦.

నాల్క = నాలుక. (జిహ్వ.) "గీ. నాసికాగ్రంబు వంగుట నాల్క నల్ల, నగుట వదనంబు గడు నెఱ్ఱ నగుట...అయు వడఁచు." మార్క. ౩, ఆ. ౩౫౩. (ఇ. సర్పజిహ్వకలు) "చ. ఫణాఫలకంబు విచ్చి..మణిమయ పీఠమధ్యమున నాల్కలు గ్రోయుచునున్నవాసుకిన్..." నైష. ౫, ఆ. ౨౫, హరి. పూ. ౭, ఆ. ౧౦౫.

నాల్కడము = నారికడము. (కొబ్బెరకాయ.) "ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మనియాల నేతితో, బెల్లముతోడ నాల్కడపుఁ బేసెము తోడను నిమ్మపండ్లతో...ఊర్వశి పెట్టె భిక్షమున్." హార. ౫, ఆ. ౮౬.

నాల్గుకన్నులవేల్పు. దే. వి. అగ్ని. "సీ. నాల్గుకన్నుల వేల్పునకు వేల్పు వెన్నని చేసి మే లేమియుఁ జెందకున్న." అచ్చ. బాల. ౨౯. పు.

నాల్గుగంబములయాట. ద్వ. వి. బాలికాక్రీడావిశేషము. ఇందు. ౨, ఆ. ౧౮౩.

నాల్నాఁడు. దే. వి. (నాలుగు+నాఁడు.) 1. నాలుగవనాఁడు చేయుపని (ఋతుస్నానము.) "ఆ. కలితకీర్తిశాలి కశ్యపుఁ డొకనాఁడు, మానవతియుఁ జెలఁగుమాసి యనల, నామలీర్థవారి నాల్నాఁడు చేసిన, యలివఁ గాంచి ప్రముదితాత్ముఁ డగుచు." వరాహ. ౮, ఆ. ౬౧; 2. నాలుగవదినము. "గీ...సవిత్రుఁ డుదయించిన నాల్నాఁట జలకమాడి, చూడ నెవ్వారిఁ బురుషునిఁ జూచి కాని." కాశీ. ౨, ఆ. ౭౨.

నావ. ఉభ. వై. వి. (సం. నౌః. క. నావె. త. నావాయ్.) ఓడ, కలము. "సీ. ఓడ నావ

యనంగ నొప్పుచుండుఁ దరణి..." ఆం. భా. ప్ర. ౧౫౭. కేయూర. 3, ఆ. ౯౫౪. సం. వి. ఔ. స్త్రీ. ఓడ, తరణి.

నావాశ్రమము. సం. వి. అ. పుం. ఓడరేవు. భార. అర. 3, ఆ. ౯౫.

నావి. దే. వి. సస్యరోగవిశేషము. (శ. ర.)

నావికుఁడు. సం. వి. అ. పుం. 1. ఓడ నడుపువాఁడు, కర్ణధారుఁడు; 2. ఓడమీఁద ప్రయాణముచేయు వాఁడు.

నావుడు. దే. అవ్య. క్ర. (అను ధా.) అనినపిమ్మట. "మత్తకోకిల. ఏమి కారణమయ్యె పాముల కేల యల్గితి వీవు తేజోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు నావుడున్..." భార. ఆది. ౧, ఆ. ౧౫౪. ఉ. హరి. ౨, ఆ. ౨౨.

నావురు = నాఁగురు. (వృక్షవిశేషము.) "వ...కమ్మ తావులు కలనావురాకులు వఱచి..." స్కా. ౪, ఆ. ౬౦. ఆం. భా. ద్వి. ౬౨.

నావ్యము. సం. వి. అ. న. నవ్యత, క్రొత్తదనము. విణ. (అ. ఆ. అ) నావచే దాఁటఁదగినది.

నాశనము. సం. వి. అ. న. 1. నశింపఁజేయుట; 2. కనఁబడకుండఁజేయుట. విణ. (అ.ఆ. అ.) నాశము చేయునది. (అ. ఈ. అ.) నశింపఁజేయుటకు సాధనమైనది.

నాశపడు. మి. అ. క్రి. నశించు. (చూ. నాశపఱచు.)

నాశపఱచు. మి. స. క్రి. (నాశపడు ధా. ప్రే.) నాశముచేయు. "క. పవనజజంఘాసంభవ, పవనము వడిఁ గడలిఁ బాయపడ నడఁచి మహా,వివరమునకుం జొరఁబడి, పవనాశనకోటి నాశపఱచి గమించెన్." రామా. ౬, ఆ. ౯౭.

నాశము. సం. వి. అ. పుం. 1. చేటు; 2. చావు, మృతి; 3. కనఁబడమి, అదర్శనము; 4. పాఱిపోవుట.

నాశయిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) నశింపఁజేయు వాఁడు.

నాశితము. సం. విణ. (అ. ఆ. అ.) నాశముచేయఁ బడినది.

నాశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నశింపఁజేయఁ దగినది.

నాస. సం. వి. ఆ. స్త్రీ. 1. ముక్కు, ఘ్రాణేంద్రియము; 2. ఏనుఁగుతొండముకొన; 3. ద్వారముపై నుండుఅడ్డకఱ్ఱ; 4. ధ్వని, శబ్దము.

నాసత్యులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీకుమారులు, దేవవైద్యులు.

నాసాపుటము. సం. వి. అ. పుం న. ముక్కుచెరము, ముకుపుటము,

నాసామణి. సం. వి. ఇ. పుం. ముక్కఱ. (శ. ర.)

నాసి దే. వి. పిల్లి, మార్జాలము. (శ. ర.) విణ. నికృష్టము. (వా.)

నాసిక. సం. = నాస.

నాసిక్యము. సం. వి. అ. పుం. అనునాసికధ్వని. న. ముక్కు, నాసిక. విణ. (అ. ఆ. అ.) 1. నాసికయందు పుట్టినది; 2. నాసికయం దున్నది

నాసిరిల్లు. వై. అ. క్రి. నశించు. (శ. ర.)

నాసిలు. వై. అ. క్రి. నవయు, క్షీణించు. "క. ఈ సరణిఁ గామతంత్రా,భ్యాసపరిశ్రాంతి మిగులఁ బరవశ మైనన్, నాసిలి ధాతుక్షయమై, మాసము లోపలన వాఁడు మరణము నొందున్." జై. ౫, ఆ. ౧౦౦. పి. శకుం. ౨, ఆ. 3౭.

నాసీరము. సం. వి. అ. పుం. 1. ముందు నడచు సేన; 2. సేనాముఖము, అనిమొన. విణ. (అ. ఆ. అ) ముందు పోవునది.

నాసీరుఁడు. సం. వి. అ. పుం. సేనకుముందు నడుచు యోధుఁడు.

నాస్తి. సం. అవ్య. క్రి. (న+అస్తి.) లేదు. "చ. నిలుకడ సున్న వాని నహి వేస్తము నాస్తి భయంబు లేదు..." శశా. ౪, ఆ. ౧౭.

నాస్తికత. సం వి. ఆ. స్త్రీ. = నాస్తిక్యము.

నాస్తికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. పరలోకము లే దనునమ్మకము కలవాఁడు; 2. దేవుఁడు లేఁ డనునమ్మకము కలవాఁడు; 3. వేదప్రమాణబుద్ధి లేనివాఁడు.

నాస్తిక్యము. సం. వి. అ. న. దేవుఁడు లేఁడనియు పరలోకము లేదనియు నమ్ముట, వేదమందు ప్రమాణబుద్ధి లేకుండుట.

నాస్యము. సం. వి. అ. న. (ఎద్దుమున్నగువాని) ముకుఁత్రాడు.

నాహరీగడలు. దే. వి. బ. వాద్యవిశేషములు. "ఉ. ముందఱ నాహరీగడలు మ్రోయఁగ ఘంటావళి వెంట నంటి రావందిజనమ్ము గ్రక్కి కయివారముఁ జేయఁగ..." ఉ. హరి. ౪, ఆ. ౧౧౩.

నాళము. ఉభ. దే. వి. లాడము, గుఱ్ఱపుగిట్టలకు వేయుఇనుపరేకు. (శ. ర.-వా.) సం. వి. అ. పుం.

తామరలోనగువానికాడ. న. 1. క్రోవి, గొట్టము; 2. నరము, నాడి; 3. కత్తిపిడి; 4. రంధ్రము; 5. మగగుఱి. అ. పుం. జలనిర్గమము, నీరుపోవుటకై యేర్పఱచినగొట్టము.(తూముకాలువ లోనగునది.)

నాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరలోనగువాని కాఁడ; 2. నరము, నాడి; 3. వాతాదినాడి; 4. వృక్షవిశేషము. ఈ. స్త్రీ. 1. (గోఁగు మొదలగు వాని) నార; 2. గడియకాలము; 3. తామరతీఁ; 4. ప్రణాళి, జలనిర్గమమార్గము.

నాళిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తామరలోనగువాని కాఁడ; 2. క్రోవి, గొట్టము; 3. గడియకాలము; 4. రంధ్రము; 5. ప్రాయ్యాసందు.

నాళికము. సం. వి. అ. పుం. 1. తామరతీఁ; 2. తామర పూవు; 3. దున్న, మహిషము; 4. పిల్లనఁగ్రోవి, వేణువు.

నాళీకము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. బాణపు ములికి; 3. కొబ్బెరచిప్పతో చేసినకమండలువు; 4. ఇనుపనాళము కలఆయుధము. (తుపాకి మొ.) న. 1. తామరపువ్వు; 2. తామరతంపర, పద్మ సమూహము.

నాళీకాసనుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.

నాళీకిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతంపర; 2. తామరకొలను.

నాళీలు. దే. వి. బ. భక్ష్యవిశేషము. "సీ. ఎడలవెన్నెల చక్కి రిడి జోగు వెన్నెలఁ బూనిక నాళీలు గాను గూర్చి. గీ. పండువెన్నెల యనువెండిపళ్లెర ములఁ, జెలఁగి యిల్లాండ్రు వడ్డింపఁ జెలులుఁ దాము, వేడుకలు మీఱ బువ్వంపుఁగూడుఁ గుడిచి, పొదలుతమితోడ వెన్నెలపులుఁగు లమరె." య. ౨, ఆ. ౭౩.

## ని

ని. ఉభ. దే. అవ. 1. ద్వితీయైకవచనమందు వచ్చెడి ఒకప్రత్యయము. "ఉదా:—రాముని, కృష్ణుని. మొ; 2. భూతార్థకోత్తమపురుషైకవచన ప్రత్యయము. ఉదా:-చూచితిని. మొ; 3. వ్యతిరేకత్వ వర్జ్యకార్థమున వచ్చుప్రత్యయము. ఉదా:-చేయని, వ్రాయని. మొ; 4. కొన్నిపదములకు ద్వితీయా ద్యేకవచనము పరమగునపుడు వచ్చుఆగమము. ఉదా:-రామునిచేత, రామునికి. మొ; 5. గుణ వాచకము మున్నగు కర్మధారయసమాసమందు వచ్చెడి యాగమము. ఉదా:-తెల్లని. మొ. సం. అవ్య. 1. అధికము. అతిశయము. ఉదా:-నిపీతము. మొ; 2. అభావము, లేనిది. ఉదా:-నిధనుఁడు. మొ.

నింక = ఇంక. దే. అ. క్రి. నశించు. "ఉ. శంక యొకింత లేక ద్విజసంఘము లెల్లెడఁ గూడి పాప ముల్, నింక మడఁపరీమనువు నీమముతో నుపదేశ మొంది..." ఉద్భ. 3, ఆ. 3౧3.

నింకె. అ. దే. అవ్య. క్రి. విణ. శీఘ్రముగా. (శ. ర. బ్రా.)

నింగి. దే. వి. 1. ఆకాశము, అంతరిక్షము. "గీ. ప్రాగ్దిశాకాంత నిండుగర్భంబునందు, సూర్యుఁ డుద యింపఁ బ్రొద్దులు చొచ్చి యుండ, మొదలఁ దీండ్రించులేఁత క్రొమ్మెఱుఁగులయొండ, నింగి యింగిలి కాన నభ్యంగ మార్చె." కాశీ. ౧, ఆ. ౧౨౪. భార. ఆది. ౬, ఆ. ౨౫౧; 2. స్వర్గము. (చూ. నింగిమ్రాను.)

నింగిచూలి. దే. వి. నభస్వంతుఁడు - గాలి. "గీ... నింగిచూలి మబ్బులపగదాయ గాలి...అన మారుతాఖ్య లగు..." సాం. ని. దేవ. ౧3.

నింగిపడు. ద్వ. అ. క్రి. (నింగి+పడు.) (సూర్యాదులు) అస్తమించు. "ఆ. సీత నట్టుపేక్షసేసి మిన్నక యుంకి, నఖిలభూతములకు నధిపునల్కఁ, బట్టపగలు నింగిపడియె నా పేనారుజోంధకార మడల నపుడు కప్పులు." భా. రా. యుం. ౭౪. ఉ. హరి. ౫, ఆ. ౭౪.

నింగిమిరి. దే. వి. సువర్చలతీఁ. (శ. ర. బ్రా.)

నింగిముట్టు. దే. అ. క్రి. (నింగి+ముట్టు.) ఆకసము నంటు, అత్యధికమగు. "వ...రథచక్రఘోషంబు లును గేతనపటపటాత్కారంబులు నింగిముట్ట..." శశాం. ౫, ఆ. ౨౧, నీలా. 3, ఆ. ౧౦.

నింగిమ్రాను. దే. వి. (నింగి+మ్రాను.) కల్పవృక్షము, సురతరువు. "మ. కురిసెన్ జల్లున నింగి మ్రానివిరి చిన్కుల్ దేవతాదుందుభుల్, మొరసెన్..." ఉ. హరిశ్చ. ౪, ఆ. ౯౯.

నింగిసిగ. ద్వ. వి. (నింగి+సిగ.) వ్యోమకేశుఁడు శివుఁడు. "ఉ. క్రొన్నెలతాల్పునింగిసిగకన్ గనుఁగందనిపూలదండయున్." రామా. ౫, ఆ. ౧౬, (శ. ర. పా.)

నించు. దే. స. క్రి. (నిండు ధా. ప్రే.) 1. నిండఁ జేయు, నిండించు. "సీ. సీధుతీరసలిలంబు నించి

గాంచనకలశముల మజ్జనమార్పఁ జనవు లేదు." వరాహ. ౭, ఆ. ౪౮, వసు. ౫, ఆ. ౧౨౩; 2. నెఱవేర్చు, సఫలమొనర్చు. "ఉ. నిండువు నాదుకోర్కెఁ గమనింతువు కేళి కహర్నిశంబు నా,నింతువు ఱొమ్ము గుబ్బలఁద నింతువు పౌరుష కేళిచేత..." శశాం. ౪, ఆ. ౮౦; 3. వ్యాపింపఁ జేయు. "ఉ. నించితి సజ్జనస్తుతుల నిర్మల మైన యశంబు దిక్కులన్." భార. ఆది. ౨, ఆ. ౨౦౩; 4. కలిగించు. "మ ..తటిద్దేహాకు నవ్యపత్త్రలతి కాశ్రీ నించి రాళీజనుల్." వసు. ౫, ఆ. ౧౨౦. రాఘవ. ౧, ఆ. ౧౧; 5. ఉంచు, పెట్టు. "గీ రౌహిణేయుండు భుజబలోత్సాహ మెసఁగఁ, జటులరథమున శస్త్రాస్త్రసమితి నించి. ఉ. హరి. ౩, ఆ. ౩౯, పారి. ౨, ఆ. ౬౩; 6. పోయు. "ఉ...ఆ, వన్నెలప్రోకయాదలను వావిరిబల్ తెలిముత్తియంపుఁబ్రా, లెన్నఁడు నింతు..." నీలా. ౧, ఆ. ౧౯౨. ఇందు. ౬, ఆ. ౫౩; 7. ఏయు, ప్రయోగించు. "క. మెఱుఁగారునార సమ్ములు, దఱుచుగ నించితిఁ గడంగి తద్గాత్రము నన్." భార. ఉద్యో. ౪, ఆ. ౩౨౦. నిర్వ. ౬, ఆ. ౧౩౫; 8. (పుష్పాదులు) చల్లు. "క. అసమ భయభక్తు లలరఁగఁ, గుసుమంబులు దోయిలించి కోమలి నించెన్, గిసలయభంగంబులతో, నసదు నడుము వణఁక మృదునియడుగులమీఁదన్." హర. ౩, ఆ. ౭౪, వసు. ౪, ఆ. ౧౬; 9. కలుపు, చేర్చు. "సీ. ప్రత్యూషహృతనూత్నభాండ శీతాంబువు వేలారజము నించి కోలువారు." ఇందు. ౩, ఆ. ౯౬, య. ౪౦; 10. పొందు. "సీ. జేవురించినకంటిచిగురుచాఱలతీరు సిందూర తిలకంబుచెలువు నించె." హర. ౪, ఆ. ౮౮, కువల. ౩, ఆ. ౧౦౮; 11. కటాక్షించు, చూచు. "ఉ. పంచశరుండు తత్పరత బాణ విమోక్షణకాలములం బ్రతీక్షించుచు గౌరి శంకరునిఁ జేరినయప్పటినుండి యెప్పుడున్, నించునొకో హరుండు తరుణీమణి నంచును వింట నారి సారించుచు నుండెఁ జింత..." హర. ౩, ఆ. ౭౭; 12. పాఁతించు. "వ...మొకముల బాడ లరసి..." వలలు హత్తించి మాటులు పెట్టించి తెరువులు గట్టించి పోటుకోలలు నించి..." ఇందు. ౨, ఆ. ౬౦; 13. ఆవరించు. "మ...తాదాత్వికమోదఖేదగుణశీతాశీతనేత్రాంబు లా, ననముల్ నింప గుహుండు రాఘవునకున్ వందారుఁడై యిట్లనున్." చం. రా. ౪, ఆ. ౬౪; 14. వెలువఱచు. "ఉ...నీమదిలోఁ గలమర్మ మిప్డు నిక్కముగఁ జెప్పు నీకలికికన్నుల నీరిటు, నించనేఁటికే." వేం. మా. ౫, ఆ. ౩౯, నైష. ౨, ఆ. ౮౭.

నింట. దే. వి. (నిండు ధా.) జలపూరము, వెల్లువ; "ఉ. అంటినఁ గందు మేనుఁ బస నారెడుజవ్వన మున్ రసంబుపై, న్నింటలఁ గూర్చు కావుము..." హరి. ఉ. ౭, ఆ. ౯౪, ౪, ఆ. ౩౦, విణ. ప్రేరకుఁడు. "ద్వి. విరహులబలుమంట విబుధులపంట, సురతంబులకు నింట సొబగులపొట." నవనాథ. ౨, ఆ. ౮౧, పు.

నిండఁబడు ద్వి. అ. క్రి. (నిండన్ + పడు స్వార్థమున.) వ్యాపించు. "ఆ. ఎన్నఁ బెక్కులగుచు నెక్కడఁ జూచిన, నడచువారు నడువఁగడఁగువారు, విడియువారు మఱియుఁ బిడెత్తువారునై, నేల యీనినట్లు నిండఁబడిరి." భా. రా. యు. ౨౮౪.

నిండారు. దే. అ. క్రి. (నిండు+ఆరు స్వార్థమున.) 1. పూర్ణమగు. "సీ. నిండారుచందురునిమపారు నుచుఁగాంతిఁ జెలువగా మరుఁడు సృజించినట్లు." మార్క. ౩, ఆ. ౯౧, నైష. ౧, ఆ. ౯౬; 2. అతిశయించు, అధికమగు. "మ...ఉద్యోగాదులుం గూడఁగాఁ, బదివేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం, దుదిముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్." భార. విరా. ౧, ఆ. ౭, విక్ర. ౧, ఆ. ౫౪; 3. వ్యాపించు. "మ. అఱజాబిల్లిమెఱుంగుబాసి కముచాయం బూనఁగాఁ దారకల్, నెరయన్ జల్లిన నీసఁబ్రాలకరణి న్నిండార..." శశాం. ౨, ఆ. ౬, ఆము. ౪, ఆ. ౫౩; 4. కడచు, అతిక్రమించు. "క. లలిఁ జాలింతతనంబులఁ, దలరెడు నమ్ముద్దునేలదాలుపునవలా, తలమానికముల కటుల,న్నెల లేర్పడఁ దొమ్మిదియును నిండారుట యున్." అచ్చ. బాల. ౮౩.

నిండించు. దే. స. క్రి. (నిండు ధా. ప్రే.) 1. నెఱవేర్చు, సిద్ధింపఁజేయు. "క. కుండలములఁ గవచము నట్టుండఁగని మ్మనఘ వేఁడు మొందు ధనంబుల్, నిండింతు నీమనోరథ, మొండేఘియు

ననకు మింక నూర్జితచరితా." భార. అర. ౭, ఆ. ౩౬౧; 2. వ్యాపింపఁజేయు. "శా. ఆకాశంబు వెలుంగఁ దోఁచె..." రాకాచంద్రదివాకరానల శిఖారత్నప్రభాజాలరే, ఖాకాంతిం బురుషుం డొకం డచట లోకం బెల్ల నిండించినన్, మా కన్నుంగవ గిట్టిరూప మని సమ్మంజాల వయ్యెన్ నృపా." ఉ. హరి. ౨, ఆ. ౫౦; 3. నిండఁ జేయు, నింపుకొను. "గీ. భూరిరవిరోచిఁ గాలెదు పుడమి వెడఁద, పెనముపైఁ బండువెన్నెల పేరి యట్టు, మంట మీఱినయాడట మఱియు మఱి యుఁ బొట్ట నిండించె లేఱినిపుఁలుఁగుదుటుము." కాళిందీ ౪, ఆ. ౪౮, విరాట. ౮, ఆ. ౧౮.

నిండు. దే. అ. క్రి. 1. (జలాదులచే) పూర్ణమగు. "గీ. తనువున హిమానితాశ్లేషజనితపులక, రాజ కైతవమున రాగరసము నిండి, ధైర్య మనుకట్ట నగలింప..." దశా. 3, అ. ౧౫, విక్ర. ౧, ఆ. ౯౦; 2. నెఱవేఱు, సఫలమగు. "గీ. ఆర గింవఁ జతుర్విధాహారములను, మనసుకోరిక నిండంగ మునిగణంబు." కాశీ. ౭, ఆ. ౧౮౭. హరి. ఉ. ౧౦, ఆ. ౧౨౦; 3. అధికమగు, అతిశయించు. "గీ. శారదాదేవి మామకస్వాంత వీథి నిండుకేడుక విహరించుచుండుఁ గాత." సైమ. ౧, ఆ. ౫, హరి. ఉ. ౯, ఆ. ౧౦; 4. వ్యాపించు. "ఉ...దిక్కులం, జెచ్చఱతూపు తండములు సింహరవంబులు నిండె నొక్కటన్." పారి. ౫, ఆ. 3, దశా. ౨, ఆ. ౨౦౩; 5. (ఆయువు మొ.) ముగియు, మూడు. "సీ. తగ ధనుర్గుణ మీవు తెగ నిండఁ దీసిన దివిజారివరుల కాయువులు నిండు." ఉ. రా. ౧, ఆ. ౩౨౪. కాశీ. ౪, ఆ. ౪౦; 6. కడచు, అతిక్రమించు. "మ. నవమాసంబులు నిండఁగా గురుఁడు కేంద్ర స్థాయియై యుండఁగా, శివలగ్నంబున నుద్భవించె సుతుఁ డర్చిష్మంతునంశంబునన్..." కాశీ. ౪ ఆ. ౯; 7. పూర్తియగు, సర్వాంగసంపూర్ణమగు. "గీ. వలపు గలిగిననిండుజవ్వనిని వనినిఁ, గలయుం గంటెను సౌఖ్యంబు గలదె వేఱె." దశా. 3, ఆ. ౨౪, భార. ఉద్యో. ౨, ఆ. ౧౫౯; 8. సంతోషించు. (చూ. నిండుకొను.) వి. పూర్ణత. (వా.) విశ. పూర్ణము. (శ. ర.)

నిండుకొను. దే. స. క్రి. (నిండు+కొను స్వార్థమున.) 1. సంతోషించు. "క...నిన్నుం, గనుఁగొంటిం బండు వయ్యెఁ గన్నులకును నా,మన మిపుడు నిండుకొనియెన్..." కళా. ౨, ఆ. ౫౦, ఉ. రా. ౧, ఆ. ౧౩౮; 2. అయిపోవు, ఖర్చగు. (వా); 3. వ్యాపించు. "సీ. ప్రేతవనాయాతశీత విభూతినికరంబు చెమ్మైన నిండుకొనఁగ. గీ. రుద్రుఁ డేశిశ మెలఁగెడుకాద్రమునను." దశా. 3, అ. ౫౨, భీమ. ౨, ఆ. ౧౦౧; 4. అతిశయించు. "క. గుండియ జల్లన మదిలో, నిండుకొనినభీతి నావినిర్మలచిత్తుం, డుండక నలుగడలకు నయ్యండ విడిచి పఱవఁ దలఁచునాసమయమునన్." శివ. ౨, ఆ. (శ. ర.)

నిండుదొర. దే. వి. (నిండు+దొర.) ధీరుఁడు. "క. మండిపడి పీనితల గొట్టుండటు గొనిపోయి నావుడున్ రావణుతో, నిండుదొర తదనుజుం డనఘుండు విభీషణుఁడు వలికెఁ గోప మడం గన్." రామా. ౬, ఆ. ౨౩౭.

నిండువన్నెలు. ద్వి. వి. బ. (నిండు+వన్నెలు.) వస్త్ర విశేషములు. "సీ. నిండువన్నెలు మంచినిగమ గోచరులు సామంతవీథులు ప్రతిమలును బోగడ, పచ్చలును..." ప్రబంధ. ౨౭౨.

నింద. సం. వి. ఆ. స్త్రీ. 1. అపవాదము; 2. నిందించుట, గర్హణము.

నిందకుఁడు. సం.విశ. (అ. దిశా. అ.) నిందించువాఁడు.

నిందత్. సం. (శత్రు.) నిందించుచున్న.

నిందనము. సం. వి. అ. న. నిందించుట, దూఱుట.

నిందనీయము. సం. విశ. (అ. ఆ. అ.) నిందింపఁదగి నది, గర్హ్యము.

నిందాస్తుతి. సం. వి. ఇ. స్త్రీ. పైకి నిందవలెఁ గనఁబడు స్తుతి, వ్యాజస్తుత్యలంకారభేదము. (అలం.)

నిందించు. సం. స. క్రి. దూషించు, దూఱు. "వ. ఆ సంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల గొఱింగిరయేని." "క. ముందటిధంగిన కానల,యందుఁ జరింపంగవలదె యది నీవును నేఁడుం దెచ్చినయాపదగా, నిందింపరె తొల్లవారు నీరజనయనా." భార. విరా. ౨, ఆ. ౧౮౦, ౧౮౧. కాశీ. ౪. ౧౦౯.

నిందిత. సం. విశ. (పు. స్త్రీ. పు.) = నిందకుఁడు.

నిందితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. గర్హితము; 2. నిషేధింపఁబడినది; 3. నీచము, అధమము; 4. తిరస్కరింపఁబడినది.

నిందితవ్యము. సం. = నిందనీయము.

నింద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిందింపఁబడుచున్నది.

నింద్యము. సం. = నిందనీయము

నింపాది. దే.విణ. (నింపు+అది) 1. సమృద్ధము. ఉదా: కొలనిలో నీళ్లు నింపాదిగా నున్నవి. (శ. ర.); 2. సుఖితము. (వ్యవ) అతఁడు నింపాదిగా నున్నాఁడు.

నింపారు = నినుపారు. (శ. ర.)

నింపిరి. దే. వి. మలము. "సీ. మలవాచకం బగు మనటు నింపిరి మస్తు..." ఆం. భా. ద్వి. ౧౩౪.

నింపు. దే. స. క్రి. (నిండుధా. ప్రే.) 1. వ్యాపింపఁజేయుట. "చ...నల్లడలఁ బ్రసూనకోరకనికాయము నింపిన సొంపు మెంపురన్." వసు. ౧, ఆ. ౧౪౭; 2. కలిగించు. "వ...పాదవు కెంపు సొంపు నింపు విడికెంపురవచెక్కడంపుఁ బసిఁడి గద్దియ నధివసించి .." దశా. ౧, అ. ౧౪; 3. నిండఁజేయు, పూరించు. "ఆ...ఆసంది, యొచటి కరుగఁబోక యొటుకునింట, గంజికడుగు చేతఁ గడుపు నింపుచుఁ గొంత,కాల ముండె జాతిగతుల నంత." చెన్న. ౫, ఆ. ౫౭. స్వా. ౪, ఆ. ౭౫. వి. బలుపు, సమృద్ధి. "సీ. పయ్యెదకొంగులోపలఁ బిక్కటిల్లెడు నెవ్వఁగుఁ జన్నులనింపుసొంపు. గీ. కలికి..."కావ్యా. 3, ఉ. ౪౧. విణ. 1. సమృద్ధము, అధికము. "ఉ. నిద్దపుఁ జెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప..." కళా. ౬, ఆ. ౫౩౭; 2. మనోజ్ఞము. "మ. కలయం గిన్నరగీతిఁ గూడ మృదురేఖం బాడు మత్తాళిసం,కులము ల్గింపురుషాంగనాతతియొలుంగుల్ వించుభావించుమా.తెలుఁగు ల్నింపుగ నిచ్చుకోవెలలు..." శు. సం. 3, ఆ. ౧౭.

నింబము. సం. వి. అ. పుం. వేము.

నింబుపు. సం. వి. ఊ. స్త్రీ. ఒకజాతినిమ్మచెట్టు.

నికటము. ఉభ. దే. వి. (క. నికటము) నిర్బంధము. (శ. ర.) సం. వి. అ. పుం. న. సామీప్యము. విణ. (అ. ఆ. అ.) ఆసన్నము, దేశకాలములచే సన్నిహిత మైనది.

నికము. దే. క్రి. విణ. యథార్థముగా. "గీ. క్షీణ సంకల్పజాలుఁడౌ జీవుఁ డొందు నికము బ్రహ్మత్వమును..." అధ్యా. ఉ. ౫౪౬. పు.

నికరము. ఉభ. దే. విణ. శ్రేష్ఠము. "గీ. నీవు చదివిన చదువులో నికర మైనపద్య మొక్కటి చదివి యేర్పాటు గాఁగ,నర్థ మెఱిఁగింపుము......" దశా. ౪, ఆ. ౧౫౭. కృష్ణ. పీఠి. ౧౪. ఆం. భా. తృ. ౧౫. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. సారము; 3. నిధి; 4. న్యాయముగా నిచ్చినధనము.

నికర్తనము. సం. వి. అ. న. కత్తిరించుట, ద్రుంచుట.

నికర్షణము. సం. వి. అ. న. 1. ఇల్లు మొదలగునవి యావరించి యున్నప్రదేశము, నివేశనస్థలము; 2. గ్రామకంఠము, పట్టణము పల్లె లోనగువాని బయటిభూమి.

నికష. సం. వి. ఆ. స్త్రీ. రాక్షసమాత.

నికషము. సం. వి. అ. పుం. 1. ఒరయిక,రాపు; 2. గీటురాయి, ఒరగల్లు; 3. కత్తులు మొదలగునవి సానఁబట్టుసాధనము; 4. గీటురాతిపై రాచిన బంగారు మున్నగువానిగీత ; 5. పరీక్షార్థమై ఒరగంటిపై గీచుబంగారు లోనగునది.

నికషాత్మజుఁడు. సం. వి. అ. పుం. నైరృతుఁ డను రాక్షసుఁడు.

నికషోపలము. సం. వి. అ. పుం. గీటురాయి.

నికామము. సం. వి. అ. న. తీవ్రేచ్ఛ. విణ. (అ. ఆ. అ.) 1. అధిక మైనది; 2. అధికమగుకోరిక గలది క్రి. విణ. 1. యథేచ్ఛము; 2. చాలునంత; 3. అత్యధికముగా.

నికాయము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. తెగ ; 3. నివాసము; 4. గుఱి, లక్ష్యము; 5. పరమాత్మ.

నికాయ్యము. సం. వి. అ. పుం. ఇల్లు, గృహము.

నికారణము. సం. వి. అ. న. చంపుట, మారణము.

నికారము. సం. వి. అ. పుం. 1. అవమానము; 2. చంపుట, మారణము; 3. బెదరింపు; 4. (ధాన్యాదులను) ఎగురఁబోయుట, తూర్పెత్తుట; 5. ధాన్యము ప్రోగగునట్లు ఎగఁదోయుట; 6. పండ్లు కొఱుకుట మొదలగువానివలనఁ గలుగుముఖవికారము; 7. అపకారము, కీడు. "క. వారలు సమయము దప్పిన, వారిజరిపుహితులగకు లవశ్యము

దప్పిన్, వారికి నకారణంబ నికారము సేకొడుకు సేసెఁ గడు నహితుండై." భార. అర. ౧, ఆ. ౧౦౪. విణ. (అ. ఆ. అ.) దుష్టము, శఠము. "ఉ. కోయిలనోరు సోఁకనిచిగుళ్లు నికారపుఁజిల్కఖిన్నముల్, సేయనిపండ్లు..." వేం. పంచ. ౪, ఆ. ౧౨౮.

నికాశము. సం. వి. అ. పుం. 1. సమీపము; 2. ప్రకాశము. విణ. (అ. ఆ. అ.) తుల్యము, సాటియైనది.

నికాషము. సం. వి. అ. పుం. ఒరపిడి, రాయిడి.

నికుంచకము. సం. వి. పుం. 1. సోల; 2. నీటిప్రబ్బలి.

నికుంజము. సం. వి. అ. పుం. న. 1. పొదరిల్లు; 2. గుహ; 3. గుహవలె నుండుగది

నికుంభము. సం. వి. అ. పుం. దంతి, నేపాలములి.

నికుంభుఁడు. సం. వి. పుం. 1. శివానుచరులలో నొకఁడు; 2. కుంభకర్ణునికొడుకు; 3. ప్రహ్లాదుని కొడుకు; 4. సుందోపసుందులతండ్రి.

నికురంబము. సం. వి. అ. న. సమూహము.

నికురుంబము. సం. = నికురంబము.

నికృంతనము. సం. వి. అ. న. 1. కత్తిరించుట, త్రుంచుట. విణ. విణ. (అ. ఈ. అ.) త్రుంచునది, కత్తిరించునది.

నికృతము. సం. వి. అ. న. వంచన. విణ. (అ. ఆ. అ.) 1. అవమానింపఁబడినది; 2. నిందింపఁబడినది; 3. వంచింపఁబడినది; 4. నీచము; 5. కపటహృదయము గలది, శఠము. 6. త్రోసివేయఁబడినది.

నికృతి. సం. వి. ఇ. స్త్రీ 1. బెదరింపు; 2. వంచనము; 3. దైన్యము; 4. నిందించుట; 5. నిరసించుట, త్రోసివేయుట; 6. భూమి.

నికృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) నఱకఁబడినది, త్రుంచఁబడినది, "ఆ. హతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్నచాపుఁడును నికృత్తసారథియును నయ్యె..." భార. విరా. ౫, ఆ. ౧౫౦. హరి. ఉ. 3, ఆ. ౧3౭.

నికృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) అధమము, నీచము.

నికేతనము. సం. వి. అ. న. ఇల్లు, గృహము.

నికేతము. సం. వి. అ. పుం. ఇల్లు, గృహము. "శా. లింగం బున్నగుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మాతంగంబుం బుఱుడించుచున్..." భార. విరా. ౨, ఆ. 33౦.

నికోచనము. సం. వి. అ. న. ముడుఁగుట, ముకుళితమగుట.

నిక్కచ్చి. దే. వి. 1. నిర్బంధము; (వ్యవ: వాఁడా యప్పునకై నన్ను నిక్కచ్చి చేయుచున్నాఁడు. (శ. ర.); 2. సారము. "ఆ. పాఱు డొక్కఁ డొకఁడు పడుచువాఁడిట వచ్చి, పోయి యొకఁడ చిక్కెఁ బోటుబంటు, కలుగు వాఁడువ నుప్పఁ గలుపోలె నిక్కచ్చి, చేరువాని కోఁడువాఱె మీఱు." కళ. ౨, ఆ. ౧౧౭.

నిక్కపుజగము. ద్వ. వి. (నిక్కము+జగము.) సత్యలోకము. "గీ. పుడమి వీరికెఁ జొరరానియెడలు లేవు, మీఱి నిక్కపుజగమైన దూఱి వాలుఁ, గంటిచందంబు చెలిసి రాఁగలరు మీరు, నెల వోసంగిన నంచుఁ జెచ్చెర నతండు." అచ్చ. కిష్కిం. ౭౬.

నిక్కపుటాలు. దే. వి. (నిక్కము+ఆలు.) ధర్మపత్ని. "క. ఎక్కువ కులం బతనికిని, నిక్కపుటాలైన దాని నీచకులుం డుక్కెక్కఁగ బలిమిం గలిసినఁ, దక్కని చంపుటయె రాజధర్మం బెందున్." విజ్ఞా. ప్రా. ౧౦౭.

నిక్కము. దే. వి. 1. యాథార్థ్యము. "క. మేనలకల్లను జీవుఁడు, తానే గోవిందుఁ డొకఁడు తండ్రీ యున్నాఁడా నిక్కము తన కబ్బెను..." నృసిం. ౪, ఆ. ౧౫౮. స్వా. ౨, ఆ. ౫౧; 2. సత్యవాక్యము. "గీ. మంచి నిక్కము గలవాని మాట నమ్మి." దశ. ౬, ఆ. ౧౧౮. ఆ. భా. ప్ర. ౧౧౯, 3. శాశ్వతత్వము, త్రికాలాబాధ్యత. "క. అమృతమయ బుగ్యజుస్సామ ద్వచస్సమాజములకు వాచ్యమయిన పురుషోత్తము నిక్కము రూ పగువాని భక్తిగమ్యుఁ దలంతున్." భార. శాం. ౨, ఆ. ౨. విణ. 1. యథార్థము, నిజమైనది. "ఉ. నిందుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణాఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మీరెండును రాజులందు విపరీతము..." భార. ఆది. ౧, ఆ. ౧౦౦; 2. సిద్ధము, అసందిగ్ధము. "గీ. చావు నిక్కంబు బ్రదుకుట సంశయంబు." కాశీ. ౨, ఆ. ౧౭౪. దశా. ౪, అ. ౧౨౫; 3. సార్థకము. "వ... అతనికిఁ బరజి త్తనునిక్కంపుఁ జేరివాఁడు పుట్టె ..." హరి. పూ. 3, ఆ. ౧౨3. క్రి. విణ. నిశ్చ

యమునగా. "మ. నిను మద్దామకుతూహలోత్తరు నిఁగా నిక్కం బెదం గాంచి .." హరి. ఉ. ౨, ఆ. ౧౫౪.

నిక్కముచేయు. దే. స. క్రి. (నిక్కము+చేయు.) దృఢపఱుచు. "క. జక్కవలకు రవి యుదిఁ బ్రాగ్దిక్కుధరం బెక్కు ననుచుఁ దెలియఁ ద్రివాచన్, నిక్కముచేసిన తెఱఁగునఁ, గొక్కొక్కొ రుతులఁ గోడి కూయఁదొడంగెన్." వరాహ. ౪, ఆ. ౧౬౪.

నిక్కల. దే. వి. (నిక్కము+కల) నిజమైనకల, యథార్థస్వప్నము. "గీ. అనుచు నత్యంత మోహశోకార్తి, నాథుమెడ వట్టికొని యేడ్చె నలినవదన, అకట కల యిట్లు నిక్కల యగునె? యనుచుఁ, బనవె విభుఁడు..." మార్క. ౧, ఆ. ౨౬౩. పండి. ౪, ప్ర. ౨౫౯, పు. ఆం భా. ప్ర. ౧౪౨.

నిక్కలము = నిక్కము. (యాథార్థ్యము, నిజము.) "క. నిక్కముగఁ జెప్పుచున్నను. గ్రక్కున నీశిరము ద్రుంతు ఘనఖడ్గముచే, దిక్కెవరు నన్ను వల దన, నక్కజముగ నిక్కలంబు నానతి యీవే." సురా. ౧౨౯.

నిక్కవుడు. వై. వి. (సం. నిష్కపటః.) నిష్కాపట్యము. "సీ...నిష్కపటాభిధ నిక్కవు డంచన నెగడు చుండు." ఆం. భా. ప్ర. ౧౩౮.

నిక్కవోడుచు. దే.అ. క్రి. (నిక్కు+అ+పోడుచు.) నిక్కున నిలుచు (శ. ర)

నిక్కాఁక. దే. వి. (నిండు+కాఁక.) మిక్కిలికాఁక. (కుంభకర్ణుఁడు.) "వ...సౌమిత్రి యేయు నేటులు దను నాఁటిన గీటుగొనినపాటి గాక పోకకునిక్కాకం బోక రాకాసిం దునుమతూపు కల్గునొకో యని వేల్పులు వెక్కసపడి చూడ..." రామా. ౮, ఆ. ౧౫౧. విణ. నిండుకాఁక గలది. (శ. ర.)

నిక్కించు. దే. స. క్రి. నిక్కుధా. ప్రే.) నిగుడఁ జేయు, పైకెత్తు. "క. తెక్కలు విదలిచి యాఁకలు ముక్కునఁ జక్కంగ దిద్ది ముందటికి మెడల్, నిక్కించి మిన్నుఁ జూచుచుఁ, గొక్కొరొకో యంచి కూసెఁ గొల్లనకోళ్లల్." సురా. ౧౧౫. పాంచా. ౧, ఆ. ౧౯౯.

నిక్కిచూచు. దే. స. క్రి. (నిక్కి+చూచు.) చక్కఁగా చూచు, సోఁకు. "సీ. నిక్కిచూడఁగఁ జాలె నే యంబరీషుని దుర్వాసుఁ డొనరించు దుర్ణయములు." విప్ర. ౪, ఆ. ౪౯.

నిక్కిడు. దే. అ. క్రి. (నిక్కు+ఇడు) నిక్కు, పైకిలేచు. "సీ. కన్నులు గదలఁ గన్బొమ్మలు నిక్కిడ నారజమ్మునఁ గూలి బేరమాడి." శుక. ౪, ఆ. ౭

నిక్కు. దే. అ. క్రి. 1. నిగుడు; పైకిలేచు. "మ. సకలాంగంబులు నిక్కి దీపకలికాస్తంబులై యుండ్రు పాయక చూడామణి లొప్పు రాజసుని శుద్ధాంతంబులన్ శేషవాసుకి కర్కోటక తక్షక ప్రముఖచక్షుశ్శ్రోత్రబృందారకుల్." హర. 3, ఆ. ౫. పారి ౧, ఆ. ౧౭౪; 2. హెచ్చు, వర్ధిల్లు. "ఆ. మించి వృశ్చికాదిపంచమాసముల నొక్కొక్కగడియ రాత్రి నిక్కి నడచు దినములందు నెల్ల దిగజాఱు నొక్కొక్క, గడియ నెలకుఁ దప్పు గారమునకు." భాగ. స్కం. ౨, ఆ. ౭౮; 3. పొంగు, పొరలు. "చ. నెల యుదిర్పైన మన్నయనసీరజముల్ వికసిల్లు నెట్లు దా,నెలయు రసాంబురాశి వడి నిక్కఁగ." కాళిందీ. ౬, ఆ. ౭౫; 4. ఉబ్బు, ఉబుకు. "సీ. ఘనకుచంబులు నిక్కి గంధర్వకామినుల్ ధవళాతపత్త్రముల్ దాల్చి నడువ." భా. రా. సుం. ౧౭౪. ఆము. ౧, ఆ. ౫౯; 5. అధికమగు. "ఉ. లెక్కకు నిక్కుజన్మముల లేఁతకుఁ దక్కున భక్తినే నతుల్ మిక్కిలి నీకొనర్చితి." కాళిందీ. ౫. ఆ. ౧౫; 6. వ్యాపించు. "సీ శ్రీగంధ వాసనల్ చిక్కంగ నిక్కంగ సారంగధరుఁ డని చేరఁబోవు." సా 3, ఆ ౨౩౮. చిత్రభా. ౪, ఆ. ౧౧౦; 7. సాఁగు, దీర్ఘమగు. "గీ. హారములు దూఁగఁ గొ నసియాడఁ దొడఁగ,వలచు నూర్పులు వెంపెక్క వళులు నిక్కఁ,గంకణధ్వను లల తాళగతుల నెనయ,గౌరి తలయంటె నొకమహోదారజఘన." కాళిందీ. ౫, ఆ. ౮౪. భీమ. ౪, ఆ. ౯౩౦; 8. పొడము, జనించు. "చ. ధరణీజనసంతతికిఁ గొరకదంతము లించుకంత ని,క్కినయది యాది గాఁగఁ దెలఁగెన్ వన లక్ష్మి..." ఆము. ౫, ఆ. ౧౧౬. శుక. ౨, ఆ. ౪౪౨; 9. సంతోషించు. "సీ. అందఱింద్లకు

వాసరమై యుండు నితఁ డని నిక్కుబందుగు లెంత
పొక్కువలయు." నిరం. ౨, ఆ. ౧౨౮. భీమ.
౨, ఆ. ౪౬; 10. గర్వము. "శా. నా సామ
ర్థ్యము నీవెఱుంగ వనిలో నక్తంచరశ్రేణి
సుల్లాసం బొందఁగఁ గూల్చి నిక్కెదవు వేల్ల
చ్చాపనిష్క్రాంతబాణాసారంబున నీప్రతాప
దహనవ్యాసంబు నే సార్చెదన్." భా. రా.యు.
౧౯౯౬. పారి. ౧, ఆ. ౬౬. వి. 1. ఔన్న
త్యము. "చ...అందు నేనుఁగుల్,దనరుచునుండు
సాకసము దాఁకెడు నిక్కున .." య. ౧, ఆ.
౭3. ప్రబంధ. ౧౬౮; 2. ఉబ్బు: పొటకరింపు.
"సీ. కెంగేలఁ బైఁటచెఱఁగు బిగించుచో
నిద్దంపుఁజనుఁదోయి నిక్కుదోఁప." కువల. ౨,
ఆ. 3౦; 3. బిగువు, బింకము. "ఉ. చన్నులు
నిక్కుదప్పెఁ గచసంతతిపై నర సూపెఁ జెక్కులం
జెన్ను దొలంగె..." జాహ్నవీ. ౪, ఆ. ౫౫;
4. అందము, ఒప్పు; విలాసము. "సీ. అసురీ
ముఖోజ్జ్వలహాసంబులకై వడి నిండారువెన్నెల
నిక్కు దక్క." భా. రా. యు. ౧౪3౧. అం
భా. ప్ర. ౧3౯.

నిక్కుఁబోతు. దే. విణ. (నిక్కు+పోతు) గర్వ
స్వభావము గలవాఁడు. (శ. ర.)

నిక్కుడు. దే. వి. (నిక్కు ధా.) ఉన్నతి. (శ. ర.)

నిక్కులాఁడి. దే. వి. (నిక్కులు+ఆఁడి) అంద
గత్తె. విలాసిని. "వ. అంత నొక్కనిక్కులాఁడి
యచ్చకక్కుఁదనాలకుప్ప కిట్లనియె." కాళిందీ. ౬,
ఆ. ౨౭.

నిక్కులించు. దే. స. క్రి. (నిక్కు ధా. ప్రే.)
నిగుడఁజేసికొను. "క. వలసిన మేపులఁ గొని కాళ్లు
లావులును నిక్కులించి...పులుఁగులు చట్టుప
లార్చుచుఁ, గొలకొలమని కూఁతలిడుచు గూడులు
సేరెన్." ప్రబంధ. ౬౧.

నిక్కువము = నిక్కము (సత్యవాక్యము.) "ఉ...
ఎట్టిచోఁ, బాయనినిక్కువంబులకుఁ బట్టు ధరిత్రిఁ
జగత్కృవిశ్వభూనాయకుఁడు..." కావ్యా. 3,
ఆ. ౬. విణ. (యథార్థము, నిజమైనది.) "చ.
అది గల గాదు నిక్కువము యై నటులున్నది
నాకు నెంతయున్." భార. అర. ౭, ఆ. ౨౫౪.
భార. విరా. ౨, ఆ. ౫౬. క్రి. విణ. (నిజ
ముగా) "ఉ. నిక్కువ మీవు సూర్యశశిరన్న ల
వంశజు లైనరాజులం, దొక్కమహానుభావు
తనయుండవు గావలయు న్నరోత్తమా." భార.
విరా. ౧, ఆ. ౧౮౧. హరి. ఉ. ౬, ఆ. ౧౧౮.

నిక్తము. సం. విణ. (అ. ఆ. అః) కడుగఁబడినది,
శుద్ధము చేయఁబడినది.

నిక్వణము. సం. వి. అ పుం. 1. ధ్వని; 2. వీణాధ్వని.

నిక్వాణము. సం. = నిక్వణము.

నిక్షణము. సం. వి. అ. న. ముద్దిడుట, చుంబనము.

నిక్షిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁ
బడినది, త్యక్తము; 2. ఉంపఁబడినది; 3. పాఁతఁ
బడినది, పూడ్వఁబడినది; 4. ఇల్లడపెట్టఁబడినది.

నిక్షేపకుఁడు. సం. విణ. (అ. పికా. అ.) నిక్షేపించు
వాఁడు.

నిక్షేపణము. సం. వి. అ. న. అడుగులు మొదలగు
వానిని ఉంచుట.

నిక్షేపణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁ
దగినది; 2. ఉంచఁదగినది; 3. పాఁతఁదగినది.

నిక్షేపము. సం. వి. అ. పుం. 1. చెప్పి చూపి యుంచిన
యిల్లడ, న్యాసము; 2. కుదువ, తాకట్టు; 3.
పాఁతిపెట్టినసొమ్ము, నిధి; 4. విడుచుట, త్యజిం
చుట; 5. ఉంచుట.

నిక్షేపించు. సం. స. క్రి. 1. దాఁచు, మఱుఁగు
పఱుచు. "వ. మఱియు విరాటనగరంబునకుఁ
జనుచుండి తత్సమీపశమీవృక్షంబునఁ
బాండవులు తమయాయుధంబులు నిక్షేపించి
తమ్మెవరు నెఱుంగ కుండ విరాటుం గొలిచి
యునికియు..."భార. ఆది, ౧, ఆ. ౪౦; 2.
నిలుపు, స్థాపించు. "వ. ఇవ్విధంబున ద్రుపద
పుత్త్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరి
హారణంబు హరిస్మరణంబ యని తన హృదయ
పుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని
..."భార. విరా. ౨, ఆ. ౧౦3; 3. పాఁతు,
పూడ్చు. "వ...అచ్యుతప్రేరితులై భీమార్జు
నాదులు దొల్లి మరుత్తుం డనురాజు మఖంబుసేసి
పరిత్యజించి నిక్షేపించిన సువర్ణపాత్రాదికం బైన
విత్తం బుత్తర దిగ్భాగంబువలన బలవంతులై
తెచ్చిన..."భాగ. ౧, స్కం. ౨౫౯. వేం.
పంచ. ౧, ఆ. ౭౦౦; 4. ఉంచు, పెట్టు. "శా.
చాపంబుల్ బటుబాణతూణయుగముల్ కాశా
సియుంగ్ వర్మముస్, భూపాలుండు విహార

రత్నముపయిం బూజాసమేతంబు నిక్షేపింపం దగువారిం బుచ్చి..." నిర్వ. ౧౦, ఆ. ౬౬.

నిక్షేపితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇల్లడ పెట్టింపఁబడినది; 2. చెక్కింపఁబడినది, వ్రాయింపఁ బడినది.

నిక్షేప్త. సం. విశే. (బు. స్త్రీ. బు.) నిక్షేపించువాఁడు.

నిక్షేప్తవ్యము. సం. = నిక్షేపణీయము.

నిఖనకుఁడు సం. విశే. (అ. నికా. అ.) 1. త్రవ్వువాఁడు; 2. పాఁతిపెట్టువాఁడు.

నిఖననము. సం వి. అ. న. 1. త్రవ్వుట; 2. పాఁతి పెట్టుట.

నిఖర్వము. సం. వి. అ. పుం. న. పదివేలకోట్లు, అయుంతకోటిసంఖ్య.

నిఖర్వుఁడు సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి పొట్టివాఁడు.

నిఖాతము. సం. విశే (అ. ఆ. అ.) 1. త్రవ్వఁ బడినది; 2. నాఁటఁబడినది.

నిఖిలము. సం. విశే. (అ. ఆ. అ.) సర్వము, సమస్తము. "గీ. యోగధర్మంబునకు నెక్కుడొక్కటి యుంను, నిఖిలమందును లే దిది నిశ్చయంబు." హరి. పూ. ౨, ఆ. ౧౫౫.

నిగణము. సం. వి. అ. పుం. హోమధూమము.

నిగదనము. సం. వి. అ. న. = నిగదము.

నిగదము. సం. వి. అ. పుం. 1. చెప్పుట; 2. స్పష్టముగాఁ జెప్పుట; 3. శబ్దము; 4. అర్థము తెలియకయే మంత్రాదులు చదువుట.

నిగదించు. సం. స. క్రి. స్పష్టముగాఁ జెప్పు. "క. మానుషజన్మము నొందిన, మానవులకు లభ్యమాన మరణంబులకు మహాజ్ఞానులకుఁ జేయవలయు విధానము నిగదింపఁబడియె. ధరణీనాథా." భాగ. ౨, స్కం. ౩౮.

నిగదితము. సం. వి. అ. న. చెప్పుట, భాషణము. విశే. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది; 2. స్పష్టముగాఁ జెప్పఁబడినది.

నిగనిగ. దే. వి. 1. కాంతివిశేషము; "క. అలచుక్కల నిగనిగ యౌ, పొలఁతీ నీకాలిగోరఁ బోలదు సుమ్మీ." సా. ౨, ఆ. ౨౨౨. స్వా. ౩, ఆ. ౯; 2. మెఱయుంట మన్నుగువానియం దగుననుకరణము. "వ...మెఱుంగులు వెనువెంటి మింటి డాఁక జిగి దగద్ధగ నిగనిగ వెలుఁగుటం జేసి..." భీమ. ౫, ఆ. ౮. కళా. ౨, ఆ. ౭౮. షణ. నిగనిగ యనుకాంతి కలది. (నిగానిగము వికల్పము.) "గీ. నిగనిగనిసంజకెంజాయపొగడు దెగడు, మోవి మానిక మాని." వసు. ౬, ఆ. ౧౫. హర. ౨, ఆ. ౧౭౭. ఇట్లే: నిగనిగన్నిగ, నిగన్నిగ. మొ.

నిగమగోచరులు. సం. వి. అ. న. బ వస్త్రవిశేషము లు. "సీ. నిండువన్నెలు మంచినిగమగోచరులు సామంతవీథులు ప్రతిమలును బొగడ, పచ్చలు... గీ. మెదలఁగా వల్వలు ధరించి ముదిత లపుడు." ప్రబంధ. ౨౭౭.

నిగమనము. సం. వి అ. న. 1. వేదమునుండి పదము నెత్తి చెప్పుట, అట్లెత్తిచెప్పినపదము; 2. లోనికి చొచ్చుట.

నిగమము. సం. వి అ. పుం. 1. వేదము; 2. వేదము నుండి యుద్ధృత మగువాక్యపదాది; 3. న్యాయశాస్త్రము, తర్కశాస్త్రము; 4. నిశ్చయము; 5. పట్టణము; 6. బజారు; 7. వాణిజ్యము; 8. వర్తకులసంఘము, సార్థము; 9. దారి, మార్గము.

నిగమి. సం. విశే. (న్. నీ. న్.) వేదముల నెఱిఁగినవాఁడు.

నిగమించు. సం. స. క్రి. తెలుపు, ఘోషించు. "వ...గృహస్థాశ్రమధర్మంబు లైనతురంగమేధాదియాగంబులచేతఁ బురుషుండు బ్రహ్మహత్యాది పాపంబువలన విడివడి నిర్మలుం డగు నని నిగమంబులు నిగమించు..." భాగ. ౧ స్కం. ౨౦౩.

నిగముఁడు. సం. వి. అ. పుం. వణిజుఁడు, బేహారి.

నిగరణము. సం. వి. అ. పుం. 1. కంఠము; 2. హోమధూమము; 3. మ్రింగుట; 4. కప్పిపుచ్చుట, ఘుటుఁగుపఱచుట; 5. తినుట, భక్షణము.

నిగరణీయము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తినఁదగినది; 2. మ్రింగఁదగినది.

నిగరము. ఉభ. దే. వి. 1. కాంతివిశేషము. "వ...నిగరాలమగరాలనిగరాలఁ గనునితాంతకాంతదంతంబులును..." ప్రబంధ. ౪౦; 2. పెల్లిక, బిల్ల. "గీ. వలచుఁ గస్తూరినిగరాలతలుపుఁ దెఱవ, గాజుటోవరిలో ధూపగంధలహరి" నైష. ౭, ఆ. ౧౫౪. వసు. ౨, ఆ. ౧౧. విశే. 1. శ్రేష్ఠము. "క. పగడంబుల తెగడంబుల, జగడంబుల గెలువఁ జాలుసఖిమోవి జగా, నిగరాలక్ మగరాలక్, నగరాల న్వెలకు నమ్ము సాలిరదమ్ముల్." శశాం.

3, ఆ. ౪౦. చంద్రా. ౧, ఆ. ౯; 2. పెద్దది, పృథువు. "సీ. నిగరంపుఁజనుకట్టున గరంబురవిక మేల్ సరిగకుట్టులమెట్టు సడల నిక్క-" రా. వి. 3, ఆ. ౧౭౪; 3. నీచము, అల్పము. "క. నిగరా లగుమగతాలఁ, నిగరాలుగఁ జేయుసార పెలఁ తరదంబుల్." ప్రబంధ. ౪౦3. సం. వి. అ పుం. 1. మ్రింగుట; 2. తినుట, భక్షణము.

నిగరిత. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. మ్రింగువాఁడు; 2. తినువాఁడు.

నిగళము. సం. వి అ. పుం. న. 1. సంకెల; 2. ఏనుఁగుకాలిసంకెల; 3. మ్రింగుట.

నిగళితము. సం. విణ. (అ. ఆ అ) 1. సంకెలవేయఁబడినది; 2. బంధింపఁబడినది.

నిగా. హిం. వి. 1. దృష్టి; 2. లక్ష్యము.

నిగాదము. సం. = నిగదము.

నిగారకము. సం. విణ. (అ. రికా. అ) 1. మ్రింగునది; 2. భక్షించునది.

నిగారము,* ఉభ. దే. వి. కాంతివిశేషము, సొంపు. "ఉ, చన్నులు పొన్నకాయలకుఁ జక్కఁదనంబులొసంగుఁ గల్కిచూ,ల్గన్నులు గండుమీలకు నిగారములిచ్చు నొయారి దీని కే,యన్నులు సాటిరాఁ గలరు..." మృ. వి. ౨, ఆ. ౬౦ విణ. శ్లక్ష్ణము. "ఉ. సుందర మెందునుల్ దొరయి కొమ్మనిగారపుమేనిచాయకున్." నీలా. ౧, ఆ. ౫౭. అచ్చ. అయో. ౮3. సం. వి. అ. పుం. 1. మ్రింగుట 2. తినుట.

నిగారి. సం. విణ. (న్. నీ. న్.) 1. తినువాఁడు; 2. మ్రింగువాఁడు

నిగార్యము. సం. = నిగరణీయము. [చోటు.

నిగాళము. సం. వి. అ. పుం. న. గుఱ్ఱపుమెడసమీపపు

నిగిడించు. దే. స. క్రి. (నిగుడు ధా. ప్రే.) 1. చాఁచు, సాఁగఁజేయు. "క. మొగిచినచేతులు ముందల, నిగిడించి నితాంతవినయనిరతిఁ జారుల్, దగ విన్నవించి రిట్లని..." భార. విరా. 3. ఆ. ౪౯. పారి. ౨, ఆ. 3౬; 2. వెలువరించు. "వ .. పెచ్చుపెరుందాడనేరక నిట్టూర్పు నిగిడించితి..." కాశీ. ౯, ఆ. ౧౦౫. నైష. ౪, ఆ. ౯౧; 3. ప్రయోగించు. "గీ. వైచుటయు నొక్క తెగఁ గత్తివాలియమ్ము,లతఁడు పదుసాల్గు నిగిడించి యదృశ్యమునగఁ, దునిమె..." భా. రా. అర. ౧౬౫; 4. కల్గించు. "మ ..వజ్రకుంభల సచ్ఛాయ సితాంశుదీప్తి నిగిడింపన్..." చంద్రి. ౬, ఆ. ౬.

నిగిడికొను. దే. స. క్రి. (నిగిడు+కొను.) తడవుకొను, నిముడుకొను. "వ ..గండంబులు గడచితిమని గుండియలు నిగిడికొనుచుం జనిరి." హర. ౨, ఆ. ౨౭.

నిగితము. దే. వి. (సంగీతములోని.) ఒకస్వరస్థాయి, ఒకరాయము. "ద్వి. నిగితిసుధాయినన్నిగిసంబు ...ఆదిగా సొగయుంరాయములు" బస. 3, ఆ. ౯3౯. పం.

నిగితి. దే. వి. (సంగీతములోని) ఒకస్వరస్థాయి. బస. 3, ఆ. ౯3౯.

నిగిరత్. సం. (శతృ.) 1. మ్రింగుచున్న; 2. తినుచున్న.

నిగీర్ణము. సం. విణ. (అ. ఆ అ.) 1. మ్రింగఁబడినది; 2. తినఁబడినది; 3. కప్పిపుచ్చఁబడినది, అంతర్భావితము.

నిగీర్ణి. సం వి. ఇ. స్త్రీ. 1 మ్రింగుట; 2. తినుట.

నిగీర్యమాణము. సం. విణ. (అ. ఆ. అ) 1. మ్రింగఁబడుచున్నది; 2. తినఁబడుచున్నది

నిగుంభన. సం. వి. ఆ. స్త్రీ. (మాటలయొక్క) కూర్పు. "మ. ఒకచో మాధురిఁ గుల్కుపల్కుగము లింపొందంగ వేఱొక్కచోఁ, బ్రకటప్రౌఢవచోనిగుంభనలఁ దీవ్రస్ఫూర్తి వర్తిల్ల..." కాళిందీ. ౫. ఆ. ౯.

నిగుడఁజేయు. దే. స. క్రి. (నిగుడక్+చేయు.) 1. వర్తిల్లఁజేయు. "క. నావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండవుల సలుక ధృష్టద్యుమ్నుం, డేపెరపు మాటనైనను, నే వోసిచయగ్నిభంగి నిగుడం జేయున్." భార. ఉద్యో. ౨, ఆ ౨౪3; 2. ప్రసరింపఁజేయు; ప్రయోగించు. "సీ విరివిగా నొకవేళఁ బెరిఁగి పీటికి నెల్ల నిజశీతలచ్ఛాయ నిగుడఁజేయ." పారి. ౫, ఆ. ౫౨. "గీ. రక్తధారలు వెడలంగ రశ్మి వెలుఁగఁ, బోలుచు బాలార్కుచాడ్పునఁ జెలువుమిగిలి, ఫల్గునుండు ప్రతాపసంభరితమూర్తి, యగుచు శరకిరణంబులు నిగుడఁజేసె." భార. విరా. ౫, ఆ. ౧౯౦.

నిగుడము. దే. వి. అశ్వశిక్షాభేదము. "సీ. పరసంబు నొందించి పల్లంబు కల్పించి నిగుడంబు సమకొల్పి ...." పి. శకుం. ౧, ఆ. ౧౧౨.

నిగుడారు. దే. అ. క్రి. (నిగుడు+ఆరు-స్వార్థమున.) వ్యాపించు. "ఉ. నవ్వక నవ్వునెమ్మొగమునన్ నిగుడారెడువింతకాంతియుంన్, జివ్వలుచేసి చేసి యిటు చిక్కనిసె వెన్నెలవెల్లి వేఁడికిన్." ఉ. హరి. ౫, ఆ. ౧౩౪.

నిగుడించు = నిగిడించు. (వ్యాపింపఁజేయు.) "వ... ఏము నిదిధ్యాసనిశ్వాసనిరోధంబు సేసినం దాఁ దద్ధ్యానదశ వెలికి నిగుడించుచు..." ఆము. ౫, ఆ. ౧౫౭. (ప్రయోగించు.) "సీ. సాత్యకి డిభకుపై సాయకదశకంబు నిగుడించె నని వాని మొగమునందుఁ, జను మొనమీఁద వక్షంబుపై నాఁటిన..." ఉ. హరి. ౪, ఆ. ౨౫౦.

నిగుడు. దే. అ. క్రి. 1. నిక్కు, (పైకి)లేచు. "వ...తోలూచ్చు మహానాగంబుచందంబొలెఁ గర వాలంబుఁ దాన యొఱవెలికి నిగుడుచున్నయది ..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౪౬. ద్వి. హరిశ్చ. పూ. ౫౭౫, పం; 2. విజృంభించు. "సీ. నెత్తుటఁ దోఁగియుం నిగిడిపోరెడివీరు లలరిన నడమోదుగుల విధంబు." భార శల్య. ౧, ఆ. ౧౨౯. ఉ. హరి. ౩, ఆ. ౯౧; 3. వ్యాపించు. "గీ. వారిముఖమండలములతో వారిజములు, మొగిడె శోకతమంబుతో నిగిడెఁ దిమిర, పటలి ..." భార. సౌ. ౧, ఆ. ౧౩. భార. శాం. ౫, ఆ. ౬౭; 4. బయలుదేఱు. "వ. అనుచు సభార్యుం డయి వింధ్యావార్యస్తంభయిత సంభృతాను రాగంబున నిగిడి చని ..." పాండు. ౧, ఆ. ౧౩౭; 5. (యుద్ధాదులయందు) కవియు, మార్కొను. "గీ...కౌరవయోధులయుబ్బు మెఱసె, నృపు లనేకులు నామీఁద నిగిడిరేను, జిక్కువఱిచెదఁ జూడుమీ యంఁక్కుమడఁచి." భార. భీష్మ. ౩, ఆ. ౧౧. ౩, ఆ. ౩౯౯; 6. వెలువడు, ఉద్గతమగు. "క. చని మననాగ్ని జ్వాలలు, దను కఁగ నిట్టూర్పుగాడ్పుదందడి నిగుడన్." భార విరా. ౨, ఆ ౬౦. నైష. ౪, ఆ ౮౭; 7. చక్కఁబడు. "క బెడిదముగఁ గత్తిగొడ్డటఁ, దెగిన మ్రానఁ జిగురువొడము బలుకులం, శెడఁ దునిసిన కార్యంబు నిగుడనేరదు పిదప నెట్టుఁ గురువంశనిధీ." భార. ఉద్యో. ౨, ఆ. ౬౧; 8. పొడము, జనించు. "ఉ. మైలవలిన్ నసల్ నిగుడు పైఁ ఖులకల్ పొడమన్ శ్లథాంగియై." ఆము. ౫, ఆ. ౬౬; 9. తలఁచు, కోరు. "క. భీముని నర్జును విడిచియు, నీమది నకులు బ్రదికింప నిగుడుట పుత్త్రా, నామనమున మాయద్ధు నిన్నే మనవచ్చు నఖిలంబు నింద్రుఁ డెఱుంగున్," భార. మహా. ౬౪; 10. ఒప్పు. "సీ. బొమల నెన్నడిమిపద్మముదళంబులరేఖ రహిఁ జూపునూర్ధ్వపుండ్రంబు నిగుడ" విప్ర. ౨, ఆ. ౬౮; 11. ప్రవహించు. "సీ. వాహిను లంతేని వడిమించి నిగుడంగ..." కాళిందీ. ౪, ఆ. ౫౮. పాండు. ౫, ఆ. ౨౬; 12. చాఁగు, దీర్ఘమగు. "సీ. నిగిడి పూఁఱెకు బాగుగఁ గత్తిరించిన గడ్డంబు కొన రొమ్ముఁ గమ్మిరింప." నైష. ౭, ఆ. ౯౧; 13 పరుగెత్తు. "క. మాయాహారిణము మిగులుచు, వాయువు దెగఁ బఱతు ధరణివలయము గడచుం, దోయధి దాఁటును నను క్రియఁ. గాయద్యుతు లడర నొక్కగతిఁ దెగి నిగిడెన్." భా. రా. అర. ౨, ఆ. ౫౭, ౫౮. చిత్రభా. ౩, ఆ. ౧౩౯; 14. (బాణాదులు) మీఁదికి వచ్చు. "చ. ఘనరభసమ్మునన్ నిగుడుకై దువులన్ దును మాడి..." భా. రా. అర. ౧, ఆ. ౨౦౧. పారి. ౫, ఆ. ౧౨; 15. మరణించు. "క. ఈరీతిఁ బొదల మెదలుడు, నారీతిలకంబు మేని నచ్చిక యిచ్చం, గోరక నవసహకారక, కోరక మూరు కొని వడి నిగుడఁ గమకించెన్." వసు. ౩, ఆ. ౧౮౯; 16. అధికమగు. "వ...ఒడళ్లు జడియ జడిమ నిగుడ బడలియున్నవారలం గనుంగొని." దశా. ౨, ఆ. ౧౬౨. పాండు. ౨, ఆ. ౨౬; 17. స్వాస్థ్యమునొందు. "క. కావున నేత ద్దానము, నీవును గావింపు మనసునిగుడుదు వన ..." వరాహ. ౧౨, ఆ. ౬౯.

నిగుడుచు. దే. స. క్రి. (నిగుడు ధా. ప్రే.) 1. పెట్టు, తూర్చు. "చ. పొగడలు బొండుమల్లియలు పొన్నలు పావడచాల్లియంబునన్, నిగిడిచి వీరభద్రుఁడు చనెన్ శశిమాళిసమీపభూమికిన్." భీమ. ౫, ఆ. ౧౧౦.

నిగుడుదెంచు. దే. అ క్రి. (నిగుడు+తెంచు-స్వార్థమున.) పొడము, కలుగు. "గీ. వెక్కుడలఁ జూచి యొఱుఁగుదు నిక్క మనిన, నగవు మొలక మొగంబున నిగుడుదేర." రామా. ౮, ఆ ౨౦౭.

నిగుడ్చు-ఱ నిగుడుచు. దే. స. క్రి. (నిగుడు ధా. ప్రే.) 1. వ్యాపింపఁజేయు, ప్రసరింపఁజేయు. "క. అను టయుం నతఁ డమ్మునిరుషఁ, దనదృష్టి నిగిడ్చి నగుచు .." కళా. 3, ఆ. ౪3. సైమ. ౪, ఆ. ౨౫; 2. వెలువఱించు, "గీ. పోవలయుఁ జూడ నగుచు నూర్పులు నిగుడ్చు." స్వా. ౧, ఆ. ౫౭; 3. (బాణాదులను) ప్రయోగించు. "సీ...కనలి యశ్వీరుఁడు...గొడుగును దునుమాడఁగా భవ త్పుత్రుఁ డేపు, గుంపఁగ శక్తి నిగుడ్పఁగఁ ద్రుంచె నేడ్లెఱ కృపాణము గొని నుఱుము నేసె." భార. కర్ణ. ౨, ఆ. ౨౬౯; 4. కలిగించు "ఆ. అతఁడు తన యవరజయాకర్ణ నాసాస్త్రములు నిజాతుల నఘవిలసనమ్ము, గడు నిగుడ్చి నడిగి యడిగి తత్కథితన, భార్యరామవృత్తకార్యుఁ డగుచు." రాఘవ. 3, ఆ. ౧౫; 5. పెట్టు, తూర్చు "గీ.. నగపరాతులు నిగిడ్చి, చెప్పుటట్టలు శోధించి సిగలు విప్పి." ఆము. ౬, ఆ. ౭౧.

నిగుఱు. దే. వి. బూడిద, భస్మము. "గీ. నిగుఱులో నిప్పుతీఱున నీచరిత్ర, మెఱుఁగఁబడదు..." ఉ. రా. ౫, ఆ. ౫౧. ఆం. భా. ద్వి. ౨౪౫.

నిగువు. సం. వి. ఉ. పుం. 1. మనస్సు; 2. మలము; 3. వేరు, మూలము; 4. చిత్తరువు వ్రాయుట. విణ. (ఉ.) మనోజ్ఞము.

నిగూఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రహస్య మైనది; 2. దురవగాహము, తెలియనిది; 3. భావ గర్భితము, వాచ్యముకానిది. "క. అసిన విని యెఱిఁగికొని యీ,తనిమదినందియము మాన్పఁ దలఁచి నరేంద్రుం,గనుఁగొనుచు నతనితోఁ జెప్పిన భంగి నిగూఢవృత్తి భీష్ముఁడు వలికెన్." భార. విరా. ౪, ఆ. ౫౨.

నిగూహనము. సం. వి. అ. న. దాఁచుట.

నిగూహించు. సం. స. క్రి. దాఁచు, మఱుఁగుపఱుచు "మ. మనువంశాగ్రణిజాగ్రదగ్రసుత సామ్రాజ్యా గమప్రాజ్యము, జ్జనసంమర్దజభూరజఃపరిజీహీర్షారో మాంచుంచుచకా,యని కాయప్రకృతి వ్రజ ద్విగుణ జాతానందముక్ డెందమం,ద నిగూహిం చుచుఁ బల్కెఁ నాప్తసచివోత్తంసాళితో నత్త ఱిన్." చం. రా. ౪, ఆ. ౧౧.

నిగృహీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిరోధము, అడఁక; 2. అడఁచుట, నిగ్రహము.

నిగృహీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పట్టు కొనఁబడినవాఁడు; 2. నిరోధింపఁబడినవాఁడు, అడ్డగింపఁబడినవాఁడు; 3. ఎదిరింపఁబడినవాఁడు; 4. ఓడింపఁబడినవాఁడు. [బడుచున్నది.

నిగృహ్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిగ్రహింపఁ

నిగ్గడి. దే. విణ. (క. నిగ్గడి.) కఠినము. "సీ...అవి యక నిగ్గడి యైన యిపుప. గీ గుండియుకుఁ టేటు పా టింకఁ బుండరీక, నయన యెన్నఁడు లేమి నిర్ణయము గాదె." భార. స్త్రీ. ౨, ఆ. ౪౭

నిగ్గారు. దే. అ. క్రి. (నిగ్గు+ఆరు.) 1. ఉత్కృష్ట మగు. "ద్వి. నిగ్గారుపంచవన్నియలతోఁ గూర్చి, ముగ్గులువెట్టి..." పండితా. దీక్షా. ౫౭, పు; 2. పరిమళించు. "ద్వి. ముగ్గ చాలదొ పద్మములు నెవరినవొ, నిగ్గారుగందంబు నెరసు దోఁచినదొ." పండితా. పురా. ౧౫౪, పు.

నిగ్గించు. దే. స. క్రి. (నిగ్గు+ఇంచు.) నెఱవేర్చు, నిర్వహించు. "మ...ధాత్రీకాంత నీ వొప్పు మా,నితులశ్రేష్ఠులతో నిరీతి మఖముల్ నిగ్గించు చున్ మేము వేడుక వర్తిల్లుదు మాశ్రమాళి సుర కోటుల్ నిచ్చ హర్షింపఁగన్." చంద్రి. ౧, ఆ. ౧33.

నిగ్గు. దే స. క్రి. మించు, మీఱు. "చ...మత్తి యంబులు ..మెయిఱపులతీఁగెమై మెలఁగి యొ ప్పును మొగ్గలనిగ్గు నిగ్గుచున్." కాళిందీ. ౫, ఆ. ౧౨౨. వి. 1. కాంతి. "సీ. పసుపునిగ్గులు దేఱ పాఁపజన్నిద మొప్పఁ బ్రమథాధిపతి యింటిప ట్టైతిం గె." స్వా. ౨, ఆ. ౧౧. పారి. ౪, ఆ. 3౭; 2. సొంపు, అందము. కాళిందీ. ౫, ఆ. ౧౨౫; 3. జిడ్డు. "మ...సోఁగెనెఱుల్ సంపఁగి నూనెనిగ్గ సడలంగాఁ బైపయిన్ దువ్వి .." వసు. ౫, ఆ, ౭౦; 4. కిరణము. "సీ. మినుకు తళుకు నిగ్గు మించు కళు కనంగఁ గిరణనామంబులై, కెరలుచుండు." ఆం. భా. ప్ర. ౧౫; 5. పరిమ ళాతిశయము. "ఉ. మజ్జనమాడె రాజు కృశ మధ్యము లింపున వంప గుంపులై, గొజ్జఁగనీటి వెల్లువలు గోవజవాజులనిగ్గుఁ జూప..." స్వా. ౫, ఆ. ౫౭; 6. సారము. (వా.) విణ. త్రోపుడు పోఁగా మిగిలినది. (శ. ర.)

నిగ్గులాఁడి. దే. వి. (నిగ్గులు+ఆఁడి.) అందముగలస్త్రీ, స్త్రీ. "చ. కలఁగుచు మోమువాంచెఁ గధుఁ

గ్రమ్మైదుసిగ్గున నిగ్గులాడి తాన్." కాళిందీ. ౬, ఆ. ౧౫౭. నరస. ౫, ఆ: ౧౭౭.

నిగ్రహణము. సం. వి. అ. న. 1. నిరోధించుట, అడ్డగించుట; 2. అడఁచుట; 3. బంధించుట, చెఱఁబెట్టుట; 4. ఓడించుట; 5. దండించుట. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగించునది; 2. అడఁచునది.

నిగ్రహపడు. మి. అ. క్రి. (నిగ్రహము+పడు.) చిక్కులుపడు. "క. వెలి వెడలనిజను లిటు దమ, నెలవులు డిగి వచ్చి యిచట నిగ్రహపడఁగా." హరి. ఉ. ౨, ఆ. ౧౫౧.

నిగ్రహము. సం. వి. అ. పుం. 1. అడ్డగించుట, నిరోధించుట; 2. అడఁచుట; 3. చెఱ; 4. మేర, సీమ; 5. చికిత్స; 6. తెగడుట, నిరసనము; 7. చంపుట, మారణము; 8. శిక్ష, దండనము; 9. బెదరింపు; 10. ఓడించుట; 11. దూఱు, నింద; 12. పిడి; 13. పట్టుకొనుట, పీడించుట. "వ. ఇవ్విధంబున నరదంబులయిఱకటంబు గడచి యెడ గలుగ నిలిచి రావునిగ్రహనిరాసభాసురుం డగుభానుండునుం బోలె..." భార. విరా. ౫, ఆ. ౨౧౩.

నిగ్రహించు. సం. స. క్రి. 1. తిరస్కరించు, నిరసించు. "క...తన్ను నెదిరిని, మది నెఱుఁగక నిగ్రహించి మదమెత్తుట యెప్పుడు..." భార. ఉద్యో. ౩, ఆ, ౨౮౯; 2. అడఁచు, నిరోధించు. "వ...నిఖిలేంద్రియంబుల నిగ్రహించి..." మార్క. ౮, ఆ. ౩౬; 3. త్రోపాడు. (శ. ర.)

నిగ్రాహము. సం. వి. అ. పుం. 1. దండనము, శిక్ష; 2. తిట్టు, శాపము.

నిఘంటు. సం. వి. ఉ. పుం. పదములను వానియర్థములను తెలియఁజేయుం గ్రంథము. "మ...విభూతిర్భూతిరైశ్వర్య మంచు వినంగాఁ దెలిసెన్ నిఘంటుఁ గనినన్..." సావి. ౨, ఆ. ౬౨.

నిఘంటువు. సం.=నిఘంటు.

నిఘము. సం. విణ. (అ. ఆ. అ.) నిడుపు వెడల్పు ఎత్తు సమానముగాఁ గలది. (వేదికాది.)

నిఘర్షణము. సం. వి. అ. న. 1. రుద్దుట, తోముట; 2. రాచుట, రాపిడి; 3. నూఱుట; 4. (పిండిమొ.) విసరుట.

నిఘర్షము. సం. వి. అ. పుం నిఘర్షణము.

నిఘసము. సం. వి. అ. పుం. భోజనము, భుజించుట.

నిఘాతకుఁడు. సం. విణ. (అ. తికా. అ.) 1. కొట్టువాఁడు; 2. హింసించువాఁడు.

నిఘాతము. సం. వి. అ. పుం. 1. కొట్టుట; 2. దెబ్బ; 3. అనుదాత్తస్వరము.

నిఘాతి. సం. వి. ఇ. స్త్రీ. ఇనుపసుత్తె, లోహఘాతిని.

నిఘానక. సం. వి. ఆ. స్త్రీ. కమ్మరి యినుపపని చేయుం దాయి.

నిఘుష్టము. సం. వి. అ. న. ధ్వని, శబ్దము.

నిఘృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. రుద్దఁబడినది; 2. నూఱఁబడినది; 3. అఱఁగఁదీయఁబడినది.

నిఘృష్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఘర్షింపఁదగినది.

నిఘృష్వము. సం. వి. అ. పుం. 1. డెక్క, ఖురము; 2. వాయువు; 3. గాడిద; 4. మార్గము; 5. పంది, వరాహము.

నిఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లోనైనది, అధీనము. (భృత్యాది); 2. గుణింపఁబడినది. (సంఖ్య); 3. అంతర్భూతమైనది. "గీ. రమణి దీపకభూషణరత్న మిద్ది, మంజులై తాఁవళీయోగమహిత మగుట, మాలికాదీపకం బౌచు మాము కీన, మానసము నాత్మ నిఘ్నతఁ బూనఁజేసె." కాళిందీ. ౬, ఆ. ౧౭౭.

నిచయము. సం. వి. అ. పుం. 1. సమూహము, రాశి; 2. నిశ్చయము.

నిచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాపించినది; 2. పూరితము, నింపఁబడినది; 3. నిర్మితము; 4. ప్రోగుచేయఁబడినది; 5. ఒకటితో నొకటి కలిసినది, సంకీర్ణము; 6. ఆవరింపఁబడినది, వ్యాప్తము. "క . . రావణాసురుఁడు దైతేయ, ప్రచయ కలకలనిరంతర, నిచితనభోభాగుఁడై యనికి నేతెంచెన్." నిర్వ. ౫, ఆ. ౪౮.

నిచులము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగన్నేఱు; 2. వేతసము, ప్రబ్బలి; 3. గవుసెన.

నిచోళకము. సం. వి. అ. పుం. 1. అరచొక్కావంటి యోధులకవచము; 2. అవిక.

నిచోళము. సం. వి. అ. పుం. 1. గవుసెన; 2. స్త్రీల మేలిముసుఁగు, అవగుంఠనము; 3. పఱుపులోనగువానికప్పుడు దుప్పటి.

నిచ్చెన. వై. వి. (సం. నిశ్రేణిః. క. నిచ్చణిగె.) పైకెక్కుట కుపయుక్త మగుమెట్లు గలసాధనవిశేషము, నిశ్రేణి. "సీ. ధనము లుత్కృష్టంబు

లనుఘనంజయుంమాట పాటిగాఁ గొనుము సోపాన భంగి, నున్నది మార్గంబు యోగసమారోహణము నకు దానన నడచికాక, వడి సుర్కిపడ నీకు వచ్చునే ధనసంగ్రహంబు భోగార్థకృతంబు దుష్ట, మగుటయుఁ గలదు యజ్ఞార్థకృతంబైన నదియ నిచ్చెన బ్రహ్మపదము నొంద." భార. శాం. ౧, ఆ. ౧౪౪, అం. భా. ౨, ఆ. ౨౨.

నిచ్చెనపంజో. ద్వ. వి. (నిచ్చెన+పఁజు.) నిచ్చెనవలె నుండుదీపములపంక్తి. "మ...నిచ్చెనపంజు లార తులు నగ్నిజ్యోతులుః వెల్గఁగన్." హంస. 3, ఆ. ౨౦, ప్రబంధ. ౭౪.

నిచ్చే. వై. అవ్య. (సం. నిత్యమ్. క. నిచ్చ.) 1. ఎల్లప్పుడు, సదా. "క...ఈలతాంతము కొలఁదులు చెప్పంగ నిచ్చ క్రొత్తలుసుమ్మీ." పారి. ౧, ఆ. ౬3, ఉ. రా. 3, ఆ. ౧3౯; 2. ప్రతిదినము. "సీ. నిచ్చ యొక్కమృగంబు నీకుఁ గట్టడ గాఁగఁ బ్రీతి నాహారంబుఁ బెట్టఁగలము." నా. పంచ. ౧, ఆ. ౭౪౯, పండితా. మహిమ. 3౦౬. పు.

నిచ్చేచావు. ద్వ. వి. (నిచ్చే+చావు.) నిత్యమరణము. "క. విను దుర్యోధనదుశ్శా, సనులఁ బలికి నిచ్చ చావుగ నప్పువని యలఁచు..." భార. శల్య. ౧, ఆ. 3౨.

నిచ్చేనిచ్చేలు. వై. అవ్య. (నిచ్చలు+నిచ్చలు.) 1. ఎల్లపుడు, సదా. "ఉ. ఆశువిశేషణప్రతిభ నార్చు మహాబడబాగ్ని చేఁ బయో, రాశి శమించిపోమికి ధర న్గత మేమొకో నిచ్చనిచ్చలుః, వేసట లేక యన్నమిడు వేంకటరాఘవయజ్వయింట మృష్టాశనదానవార్ఘరసహాయత యాయత మై చెలంగఁగన్." శశాం. పీఠి. ౪౭; 2. ప్రతిదినము. "ఆ. నిచ్చనిచ్చవడ్డి నెలనెలవడ్డోడ్డఁ, బాటువడ్డి వడ్డిపైనివడ్డి, యనఁగ నాల్గుతెఱఁగు లయ్యె." విజ్ఞా. వ్యవ. ౬౬, దశా. ౪, ఆ. ౨౯.

నిచ్చేయము. వై. వి. (సం. నిశ్చయః.) నిశ్చయము "క. మెచ్చగునె సాహసానకు, వచ్చినతఱి సంధి మనల వారలకొలఁదుల్, నిచ్చయము చేసి యిటు వలెఁ, జొచ్చితి మన కింక నొండుచొప్పులు గలవే." భా. రా. యు. ౭3౦.

నిచ్చేలము. వై. విశ. (సం. నిశ్చలః.) 1. నిష్కపటము. "క. వచ్చినఁ గుబేరసూనుఁడు, నచ్చెలు వలు శెదురు గాఁగ నరిగి యతనికిః, నిచ్చల మగుతాత్పర్యం బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్." కళా. 3, ఆ. ౧౯౦, నీలా. ౧, ఆ. ౧౬; 2. నిర్దోషము, నిర్మలము. "ఉ. నిచ్చల మైనకెంపులును నీలమణుల్ వరమౌక్తికంబులున్." శశాం. ౨, ఆ. ౧౦, ఉ. రా. ౧, ఆ. ౯౦; 3. అసందిగ్ధము, యథార్థము. "ఉ... నిచ్చల మమ్మహామహునినేత్రము లజ్జము లౌట వాసవా." కవిక. ౬, ఆ. 33. (శ. ర. పా.) ప్రభా. ౨, ఆ. ౨౯. (సం. నిశ్చలమ్;) ధైర్యము; స్థైర్యము. "గీ. జిగిని మాటలలోఁతున మగతనమున, నిచ్చలంబునఁ గడలఁ దానెచ్చు గాంచి." నీలా. ౧, ఆ. ౪౨, అచ్చ. బాల. ౨౦, విశ. 1. చలింపనిది, నిశ్చలము. "క. ఇచ్చటఁ దప మొనరించిన, నచ్చపునియమమున వాంఛితార్థము నొందః, వచ్చును సంశయ మే లని, నిచ్చలపుః మనసుచేత నిర్ణయయుతుఁడై." సీమం. ౧, ఆ. ౨౬; 2. నిరంతరము, ఎడతెగనిది. "సీ. నిచ్చలం బైనతేనియవానజడిసొంపు లాలితదానధారాళి గాఁగ." రాఘవ. ౨, ఆ. ౯, దశా. ౭, అ. ౧౬౨.

నిచ్చేలు. వై. అవ్య. (సం నిత్యమ్.) సదా, ఎల్లపుడు. "ఉ. నిచ్చలు నిచ్చలోఁ బొదలునీపితృభక్తికి జ్ఞానశక్తికిః, మెచ్చితి..." పాండు. ౨, ఆ. ౯3. క్రి. విశ. "సీ....నీకు. గీ. చేయలంతిగా నిచ్చలు చెలియ యిత్తు." హరి. ఉ. ౭, ఆ. ౧3౨.

నిజ. సం. వి. ఆ. స్త్రీ. నెచ్చెలి, మిత్రురాలు.

నిజము. సం. విశ. (అ. ఆ. అ.) 1. స్వాభావికము, సహజము; 2. తనది, స్వకీయము; 3. శాశ్వతము.

నిజుఁడు. సం. వి. అ. పుం. చెలికాఁడు, మిత్రుఁడు.

నిజ్యమానము. సం. విశ. (అ. ఆ. అ.) శుద్ధిచేయఁబడుచున్నది.

నిజేమరి. ద్వ. విశ. (నిజేము+అరి.) సత్యశీలుఁడు. "క. తానొక్కనిజేమరివలెన్..." భో. ౬, ఆ. ౯౬, య. ౧, ఆ. ౯౯. [మరి.)

నిజేము. వై. వి. (సం. నిజము.) సత్యము (చూ. నిజే

నిజేవణి. దే. వి. సంగీతములోనిఒకస్వరస్థాయి. "ద్వి. నిజవణి నివళంబు నీచమై ధసము...అదిగా నాగయుతాయములు." బస. ౭౧, పు.

నిజోము. దే. వి. ఒకానొకమహమ్మదీయప్రభువు. (ఇది మొదట సంజ్ఞావాచకమయ్యును క్రమ

ముగా హైదరాబాదుమహమ్మదీయప్రభుసామాన్య వాచక మైనది.) "గీ. అనుచు శిరములఁ దాల్తు రెవ్వనిసమగ్ర, సైన్యధుతధూళిఁ జకితులై చనుస పాద, కుతపళాకానిజామాదికుతలపతులు." వసు. ౧, ఆ. ౪౬, ఆనంద. పీఠి. ౧౦౯.

నిజావళి. దే. వి. సంగీతములోనిస్వరస్థాయిభేదము. "ద్వి. వరుస లేర్పడ నిజావళి భజావళియు, నరసి సాళగము తాయము లేర్పఱచి." అ. మ. క. ౨, ఆ. ౧౦౯. పు.

నిటక్కనిలుచు. దే. అ. క్రి. స్తంభమువలె పొడుగుగా నిలుచు. "వ...బొసటకాసటలు సముత్కట నిటలతటంబున నిటక్కనిలిచి యంపకట్టెలఘటన నటియింప..." రా. వి. 3, ఆ. ౬౭.

నిటనిటనగు. దే. అ. క్రి. (మదాదులచే) కన్నులు తేలగిలు. "చ. కిటకిటనయ్యె నెన్నడుము కేసరి మధ్యకు నాఁడునాఁటికిన్, నిటనిటనయ్యె సోలము జనించి విశాలవిలోచనంబులున్." పి. కుం. ౪, ఆ. ౭౪.

నిటలము. సం. వి. అ. న. నుదురు, ఫాలము.

నిటలాక్షుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి, శివుఁడు.

నిటాలము. సం. = నిటలము. "గీ. శక్యమే సన్నుతికి యదుసార్వభౌము, లాలితచ్ఛాయమృదులనిటాల తలము." కాళిందీ. ౧, ఆ ౩౧౯. చంద్రా. ౬, ఆ. ౮౩.

నిట్ట. దే.వి. 1. ప్రవాహము, జలపూరము. "సీ. మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి సతిఁ దేల్తు సౌఖ్యరసంపునిట్ట." భార. విరా. ౨, ఆ. ౧౩౦. ద్వా. 3, ఆ. ౧౦౭; 2. పొంగు, పోటు. "క...కనుంగొని రద్భుతరసపూరంబున వెన్నిట్టఁ దమచిత్తములు మునుఁగంగన్." భార. విరా. ౧౭౮. బస. ౬, ఆ. ౮౦౯. సం; 3. నిక్కు, నిగుడుట. "గీ. భక్తిసంయుక్తి యనుపోఁతపాల నొయ్యఁ, జెట్టుకట్టుచు మునికాఖి నిట్టచూప, నిజ మనోమార్గసంపసన్నీలవర్ణ, కైతవంబున లోఁకేగ గలయనూఁతె" పాండు. 3, ఆ. ౧౩౯; 4. స్థానము. "సీ...టెంకి నిట్ట యనఁగ. గీ. స్థాన మగు..." ఆం. భా. ద్వి. ౧3; 5. స్తంభము. "ఉ...అయ్యనఁటినిట్టలపైఁ బొరలాడి....." శవిక. 3, ఆ. ౧౧౬. విశ. 1. నిక్కినది, [illegible] పైకి లేచినది. "ఆ. నిట్టరోమములకుఁ

బట్టగు చానంద, బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి సేసె." భాగ. ౬, స్కం. ౭౬౮. శుక. ౨, ఆ. ౧౦; 2. స్థిరము, నిశ్చలము. "చ...హృజ్జ రజమానసపౌరభవట్పదంబు నర్జునరథభూషణంబు వెలిఁ జూడనినిద్దపునిట్టమూపునన్, మనుకొని. చొక్కి..." పాండు. ౨, ఆ. ౯; 3. నిడు పైనది, ఉన్నతమైనది. "గీ. నిట్టతాడనఁ బొడ వుచే నిక్కినాఁడు." స్వా. ౪, ఆ. ౭3, కు.సం. ౧౨, ఆ. ౧౨౨.

నిట్టకనిలుచు. దే. అ. క్రి. (నిట్ట+నిలుచు.) స్తంభము వలె నిలుచు, పొడువుగా నిలుచు. "క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడువోలె..." రామా. ౮, ఆ. ౧౩౨.

నిట్టకనిల్వు. దే. వి. (నిట్ట+నిలువు) సరినిలువు. "ఉ. నిట్టకనిల్వునం గలఁగి నేత్రయుగంబున బాష్పపూరముల్, దొట్టఁగ..., తాఁ, బెట్టెఁ ద దీయపాత్ర నది భిక్షయకాఁ గొనిపోయె సిద్ధఁ డున్." భో. 3, ఆ. ౬౬.

నిట్టగ్రమ్ము. దే. అ. క్రి. (నిట్ట+క్రమ్ము.) ఉప్పొంగు, పైకుబుకు. "సీ. చామల నగుమోముఁ జందురు పొడుపున రాగాంబుధులు నిట్టగ్రమ్ము ననుట." నృసిం. ౨, ఆ. ౭౦, కు. సం. ౧౨, ఆ. ౨౭.

నిట్టతోలఁకు. దే. అ. క్రి. (నిట్ట+తోలఁకు.) వెల్లి విరియు. "గీ. మున్ను పోయినకల్పాంతమున నరేంద్ర, బ్రాహ్మ మనఁగ నైమిత్తికప్రళయ మైన, నింగిపై నిట్టతోలఁకుమున్నీటిలోనఁ, గూలె భూతాళి జగములకోలఁదు లెడలి." భాగ. ౮, స్కం. ౭౧౭.

నిట్టదొట్టు. దే. అ. క్రి. (నిట్ట+తొట్టు.) వెల్లివిరియు. "చ...అంత్యకాలమున వారిధు లన్నియుం నిట్ట దొట్టిన, ట్లుడుగక యేడురాత్రులు మహోద్ధతి వానలు గుర్య..." పద్మ. ౯, ఆ. ౨౩౧.

నిట్టద్రోచు. దే. అ. క్రి. (నిట్ట+త్రోచు.) ఉప్పొంగు, వెల్లివిరియు. సీ. దుగ్ధాంబునిధి నిట్టద్రోచెనో యని శేషుఁ బాన్పుగా హరి నీటఁ బవ్వడింప." ('నిట్టఁ దోఁచు' అని. ము. పా.-లు.) కు. సం. ౮, ఆ. ౧౧౮. కావ్యా. 3, ఉ. ౩౯.

నిట్టనిలుచు. దే. అ. క్రి. (నిట్ట+నిలుచు.) పొడు వుగా నిలుచు. "గీ. మేదినీధర మిట్టుంగి మిన్ను

ముట్టి నిట్టనిలుచుండి చూచె నిర్నిమిషదృష్టి." కాశీ. ౧, ఆ. ౧౧౯. పాండు. ౨, ౫౫.

నిట్టపొడుచు. దే. అ. క్రి. (నిట్ట+పొడుచు.) వ్యాపించు. "గీ జనము లానందమునఁ దేల జగము లెల్లఁ, దొట్టి నిండారు వెన్నెల నిట్ట పొడిచె." నిర్వ. ౬, ఆ. ౫౫. ఇట్లే నిట్ట వొడుచు. భాను. ౩, ఆ. ౧౭.

నిట్టరాడు. దే. వి. (నిట్ట+రాడు.) దూలము లేకయే కట్టెడుగృహమునకు పొడుగు స్తంభము. "సీ...అల యాధారదీర్ఘస్తంభసంజ్ఞ నిట్రాడు నిట్ట, రా డనఁ దగు..." ఆం. భా. ద్వి. ౨౦, ద్వి. హరిశ్చ. ఉ. ౧౬౭౫.

నిట్టలము. దే. వి. నిలుకడ. "సీ...,నిలుకడ తనరును నిట్టల మన." ఆం. భా. తృ. ౨౯, విణ. అధికము. "ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టలమై.." భాగ. ౬, స్కం. ౩౧౯. (శ. ర. పా. 'నిచ్చలమై.' ముద్రి.) నిర్వ. ౬, ఆ. ౧౪౪.

నిట్టలుద్రోచు. దే. అ. క్రి. (నిట్టలు+త్రోచు.) ఊబుకు, ఉప్పొంగు. "సీ. నిట్టలుద్రోచుచు నెలవులు కలమేర లెల్లను బిగియెక్కి యేర్పడంగ." భార. విరా. ౧, ఆ. ౨౪౫.

నిట్టలుద్రోయు. దే. అ. క్రి. (నిట్టలు+త్రోయు.) అతిశయించు. "ఉ. ఆరమణీలలామ హృదయంబున నాదట లంతకంతకుం, బేరఁగ...వేడుకలుం నిట్టలుద్రోసెడువాలుఁగన్నులన్, వారణ లేక క్రోలె జనవల్లభసుందరు మేనచెల్వమున్." కేయూర. ౪, ఆ ౫.

నిట్టలుపొడుచు. దే. అ. క్రి. (నిట్టలు+పొడుచు.) ఉప్పొంగు, వెల్లివిరియు. "వ. తన్ను విస్మయంబునఁ గొనియాడువై మానికులకోలాహలంబు లాలకించువడువున నిట్టలుపొడుచుచు సేనదులుం దనకు సరిరా వని నవ్వునురువున నురువులు చూపుచు..." వరాహ. ౧౦, ఆ. ౬౨; 2. రోమాంచితమగు. (శ. ర.) ఇట్లే. నిట్టలు వొడుచు. పద్మ. ౩, ఆ. ౧౬౪.

నిట్టు. దే. వి. 1. ఉపవాసము. "సీ. వంటగుడారు క్రిందంటివెల్లువనీరు ప్రాయి పీఁగఁ దొట్టిన పూఁట నిట్టు." రా. వి. ౨, ఆ. ౬౯. (శ. ర. పా. 'నిట్రు.' ముద్రి.); 2. క్షామము. "క. దున్నక [illegible] [illegible] లై పట్టివిపులబహు

సస్యంబుల్, సన్న సనఁ బండుఁ బ్రాణులకు నిట్టను మాటలేదు గోరంతైనన్." మార్క. ౪, ఆ. ౪౧, (శ. ర. పా.) విణ. శుష్కము. "ఉ. వాడదు మేను నిట్టుపవాసము లుగడిన ధైర్య మింత యుండున్, పీడదు..." ఉద్భ. ౩, ఆ. ౨౦.

నిట్టుక్కి. దే. వి. బాలికాక్రీడావిశేషము. హంస. ౫, ఆ. ౧౫౫.

నిట్టుపవాసము. మి. వి. (నిట్టు+ఉపవాసము.) శుష్కోపవాసము. "ద్వి. నిట్టుపవాసమే న్దినము లుండంగ, నెట్టకేలకు బియ్య మిరుస గల్గినను." బస. ౪, ఆ. ౧౩౫. పు.

నిట్టుపాసము. ద్వ. వి. (నిట్టు+ఉపాసము.) శుష్కోపవాసము. "ఉ. నిన్నటినుండి యేము నిజునీఁగియు నుంటిమి నిట్టుపాసముల్." కాశీ. ౭, ఆ. ౧౭౯.

నిట్టూరుచు. దే. అ. క్రి. (నిడుద+ఊరుచు.) నిట్టూర్పువిడుచు. (శ. ర.)

నిట్టూరుపు. దే. వి. (నిడుద+ఊరుపు.) దీర్ఘనిశ్వాసము. "గీ. ద్రుపదనందనపరిభవదుఃఖమునకు, నుల్లమున దురపిల్లుచు నున్నసరసి, వేఁడినిట్టూరుపో యన వెడలెఁ గ్రొత్తతావి మూతులు విచ్చునెత్తమ్మివిరుల." భార. విరా. ౨, ఆ. ౨౩౬. ఇట్లే. నిట్టూర్పు. కాశీ. ౧, ఆ. ౧౦౧.

నిట్టూర్పులిచ్చు. దే. అ. క్రి. (నిట్టూర్పులు+ఇచ్చు.) నిశ్వాసమువిడుచు. "గీ. అలసి నిట్టూర్పు లిచ్చు నొయ్యారము..." కలుగుమోహిని దలఁప మైఁబులక లొదవె. దశా. ౨, అ. ౩౬౦.

నిట్టెము. దే. వి. (నిడుద+ఎమ్ము.) వెన్నెముక, పొడువైనయెముక. "ద్వి. అట్టిత్రివిక్రము నెట్టెము గాదె, పట్టె ఖట్వాంగముభాతి శంకరుఁడు." బస. ౬, ఆ. ౯౯౯. పం.

నిట్ర = నిట్రము. (శ. ర.)

నిట్రము. దే. వి. నిలువు. ఉదా:—కలము అంత నిట్రముగా పట్టుకొనకుము. (శ. ర.)

నిట్రపడు. ద్వ. అ. క్రి. (నిట్ర+పడు.) నిలుచు, నిక్కు. (చూ. నిట్రపాటు.)

నిట్రపాటు. ద్వ. వి. (నిట్రపడు ధా.) నిలుపాటు, నిక్కుట. "వ...నిడుదరోమంబులు బహిర్నిర్గతంబు లైన యాంతరకోపానలజ్వాలలపగిది నిట్రుపాటునం దనర..." చంద్రా. ౨, ఆ. ౪౪.

నిట్రపొడుచు. దే. అ. క్రి. (నిట్ర+పొడుచు.) పొడువగు, నిక్కు. "వ...తటాలున నేఁడుఁ బందులచాడ్పున నెఱకలు నిట్రపొడువ నొడళ్లు జాడించుచు..." ప్రబంధ. ౭౮౮.

నిట్రాడు. దే. వి. బొ. (నిట్ర+రాడు.) దూలము లేకయే కట్టెడు గృహమునకు పాఁతు స్తంభము. "క. ఇలు కాలి కూల నిట్టక, నిలిచిననిట్రాడు వోలె..." రామా. ౮, ఆ. ౧౩౨, ఆం. భా. ద్వి. ౨౦.

నిట్రాయి. దే. వి. బొ. (నిట్ర+ఱాయి.) పొడువు ఱాయి. "వ...అయ్యదవగాకి ఱంకుటాలిం గాలం గేలం బొడిచి పెడమరలం దిగిచి నిట్రాత నేఁత పగ్గంబున బంధించి కాలికుండు నిద్రించె .." వేం. పంచ. ౧, ఆ. ౨౯౮.

నిట్రించు. దే. స. క్రి. నిక్కించు, నిలువుగా నుంచు "ద్వి. వలపటికి నెపంబు వ్రాలి కుంభకము, నెల కొల్పి భుజములు నిట్రించి కంఠఁ, మోరగించి ..." పండితా. ౮, ఆ. ౨౯౦, పు. బస. ౯, ఆ. ౮౭౮, పం.

నిట్రిల్లు. దే. అ. క్రి. ఉపవాసముండు. (శ. ర.)

నిట్రు. దే. వి. ఉపవాసము. "సీ. దశమినాఁ డేక భుక్తము చేసి యవలినాఁ డోర్చి జాగరముతో నుండు నిట్రు." ఆము. ౮, ఆ. ౯౦, ఆం. భా. ద్వి. ౧౭౯. విణ. శుష్కము. (చూ. నిట్రుపాసము.)

నిట్రుపాసము = నిట్టుపాసము. (శుష్కోపవాసము) "సీ. సతతంబు నిట్రుపాసములతో నత్యుగ్రత పముఁ గావించుచుఁ దానమాడ." వరాహ. ౭, ఆ. ౭౩. వాల్మీకి. ౨, ఆ. ౧౩౦.

నిడి. దే. విణ. (నిడివిశబ్దమునకు వృత్తియం దంత్య వర్ణలోపము.) దీర్ఘము. "క...ఒకింతతడవున కానె, వ్వడి నడలె నడఁగె నుఱుముల్, నిడి మించులు మాసె వెలుఁగు నిలిచెన్ వెలిచెన్." వేం. పంచ. ౩, ఆ. ౧౦౬.

నిడివి. దే. వి. 1. దైర్ఘ్యము, పొడువు. "క. అమడ నర వెడలుపు మూఁడామడ నిడివియును గలిగి యతిరమ్యంబై,...నిద్రామందిర మలరు మృదుల తల్పతతులతోన్." ఉ. హ. ౨, ఆ. ౨౯౩, పి. శకుం. ౩, ఆ. ౮౩; 2. అశ్వగతిభేదము. "సీ. నిజకీర్తిచంద్రికల్ నిగిడి యంబుధు లెల్లఁ గడచె నన్నవిధాన నిడివిఁ దోలి." ప్రబంధ. ౧౮౯, విణ. దీర్ఘము. "గీ. ఇట్టివేసవితఱిఁ బగ లిట్టి నిడివి, యైన నయిరించునే దివిజారి యనుచు..." లక్ష్మీ. ౩, ఆ ౭౬, కేయూర. ౩, ఆ. ౧౨.

నిడు. దే. విణ. (నిడుదశబ్దమునకు వృత్తియం దంత్య వర్ణలోపము.) దీర్ఘము, పొడువైనది. "సీ. మును మించి నిడుమోర ముంచి దూఁటినమహాజలధి పూరము దల కెడవు గాఁగ." హరి. పూ. ౮, ఆ. ౧౬, హరిశ్చ. ౮, ఆ. ౧౬౮.

నిడుచను. దే. అ. క్రి. (నిడు+చను.) చాఁగు. "క. వడి నొడుగఱచి వలకేల్, నిడుచన గనయమునఁ బెనఁచి నీల్గి బలం బేర్పడ..." భార. ఆది. ౭, ఆ. ౧౭౯.

నిడుద. దే. వి. దీర్ఘము, ద్విమాత్రస్వరసంజ్ఞ. "క. గురువులు నిడుదలు..." కవిజనా. ౧, అధి. ౧౩, ఆం. భా. ద్వి: ౧౮౮. విణ. దీర్ఘము, నిడుపైనది. "క...సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం, దొడరి భవత్సుతు మార్కొని, నిడుదవెడఁద తూపు లేసి నెఱిఁ దూలించెన్." భార. శల్య. ౧, ఆ. ౩౭౬, ఆం. భా. తృ. ౧౮.

నిడుదనిదుర. ద్వ. వి. (నిడుద+నిదుర.) దీర్ఘనిద్ర, మరణము. "క...కాకంఖులు నఱవఁగ నిడుద నిదుర, నొలసి తెలుప దిక్కుమాలి యున్నాఁడు గదే." భార. ఆశ్ర. ౨, ఆ. ౧౬౨.

నిడుదవెన్ను. దే. వి. (నిడుద+వెన్ను.) సర్పము, దీర్ఘపృష్ఠము. "సీ. నిడుదవెన్ను గయ్యాళి తొడ వులదొర యుండు గుండుగం డెసఁగఁ గైచెడు చేసి." అచ్చ. సుం. ౯౭.

నిడుపఁడు. దే. వి. (నిడుపు+అఁడు-శ. ర.) పాము, సర్పము. "సీ. శశిమౌళి తిరుపుచే జడఁ జుట్టు నిడుపఁడు ద్రావినపా లెరఁ గ్రాచె ననఁగ." రా వి. ౩, ఆ. ౧౧.

నిడుపు. దే. వి. 1. నిడివి, ఆయామము. "వ...అది యును నూఱుయోజనంబుల వెడల్పును నూట యేఁబదియోజనంబుల నిడుపును నేనుయోభఫల్గుల తనర్పును గలిగి..." భార. సభా. ౧, ఆ. ౭౨, ఆం. భా. ద్వి. ౧౯౨; 2. నిలువు. "గీ. అద్దొ మేర్పడ వళియుఁ రోమాళి నిడుపుఁ, బడఁగ శేఖయుం గళి వ్యాంసషాది వ్రాసె, లేనినడుముప కొకకంక గా నఱందు, జనము లెం దున్నదో

యని సంశయింప." ముకుంద. ౨, ఆ. ౧౦౧. విణ. పొడువైనది, దీర్ఘము. "ఆ. లంజతల్లు లనఁగ లక్షింపఁగా నిట్టి, కట్టిఁడులకు నలువ కరుణ లేక, బొఁతిమాలినట్టి బ్రతుకులు నిడుపుగాఁ, జేసి విటులగోడు వోసికొనియె."కలిక. ४, ఆ. ౧౧౦, నైష. ౭, ఆ. ౧౭౫. క్రి. విణ. నిలువుగా "సీ. అడ్డంబు నిలువు నాపడ్డలగతి మనువిల్లు డొంకలనుండి క్రేళ్లుదాఁటు." స్వా. ౨, ఆ. ౭.

నిడుబాట. ద్వ. వి. (నిడు+బాట.) పెద్దత్రోవ. "ఆ. అడరి రాకసమున నిడుబాట నట్లపాఁ,ఉదము రమ్ము జలధిఁ జదల ననిన."భార. కర్ణ. ౨, ఆ. ౬౩.

నిడుముసుఁగు. దే. వి. (నిడు+ముసుఁగు.) నిండు ముసుఁగు. "సీ. కాళ్లు కుప్పవడంగఁ గదలఁజాలక యట్టె నిడుముసుం గిడి శయనించుచెలువ." దశా. ४, అ. ४౫.

నిడుముస్తె. ద్వ. వి. (నిడు+ముస్తె.) తుంగళీ. (శ.ర.)

నిడువాలు. దే. విణ. (నిడు+వాలు.) నిడుపైనది. "సీ. వారణంబులనిడువాలు తుండంబులఁ జెలఁగి యూఁచఁగఁ గూర్కు-చిఱుతపులులు." శశాం. ౧, ఆ. ౧౯.

నిడువెండ్రుక. దే. వి. (నిడు+వెండ్రుక.) రోమాంచము. "క. జడనుం దాపము నిద్రయుం, నిడు వెండ్రుకతోడ సొగయు నిట్టూర్పులు సం,దడిగొని వడిగొని మదిలోఁ, జిడిముడిపడి కన్నులఁగవయుం జిడిముడి పడఁగాన్."ఉ. హరి. ౬, ఆ. ౭౮.

నిడువెండ్రుకవెట్టు. దే. అ. క్రి. (నిడువెండ్రుక+వెట్టు.) రోమాంచమునొందు. "చ. సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా, విర విరవోయి మేను నిడువెండ్రుక వెట్టుచుఁ గంప మొంద..." భార. భీష్మ. ౧, ఆ. ౧౮౧, భాగ. ౧౦, స్కం. ఉ. ౮౭౨.

నిడుసు. దే. వి. చదువుటలో దీర్ఘములతోఁ గూడిన పెద్దధ్వని. "సీ. నిడుసునఁ బెట్టక నిప్పొటమునఁ బోక తరువాయి తప్పక తడవికొనక." సకల. స. ౩౦౭.

నిడూర్పు. దే. వి (నిడు+ఊర్పు.) నిట్టూర్పు, దీర్ఘ నిశ్వాసము. "ఉ. ఆవచనంబు వేడ్క-విని యాదల యూఁచి, నిడూర్పు పుచ్చి హా, మావతి వత్స..." హంస. ४, ఆ. ౧౬౫, పా. శకుం. ౩, ఆ. ౫౭.

నితంబము. సం. వి. అ. పుం. 1. పిఱుఁదు; 2. మొల, కటి; 3. మూఁపు, స్కంధము; 4. ఒడ్డు, కూలము; 5. కొండనడుము అద్రికటకము.

నితంబవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. నితంబిని, స్త్రీ; 2. గొప్పపిఱుఁదులు గల స్త్రీ.

నితలము. సం. వి. అ. న. అధోలోకములలో మూఁడవది.

నితాంతము. సం. విణ. (అ. ఆ. అ.) అధికము. అధికము. క్రి. విణ. అత్యంతము.

నిత్తెపెండ్లికొడుకు. ద్వ. వి. (నిత్తెము+పెండ్లికొడుకు.) 1. నిత్యశోభనుఁడు. "క...ఏమనుచుం, దీవింప నిందు మనుపే, గోవిందుఁడు నిత్తెపెండ్లికొడుకన విందున్." రాధా. 3, ఆ. ౧౫.

నిత్తెమల్లె. వై. వి. (నిత్తెము+మల్లె.) నిత్యముఁబూయు మల్లికావిశేషము."సీ. నీలాంబరంబులు నిత్తెమల్లెలం కొండగోఁగులు మల్లెలు గోరఁటలును." భల్లా. 3, ఆ. (శ. ర)

నిత్తెము. వై. విణ. (సం. నిత్యమ్.) శాశ్వతము. "క. సత్తైన దెల్ల క్షణికము, నిత్తెము గా దంచు వాహ నివహామువలెనే." దశా. ౧౦, అ. ౫౫.

నిత్యకర్మము. సం. వి. న్. న. 1. చేయనియెడల ప్రత్యవాయము గలిగించుశాస్త్రవిహిత మగు కర్మము. (స్నానసంధ్యాది); 2. ఎప్పుడును చేయఁ దగునది.

నిత్యకల్యాణము. సం. వి. అ. పుం. ఎల్లపుడును గలుగుశుభము. "ఉ....వాద్యనిరంతరవాద్య ఘోషణల్, రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించి నిత్యకల్యాణముఁ బచ్చతోర ణమునై జను లందఱు నుల్లసిల్లఁగన్." విజ. ౧, ఆ. ౮౩, దశా. ౧, అ. ౨.

నిత్యపడి. మి. వి. (నిత్యము+పడి.) నిత్యము నియమముగా నీయవలసినది, దినపడి. "ద్వి. మ్రొక్కక కరములు మోడ్చ కందంద, చిక్కక స్రుక్కక చక్కన వచ్చి, గుడి సొచ్చి తననిత్యపడి వేఁడు కొనఁగ, మిడమిడ మిడుకుచు మిఱుమిండఁ డనియె." బస. ४, ఆ. ౧౫౮. పు.

నిత్యము. సం వి. అ. పుం. సముద్రము. విణ. (అ. ఆ. అ.) 1. ఎడతెగనిది; 2. చేయనియెడల ప్రత్యవాయము గల్గించుచు విధివాక్యముచే బోధింపఁబడునది; 3. శాశ్వతము; 4. అవశ్యకము. క్రి.

విణ. 1. ప్రతిదినము; 2. ఎల్లపుడు, శాశ్వతముగా (దీనికి కొన్ని యెడల మువర్ణలోపము. బస. ౪, ఆ. ౯౭౭. పం.)

నిత్యసమాసము. సం. వి. అ. పుం. లౌకికవిగ్రహము లేనిదికాని, స్వపదముతో కాక అస్వపదముతో లౌకికవిగ్రహము కలది యగుసమాసము. (కంఠీకారుఁడు, వ్యాఘ్రిము మొ.)

నిదర్శకుఁడు. సం. విణ. (అ. ర్శికా. అ.) 1. చూచువాఁడు; 2. కనుపెట్టువాఁడు; 3. చూపువాఁడు; 4. తెలుపువాఁడు.

నిదర్శన. సం. వి. ఆ. స్త్రీ. అర్థాలంకారవిశేషము. సరస. ౫, ఆ. ౧౫౭, ౧౫౮.

నిదర్శనము. సం. వి అ. న. 1. చూపు, దృష్టి; 2. చూపుట; 3. ఉదాహరణము; 4. ప్రమాణము. విణ. (అ. ఆ. అ.) 1. చూపునది; 2. వెల్లడించునది; 3. బోధించునది.

నిదర్శించు. సం. స. క్రి. 1. నమ్ము, విశ్వసించు. "మ. ఇతఁడా శ్రీగిరిమల్లికార్జునుఁడు... సేవెట్టిని గాను వేలుపు నిదర్శింపంగ నాతోడనా, చతురత్వంబులు..." మన్న. ౩, ఆ.౪౮; 2. నిశ్చయించు. "వ... కార్యంబు నిదర్శించి బృహస్పతి యింద్రాదిదేవతల కిట్లనియె." కాశీ. ౫, ఆ. ౨౫౫.

నిదాఘము. సం. వి. అ. పుం. 1. వేసఁగి, గ్రీష్మము; 2. వేఁడిమి, ఉష్ణము; 3. చెమట, ఘర్మజలము.

నిదానము. ఉభ. వై. వి. (సం. నిర్ధారణమ్) 1. తొందరపడక విచారించుట. (శ. ర. వా.) సం. వి. అ. న. 1. ఆదికారణము, కారణము; 2. దూడను కట్టుపలుపు; 3. రోగనిర్ణయము.

నిదానించు. యం. వై. అ. క్రి. నిశ్చయించు. "వ .. అమ్మించుఁబోఁడి విషాదంబు నివాదంబై సంధిల్లుడుఁ దన్నిదానం బిద్ది యని నిదానింప నంతఃకరణం బకరణంబు గానేరదు..." కాళిందీ. ౨, ఆ. ౬౨, సం. అ. క్రి. పరిశీలించు. "ద్వి. చీకు దర్పణము వీక్షించినయట్లు, నాకలరూపు మిన్నక నిదానించి, లేటగా నెవ్వరుఁ దెలియలే రనిన." నవనాథ. ౫, ఆ. ౧౮౬. పు.

నిదిగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వృద్ధి నొందింపఁబడినది; 2. పూయఁబడినది.

నిదిగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. 1. జలగ, జలూక; 2. వాఁకుడుచెట్టు.

నిదిధ్యాసకుఁడు. సం. విణ. (అ. సికా. అ.) నిరంతరధ్యానము చేయువాఁడు.

నిదిధ్యాసనము. సం. వి. అ. న=నిదిధ్యాసము.

నిదిధ్యాసము. సం. వి. అ. పుం. శ్రవణమననములచే తెలియఁబడినవిషయమును ఏకాగ్ర మగుమనస్సుతో నిరంతరము ధ్యానముచేయుట.

నిదిధ్యాసితము. సం. విణ. (అ. ఆ. అ.) నిరంతరధ్యానము చేయఁబడినది.

నిదిశత్. సం. (శత్రు.) 1. చూపుచున్న; 2. ఆజ్ఞాపించుచున్న.

నిదిశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ) 1. ఆజ్ఞాపింపఁబడుచున్నది; 2. చూపఁబడుచున్నది.

నిదిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూపఁబడినది; 2. ఆజ్ఞాపించఁబడినది.

నిదుర. వై. వి. (సం. నిద్రా.) నిద్ర. "మ... రాజనందనుఁ జూ ప్పారయ వేఁడి పేరెలుఁగు నిద్రక్ మేను దూఁగాడెడుఁగ్, నను నీయంకతలమ్మున న్నిదురనూనం జేయవే వేఁడెదన్." విక్ర. ౩, ఆ. ౯౪, భార. ఆశ్ర. ౧, ఆ. ౬౭.

నిదురతెలియు. ద్వ. అ. క్రి. (నిదుర+తెలియు.) మేలుకాంచు. "ఆ సాంధ్యరాగలహరి సామిరంజితములై, లిరిగె మింట నిదుర తెలిసినట్టి యిందిరాధిపతికి నెత్తుకప్పూరనీ, రాజనంబు లన శరద్ఘనములు." ఆము. ౪, ఆ. ౧౩౯.

నిదురపుచ్చు. ద్వ. స. క్రి. (నిదుర+పుచ్చు) నిద్రింపఁజేయు. "సీ. అత్తమామలు సుఖాయత్తులై పవళింప మృదుపదంబుల నొత్తి నిదురపుచ్చి." శుక. ౧, ఆ. ౧౪౯.

నిదురపోతు. ద్వ. విణ. (నిదుర+పోతు.) ఎల్లపుడు నిదురపోవుస్వభావము కలవాఁడు, నిద్రాళువు. "క. వినియుం వినవు రణభీరువు, మనుజాధము నిదురపోతు మందుని నకటా, నినుఁ జక్రవర్తిఁ జేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడును గలఁడే." భాగ. ౯, స్కం. ౪౧౯.

నిదురపోవు. ద్వ. అ. క్రి. (నిదుర+పోవు.) నిద్రించు. "ఉ...కడుఁ దిమ్మటచే శ్రమమొందినారుగాఁ, బోలును బోదునా నిదురపోయెద రే యని...", కళా. ౪, ఆ. ౧౦౯. ఇట్లే నిదురవోవు. ఉ. రా. ౬, ఆ. ౩౭౫.

నిదురించు. వై. అ. క్రి. నిద్రనొందు, నిద్రించు. "క. నిదురించినశిశు వాకొని, కిదుకుచుఁ జను

గోరి కెరలి..." భాగ. ౧౦, స్కం. పూ. ౨౫౦. నీలా. ౧, ఆ. ౭౬.

నిదేగ్ధ. సం. విణ. (ఋ. గ్ధీ. ఋ.) పూయువాఁడు.

నిదేగ్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పూయఁదగినది.

నిదేశకుఁడు. సం. విణ. (అ. శికా. అ.) 1. చూపువాఁడు; 2. ఆజ్ఞాపించువాఁడు.

నిదేశనీయము. సం. = నిదేష్టవ్యము.

నిదేశము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. చెప్పుట, కథనము; 3. దాఁపు, నికటము.

నిదేశి. సం. విణ. (న్. నీ. న్.) 1. చూపువాఁడు; 2. ఆజ్ఞాపించువాఁడు.

నిదేశించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు. "మ. జనిసాహస్రతపఃఫలం బితనిసాక్షాత్కార మీస్వామి కై, క నిదేశింప పనిం జరింపఁ జను టాకర్ణింప శక్యంబె..."చం. రా. ౪, ఆ. ౬౪.

నిదేశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁదగినది.

నిదేష్ట. సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. చూపువాఁడు.

నిదేష్టవ్యము. సం. = నిదేశ్యము.

నిద్దపుఁదనము. వై. వి. (సం. స్నిగ్ధత్వమ్.) నునుపు, స్నిగ్ధత్వము. "వ...పలుఁదతనంబులు సలపందనంబులు నిద్దంపుఁదనంబులు తద్దయుం గలిగి... కనక కదళిమృదులంబులు నైనపెందొడలును..." పాండు. 3, ఆ. ౧౭౯.

నిద్దము. వై. వి. (సం. స్నిగ్ధమ్.) 1. నున్ననిది. "గీ. ఉవిదనిద్దంపుజంఘలసవతుఁ గోరి, కలమగర్భంబులడఁచులోఁగంటకములు." ఆము. ౫, ఆ. 33; 2. మనోహరము. "ఉ...పికంబు గూయ న, న్నిద్దపుమోవిత మాన్పుదురు నెచ్చెలు లిచ్చ యొఱింగి యిచ్చుటన్." కావ్యా. ౧, ఉ. ౬౮, విక్ర. ౨, ఆ. ౧౦౨; 3. స్నేహము గలది, ప్రేమతోఁ గూడినది. "సీ. బ్రహ్మాండకోటుల పారుపత్తెము సెల్లఁ గని యున్కి నిద్దంపుమనసుతోడ." పాండు. ౧, ఆ. ౭; 4. అధికము. "సీ. తల్లిదండ్రులకు నిద్దపుభక్తి తపణిల్ల శుశ్రూష చేసినశుద్ధమతులు" కాశీ. ౨, ఆ. ౧౧, దశా. ౮, ఆ. ౮౮; 5. సాంద్రము, దట్టము. "చ.. నివిడీన బొజ్జపై మిగులునిద్దపుదోవలిదట్టి డొల్లి రాఁ, విచి పెనంగ వల్లువముఁ ద్రెంచి..." ఆము. ౬, ఆ. ౧, శ్లో. ౪౪.

నిద్దా = నిద్దము. వై. విణ. 1. ప్రేమ గలది. "క. ముద్దుల నిడి పడకిండ్లన్, ముద్దియ లాత్మీయ లెనసి మురియుచు నిద్దా, సుద్దుల నెత్తుచు, నందొగి, విద్దెము విద్దె మని కాళివిద్దెం బనుచున్." రా. వి. ౨, ఆ. ౨౦; 2. అధికము. "ఉ. రాత్రియుం బవల్ మఱపురానివ్యాయల్ చెవియారజంపుని, ద్రాతరిటీపులంబ లెను దారసిలన్ వలె లోఁదలంచినన్." (పెద్దనచాటువు.); 3. శ్రేష్ఠము. "సీ. జిలుఁగుచీనాపట్టుచెంగావిచెఱఁగులనిద్దాజరీనిశానీలకరులు." రంగా. ౧, ఆ. ౧౫౬; 4. సాంద్రము, దట్టము. "మ. తళుకుంజాయకజాని మైపొడలు నిద్దామీసలున్... కల్గు నిన్ను భజియింతున్ దంభమీనాధిపా."దశా. ౧,అ.౨౧౧.

నిద్దుర = నిదుర. "చ. మననాయకుఁ డేమి చెప్పనిద్దుర మునుమున్న గాఁ దెలిసి తోడుగ నిన్నెటులైనఁ దేక..." రాఘవ. ౪, ఆ. ౧౯౨. నైష. ౮, ఆ. ౧౭.

నిద్దురగొను. ద్వ. అ. క్రి. (నిద్దుర+కొను.) నిద్రించు. "సీ...నిద్దురగొనియె గుఱక, గొనియె నిద్దుర వోయెఁ గూర్కెడె నన నిద్రితుల కొవ్వు..." సాం. ని. మాన. ౨౩.

నిద్దురపుచ్చు = నిదురపుచ్చు. "చ. వదిసెలపోరు మాన్పి నిజవల్లభునిద్దురపుచ్చు మామనో రదు మఁగ..." శుక. ౨, ఆ. ౯౮.

నిద్దురపోతు = నిదురపోతు. "సీ. అలిధనాపేక్షచే నలరక నిద్దురపోతును గాక పెంపుడును గాక." భల్లా. ౪, ఆ. (శ. ర.)

నిద్దురపోవు. ద్వ. అ. క్రి. (నిద్దుర+పోవు.) నిద్రించు. "ఉ...వాణీవిభుఁ డిప్డు మై మఱచి నిద్దుర వోవఁగఁ జూచి..." దశా. ౧, అ. ౨౭౫.

నిద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నిదుర, కూర్కు. "వ... వేగుఁబోకట నంకురించుమదంబునఁ గెంపుగదురుట నిద్ర లేమి నని శంకింపక..." భార. విరా. ౨, ఆ. ౨౪౦; 2. కునికిపాటు, తూఁగు; 3. మొగుడుట, ముకుళనము.

నిద్రతెలియు. మి. అ. క్రి. (నిద్ర+తెలియు.) మేల్కాను. "గీ. సీరకేతుఁడుఁ డక్కేళి నిద్ర తెలిసి." ఆము. ౪, ఆ. ౧౪౪.

నిద్రపుచ్చు. మి. స. క్రి. 1. (నిద్రపోవు ధా. ప్రే.) నిద్రింపఁజేయు. "ఉ. పాపని నిద్రపుచ్చి తగ

పొన్నున..." హరి. పూ. ౫, ఆ. ౧౭౨; 2. లయమొందించు. "గీ. సకలమును నిద్రపుచ్చు కేశవుని నిద్రపుచ్చుఘనునకు నిట్టి దద్భుతమె తలఁప." ఆము. ౪, ఆ. ౧౦౯. (ఇది మొదటి యర్థమునకు నుదాహరణము.)

నిద్రపోతు. మి. వి. (నిద్ర+పోతు.) నిద్రాళువు. "ద్వి. నిదురదపండ్లది యైన నిద్రపోతైన." ద్వి. భల్లా. ౨, ఆ. ౩౭, పు.

నిద్రపోవు. మి. అ. క్రి. (నిద్ర+పోవు.) నిద్రించు. "క...అమ్మునఁ జేయిడి నిద్రవోయె ముది తాత్ముండై." భార. ఆది. ౬, ఆ. ౬౨, ఆము. ౪, ఆ. ౨౪౧.

నిద్రచేయు. మి అ. క్రి. (నిద్ర+చేయు.) నిద్రించు. "ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు మున్నున్న తెఱంగు దప్పక సుఖోచిత శయ్యను నిద్రసేయ నీ, కన్ను మొగుడ్చు నూఱటకుఁ గారణ మెయ్యది భీమసేన..." భార. విరా. ౨, ఆ. ౧౬౬, రళ. ౯, ఆ. ౪౨.

నిద్రాణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిదురించునది; 2. ముకుళించునది. "శా...దిశాస్తోమంబు శోభాదరి, ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్." స్వా. ౩, ఆ. ౧౨.

నిద్రాళువు. సం. విణ. (ఉ) నిద్రాశీలుఁడు, నిదురపోతు.

నిద్రించు. సం. అ. క్రి. నిదురపోవు. "వ. ఇట్లూహించి రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులుఁ గ్రమంబున నిద్రింపం దొడంగినన్...." భార. విరా. ౨, ఆ. ౧౬౫, కాళిందీ. ౬, ఆ. ౨౭౪.

నిద్రితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిద్రించినది; 2. ముకుళించినది, మొగిడినది. (పువ్వు. మొ)

నిద్రిలు. సం. అ. క్రి. నిద్రించు. "ఉ...జటాచ్ఛటాచ్ఛదిక్, ద్రుట్టైలుగట్టి నిద్రిలుమరుద్భగదీశకులంబు మేల్కనన్." పాండు. ౫, ఆ. ౨౪౯.

నిధనము. సం. వి. అ. పుం. న. 1. మరణము; 2. చేటు, నాశము; 3. సమాప్తి.

నిధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బీద, నిర్ధనుఁడు. సం. వృచ్ఛ. ౧, అం. ౧౪.

నిధానము. సం. వి. అ. న. 1. ఉంచుట, స్థాపనము; 2. పదిలపఱచుట; 3. పాఁతిపెట్టినసొమ్ము, నిధి; 4. ఆశ్రయము, ఆధారము.

నిధి. సం. వి. ఇ. పుం. 1. ఆధారము, ఆశ్రయము; 2. పాఁతర; 3. బొక్కసము, కోశాగారము.

నిధువనము. సం. వి. అ. న. 1. మైథునము, స్త్రీపురుషులరతి; 2. క్రీడ, కేళి; 3. వడఁకు, కంపము.

నిధ్యాతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధ్యానింపఁబడినది; 2. చూడఁబడినది.

నిధ్యానము. సం. వి. అ. న. దర్శనము, చూపు.

నిధ్యానించు. సం. స. క్రి. చూచు. "వ. ఫలితసహకారంబు నిధ్యానించురాజకీరంబువడువునఁ బ్రియనందన సందర్శనానంద కందలతుందిల హృదయారవిందుండై..." నిరం. ౧, ఆ. ౮౭.

నిధ్వానము. సం. వి. అ. పుం. ధ్వానము, శబ్దము.

నినదము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

నినదించు. సం. అ. క్రి. ధ్వనిచేయు. "క. అనిఁ దృణముగఁ బఱచి జేయని, నినదించుచుఁ బోరలు విమతనికరముఁ గరుణన్, గనుఁగొని కాచుట సైజము..." కావ్యా. ౫, ఉ. ౬౨.

నినయనము. సం. వి. అ. న. 1. పొందించుట; 2. చేయుట; 3. (కాలము) కడపుట; 4. సిద్ధింపఁజేయుట.

నినాదము. సం.=నినదము.

నినాది. సం. విణ. (న్. నీ. న్.) 1. ధ్వనించునది, మ్రోఁగునది; 2. వాయించునది.

నినాదితము. సం. వి. అ. న. ధ్వని. విణ. (అ. ఆ. అ.) మ్రోయింపఁబడినది.

నినుచు. దే. అ. క్రి. (నిండుధా.) అతిశయించు. "సీ. చైత్యారి వశమైనతనచిత్త మంతయు నినుచు గౌరవమున నివ్వటించి." పాండు. ౧, ఆ. ౯. స. క్రి. (నిండుధా. ప్రే.) 1. ఉంచు, పెట్టు. "క. అనుటయు రసలింగము నిడు, తనవట్టువ ప్రేఁకసజ్జదంతపుబరణిన్, నినిచినయొక పస రిది యది, యని చెప్పక భూసెఁ దత్పదాంబుజయుగళిన్." స్వా. ౧, ఆ. ౭౦, రసిక. ౪, ఆ. ౭౪; 2. వ్యాపింపఁజేయు, "క. మనిచెద నామానాంగము, నినిచెద భువనములఁ గీర్తి నిష్ఠురగతితో నవిచెద నిను జముప్రోలికి..." భా. రా. యుం. ౧౨౩౯; 3. చిప్పిలఁజేయు. "మ...వ్రాఁ, మ్మనినిట్టూర్పు నిగుడ్చుఁ గన్నుఁగవ బాష్పాంభఃకణంబుల్ గడున్, నినుచున్..." భో. ౪, ఆ. ౭; 4. నాఁటు; ఏయు. "చ. కినుక మనంబునం గదిరి

క్రీడి పితామహువిల్లు ప్రేల్చి డింప,దునిమి నితాంత గాఢరయదోర్విభవంబున నొండువిల్లు గై,కొని యొడసందునన్ నినిచెఁ గ్రూరశరంబు లురంబు నందు..." భార. విరా. ౫, ఆ. ౧౭౬, అచ్చ. యు. ౨౧౪; 5. నించు, నిండించు. "చ. అని ప్రణమిల్లినన్ ఫణికులాధిపుఁ డయ్యమృతంబు కుండలో, నినిచి ప్రియంబుతో నొసఁగి..." ద్వా. ౯, ఆ. ౧౨౭, హరి. ఉ. ౧, ఆ. ౧౦.

నినుపారు. దే. అ. క్రి. (నినుపు+ఆరు.) 1. అధికమగు. "సీ. నిండారు చందురు నినుపారు నును గాంతిఁ జెలువగా మరుఁడు సృజించి నట్లు." మార్క. 3, ఆ. ౯3, నిర్వ. ౧, ఆ. ౫౫; 2. పూర్ణమగు, నిండు. "మ...నాల్గోడలన్, నిను పారంగ సువర్ణ మెత్తికొని..." కేయూర. 3. ఆ. ౧౭౧, భార. అశ్వ. 3, ఆ. ౧౪౫; 3. వ్యాపించు. "ఉ. చిల్లులచిల్కులం జిలికి చిల్కల కొల్కులు చల్లులాడ సం,పల్లలితాంగి చూచి కడుఁ బైకొను వేడుక వారిపూరముల్, చల్లెఁ దదంగ నాంగలతలన్ నినుపార ననంగ నప్పు డు,త్ఫుల్లపయోరుహాంతరమధూళిఁ జివుక్కునఁ జిమ్మెఁ దెమ్మెరల్."రాజ. చ. ౨, ఆ. ౧౫౫; 4. చిప్పిలు, పైకుబుకు. "చ...కరుణారసంబు నినుపారెడు చూపులఁ జూచుఁగావుతన్." పారి. పీఠి. ౬.

నినుపు. దే. వి. (నినుచుధా.) వెల్లువ, జలపూరము. "చ...కన్నులన్, నినుపులు గాఁగ బాష్పములు నివ్వటిలంగ..." భో. ౭, ఆ. ౧౦. విణ. 1. మనోజ్ఞము. "ద్వి. నినుపుగా స్ఫాటికనిర్మలలింగ, మనఁగ నాస్ఫాటికాయతలింగమూర్తి, వరుణుండు ధరియించి..." పండితా. దీక్షా. ౧౮, పు. 2. సమృద్ధము. "చ. నినుపు లాకర్తు చేతఁ గమనీయలతాంతము లున్న నొక్కెడన్, గనుఁగొని..." నిర్వ. ౮, ఆ. 3౬.

నిన్న. దే. వి. ఖా. (క. నిన్నత. నిణ్ణల్.) 1. కడచినదినము, పూర్వదివసము. "సీ. జనసుత దాని వత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచు నున్న యదియు." భార. ఆది. ౮, ఆ. ౧౧౮, వసు. ౫, ఆ. ౫౮; 2. అచిరభూతకాలము, కొలఁది కాలమునకు ముందు. "సీ. మేనత్త యను మేర మాఱి రాధికతోడ జనయఁడే నిన్నన యనుఁగు బావ."శశాం. 3, ఆ. ౮౧, ఆము. ౬, ఆ. ౪౦.

నిపతనము. సం. వి. అ. న. పాతముచదువుట.

నిపతము. సం. వి. అ. పుం. = నిపతనము.

నిపతనము. సం. వి. అ. న. 1. క్రిందఁబడుట; 2. పశుపక్ష్యాదులు క్రిందికి వచ్చుట.

నిపతించు. సం. స. క్రి. 1. పడఁద్రోయు, పడఁగొట్టు; 2. నిపాతముచేయు. (వ్యాక.)

నిపతితము. సం.=నిపాతితము. పడఁగొట్టఁబడినది. "ఆ. పాత్రరథుండు నిపతితాశ్వుండు సంఛిన్న, చాపుడును..." భార. విరా. ౫, ఆ. ౧౫౦.

నిపత్య. సం. వి. ఆ. స్త్రీ. 1. యుద్ధభూమి; 2. జాఱునేల, పిచ్చిలభూమి.

నిపము. సం. వి. అ. పుం. న. కలశము. పుం. కడిమిచె.

నిపాఠము. సం. వి. అ. పుం. పాఠము చదువుట.

నిపాతకము. సం. వి. అ. పుం. న. పాపము, పాతకము. విణ. (అ. తిక్తా. అ.) క్రిందికి త్రోయునది.

నిపాతన. సం. వి. ఆ. స్త్రీ. పతనము, పాటు. "ఉ... ఉగ్రగదఁ గైకొని వైచినఁ దన్నిపాతనన్, సూతతురంగకేతువులు చూర్ణములై యొడలెన్..." హరి. ఉ. ౧౦, ఆ. ౭౧.

నిపాతనము. సం. వి. అ. న. 1. పడఁద్రోయుట; 2. చంపుట, మారణము; 3. సూత్రమునకు వ్యతిరేకముగా శబ్దరూపమును విధించుట; 4. పక్షులు మొదలగునవి క్రిందికి వచ్చుట. విణ. (అ.ఆ.అ.) 1. పడఁద్రోయునది; 2. చంపునది.

నిపాతము. సం. వి. అ. పుం. 1. పతనము, పడుట; 2. క్రిందికి వచ్చుట; 3. మీఁదికి దుముకుట; 4. ఏయుట, బాణాదులు విసరివైచుట; 5. చావు, మరణము; 6. అప్రయత్నము, యదృచ్ఛ; 7. సూత్రములకు వ్యతిరేకముగా విధించినశబ్దము. "గీ. అలసస త్త్వంబుల నసత్త్వములఁ గ్రియాప, రాశయముల స్వరాదుల నవ్యయములఁ, దా నిపాతంబులుగఁ జేసి ధరఁ దదంతసంగ్రహాయత్తమతి యైనసాధుమాళి." కాళిందీ. ౫, ఆ. ౨౨; 8. అవ్యయము. విణ. (అ. ఆ. అ.) పడఁగొట్టఁబడినది. కాళిందీ. ౫, ఆ. ౨౨.

నిపాతి. సం. విణ. (న్. నీ. న్.) 1. పడునది; 2. పడఁద్రోయునది; 3. నశించునది; 4. క్రిందికి వచ్చునది; 5. నాశము చేయునది 6. నిపాతము గలది.

నిపాతించే = నిపతించు. (పడఁగొట్టు.) "క. అతో యధి నీచేతం, బీతం బగుడుం గడంగి భీమాసుర సం,ఘాతంబుఁ దల్ క్షణంబ ని,పాతింతుము దివ్య శస్త్రపటుఘాతములన్." భార. అర. ౩, ఆ. ౩౬.

నిపాతితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పడఁద్రోయఁబడినది; 2. చంపఁబడినది; 3. నిపాతము చేయఁ బడినది. (వ్యాక.)

నిపానము. సం. వి. అ. న. 1. నిశ్శేషముగా త్రాగుట; 2. పసులు లోనగునవి నీళ్లు త్రావుటకై బావులు మొదలగువానితోఁ గట్టినతొట్టి; 3. జలాశయము.

నిపీడన. సం. వి. ఆ. స్త్రీ = నిపీడనము.

నిపీడనము. సం. వి. అ. న. 1. గట్టిగా పిడుచుట; 2. మిక్కిలి బాధించుట; 3. గట్టిగా అదుముట.

నిపీడితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పిండఁబడినది; 2. గట్టిగా అదుమఁబడినది; 3. మిక్కిలి బాధింపఁబడినది.

నిపీడితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి బాధింపఁబడినవాఁడు. "ఉ...ఈ, కావరమైన కీచకుఁడు గామనిపీడితుఁడై..." భార. విరా. ౨, ఆ. ౨౨౮.

నిపీడ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి బాధింపఁబడుచున్నది. "క...మనోభవ నిపీడ్యమానమానస నయితిన్." భార. ఆది. ౬, ఆ. ౧౯౩.

నిపీతము. సం విణ. (అ. ఆ. అ.) త్రాగఁబడినది.

నిపీతి. సం. వి. ఇ. స్త్రీ. పానము, త్రాగుట.

నిపుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి, ప్రవీణుఁడు.

నిప్పచ్చే = నిప్పచ్చరము. (శ. ర.)

నిప్పచ్చరము. ద్వ. వి. (నిఱు+పచ్చరము.) దారిద్ర్యము, బీదఱికము. "క. అలజడిగలారు కలుషము, గలారు నిప్పచ్చరంబు గలవారు రుజల్, గలవా రనభిజ్ఞత్వము, గలారు పురి నెందు లేరు..." కవిజ. ౧, ఆ. ౨౬, ఆం. భా. ద్వి. ౨౧౦. విణ. 1. శూన్యము, రిక్తము. "గీ. బోధమల్పంబు గర్వ మభ్యున్నతంబు, శాంతి నిప్పచ్చరంబు..." భీమ. ౧, ఆ. ౧౩. కాశీ. ౫, ఆ. ౩౦౨; 2. బలహీనము; దీనము. "గీ. మోఱకుని చందమున నీఱుతాఱుచూపు, పాండవేయుని పైఁ దార్చి బ్రాహ్మణుండు, పలికె నిప్పచ్చరంబైన భాషణముల." హర. ౭, ఆ. ౧౮.

నిప్పటి. దే. వి. (నిప్పు+అట్టు.) భక్ష్యవిశేషము, ఆకులు కప్పి నిప్పులో వేసి కాల్చెడి అట్టు. "ఉ......భానుమండలము మాఁడినదిప్పటివోలె నుండ..." రామా. ౮, ఆ. ౬౩, ఆం. భా. ద్వి. ౨౫౬.

నిప్పట్టు. దే. వి. (నిప్పు+అట్టు.) నిప్పటి. "వ... ఉండ్రంబులు కుడుములు దోసెలు నిప్పట్లు..." ప్రబంధ. ౧౧౨.

నిప్పస్తు. దే. వి. (నిఱు+పస్తు.) పూర్ణమైనయుపవాసము; ఉపవాసము. "క...అహో రూహారము, దొరకదు నిప్పస్తు లుండుదుమె నీమ్రోలన్." వేం. పంచ. ౧, ఆ. ౪౯౫. ఆం. భా. ద్వి. ౧౭౫.

నిప్పు. దే. వి. (క. నిప్, నిప్పురి.) అంగారము; అగ్ని. "ఉ. అత్తఱి ద్రొక్కినటు లౌదల దేల్గాని నట్టులు..." పాండు. ౫, ఆ. ౧౮౯. ఆం. భా. ద్వి. ౨౪౨. బ. అగ్నికణములు, విస్ఫులింగములు. "క. అప్పుడు కోపము గన్నుల, నిప్పులు రాల్పంగ..." భార. భీష్మ. ౩, ఆ. ౩౫౦. భా. రా. అర. ౧, ఆ. ౨౪౭.

నిప్పుఁదిండి. దే. వి. (నిప్పు+తిండి.) పక్షివిశేషము. (శ. ర.)

నిప్పుక = నిప్పు. (నిప్పు+ఉక-స్వార్థమున.) అగ్ని; అంగారము. "ద్వి. ఎఱుఁగరా దీతని వెసఁగు తేజంబు, మఱుపడ్డనిప్పుకమాడ్కి నున్నాఁడు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౭. పు. ౩౩౪. పం. ఆం. భా. ద్వి. ౨౪౨. బ. విస్ఫులింగములు, అగ్నికణములు. "క...కురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలు గుప్పలుగన్." పాండు. ౫, ఆ. ౧౮౮. ఆము. ౪, ఆ. ౯౮.

నిప్పోటము. దే. వి. (చదువుటలో) అతిత్వర. "సీ. నిడుసునఁ బెట్టక నిప్పోటమునఁ బోక తరువాయి తప్పక తడవికొనక." సకల. స. ౩౫. పు.

నిబంధ. సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. గ్రంథకర్త; 2. బంధించువాఁడు.

నిబంధకుఁడు. సం. విణ. (అ. ధికా. అ.) = నిబంధ.

నిబంధనము. సం. వి. అ. న. 1. కట్టుట, బంధించుట; 2. గృహాక్షూపాదులను నిర్మించుట; 3. అడ్డగించుట; 4. సంకెల; 5. ప్రాపు, ఆలంబము; 6. ఏర్పాటు; 7. స్థానము; 8. హేతువు; 9. గ్రంథము; 10. రచన, కూర్పు; 11. సంబంధము;

12. వ్యాఖ్యానము, వివరణగ్రంథము. సం. విణ. (అ. ఈ. అ.) బంధించుటకు సాధనమైనది.

నిబంధని. సం. వి. ఈ. స్త్రీ. సంకెల; గొలుసు లోనగు బంధించుసాధనము.

నిబంధము. సం. వి. అ. పుం. 1. బంధించుట, కట్టుట; 2. గృహానూపాదులను నిర్మించుట; 3.(గ్రంథము) రచించుట. 4. గ్రంథము; 5. అడ్డగించుట. ప్రతిబంధము; 6. సంకెల; 7. ఏర్పాటు; 8. ఆధారము, ఆశ్రయము; 9. హేతువు.

నిబంధి. సం. విణ. (న్. సీ. న్.) 1. బంధించునది; 2. మూలమైనది, కారణము; 3. సంబంధించునది.

నిబంధించు. సం. స. క్రి. 1. బంధించు, కట్టు; 2. అడ్డగించు, నిరోధించు. "మ...చిక్కఁ డింద్రియములం ద్రిప్పక నిబంధించుచున్." భాగ. ౧, స్క. ౭౫; 3. కూర్చు, రచించు. "వ...ఒక్క దివ్యప్రబంధంబు నిబంధింపక మదిఁ నెంచునవసరంబున." ఆనంద. పీఠి. ౧౨.

నిబద్ది. దే. విణ. సత్యము, నిజము. "క. దగ దప్పి యుండుగు నొంటం, బిగి దప్పదు జబ్బుకండ వెట్టఁగ నీ ద్రావఁగ మేలుగాదె యింకా, బగుగుణములు వేటలో నిబద్దే యనుమీ." పార్వ ౬, ఆ. ౫౧, ప్రబోధ. ౨, ఆ. ౫౩.

నిబద్దించు. దే. స. క్రి. నిజపఱుచు, రుజువుచేయు. "క. గద్దించును లేదన్న ని,బద్దించును జూడకున్నఁ బరితాపించున్." రాధా. ౧, ఆ. ౨౫, (శ.ర.పా.)

నిబద్దిలించు = నిబద్దించు. "మ...పొందుగ నీసుద్ది నిబద్దిలించు జవధద్రుండాగ్రహం బందుచోన్." ఉ. హరిశ్చ. ४, ఆ. ౫౧. (శ. ర. పా.)

నిబద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బంధింపఁబడినది, కట్టఁబడినది; 2. అడ్డగింపఁబడినది; 3. రచింపఁబడినది. (గ్రంథము); 4. ఖచితము; 5. సంబంధించినది.

నిబర్హణము. సం. వి. అ. న. చంపుట, వధము. విణ. (అ. ఆ. అ.) 1. చంపునది; 2. పోఁగొట్టునది. "క...అఘనిబర్హణమే యది యక్కథయ వినఁగ నిష్టము మాకున్." భార. ఆది. ౧, ఆ. ౩౦.

నిబర్హితము. సం. విణ. (అ. ఆ. అ.) చంపఁబడినది.

నిబిడము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సాంద్రము, దట్టము; 2. గట్టిది, దృఢము. [(శ. ర.)

నిబిడీకరించు. సం. అ. క్రి. దట్టముగా చేయు.

నిబిడీకృతము. సం. విణ. (అ. ఆ. అ.) నిబిడముగా చేయఁబడినది.

నిబిరీసము. సం. = నిబిడము.

నిబోధకుఁడు. సం. విణ. (అ. ధికా. అ.) 1. బోధించువాఁడు; 2. గ్రహించువాఁడు.

నిబోధనము. సం. వి. అ. న. 1. తెలియుట, గ్రహించుట; 2. తెలుపుట, బోధించుట.

నిబ్బద్ది = నిబద్ది. "సీ., నిబ్బద్ది నిక్కము నిలువరంబు నిజము నిక్కువ మన సెగడు సత్యము పేర్లు." సాం. ని. మాన. ౫౧, వేంక. మాన. ౬४.

నిబ్బరము వై. వి (సం. నిర్భరమ్.) 1. అక్కఁగలివిశేషము. "సీ. బలునిబ్బరమునకుఁ బ్రతి గాక గరుడియనామధేయుఁనివాహనం బనఁ దగె." ఉ. రా. ౧, ఆ. ౧౭; 2. అధిక్యము, అతిశయము. "గీ...మిక్కిలి మిక్కుటం బగ్గలంబు, బెట్టు నిబ్బరము దిటము బిట్టు గాట, మనఁగ నతిశయమగును..." ఆం. భా. ప్ర. ౬౬; 3. బొన్నత్యము. "చ. కురులసిరుల్ మెఱుంగుఁజను గుబ్బలనిబ్బరమున్..." పాండు. ౫, ఆ. ౨౭; 4. బెస్తలు సవారిమోయునపుడు మిట్టపల్లము మొ. సూచించు హెచ్చరికపదము. "వ... బెస్తలు సిస్తుగా మోచి నిబ్బడుగు ... నిబ్బరము...అన విని..." ప్రబంధ. ౭౦౫; 5. దిట్టతనము, ధైర్యము. "క. ఆమాట విని తలారు లి,దేమని గద్దింప.....నిబ్బరంబునఁ బలికెన్." శుక. ౩, ఆ. ౫౭౫; 6. పారవశ్యము. "చ...౨౦, డొకమతి విష్ణుభక్తి మది నుబ్బిన నిబ్బర మందుచుండు...భాగవతోత్తముఁ డాత్మఁ జొక్కుచున్." వి. పు. ౨, ఆ. ౩౦౦; 7. తదేకాగ్రత. "క...ఉత్సాహంబుల్, గుబ్బతిలఁ గొన్నిచెట్లకు, నిబ్బరమున జలము లెత్తి నిస్త్రాణండై." హంస, ౧, ఆ. ౧౯౬. 8. బుజాత్వము, సూటి. "ఉ ..ఇరుతెక్కలుక్ ముడిచి యబ్బురపుంబలు నిబ్బరంబునన్." "గీ...పా రావతంబు రాఁ దొడఁగె..." సా. ౧, ఆ. ౧౨౬, ౧౨౭. విణ. 1. అధికము. "ఉ. పె, న్నింటలఁ గూర్చుకామమును నిబ్బర మైన మదంబునై మనం, బొంటికిఁ బోక భర్త్రురతి కున్విరలార..." హరి. ఉ. ౭, ఆ. ౮౧, నైష. ౫, ఆ. ౧౭౭; 2. ఉన్నతము; పీనము. "గీ.

నిబ్బరపుగబ్బిగుబ్బల యుబ్బుకతన..." వసు. ౨, ఆ. ౧౫౪; 3. తీక్ష్ణము. "గీ...అయ్యగనిపతియు, డెబ్బదేనుదొమ్మిదియును నిబ్బరంపు, టమ్ము లతనిపైఁ బరఁగింపె నలుక మిగుల." హరి. ఉ. ౨, ఆ. 33, హరి. పూ. ౪, ఆ. ౧౭౦; 4. స్పష్టము. "క. ఈకన్నియకుం దగునొక, రాకొమరుని నరసి నిబ్బరంబుగ నిపుడే, మాకెఱిఁగింపుము..." నీలా. ౧, ఆ. ౯౦; బస. ౭, ఆ. ౨౧౩. పు. 5. స్థిరము, నిశ్చలము. (వ్యవ.); 6 దిట్టరి. "క. నిబ్బరపుబాల వాంతయు..." భాగ. ౧, స్కం. ౧౭౩.

నిబ్బరించు. వై.అ. క్రి. 1.అతిశయించు. "ఉ.గుప్పున నవ్వు దప్పుడఁలిగుబ్బలు మించె...ఉబ్బున నిబ్బరించుచున్." చంద్రా. ౬, ఆ. ౧౪౨; 2. నిదానించు. (శ. ర.)

నిబ్బరికము = నిబ్బరము. వి. 1. ఋజుత్వము, సూటి. "గీ. నిబ్బరిక మేది యను .." సా. ౨, ఆ. ౨౧౫; 2. దయ, కారుణ్యము. "సీ...అక్కటికం బన నక్కఁస మన, నిబ్బరిక మనఁ గనికరం బనంగను గారుణ్యసంజ్ఞయై మీఱుచుండు." ఆం. భా. ప్ర. ౧౩౧.

నిబ్బరికించు. వై. అ. క్రి. 1. కరుణించు. (శ. ర.); 2. నిదానించు, ఆలోచించు. "ఉ. నిన్ను నె నమ్మియున్నయెడ నిబ్బరికింపక చోరవృత్తి నా, కన్నియఁ దెచ్చు టింతయును గానివిధం బని .." పరమ. ౪, ఆ. ౧౧౧; 3. ఉప్పొంగు. "వ... అగ్గుబ్బలి సోయగంపుటుబ్బునకు మైనిబ్బరికింప నబ్బురపడి యబ్బలియుండు తనలోన." య. ౨, ఆ. ౪౦.

నిభము. సం. వి. అ. పుం. 1. ప్రకాశము; 2. నెపము, వ్యాజము. (శ. ర.) విణ. (అ. ఆ. అ.) ఇది సమాసోత్తరపదముగనే కనపట్టుచున్నది. 1. సమానము, సదృశము; 2. మిక్కిలి ప్రకాశించునది.

నిభృతము. సం. వి అ. న. అడఁకువ, వినయము. విణ. (అ. ఆ. అ.) 1. స్థిరము, నిశ్చలము; 2 పూర్ణము; 3. గుప్తము; 4. గూఢము, అస్పష్టము; 5. రహస్యమైనది; 6. అడఁకువ కలది, వినీతము.

నిభృతుఁడు. సం. విణ (న్. నీ. న్.) చలింపనివాఁడు. "క...పవనపుత్త్రుఁడు మనుజేంద్రునకు జయశబ్దయుంతముగ, వినయంబున మ్రొక్కి విన్నవించె నిభృతుఁడై." భార. విరా. ౧, ఆ. ౨౧౭.

నిమంత్రకుఁడు. సం. విణ. (అ త్రికా. ఆ.) నిమంత్రణము చేయువాఁడు.

నిమంత్రణము. సం. వి. అ. న యజ్ఞాదులకు పిలుచుట.

నిమంత్రణీయుఁడు సం. విణ. (అ. ఆ. అ.) నిమంత్రణము చేయఁదగినవాఁడు.

నిమంత్రించు. సం. స క్రి. (యజ్ఞాదులకు, పిలుచు, ఆహ్వానించు.

నిమంత్రిత. సం. విణ (ఋ. త్రీ. ఋ.) నిమంత్రించువాఁడు.

నిమంత్రితము. సం. విణ. (అ. ఆ. అ.) నిమంత్రింపఁబడినవాఁడు.

నిమగ్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మునిఁగినవాఁడు; 2. లీనుఁడు, అణఁగినవాఁడు.

నిమజ్జకుఁడు. సం. విణ. (అ. జ్జికా. అ.) మునుఁగువాఁడు.

నిమజ్జథువు. సం. వి. ఉ. పుం. 1. నిమజ్జనము, మునుఁగుట; 2. శయనించుట.

నిమజ్జనము. సం. వి. అ. న. 1. మునుఁగుట; 2. లీనమఁగుట.

నిమటాయి. దే. వి. ఒకానొకతీఁగ. "సీ. నిమటాయి గొలిమిడి నీరుబచ్చలి .." హంస. ౪, ఆ. ౧౦.

నిమయము. సం. వి. అ. పుం. ఒకవస్తువు నిచ్చి దానికి బదులు మఱొకవస్తువు పుచ్చుకొనుట, వినిమయము.

నిమవఁడు. దే. వి. అశ్వవిశేషము. "క...సారంగని జారని జన్నని నిమవని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకు డెదురన్." ద్వా. 3, ఆ. ౧౪౧.

నిమితకాఁడు. ద్వ. విణ. (నిమితము+కాఁడు) 1. మోఁతకాఁడు. "క...ప్రాయందలముల్, స్థానికుఁడొసంగి పనుపం,గా నానటిఁ బడినిమితకాండ్రు వహింపన్." ఆము. ౨, ఆ. ౯౫; 2. యుద్ధమునకు నియోగింపఁబడినవాఁడు. "మ...మ్రాఁకులన్ రాలఁ దేరనెయెంతే నలవడ్డయానిమితకాండ్రన్ భానుపుత్త్రాదులన్, వినుమీ చంపక పట్టి తెచ్చి. ..." రామా. ౮, ఆ. ౧౮౫; 3. బాణశాలవలన జీవించువాఁడు. "గీ. మందుపట్టెడ పేరు చెన్నొందు బాణ, శాల యనఁగను దక్షిణమున

వెలఘుం, నిమితకాం ద్రనఁగా సుగంధికబరీశ." అం. భా. ద్వి. ౬౫.

నిమితము. యం. వై. వి. (సం. నియమితః.) నియమనము. (చూ. నిమితకాఁడు.) సం. విణ. (అ. ఆ. అ.) నలుచదరమైనది.

నిమిత్తము. సం. వి. అ. న. 1. కారణము, హేతువు; 2. శకునము; 3. లక్ష్యము; 4. గుఱుతు, చిహ్నము; 5. ఉద్దేశము; 6. చెవులయందు చేయుచుంబనము. "సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు నధరోష్ఠమున భ్రాంతము..." హంస. ౫, ఆ. ౧౪౮.

నిమిత్తవిదుఁడు. సం. వి. దీ. అ. పుం. జోస్యుఁడు.

నిమిత్తి. సం. విణ. (న్. నీ. న్.) నిమిత్తము గలది.

నిమిషము. సం. వి. అ. పుం. 1. ఱెప్పవేయుట, ఱెప్పపాటు; 2. ఱెప్పవేయునంతకాలము; 3. (పువ్వులు.) ముకుళించుట, ముకుళనము.

నిమీల. సం. వి. ఆ. స్త్రీ. 1. కనుమూయుట; 2. కనుగీటుట; 3. నిద్ర; 4. కునికి పాటు; 5. వ్యాజము, కపటము.

నిమీలకము. సం. విణ. (అ. లికా. అ.) 1. మూయునది; 2. ముకుళించునది.

నిమీలత్. సం. (శత.) 1. మూయుచున్న; 2. ముకుళించుచున్న. "లయగ్రాహి...అనిమీలదరవిందసరసీవనములయందు..." భార. ఆది. ౫, ఆ. ౧౩౯. (అనిమీలత్ = వికసించుచున్న.)

నిమీలనము. సం. వి. అ. న. 1. ఱెప్పవేయుట; కనుమూయుట; 2. మరణము; 3. (పుష్పాదులు) ముకుళించుట; 4. మఱుఁగువడుట; 5. పూర్ణగ్రహణము (జ్యోతి.)

నిమీలనీయము. సం. = నిమీలితవ్యము.

నిమీలిక. సం. = నిమీల.

నిమీలిత. సం. విణ (ఋ. త్రీ. ఋ.) నిమీలకము.

నిమీలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూయఁబడినది; 2. ఆవరింపఁబడినది; 3. ముకుళించినది. (పుష్పాదికము); 4. అస్తమించినది.

నిమీలితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూసికొనఁదగినది; 2. ఆవరింపఁదగినది.

నిమీల్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూయఁబడుచున్నది; 2. ఆవరింపఁబడుచున్నది.

నిమీల్యము. సం. = నిమీలితవ్యము.

నిముకళ్లు. దే. వి. (నిమురు+కళ్లము.) 1. కైలు చేసిన కళ్లమునందలియదుగుధాన్యము. (శ. ర.); 2. కొఱఁత. (శ. ర.)

నిముకు. దే. స. క్రి. కుడుచు, స్తన్యపానము చేయు. "ద్వి...అక్కట దాదిచన్ను, నిముక నేరని చిన్ని నెత్తురుఁగందు." ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౭౮. పం.

నిమురు. దే. స. క్రి. స్పృశించు, తాఁకు; వాత్సల్యముతో రాచు. "వ...భక్తవత్సలుం డైనహరి దనకరంబున నతనిమేను నిమిరి..." భాగ. ౧౦, స్కం. ఉ. ౬౯, కాళిందీ. ౬, అ. ౫౩; 2. ఆవరించు. (చూ. నిమురుకొను.)

నిమురుకొను. దే. అ. క్రి. (నిమురు+కొను.) ఆవృతమగు. "గీ. హిమముచే నంబరం బెల్ల నిమురుకొనఁగ..." శ్రీరం. ౨, ఆ. ౨౪౧. స. క్రి. తడవుకొను. "గీ. కులిక మోవఁగ నెత్తురుల్ గ్రోలి కడుపు, నిమిరికొంచు నగస్త్యమంత్రముల నొడివి." దశా. ౨, అ. ౪౩౫.

నిముసము. వై. వి. (సం. నిమిషః.) 1. ఱెప్పపాటు; 2. ఱెప్పపాటుకాలము, స్వల్పకాలము. "సీ. నను నిముసంబు గానక యున్న నూర్లెల్ల నరయు మజ్జనకుఁ డెంతడలు నొక్కొ." స్వా. ౨, ఆ. ౧౩, విజ. ౧, ఆ. ౧౦౪.

నిమేయము. సం. వి. అ. పుం. వినిమయము. విణ. (అ. ఆ. అ.) వినిమయము చేయఁదగినది, మార్చుకొనఁదగినది.

నిమేషము. సం. = నిమిషము.

నిమ్నగ. సం. వి. ఆ. స్త్రీ—పల్లమునకు పాఱునది—నది, ఏఱు.

నిమ్నము. సం. వి. అ. న. పల్లము. విణ. (అ. ఆ. అ.) 1. లోఁతైనది, గభీరము; 2 తక్కువది, నీచము.

నిమ్మ. వై. వి. (సం. నింబః.) జంబీరము, జంభలము. "సీ. అమరులసభ జూడ నరుదెంచునొకభక్తి పరుఁడు దెచ్చిననిమ్మపం డనంగ." కృష్ణ. ౪, ఆ. ౧౦౫, అం. భా. ద్వి. ౪౨.

నిమ్మళము. వై. వి. (సం. నిర్మలమ్.) 1. నిష్కళంకత. "సీ. నిమ్మళం బనఁగను నిష్కళంకత యొప్పు. ..." ఆం. భా. ద్వి. ౯౯౧; 2. స్వాస్థ్యము. (వా.) విణ. 1. స్వస్థము; ఉపశాంతము. (వా.); 2. మందము. (వా.)

నిమ్మళించు. వై. అ. క్రి. స్వస్థమగు; ఉపశమించు. (శ. ర. వా.)

నిమ్ము. దే. వి. కొమ్ము మున్నగువాని ధ్వనివిశేషము. "వ...గుమ్మెటలచటులరవమును గొమ్ములనిమ్మును శేలంగె నయ్యవసరంబున." కాశి. 3, ఆ, 3౬

నిమ్లుక్తి. సం. వి. ఇ. స్త్రీ. క్రుంకుట, అస్తమయము.

నిమ్లోచము. సం. వి. అ. పుం=నిమ్లుక్తి.

నియంత. సం. వి. ఋ. పుం. 1. సారథి; 2. పరమేశ్వరుఁడు. విశే. (ఋ. త్రీ. ఋ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2 దండించువాఁడు; 3. రక్షకుఁడు.

నియంతవ్యుఁడు. సం. = నియమ్యుఁడు.

నియంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. 1. అడ్డగింత; 2. ఆజ్ఞాపించుట; 3. నిర్వచించుట.

నియంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. ఆజ్ఞాపింపఁబడినది.

నియచ్ఛత్. సం. (శత్రు.) 1. నియమించుచున్న; 2. ఇచ్చుచున్న.

నియతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నియమము గలది; 2. కట్టఁబడినది, సంయతము; 3. నిగ్రహింపఁబడినది; 4. నిత్యమైనది; 5. అనివార్యము.

నియతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నియమము; 2. ఇంద్రియనిగ్రహము; 3. పూర్వజన్మార్జితమైన సుకృతదుష్కృతరూపకర్మము. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

నియమనము. సం. వి. అ. న. 1. నియమము; 2. బంధించుట; 3. నిగ్రహించుట, అడఁచుట; 4. శిక్షించుట.

నియమనీయము. సం. = నియమ్యము.

నియమము. సం. వి. అ. పుం. 1. బంధము, కట్టు; 2. ఏర్పాటు, వ్యవస్థ; 3. నిగ్రహము, అడఁచుట; 4. ఆజ్ఞ; 5. ప్రతిజ్ఞ; 6. నిశ్చయము; 7. వ్రతనిష్ఠ; 8. నియంత్రణ, నిర్దేశము.

నియమవిధి. సం. వి. ఇ. పుం. నిత్యకర్మానుష్ఠానము.

నియమించు. సం. స. క్రి. 1. ఆజ్ఞాపించు. "క. ఈ నెలఁతఁ గన్నమన్మథుఁ, డైనఁ జిగురుగొడుగుఁ బువ్వుటమ్ములఁబొదులుక్, లోనుగ నెజ్జలుసేయం, దానియమింపం డె విరహతాపము పేర్మిన్." భార. విరా. ౨, ఆ. ౨౦. మార్క. ౧, ఆ. ౨౩౪; 2. అడ్డపెట్టు, నిరోధించు. "వ...నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తిచెప్పను నియమింపను జాలను..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౫౫; 3. ఏర్పఱచు, నిర్ణయించు. "చ. వనిత మనోహరంబులగువస్తువు లెల్లను వేడ్కనేఁటి నీకని నియమించి తెచ్చితిఁ బ్రియంబునఁ గైకొనుము..." భార. విరా. ౨, ఆ. ౩౩౪.

నియమితము. సం విశే. (అ. ఆ. అ.) 1. ఏర్పఱుపఁబడినది, నిర్ణయింపఁబడినది; 2. కట్టఁబడినది, బద్ధము; 3. నిగ్రహింపఁబడినది; 4. శిక్షింపఁబడినది; 5. అడ్డగింపఁబడినది, నిరుద్ధము.

నియమ్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నియమింపఁబడుచున్నది.

నియమ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నియమింపఁదగినది

నియాతనము. సం. వి. అ. న. క్రిందికిఁ ద్రోయుట.

నియామకుఁడు. సం. వి. అ. పుం. 1. సారథి; 2. ప్రభువు; 3. తండేలు, నౌకానియంత. విశే. (అ. మికా. అ.) 1. ఆజ్ఞాపించువాఁడు; 2. శిక్షించువాఁడు; 3. నిరోధించువాఁడు; 4. నిగ్రహించువాఁడు; 5. నిర్ణయించువాఁడు; 6. నిర్దేశించువాఁడు.

నియామము. సం. = నియమము.

నియామి. సం. విశే. (న్. నీ. న్.) నియమించువాఁడు.

నియుంజత్. సం. (శత్రు.) నియోగించుచున్న.

నియుంజానము. సం. విశే. (అ. ఆ. అ.) నియోగించుచున్నది.

నియుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆజ్ఞ, పనుపు; 2. ఉద్యోగమందు నియోగించుట.

నియుక్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. అజ్ఞప్తుఁడు; 2. అధికారమందు నియమింపఁబడినవాఁడు; 3. ప్రేరింపఁబడినవాఁడు.

నియుజ్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నియోగింపఁబడుచున్నది.

నియుతము. సం. వి. అ. న. 1. సంఖ్యావిశేషము, లక్షత్వసంఖ్య; 2. దశలక్షత్వసంఖ్య. విశే. (అ. ఆ. అ.) 1. లక్షత్వసంఖ్యావిశిష్టము; 2. దశలక్షత్వసంఖ్యావిశిష్టము.

నియుద్ధము. సం. వి. అ. న. శస్త్రాదులు పట్టఁగూడదనునియమము గలయుద్ధము, బాహుయుద్ధము. "క. వీనికి మాఱొక్కనిఁ గాలెదు, దానికిఁ దగువానిధర్మతనయునిపురిలో, నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి నిపుణుఁ డిందుల కతఁడున్." భార. విరా. ౨, ఆ. ౯.

నియోక్తృ. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) నియోగించువాఁడు.

నియోక్తవ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నియోగింపఁ దగినవాఁడు.

నియోగజనుఁడు. సం. వి. అ. పుం. భృత్యుఁడు. "సీ... అవని, సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయబంధుసుహృద్వీరభటనియోగ, జనులను దేవల సాదుల నిత్యంబుఁ దాన పరీక్షించి..." భార. సభా. ౨, ఆ. ౧౧౬.

నియోగము. సం. వి. అ. పుం. 1. అధికారమందు నియమించుట; 2. ప్రేరణము; 3. ఆజ్ఞ; 4. నియోగించినపని. "వ ..... ఇన్ని కారణంబులు విచారించి నానియోగంబు చేయుము." భార. ఆది. ౭, ఆ. ౪౯; 5. నిశ్చయము; 6. పుత్రులు లేనివిధవను దేవరునివలననో సపిండునివలననో పుత్రునిఁ బడయుటకై నియమించుట; 7. పరిజనము. "ద్వి. వినయపూర్వకముగా వినుతి సేయుచును, సుందరగ నఖిలనియోగంబు గొలువ." బస. ౭, ఆ. ౧౧౭. పం. పండితా. దీక్షా. ౭౨. పు.

నియోగి. సం. విశే. (న్. నీ. న్.) 1. రాజాదులచే ఒకపనియందు నియుక్తుఁడైనవాఁడు, ఉద్యోగి. "క జనకనృపునుత్తరం బని, జనపతికిం జెల్పి రాయసము వ్రాయునియోగిని బిలిచి యొసఁగ..." దశా. ౭, అ. ౧, ఆ. ౨౨౨; 2. ఒకతెగబ్రాహ్మణుఁడు. (వా.) (వీరిలో భేదములు. ఆఱువేల నియోగులు, తెలఁగాణపునియోగులు, నందవరీక నియోగులు మొ.); 3. పురోహితుఁడు. "గీ... రాఘవులపెండ్లికిని సాగిరమ్మటంచు... నియోగిఁ బనుప..." దశా. ౨, అ. ౧, ౨౨౦.

నియోగించు. సం. స. క్రి. 1. ఏర్పఱచు. "ఆ. అనఘచరిత యిట్లు నను నియోగించుట, యెందుఁగు మని యమాత్యయంతము గాఁగ, భక్తి మెఱసి యెన్నిభంగులఁ జెప్పిన, నియ్యకొనక యున్న నెట్ట కేని." భార. శాం. ౧, ఆ. ౧౬౪. మార్క. ౨, ఆ. ౨౮౪; 2. ఆజ్ఞాపించు, పనుచు. "వ... సుదేష్ణ తన్ననుచితవ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదంబునం బొంది..." భార. విరా. ౨, ఆ. ౧౦౩. భార. ఆది. ౭, ఆ. ౪౯; 3. కోరు. "వ... యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించుసదియై యరుగుదెంచెం గావలయు..." భార. విరా. ౨, ఆ. ౧౬౭.

నియోగ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నియోగింప నర్హుఁడు. (ప్రభువు.)

నియోజకుఁడు. సం. విశే. (అ. ఇకా. అ) నియోగించువాఁడు.

నియోజనము. సం. వి. అ. న. 1. ఆజ్ఞాపించుట; 2. ప్రేరించుట; 3. పనియందు నియమించుట. విశే. (అ. ఆ. అ.) నియోజనముచేయునది. (అ.ఈ.అ.) నియోజనము చేయుటకు సాధనమైనది.

నియోజనీయుఁడు. సం. = నియోక్తవ్యుఁడు.

నియోజించు. సం. స. క్రి. లగ్నముచేయు. "గీ. సుమహితధ్యానమునఁ బరంజ్యోతియందు, మనముఁ జాల నియోజించి మహిమఁ దనరు." భాగ. 3, స్క. ౯౪౨.

నియోజితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆజ్ఞాపింపఁబడినవాఁడు; 2. ప్రేరింపఁబడినవాఁడు; 3. పనియందు నియమింపఁబడినవాఁడు.

నియోజ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నియోజింపఁ దగినవాఁడు.

నియోధకుఁడు. సం. వి. అ. పుం. బాహుయుద్ధము చేయువాఁడు, మల్లుఁడు.

నియోద్ధ. సం. విశే. (ఋ. ద్ధ్రీ. ఋ.) బాహుయుద్ధము చేయువాఁడు.

నియ్యోగి. వై. వి. (సం. నియోగీ.) 1. మంత్రి. (శ. ర.; 2. ఒకతెగబ్రాహ్మణుఁడు. (శ. ర.; 3. ఒకతెఱఁగుభృత్యుఁడు. "గీ. కటికవారలు దగు నూడిగములవార, లవసరంబున నియ్యోగు లాడ నాడఁ, బొడగని యథోచితాకృతుల్ వారసి గొలువ." ఉ. రా. ౬. ఆ. ౧౯౦.

నిరంకుశము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డులేనిది, నిరర్గళము; 2. అంకుశములేనిది.

నిరంజనము. సం. వి. అ. పుం. చిత్రవర్ణమై యజ్ఞార్హమగుహరిణము. విశే. అ. ఆ. అ. 1. కాటుక లేనిది. (కన్ను.); 2. నిర్మలము.

నిరంజనుఁడు. సం. వి. అ. పుం. 1. పరమాత్మ; 2. శివుఁడు.

నిరంతరము. సం. విశే. (అ. ఆ. అ.) 1. సంతతము, ఎడతెంపు లేనిది; 2. మిక్కిలి దగ్గఱగా నున్నది;

3. సాంద్రము; 4. మఱుఁగు లేనిది; 5. భేదము లేనిది. అభిన్నము.

నిరంశము. సం. విశ. (అ. ఆ. అ.) 1. అఖండము, పూర్ణము; 2. భాగము లేనిది.

నిరతము. సం. విశ. (అ. ఆ. అ) 1. మిక్కిలి ఆ సక్తి కలది; 2. అవిచ్ఛిన్నము "క. నిరతముగఁ దీర్థసేవా, పరులకు...దుష్కర మెద్దియు లేదు. ..." భార. ఆర ౨, ఆ. ౨౫౯; 3 స్థిరము, నిశ్చలము. "చ. సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా, విరవిరవోయి మేను నిడు వెండ్రుకపెట్టుచుఁ గంపమొందెఁ జే, నిరతము గాదు గాండివము నిల్వఁగ నోర్వవు గాళ్లు .." భార భీష్మ. ౧, ఆ ౧౮౧, క్రి. విశ. ఎల్లపుడు "క. కిరణములభంగిఁ జతురపుఁ, బరిజనముల కెందుఁ జొనిపి పరకృత్యంబుల్, నిరతంబును గనుఁగొనుచును, దరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్." భార. శాం. 3, ఆ. ౧౦౯.

నిరతి. సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలియాసక్తి.

నిరత్యయము. సం. విశ. (అ. ఆ. అ.) 1. నాశనము లేనిది; 2. దోషము లేనిది.

నిరపేక్ష. సం. వి ఆ. స్త్రీ. కోరికలేమి

నిరపేక్షము. సం. విశ. (అ. ఆ. అ.) 1. కోరిక లేనిది; 2. ప్రయోజనము లేనిది.

నిరప్పుణ. వై. విశ (సం. నిరర్పణమ్) నిరభ్యంత రము, ఆటంకము లేనిది. "వ. అని నిరప్పుణగాఁ గప్పలఱేఁడు సెలవిచ్చిన..." వేం. పంచ. ౨, ఆ. ౩౭౦.

నిరయము. సం. వి. అ. పుం. నరకము.

నిరర్గళము. సం. విశ. (అ. ఆ అ.) 1. గడియ లేనిది; ఆటంకము లేనిది. క్రి. విశ. యథేచ్ఛ ముగా, విచ్చలవిడిగా.

నిరర్థకము. సం. వి. అ. న. ఒకానొకపదదోషము. విశ. (అ. ఆ. అ.) 1. అర్థము లేనిది. (పదాది.); 2. ప్రయోజనము లేనిది.

నిరర్థము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ధనము లేనిది; 2. అర్థము లేనిది. (పదాది.); 3. ప్రయోజనము లేనిది.

నిరవద్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. దోషము లేనివాఁడు, ఉత్కృష్టుఁడు; 2. నింద లేనివాఁడు.

నిరవము. సం. విశ. (అ. ఆ. అ.) ధ్వని లేనిది.

నిరవహాలిక. సం. వి. ఆ. స్త్రీ. వెలుఁగు. కంచె.

నిరశనము. సం. వి. అ. న. ఉపవాసము. విశ. (అ. ఆ. అ.) భోజనము చేయనిది.

నిరసనము. సం. వి. అ. న. 1. త్రోసివేయుట; 2. (వాదాదులను) ఖండించుట, ప్రత్యాఖ్యానము; 3. తిరస్కారము; 4. వెడలఁగొట్టుట; 5. ఉమి యుట, నిష్ఠీవనము; 6. వధము. విశ. (అ. ఆ. అ.) 1. తొలఁగించునది; 2. వెడలఁగొట్టునది, తఱుము నది; 3. ఉమియునది.

నిరసనీయము. సం. విశ. (అ. ఆ. అ.) నిరసింపఁ దగినది.

నిరసము. సం. విశ. (అ. ఆ. అ.) 1. శృంగారాది రసహీనము. (కావ్యాది.); 2. చప్పిడి; 3. సార హీనము, ఎండినది. (ఫలాది.)

నిరసించు. సం. స. క్రి. 1. పోఁగొట్టు. "వ...మదీయ మనఃక్లేశంబు నిరసింప నీవ యర్హుండవు..." భార. శాం. ౬, ఆ. ౯౫౪; 2. తిరస్కరించు. "శా...నీలాంబుదో, న్మేషంబుల్ నిరసింపఁజాలు తనుకాంతిశ్రీలు దిగ్భూములన్, భూషింపంగ.." వరాహ. ౧, ఆ. ౧౪౧. కృష్ణ. ౪, ఆ. ౯; 3. విడుచు, పరిహరించు. (శ. ర.); 4. జయించు. "క. తిరముగ భవదీయాంఘ్రిః, కరణసరోజాత కర్ణికాతలమున సుస్థిరుఁ జేసి యింద్రియంబుల, నిరసించి మనోంబకమున నెఱిఁ గను మునఘా." భార. 3, స్కం. ౦౬౪; 5. కాళిం. ౬, ఆ. ౧౦౦; 6. చంపు. "క. నిరసించిన నిరసించన్, శరణన రక్షించ నీకె చను నృపతులతోఁ, గరుణించితి నీపట్లన్..." కృష్ణ. ౪, ఆ. ౯.

నిరసిత. సం. విశ. (ఋ. త్రీ. ఋ.) నిరసించువాఁడు.

నిరసితవ్యము. సం. = నిరసనీయము.

నిరస్తము. సం. వి. అ. న. 1. తొలఁగించుట,త్రోసి వేయుట; 2 ఉమియుట, నిష్ఠీవనము; 3. విస రుట; ఏయుట. విశ. (అ. ఆ. అ.) 1. త్రోసి వేయఁబడినది; 2. తఱుమఁబడినది; 3. ప్రయో గింపఁబడినది. (బాణాది.); 4. విడువఁబడినది, త్యక్తము; 5. ప్రత్యాఖ్యాతము, ఖండింపఁబడినది. (వాదాది.); 6. ఉమియఁబడినది, నిష్ఠ్యూతము; 7. త్వరితముగా ఉచ్చరింపఁబడినది. (మాట.); 8. తిరస్కరింపఁబడినది; 9. చెడఁగొట్టఁబడినది, ప్రతిహతము. (ప్రతాది.); 10. జయింపఁబడినది;

డాటబడినది. "అ. ఎటిఁగి రేనిఁ జాల నెగ్గు వాటిల్లు న, ట్లగుట మమ్ము నింక నతిరహస్య వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి,యింపుఁ డని యను గ్రహింపవలయుం." భార. విరా. ౧, ఆ. ౪౭.

నిరస్యత్. సం. (శత్రు) నిరసించుచున్నది.

నిరస్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరసింపఁ బడుచున్నది.

నిరస్యము. సం. = నిరసనీయము.

నిరాకరణము. సం. వి. అ. న. 1. తొలఁగించుట; 2. తిరస్కరించుట; 3. (వాదాదికమును) ఖండించుట, ప్రత్యాఖ్యానము; 4. అనాదరించుట.

నిరాకరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁదగినది.

నిరాకరించు. సం. స. క్రి. 1. తిరస్కరించు, త్రోసివేయు. "ఉ. వాసవునిందుకోల్వనను వచ్చిన యప్పుడు తత్సభాంచితా, ర్థాసన మెక్కి యున్న నిను నంగజసన్నిభుఁ జూచి పుష్పబాణాసను పుష్పబాణనిభమౌములకుం గుఱియైతి నిట్టినా, యాస నిరాకరింపఁ దగవా కరుణాకర పాండునందనా." హర. ౭, ఆ. ౧౫౫; 2. అగౌరవించు, అలక్ష్యముచేయు. "శా. అవ్వాక్యంబు నిరాకరించి దిశ లల్లాడం గఠోరంబుగా, నవ్వెన్.." వరాహ. ౫, ఆ. ౧౧.

నిరాకరిష్ణువు. సం. విణ. (ఉ) నిరాకరించుస్వభావము గలవాఁడు.

నిరాకరిష్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁబడఁబోవుచున్నది.

నిరాకర్త. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిరాకరించువాఁడు.

నిరాకర్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁదగినది.

నిరాకారకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరించువాఁడు.

నిరాకారము. స. వి. అ. పుం. నిరాకరణము. విణ. (అ. ఆ. అ.) 1. రూపము లేనిది; 2. పిలుపు లేనిది, అనాహూతము; 3. వికృతరూపము గలది.

నిరాకారి. సం. విణ. (న్. నీ. న్.) నిరాకరించువాఁడు.

నిరాకార్యము. సం. = నిరాకరణీయము.

నిరాకుర్వత్. సం. (శత్రు.) నిరాకరించుచున్న.

నిరాకుర్వాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరించుచున్నవాఁడు.

నిరాకులము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి కలఁతనొందినది; 2. మిక్కిలివ్యాప్తమైనది; 3. నిర్వ్యాకులము, స్వస్థము.

నిరాకృతము. సం. వి. అ. న. = నిరాకరణము. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁబడినది.

నిరాకృతి. సం. వి. ఇ. స్త్రీ. = నిరాకరణము. ఇ. పుం. 1. పంచయజ్ఞములను త్యజించినవాఁడు; 2. అధ్యయనము చక్కఁగా చేయనివాఁడు విణ. (ఇ.) 1. ఆకారము లేనిది; 2. వికృతాకారము కలది.

నిరాక్రియ. సం. వి. ఆ. స్త్రీ. నిరాకరణము.

నిరాక్రియమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిరాకరింపఁబడుచున్నది.

నిరాగసుఁడు. సం. విణ. (స్) 1. పాపము లేనివాఁడు; 2. అపరాధము లేనివాఁడు.

నిరాగుఁడు. సం. = నిరాగసుఁడు.

నిరాఘాటము. సం. విణ. (అ. ఆ. అ.) 1. హద్దు లేనిది, అపరిమితము. "గీ. ఏఁటిధృతి యేఁటి వితరణ మేటిశౌర్య, మేఁటిగాంభీర్య మని నిరాఘాటధైర్య, దానశక్తిగభీరతానూనుఁ డగుచు.." కృ. శతకం పీఠి; 2. అడ్డులేనిది; నిలుపులేనిది. "వ... ఖచరపురపరస్థితతురంగంబే సేన యని యభినయించురీతిని గైజామోరలు చేయునిరాఘాటధాటీసమాటీకఘోటీపటలంబు జటిలంబగుచు నుండ..." ఆం. భా. పీఠి. ౭; 3. చెదరనిది, నిశ్చలము. "గీ. ప్రతిదినంబును బ్రాతరారంభవేళ, నిర్నిబంధననిరుపాధినిరవగాఢ, నిర్నిరోధనిరాఘాటనిరుపమాన, భక్తి సంభజియింతు రీపద్మబంధు." కాశీ. 3, ఆ. ౧౭౪.

నిరాణ. దే. వి. (క. నిరాళ.) స్వచ్ఛము. "క.. నిరం, తరభక్తుఁడై శివైక్యుఁడు, నిరాణ యగు పసిఁడి పోలె నిలువఁగ వలయున్." శివ. సా. ౧౪౫.

నిరాతంకము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జంకు లేనిది; 2. రోగము లేనిది; 3. బాధించనిది; 4. అడ్డు లేనిది.

నిరాతప. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి.

నిరాదిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) తీర్పఁబడినది. (ఋణాది.)

నిరాదేశము. సం. వి. అ. పుం. ఋణమును పూర్తిగాఁ దీర్చుట.

నిరాపనింద. మి. గ్రా. వి. (శ. ర.) అపనింద, లేని పోనినింద. "క. పినతల్లివి పెఱుఁగ నో, పినతల్లివి గాన వచ్చి పిలిచిన నయ్యో, గనికరము లేక వానిం, గని కరము నిరాపనింప గట్టం దగునే." సా. 3, ఆ. 90, 3 ఆ. ౨౧౭.

నిరాబాధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బాధ లేనిది, నొవ్వు లేనిది; 2. దుఃఖము లేనిది; 3. అడ్డు లేనిది, ప్రతిబంధము లేనిది.

నిరాబారి. వై. వి. (సం. నిరాహారీ.) ముని. "సీ. .. గాలి యోగిరము గాఁ గను నీటిలోనఁ దబము లొనర్చెడు నిరాబారిగములు." య. ౨. ఆ. ౪3, అచ్చ. బాల. ౯.

నిరామయము. సం. వి. అ. పుం. న. రోగములేమి, ఆరోగ్యము. పుం. 1. అడవిమేఁక; 2. పంది. విణ. (అ. ఆ. అ.) 1. రోగము లేనిది; 2. దోషము, లేనిది; 3. కపటము లేనిది.

నిరాయతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి నిడివి యైనది; 2. సంకుచితము.

నిరాయము. సం. విణ. (అ. ఆ. అ.) రాబడి లేనిది.

నిరాలంబము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆధారము లేనిది; 2. స్వతంత్రము.

నిరాసకము. సం. విణ. (అ. సికా. అ.) నిరసించునది.

నిరాసము. సం.=నిరసనము విణ.(అ ఆ. అ.) నశింపఁ జేయునది. (నాశము.) "క. ఈసౌవర్ణాఖ్యానము, భాసురముగ వినినపుణ్యపరులకు నధిక, శ్రీసంపద లగు దురితని, రాసం బగుఁ బాయు నురగరత్తో భయముల్." భార. ఆది. ౨, ఆ. ౧౨౪.

నిరాసీలు. దే. వి. బ. వస్త్రవిశేషము. "రగడ. ఖురుత కాసీలు మహముదులు నిరాసీలు, సరిసేయరాని హంసావళులు లాకీలు." హంస. ౯. ఆ 3౯౬.

నిరాస్వాదము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుభవము లేనిది; 2. రుచి లేనిది.

నిరాహారము. సం వి. అ. పుం. ఉపవాసము. విణ. (అ. ఆ. అ.) ఆహారము లేనిది.

నిరీక్ష. సం. వి. ఆ. స్త్రీ.=నిరీక్షణము. [వాఁడు.

నిరీక్షకుఁడు. సం. విణ. (అ. క్షికా. అ.) వీక్షించు

నిరీక్షణ. సం.=నిరీక్షణము. (చూచుట, కనుఁగొనుట.) "ఉ. పంకజశోకపుప్పుటు భాసిమిళింద విలాసవాసమై, యంకురసూచి కావినిహతాహితమండల జీవితంబునై, శంకిలఁజేయు సాభిరతశాస్త్రము నామని దానిఁ జూడఁగా, సంకుర మూను మోర భర మన్యనిరీక్షణఁ గల్గనేర్చునే." కాళిందీ. ౪, ఆ. ౨౬.

నిరీక్షణము. సం. వి. అ. న. 1. చూపు, దృష్టి; 2. చూచుట, కనుఁగొనుట; 3. ఎదురు చూచుట; 4. తలఁచుట, భావించుట.

నిరీక్షించు. సం. స. క్రి. 1. చూచు. "శా. చేరం బోవుటయుక్ సమీరుఁడు సురజ్యేష్ఠు న్నిరీక్షించి ..." నిర్వ. ౭, ఆ. ౧౧3, మార్క. ౬, ఆ. ౧౭౪; 2. ఎదురుచూచు, ప్రతీక్షించు. "వ... ఇష్టైకతంబ యేకవస్త్రయై యొంటి నెక్కవచ్చు వారి నిరీక్షించుచున్న సత్యవతిం జూచి యామునివరుండు." భార. ఆది. 3, ఆ. 3౭; 3. భావించు, తలపోయు. "ఉ. చంచలనేత్ర సీత విడఁజాలు దునే శుక యేమిగా నిరీ, క్షించితి నన్ను సృష్టి యిటఁ జేకటిచేసెదఁ జూడు మంచు..." రామా. ౭, ఆ. ౧౭3.

నిరీక్షితము. సం.వి. అ. న.=నిరీక్షణము. విణ. (అ. ఆ. అ.) నిరీక్షింపఁబడినది.

నిరీషము. సం. వి అ. న. నాఁగటికఱ్ఱు, ఫాలము. విణ. (అ. ఆ. అ.) లాంగలదండము లేనిది. (నాఁగలి.)

నిరీహ. సం. వి. ఆ. స్త్రీ. 1. చేష్టాశూన్యత్వము; 2. ఇచ్ఛాశూన్యత; 3. ప్రయత్నము లేమి.

నిరీహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. చేష్టాశూన్యుఁడు; 2. ఇచ్ఛాశూన్యుఁడు; 3. ప్రయత్నశూన్యుఁడు.

నిరు. దే. అవ్య. గతార్థకము. (నిరుడు, నిన్న, నిప్పచ్చ మొ. శ. ర)

నిరుంధత్. సం. (శత్రు.) నిరోధించుచున్న.

నిరుంధానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధించుచున్నది.

నిరుకడము దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

నిరుకు. దే వి. (క. నిరఖు.) 1. నిర్ణయము; 2. నిర్ణయించిన వెల. (శ. ర.)

నిరుకుళము. వై. విణ. (సం. నిరర్గళమ్.) నిరర్గళము. (శ. ర.) "గీ. నిగమనూపురములు మ్రోయ నిరుకుళముగ..." పాండు. ౨, ఆ. ౨౫.

నిరుక్తము. సం. వి. అ. న. 1. పదముల అవయవార్థములను వివరించుట, నిర్వచనము. 2. వేదాంగములలో నొకటి. విణ. (అ. ఆ. అ.) నిర్వచింపఁబడినది.

నిరుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిర్వచనము; 2. ఒక అర్థాలంకారము, శబ్దమునకు యోగమువలన అన్వర్థమును కల్పించుట; 3. వేదాంగములలో నొకటి.

నిరుడు. దే. వి. ఔ. (నిరు+ఏఁడు.) గతవత్సరము. "చ. ఒకవిరజాదితీవె నిరుడుంచిన దించుక పూయు..." పార్వ. 3, ఆ. ౧౦, ఆం. భా. ప్ర. ౯౬.

నిరుతి. వై. వి. (సం. నిర్ఋతిః. క. నిరుతి.) నైరృతుఁడు, నిరృతి. "క...ఆర్చెన్, సురబలము లసురపుత్త్రులు, నిరుతికి వెన్నిచ్చి రెదిరి నిల్వక భీతిన్." కు. సం. ౧౨, ఆ. ౪౬.

నిరుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. చెఱఁబెట్టఁబడినది.

నిరుధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధింపఁబడుచున్నది.

నిరుపద్రవము. సం. విణ. (అ. ఆ. అ.) 1. బాధ లేనిది; 2. విపత్తు లేనిది.

నిరుపహతము. సం. విణ. (అ ఆ. అ.) 1. కొట్టఁబడనిది; 2. ఉపద్రవము లేనిది.

నిరుపహతి. సం. విణ. (ఇ.)=నిరుపహతము.

నిరుహ్యమానము. సం. విణ (అ. ఆ. అ.) నిర్వహింపఁబడుచున్నది.

నిరూఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధికెక్కినది; 2. పెండ్లియాడఁబడనిది; 3. రూఢము. సంకేతసిద్ధము. (వ్యతి. యౌగికము); 4. నిరూఢలక్షణచే అర్థమును బోధించునది. (శబ్దము.)

నిరూఢలక్షణ. సం. వి. ఆ. స్త్రీ. వ్యాకరణకోశాదులందు ప్రసిద్ధ మగునర్థమును తెలుపులక్షణ. (ఉదా:—లావణ్యము, అనుకూలము, ప్రతికూలము.)

నిరూఢి. సం. వి. ఇ. స్త్రీ. 1. మిక్కిలిప్రసిద్ధి; 2 (విద్యాదులందు) కౌశలము, ప్రవీణత; 3. నిర్ధారణ, నిశ్చయము; 4. నిరూఢలక్షణ. "గీ. కటిపదంబున నర్థసంఘటిత మగుచు, జఘన మభిధకు సాటి యౌనన్నితంబ, మాత్రపశ్చాన్నిరూఢియై యందు లక్షణాభిరూప్యంబు రుచి గాంచి వ్యక్తిఁబోలు." కాళిందీ. ౬, ఆ. ౨౫౭.

నిరూపకుఁడు సం. విణ. (అ. పి౯. అ.) నిరూపించువాఁడు. "ఉ. ధర్మనిరూపకత్వమున ధైర్యమునన్...ప్రసిద్ధుఁడవు..." భార. విరా. ౧, ఆ. ౫౧.

నిరూపణ. సం. వి. ఆ. స్త్రీ. = నిరూపణము. (విచారణము, అరయిక) "చ. పొరిఁబొరిఁ బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించుఁ దత్పరమగుసద్వివేకమున భావనిరూపణ సేయు..." భార. విరా. ౧, ఆ. ౨౦౯.

నిరూపణము. సం. వి. అ. న. 1. నిర్ణయించుట, నిర్ధారణచేయుట; 2. అరయిక, విచారణము; 3. నిదర్శనము; 4. చూచుట; 5. చూపుట; 6. నిర్వచించుట.

నిరూపణీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁదగినది. "గీ...పొదివి చిత్ర, నిహతిఁ దెగఁ జూచియనిరూపణీయదుర్ని, వారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర." భార. విరా. 3, ఆ. ౪౯. (అనిరూపణీయము = నిరూపింపరానిది.)

నిరూపయత్. సం. (శత్రం.) నిరూపించుచున్న.

నిరూపయమాణము. సం. విణ. (అ. ఆ. అ) నిరూపించుచున్నది

నిరూపయిత. సం. విణ. (ఋ. త్రి. ఋ) నిరూపించువాఁడు.

నిరూపయితవ్యము. సం. = నిరూపణీయము.

నిరూపించు. సం. స క్రి. 1. నిర్ణయించు. "వ...మరణభయంబున కిది నిమిత్తం బని నిరూపింపరాదు." మార్క. ౧, ఆ. ౫౬, భార. శాం. ౪, ఆ. ౩౬౬; 2. గ్రహించు, తెలిసికొను. "వ..అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించు..." భార. విరా. ౪, ఆ. ౧౪, భార. విరా. ౩, ఆ. ౪౨; 3. చూచు. "సీ. మెలఁగిన యట్టివఁ బలికింపఁ దలఁచి నిరూపించి లేమి నత్తులు వహించు." భార. విరా. ౨, ఆ. ౩౦౧; 4. నిర్వచించు; 5. అభినయించు. (నాట్య.)

నిరూపితము. సం.విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడినది.

నిరూప్యమాణము. సం.విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడుచున్నది

నిరూప్యము. సం. = నిరూపణీయము తెలియఁదగినది. "చ...సంగరోత్సవోద్యమరభసాతిరేకము బయ

ల్పడు టించుక లేక రోషసం, భ్రమ మొకయింత
యైనఁ బరభావనిరూహ్యము గాక..." భార. విరా.
౨, ఆ. ౩౨.

నిరూహణము. సం. = నిరూహము.

నిరూహము. సం. విణ. (అ. ఆ. అ.) ఊహ లేనిది.

నిరృతి. సం. వి. ఇ. పుం. దక్షిణపశ్చిమదిక్పాల
కుఁడు. స్త్రీ. 1. అలక్ష్మి; 2. అధర్మునిభార్య; 3.
అధర్మునికూఁతురు; 4. మృత్యువుభార్య; 5. మూలా
నక్షత్రము.

నిరోధకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరోధించు
వాఁడు.

నిరోధనము. సం. = నిరోధము.

నిరోధనీయము. సం. = నిరోద్ధవ్యము.

నిరోధము. సం. వి. అ. పుం. 1. చెఱఁబెట్టుట, బంధిం
చుట; 2. అడ్డగించుట; 3. నాశము; 4. వశ
పఱుచుకొనుట.

నిరోధి. సం. విణ. (న్. నీ. న్.) నిరోధించువాఁడు.

నిరోధించు. సం. స. క్రి. అడ్డగించు. "మ...భీ,
కరులై యొక్కటఁ జుట్టుముట్టుకొని మార్గంబున్
నిరోధించినన్." ఉ. రా. ౩, ఆ. ౩౩౧.

నిరోద్ధ. సం. విణ. (ఋ. ద్ధ్రీ. ఋ.) నిరోధించువాఁడు.

నిరోద్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ) నిరోధింపఁ
దగినది.

నిరోధ్యము. సం. = నిరోద్ధవ్యము.

నిర్గంధనము. సం. వి. అ. న. 1. చంపుట; 2. మిగుల
హింసించుట. విణ. (అ. ఆ. అ.) గంధము లేనిది

నిర్గచ్ఛత్. సం. (శత్రు.) నిర్గమించుచున్న.

నిర్గతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిష్క్రమించి
నది; 2. నశించినది; 3. పైకివచ్చినది. (రసము,
రక్తము. మొ.); 4. బయలువేఁడినది, ఉద్గతము.
(మొగ్గ. మొ.)

నిర్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వెడలుట; 2. నిష్క్ర
మణము.

నిర్గమనము. సం. = 1. నిర్గతి; 2. ద్వారము.

నిర్గమనుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

నిర్గమము. సం. వి. అ. పుం. = నిర్గమనము.

నిర్గమించు. సం. అ. క్రి. 1. ఉద్భవించు, పుట్టు.
"వ. అవ్విరోచననందనుశరీరంబుననుండి సురూ
పయును సుగౌరవయును నగునొక్కమగువ నిర్గమించి
నం గని కౌశికుండు..." భార. శాం. ౪, ఆ.
౪౦౦; ౫, ఆ. ౪౭౫; 2. పైకివచ్చు, ఉద్యత
మగు. "గీ. ఒగిడి పొక్కిలివిరియండి నిర్గమించు,
నట్టిపట్టదరేఖ దా నగుటఁజేసి .." రామా. ౩,
ఆ. ౯౧; 3. బయలువెడలు బయలుదేఱు."వ...
దీవించి సేనలు సల్లం బురంబు నిర్గమించి ..",
భార విరా. ౪, ఆ. ౪౯.

నిర్గర్వము. సం. విణ. (అ. ఆ. అ.) గర్వము లేనిది.
"శా. ఆరూపం బవికార మాభుజబలం బత్యంత
నిర్గర్వము..." భార. విరా. ౨, ఆ ౨౦౯.

నిర్గళనము. సం. వి. అ. న. వెలికిజాఱుట.

నిర్గళితము. సం. విణ. (అ. ఆ. అ.) వెలికిజాఱినది.

నిర్గుండి. సం. వి. ఈ. స్త్రీ. 1. వావిలి; 2. నల్ల
వావిలి.

నిర్గుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ ) గుణములు లేని
వాఁడు.

నిర్గూఢము. సం. వి. అ. పుం. చెట్టుతొఱ్ఱ. విణ.
(అ. ఆ. అ.) 1. సంవృతము, కప్పఁబడినది; 2.
మిక్కిలి గూఢమైనది.

నిర్గ్రంథకుఁడు. సం. వి. అ. పుం. 1. క్షపణకుఁడు;
2. దిగంబరసన్న్యాసి; 3. జూదరి. విణ.
(అ. ధికా. అ.) 1. ఒంటరి, నిస్సహాయుఁడు;
2. వస్త్రరహితుఁడు; 3. జ్ఞాని, హృదయగ్రంథి
వీడినవాఁడు.

నిర్గ్రంథనము. సం. వి. అ. న. చంపుట.

నిర్గ్రంథుఁడు. సం. వి. అ. పుం. 1. క్షపణకుఁడు;
2. దిగంబరసన్న్యాసి; 3. ముని. విణ. (అ. ఆ. అ.)
1. నిర్ధనుఁడు, బీదవాఁడు; 2. ఒంటరి, నిస్సహా
యుఁడు; 3. జ్ఞాని; 4. మూర్ఖుఁడు; 5. జూదరి.

నిర్గ్రాహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) తప్పక
గ్రహింపఁదగినది.

నిర్ఘటము. సం. వి. అ. న. బహుజనసమ్మర్దము గల
అంగడి. విణ. (అ. ఆ. అ.) ఘటము లేనిది.

నిర్ఘాతనము. సం. వి. అ. న. యంత్రాదులచే అదిమి
రసి మున్నగువానిని వెలికితీయుట.

నిర్ఘాతము. సం. వి. అ. పుం. 1. నాశము; 2. దెబ్బ;
3. సుడిగాలి; 4. వజ్రాయుధము.

నిర్ఘోషము. సం. వి. అ. పుం. 1. మ్రోఁత శబ్దము;
2. మహాధ్వని. విణ. (అ. ఆ. అ.) ధ్వని లేనిది.

నిర్ఘోషించు. సం. అ. క్రి. ధ్వనిచేయు. "మ...
అజుం డేసృష్టియు స్వామి... నిద్రించుచున్

గుఱువెట్టం దొడఁగెన్ గలల్ గనుచు నిర్ఘోషించుచున్ భూవరా." భాగ. ౮, స్క౦. ౭౧౮.

నిర్జయము. సం. వి. అ. పుం. పూర్ణవిజయము.

నిర్జర. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ; 2. మురయను గంధద్రవ్యము.

నిర్జరము. సం. వి. అ. న. అమృతము

నిర్జరుఁడు. సం. వి. అ. పుం. వేలుపు, దేవత. విణ. (అ. ఆ. అ.) ముదిమి లేనివాఁడు.

నిర్జాతము. సం. విణ. (అ. ఆ. అ.) ఉద్భూతము, ఉద్గతము.

నిర్జించు. సం. స. క్రి. 1. బాధించు. "గీ. బలము గలవానిఁ బలువురు బలవిహీను, లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి, మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁ బట్టి, కుట్టి నిర్జించుమధుకరకులమునట్లు." భార. అర. ౧, ౭౪౧; 2. జయించు. "గీ .. ఇంద్రియముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోఁచి, యేను శాంతిసుఖంబున నెలయుఁ టనఘ." భార శాం. ౫, ఆ ౩౯౫, భార. అశ్వ. ౩, ఆ. ౬; 3. చంపు. "వ .. న్యాజ్ఞసేని కీచకదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించునదియై యరుగుదెంచెం గావలయు .." భార. విరా. ౨, ఆ. ౧౬౭.

నిర్జితి. సం. వి. ఇ. స్త్రీ. పూర్ణవిజయము.

నిర్జితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) జయింపఁబడినవాఁడు.

నిర్ఝరము. సం. వి అ. పుం. న. సెలయేఱు, ఝరము. పుం. 1. ఏనుఁగు; 2. సూర్యాశ్వము; 3. తుషానలము, ఊఁకనిప్పు.

నిర్ఝరి. సం. వి. ఈ. స్త్రీ. సెలయేఱు, నది. న్. పుం. సెలయేళ్లు కలది-పర్వతము.

నిర్ఝరిణి. సం. వి. ఈ. స్త్రీ. నది, సెలయేఱు.

నిర్ణయత్. సం. (శత్రు.) నిర్ణయించుచున్న.

నిర్ణయనము. సం. వి. అ. న నిర్ణయించుట.

నిర్ణయనీయము. సం. = నిర్ణేయము.

నిర్ణయము. సం. వి. అ. పుం. 1. నిశ్చయము, సిద్ధారణ; 2 తీర్పు; 3. ఏర్పాటు.

నిర్ణయించు. సం. స. క్రి. 1. స్థిరపఱుచు, నిర్ధారణచేయు. "ఉ. ఇంతిరో మోము చంద్రుని సమయిత్వము నైఁపనియట్లుఁ గెంపు మో, వంత సుధారసం బనఁగ నధ్యవసాయసహిష్ణుతాగుణా, క్రాంతము గాదొ తద్రసము కాఁగునో యమృతంబుఁ గొంటి మున్నిం తిది నిర్ణయింతు నని యింపుగఁ జేసెను జుంబనక్షతుల్." కాళింది. ౬, ఆ. ౧౮౮ వరాహ. ౧,౩.౮౧; 2. ఏర్పఱుచు. "చ. సమయము నిర్ణయింప విని చంద్రనిభానన పల్కు లప్డు చి,త్తమునకు నింపు నింప .." భార విరా. ౨, ఆ ౭౬౯.

నిర్ణాయకుఁడు. సం. విణ. (అ. యికా అ.) 1. నిర్ణయించువాఁడు; 2. నిర్ణయింపఁజేయువాఁడు.

నిర్ణాయనము సం. వి. అ. న. 1. నిర్ణయము చేయుట; 2. నిర్ణయింపఁజేయుట; 3. మరణము; 4 ఏనుఁగు యొక్క అపాంగప్రదేశము.

నిర్ణిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కడుగఁబడినది; 2. పవిత్రము చేయఁబడినది.

నిర్ణిక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కడుగుట; 2. పాపము పోఁగొట్టుట.

నిర్ణిద్రము. సం. విణ (అ. ఆ. అ.) 1. నిద్ర లేనిది; 2. జాగ్రత్త కలది; 3. ముకుళితము కానిది, వికసించినది. (పుష్పాది.)

నిర్ణీతము. సం. విణ. (అ. ఆ. అ) నిర్ణయింపఁబడినది.

నిర్ణీతి సం వి. ఇ. స్త్రీ. నిశ్చయము. "క. బాలాపాణిగ్రహశుభ, వేళానిర్ణీతి కిపుడ విచ్చేయుము..." వసు. ౩, ఆ. ౮౯.

నిర్ణీయమానము. సం. విణ (అ. ఆ. అ.) నిర్ణయింపఁబడుచున్నది.

నిర్ణుదత్. సం. శత్రు. తొలఁగింపఁబడుచున్న.

నిర్ణుదమానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగించుచున్నవాఁడు.

నిర్ణుద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడుచున్నది.

నిర్ణేకము. సం. వి. అ. పుం. 1. మిక్కిలిశుద్ధి; 2. పాదప్రక్షాళనాదికము; 3. పాపపరిహారము. 4. ప్రాయశ్చిత్తము.

నిర్ణేజకుఁడు. సం. వి. అ. పుం. చాఁకలి, రజకుఁడు. విణ. (అ. జికా. అ.) శుద్ధిచేయువాఁడు.

నిర్ణేజనము. సం. వి. అ. న. 1. కడుగుట; 2. పాపము పోఁగొట్టుట; 3. ప్రాయశ్చిత్తము. విణ. (అ. ఈ. అ.) 1. కడుగుటకు సాధనమైనది; 2. పాపము పోఁగొట్టుటకు సాధనమైనది; 3. ఉదుకుటకు సాధనమైనది.

నిర్ణేత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. నిర్ణయించువాఁడు; 2. నేత, నాయకుఁడు; 3. న్యాయాధిపతి, తీర్పుచెప్పువాఁడు.

నిర్ణేతవ్యము. సం.=నిర్ణేయము.

నిర్ణేయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయింపఁదగినది.

నిర్ణోదకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగించువాఁడు.

నిర్ణోదనీయము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁదగినది.

నిర్ణోదము. సం. వి. అ. పుం. 1. తొలఁగించుట; 2. నిరసించుట. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగించునది; 2. నిరసించునది.

నిర్ణోది. సం. విణ. (న్. నీ. న్.) తొలఁగించువాఁడు.

నిర్ణోద్యము. సం.=నిర్ణోదనీయము.

నిర్దగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా కాలినది; 2. కాలనిది.

నిర్దయము. సం. విణ. (అ. ఆ. అ.) క్రూరము, దయలేనిది. క్రి. విణ. క్రూరముగా.

నిర్దరము. సం. వి. అ. న. సారము. విణ. (అ. ఆ. అ.) 1. కఠినము; 2. సిగ్గులేనిది; 3. నిర్భయము; 4. సెలయేఱు, నిర్ఝరము.

నిర్దళనము. సం. వి. అ. న. పూర్తిగా చీల్చుట, భేదించుట.

నిర్దళించు. సం. స. క్రి. చంపు. "క. ప్రజగరము సంతసిల్లఁగ, నజగరము నశేషలోకహారణగుణోద్య, న్నిజగరము నిర్దళించె, న్భుజగారిధ్వజుఁడు విబుధబుధసన్నుతుఁడై." సాంబో. ౧, ఆ. ౮౧.

నిర్దళితము. సం. విణ. (అ. ఆ. అ.) పూర్తిగా చీల్పఁబడినది.

నిర్దహనము. సం. వి. అ. న. పూర్తిగా కాల్చుట. విణ. (అ. ఆ. అ.) 1. పూర్తిగా కాల్చునది; 2. అగ్ని లేనిది; 3. కాలుట లేనిది.

నిర్దహించు. సం. స. క్రి. 1. పూర్తిగా కాల్చు, బాగుగా కాల్చు. "శా. వంశారణ్యము గాల్చు పావకుగతిన్ వర్ధిష్ణువై విద్విష, ద్వంశారణ్యము నిర్దహించు భవదుద్దామప్రతాపాగ్ని..." నిరం. ౪, ఆ. ౧౧౮. భార. కర్ణ. ౧, ఆ. ౨౯౫; 2. నాశముచేయు. "మ. అవితృష్ణప్రతధీసమాఖ్యతపోవ్యాసంగులై నట్టిభా, గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైకజ్యోతిమైఁ జూపి శోకవిశోకంఋలు నిర్దహించి..." భాగ. ౩, స్కం. ౮౮, హరి. ఉ. ౧౦, ఆ. ౨౧౫.

నిర్దారణము. సం. వి. అ. న. చక్కఁగా చీల్చుట.

నిర్దారితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూర్తిగా చీల్పఁబడినది; 2. తెఱువఁబడినది.

నిర్దిశత్. సం. (శతృ.) నిర్దేశించుచున్న.

నిర్దిశ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్దేశింపఁబడుచున్నది.

నిర్దిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చూపఁబడినది; 2. ఏర్పఱుపఁబడినది; 3. ఆజ్ఞాపింపఁబడినది; 4. ఉపదేశింపఁబడినది; 5. చెప్పఁబడినది, కథితము.

నిర్దిష్టి. సం. వి. ఇ. స్త్రీ. నిర్దేశించుట.

నిర్దేశకుఁడు. సం. విణ. (అ. శికా. అ) నిర్దేశించువాఁడు.

నిర్దేశనము. సం. వి. అ. న. నిర్దేశించుట.

నిర్దేశనీయము. సం.=నిర్దేష్టవ్యము.

నిర్దేశము. సం. వి. అ. పుం. 1. చూపుట; 2. ఆజ్ఞ; 3. ఉపదేశము; 4. చెప్పుట, కథనము; 5. ఏర్పాటు 6. నిశ్చయము; 7. దాపు; 8. వేతనము; 9. ప్రతిపాదకశబ్దము.

నిర్దేశి. సం. విణ. (న్. నీ. న్.) నిర్దేశించువాఁడు.

నిర్దేశించు. సం. స. క్రి. 1. చూపు; 2. ఆజ్ఞాపించు; 3. నిరూపించు, నిర్ణయించి చెప్పు. "క. విదుమజుఁడు శ్రద్ధ యతిపావని యది గలవాఁడు గౌరవశ్రేష్ఠుం డా, తనియన్నము భోజ్యతరం, బని నిర్దేశించె నెల్లయమరులు వినఁగన్." భార. శాం. ౫, ఆ. ౨౪౮.

నిర్దేశ్యము. సం.=నిర్దేష్టవ్యము.

నిర్దేష్ట. సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ) నిర్దేశించువాఁడు.

నిర్దేష్టవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్దేశింపఁదగినది.

నిర్దైన్యము. సం. విణ. (అ. ఆ. అ.) దైన్యము లేనిది.

నిర్ధనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ధనహీనుఁడు, దరిద్రుఁడు.

నిర్ధరించు. సం. స. క్రి. నిర్ధారణచేయు. కాశీ. ౫, ఆ (శ. ర.)

నిర్ధారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) నిర్ధారణచేయువాఁడు.

నిర్ధారణ. సం. వి. ఆ. స్త్రీ.=నిర్ధారణము.

నిర్ధారణము. సం. వి. అ. న. 1. నిశ్చయము; 2. తీర్పు.

నిర్ధారణీయము. సం.=నిర్ధార్యము.
నిర్ధారము. సం. వి. అ. పుం.=నిర్ధారణము.
నిర్ధారయత్. సం. (శతృ) నిర్ధారణచేయుచున్న.
నిర్ధారయమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణ చేయఁచున్నది.
నిర్ధారయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్ధారణ చేయువాఁడు.
నిర్ధారయితవ్యము. సం.=నిర్ధార్యము.
నిర్ధారి. సం. విణ. (న్. ణీ. న్.) నిర్ధారణ చేయువాఁడు.
నిర్ధారించు. సం. స. క్రి. నిశ్చయించు. "శా... భార్గవుఁడు కార్యం బాత్మ నూహించి నిర్ధారించెన్ బలమర్దనాధ్వర పశుగ్రాహం బవశ్యంబుగాన్." వరాహ. ౫, ఆ. ౩౮.
నిర్ధారితము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణచేయఁబడినది.
నిర్ధార్యమాణము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణ చేయఁబడుచున్నది.
నిర్ధూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగింపఁబడినది; 2. విదుల్పఁబడినది; 3. విడువఁబడినది, త్యక్తము; 4. ఖండింపఁబడినది. (వాదాది.)
నిర్నాభి సం. విణ. (ఇ) 1. బొడ్డు లేనిది; 2. నాభిని అతిక్రమించినది, బొడ్డుక్రిందికి దిగినది.
నిర్నాభిబిలము. సం.=నిర్నాభి. (నాభిని అతిక్రమించినది.) "సీ. అభిషేకవిధియోగ్య మగుమహుఁగొల్లి యనిర్నాభిబిలముగా నెఱిక గట్టి..." హర. ౪, ఆ. ౭౧. (అనిర్నాభిబిలము = నాభిని అతిక్రమింపనిది.)
నిర్బంధ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్బంధించువాఁడు.
నిర్బంధకుఁడు. సం. విణ. (అ. ధికా. అ.) నిర్బంధించువాఁడు.
నిర్బంధనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్బంధింపఁదగినది.
నిర్బంధపడు. మి. అ. క్రి. (నిర్బంధము+పడు.) బలాత్కారము నొందు.
నిర్బంధపఱుచు. మి. స. క్రి. (నిర్బంధపడు ధా. ప్రే.) 1. బలవంతముచేయు, "గీ... బాంధవుల్ మీని నిర్బంధపఱుప మనకు, నేమికారణ మని చెప్పరింత యొత్తి." ఉద్భ. ౨, ఆ. ౧౨౩. రామా. ౯, ఆ. ౧౮౬.

నిర్బంధము. సం. వి. అ. పుం. 1. బలాత్కారము; 2. పట్టుదల; 3. గట్టిగా బంధించుట.
నిర్బంధి. సం. విణ. (న్. నీ. న్.) నిర్బంధించువాఁడు.
నిర్బంధించు. సం. స. క్రి. 1. గట్టిగా బంధించు, కదలకుండఁ జేయు. "శా. భూలోకంబున దుష్టశాత్రవచయంబుం జంపి ధర్మజ్ఞులన్, బాలింపంగ జనించినాఁడవు మహీభారావతీర్ణక్రియా, శీలత్వంబు వహించె నీ వివుడు లక్ష్మీనాథ యీ పాముతో, బాలక్రీడలు సల్ప నేమిటికి నిర్బంధించి మర్దింపవే." వి. పు. ౭, ఆ. ౧౭౪; 2. బలవంతపెట్టు, నిర్బంధపఱుచు. "మ. అని దైన్యంబున వేశ్యమాత మిగులం బ్రార్థింప నార్ద్రాత్ముఁడై, వనవాసంబునఁ గష్టముం దపము సాఫల్యంబునుం జెప్పి జవ్వని నవ్వేశ్య బహుప్రకారముల నిర్బంధించె పొమ్మన్న..." దశ. ౫, ఆ. ౨౦.
నిర్బంధ్యము. సం.=నిర్బంధనీయము.
నిర్బద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్బంధింపఁబడినది.
నిర్బధ్నత్. సం. (శతృ.) నిర్బంధించుచున్న.
నిర్బధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్బంధింపఁబడుచున్నది.
నిర్బర్హణము. సం. వి. అ. న. చంపుట, నిబర్హణము.
నిర్బాధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డు లేనిది; 2. ఉపద్రవము లేనిది; 3. జనసమ్మర్దము లేనిది.
నిర్భయము. సం. వి. అ. న. భయములేమి, భయాభావము. "ఉ... ఇందుల కెమ్మెయిన్ మనుజులెన్నఁడు వత్తురె వచ్చిరేని యీ యానందముఁ బొంది నిర్భయమునన్ శయనింతురె .." భార. ఆది. ౬, ఆ. ౧౭౬.
నిర్భరము. సం. వి. అ. న. 1. అతిశయము, ఆధిక్యము. "చ... నరసుతకీర్తి యిట్లనిలనందనుఁ డెవ్వరితోడనేని భీకరసమరంబుసేయు సమకట్టినయట్లు మహానురాగని, ర్భరమున నున్నవాఁడు..." భార. ఆది. ౬, ఆ. ౨౩౯; 2. భారములేమి. క్రి. విణ. 1. మిక్కుటముగా, అధికముగా. (శ. ర.); 2. గాఢముగా.
నిర్భర్త్సకుఁడు. సం. విణ. (అ. ర్త్సికా. అ.) నిర్భర్త్సించువాఁడు.
నిర్భర్త్సన. సం. వి. ఆ. స్త్రీ. = నిర్భర్త్సనము.
నిర్భర్త్సనము. సం. వి. అ. న. 1. బెదరించుట, బెదరింపు; 2. తిరస్కారము; 3. లత్తుక.

**నిర్భర్త్సనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) నిర్భర్త్సింపఁదగినది.

**నిర్భర్త్సయమానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నిర్భర్త్సించుచున్న వాఁడు.

**నిర్భర్త్సయిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్భర్త్సించువాఁడు.

**నిర్భర్త్సయితవ్యము.** సం. = నిర్భర్త్సనీయము.

**నిర్భర్త్సి.** సం. విణ. (న్. ఈ. న్.) నిర్భర్త్సించువాఁడు.

**నిర్భర్త్సించు.** సం. స. క్రి. 1. తిరస్కరించు; 2. బెదరించు. "వ...అసూయాకుటిలం బగుకటాక్ష వీక్షణంబునం దర్జించె నిట్లు నిర్భర్త్సింపఁబడి..." నైష. ౧, ఆ. ౭౨.

**నిర్భర్త్సితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. బెదరింపఁబడినవాఁడు; 2. తిరస్కరింపఁబడినవాఁడు.

**నిర్భర్త్స్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) నిర్భర్త్సింపఁబడుచున్నది.

**నిర్భర్త్స్యము.** సం. = నిర్భర్త్సనీయము.

**నిర్భిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా భేదింపఁబడినది.

**నిర్భేదము.** సం. వి. అ. పుం. 1. భేదించుట; 2. చీలిక; 3. వెల్లడి చేయుట.

**నిర్భేదించు.** సం. స. క్రి. చీల్చు. "వ. ఈక్షణంబున నిన్ను నిర్భేదించె నీగర్భంబున నున్నయతలవితలాదిసప్తపాతాళలోకంబులు చీకాకుగావించె.." ఉ. రా. ౧, ఆ. ౧౧౨.

**నిర్భేద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) భేదింపరానిది.

**నిర్మంథకుఁడు** సం. విణ (అ. ధికా. అ.) మథించువాఁడు.

**నిర్మంథనము.** సం. వి. అ. న. 1. మథించుట; 2. త్రచ్చి నిప్పుపుట్టించుకఱ్ఱ, అరణి; 3. ధ్వంసము.

**నిర్మంథనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) మథింపఁదగినది.

**నిర్మంథము.** సం. = నిర్మంథనము.

**నిర్మంథ్యము.** సం. అ. న. అరణి, మథించి నిప్పుపుట్టించు కఱ్ఱ. విణ. (అ. ఆ. అ.) మథింపఁదగినది.

**నిర్మక్షికము.** సం. అవ్య. అ. న. 1. మక్షికాభావము, ఈఁగలులేమి; 2. జనములేమి. విణ. (అ. ఆ. అ.) 1. ఈఁగలు లేనిది; 2. నిర్జనము.

**నిర్మథనము.** సం.=నిర్మంథనము. 1. (మథించుట.) "ఉ. ధర్మువు దప్పి తాపసమతంబున కంకిలిపా టొనర్పఁ గ్రోధోర్మిమహాత్ములై తపసు లొక్కటఁ గాతని దక్షిణంపుఁగే, ల్నిర్మథనంబుసేసిన జనించెఁ బృథుం డనురాజు.." హరి. పూ. ౧, ఆ. ౧౬౩; 2. (నిర్మూలించుట, చంపుట.) "శా...దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫురత్, గర్వాంధప్రతివీరనిర్మథన విద్యాపారగుల్ మత్సుతుల్." భార. విరా. ౨, ఆ. ౫౫.

**నిర్మథము.** సం. వి. అ. పుం.=నిర్మంథనము.

**నిర్మథించు.** సం. స. క్రి. ధ్వంసముచేయు, పోఁగొట్టు. "మ...దు, ర్మలినాహంకృతి నిర్మథించి..." విష్ణు. నా. ౩, ఆ. ౩౬౯.

**నిర్మదము.** సం. అవ్య. అ. న. మదములేమి. విణ. (అ. ఆ. అ.) మదము లేనిది.

**నిర్మర్యాదము.** సం. అవ్య. అ. న. మర్యాదలేమి. విణ. (అ. ఆ. అ.) మర్యాద లేనిది.

**నిర్మలము.** సం. వి. అ. న. 1. అభ్రకము; 2. నిర్మాల్యము. విణ. (అ. ఆ. అ.) 1. మురికి లేనిది, శుద్ధము; 2. తెల్లనిది; 3. పాపము లేనిది.

**నిర్మాణము.** సం. వి. అ. న. 1. సృష్టి, సృజించుట; 2. చేయుట; 3. గ్రంథాదుల రచించుట; 4. నిర్మించుటకు సాధనము; 5. పన్నుట, కూర్చుట; 6. ఆకారము; 7. కృతి, గ్రంథము; 8. సారము; 9. యోగ్యత.

**నిర్మాత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్మించువాఁడు.

**నిర్మాతవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) నిర్మింపఁదగినది.

**నిర్మానుషము.** సం. అవ్య. అ. న. మనుష్యాభావము. విణ (అ. ఆ. అ.) నిర్జనము.

**నిర్మాయకుఁడు.** సం. విణ. (అ. యికా. అ.) 1. నిర్మించువాఁడు; 2. మాయ లేనివాఁడు.

**నిర్మాయి.** సం. విణ. (న్. నీ. న్.) నిర్మించువాఁడు.

**నిర్మార్జనము.** సం. వి. అ. న. 1. కడుగుట; 2. శుద్ధి చేయుట. విణ. (అ. ఆ. అ.) మార్జనము లేనిది.

**నిర్మాల్యము.** సం. వి. అ. న. దేవతలను పూజించి పిదప తీసివేసినపుష్పాదికము, ధరించి తీసివేసిన పుష్పాదికము.

**నిర్మించు.** సం. స. క్రి. 1. సృజించు. "వ...చరాచరంబులఁ బురాతనసర్గంబుల చందంబున నిర్మించి..." వి. పు. ౧, ఆ. ౧౧; 2. కావించు,చేయు. "క...న న్నతిరుచిరాంబరభూషా, న్వితఁ జేసి మనఃప్రియంబు నిర్మింపు దయన్." భార. ఆర

౨, ఆ. ౩౭౬; 3. (గ్రంథాదులను) రచించు. "మ...ప్రబంధం బూని నిర్మించు టే, సరసత్వం బని..." ఉ. రా. పీఠి. ౧౪; 4. (గృహాదులను) కట్టు. "వ...ఇట ధృతరాష్ట్రుండు దననిర్మింపం బంచినసభ దుర్యోధనునకుం జూపి..." భార. సభా. ౨, ఆ. ౧౩౪, ౧, ఆ. ౪.

నిర్మితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింపఁబడినది.

నిర్మితి. సం. వి. ఇ. స్త్రీ. నిర్మించుట.

నిర్మితిచేయు. మి. స. క్రి. (నిర్మితి+చేయు) నిర్మించు. "చ...జగజ్జయసాధనంబులై మెలఁగెడు చాప బాణములు మేలుగ నిర్మితిచేసి మాధవుం, డల మరు నంగహీను విజయాన్వితుఁ జేయు ననంగ లక్ష్మమా." కాళిందీ. ౨, ఆ. 2.

నిర్మిత్స. సం. వి. ఆ. స్త్రీ. నిర్మింపనిచ్ఛ.

నిర్మిత్సితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింప నిచ్ఛగింపఁబడినది.

నిర్మిత్సువు. సం. విశే. (ఉ.) నిర్మింప నిచ్ఛగించువాఁడు.

నిర్మిమీష. సం. వి. ఆ. స్త్రీ. నిర్మింపనిచ్ఛ.

నిర్ముక్తము. సం. వి. అ. పుం. కుబుసము విడిచిన పాము.

నిర్ముక్తి. సం. వి. ఇ. స్త్రీ. బంధమునుండి విడివడుట, ముక్తి.

నిర్ముక్తుఁడు. సం. వి. అ. పుం. సంగము విడిచిన సన్న్యాసి. విశే. (అ. ఆ. అ.) 1. విడువఁబడిన వాఁడు; 2. సంసారాదిబంధవిముక్తి నొందిన వాఁడు.

నిర్మూలకుఁడు. సం. విశే. (అ. లికా. అ.) నిర్మూలించు [వాఁడు.

నిర్మూలనము. సం. వి. అ. న. 1. పెల్లగించుట; 2. నాశముచేయుట.

నిర్మూలనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁదగినది.

నిర్మూలపడు. మి. స. క్రి. (నిర్మూలము+పడు.) నాశమగు. (చూ. నిర్మూలపఱచు.)

నిర్మూలపఱచు. మి. స. క్రి. (నిర్మూలపడుధా.) నాశముచేయు. "గీ. పూల నేసినవాని నిర్మూలపఱచి, తూల నేసినవాని పేరాళమైన, లీలఁ గరుణించితివి..." నిరం. ౩, ఆ. ౪౨.

నిర్మూలము. విశే. (అ. ఆ. అ.) 1. వేరు లేనిది. (చెట్టు.); 2. ఆధారము లేనిది. (వాక్యాది.); 3. మూలము లేనిది, నశించినది; 4. నశింపఁ జేయునది.

నిర్మూలయత్. సం. (శతృ.) నిర్మూలించుచున్న.

నిర్మూలయమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలించుచున్నది.

నిర్మూలయితృ. సం. విశే. (ఋ. త్రి. ఋ.) నిర్మూలించువాఁడు.

నిర్మూలయితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁదగినది.

నిర్మూలించు. సం. స. క్రి. 1. నాశముచేయు. "వ...నీయందుఁ గలనిఖిలజంతువుల నిర్మూలించి...ఈ యేడులోకంబుల నీటి కావించెద..." ఉ. రా. ౧, ఆ. ౧౧౨; 2. ఊడఁదీయు. "క. తూలింతు దానవుల నిర్మూలింతు రిపుప్రియాంగముల భూషణముల్." భాగ. ౧, స్కం. ౪౧౬; 3. పెకలించు.

నిర్మూలితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁబడినది.

నిర్మూల్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మూలింపఁబడుచున్నది.

నిర్మూల్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిర్మూలింపఁదగినది; 2. విలువ లేనిది.

నిర్మృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) శుద్ధిచేయఁబడినది.

నిర్మేయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింపఁదగినది.

నిర్మోకము. సం. వి. అ. పుం. 1. విడిచిపెట్టుట, మోచనము; 2. కుబుసము; 3. కవచము; 4. ఆకాశము.

నిర్మోచనము. సం. వి. అ. న. 1. పూర్తిగా విడిచిపెట్టుట; 2. పూర్తిగా విడిపించుట.

నిర్యంత్రణము. సం. వి. అ. న. 1. పిడుచుట; 2. నలఁచుట. అవ్య. అ. న. 1. అడ్డులేమి; 2. బంధములేమి, ఉచ్ఛృంఖలత్వము; 3. బాధలేమి. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డులేనిది; 2. బంధములేనిది, ఉచ్ఛృంఖలము; 3. బాధలేనిది.

నిర్యంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) అడ్డములేనిదిగా చేయఁబడినది.

నిర్యాణము. సం. వి. అ. న. 1. వెడలుట, నిస్సరణము; 2. మరణము; 3. మోక్షము, ముక్తి; 4. ప్రయాణమగుట; 5. ఏనుఁగుకడకన్ను.

నిర్యాతకుఁడు. సం. విశే. (అ. తికా. అ.) పీనుఁగును మోయువాఁడు, శవవాహకుఁడు.

నిర్యాతనము. సం. వి. అ. న. 1. ఈవి, దానము; 2. ఇచ్చినదానికి బదులుగా నిచ్చుట, ప్రతిదానము;

3. ప్రతీకారము; 4. చంపుట; 5. అప్పు లోనగు వానిని తీర్చుట; 6. దాఁచఁబెట్టినసొమ్మును తిరిగి అప్పగించుట.

నిర్యాతము. సం. వి. అ. న. 1. వెడలుట; 2. మరణము. విణ. (అ. ఆ. అ.) 1. వెడలినది; 2. మరణించినది.

నిర్యాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వెడలుట, నిస్సరణము; 2. ప్రయాణము; 3. మరణము.

నిర్యాత్యము. సం. విణ. (అ. ఆ. అ.) తీర్పఁదగినది.

నిర్యాపణము. సం. వి. అ. న. వెడలఁగొట్టుట.

నిర్యాసము. సం. వి. అ. పుం. న. 1. బంక; 2. కషాయము. "గీ. సల్లకీజాతనిర్యాసమెల్లదేవ, తలకు మేలు...ధూపదానము సెడ..." భార. అను. ౪, ఆ. ౧౨.

నిర్యుక్తి. సం. అవ్య. ఇ. న. 1. కూడికలేమి; 2. అర్హతలేమి. విణ. (ఇ)=నిర్యుక్తికము.

నిర్యుక్తికము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కూడికలేనిది; 2. అర్హము కానిది.

నిర్యూషము. సం. వి. అ. పుం. బంక, నిర్యాసము.

నిర్యూహము. సం. వి. అ. పుం. 1. వాకిలి, ద్వారము; 2. నిర్యాసము, బంక; 3. సిగబంతి; 4. కషాయము; 5. గోడపైని కఱ్ఱతో కట్టినగువ్వగూడు; 6. చిలుకకొయ్య.

నిర్లజ్జుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) లజ్జ లేనివాఁడు.

నిర్లిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూఁత లేనిది లేపనము లేనిది; 2. నిస్సంగము.

నిర్లుంచనము. సం. వి. అ. న. 1. ఒలుచుట, పొట్టు లోనగునవి తీయుట; 2. త్రుంచుట.

నిర్లుంఠనము. సం. వి. అ. న. అపహరణము.

నిర్లూత. దే. వి. జలజంతువిశేషము. "గీ....వెలుక నిర్లూత కోచు తాఁబేలు పిడుక, మొసలి శింశుమారము పెద్దమొసలి..." హంస. ౪, ఆ. ౧౭౬.

నిర్లేఖనము. సం. వి. అ. న. 1. వ్రాయుట; 2. గోఁకుట. విణ. (అ. ఈ. అ.) 1. వ్రాయుటకు సాధనమైనది. -(కలము. మొ.); 2. గోఁకుటకు సాధనమైనది.

నిర్లేపము. సం. = నిర్లిప్తము.

నిర్వక్తవ్యము. సం. = నిర్వచనీయము.

నిర్వచనము. సం. వి. అ. న. 1. ఉచ్చరించుట; 2. అర్థమును వివరించి చెప్పుట; 3. సామెత; 4. ప్రసిద్ధి. విణ. (అ. ఆ. అ.) 1. గద్యము లేనిది. (కావ్యము.); 2. మాటాడనిది.

నిర్వచనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వచింపఁదగినది.

నిర్వచించు. సం. స. క్రి. వివరించిచెప్పు, స్పష్టపఱచు. "గీ...భ్రూమధ్యమాస్థలంబు, వరణ సంసారదోషనివారణంబు, నాశి యింద్రియదోష వినాశనంబుఁ, జేయుచుండుట యిది నిర్వచింపఁబడియె." కాశీ. ౨, ఆ. ౧౯౯.

నిర్వపణము. సం. వి. అ. న. 1. పితృతర్పణము విడుచుట; 2. ఈవి, దానము; 3. యజ్ఞాదులందు దేవతల కన్నాదులను పంచుట; 4. విత్తనములు చల్లుట.

నిర్వర్ణనము. సం. వి. అ. న. 1. చూపు; 2. పరిశీలనపూర్వకముగా చూచుట.

నిర్వర్ణించు. సం. స. క్రి. చూచు. "వ...పూర్ణచంద్రు దర్శించుకలశాంబుధి తెఱంగున సరోవరంబు దర్శించుతర్షితునిమాడ్కి..." నిరం. ౧, ఆ. ౭౯.

నిర్వర్తకుఁడు. సం. విణ. (అ. ర్తికా. అ.) నెఱవేర్చువాఁడు.

నిర్వర్తనము. సం. వి. అ. న. నెఱవేర్చుట.

నిర్వర్తనీయము. సం. = నిర్వర్తితవ్యము.

నిర్వర్తమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తించుచున్నది.

నిర్వర్తి. సం. విణ. (న్. నీ. న్.) నెఱవేర్చునది.

నిర్వర్తించు. సం. స. క్రి. 1. చేయు. "వ.. దుర్యోధనుసందర్శనంబును నిర్వర్తించి......" భార. ఉద్యో. ౧, ఆ. ౨౩౦; 2. ఆచరించు. "సీ... దేవ, పిత్రతిథిజ్ఞాతిమిత్రకార్యములు నిర్వర్తించు సువినయవంతులైన, తనయులఁ గన్నాఁడు..." భార. శాం. ౬, ఆ. ౫౪౭; 3. సిద్ధముచేయు, ఒడఁగూర్చు. "వ. అని నిశ్చయించి యతనికి నాహారసంఛాదనంబులు సమీచీనంబులుగా నిర్వర్తింపఁ దగువాని నియోగించి..." భార. శాం. ౩, ఆ. ౪౯౩.

నిర్వర్తిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్వర్తించువాఁడు.

నిర్వర్తితము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్వర్తింపఁబడినది.

నిర్వర్తితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁదగినది.

నిర్వర్తిల్లు. సం. స. క్రి. నెఱవేఱు. (శ. ర.)

నిర్వర్త్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వర్తింపఁబడుచున్నది.

నిర్వర్త్యము. సం. విణ. (అ. ఆ.అ.) నిర్వర్తింపఁదగినది.

నిర్వహణము. సం. వి. అ. న. 1. నెఱవేర్చుట; 2. జరుపుట; 3. నాటకసంధులలో నొకటి.

నిర్వహణీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వహింపఁదగినది.

నిర్వహత్. సం. శత్రు. నిర్వహించుచున్న.

నిర్వహించు. సం. అ. క్రి. జీవించు, బ్రదుకు. "వ. నిన్నుం బాసి నిమిషం బయిన నిర్వహింపనేర మని ధర్మరాజు జెట్టకేనియు గరుడగమనుగమనంబున కొడంబడియె నంత." భార. సభా. ౨, ఆ. ౭౩, దశా. ౨, అ. ౭౨, స. క్రి. 1. నెఱవేర్చు, పూర్తిచేయు. "వ... ధర్మదేవత..." యాగవిశేషవిధానంబు పరప్రదానంబున నిర్వహించె... భార. శాం. ౫, ఆ. ౩౬౨; 2. ఆచరించు "ఉ. వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచున్." భార. విరా. ౧, ఆ. ౧౫; 3. చేయు. "సీ. ప్రామినుకులు సూత్రపఱచి లోకహితంబుగా నిర్వహించె నెవ్వానిబుద్ధి." వరాహ. ౧, ఆ. ౯; 4. జరిగించు, సాగించు. "ఉ...మది యెంతయు బెగ్గిలె మేను చేష్టలం, దక్కనశక్య మింకిట రథవ్యవహారము నిర్వహింపఁగన్." భార. విరా. ౫, ఆ. ౧౧౨. భార. సభా. ౧, అ. ౫౦; 5. అన్నాదిక మిడి పోషించు. "చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పెర్మితోఁ, బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె నప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండినశాకమూలముల్, గడురుచి సిష్ట భోజనసుఖంబును దృప్తియుఁ జేయుచుండఁగన్." భార అర. ౧, ఆ. ౪౪.

నిర్వహిల్లు. సం. అ. క్రి. 1. జరుగు; 2. నెఱవేఱు. (శ. ర.)

నిర్వాచ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వచింపఁ[దగినది.

నిర్వాణము. సం. వి. అ. న. 1. అస్తమించుట; 2. మృతి; 3. మోక్షము; 4. సంతోషము; 5. సంగమము; 6. ఏనుఁగు నీళ్లలో మునుఁగుట; 7. విశ్రాంతి. విణ. (అ. ఆ. అ.) 1. శూన్యము, లేనిది; 2. మృతము, చచ్చినది; 3. నిశ్చలము; 4. నీళ్లలో మునిఁగినది, (ఏనుఁగు); 5. అస్తమించినది; 6. శాంతము, ఆఱిపోయినది. (గర్వము, దీపము. మొ.) "ఉ. క్షోణి వడంకె దిగ్గహనఘోరముగా దివిధూమకేతు వక్షీణతఁ దోఁచె శర్కరలు సేద్వఁడఁ జల్లుచుఁ దీవ్రుఁడై జగత్ప్రాణుఁడు వీచె శోణితపురం బురుశోణితవృష్టిఁ దేలె నిర్వాణము లయ్యె దేవరిపువర్గము లేఁడుము లెల్ల నొక్కమై." హరి. ఉ. ౭, ఆ. ౪౪.

నిర్వాణి. సం. విణ. (న్. నీ. న్.) నిర్వాణము కలవాఁడు-శాంతుఁడు. "ద్వి. బాపురే నిర్వాణి బాపురే తపసి." బస. ౩, ఆ. ౧౧౭౯. పం.

నిర్వాణుఁడు. సం. వి. అ. పుం. 1. సేవకుఁడు; 2. బరువు మోయువాఁడు; 3. సన్న్యాసి; 4. ముక్తి నొందినవాఁడు.

నిర్వాతము. సం. అవ్య. అ. న. గాలిలేమి. విణ. (అ. ఆ. అ) గాలి లేనిది.

నిర్వాదము. సం. వి. అ. పుం. 1. జనవాదము, నింద; 2. నిశ్చితవాదము. అవ్య. అ. న. వాదములేమి. విణ. (అ. ఆ. అ.) వాదము లేనిది.

నిర్వాపకుఁడు. సం. విణ. (అ. పికా. అ.) నిర్వాపము చేయువాఁడు, పోఁగొట్టువాఁడు "క. ఉర్వీశమౌళి యగునా, తుర్వసువంశంబునందు దుష్టారిభుజా, దుర్వారగర్వరేఖా, నిర్వాపకుఁ డీశ్వరాఖ్యనృపతి జనించెన్." పారి. పీఠి. ౭.

నిర్వాపణము. సం. వి. అ. న. 1. ఈవి, దానము; 2. తర్పణము చేయుట; 3. (దీపాదులను) ఆర్పుట, 4. ఉపశమింపఁజేయుట; 5. నాశము చేయుట; 6. చంపుట; 7. విత్తనములు చల్లుట; 8. చల్లఁబఱచుట; 9. చలువ చేయుటందు లోనగువస్తువు; శిశిరోపచారద్రవ్యము.

నిర్వాపము. సం. వి. అ. పుం. 1. దానము; 2. తర్పణము చేయుట; 3. (అగ్న్యాదులను) చల్లార్చుట.

నిర్వాపయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిర్వాపము చేయునది.

నిర్వాసనము. సం. వి. అ. న. 1. నిస్సారణము, వెళ్లఁగొట్టుట; 2. చంపుట; 3. విసర్జించుట.

నిర్వాసము. సం. వి. అ. పుం. 1. ఇల్లు వెడలిపోవుట, ప్రవాసము; 2. వెడలఁగొట్టుట; 3. చంపుట.

నిర్వాసించు. సం. స. క్రి. ప్రవాసముగాఁ బంపు; వెడలఁగొట్టు.

నిర్వాసితము. సం. విణ. (అ. ఆ. అ.) వెళ్లఁగొట్టఁబడినది.

నిర్వాహకుఁడు. సం. విణ. (అ. హికా. అ.) నిర్వహించువాఁడు.

నిర్వాహము. సం. వి. అ. పుం. నిర్వహించుట.

నిర్వాహి. సం. విణ (న్. నీ. న్.) 1. నిర్వహించునది, నెఱవేర్చునది; 2. వెలుఁవరించునది.

నిర్వాహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వహింపఁదగినది. "గీ. వైశ్వదేవ మవశ్య నిర్వాహ్యమనఘ." భార. అను. 3. ఆ. 33౭.

నిర్వికల్పము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పక్షాంతరము లేనిది; 2. సందేహము లేనిది. క్రి. విణ. నిస్సంశయముగా.

నిర్విఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) విఘ్నము లేనిది. క్రి. విణ. విఘ్నము లేకుండఁగా.

నిర్విణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూనిన కార్యము విఫలమైన దని యనుతాప మొందువాఁడు; 2. ఖిన్నుఁడు; దుఃఖముచే కృశించినవాఁడు; 3. మిక్కిలివిరక్తుఁడు; 4. తన్ను తాను నిందించుకొనువాఁడు.

నిర్విశేషము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆధిక్యము లేనిది; 2. అభిన్నము; సమానము. క్రి. విణ. భేదము లేకుండునట్లుగా. అవ్య. అ. న. భేదము లేమి.

నిర్విశేషుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అభిన్నుఁడు; సమానుఁడు. "వ... పుత్త్రనిర్విశేషుం డగునిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయొ.." భార. విరా. ౪, ఆ. ౧౯౯.

నిర్విష. సం. వి. ఆ. స్త్రీ. అతివస.

నిర్విషము. సం. అవ్య. అ. న. విషాభావము. "చ... ఈ ప్రమద్వరకు నిర్విషమయ్యెడు నేఁడు మీద యన్." భార. ఆది. ౧, ఆ. ౧౮౮. విణ. (అ. ఆ. అ.) విషము లేనిది.

నిర్విష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది; 2. చొరఁబడినది; 3. పొందఁబడినది. (శ. ర.)

నిర్వీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వీరుఁడు కానివాఁడు, పిఱికివాఁడు.

నిర్వీర్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పుంస్త్వము లేనిది; 2. పౌరుషము లేనిది.

నిర్వృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సుఖముగా నుండునది; 2. నశించినది.

నిర్వృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. స్వస్థత, 2. నాశము. మృత్యువు; 3. మోక్షము; 4. సుఖము. "శా. ఎంతే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్, బొందున్..." స్వా. ౨, ఆ. ౯౨.

నిర్వృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) నెఱవేఱినది.

నిర్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నెఱవేఱుట, సంసిద్ధి; 2. మోక్షానందము. అవ్య. ఇ. న. వృత్తిలేమి, జీవికలేమి. విణ. (ఇ) వృత్తిలేనివాఁడు, జీవికలేనివాఁడు.

నిర్వేదనము. సం. వి. అ. న. దుఃఖము. ఖేదము. "వ......సుదేష్ణ త న్ననుచితవ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదనంబునం బొంది." భార. విరా. ౨, ఆ. ౧౦౩.

నిర్వేదము. సం. వి. అ. పుం. 1. రోఁత; 2. తన్నుఁదాను నిందించుకొనుట; 3. పరమవైరాగ్యము.

నిర్వేదించు. సం. అ. క్రి. 1. విచారించు, దుఃఖించు "వ. ఇట్లురగు లమృతం బుపయోగింపం గానక చనిన శేషుండు దనతల్లియుం దమ్ములుఁ జేసిన యధర్మంబునకు నిర్వేదించి..." భార. ఆది. ౨, ఆ. ౧౨౫. శివరా. ౪, ఆ. ౧౦౮; 2. రోఁతపడు; విరక్తినొందు. "వ. తపోమహత్త్వంబున మాకు నాయువు గడుం బెద్దయైన నిర్వేదించి మనుష్యలోకంబున నుండ నొల్లక..." భార. ఆది. ౨, ఆ. ౧౪౦. భార. సభా. ౧, ఆ. ౧౩౬.

నిర్వేశము. సం. వి. అ. పుం. 1. భోగము; 2. అనుభవము; 3. భృతి, వేతనము; 4. మూర్ఛపోవుట.

నిర్వైరము. సం. అవ్య. అ. న. వైరములేమి. విణ. (అ. ఆ. అ.) వైరములేనిది.

నిర్వోఢ. సం. విణ. (ఋ. ఢ్రీ. ఋ.) నిర్వహించువాఁడు.

నిర్వోఢవ్యము. సం. విణ. (అ. ఆ. అ) నిర్వహింపఁదగినది.

నిర్వ్యథనము. సం. వి. అ. న. 1. మిక్కిలిబాధ; బెజ్జము, రంధ్రము. అవ్య. అ. న. వ్యథలేమి.

నిర్వ్యథము. సం వి. అ. న. అధికబాధ. అవ్య. అ. న. బాధలేమి. (విణ. అ. ఆ. అ.) వ్యథ లేనిది.

నిర్హరణము. సం. వి. అ. న. 1. శ్మశానాదులకు తీసికొనిపోవుట; 2. వెడలఁగొట్టుట; 3. నివారించుట,

పోఁగొట్టుట. "క. శ్రీమదపాంగాలోకన,ధామ సకృత్సంగరూఢతాదృశ విభవో,ద్దామాశ్రిత లోకాలో,కామయనిర్హ్రరణ నిపుణ హరిహర నాథా." భార. విరా. ౨, ఆ. ౧.

నిర్హ్రాదము. సం. వి. అ. పుం. మలవిసర్జనము.

నిర్హ్రారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) నిర్హ్రరణము చేయువాఁడు.

నిర్హ్రారము. సం. వి. అ. పుం. 1. నిర్హ్రరణము; 2. రహస్యముగా ధనాదులు కూడఁబెట్టుట; 3. మలమూత్రాదివిసర్జనము.

నిర్హ్రారి. సం. విణ. (న్. ణీ. న్.) 1. నిర్హ్రరణము చేయువాఁడు; 2. మిక్కిలిమనోహరము; 3.దూరముగా వ్యాపించునట్టిది. (పరిమళాది.)

నిర్హ్రృతము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్హ్రరణము చేయఁబడినది.

నిర్హ్రృతి. సం. వి. ఇ. స్త్రీ = నిర్హ్రరణము.

నిర్హ్రాదము. సం. వి. అ. పుం. ధ్వని.

నిఱనిఱ. దే. వి. నీల్గుటయందు దగుధ్వని కనుకరణము. "ద్వి. నిఱనిఱ నీల్గుచు నిక్కుచు వీపు,విఱిచి కొను .." పండితా. పురా. ౧౧౧. పు.

నిఱు. దే. విణ. (క. నిఱు.) మిక్కిలి. (చూ. నిఱుపేద మొ.)

నిఱునీఁగు. దే. స. క్రి. (నిఱు+నీఁగు) సంపూర్ణముగా త్యజించు. "ఉ నిన్నటినుండి యేము నిఱునీఁగియుం నుంటిమి నిట్టుపాసముల్." కాశీ. ౧, ఆ. ౧౭౯.

నిఱుపేద. దే. విణ. (నిఱు+పేద.) 1. కడుబీద, అతిదరిద్రుఁడు. "క. నిఱుపేద యింటి కేఁటికిఁ, బఱతెంచు నిధానము..." నైష. ౪, ఆ. ౭౩; 2. మిక్కిలి సన్ననిది. "సీ. ఘనమైనరారాపు చనుదోయిరాయిడి నిఱుపేదనడిమికి వెఱపు చూప." కాశీ. ౧, ఆ.౯౦. స్వా. ౩, ఆ. ౧౧౩. ఇట్లే: నిర్పేద. పాండు. ౧, ఆ. ౧౦౧.

నిఱుప్రేమ మి. వి. (నిఱు+ప్రేమ) పూర్ణమగుప్రేమ "చ ..పిల్చియుం బిలువక మున్నె వచ్చె నిఱుప్రేమ దొలంకఁగ ..." సా. ౧, ఆ. ౧౩౦.

నిట్టనీల్గు. దే. అ. క్రి. (నిట్టు+నీల్గు) ఒడలుఁవిఱిచికొను. "గీ. నీడుగాలికిఁ బసిపట్టి నిట్టనీల్గి,పట్టెడల బిగఁబట్టిన పట్టుపడక,నిలువ కేతెంచి వేఁట కుక్కలు కుమారు,చుట్టుక గునిసి కూడంగఁ జూడ వేమి." కాశీ. ౩, ఆ. ౭౫. ఇట్లే: నిట్టన నీల్గు. చెన్న. ౪, ఆ. ౪౧౦.

నిట్టు. దే. వి. నీల్గుట కనుకరణము. (చూ. నిట్టనీల్గు.)

నిలఁబడు = నిలువఁబడు. (నిలుచు) "క. ఇలుకాలి కూల నిట్టక, నిలిచిన నిట్రాడువోలె నిజరథమటులుం,బోలియన్ నిలఁబడి రాకా,సులఱేఁడుండుటకు నగుచుఁ జూచిరి వేల్పుల్." రామా. ౮, ఆ. ౧౩౨.

నిలక. దే. వి. (నిలుచు ధా.) నిలుపు, నిలుకడ. (శ. ర. బ్రౌ.)

నిలయనము. సం. వి. అ. న. 1. నెలకొనుట,ఉండుట; 2. కనుమూసికంతలు అనుక్రీడావిశేషము; 3. లీనమగుట, అంతర్ధానమగుట; 4. ఉనికిపట్టు, నిలయము.

నిలయము. సం. వి. అ. పుం. 1. ఉనికిపట్టు, వాసస్థానము; 2. ఇల్లు, గృహము; 3. పూర్ణముగా నశించుట; 4. లీనమగుట, కనఁబడకుండుట; 5. కనుమూసిగంతలు అనుక్రీడావిశేషము.

నిలింపుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

నిలీనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నశించినది; 2. కనఁబడనిది; 3. కరఁగినది; (బంగారు మొ); 4. నిశ్శేషముగా లీనమైనది.

నిలుకడ. దే. వి. 1. ఉనికి, స్థితి. "మ. నుదుపుం జిల్కలకొల్కి...సిల్కడ గావించె భవద్రసజ్ఞపయి నింకన్...కబ్బంబు గావింపుమా." చం.రా. ౧, ఆ. ౮౩. హరి. ఉ. ౭, ఆ. ౧౧౪; 2. వాసస్థానము. "వ...కావున నలుక నలఁకువలకు నిలుకడ యగుట దాని విడువవలయు..."య ౩, ఆ. ౮; స్థిరత్వము, నిశ్చలత్వము. "చ. నిలుకడ నున్న వావి నహి నేస్తము నాస్తి భయంబు లేదు..." శశాం. ౪, ఆ. ౧౭. సా. ౨, ఆ. ౧౪; 3 నిలువఁబడుట, ఉత్థానము. "వ. పురారి...ఒయ్యారంపునిలుకడ నిలిచి..." హర. ౭, ఆ. ౪౯. శుక. ౨, ఆ. ౪౩౩; 4. సమాప్తి, ముగింపు. "సీ. అందంద కదిరెడు కొండలపాటుచేఁ దలఁకుచు నునికికి నిలుకడయయ్యెను." గీ. లేమి... భార. విరా. ౨, ఆ. ౩౧౫; 5. ధైర్యము. "గీ. దానవాధిపునిలుకడ దప్పినట్లు, పదసరోజయుగము దొట్రుపడుచు నుండ." భా. రా. యు. ౧౮౬౪. యు. ౪, ఆ. ౧.

నిలుకాలు. దే. వి. బొ. (నిలుచు+కాలు) కాలి నిలుకడ. "క. తల యొడ లెఱుఁగక యాగతి వలచి...నిలుకాల నిలువఁ దీఱక,మెలగంగా." మల్హా. ౩, ఆ. ౯౮.

నిలుగు = నీలుగు. 1. (ఒడలువిఱుచుకొను.) "చ. నిలుగుచు నావులించుచు వనీవిహగోత్కర మెట్లు వల్కు నప్పలుకులె యట్టు లెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్." స్వా. ౩, ఆ. ౫౮. వరాహ. ౧౧, ఆ. ౧౭౬; 2. (చచ్చు.) "చ... రోగముల మ్రంది గృహంబులయందు బంధు లేడ్వ నిలుగుకష్టులు న్నరులె వారలతల్లులు తల్లులే మహిన్." మార్క. ౩, ఆ. ౩౭. చం. రా. ౭, ఆ. ౪౬; 3. (గర్వించు.) "చ. జలరుహనేత్ర నన్నిపుడు సారెకుఁ దూఱుచుఁ గేరి నిక్కుచున్, నిలుగుచు విఱ్ఱవీఁగుచును .." సా. ౩, ఆ. ౫౫.

నిలుచు. దే. అ. క్రి. 1. నిలువఁబడు, ఉత్థితుఁడగు "చ. కని యతిభక్తిపూర్వకముగా ధరఁ జాఁగి నమస్కరించి లేచి నిలిచి ఫాలభాగమునఁ జేతులు చేరిచి..." విక్ర. ౨, ఆ. ౨౨౧; 2. ప్రతిష్ఠితమగు. (శ. ర.); 3. వర్తించు. "గీ... ధర్మంబు శూద్రులతలన నిలుచు, శాక్తబౌద్ధాది దుర్మతశ్లాఘ లెసఁగు." హరి. ఉ. ౯, ఆ. ౩౮. భార. విరా. ౧, ఆ. ౬౪; 4. నివసించు. "గీ. కాంచి యేలెడుజయసేనుఁ గాంచి యతఁడు, నన్ను మన్నింప నందుఁ గొన్నాళ్లు నిలిచి..." విక్ర. ౫, ఆ. ౧౬౯; 5. పాఱిపోకుండు. "గీ. సింహచర్మంబు దొడిగినఁ జెనఁటికుక్క, గంధగజగంధమునకును గలదె నిలువ." హరి. ఉ. ౬, ఆ. ౧౬౯. పారి. ౫, ఆ. ౩; 6. మిగులు, శేషించు. "గీ. ఇంట దొల్లెడుకుండలు నినుపకట్ల, మాని ముంతలు నిలిచె నమ్మల్లపతికి, వార్ధికన్యాకటాక్ష మవ్వలికిఁ జనిన." శుక. ౨, ఆ. ౩౫౦. ఉ. హరి. ౧, ఆ. ౧౧; 7. అడఁగు. "క...రా,నేరరు గావున నిట చను, దేరక నిలువుండ యివియు దేవపథంబుల్." భార. ఆది. ౫, ఆ. ౬౮. ఉ. హరి. ౨, ఆ. ౨౪; 8. ఉండు, పోకుండు. "గీ. అంధకారంబు నిలుచునే యర్కునెదుట." వి. పు. ౪, ఆ. ౧౨౨; 9. ఓర్చు, తాళు. "ఆ... అమ్మృగాక్షి నీవు పరింపక, నిలువలేవు మఱఁదు బలియుఁ డగుట." భార. శాం. ౧, ఆ. ౨౫౨. భార. ఆది. ౬, ఆ. ౨౯౧; 10. కలుగు, జనించు. "క...నీకృప నామీఁదఁ జాల నిలిచిన కతనన్." వి పు. ౬, ఆ. ౩౩౬; 11. తీఱు, పోవు. "గీ. నీరు గ్రోలిన దాహంబు నిలుపదేని, వాఁడు వేంచేయు నీరైదువాసరముల." జై. ౮, ఆ. ౧౦౧. వరాహ. ౧౨, ఆ. ౬౬; 12. జీవించు, బ్రదుకు. "ఆ. నిద్ర లేక తమకు నిలుచుపాయంబు, లొండు దక్క వెదకుచున్న వారు." భార. ఆది. ౬, ఆ. ౭౭౮; 13. కనఁబడు. "ద్వి. తఱుచుమెఱుంగులు తళతళమనఁగ, నెఱిఁ దూర్పుఁగొండపై నిలిచె నాదిత్యుఁడు ..." ద్వి. హరిశ్చ. పూ. ౫౫౪. పం; 14. వృద్ధిఁబొందు, పోషింపఁబడు. "సీ. స్థావరజంగమాత్మకమగుభౌతికం బెవ్వనిచేఁ బుట్టు నెవ్వనికృప. గీ. నిలుచు నెవ్వనికతనచే విలయ మొందు." పాండు. ౨, ఆ. ౨౧౩; 15. తగులుకొను, సక్తమగు "సీ. భూషామణివ్యాజమున నంగకంబుల జనుల చూపులు నిశ్చలత నిలువ." నైష. ౫, ఆ. ౭; 16. నశింపకుండు. "క...కొలఁదులవారికి గర్వము, నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్." భార. ఉద్యో. ౩, ఆ. ౩౦౩; 17. చిత్తైకాగ్రత నొందు. "క. అని యిష్టదేవతాప్రార్థనమ్ము నాదిసు కవివినుతమునుం గావించి నిలిచి పెల్లగుచుల్లంబు నందు నే నొకపురాణముం జెప్పంగన్." జై. ౧, ఆ. ౭; 18. విశ్రమించు. "సీ. నిలనీనివంట వార్పుల నత్తమామలపోరును లేనికాఁపురము గలిగె." శుక. ౩, ఆ. ౬౦౪.

నిలుచుండఁబెట్టు. దే. స. క్రి. (నిలుచుండు ధా. ప్రే.) నిలుచునట్లుచేయు. "సీ. నిలుచుండఁబెట్టి యంగుళియూఁత సూపఁగాఁ బ్రీతిఁ దప్పడుగులు వెట్టి వెట్టి." హరి. పూ. ౫, ఆ. ౧౯౦.

నిలుచుండు. దే. అ. క్రి. (నిలుచు+ఉండు-స్వార్థమున.) 1. నిలువఁబడు, ఉత్థితుఁడగు. "గీ ..పదపడి కాల్కడయొద్ద కల్లఁజరి విశ్రముఁడై నిలుచుండె సవ్యసాచి." భార. ఉద్యో. ౧, ఆ. ౬౫. కాశీ. ౫, ఆ. ౧౯౩. భార. మా. ౧, ఆ. ౬౩౪ 2. కదలకయుండు; లేచియుండు "గీ...శార్ఙ్గి మెదుర నిలుచుండు గద నేయు నెల్లపసులు." ఉ. హరి. ౨, ఆ. ౧౬౫

**నిలుచుకొను.** దే. అ. క్రి. (నిలుచు+కొను - స్వార్థము.) నిలుచు. (శ. ర.)

**నిలుచూఱు.** దే. వి. (నిలువు+చూఱు.) నిలువుదోఁపు, దేహమందుధరించువస్తువు లన్నియు ఇచ్చుట. "ద్వి. నెమ్మదిఁ దనయేలు నేలకుఁ దోడు, సొమ్ము లన్నియు నిలుచూఱుగా నిచ్చి." ద్వి. హరిశ్చ. ఉ. ౪౧౧, ౫౦.

**నిలుపు.** దే. స. క్రి. (నిలుచు ధా. ప్రే.) 1. నిలువఁబెట్టు, కనఁబఱచు. "క...కన్నియఁ దెచ్చి యతం డెదుట నిలిపి దీనికి నెనయై, మెచ్చుకను పెండ్లికొడుకును, నిచ్చలముగఁ దెల్పుము..." నీలా. ౨, ఆ. ౬; 2. స్థాపించు, ప్రతిష్ఠించు. "సీ. నిధులు నిల్లిండ్లును నిలిపెఁ దోఁటలు సత్రములు చలివెందరల్ వెలయఁబెట్టె." హరి. పూ. ౧, ఆ ౧౯. భార ఉద్యో. ౨, ఆ. ౨౦౬; 3. అలంకరించు, పెట్టు. "గీ. కటకములు హస్తసరము లంగదము లంగుళీయకములును బాహువల్లికల ప్రేంఖ, నిలిపి ..." ఆము. ౬, ఆ. ౧౨౮. కాశీ. ౪, ఆ. ౧౩౬; 4. వసింపఁజేయు. "క. అని చెప్పినఁ గలదు కలదు, నినునట్ల వచించి యందు నిలిపితి నని..." కళా. ౨, ఆ. ౧౬౭; 5. ఆఁపు. "సీ. క్రిందుగా రేఁగినం గలఁగ కందఱఁ దీర్చి నిలిపి యమ్మొపలివానికినె మగిడి." ఆము. ౩, ఆ. ౬. వసు. ౬, ఆ. ౧౬; 6. అడ్డగించు, నిరోధించు. "క. కలఁగిన సేనలఁ గాచెద, నిలిపెద నర్జునుని కడఁక..." భార. ద్రో. ౧. ఆ. ౩౩. ఆం. భా. తృ. ౧౭౦; 7. స్థిరముగా ఉంచు. "గీ. అలరు విలుదాల్పు తండ్రిపై వలపు నిలిపి." నీలా. ౭, ఆ. ౨౯. వసు. ౩, ఆ. ౮౩; 8. పుట్టించు, కలిగించు. "మ ..కంసఘస్మరుఁ డత్యుద్ధతిఁ బారిజాతధరణీజాతంబు ..ఉత్పాటించి లీలాగతిన్, గరుడస్కంధముమీఁద నిల్పి నిలిపెం గౌతూహలం బింతికిన్." పారి. ౪, ఆ. ౯౩. కాశీ. ౧, ఆ. ౧౩౦; 9. తగులొనఁజేయు, సక్తమొనరించు. "వ...భీమనందన యానరేంద్ర బృందారకునియందు డెందంబు నిలుపుటయును..." నైష. ౧, ఆ. ౬౯. హరి. పూ. ౨, ఆ. ౮౬; 10. స్వస్థపఱచు. "క. కలఁగినచిత్తము దృఢముగ, నిలిపి విచారించి..." దశ. ౯, ఆ. ౩౬; 11. ఏర్పఱచు. "ఉ. దేవరవంటిపుణ్యునిఁ గృతిప్రభుఁగా నిలుపఁగఁ గల్గుటం, బావనమై ప్రసిద్ధిఁ గను మాకవితావిభవంబు దిక్కులన్." వరాహ. ౧, ఆ. ౧౯. భార. ఆది. ౯, ఆ. ౮౯; 12. పాలించు. "సీ. కట్టించవలేనైతిఁ గమలకాసారంబు నిలుపంగలేనైతిఁ దులసివనము." కాశీ. ౩, ఆ. ౮౧; 13. నిర్మించు. "సీ. ఆద్యంబులైన దేవాలయంబులు వ్రాల నవని నిరాశ మఠాళి నిలుపు." ఆము. ౪, ఆ. ౪౩. వసు. ౩, ఆ. ౩౦; 14. కూరుచుండఁబెట్టు. "మ ..మోదం బందియానందనం, దను దీవించుచుఁ జెంగట న్నిలిపెఁ జింతారత్నపీఠంబునన్." పారి. ౩, ఆ. ౨౯. హర. ౩, ఆ. ౪౦; 15. రక్షించు. "సీ. నిలుపంగవలయును నెఱసు వాటిలకుండ శాస్త్రధర్మస్వవర్ణాశ్రమముల." కాశీ ౭, ఆ. ౧౧౪. కేయూర. ౪, ఆ, ౧౧౭. వి. 1. ఉత్థానము, నిలువఁబడుట. "గీ. ఒకఁడు కుంతానఁ బగవానియుఁరము గ్రుమ్మ,వెంటనే యూతఁ డీఁటెచే వెళ్లఁబొడువ, వెలసె నిద్దఱు నిల్చిన నిలుపు కదన, కాళికైకావడించిన కాను కనఁగ." కువల. ౨, ఆ. ౧౩౬; 2. స్థైర్యము. "గీ. బలము లిది యేమి నలుగడఁ బాఱఁ జొచ్చెఁ, గర్ణగృపముఖ్యు లేటికిఁ గలఁగి రేట, మొగమువడి రెల నీవును మున్నువోలె, నిలువరింపఁగఁ దగియెడునిలుపు లేవ." భార. ద్రో. ౯, ఆ. ౩౭౬; 3. స్థానము, చోటు, "గీ. కుజము కొనకొమ్మ డిగి క్రిందికొమ్మమీఁది, నిలుపు నైకొను పులుఁగులయెలుఁగు లెచ్చె." విక్ర. ౪, ఆ. ౨౭; 4. ప్రాపు, ఆధారము. "క...నీరక్షణ వీని కెల్ల నిలుపై యుండున్." భార. భీష్మ. ౨, అ. ౨౬౬; 5. రక్షణము. "క...తనప్రాణమునిలుపుకన్న ధర్మము కలదే." పాండు. ౪, ఆ. ౧౬౧; 6. నిలుచుట, ఉండుట. "చ...వానఁ బడకాత్మరతిన్ నిలు విచ్చు మోక్షమున్." భార. శాం. ౪, ఆ. ౩౯౪; 7. బ్రతుకు, జీవనము. "క. ఇలఁ జిత్రము తారకుకర,తలసంగతమైనఘోరతరవారి సారస్, నిలు పగుఁ దనుఁ జొర కదరినఁ, దలము యగుక్ విరోధికలి కబ్జభవా." కు. సం. ౪, ఆ. ౧౪.

**నిలుపుకొను.** దే. స క్రి. (నిలుపు+కొను.) 1. ఏర్పఱచుకొను. "వ...ఇట్లన్నియుం దమకు మహావేగం బెసనొక చక్కనిమండపాకంబు రాజాగా

"నిలుపుకొని సుఖం బుండునంత..." కేయూర. ౩, ఆ. ౧౬, కళా. ౬, ఆ. ౧౩౦; 2. స్థిరపఱచుకొను, చిక్కఁబట్టుకొను. "క. తలఁగినధైర్యముఁ గ్రమ్మఱ, నిలుపుకొని దశాననుండు నిర్భయుఁ డగుచున్..." ఉ. రా. ౪, ఆ. ౧౩.

నిలుపుమందు. దే. వి. (నిలుపు+మందు.) వీర్యస్తంభనము చేయుమందు. "వ...మచ్చువీడెంబులును నిలుపుమందులకరాటంబులును..." ప్రబంధ. ౭౮.

నిలుపుసేయు. దే. స. క్రి. (నిలుపు+చేయు.) ఆఁపు "ద్వి. పయనమై యాత్రోవఁ బయనంబు నిలుపు, సేయక నలుని కాపెలిఁ గూర్చి తలఁపుఁద్రోయక." ద్వి. నల. ౧, ఆ. ౫౫౩.

నిలుపోపు. దే. అ. క్రి. (నిలుపు+ఓపు.) తాళు, ఓర్చు. (దీనికి వ్యతిరేక తుమున్నర్థములందుమాత్రమే ప్రయోగములు గన్పట్టుచున్నవి.) "వ ఇట్లు పాంచాలుబాణవృష్టికి నిలుపోపక కురుకుమారులు .." భార. ఆది. ౬, ఆ. ౭౫. సా. ౨, ఆ. ౯౪.

నిలువ. దే. వి. (నిలువు ధా.) 1. నిలిచినవస్తువు శేషము "ఆ. వానివివరమెల్ల వర్గువుగాఁ గూర్చి, తెలియఁ జెల్పు లెక్కలెఱిఁగికొనుచు, వ్యయము పుచ్చి నిలువ వ్రాయించి కైకొంట..." ద్వా. ౧౧, ఆ. ౯౫; 2. బాకీ, ఋణము. "ద్వి. కొలిచినవారికిఁ గోరి జీతములు, నిలువ గాకుండ నిచ్చలు నొసంగుదువె." రం. రా. అయో. ౧౩౮. పు.

నిలువఁబట్టు. దే. స. క్రి. (నిలువన్+పట్టు.) దాఁచు రహస్యముగా నుంచు. "ఉ. దివ్యఖగేంద్ర నమ్మవు మది న్నను నీయెడ నాకు విప్రలం, భవ్యవహారము న్నిలువఁబట్టఁగ నేమిఫలంబు..." నైష. ౨, ఆ. ౭౨.

నిలువఁబడు. ద్వ. అ. క్రి. (నిలువన్+పడు.) 1. ప్రతిష్ఠితుఁడగు. "క. మేలెట్టి దట్టిశోభన, కాలము పరిగడచెనేని కాదని కంశేకాలుఁడు కారుణ్యాసమున్మీలితమతిఁ దనకుఁ దాన నిలువం బడియెన్." భీమ. ౪, ౨౧౨; 2. నిలుచుండు, నిలఁబడు. "గీ. సత్యవతికొడుక్కొడుకు విశాల మహిమ, దెలిసి యప్పర్వతముమీఁద నిలువఁ బడియె." భార. శాం. ౬, ఆ. ౩౩౫; 3. ఆఁగిపోవు, నిలిచిపోవు. "చ. వలపదు శాం దనంగ నిలువంబడ కేపున సూరవర్మ యుబ్బలియంని మీఁదఁ గ్రూరశరపంక్తి నిగిడ్చెన..." భార. అశ్వ. ౪, ఆ. ౮. రామా. ౫, ఆ. ౧౧; 4 సహించు. "క. బహుకాలము సీతోడను, విహరించితి నిలువఁ బడియె విషయసుఖైక, స్పృహ యిప్పుడు గడు ముదిసితి, నివాభోగము లింక నుడుగు టెంతయు నొప్పున్." మార్క. ౫, ఆ. ౯౮.

నిలువనాడు. దే. స. క్రి. (నిలువన్+ఆడు.) ఘోషించు, దృఢముగా పలుకు. "గీ. ఇతఁడు చోరుఁడు గాఁ డని యొంతకైన, నిలువనాడంగ వచ్చు...." విప్ర. ౫, ఆ. ౩౯.

నిలఁవరము. దే. వి. 1. క్రోధము. "చ. నిలువరమంతగాఁ గలిగెనేని నను౦ బిలిపించి నీదుహస్తలుకుమిటారిగుబ్బచనుగుట్టలఁగ్రమ్మి యదల్చి పల్కిచే, నలపడఁ జెక్కుఁగొట్టి యకటా జడకొద్దిని మాట కిప్పుడీ, చెలియల కొప్పగించి యిటు సేయఁగఁ జెల్లునె రాధికామణీ." రాధికా. ౪, ఆ. ౨౧; 2. స్థిరత్వము. "చ... నిలువర మైన లేక నను నిక్కాఱఁగందఁగఁ జేసి నవ్వనో... తెలుపఁగదమ్మ..." పార్వ. ౪, ఆ. ౯. విశ. స్థిరము, యథార్థము. "క. నిలువర మయ్యెను ముకు నాతలఁచినయది .." శశాం. ౩, ఆ. ౫౬.

నిలువరించు. దే. అ. క్రి. తాళు, ఓర్చు. "గీ...వలపరించుచు నాచంద్రభాను డపుడు, నిలువరింపఁగ లేక కన్నియఁ దలంచి." చంద్ర. ౪, ఆ. ౧౮౯. స. క్రి. 1. కవియు, మార్కొను. "ఆ. వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన, మేమిసేయువార మీవు దక్క, నొరులు నిలువరింప నోపెడువారు లేరు..." భార. విరా. ౫, ఆ. ౧౮౧; 2. నిరోధించు. "గీ. ఇంద్రియంబుల నాఱింటి నిట్లు విషయ, ములకు నొలయక యుండఁగ నిలువరించి, తలఁపు లుడిగి..." భార. శాం. ౫, ఆ. ౧౮౧; 3. ఉంచు, పెట్టు. "గీ..., పొదలవలకేలు నిలువరించి, చదివె నాతనిదక్షిణశ్రవణవీథి, నపుడు తచ్చిత్రమానంద మనుభవించె." కవ. ౧, ఆ. ౧౫౮; 4. నిలుపు, వహించు. "సీ. ఉపవాసముల డస్సియున్నయాకొఁదీఁగ నిలువరించెదులావు వెలితిపడఁగ." భా. రా. యు. ౨౩౩౨; 5. ఆఁపు, నిలుచునట్లు చేయు. "వ. కలఁగి పాఱునిజ బలంబుల నిలువరించుచు..." కళా. ౮, ఆ. ౧౨౩.

నిలుపసల్లావలు. దే. వి. బ. నిలిచియున్నసొమ్మును దానిపై పెచ్చును. "వ...ఋణశుద్ధి కావలసిన వాఁడునుంబోలె మననిలుపసలువలు మనకుం బ్రవేశించినట్లయై యుండ..." పరమ. ౪, ఆ. ౧౫౫.

నిలువు. దే. వి. 1. నిలుచుట, ఉత్థానము. "క. నిలిచిన నిలువుననె వారు నేలన్ వ్రాలన్." రామా. ౮, ఆ. ౧౮, హరి. ఉ. ౨, ఆ. ౧౩౯; 2. చేయి పైకెత్తుకొని నిలుచున్నపురుషుని పరిమాణము. వ్యవ.-నూతిలో రెండునిలువులనీ రున్నది; 3. అంతస్తు. "క. మద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువునఁ బ్రణయసఖులతోడ విహారాస్పద మగునెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్." భార. విరా. ౧. ఆ. ౩౦౫; 4. బ్రతుకు, జీవితము. "గీ...ఇంపు సమకొల్పు తనవల్పు నిందువదనఁ, గలసి వర్తింపలేకున్న నిలువు సున్న." ఉద్భ. ౨, ఆ. ౧౭౫; 5. శరీరము, ఆకృతి. "చ. నిలువు దయామయంబు మహనీయము లానడకల్ తలంపఁగా." రామా. పీఠ. ౫౯, సు. శ. ౫౪; 6. పరిమాణము; ఎత్తు. "చ. తలనిలు వర్థ మిచ్చినను తాము కులస్థులు కాని హీనులర్, బిలువమటన్న నేమములు భేషజముల్..." వై జ. ౨, ఆ. ౭౧; 7. చేనిలో కొంత కోసినతరువాత కోయఁగలభాగము. (శ. ర. వా.) బ. ద్వారపుగుజ్జుపుపీటలకు వెనుకటిభాగమున ఊఁతగా నుంచెడుకమ్ములు. (శ. ర.): 8. స్థైర్యము. "చ...హృదయము వ్రాసి తోన నిలువేది కవుంగిటఁ జిక్కఁ జేర్చుచున్." కవిక. ౩, ఆ. ౭౦. విణ. మీఁదికుండునది, ఊర్ధ్వముగా నుండునది. "సీ. కిఱ్ఱుచెప్పులు గొప్పగీఱునామంబులు మొలఁజెక్కుకత్తులు నిలువుసిగలు. గీ. కలిగి ..." నీలా. ౩, ఆ. ౪౯.

నిలువుగాళ్లు. దే. వి. బ. (నిలువు+కాళ్లు) తావకాళ్లకు వెనుక మాను మొదలైనవాని కాధారముగా నాఁటిన స్తంభములు. (శ. ర.)

నిలువుజీతము. ద్వ. వి. (నిలువు+జీతము.) నిలుచుండి సేవచేయుట కిచ్చుజీతము. (శ. ర.)

నిలువుటద్దము. ద్వ. వి. (నిలువు+అద్దము.) నిలువు ప్రమాణము కల అద్దము. "సీ. కెలియయంగఁ గైసేసి నిలువుటద్దము చూచె నవిముక్తమున విశాలాక్షి గౌరి." కాశీ. ౩, ఆ. ౨౩౬, ఉ. రా. ౬, ఆ. ౧౨౭.

నిలువుటీఁత. దే. వి. (నిలువు+ఈఁత.) నిలుచుండి యీఁదెడి యీఁత. "తరళ. సలువుటీఁతల వచ్చు కొమ్మల నెమ్మొగంబులు పొల్పగున్." య. ౩, ఆ. ౬౯.

నిలువులుపడు. ద్వ. అ. క్రి. (నిలువులు+పడు.) 1. నిలువునఁ గూలఁబడు; నిశ్చేష్టమగు. "చ. నిలువులుపడ్డయట్లు తననేత్రము లేమియుఁ గాన లేమి నగ్గలముగ బెగ్గలించు బలభుస్మరునమ్ముల నోడు సేసి నిట్టల మగుడప్పి సోలుటయు..." నిర్వ. ౬, ఆ. ౧౪౪; 2. తెలుచుకొను. "ద్వి. నిలువులుపడి శివునేత్ర త్రయంబు, పొలుపుగా తెప్పలఁ బొందకున్న యది." బస. ౩, పు.

నిలువోపు. దే. అ. క్రి. (నిలువు+ఓపు.) తాళు, ఓర్చు. (శ. ర.)

నిల్కడ = నిలుకడ. (శ. ర.)

నిల్వకొల్వు. దే. వి. (నిల్వు+కొల్వు.) నిలుచుండి చేయుసేవ. "సీ. అలవాటుచేసి కొమ్మఖలమరుత్పాలకులఁ గూడుకొని నిల్వకొల్వనకును..." కువల. ౪, ఆ. ౬౮.

నిల్వకోక. దే. వి. (నిల్వు+కోక.) పొడవైనకోక; పెద్దచీర. "మ...నిల్వకోకలటు లెంతేఁ దాల్చి..." సావి. ౨, ఆ. ౫౦.

నివపనము. సం. వి. అ. న. 1. (నీళ్లలోనగువానిని.) చల్లుట, పోయుట; 2. పితృతర్పణాదికము; 3. విత్తనములు చల్లుట.

నివరి. వై. వి. (సం. నీవారః) సస్యవిశేషము (శ. ర.)

నివర్తకము. సం. విణ. (అ. ర్తికా. అ.) 1. నివర్తిల్లునది; 2. నివర్తించునది.

నివర్తనము. సం. వి. అ. న. 1. మరలుట; 2. ప్రవృత్తి లేమి. (వ్యతి. ప్రవర్తనము); 3. విడుచుట. "చ...భీష్ముఁడు...నిఖిలావనిరాజ్యనివర్తనంబునుం దనరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదితప్రతిజ్ఞుఁడై." భార. ఆది. ౪, ఆ. ౨౪౩; 4. మరల్చుట; 5. తొలఁగించుట. విణ. (అ. ఆ. అ.) 1. మరల్చునది; 2. మరలునది; 3. ఉడుగునది.

నివర్తనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తింపఁ దగినది.

నివర్తమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తిల్లుచున్నది.

నివర్తయమానము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తిల్లఁ జేయుచున్నది.

నివర్తయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నివర్తిల్లఁ జేయునది.

నివర్తయితవ్యము. సం.=నివర్తనీయము.

నివర్తి. సం. విణ. (న్. నీ. న్.) 1. మరల్చువాఁడు; 2. మరలువాఁడు. "వ...భవదీయజ్ఞాతులు సమరంబున ననివర్తులై యూర్ధ్వలోకవర్తులైరి." భార. అశ్వ. ౧, ఆ. ౭. (అనివర్తులు = మరలనివారు.)

నివర్తించు. సం. స. క్రి. 1. మరలించు; 2. పోఁగొట్టు. "వ...బ్రహ్మహత్యాపాతకంబు నివర్తింప విచారించి..." వరాహ. ౨, ఆ. ౫౭; 3. నిర్వర్తించు, చేయు. "సీ. వేదికాసమ్మార్జవిధి నివర్తించును లీలమై రంగవల్లిక లొనర్చు." హర. 3 ఆ. 3౬.

నివర్తింపించు. సం. స. క్రి. (నివర్తించుధా. ప్రే.) మరలింపఁజేయు. "వ...భీష్ముండు తనరథంబు నివర్తింపించి...అతిరౌద్రాకారుండై నిలిచిన." భార. ఆది. ౮, ఆ. ౨౦౫.

నివర్తిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) మరలునది.

నివర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) మరలింపఁబడినది.

నివర్తిల్లు. సం. అ. క్రి. తొలఁగు, పోవు. "వ...అప్పుడు సత్యవతీనందనునకు వాగ్బలాస్తంభంబులు నివర్తిల్లె.." కాశీ. ౭, ఆ. ౧౦౯.

నివర్త్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) మరలింపఁబడుచున్నది.

నివర్త్యము. సం. = నివర్తనీయము.

నివసత్. సం. శత్రు. నివసించుచున్న. "చ..శతశృంగశైలనివసన్మునిసంఘము సంతసిల్లఁగన్..." భార. ఆది. ౫, ఆ. ౧౦౮.

నివసతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఇల్లు, గృహము; 2. నివసించుట.

నివసథము. సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

నివసనము. సం. వి. అ. న. 1. గృహము, ఇల్లు; 2. నివసించుట; 3. వస్త్రము.

నివసించు. సం. అ. క్రి. ఉండు, వాసముచేయు. "క...ఎందు ధరణి చెన్నొందు బహుసస్యదాయిని, యెందుఁ నివసింపఁ దగు సుఖార్థులు పుత్రా." మార్క. 3, ఆ. ౨౫౧.

నివహము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. సప్తవాయువులలో నొకటి.

నివాకువు. సం. విణ. (ఉ) మాటాడకుండునది, మిన్నకుండునది.

నివాతము. సం. వి. అ. పుం. 1. ఆశ్రయము, నివాసము; 2. బాణాదులచే భేదింపరానికవచము. న. 1. గాలి లేనిచోటు; 2. సురక్షితస్థలము, అవ్య. అ. న. గాలిలేమి. విణ. (అ. ఆ. అ.) 1. గాలి లేనిది; 2. సురక్షితము; 3. బాణాదులచే భేదింపరానిది.

నివాదము. సం. అ. అవ్య. న. నిర్వివాదము, సంశయము లేమి. "వ...అమ్మించుఁబోఁడి వివాహంబు నివాదంబై సంభవిల్లుడుఁ దన్నిదానం బిద్ది యని నిదానింప నంతఃకరణం బకరణంబు గానేరదు." కాళిందీ. ౨, ఆ. ౬౨.

నివాన్య. సం. వి. ఆ. స్త్రీ. తనదూడ చచ్చుటచే మఱియొకయావుదూడను కుడిపింపఁగా పాలిచ్చునట్టి యావు.

నివాపకుఁడు. సం. విణ. (అ. పికా. అ.) విత్తనములు చల్లువాఁడు.

నివాపము. సం. వి. అ. పుం. 1. పితరుల నుద్దేశించి నువ్వులు నీళ్లు విడుచుట. (తిలతర్పణాదికము.)

నివారణ. సం. వి. ఆ. స్త్రీ. = నివారణము.

నివారణము. సం. వి. అ. న. 1. అడ్డగించుట; 2. తొలఁగించుట.

నివారణీయము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁదగినది; 2. తొలఁగింపఁదగినది.

నివారము. సం. వి. అ పుం. 1. నివ్వరిధాన్యము; 2. నివారించుట.

నివారించు. సం. స. క్రి. 1. పోఁగొట్టు; 2. అడ్డగించు, నివారణచేయు. "మ. కని తత్తీరవనాంతరంబునఁ గురంగశ్రేణి వెంటన్ గృతాంతునిరీతిం బఱతెంచువిష్టరథు ధానుష్కుం గుణారోపితాస్త్రుని రక్తాక్షుని ఝుంఝురుందలకిరాతున్ ముందరం జూచి చేత నివారించుచు..." వరాహ. ౭, ఆ. ౧౬.

నివారితము. సం. విణ. (అ. ఆ. అ.) నివారింపఁబడినది.

నివాసకుఁడు. సం. విణ. (అ. పికా. అ.) 1. నివసించువాఁడు; 2 నివసింపఁజేయువాఁడు.

నివాసనము. సం. వి. అ. న. నివసింపఁజేయుట.

నివాసము. సం. వి. అ. పుం. 1. వాసము, కాఁపురము; 2. వస్త్రము; 3. గృహము, ఇల్లు. "క. ఆసవమున కని నీమని,వాసమునకు దివములో నవశ్యంబును నే, నాసురలిం బుత్తెంతు..." భార. విరా. ౨, ఆ. ౧౧.

నివాసి. సం. విణ. (న్. నీ. న్.) 1. నివసించువాఁడు; 2. (వస్త్రము) ధరించువాఁడు.

నివాళి. దే. వి. 1. నీరాజనము, ఆరతి. "సీ. నీరాజనాభిధ నెగడు నివాళి యారతి నాఁగ..." ఆం. భా. ద్వి. ౧౬౫. జై. భా. ౨, ఆ. ౯౯; 2. దీపము. "క. కల్యాణపాత్రికల స్వాకల్యముగ నివాళు లునిచి గతితలు గౌరీకల్యాణంబులు వాడిరి..." రసిక. ౬, ఆ. ౨౦౦.

నివాళించు. దే. అ. క్రి. ఆరతిచ్చు. "గీ. పార్వతీదేవి కై నేనె బహువిధములఁ, బలుకుఁదొయ్యలి రత్న దర్పణము చూపె, శచి నివాళించె మణిదీపసంచయముల్లన, శివశయనునిపట్టాభిషేకవేళ." కాశీ.౪, ఆ. ౨౯౫. స. క్రి. 1. నీరాజితముచేయు, నివాళి కలదానినిగాఁ జేయు. "సీ. అమరంగ నింద్రాణి యాఖండలుని నివాళించెడుపసిఁడిపళ్లెర మనఁగ." ద్వి. ౪, ఆ. ౧౦౭. ఉరా. ౪, ఆ. ౧౬౦; 2. దిగఁదుడుచు. "క. వనస్పతి మాధవునిఁ బొడఁ, గనుచు నివాళించ వైచుగమ కవుజాళ్వా, పనిచేయం దగుతఖులు, యనువున నెల్లెడలఁ బండుటాకులు డుల్లెన్." ల. వి. 3, ఆ. ౧౦౬; 3. తృణీకరించు, తిరస్కరించు. "సీ. దీపకాంతులు సుదతీలోచనముల ఘర్షించి నేనియు నివాళించవలదె." సాంబో. ౪, ఆ. ౧౨౨.

నివాళిక. దే. వి. (నివాళి+ఇక-స్వార్థమున.) ఆరతి "ద్వి. వనజలోచనలు నివాళిక లొసఁగ." రం. రా. బాల. ౭౫. పు. (శ. ర. పా.)

నివాళితము. సం. విణ. (అ. ఆ. అ.) చుట్టఁబడినది. (శ. ర.) "వ...ప్రతిగృహాంగణప్రదేశనివాళిత నీరాజనంబులు గైకొనుచు..." బ్రహ్మో. ౪, ఆ. ౧౩౯. పు.

నివాళిపళ్లెము. ద్వి. వి. (నివాళి+పళ్లెము) నీరాజనపాత్రము. "చ...మనోహరంబులై, తనరు నివాళిపళ్లెములు తామరసాతను లొసంగ..." భాను. ౪, ఆ. ౬౧.

నివాళిసేయు. దే. అ. క్రి. (నివాళి+చేయు.) 1. ఆరతిచ్చు. "క. ధవళాంశుమండలమువిధి, నివాళిసేయును లతాంగి నెమ్మొగమునకున్." నైష. ౨, ఆ. ౧౪; 2. వ్యాపించు. "సీ. చెక్కులందు నివాళిసేయులేనగవులు తాటంకరుచి కొల్లకోటు సేయ." విక్ర. ౧, ఆ. ౧౦౧.

నివిడించు. దే. స. క్రి. (నివుడు ధా.) వెలికిఁజాచు. "క. అవయవము లెట్లు కూర్మము, నివిడించును లోని కడఁచు..." భార. శాం. ౫, ఆ. ౧౬౨.

నివిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కూర్చున్నవాఁడు; 2. ప్రవేశించినవాఁడు; 3. పట్టుదల కలవాఁడు; 4. ఏకాగ్రత కలవాఁడు.

నివీతము. సం. వి. అ. న. 1. పేరుగా వేసికొనిన జన్నిదము; 2. జన్నిదమును మెడలో పేరుగా వేసికొనుట. విణ. (అ. ఆ అ.) కప్పుకొనఁబడినది, ప్రావృతము.

నివీతి. సం. విణ. (న్, నీ. న్.) నివీతము గలవాఁడు.

నివుడు. దే. అ. క్రి. 1. చిప్పిలు, స్రవించు. "ఆ. అని గురంతశోకమును బొంది సెజ్జపై, మేను వైచి కన్నుఁగొనలందు, నివుడునశ్రువారి చెవులకొలంకుల, నిండ నిట్టు లను విభుండు మఱియు." నిర్వ. ౯, ఆ. ౯౦; 2. వ్యక్తమగు, స్ఫుటమగు. "మ. అవనీనాథుఁడు బిట్టు మేలుకొని కోపాటోపముల్ చూడ్కులన్, నివుడన్ దారుణవృత్తిఁ గాలయవనున్ వీక్షించినన్..." వి. పు. ౧, ఆ. ౨౧; 3. సాఁగు, దీర్ఘమగు. "క. శివునంగయష్టి నిటియఁగ, నవిగళముగఁ బట్టి ప్రాఁకనని కదు నెమ్మిన్, నివుడునవకల్పలతికల, వవిదిని మృదుబాహులతలు పార్వతి కొప్పున్." కు. సం. 3, ఆ. ౫౬; 4. తగు, ఒప్పు. "క. ప్రవితత మత్త్రింశత్తత్త్వవితానంబులకు సద్మవస్థానంబై, నివుడురజోగుణసంగతి, భవుఁ డనునామంబు నీకుఁ బరఁగు మహేశా." శివ. సా. ౧౧; 5. వైపు ఋకు "చ. కవ వటు డించి యేఁ గనుకఁగా నురెఁ గొంతులఁ దార్చి కూలందున్, నివిడినబొజ్జతో మిగులునిద్దపుదోవలి దట్టి డొల్లి రాఁదివిచి..." ఆము. ౬, ఆ. ౧౧. 6. వ్యాపించు. "క. చిచ్చు ముట్టి ధరణియంతటు, నివిడి మెఱయుచుండు నెవ్వనియుగ్రోరము..." భార. ఆర. ౭, ఆ. ౪౫౩. చంద్రా ౪, ఆ. ౧౧౨. 7. అతిశయించు. "ద్వి.

లీల సారణయుఁ దలిర్ప సంప్రీతి, నివుడంగ..." బస. 3, పు పండితా. దీక్షా. ౭౫. పు.

నివురు. దే. అ. క్రి. అతిశయించు. "ద్వి ఆరాధ్య లాదిగా నలరుజంగములు,దవిలి పండితవిభు దర్శిం చువేడ్క,నివురంగ..." పండితా. దీక్షా. ౫౬, పు. స. క్రి. 1. వాత్సల్యాదులచే చేతితో రాచు. "క. కర మనురక్తిని మోము ని,విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు సంతతి,పురవాసులు చెప్పిన విని..."భాగ...౪, స్కం, ౨౨౫. కాశీ. ౫, ఆ. ౨౨౪; 2. దువ్వు,సవరించు. "శా...సాంద్రా మోదంబునఁ బక్షముల్ నివురుహస్తాంభోజ యుగ్మంబునన్." నైష. ౨, ఆ. ౧౦౫. సా. ౨, ఆ. ౨౨౫; 3. తుడుచు,తొలఁగించు. "ద్వి. నవఘర్మకణముల నఖరాంకురముల,నివురుచు .." ద్వి. హరిశ్చ. పూ. ౯౬౩, పరి.

నివుఱు. దే. వి. బూడిద,భస్మము. "గీ. నివుఱు గవిసిన మెఱయునినిప్పువోలె." భార. విరా. ౪, ఆ. ౭౫. కేయూర. 3, ఆ. ౧౪.

నివృతము. సం. వి. అ. న. ఉత్తరీయము,పైబట్ట. విణ. (అ. ఆ. అ). 1. ఆవరింపఁబడినది; 2. పైని కప్పుకొనఁబడినది. (వస్త్రము)

నివృతి. సం. వి. ఇ. స్త్రీ. ఆవరించుట.

నివృత్తము. సం. వి. అ. న. 1. మరలుట; 2. లేమి, అభావము; 3. మనస్సువిషయములనుండిమరలుట. విణ. (అ. ఆ. అ). 1. మరలినది; 2. తొలఁగినది; 3. విషయములనుండి మరలినది.

నివృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. మరలుట; 2. పోవుట, నశించుట; 3. విషయములయందు ప్రవర్తింపకుండుట,అప్రవృత్తి; 4. ముక్తి. అవ్య. ఇ. న. పనిలేమి.

నివేదకము. సం. విణ. (అ. దిశా. ఆ.) 1. తెలుపునది; 2. ఇచ్చునది; 3. విన్నవించునది.

నివేదనము. సం. వి. అ. న. 1. తెలుపుట; 2. సమర్పించుట; 3. విన్నవించుట.

నివేదనీయము. సం. విణ. (అ. ఆ. అ) నివేదింపఁదగినది.

నివేదయత్. సం. శత్రు. నివేదించుచున్న.

నివేదయమానము. సం. విణ. (అ. ఆ. అ) నివేదించుచున్నది.

నివేదించు. సం. స. క్రి. 1. విన్నవించు. "వ... ధరణుం గాంచి మద్వృత్తాంతంబు నివేదించి రమ్ము పొమ్మనిన..." భా. రా. యు. ౨౫౩౯; 2. సమర్పించు,భక్తితో నిచ్చు. "వ...గోలోక ప్రచారులు నివేదించు కానుక లంగీకరింపుచు..." ఉ. రా. ౮, ఆ. ౨౯౪. భార. ఆది. ౬, ఆ.౨౩౭.

నివేదిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నివేదించువాఁడు.

నివేదితము. సం. విణ. (అ. ఆ. అ). 1. తెలుపఁబడినది; 2. విన్నవింపఁబడినది; 3. సమర్పింపఁబడినది.

నివేదితవ్యము. సం. విణ. (అ ఆ.అ.) నివేదింపఁదగినది.

నివేది. సం. విణ. (న్. నీ. న్) నివేదించువాఁడు.

నివేద్యమానము. సం. విణ. (అ. ఆ. అ) నివేదింపఁబడుచున్నది.

నివేద్యము. సం. అ. న. దేవతలకు సమర్పింపఁదగిన భోజనపదార్థము,నైవేద్యము. విణ. (అ. ఆ అ.) 1. ఎఱిఁగింపఁదగినది; 2. సమర్పింపఁదగినది; 3. విన్నవింపఁదగినది.

నివేశనము. సం. వి. అ. న. 1. ప్రవేశము, చొచ్చుట; 2. చొప్పించుట; 3. ఇల్లు, గృహము; 4. వాసస్థానము, ఉనికిపట్టు; 5. వీడు,నగరము; 6. స్కంధావారము; 7. స్థితి,ఉనికి; 8. ఉండుట; విన్యాసము; 9. కూర్చుండుట; 10. కూర్చుండఁబెట్టుట.

నివేశము. సం. వి. అ. పుం. 1. ఇల్లు, గృహము; 2. ఉంచుట, విన్యాసము; 3. చొచ్చుట; 4. స్కంధావారము; శిబిరము; 5. స్థానము; 6. కూర్చుండుట; 7. విడియుట; 8. పెండ్లి.

నివేష్టనము. సం. వి. అ. న. చుట్టుకొనుట.

నివ్వగిలు. వై. అ. క్రి. (నివ్వటించు ధా.) వెలువడు. "సీ. కేలు సాఁచిన నివ్వగిలుకఠకాంతులు జిగి చన్నుఁగ్రేవలఁ జేరువాఱ." శ్రీరం. మా. ౨, ఆ. ౨౮౨.

నివ్వటించు. వై. స. క్రి. ఒప్పునట్లు చేయు. "సీ. దైత్యారివశ మైనతనచిత్త మంతయు నినుచు గౌరవమున నివ్వటించి." పాండు. ౧, ఆ. ౯.

నివ్వటిలు = నివ్వటిల్లు. 1. (అతిశయించు.) "చ. మోహనగుణశక్తి నివ్వటిలు నవ్వలరాయని నేర్పు పెంపునన్." వసు. 3, ఆ. ౫౧. విప్ర. ౭. ఆ. ౨౯౧; 2. (కలుగు, జనించు.) "క. ఇవ్విధమున నుత్పాతము, నివ్వటిలం దొడఁగుటయును..." ఉ. హరి. ౬, ఆ. ౧౪౮; 3. (వ్యాపించు, ప్రకాశించు.) "క. త్రవ్వినఁ బ్రథ లెల్ల కూపులు నివ్వ

టిలఁగ వెలుఁగుచుండెడి నిధి..." భార. అశ్వ. ౩, ఆ. ౧౫౪; 4. (వర్ధిల్లు). "క. నివ్వటిలు జగము లన్నియు, నెవ్వనిచే నమ్మకుండు నెప్పుడుఁ గొలుతున్." భార. శాం. ౪, ఆ ౨౧౭. కాశీ. ౪, ఆ. ౭౧; 5. (ఒప్పు). "ఉ. ఎవ్వని కెంతబుద్ధి పరమేశుఁడు దాఁ గృపఁ జేసె వట్టిదై, నివ్వటిలున్ గవిత్వరుచి..." కవిరా. ౧, ఆ. ౧౦.

నివ్వటిల్లు=నివ్వటిలు. వై. అ. క్రి. (నివ్వటించు ధా.) 1. నిండారు. "సీ. నివ్వటిల్లె ననంగ నిండారె ననఁ బూరటిల్లె నా సమములై యుల్లసిల్లు." ఆం. భా. తృ. ౩౦౧; 2. సిద్ధించు. "ద్వి. అనఘ నీచేతఁ గార్యము నివ్వటిల్లు." రం రా. యు. (శ. ర.) నైష. ౨, ఆ. ౭౬; 3. ఒప్పు, ప్రకాశించు. "సీ. ఎవ్వనికడకంట నివ్వటిల్లెడు చూడ్కి మానితసంపద లీనుచుండు" భార. విరా. ౨, ఆ. ౯౧. విక్ర. ౪, ఆ. ౭౧; 4. అతిశయించు. "చ. అన వినుచుం గలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల నిట్లను..." భార. విరా. ౫, ఆ. ౨౩౬; 5. వ్యాపించు. "మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటులల్లన నోలిన్ వెడలంగ..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౦; 6. కలుగు, జనించు. "గీ. ఉదయపర్వతకటకగండోపలములఁ బక్షమూలచ్ఛిదావ్రణప్రభవమైన నెత్తురనియెడు విచికిత్స నివ్వటిల్ల, భానుకిరణంబు లాకకొన్ని ప్రాఁకె నభము." కాశీ. ౧, ఆ. ౧౨౨.

నివ్వరిముల్లు. ద్వ. వి. ఔ. (నివ్వరి+ముల్లు) నీవారశూకము, నివ్వరిధాన్యపుగింజచివరిముల్లు. "గీ. తలఁప నివ్వరిముంటిచందమున మిగులఁ, గొంచెమై..." అచ్చ. యు. ౧౬౦. నివ్వరులు. వై. వి. బ. (నీవారః.) తృణధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ దబ్బసల్ నీరుకావులు .. గీ...అది యగుపేరు గల్గువడ్లని యింటు, నుండు..." హంస. ౪, ఆ. ౧౭౪. ప్రబంధ. ౧౧౨.

నివ్వాళి = నివాళి. (ఆరతి.) (శ. ర.)

నివ్వాళిపళ్లెము = నివాళిపళ్లెము. "ద్వి. నివాళి పళ్లెము." భల్లా. ద్వి. ౧, భా. (శ. ర.)

నివ్వెఱ. దే. వి. (నిండు+వెఱ.) 1. మిక్కిలి ఆశ్చర్యము. "సీ...శౌలుపార్థుచుండును నిర్ఝరాశ్చర్యంబు నివ్వె ఱనఁగ." ఆం. భా. ప్ర. ౧౩౨. దశా. ౧, అ. ౨౯౨; 2. మిక్కిలిభయము. "చ చెలువ మెసంగినట్టి యలచిత్ర భవార్పిత సూనపాళికల్, బలుమఱు సారసా లనుచుఁ బాయనినివ్వెఱ యాత్మ మించఁగన్." చంద్రి. ౪, ఆ. ౭౯. దశా. ౪, అ. ౧౦౭; 3. పారవశ్యము సంమోహము. "ఉ. నిక్కమ యట్ల లేమిఁ గడు నివ్వెఱ నవ్వర మేల వేఁడితిన్." విక్ర ౩, ఆ. ౧౦. స్వా. ౫. ఆ. ౬౫; 4. భ్రాంతి. (శ. ర.); 5. (భయాదులవలని నిశ్చేష్టత.) (చూ నివ్వెఱపడు.)

నివ్వెఱఁగు = నివ్వెఱ. దే. వి. (నిండు+వెఱఁగు). 1. మిక్కిలి ఆశ్చర్యము. "మ. అనినన్ నివ్వెఱఁ గంది భూవిభుఁడు నాహా యిట్టి మానంబులం,గని నామో వినినామొ యెందయిన... అటంచు ..."దశా. ౧, అ. ౧౫౫. ఉ. రా. ౩, ఆ. ౬౭; 2. మిక్కిలిభయము. "చ. పులిఁ బొడఁగన్నవేళ్లగమి వోలె సుయోధను సగ్రసైనికుల్, దలఁకి కలంగి నివ్వెఱఁగుఁ దక్కినఁ జేష్టలు దక్కి .." భార. భీష్మ. ౨, ఆ. ౧౫౭; 3. భ్రాంతి. "ద్వి. నిలుకడ దప్పిన నివ్వెఱఁ గందె." విష్ణు. పూ. ౩. (శ. ర.); 4. భయాదులవలని నిశ్చేష్టత. "క. వెఱచఱచి వెగడుపడి నివ్వెఱఁ గందుచుఁ గురుబలంబువీరు లతని దగ్గఱ కంతనంతఁ జూడఁగ,నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్." భార. భీష్మ. ౨, ఆ. ౨౨౩.

నివ్వెఱపడు. ద్వ. అ. క్రి. (నివ్వెఱ+పడు.) 1. మిక్కిలిభయపడు. "వ...కౌరవసైనికులు కలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ." భార. విరా. ౪. ఆ. ౭౫. ("విత్రస్తమనసస్సర్వేధనంజయకృతాద్భయాత్." అనిమూలము.); 2. మిక్కిలి ఆశ్చర్యపడు. "క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వును నాసైన్యసమితి క్రూరోద్ధతియున్, నివ్వటిలనీక ఖచలులు, నివ్వెఱపడ సమరకేళినిపుణత మెఱసెన్." భార. కర్ణ. ౨,ఆ. ౩౦౫; 3. చేష్టలుదక్కు. "గీ. నీవు మమ్ము బోధింపఁగా నేర్తు గాక, యిమ్మహానలస్ఫురణంబు నిట్టి దనఁగ నేము నేర్తుమె యేమియో యెఱుఁగ కునికిఁ, గాదె నివ్వెఱపడితిమి కమలనాభ." భార. అను. ౪, ఆ. ౪౦౩; 4. భ్రాంతిపడు. (శ. ర.)

నివ్వెఱపఱుచు. ద్వ. స. క్రి. (నివ్వెఱపడుధా. ప్రే.) భయపెట్టు. "క. సకియఁ గను మొఱఁగి మధుకర,చికుర నిజారామవాటిఁ జేరి ప్రసూనాం, బకఘోటీశుకఘోటీ, నికరాటీకనము మనము నివ్వెఱపఱుపన్." వసు. 3, ఆ. ౧౧౭.

నివ్వెఱపాటు. ద్వ. వి. (నివ్వెఱపడుధా.) 1. మిక్కిలిభయము. "గీ. ఇట్లు పాండవసైన్యంబు లెల్లఁ గలఁగి, యెక్కడక్కడఁ బఱచుచుండ నక్క జంపు, కడిమి కచ్చెరువడి యొక్కకడకు వచ్చి, పాండుసూనులు నివ్వెఱపాటునొంద." భార.భీష్మ. ౧, ఆ. ౫౭; 2. మిక్కిలి ఆశ్చర్యము. "వ .. పొత్తులలో నున్నయొక్క చక్కనిబాలికనుం జూచి యొక్కింతతడవు నివ్వెఱపాటున నిశ్చలుం డగుచు..." ౫, ఆ. ౫; 3. నిశ్చేష్టత. "సీ. చిత్రరూపంబున చెలువున నేలొకో పతిమూర్తి నివ్వెఱపాటు నొందె." నిర్వ. ౮, ఆ. ౧౧౧; 4. భ్రాంతి. "సీ. తొంట్రిలుభయమునఁ బ్రోవఁ గానఁగలేక నివ్వెఱపాటుతో నిలుచుచెలఁత." దశా. ౪. ఆ. ౫. [3. కల, స్వప్నము.

నిశ. సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు;

నిశమనము. సం. వి. అ. న. 1. వినుట; 2. చూచుట.

నిశాంకుశ. సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిబీఱకి.

నిశాంతము. సం. వి. అ. పుం. ప్రభాతము, వేకువ. న. ఇల్లు. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి శాంతమైనది.

నిశాకరము. సం. వి. అ. పుం. 1. కర్పూరము; 2. కోడి, కుక్కుటము. [వాఁడు, చంద్రుఁడు.

నిశాకరుఁడు. సం. వి. అ. పుం. రాత్రిని కలిగించు

నిశాచరము. సం. వి. అ. పుం. 1. నక్క; 2. గ్రుడ్లగూబ; 3. పాము, 4. చక్రవాకము.

నిశాచరి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాక్షసి; 2. ఱంకుటాలు; 3. ఆఁడునక్క; 4. ఆఁడుగ్రుడ్లగూబ; 5. పైఁడికంటి అనుపక్షి.

నిశాచరుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ; 2. రాక్షసుఁడు. విణ. (అ. ఈ అ.) రాత్రులందు తిరుగువాఁడు.

నిశాటము. సం. వి. అం. పుం. గ్రుడ్లగూబ.

నిశాటి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాక్షసి; 2. ఱంకుటాలు. 3. ఆఁడుగ్రుడ్లగూబ.

నిశాటుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు విణ. (అ. టికా. అ.) రాత్రియందు తిరుగువాఁడు

నిశాతము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వాఁడి చేయఁబడినది. "క. అనుచు నిశాతాశుగములు, దనుజునిపై నేయ..." ఉ. హరి. ౯, ఆ. ౨౮౦.

నిశాత్యయము. సం. వి. అ. పుం. ప్రభాతము, వేకువ.

నిశానము. సం. వి. అ. న. 1. వాఁడిచేయుట; 2. మెఱుఁగుపెట్టుట.

నిశానాథుఁడు. సం. వి. అ. పుం. రాత్రికిదొర - చంద్రుఁడు. ఇన్లే: నిశాధీశుఁడు. మొ.

నిశానిశము. సం. అవ్య. ప్రతిరాత్రము.

నిశాని = నిశానీ. ధ్వజము జెండా. "చ. తొలుకటి దిక్కుదీవుఁ లటఁ దోడసె ఘూర్ధవునాజ్ఞ చేకొనక్, మలయక నిల్చుతద్ధవళిమం బనుతెల్ల నిశానిచేరువక్, వెలిఁగెడు పద్మరాగయుత విశ్రుతకాంచనకుంభమో యనక్, జలరుహబాంధవ్యం బుదయశైలముపైఁ గనుపట్టె నయ్యెడన్." ఉ. హరిశ్చ. ౧, ఆ. ౫౩.

నిశానీ. హిం. వి. 1. గుఱుతు, చిహ్నము. "సీ. జిలుఁగు చీనాపట్టు చెంగావి చెఱఁగుల నిద్దాజరీనిశానీల కరులు." రంగా. ౧, ఆ. ౧౫౬; 2. జెండా, ధ్వజము "క. ఆరాచవారి మమ్ముక్, బారు నకుం దీర్చి యొక్కపసిమినిశానీ, వారలచేతికి నిచ్చిన ఘోరాహవ మోర్చి దానిఁ గొంటిమ యేనిన్." రం. రా. ౬, ఆ. ౨౨౬; 3. వ్రేలి ముద్ర. (వా).

నిశానీదారు. హిం. వి. 1. చేతివ్రేలిముద్ర వేయువాఁడు, వ్రాలుచేయలేనివాఁడు. (వా); 2. రాజచిహ్నములు ధరించి దప్పుడు మొదలగునవి వాయించువాఁడు. "సీ. నెమ్మిఁ గోవెల నిశానీదారుగములు కర్నాటీడమారములాన్ని దు నీయ." అని ౬,ఆ. ౫౯.

నిశామణి. సం. వి. ఇ. పుం 1. చంద్రుఁడు; 2. మిణుంగుఱుపుర్వు. ఖద్యోతము; 3. కర్పూరము.

నిశామనము. సం. వి. అ. న. 1. చూచుట; 2. వినుట; 3. ఆలోచనము.

నిశామము. సం. వి. అ. పు. 1. చూచుట; 2. వినుట.

నిశారణము. సం. వి. అ. న. చంపుట, మారణము.

నిశారము. సం = నీశారము.

నిశితము. సం. వి. అ. న. ఇనుము. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలివాఁడి చేయఁబడినది; 2. మెఱుఁగు పెట్టుట. [మెఱుఁగుపెట్టుట.

నిశితి. సం. వి. ఇ. స్త్రీ. 1. వాఁడిచేయుట; 2.

నిశీథము. సం. వి. అ. పుం. జనులు పరుండువేళ - 1. నడురేయి, అర్ధరాత్రము; 2. రాత్రి, రేయి.

నిశీథిని. సం. వి. ఈ. స్త్రీ. రేయి, రాత్రి.

నిశుంభము. సం. వి. అ. పుం. 1. చంపుట; 2. హింసించుట.

నిశుంభి. సం. విశే. (న్. నీ. న్.) చంపువాఁడు.

నిశ్చయనీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిశ్చయింపఁదగినది.

నిశ్చయము. సం. వి. అ. పుం. 1. నిర్ణయము; 2. సిద్ధాంతము; 3. తప్పక కలుగుట; 4. అలంకారభేదము.

నిశ్చయించు. సం. స. క్రి. నిర్ణయించు, స్థిరపఱచు. "చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁ బొంచె నిట్లు నీ,యఁడుము కులప్రయుక్త మగుచున్న సనాతనధర్మ మిత్తెఱంగ ॥ దహనకర్మ మొల్ల మది గానిదిగా మును నిశ్చయించి మా మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నియ్యెడన్." భార. విరా. ౧, ఆ. ౧౭౫. కాళిందీ. ౬, ఆ. ౨౪౬.

నిశ్చల. సం. వి. ఆ. స్త్రీ. భూమి.

నిశ్చలము. సం. విశే. (అ ఆ. అ.) 1. కదలనిది, స్థిరము; 2. మాఱనిది.

నిశ్చాయకుఁడు. సం. విశే. (అ. యికా. అ.) నిశ్చయించువాఁడు. [వాఁడు.

నిశ్చాయి. సం. విశే. (న్. నీ. న్.) నిశ్చయించు

నిశ్చింతము. సం. అవ్య. అ. న. చింతలేమి నిర్విచారము. "మ...ఏచినపెం పొప్పఁగ బాహ్లికు డరిగె నిశ్చింతంబునం బోరికిన్." భార. భీష్మ. ౧, ఆ. ౫౪, భార. విరా. 3, ఆ. 30. విశే. (అ. ఆ. అ.) చింతలేనిది.

నిశ్చితము సం. వి. వి. ఆ. న. నిశ్చయము. క్రి. విశే. 1. తప్పక. 2. రూఢిగా; విశే. (అ. ఆ. అ.) నిశ్చయింపఁబడినది. [సంకల్పము.

నిశ్చితి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిశ్చయము; 2. దృఢ

నిశ్చిన్వత్. సం. శత్ర. నిశ్చయించుచున్న.

నిశ్చిన్వానము. సం. విశే. (అ. ఆ. అ.) నిశ్చయించుచున్నది.

నిశ్చీయమానము. సం. విశే. (అ ఆ. అ.) నిశ్చయింపఁబడుచున్నది. [వాఁడు.

నిశ్చేత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.) నిశ్చయించు

నిశ్చేతవ్యము. సం. = నిశ్చయనీయము.

నిశ్చేయము. సం. = నిశ్చయనీయము.

నిశ్చేష్టము. సం. విశే. (అ. ఆ. అ) చేష్టలు లేనిది.

నిశ్చేష్టితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చేష్టలు దక్కినవాఁడు.

నిశ్శ్రమము. సం. వి. అ. పుం. అధికపరిశ్రమము

నిశ్శ్రయణి. సం. వి. ఈ. స్త్రీ. నిచ్చెన.

నిశ్శ్రేణి. సం. వి. ఇ, ఈ. 1. నిచ్చెన; 2. ఖర్జూరవృక్షము.

నిశ్శ్రేయసము సం. వి. అ. న. 1. మేలు, మంగళము; 2. మోక్షము. విశే. (అ. ఆ. అ.) శ్రేష్ఠమైనది.

నిశ్వసనము. సం. వి. అ. న. నిట్టూర్చుట.

నిశ్వసించు. సం. అ. క్రి. 1. నిట్టూర్పు విడుచు. "సీ. పద్మిని నిశ్వసింపఁగఁ జూచె వావిలి కమలాక్షి గనఁ దిలకంబు పూచె." పరామా. 3, ఆ. ౭౦; 2. ఊర్పు లోపలికిఁగొను; 3. ఊర్పు వెలుపలికి విడుచు.

నిశ్వసితము. సం. వి. అ. న. నిశ్వాసము. విశే. (అ. ఆ. అ.) నిట్టూర్పుపుచ్చినది, నిశ్వసించినది

నిశ్వాసము. సం. వి. అ. పు. నిట్టూర్పు.

నిశ్వాసించు. సం. అ. క్రి. నిట్టూర్పు విడుచు. ". మ వనితల్ నవ్వఁగఁ గౌఁగిలింపఁ గన నిశ్వాసింపఁ గానం బొనర్ప నరల్పన్."... రామా. ౧. ఆ. ౧౫౦.

నిశ్శంకుఁడు. సం. విశే. (న్. న్. నీ.) 1. భయములేనివాఁడు; 2. సందేహము లేనివాఁడు.

నిశ్శబ్దము. సం. అవ్య. అవ్య. అ. న. సద్దులేమి. విశే. (అ. ఆ. అ.) 1. సద్దులేనిది; 2. మిన్నకుండునది.

నిశ్శమము. సం. అవ్య. అ న. శాంతిలేమి. విశే. (అ. ఆ. అ.) శాంతిలేనిది.

నిశ్శరణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. రక్షకములేనిది; 2. ఇల్లులేనిది.

నిశ్శలాకము. సం. వి. అ. న ఏకాంతస్థలము. విశే. (అ. ఆ. అ.) 1. నిర్జనము, ఏకాంతమైనది; 2. శలాకము లేనిది.

నిశ్శల్యము. సం. విశే. (అ. ఆ. అ.) శల్యము లేనిది.

నిశ్శేషపఱచు. మి. స. క్రి. మిగులకుండఁజేయు. "గీ. చిక్కుబాకీలు పిదప నిశ్శేషపఱచి, ప్రతి

దినము దానిసంసారబాధ తెల్ల, నెత్తుకెత్తుగ నడపె దుర్వృత్తి నతఁడు." నిరం. ౨, ఆ. ౧౧౬.

నిశ్శేషము. సం. క్రి. విణ. అంతయు, సర్వము. విణ. (అ. ఆ. అ.) మిగులు లేనిది.

నిశ్శోధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) శుద్ధిచేయఁ బడినది.

నిశ్శ్రీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాంతిలేని వాఁడు; 2. సంపదలేనివాఁడు.

నిషంగధి. సం. వి. ఇ. పుం. 1. కాఁగిలింత; 2. విలుకాఁడు; 3. సారథి; 4. రథము; 5. తృణము; 6. మూఁపు.

నిషంగము. సం. వి. అ. పుం. 1. అమ్ములపొది; 2. కత్తి; 3. మిక్కిలి సంగము.

నిషంగి. సం. విణ. (న్. ణీ. న్.) 1. విలుకాఁడు; 2. ఖడ్గధారి; 3. అత్యంతసంగము కలవాఁడు.

నిషణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ) 1. కూర్చున్న వాఁడు; 2. ఉన్నవాఁడు.

నిషద్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అంగడి; 2. కూర్చుండుట; 3. చిన్నమంచము; 4. అంగడివీథి.

నిషద్వర. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి.

నిషద్వరము. సం. వి. అ. పుం. బురద, కర్దమము.

నిషధము. సం. వి. అ. పుం. 1. ఒకదేశము; 2. ఒక కొండ. విణ. (అ. ఆ. అ.) కఠినము.

నిషా. హిం. వి. మత్తు.

నిషాదనము. సం. వి. అ. న. కూర్చుండఁబెట్టుట.

నిషాదము. సం. వి. అ. పుం. 1. ఒకదేశము; 2. సప్తస్వరములలోఁ కడపటిది. (సంగీ.)

నిషాది. సం. వి. న్. పుం. మావటివాఁడు. ఈ. స్త్రీ. 1. నిషాదస్త్రీ; 2. చండాలస్త్రీ. విణ. (న్.నీ.న్.) 1. కూర్చుండువాఁడు; 2. ఉండువాఁడు.

నిషాదితము. సం. వి. అ. న. కూర్చుండఁబెట్టుట. విణ. (అ. ఆ. అ.) కూర్చుండఁబెట్టఁబడినది.

నిషాదుఁడు. సం. వి. అ. పుం. 1. బోయవాఁడు; 2. చండాలుఁడు.

నిషిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి తడుపఁబడినది; 2. గర్భాదులం దుంచఁబడినది. (శుక్రము. మొ.); 3. గర్భాధానము చేయఁ బడినది. (స్త్రీ.)

నిషిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁబడినది. "క. నాతోనున్నబాము దలఁపవ, యీయొడ లీచీర యిట్టియేవపుఁజంపం, బోయన్న మదనవిక్రృతిం, జేయు నటుట యెంతయును నిషిద్ధము గాదే." భార. విరా. ౨, ఆ. ౪౯.

నిషిధ్యత్. సం. శత్ర. నిషేధించుచున్న.

నిషిధ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁ బడుచున్నది.

నిషీదత్. సం. శత్ర. కూరుచున్న.

నిషూదనము. సం. వి. అ. న. చంపుట, వధము. విణ. (అ. ఆ. అ.) చంపునది.

నిషేకము. సం. వి. అ. పుం. 1. మిక్కిలితడుపుట; 2. కాఱుట, స్రవించుట, 3. గర్భాధానము; 4. చల్లుట.

నిషేచనము. సం. వి. అ. న.=నిషేకము.

నిషేద్ధ. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిషేధించువాఁడు.

నిషేద్ధవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁ దగినది.

నిషేధకము. సం. విణ. (అ. ధికా. అ.) నిషేధించునది.

నిషేధత్. సం. శత్ర. నిషేధించుచున్న.

నిషేధనీయము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁ దగినది.

నిషేధము. సం. వి. అ. పుం. 1. నివారణము; 2. నిరాకరణము; 3. మరలించుట; 4. ఈపని చేయఁ గూడ దని తెలుపువేదవాక్యాదికము.

నిషేధించు. సం. స. క్రి. కూడ దని చెప్పు, త్రోసిపుచ్చు. "వ... హంసాభిముఖి యైనయాత్రఁ బెద్దలు నిషేధింతురుసుమీ..." శైవ. ౨, ఆ. ౪౬.

నిషేధిత. సం.=నిషేద్ధ.

నిషేధితము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁబడినది.

నిషేధితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁ దగినది.

నిషేధ్యము. సం.=నిషేధితవ్యము.

నిషేవణము. సం. వి. అ. న. 1. కొలువు, సేవ; 2. (వ్రతాదులను) చేయుట; 3. (ఆహారాదికమును) అనుభవించుట.

నిషేవితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొలువఁ బడినది; 2. అనుభవింపఁబడినది; 3. ఆచరింపఁబడినది. (వ్రతాదికము.)

నిషేవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సేవింపఁదగినది.

నిష్కము. సం. వి. అ. పుం. న. 1. మాడ, పదునాఱుమాషములు తూనిక గలబంగారునాణెము;

2. టంకము; 3. దీనారము; 4. బంగారు; 5. పత కము; 6. బంగారుపాత్రము; 7. పలము, నాలుగు కర్షములయెత్తు.

నిష్కర్తనము. సం. వి. అ. న. కత్తిరించుట, ఛేదించుట.

నిష్కర్షణము. సం. వి. అ. న. 1. ఊడఁబెఱుకుట, నిస్సారణము; 2. నిశ్చయించుట.

నిష్కర్షము. సం. వి. అ. పుం. 1. నిస్సారణము; 2. సారాంశము; 3. నిశ్చయము.

నిష్కర్షించు. సం. స. క్రి. నిశ్చయించు. (శ. ర.)

నిష్కళ. సం. వి. ఆ. స్త్రీ. ముట్లుడిగినయాఁడుది.

నిష్కళము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కళలు లేనిది. (చంద్రబింబము. మె.) 2. వీర్యము లేనిది; 3. భాగములు లేనిది, సంపూర్ణము. (బ్రహ్మము.)

నిష్కారణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కారణము లేనిది, నిర్హేతుకము; 2. ఒక కారణమువలన కలుగనిది, సహజము.

నిష్కాసము. సం. వి. అ. పుం. 1. వెడలుట; 2. వెడలఁగొట్టుట; 3. మేడ మొదలగువానిమీఁది బహిః ప్రదేశము.

నిష్కాసి. సం. విశే. (న్. నీ. న్.) 1. వెళ్లువాఁడు; 2. వెళ్లఁగొట్టువాఁడు.

నిష్కాసితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. వెడలఁగొట్టఁబడినది; 2. ఉంచఁబడినది.

నిష్కించనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఏమియు లేనివాఁడు, దరిద్రుఁడు; 2. పొందఁదగినది లేనివాఁడు, ఆప్తకాముఁడు.

నిష్కుటము. సం. వి. అ. పుం. 1. అంతఃపురము; 2. తలుపు, కవాటము; 3. మడి, కేదారము. 4. ఇంటితోఁట, గృహారామము.

నిష్కుటి. సం. వి. ఈ. స్త్రీ. ఏలకి. [వాఁడు.

నిష్కులీనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నీచవంశమువాఁడు.

నిష్కుహము. సం. వి. అ. పుం. తొఱ్ఱ, కోటరము.

నిష్కూటము. సం. విశే. (అ. ఆ. అ.) కపటము లేనిది.

నిష్కృతము. సం. వి. అ. న. 1. ప్రాయశ్చిత్తము; 2. సంకేతస్థలము. విశే. (అ. ఆ. అ.) 1. చేయఁబడినది; 2. ప్రాయశ్చిత్తము చేయఁబడినది; 3. (ఋణాదులనుండి) విముక్తి నొందినది.

నిష్కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. (ఋణాదులనుండి) విముక్తి; 2. ప్రాయశ్చిత్తము. విశే. (ఇ.) కృతి లేనివాఁడు.

నిష్కృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిస్సారితము, వెడలింపఁబడినది; 2. సారముగాఁ దీయఁబడినది; 3. నిశ్చయింపఁబడినది.

నిష్కైవల్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కేవలము; 2. మోక్షహీనము.

నిష్కోషణము. సం. వి. అ. న. 1. (పండ్లు మొ. వాని) తోలు ఒలుచుట; పొట్టుదీయుట; 2. నిస్సారణము, వెలికిఁ దీయుట.

నిష్కోషము. సం. వి. అ. పుం.=నిష్కోషణము.

నిష్క్రమణము. సం. వి. అ. న. 1. వెడలిపోవుట; 2. షోడశసంస్కారములలో నొకటి.

నిష్క్రమణిక. సం. వి. ఆ. స్త్రీ. షోడశసంస్కారములలో నొకటి, నిష్క్రమణము.

నిష్క్రమత్. సం. శత్ర. నిష్క్రమించుచున్న.

నిష్క్రమము. సం. వి. అ. పుం. 1. వెడలిపోవుట; 2. శిశువును నాల్గవమాసమునఁ గాని మూఁడవమాసమునఁ గాని మొదటిసారి యింటినుండి బయటికిఁ దీసికొనివచ్చి సూర్యచంద్రాగ్నులదర్శనము చేయించుట. (ఇది షోడశసంస్కారములలో నొకటి;) 3. కులభ్రంశము; 4. ధీశక్తి (శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహ, అపోహము, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అను ఎనిమిదిగుణములు గలది.)

నిష్క్రమించు. సం. అ. క్రి. వెడలిపోవు.

నిష్క్రయము. సం. వి. అ. పుం. 1. భృతి, వేతనము; 2. వినిమయద్రవ్యము; 3. వినిమయము; 4. మూల్యము, వెల; 5. వెలకుఁ గొనుట, క్రయము; 6. అమ్ముట, విక్రయము; 7. పరాధీన మగుదానిని ప్రతిఫల మిచ్చి విడిపించుట; 8. పరాధీన మగుదానిని విడిపించుట కిచ్చు ప్రతిఫలము; 9. ప్రత్యుపకారము; 10. సామర్థ్యము; 11. బయలువెడలుట, నిర్గమనము; 12. బ్రహ్మానుసంధానము, బుద్ధియోగము.

నిష్క్రాంతము. సం. విశే. (అ. ఆ. అ.) నిష్క్రమించినది.

నిష్క్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. నిష్క్రమించుట.

నిష్క్రామ్యత్. సం. శత్ర. నిష్క్రమించుచున్న.

నిష్టంకము. సం. వి. అ. న. 1. మధుపర్కము. (అతిథులకు తేనె పండ్లు పెరుఁగు మొదలైనవి యొసఁగుట.); 2. ఎదుర్కొనుట.

**నిష్టంకించే.** సం. అ. క్రి. మార్మ్రోయు, తాఁకు. "శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండున్,...సాదృశ్యం బదృశ్యంబుగా, ముష్టి ముష్టి రణంబు చేసిరి..." హర. ౭, ఆ. ౧౭౬. పాంచాలీ. ౨, ఆ. ౬.

**నిష్టానకము.** సం. వి. అ. పుం. మొఱ, ఆర్తధ్వని.

**నిష్టాపము.** సం. వి. అ. పుం. 1. కాల్చుట, వెచ్చ చేయుట; 2. పరితాపము, దుఃఖము. "క...సుజనో, త్కృష్టుఁ డగుగురుని తెగుటకు, నిష్టాపముఁ బొందె భూతనికరము లెల్లన్." భార. ద్రో. ౧, ఆ. ౭౮.

**నిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి, స్థితి; 2. చేటు, నాశము; 3. తుది, సమాప్తి; 4. నెఱవేఱుట; 5. యాచన, వేఁడికోలు; 6. ఆసక్తి; 7. నిలుకడ; 8. ఆధారము; 9. ప్రస్తుతకథాసమాప్తిరూప మగు సంధివిశేషము. (నాట్య.); 10. ధర్మాదులయందలి శ్రద్ధ, నమ్మిక; 11. నిశ్చయము, అవధారణము. "గీ...సంశయిత సంవేదనంబు, మనసుకృత్యంబ యొకార్యమునను నొండ్లు, సారవు నిష్ఠ బుద్ధిన యగుఁ జొరఁగ నేర, వి త్తెఱంగున కపరంబు లెఱిఁగి కొనుము." భార. అశ్వ. ౨, ఆ. ౨౯౯.

**నిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉన్నది. "వ... నివృత్తిధర్మంబునందు నిష్ఠుండును విద్యాసహాయుండునునై..." భార. శాం. ౬, ఆ. ౪౧౩.

**నిష్ఠానము.** సం. వి. అ. న. 1. పాలు పిండి బెల్లము కలిపి వండెడుపదార్థము; 2. తేమనము, తెమ్మనము.

**నిష్ఠించే.** సం. అ. క్రి. శ్రద్ధవహించు. "ద్వి. నెల కొని మముఁ బ్రోవ నిష్ఠించి కావఁ, దలఁచి..." పండితా. పురా. ౧౩౭. పు. స. క్రి. నిర్ణయించు. "క. అని నిష్ఠించి పలుక న,న్వినుతచరిత్రుండు... తపమునన మేలొంచెన్." భార. అశ్వ. ౨, ఆ. ౧౨౨, 3, ఆ. ౯౫.

**నిష్ఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉన్నది; చక్కఁగా నున్నది; 2. శ్రద్ధ గలది; 3. నిలుకడ గలది; 4. నిర్ణయింపఁబడినది.

**నిష్ఠీవనము.** సం. వి. అ. న. ఉమియుట.

**నిష్ఠీవము.** సం. వి. అ. పుం. = నిష్ఠీవనము.

**నిష్ఠీవితము.** సం. వి. అ. న. = నిష్ఠీవనము.

**నిష్ఠురము.** సం. వి. అ. న. 1. పరుషవచనము; 2 అమంగళవచనము. విణ. (అ. ఆ. అ.) 1. కఠిన మైనది; 2. అమంగళకర మైనది.

**నిష్ఠేవనము.** సం. = నిష్ఠీవనము.

**నిష్ఠేవము.** సం. = నిష్ఠీవము.

**నిష్ఠ్యూతము.** సం. వి. అ. న. ఉమియుట. విణ. (అ. ఆ. అ.) ఉమియఁబడినది.

**నిష్ఠ్యూతి.** సం. వి. ఇ. స్త్రీ. ఉమియుట.

**నిష్ణాతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రవీణుఁడు, నేర్పరి; 2. పారంగతుఁడు, పూర్తిగా నేర్చిన వాఁడు.

**నిష్ణుఁడు.** సం. = నిష్ణాతుఁడు.

**నిష్పక్వము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి పక్వ మైనది; 2. కషాయముగా కాఁచఁబడినది, క్వథితము.

**నిష్పత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, ఉత్పత్తి; 2. సిద్ధి, నెఱవేఱుట; 3. పండుట, పరుపము; 4. సంబంధము; సామ్యము. (గణిత.)

**నిష్పద్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) కలుగుచున్నది.

**నిష్పన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగినది, ఉత్పన్నము; 2. సిద్ధించినది, నెఱవేఱినది.

**నిష్పవనము.** సం. వి. అ. న. చేట మొదలగువానిచే చెరుగుట.

**నిష్పాదకము.** సం. విణ. (అ. దికా. అ.) కలిగించునది.

**నిష్పాదన.** సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగించుట, ఉప్పతిలఁజేయుట; 2. నెఱవేర్చుట.

**నిష్పాదనము.** సం. వి. అ. న. = నిష్పాదన.

**నిష్పాదనీయము.** సం. విణ. (అ. ఆ. అ) నెఱవేర్పఁదగినది.

**నిష్పాదయమానము.** సం. విణ. (అ. ఆ. అ.) నిష్పాదించుచున్నది.

**నిష్పాదయిత.** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) నిష్పాదించువాఁడు.

**నిష్పాదయితవ్యము.** సం. = నిష్పాదనీయము.

**నిష్పాదించే.** సం. స. క్రి. 1. కలిగించు. 2. నెఱవేర్చు.

**నిష్పాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁబడినది; 2. నెఱవేర్పఁబడినది.

**నిష్పాద్యమానము.** సం. = నిష్పాదయమానము.

**నిష్పాద్యము.** సం. = నిష్పాదనీయము.

**నిష్పావము.** సం. వి. అ. పుం. 1. (ధాన్యాదులను) ఎగురఁబోయుట, తూర్పెత్తుట; 2. చెరుగుట; 3. చేట మొదలగువానిగాలి; 4. పెసలు లోనగు

వాస్తిపొట్టు; 5. అనుములులోనగునవి; 6. పెద్దబొబ్బర్లులోనగునవి; 7. పొల్లు. విశే. (అ. ఆ. అ.) నిశ్చితము.

నిష్పావలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చెరుగఁబడినది; 2. తూర్పెత్తఁబడినది.

నిష్పిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి నలుఁగఁగొట్టఁబడినది; 2. చక్కఁగా నూఱఁబడినది.

నిష్పీడనము. సం. వి. అ న. 1. పిసుకుట; 2. పిండుట; 3. పీడించుట; 4. మర్దించుట.

నిష్పేషణము. సం. వి. అ. న. 1. చక్కఁగా నూఱుట; 2. చూర్ణముచేయుట; 3. నిష్పీడనము.

నిష్పేషము. సం. వి. అ. పుం. = నిష్పేషణము.

నిష్ప్రయోజనము. సం. వి. అవ్య. అ. న. ప్రయోజనములేమి. విశే. (అ. ఆ. అ.) ప్రయోజనము లేనిది.

నిష్ప్రవాణము. సం. వి. అ. న. చలువచేయని క్రొత్తబట్ట.

నిష్ప్రవాణి. సం. విశే. (ఉ.) చలువచేయనిది, క్రొత్తది. (వస్త్రము.)

నిష్ఫల. సం. వి. ఆ. స్త్రీ. ముట్టుడిగినయాఁడుది.

నిష్ఫలము. సం. విశే. (అ. ఆ. అ.) ఫలములేనిది.

నిష్యందము. సం. వి. అ. పుం. 1. స్రవించుట, కాఱుట; 2. ప్రవాహము; 3. వృక్షాదులపట్ట నుండి కాఱుద్రవము, రసము. విశే. (అ. ఆ. అ.) స్రవించునది.

నిష్యంది. సం. విశే. (న్. నీ. న్.) 1. స్రవించునది; 2. రసము కలది; 3 ఒలికించునది.

నిష్పందము. సం. విశే. (న్. నీ. న్.) కొంచెమైనను కదలికలేనిది.

నిసర్గము. సం. వి. అ. పుం. 1. స్వభావము; 2. స్వరూపము; 3. సృజించుట, సృష్టి; 4. విడుచుట; 5. ఈవి, ఇచ్చుట.

నిసి. వై. వి. (సం. నిశా.) 1. అర్ధరాత్రము. (శ.ర.); 2. రాత్రి. "క. అని తలఁచి మెచ్చి...ఒకముద్దు పార్థునిచే నిప్పించి నగరు సొచ్చి నిసి చనన్." ఆము. ౨, ఆ. ౮౩. విక్ర. ౨, ఆ. ౧౦౫.

నిసివెలుఁగు. ద్వ. వి. (నిసి+వెలుఁగు.) చంద్రుఁడు. (శ. ర.)

నిసుఁగు. వై. వి. (సం. శిశుః. త. సిసువు.) 1. శిశువు, బిడ్డ. "వ...గాధిపుత్రు నిమీఁదిమైత్రియుఁ దల్లి తొంటఁగనినిసుంగుమీఁదికారుణ్యంబును బెనఁగొన." పా. శకుం. ౨, ఆ. ౧౪౯. అచ్చ. యు. ౧౪౨; 2. పక్షి మొదలగువానిపిల్ల. "గీ. నిసు వనంగను బిల్ల నా నిసుఁ గనంగఁ, గూన యనఁగను గందు నాఁ గొదమ యనఁగఁ, శిర్యగర్భకములుగాను దెలియ వలయు." ఆం. భా. ద్వి. ౯౯.

నిసువు = నిసుఁగు. 1. శిశువు, బిడ్డ. "సీ. నిసువుపై పసుపునూనియజిడ్డు లంటినచిటికమ్మికుఱుమాపుచీర తోడ." శుక. ౪, ఆ. ౩౮. హర. ౨, ఆ. ౯౯; 2. అంకురము. "సీ. మొక్క మోక నిసువు మొలక మో సనఁగ నంకురమునకుఁ బేళ్లు..." ఆం. సం. స్థా. ౭; 3. పక్షి మొ. వానిపిల్ల. ఆం. భా. ద్వి. ౯౯.

నిసృష్టము. సం విశే. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. ఈయఁబడినది; సృజింపఁబడినది; 4. ఉంచఁబడినది; 5. దాఁచఁబడినది; 6. మధ్యస్థము ఒకపక్షమున అభిమానము లేక సమానముగా నుండునది. [సహింపఁబడినది.

నిసోఢము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి

నిస్తబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిలిచినది, ఆఁగినది; 2. నిశ్చేష్టము.

నిస్తరణము. సం. వి. అ. న. 1. వెలువడుట, నిర్గమము; 2. తరణము, దాఁటుట; 3. పూర్ణముగా తెలిసికొనుట; 4. ఉపాయము.

నిస్తరించు. సం. స. క్రి. 1. దాఁటు; తొలఁగించుకొను. "వ. ధృత్యాలంబనంబునం గడా యయాతి యాపద నిస్తరించె." భార. శాం. ౬, ఆ. ౭౭. భార. విరా. ౨, ఆ. ౨౩౪; 2. దాఁటించు, తరింపఁజేయు. ద్వా. ౪, ఆ. ౨౫౫. దశ. ౧౨, ఆ. ౩.

నిస్తర్హణము. సం. వి. అ. న. చంపుట, మారణము.

నిస్తలము. సం. వి. అవ్య. అ. న. తలాభావము. విశే. (అ. ఆ. అ) 1. తలములేనిది. అడుగులేనిది; 2. వర్తులము, గుండ్రనిది; 3 నిలుకడలేనిది, చంచలము.

నిస్తారకము. సం, విశే. (అ. రికా. అ.) దాఁటించునది.

నిస్తారణము. సం. వి. అ. న. 1. దాఁటించుట; 2. కష్టాదులనుండి ఉద్ధరించుట.

నిస్తారము. సం. వి. అ. పుం. 1. దాఁటుట; 2. కష్టాదులనుండి తప్పించుకొనుట; 3. ఉపాయము; 4. మోక్షము; 5. ఋణాదులను పూర్తిగా చెల్లించుట.

నిస్తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దాటఁబడినది; 2. కష్టాదులనుండి తప్పింపఁబడినది; 3. నెఱవేర్పఁబడనిది. "క. మతి మఱచి యనిస్తీర్ణ, ప్రతిజ్ఞుఁడగువానికోపఘటుదహన మని.ర్గతమయి వడి నర ణిసము, క్షితితదహనమపోలె నాత్మదేహము నేర్పున్." భార. ఆది. ౨, ఆ. ౧౪౩.

నిస్తుషము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొట్టుతీసినది; 2. నిర్మలము; 3. లఘువైనది, తేలికయైనది.

నిస్తుషితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. పొట్టులేనిదిగాఁజేయఁబడినది; 3. లఘూకృతము, చులుకనిదిగాఁ జేయఁబడినది.

నిస్తేజము. సం. వి. అవ్య. స. న. 1. తేజోభావము; 2. పౌరుషములేమి. "మ...నృపప్రకృతి నిస్తేజంబు సైరించునే." దశ. ౨, ఆ. ౩౧. విణ. (అ. ఆ. అ.) ప్రతాపములేనిది.

నిస్త్రాణము. సం. విణ. (అ. ఆ. అ.) సత్త్వములేనిది. "మ...దుర్జనవృత్తిం జనువారలై మునులు నిస్త్రాణంపుగోవుల్ సృజించి నియోగించిరి గౌతమోత్త కలమక్షేత్రంబు భక్షింపఁగన్." వరాహ. ౧౦, ఆ. ౩౭. హంస. ౧, ఆ. ౧౯౬.

నిస్త్రింశము. సం. వి. అ. పుం. ఖడ్గము. విణ. (అ. ఆ. అ.) 1. కనికరము లేనిది; 2. ముప్పదికి మించినది.

నిస్పందము. సం. వి. అవ్య. అ. న. కదలిక లేమి. వి. అ. పుం. మిక్కిలికదలుట. విణ. (అ. ఆ. అ.) కొంచెమైనను కదలనిది.

నిస్పృహము. సం. విణ. (అ. ఆ. అ.) ఆశ లేనిది.

నిస్యందము. సం. వి. అ. పుం. కాఱుట, స్రవించుట.

నిస్రవము. సం. = నిస్రావము.

నిస్రావము. సం. వి. అ. పుం. 1. గంజి; 2. స్రవించుట, 3. ప్రవాహము.

నిస్వనము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత. విణ. (అ. ఆ. అ.) ధ్వని లేనిది.

నిస్వానము. సం. = నిస్వనము. (ధ్వని.) "సీ. చతురుదాత్తకవిత్వసాధునిస్వానంబు వీనుల కొక్కెడ వింత యొసఁగ." కాళిందీ. ౫, ఆ. ౭౪.

నిస్సంతు. వై. విణ. (సం. నిస్సంతతిః.) సంతానము లేనిది. (వ్యవ.) అతనిసంతు నిస్సంతై పోయినది. (శ. ర.)

నిస్సంశయము. సం. వి. అవ్య. అ. న. సంశయము లేమి. విణ. (అ. ఆ. అ.) సందేహములేనిది.

నిస్సత్తువ. వై. వి. (సం. నిస్సత్త్వం.) శక్తిలేమి, అశక్తి. (శ. ర బ్రౌ)

నిస్సత్త్వము. సం. అవ్య. అ. న. 1. అశక్తి; 2. అభావము. విణ. (అ. ఆ. అ.) 1. బలము లేనిది; 2. యోగ్యత లేనిది; 3. జంతువులు లేనిది; 4. పారమార్థికసత్యత లేనిది.

నిస్సరణము. సం. వి. అ. న. 1. వెడలుట, నిర్గమము; 2. మరణము; 3. ముక్తి; 4. ఉపాయము; 5. ఇల్లు లోనగువానిముందఱిభాగము.

నిస్సరత్. సం. శత్రు. వెలువడుచున్న. "ఉ. తావక కంఠనిస్సరదుదంచితభారతి సద్గుణత్వసం, భావితమైనదోషముల భాసిలు..." కాళిందీ. ౬, ఆ. ౧౬౮.

నిస్సరించు. సం. అ. క్రి. వెలువడు. "గీ. రసికు లొననఁ ద్రిపకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నాదనంబుఁ, గొంచు నీకంఠమున నిస్సరించు నంచు, వినికి నాకగు నది కోర్కికనువుసామ్ము." కాళిందీ. ౬, ఆ. ౧౭౧.

నిస్సహాణము. సం. వి. అ. పుం. చర్మవాద్యవిశేషము. "ఉ...పట్టణంబులన్, భేరులు తమ్మటంబులును నిస్సహాణంబులు శంఖకాహళుల్, బోరుకలంగ మ్రోయ నృపపుంగవునాజ్ఞ వినంగఁ జెప్పుచున్." రుక్మా. ౧, ఆ. ౧౧౫, భా. రా. సుం. ౪౬౧.

నిస్సాణము. సం. వి. అ. పుం. చర్మవాద్యవిశేషము. "ఉ. బాణుని గారవించి పురభంజను ఫీడ్కొని శంఖనాదని, స్సాణధణంధణల్ చెలఁగ..." అని. ౫, ఆ. ౪౮, పారి. ౪, ఆ. ౯౧.

నిస్సానము. వై. వి. (సం. నిస్సాణః.) చర్మవాద్యవిశేషము. "మ. చనియెన్ రాజును భేరులున్ గడిఁదిది నిస్సానంబులున్ లోనుగాఁ, గను బెక్కుల్ బలువాయిదంబులు చెలంగన్..." య. ౪, ఆ. ౧౫౧.

నిస్సారణము. సం. వి. అ. న. 1. వెడలఁగొట్టుట; 2. ఇల్లు లోనగువానిముందఱిభాగము.

నిస్సారము. సం. వి. అ. పుం. నిర్గమము, బయటికి పోవుట. విణ. (అ. ఆ. అ.) సారము లేనిది.

నిస్సారితము. సం. విణ. (అ. ఆ. అ.) వెడలఁగొట్టఁబడినది.

నిస్స్రవము. సం.=నిస్స్రావము.

నిస్స్రావము. సం. వి. అ. పుం. 1. గంజి; 2. వ్యయము.

నిహంతృ. సం. విశే. (బహు. త్రి. బహు.) చంపువాఁడు.

నిహతము. సం. వి. అ. న. గుణకారము. (గణిత.) పుం. అనుదాత్తస్వరము. విశే. (అ. ఆ. అ.) 1. గుణింపఁబడినది; 2. చంపఁబడినది; 3. కొట్టఁబడినది.

నిహతి. సం. వి. ఇ. స్త్రీ. 1. చావు, మరణము; 2. దెబ్బ.

నిహననము. సం. వి. అ. న. 1. చంపుట; 2. దెబ్బ కొట్టుట. [యుండుము.

నిహాక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉడుము; 2. నీటి

నిహారము. సం. వి. అ. పుం. మంచు.

నిహింసనము. సం. వి. అ. న. చంపుట.

నిహితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. దాఁచఁబడినది.

నిహ్నవము. సం. వి. అ. న. 1. నెపము, మిష; 2. (సత్యాదులను) మఱుఁగుపఱచి చెప్పుట.

నిహ్నవము. సం. వి. అ. పుం. 1. (సత్యాదులను) మఱుఁగుపఱచి చెప్పుట; 2. రహస్యము; 3. కపటము; 4. అవిశ్వాసము; 5. నెపము; 6. తిరస్కారము.

నిహ్నవించు. సం. స. క్రి. మఱుఁగుపఱుచు. "సీ... సమరనిశ్శంకకాంకశంఖ నినాదంబు నేమిస్వనంబుల నిహ్నవింప" భాగ. ౬, స్కం. ౩౬౯. నైష. ౧, ఆ. ౧౪.

నిహ్నుతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మఱుఁగు పఱుపఁబడినది; 2. నిరాకరింపఁబడినది.

నిహ్నుతి. సం. వి. ఇ. స్త్రీ.=నిహ్నవము.

## నీ

నీ. దే. స. (క. త. నీ.) యుష్మదర్థకము. (దీనికి ప్రథమాదివిభక్త్యేకవచనములయందు నీవు, నువు, నిన్ను, నిను, నీకు, నీచేత, నీకు, నీకు మొదలగు రూపములును బహువచనముల మీరు, ఈరు, మీరలు, ఈరలు, మిమ్ము, మీచేత, మీకు, ఈకు మొదలగురూపములును వచ్చును.) "గీ...నీవు మాచుట్టమవపోలె నెమ్మితోడ." భార. ఆది. ౫, ఆ. ౧౪౪. "సీ....కనుఁగొంద నేను మి మ్మిరుపుర..." నైష. ౫, ఆ. ౧౬, ఆము. ౩, ఆ. ౫౧.

నీఁగు. దే. స. క్రి. 1. పోఁగొట్టుకొను. "ఉ. ఇక్కథ భక్తితో వినిన నెప్పుడుఁ గీర్తనసేసినన్ జనుల్, నిక్కము సర్వదోషముల నీఁగి భజింతురు భవ్యభద్రముల్." భార. అర. ౫, ఆ. ౫౦౯. భార. ఉద్యో. ౪, ఆ. ౫౧౧; 2. (ఋణము) తీర్చు. "మ. తత్పాదమున నీ శ్రీ లొందె రఘుస్వాఁడెఁబెం, పెనయన్ నామది నామహాత్ముని ఋణం బే నేమిట న్నీఁగెదన్." భా. రా., కిష్కిం. ౪౯౩, వి క్ర. ౩, ఆ. ౧౨౯.

నీఁడు. దే. వి. కమ్మవారిబిరుదుపేరు. (శ. ర. బ్రౌ.) (వ్యవ.) అంకినీఁడు, అచ్చినీఁడు. బావినీఁడు. మొ.

నీకారము. సం. వి. అ. పుం. తిరస్కారము.

నీకాశము. సం.=నికాశము.

నీగ. దే. వి. బాలక్రీడావిశేషము. (బ్రౌ.) "సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్లు మోపిళ్లు నీగ పోగిప బంతి దుంగిలాట." హంస. ౩, ఆ. ౧౪౬.

నీచక. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తమమైనయావు.

నీచము. సం. వి. అ. పుం. చోరమనుగంధద్రవ్యము. న. సూర్యాదిగ్రహముల నీచస్థితి. విశే. (అ.ఆ.అ.) 1. అధమము; 2. పొట్టిది; 3. పల్లమైనది, నిమ్నము; 4. హీనము, బిగ్గఱగానిది.

నీచిక. సం.=నీచక.

నీచికి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమమైనయావు.

నీచీభావము. సం. వి. అ. పుం. నీచత్వము. "మ... చెడుగుగంంపును గల్గి హేయమగు నీచీభావముం దాల్చి . చండాలవేషంబుతోన్..." మార్క. ౧, ఆ. ౨౪౪.

నీచు. ఉభ. వై. వి. (సం. నీచః.) 1. ధూర్తుఁడు. "సీ. చెడుగు గావరి నీచు చెరికి కేడ ములుచ బేరజ మన ధూర్తుపేరు వెలయు." ఆం. భా. తృ. ౭; 2. మత్స్యవిశేషము. "ఉ... పెక్, జెల్లయు పక్కిపారయును నీచును మచ్చగి బొమ్మడాయముల్...పరకాదిగఁ జేపలఁ బట్టి బెట్టుగన్." ప్రబంధ. ౧౫౫; 3. మత్స్యాదిమాంసాదికము. (వా) సం. విశే. (అ. ఆ. అ.) మూర్ఖుఁడు. "క. అనునప్పలుకుల కయ్యం, గన కోపము గదిరి నీచు గావున జంకించినఁ గాని మెత్తఁబడి పోఁ డని..." భార. విరా. ౫, ఆ. ౫౪, ప్రబోధ. ౩, ఆ. ౩౧.

నీచుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు, పామరుఁడు; 2. అధముఁడు. "క. నన్నడుగనేల నీవును, నన్నీచుఁడు నేమి మాటలాడితి రది నా, కున్నట్టు తెలుఁగఁ జెప్పుము..." భార. విరా. ౫, ఆ. ౨౬౩.

నీటఁగలియు. దే. అ. క్రి. (నీటన్+కలియు.) నశించు, పోవు. "సీ. తనపార్శ్వభాగసంఘర్షణంబున ద్విపకోటులు నుగ్గులై నీటఁగలియ." దశా. ౧, ఆ. ౧౬౩.

నీటరి. దే. విశే. (నీటు+అరి.) నీటుకలవాఁడు; విలాసి. "చ... తామరకంటి నెఱిఁ దొవరంగు పొంగి డెడు నీటరి సాటి యటంచుఁ బల్కఁగా..." కాళిందీ. ౨, ఆ. ౯.

నీటారు. దే. అ. క్రి. (నీటు+ఆరు.) ప్రకాశించు, ఒప్పు. "గీ. భానుదీప్తుల నీటారి ప్రసన్నమైన, పృథులమందాకినీ పద్మబిజమాల." హర. ౩, ఆ. ౭౦.

నీటికానుపు ద్వ. వి. (నీరు+కానుపు.) అగ్ని. "గీ. బారకై నీటికానుపుపాపయప్పు, పుడుకుఁగల్గల జెట్టికై పొడమినట్టి, మెట్టవాలేపిట్టరామేని దిట్ట వేల్పు." అచ్చ. బాల. ౦.

నీటికుప్ప. ద్వ. వి. (నీరు+కుప్ప.) జలరాశి, సముద్రము. "సీ. తనకుందనపుఁజాయ, పెను నీటికుప్ప కప్పెనసినపసఁ బసరెక్కనఁగ." వసు. ౫, ఆ. ౩౬.

నీటిచూలి ద్వ. వి. (నీరు+చూలు+ఇ.) అగ్ని. "ఉ... ప్రదక్షిణమ్ము చొక్కమ్ముగఁ జేసెఁ బద్మహితుగాదిలికూఁతురు నీటిచూలికిన్." కాళిందీ. ౫, ఆ. ౧౩౨. కాళిందీ. ౪, ఆ. ౭౨.

నీటితాత. వై. వి. (నీరు+తాత.) వాయువు. (వాయువునుండి అగ్ని అగ్నినుండి జలము పుట్టినట్లు తైత్తిరీయోపనిషత్తునఁ గలదు.)

నీటిదయ్యము. వై. వి. (నీరు+దయ్యము.) నీటి నాశ్రయించి యుండుభూతము, నెగడు. "గీ. నీటిదయ్యంబు నెగడు నా నివ్వటిల్లు." ఆం. భా. ప్ర. ౬౪.

నీటిదారి. వై. వి. (నీరు+దారి.) జలధరము, మేఘము. "సీ. అల దచ్చి నెసలకొండలను నిల్కడగల్గె నింగి నంటకయున్న నీటిదారి,కి..." ప్రబంధ. ౧౪౬.

నీటిదాలుపు. ద్వ. వి. జలధరము, మేఘము. "క... సిరిరాచవేల్ప కడుసీ, పరితనమున నీటిదాల్ప వలమురిసుడివాల్గొరవంటి యొప్పు గలదే, వర..." య. ౫, ఆ ౧.

నీటినిసువు. వై. వి (నీరు+నిసువు.) నీరునిసువుగా కలవాఁడు?; అగ్ని. "సీ. నీటినిసువు గాడ్పు నెచ్చెలి దుగమోము .." వేంక. దేవ. ౧౬, ఇట్టే: నీటిబిడ్డడు. మొ.

నీటిపుట్టుగు. ద్వ. వి (నీరు+పుట్టుగు.) తామరపువ్వు, అబ్జము. (చూ. నీటిపుట్టుగుపట్టి.)

నీటిపుట్టుగుపట్టి. ద్వ. వి. (నీరు+పుట్టుగు+పట్టి.) పద్మజుఁడు, బ్రహ్మ. "మత్తకోకిల. నీటిపుట్టుగుపట్టి యెన్నఁడు నెమ్మిఁ గానఁగ లేనియ, మ్మేటివేలుపు రాయఁ డామరుమేపుకంటికి మామగా, నేటి నీటుతటంబుచేసెరో యావడంకును లంచు .." య. ౨, ఆ. ౪౧.

నీటిమానికము వై. వి. (నీరు+మానికము.) కౌస్తుభమణి. "సీ. అనుబింబమునఁ బద్మకన్యకన్యాయముక్తిఁ బ్రకటించు నీటిమానికము మించు." దశా. ౪, ఆ. ౧౭౦. [ని. దేవ. ౨౧.

నీటిమోపరి.=నీరుమోపరి. ద్వ. వి. (మేఘము.) సాం.

నీటియిక్క. ద్వ. వి. (నీరు+ఇక్క.) కౌస్తుభమణి. "సీ... తొలంకడకడలిలోఁ దులకించుసిరి గేస్తు నక్కనఁ దగునీటియిక్క యనఁగ." య. ౨, ఆ. ౧౦౫.

నీటియేకిమీఁడు. ద్వ. వి. (నీరు+ఏకిమీఁడు.) 1. సముద్రుఁడు. "గీ. నీటియేకిమీని మొలనూలు బోటిమిన్న, యొంటిపంటను గలకితియొకటి దక్క, కలను నెమకిన మెకముఁలపొలుపు గానము..." ప్రబంధ. ౧౬౩; 2. అప్పతి, వరుణుఁడు.

నీటియొడయఁడు = నీటియేకిమీఁడు. (నీరు+ఒడయఁడు.) వరుణుఁడు. "సీ. పడమటిదొర నీటియొడయఁడు జడసామి." సాం. ని. దేవ. ౧౩.

నీటిరాయఁడు. వై. వి (నీరు+రాయఁడు.) వరుణుఁడు. "సీ. మాటమాటై యల్గి మఱుఁగుమై దాఁగిన నీటిరాయనికూర్మి నెలఁత యనఁగ." య. ౩, ఆ. ౪౧.

నీటిరిక్క. వై. వి. (నీరు+రిక్క.) పూర్వాషాఢా నక్షత్రము. (శ. ర.)

నీటిఱేఁడు. వై. వి. (నీరు+ఱేఁడు.) 1. సముద్రుఁడు; 2. వరుణుఁడు. "సీ. కొలముపాఁగెమున నప్పొలసుదిండిని నల్పి తెగి నీటిఱేనిపెంపిగురఁ జేసి." య. ౨, ఆ. ౧౦౭.

నీటిఱేనిరిక్క. వై. వి. (నీటిఱేఁడు+రిక్క.) శతభిషక్నక్షత్రము.

నీటు. దే. వి. (క. నీటు. త. నీటమ్.) 1. మురిపము, శృంగారగర్వము; 2. విలాసము. "సీ. సాక్షాత్కరించినజలదేవత యనంగ నీరాటరేవున నీటు చూపు." శుక. ౨, ఆ. ౪౧౦. ఆం. భా. ప్ర. ౧౩౯; 3. అందము. "సీ. కురులు నున్నఁగ దువ్వి కొప్పువెట్టినసీటు గనుఁగొన్న మోహాంధకార మొదవు." ఉ. రా. ౪, ఆ. ౧౯౭; 4. లావణ్యము, నైగనిక్యము. "ఉ...సీ, జవ్వన మున్ విలాసమును జక్కఁదనంబును నీటుఁ జూచి నన్, బువ్విలుకాని కైన భ్రమపుట్టుఁగదే భువనైకమోహినీ." ఉ. రా. ౪, ఆ. ౧౯౬; 5. నగ. "ఉ. సానులకూటముల్ కలుగుజాణలు నీటులు వెట్టకుందురే" దశా. ౨, ఆ. ౧౫౫; 6. రీతి, విధము. "వ...అంబుదంబు చందంబునఁ దిము రుచు మున్నీటినీటునఁ గసరుచు మత్తేభంబువడువునఁ బుష్కరవాలంబు విసరుచు..." చంద్రా. ౬, ఆ. ౯౩. కువల. ౪, ఆ. ౯౨. విణ. చక్కనిది. "సీ. కస్తూరికాచర్చ సిస్తుగా దని నీటుగాఁ దావికుంకుమగంద మలఁది." ఉ. రా. ౪, ఆ. ౧౭౬. నీలా. ౧, ఆ. ౪.

నీటుకత్తియ. ద్వ. వి. (నీటు+కత్తియ.) ఆఁడుది; విలాసము గలయాఁడుది. "క. అలుగువగ చూపు కేశం, దలతలమను నింత సోఁకిన న్మగవానిం, గళ ద్బ్రాఁకఁ బెనఁగునొకమొక్కలపుదొరకరాని నీటుకత్తియ యగుటన్." కువల. ౨, ఆ. ౧౩౯.

నీటుకత్తె = నీటుకత్తియ. వి. (విలాసముకల ఆఁడుది; ఆఁడుది). "వ...మగలఁ గికురింపఁ గంకణంబులు గట్టినరీతి నత్తమిల్లు పుత్తడికంకణంబులు గల చాతనినీటుకత్తెలు..." ప్రబంధ. ౭౦. విణ. (విలాసముకలది). "చ. కరిగిరికైనదై నెనరు కల్గినదై నెఱినీటుకత్తె యై,...ముచ్చటైనదై, సురతకళాప్రవీణ యగుసుందరి యందఱికున్ లభించునే." శశాం. ౪, ఆ. ౭౦.

నీటుకాఁడు. దే. విణ. (నీటు+కాఁడు.) 1. అందము గలవాఁడు. "సీ...సొగసుకాఁ డనంగను వన్నెకాఁ డనంగను నీటుకాఁ డనఁగా నలంకారి యొప్పు." ఆం. భా. తృ. ౧౦; 2. విలాసవంతుఁడు. "గీ. నిక్కి నిక్కి నిరీక్షించునీటుకాని, నందముల కెల్ల నెల్ల యానందగాని." చంద్రా. ౨, ఆ. ౧౩౬. సాం. ని. మాన. ౮.

నీటుకోల. దే. వి. (నీటు+కోల.) విలాసార్థము చేతఁ బట్టుకొనుకఱ్ఱ. "క. లిండాడువై రివీరులఁ, జెండాడుట యేమి దొడ్డు చెండాడుగతిన్, గొండ వయిఁ గొండ గూలఁగఁ, గొండికపాయమున నీటుకోల స్మీటున్." సుద. ౨, ఆ. ౧౨౭.

నీటుపడు. ద్వ. అ. క్రి. (నీటు+పడు.) నీటుకల దగు. (చూ. నీటుపఱచు.)

నీటుపఱచు. ద్వ. స. క్రి. (నీటుపడు ధా. ప్రే.) 1. నీటుకలదానినిగాఁ జేయు. "సీ. పాఁచపటతేటసుపాణిముత్తెపుబొట్టు పాటలాధర యొత్తు నీటుపఱచె." ఇందు. ౫, ఆ. ౭౯.

నీటులాఁడి. దే. వి. = నీటుకత్తె. "సీ. కలికిచిల్కల పల్కులకు లులుక్కులఁ జెందఁ దేఁటగాఁ బల్కవే నీటులాఁడి." కాళింది. ౨, ఆ. ౬౬.

నీటువెట్టు. దే. అ. క్రి. (నీటు+పెట్టు.) విలాసము కలిగించుకొను. "సీ. తనవిలాసము గనుంగొని నీటువెట్టుదుఃకూనాస్త్రరతియుఁ నుచుక్కురనఁగ." దశా. ౧, ఆ. ౫౭.

నీటుసేయు. దే. అ. క్రి. (నీటు+చేయు.) విలాసము చూపు. "సీ. నీటుసేయుందు రొక్కచోటఁ గేళిని మనోహరుఁ డేడ వలఁచునో యని చలింప." ఉ. రా. ౧, ఆ. ౧౭౦.

నీడ. దే. వి. 1. ఛాయ, అనాతపము. "ఉ. నేమము నర్వఁగా గొడుగునీడవహించు వసుంధరాస్థలీ, సీమనె యెక్కియాడెను విచిత్రగతిన్..." శైవ. ౧, ఆ. ౮౮; 2. ప్రతిబింబము. "గీ. నిద్ర మేల్కాంచి నెలయేట నీడఁ గాంచి." ఆము. ౧, ఆ. ౩౯; 3. కాంతి, తళుకు. "ఉ...చెక్కుల తళ్కు లద్దపున్, నీడల నేలుగుబ్బగవనిగ్గు లనంగునిగుండుబంగరున్, మేడలఁ బోలు......" ముకుంద. ౨, ఆ. ౧౧౧; 4. చాటు, మఱుఁగు. "క. తెచ్చుటయుఁ గేలిభవనముఁ, జొచ్చునో చొరదో యనంగ సుదతులనీడన్, జొచ్చి... అచ్చేడియ తలుపుదండ నల్లన నిలిచెన్." స్వా. ౬, ఆ. ౬; 5. ఆశ్రయము, ప్రాపు. (వా.)

నీడకము. సం. వి. అ. పుం. 1. గూఁడు; 2. పక్షి.

నీడజము. సం. వి. అ. పుం. పక్షి. విణ. (అ. ఆ. అ.) నీడమునందుఁ బుట్టినది.

నీడతోఁచు. దే. అ. క్రి. (నీడ+తోఁచు.) ప్రతిబింబించు. "గీ. నిర్మలం బైనపనధిలో నీడతోఁచు,

నిండుబింబంబులను బోలి బుషిగణంబు." హార ౪, ఆ. ౫౨.

నీడము. సం. వి. అ. పుం. 1. పక్షిగూడు; 2. ఆశ్రయము. "వ...తరుకోటరక్రోడంబులు నీడంబులు సేసికొని నలుదిక్కులం బక్వంబు లైనఫలంబులు తిని వచ్చి..." శ్రీరాధా. ౨, ఆ. ౧౩౮.

నీడోద్భవము. సం. వి. అ. పుం. పక్షి. విశే. (అ. ఆ. అ). నీడమునందుఁ బుట్టినది.

నీతకము = నీతము. వి. నియమము. (శ. ర.)

నీతము. ఉభ. వై. వి. (సం. నియతమ్.) నియమము. "క. జాతులు నాతుల కెందుక్, నీతము లే కున్కిఁ గామినీలోకానాం, జాతిః ప్రకల్పితా యను,నీతి పురాతనమె కాక నేఁటిదె యరయన్." విక్ర. 3, ఆ. ౭౮. సం. వి. అ. న. 1. ధనము; 2. ధాన్యము; 3. నీతి. "శా. కానీరా యిటువంటి నీతము లనేకంబుల్ నినుంబోలి వి,న్నా నేనున్.." శశాం. 3, ఆ. ౬౮. విశే. (అ. ఆ. అ.) 1. కొని పోఁబడినది; 2. పొందింపఁబడినది; 3. నడపింపఁ బడినది; 4. గడుపఁబడినది. (కాలము); 5. గురువుచే శిక్షింపఁబడినది.

నీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కొనిపోవుట; 2. పొందించుట; 3. న్యాయము, పాడి; 4. ఉపాయము; 5. చాణక్యనీతి మొ. రాజనీతి; 6. సత్ప్రవర్తనము; 7. (అశ్వాదులను గూర్చి) తెలుపుశాస్త్రము. "క. ఈతండు శాలిహోత్రుఁడో, మాతలియో నలుఁడో యొరులు మానవులు జవో,పేతముగ నిట్లు రథహాయ, నీతి యెఱుంగుదురె ధారుణీవలయమునన్." భార. అర. ౨, ఆ. ౧౭౭; 8. విధము, రీతి. (ఈయర్థము తెలుఁగునమాత్రమే కలదు.) "సీ...భరతు, నీతి సుహోత్రునిభాతి భార్గవుబలె రామునాలిక భగీరథునిపోలుపు. గీ. ధాత్రిఁ బాలించునవిభుండు దద్విభుండు." హంస. ౧, ఆ. ౪౨. [వాఁడు.

నీతిమంతుఁడు. సం. విశే. (త్. మతీ. త్.) నీతి కల

నీధ్రము. సం. వి. అ. న. 1. ఇంటిచూరు; 2. అడవి; 3. నేమి, చక్రమునుచుట్టుకమ్మి; 4. రేవతీనక్షత్రము.

నీధ్రుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

నీపము. సం. వి. అ. పుం. 1. కడిమి, కదంబము వృ; 2. మంకెన, బంధూకము వృ; 3. నల్లయిరుగుడు వృ; న. కడిమిపువ్వు.



నీయమానము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కొనిపోఁబడుచున్నది; 2. పొందింపఁబడుచున్నది; 3. నడుపఁబడుచున్నది.

నీరంధ్రము. సం. విశే. (అ. ఆ. అ.) రంధ్రములు లేనిది; సాంద్రము.

నీరగు. ద్వి. అ. క్రి. (నీరు+అగు.) 1. ద్రవించు. "చ. చెవు లవిసెక్ దిశ ల్దిరిగెఁ జిత్తము నీరయి పోయె..." భార. విరా. ౪, ఆ. ౧౩౭; 2. నశించు. "చ. జరఠ యొకర్తు కుంజగృహచంద్రశిలం గనుగూర్కుచుండ...పాన్పుఁ గరంచె వెన్నెలల్, చోరఁబడి నిద్ర నీరగుట చోద్యమె దానికి నట్టిపట్టునన్." రామా. ౨, ఆ. ౯౭.

నీరజము. సం. వి. అ. న. 1. తామరపువ్వు; 2. ముత్యము; 3. చెంగల్వకోష్టు వృ; 4. వట్టివేరు, ఉశీరము వృ. విశే. (అ. ఆ. అ.) జలమునఁ బుట్టినది. న్. 1. రజోగుణము లేనిది; 2. దుమ్ము లేనిది; 3. పుష్పాడి లేనిది; 4. ముట్టుడిగినది. (స్త్రీ.)

నీరజాతము. సం. వి. అ. న. తామరపువ్వు. విశే. (అ. ఆ. అ.) నీటఁబుట్టినది.

నీరదము. సం. వి. అ. పుం. మేఘము, మబ్బు. విశే. (అ. ఆ. అ.) దంతములు లేనిది.

నీరధి. సం. వి. ఇ. పుం. నీటికి ఉనికిపట్టు-సముద్రము.

నీరము. సం. వి. అ. న. 1. జలము, నీరు, 2. ద్రవపదార్థము, రసము.

నీరవము. సం. విశే. (అ. ఆ. అ.) ధ్వని లేనిది.

నీరసము. సం. అవ్య. అ. న. రసాభావము, బలము లేమి. వి. అ. పుం. దానిమ్మ వృ. విశే. (అ. ఆ. అ.) 1. రుచి లేనిది; 2. సారము లేనిది; 3. శృంగారాదిరసము లేనిది, సరసము కానిది. "గీ. నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె." భార. విరా. ౨, ఆ. ౬౪.

నీరసించు. సం. అ. క్రి. బలహీనమగు. (బ్రా. వా.) స. క్రి. నీరసము కల్గించు. "సీ. రేల వెన్నెలలు పండ్రెండు సూర్యులు చూపు బీఁటెండలై కాసి నీరసింప." కవిక. ౪, ఆ. ౧౩.

నీరసుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అరసికుఁడు. "క... వెక్కుపరిహాసంబుల్, రూఢిగఁ బలికితి మెట్లుం, జూడఁడు మావలను నీరసుం డవనుండెన్." భార. ఆది. ౭, ఆ. ౧౫౩.

నీరాకు. ద్వ. వి. (నీరు+ఆకు.) పాఁచి, వారిపర్ణి చెట్టు. "సీ. పాఁచి నీరాకు నా వారిపర్ణి చెలంగు..." ఆం. భా. ప్ర. ౧౬౫.

నీరాజన. సం. వి. ఆ. స్త్రీ.=నీరాజనము.

నీరాజనము. సం. వి. అ. న. దీపాదులచే దేవతా ప్రతిమాదుల కిచ్చువారతి.

నీరాట. ద్వ. వి. (నీరు+ఆట.) స్నానము. "సీ.... నీరాట వెనుకగా నిర్ఝరంబుల కేఁగి సవిధవానీర కుంజముల నొందు." శివరా. 3, ఆ. ౧౧3; 2. జలక్రీడ. "గీ. చల్లులాడంగ నప్పుడు చదల నెగసి, మగుడు తెలినీటితుంపరల్ దగియెఁ జూడ, వారి నీరాటకును మెచ్చి వలపురాయఁడాని కురియించు పువ్వులవాన లనఁగ." య. 3, ఆ. ౬3.

నీరాటము. ఉభ. ద్వ. వి.=నీరాట. (స్నానము.) "క. నీరాట మొనర్చియుఁ శృంగారించిరి వేడ్క షోడశ గ్రక్కున నంతన్." బిల్హ. 3, ఆ. ౨౧౪. సం. విణ. (అ. ఆ. అ.) నీటిలో సంచరించునది. (మొసలి. మొ.) "క. నీరాటవనాటములకుఁ, బోరాటం బెట్లు కలిగె..." భాగ. ౮, స్కం. ౧౯౯.

నీరాటరేవు. ద్వ. వి. (నీరాట+రేవు) స్నానము చేయురేవు. "సీ. ఆరాటమునఁ బొంగి నీరాట రేవునఁ గాచి కన్నెలఁ బల్మిఁ గవయఁ జూచు." నీలా. ౧, ఆ. ౭౬.

నీరాడు. ద్వ. అ. క్రి. (నీరు+ఆడు.) స్నానము చేయు. "శా...మిన్నేట నీరాడంబోయెడి చేసి తాపసులు..." నరస. ౫, ఆ. ౫౭. వి. 1. కాఁగు, అలంజరము. "గీ. నెగడు నీరా డనంగను నీళ్లచివది, యన నలంజరనామధేయమ్ము..." ఆం. భా. ద్వి. ౨౪౫; 2. కూరాటిలో పోసెడు వేన్నీళ్లు. (శ. ర.)

నీరాదులు. దే. వి. బ. వస్త్రవిశేషము. "వ...పీతాంబరములు నీరాదులు బురుసాలు వన్నెమణుంగులు చందురుకావులు..." ప్రబంధ. ౬౦౫.

నీరామని. ద్వ. వి. (నీరు+ఆమని) వర్షఋతువు. "క. ధారణిఁ గలమే ల్లెల్లను, ధారాళకరాళవర్షధారలచేతన్, నీరామని కాఁ గల దని, పూరాల్చిన భంగి ముసురు పొరిఁబొరిఁ దొరఁగెన్." విక్ర. ౪, ఆ. 3౦.

నీరార్చు. ద్వ. స. క్రి. (నీరాడు ధా. ప్రే.) స్నానము చేయించు. "గీ. కాంచి యువగానానము చేసి కనకపంజ, రాంతకీరంబుఁ దివిచి నీరార్చి..." రాజ. చ. ౨, ఆ. ౧౨౨. (నీరాఱు ధా. ప్రే.) తడియాఱఁజేయు, ఎండించు. "గీ. చికురసంతతి నీరార్చి చెలువతురిమె, నేసకొప్పు..." శివరా. 3, ఆ ౪౫. [ఎండు. (చూ. నీరార్చు.)

నీరాఱు. ద్వ. అ. క్రి. (నీరు+ఆఱు.) తడియాఱు,

నీరాళము. దే. వి. ఒకవిధమగురంగు. "మ. నెలతాలీ వియసంతనంపుమగజానీరాళపుం గొప్పటా, కుల నిద్దంపుఁబసిండి నున్నవికె నిగ్గుల్ దొట్టు కట్టాణి పూసలమేల్ బొబ్బమెకంబు చెక్కడపుఁగీల్ జాగాజ గాగ్దియర్, జెలు వెచ్చం గొలువుండె. ..." ప్రబంధ. ౧౨౬.

నీరాళ్లగొంది. ద్వ. వి. ఈశాన్యదిక్కు. "సీ. ధళధళక్కున నింగిఁ దాటించెఁ బలుమాఱు నీరాళ్లగొందిఁ గన్నియమెఱుంగు." పాండు. ౪, ఆ. ౨౧, కవిరా. ౪, ఆ. ౨౬.

నీరిజె. దే. వి. ఒకానొకయడవిచెట్టు. (శ. ర. బ్రా.)

నీరిప్ప. ద్వ. వి. (నీరు+ఇప్ప.) మధూలకము చెట్టు. "గీ ..నీరిప్ప యన మధూల, క మగు..." ఆం. భా. ద్వి. ౪3.

నీరీఁగ. ద్వ. వి. (నీరు+ఈఁగ.) నీటిలో నుండు ఈఁగ. "సీ. నీరుకుమ్మరపురువ్వ నీరీఁగ తలకప్ప..." హంస. ౪, ఆ. ౧౮౬.

నీరు. యు. దే. విణ. అల్పము. (చూ. నీరుకావి, నీరెండ మొ.) వై. వి. జా. అవా. (సం. నీరమ్. క. త. నీరు. బ. నీళులు, నీళ్లు, నీళ్లులు.) 1. ఉదకము. "ఆ. నీరిలోనఁ దోఁచుతారకప్రతిబింబ, మొక్కొ యనఁగ..." భార. ఆది. ౫, ఆ. ౨౦౭, ౪, ఆ. ౧౫౧, సాంబో. ౫, ఆ. ౨౪౦; 2. కన్నీరు, బాష్పము. "మ. కని యంతంతన చాప కట్టుగ నమస్కారంబు లర్పించి లో, చపగోళంబుల నీరు గ్రమ్మ వదనాబ్జంబుల్ కసుగంద..." సాంబో. ౫, ఆ. ౨3౭, భాగ. స్కం. ౪3౦; 3. (లోహాదుల) ద్రవము. "సీ...అమర సేనిక దోయి నీరార్చునపరంజి కీటి వ్రాఁత." ఆము. ౧, ఆ. ౫3; 4. మూత్రము. (శ. ర.); 5. పశురోగవిశేషము. "ద్వి. నరదకన్నును నీరు నాలుక చేర్చు." నవనాథ. ౧, ఆ. 3౦, పు. 6. శుక్రము (చూ. నీరుమోయు; 7. క్రొవ్వు. (చూ. నీరుపోయు.)

నీరుకందువ. ద్వ. వి. (నీరు+కందువ.) జలాశయము. "ద్వి. నీరుకందువ నుండు నీకుమారుండు, నీరు ముంపఁగఁ గుంభినిదమాలించి" రం. రా. అయో. ౧౨౫౯, పు. ౧౮. పం.

నీరుకట్టు. ద్వ. వి. (నీరు+కట్టు.) మూత్రకృచ్ఛ్ర రోగము. "గీ...అడరు నీరు, క ట్టనఁగ మూత్ర కృచ్ఛ్రంబు..." ఆం. భా. ద్వి. ౧౨౭.

నీరుకట్టె. వై. వి. నీరుపాము. "సీ. నీరుపా మనఁ గను నీరుకట్టె యనంగ జలభుజంగము పేరు చెలఁగు..." ఆం. భా. ప్ర. ౧౪౭, అను. ౪, ఆ.౧౨౫.

నీరుకడిమి. వై.వి. (నీరు+కడిమి.) ధారాకదంబము. (శ. ర.)

నీరుకాకి. వై. వి. (నీరు+కాకి.) జలకాకము. "సీ. కొంగ బెగ్గురు నీరుకాకి కంకణమును గొంగ డాబయు గువ్వ వంగపండు." య. ౨, ఆ. ౨౪, ఆం. భా. ద్వి. ౯౩.

నీరుకాకినెపము. వై. వి. (నీరుకాకి+నెపము.) లేని నేరము. "శా...అ, స్తోకప్రౌఢిని నీరుకాకినెప ముల్ జోడించి పల్కా అయో, హాకీము ల్దమ రిట్లు పల్కుటకు నర్హంబే..." రంగా. ౨, ఆ. ౨౧౮.

నీరుకాయ. ద్వ. వి. (నీరు+కాయ.) నీటిబుగ్గ, బుద్బుదము. (శ. ర. బ్రౌ.)

నీరుకాయవాఁడు. ద్వ. వి. నీటిమనుష్యుఁడు. (శ. ర. [బ్రౌ.)

నీరుకాఱు. ద్వ. వి. కమసాలివాని యొకవిధమగు పనిముట్టు. "చ...నీరుకాఱుశాణము పటుకాఱు మూస బలునాణెపరీక్షలకుచ్చు లాదిగా, నమరఁగ భద్రకారక సమాహ్వయుఁ డొండొకఁడుండు నప్పురిన్." హంస. ౨, ఆ. ౧౮౧.

నీరుకావి. దే. వి. (నీరు+కావి.) కొంచెమెఱుపు, లేతకావి. "ఆ. పరఁగ జలకమాడి పట్టెనామము దీర్చి నీరుకావిపంచె నెరయఁ గట్టి." వేమన. ౩, భా. ౨౬౨. ౨. ధాన్యవిశేషము. "సీ. నివ్వరుల్ బెబ్బసల్ నీరుకావులు గాజుకప్పెర ల్కుఱు వడా ల్కుంటసరులు." హంస. ౪, ఆ. ౧౫౮.

నీరుకాసు. ద్వ. వి. (నీరు+కాసు) స్నానముచేయునప్పుడు నీటియొద్దున మంత్రములు చెప్పెడు బ్రాహ్మణుల కిచ్చెడుడబ్బు. "సీ. తిలలు దర్భలు పూని తీర్థసన్నిధి మంత్రములు సెప్పి నీరుకాసులు గడించి." హంస. ౩, ఆ. ౧౫౨.

నీరుకాల్వ. ద్వ. వి. ౨. శోణహరితవర్ణములై సంధ్యాకాలములందు కానవచ్చుసూర్యకిరణములు. "సీ. ఈఁగ మిక్కుట మయ్యె నెఱి నింగి గడు మించె నిడుదలై తెలకించె నీరుకాల్వ." హరి. పూ. ౭, ఆ. ౧౬౦.

నీరుకుక్క. వై. వి. (నీరు+కుక్క.) జలశునకము. (శ. ర)

నీరుకుప్ప. ద్వ. వి. (నీరు+కుప్ప.) జలరాశి, సముద్రము. "ఆ. ఓరికోఁతి కూళ యొక్కింతయును మదిఁ, గొంకులేక నీరుకుప్ప దాఁటి, గడును బొలసుదిండిగము లుండునిద్దీవి,కెట్లు చేరినాఁడ వెఱుక మాలి." అచ్చ. సుం. ౧౩౪.

నీరుకుమ్మరపుర్వు. ద్వ. వి. (నీరు+కుమ్మరపుర్వు.) నీటిలోనుండుకుమ్మరపురుగు. "సీ. నీరుకుమ్మర పుర్వు నీరీఁగ తలకప్ప..." హంస. ౪, ఆ. ౧౭౬.

నీరుకోఁతి. ద్వ. వి. (నీరు+కోఁతి.) జలమర్కటము. (శ. ర.)

నీరుకోడి. ద్వ. వి. (నీరు+కోడి.) జలకుక్కుటము, పరిప్లవము. "గీ. సలిలకుక్కుటనామంబు వెలయు నీరుకోడి యన..." ఆం. భా. ద్వి. ౯౨, అను. ఆ. ౭౧.

నీరుగండి. ద్వ. వి. (నీరు+గండి.) తూముకాలువ, వాహాసము. (శ. ర.)

నీరుగన్నేరు. ద్వ. వి. (నీరు+గన్నేరు.) హిజ్జలము. (శ. ర.)

నీరుగాఱు. ద్వ. అ. క్రి. (నీరు+కాఱు) ఉత్సాహములేకుండుట. "సీ. ఇంతికన్నులతోడ నీడన వచ్చునే గండుమీలవి నీరుగాఱుచుండు." తపతీ. ౨, ఆ. ౧౭.

నీరుగాలివడు. ద్వ. అ. క్రి. తాపమునొందు. "శా. వన్యేభంబులు గొన్ని... భూరిభూధరదరీద్వారంబులం దుండి సొంజన్యక్రీడల నీరుగాలివడి కాసారావగాహార్థమై." భాగ. ౮, స్కం. ౨౬.

నీరుగుట్టు. ద్వ. వి జలజంతువిశేషము. "సీ. గులకరింతయుం నీరుగుట్టు శంఖనఖంబు పులంకాసి నసిమిరి బుంగపురువు." హంస. ౪, ఆ. ౧౭౬.

నీరుచము. సం. విణ. (అ. ఆ. అ.) కాంతి లేనిది.

నీరుచల్ల. ద్వ. వి. (నీరు+చల్ల.) లేతమజ్జిగ. "చ...ఫలంబులును సుగంధిశీతజలము ల్వడపిందెలు నీరుచల్లయుంగ్, వెలయఁగఁ బెట్టు భోజనము

వేసవిఁ జందనచర్చ మున్నుగన్." ఆము. ౧, ఆ. ౮౧. సాం. ని. స్థా. ౯౮. ఇట్లే: నీరుమజ్జిగ. సాం. ని. స్థా. ౯౮.

నీరుచించేలము. ద్వ. వి. (నీరు+చించలము.) ఓషధీవిశేషము౹. "సీ. విషకంటకాలార్లు వేతసంబును నీరుచించలంబును ఖులిచించలంబు." హంస. ౨, ఆ. ౨౧౮.

నీరుచిచ్చు. వై. వి. (నీరు+చిచ్చు.) 1. బడబాగ్ని. "గీ...నీరుచి చ్చనంగఁ బొలుచు బడబాగ్ని..." ఆం. భా. ప్ర. ౪౮; 2. జలమెక్కువగుటచే వృక్షలతాదులకుఁ గలుగురోగవిశేషము. "వ... సుధాకరుండు చెంగలువకేదారంబులకుఁ దీర్చిన తేటపన్నీటికాలువలజాలఁవలె ధళధళని వెలివెలుంగుచలువల జలజలనఁ దొఱఁగుసలిలములు దొట్టి నీరుచిచ్చుఁగొని యంచుల సంచరించు రాయంచబోదలు వాకగా ముక్కుం బక్కపక్కనఁ బొడువ నొక్కించుక విచ్చుమెట్టి నెత్తమ్మిమొగడల వెడలుకట్టావివెట్టగిలి ....." చంద్రా. ౫, ఆ. ౯౩.

నీరుచిచ్చువడు. వై. అ. క్రి. (నీరుచిచ్చు+పడు.) నశించు. పార్వ. ౪, ఆ. ౨౧.

నీరుచిట్టి. ద్వ. వి. (నీరు+చిట్టి.) అ_స్తండులీయము౹. "సీ. అగు నీరుచిట్టి నా న_స్తండులీయంబు..." ఆం. భా. ద్వి. ౯౭. [(శ. ర.)

నీరుచేఱుకు. ద్వ. వి. (నీరు+చుఱుకు.) మూత్రము విడుచునపుడు మంట కలిగెడురోగవిశేషము.

నీరుచెంబేలి. ద్వ. వి. (నీరు+చెంచేలి.) వితున్నము౹. (శ. ర.)

నీరుటెంకి. ద్వ. వి. (నీరు+టెంకి.) జలాశయము౹ చెఱువు. "సీ. నీరుటెంకి యనంగ మీఱు జలాశయంబు." ఆం. భా. ప్ర. ౧౯౨.

నీరుడి. ద్వ. వి. (నీరు+ఊడు.) 1. మూత్ర మధికముగా విడుచురోగవిశేషము, అతిమూత్రము (శ. ర.); 2. మూత్రము. (వా.) [(శ. ర.)

నీరుడుము. ద్వ. వి. (నీరు+ఉడుము.) జలగోధిక.

నీరుతిట్ట. ద్వ. వి. (నీరు+తిట్ట.) జలరాశి, సముద్రము. "సీ. అత్తఱిఁ జైక క్రచ్చఱ నీరుతిట్టబత్తళికవ జేరుబల్విలం దునిమిన, వెరవరినొసలబంగరురేకు గట్టుతెఱంగుమంథర యనుటాఁగబోలఁలి, వలన నొతింగి..." అచ్చ. అయో. ౨౧.

నీరుతిత్తి. వై. వి. (నీరు+తిత్తి.) 1. మూత్రకోశము. (శ. ర.); 2. నీటితిత్తి. "వ...పన్నీరు నించిన యన్నీరుతిత్తు లొత్తి వియత్తలంబునం బాఱి కయివ్రాలుధారలవాద్యంబులు దడిసిన..." ఆము. ౪, ఆ. 3౫.

నీరుతుట్ర. ద్వ. వి. (నీరు+తుట్ర.) నీరుకట్టె, అలగర్దము. (శ. ర.)

నీరుదాలుపు. ద్వ. వి. (నీరు+తాలుపు.) జలధరము, మేఘము. "శా. ఏఁడే రక్కసి నీరుదాలుపులగా ద్వేఁడీ జగం బేలుఁడేఁడు..." అచ్చ. అయో. ౮౮.

నీరుదొత్త. ద్వ. వి. నీరుకట్టె, అలగర్దము. "గీ. నిక్కమొకరుఁడుదియు నొకనీరుదొత్త, యొక్కగాడిద యొకకోడె యొక్కగుఱ్ఱ, మని తలంపకనను విలుప్తారిగంధుఁ, డగుజరాసంధుఁడుగ నింక నరసికొనుము." హరి. ఉ. ౧, ఆ. ౧౦. [(శ. ర.)

నీరుదోమ. ద్వ. వి. (నీరు+దోమ.) జలమశకము.

నీరుద్రిమ్మరి. ద్వ. వి. (నీరు+త్రిమ్మరి.) జలచరము, జలజంతువు. "గీ. నీరుద్రిమ్మరిపదువులు నెఱయ బెరయఁ, బొనరుమున్నీరు సేరి యబ్బురము మీఱ." అచ్చ. యు. 3. [(శ. ర.)

నీరుపంది. ద్వ. వి. (నీరు+పంది.) జలసూకరము.

నీరుపదను. ద్వ. వి. (నీరు+పదను.) కొంచెపుఁబదను. "సీ. ఘుమఘుమాధిరుతాకుంతితాంభోరాశి నిజసాయకముపకు నీరుపదను." చంద్రా. ౧, ఆ. ౮౧.

నీరుపాఁచి. ద్వ. వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

నీరుపాప. యు. దే. వి. షసిబిడ్డ. "చ...విరు లను దూపు లుంచుకొని వేడుకగా రసికాలి వైచుచుక్, దిరిగెడునీరుపాపను వధించెను శంభుఁడు శూరుఁడేకదా." పార్వ. 3, ఆ. ౧౦౦. ద్వ. వి. (నీరు+పాప.) 1. కృపీటయోని, అగ్ని. "ఆ. నీరుపాప గాలికెచ్చెలి యన్నిఁటి, తిండికాఁడు... అగ్ని యనఁగ నొప్పు ననలుఁ డీశ." ఆం. సం. దేవ. ౧౮; 2. జలజంతువిశేషము. "గీ...నీరు, పాప నీకేన్గు నీర్పిల్లి ప్రాఁచిపురువు, లాదికొఱగాని జంతువు లన్ని విడిచి." హం. ౪, ఆ ౧౮౯; 3. జలమనుష్యుఁడు; జలమనుష్యాంగన. "సీ. కొలఁకులోపలనుండి కెలఁకుల విహరింప బయట నిల్చిననీరుపాప లొక్క..." తపతీ. ౪, ఆ. ౯౪.

నీరుపాము. ద్వ. వి. (నీరు+పాము.) జలసర్పము, నరుకట్టె. "సీ. నీరుపా మనఁగను నీరుకట్టె

యనంగ జలభుజంగము పేరు చెలఁగును..." ఆం. భా. ప్ర. ౧౪౭. సాం. ని. తిర్య. ౦౧.

నీరుపిప్పలి. వై. వి. (నీరు+పిప్పలి) పిప్పలివిశేషము, తోయపిప్పలీ. "సీ. నీరుపిప్పలి యం చనిన బొక్కెన యనంగఁ దోయపిప్పలిసంజ్ఞ తోఁచు చుండు." ఆం. భా. ద్వి. ౫౭.

నీరుపిల్లి. వై. వి. (నీరు+పిల్లి.) జలమార్జాలము.(శ.ర.)

నీరుపుట్టువ. ద్వ. వి. (నీరు+పుట్టువ.) 1. శంఖము. "సీ. నీరుపుట్టువయును నీరుపుట్టువయును బూర యుఁ దొడవునై పొలుపు నెఱప." అచ్చ. బాల. 3; 2. కౌస్తుభము. అచ్చ. బాల. 3; 3. తామరపువ్వు. (శ. ర.)

నీరుపోఁత. ద్వ. వి. (నీరు+పోఁత.) జలక్రీడ. "ఆ. ప్రణయభావ మెసఁగఁ బౌరు లుత్సవమునఁ, గూడి నీరుపోఁత లాడి రొప్ప." కు. సం. ౧, ఆ. ౧౨౦.

నీరుపోయు. ద్వ. అ క్రి. (నీరు+పోయు.) క్రొవ్వెక్కు, మదించు. "గీ. ఇవ్విధంబున మెలఁగునయ్యింతి యొంటి, తిండికతమున నినుమడి కండ పట్టి, నీరుపోసినమేనితో నిలుపరాని, మన సుచే జారభోగ మేమఱక తిరుగు." శుక. 3, ఆ. 3౫౧.

నీరుప్పు. ద్వ. వి. (నీరు+ఉప్పు.) వృక్షవిశేషము. "సీ...తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్ప."హంస. ౪,ఆ.౧౧.

నీరుప్రబ్బలి. ద్వ.వి. (నీరు+ప్రబ్బలి) జలవేతసము. (శ. ర.)

నీరుబచ్చలి. ద్వ. వి. (నీరు+బచ్చలి.) ఒకవిధమైన కూరాకు. "సీ....నిమిటాయి గొలిమిడి నీరు బచ్చలి ప్రబ్బ..." హంస. ౪, ఆ. ౧౦.

నీరుబొద్ది. ద్వ. వి. (నీరు+బొద్ది.) వృద్ధదారకవిశే షము. (శ. ర.)

నీరుమట్టము. ద్వ. వి. (నీరు+మట్టము.) జలవ్యాప్తి గలభూభాగము. (శ. ర.)

నీరుమానిసి. వై. వి. (సం. నీరమానుషః.) నీటిమను ష్యుఁడు. "గీ. శైవలచ్ఛన్నముఖముతోఁ జౌక శించి, పవనహాలిచేత నన్నాచు బయలువడిన, నీరు మానిసిఁ బోలు మన్నిశితశరవి, రూపితుం డగు రుక్మి పౌరుషముఁ దెలిపె." సాంబో. ౧, ఆ. ౧౧౧.

నీరుముంపు. ద్వ. వి. జలప్రాయము, స్త్రీ నీరు నేల, అనూపము. "గీ. నీరుముం పనఁ గ్రీనీరు నేల యనఁగ, ఖ్యాతిఁ గాంచు ననూపంబు..." ఆం. భా. ద్వి. ౭.

నీరుముట్టు. ద్వ. అ. క్రి. (నీరు+ముట్టు.) మల మూత్రవిసర్జనముచేయు. "గీ. రచ్చఁ జెరువున గృహవాటి మచ్చుమీఁద, నీటిచేరువఁ గొఱ గాదు నీరుముట్ట,వసుధమీఁదను దళముగాఁ గసవుఁ బఱపి, వేగ మూత్రపురీషముల్ విడువవలయు." వి. పు. ౪, ఆ. ౧౦౨.

నీరుమోపరి. ద్వ. వి. (నీరు+మోపరి) 1. మేఘము. (శ. ర.); 2. కలశము. "సీ. ముదికొగుబ్బలు నీరు మోపరుల గణింప వప్పొఁబుట్టువుఁ గాచు నలివ కేలు." హ. న. ౪, ఆ. ౪3, వి. నీరుమోచు నది. (శ. ర.)

నీరుమోయు. ద్వ. అ. క్రి. 1. నీటిలోఁ మునుఁగు; నీటితో నిండు. "ఉ. తామర నీరు మోవ హిమధా మఁడునుం గళవచ్చి డిగ్గఁ దే, జోమహిమాభి రామ మగుచుఁ సుదతీవదనంబు వోల్చు..." సాంబో. 3, ఆ. ౧౦౫; 2. గర్భవతియగు. "ఉ. శైవలమల్లి కావికచసారస నీలసరోజచక్రమూ, ర్త్యావయ వాఢ్యనిమ్నలుషమానస పద్మిని నీరు మోచిన, ట్లావిలసిల్ల గర్భకమలంబును బోలిన కల్వలో మధు, స్రావము నుమ్మనీ రసెడిజాడను జూపక చూచుచున్నెడన్." పార్వ. ౨, ఆ. ౭, పను. 3, ఆ. ౨౧. (ఈరెండు పద్యములును పైరెండర్థముల కుదాహరణములు.)

నీరుల్లి. ద్వ. వి. (నీరు+ఉల్లి.) ఎఱ్ఱగడ్డ, పలాండువు. "సీ ..ఎఱ్ఱ, యుల్లియం చనఁగ నీరుల్లి నాఁగఁ బలాండు వొప్పు..." ఆం. భా. ద్వి. ౬౯.

నీరువంగ. వై వి. (నీరు+వంగ.) వార్తాకవిశేషము, వృంతాకము. "సీ...నీరెత్తువంగ నా నీరువంగ, యనఁగను వృంతాక మలరును..." ఆం. భా. ద్వి. ౨౪౯.

నీరువట్టివేరు. ద్వ. వి. (నీరు+వట్టివేరు.) ఉశీరవిశే షము, లామజ్జకము. (శ. ర.)

నీరువట్టు. ద్వ. అ. క్రి. (నీరు+పట్టు.) దప్పిగొను. "ఆ. రాత్రి జాగరణభరశ్రాంతు లైవారు, నిద్రఁ బొందియుండ నీరువట్టి, ధారుణీశ్వరుండు తన్మంత్రకలశోద, కంబు ద్రావె గడుపు

నిండ."భార. ఆర. 3, ఆ. ౨౦౨. వి. 1. దాహము దప్పిక. "ఉ. గాసిలనీక రాసుతులఁ గౌశికుఁ డాఁకలి నీరువట్టు నాయాసము లేనిమంత్రము రణాభయవృత్తి యమోఘబాణబాణాసన సాధనంబులు...కృపచేసి కృతార్థులఁ జేసె నెంత యుఁన్." రామా. ౪, ఆ. ౨౪, భార. ఆది. ౬, ఆ. ౨౧౯; 2. నీటిచాటిక. "మ...నిర్మలతో యస్నపనం బొనర్చినశరీరం బేటికి న్నీరువట్టులు గట్టెం భవదాత్మశుద్ధి కిది గూడుంగా మహాహేయముల్." కాశీ. 3, ఆ. ౯౬; 3. జలాశయము, నీరున్నచోటు. (బ్రౌ. వా.)

నీరువత్తిగ. వై. వి. భక్ష్యవిశేషము. "వ...మణుఁగుఁ బువ్వులుం బేణీలు నీరువత్తిగలు మడతలుఁ బప్పుబూరెలు..."హంస. ౧, ఆ. ౧౦౫ (శ.ర.పా.)

నీరువరి. ద్వ. వి. (నీరు+వరి.) నీవారతృణము⚘.(శ.ర.)

నీరువామి. ద్వ. వి. (నీరు+వామి.) జలరాశి, సముద్రము. "చ...పఱచెఁ దెల్లగ నేఱులు నీరువామికిన్." అచ్చ. కిష్కిం. ౬౪, (శ. ర. పా.)

నీరువెట్టు. ద్వ. అ. క్రి. (నీరు+పెట్టు.) పొలము మున్నగువానికి నీరుప్రవహింపఁజేయు. "చ...అసురఘస్మరవైరి భుజాంతరాళజాం, గల మహిజాలువట్టి పయిఁగ్రమ్మెడు నెత్తురు నీరువెట్టి యం, దలుకవె కీర్తిపూర్తికలమాంకుర మింద్రరమాఫలార్థివై." పాండు. ౨, ఆ. ౫౯.

నీరూపము. సం. వి. అ. పుం. గాలి. న. ఆకాశము. విణ. (అ. ఆ. అ.) రూపములేనిది.

నీరెండ. దే. వి. (నీరు+ఎండ.) కొంచెపాటియెండ, లేఁతయెండ. "ఉ. కొండలు ద్రవ్వినట్టి పెనుగుంటలవెంటనె నిర్గమించి మార్తాండమరీచులం దటిమి తాఁకినమాత్రమె కాదు రయ్యు తన్మండలముం గరాగ్రగిరిమండలిచేఁ గపులాచి దాఁచ నీరెండలుగాచెఁ బైకొని ఫణీశఫణామణి దీప్తులిమ్మహిన్."రామా. ౭, ఆ. ౧౨౬, శశాం.పీఠి. ౩౭.

నీరెత్తువంగ. ద్వ. వి. నీరువంగ, వృంతాకము⚘. ఆం. భా. ద్వి. ౫౯. [౪, ఆ. ౧౭౬.

నీరేన్గు. ద్వ. వి. (నీరు+ఏనుఁగు.) నీటిగజము. హంస.

నీరొట్టు. ద్వ. వి. భక్ష్యవిశేషము. "గీ. రొట్టె నీరొట్టు నిప్పటి యట్టు దోసె...భక్ష్య భేదావ్యయంబులు..." ఆం. భా. ద్వి. ౨౫౬.

నీర్కావి = నీరుకావి. "సీ...నిద్దమైనమడుంగు నీర్కావిదోవతి కనకమేఖలతోడఁ గటిఘటించి." కాశీ. ౧, ఆ. ౩౯.

నీర్గొబ్బి. ద్వ. వి. (నీరు+గొబ్బి.) వృక్షవిశేషము, నీరుగొలిమిడి⚘. "గీ. వెలఁగ వాఁకుడు పల్లేరుములక వేము, నగిర నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు కంప లన్నియుం వేవేగఁ గడచి కడచి." హంస. ౪, ఆ. ౬.

నీర్చిచ్చుకాఁడు. ద్వ. వి. ఒకవిధమైనలకుముకిపిట్ట. "సీ...టిట్టి, భము లకుముకి యనఁ బరఁగు దద్భేదంబు నీర్చిచ్చుకాఁ డన నెగడుచుండు." ఆం. భా. ద్వి. ౯౭.

నీర్వట్టు. ద్వ. అ. క్రి. (నీరు+పట్టు.) దప్పిగొను. "వ...వెన్నెల నీర్వట్టువెన్నెలపిట్టలు పొట్టలు నిండ నాస్వాదించె." పాండు. ౪, ఆ. ౧౬. వి దప్పి. "శా. వాసోనిగ్రహ మెన్న రాఁకలియు నీర్వట్టుఁ గణింప ర్తలల్, మానెం గాయనరు .." పాండు. ౫, ఆ. ౧౬౪, ఆము. ౪, ఆ. ౧౨౨

నీర్వామి=నీరువామి. "గీ...కడు మ్రోయునీర్వామి గాంచి రెదుట." అచ్చ. కిష్కిం. ౯౦.

నీఱు. దే. వి. (క. త. నీఱు.) బూది, భస్మము. "ఆ. మాఱుకొన్నవారి నీఱుసేయుము ప్రజ, నరసి మనుపు ధరణిసురులఁ బ్రోవు." భార. శాం. ౧, ఆ. ౩౭౦, వరాహ. ౪, ఆ. ౫౬.

నీల. సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. నల్లగలిజేరు⚘.

నీలంగువు. సం. వి. అ. పుం. 1. పురుగు; 2. ఇంద్రనీలమణి; 3. నక్ర. స్త్రీ. 1. ఈఁగ; 2. తుమ్మెదలపంక్తి.

నీలఁడు. వై. వి. (సం. నీలః.) అశ్వవిశేషము. "క. ఒనరించిన నీలని నడ, గని బొల్లనిఁ గత్తలాని గైరని సారం, గని జారని జన్నని నిమ, వని మొదలుగఁ దెచ్చి నిలిపె వాహకుఁ డెదురన్." ద్వా. 3, ఆ. ౧౪౧.

నీలకంఠ. సం. వి. ఆ. స్త్రీ. నెమిలి. "క. ఘనమండలియుత్కృన్నతి, గనుఁ దొల్తం బిదపఁ గరక కలిత కుసుమజా, లనవజలసేకములఁ దా, మొనయింపుచు నీలకంఠ ముద నొనరించున్." కాళిందీ. ౪, ఆ. ౭౯.

నీలకంఠము. సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. ఊరఁబిచ్చుక; 3. కాటుకపిట్ట; 4. బంగారు పిచ్చుక; 5. తుమ్మెద; 6. పాము విణ. (అ. ఆ. అ.) నల్లని కంఠము కలది.

నీలకంఠుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. (ఇట్లే. నీలగ్రీవుఁడు. మొ.

నీలకత్తి. మి. వి. ఖడ్గవిశేషము. "క. ...వంటలక్క-చిలుకం దఱుగం, గోరిపచనక్రియాచిం, తారతితో నలకత్తి నలుగడ నెరుకన్." శుక. 3, ఆ. ౫౭.

నీలకము. సం. వి. అ. పుం. 1. నల్లగుఱ్ఱము; 2. తుమ్మెద; 3. నల్లకోఁతి. న. 1. నల్లయుప్పు; 2. నల్లయుక్కు; 3. మైలుతుత్తము; 4. వేగిస✽. విణ. (అ. విశా. అ.) నల్లనిది.

నీలగంధి. సం. వి. ఇ. పుం. మాణిక్యవిశేషము. (ఇది తుంబురమునఁ బుట్టినది. నల్లడాలు గల అధమ జాతిరత్నము. అని శ. ర.)

నీలతాలము. సం. వి. అ. పుం. చీకటిమ్రాను, తమాలము.

నీలదూర్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లగఱిక✽. 2. నల్లగొలిమిడి✽.

నీలధ్వజము. సం. వి. అ. పుం. 1. తమాలము, చీకటిచెట్టు; 2. తాడిచెట్టు.

నీలపత్త్రము. సం. వి. అ. పుం. 1. దానిమ్మ✽; 2. నల్లతామర✽. న. 1. నల్లకలువ; 2. నల్లనియాకు. విణ. (అ. ఆ. అ.) నల్లపత్త్రములు గలది.

నీలపద్మము. సం. వి. అ. న. నల్లతామర✽.

నీలపుచ్ఛము. సం. వి. అ. పుం. డేగ.

నీలఫల. సం. వి. ఆ. స్త్రీ. నేరేడు, జంబువు✽.

నీలమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. మారేడు, బిల్వము✽.

నీలము. సం. వి. అ. పుం. 1. కృష్ణవర్ణము, నలుపు; 2. ఇంద్రనీలమణి; 3. మఱ్ఱి, వటము✽. 4. మచ్చ, కళంకము; 5. ఒకపర్వము; 6. ఒకనిధి; 7. నల్లనియెద్దు. న. 1. విషము; 2. మైలుతుత్తము; 3. నీలిమందు; 4. చీకటి. విణ. (అ ఆ. అ.) నల్లనిది.

నీలలోహిత. సం. వి. ఆ. స్త్రీ. 1. నేలనేరేడు✽; 2. పార్వతి.

నీలలోహితము. సం. వి. అ. పుం. నలుపు కలిసిన యెఱుపు. విణ. (అ. ఆ. అ.) నలుపు కలిసిన యెఱుపు గలది.

నీలలోహితుఁడు. సం. వి. అ. పుం.-కంఠమున నలుపును కేశములందు ఎఱుపును కలవాఁడు - శివుఁడు.

నీలాంబరము. సం. వి. అ. పుం. 1. నల్లనిబట్ట; 2. తాళిసపత్త్రి✽.

నీలాంబరి. సం. వి. ఈ. స్త్రీ. ముప్పదిరెండునపుంసకరాగములలో నొకటి "గీ. రీతి గౌళయు నీలాంబరియును ఘనము, దనరుహంవీర నాటయుం నని నపుంసకములు ముప్పదిరెండు రాగములు మఱియు ..." ప్రబంధ. ౯౭.

నీలాంబరుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు. 2. శని; 3. నిర్ఋతి. విణ. (అ. ఆ. అ.) నల్లని వస్త్రము కలవాఁడు. (ఇట్లే: నీలవసనుఁడు. మొ.)

నీలాక్షము. సం. వి. అ. పుం. బాతు. విణ. (అ. ఈ. అ.) నల్లనికన్నులు గలది.

నీలాలి. దే. వి. ద్విముఖదీపిక. "సీ. ద్విముఖదీపిక దడిదేరు నీలాలి నా..." ఆం. భా. ద్వి. ౧౬౫.

నీలి. ఉభ. యం. దే వి. మల్లవిద్యాసాధనవిశేషము. "సీ. మనుసు జెట్టి యనంగ మల్లాభిధానంబు తద్విద్య సా మనఁ దనరుచుండుఁ, దత్సాధనంబులై తగు...... గీ. సంగడము నీలి గోతా మనంగఁ గొన్ని." ఆం. భా. ద్వి. ౨౦౭. వై. వి. (సం. నీలం. ప్రా. నీలీ.) 1. నీలవస్త్రము. "సీ... నీలవస్త్రం బగు నీలి యనఁగ." ఆం. భా. ద్వి. ౧౫౮; 2. నలుపు, నీలిమ. "గీ ..సకలజగద్భిన్నజాయమాన, నీలవన్నియఁలను నొక్కనీలి మ్రింగె, ననుట నిజమై యశేషవర్ణాంతరములఁ, గప్పుకొని యొప్పుచిమ్మచీకటులు నెఱయ." శుక. ౧, ౧౫౭. కు. సం. ౮, ఆ. ౯౯; 3. నల్లనూలు. (శ. ర.); 4. ఇంద్రనీలము. (చూ. నీలితిగ్మ.) విణ. 1. నల్లనిది. "గీ. కొస దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగు వెట్టి." హర. ౭, ఆ. ౧౮౯. 2. ధూర్తురాలు. "ఉ. అద్దమరేయిదాఁక పాల మారసి మారశిలీముఖావళి, న్నిద్దురఁ గాచియున్నమగనిన్ జగనీలిపిశాళిజంత యు, మ్మద్దియ సేవచేయదు..." పాండు. 3, ఆ. ౭౧. సం. వి. ఈ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. నల్లయాఁగ; 3. నల్లగోరంట✽; 4. నల్లగలిజేరు✽.

నీలిచీర. వై. వి. (నీలి+చీర.) నల్లనివస్త్రము; చోరసాధనవిశేషము. "ఉ. కత్తియు నీలిచీరయును గంకటిరజ్జువు నారసంబు ... క. మొదలగు

సాధనములుగొని..." చెన్న. 3, ఆ. ౨౫౪, ౨౫౫.

నీలితనము. వై. వి. (నీలి+తనము.) 1. దౌష్ట్యము. "గీ...నరపాలవరాళి దా న సత్యభీమకీలి గావున జాలిఁగొలుపు, నాలి నీలితనాన కౌ ననఁగఁ జాలి, సోలి సుతుమాలిమికి నాగరమాళిఁ జూచి." చం. రా. ౪, ఆ. ౨౨; 2. మాయయేడ్పు. (బ్రౌ.)

నీలితిన్నె. వై. వి. (నీలి+తిన్నె.) ఇంద్రనీలమణుల తోఁగట్టినవేదిక. "సీ. అచట బెళ్లుఁ దమచాయ నంటినట్లుగ నుండఁ దిరుగులాడెడునీలితిన్నె లనఁగ." య. ౨, ఆ. ౧౨.

నీలిదట్టి. వై. వి. (నీలి+దట్టి.) 1. నల్లనికాసెకోక; 2. చోరసాధనవిశేషము. "క. బలపముఁ గన్నపు కత్తియుఁ, దలముష్లను జొక్కనీలిదట్టి యిసుము." మొదలగువానిన్." పరమ. ౪, ఆ. ౧౮౪; 3. ఒకానొకవేఁటసాధనము. "మ. వలలం బోనులు చిక్కములన్... నీలిదట్లు పిడియంబుల్ పూని లీలన్ విక్రీం, ఖలవృత్తిన్ చరవేఁటకాండ్రు గొలువంగా వచ్చె రా జున్నతిన్." రామా. ౨, ఆ. ౨౨.

నీలిమ. సం. వి. న్. పుం. నలుపు.

నీలిమము. సం. = నీలిమ.

నీలిమందు. ద్వ. వి. (నీలి+మందు.) నీలియాకులనుండి తీసినవర్ణంజకద్రవ్యము. (వా.)

నీలిమబ్బు. ద్వ. వి. ఒకానొక వేఁటసాధనము. "ద్వి. జిగురుకోలలు మేటిచిక్కము లురులు, తెగనీలిమబ్బులు ద్రిప్పుడుత్రాళ్లు, పిగిలిబెం డ్లమరినపెదయాఁటెలును." ద్వి.నల.3, భా.౨3౪. పం.

నీలుగు. దే. అ. క్రి. 1. మరణించు. "గీ. అట్టు లొక్కొక్కపోటున నాలపోతు, లన్నియుం వాత ముక్కునఁ గన్నుఁగవల, నెత్తురులు గాఱ నీలిగి నేలఁ బడిన, నెల్లవారలు వెఱఁగంది రుల్ల ములను." నీలా. 3, ఆ. ౫౬; 2. ఒడలు పెంచు, దేహ ముబ్బించు. "క. బలితపుటురి గ్రామంబున, నిలుచుట యూర్జు త్రెవ్వ నీలిగి సుమతుల్, వెలుపడి చని సుఖులగుదురు..." భార. శాం. ౬ ఆ. ౨3౨.

నీలోత్పలము. సం. వి. అ. న. నల్లకలువ. (ఇది మన్మథునిపంచబాణములలో నొకటి. (ఇట్లే: నీలాంబుజము, నీలాబ్జము. మొ.

నీల్గు = నీలుగు. 1. చచ్చు. "సీ. సమరయుంట యీల్గుట... నీల్గుట... నా మిూఱుకు మరణము." ఆం. భా. ద్వి. ౨౨౫. నా. పంచ. ౧, ఆ. ౯౫; 2. సాఁగు; 3. గర్వించు. "చ. అతివిపులంబు లన్ మెఱుఁగుటాఱును వేసలియున్ ధరాద్రి పోఁన్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యు దయంబు నిప్పు డొంౢదితి మని మాటిమాటికిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్, క్షితి నటుగాద యొక్కొకరికి న్నదుమంత్రపుఁగల్మి గల్గినన్." విజ. ౧, ఆ. 3౪. (ఇది పైరెండర్థములకు నుదాహరణము.); 4. ఒడలువిఱుచుకొను. "ఉ. వెచ్చని యూర్పు నించుచును వేదనఁ బొందుచుఁ గన్ను మోడ్చుచున్, వెచ్చుచు నెజ్జపైఁ దనువు వెమ్మఁగ వేఁచుచు నీల్గి లేచుచున్." కేయూర.3,ఆ3౪3. ఉ. రా. ౨, ఆ. ౧౮౫; 5. ఒడలుసాచు. "గీ. అవయవంబులు గదలించి యావులించి, నిదురఁ దెప్పిరి మేల్కాంచి నీల్గి మలఁగి, యొడలు విఱుచుచు......" భాగ. ౮, స్కం. ౭3౪. స్కా. ౪, ఆ. ౨౮; 6. ఒడలుపెంచు, దేహ ముబ్బించు. "సీ. జమిలిమద్దులతోడ సంరంభ మునఁ దగిలించి తాఁ దగులక లీల రెంటి. గీ. నడుము గడచి నీల్గుటయును బుడమి పగులఁ, బెల్లగిలి కూలెఁ దరువులు..." హరి. పూ.౫,ఆ.౭౪3.

నీవరి = నివరి. (సస్యవిశేషము.) "గీ...పాములపడగ నీడ, నలరుచుఁ జెలంగు నెలుకలు తలవరు లయి, వరుసఁ గావంగ వెలయునీవరులు గలిగె." శశాం. ౧, ఆ. ౧౭. [వణిజుఁడు.

నీవరుఁడు. సం. వి. అ. పుం. 1. సన్న్యాసి; 2.

నీవారము. సం. వి. అ. పుం. సస్యవిశేషము, నివ్వరిబీ.

నీవి. సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీలపోఁకముడి; 2. మూల ధనము; 3. పంచెపుసొమ్ము; 4. చెఱసాల.

నీవు. దే. స. యుష్మదర్థకము. "గీ. నీవు మాచుట్ట మవపోలె నెమ్మితోడ." భార ఆది. ౨, ఆ. ౧౪౪. భార. ఆది. ౨, ఆ. ౧౫౦.

నీవృతము. సం. = నీవృత్తు.

నీవృత్తు. సం. వి. త్. పు. 1. గ్రామము; 2. దేశము.

నీవ్రము. సం. = నీధ్రము.

నీహారము. సం. వి. అ. పుం. మంచు.

నీళులాడు. ద్వ. అ. క్రి. స్నానము చేయు. "ఉ... యశోద వేడుకన్,...ఆ, న్యాయపగ నీళులాడు

టకునై చనియెన్..." హరి. పూ. ౫, అ. ౧౭౮. శ్రీరాధా. ౫, అ. ౨౭౯.

నీళ్లచివది. ద్వ. వి. (నీళ్ల+చివది.) కాఁగు, అలంజరము. "గీ. కొగడు నీరా డనంగను నీళ్లచివది, యన నలంజరనామధేయమ్ము......" ఆం భా. ద్వి. ౨౪౫.

నీళ్లదొర. ద్వ. వి. (నీళ్ల+దొర.) వరుణుఁడు. "చ...నీళ్లదొర గాడుపు జక్కులఱేఁడు చిల్వపోమ్ములరేకిమీఁడు నాల్గుబుజముల్గల వేలుపు దమ్మిచూలియుం, గొలువగ వెండికొండపయిఁ గూర్మిఁ జెలంగు గడింది దయ్యమా." అచ్చ. ఆర. ౧౨౬.

నీళ్లనాడు. ద్వ. అ. క్రి. (నీళ్లన్+ఆడు.) స్నానము చేయు. "ఉత్సాహ. మలఁసమర్త నంటకుండి మాలదాన నగుట నేఁ, గలయ నీళ్లనాడి కడవఁ గ్రంత యంటుకొనుటకై, కొలనఁ గ్రుంకి..." శివరా. ౩, అ. ౧౪. [వేంక. దేవ. ౧౭.

నీళ్లరాయఁడు. వై. వి. (నీళ్ల+రాయఁడు.) వరుణుఁడు.

నీళ్లవరుగు. ద్వ. వి. ఉప్పు, లవణము. (శ. ర.)

నీళ్లాడు. ద్వ. అ. క్రి. (నీళ్ల+ఆడు.) 1. స్నానము చేయు. "సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయుచుండె యాచేరువ నొర్తు తడుపు, కట్టక నీళ్లాడఁగాఁ జూడ దనదుశుక్రము నిర్గమించిన ..." భార. శల్య. ౨, అ. ౧౬౦. కాశీ. ౨ అ. ౭౫; 2. ప్రసవించు. "సీ. తెలిసి చక్కన వచ్చి దేవకి నీళ్లాడె రమ్ము రమ్మని భోజరాజు తోడఁ, జెప్పిన..." భాగ. ౧౦. స్కం. పూ. ౧౪౧; ౧, స్కం. ౫౦౨.

నీళ్లార్చు. ద్వ. స. క్రి. స్నానము చేయించు. "సీ. పాపకదంబజంబాలంబుఁ గడిగెడుపగిది నీళ్లార్చిరి పావనికిని." కాశీ. ౩, అ. ౨౭.

నీళ్లకాఱు. ద్వ. అ. క్రి. (నీళ్ల+కాఱు.) మందమతితో నుండు; జాడ్యముచేయు. (బ్రౌ. వ్యవ.)

నీళ్లనమలు. ద్వ. అ. క్రి. (నీళ్ల+నమలు.) సంకోచించు, సంశయించు. "క. నీ వాపురికిని మొదలం, బోవం బని యేమి చెప్పుము యథార్థముగా, నావుడును నీళ్లనమలుచు, నావిహగము చెప్పఁ గొంక నంచయు దానిన్.' ప్రభా. ౪, అ. ౧. ద్వి. పారిజా. పూ. ౨౧౬.

నీళ్లోడు = నీళ్లకాఱు. (వ్యవ.)

# ను

ను. దే. అవ్య. (కొన్నియెడల దీనియుత్వమునకు లోపము కలుగును.) 1. నాశబ్దమునకును తన శబ్దమునకును వచ్చు ప్రథమైకవచనము. (ఉదా:- నేను, తాను.) "చ..సర్వమునను నేన నిల్తు సుఖవాసత నక్కడఁ జెంది నిల్చు సర్వము..." భార. అశ్వ. ౩. అ. ౩౧. "గీ. తాను దనుసేది బాంధవదారపుత్ర, మిత్రులును సజ్జనంబు లేమిటికి .." భార. శాం. ౬, అ. ౨౩౩; 2. ద్వితీయైకవచనము "గీ. సత్కవిశ్రేష్ఠు తిక్కయజ్వను భజించి." కాశీ. ౧, అ. ౧౯. భార. ఆది. ౨, అ. ౫౮; 3. తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైకవచనమునందు వచ్చు ప్రత్యయము. "మ...పొంచజన్య మొసఁగుఁగాఁ గల్యాణసాకల్యమున్." ఆము. ౧, అ. ౫, భార. ఆది. ౪, అ. ౧౬; 4. ఉత్తమ పురుషైకవచన ప్రత్యయము. ఉదా:-చేయుచున్నాను, చేయఁగలను. "ఉ...వేంకటభర్తఁ గొల్చెదన్." ఆము. ౧, అ. ౧; 5. తుమర్థభావ లక్షణాద్యర్థములయందు వచ్చు ప్రత్యయము. ఉదా:-వండను బోయెను. వాఁడు వండ నతిథి వచ్చెను; 6. సముచ్చయార్థమును దెలుపును. "చ. ఇవి యేనుక్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బ్రాయపు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియుం భారత, శ్రవణాసక్తియు...శశ్వత్సాధు సాంగత్యమున్." భార. ఆది. ౧, అ. ౧౨; 7. అవధారణార్థమును దెలుపును. "క...ఒకండును మధ్యేరాత్రమునఁ గడుం గుతుకమును." హరి. ఉ. ౫, అ. ౧౫౮; 8. సహితార్థమును దెలుపును. "వ...మేనం బులకలిప్పుడుం బొడమెడును." స్వా. ౧, అ. ౭౨; 9. ఏని, ఐన అనునర్థమును దెలుపును. "క. భీమార్జునులకు రణమున నేమగలను బ్రతియె." భార. ఉద్యో. ౧, అ. ౨౮; 10. కొన్ని ప్రత్యయములకును కొన్ని అవ్యయములకును అంతాగమముగా వచ్చును. ఉదా:-రామునిచేతను, వలెను. మొ.; 11. వృత్తియందు కొన్నియెడల ఆగమముగా వచ్చును. ఉదా:-తలకుంజెక్కులు, తెల్లందనము. మొ.; 12. కల అనుబంధము పరమగునపుడు పడు అనుబంధము పరమగునపుడును ధాతువునకు వచ్చు ఆగమము. ఉదా:-చేయఁగలఁడు, చేయఁబడెను;

13. ప్రథమాంతము లగురవస్త్వద్వివేశణములకు ప్రాయికముగా నగు అంతాగమము. ఈయాగమము పరమగునపు డుత్వమున కత్వ మగును. ఇది లపై దీనికి 'ని' వచ్చును. ఉదా:- నేను ధన్యుండను. నేను సుకృతిని. నేను స్త్రీని.

నుంకు. దే. వి. పస్తు, ఉపవాసము. "సీ. ప స్తిల్లి నుంకు నిప్పస్తు ని ట్రనఁగను నుపవాససంజ్ఞయై యొప్పుచుండు." ఆం. భా. ద్వి. ౧౭౯.

నుంజె. దే. వి. సొగటాలపలక. "సీ. పనిగిండి చిటికెన పావురాల్ సొగటాలు నుంజలు గొరవంక పంజరంబు." ప్రబంధ. ౯౨౩.

నుక్కుటు. దే. వి. 1. బాధ. "ఉ. ఘోరతరానన స్ఫురితకోపులునై యమదూత లానరుం, జేరినఁ గాంచి మై నడఁకఁ జేష్టలు వైకృత మందఁ బల్కుటన్, నోరును గన్నులుం దెఱచు నుక్కుటయై. వెగ డగ్గలింపఁగన్." మార్క. ౨, ఆ. ౩౮; 2. కదలియాడుట, అసియాడుట. "ద్వి. చెక్కుల సన్నంపు సేమ రెక్క నడుము,నుక్కుట నొక్కింత నూగారు దోఁప, నలరుపయ్యెద జాఱ నలకలు చెదర..." ద్వి. హరిశ్చ. ఉ. ౯౧౦. పం.

నుగ్గడుచు. దే. స. క్రి. (నుగ్గు+అడుచు.) నలఁగఁ గొట్టు. "సీ. ఎక్కుడు వలనైనయెడ లడ్డగించిన చఱుల నుగ్గడుపుడు..." హరి. ఉ. ౧, ఆ. ౭౩.

నుగ్గాడు. దే. స. క్రి. (నుగ్గు+ఆడు.) 1. నలఁగఁ గొట్టు, పొడిచేయు. "మ. భటులన్ గీటడఁగించి ఘోటకములన్ భర్జించి భద్రేభరా, ట్ఘటలం జెక్కులుచేసి సైనికశతాంగశ్రేణి నుగ్గాడి..." రా. వి. ౫, ఆ. ౧౪; 2. వధించు, చంపు. "సీ. నుగ్గాడెఁ బరిమార్చె నురివెను దెగటార్చెఁ జదిపెఁ జంపెను సదమద మొనర్చె." ఆం. భా. తృ. ౧౨౩, భా. రా. అర. ౨, ఆ. ౩౩౩; 3. ధ్వంసముచేయు. "సీ. వనలులాయము లిక్షువనము నుగ్గాడినపగిదిఁ గాల్వుర నేలపాలు చేసి." కు. సం. ౧౧, ఆ. ౧౩౭, రా. వి. ౨, ఆ. ౯౫; 4. ఖండించు. "ద్వి. నీతలల్ నుగ్గాడి నిను సంహరించి, సీతఁ దోడ్కొని పోవు సిద్ధ మీపలుకు." రం. రా. సుం. ౩౯౯. పు. ౭. పం.

నుగ్గించు. దే. స. క్రి. తిట్టు. "మ...తల్లి నున్నార్గు నుగ్గించి మోహమునకుం దైన్యము కొంత తెచ్చి కొని దంభుల్ చూపి యువ్విళ్లు నొయ్యన డాయం జని యిట్లు పల్కెను రహస్యాలాపరూపంబునన్." విప్ర. ౪, ఆ. ౭౬.

నుగ్గు. దే. అ. క్రి. నలఁగు. "చ...మా, కఱచిన కాట్లకున్ శిశువుకాయము తోలును నుగ్గ దేమియున్." నృసిం. ౪, ఆ. ౪౩. (శ. ర. పా.) వి. 1. చూర్ణము, పొడి. "గీ. నురుము నుగ్గు పొడుము పొడి నురుము నుస్ని, చూ రనంగను విలసిల్లుఁ జూర్ణ మభిధ." ఆం. భా. ద్వి. ౨౯౯, భార. ఆది. ౭, ఆ. ౭౮; 2 ఖాడము, ముక్క. "చ. తేరిపై, నొగనొగ దాఁకఁగాఁ బఱపి నుగ్గుగఁ గౌరవహూతు నేసి..." భార. భీష్మ. ౨, ఆ. ౩౩౧, దశా. ౧, అ. ౧౯౬; 3. సమూహము. "ఆ. ఉగ్రభానుసుతుఁడు నగ్రభాగంబున, బలిముఖాధిపతులు పన్ని నడువ, వెనుకఁ దాను గదలె వెన్నుబలం బయి, నూఱుకోట్లకపులనుగ్గలలవు." రామా. ౭, ఆ. ౨౭౫, బ. పిడుకలు. (శ. ర. బా.)

నుగ్గుచేయు. దే. స. క్రి. (నుగ్గు+చేయు.) ముక్కలు సేయు; పొడిచేయు. "గీ. యోధసారథియుగ్య సంయంతము గాఁగ, నూఱురథములు వ్రేల్మిడి నుగ్గుచేసె." భార. విరా. ౩, ఆ. ౧౭౨.

నుగ్గులువాఱు. దే. అ. క్రి. (నుగ్గులు+పాఱు.) పొడియగు. "ద్వి. కలయఁ బర్వెడుభవద్దరశకాలాగ్నిఁ, గులగిరు లైన నుగ్గులువాఱఁ గాలు." ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౬౬. పం.

నుగ్గుసేయు = నుగ్గుచేయు. (చ:పు.) "చ...లేరికి సారథి కమ్ము నాకుఁ జిచ్చుఱపిడు గెట్టు లట్టడరి కౌరులమొత్తము నుగ్గుసేసెదన్." భార. విరా. ౫, ఆ. ౭౩. (ఇట్లే: నుగ్గుల్ సేయు." దశా. ౨, ఆ. ౪౦౬.)

నుచ్చిలి. దే. వి. నురుఁగు, ఫేనము. "శా. నోర నుచ్చిలి గ్రమ్మ కుండ...కన్ను ల్తారకాబింబసంచారవ్యాప్తి నధఃకరింప హృదయస్థానంబు గంపింప..." హర. ౨, ఆ. ౭౩, శివరా. ౪, ఆ. ౪౮.

నుచ్చు. దే. స. క్రి. నుచ్చుపొఁతలు చుట్టు. (శ.ర.) వి. గొఱ్ఱెలయొక్కయు మేఁకలయొక్కయు పెంటిక. "వ...వెల్లిగొయ్యలు ద్రచ్చి నుచ్చులంటించినం బెచ్చు పెరుఁగుచిచ్చు లాత్రంపులం దవిలించి..." స్వా. ౪, ఆ. ౬౦.

నుచ్చుకోక. దే. వి. (నుచ్చు+కోక.) గొఱ్ఱెలయు మేఁకలయు చన్నులకు చుట్టెడుగుడ్డ. "ద్వి. ములు గత్తి నుచ్చుకోకలుఁ జూఁడుఁగోడుపు, మొల తిత్తి నిడి దొడ్డమొలకచ్చ గట్టి." బస. 3, ఆ. ౧౧౧౮, పం.

నుచ్చుప్రాఁత. ద్వ. వి. (నుచ్చు+ప్రాఁత.) గొఱ్ఱెలయు మేఁకలయు చన్నులకు చుట్టెడుగుడ్డ. "సీ. ఒడిసెల పాలకావడి నుచ్చుప్రాఁతలగుది మూఁపుపై వ్రేలుగోర్పడంబు." వేం. పంచ. ౧, ఆ. ౫౯౮.

నుజ్జు. దే. విశే. ఖతి నొందినది. "ఉ. అంటినఁ గందునో యనక యంగము నిర్దయ వృత్తి మీఱఁ గాఁ, గింటికిఁదార్చి నుజ్జుగనొ కెంజిగురట్టిది సాకమోవిఁ బల్గంటు లొనర్చి..." ఉ. రా. ౭.ఆ. ౪౭౭.

నుడి. దే. వి. 1. మాట, పలుకు. "మ. దశకంఠుండనుఁ దాత! నీనుడి యథార్థంబైనచో నెంతబాలిశుఁడైనక నయ మేది యగ్రజుని బల్మిం ద్రోచి దుర్వృత్తిఁ దద్వాకమా నిల్లెటు లాక్రమించు..." ఉ. రా. ౨, ఆ. ౨౭౬; 2. అపప్రథ. "క. పుడమి నపప్రథయగునెడఁ, బడఁతికి దేహంబు విడువఁ బాడియ కాదే, నుడికంటెఁ జావు మేలను, నుడువు పురాతనము కాదె నూతనపదమే." భో. ౭, ఆ. ౧౫౬. (శ. ర. పా.)

నుడికారము. ద్వ. వి. (నుడి+కారము - స్వార్థమున.) 1. మాట, పదము. "సీ. నుడుగు నుడువు నుడికారము నొవు నొడి నొడికారము నొడుగు నాఁగఁ, బదమొప్పు .." ఆం. భా. ప్ర. ౧౧౧. కాశీ. ౨, ఆ. ౧౯౨; 2. (మాట మొదలగు వానియందలి) సొగసు, సరసత్వము. "గీ. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాషయం దు, పలుకు నుడికారమున నాంధ్రభాషయందు,రు ..." భీమ. ౧, ఆ. ౧౫; 3. పలుకుబడి, రచనము. "గీ. ఆపురాణంబుగనఁ దెనుఁ గయ్యె నేని, జెప్ప నేర్చిన కవియుఁ బ్రసిద్ధుఁడేనిఁ, దెనుఁగు నుడికారమున మించు గనియె నేని, గుంపనము కమ్మవలచిన చందమగును." శై. ౧, ఆ. ౧౮. విశే. సరసమైనది. "చ ...నీవుపల్కు నుడికారపు మాటలకెల్ల నాతఁ డ్యాడును విరసంపుఁ బల్కులు గడక మఱి మోసమువచ్చు నత్తఱిన్." శుక. 3, ఆ. ౩౯౦.

నుడిపడఁతుక. దే. వి. (నుడి+పడఁతుక.) సరస్వతి. వేంక. దేవ. ౭.

నుడుగు. దే. స. క్రి. 1. వచించు, చెప్పు. "క. నుడిగి రహస్యోక్తులు..." బహు. ౫, ఆ. ౯౯; 2. జపించు. "సీ. మదనాహితుని నామమంత్రంబు నుడుగువాఁ డొడికంపుఁబాములఁ బొడుగు వాఁడు." భల్లా. ౨, ఆ. (శ ర.) వి. మాట, పలుకు. "క. ఉడుపతి మకుటుండు చెవుల నొనరని నుడుగుల్, నొడివిన......" భీమ. ౨, ఆ. ౧౫౪. వసు. ౪, ఆ. ౭౩.

నుడుగుపడఁతి. దే. వి. (నుడుగు+పడఁతి.) సరస్వతి. వేంక. దేవ. ౯౯.

నుడుగుపడఁతిమామ. దే. వి. (నుడుగుపడఁతి+మామ.) విష్ణువు. వేంక. దే. ౧౯.

నుడుగుతేఁడు. ద్వ. వి. (నుడుగు+తేఁడు.) బృహస్పతి, గీష్పతి. "సీ. అరయవేల్పులకెల్ల నయ గారనందగు నుడుగుఁ తేనికిఁ గూర్మి కొడుకుఁగఱ్ఱ." య. 3, ఆ. ౩౧.

నుడుగులచెలి. దే. వి. (నుడుగు+చెలి.) సరస్వతి. "సీ. జగములమూఁటిపై జంగఁ జాచినజాఁగ నుడుగులచెలిమామ యడుగుఁజెమరు." య. ౨, ఆ. ౪౪.

నుడుగువాలు. దే. వి. దేవత, వేల్పు. "సీ. నుడుగు వాల్గమిమైల గడుగువారిమెఱుంగు లుడుగు వాఁఱని వ్రేలి మడుగువాఁడ." ప్రబంధ. ౨౧౭.

నుడువరి. దే. విశే. (నుడువు+అరి) మాటలమారి, వాచాలుఁడు. (చూ. నుడువరితనము.)

నుడువరితనము. ద్వ. వి. (నుడువరి+తనము.) వాచాలత. "ద్వి. వడుగుచేసిన భక్తి పట్టిపాటుగునె, నుడువరితనమునఁ గడవ నాడెదవు." బస. పు. ౧, ఆ. ౪౫౪. పం. (శ. ర. పా. నొడువరితనము. ము. ద్రి. పా.)

నుడువు = నుడుగు. దే. స. క్రి. 1. వచించు, చెప్పు. "గీ. వాని సౌశీల్యగతి నుడువంగనౌనె, కవులకైనను మౌనిపుంగవులకైన." ఇందు. ౪, ఆ. ౧౬. ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౩౨. పం; 2. నేర్పు, బోధించు. "గీ. కూరిఁగొను నొజ్జ కాఁబోలుఁ గొదమచిలుక, తపసి బుడుతల గమికి వేదంబు నుడువు." కువల. ౨, ఆ. ౬౩; 3. చదువు, పఠించు. "క ...వి, వేళక వేదమునుడువున, లోలాత్ముం డుండు బ్రహ్మలోకమునందున్." జాహ్నవీ. 3, ఆ. ౬౦; 4 (అంకితమునగా)

రచించు. "క. యశము గలిగించు నీ మృదు, విశదోక్తులఁ బౌండరీకవిభుచరితఁ జతుర్దశభువన వినుతముగ శుభ, వశమతి నాపేర నుడువు వర తత్త్వనిధీ." పాండు. ౧, అ. ౨౫. వి. 1. మాట, పలుకు. "మధ్యాక్కర. నుడువులు వేయు నింకేల యిప్పాటినోములు తొల్లి, కడఁగి నోఁచితిని గా కేమి యనుచును గంధ డెందమున." భార. ఆది. ౪, అ. ౧౦౨; 5. లోకోక్తి, నానుడి. "క...నుడికంటెఁ జావు మేలను, నుడువు పురాతనముగాఁ నూతనపదమే." భో. ౭, అ. ౧౫౬. కాళిందీ. ౪, అ. ౨౯; 3. ఆజ్ఞ. "క. నడవడు నిలయము వెలువడి, తడవడు పరపురుషగుణముఁ దనపతినుడువుం, గడవడు......" భాగ. ౧, స్కం. ౨౫.

నుడువులనఁబోఁడి. దే. వి. సరస్వతి. "సీ. నుడువుల నఁబోఁడి జడియకు మని వెన్ను నఱచు ప్రాణేశు తిచ్చవడి చూచె." దశా. ౨, అ. ౫౫.

నుడువులపడఁతుక. దే. వి. సరస్వతి. "క. నుడువుల పడఁతుకకైనన్, దడవుల నిడుపనికినైనఁ దరమే యెన్నన్." అచ్చ. యు. ౫౫౦.

నుడువులతేఁడు. ద్వ. వి. (నుడువులు+తేఁడు.) బృహస్పతి. "గీ. వానికొలువంబు నుడువులతేని కైనఁ, బూని దిటముగ వాత్రువ్వఁ బోల దెందు." సీలా. ౨, అ. ౧౭.

నుతము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁబడినది.

నుతి. సం వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

నుతించు. సం. స. క్రి. పొగడు, కొనియాడు. "సీ. పరమేష్ఠియంచ యా గిరికోలంకులయంచపిండు లోఁ దప్పిన పిల్లయొక్కొ. గీ. యని నుతించుచు..." మార్క. ౧, అ. ౯౭. ద్వి. పరమ. 3, అ. ౧౬౨. పు.

నుతిక = నుతికె. (శ. ర.)

నుతికె. దే. వి. 1. తెగ, ముత్తము. (శ. ర.); 2. దండు, దళము. (బ్రా.) "ద్వి. నూఱేసి గుఱ్ఱాల నుతికెలు రెండు, పోఁజాలుగాఁ జేసి పదిలంబుచేసి." పల్నాటివీరచరిత్ర. ౩౦. (బ్రా.)

నుతియించు = నుతించు. "గీ. కాన నింద్రుఁడు ఫణిరాజులైనఁ గాని, యీనుదతియందమును నుతియింప లేరు." పార్వ. ౩, అ. ౯౫. వరాహ. ౪, అ. ౧౩౨.

నుత్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోయఁబడినది; 2. ప్రేరింపఁబడినది.

నుత్యము. సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁదగినది.

నుదత్. సం. శత్రు. 1. తొలఁగించుచున్న; 2. ప్రేరించుచున్న. [గించుచున్నది.

నుదమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁ

నుదుటికన్ను. దే. వి (నుదురు+కన్ను.) ఫాలాక్షము, శివుని తృతీయనేత్రము. "ఆ. నుదుటి కంటిమంట చదలంటి పర్వెడుఁ, గలసి తరతరంబ కప్పి కొనఁగ." కు. సం. ౧౦, అ. ౫.

నుదురు. దే. వి. బొ. నొసలు, లలాటము. "సీ. వదనంబు కొమరు భావనఁజేసి వేఱుగా నుదుటి వెంపలకలఁ బొదువఁబడఁగ." భార. విరా. ౧, అ. ౨౬౮. రం. రా. యు. 3 ౭౭. పు. ౨౬. పం.

నుద్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగింపఁబడుచున్నది; 2. ప్రేరింపఁబడుచున్నది.

నును. దే. విణ. (నునుపుశబ్దము కడవర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. వృత్తియందు హల్లు పరమైనపుడు దీని కడపటియచ్చునకు లోపము వైకల్పికము.) 1. నున్ననిది, స్నిగ్ధము. "ఉ.. నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం, జేరిచి బుజ్జగించి నునుఁజెక్కుల జాలుకొనంగ జాఱు కన్నీరు కరంబునం దుడిచి..." పారి. ౧, అ. ౧3౪. దశా. ౧. అ. ౧3౧; 2. మెత్తనిది, మృదువైనది "చ...కెంపు మీఱిన నునుఁబట్టుఁజేలఁ గటిఁజెంగులు వాఱఁగఁగట్టి......" పార. 3, అ. ౬౯. స్వా. ౫, అ. ౭౫; 3. లేఁత. "సీ. నునుఁదీవె నురఫొన్నఁ బెనఁగొన్నఁ గనుఁగొని ప్రాణేశుఁ గౌఁగిలింపఁగఁ దలంచు." దశా. 3, అ. ౧౭. స్వా. 3, అ. ౧౨; 4. అల్పము. "సీ. నునునవ్వు నవ్వనోపని మృదుస్వనలిటువలె నట్టహాసముల్ సలుపు రెట్టు." వరాహ. ౧౧, అ. ౯౬. పారి. ౫, అ. ౧౦3; 4. సాంద్రము. "ఉ. ఎక్కడనుండి వచ్చెఁ దరకేతకిరేణుకమ్ సును సిగ్గు దొంతరల్." విజ. ౧,అ. ౧౦౪; 5. మనోజ్ఞము. "చ...చందురు నునుసోఁగ వెన్నెలలతోఁ దులదూఁగెడు తద్గుణంబులన్." శైవ.౧, అ. ౪౮, దశకు. ౩, అ. 33.

నునుపరి. దే. విణ. (నునుపు+అరి.) నునుపుకలది. (శ. ర. బ్రా.)

నునుపు. దే. వి. 1. నున్నన, స్నిగ్ధత్వము. "వ... పారిజాతపూగావళీకోమల పలాశశ్రోణికలనునుపు గల పొరలయూరల శరధితరఁగలమీఁదనుం బోలె కెటికొని ...", స్వా. 3, ఆ. ౨౮; 2. మనోజ్ఞత, సొంపు. "గీ. నునుపు దళుకొత్తఁ బలుకులు నుడువ వేమి" సీలా. ౨, ఆ. ౦౦, ద్వా. ౪, ఆ. ౧౦౫. విశే. 1. నున్ననిది, స్నిగ్ధము. "చ నునుపగు పచ్చపట్టునఁ గనుంగొన నొప్పఁగఁ దిండు గట్టి. ..." పారి. పూ. ౬, ఆ. ౧౭౮, కు. సం. ౮, ఆ. ౪౯; 2. మనోజ్ఞము. "క. నునుపగు నలిగానము విని, వనదేవత కరము మెచ్చి..." కు. సం. ౪, ఆ. ౯౬.

నున్న. దే. వి. 1. నున్నని ఉమ్మక. (శ. ర.) 2. నున్నఁదనము, స్నిగ్ధత. "సీ...: తేటనున్నన నున్న తెలివి నునుపు. గీ. నిద్దమనస్నిగ్ధత కెనంగు .." సాం. ని. స్థా. ౬౦, విశే. (దీనికి కర్మధారయమందు నిగాగమము బహుళము.) 1. నునుపైనది, స్నిగ్ధము. "సీ. కురులు నున్ననఁగ దువ్వి కొప్పుఁబెట్టిన నీటు గనఁగొన్న మోహాంధకార మెదవు." ఉ. రా. ౪, ఆ. ౧౯౭; 2. మృదులము. "వ...అమ్మ దాంధగంధ సింధురంబు...తుండంబెత్తి నున్నని యప్పుప్పుదండ గ్రమ్మనఁ గ్రమ్మరించి విసరి..." హరి. ౬, ఆ. ౧౬, వరాహ. 3, ఆ. ౯౨; 3. మనోజ్ఞము. "సీ. మలదాయ రానున్న మలపు కీల్పులు దిండి పెఱరాపతిమ కాలిపెండె మమర." చంద్రా. ౨, ఆ. ౩౬; 4. సుఖకరమైనది. "ఉ. సువర్ణడోలికాం, దోళనఖేలనంబులను నున్నని నిద్దుర సోలగింప నా, బాలికఁ బాడుచుండుదురు పాటలగంధులు జోల పాటలన్." విప్ర. ౨, ఆ. ౩౦; 5. అల్పము. (చూ. నున్నగాలి.)

నున్నఁదనము. ద్వ. వి. (నున్న+తనము.) మార్దవము, మెత్తన. "ఉ. ..నున్నఁదనంబుగా నలుఁగు నూఁటియుఁ జందనమట్టు రాచియుం, బన్నుగఁ గ్రొత్తలైనకలుపంబులు గూర్చియు..." భార. విరా. ౨, ఆ. ౨౨౧.

నున్నగాలి. దే. వి. (నున్న+గాలి) మందమారుతము. "చ...నున్నగాలికి జాల పైన పుప్పొడిబోదలే బోదలే పులకింప..." కావ్యా. ౨, ఉ. ౬౭.

నున్నన. దే. వి. నున్నఁదనము, స్నిగ్ధత. "సీ... తేట నున్న తెలివి నునుపు. గీ. నిద్ద మన స్నిగ్ధత కెనంగు..." సాం. ని. స్థా. ౬౦, విశే. నున్ననిది, స్నిగ్ధము. "మ. ఉడుమార్గం బఖిలంబు నున్ననయి శాణోత్తేజనం బొంది పుల్లడుగం బడ్డనిశాతఖడ్గముక్రియం గన్పట్టె నప్పట్టునన్." హర ౨, ఆ. ౨౫, ఆం. భా. ద్వి. ౨౫౨.

నున్నము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తోలఁగింపఁ బడినది; 2. ప్రేరింపఁబడినది.

నుయి. దే. వి. బావి, కూపము. (దీనికి ప్రథమైక వచనమందే ప్రయోగములు గన్పట్టుచున్నవి. "శా...నుయి దాఁటేవానికిన్ జింతయా,కం తైనం గడమేనియుం గడమ కారా యంచు నూహించుచున్." పాండు. ౪, ఆ. ౨౦౫.

నుయ్యి=నుయి. "క. వాలినదప్పి వియజ్జ్యోర,కూలంబున నుయ్యి ద్రవ్యపుమతి గలిగినన్, శ్రీలలనా విభుఁ డుండని, నేలయు క్షేత్ర మనియురుగు నీచుఁడు గలుగున్." పాండు ౫, ఆ. ౬౨, విజ్ఞా. వ్యవ. ౧౫౧.

నురుఁగు. దే. వి. ఫేనము. "సీ. కొడుకు రాఁగలఁ డంచుఁ గడుఁ బొంగువాహినీవరుని యూర్మల మించు నురుఁ గనంగ." ఉ. రా. ౪, ఆ. ౧౫౦. ఆం. భా. ప్ర. ౧౫౪.

నురుఁగుకొను. దే. అ. క్రి. (నురుఁగు+కొను.) నురుఁగు కట్టు. "వ...లాలావినిర్యాసంబులు సెలవుల నురుఁగుకొన..." కవిక. ౫, ఆ. ౧౧౦.

నురుఁగుదబ్బ. దే. వి. (నురుఁగు+దబ్బ.) కొరిజము, కడుపులో కుడిప్రక్క నుండు మాంసఖండవిశేషము. (శ. ర.)

నురువు. దే. వి. ఫేనము, నురుఁగు. "క. ఆపాలనురువు పవన,వ్యాపారముచేతఁ దెరలి వచ్చి నిలిచె లీ, లాపింఛచ్ఛవిభర్త్సిత, తాపింఛమదయ హరి కటిచెంగుచలితుచా." పాండు. ౪, ఆ. ౧౯౨, ఆము. ౪, ఆ. ౧౭౫.

నుర్గాడు. దే. అ. క్రి. (నుర్గు+ఆడు.) నుగ్గగు. "శా. భర్గుం డంతకవాహినుల్ శరహతిన్ భంజించున ట్లెమ్మెయిన్, దర్గంగా రథపత్త్రముల్ విఱుగవే దండాంతరానీకముల్ నుర్గాడన్..." కు. సం. ౧౧, ఆ. ౩౩.

నుర్గు=నుగ్గు. (చూర్ణము, పొడి.) "క. నుర్గై విశ్వేశ్వరదోఃర్గళహతిఁ జన్నరిపులనగు వినుతింపన్." కావ్యా. ౭, ఉ. ౭౯.

నుర్వు=నుర్గువు. "చ. జలధి మథింపఁగాఁ బొడమెఁ జంద్రమయం బగునుర్వుముద్ద..." కాళింది ౪, ఆ. ౭౦, అచ్చ. కిష్కిం. ౬౬.

నుఱిచియాడు. దే. స. క్రి. (నుఱుచు+ఆడు-స్వార్థమున) సంహరించు. "సీ. ఆమేటి తనను సైన్యమును బద్మవ్యూహభంగిఁ జూపట్టంగఁ బన్ని పాలిక, రథప్రహారప్రవర్తనలచేఁ జీకాకుపఱుచుచుఁ గడుఁ జొచ్చి నుఱిచియాడు, వీర కుంజరు..." రాఘవ. ౪, ఆ. ౧౪౨.

నుఱిపిడి. దే. వి. ధాన్యము మొదలగువానిని కాళ్లు మొదలగువానితోఁ ద్రొక్కి నలుపుట. "వ... నుఱిపిడికిం జొచ్చినప్రబలహాలికునిలీల నేలం బెట్టి కాలం జమరి చంపి పొంపిపోవ్వమగంటిమిం బేర్చి యార్చిన..." భార. ద్రో. ౩, ఆ ౨౬౯.

నుఱుచు. దే. స క్రి. 1. ధాన్యాదికమును గాళ్లతోఁ ద్రొక్కి నలుపు. "ఆ. కాలినడలు లంకపాలికిఁ దెచ్చిన, మేటిఁ గూడి యుక్కుమిగిలి తగిలి, ముంచి నుంచి దంచి చించి నొంచి కలంచి, కఱిచి విఱిచి చఱిచి నుఱిచి రటులు." రామా. ౭, ఆ. ౨౪౫. మార్క. ౨, ఆ. ౧౦౦; 2. నశింపఁజేయు. "సీ కరిసింహశార్దూలశరభాది మృగముల నుగ్గునూచంబుగా నుఱుచునవియు." కళా. ౬, ఆ. ౧, ప్రభా. ౫, ఆ. ౧౭౪.

నుఱుపు. దే. స. క్రి. 1. ధాన్యాదికమును కాళ్లతోఁ ద్రొక్కి నలుపు. "గీ. నుఱిపి తూర్పెత్తి కడలకు బిఱుసు దిగిచి, గండ్రలుగఁ జేసి రాశి పొంకముగ నిలిపి." శివధ. ౫, ఆ. ౯; 2. ధ్వంసముచేయు. "సీ. శస్త్రభూషణసముచ్చయములు నుఱుపంగఁ గడలొత్తు వలుఁద క్రేంకారములును." హరి. ఉ. ౭, ఆ. ౨౦౯; 3. చంపు, వధించు. "సీ... నిఖిలబలము. గీ. నుఱిపి నెత్తురుటేఱులు పఱపి భీమసేన మాయన్న బకుని నాలేనిచోట, నట్లు చేసితి గాక నీయలవుఁ జలము, నింక మెఱయంగ వచ్చునె యేను గలుగ." భార. ద్రో. ౩, ఆ. ౨౫౯, హరి. పూ. ౬, ఆ. ౧౯౭; 4. ఖండించు, నఱకు. "లయవిభాతి. తఱిమి వెస రక్కసుల వెఱచఱవఁ బట్టుకొని, పరిపరిగ వే తలలు నుఱిపి యవలీలన్." భా. రా. యు. ౧౪౩౭.

నుఱుమాడు. దే. స. క్రి. (నుఱుము+ఆడు.) 1. పొడిచేయు. "ఉ. కొన్నిటి నప్పళించుకొని కొన్నిటి నుఱుమాడు..." భార. సౌ. ౧, ఆ. ౧౮; 2. చంపు, వధించు. "క. ఉఱక విరాటుబలము పై, గొఱియలపిండునకుఁ గవిసి కొల్పులిక్రియ బిట్టుఱఁ గవిసి నదీసూనుఁడు, నుఱుమాడె వియచ్చరులు విస్మితిసేయంగన్." భార. భీష్మ. ౧, ఆ. ౨౯౬, ఆం. భా. తృ. ౧౨౩; 3. ఖండించు. ముక్కలుచేయు. "సీ. వెస ఱంప మున నిడ్డ పసిగఁ గొన్నిటి నినుమంతలుగా నుఱు మాడియాడ." భార. విరా. ౫, ఆ. ౩౫, భా. రా. సుం. ౩౩౩.

నుఱుము. దే. స. క్రి. 1. పొడిచేయు. "చ... మఱితఱి విభీషణుండు ..దైత్యులన్, నుఱుముచు రూపుమాపుచును నొంచుచుఁ ద్రుంచుచుఁ జేర్చి కంఠముల్, నఱకుచు నొక్కపెట్ట రణమందునఁ గూల్చె సుదగ్రమూర్తి యై." భా. రా. యు. ౧౩౬౭; 2. చంపు, వధించు. "సీ... దక్షుఁడు దూషింపఁ దక్షిణంబునఁ గొట్టి నుఱుముట దలఁచిన వెఱపు రాదొ." పార్వ. ౪, ఆ. ౧౦౯; 3. పీడించు. "కళిక. నఱిమి తఱిమి చఱిమి నుఱుమునకుఁ గెల్చినవితకరికి." అప్ప. ౪, ఆ. ౩౨. వి. చూర్ణము, పొడి. "సీ. అద్దానవులు దారుణాశ్మవర్షమ్ము పైఁ, గురిసిన నవి నన్నుఁ దెరలఁ గప్పెఁ, నేను గులిశాస్త్ర మేసి పాషాణముల్, నుఱుము గావించితి..." భార అర. ౪, ఆ. ౬౧, భార ఆది. ౬, ఆ. ౧౬౧, ఆం. భా. ద్వి. ౨౭౦. [భా. తృ. ౧౨౩.

నుఱుముచేయు = నుఱుముసేయు. (చంపు.) ఆం.

నుఱుముసేయు. దే. స. క్రి. (నుఱుము+చేయు.) 1. చంపు. "ఉ. వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ వ్రేసి యందఱం, జేతులతీట వో నుఱుము సేసె విశృంఖలవిక్రమంబునన్." భార. విరా. ౩, ఆ. ౨౧, నీలా. ౧, ఆ. ౩; 2. పొడిచేయు. "సీ. ఉర్వీధరంబు లొండొంటితోఁ దాఁకించి నుఱుము సేతుసుమీ మనోవసంత." చెన్న. ౫, ఆ. ౧౮౦. భా. రా. అర. ౧, ఆ ౨౦౩.

నులక. దే. వి. (నులుచు+ధా.) నారతో పేనినదారము, త్రపుస్సూత్రము. "సీ...చెలఁగుఁ ద్రపుస్సూత్రంబు నులక యనఁగ." ఆం. భా. ద్వి. ౨౯౫.

నులకమంచము. ద్వ. వి. (నులక+మంచము.) నులకతో నేయుమంచము. "ఆ. మలిన మైన సేత

పలుచనైనను నల్లు, లున్న నులకమంచ మెుప్ప దంద్రు." వి. పు. ౪, ఆ. ౨౧౯.

నులకశయ్య. మి. వి. (నులక+శయ్య.) నులకమంచము. "మ. అహాహా బ్రహ్మము వారయే నులకశయ్యం బ్రెల్లి నిద్రింతురో." శివరా. 3. ఆ. ౯.

నులి దే. వి. (నులియు ధా.) మెలిక, చిక్కు. "సీ. కౌస్తుభోజ్జ్వలపదకంబునం బెనంగొన్న చారుహారము నులి చక్కంజేసి." హరి. పూ. ౫, ఆ. ౯, భాగ. ౧౦, స్కం. ఉ. ౨౪౨. విశే. 1. అల్పము, చిన్నది. "సీ. బలుగోడలం బొసంగు నులిపచ్చ పగడంబు బారుదూలంబులవార మాను, పులుదిండి బ్రాకంబములగరిమంబు .." ఉ. రా. ౬, ఆ. ౭౨౭; 2. మెలికలు గలది. "ద్వి. పులిగోరు సేవళంబులు సందమైన, నులికడియంబులు నూపురంబులును." నవ. ౪, ఆ. ౧౮౬. పు.

నులించు. దే. స. క్రి. (నులియు. ధా. ప్రే.) నులియంజేయు, నులుపు. "ఉ... తానును దైత్యులావునకుం దద్దయుం మెచ్చుచుం జేర్చి దేవకీ, సూనుఁడు కొమ్ములూఁది మెడ సుక్కంగ నెత్తి నులించి త్రిప్పి వే,వేసెఱిఁ దప్పఁ ద్రోచుటయుం. ..." హరి. పూ. ౮, ఆ. ౫౦.

నులికొమ్ముమెకము. ద్వ వి. ఇఱ్ఱి, మగజింక. "సీ... నులికొమ్ముమెక మన వెలయుఁ గృష్ణమృగంబు..." సాం. ని. తిర్య. ౭౪, ఇఱ్ఱే నులిగొమ్ములమెకము. ఆం. సం. తిర్య. ౬

నులిగాయ. దే. వి (నులి+కాయ ) దృష్టిదోషము గాలిసోకు మొదలగునవి కలుగ కుండుటకు కట్టెడి కాయ, దిష్టిపూస. "గీ. త్రాట నులిగాయఁ గూర్చి పాదములఁ గట్టు, నుప్పు వేఁపాకు పైఁ జల్లు నిప్పు లలివ, ద్రిప్పి యిడుదృష్టిదోషంబు దీఱ వీథిఁ, బ్రేమ మీఱంగ బిడ్డలఁ బెంచునపుడు." కాశీ. ౪, ఆ. ౧౧. అ. మ. క. ౧, ఆ. ౨౬. పు.

నులిగొను. దే. అ. క్రి. (నులి+కొను.) 1. చిక్కుపడు. "సీ. నులిగొన్నచెలఁదిపుర్వులనూలివఱ్ఱునా నమరెడుముడుతకన్బొమలవలన." కళా. 3, ఆ. ౮3. శుక. ౧, ఆ. ౨౮౭; 2. చుట్టుకొనంబడిన దగు, వలయిత మగు. "క... పెనగొనె గిఱికొనియెను...,నులిగొనె నన నాఖ్యలగును వలయితమయ్యె ననుటకును..." ఆం, శే. ౬౭,

నులిగొల్పు. దే. స. క్రి. (నులిగొను ధా. ప్రే.) మెలివెట్టు. "ద్వి. ముదురుజుంజురుమీసముల నులిగొల్పి." ద్వి. హరిశ్చ. పూ. ౨౦౬౨. పం. చంద్రా. ౬, ఆ. ౮.

నులిజెముడు. దే. వి. (నులి+జెముడు.) చిన్న జెముడుచెట్టు. "సీ నల్లేరునులిజెము డాకుజెముడు." హంస. ౪, ఆ. ౧౦.

నులితడ. దే. వి. మహాబలచెట్టు. "గీ ..గూబతడ నులితడ, యన మహాబల దనరు వృషాధిరూఢ." ఆం. భా. ద్వి. ౫౬.

నులిపచ్చి. దే. విశే. (నులి+పచ్చి.) కొంచెము తడిసినది. "ద్వి. పనుపడ నులిపచ్చి పయ్యెద కొంగు, మొనల పానిన కుచముల నొప్పు దాని." ద్వి. పరమ. ౪, ఆ. ౨౯౨. పు.

నులిపడు. ద్వ. అ. క్రి. (నులి+పడు.) దోఁపుడుపడు. "ఆ. దోఁపువారె నసుట దోఁచు నులిపడె ననంగ..." ఆం. భా. తృ. ౧౧౬.

నులిపురుగు. ద్వ. వి. (నులి+పురుగు.) కడుపులోఁ బుట్టుచిన్నపురుగు. (బ్రౌ. వా.)

నులిబిల్ల. దే. వి. (నులి+బిల్ల.) చిన్న దైనయొక రకమునీటిపురుగు. "సీ. నులిబిల్ల యేఱుబిల్ల పురుగు గోఁదురుకప్ప...ఎండ్రకాయఁ జలగ." హంస. ౪, ఆ. ౧౮౬.

నులియు. దే. అ. క్రి. 1. పొడియగు. "వ...మిడియు ప్రేళ్లును నలియుకన్నులును నులియఁ వెన్నులును జదియుచెక్కులును .." చంద్రా. ౬, ఆ. ౯3; 2. చలించు, అల్లలాడు. "చ. వెరవున నంగముల్ నులియుప్రేటుల నిమ్ముగఁ దాఁకినప్పు..." భార. శల్య. ౧, ఆ. ౧౭౬. (శ. ర. పా. నుసులు ముద్రి. పా.) కృ. శతం. 3, ఆ. ౭౫.

నులివంక. ద్వ. వి. (నులి+వంక ) 1. పల్లకిబొంగు యొక్కదోషవిశేషము. "వ ..నులివంక యగ్గిసోఁకుడు .....మొదలుగాఁ గల దుర్గుణంబులు లేక..." ప్రబంధ. ౬౦౫.

నులివడు = నులిపడు. మెలికపడు. "చ. నులివడి వారిదాళి నళనుల్ తలదూర్చుట...బౌర్వమబ్ధిలో నిలుచుట ...గ్రీష్మకాలసం,వలదురుతాపమోర్వక ..."కాళిందీ. ౨, ఆ. ౧౦౮. పారి.౪,ఆ. ౧౩.

నులివాడు. దే. అ. క్రి. (నులి+వాఁడు.) కొంచెముగా వాడు "సీ. నులివాడు నాఁచువల్లుల గొంతో"

గర్భి:లేఁబోల వల్చుగాలి తే పోక యొదిగి." ఆము. ౨, ఆ. ౫౩.

నులివాల్డువాడు. దే అ. క్రి. కొంచెమువాడు. "క. నులివాల్డువాడుచున్నవి, లలిత మహాతరుణదేహ లతికలు .." విక్ర. ౫, ఆ ౩౭.

నులివు. దే. వి. 1. నులియుంట. (శ. ర); 2. ఆభరణ విశేషము. "ద్వి. చంద్రాస్య యోర్తు, తనకేలి నులివుమధ్యమునఁ బొంకించి, యరుచెంచి..." ద్వి. పరమ. ౫, ఆ. ౪౪౧. పు; 3. విధము, రీతి. "ద్వి ..వాఁడు నారీతి నొందు, నుడువ నేరక మూఁగ నులివున నున్న." ద్వి. పరమ. ౨, ఆ. ౧౨౭. పు.

నులివెచ్చ. దే. విశే. (నులి+వెచ్చ.) కొంచెము వెచ్చనిది, కదుష్ణము. "చ. తెలినులివెచ్చయోగిరముఁ దియ్యనిచారులుఁ దిమ్మనంబులున్." ఆము. ౧, ఆ. ౭౧. ఆం. భా. ప్ర. ౭౩.

నులివెట్టు. దే. స. క్రి. (నులి+పెట్టు) 1. మెలి పెట్టు. "చ. అన విని నవ్వి యవ్వికసితాంబుజ లోచన పైఁటకొంగు కేలున నులివెట్టుచుం దళు కుబుక్కునఁ జూపులఁ జూచి......" శుక. ౨, ఆ ౪౯. భాగ. ౧౦, స్కం. ఉ. ౫౪౪; 2. గ్రుచ్చు. "మ. ధర గంపింప మహాసభాభవన రత్నస్తంభసంభూతుఁ డై, కరజంబుల్ నులివెట్టి రక్తకణముల్ గాఱంగ వీక్షించి...చెండాడెన్ నృసింహాకృతిన్." వరాహ. ౭, ఆ. ౨౭.

నులివేఁడి. దే. విశే. (నులి+వేఁడి) కొంచెమువెచ్చనిది. "చ...ఓరి మనుజాధమ నిచ్చలుఁ దెచ్చు వంటకం,బును నులివేఁడికూరలు నపూపములున్ గొనిరా కహంకృతిన్." విక్ర. ౫, ఆ. ౨౧౯. భీమ. ౩, ఆ. ౩౭. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭. పం.

నులుచు. దే. స. క్రి. (నులియు ధా. ప్రే.) 1. చంపు, వధించు. "సీ...మురియించె నులిచెను .. గీ. వధించె, ననుటకు సమాఖ్యలు..." ఆం. భా. తృ. ౧౨౩. వరాహ. ౧, ఆ. ౫౨; 2. మెలి పెట్టు. "సీ మొలకచ్చకట్టుపై మలఁగినపచ్చని నునుకొంగుదిండుగా నులిచి చుట్టి."హరి. పూ. ౭, ఆ. ౧౩. భార. భీష్మ. ౧, ఆ. ౨౦౪.

నులుపు. దే. స. క్రి (నులియు ధా. ప్రే.) నలఁగఁ గొట్టు, నలఁగఁజేయు. "ఉ. కొన్నిటికంఠముల్ నులుపుఁ గొన్నిటికాళులు ద్రుంచు...అన్నిటి నయ్యుల్కాకము రయం బెసఁగన్ వధియించె భూవరా." భార. సా. ౧౭. ఉ. రా. ౨, ఆ. ౬౦. వి. పన్నగడ.

నులుము. దే. స. క్రి. (నులియు ధా. ప్రే.) 1. మెలి పెట్టు. "సీ. ధూర్జటి నే మనిదూషించితి వటంచుఁ బువ్వుఁబోణి యొకర్తు బుగ్గ నులిమె." పార్వ. ౪, ఆ. ౧౨౧. సీరా. ౩, ఆ. ౭౪; 2. నలుపుకొను. "సీ. కాటుక నెఱయంగఁ గన్నులం నులుముచు పెదలుకన్నీటితో వెగచువాని." భాగ. స్కం. పూ. ౩౭౨; 3. పెకలించు. "సీ. బలిమి వాసవుచెట్టు నులిమి వాకిటఁబెట్టు కలిమివాలుగకంటిచెలిమివాని." చంద్రా. ౧, ఆ ౭౪; 4. నాశముచేయు. "సీ. బంధనంబులఁ బటాపంచలు గావించు నొలయునావదలను నులిమివైచు." సీతారా. ౧, ఆ. ౬౩; 5. వధించు, చంపు. "సీ...నుగ్గాడె, బరిమార్చె నులిమెను దెగటార్చె...గీ...వధించె ననుటకు సమాఖ్యలు..." ఆం. భా. తృ. ౧౨౩; 6. విడుచు. "సీ. అన నప్పు డెన్నిక నమరశత్రు విభీషణుఁడు భీష్ముఁ డనుశంక నులిమివైచి, పలుకుఁ బంతము మీఱ..." రాఘవ. ౪, ఆ. ౫౩; 7. పిసుకు, గట్టిగా అదుము. (వా.); 8. ఒడిసిపుచ్చుకొను, లాగుకొను. "క. అని మరుబాములఁ బడ లే, నని కైదువు దుస్సి దాఁటు నాయితము బలెన్, బెనఁగు నలయుఁ ఱియచే సురియ నులిమి బలిమి విడిపించి యను నసురక్తిన్." సా. ౨, ఆ. ౨౩౫. వీర. ౪, ఆ. ౧౪౬.

నులుసు. దే. వి. లోపము, లోటు. "తరలము. నలిన లోచన...మమ్ముఁ గావుము భీతులన్, నులుసు లేక ఫలించె నోచిననోములెల్లను నీవ యై." భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౦.

నుల్లింద. దే. వి. వృక్షవిశేషము. "వ...మఱియునుం బెదవిచ్చి చినవిచ్చి నల్లింద నుల్లింద యిప్ప కప్పుర మద్ది..." వి. శకుం. ౨, ఆ. ౧౪.

నువత్. సం. శతృ. నుతించుచున్న.

నువు = నువ్వు. సస్యవిశేషము. "సీ. ఎడ లేదు నువుగింజ యిడఁగ సప్తద్వీపములయందు యూళముల్ పొదలుకతన." నీలా. ౨, ఆ ౧౯, రా. వి. ౩, ఆ. ౪౭. బ. ధాన్యవిశేషము. "ఆ. ఘటము గాన్గఁ జేసి కరణ పెద్దగఁ జేసి తవిలి

కర్మములను నువులఁ జేసి తెలిసి గానుగాఁడు తిలకారుఁ డాత్మయందు..." వేమన. ౨, భా. ౨౭౫.

నువ్వు. దే. వి. తిలసస్యము. "ఆ. నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వనినాసిక ..." విజ. ౧, ఆ. ౭౪. భీమ. 3, ఆ. ౫౭. బ ధాన్యవిశేషము. "ఆ. నూనె లేని దివ్వె నువ్వుల మండునా......" వేమన. ౧, భా 3౮౦.

నుసము. దే. వి. కనరు. "ద్వి. బలవంత మగువిధి ప్రాణేశుఁ బాప, వలవంతఁ జెందిన వరవధూ మణికి...పూ బొదరిండ్ల క్రంతలు వంతలు కమ కమనీయసరసి, బిసములు నుసములు పృథుమక రంద, రసములు విసములు..." ద్వి మారిశ్చ. పూ. ౨౫౨౭. పం.

నుసలు. దే. అ. క్రి. 1. ఆలసించు. "ఆ. నొడివినంత వట్టు నుసలక యిచ్చుచో, నేల కట్టు విష్ణుఁ డేటి మాట." భాగ. ౮, స్కం. ౫౮౪; 2. కదలు. "ద్వి. చాల నీతనిపల్కు సత్యంబుకొఱకు, నూలి పోఁగునఁ జిక్కి నుసుల కున్నాఁడ." ద్వి. మారిశ్చ. ఉ. ౧౫౨౭. పం; 3. ఏమఱు, ప్రమాద మొందు. "ద్వి. నుడితప్పు వాతప్పు నుసలక సత్య మెడలింపఁ గనిపట్టు నెపుడుఁ గౌశికుఁడు." ద్వి. మారిశ్చ. ఉ. ౧౮౪. పం. ద్వి మారిశ్చ. ఉ. ౧౫౪౭; 4. వ్యతిరేకించు. "క...సకి, నుసలక మఱి నామనసు ననుసరింపఁగదే." గాథే. ౧౫౭. స. క్రి. పట్టుకొను. "మ. పెసరుం గాయకు మెత్తకన్నులకు నై పేటాడు మర్గొత్తె లక్, నుసలం జూచుచు దోసచేల్ చెఱకుచాల్ నుగ్గాడుచున్..." రా. వి. ౧, ఆ. ౬౫

నుసి. దే. వి. 1. పురుగులు తొలువఁగా రాలుమ్రాని పొడి. "చ ..అప్పుడఁతుక భ్రూలతాధనువుపుట్టి మనోభవుఁ డింతనుండియుంక్, విడుచున కాని మానఁ డిగి నిక్కము వట్టుదకీటజుష్ట మై, యుండు గక కమ్మధూళి నుసియొల్కుచు నున్నపురాణ చాపమున్." నైష. ౫, ఆ. ౬౨, అము. ౪, ఆ. ౧౪౧; 2. బూడిద. (వా) విజా. నుసిఁట్టినది. ప్రాఁతది. "ఉ...ఈనుసివి బ్లాక పెద్దకొండగాఁ, జూచెన రెల్లవారు నది కాలికిఁ గా కిట నాకు లక్ష్యమే." రామా. ౪, ఆ. ౭౮.

నుసిపురుగు. ద్వి. వి. (నుసి+పురుగు.) మ్రానుతొలిచి నుసి రాల్చెడిపురుగు. (శ. ర. బ్రా.)



నుసుఁగు. దే. అ. క్రి. తిరస్కరించు. "గీ. అనృశం సుఁడు నుసుఁగు వైఖానసులను, అదురాత్ముండు. శ్రోత్రియుల సపహసించు, నాభలుఁడు సోమ. యాజి నిరాకరించు, నక్కిరాతుఁ డనుష్ఠాత ధిక్కరించు." నైష. ౭, ఆ. ౧3౦.

నుసుమ. దే. వి. ఎండకాలమునందు కన్నులపై ముసరెడు చిన్నదోమ. (శ. ర. బ్రా.)

నుసుము. దే. స క్రి. లాగు, ఆకర్షించు. "వ... చరణాంగుళి దంశికలం బట్టి నుసిమినమిట్టిపడి యిట్టట్టు గదల నేరక..." వసు. ౪, ఆ. ౭3.

నుసులు. దే. అ. క్రి. 1. కదలు, చలించు. "గీ... మధుఁడు సారంగధరుఁడు మన్మథుఁడు విధుఁడు, వసులపాంతర నై వీరు నుసులనీయ, రెటుల నిటు తాళఁగల దని యెఱుఁగ వైలి." సా. ౨, ఆ. ౧౭౬; 2. పూను, యత్నించు. "క . ఏ నుఁగుఁ గంబంబునకుఁ గివియ నుసిలితిమినుమీ." రామా. ౨, ఆ. ౧౧3; 3. (ఒడలు) విఱుచుకొను. "చ... నిద్రచేఁ, గసరిసయట్లు నుత్కరము గబ్బిచనుంగవ పైకిఁ దార్చి మై, నుసులుచు నీవి జార్చిన మనో హరలీలల నెన్న శక్యమే." శకాం. ౪, ఆ. ౬౨; 4. ఒదుఁగు, ముడిఁగియుండు. "మ. గదలన్యోన్య సమాహతిక్ మిడుఁగుఱుల్ గ్రక్కంగ సారించుచుం, గదియంబాయఁగ వ్రేటు దప్ప నుసు లంగా నేర్పు లంగంబులం, దొదవన్..." భార. ద్రో. ౧, ఆ. ౧౫౮; 5. నలుపు. (చూ: నుసులు కొను.) వి. 1. ఒదుఁగుట. "వ...అవ్వడమడి పుడమిఁజేనివెడఁదయురం బుపలక్షించి లాఘవ ఘోరంబుగ గదాదండంబుఁ ద్రిప్పి వైవ నాతం డది మేని నుసులునం దప్పింప నది యిల చలింపం బడిన నన్నుసులు తెఱపిన యుంటికి యద్భుత వేగుం దగునవ్వాయుపుత్రుండు .." భార. శల్య. ౨, ఆ. ౭౬౭; 2. వెనుదీయుట, జంకు. "వ... నుసులు లేక మానంబు మనంబునకు ధనంబుగా వనంబునం గార్చిచ్చునం గమిరినయట్లు రూపునెడి. పీనుంగుపెంట లగుచోట్ల వరంబులు రాలినను శిరంబు వంపక..." ఉ హరి. 3, ఆ. ౮౦.

నుసులుకొను. దే. అ. క్రి. (నుసులు+కొను.) నలుపు కొను. "గీ. చంద్రశేఖరుఁ ముఖకాంతి సడలి కనులు, నుసులుకొంచును మేల్కాంచి మసలఁ జొచ్చె." చంద్ర. వి. 3, ఆ. ౧3౫.

# నూ

నూ. వృత్తియందు నూవుశబ్దముయొక్క ఉత్తశేషము. (చూ. నూఁబువ్వ. మొ.) [(శ. ర.)

నూఁక. దే. వి. (త. నూక్కం.) వృక్షవిశేషము.

నూఁకు. దే. వి. పూనిక, యత్నము. "సీ. చిఱుత నూఁకుల నింగి జేర్వ్వారు గేహవప్రముల నిచ్చెన లేకప్రాఁకి ప్రాఁకి." కకు. ౧, ఆ. ౧౨౦.

నూఁగారు. దే. వి. (నూఁగు+ఆరు.) రోమావళి. "ఉ....ఆరమణీలలామ...వలిచన్నులుఁ జిన్ని మోము నూఁగారుఁ గృశోదరంబు నలకావలియుం బొలుపొందఁగా..." వా. రా. ౭, ఆ. ౧౨౫, ఆం. భా. ద్వి. ౧౪౬.

నూఁగు. దే. వి. 1. కొన్నియాకులు, కాయలు, తీఁగలు, ధాన్యము మొదలగువానిమీఁద చిన్న ముండ్లవలె నేర్పడుసూక్ష్మావయవ సమూహము. (దీనియామ్రేడితరూపము నూఁగునూఁగు, నూనూఁగు.) "సీ. తాఁగ రాయంచలు నూఁగారఁ బెరిఁగిన బిసములు దమపాలఁ బెట్టికొనఁగ." కకు. ౨, ఆ. ౮౦, నిర్వ. ౬, ఆ. ౭౧; 2. రోమాంకురము, క్రొత్తగా బయలుదేరినరోమము. "సీ. పెడపెడ నూఁగారి వింత యై యేర్పడు దేరని వళులలో నారు నిగుడ." భార. విరా. ౧, ఆ. ౨౪౭. విణ. లేఁతది. "సీ. నూనూఁగు మీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి." కాశీ. ౧, ఆ. ౫, దశా. ౮, ఆ. ౨౧౨.

నూఁగుటారు = నూఁగారు. "సీ. కమలోద్భవస్ఫూర్తి సుముఖంబు భరియింప హరిలీల నూఁగుటా రతి శయింప." ఇందు. ౨, ఆ. ౨౯౧.

నూఁగుడు. దే. వి. కొన్నియాకులు, కాయలు, తీఁగలు, ధాన్యము మొదలగువానిమీఁద నేర్పడియుండు సూక్ష్మావయవసమూహము. "క...బ్రదికెడు నంతకుఁ బురుషుఁడు, బ్రిదులక నిలువెల్ల వగలఁ బెనఁగొనియుండున్, గుదురుకొని దూది నూఁగుడు, పొదివినకార్పాసబీజమునకుం బ్రతియై." కవిక. ౭, ఆ. ౧౧౮. (శ. ర. పా.)

నూఁగుదోస. దే. వి. (నూఁగు+దోస.) కూఁతురు బుడమకి. (శ. ర.)

నూఁబిండి. ద్వ. వి. (నూవు+పిండి.) నువ్వులపిండి "సీ. ఉండ్రాళ్లు నూఁబిండి పుండ్రేక్షులుం దేనియనఁటిపండ్లు..." హర. ౬, ఆ. ౭౯.

నూఁబువ్వు. దే. వి. (నూవు+పువ్వు.) నువ్వుఁబువ్వు, తిలపుష్పము.

నూఁబూవు = నూఁబువ్వు. "వ...నూఁబూవువంటి నాసికయును..." హర. 3, ఆ. ౨౩.

నూక. దే.వి. తండులాదిక కణసముదాయము.(వ్యవ.) గోధుమనూక. బ. తండులకణములు. "సీ. ధాన్యశకలములు దనరునూక లనంగ." ఆం. భా. ద్వి. ౨౩౯, ద్వా. ౨, ఆ. ౧౫౩.

నూకించు. దే. స. క్రి. (నూకు ధా. ప్రే.) త్రోయించు. "గీ ...అబ్బురపుఁగినుకఁ, గెరలివడిఁ దన్ని పెడల నూకించె నిందు." అచ్చ. యు. ౫౨.

నూకు. దే. స. క్రి. 1. దాఁటు. "ద్వి. చనియొను గోడను నూకికొని యందమేని, చనుచోట గోడ నూకిన చొప్పు లేదు." పండితా. దీక్షా. ౪౪, పు. 2. త్రోలు. "మ...ఏటలవికిన్ వాహంబు నూకి రసావల్లభుఁ డేసె భల్లమున .." స్వా. ౪, ఆ. ౪౪, రామా. ౮, ఆ. ౧౬౭; 3. త్రోయు, గెంటు. "వ...ఈబ్రహ్మచారి శంకరునిగురించి యింకను వంకరటొంకరమాటలాడ నుంకించుచున్నాఁడు ఇతని మెడపట్టి నూకుం డనిపలికి కోపావేశంబున." హర. ౪, ఆ. 33; 4. పడఁద్రోయు. పడఁగొట్టు. "మ. పురముల్ గూలఁగఁ ద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్, ధరణిం గూల్చి..." భాగ. ౧౦, స్కం. ఉ. ౩౯౮, సుద. ౭, ఆ. ౮౦. విణ. త్రోయునది. "వ...చిగురాకు తొగరు జిగివగపొగరు నూకుటడుగుల జోడించిన పాలవెండి పాగడమ్ములు.." ప్రబంధ. ౫౮.

నూకుడు. దే. వి. (నూకు ధా.) త్రోపుడు. "చ...కెట్టవీఁక ధే. నుకములపై ఖరిం గపులనూకుడు భంగిని భైరవాశ్మయు, గ్మకములరీతి సింహముల కై వడిఁ బోరి రనూనచాతురిన్." హంస. 3, ఆ. ౨౩౨.

నూగు=నూవు. (శ. ర. నూగులు ధాన్యవిశేషము అని. బ్రా.)

నూచే. దే. వి. 1. పొడి, చూర్ణము. (ఇది నుగ్గునుఁ దోఁ గలిసియే ప్రయోగములలోఁ గానవచ్చుచున్నది. నుగ్గు అనునది అపుడత్యంతార్థము నిచ్చును.) "ఉ. కొన్నిటి హస్తముల్ చదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్ముదూళిగాఁ గొన్నిటిఁ

గుంభముల్ పగులఁ గొన్నిటిఁ గాళుల నుగ్గు నూచగా..." అన్నిటి భీముఁ డుత్కటగదా హతి నేనికవేఁట లాడఁగన్."భార. భీష్మ. ౨, ఆ. ౨౨౧, భాగ. ౧౦, స్కం. ఉ ౭౭౦.

నూచేము = నూచ. (శకలము ముక్క.) "క... వెల్లుబ్బెడు గబ్బిమెఱుఁగు చన్నుబ్బలచే రవికె నుగ్గునూచము లయ్యెన్."రా వి. ౩, ఆ. ౧౩౦. పొడి, చూర్ణము. "మ... వేదచోరపురవప్రశ్రేణి కల్ నుగ్గునూ, చముగాఁ దాఁకె సుధాశనాస హనరోషాగర్భనిర్భేది యై." దశా. ౧, ఆ. ౨౭౭.

నూటిడి. దే వి. భక్ష్యవిశేషము. "మ. ఇడి రమ్మాని కుపాయనంబులు మనోభీష్టంబుగా...నూ, టిడు లుక్ దోసెలు నప్పములు సుకియలుఁ హేరాళ మై కన్పడన్." రామా. ౨, ఆ. ౧౧౯, నైష. ౭, ఆ. ౧౫౭.

నూతనము. సం. విశే. (అ. ఆ. అ) 1. క్రొత్తది; 2. వింతయైనది.

నూత్నము. సం.=నూతనము.

నూదోస. దే. వి. 1. నూఁగుదోసచెట్టు. (శ. ర.); 2. రేణుకలు ..ఆం. భా. ద్వి. ౬౧, ఆం. పద. అచర. ౭౩.

నూనియ. ద్వ. వి (నూవు+నేయి.) తైలము, నువ్వు లచమురు. "క. .జనవాదము నిండె సర్వజగతీస్థలిఁ జెర్వున నూనియ సెరసినక్రియ, బెనఁగొని నేత్రమున నవిరి వెరిగినకరణిన్." సాంబో. ౩, ఆ. ౩౬, భార. అను. ౨, ఆ. ౩౦౭.

నూనె = నూనియ. 1. తైలము నువ్వులచమురు. "సీ. జడగట్టు పెన్నెఱుల్ విడిచి పెట్టినవాఁడు వీని కెచ్చటనుండి నూనెఁ దెచ్చు." పార్వ. ౪, ఆ. ౫౭, ఆం. భా. ద్వి. ౨౯౭; 2. చమురు కలుగఁజేసెడు విత్తులు గలచెట్టునకు పిదప వచ్చి నపుడు చమురు అనునర్థ మిచ్చును. ఉదా;— కొబ్బరినూనె, వేపనూనె. మొ )

నూనెముంత. ద్వ. వి. గుచ్ఛబలచెట్టు. "గీ. నూనెముంత యనంగను నొప్పుగుచ్ఛ, బలయు..." ఆం. భా ద్వి. ౯౪.

నూనెముడి. ద్వ. వి. (నూనె+ముడి) కీలుగంటు, ఖాఱుముడి. "గీ. అనుచుఁ జెలియలు మధురోక్తు లాడుచున్నఁ, బడఁతి యొక్కర్తు మిగుల నేర్పరి సుగంధ, తైలమున నింతి తలయంటి తార్చి తీర్చి, నూనెముడి సంఘటించెను నూనెముడికి." కాళిందీ. ౯, ఆ. ౫౧, ఆం. భా. ద్వి. ౧౪౯.

నూనెయాగిసె. ద్వ. వి. నల్లగిసె, అఁజసిచెట్టు. (శ. ర.)

నూపురము. సం. వి. అ. పుం. మంజీరము, అందె.

నూయమానము. సం. విశే. (అ. ఆ. అ.) నుతింపఁ బడుచున్నది.

నూయి. దే. వి. ఔ. చేఁదుడుబావి, కూపము. "క. అనఘ యధర్మము ధర్మం, బనుమతిఁ బుట్టించుఁ దృణసమావృత మై ప్రన్ననితలముచందమునఁ దోఁచిననూయింబోలె సూక్ష్మచిత్తత లేమిన్." భార. అను. ౯, ఆ. ౪౦౫. భార. ఆది. ౪, ఆ. ౫౩.

నూర్మొనలపట్టెము. ద్వ. వి. వజ్రాయుధము. "వ... నూర్మొనలపట్టెంబువట్టు వేల్పుఁ జలుపక్ గట్టిన గోపురంబు డాసి .." ఉ. రా. ౩, ఆ. ౨౨.

నూర్వురు దే. స. (నూఱునకు మహన్మహత్యర్థక రూపము.) శతసంఖ్య కలవారు. "సీ. అతనికి నూర్వురు సుతులు బుచీకాదు లుదయించి రఖిల భూవిదితతేజులు..." భార. ఆది. ౩, ఆ. ౭౦.

నూఱంచులకైదువు. ద్వ. వి. వజ్రాయుధము. "ఉ. మించినపేర్మి నేయెడల మిన్నులుముట్టి వెలుంగు నట్టి నూఱంచులకైదువుక్ దృణకణాకృతి యై వెడఁబాయఁ జేర్చి దర్పించిన ధీరచిత్తములు..." నృసిం. ౨, ఆ. ౪౬. (ఇట్లే: నూఱంచులవాలు. ఆం. సం. దేవ. ౧౭.

నూఱాఱు. దే. స. (నూఱు+ఆఱు.) అనేకము. "సీ. సంతలోఁ బ్రత్తి బిచ్చములెత్తి నూఱాఱు వగల జన్నిదములు వడికి వడికి." శుక. ౪, ఆ. ౧౦౫. శశాం. ౨, ఆ. ౨౪. ఇట్లే:నూఱార్లు. రామా. ౭, ఆ. ౧౨౫.

నూఱిపిడి = నుఱిపిడి. (శ. ర.)

నూఱిపోయు. దే. స. క్రి. (నూఱు+పోయు.) బాగుగా బోధించు. "క. తనయులకును మనుమల కును, దన నేరుపు నూఱిపోసి .."కళ. ౩,ఆ ౧౨.

నూఱు. దే. స. క్రి. 1. సన్నెకంట మర్దించు. "ఉ. నూఱక త్రావు నతఁడు కనుంగొను నంతటిలో మనుష్యులన్." కాళ. ౩, ఆ. ౨౦౯. హా. న. ౩, ఆ. ౧౪; 2 రాచు, నలఁచు. "ఉ. నున్నఁదనం బుగా నలుఁగు నూఱియుఁ జందనమట్లు రాచి

యమన్." భార. విరా. ౨; ఆ. ౨౨౨; 3. అయుధములు మొ. పదసెక్కుటకు ఱాతిమీఁద ఒరపెట్టు. "గీ. మదనుఁ డమ్ముల నూఱె హిమంబు పేరె." స్వా. 3 ఆ. ౨3. ఉ. రా. ౫, ఆ. ౨3౯. స. ఔ. శతము, వంద. "చ. నుతజల పూరితంబు లగు నూతులు నూఱిటికంటె సూనృత వ్రత యొకబావి మేలు..." భార. ఆది. ౪, ఆ. ౯3. హరి. పూ. ౪, ఆ. ౧౧౪.

నూఱుగురు. దే. స. వందమంది. "వ...గంధర్వదేవ మానవకన్యలం బదాఱువేలు న్నూఱుగురఁ నప్స రోగణంబు లేడింటిం జెఱలువట్టి..." ఉ. హరి ౧. ఆ. ౯౪.

నూలిగరసు. దే. వి. బట్టతల, ఇంద్రలుప్తకము. "సీ...ఇంద్రలుప్తకం బగు నూలిగర సం చనఁ గను..." ఆం. భా. ద్వి. ౧౭౯.

నూలు. దే. వి. ఔ. 1. ప్రత్తివడికినపోఁగు, దారము. "చ...కలువతండము మొల్లలు నంచు మిన్ను గ్రుచ్చి రహిని రిత్తనూలోనఁగి సిగ్గ వహింతురు పువ్వులావికల్." అము. ౨, ఆ. ౭౦. ఆం. భా. ద్వి. ౮౯౫; 2. తామర మొ. వానిలోనిదారము. "ఉ...కొనుఁదీగె లే,నూలును జన్ను మొగ్గలు గనుఁ డలిదమ్ములు మోవిచెయ్యిం, జాలగు నవ్వు తేటయుం భుజాబిసవల్లని యవ్విలాస పాం,చాలుఁడు ప్రేమఁ బన్నిని నిజప్రియఁగా మదిలోఁ దలంచుచున్." సా. ౨, ఆ. ౧౫3. క్రీడా. ౨; 3. మొలనూలు.

నూలుకొను. దే. అ. క్రి. 1. చక్కఁబడు, సరియగు. (చూ. నూలుకొలుపు.); 2. స్థిరపడు. "క. మనసు సరస్వతిఁ గనుఁగొని, జనని నామనసు శోక సంతాపమునన్, బొనుఁగుపడి వివేకమునకుఁ గొనఁ గొఱయై చాల నూలుకొన దని పలుకన్." ప్రబోధ. ౫, ఆ. ౧౮; 3. పూనుకొను. "వ... యజ్ఞాదికృత్యంబులు ధనసామగ్రి లేక నడవ రాదు ధనంబు గలిగెనేనియు లోభంబున సంసారులు తత్కృత్యంబులకు నూలుకొనరు ....." వరాహ. ౯, ఆ. ౨; 4. పురికొను. "గీ. బీఱు వోయి రథ్యంబులు మాఱుమొగము, వడినఁ దా నొచ్చియుండియుఁ దడవి శౌరి, నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర, భల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె." భార. భీష్మ. 3, ఆ. ౨౫౭.

నూలుకొలుపు. దే. స. క్రి. (నూలుకొను ధా. ప్రే.) 1. చక్కఁబఱుచు, సరిచేయు. "వ...అలిక దేశంబునం గలయఁబడిన యలకంబులు నూలు కొలిపి." ఉ. హరి. ౫, ఆ. ౧3౦; 2. ప్రసరింపఁ జేయు. "సీ. హరిణాక్షి లసదపాంగాలోకనము నూలుకొలుపుడు నమ్మరిఁగొలిపె మరుఁడు." శు. సం. ౫, ఆ. 3౬. వరాహ. ౧౦, ఆ. ౫౪; 3. కలిగించు. "గీ. ఎట్టకేలకు ధైర్యంబు హృదయ మునకు, నూలుకొలుపుచు నున్నాఁడు ....." వరాహ. ౫, ఆ. ౪౪.

నూలుకొల్పు=నూలుకొలుపు. 1. (పురికొల్పు, ప్రేరించు.) "ఉ. ఈనృపులుఁ దమ్ములు నేనును బుట్టిరాఁ జమూ,మండలి నూలుకొల్పికొని మార్తురనోర్చినఁ గాక యొప్పనే." భార. భీష్మ. ౨, ఆ. ౧౫. 2. (స్థిమితపఱచు, కుదురుపఱుచు.) "చ. మనసుల నూలుకొల్పి యనుమానము లెల్లను బాచి..." భార. విరా. ౪, ఆ. ౮౦౭. 3. (అంగీకరింపఁజేయు.) "ఉ. మిక్కిలి మిన్కుటంబగు శమిక్ రతికిన్ సతినూలుకొల్పుచున్..." కళా. ౭, ఆ. ౧౫౭.

నూలుకోలు. దే. వి. (నూలుకొను ధా.) నూలు కొనుట. (శ. ర.)

నూలుపట్టు. దే. అ. క్రి. (నూలు+పట్టు.) దారము ఉంచి సూటి యగునట్లుచేయు. "గీ. కర్ణికా రాంబికా మహా కాళిగుడికి, నందముగ నూలు పట్టినచాయ, సూర్యవీథికిఁ జని సంశుద్ధమతులఁ, బళ్చిను ద్వారమునకునై పరమమునులు." భీమ. 3, ఆ. ౫౯.

నూల్కొను=నూలుకొను. దే. అ. క్రి. 1. పురికొను. "గీ. వెడలి తమతమ చతురంగ వితతులెల్ల, నుచిత గతి నూల్కొనంగఁ జేయుచుఁ గదంగి, సంగరోత్సవ సంభృతోత్సాహు లగుచు." భార. భీష్మ. ౧, ఆ. ౦౭; 2. చక్కఁబడు. "చ. కనుఁ గొని ఫల్గునుండు దురగంబుల వాగెలు పట్టి యొత్తిత, తనువులు నూల్కొనన్ నిలిపి......" భార. విరా. ౪, ఆ. ౧౭౪; 3. ఒప్పుకొను. "చ...నాకతంబునఁ బటు రోగ దుఃఖములఁ బొందుచు నెచ్చెలు లిట్టు లుండఁగా, మనసిజ భోగ లీలలకు మానస మెట్లొలు నాకు నూల్కొనున్." మార్క. ౫, ఆ. ౫౦; 4. జాలువాఱు. "చ...సురుచిర నవ్యవేశన నికుంజము రంజిలు

చోట...నవారవింద బంధుర మకరంద తైలములు నూల్కొనుచోట......" వసు. 3, ఆ. ౨౨; 5. సమ్మతమగు. "చ ..ఏను కామధేనువ నిను మెచ్చితిఁ మదికి నూల్కొను నిష్టము వేడు నావుడున్." ద్వా. ౧౦, ఆ. ౫౮; 6. స్థిరపడు. "చ...నీమది కార్యవృత్తి నూల్కొనియె సుయోధనుం గొని యకుంఠిత నిశ్చయ మై..." భార. ఉద్యో. ౨, ఆ. ౯౭; 7. వ్యాపించు. "ద్వి. ఓరువ రాక చిట్టోకిలిం తొడవ, నోర మద్యపుఁగంపు నూల్కొనఁబలికె." ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౦౨. పం; 8 సంభవించు, కలుగు. "ద్వి. ఇల యేలఁగా లేని యీ రామ లక్ష్మణుల చేత నే కీడు నూల్కొను నింక." రం. రా. యు. 3౨౬. ప్రే. స. క్రి. 1. స్థిరపఱుచు "చ. పలికిన నేమి యన్ని యును పల్కనగున్ మనరాజునొద్ద మార్పలికెడువారు లేరు విను పాండవమధ్యము గాండివంబు దీప్తుల మిఱుమిట్లు గొన్న కను దోయి గుణ ధ్వని ప్రయ్యలైన వీనులు నయినన్ బలేపలుకు నూల్కొన కుండుదు సూతనందనా." భార. ఉద్యో. ౪, ఆ. ౪౧౮; 2. సమ్మతించు. "మ. ధన ముద్యన్నిధనంబు, దేహము విపత్సంతాన గేహమ్ము...ఇట్లెఱిఁగి నూల్కొ లేరు ప్రాజ్ఞుల్ కటా, యనవధ్యాత్మ సమేధమాన సుఖ పద్యాహృద్యసంచారముల్." ప్రబోధ. ౫, ఆ. 3౭.

నూల్కొలుపు = నూలుకొలుపు. చక్కఁబఱుచు, పొందుపఱుచు. "మ. లలనారత్నము నొయ్యనొయ్య మొనవ్రేలన్ వేల వ్రాయించి నిశ్చలవృత్తిన్ వరవర్ణపూర్ణఫలకాసంగంబు నొందించి మిన్నక్కలువేమాఱుఁ దదర్థచింతనలతో నూల్కొల్పి నెయ్యంపు టొజ్జలు పైపై నెనయింప సాఁగెఁ బటు శాస్త్రశ్రేణి కాభ్యాసమున్." వసు. 3, ఆ. ౧౦౦.

నూవు = నువ్వు. సస్యవిశేషము, తిలసస్యము. "సీ...తిలసంజ్ఞ నూవనఁ దేజరిల్లు." ఆం. భా. ద్వి. ౨౩౬.

## నృ

నృ. సం. వి. ఋ. పుం. నరుఁడు, మానవుఁడు (దీనికిఁ దెనుఁగునవ్యస్తప్రయోగము లేదు.)

నృకేసరి. సం. వి. న్. పుం. నరసింహమూర్తి, విష్ణువు.

నృతి. సం. వి. ఇ. స్త్రీ. నాట్యము.

నృత్తము. సం. వి. అ. న. అంగప్రత్యంగములచే భావమును దెలుపుచు ఆడెడియాట.

నృత్తశాల=నృత్యశాల.

నృత్తప్రియము. సం. వి. అ. పుం. నెమలి.

నృత్యము = నృత్తము.

నృత్యశాల. సం. వి. ఆ స్త్రీ. నాట్యమందిరము.

నృపతి. సం. వి. ఇ. పుం. 1 ప్రభువు; 2. క్షత్రియుఁడు; 3. కుబేరుఁడు.

నృపత్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. రాణి; 2. మనుష్యుని భార్య.

నృపమానము. సం. వి. అ. న. రాజుయొక్క భోజన కాలమును దెలుపు వాద్యభేదము.

నృపలక్ష్మము. సం. వి. న్. న. రాజులకు పట్టెడు తెల్ల గొడుగు.

నృపాంశుఁడు. సం. వి. అ. పుం. రాజకుమారుఁడు.

నృపాభీరము. సం.=నృపమానము.

నృపాలుఁడు. సం.=నృపతి.

నృపుఁడు. సం. వి. అ. పుం. రాజు, ప్రభువు.

నృమేధము. సం. వి. అ. పుం. మనుష్యుని పశువుగా నేర్పఱచి చేయుయాగము.

నృలోకము. సం. వి. అ. పుం భూలోకము.

నృశంసుఁడు సం. విశే. (అ. ఆ. అ.) ఘాతుకుఁడు, మనుజులను హింసించువాఁడు.

నృసింహము. సం. వి. అ. న. 1. రతిబంధ విశేషము; 2. ముప్పదిరెండు విన్నాణములలో నొకటి. "వ...గళకత్తెరయుఁ గాసె నిల్కడయుఁ నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణముల నాణెంబు పరీక్షించి..." హంస. ౧, ఆ. ౧౦౬, ప్రబంధ ౭౮.

నృసింహుఁడు. సం. వి. అ. పుం. విష్ణుమూర్తి.

నృహరి. సం. వి. ఇ. పుం. నృసింహమూర్తి. "మ. నృహరీ వాదములేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్." ఆము. ౨, ఆ. ౮౧.

## నె

నె. దే. వి. నెలవుశబ్దమునకు లుప్తశేషము. (దీనిమీఁది హల్లునకుద్విత్వము వచ్చును. చూ. నెక్కొను మొ.) విశే. నెఱ, నెఱి శబ్దములకు కొన్నిహల్లులు పరమగునపుడు వృత్తియం దంత్యవర్ణము, లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి కొన్నిమొదల

నుగాగమును కొన్నియెడల దీనిమీఁది హల్లునకు ద్విత్వమును వచ్చును. ఉదా. నెమ్మది, నెచ్చెలి నెన్నడుము, నెమ్మేను. మొ.)

నెంజిలి. దే. వి. మనోవ్యథ, ఆధి; ఖేదము. "చ. .. అనుటయు సంభ్రమంబడర నంగనతొల్తటి నాటి యామినిం, దనకని వండి డించికొని నాథుఁడు పల్లియకేఁగు నెంజిలిం, దనికి భుజింపకున్కి .." పాండు. ౪, ఆ. ౧౭౩, ఆం. భా. ప్ర. ౧౩౭.

నెందోలు. దే. వి. (నెఱ+తోలు.) పెద్దతోలు. "ద్వి. కాయగాచినయఱచేయి నెందోళ్లు, గోయఁ దాఁకిన యసిగోఁతఁడాచేయు." పండితా. దీక్షా. ౪౦, పు. (క్రొత్తప్రతిపా.)

నెకబిక. దే. వి. పట్టుదల. "క....ఒకని నొకించుక యును సోఁకక యుండెఁ గటారి మొనలు కడు బెట్టు వడిఁగా, నెకబికలుగఁ బోట్లాడుచు, వికసిల్లెడు నాకడింది వీరులయందున్." కళా. ౯, ఆ. ౧౦౨.

నెక్కర. దే. వి. ఒకానొకచెట్టు. (శ. ర. బ్రౌ.)

నెక్కొను. దే. అ. క్రి. (నెలవు+కొను.) 1. ఉండు. "క. మ్రొక్కి వినుతించెఁ దనమది, నెక్కొను నెగులెల్ల నేల నెలఁతుకకన్నీ, రొక్కొక్కబొట్టు మెఱుఁగుం, జెక్కుల దిగ జాఱ గోరఁ జిమ్ముచు హరికిన్." పాండు. ౩, ఆ. ౧౬౯; 2. వ్రాలు, పడు. "క. ఇక్కరణిఁ బలికి యదుపతి చక్కని రవణమునఁ జిక్కు సడలింపుచుఁ జక్, జొక్కపుఁ బూగుత్తులపై, నెక్కొనఁగాఁజేసెఁ గన్ను నెఱితుమ్మెదలన్." కాళిందీ. ౬, ఆ. ౧౯౨; 3. పొదుకొను, స్థిరపడు. "ఉ. నీదెస నాదుచిత్తమున నెక్కొని యుండెడు భక్తిభద్రసం, పాదిని గావు టచ్చెరువె .." భార్య. కల్యా.౧, ఆ. ౨౭౫, భార. ఉద్యో. ౧, ఆ. ౨౯౭, భార. ఆర. ౭, ఆ. ౪౬౬; 4. తోడ్పడు. "చ...సముద్ధతవృత్తినదల్చి వెన్నుద,న్ని నిలిచె దాన వేశ్వరుఁడు నెక్కొనఁగాఁ దనముద్దుఁదమ్ములున్, దనయులు దండనాథులు నుదగ్రతసేనకు దర్పమెక్కఁగన్." నిర్వ. ౩, ఆ. ౧౩; 5. తగులు, నాటు. "మ.. సమయ వాయవ్యాస్త్ర ముద్వృత్తిసె, క్కొన మారీచ నిశాచరుం దన మృగాంతుం డంబురాశిం బడెన్." సా. ౨, ఆ. ౧౯౬; 6. వ్యాపించు, పర్వు. "చ... నేను మంటలు మింట నెక్కొనం, గనదురు విస్ఫులింగములు గ్రక్కుమహాశనిఁబోలు కాలమున్." భా. రా. ఆర. ౧, ఆ. ౨౪; 7. కలుగు, జనించు. "వ...అఖిలజనంబులకుఁ బ్రీతి నెక్కొన నతఁ డమ్మోహాంబు దీర్చునెడ .." భార. భీష్మ. ౨, ఆ. ౩౪౪, భో. ౩, ఆ. ౧౪౨; 8. అతిశయించు. "ఉ. చచ్చె ఘటోత్కచుండు మన సైన్యములెల్లఁ గలంగి నల్గడ, న్విచ్చుటఁ జూచియేము నగ నెక్కొన వందెదము..." భార. ద్రో. ౫, ఆ. ౨౩౯, ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౮, పం; 9. ఫలించు. "ఉ...ఎవ్విధంబులన్, నెక్కొనకున్నె మర్త్యులకు నిక్కము ప్రాక్తన భోగ్య కర్మముల్." హరి. ఉ. ౪, ఆ. ౬౬; 10. నిగుడు. "ద్వి. నెక్కొన్నచన్నులు నిరుపేదనడుము..." రం రా. ఉ. ౧౦౦. పు. స. క్రి. పొందు, పడయు. "క. అక్కట సద్ద్విజజన్మము, నెక్కొనియును జేసికొనిన నేరమి నిన్నుం, డెక్కొన..." పద్మ. ౩, అ. ౯౨.

నెక్కొలుపు. దే. స. క్రి. (నెక్కొను ధా. ప్రే.) 1. నిలుపు. "వ ..పాండవాగ్రజా నీమనంబున నెక్కొలుపు మిక్కథ యభిప్రాయంబు." భార. అను. ౧, ఆ. ౯౩; 2. తాల్చు, ధరించు. "సీ. వనమాలికలు పాఱవైచి రుద్రాక్షపూసల పేరులఱుత నెక్కొలుప వచ్చు." శుక. ౩, ఆ. ౯౯; 3. సంఘటించు. "క. ..అక్కట దైవము రాజ్యము, డెక్కొని యాలిం దనూజుఁ డాగ నమ్మంగా, నెక్కొలిపి హరిశ్చంద్రుని, నిక్కడ గాడ్పఱిచె నింక నేగతిఁ బోదున్." మార్క. ౧, ఆ. ౨౪౯. [(శ. ర.)

నెక్కోలు. దే. వి. (నెక్కొను ధా.) నెక్కొనుట.

నెగడి. దే. వి. 1. దుష్టమృగములు రాకుండుటకును చలికాఁచుకొనుటకును వేసెడి మంట. "గీ.... నెగడికిఁ బాచనమున, కింధనము లిచ్చి ధనముల నెసక మెసఁగు" భార. అను. ౨, ఆ. ౩౯౯, చిత్ర భా. ౨, ఆ. ౩౪; 2. అగ్ని. "గీ. ఎపుడు నీవు ననుం బాసి యేఁగి తపుడె, నీరసైనను నరిసైన నెగడిసైన, విడుతుబ్రాణము..." శివరా. ౩, ఆ. ౧౩౦; 3. పిశాచము, దయ్యము. "సీ. గాలి గాము నెగడి. గీ. కొఱవిరాలుపు బూచి సోఁకుడు పిసాసి, దయ్య మనఁగఁ బిశాచాభిధానములగు." సాం. ని. దేవ. ౧౯.

నెగడించు. దే. స. క్రి. (నెగడు ధా. ప్రే.) 1. వర్ధిల్లఁజేయు. "ద్వి. మగువఁ బుంసవనసీమంతో త్సవముల, నెగడింపఁదొమ్మిది నెలలు నిండుటయు." ద్వి. భాగ. ౪, ఆ. ౭౪, పు.; 2. ప్రవర్తింపఁజేయు. "ఆ. నింగి ముట్టి యుండన్న జంగమమల్లయ, వరమునందుఁ గనిన వస్తుకవిత, దగిలి వారి యంద నెగడించుతురవికిదీ, పముని నర్చ లిచ్చు పగిది దోఁప." కు. సం. ౧ ఆ. ౪౯.

నెగడు. దే. అ. క్రి. 1. బయలుపడు, ప్రకటితమగు. "క...ఈ, ఖగపతిసీతావృత్తము, నెగడఁగ వినిపించి చనియె నిజగృహమునకున్." భా. రా. కిష్కిం. ౭౬౪, భార. విరా. ౧, ఆ. ౧౪౩; 2. వర్ధిల్లు. "రగడ. నీకను దెఱచిన నెగడును జగములు, నీకను మూసిన నిలువవు జగములు." ఉ. రా. ౪, ఆ. ౯౨. "క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నేనొక్కరూప యట్లగుటఁదగన్ వారును వీరును దమతమ, నేరిమిమెయి ధరణి యేలి నెగడఁగఁజూతున్." భార. ఉద్యో. ౧, ఆ. ౪౧; 3. ప్రవర్తించు, నడచు. "క. ధర్మ సుతుఁ డున్నచోటను, ధర్మువునకు హాని గలదె ధారుణి నైనన్, ధర్మువ తాత్పర్యముగా, నిర్మల మతి నెగడునది వినీతాత్ములరై." భార. ఆది. ౭, ఆ. ౩౫, భార ఆర. ౧, ఆ. ౫౨; 4. ప్రసిద్ధికెక్కు. "చ...దక్షిణ లిమ్ముగ నిచ్చియజ్ఞముల్, నెగడఁగఁ జేసియుం బడయ నేరరపుత్రకులైన దుర్మతుల్." భార. ఆది. ౨, ఆ ౧౫౦, ఆం. భా. తృ. ౯౦; 5. యత్నించు. "సీ. పొందమ్మి తూండ్లతోఁ బొందు లీనెడుకొను దిగుడు బావి హసింప నెగడు నాభి." గంధ. ౬౯౯; 6. గర్వించు. "క. తనయింట దివియ యుండఁగ, నను డాయు మనండు నెగడి నాతోఁ గొఱమా, లినమాటల నిసుమంతయుఁ, గొనకుండఁగ నాడె నిట్టి కుటిలుఁడు గలఁడే." కేయూర. ౩, ఆ. ౨౭౯; 7. అతిశయించు, అధికమగు. "సీ. చెలువంబు నెగడఁదీర్చిన క్రొత్తకస్తూరి పట్టెలమేల్తావి మట్టు మీఱ." చంద్రి. ౧, ఆ. ౧౦౭. చిత్రభా. ౨, ఆ. ౩౪; 8. కలుగు, లభించు. "గీ. నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁ గాక, దవ్వు దవ్వుల నిట్టైన నవ్వరెట్లు." భార. విరా. ౪, ఆ. ౫౨, భర్తృ. ౧, శ. ౯౦; 9. ఒప్పు. "చ...వీణె మీటుచును వేడ్కఁ బడంతుల యొద్దనుం గడున్, నెగడెడు విందు గద్దె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్." కళా. ౩, ఆ. ౧౫౭; 10. వ్యాపించు. "గీ. నింగె నెగడె వెలసెఁ బర్వె నిగిడె నడఁగ, వ్యాప్త మయ్యెడి నను పేళ్లు కలరు సాంబ." సాం. ని. మాన. ౫౦. వి. తంతువాగము, క్రూరజలజంతు విశేషము. "గీ. ఊఁతయులజళ్లఁ జెఱువుల నుండ రాక, కార్మొసల్లు నెగళ్లును గవులు విడిచి, తరలి చెంతల నూతిగుంతల వసించె." వేం పంచ. ౧, ఆ. ౨౫౪. అచ్చ. యు. ౩.

నెగడ్త. దే వి. (నెగడు ధా.) ప్రసిద్ధి. "క. జలజార్యంతక కశ్యప, కులభామినులై నెగడ్తకుం జని బహుపుత్రులఁ బడసి పేరుకొను కూఁతులఁ జూడఁగ నరిగె నతి కుతూహల బుద్ధిన్." కు. సం. ౧, ఆ. ౧౧౧, ౩. ఆ. ౧.

నెగపు = ఎగపు. (శ. ర.)

నెగయు = ఎగయు. దే. అ. క్రి. 1. ఎగురు. "క. నెగయుడు నెగసి పిఱుందం, దగిలెడు మిడుఁగుఱులచేత దగ్ధచ్ఛదమై, గగనమునఁ బఱవనోపక, ఖగనివహము వహ్ని యంద కడు వడిఁ బడియెన్." భార. ఆది. ౮, ఆ. ౨౫౪. భార. అను. ౩, ఆ. ౨౪౫; 2. పైకి లేచు. "ఉ. దాని నెఱింగి యెంతయు నుదగ్రత నా బకవైరి గ్రక్కునన్, వానినడంగఁబట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బంచానన మేణముం బోదువు నట్లతఁ డూర్జితశక్తి నుద్భటుండై నెగసెన్ సమీరసుతు నల్కకుఁ బ్రాఁకిడి నట్టు వీఁకతోన్." భార. విరా. ౨, ఆ. ౩౫౦. భార. విరా. ౨, ఆ. ౩౫౧. 3. బయలువెడలు, ఉద్గమించు. "ఉ. నావుడు నవ్వ నెమ్మొగమున న్నెగయంగ జనార్దనుండు .." ఉ. హరి. ౩, ఆ. ౫౯. కు. సం ౫, ఆ. ౧౦౮; 4. నీటినుండి పైకితేలు. "గీ నీరముంచినసొరకాయ నెగసి నట్లు." ఉ. హరి. ౪, ఆ. ౨౮. ఆము. ౨, ఆ. ౯.

నెగయుతెంచు దే అ. క్రి. (నెగయు+తెంచు.) నీటినుండి పైకితేలు. "ఆ. బంధనంబు లెల్లఁ బాయఁడు భీముండు, నీరిలోననుండి నెగయుఁ దెంచె." భార. ఆది. ౫, ఆ. ౧౯౩.

నెగవు. దే. వి. ఎగురుట, ఉడ్డీనము. "సీ. నిఖిలాండ ములు నొక్క నెగవున దాటంగఁ గల యద్భు తోగ్ర వేగంబువాని." హం. పూ. ౪, ఆ. ౮౫.

నెగవైచు. దే. స. క్రి. (నెగయు+వైచు.) ఎగసర వైచు. "చ. దర్పదుర్దమరిపు ఖండదోండ భుజ దండమునందుఁ బ్రచండ మండలాగ్రము జళి పించుచుఁ గిరగిరఁ దిరుగఁ నెగవైచి పట్టు చున్." కళా. ౬. ఆ. ౧౪.

నెగుచు = ఎగుచు. దే. స. క్రి. తఱుము. "ఆ. వన గజంబు నెగుచు వనచారిఁ బొడఁగని, వన గజంబు కాన పక్షిగజము వెల్లనై సురేంద్రు వేచి సుధాం ధులు, పట్టఁ బట్టనీక బయలు ప్రాఁకె." భాగ. ౮, స్కం. ౬౬.

నెగులు. దే. వి 1. బాధ. "ఆ...నరులు జుంటి, చవియకాని నెగులుఁ జఱిరయంబున నెక్కి, తారు విఱుగఁబడుటఁ దలఁపలేరు." భార. శాం. ౬, ఆ. ౭౩, కాశీ. ౪, ఆ. ౨౨; 2. విచారము, దుఃఖము. "క. మ్రొక్కి వినుతించెఁ దనమది, నెక్కొను నెగులెల్ల నేలనెలఁతుక కన్నీ, రొక్కొక్క బొట్టు మెఱుఁగుం, జెక్కుల దిగఁ జాఱ గోరఁ జిమ్ముచు హరికిన్." పాండు 3, ఆ. ౧౬౯. య. 3, ఆ. ౪౨; 3. హాని. "క... ...ధృతరాష్ట్ర సుతు లసద్వృత్తులు నిష్కారణ వైరులు వీరల, కారణమున నెగులు పుట్టఁ గౌరవ్యులకున్." భార. ఆది. ౫, ఆ. ౧౬౦. ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౦౪; 4. కోపము. "చ. మనమున యందు నీ నెగులు మానుము పర్వత పుత్రి..." కాశీ. ౪, ఆ. ౧౫౪. సా. ౨. ఆ. ౨౪౬.

నెగులుకొను. దే. అ. క్రి. (నెగులు+కొను.) పీడ నొందు. "గీ. తెగువ మోమునఁ జేటుపాటు మిగుల మఱియుఁ, జూచి పాణిపంకజమును శోక శుష్క, కంఠనాళాంతరమున గద్గదిక నెగులు, కొను నెలుంగును నెత్తి యజ్జనక తనయ." భా. రా. యు. ౫౮౦.

నెగులుపడు. ద్వ. అ. క్రి. (నెగులు+పడు.) బాధ నొందు. (చూ. నెగులుపఱుచు)

నెగులుపఱుచు. ద్వ. స. క్రి. (నెగులుపడు ధా.) బాధించు, పీడించు. "వ. ఇట్లు విశ్వామిత్రుండు హరిశ్చంద్రు నెగులుపఱుచుట విని వసిష్ఠుండు విశ్వామిత్రుని గృధ్రమ్మవు గమ్మని శపించిన..." భాగ. ౯, స్కం. ౧౯౩.

నెగులుపెట్టు. దే. స. క్రి. (నెగులు+పెట్టు.) బాధించు. "సీ. చారుమధ్యమఁ గని శరభముల్ మనసీవు నెమ్మోముఁ గని యళుల్ నెగులువెట్టు." భా. రా. అర. ౨, ఆ. ౩౦౩.

నెగ్గడను. పై. వి. (సం. నికటమ్. ప్రా. నిఘట్టనమ్.) త్రొక్కటము, సమ్మర్దము. (శ. ర.) విణ. సాం ద్రము, దట్టము. "గీ...అలరు సాంద్రంబు నెగ్గడ మనఁగ..." ఆం. భా. తృ. ౧౬.

నెగ్గు. దే. అ. క్రి. 1. నెఱవేఱు, సిద్ధించు. "గీ. మీదు కార్యంబు నెగ్గను మీరలంగి, వేగ సుగ్రీవు చెల్మి గావింపుఁ డనిన వచ్చినారము..." మొ. రా. కిష్కిం. ౫; 2. మను, బ్రతుకు. "క... చంద్రిక్, మగ్గము వెట్టిన మొదలే, నెగ్గ వయో సింగ భూప నృపసుమ చాపా." చంద్ర. వి. 3, ఆ. ౪౩; 3 జయమునొందు. (వ్యవ.) వారు యుద్ధములో నెగ్గుట కష్టము; 4. నిస్సత్త్వమగు, బెండువడు. "వ...వారి చతురంగబలంబున శూర కరమె దారున బెగ్గడిల నెగ్గి వేఁటకాండ్రు చోపుడువెట్టఁ బొదలు వెల్వడి పిట్ట లెగిరిపోవు చాడ్పున." ప్రబంధ. ౭౮౮. సానందో. ౧, ఆ. ౮, పు; 5. ఎదురాడు, మాఱుపలుకు. "గీ. నీకు హితవుగ నడిచెద నెగ్గనింకఁ, జెంతకును రార యోరి లక్ష్మీకుమార." పార్వ. 3, ఆ. ౭౮.

నెగ్గుకొను. దే. స. క్రి. (నెగ్గు+కొను.) జయించు. "గీ. నిండు కల్వలరా నిగ్గు నెగ్గుకొనెడి, మొగము చిఱునవ్వు కెమ్మోవి ముడిచి యణఁప." పార్వ 3, ఆ. ౪౪.

నెగ్గురు. దే. వి. గుండె యదరుట యందలి యనుకర ణము. "ఉ...అ, స్నీరజగంధిఁ జూచి యెద నెగ్గు రనం గడు విస్మితాత్ముఁడై." శుక. ౧, ఆ. ౧౨౧.

నెచ్చు. దే. వి. 1. మిక్కిలి సన్నమైన నూకలసమూ హము. (శ. ర.); 2. మెత్తని బియ్యపుపిండి. (బ్రౌ.)

నెచ్చూలి. దే. వి. (నెఱ+చూలి.) ప్రియపుత్రి. "ద్వి. వలపలికడఁ బంటవలఁతి నెచ్చూలి, వల నొప్పఁ దమ్ముఁ డప్పలనొప్ప .." ద్వి. పరమ. 3, ఆ. ౨౧౮. పు.

నెచ్చెలి. దే. వి. (నెఱ+చెలి.) 1. ప్రాణస్నేహితుఁడు; ప్రాణస్నేహితురాలు. "ఉ. కాంచిరి నిర్జరేశ్వ

రులు...ధీరతం గాంచనభూధరంబునకు గాదిలి నెచ్చెలి యైనవాని నిర్వంచిత దానశక్తి సుర రత్నముఁ బోలెడు వాని నైషధున్." నైష. 3, ఆ. ౪౦, మార్క. ౨, ఆ. ౩౨౪; 2. ఆఁడువి, స్త్రీ. "ద్వి...వేల్పు నెచ్చెలుల పాలిండ్లఁ, గలకల నవ్వు బంగారుకుండలకు." ద్వి. పరమ. 3, ఆ. ౧౪౬ పు.

నెచ్చెలికత్తె. ద్వ. వి. (నెచ్చెలి+కత్తె-స్వార్థము.) ప్రాణస్నేహితురాలు. "ఉ. మ్రుచ్చిలి గంధ వారణ సమూహము కుంభవిలాస సంపదల్, మ్రుచ్చిలి మించు పయ్యెదలలోపల డాగుచు నుండు దెప్పు మీా, నెచ్చెలికత్తె చన్నుఁగవ నీవు విచారము సేయుమా..." నైష. ౧, ఆ. ౬౯, కు. సం. ౫, ఆ. ౬౧౦.

నెచ్చెలికాఁడు. దే. వి. (నెచ్చెలి+కాఁడు - స్వార్థమున.) ప్రాణస్నేహితుఁడు. "చ. అని వరమిచ్చి కరాలి రజతాద్రికి నెచ్చెలికాని వెంటఁదోడ్కొని చనుదెంచె." ఉ. రా. ౨, ఆ. ౩౧౧. పి. శకుం. ౪, ఆ. ౧౭౪.

నెచ్చెలికారము. దే. వి. స్నేహము.

నెచ్చెలితనము. ద్వ. వి. (నెచ్చెలి+తనము.) ప్రాణ స్నేహము. "సీ. ఇన్నియుండఁగఁ బంచి యిడుట నెచ్చెలితన మనుచు బంతెన గుండులాడు నొకఁడు." భాగ. ౧౦. స్కం. పూ. ౪౯౬.

నెచ్చెలియ. దే. వి. (నెఱ+చెలియ.) ప్రియసఖి. "శా. మేలంబాడుచు వచ్చె నెచ్చెలియపై మిథ్యాలసత్వంబు న్యాలోక్య లోలోపల వేడు కల్ నిగుడ..." వరాహ. ౪, ఆ. ౯.

నెచ్చెలువ. దే. వి. (నెఱ+చెలువ.) మిక్కిలి మనోజ్ఞురాలైనస్త్రీ. "సీ. తన జాతిజోమ్మ నెందిన మరు ద్గతి బంధు జీవంబు వడఁకె నెచ్చెలువ చూడు." ఉ. రా. ౧, ఆ. ౧౭౧.

నెటిక. దే. వి. వ్రేలిగనుపు, అంగుళిపర్వము. "చ. నెటికలు దీసి యిచ్చకమునేర్చి ప్రసంగము దీసి ...విటులఁ గలంచి తీయఁదగు విత్తము లుత్తమ వారకాంతకున్." విప్ర. ౪, ఆ. ౩౨, బహు. ౫, ఆ. ౧౬౬.

నెటికలువిఱుచు. దే. అ. క్రి. (నెటికలు+విఱుచు.) 1. వ్రేళ్లసంధులను విఱుచు. "ద్వి. అసలార నాయయ్యహస్తతలంబు నటుసోఁగఁ దిగుచుచు నప్పటి వ్రేళ్ల, నెటికలు విఱుచుచు నెమ్మినొత్తుచును." పండితా. పురా. ౧౨౪, పు. 2. ఏవగించుకొను. "సీ. తనకు లేమిని నొద్ద ధనము పెంపును జూచి విధిమీాఁద నెటికలు విఱిచి విఱిచి." పద్మ. ౨, ఆ. ౨౩౯.

నెటికె = నెటిక. (చూ. నెటికలువిఱుచు.)

నెటికెకత్తు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. తిరుగుడు బిళ్లలత్రిప్పట్లు జరుగుట్లు చిటితాళ మీాళలు నెటికెకత్తు." హంస. 3, ఆ. ౧౪౬.

నెటికెవిఱుచు = నెటికలు విఱుచు. (ఏవగించుకొను.) "సీ. మమతతో నాథుండు మాటాడియించుక యటు మొగంబైనచో నెటికె విఱుచు." శశాం. ౪, ఆ. ౩౨.

నెటుకురు. దే. వి. వీపు మొదలగువాని కీళ్లధ్వని కనుకరణము. "సీ. అష్టోత్తరశతప్రణామ్యత్ముఁడగు రాజ పిటకునకును వీపు నెటుకు రనియె." జై. ౯, ఆ. ౧౭.

నెటుక్కు. దే. వి. ఎముకలు మున్నగు వానిని ఖండించుటయందగు ధ్వని కనుకరణము. "దండకము...వజ్రసారాస్థిపాళిక్ నెటుక్కంచు ఖండించుచున్..." దశా. ౪, ఆ. ౨౩౨.

నెట్ట. దే. క్రి. విశ. అధికముగా. "గీ. విరహకాలంబు మరు బాణవితతిఁ గొన్న, గంటు లన్నియుఁ బ్రియుఁ గూడి కైపు మిగిలి, పెనఁగునెడ నెట్ట విరిసె నా వనితమేనఁ, గలయ నవనఖదంతవిక్షత ము లడరె." కు. సం. ౯, ఆ. ౧౭౯, య. ౪, ఆ. ౨౦.

నెట్టన. దే. క్రి. విశ. 1. అధికముగా. "ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్నుపలంబము సేసియోడతోఁ, గట్టినయోడవోలె గతగౌరవుఁ డైకడుఁ దూలె..." భార. సభా. ౨, ఆ. ౪౦, ఆం. శే. ౫౭; 2. అవశ్యము, తప్పక. "క...ముక్, గట్టినకర్మ ఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురెమను జుల్." భార. ఆది. ౫, ఆ. ౫౯, భాగ. ౧, స్కం. ౩౧౭; 3. శీఘ్రముగా. "ఉ...రాక్షస వధోచిత నీబలగర్వ మేదఁగా, నిన్ను వధించి యివ్వనము నెట్టన చేసెద నిర్భయంబుగాన్." భార. ఆది. ౬, ఆ. ౨౦౪. వి. పు. ౨, ఆ. ౧౯౩, 4. నిజముగా, యథార్థముగా. "ఉ. నెట్టనరూపనా సుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా, కట్టెఁడి

పీను లేమి విను కాఱియకోర్వవు..." భార. భీష్మ. ౧, ఆ. ౬౫, సా. పంచ. ౨, ఆ. ౧౧౧; 5. న్యాయముగా, పాడిదప్పక. "సీ. కవచధారణ మను ఘనవిద్య గప్పడి కే నెఱింగించితి నితఁడు దాని, నేర్పుట నీతని నెట్టన నొప్పింప శక్యంబు గాదు..." భార. ద్రో. ౨, ఆ. ౨౦౫; 6. కొంచెమైనను, ఇంచుకయైనను. "చ. అనవుఁడు చిన్నినవ్వునగి యన్నరుఁ డన్నమొగంబుఁ జూచి నె, ట్టన బలుమాట లాడఁగఁ గడంగఁగ నొల్లకయత్యుదాత్తతన్." భార. భీష్మ. ౧, ఆ. ౧౬౫; 7. చక్కఁగా, మనోజ్ఞముగా. "ఉ. నెట్టన యల్లలచ్చియును నీళయుం భూసతి యుండ నీకు నీ, నెట్టిక సీలపై మనసు నిల్పుట కేమనవచ్చు..." ఆము. ౬, ఆ. ౧౧౧; 8. సాహసించి, తెగువపూని. "క. నెట్టన సభలో నేవుర, కట్టైనర నరాతిజనము గాకెంతయు వా, రెట్టితులువలో ద్రౌపది, నట్టులు పటిచెడిద జూదమాడరె యెందున్." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౪, మార్క. ౧, ఆ. ౭౬; 9. అనాలోచితముగా. "చ... ఉదకంబుల నీ విటు కుండ ముంపఁగా, నినదము హాస్తినాద మని నెట్టన యేసితిఁ దప్పుసేసితిన్." భా. రా. అయో. ౧౮౬, భార. సౌ. ౧, ఆ. ౩౫.

నెట్టణము = నెట్టనము. విశే. యథార్థము. "సీ. ఎట్టివాఁడు గురుండు నెట్టణంబుగ శిష్యు లెవ్వరుసోదరు లెట్టివారు." శివయోగసారము ౨,ఆ.౧౯౦.

నెట్టనము. దే. వి. పెంపు, అతిశయము. "గీ...చెవులకు విందు గాఁగ, నెట్టనంబునఁ దేనియ లుట్టిపడఁగ." చిత్రభా. ౫, ఆ. ౩౪. విశే. 1. సంపూర్ణము. "గీ. దరిసెనంబిచ్చెఁ దాతలతరము దాఁటి, కట్టుబండి యొకర్తెకు నెట్టనముగ" రుక్మా. ౪, ఆ. ౧౦౪.; 2. అనివార్యము. "గీ. పాత్ర మెఱుఁగని చెనఁటి భూపతుల యిండ్ల, కెట్టినియతాత్మకులనైన నేఁగఁజేయు, ద్వారనిలయులు వారింప వారి నచట, నిలువఁబెట్టును గామంబు నెట్టనముగ." శివయోగసారము. ౨, ఆ. ౨౧.

నెట్టపంట. దే. క్రి. విశే. నిష్కారణముగా. "సీ... నెట్టపంట యనంగ నిష్కారణం బంట..." ఆం. శ. ౫౬.

నెట్టము. దే. వి. నెమిలియీఁకలతో పేనినదారముల పాగ. "గీ. నెమలి యీఁకలఁ జేసు దారముల పాగ, నెట్టమని పల్కఁగాఁ దగు..." ఆం. భా. తృ. ౩౪.

నెట్టించు. దే. స. క్రి. (నెట్టు+ఇంచు-స్వార్థమున.) 1. జయించు. "శా. సీలుక్ శౌర్యగుణాల వాలు ననిలో నెట్టించు వారే రిలన్." సీతావి. ౧, ఆ. ౧౦౬; 2. పెంపొందించు. "క. కట్టికరాలను మంటను, గట్టినదేవాలయములు గలిగిన వారల్, నెట్టించి రాలచేత్రను, గట్టించిన యిల్లు నొక్కగతి పుణ్యమగున్." శేష. ౨, ఆ ౯౨.

నెట్టిక = నెటిక. అంగుళిపర్వము. (చూ. నెట్టికసీల.)

నెట్టికసీల. యం. దే. వి. వ్రేలిగనుపులోని సీల. "గీ...గొరగపడుచు, నాడుచున్నది చూడు మూర్ధాభినయము, తాను నెట్టికసీలంత గాని లేదు." క్రీడా. ౧౪౩, ప్రభా. ౧, ఆ. ౧౦౪. వై. విశే. (సం. నైష్ఠికశీలః.) బ్రహ్మచారిణి; బ్రహ్మచారి. "ఉ. నెట్టన యల్లలచ్చి యల నీళయు భూసతియుండ నీకు నీ, నెట్టికసీలపై మనసు నిల్పుట కే మనవచ్చు..." ఆము. ౬, ఆ. ౧౧౧, పాండు. ౪, ఆ. ౧౭౯.

నెట్టియము=నెట్టెము. 1. చుట్టకుదురు. (శ.ర.బ్రౌ.); 2. తలపాగ, శిరస్త్రాణము. "వ...కెంజడముడి బిగియించి నెట్టియంబుచుట్టిన జగజెట్టి పాఁపతేనియాదల మాణిక్యంబుల కుఱంగలి మెఱుంగులు వెనువెంట మింట దాఁకను జరిగి .." భీమ. ౫, ఆ. ౮.

నెట్టు. దే. అ. క్రి. అధికమగు, అతిశయించు. "క. అనుటయు భగభగమండెడు, కనుఁగవతో నొడల నడరు కంపముతో నెట్టిన నిట్టూర్పులతో మొగ, మునఁదనికిన కెంపుతోడ మునిపతియుండెన్." ఉ. హరి. ౪, ఆ. ౮౯. స. క్రి. 1. త్రోయు; పడఁద్రోయు. "క. పెట్టిరి విషాన్న మంటం, గట్టిరి ఘనపాశములను గంగానదిలో, నెట్టిరి రాజ్యము వెడలం, గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకులై." భాగ. ౩, స్కం. ౧౩, కృ. శతం. ౨, ఆ. ౨౨౧, 2. తిరస్కరించు. "ఉ...వేడుచో, నప్పున నెట్టి పోఁ దడిగినన్ని వరా లిడుఁ గొండ మీఁదిలె, మ్మప్పని వంటి కావ్యపతియబ్బుట యబ్బురమిబ్బు ధాళికిన్." రా.వి. ౧,ఆ. ౨౬, వి. 1. త్రోపు, గెంటు. "గీ. కుఱుచ నెట్టున నందియల్ చఱచి మొరయ." కవిక. ౩, ఆ. ౧౫౧; 2. సాకము,

ఉపహాతి. "గీ. ఉపహాతియుఁ దావు నెట్టన నొప్పు చుండు." ఆం. భా. త్రి. ౯౦; 3. తావు, ఉనికి పట్టు. "గీ. ఉపహాతియుఁ దావు నెట్టన నొప్పు చుండు." ఆం. భా. తృ. ౯౦. ఆనంద. పీఠి. ౧౦౭; 4. పూనిక. "గీ. అంజక యశేషసుమనో వనా గ్రదేశ, ముఖర భూరిద్విజావళి మ్రోలనెట్టు, గానిలువ నేర్తు నాత్మయోగంబుఁ దొఱఁగి, సనుదు గాకని తాల్చె రూఢ ప్రతిజ్ఞ." హ. న. ౧, ఆ. ౨౫; 5. విషయము, సందర్భము. "క. ఐన న్నెనటువలెఁగా, నీనను కోరాదుగాక యెల్లసుగుణ ముల్, నేనీయకలేదు సుమీ, యీ నెట్టున నీవె మీఁద నెఱిఁగెదవింకన్." దశా. ౨,ఆ. ౩౩౬.బ బాలక్రీడా విశేషము. "సీ చీకటి మొటికిళ్లు చిమ్ము బిల్లలు నెట్లు బొట్టసగోలలు బొమ్మరాలు. గీ. ఆదిగా శైశవక్రీడలాడి రచట." వి. పు. ౭,ఆ. ౨౦౨.

నెట్టుకొను. దే. అ. క్రి. (నెట్టు+కొను.) 1. నివ సించు. "క. నెట్టుకొనియుండు నావర,పట్టన మున సకల దితిజ పతుల మకుటసం,ఘట్టిత పద పీఠుం డగు, నట్టి జగన్నాయకుండు హరి యెల్లపు డున్." పరమ. ౨, ఆ. ౬౦. కళా. ౩, ఆ. ౪౦; 2. పూనుకొను. "వ. నేనును నాధాతోత్తరీ యంబు నడుమం జుట్టుకొని నెట్టుకొని యుండితి." భో. ౭, ఆ. ౭౯. శివరా. ౨, ఆ. ౧౦౦; 3. అతిశయించు; విజృంభించు. "గీ. గురుని వెంబడిఁ దా నొక కొంత దూర, మరిగి యాతని యను మతి నంబుజారి, క్రమ్మరఁగ వచ్చు నాలోనఁ గంబుకంఠి, పట్టఁగూడని తమకంబు నెట్టుకొనఁగ." శశాం. ౩, ఆ. ౪, కాశీ. ౭, ఆ. ౧౩౩; 4. పట్టు పట్టు. "ఆ. నృప కులాబ్ధిచంద్ర నీవింత నెట్టు కొనంగఁ ద్రోచిపోవ నాకుఁ దగదు." భో. ౭, ఆ. ౨౩౬. దశా. ౭, అ. ౨, ఆ. ౨౯. స. క్రి. త్రోసికొను. "క. నెట్టుకొని నరునిఁ గనుచోఁ, బట్టనమునఁ గల సమస్త భామల కహా హా, యెట్టి విచిత్రమొ మనసునఁ, బుట్టిన వాఁ డపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ." విజ. ౧, ఆ. ౧౯౭.

నెట్టుకొలుపు. దే. స. క్రి. (నెట్టుకొను ధా. ప్రే.) ఉండఁజేయు, ఉంచు. "వ...అ జ్జలజభవుండు త ద్విరహదశా వికలితధైర్యుండయ్యు నుల్లంబునఁ గల్గ గుట్టు నెట్టుకొలిపి యిట్టటు దెల్పుటకుం జొరకుండి,.." కళా. ౯, ఆ. ౧౭.

నెట్టుడుగాయ. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ...ఒడ్డు, విడుపు నెట్టుడుగాయ పిండ్లమ్ము లాటలు...ఆడుకొంటిఁ, జదువుపై సంధ్యపై నాస్థ చాలలేక." హంస. ౩, ఆ. ౧౪౩.

నెట్టుపడు. ద్వ. అ. క్రి. (నెట్టు+పడు.) త్రోయఁ బడు. "సీ. తొలుదొల్త గుప్పెఁ గోలలు కొన్ని పైనేసి యవి నెట్టుపడి పోవ నాడు గఱచి." వాల్మీకి. ౨, ఆ. ౫౯.

నెట్టె. దే. వి. ఉద్ది, జత. "ద్వి. నింజారు ప్రేమతో నెట్టెలు గట్టి, చెండును దండంబుఁ జెలు వొప్పఁ బట్టి." రం. రా. బాల. ౨౧. పు.

నెట్టెము. దే. వి. 1. కిరీటము. "సీ తన యడుగుం దమ్ములను రాచ నెట్టెంపుఁ బులుదిండిజాతుమ్మె దలు మెలంగ." య. ౧, ఆ. ౯౭, 2. తలపాగ, శిరస్త్రాణము. "సీ. విసుమానములు గాఁగ వస తోడఁ బెనవెట్టి నెట్టెంబుగాఁ ద్రెవ్వు చుట్టి నాఁడు." స్వా. ౪, ఆ. ౭౩, హరి. పూ. ౬, ఆ. ౧౭౫; 3. అఱుపు, ధ్వని. "క. అని తలఁచి నిలిచి కివిం, బనివడి చిరజీవి యేరు పడ నొక నెట్టెం, బొనరించినఁ గ్రమ్మఱిపరి,మును మై యల్లో లులఁ జుట్టుముట్టిక బట్టెన్." వేం. పంచ. ౩, ఆ. ౧౯౭.

నెట్టోడు. దే. అ. క్రి. (నెట్టు+ఓడు.) చేష్టలు దక్కు. "ద్వి. బిట్టులిక్కి మూర్ఛిలి బిమ్మిటిఁ బొంది, నెట్టోడి లింగసన్నిహితులు దక్కి." బస. ౯, ఆ. ౧౩౦. పం.

నెడిమె. దే. వి. ద్వీపము. (శ. ర. బ్రా.)

నెత్త. దే. వి. మత్స్యవిశేషము. (బ్రా.)

నెత్తకమ్మ. దే. వి. (నెత్తము+కమ్మ.) పాచికల పందెము. "సీ. నిలు మహో బొంకకు నెత్తకమ్మ యటంచుఁ బత్తు లుల్కొడు నొయ్యఁ బలుక మనుచు." కళా. ౬, ఆ. ౧౨౦.

నెత్తటిల్లు. దే. అ. క్రి. శ్రమ దీర్చికొను. "గీ. వేడు కలు మీఱ సురతాంత వేళయందు, నెఱియఁగాఁ బూవుఁ బాన్పున నిద్రఁజెంది, నెత్తటిల్లిరి మల యాద్రి నిలయపవన, గతుల నూర్పులు విలసిల్లఁ బతియు సతియు." భాను. ౪, ఆ. ౫౭.

నెత్తపలక. ద్వ. వి. (నెత్తము+పలక.) జూదమాడెడు పలక, శారిఫలకము. "ఉ...క్రొత్త నెత్తపలకల్ తెరలుం బకధారిపాటు వా, పిట్టలగూండ్లు గ్రొమ్మె

ఱుఁగు బిందెలుఁ గొందఱు దెచ్చి రయ్యెడన్." వాల్మీకి. 3, ఆ. ౮౪.

నెత్తపుఁబలక. ద్వ. వి. (నెత్తము+పలక.) నెత్త మాడుపలక, అష్టాపదము. "సీ. అష్టా పదాభిధ లగుఁ జదరంగపుఁ బలక నా నెత్తపుఁ బలక నాఁగ." ఆం. భా. ద్వి. ౩౦౫.

నెత్తము. దే. వి. (దీనికి వృత్తియందు వైకల్పికముగా ముపర్ణలోపము.) 1. పాచికలాట, ద్యూతము; ద్యూతవిశేషము. "వ...ధర్మసూనుండు...... ఒక్కొక్కమాటు మధుర ప్రసంగంబుగా నాడిన నెత్తంబున గెలిచిన విత్తంబులు దమ్ముల కొసఁగుచుండు..." భార. విరా. ౨, ఆ. ౨, ఆం. భా. తృ. ౬౬; 2. పందెము. "సీ. తనకు లాగైన నెత్తంబు గైకొని పన్ని పాసికల్ తాళించి పాటెఱింగి." ఉ. హరి. 3, ఆ. ౧౨౦; 3. కొండమీఁది విశాల సమప్రదేశము. "సీ. ఉరుతర పూర్వభూధరము నెత్తమ్మునఁ బోలుచు గైరిక గండశిల యనంగ." దశకు. ౫, ఆ. ౨౮. స్వా. ౪, ఆ. ౭౮; 4. అందఱు పసుల మేపు కొనుటకై విడిచిపెట్టిన గయాళుభూమి, బీడు. "వ...కాల్గట్టి విడువ నెత్తంబున మెత్తని గఱిక మేసి..." ఆము. ౪, ఆ. ౩౪.

నెత్తమ్మి. ద్వ. వి. (నెఱ+తమ్మి.) తామర, విరిసిన తామర. "సీ. నెత్తమ్మిరేకుల మెత్తందనము దెచ్చి యచ్చునఁబెట్టి న ట్టిందమంది." భార. విరా. ౨, ఆ. ౫౨. ఆం. భా. తృ. ౬౨.

నెత్తమ్మికొలనికాఁపు. ద్వ. వి. గాలి. వే. ఆం. ౧౫.

నెత్తమ్మివిరివిందు. ద్వ. వి. సూర్యుఁడు. "గీ. తోఁచె నెత్తమ్మివిరివిందు తూర్పునందు." రాజ. చ. 3, ఆ. ౨౯.

నెత్తఱి. దే. వి. (నెఱి+తఱి.) 1. కడుపుమీఁది ముడుత. "సీ. నాళీకముఖికి నెన్నడుము గానఁగ నయ్యె దనరు నెత్తఱుల చిత్తరము దరలె." వసు. 3, ఆ. ౨౦. ఆం. భా. ద్వి. ౧౩౭; 2. పెద్దయల, కల్లోలము. "చ...చదలేటి నీటి నెత్తఱుల జనించు క్రొన్నురువు దండములై." నృసిం. పీఠి. ౪, చంద్ర. ౪, ఆ. ౨౫.

నెత్తావి. దే. వి. (నెఱ+తావి.) నిండు పరిమళము, సువాసన. "సీ. అరవిరి నెత్తావి నడరించు నున్నిద్ర విటపీటి సౌరభ పేతతి వొదల." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౨. కాశీ. పీఠి. ౪౫.

నెత్తి. దే. వి. తల, శిరము. "గీ. కాకియైన గ్రద్దయిన నలూకమైన, నెత్తి సోఁకిన నాఁ డారునెలలఁ గెడయుఁ." జై. ౮, ఆ. ౯౮, భార. శాం. ౬, ఆ. ౧౨౯. [శిరము. (శ. ర. బ్రౌ.)

నెత్తికాయ. దే. వి. (నెత్తి+కాయ.) తలకాయ,

నెత్తురు. దే. వి. బౌ. రక్తము. "క. అత్తఱిఁ బాషాణంబులు, నెత్తురు నెమ్ములును గురిసె..." భార. ఉద్యో. ౪, ఆ. ౧౬౦. భార. భీష్మ. ౧. ఆ. ౧౮౩.

నెత్తురుఁగందు. ద్వ. వి. (నెత్తురు+కందు.) బొత్తు పాప, పసిబిడ్డ. "గీ. కటకటా యిట్టి నెత్తురుఁ గందు నిచట, వైచి పోవంగ వలసెనే నీచగతిని." భో. ౬, ఆ. ౨౫. పి. శకుం. ౨, ఆ. ౧౪౭.

నెత్తురుఁగళ. మి. వి. (నెత్తురు+కళ.) నెత్తురు చూచుటవలనఁ గల్గు మూర్ఛ. "వ...తెట్టువలు గట్టియున్న క్రొన్నెత్తురులు గనుంగొని నెత్తురుఁ గళవట్టి తమకుఁ దామ వ్రాలువారును..." కువల. ౨, ఆ. ౧౪౮.

నెత్తురుఁద్రావుడు. దే. వి. (నెత్తురు+త్రావుడు.) అస్రపుఁడు, రాక్షసుఁడు. "క. అత్తఱి నీల్గక చిక్కిన, నెత్తురుఁద్రావుడులవలన నెవ్వడిఁజాల్పక్, గుత్తుకల రక్కసుఁడు విని .." అచ్చ. యు. ౧౯౬. అచ్చ. యుం. ౬౦.

నెత్తురుఁబొడ. దే. వి (నెత్తురు+పొడ.) ముఱుఁబాము, ఎఱ్ఱపొడలు గల ఒక జాతిపాము. (శ. ర. బ్రౌ.)

నెత్తురుఁబొత్తు. దే. వి. (నెత్తురు+పొత్తు.) ప్రాణస్నేహితుఁడు. "క. ఇత్తెఱఁగునఁ దొయ్యలికిన్, నెత్తురుఁ బొత్తగుచు నతఁడు నిచ్చలు మదిలో, హత్తిన ప్రేముడిఁ జదివెడు, నత్తఱి నొకనాఁడు జేపటంత కడంకన్." య. 3, ఆ. ౧౧౫.

నెత్తురుఁబ్రొద్దు. ద్వ. వి. (నెత్తురు+ప్రొద్దు.) మధ్యాహ్నము. "వ...అత్తఱిఁ గడింది నెత్తురుం బ్రొద్దగుట..." స్వా. ౪, ఆ. ౬౦.

నెత్తురుగడ్డ. దే. వి. (నెత్తురు+గడ్డ.) ఒక విధమగు కుఱుపు, సెగగడ్డ. (బ్రౌ. వా.)

నెత్తురుబంక. ద్వ. వి. (నెత్తురు+బంక.) మల ద్వారమునుండి బంకవంటి నెత్తురుపడువ్యాధి విశేషము, రక్తగ్రహణి. (వా.) మలముతో

నెత్తురును జీగురును పశువ్యాధి విశేషము, గ్రహణి అని. (శ. ర. బ్రౌ.)

నెత్తురువాఱు. దే. అ. క్రి. (నెత్తురు+పాఱు.) ఎఱ్ఱనగు, జొత్తిల్లు. "క. కడలును నెత్తురు వాఱఁగఁ దొడఁగెన్..." హరి. పూ. ౬, ఆ. ౪౫. (శ. ర. పా. నెత్తురుఁబాఱు. ముద్రి. పా.)

నెత్రు = నెత్తురు. "గీ... నెత్రుటేఱుల నీఁది..." భార. భీష్మ. 3, ఆ. ౨౨౫.

నెనడు. దే. వి. ఎముకలలోని క్రొవ్వు. మజ్జ. "చ... నెత్తురున్, నెనడును గ్రోలి భూతములు నిక్కుచు నీల్గుచుఁ జొక్కుచుండఁగన్." భార. ద్రో. ౨, ఆ. ౩౧౨, భార. ఉద్యో. ౬, ఆ. ౧౮౪.

నెనరు. దే. వి. 1. ప్రేమ, "క... ఆభంగిన్, జననత నూఱులఁ దెచ్చికొని, నెనరు విడిచి యానెలంత నిష్ఠురమతియై." భార. అను. ౧, ఆ. ౧౯౬, వసు. 3, ఆ. ౭౪; 2. స్త్రీపురుషుల వలపు, మోహము "గీ. నిన్నుఁ జూచు నహల్యకు నెనరు లేదె, హృదయ మియ్యదు పతిభీతి నింతె కాక." దశా. ౭, ఆ. ౧౦౮, సా. ౨, ఆ. ౬౧; 3. దయ, జాలి. "గీ. ఆకు దేరుఁడు నవ్వి బళా మతేమి, దశముఖుఁడు మంచిపని సేయఁదలఁచె హితవు, దలఁచినన్ మఱిముక్కుకోఁత లనుమాట, నేఁడు నిజమయ్యె నీక నేల నెనరు దలఁప." ఉ. రా. 3, ఆ. ౬; 4. పరిచయము, స్నేహము. "ఉ... తానునుం, దానును నేఁటి దాఁక మమతం దగ నర్మిలిఁ గూడియున్నవా, రానెనరైననుం దలఁ పడయ్యెను దీని గణించిమేనియఁన్." విప్ర. ౪, ఆ. ౭౨. విశే. 1. ప్రేమాస్పదము, ప్రియము. "గీ. వనిత నాకన్న నెనరైనవారు నీకుఁ, గలుగ నేర్తురె..." భాగ. ౧౦, స్కం. ఉ. ౩౪౦; 2. కృతజ్ఞుఁడు. "సీ. దీవెనల్ వినయవిధేయత తోడఁ జేకొనుచును వెండియుం నెనరు దొరలు. ఆ. గౌరవము లొనర్పఁ గైకొంచుఁ గ్రమమున ..." రాఘవ ౨, ఆ. ౧౬.

నెనవు. దే. వి. సంస్మృతి. "క వనజనిభాకారుండై, వననిధిలోఁ దేలుచున్న వటపత్త్రముపైఁ, దనుఁ దాన చూచి చొక్కుచు, నెనవున నానందయోగ నిద్రం జెందున్." వేం. మా. ౬, ఆ. ౨౪౬.

నెన్నడ. దే. వి. (నెఱి+నడ.) చక్కనినడక. "సీ. నెఱనీటు గులుకులే నెన్నడల్ పరికించి కదు మందగతిఁ గాంచె గంధకరటి." దశా. ౨, ఆ. ౩౦౨, ఉ. రా. ౪, ఆ. ౧౯౭.

నెన్నడపు. దే. వి. (నెఱి+నడపు.) చక్కని నడక. "సీ. పూఁదీఁగఁబోఁడి చూపులు చంచలములని మెలపు నెన్నడపున మేళవించె." విక్ర. ౪, ఆ. ౧౭.

నెన్నడుము. దే. వి. జా. 1. (నెఱు+నడుము.) నట్టనడిమిప్రదేశము. "గీ. నాగవల్లీదళంబు నెన్నడుమఁ జేరి, మడిచి యందిచ్చినపుడు గోరిడుదుఁ గేల." నైష. ౮, ఆ. ౮౪, కాశీ. ౧, ఆ. ౩౭; 2. (నెఱి+నడుము.) చక్కని కౌను. "సీ...పిడికిట నడఁగు నెన్నడుముదాని. గీ. సొగసు నడదాని నక్కన్నెఁ జూచె నతఁడు." ఉ. రా. ౨, ఆ. ౧౨౮, హరి. ౫, ఆ. ౨౭౬.

నెన్నుదురు. దే. వి. జా. 1. (నెఱు+నుదురు.); 2. ఫాలము; విశాలఫాలము. "మ... అద్భుత కేల్దోయి నె, న్నుదుటన్ జేరిచి పల్కెఁ గ్రమ్మరమదాంధుండా దశగ్రీవుతోన్." ఉ. రా. ౨, ఆ. ౩౧౧, దశా. ౧, ఆ. ౧౨౩; 2. (నెఱి+నుదురు) చక్కని ఫాలము. "మ. పదియార్వన్నె పసిండి పట్ట మవనీపాలావతంసంబు నెన్నుదుటం గట్టె లతాంగి యొర్తు..." శైవ. ౬, ఆ. ౫౩.

నెన్నెఱులు. దే. వి. బ. (నెఱు+నెఱులు.) దీర్ఘకేశములు. "సీ...నగారి కైతవంబునఁ బరిచర్య సల్పుచు వినీతుఁడై యుండి యొక్కనాఁ డంఘ్రి నెన్నెఱు లంట నశుచియై కూర్కు నెయ్యతివ కుత్తే. గీ. దూఱి..." చం. రా. ౩, ఆ. ౨౭.

నెన్నొసలు=నెన్నుదురు. (ఫాలము; విశాలఫాలము.) "చ. జలజభవుండు నెన్నొసట వ్రాసిన సొమ్ము ఘనంబో కొంచెమో, విను మరుభూమి కేఁగిన లభించును..." భర్తృ. ౧, శ. ౪౧, (చక్కని నుదురు.) "సీ. చిన్నిక్రొన్నెల నెన్ను నెన్నొసల్ల నొయారి యలఁతి కస్తురిరేక లనువుమీఱ." అచ్చ. బాల. ౮౭.

నెపపడు. వై. అ. క్రి. (నెపము+పడు.) నెపము నొందు, దోషియగు. "క. కృపఁగట్టి పెట్టి మీపాపపు బిడ్డలఁ బట్టిపట్టి పగవుట్టి విని, ప్పపటుఁ గథనకునిఁ బొరిఁ గొని, నెపపడి పడియుండెడు వాఁడనే నే నకటా." వేం. పంచ. ౧, ఆ. ౫౧౪.

నెపము. వై. వి. (సం నిభః. క. నెవ, నెపవు. త. నిపమ్.) 1. వ్యాజము, మిష. "క. ఉపవాసాదుల

సంబున, నృపముఖ్యాదుస్సహామున నీవు దలఁచి యజ్ఞపు రక్షము దుర్ఘటమను, నెప మిడి యిట్లిడి గితని మనీషం గంటిన్" భార. ఆను. ౪, ఆ. ౧౬౭, స్వా. ౨, ఆ. ౪౧; 2. కారణము, హేతువు. "క. విపరీతమతిని సుందుఁడు, నుపసుందుఁడుఁ దాఁకి పొడిచి రొండొరులొడల్, గుపితాత్ము లయి తిలోత్తమ. నెపమున దృఢముష్టి ఘాత నిర్ఘాతములన్." భార. ఆది. ౮, ఆ. ౧౧౭, రం. రా-ఉ. ౩౭, పు.; 3. ఉపాయము. "సీ... అథార్తరాష్ట్రుండు గాంధార రాజతనయుం వచన ముల్ విని యతిపతి నెపంబున వానిఁగొని సమ కట్టి..." భార. ఆర. ౧, ఆ. ౫౫; 4. తప్పు, దోషము. "చ. తివిరి మురారి నీకుఁ గడుఁదీపుగఁ జెప్పిన పల్కుఁగల్గినన్, గువలయనేత్ర నీమనసు గూడిన వారికి నైన నెప్డుఁ జెప్పవలదు దాన నొండొక నెపంబు ఘటించెంతు రెటింగి రేని నీసవ తులు..." భార. ఆర. ౫, ఆ. ౩౧౮. కాశి. ౩, ఆ. ౯౦; 5. విధము. "గీ. ఎంత కాలంబు నకు నాకు నేనెపమున, శాపమోక్షంబు గలి గెడు..." చిత్రభా. ౩, ఆ. ౯౭, శివ. సా. ౧౭౮. విణ. ఉపయుక్తము, కార్యకారి. 'చ... నా, యలవులుబలంబుఁ జూప నెపమై తగు సాధన మెద్ది కల్గునో." భార. ఉద్యో. ౧, ఆ. ౧౩౮.

నెప్పరము = నెప్పళము. (శ. ర.)

నెప్పళము. దే. వి. వేగము, త్వర. "క. అప్పుడు నారద సంయమి, చెప్పిన వికిళివళంబు చిత్తాబ్జ ములో, నుప్పతిల నంచ లేచె, నెప్పళమున నెక్కి నలువ విలువక వచ్చెన్." వరాహ. ౭, ఆ. ౩౩. పారి. ౪, ఆ. ౬౬.

నెప్పరి. దే. విణ. (నెప్పు+అరి.) నేర్పుకలది; నేర్పు కలవాఁడు. "క. అప్పరిఁగల యుప్పరిగల, నెప్పరు లగు మగువ లెక్కి నిక్కి తమ నెఱిం, గొప్పులఁ గల కల్పకముల, గొప్ప సుమము లేరి కోరి కోయుదు రదనన్." ముకుంద. ౧, ఆ. ౨౬. పు.

నెప్పరించు. దే. స. క్రి. మూదలించు, నిరూపించు. (శ. ర. బ్రౌ.)

నెప్పుఱు. దే. అ. క్రి. (నెప్పు+అఱు.) స్థానభ్రంశ మొందు. "ఉ. అప్పుడు దానవాధము భయం కరరూపముఁ జూచి సాధ్వసం, బుప్పతిలన్ మహీతల యుత్కూర్వరవ్రాలె హారిత్కరీంద్రముల్, నెప్పుఱి కూలి తూలె..." రామా. ౫, ఆ. ౧౮౭, రామా. ౩, ఆ. ౩౧.

నెప్పు. దే. స. క్రి. గెంటు, త్రోయు. "మ... జీవుఁడు, ధ్రువకాలంబున సూతిమారుతము నెప్పఁగ యోనిమార్గంబునన్, భువికిన్ వెల్వడి మోహ పాశనికరంబుల్ దన్ను బంధించినన్." వ. వరాహ. ౩, ఆ. ౫౦. వి. 1. నెలవు, స్థానము. "వ...గవ ముంబులకు నిలయంబు దుష్టులకు నెప్పును..." శుక. ౨, ఆ. ౨౪౫. అం. భా. ద్వి. ౧౩. 2. ఉపాయము. (చూ. నెప్పరి)

నెప్పుకొను. దే. అ. క్రి. (నెప్పు+కొను.) పాదు కొను. "సీ. నెలనెప్పుకొని రొప్పుపులినైనఁ బీడించి పడవైతుఁబొచ్చి నీపాదమాన." స్వా. ౪, ఆ. ౩౪, శుక. ౨, ఆ. ౧౧.

నెమకు. దే. స. క్రి. వెదకు, అన్వేషించు. "సీ. తన మణిపడిపోవ ధరణీతలంబున నెమకంగ వచ్చిన నింగి యనఁగ." పారి. ౨, ఆ. ౩౪.

నెమకుడు. దే. వి. (నెమకు ధా.) వెదకుట, అన్వే షణము. "సీ. వెదకుడు తడవుడు వెనకుడు రోయుడు నెమకు డనంగ నన్వేషణ మగు." అం. భా. ద్వి. ౧౭౩.

నెమరు. దే. వి. పశువులు మ్రింగిన ఆహారమును మరల నోటికిఁ దెచ్చుకొని చక్కఁగా నమలుట, రోమంథము. "గీ. నెమరు నాఁగను రోమంథ మమరు..." అం. భా. ద్వి. ౨౬౩.

నెమరుపెట్టు. దే. అ. క్రి. (నెమరు+పెట్టు) పశు వులు మ్రింగిన యాహారమును మరల నోటికిఁ దెచ్చుకొని చక్కఁగా నమలు, రోమంథముచేయు. "సీ. ఒద్దిక మీఱంగ నొక్కెడ వసియించి యెడ నెడ నెమరుపెట్టెడి విధంబు. గీ. గాంచి యెక్కడినుండి యిక్కడికి వచ్చెనో క్కొయా యావు దూడయు..." దశా. ౯, ఆ. ౩౦, పారి. ౨, ఆ. ౯౫.

నెమరువేయు = నెమరువెట్టు. (వా.)

నెమరుచు. దే. అ. క్రి. నెమరువేయు.

నెమర్చు = నెమరుచు. "చ. ప్రమదము లుల్లసిల్లఁ దను పారఁగ నిద్రలుపోయి సల్లయుం, గమియ నెమర్చి..." హరి. పూ. ౮, ఆ. ౧౬౫.

నెమలి. దే. వి. (క. నెమలి.) 1. మయూరము. "సీ. నెమలి పోఁగలఁగేరు నెఱి కురుల్ గల

హంసముల గెల్చు గతులవారి." భాను. ౪, ఆ. ౭౫, క్రీడా. ౫౧; 2. పూతికరంజము॥. "సీ. నెమిలియడుగు మ్రాను నెమలి యంచనఁ గను బూతికరంజంబు పొల్చు..." ఆం. భా. ద్వి. ౪౮.

నెమిలి = నెమలి. మయూరము. "గీ. పక్షములు గప్పి పసిపాప పాములకును, మేపు లొసఁగి రక్షించు నెమిళ్లు....." జై. ౪, ఆ. ౭౯. దశా. ౮, అ. ౩౦౮.

నెమిలియడుగు. దే. వి. పూతికరంజము॥. "సీ. నారువ సురపొన్న వారిజమును బొన్న నెల్లి మూలుగ బిల్లు నెమిలియడుగు." హంస. ౪, ఆ. ౧౧, ఆం. భా. ద్వి. ౫౮. బ. కుచనఖక్షతములు. (శ. ర.)

నెముక = ఎముక. దే. వి. అస్థి, శల్యము. "ద్వి. కత్తి శంబులు చించి కంతముల్ నఱకి, నెత్తురు లడరించి నెముకలు విఱిచి." సిం. భాగ. ౨, ౬.౨. పు.

నెమ్మది. ద్వ. వి. (నెఱ+మది.) 1. నిండుమనస్సు; మనస్సు. "ఉ...ఒకయప్పుడు జన్మము లేక యుండుటకై, యారయ శ్రీనగంబు శిఖరాగ్రముఁ జూచినఁ జాలు నెమ్మదిన్." విక్ర. ౧, ఆ. ౨౦౦, వసు. ౩, ఆ. ౧౩౦; 2. శాంతి, నిశ్చింతత. "క. మమ్ము నరయం భరమున నీ, విమ్మెయిఁ దలపోసి తెంక నిచ్చుట నేలా, నెమ్మది నిద్రింపంగాఁ, బొమ్ము..." భార. ద్రో. ౨, ఆ. ౩౧౭, భార. ఆర. ౬, ఆ. ౧౬౦; 3. ఆరోగ్యము. (వ్యవ.) ఎన్నిమందు లిచ్చినను వానికి నెమ్మది కలుగలేదు; 4. సుహృదయము. "ఆ...సుహృదయము నెమ్మది యనఁదగు మహేశ." ఆం. భా. ప్ర. ౧౦౦, భార. శాం. ౧, ఆ. ౩౮౮.

నెమ్మనము. మి. వి. (నెఱ+మనము.) నిండుమనస్సు; మనస్సు. "సీ. రఘువంశతత్కృపా సమభ్యుదిత సంతోషంబు నిండి దైవాఱె నా నెమ్మనమున." హర. ౪, ఆ. ౫౮, ఉ. హరి. ౧, ఆ. ౧౪౬.

నెమ్మలిపరుఁజు. దే వి (నెమ్మలి+పరుఁజు.) కత్తిపిడి. "సీ...ఖడ్గాదిముష్టి సంగ్రాహ్యతలము. గీ. పరుఁజనఁ బరుంజనం గను బరఁగునదియె, చనును నెమ్మలి పరుఁజు గాజాపరుఁజన." ఆం. భా. ద్వి. ౨౧౫.

నెమ్మి. యం. దే. వి. 1. మయూరము. "సీ. నెఱివేణి మెఱయించి నెమ్మిబోదను రేఁచి వడిఁ గేక వేయించె వనితయొకతె." చంద్రా. ౩, ఆ. ౯౭, రసిక. ౩, ఆ. ౧౧౭; 2. ప్రేమము; అనురాగము. "గీ...కరము, నెమ్మిఁజేసితి దీనిఁ బాణిగ్రహణము." భార. ఆది. ౪, ఆ. ౧౦౫ భార. ఉద్యో. ౨, ఆ. ౩౪; 3. సంతోషము. "క. త్రిణయనుఁడు వరమువేఁడుము, దనుజాధిప యనుఁడు నతఁడు తద్దయు నెమ్మిన్." ఉ. హరి. ౬, ఆ. ౨౩౧, భార. ఆది. ౫, ఆ. ౨౪౨; 4. మైత్రి, స్నేహము. "క. మిత్ర నరపతుల శాత్రవ, ధాత్రీశుల నెమ్మిఁ బరుసఁదనమున వశతా, పాత్రములుగఁ జేయుదె .." భార. ఆశ్ర. ౧, ఆ. ౪౮, ఆం. భా. ద్వి. ౧౮౬; 5. క్షేమము. "గీ. అన్నగాదిలి చుట్టమ వగుచు జేని, నెమ్మి యొఱఁగించి యుసురులు నిలిపి నట్టి, ని న్నొకింతయు నగ్గింపనేర..." అచ్చ. సు. ౮౬, భార. సభా. ౧, ఆ. ౩౯; 6. అనుగ్రహము, దయ. "ఆ...పెక్కులేండ్లు నిష్ఠ, గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర నెమ్మి వడసెఁ దనదు నేర్పు పేర్మి." భార. ఆది. ౩, ఆ. ౧౧౦; 7. శ్రద్ధ. "ఉ. నెట్టన నశ్వమేధములు నెమ్మి ననేకముచేసి వైరులం గిట్టి వధించి లోకములఁ గీర్తి దళంబుగ నించె మించఁగా." వి. పు ౫, ఆ. ౭౫; 8. గౌరవము. "ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యెక్కకాంత రూ, పెక్కుడు పెంపు సొంపు మన కేర్పడుచున్నది తా వినీతయై, స్రుక్కుచు నీచభామినుల చొప్పునఁ బల్కెడుఁ బౌరులుం గడున్, వెక్కసమంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్." భార. విరా. ౧, ఆ. 303. వై. వి. (సం. నేమిః.) 1. పంజాలము, తినాసము॥. "వ ..నెమ్ముల జమ్ముల నేరేళ్ల మారేళ్ల కలువుల బలువులఁ గొడిసెల నొడిసెల..." వి. శకుం. ౨, ఆ. ౧౪, ఆం. భా. ద్వి. ౪౩; 2. బండిచక్రమునకుఁ జుట్టునుండు కమ్మి. "ఆ. అంచు లైదు నెమ్ములాఱు నాభులు మూఁడు, గలిగి సూక్ష్మగమన కలితమగుచు, సంయమీంద్ర వినుము సంవత్సరాకృతిఁ, గాలచక్రమందుఁ గ్రాలుచుండు." వి. పు. ౩, ఆ. ౧౫౮. ఆం. భా. ద్వి. ౨౦౨.

నెమ్మించు. దే. అ. క్రి. (నెఱ+మించు.) అతిశయించు. "వ...లేఁత వెన్నెలల నెమ్మించు క్రొమ్మించులుం గల మేడలును..." పి. శకుం. ౧, ఆ. ౧౬.

నెమ్మిక. దే. వి. (నెమ్మి+ఇక-స్వార్థమున.) ప్రేమ, అనురాగము. "ఉ. నేయము లజ్జయుం గరుణ నెమ్మిక కోపభయైకవేశమే, నే యెడఁ జూచినన్ మదికి నించుక యించుక..." రస. 3, గుచ్ఛము. (శ. ర. పా.)

నెమ్మిజుట్టు. ద్వ. వి. (నెమ్మి+జుట్టు.) బర్హి చూడము చూ. (శ. ర.)

నెమ్మిరవుతు. ద్వ. వి. (నెమ్మి+రవుతు.) శిఖివాహనుఁడు, కుమారస్వామి. (శ. ర)

నెమ్మిఱేఁడు. ద్వ. వి. (నెమ్మి+ఱేఁడు.) కుమారస్వామి. (శ. ర.)

నెమ్మిలి = నెమిలి. (శ. ర.)

నెమ్మిసేయు. దే. అ. క్రి. (నెమ్మి+చేయు.) ఇష్టపడు, ఉత్సహించు. "గీ. ఊరు సంవాహనమునకు నుత్సహించు, ఘననితంబంబు పైనుండ మనసువెట్టు, నిమ్ననాభికి డిగ్గంగ నెమ్మిసేయుఁ, బద్మలోచన మరగి భూపాలు కరము." నైష. ౭, ఆ. ౧౭౨.

నెమ్ము. దే. వి. 1. తడి, తేమ. (శ. ర.); 2. రెండువైపులను మొనగలిగి బల్లలు మొదలగువాని నంటవేయుట కుపయోగించు మేకు. "ద్వి. తలుపు నెమ్ములు గ్రక్కదలఁ దన్నుఁ డనుచు." పండితా. దీక్షా. ౪౩. పు; 3. ఎముక, అస్థి. "సీ. అస్థి మయూరాఖ్య లలరు నెమ్ము లనంగ." ఆం. భా. తృ. ౪౭, చంద్రా. ౬, ఆ. ౧౫; 4. నేమి, బండిచక్రమునకు చుట్టునుండు కమ్మి. "గీ. నేమి దనరారుచుండును నెమ్ము నెమ్మి, కమ్మి యనఁగను..." ఆం. భా. ద్వి. ౨౦౨.

నెమ్ముకొను. దే. అ. క్రి. (నెమ్ము+కొను) చెమ్మగిల్లు. (వా.)

నెమ్మేను. దే. వి. (నెఱి+మేను.) చక్కనిశరీరము; శరీరము. "గీ. అతుల మాణిక్యదీపము లార్పరామిఁ, దనదు నెమ్మేని చాయ నత్యతిశయించి, యున్న యండిగంపుఁ బూఁబోండ్ల..." దశా. ౧, ఆ. ౨౭౦, ఆం. భా. ద్వి. ౧౩౪.

నెమ్మొగము. ద్వ. వి. 1. (నెఱ+మొగము.) నిండుమోము; మోము. "చ. నగరిసమీపమైన నరనాథుని సన్నిధి కోహటించి నెమ్మొగము వివర్ణతం బొరయ నేఁగె...లక్ష్మణ కుమారకుఁడా నృపుఁ డున్నచోటికిన్." నిర్వ. ౯, ఆ. ౬౯, ఆము. ౨, ఆ. 3౦; 2. (నెఱి+మొగము.) చక్కని ముఖము. "చ. పుడమి ధనంబు నాకము విభూతయుఁ జేరెనయేని నల్ల నవ్వెడు నభిమన్యు నెమ్మొగము వేయగు పాలును బోల నేర్చునే." భార. ద్రో. ౨, ఆ. ౧౪౫.

నెమ్మోము=నెమ్మొగము. (నిండుమొగము, మొగము.) "సీ. చెలువంపు నెమ్మోము నెలమి సొంపినుమడిగా నల్ల నవ్వినఁ గాదె యింతి." భార. విరా. ౨, ఆ. ౪౫. (చక్కని ముఖము.) "సీ. దౌ హృదశ్రీ నిల్చు ధవళాంబుజముపోల్కిఁ దెలిగంటి నెమ్మోము దెల్లనయ్యె." ఉ. రా. ౨, ఆ. ౧౩౭.

నెయి. దే. వి. ఆజ్యము. (దీనికి ప్రథమైక వచనమందే ప్రయోగములు కనఁబట్టుచున్నవి.) "గీ. బూదిలో వేల్చు నెయివోలె బొల్లువోవు." శేష. ౫, ఆ. ౨౫౧, కాశీ. ౪. ఆ. ౩౪.

నెయ్యపుఁగలను. ద్వ. వి. (నెయ్యము+కలను.) సురతము. "మ. పలుకుం జిల్కలకోల్కి రాచిలుక బాబా సాహిబూ నెయ్యపుం, గలనన్ సౌఖ్యముఁగాంచి సై బడలఁగా..." దశా. ౧, ఆ. ౨౬౮.

నెయ్యపుఁగినుక. ద్వ. వి. (నెయ్యము+కినుక.) ప్రణయకోపము. "చ. నను భవదీయ దాసుని మనంబున నెయ్యపుఁ గినుకఁబూని తాఁచిన యది నాకు మన్ననయ..." పారి. ౧. ఆ. ౧౨౩. ఇట్లే: నెయ్యపుటలుక. ఆం. శే. ౬౨.

నెయ్యమాడు. ద్వ. అ. క్రి. (నెయ్యము+ఆడు.) చెలిమిచేయు. "సీ...నూగారు సౌరు శంబర వైరి నిడువాలు వాలుతో నెయ్యమాడ." వి. పు. ౨, ఆ. ౨౦౯.

నెయ్యమి. వై. వి. (సం. స్నేహః.) 1. మైత్రి, స్నేహము. "సీ. నెయ్యము నేస్తము నెయ్యమి సంగడి...గీ...పొందికః యనఁ, బరగుచుండును మిత్రభావంబు..." ఆం. భా. ద్వి, ౧౯౬. 2. ప్రేమ, అనురాగము. "సీ. నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము...గీ .. మక్కువ యనఁ, బ్రేమ దోఁచును." ఆం. భా. ప్ర. ౧౩౬. 3. ఉత్సాహము. "క. అయ్యా కల దొకయుపవన, మియ్యె

పవనసీమ నిప్పుడే నేర్పుగలిక్, నెయ్యమి నొక భూజపుర, మొయ్యన రచియించితిని సముజ్జ్వలభంగిన్." చమ. ౧, ఆ. ౧౯౦.

నెయ్యము. వై. వి. (సం. స్నేహః.) 1. స్నేహము, మైత్రి. "క. రమణి నిజభ్రాతృవిభో, గముc దలcపక యుధుడు భీము గలసెc బతిస్నే, హము కామితఫలదు బలవంతము వెఱనెయ్య ములు కోయుc దస్వప్నములే." భార. ఆది ౬ ఆ. ౧౯౧. ఆం. భా. ద్వి. ౧౦౬. 2. ప్రేమ, వలపు. "ఉ. నెయ్యములేని సంగతియు నిక్కములేని వచోవిలాసముల్ ..., కయ్యములేని శూర తc గాcగ నైనాని యూరక మెచ్చవచ్చునే." ఉ. హరి. ౫, ఆ. ౩౨, నరస. ౩, ఆ. ౪౨. 3. ప్రీతి, సంతోషము. "గీ. అట్టి గోలోకమున యందు సధి వసింతు, రధవ్రుచేc బ్రాప్త ప్రాప్తు నెయ్యంబుc గవము." కాశీ. ౨, ఆ. ౨౭. విక్ర. ౪, ఆ. ౯౭. 4. మనోజ్ఞత. "సీ. నాcటినాcటికిc బ్రోగి నవకంపుc గివల నునుబోవ నెయ్యంబు నూలుకొలిపె." భాగ. ౭, స్క. ౬౬౬. 5. చుట్ట ఱికము. "గీ. ఒకవు తకవు లటంచు నెయ్యంబు లనుచు, నంపకములంచు మఱియెన్ని యైనc గలవు, కాcకులు..." నవల. ౩, ఆ. ౯౫, భార. ఉద్యో. ౧, ఆ. ౨౭౧. 6. వేడుక, ఆసక్తి. విణ. ప్రియము, ఇష్టము. "సీ. నీకుc బ్రెగ్గడయును నెయ్యంపుc జెలికాcడునై కయ్యంబునను నెప్పుc గాలు ద్రవ్వ" భార. ఉద్యో. ౪, ఆ. ౨౩౪, దశా. ౨, ఆ. ౧౩౦.

నెయ్యరి. ద్వ. విణ. (నెయ్యము+అరి.) స్నేహితు రాలు, స్నేహితుcడు. "సీ. నేర్పులేక చెడెంగ నెండ వేగురుకుండి యడనోడు వారు నెయ్య రులుగారు." రామా. ౭, ఆ. ౭౪, (శ.ర.పా.)

నెయ్యి. దే. వి. (దీనికి ప్రథమైక వచనమునందే ప్రయోగములు కన్పట్టుచున్నది.) 1. ఆజ్యము. "సీ. ప్రక్షాళితంబైన పసిండి చట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి." కాశీ. ౬, ఆ. ౧౪౧. విక్ర. ౩, ఆ. ౬౪; 2. క్రొవ్వు, చమురు. "క. చెడు గళ్లల గ్రుచ్చినం, జూడు మంటలc దగిలి నెయ్యి జొటజొట వడియున్." స్వా. ౪, ఆ. ౧౭.

నెయ్యుcడు. వై. విణ. (సం?) 1. మిత్త్రుcడు, స్నేహితుcడు. "ఉ. వానికి నెయ్యుcడై యమర వంద్య పదాంబు జుcడంబికా బ్రహ్మ,త్రినపనా భరాగ్ర పరిపీడిత వక్షుcడు .." భార. సభా. ౧, ఆ. ౭౭, వెం. పంచ. ౨. ఆ. ౪౧౭. ఇష్టుcడు, ప్రియుcడు. "చ. ..అనుమతి నెయ్యుcడుక్ హితుcడు నైన వయస్యుcడు సేయు కృత్యముల్, పొనరcగcజేసి తీవు..."భా. రా. కిష్కి౦. ౭౪, అచ్చ. సుం. ౭౫.

నెయ్యురాలు. ద్వ. విణ. (నెయ్యము+ఆలు.) 1. స్నేహితురాలు, నేస్తకత్తె. (శ. ర.); 2. ప్రియు రాలు, ఇష్టురాలు. "గీ. చొచ్చి తన నెయ్యు రాలికిc జూపి దాని, తల్లిపాతరలాడ సొమ్మెల్ల నొసcగె" ప్రబంధ. ౭౨౪.

నెర. దే. విశే. 1. పూర్ణము, గొప్పది. "మ. నెర విల్కాcడవు నీవె రామ .." రామా. ౭, ఆ. (శ. ర.); 2. నేర్పరి. "గీ. మత్తకరిచండ నెర యైన మావటీcడు, బుద్ధియెఱcగని కొమరుని పొంత దాది, యతుల గర్వాంధుcడగు రాజు నండ నాప్త, మంత్రి యొకవేళనైన నేమఱc దరంబె." శుక. ౧, ఆ. ౨౪౭. క్రి. విణ అధిక ముగా. "మ. పురి యభ్రంకషసౌధపంక్తిc గని వేల్పుందంతి శైలాళియంచు రహిం గొమ్ముల ద్రవ్వ నూడుటకు నచ్చోcజేరి యందు గ్రమై, ఖురిc గన్పట్టెడి కృత్రిమేభరిపు సంఘంబుల్ సిరిక్షింపవే, నెరc జాఱున్..." ఘటికా. ౫, ఆ. ౨౦౦.

నెరదు. దే. విణ. విమలము, ఎచ్చుతగ్గులు గలది. "సీ. మౌక్తికం బొప్పును ముత్తియ మన .. గీ. అదియ నెరదైన గొగ్గి యం చనcగc బరcగు." ఆం. భా. ద్వి. ౨౭౬.

నెరపు. దే. స. క్రి. (నెరయు ధా.ప్రే.) 1. నెఱ వేర్చు. "వ... అట్టి వసంతసమయంబునం బు రందరాదేశంబు నెరపం బూని చనుదెంచిన వనజ లోచనలు..." నృసిం. ౨, ఆ. ౭౬; 2. పఱచు. "చ.. విక్రయార్థమై, నెరపిన మౌక్తి కంబులన ..." భల్లాణ. ౫, ఆ. (శ. ర.) దశకు. ౧౦, ఆ. ౮౦౫; 3. ప్రసరింపcజేయు. "సీ. సురభిళశ్వసనంబు నెరపె సంధ్యకవల్లి గ్రచ్చోc దావులు సోcకc గ్రోవిరెమ్మ." వసు. ౧, ఆ. ౧౫౭; 4. వెదcజల్లు, చిమ్ము. "చ. పరిగొనివచ్చి వేది కలపై రుధిరంబులు చల్లి మాంసముల్, నెరపుచు

యజ్ఞవిఘ్నమవలీల నొనర్తురు..." బా. రా. బాల. ౧౭౩, వసు. ౬, ఆ. ౧౬; 5. చూపు, కనఁబఱుచు. "గీ. బ్రాహ్మణులయందు గురులందు బంధులందు, భక్తివిశ్వాససౌహార్ద పరత నెరపు." నైష. ౭, ఆ. ౯, అచ్చ. బాల. ౭; 6. కల్పించు. కావించు. "గీ. తరళవైడూర్యవలభికల్ తెఱలు నెరప." వసు. ౨, ఆ. ౨౩; 7. ఆడు. "గీ. .. నెరప నొప్పదు జూదంబు నృపకుమార." పి. శకుం. ౪, ఆ. ౧౬౪. విశే. అధికము. "మ. నెరపయ్యె న్మదనానలంబు వరుసన్నీరయ్యె నాలేపముల్." ఉ. హరి. ౫, ఆ. ౧౦౦, కువల. ౫, ఆ. ౩౭.

నెరయించు. దే. స. క్రి. (నెరయు ధా. ప్రే.) వ్యాపింపఁజేయు. "సీ. నెరయించు నెవ్వఁడునిజసత్తాతన మాయ సకల ప్రపంచంబు సంతతముగ." కాశీ. ౫, ఆ. ౯౦, భా. రా. యు. ౧౪౨౮.

నెరయిక. దే. వి. నెరయుంట. (శ. ర.)

నెరయు. దే. అ. క్రి. 1. నిండు; అతిశయించు. "క. తరళనయనాబ్జదళములు, నెరయఁగఁబై మున్ను చల్లి నృపసుతుఁ బూజించిరి..." భార. ఆది. 3, ఆ. ౧౫౭, భాగ. ౧౦, స్కం. పూ. ౧౩౨౧; 2. వ్యాపించు. "మాలిని ..ఇంద్రుం,డరిగె దివిక్రిదివ్యానంత రత్నాంశు జాల, స్ఫురిత సురవిమానంబుల్ నభోభాగమెల్లన్, నెరసి వెలుగుచుండన్ నిర్జరశ్రేణితోడన్." భార. ఆది. ౮, ఆ. ౧౯౬; నృసిం. 3, ఆ. ౧౪౧; 3. నెఱవేఱు, సిద్ధించు. (శ. ర. బ్రా.); 4. చెదరిపడు, చెదరు. "గీ. భూమిసుత శిరంబున నున్న పుష్పమాల, నేలఁబడి యున్నయది దీనిఁ బోలఁజూడు, మనుజ విరు లివె నెరసిన పవనిపుత్రి, యుండ నోపు సీఘనమగు కొండమీఁద." భా. రా. ఆర. ౨, ఆ. ౩౧౨, పారి. 3, ఆ. ౫3; 5. విడిపడు, తప్పించుకొని పోవు. "రగడ. నెరసి పోఁజూచెదవు నిలునిలువుమా కనము, గురియుంతే నెలఁ జీలు కొన్నదంతట వనము." స్వా. 3, ఆ. ౮౮.

నెరవంజి. దే. వి. మునఁగచె. (శ. ర.)

నెరవచ్చు. దే. అ. క్రి. (నెర+వచ్చు.) అధికమగు "సీ. కాంతి సంపదనిశాకరుతోడ నొరసిన నొచ్చు మీఱఁగ నెర వచ్చువాఁడు" దశకు. ౧, ఆ. ౭౫.

నెరవరి. దే. విశే. (నెరవు+అరి) నేర్పరి. "చ... అట్టి దుర్నయపుటారడి కెంతయు నియ్యకొల్పుటల్, నెరవరిగాఁడు రాజనుచు నిష్ఠుర వాక్యము లుగ్గడించుచున్." రంగా. ౨, ఆ. ౧౦౯.

నెరవిడి. దే. వి. ఆధిక్యము. "సీ. రథ్యాప్రతీకోత్థరవముచే గిరికోటి పిడుగుల నెరవిడిఁ బిఱుఁదు కొనఁగ." ఉ. హరి 3, ఆ. ౨౪. (శ. ర. పా.)

నెరవు. దే. వి. (నెరయు. ధా.) 1. పూర్తి, సమృద్ధి. (శ. ర.); 2. వ్యాపనము. (శ. ర.); 3. మార్గము. "ద్వి. ఆనెరవున జాఱి హంసము లరుగు, నాపైని గారుడం బైనమార్గంబు." రం. రా. కిష్కిం. (శ. ర); 4. ఒకానొకచెట్టు. "ద్వి. కొరవులు నెరవులు గురువింద పొదలు, నరుదుగాఁ బొదలిన యంబాళములును." రం. రా. ఉ. ౧౧౯. పు. బ. పరివారము. "ఆ. సూతుశవముతోడ నేతెంచు నెరవులు, దవ్వుదవ్వులన యుదగ్రరూప, కలితుఁడైన భీముఁ గనుఁ గొని నడవక, నిలిచిరంత నంతఁ గలఁగఁ బాఱి" భార. విరా. 3, ఆ. ౨౭, హరి. ఉ. 3, ఆ. ౯౩. విశే. 1. అధికము. "క. తెలతెల వాఱి నటించును, నెలఁతుక లెఱిఁగింప లేచి నెరవగు వేడ్కన్." య. ౫, ఆ. ౧౪౮, ప్రభా. ౨, ఆ. ౫౮; 2. విశాలము (శ.ర.బ్రా.); 3. శక్యము, సాధ్యము. "వ...ఎదిరి మతం బెఱుంగకయెట్టి కార్యంబు నిశ్చయింప నెరవగునే .." భార. ఉద్యో. ౧, ఆ. ౧౭; 4. వ్యాప్తము. "మహాస్రగ్ధర. మురజిన్నాభీప్రణాళీముఖమున ధవళాంభోజ మన్పేరుగాఁదా, నెరవై తత్పూర మంతర్నిబిడముయి .." నైష. ౫, ఆ. ౧౬౧.

నెరవెంప = నెరవంజి. (శ. ర.)

నెరసాని. దే. వి. (నెర+సాని.) నేర్పరియైనస్త్రీ. "సీ. నెరసాని దొరసాని హరి నెక్కు దురమెక్కువగ వింత జోడైనవగలఁజూపు." శశాం. 3, ఆ. ౧౧౨.

నెరసు. దే. వి. 1. రేణువు, నలుసు. "గీ. అనిమిషుల గుండెలో గాల మణులలోక, నేత్రమున నాఁటి వేధించు నెరసు..." ఉ రా. ౧, ఆ. ౧౪౯, వసు. 3, ఆ. ౧౮౪; 2. కళంకము. "సీ. .. నిండారు చందురు నెరసు తక్కువ పడఁ దిలకించు ముద్దుమోముల బెడంగు." హరి. ఉ. ౭, ఆ. ౪౭; 3. ఒక విధమైన ఇసుక. "సీ...సికతాఖ్య యిసుక మన నిసుక నానెసఁగుచుండు. గీ. దద్విశేషంబు నెరసు నాఁ దనరు..." ఆం. భా.

ప్ర. ౧౫౫; 4. చిన్నతప్పు. "గీ. నెరసు పొడఁగాన లేఁడయ్యె నెమకి నెమకి, సాంబుపైఁ బొంచ జన్యరథాంగపాణి." కాశీ. ౬, ఆ. ౭; 5. తప్పు, దోషము. "ఆ...సుకవి కావ్యములోన, నెమక వీసమంత నెరసు లేదు." ప్రబోధ. ౧, ఆ. ౩౦, హరి. పూ. ౮, ఆ ౯౫; 6. కల్లమాట. "రగడ. నింతు నింతులకంటెఁ బుష్పాడి, నెరసు నెరసులఁ బల్కి నింతయు." వసు. ౩, ఆ. ౧౪౮; 7. గవుండ్లవాఁడు కత్తులునూఱెడు పొడి (శ. ర.)

నెరసుఁజూపు. దే. వి. (నెరసు+చూపు.) క్రేఁగంటి చూపు, కటాక్షము. "సీ. నెరసుఁ జూపులతోన నెయ్యంబు మూర్తికి నెరవైన తియ్యంబు నిగుడుచుండ." విక్ర. ౪, ఆ. ౨౦౩.

నెరసుదెగడు. దే. స. క్రి. (నెరసు+తెగడు.) తప్పు లెన్ను, నిందించు. "సీ. కనుఱెప్ప వెట్టని తనవేయి కన్నులు నెఱివిరి దమ్ముల నెరసుదెగడ." భా.రా. అర. ౧, ఆ. ౪౩.

నెరసువెట్టు. దే. స. క్రి. (నెరసు+పెట్టు.) దోషినిఁ జేయు. "సీ. నెరసువెట్టితి పరాశరు లంత వాని..." పి. శకుం. ౩, ఆ. ౧౮౯.

నెరి = నెఱి. దే. వి. వక్రత. "సీ. మొలక చీకటి జలజల రాల్పఁగా రాదె నెరులు మించిన వీరి కురుల యందు." పాండు. ౧, ఆ. ౧౧౭. (శ. ర. పా. పాఁత ప్రతి. పా.) రా. వి. ౨, ఆ. ౫౭. విణ. వక్రము, కుటిలమైనది. "సీ. నెరి కురుల్ చెదరి క్రొవ్విరి సరుల్ వడివాడ నొప్పు దప్పిన గొప్ప కొప్పుఁ జూచి." శుక. ౧, ఆ. ౨౭౬.

నెరుకు. దే. విణ. ముదుక యైనది. "ద్వి. పిరిగొన్న పూసలపేరు లొక్కింత, నెరుకుఁగాసియలపై నిగ నిగ మనఁగ." అ. మ. క. ౧, ఆ. ౫౦. పు.

నెరుము. దే. స. క్రి. రాచు, అదుము. "ద్వి. నెరిమి డాకాలఁ బొడేరంబుఁ బెట్టి." ద్వి సా. ౨, భా. (శ. ర.) శశాం. ౩, ఆ. ౯౦.

నెఱ. దే. విణ. 1. నిండు, పూర్ణము. "సీ. నెఱ చందురుని సిగ్గు వఱుపంగఁజాలు నీ నెమ్మోము తాలిమి వమ్ము సేసె." భార. అను. ౧, ఆ. ౫౧, భార. ఉద్యో. ౧, ఆ. ౨౪౭; 2. గొప్పది. "క. నెఱ గొండలు గువ్వలచే, నఱుగునె..." భో. ౩, ఆ. ౭౯, వసు. ౪, ఆ. ౯౫; 3. వాఁడియైనది. "క. ఒక్కొక నెఱ నారసమున, నెక్కుడు వడి వారియుఁరము నేసి నిలుపుచున్." భా. రా. యు. ౧౦౨౬, హరి. పూ. ౬, ఆ. ౭౯. శ్రేష్ఠము, ప్రశస్తము. "ఉ. ప్రాసఁగు విత్తువంటి నెఱహొఱు కొలంబునఁ బుట్టి..." పాండు. ౩, ఆ. ౩, హరి. ఉ. ౬, ఆ. ౧౬౩.

నెఱఁకులాడు. దే. అ. క్రి. (నెఱఁకులు+ఆడు) ఆయువు పట్టులఁ గ్రుచ్చుకొను. "ఆ. ఎఱుకు నన్ను నుఱక యేసిన శరములు, నెఱఁకులాడి నాకు నిశిత దివ్య, విశిఖ తతుల యట్లు వేదన గావించు,ట..." భార. అర. ౧, ఆ. ౩౧౪, భా. రా. యు. ౧౧౨౦.

నెఱఁకువేయు. దే. స. క్రి. (నెఱఁకులు+వేయు.) మర్మములను భేదించు. "గీ. నీదు తనువుండ విలుసేసి నెఱఁకువేయు, రతి వరుఁడు హారగుళికల రాజహంసు." నైష. ౨, ఆ. ౯౭. ఇట్లే: నెఱకులు మీటు. నృసిం. ౪, ఆ. ౧౩౫.

నెఱక. దే. వి. కేశము, వెండ్రుక. "సీ...వెండ్రుక నెఱి నెఱక నాఁగఁ దనరుఁ గేశ,ము..." ఆం. భా. ద్వి. ౧౪౫, అము. ౬, ఆ. ౬.

నెఱకాఁడు. దే. విణ. (నెఱవు+కాఁడు.) 1. పూర్ణుఁడు. (శ. ర. బ్రా.); 2. ప్రియుఁడు. "వ...బెడంగు తరఁగలతో దొరయు నెఱకాని నెనరుఁ బలుకుల వెనుదవిలి యలరించు జక్కవ పెంటులును." అచ్చ. భా. ౭, ఆ. ౧౬. పు.

నెఱజాణ. దే. విణ. (నెఱ+జాణ.) నేర్పరి. (చూ. నెఱజాణతనము.)

నెఱజాణతనము. ద్వ. వి. (నెఱజాణ+తనము.) నేర్పరితనము. "ఉ. చక్కఁ దనాల కేమి రుచి సంపద చిత్తరు బొమ్మ యున్నదుర్, జక్కనఁ గాదె యంత నెఱజాణతనం బొకచోట గానఁగా మక్కువ లోకమందె నహి..." శశాం. ౪, ఆ. ౫౬, శశాం. ౨, ఆ. ౬౯.

నెఱతనకాఁడు. ద్వ. విణ. (నెఱతనము+కాఁడు.) నెఱతనముకలవాఁడు, పూర్ణుఁడు. "చ. నెఱతన కాఁడునై వెలసె నిర్మలకాంతి విలాసరేఖలన్." స్వా. ౪, ఆ. ౭.

నెఱతనము. ద్వ. వి. (నెఱ+తనము.) 1. జాణ తనము, నేర్పు. "సీ. తారుణ్యములె చాలుఁ దలఁపులు గరగింప నెఱతనంబే లోకో నేర్చి రిట్టు."

నున్నదిక్కు, నెట్టి నెఱవాదులకునేని యొఱుఁగ నీదు." కాళిందీ. ౬, ఆ. ౭౭౬, భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౧౦; 2. సమర్థుఁడు, శక్తుఁడు. "చ...పంబు వచ్చెనేనిఁ దప్పక పోడుమంగ నేర్పు ఘనబాహు బలంబునుగల్గి మేటి వేఁటకు నెఱవాదులైన సుభట ప్రకరంబులు మ్రోల నేఁగఁ గన్." పి. శకుం ౨, ఆ. ౩, బస. ౫, ఆ. ౧౪౮. పు; 3. పండితుఁడు; పండితురాలు. "క. అఱువది నాలుగు విద్యల, నెఱవాది త్రికాలవేది నీవీ చిలుకక్, నెఱవుగఁ జేపట్టిన నది, చెఱకునఁ బండోదవి నట్లు చిరకీర్తి నిధీ." విక్ర. ౭, ఆ. ౨౦, విప్ర. ౪, ఆ. ౧౧.

నెఱవాదితనము. ద్వ. వి. (నెఱవాది+తనము.) జాణతనము, నేర్పు. "ఉ. లేరె ధనుర్ధరుల్ పుడమి లెక్కకు మిక్కిలి యొండు రెండుగా, వారడరింతు రేటి నెఱవాదితనం బది రెండు నొండుగా, నారసి వేయ నేరవలదా మఱినీవలె .." వేం. పంచ. ౩, ఆ. ౧౯౩, చిత్రభా. ౫, ఆ. ౩౬.

నెఱవిద్దె. ద్వ. వి. (నెఱ+విద్దె.) హస్తలాఘవము గల జాల విద్య. (శ. ర. బ్రౌ.)

నెఱవు. దే. వి. 1. పూర్తి. "సీ. పుణ్యపంచక్రోశ భూతీర్థమహిమంబు నెఱవుగా సర్వంబు నెఱిఁగె నేని." కాశీ. ౭, ఆ. ౧౧౦, రం. రా. యు. ౪౦౯, పు.; 2. వ్యాపనము. (శ. ర.); 3. మార్గము. (శ. ర.) విశే. 1. పూర్ణము, సమృద్ధము. "ద్వి. కఱకైన యాకుంభకర్ణునియందు, నెఱవైన కడిమికి నిలువక కపులు." రం. రా. యు. ౪౦౮, పు. విక్ర. ౬, ఆ. ౧౭౯; 2. వ్యాప్తము. (శ. ర.); 3. వ్యాపకము. (శ. ర.); 4. విశాలము. "క. మఱిమఱి చీకటిలోనం, దఱిరాజులు సమర ముడిగి తగ నెల్లిటికిక్, గొఱకల కలనగు నడువుఁడు, నెఱవగు గోవర్ధనాద్రి నేలకు ననుచున్." ఉ. హరి. ౪, ఆ. ౨౭౬; 5. చతురుఁడు. "ద్వి. ..నెఱవైన పెద్దలు నేరనియట్టి, కఱవులు గఱచెక్ కతకారిబిడ్డ." అ. మ. క. ౧, ఆ. ౩౪, పు.

నెఱవేర్చు. దే. స. క్రి. (నెఱవేఱుధా. ప్రే.) 1. సిద్ధింపఁజేయు, ఈడేర్చు. "ఆ. నీమనోరథంబు నెఱవేర్తునేనియు, నవుల నెట్లు సైతు రార్యజనులు." కృ. శకుం. ౩, ఆ. ౪౩; 2. పూర్తినొందించు. "చ. జనకున కాహితాగ్ని యుచిత సంస్క్రియల న్నెఱవేర్చి సన్నుటిన్." చం. రా. ౪, ఆ. ౯౮, ఉ. రా. ౨, ఆ. ౧౭౭.

నెఱవేఱు. దే. అ. క్రి. (నెఱవు+ఏఱు.) 1. సిద్ధించు. "సీ. కాము మీఱెడి ననంగ నీవేఱ ననఁగను వచ్చె నపుటు వరలు నందు, సంక్షయంబు నెఱవేఱ ననుటయుఁ దోఁచును..." ఆం. భా. తృ. ౯౪; 2. పూర్తియగు. (వా.)

నెఱసరి. ద్వ. వి. (నెఱ+సరి.) 1. సింహము. "గీ. నెఱసరిని మించు మించుకే లొఱపు పాదము, నెఱసరిని బెంపుఁ జంపుఁగా నెలఁత నడుము." ప్రబంధ. ౬౬౭, ఆం. భా. తృ. ౫౬; 2. నిండు సామ్యము, పూర్ణోపమానము. "గీ...సింహ పూర్ణోపమానముల్ నెలఁగును నెఱ సరియటంచని పలుకాడ. .." ఆం. భా. తృ. ౫౬. విశే. శౌర్యము కలది. "క. చఱిచుండి తోలఁగ నుఱికెడి నెఱసరి సింగంబుఁబోలె..." హరి. పూ. ౭, ఆ. ౧౦౫. (శ. ర. పా)

నెఱసు. దే. వి. అశ్వశిక్షాభేదము. "సీ. పరసంబు నొందించి పల్లంబు కల్పించి సిగుడంబు సమకొల్పి నెఱసు నెఱపి." పి. శకుం. ౧, ఆ. ౧౧౨.

నెఱా. దే. విశే. నిండు, అధికము. "క...కడు నెఱాకుంచనపుం, బ్రతిమేకద..." ముకుంద. ౧, ఆ. ౨౩౦, హంస. ౨, ఆ. ౮౭.

నెఱి. దే. వి. 1. అందము, సొగసు. "క. పసివాల్గు వాఁడి యప్పుడు, వసంతసమయంపుటెండ వలనక్ నెఱివోఁ, గసుగందుబు కందినవవ, కుసుమలతిక వోలె మిగులఁ గోమలియొప్పెన్." కళా. ౪, ఆ. ౧౦౩, కు. సం. ౮, ఆ. ౭; 2. న్యాయము, పాడి. "ఆ. నీవుఁ గొడుకు వారి నెఱిలేక పఱిచిలి, రదియ చాలు నుచితమైన పాలు, పంచియిండు. ..." భార. ఉద్యో. ౨, ఆ. ౨౫, భార. విరా. ౨, ఆ. ౧౫౯; 3. సదాచారము. "క. ఈనెఱిఁ గనికొని శూద్రుం డైనను గ్రమవృత్తి నవ్వయం బగు పదముం, గానంబడయుంట గల్గును..." భార. అను. ౩, ఆ. ౩౦౨, విజ్ఞా. ఆచా. ౩౦; 4. వస్త్రపుకుచ్చె. "సీ. నెఱివెట్టికట్టిన నిండు చెంగావి మైఁ గాంచికా ఘుంటికల్ కిలకిలింప." పాంచా. ౨, ఆ. ౧౪, ఆం. భా. ద్వి. ౧౫౩; 5. క్రమము "క. అఱవఱలైన రథంబులు, నెఱి

దప్పఁగఁ బడినయశ్వ నికరంబులు..." భార. భీష్మ. ౨, ఆ. ౧౩౬, భార. ద్రో. ౨ ఆ. ౧౩౨; 6. (పక్షియాఁకలు మున్నగువాని) చిక్కు. "సీ. అలంతఁజేతిన యెఱకల నెఱిఁదీర్చు జక్కవలు చెంగోవల కేఁకట యొనర్చ." భార. ఉద్యో. ౨, ఆ. ౧౧౫; 7. పరాక్రమము. "క. నెఱి నుఱక వైరివీరుల, నెఱఁకులు దూఱంగ నేయు నృపపుంగవుసం, పఱకోర్వక..." భార. ఆది. ౪, ఆ. ౨౦౨, భా. రా. యు. ౨౯౪; 8. చెక్కు, పక్షము. "గీ. కఱకుటంపుల్లి నిఱికించి కజ్జె గదలఁ, గఱికి నెఱి నెఱి కోలెన్నుకయును విఱుగ, విఱిచె వడిఁ గైజ నొక పెద్దపేసదంబు." స్వా. ౪, ఆ. ౫౮, భార. ఉద్యో. 3, ఆ. 3౦౧; 9. వక్రత, వంకర. "గీ. ఇంతి కచములు నెఱి గల యింద్రశిలలు." చంద్రా. ౬, ఆ ౧౭౯, కాశీ. ౧, ఆ. ౫3; 10. విధము. "క. ఏ నిచ్చట నిద్రిత నై, యీ నెఱి నుండంగఁ బురుషుఁ డెవ్వఁడొకొ యుపగూ, హానుభవంబున వికృతం, గా నొనరించె నది కలయొ కాదొ యెఱుంగన్." హరి. ఉ. ౭, ఆ. ౯౦, భార. శాం. ౪, ఆ. ౪3౯; 11. ప్రజ్ఞ, స్పృహ. "వ... ఆనక్కలు నరంబులు ద్రవ్వం గఱచిన నెఱి దప్పి యయ్యుష్ట్రంబు నిర్గత ప్రాణంబయ్యె..." భార. శాం. 3, ఆ. ౦౫; 12. వెంట్రుక, కేశము. "సీ. వికట పాటలజటా మకుటికా భారంబు కఱకైన జంజు రునెఱులు గాఁగ." హర. ౭, ఆ. ౪౧. ఆం. భా. ద్వి. ౧౪౫; 13. ఓరిమి. (కీచకుఁడు) "చ. జనువెడయాట గాంచు నెఱి సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ, జనియె...." భార. విరా. ౨, ఆ. ౨౪౭; 14. మంచితనము. "క. ఎఱుఁగ వె యజాతశత్రుని, నెఱియును ధర్మంబు సత్య నిష్ఠయు..." భార. ఉద్యో. ౨, ఆ. ౧౯౯, భార. విరా. ౨, ఆ. 3; 15. వేడుక, ఉత్సాహము. "క. అని పల్కునతని తాల్మికి, మనమున నెఱి విఱిగి..." సా. ౨, ఆ. ౧౨౨; 16. నిశ్చలత్వము. "క... ఆతనియాత్మ యును మెఱు, జాయో కులిశంబో నెఱి దొఱంగక యుండెన్." ప్రభా. ౪, ఆ. ౪౦; 17. తెంపు, సాహసము. "గీ. ఇవ్విధంబునఁ దన పోక లెఱుఁగనీక, మగని బోఁ గొట్టి నెఱి వచ్చి పొగడుకొట్టి, వాడలోఁ గూఁడ జారుల..." శుక. 3, ఆ. ౧౬3, సురా. ౦౪; 18. పక్షము, పైపు. "క. తానిది గెలిచితి ననియెడు, నేను గెలిచియుండ నీతఁడిది యేటికి మీ, రే నెఱికి నిజము సెప్పుఁడా, నా నొకరును బలుకరైరి నమితానను లై." హరి. ఉ. 3, ఆ. ౨౩౬, హరి. ఉ. 3, ఆ. ౯౯; 19. నిగ్గు, కాంతి. "గీ....నిగ్గు చిరుగడ్డ కుటిలంబు నెఱి యనఁదగు." ఆం. భా. తృ. ౬౧; 20. చిరుగడ్డ. ఆం. భా. తృ. ౬౦; 21. శక్తి, సామర్థ్యము. "సీ... నెఱి గల్గి పలుకక యుండంగఁ దగుట గూహింపుచుత్తమ విధంబు" భార. ఆశ్ర. ౧, ఆ. ౭3, ప్రభా. ౧, ఆ. ౦౧.

విశే. 1. వంకరయైనది, కుటిలము "మ. నెఱులై యొప్పు విసలకేశములు .." హరి. పూ. ౫, ఆ. ౧౦౯. భార. ఆది. ౭, ఆ. ౭3; 2. అందమైనది. సుందరము. "వ... నెఱి తుఱుమును జెంగలువలు తురిమె..." నైష. ౬, ఆ. ౪౪, పారి. ౧, ఆ. ౫౫; 3. ఉచితము, యుక్తము. "గీ నీకు వీరలఁ జేర్చుట నెఱియ కాదు." భార. ఉద్యో. 3, ఆ. ౨౬3, రం. రా. ఉ. ౧౨౭. పు; 4. తీక్ష్ణము, "ద్వి. నెట్టన మొల నున్న నెఱి కత్తిఁ దిసిచి." ద్వి. హరిశ్చ. పూ. ౭౦౫౬, పం. పారి. ౧ ఆ. ౧౨౪; 5. కఠినము. "క... అపథ్యా దక్కుజూఁడు ఒగతుఁ డద్దెస, నెక్కొని సిద్ధంపఁ జట్టి నెఱికర్జములన్." హరి. ఉ. ౨, ఆ. ౧౨౧, క్రి. విశే. 1. మిక్కిలి, అత్యంతము. "క. గూఢమతి నుండుద మిం, దఱముఁ బురోచను కృతకము, నెఱినేర్పడు నంతకును విచిత్రాత్ములమై." భార. ఆది. ౬, ఆ. ౧౫౪, ఆం. శే. ౫౭; 2. చక్కఁగా. "క. అవయవము లెట్లు కూర్మము, నివిడించును లోనికడఁచు నెఱినట్టుల భూ, తవితతి భూతాత్ముండును, బ్రవర్తన నివర్తనములఁ బాల్పడఁ జేయున్." భార. శాం. ౫, ఆ. ౧౩౨, భార. ఉద్యో. ౪, ఆ. ౧౧౪; 3. స్పష్టముగా. "సీ. నెఱి నిట్టి దనియింతి నీ నెమ్మనం బెఱిఁగి భంగుల నరసినఁ బట్టువడదు." భార. విరా. ౨, ఆ. ౪౭.

నెఱిఁబడు. ద్వ. అ. క్రి. (నెఱిన్ + పడు.) 1. స్వస్థతనొందు కుదురుపడు. "క. నెఱికిరి నలుఁగురు మేనులు, నెఱిఁబడ నెల్లెడలఁ గలయ నిని రిరి..." భార. ద్రో. 3, ఆ. ౧౩౦, భార.

ఉద్యో. ౪, ఆ. ౧౪౩; 2. నెఱవేఱు. "క... కానియటులుండి నెఱిఁబడు, నైన తెఱఁగు దోఁచి మాయమగు నిబ్బంగిక్, మానసమున కుబ్బువగయుఁ, దే నోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్." భార. శాం. 3, ఆ ౨౮.

నెఱిక. దే. వి. 1. వస్త్రపు కుచ్చె. "సీ. బంగారు సరిగల పట్టంచు వలి పంపునెఱిక మీఁగాళ్లపై నెఱసియాడ." సురా. 3౪, ఆం. భా. ద్వి. ౧౫3; 2. పైఁటపావడ. "సీ. అచ్చ వెన్నెల చాయ నవఘుళింపఁగఁజాలు నిద్దంపు వెలిపట్టు నెఱిక గట్టి." నైష. ౬, ఆ. ౨౨, రా. వి. 3, ఆ. ౧౭౪; 3. స్త్రీలు తొడుగుకొను పొట్టి లాగు, చల్లడము. "చ. గిరికొను గాలివల్వ దొరఁ గింపఁగ వేలుపుటింతిపోఁ దొడల్, నెఱికకు వోలెఁ గెంపు గమి నిద్దపుఁ గ్రొమ్మెయిలనూలి డాల్గొనెన్." అచ్చ. భా. 3, ఆ. ౧౦.

నెఱికగట్టు. దే. స. క్రి. (నెఱిక+కట్టు.) కుచ్చెళ్లు పోసి కట్టు. "సీ. అంచవన్నియతోడ నందమైన మడుంగు నిద్దంపుఁ బుట్టంబు నెఱిక గట్టి." కాశీ. 3, ఆ. ౨౧౨, హర. ౪, ఆ. ౭౮.

నెఱికపట్టు. దే. అ. క్రి. (నెఱిక+పట్టు.) కుచ్చెళ్లు పోయు. "సీ. నెఱికపట్టి పసిండి నీటి వ్రాఁత చెఱఁగు వెలిపట్టు రహిఁగట్టె వెలఁది యొర్తు." ఆము. ౬, ఆ. ౧౭౮.

నెఱికొల్పు. దే. స. క్రి. (నెఱి+కొల్పు.) చక్కఁగా ధరించు. "ఉ...విభూషణ సముత్కరముల్ ధరియించి హారముల్, గొప్ప చనుంగవందు నెఱి కొల్పి తనర్చి విలాస వైఖరిన్." విప్ర. 3, ఆ. ౭౯.

నెఱిపట్టు. దే. వి. ఒకరకము పట్టు వస్త్రము. "ద్వి. నెఱిపట్టు వెలిపట్టు నేత్రంబు పట్టు." బస. 3, ఆ. ౯౬. పు.

నెఱియ. దే. వి. 1. బీఁట, పగులు; రంధ్రము. "క. మండెడు మార్తాండద్యుతి, నెండుచు నొం డొండ నెఱియ లేర్పడఁగా భూ మండలము..." ద్వా. ౯, ఆ. ౮; 2 చీలిక, పాయ. "మ. స్వని దానోగ్రనిదాఘ వైఖరిన యూష్మ న్మల్లికల్ కామినీ, కన దానీల కచాగ్రపంక్తి నెఱయల్గాఁ భావఁగా..." ఆము. ౨, ఆ. ౬౭.

నెఱియలువాఱు. దే. అ. క్రి. (నెఱియలు+వాఱు.) బీఁటలువాఱు, పగులు. "వ...అసితయగు వసుధఁ గాఁడి నెఱియలు వాఱిన దనుదర విస్ఫురితాంత్ర లతామ తల్లికల వెల్లినం బాతాళ వ్యాళంబులు గానవచ్చె." పాండు. ౪, ఆ. ౧౬, స్వా. ౪, ఆ. ౬౦.

నెఱె = నెఱియ. (బీఁట; రంధ్రము.) "చ. సవితృ మయూఖముల్ నెఱెల సందులఁ దూఱుట యొప్పె..." చంద్ర. ౧, ఆ. ౧౫౪.

నెఱెవాఱు = నెఱియలువాఱు. "శా...మంద రాద్రి నెఱె వాఱక్ పీఁక మై నెత్తె యు, య్యంభోజాక్షుఁడు పట్టెపై నెఱె .." వీర. 3, ఆ. ౨౦౬.

నెఱెవెట్టు. దే. అ. క్రి. (నెఱె+పెట్టు.) తొలుచు, రంధ్రము చేయు. "సీ నెలవుల వనదంశములు మూఁగి నెఱె వెట్ట..." స్వా. ౨, ఆ. ౭.

నెఱ్ఱె = నెఱియ. (రంధ్రము) "వ...వీరభద్రుని రణంబుచూచి భీతచిత్తులై ... నెఱ్ఱెలు చొరఁ బాఱు వారును..." వీర. ౪, ఆ. ౧౬౭.

నెల. దే. వి. 1. మాసము. "సీ. ఏఁటేఁట నొనరింపు మితరదేశ విహార మాఱు నెలలు రాజ్య మాఱు నెలలు." విక్ర. ౪, ఆ. ౪౭. ఆం. భా. తృ. ౫౫; 2. పూర్ణిమ. "సీ. నెల చందురుని కాంతి నెమ్మోము సృజియించి యకలంక విలసనం బల వరించి." షోడ. ౬, ఆ. 3౦; 3. వెన్నెల. (చూ. నెల త్రావడము.); 4. స్త్రీ శిరోభూషా విశేషము. (శ. ర.); 5. కర్పూరము. (చూ. నెలవత్తి); 6. చంద్రుఁడు; 7. స్థానము. "క. అని పలుకు కలశ భవముఖ, మునిజనముల ప్రశ్న వాక్యములు విని పురభిత్తనయుఁడు తత్త్రివిధము నొక్క నెలం గుమిగూడి యుండికిఁ గనఁజాల మికిన్." పాండు. ౧, ఆ. ౧౫3; 8. ఋతు కాలము, గర్భము ధరించుటకు యుక్తమైన కాలము. "చ...మగఁడు గల్గియు లేని విధంబు చేసి తా, నెలఁ గలనైన నన్నుఁ గరుణింపఁడు భోగము వారి పొందునన్." శుక. ౨, ఆ. ౧౧౨.

నెలఁత. దే. వి. 1. స్త్రీ, ఆఁడుది. "గీ. నీవు చక్కని దానవు నెలఁత ధైర్యరహిత చిత్తులు మగవారు.." భార. విరా. 3, ఆ. ౫౬, భార. అను. ౧, ఆం. ౧౯౬; 2. ప్రియురాలు, భార్య. "మ. తమ

ప్రాణేశులు గారవింపఁగ నెలంతల్ నిండు కౌఁగిళ్ల నంగదముగా నుండియుం నప్పూరూరవుని సౌందర్యంబు భావింతురు..." కవిరా. ౧ ఆ. ౯౬, ఆము. ౪, ఆ. ౧౨౩.

**నెలఁతుక.** దే. వి. (నెలఁత+ఉక-స్వార్థమున.) 1. స్త్రీ, ఆఁడుది. "క. ఆ పాపాత్ముల నీచ, వ్యాపార క్రమము వార లందఱు మృత్యు, వ్యాపితులైన తెఱంగును, నీ పలుకుల నెఱుఁగవలయు నెలఁతుక చెపుమా." భార. విరా. ౩, ఆ. ౪౮. (ఇది రెండవ యర్థమునకు గూడ నుదాహరణము.) ఉ. రా. ౬, ఆ. ౨౯౩; 2. ప్రియురాలు, భార్య. "క...ఏమి యిది నాకుఁ జెపుమా. నీమది యని యతని సతని నెలఁతుక పలికెన్..." కళా. ౩, ఆ. ౧౭౪.

**నెలకట్టడ.** దే. వి. (నెల+కట్టడ.) నెలనెలకు ద్రవ్య మిచ్చు నేర్పాటు. రామా. పీఠి. ౧౦౭, రా. వి. ౫, ఆ. ౧౩.

**నెలకట్టియ.** ద్వ. వి. (నెల+కట్టియ.) అర్ధచంద్రాకృతితోనుండు బాణము. "వ...బల్లెములు బల్లెముల విఱువ నమర్చెనను నెలకట్టియలు నెల కట్టియలపై నిలిపియుం......" నారాయణుం డాఁకె..." ఉ. హరి. ౬, ఆ. ౫౦.

**నెలకట్టు.** దే. వి. (నెల+కట్టు.) కట్టినుము, జాతి కట్టడపునేల. "సీ. అడుగుల నునుఁగాంతి నయ్యెడ పద్మరాగంబుల నెలకట్టు కరణి నొప్పు." భార. విరా. ౪, ఆ. ౨౬, రాజ. చ. ౩, ఆ. ౧౭౧.

**నెలకల్లు.** దే. వి. (నెల+కల్లు.) చంద్రకాంతమణి. యం. ౧, ఆ. ౭౦.

**నెలకువ.** దే. వి. స్థానము, చోటు. "క. ఐనను రావణుఁ డేఁట రిపుఁ, డా నెలకువఁ జొచ్చి బోదివి తఁట పోరను నీచే, నెత్తురు గాఱుండఁగ, వానిం జంపితఁట తగఁజ వర్ణన సేయన్." నిర్వ. ౨, ఆ. ౧౧.

**నెలకూన.** ద్వ. వి. (నెల+కూన.) 1. బాలచంద్రుఁడు. "సీ. చెలువైన కళలీనఁగల చిన్ని నెలకూన పృథుల వజ్రపు నరిభేషు గాఁగ." మృ. వి. ౩, ఆ. ౨౦; చెన్న. ౩, ఆ. ౫౭; 2. అర్ధచంద్రాకారముగా నుండునది - నఖక్షతము. "సీ. నెలఁత గుత్తపు గుబ్బ నెత్తమ్మి మొగడల నెలకూన సోఁకులు నిగుడకుండ." వసు. ౬, ఆ. ౫౧, చంద్ర. ౪ ఆ. ౭౫.

**నెలకొను.** దే. అ. క్రి. (నెల+కొను.) 1. కదురుకొను, స్థిరపడు. "క...మర్త్యుల కేశాంతిక వృత్తిని నెలకొనఁగా నేట్లు వచ్చు నిర్మల ధిషణా." భార. శాం ౬, ఆ ౫౦౭, వరాహ. ౧, ఆ. ౧౯; 2. ఉండు. "సీ. విఁగడం బైనట్టి ముంగిట నెలకొన్న బృందావనికి మ్రుగ్గు పెట్టుఁ దాన." ఆము. ౪, ఆ. ౫౦, దశా. ౮, ఆ ౧౧. 3. ప్రాప్తించు, కలుగు. "సీ. ఇత్తీర్థమున వసియించెద నడుచక్కి నీదుఁ జేతఁ బ్రీతి నెలకొనంగ." పాండు. ౨, ఆ. ౭౪, భాగ. ౧, స్కం. ౪౮౭; 4. పూను, యత్నించు. "క. ఆరీతి మహోపాయము, నేరిచినట్ జాడఁ గవయ నెలకొను మనసౌఁరార జగజంత యని తెలవాఱుటఁగని భాను కేళివసతికిఁ జనియెన్." హంస. ౩, ఆ. ౨౪౩, పారి. పీఠి. ౨౨.

**నెలకొలుపు.** దే. స. క్రి. (నెలకొను ధా. ప్రే.) నిలుపు. "వ...భావంబున భూతనాథు నెల కొలిపి యకుంఠిత భవ సంభేవృందు..." భార. సౌ. ౧, ఆ. ౧౧౦.

**నెలగ.** దే. వి. ధనము, లా 'నిభాగము. "క. కనిమి కిని ఒగిన కొలఁదిని, నెలగల వెసి విడుపకున్న నిలుపెక్కడి దొఁ, గలదఁగ నిండిన చెఱువున, కలఁగించుక విడుపకున్న నా గని భంగిన్." ద్వా. ౨ ఆ. ౧౫౭.

**నెలచట్టు.** దే. వి (నెల+చట్టు.) చంద్రకాంతమణి. "సీ. చిలుకు నీరు దొలంకఁ దెలివొందు నెల చట్టు పల్లెరంబుల మోలిల బంతి సాఁగి." చంద్రి. ౪, ఆ. ౭౭, ఉ. రా. ౬, ఆ. ౯౧.

**నెలచెలియలు.** దే. వి. (నెల+చెలియలు.) లక్ష్మి. వేంక. దేవ. ౭.

**నెలజోడు.** ద్వ. వి. (నెల+జోడు.) సూర్యుఁడు. వేంక. దేవ. ౧౨.

**నెలతాల్పు.** దే. వి. (నెల+తాలుపు.) చంద్రశేఖరుఁడు, శివుఁడు. "సీ. నెలతాల్పు దేవర యలిగినఁ బనిగాదు కొండి గుబ్బలి జేకయుండ నిండు." యం. ౩, ఆ. ౩౪, ఉ. రా. ౧, ఆ. ౩౩. ఇట్లే; నెలదారి. రామే. ౨, ఆ. ౬౧.

నెలత్రావడము. దే. వి. (నెల+త్రావడము.) చకోర పక్షి. "సీ. తరుణి చూపులు నెలత్రావడంబులఁ బ్రోచు నివురు చాయల నెన్న దింతిమోవి." హ. స. ౪, ఆ. ౪౩.

నెలదిండి. దే. వి. (నెల+తిండి.) రాహువు. "గీ. తొలుత మి[illegible]గిన కొఱనెలల్ నెలవులందుఁ గడఁగి వెడలించు నెలదిండిగాము లనఁగ..." య. ౨, ఆ. ౬. ఇట్లే: నెలమేపరి. (శ. ర.)

నెలపట్టి. దే. వి. (నెల+పట్టి.) బుధుఁడు. "క. నెలపట్టి యిటుల నలరఁగ, నిలవై యొకనెలయు మరల నిలుఁడై నెలయుఁన్, మెలఁగుచుఁ గ్రమమునఁ దొమ్మిది, నెలలు సనఁ బురూరవుఁన్ గనియె నది యంతన్." ఉ. రా. ౭, ఆ. ౪౯౨, ఇట్లే: నెలచూలి. (శ. ర.)

నెలపాలు. దే. వి. (నెల+పాలు.) చంద్రకళ. (శ.ర.)

నెలపుల్గు. దే. వి. (నెల+పుల్గు.) చకోరపక్షి. "సీ. చను జక్కవలకు మెప్పన కిడ్డ బిసఖండముల లీల హారముల్ ముద్దుగులుకఁ, గనుదోయి నెలపుల్గు గవకుంచు తళుకువె న్నెలవీఁకఁగపురంపుఁ దిలకమమర." చంద్రా. 3, ఆ. ౯౨. చంద్రా ౫, ఆ. ౧౨౦.

నెలపూవు. దే. వి. (నెల+పూవు.) చంద్రుఁడు. "సీ. ...నెలపూవు నమృతంపు గలిమిఁ బోల్ప..." ఉద్భ. ౧, ఆ. ౫.

నెలపొడుపు. దే. వి. (నెల+పొడుపు.) చంద్రోదయము. "చ. లలితములైన యూపరిఖలం దగుమేడల వారభామినుల్, నెలపొడుపుఁన్ గనుంగొనుచు నిల్చునొయారము చూచి..." కకు. ౧, ఆ. ౧౧.

నెలమసలు. దే. అ. క్రి. (నెల+మసలు.) నెలతప్పు, గర్భిణియగు. "క. హరివనమాలికయంశము, ధర లోపల నవతరింపఁ దలఁచినదై య, ప్పురి నొక్క విప్రకాంతయుఁ, దరముప్రవేశింప సలికిఁ దగ నెల మసలెన్." విప్ర. ౧,ఆ.౭౧. శుక. ౧,ఆ. ౧౪౦.

నెలమొల్క. దే.వి. (నెల+మొలక.) బాలచంద్రుఁడు. "సీ. తనతలనెలమొల్క తళతళజిగిఁగుల్క వెలయుము త్తెపుతురా బెళుకుగాఁగ." ఇందు.౧.ఆ ౭.

నెలయల్లుఁడు. దే. వి. (నెల+అల్లుఁడు.) మన్మథుఁడు. "గీ....నెలయల్లుఁడు వెడవిలుతుఁడు, నాఁగ మరునాఖ్య లగు..." ఆం. భా. ప్ర. ౪౫.

నెలయు. దే. అ. క్రి. ఉండు. "సీ. పరితాపవేదనాపరవశంబునఁ దూలి నెలసినచిత్తంబు నెరపుకొనఁగ." కు. సం. ౫, ఆ. ౧౫౫.

నెలయూటి. దే. వి. (నెల+ఊటి.) వృక్షవిశేషము. "సీ. నేరేడుపండులు నెలయూటిపండులఁ గొండమామిడిపండ్లు దొండపండ్లు." కాశ. 3, ఆ.౬౯.

నెలరేక ద్వ. వి. (నెల+రేక) చంద్రరేఖ. "సీ. నెలరేక నుదుటిపై నీటైనకమ్మకస్తూరి గీర్నామంబు సొగసు మీఱ." ఇందు. ౧, ఆ. ౨౦.

నెలఱాయి. దే. వి. జా(నెల+ఱాయి.) చంద్రకాంతశిల. "సీ. నెలఱాతిచాలు నిగ్గులలోన మిన్నేటి రాయంచగముల నార్భటులవలన." రామా. ౧, ఆ. ౧౨౪. చంద్రా. ౨, ఆ. ౭.

నెలవంక. ద్వ. వి. (నెల+వంక.) 1. బాలచంద్రుఁడు. సీ....పసమించు నెలవంక నొసలిదాని..." ఉ. రా. ౨, ఆ. ౧౮౮. పీఠి. ౧౭. 2. నఖక్షతము. "చ...నెలవంక లుంచి చ, క్కనివలిగుబ్బ చన్నుఁగవఁ గొఁగిటఁ జేర్ప నిఁకెప్డు గల్గునో." దశా. ౨, ఆ. 3౦౮. నరస. ౪, ఆ. ౬౮.

నెలవంకకత్తి. ద్వ. వి. (నెలవంక+కత్తి.) అర్ధచంద్రాకృతిగలకత్తి. "సీ. నీలిసాలువమీఁదఁ గీలుకొల్పిన యట్టి నెలవంకకత్తులతళుకు లెసఁగ." చిత్ర. భా. 3, ఆ. ౧౨౫.

నెలవంకకోల. ద్వ. వి. (నెలవంక+కోల.) అర్ధచంద్రబాణము. "సీ. ...అవిఖండంబులుగ నెలవంకఁ గోలలఁ ద్రుంచివైచి మఱియు." భా. రా. యు. ౮3౬. ఇట్లే: నెలవంకతూపు. ద్వి. పరమ. 3, ఆ. ౨౪౬ పు.

నెలవంపు. దే. విఱ. (నెల+వంపు.) నెలవంక గలది, చంద్రుఁడు గలది. "సీ. మకుటంపుజిగిసొంపు రకమైన నెలవంపు చిలికికెంజడగుంపు శిరము లమర." శశాం. ౧, ఆ. ౨౫.

నెలవత్తి. ద్వ. వి. (నెల+వత్తి) 1. పచ్చకప్పురపుఁ బలుకు. "సీ. మంచివాసనలవాసించిన నెలవత్తి బాగాలు రాసులు వడఁగఁబోసి." కళా. ౭, ఆ. ౬౦. 2. పోఁకచెక్క, పూగఖండము "సీ. పూగభాగమ్ములు పోలుచు బాగా లన నెలవత్తి యనఁగను..." ఆం. భా. ద్వి. ౧౬౭.

నెలవరి. ద్వ.విఱ. (నెలవు+అరి.) 1. నివసించువాఁడు. "క. ముజ్జగముల నిజమజ్జన సంశీలబుద్ధి మజ్జనసమం

దా, దేహజీవనజీవనయగు నజ్జాహ్నవిఁ జేరె..." రామా. ౫, ఆ. ౨౦. ప్రబంధ. ౨౧౬. 2. పరిచితుఁడు; స్థలపరిచితుఁడు. "సీ. లేమగుంపులలివలివలాడుతేఁగౌనువంటిచోటికి నెలవరి యటంచు." కువల. ౧, ఆ. ౨౦, సా. 3, ఆ. ౨౩౯.

నెలవీడు. ద్వ. వి. (నెల+వీడు.) నివాసస్థానము. "చ. తలఁపుల తిట్ట భావముల తానక మాగల పుట్టినిల్లు గో, ర్కుల నెలవీడు..." కు. సం ౫, ఆ. ౧౦౫.

నెలవీసము. దే. వి. (నెల+వీసము.) చంద్రకళ. (శ. ర.)

నెలవు. యు. దే. వి. పరిచయము. "చ. నెలవునరాగ సంపద వనీరమచారుపికారవంబునన్, దెలిసివసంతురాక సుమనీరమహార్తికదానమూన్చి..." చంద్రి ౪, ఆ. ౪౨. వై. వి. (సం. నాలయః.) 1. స్థానము, చోటు. "గీ. ఈనెలవును బృందారకాధిపమిదియ, మనకు రావలసినచోటు..." భార. స్వర్గా. ఆ. ౧౯. 2. (భూ)భాగము. "గీ. నేమివిరిసినకతన నన్నెల నెలవు, నేమిశం బయ్యె నదియ తా నైమిశంబు." కాశీ. ౧, ఆ. ౭౭. 3. నివాసస్థానము. "చ. దనుజుఁడు మాయలాఁడు మృదుతల్పమునం బవళించి నిద్రవోయిన క్రియ నందఱు న్గాఁగి యిక్కడ నెమ్మది నున్నవాఁడు వాని నెలవుగంటి. ..." భో. ౫, ఆ. ౧౦౧. వైజ. ౧, ఆ. ౫౮. 4. నివాసము; ఉనికి. "సీ. ఆసునాసీరు నహంకారగరిమకు నిమథాచలముమీఁది నెలవుసాక్షి." హర. ౭, ఆ. ౨౨. విక్ర. ౨, ఆ. ౨౮. 5. వ్యాపనము. "సీ. అవనియెల్లను దాన యైనదియనఁదగ నీడ నొప్పారెడి నెలవుగలిగి. గీ.తనరునొక్కమహావటతరువు గాంచి." హరి. ఉ. ౧, ఆ. ౩౩. విణ. 1. సుందరము. "గీ. ఫాలమునఁ గుంతలంబు లేర్పరచినపుడు, నెలవుఁగాఁ దోఁచె గిరికన్య నెమ్మొగంబు." హర. ౪, ఆ. ౮౨. 2. పరిచితము "చ. నెలవగు వాయువేగి బలునేర్పరి గద్దరి యుంకుగుండు...తుపాకి వాఁగఁ జే, ర్లలరెడి సారమేయముల నత్తఱిఁదెచ్చి కొంద ఱుద్ధతిన్." ౧ ఇందు ౨, ఆ. ౫౯.

నెలవుకొను. ద్వ. అ. క్రి. (నెలవు+కొను.) 1. పాదుకొను, స్థిరపడు. "వ...నలునియందు...అక్కరంగళోభనచూపు నెలవుకొనియె..." శైవ. ౫, ఆ. ౧౭౩. "సీ. పరితాపవేదనా పరవశంబునఁ దూలి నెరసిన చిత్తంబు నెలవుకొనఁగ (వావిళ్ల. పా. నెరవుకొనఁగ.)" కు సం. ౫, ఆ. ౧౫౫. 2. ఉండు, వర్తిల్లు. "గీ. బంధులకుఁ దెల్లఁగన్నుల పండువగుచు, నీవుఁ దమ్ములు సౌఖ్యవృత్తి నెలవుకొనుఁడు." భార. శల్య. ౨, ఆ. ౧౨౭. 3. ఒప్పు, ప్రకాశించు. "క. రాజాపత్తరసార్ద్రపు, తేజాశద్వ్యాపులశాఖ నెలవుకొనెగా..." సాంబో. 3, ఆ ౯. 4. కలుగు, జనించు. "సీ. అనిన నా యింతి నాయందు నిగ్గిరియందు నీకుఁ బ్రియం బేల నెలవుకొనదు." మార్క. ౪. ఆ. ౨౪౪. వేం. పంచ. ౫, ఆ. ౬.

నెలవుకొలుపు. ద్వ. స. క్రి. (నెలకొనుధా. ప్రే.) 1. పాదుకొలుపు, నిలుపు. "క. నీవును సివాక్యంబుఁ, భావంబున నెలవుకొలిపి పరమసమాధి, శ్రీవాటిపుము..." భాగ. అశ్వ. ౬, ఆ. ౨౯. భార. ఆను. 3, ఆ. ౧౧౧. 2. చేర్చు, కలిగించు. "గీ. అలకముల నీలకాంతియుఁ నెలవు కొలిపి." శశాం. 3, ఆ. ౪౭.

నెలవుపడు. వై. అ. క్రి. (నెలవు+పడు.) నిలుచు. (హా. నెలవుపఱుచు.)

నెలవుపఱుచు. వై. స. క్రి. (నెలవుపడుధా. ప్రే.) నిలుపు. "సీ. భానుతనూభవ ప్రముఖులనెల్లను నిజనిజపదముల నెలవుపఱిచి." చం. రా. ౮, ఆ. ౧౬౭.

నెలవొందు. దే. అ. క్రి. (నెలవు+ఒందు.) వ్యాపించు. "సీ. లేనవ్వు వెన్నెలల్ నెలవొందఁ దెఱ కంటి తెలికంటి కమిమోవి ఫలికులందు." సమీర. ౧, ఆ. ౬౭.

నెలి. దే. వి. ఒకరకము కూరాకుచెట్టు, అగ్నిమంథము. "చ...తుమ్మికు, స్సరిగులుంగుటిబొట్ల కొలిచల్మిడి పల్లెరు..." హంస. ౪, ఆ. ౧౩౨.

నెల్లి=నెలి. "సీ. నారుప సురపొన్న గిరిజమును బొన్న నెల్లిమూలంగ బిల్లు నెలిమిడుగు." హంస. ౪ ఆ. ౧౧. స్వా. ౪, ఆ. ౬౦.

నెవడు. దే. అ. క్రి. వెలయు. "గీ. కువలయ ప్రీతి కాముఁడై నెవడు రాజు, గాఢమూఢ ప్రసన్నతఁ గాంచి తిరుగ, సాధుబుద్ధివి గాఁ దైతి శంబరారి." వేం. పంచ. ౪, ఆ. ౧౫౯.

నెపము. వై. వి. (సం. నిభః.) 1. హేతువు, కారణము. "చ. మొనసిన దీపికానికరముల్ గృహకార్యగతాభిసారికా, వనితల యూర్పుగాడ్పుల నెవంబునఁ గంపమునొంద..." పారి. ౨, ఆ. ౩౬. నైష. ౮, ఆ ౪౭. 2. దోసము, తప్పు. "ఉ...మహీవల్లభ తక్షకాధము నెవంబున సర్పములెల్లనగ్నిలోఁ, దగ్ధతఁగ..." భార. ఆది. ౧, ఆ. ౧౨౫. 3. మిష, వ్యాజము. "క. ...ఆశండుష పత్నే, వన తాత్పర్యంబు తగ నెవంబిడి యేప్రొద్దును నెడమడుగగమదిలో, ననుపత్తింపఁగఁ గించి దపశిష్టముగాన్." హరి. పూ. ౧, ఆ. ౮౩.

నెవయఁబడు. ద్వి. అ. క్రి. (నెవయు+పడు–స్వార్థమున.) ఎగయు, పైకిలేచు. "క. దివిజులు తోలు దాఁకునఁ ద, మ్మెవిచిన దనుజులు మకుకులేశ్వర శరముల్, పొవయని మంటలు మింటికి, నెవయంబడి కెడపమొనసి నిలిచిరి వారున్." కళ. ౫, ఆ. ౩౭.

నెవయు. దే. అ. క్రి. ఎగయు, ఎగురు. "క. అవమానదుఃఖితుండయి, పొవయుచుఁ గోపానలంబు పొడమి వెలుంగన్, బవనసఖుఁ డగ్నికణములు, నెవయఁగఁ దన పొడవు సూపె నిషధుని మ్రోలన్." భార. సభా. ౧, ఆ. ౨౫౫.

నెవులు. సే. అ. క్రి. బాధనొందు. "సీ. క్రొవ్విరు లెసఁగి పూఁగోలల మోపోపక నవకంపు లేఁదీఁగె నెవులునట్లు" కు. సం. ౮, ఆ. ౯.

నెవ్వ. దే. వి. 1. దారిద్ర్యము, బీదఱికము. "గీ. చుట్టువాలును నెవ్వ పోఁగొట్టునాలు, బిట్టుగ్రాలు పసిండి క్రొంబట్టుసీలు, మెట్టజాలు మొగిల్ పస మెట్టఁజాలు, నట్టిడాలును గలజగజెట్టిఁ దలఁతు." అచ్చ. బాల. 3. భర్తృ. సీతి. ౩౭. 2. అభావము, ఎద్దడి. "శా. ...వర్షంపు నెవ్వన్ రుజన్, హావళ్లందిగు నన్యభూప్రజల రాజాయాయి జాత్యోచితిన్, బ్రోవంగాఁ దగు..." ఆము. ౪, ఆ. ౨౪౫. ఆం. భా. ద్వి. ౨౧౦. 3. శ్రమ, ఆయాసము. "గీ. తెల్లవారిన గుండఁగి కోళ్లలీల, నీళ్ల మునుఁగుచు నొడలెల్లఁ జల్లఁబాఱి, నిట్రుపాసంబులనుగూడి నెవ్వఁదొడరు, వెడఁగుబాఁపన తగులునఁ బడిలిపేల." వాల్మీకి. ౨, ఆ. ౧౩౦. రామా. 3, ఆ. ౩౨. 4. దుఃఖము, విచారము. "గీ. నీ మనంబునఁ దగిలిన నెవ్వయెల్లఁ, బలుకు నాతోడ నాతోడు పద్మనేత్ర, దాఁచ నేఁటికి..." చిత్ర. భా. ౫, ఆ. ౧౨౦. భాగ. ౧౦. స్కం.. పూ. ౧౫౧౧.

నెవ్వగ. దే. వి. (నెఱ+వగ.) 1. అధికదుఃఖము. "వ. నెవ్వగలు నివ్వటిల్లనీక సెలుపు నది యెట్టిది దాని నెఱింగింపు మనిన విదురుం డిట్లనియె." భార. ఉద్యో. ౨. ఆ. ౯౩. సీలా. ౪, ఆ. ౭౨. 2. పూర్ణాలోచన, అతివిచారణ. "సీ. అతివిచారణ సంజ్ఞ యలరు నెవ్వగ యన..." ఆం. భా. ప్ర. ౧౧౩. భార. ఆది. ౭, ఆ. ౨౩౦.

నెవ్వడ. దే. వి. (నెఱ+వడ.) అధికతాపము, అత్యుష్ణము. "సీ. శౌలయు నిట్టూర్పుల...వెడ బీఁట వాఁటి నెవ్వడ వడుమోవితో ముడిఁగి వాఁడిన యెల్లు పడఁకు సూప." కు. సం. ౫. ఆ. ౭౦.

నెవ్వడి. దే. వి. (నెఱ+వడి.) మిక్కిలివేగము. "క. వడముడి యారక్కసు న, య్యెడ కప్త ధనుః ప్రమాణ మెడగలుగఁగ నె, వ్వడి నీడ్చె..." భార. ఆది. ౬, ఆ. ౨౦౬, కాశీ. ౬, ఆ. ౧౮౦. భార. ఆది. ౬, ఆ. ౮౨.

నెవ్వలి. దే. విశ. (నెఱ+వలి.) మిక్కిలిపెద్దది. "క. నెవ్వలి సన్నుల వ్రేఁగునఁ, జివ్వంకలు వంగఁగౌను..." కు. సం. ౯, ఆ. ౧౧౩.

నెవ్వీఁగు. దే. విశ. (నెఱ+వీఁగు.) ఉన్నతమైనది; మిక్కిలివీఁగినది. "తరువోజ. వెలదునిట్టూర్పుల వెస నుచ్చలించు వెలుపునఁ గలుగు నెవ్వీఁగు చందోయి." కు. ౫, ఆ. ౧౦౯. నైష. ౭, ఆ. ౪౧. భార. విరా. ౧, ఆ. ౨౯౧.

నెసుళ్లు. దే. వి. బ. ఒకజాతిపురుగులు. "చ. చివికిన విల్లు ద్రుంచుటయు చేడియ నొంచుటయున్ నెసుళ్లనె, తృవ చలమారఁ జంపుటయుఁ గోఁతిని జింకను గీటడంచుటల్." అచ్చ. యు. ౧౧౯.

నెళవరి. దే. విశ. (నెళవు+అరి.) 1. పరిచితుఁడు. "క. అళుకుచు మూర్ఛిలి తెలుసుక, కళవళపడి లేచి మనసు గాసిల్లంగా, ధళిరా యని వెలువడి తన, నెళవరులను జూచు కొనుచు నిలుచున్నంతన్." ఉ. హరి. ౩, ఆ. ౭౨. 2. మర్మము నెఱిఁగినవాఁడు. (శ. ర.)

నెళవు. దే. వి. 1. పరిచయము. (చూ. నెళవరి.) 2. రహస్యము, గుట్టు. "చ...అమ్మదవతీమణి గర్భభరంబుఁ దాల్చె ని, న్నెళవు గృహాంబులోపల"

ను నిక్కముగా వివరింపఁగాఁ దగున్." ఆని. ౩, ఆ. ౧౮౧౫. వేం. పంచ. ౧, ఆ. ౨౪౮. 3. ఆయువుపట్టు, మర్మస్థానము. "సీ. మఱపించి యొల్లని మర్మంబు లంటుచోఁ బుణికిళ్ల నెళవులు పుణికిపైచి." కవిక. ౩, ఆ. ౨౭౨. 4. అభ్యాసము. "సీ. కాలములం దప్పక త్రిసంధ్యలాదు ను మాధీశుఁ బూజించు నట్టి నెళవు." చెన్న. పీఠి. ౯౮. విణ. యుక్తము. "సీ. నెళవుగ మాటాడ నేర్చునో నేరదో పురుషుల పనులొనె పొలఁతి చేత." వేం. మా. ౫, ఆ. ౪.

**నెళినెళి.** దే. వి. విఱుగుట మున్నగువానియందగు ధ్వనికనుకరణము. "ద్వి. నిజరథంబంతయు నెళినెళి విఱుగ." అచ్చ. యు. (శ.ర.) ఉ. హరి. ౩, ఆ. ౭౨.

## నే

**నే** వై. వి. (సం. స్నేహః) (ఇది ప్రత్యేక వచనమును సమాసమునను గానవచ్చుచున్నది.) నేయి, ఘృతము. "మ...ప్ర, జ్వలితాత్యుగ్ర వాగ్ని నే మిడిచినం జల్లారునే..." ఉ.రా. ౨, ఆ. ౩౨౫. భార. ఉద్యో. ౨, ఆ. ౨౪౩.

**నేఁజెల్ల.** దే. అవ్య. సంతాపమును దెలుపును. "గీ. అకట నేఁజెల్ల నేఁజెల్ల హా కుమార, హా తనూభవ హా వత్స యనుచు నార్తిఁ, దల్లియును దండ్రియును వచ్చి తనుఁజూచి బోదివిరి...' హరి. పూ. ౫, ఆ. ౧౫౫.

**నేఁడు.** దే.వి. 1. ఈ దినము. "సీ కుండలమ్ములు వేగకొనిరమ్ము నాలవనాఁటి కని పూని నన్నుఁ బనిచె, గురుపత్ని నేఁడ యక్కుండలంబులు దొడ్గు దివసము..." భార. ఆది ౧, ఆ ౧౧౫. పాండు. ౪, ఆ. ౭౧. 2. ఈ కాలము, ఇప్పుడు. "సీ. చక్రవర్తి మహాప్రశస్తి నాఁడును నేఁడుఁ జెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె." పారి. పీఠి. ౧౮. భార. ఉద్యో. ౪ ఆ. ౩౫.

**నేఁత.** దే వి. (నేయుధా). 1. బట్టలు నేయుట. "సీ. సరిలేని మంచి గుజ్జరినేత పట్టుయుం బఱపైన రాయంచ గఱులపఱపు" ఉ. రా ౭, ఆ. ౧౭౦. 2. ఇండ్లు నేయుట. "సీ. కఱవు గేస్తుల యిండ్లుకప్పు నేఁతలయంద నుడివడి కలఁగుటల్ మడుగులంద". అచ్చ. బాల. ౫౯, ౩. సన్నబార చాఁపులు. కవిక. ౩, ఆ. (శ. ర.)

**నేఁతకాఁడు.** దే. వి. 1. నేఁత నేయువాఁడు, తంతువాయుఁడు "ఉ...తొల్లిచే, నేఁతఁ బరిగ్రహించి యతిశిష్యునిచే నొక నేఁతకానిచే, దూలిక నొచ్చె నాత్మకృతదోషము సంగద..." వేం. పంచ. ౧, ఆ. ౨౧౪. ఆం. భా. ద్వి. ౨౭౩. 2. ఇండ్లు నేయువాఁడు. (వా).

**నేఁతపలక.** ద్వి. వి (నేఁత+పలక.) వాయదండము, నేఁత నేయునపుడు పడుగు పేకలను సరిగా చేర్చు పలక. "సీ...వాయదండము నేఁతపలకనఁదగు. ఆం. భా. ద్వి. ౨౮౬.

**నేఁతపురుగు.** ద్వి. వి. (నేఁత+పురుగు). సాలెపురుగు, తంతువాయము "క. నేసి మఱి తాన క్రమ్మఱ, గ్రాసముగొను నేఁతపురుగుకరణి..." కవిక. ౬, ఆ. ౧౭౨.

**నేఁతపూఁబోఁడి.** (నేఁత+పూఁబోఁడి) సాలెపడుచు "ఉ. అడుబాడక్కవానికి రయంబున భిక్ష యొసంగ నేఁతపూఁబోఁడి ప్రకోష్ఠకస్థలికిఁ బోయి...' హంస. ౨, ఆ. ౨౮.

**నేఁతయంత్రము.** మి. వి. (నేఁత+యంత్రము) మగ్గము. "సీ ..నేఁతయంత్రము మగ్గ మనఁగను దనరుచుండు". ఆం. భా. ప్ర. ౨౮౬.

**నేఁతరి.** దే. వి. (నేఁత+అరి) తంతువాయుఁడు, నేఁతకాఁడు "సీ. తంతువాయాభిధఁ దనరు మగ్గరి యన నేఁతకాఁ డనఁగను నేఁతరి యనఁ, దోఁచుఁ దద్భేదముల్". ఆం. భా. ద్వి. ౨౮౩.

**నేజకుఁడు.** సం. వి. అ పుం. చాకలి, రజకుఁడు. విణ. (అ. జికా. అ) 1 శుద్ధిచేయువాఁడు. 2. బట్ట లుదుకువాఁడు.

**నేజనము** సం. వి. అ. న. 1. శుద్ధిచేయుట. 2. బట్టలుదుకుట. 3. చాకిరేవు. 4. బట్టలుదుకు పలక.

**నేజి.** సం. విణ. (న్.నీ.న్) 1. శుద్ధిచేయువాఁడు, బట్ట లుదుకువాఁడు.

**నేజి** దే. వి. ఈఁటె, బల్లెము. "సీ..., నేజ బరిచి యీఁటె యనంగఁ బరగుఁ గుంతము..." ఆం.భా. ద్వి. ౨౧౭. చంద్రా. ౩, ఆ. ౧౧౭.

**నేజెముఁ జనేజి.** "క. నేజముగొని యిప్పోటున, నేజ మునిం జేర్తు ననుచు నిశిచరవీరుల్, జేజే లిడ సాహసమున, జేజేలగబుంబుఖుబంధభీమం గ్రమ్మెన్." శకుం. ౫, ఆ. ౨౫. నరస. ౩, ఆ. ౩౩.

**నేజో=నేజ.** "సీ. తరుణ రాజావర్తదండంబులైన నేజాలు పెం జిలువలజాతిఁ దెలుప." సాంబో. ౨, ఆ. ౧౧౦. కృష్ణ. 3, ఆ. ౪౫.

**నేజోము=నేజా.** "సీ. నడుమ రెండుగఁ దున్నమలి ఖండించిన సర్పంబుఁ బోలు నేజాముఁ గాంచి" సాంబో. 3, ఆ ౪౮. య. ౨, ఆ. ౨౭.

**నేటించు.** దే. అ. క్రి. 1. చాఁగిలఁబడు. "ఆ. నిన్ను సన్నుతించి నేటించి మ్రొక్కెదు, హరిమురారి శౌరి యవధరింపు." భద్రరాజపుత్రచరిత్రము. 3, ఆ. (శ. ర.) 2. నిశ్చయించిపలుకు, గట్టిగా చెప్పు. "క. మాటను లెఱుఁగవుమాతో, సాటికి బద్యములు చెప్పి చదివెద విది బల్, చేటుసుమీ యని పెద్దలు, నేటించినఁ గుకవి కడుఁ గినిసి జగడించున్." అప్ప ౨, ఆ. 3౫౧.

**నేటు.** దే. వి. 1. సత్యము. "సీ. నిజమనఁగ నిక్కమనఁగ, నేటునాఁగను సత్యంబు నెగడుచుండు." ఆం. భా. ప్ర. ౧౧౮. 2. నిశ్చయము, నిర్ధారణము. "ద్వి. నేటుగా నీ కల్ల నిజములు రెండుఁ, దేటగా నిప్పుడు తెలుపకయున్న." ద్వి. సా. ౨, భా. (శ. ర.) నీలా. ౨, ఆ. ౪౧. 3. ఎన్నిక, గణుతి. "ఉ. ఆటలఁ బాటలన్ మరఁగి యమ్మునిసూనులఁ గూడియుండుటల్, నేటుకు వచ్చునే సభల..." శుక. ౨, ఆ. ౧౪3. విశే. 1. గట్టిది, దృఢము. "ఆ. కలఁగి తేటవోదు గడిదప్పు వెలుచును, నీటిలుప్పునీరు నేటుమనసు." అచ్చ. భా. ౪, ఆ. ౨౧, అచ్చ. యు. ౧౫. 2. సూటియైనది, లిన్ననిది. "సీ. నీటిపై నుఱుకుచు నేటుగా నీదుచుఁ గ్రమ్మఱ నడవక దొమ్మిఁజనుచు." అచ్చ. యు. ౭౦. 3. సర్వయుక్తము. "చ....వాలుఁ జూపులున్, గిలకిలనవ్వులన్ మిగుల నేటగు గాటపు సూటిమాటలున్, గలిగి విటావళిందిరముగా వలపింతురు వేశ్యలత్తఱిన్." రా. వి. ౧, ఆ. ౧3౫.

**నేటుకొను.** దే. అ. క్రి. (నేటు+కొను.) అతిశయించు. "క. నేటుకొని పండ్లుగొఱుకుచుఁ, జీటికిమాటికిని గసరు చిలుకం జిలుకా, బోటులవలయుంచెదు నీ, గోటాపన యెన్నఁ డింక గూటం బడునో." నీలా 3, ఆ. ౨౬.

**నేటుచేయు.** దే. స. క్రి. (నేటు+చేయు.) 1. దృఢపఱచు. "ఆ...వేల్పుబోఁటి నాభి, విస్తరిల్లె నపుడు పెడఁద బావిని బోల్పు: నేర్పుకాండ్ర మాట నేటుచేసి." రసిక. ౬, ఆ. ౧౦౦. 2. గణనచేయు, "ఆ. ముసలివానిమాట ముద్దియమాటయు నేటుచేసి యేలు నేల వదలి, కటకటా కడింది కార్తికంబులు గల పొలము సారఁగఁ దగునె పొలఁతిఁ గూడి." అచ్చ. అయో. ౧౦౯.

**నేత.** సం. వి. ఋ పుం. 1. రాజు. 2. విష్ణువు. 3. వేము. ✿ విశే. (ఋ. త్రి. ఋ.) 1. అధిపతి. 2. పొందించువాఁడు. 3. లీసికొని పోవువాఁడు. 4. నాయకుఁడు, (సేనాదులను) నడపువాఁడు. 5. కథానాయకుఁడు. 6. నెఱవేర్చువాఁడు.

**నేతవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందింపఁదగినది. 2. కొనిపోఁదగినది. 3. నడపఁదగినది. 4. నెరవేర్పఁదగినది.

**నేతిబీఱ.** ద్వ. వి. (నేయి+బీఱ.) ఒకవిధపు బీఱ, ఘృతకోశాతకి ✿ "సీ. బీరకర బీఱ నావెలయుఁ గోశాతకి నేతిబీఱయనంగ నెగడుచుండుఁ, దద్భేద నామంబు..." ఆం. భా. ద్వి. ౬౦. గాథే. ౯౦. (నేతిబీఱలో నేయియుండదు. కాన దీనిని అర్థరహితమైనదాని కుదాహరణముగా వాడుదురు.)

**నేతిబీఱాకు.** ద్వ. విశే. (నేతిబీఱ+ఆకు.) వ్యర్థము. "మ. క్షితిలో...గావు మేఁక మెడచన్నుల్ నేతిబీఱాకులున్..." ఒంటి. శ. ౨౬.

**నేత్రచ్ఛదము.** సం. వి. అ. పుం. కనుఱెప్ప.

**నేత్రపట్టము.** సం. వి. అ. పుం. కన్నులకుఁ గట్టుకొను గుడ్డ. "వ...గాంధారి...తనపతి కనుగుణంబు నేత్రపట్టంబు గట్టికొనియుండె..." భా. ఆది. ౫, ఆ. ౧౨.

**నేత్రపట్టు.** మి. వి. ఒకరకము పట్టువస్త్రము. "వ... ఉదయరాగపట్టులును నేత్రపట్టులును వజ్రపట్టులును నను పేళ్లుగల పుట్టంబులు. ద్వా. 3, ఆ. ౧౮౮. ఇట్లే: నేత్రముపట్టు. బస. 3, ఆ. ౫౬. పు.

**నేత్రపర్వము.** సం. వి. న్. న. కనులపండువు. "ఆ... సిరివరింప సభినవోజ్జ్వలత్వ మొంది దివిజులకు నేత్రపర్వమై, పొలిచి యింద్రుఁ డాత్మపురికి నరిగె." భార. శాం. ౫, ఆ. ౧౫.

**నేత్రబంధము.** సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము దాఁగిలిమూఁతలు.

నేత్రము. సం. వి. అ. న. 1. కన్ను. 2. తరిత్రాడు. 3. తేరు, రథము. 4. నది. 5. వేరు, మూలము. 6. జడ. 7. నాడి. 8. పలిపము, వస్త్రవిశేషము. "గీ. గరుడపచ్చలు నేత్రముల్ తురగవట్లీ హంస వట్లును బద్మాలు హరిణవట్లీ, మొదలుగా వల్వలు ధరించి ముదితలపుడు." ప్రబంధ. ౫౭౦.

నేత్రాంతము. సం. వి. అ. పుం. కడకన్ను, అపాంగము.

నేత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. నాయకురాలు. 2. నది. 3. నాడి. 4. లక్ష్మి.

నేదిష్ఠము. సం. వి. అ. పుం. అంకోలము#. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి సమీపమున నున్నది. 2. నిపుణము.

నేదీయము. సం. విణ. (న్. యసీ. స్.) మిక్కిలిసమీపమున నున్నది.

నేని=ఏని. అవ్యర్థకము. "మత్తకోకిల... మదీయ భాషితమెన్నఁడు, న్నేని మోఘముగాదు దిగ్ధరణీ రవీందు లెఱుంగఁగాన్." భార. ఆది. ౭,ఆ.౧౪౫.

నేనిజత్. సం. శత్రు. 1. శుద్ధిచేయుచున్న. 2. ఉదుకుచున్న.

నేనిజమానము. సం. విణ. (అ. ఆ. అ.) = నేనిజత్.

నేను. దే. స. నాశబ్ద ప్రథమైకవచనము. (చూ. నా.)

నేపథ్యము. సం. వి. అ. న. 1. తెరవెనుక నటులుండెడి చోటు. 2. అలంకారము. 3. వేషము; నటులు ధరించు వేషము.

నేపాళము. సం. వి. అ. పుం. 1. దేశవిశేషము. 2. ఒకదినుసు చెట్టు#. 3. వృక్షభేదము. న. రాగి, తామ్రము.

నేపాళిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నేపాళపుచెట్టు. 2. మణిసిల.

నేబీఱ=నేతిబీఱ. "ఆ. ఉల్లి తెలికపిండి ముల్లంగి నేబీఱ... మారేడుగాయల, ట్లనుభవించువారి ననఁగి పెనఁగు." పద్మ. ౩, ఆ. ౧౧౯.

నేబు. దే. వి. పండ్రెండుకాసుల నాణెము. "చ. పలువలు చెంతఁజేరి యొక పాతికనేబులు చేతి కిచ్చినన్." చంద్ర. వి. ౫, ఆ. ౩౪.

నేమకము. వై. వి. (సం. నియమకః.) నియమము. "పె. ... లక్ష్మీ రంగస్థలంబు దారి విలసిల్లి పెండ్లి చవికె లోనరవే ఁబుంచి రెండుబలతులు నివ్వటంబులుం బెండ్లిసెలవులు నేమకంబులుం జేసికొని..." ఆనంద. పీఠి. ౧౫౫.

నేమగాఁడు. ద్వ. విణ. (నేమము+కాఁడు.) నియమవంతుఁడు. "సీ. తల నిల్లుగట్టు వ్రతంబులరాయని తోమని పళ్యాల నేమగాని." ఘటికా. ౫,ఆ.౨౭.

నేమము. ఉభ. వై. వి. (సం. నియమః. క. నేమవు.) సం. వి. అ. పుం. 1. ఖండము, భాగము; 2. కాలము; 3. మేర; 4. ప్రాకారము; 5. వ్యాజము, మిష; 6. వజ్రము; 7. గోయి, గర్తము; 8. అన్నము. విణ. 1. తుల్యము; 2. సమీపము.

నేమి. సం. వి. ఇ. పుం. 1. వజ్రాయుధము; 2. గాడిద; పుం. స్త్రీ. నూతిగిరక. ఇ. ఈ. స్త్రీ. బండిచక్రము చుట్టుకమ్మి. న్. పుం. నెమ్మి, తినాసము#.

నేమించు. వై. అ. క్రి. నియమముగొను, దీక్షవహించు. "క. కామింపకయును సర్వముఁ, గామించియు నైన ముక్తిఁ గామించి తగన్, లోమించి పరమపురుషుని, నేమించి భజించు దక్షు నిపుణుండధిపా." భాగ ౫. స్క.౧౩౯. స. క్రి. 1. నియమించు. "గీ. నుతియించుఁ గడుఁబేరు గలిగిన మలల నరసి, యున్నతావులఁ గపలింప కునిచిరందు, మీఁదంచును బిలిచి నేమించి పనుప" య. 3, ఆ. ౩౪. ఉ. రా. ౧, ఆ. ౪౦౭. 2. నిరోధించు. "ద్వి. అంతకంతకు మనం బాకాంక్ష నేయ, నంతకంతకుఁ బెగ్గు పశ నేచ్చరియొడల, నంత కంతకు మనం బాకాంక్ష దరుగ, నంతకంతకుఁ దగ్గ నశ నేచ్చగాన, నే మించి మని బరిణామించి కీనిన, గామించు నీ యొడల్ దామించుఁగాక." పండితా. పురా. ౧౩౦ పు.

నేము. దే. స క్రి. ధాన్యాదులను చేటలో పోసి యిటునటు త్రిప్పు. (శ. ర.)

నేయము. ఉభ. వై. వి. (సం. స్నేహః.) స్నేహము, మైత్రి. "ఉ. నేయము లజ్జయుం గరుణ నెమ్మిక కోపభయైకవేళమే, నేయొడఁ జూదినన్ మదికి నించుకయించక..." రస. 3, ఆ. (శ. ర) (సం. న్యాయః) న్యాయము, పాడి. "నేయము గాదు పద్దంటే నిలిచేది మేరగాదు." క్షేత్రయ. ౧౯౫ పదము. సం. = నేతవ్యము.

నేయార్థము. సం. వి. అ. న. కావ్యదోషములలో నొకటి, స్వసంకేతితమగు అర్థముగల పదము. "క. ఇలఁ దన సంకేతంబున, నిలిపిన పద మెంచి చూడ నేయార్థంబౌ, బలుతేనె దిండిగమిసగు నల సాగరకర్ణ యూన యుటకలనంగన్." నరస.౪.ఆ.౨.

**నేయి.** వై. వి. బొ. అనా. (సం.స్నేహః.) 1. తైలము, చమురు. "క. నేయి పొలుపఱిన దీవియ, మాయము కరణి..." భార. అను. ౧, ఆ. ౧౩౮. 2. ఘృతము, "క. కామములు భోగములఁ బెగు, నే మెలఁతుక నేఁత నాజునే చిమ్ము..." భార. అను. ౫,ఆ. ౨౩౩. వా. రా. ౪, ఆ. ౬౬. 3. క్రొవ్వు. మజ్జ. "గీ... కేరజములు, గువ్వలును మొదలుగ లెక్కకొలఁది మీఱఁ, గలవు పులుఁగులు నేతులు గ్రక్కఁ గ్రొవ్వి." చిత్రభా. ౩, ఆ. ౧౨౨.

**నేయు.** దే. స. క్రి. 1. నేఁతచేయు, వయనముచేయు "చ...తద్భటకోటి చాతురీ తురి...యశోం, బర ములు నేయుచుండు..." నైష. ౧,ఆ ౪౮. 2. ఇల్లు మొదలగువానిని గడ్డి తాటియాకులు మొదలగు వానితో కప్పు.

**నేరఁబోతు.** దే. విశే. (నేరమి+పోతు.) తెలియని వాఁడు, అనభిజ్ఞుఁడు.

**నేరఁబోలు.** దే. అ. క్రి. (నేరన్+పోలు) సాధ్యమగు "చ. ...అమలిన తారకాసముదయంబుల నెన్న ను...బుద్ధిబాహువి,క్రమమున దుర్గమార్థ జల గౌరవ భారత భారతీ సముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే." భార. ఆది. ౧, ఆ. ౯౯.

**నేరపెట్టు.** దే. స. క్రి. (నేరము+పెట్టు) దోషినిగాఁ బలుకు. "క...రెడ్డిన్, గలసి యొకముడుపు గైకొని, పిలిచిన నీకిత్తు నేరపెట్టుదు మగసిన్." వేం. పంచ. ౪, ఆ. ౪౯౪.

**నేరమి.** దే. వి. (నేరుచు ధా.) 1. తెలియమి, అజ్ఞానము. "క. ఏ నెఱుఁగమి నిట్లడిగితి, నా నేరమి సైఁపవలయు..." భార. ఆర. ౫, ఆ. ౩౧౧. స్కా. ౫,ఆ.౧౧. 2. తప్పు, దోషము, "క. వైరుల దూతలు నెరవగు, వారు నిరాకృతులుఁ బాప వర్తులుఁ దమకుం, జేరువగా వర్తించుట, నేరమి తుదిఁబోయి చేటు నిందయు వచ్చున్." భార.విరా. ౧, ఆ. ౧౩౮. ఆం. భా. ద్వి. ౯౯౧.

**నేరము.** దే. వి తప్పు, దోషము. "సీ. తప్పొనర్చినవారి దండింతు నంటిరి తప్పొనర్పనివారు ధరణిఁ గలరె గీ. యజ్ఞభవు కూఁతురైన యహల్య మొదలు నేర మొనరించె ననినచో నేర్చి నడువ, నొకరితరమానె..." శశాం. ౪, ఆ. ౨౦. ఆం. భా. ద్వి. ౯౯౧.

**నేరముకొను.** దే. అ. క్రి. (నేరము+కొను.) తప్పు పట్టు. "క. ఓరి దురాత్మక విని పలు, మాఱటు రావలదు పెంచి మఱి వచ్చితివా, నేరము కొంను గ్రహించుక, యూరక యాపని ఘటింప మొప్పదు మాకున్." బిల్హ. ౩, ఆ. ౧౫౮.

**నేరాజీ.** దే. విశే. సరిగతో నేసినది. జేరబాజీ (వస్త్రము—శ. ర.)

**నేరిమి.** దే వి. (నేరుచు ధా.) 1. శక్తి, సామర్థ్యము. "ఉ...అంబక జాలవీచికా, స్ఫారమునైన భీష్ముఁ డను సాగరముం గడవంగ నీఁదఁగా, నేరిమి యె ట్లొకో కలుగనేర్చె శిఖండికి నేమిసేయుందున్." భార. భీష్మ. ౧, ఆ. ౫౪. 2 చాతుర్యము, నైపుణ్యము. "చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగె నేని యుం దానికి సైఁచి నేరముల్, గఱపి ప్రియంబుతోఁ గొలువు సైఁపఁగాఁదగు..." భార. ఆర. ౭, ఆ. ౩౭౦. దశకు. ౫, ఆ. ౬౯.

**నేరుచు.** దే. అ. క్రి. (దీనికి నేచును, నేరుచును, నేరఁడు, నేరువఁడు, నేతున్, నేరన్ మొదలగు రూపములు వచ్చును.) 1. సమర్థమగు. "క. కీచకుఁడు ప్రేటుపడి తన, నీచపువెస యొరు లెఱుంగ నేరకయుండన్, లేచి..." భార. విరా. ౨, ఆ. ౧౫౦. భార స్త్రీ. ౧, ఆ. ౭౬. 2 సంభవించు. "వ...యుష్మత్సంఘటితములైన సంబంధములకు వికారం బెన్నఁడును బుట్టనేరదు." హర. ౪, ఆ. ౪౯. స. క్రి. 1. ఎఱుఁగు, తెలియు. "వ...ఇంకనైన నుపేక్షింపక యీ దుష్టద్యూతంబు వారింపు మనినఁ బుత్రస్నేహంబున నెద్ది యుఁ జేయునది నేరక ధృతరాష్ట్రుండు మిన్నకుండె." భార. సభా. ౨, ఆ. ౧౭౪. దశకు ౩, ఆ. ౧౪౦. 2. అభ్యసించు. విక్ర. ౧, ఆ. ౨౦.

**నేరుపరి.** దే. విశే. (నేరుపు+అరి) 1. చతురుఁడు, నిపుణుఁడు. "క నేరుపరి పోషించిన హారము వెల యెక్కులీల.." ప్రబోధ. ౧ ఆ. ౨౭. ఇట్లే. నేర్పరి. భార. ఉద్యో. ౨, ఆ. ౩౬౫. 2. సమర్థుఁడు, శక్తిగలవాఁడు. య. ౧, ఆ. ౬౬.

**నేరుపు.** నేర్పు. దే. వి. చాతుర్యము. ప్రావీణ్యము. "ఉ. ఇంచిన భక్తి నొక్కతరళేక్షణ నైషధభూమి భర్తను, న్నించు వరూధినీపతికి నేరుపు, మీఱఁగ వట్టివేళ్లఁ గా, వించిన తాళవృంతముల

వీచుచునుండె..." నైష. ౭, ఆ. ౧౧౭. ఉ. హరి. 3, ఆ. ౧౧౬.

నేరటేఱు. దే. వి. (నేరేడు+ఏఱు;) జంబూనది. "గీ. నేరటేటి యసల్ దెచ్చి నీరజాప్తు, సానఁబట్టిన రాపాడి చల్లిమెదిపి, వదను సుధ విడిచేసెనో పద్మ భవుఁడు, వీనిఁ గాకున్నఁ గలదె యీ మేనికాంతి." స్వా. ౨, ఆ. 3౬.

నేరెడల్లులు. దే వి. బ. నమస్కారములు. "సీ... కైంకర్యాలు నేర, డల్లుల్ సలామన నమసు దండము పేళ్ల..." సాం. ని. మాన. ౨౯.

నేరెడు. దే. వి. ఔ. ౩నా. జంబూవృక్షము. "ఉ...అ, న్నేరెడు ప్రాని మూలమున నెక్కొని యుండు జగత్ప్రశస్తమై." మార్క. ౪, ఆ. ౧౪౪. ఆం. భా. ద్వి. ౪౬.

నేరెడుదీవి. ద్వ. వి. (నేరెడు+దీవి.) జంబూద్వీపము. "గీ. దీవులందెల్ల నేరెడు దీవి లెస్స." హర. ౨. ఆ. 3. ఇట్లే: నేరటిదీవి. నైష. ౯, ఆ. ౭౬.

నేరేడు=నేరెడు. "సీ. నేరే డనంగను నేరె డనంగను జంబూసమాఖ్యలై చనును." ఆం. భా. ద్వి. ౪౬.

నేర్చు=నేరుచు. స. క్రి. (కఱచు, అభ్యసించు) "క. అఱువది నాలుగువిద్యలు, నఱువది నాలుగు దినంబు లంతన వారల్, నెఱవాదులైనకతమున, నెఱి నొక్కొకనాఁటి వినికి నేర్చిరి లేశా." భాగ. ౧౦, స్కం. పూ. ౧౪౧౦.

నేర్పరి. దే. విశే. (నేర్పు+అరి.) సమర్థుఁడు. (చూ. నేర్పరితనము)

నేర్పరితనము. ద్వ వి. (నేర్పరి+తనము) సామర్థ్యము. "క. ఓనంద గోపవల్లభ, నీనందనుఁ డాచరించు నేర్పరితనముల్, మానవులకు శక్యంబులె, మానవ మాత్రుండె నీకుమారుఁడె తండ్రీ." భాగ. ౧౦. స్కం. పూ. ౯3౨.

నేర్పు=నేరుపు. స. క్రి. (నేర్చుధా. ప్రే.)అభ్యసింపఁ జేయు. "చ...పలుకులు నేర్పువేళఁ గల భాషిణి నీ విటు లుండ.." స్వా. 3, ఆ ౯౮. నైష. ౨, ఆ. ౯౬.

నేర్పుకాఁడు. దే. విశే. (నేర్పు+కాఁడు.) 1. శిక్షితుఁడు. "క. నిన కడు నేర్పుకాఁడవు, గా వలవదు వీనిఁగొన్ని గఱచితి మేమున్." భార. ఆది. ౭, ఆ. 3౨. 2. చతురుఁడు, నిపుణుఁడు "గీ. పూని భూప్రోలి మేలికడాని కోట, వాసియుం నగ్దబిసాం

దును వలను మీఱఁ, జూడఁ జెప్పంగ నరిదియౌఁ జుమ్ము వేయు, కన్నులును నోళ్లుగల నేర్పుకాండ్రకైన." అచ్చ. బాల. 3౬.

నేల. దే. వి. 1. భూమి. "సీ. నేలయు నింగియుఁ దాళము ల్గాఁ జేసి యేపున శేఁగి వాయించి యాడ." భార. విరా. ౨, ఆ. ౧3౪. మార్క. 3, ఆ. ౨౯౬. 2. ప్రదేశము, "వ...పటికంపు రాచట్టు నేలలు నెట్టుకొని .." స్వా. 3, ఆ. ౨౮. భార. ఆది. ౬, ఆ. ౨౬౪. 3. భూలోకము. "శా. పాతాళంబును నేలయుం ద్రిదివముం బాలించు సిద్ధుండవో..." ఉ. హరి. ౨, ఆ. ౧33. 4. దేశము. "ఆ. నేల ప్రాద్దెఱింగి చాలు మానిసి రణోద్యమ మొనర్చికాక..." భార. విరా. ౪, ఆ. ౨౨౧. శ్లో. దేశ కాలౌతు సంప్రేక్ష్య యోద్ధవ్య మితి సే మతిః. మూలము. 5. మృత్తిక, మన్ను. (చూ. నేలఁగలయు.)

నేలఁగలపు. దే. స. క్రి. (నేలఁగలయు ధా.) మంటిపాలుచేయు, నాశముచేయు. "సీ. అయ్యస్త్రమాశక్తి నద్భుతంబుగ నేలఁగలపి యుధిష్ఠిరువలను నిగుడ." భార. ద్రో. 3, ఆ. ౨౪3. దశా. 3, ఆ. ౨౦౮.

నేలఁగలయు. దే. అ. క్రి. (నేలన్+కలయు.) మంటిపాలగు, నశించు. "ఆ. ఘోరశిలలవృష్టిఁ గురియించె పీ, గించియతఁడు నికట గిరులు గాఁడ, గురుతర ద్రుమముల గుదిగ్రుచ్చునట్లుగ, నిఖిల జంతుతతులు నేలఁగలయ." కళా. ౬, ఆ. ౩౭. వరాహ. ౪, ఆ. ౨౧.

నేలకడిమి. ద్వ. వి. (నేల+కడిమి) భూకదంబము ⚘.

నేలకలిగొట్టు. దే. వి. భూపాటలి. (శ. ర.)

నేలకాన్పు. దే. వి. (నేల+కాన్పు.) భూపుత్రి, సీత. "గీ. ఖాగడ పూరెమ్మ వలపు కప్పురపు దిమ్మ, కానలేలమ్మ యా నేలకాన్పుఁగొమ్మ." అచ్చ. అయో. ౯౮. ఇట్టే. నేలచూలి. య. 3, ఆ. ౨౨.

నేలకుఁ గోలకుఁ దెచ్చు. దే. స. క్రి. ఓడించు. "ఉ. బాలుఁడవైన నీ వరిది బంటుతనంబునఁ బ్రౌఢ వీరభూపాలురఁ గుంభజప్రభృతి బాహుబలాఢ్యులఁ గిట్టి నేలకుం, గోలకుదెచ్చి..." భార. ద్రో. ౨, ఆ. 33౨, భార. ద్రో. ౧, ఆ. ౧౦౭.

**నేలగాపరి.** దే. వి. (నేల+కాపరి.) భూపాలుఁడు, రాజు. "సీ. అలగాపరిభూఁపు లచ్చట దిగఁద్రోచి నేలగాపరులఁ దా నేలఁగల్గె." అచ్చ. భా. ౧,ఆ.౬.

**నేలగుమ్మడి.** దే. వి ( నేల+గుమ్మడి.) భూమికర్కారువుచె. "సీ. నెగడు విదార్యాఖ్య నేలగుమ్మడి యన..." ఆం. భా. ద్వి. ౫౭.

**నేలగుమ్ముడు**=నేలగుమ్మడి. (ఇది నల్లనేలగుమ్ముడు తెల్లనేలగుమ్ముడు అని ద్వివిధము. శ. ర.)

**నేలగోలిమిడి.** దే. వి. (నేల+గోలిమిడి.) గోలామిచె. (శ. ర.)

**నేలజమ్మి.** ద్వ. వి. (నేల+జమ్మి.) చిన్నజమ్మి, శమీరము. చె. (శ. ర.)

**నేలజేజే.** దే. వి. భూసురుఁడు, బ్రాహ్మణుఁడు. "సీ. ఇటు నేలజేజేల కెఱుకైన చెంగావి సుద సంజఁ దగుకొండఁ జూచినాఁడ." నరస. ౫,ఆ.౨౨. అచ్చ. అయో. ౯౩.

**నేలతంగేడు.** దే. వి. (నేల+తంగేడు.) చిన్నతంగేడు ఆకుల్యము. "సీ. ములువెంపలి ములుస్తె గలిజేరు గుంటగల్జేరును దంతిబందారు నేల, తంగేడు .." హంస. ౪, ఆ. ౧౦.

**నేలతాడి.** ద్వ. వి. (నేల+తాడి.) తాళమూలిక, ముసలిచె. "సీ ..బీఱ మొగలింగ కోఁదాడు నీఁదాడు ఖర్జూర మీఁత నేల,తాడి..." హంస. ౪, ఆ. ౧౧. ఆం. భా. ద్వి. ౬౧.

**నేలతామర.** ద్వ. వి. (నేల+తామర. క. నెలతావరె. 1. స్థలపద్మము, మెట్టతామర. "సీ. స్థలపద్మమగు మెట్టతామగ యన...నేలతామర యన .." ఆం. భా. ద్వి. ౬౯. 2. స్థలపద్మినిచె. (మా. తామర.)

**నేలతాలుపు.** దే. వి. (నేల+తాలుపు.) 1. భూధరము, పర్వతము. "సీ. నేలతాలుపు రాచమాలిగాదిలికందు దొసఁగుదీకటిచాల్పు తొగలవిందు" అచ్చ. పీఠి. ౭. 2. రాజు, ప్రభువు. "క. కలికపు మానిసి యని నీ, తలఁపున నిపుడల్ల నేలతాలుపు మిన్నం, జులుకఁగఁ జూచెద వతనిన్, గెలువఁగ నీవంటివారికిం దరమగునే." అచ్చ. యు. ౨౧.

**నేలతీఁటకసింద.** దే. వి. ఒకజాతి కసిందచె. హంస. ౪, ఆ. ౧౦.

**నేలతొళసి.** ద్వ. వి. (నేల+తొళసి.) భూతులసిచె. (శ. ర.)

**నేలనమలి.** దే. వి. (నేల+నమలి.) పక్షివిశేషము. "వ ..నేలనమలి డాబగొంగడిగాఁడు మొదలగు పక్షులు..." చంద్రా. ౨, ఆ. ౧౪. ఇట్లే: నేలనమిలి, నేలనెమలి, నేలనెమిలి.

**నేలనేరేడు.** దే. వి. (నేల+నేరేడు.) కాకినేరేడు, భూమిజంబుక. "సీ...నేలనేరే డనఁగ...భూజంబు నామంబు బొల్పుచుండు." ఆం. భా. ద్వి. ౪౬.

**నేలపట్టి.** దే. వి. 1. అంగారకుఁడు, కుజుఁడు. (శ. ర.); 2. నరకాసురుఁడు. (శ. ర.) 3. భూపుత్రి, సీత. (శ. ర.)

**నేలపల్లటి.** దే. వి. (నేల+పల్లటి.) పారావతవిశేషము. "సీ. పారావతంబగు పావురాయి యనంగ... తద్భేదములుగాను దనరుచుండును నేలపల్లటి... అనంగ..." ఆం. భా. ద్వి. ౧౯. ఇట్లే: నేలపల్లటీ. సాం. ని. తిర్య. ౭౧.

**నేలపాలుసేయు.** దే. స. క్రి. కూల్చు. "గీ. పలుకయును వాలుఁగొని నరుపట్టి గవిసి, పౌరవుని రథ్యముల నేలపాలుసేసి..." భార.ద్రో.ఆ.౧౯.

**నేలపొన్న.** ద్వ. వి. (నేల+పొన్న.) కోలపొన్న. అంఘ్రిపర్ణిక. ఆం. భా. ద్వి. ౫౫.

**నేలమట్టముచేయు;** దే. స. క్రి. నాశమొనర్చు. "గీ. దేవ యొకవానరంబు లీలావనంబు,నేలమట్టంబు చేసి యాభీలవాల, మూఁచి యాడెడు తనుఁ జూచి కోఁచవాఱు, రక్కసుల నొక్కి తోరణం బెక్కినగుచు." రామా. ౬, ఆ. ౨౩౩. భా. రా. యు. ౩౧౫.

**నేలమామెన.** దే. వి. (నేల+మామెన) వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౦.

నేలమాలె. ద్వ. వి. (నేల+మాలె.) భూమిలోపలి యిల్లు, భూగృహము, "వ ..బహుశ్రుతుండు నేల మాలె నున్నట్టి కాలవేదిపాలికిం జనుదెంచి ..." విక్ర. ౩, ఆ. ౧౦౬. ఆం. భా. ద్వి. ౧౭.

నేలములక. దే. వి. (నేల+ములక.) వాకుడు, వార్తాకి. ✽. ఆం. భా. ద్వి. ౫౭.

నేల మొలత్రాడు. దే.వి. (నేల+మొలత్రాడు) సముద్రము. "గీ. వచ్చి యవ్వేడివేలుపు వంగడంపు, నేలమొలత్రాటి నిండుకుండేటికాల్వు, మ్రోలనిల్చి ..." అచ్చ. యు. ౧౫౫.

నేలయడుగు. దే. వి. (నేల+అడుగు.) పాతాళము. "సీ. పాతాళనామంబు...నేలయడుగనంగ నెగడుచుండు." ఆం. భా. ప్ర. ౧౪౫.

నేలయుసిరిక. దే. వి. (నేల+ఉసిరిక.) భూధాత్రి✽. "గీ..., నేలయుసిరిక యన, నలరు భూధాత్రి..." ఆం. భా. ద్వి. ౪౭.

నేలయేకిమీడు. దే. వి. (నేల+ఏకిమీడు.) భూపతి, రాజు. "గీ...ఓ నేలయేకిమీల కొలముసామి, చేతి కత్తుక కలపెద్దవెంచువాని, యింటివెంచెత చెలిమించు గుంటికెలని, పొలములోపలఁ జెలఁగు వెంచులము మేము." ఉ. రా. ౭, ఆ. ౩౮౯.

నేలరేను. దే. వి. (నేల+రేను) భూబదరి✽.

నేలఱేఁడు. దే. వి. (నేల+ఱేఁడు.) భూపతి, రాజు. "గీ. అట్టిపోలికి నేలికయగుచు నెల్ల, నేలఱేఁడులు దనుమేలు మేలటంచుఁ, బొగడ..." అచ్చ. బాల ౪౪. రసిక. ౧, ఆ. ౯౪.

నేలవేము. దే. వి. (నేల+వేము.) భూనింబము✽. "సీ... నేలవే మనంగ భూనింబ మొప్పు." ఆం. భా. ద్వి. ౫౦. హంస. ౪, ఆ. ౧౦.

నేలవేలుపు. దే. వి. (నేల+వేలుపు.) భూసురుఁడు, బ్రాహ్మణుఁడు. "గీ... నేలవేలుపు మొదలిటినేమములకు నెలవు..." య. ౩, ఆ. ౧౩౧. అచ్చ. బాల. ౭౪.

నేలసంపెఁగ. ద్వ. వి. (నేల+సంపెఁగ.) భూమిచంపకము✽. (శ. ర.)

నేలాఁపు. దే. వి. (నేల+ఆఁపు.) శ్యేనవిశేషము. "సీ. నేలనెనుఖ్లపై నేలాఁపుడేగల విడిచి యేపునఁ బీచ మడపఁ జేసి." రసిక. ౧, ఆ. ౧౧౫.

నేలొడ్డి. దే. వి. (నేల+ఒడ్డి.) వృక్షవిశేషము. హంస. ౪, ఆ. ౧౧.

నేవడము=నేవళము. (శ. ర.)

నేవము=నెవము. (శ. ర.)

నేవళము. దే. వి. మణులు గ్రుచ్చినహారము. "సీ. మొలనూలు నొడ్డాణమును నేవళంబుఁ బుంజాలదండయుం బన్నసరము మొగపు, తీఁగయుం ..." కళా. ౭, ఆ. ౬౬. ఆం. భా. ద్వి. ౧౪౯.

నేష్ట. సం. వి. బు. పు. సోమయాగమందలి బుత్విజులలో నొకఁడు.

నేస్తకత్తె. ద్వ. విశే. (నేస్తము+కత్తె.) స్నేహితురాలు. (శ. ర.)

నేస్తకము=నేస్తము. "ఎత్తు గీ. ప్రీతితో నేస్తకంబు గావించువిధము, లరయ వారితోడఁ జర్లాట మాడినట్లు." సానందో. ౩, ఆ. ౪౧.

నేస్తకాఁడు. దే. విశే. (నేస్తము+కాఁడు.) స్నేహితుఁడు. "సీ. .. నేస్తకాఁడు సంగడికాఁడు నాఁగను మిత్త్రుని నామములగు." ఆం. భా. ద్వి. ౧౮౬. కువల. ౪, ఆ. ౧౦౩.

నేస్తమగు. దే. అ. క్రి. (నేస్తము+అగు.) చెలిమిచేయు. "ఉ. నీవ యెఱింగెదుండుదువు నేనును చంద్రుఁడు నేస్తమాటయున్ ..." శశాం. ౪, ఆ. ౪౧.

నేస్తము. దే. వి. చెలిమి, మైత్రి. "సీ. సెయ్యము నేస్తము... గీ...అనఁ, బరఁగుచుండును మిత్త్ర భావంబు .." ఆం. భా. ద్వి. ౧౮౬. అని. ౨, ఆ. ౮౩.

నేస్తి. దే. విశే. నేస్తకాఁడు. "సీ. నేస్తి గాదిలిచెలి నేస్తకాఁడు సఖుఁడు సంగాతి చెలికాఁడు సంగడీఁడు, నాఁగఁ బేరులు మిత్త్రున కగు..." వేంక. మాన. ౨౬. సాం. ని. మాన. ౫.

నేస్తుఁడు. దే. విశే. స్నేహితుఁడు. "చ. నినుఁ దన బావగాఁ దలఁచి నేస్తులతోఁ గడుఁ బంతగించి..." చెన్న. 3, ఆ. ౧౭౧. అచ్చ. భా. ౪, ఆ. ౮౧.

నేస్తురాలు. దే. వి. (నేస్తము+ఆలు.) స్నేహితురాలు. (శ. ర.)

నేహారము. దే. వి. మణులు గ్రుచ్చినహారము. "ద్వి. లోహాచితంబులై లోలతమించు, నేహారంబులు గొన్ని నీలాల నమర..." ద్వి. హరిశ్చ. ఉ. ౬౨౩. పం.

## నై

నైకటికుఁడు. సం. వి. అ. పుం. భిక్షాదులకై గ్రామాదులదాపున వసించువాఁడు - భిక్షువు, యతి.

నైకట్యము. సం. వి. అ. న. దాపు, సామీప్యము.

నైకము. సం. విశే. (అ. ఆ. అ.) ఏకముకానిది- అనేకము, పెక్కు.

నైకృతికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) వంచకుఁడు.

నైగనిగ్యము. సం. వి. అ. న. నిగనిగలాడుట.

నైగమము. సం. వి. అ. న. 1. నీతి, నయము. 2. వేదాంతము, ఉపనిషద్రూపమగు వేదభాగము. విశే. (అ. ఈ. అ.)- 1. వేదసంబంధమైనది. 2. పట్టణసంబంధమైనది. 3. వణిక్సంబంధమైనది.

నైగముఁడు. సం. వి. అ. పుం. 1. వేదార్థము తెలిసినవాఁడు. 2. పౌరుఁడు. 3. వణిజుఁడు.

నైచికము. సం. వి. అ. న. గోశిరఃప్రదేశము.

నైచికి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమమైనయావు. "క. చూచి యిదియల్ల మొన్నటి, వాచంయము వేల్మిగిడ్డి వడువోండెదు నీ, నైచికికి నెట్లొకో యీ, నీచత వాటిల్లె నిన్న నేటనె యనుచున్." పాండు. ౫, ఆ. ౬౩౦. నైష. ౫, ఆ. ౮౪.

నైచ్యము. సం. వి. అ. న. 1. నీచత్వము. 2. భక్తిచే నేర్పడు నమ్రత.

నైజము. సం. వి. స్వభావము. "క. పెరుఁగుట స్రగ్గఁగ రుచులం, బొరయుంట యరుచంబు గాఁగఁ బుట్టుట సావం, బెరయుట పాయఁబదార్థ్యా, త్క్రమముల నైజమది యెట్లు దప్పింపనగున్." భార. స్త్రీ. ౧, ఆ. ౭౪. భార. విరా. 3, ఆ. ౫౭. సం. విశే. (అ. ఆ. అ.) 1. తనది, స్వకీయము. 2. స్వాభావికము.

నైతలము. సం. వి. అ. న. నరకము.

నైదాఘము. సం. వి. అ. పుం. నిదాఘము, వేసఁగి. విశే. (అ. ఈ. అ.) నిదాఘసంబంధమైనది.

నైదానికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) (రోగ) నిదానము నెఱిఁగినవాఁడు.

నైదానుఁడు. సం. నైదానికుఁడు.

నైదేశికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) సేవకుఁడు.

నైధనము. సం. వి. అ. న. 1. మరణము. 2. నైధనతార. విశే. (అ. ఈ. అ) మరణసంబంధమైనది.

నైపథ్యము. సం. వి. అ. న. నేపథ్యము.

నైపుణము. సం. వి. అ. న. కౌశలము, నేర్పు. "చ. ...జమదగ్ని సూనుఁడును బోలఁడు నిన్నని విందు విల్లునేర్పున నయనైపుణంబునను భూరి పరాక్రమ గర్వసంపదన్." భార. ఆది. ౫, ఆ. ౨౨౭. భార. విరా. ౧, ఆ. ౭౪౩.

నైపుణి. సం. వి. ఈ. స్త్రీ.=నైపుణము.

నైపుణ్యము. సం.=నైపుణము.

నైభృత్యము. సం. వి. అ. న. 1. నిశ్చలత్వము. 2. వినయము. 3 రహస్యము.

నైమంత్రణకము. సం. వి. అ. న. ఆతిథ్యము.

నైమిత్తము. సం. వి. అ. న. శకునగ్రంథవ్యాఖ్యానము. సం. విశే. (అ. ఈ. అ.) నిమిత్తసంబంధమైనది.

నైమిత్తికము. సం. విశే. (అ. ఈ. అ.) 1. నిమిత్తమువలనఁ గలిగినది. 2. నిమిత్తమునుబట్టి చేయఁబడినది. (శ్రాద్ధము మొ.) వి. అ. న. నిమిత్తమును అనుసరించివచ్చినకార్యము - ఫలము.

నైమిత్తికుఁడు. సం. వి. అ. పుం. శకునశాస్త్రజ్ఞుఁడు.

నైమిశము. సం. వి. అ. న. ఒకానొక అరణ్యము, సూతుఁడు శౌనకాది మహర్షులకు పురాణాదులు వినిపించిన అరణ్యము.

నైమేయము. సం. వి. అ. పుం. సరకులమార్పు, వినిమయము.

నైయగ్రోధము. సం. వి. అ. పుం. మఱ్ఱిపండు. విణ. (అ. ఈ. అ.) న్యగ్రోధవృక్షసంబంధమైనది.

నైయత్యము. సం. వి. అ. న. 1. నియతముగా నుండుట. 2. ఆత్మనిగ్రహము.

నైయాయికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) తర్కశాస్త్రపండితుఁడు.

నైరాశ్యము. సం. వి. అ. న. 1. ఆశలేనితనము. 2 ఆశలుడుగుట.

నైరృతము. సం. వి. అ. న. మూలనక్షత్రము. విణ. (అ. ఈ. అ.) నిర్ఋతికి సంబంధించినది.

నైరృతి. సం. వి. ఈ. స్త్రీ. దక్షిణపశ్చిమముల నడిమి దిక్కు.

నైరృతుఁడు. సం. వి. అ. పుం. 1. రాక్షసుఁడు. 2 చతుర్థదిక్పాలకుఁడు.

నైర్ఘృణ్యము. సం. వి అ. న. కనికరములేకుండుట, దయాభావము.

నైర్దేశికుఁడు. సం. వి. అ. పుం. సేవకుఁడు.

నైర్మల్యము. సం. వి. అ. న. 1. నిర్మలత్వము. 2. భోగ్యవస్తువులందలి వైరాగ్యము.

నైర్వాహికుఁడు. సం. విణ. (అ. ఈ. అ) 1. నిర్వహించువాఁడు, నెఱవేర్చువాఁడు. 2. (జలాదులను) మోచికొనిపోవువాఁడు.

నైల్యము. సం వి. అ. న. నల్లఁదనము.

నైవేద్యము. సం. వి. అ. న. దేవతలకు నివేదింపఁదగినవస్తువు.

నైశము. సం. విణ. (అ. ఈ. అ.) నిశాసంబంధమైనది. "క. ఘనతరనైశతమం బొకొ, యనఁగ ఘనాగమ తమిస్ర మధికలమై క, ప్పిన జనులకు వస్తువిభా, వన మొక్కటియుఁ గలిగె వైద్యుత రుచులన్." భార. అర. ౪, ఆ. ౧౩౬.

నైశ్చిత్యము. సం. వి. అ. న. నిశ్చయము.

నైషధుఁడు. సం. వి. అ. పుం. 1. నిషధదేశపురాజు. 2. నలుఁడు 3. నిషధదేశీయుఁడు.

నైష్కర్మ్యము. సం. వి అ. న. 1. కర్మత్యాగము; కర్మఫలత్యాగము. 2. సోమరితనము.

నైష్కికుఁడు. సం. వి. అ. పుం. కోశాధ్యక్షుఁడు.

నైష్ఠికము. సం. విణ. (అ. ఈ. అ) 1. నిశ్చితము. 2. నిష్ఠకలది. ఆసక్తము. 3. నిలుకడగలది. 4. మృత్యుకాలమునఁ జేయఁదగినది.

నైష్ఠికుఁడు. సం. వి. అ.పుం. మరణపర్యంతము బ్రహ్మచర్య మవలంబించి గురుకులమున వసించు బ్రహ్మచారి. విణ. (అ. ఈ. అ.) ఆసక్తుఁడు, నిష్ఠకలవాఁడు.

నైష్ఠుర్యము. సం. వి. అన. 1. కాఠిన్యము. 2. పారుష్యము, పరుసఁదనము.

నైసర్గికము. సం. విణ. (అ. ఈ. అ.) స్వాభావికము.

నైస్త్రింశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కత్తియాయుధముగాఁ గలవాఁడు.

నైస్పృహ్యము. సం. వి. అ. న. నిస్పృహత్వము, ఇచ్ఛలేమి.

## నొ

నొంచు. దే. స. క్రి. (నొచ్చు ధా. ప్రే.) 1. నొవ్వఁ జేయు, బాధించు. "అ. ఘోరశక్తివైచెఁ గౌరవపతి యది, నడుమఁ దునిమి ధర్మనందనుండు, నొంచె నిశితవిశిఖపంచకమ్మున నమ్మహీశునురము దర్ప మెసక మెసఁగ." భార. కర్ణ. ౧, ఆ. ౧౯౨. భార. స్త్రీ. ౧, ఆ. ౧౪౮. 2. చంపు. "ఉ.... తల్లీ వినవమ్మ యీజగములెల్ల సృజింప భరింప నొంపఁ జాల్దేవత లెట్టు వర్తిలిన లెస్సవుఁగా కిది చెల్లవేరికిన్." సా. ౨, ఆ. ౧౨౦. దశా. ౧, ఆ. ౨౫౩.

నొంచేవాఁడు. దే. విణ. (నొంచే+వాఁడు) "గీ.

ఘాతుకుఁడు నొంచువాఁ డనఁగాఁ జెలంగు." ఆం. భా. తృ. ౮.

**నొక్కము.** దే. వి. పెద్దసదాపు, శతాహ్వయ. (బ్రా. శ ౯ ర)

**నొక్కు.** దే. స. క్రి. నలుపు. "శా..వాఁ, డక్కో ణంబున మంపరశ్మియగు దీపాంకూరముల్ మీఁ గిక్కై, యొక్కఁ బ్రోచి ఘృతంబు నించి నిజవ స్త్రై కాంతమముం జించి చే నొక్కెన్ వ త్తిగ నేతఁ దోఁచెను శిఖన్ యోజించె వైశ్వానరున్." కాశీ ౪, ఆ. ౧౨౩. 2. అదుము. "సీ. బలితంపు గుబ్బలఁ బట్టిచూడ నెకాని నునువాఁడిగోరుల నొక్కరాదు." దశా. ౨ ఆ. ౩౧౧. దశా. 3, ఆ. ౭౮. వి. 1. అదుముటవలనఁ గలిగినపల్లము. (శ. ర.) 2. ముడుత. "సీ. ప్రిదిలి కైరవదళ శ్రేణినొక్కులు దీఱె." స్వా. ౩, ఆ. ౨౩. జై ౪, ఆ. ౫౫.

**నొక్కుడు.** దే. వి. (నొక్కుధా.) నొక్కు. "సీ. తలిరు పైఁ గెంపులు దాఁచినచందాన మునిపండ్ల నొక్కుల్ల మోము లలర." య. ౫. ఆ. ౨౬. (శ. ర. పా.)

**నొగ.** దే. వి. యుంగంధరము, కాఁడికి ఆధారమై బండి లోనగువాని మొదటనుండెడు నిడుపాటి కఱ్ఱ. "ఆ...మత్స్యరాజతనయుఁ డెలమి, దోలక నొగలఁ బగ్గములుగట్టి చనినవాని, సెల్లఁ దెచ్చి యరదమెక్కుటయును." భార. విరా. ౫, ఆ ౨౧౦. ఆం. భా. ద్వి. ౨౦౩.

**నొగిలించు.** దే. స. క్రి. (నొగులు ధా. ప్రే.) 1. పగులగొట్టు, ముక్కలు చేయు. "వ..శిరంబులు నొగిలించియు..." ఉ. హరి ౧, ఆ. ౧౪౮. 2. బాధించు. "క. మనసిజుని తూపులయి మన మనములు నొగిలించుఁగాన మాటికి నవినో, మన గోల్లు దాఁకె విరులకు, ననిపువ్వులు గోయఁదొడఁగి రలరుంబోఁడుల్." రామా. ౧, ఆ. ౧౯౫

**నొగులు.** దే. అ. క్రి. బాధనొందు. "ఆ. ఇన్ని సంకట ముల నిబ్బంగి సెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వఁదిర్చ వెజ్జ లేవకావె..." భార. ఉద్యో. ౩, ఆ. ౨౬. ఆము. ౪, ఆ. ౧౨౭. 2. స్రుఁగు. "వ...పీఁపులు పగిలియు మూఁపులు నొగిలియు..." ఉ. హరి ౩, ఆ. ౮౦. ద్వి. హరిశ్చ. పూ. ౧౭౯. పం. 3. వికలమగు, చెడు. "గీ. ఘనజరాజభూతహుంకృతి నెనయ నిగ్గు నొఱల సద్వృత్తి కర్ణవిస్ఫురణ నొగుల". దశా. ౨, ఆ. ౧౪౯. ౯ వి. ౨, ఆ. ౪౨. 4. వాడు. "సీ. పగలింటి కట్టెఁడ నొగిలిన కుముదిని సిర రోఁచిఁ గనికకస్లిలునట్లు" కు. సం. ౭, ఆ ౬౫. వి. 1. వికలమగుట. (శ. ర.) 2. నొప్పి, బాధ. "క. తనువు నొగిలించుకంటెను, మనము నొగులు చుటయొ హింస మదిఁ బరికింపన్, దనువునొగు లపుడ తీఱును, మనము నొగులు మనిన దనుక మానదు సుమ్మీ." (శ. ర.) "సీ. బారి నొగులు నొప్పి బాధ నెగులు నొవ్వినందుకుదురపెల్లు కొంసలంబు, నలుపు నోవి యనంగఁ జనువ్యథ..." ఆం. భా. ప్ర. ౧౫౦.

**నొగుల్చు.** దే. స. క్రి. (నొగులు ధా. ప్రే.) 1. నొప్పించు, బాధించు. "క. ..భోజవరు రెంట నొగిల్చిన సాత్యకి మార్కొని..." జై. ౭, ఆ. ౧౭౨. 2. పగులఁజేయు. "గీ... తేరుపదిబాణ ముల నొగిల్చె." ఉ. హరి. ౩, ఆ. ౫౩. భాగ. ౧౦. స్కం. ఉ. ౮౪౯.

**నొచ్చిలు.** దే. అ. క్రి. రాలు, పడు. "వ... చూతజాతములు చింతం బల్లవశ్రేణి నొచ్చిలు నీహారము పేర నశ్రువులు రాల్చెం గంటకి వి కోమలీ." కృ. శకుం. ౩, ఆ. ౧౦౭.

**నొచ్చిల్లు.** దే. వి బ. చొంగ. (శ. ర. బ్రా.)

**నొచ్చు.** దే. అ. క్రి. (దీనికి తుమున్నాద్యర్థము నొవ్వన్, నోవన్, నోన్ మొ. వ్యతిరేకార్థమున నొవ్వక, నోవక, నోక, నొవ్వకుము, నోవకుము, నోకుము మొ. రూపములు వచ్చును.) 1. బాధ పడు. "ఉ...సత్పురుషచిత్తము నొచ్చిన రిత్త పోవునే." ప్ర భా. ౧, ఆ. ౯౫. భార. ఉద్యో. ౪, ఆ. ౨౩౮. 2. నశించు. "సీ. ఉపవాసముల చేత నుడివోనికలుషముల్ పరహితంబులఁబోని, పాతకములు, వ్రతముల చేత నొవ్వని దుష్కృ

తంబులం." వి. పు. ౩, ఆ. ౧౫౩. దశా. ౪, ఆ. ౫౬.

నొచ్చుకొను. దే. స. క్రి. (నొచ్చు+కొను.) సిగ్గుపడు. "క. విపరీతకాల మింతే. యిప్పు డెవ్వరి నొచ్చుకొనఁగ నేటికి నీచే, నపహాద మగుట నిజ మని, తపియించి సుమిత్రపట్టి తరలఁగ నంపెన్." చం. రా. ౫, ఆ. ౭౮.

నొడలదొంతి. దే. వి. సంశయము. (శ. ర. బ్రౌ.)

నొడి. దే. వి. పదము, మాట. "సీ. నుడుగు నుడువు నుడి నుడికారము నొడువు నొడి నొడికారము నొడుగునాఁగఁ, బదమొప్పు..." ఆం. భా. ప్ర. ౧౧౧.

నొడికాఁడు. దే. విశ. (నొడి+కాఁడు.) మాటకారి "ఉ... తనఁగన్న దెప్పు నొడికాఁ డని కొంకెదఁ గాని యచ్యుతా" భార. అశ్వ. ౩, ఆ. ౧౮౧.

నొడికారము. దే. వి. (నొడి+కారము—స్వార్థమున.) 1. పదము, మాట. ఆం. భా. ప్ర. ౧౧౧. 2. మాటలయందలి చమత్కృతి. "వ... కళావతీ నీవు నొడికారపుమాటలాడం బ్రోడ వని వింటిము..." నైష. ౮, ఆ. ౫౫.

నొడికారి. దే. విశ. (నొడికారము+ఇ.) మాట చమత్కారము కలవాఁడు. (చూ. నొడికారితనము.)

నొడికారితనము. ద్వ. వి. (నొడికారి+తనము.) మాట చమత్కారము. "ఉ. కోఁగిటికాసచేసి నొడికారితనంబున నిన్నుఁ దేల్చిరా, రాఁగొఱగానివాఁడ నయి రామలలో నగుఁబాటుదేను నీకు .." ఉ హరి. ౧, ఆ. ౭౪. ఉ. హరి. ౪, ఆ. ౧౫౫.

నొడిమ. దే. వి. చెప్పినమాట. "క. నొడిమలకుఁ గలవి లేనివి, గొడిమలు గట్టుచును జనులు కుడువని నోళ్లన్, గుడుపుచుఁ బోయెద రూరకె, మడుగడలును జెరుపుమాయ మూఁకుడు గలదే?" మల్హ. ౧, ఆ. ౪౨. పు.

నొడుగు. దే. వి. మాట, పదము. ఆం. భా. ప్ర. ౧౧౧.

నొడుచు. దే. స. క్రి. తప్పులుపట్టు. (శ. ర.)

నొడుపు. దే. వి. (నొడుచు. ధా.) తప్పులుపట్టుట. (శ. ర.)

నొడువరి. దే. విశ. (నొడువు+అరి.) వాచాలుఁడు. (చూ. నొడువరితనము.)

నొడువరితనము. ద్వ. వి. (నొడువరి+తనము) వాచాలత. "ద్వి. కడు యంత్రతంత్రముల్ నొడువరితనము, లు..." పండితా. పురా. ౧౧౩. పు.

నొడువు. దే. స. క్రి. 1. వచించు, చెప్పు. "క. ఏళని యంతయు నెఱుఁగుదుఁ, గాన పృథాశోకవహ్నిఁ గాలమికని నీ, మానసమునఁ గృపకలిమికిఁ, గానొడివితి దేవసవ్యాగతిఁ దెలిపితిన్." భార. స్త్రీ. ౧, ఆ. ౧౬. భార. ఆది. ౨, ఆ. ౩౩. 2. రచించు. "సీ. నానాగమిసాల నూత్నయోగాసనమున శాలివాహనశకతి నొడివితి." కాశీ. ౧, ఆ. ౭. 3. స్తుతించు. "గీ. వెఱ్ఱిమాష్కిని లీలతో విశ్వమునుగుని, నొడువుచును బాహ్యత నొందవలయు." భాగ. ౧౧, స్కం. ౪౪. కవు. ౧, ఆ. ౨౫. వి. పలుకు, మాట. "క..., నే, నొడివిననొడువులు నొడువఁడు, దుడుకని జపియింప మాకు దుర్లభ మధిపా" భాగ. ౭, స్కం. ౨౫౩. ఆం. భా. ప్ర. ౧౧౧.

నొడువుజవ్వని. ద్వ. వి. (నొడువు+జవ్వని.) సరస్వతి. "సీ. నొడువుజవ్వనిపోఁక ముడి కాసపడు పెద్ద సరిగద్దెనుండు పెద్దఱికమెల్ల." చం. రా. ౨, ఆ. ౩౦.

నొప్పి. దే. వి. (నొచ్చు ధా.) 1. బాధ. "ఉ. కంటకముల్ పదాగ్రములఁ గాఁడఁదూసిన నొప్పిఁగూయిడెన్." ఆము. ౩, ఆ. ౩౩. నైష. ౩, ఆ. ౮౨. 2. ఆపద, హాని. "క. అప్పాండవమధ్యమునకు, నొప్పమి పుట్టంగవలయు నల్లము కలఁగెన్, డప్పదు నాకల నీసఖు, నొప్పి పరిహరించి దయఁ గనుంగొను మనినన్." జై. ౭, ఆ. ౧౧౭. బ. ప్రసవవేదన. "సీ నొప్పులు దఱచయ్యె నిప్పుడె చని వేగ పెద్దలౌ ముదుసళ్లఁ బిలిచిరారె." ఇందు. ౨, ఆ. ౫.

నొప్పించు. దే. స. క్రి. (నొచ్చు ధా.) నొవ్వఁజేయు. "ద్వి. ఏసిరయఁ గోపించు సీరితిఁ గపుల, నొప్పింప నెంతయు నొచ్చి భీతిల్లి, యప్పుడు తరుగిరు లవనిపై వైచి." రం. రా. యు. ౪౭౭. పు.

నొప్పిపడు. ద్వ. అ. క్రి. (నొప్పి+పడు) బాధపడు. "క. ఇప్పుగిది నాఁడునాఁటికి, నప్పాపములు సంహరింప హతశేషజనుల్, నొప్పిపడిపోయి కలు

నకుఁ, జెప్పిన నతఁ డాగ్రహంబు చిప్పిలు మది తోఁన్." వరాహ. 3, ఆ. ౭౨.

నొప్పిగుంటి. దే. విశే. (నొప్పి+కుంటి.) వ్యాధిగ్రస్తుఁడు. (శ. ర.)

నొల్లు. దే. స. క్రి. 1. ప్రోగుచేయు. (వ్యవ.) ఆకలములు నొల్లితీసికొనివచ్చిరి. 2. బిడ్డలు నోట వ్రేలిడుకొని చప్పరించు. "సీ. వ్రేళ్లలు గఱవంగ వెరవల్వరించిరో నోరఁజేతులు గ్రుక్కి నొల్లునాఁడ." నిర్వ. ౧, ఆ. ౪౦.

నొవులు=నొగులు. బాధపడు. "సీ. ప్రచురముక్తాచ్ఛత్రరుచి కొంతవడి సేఁగి యవి గూలఁ దడఁబడి నొవులుకరులు." చెన్న. ౫, ఆ. ౫౫.

నొవ్వి=నొవ్వు. 1. వేదన, బాధ. "క. ఎవ్వరు లేనెడ నొక్కఁడు, నొవ్వంగా నడిచెనేని నొప్పి కొలఁదియఁన్, జివ్వకతము నరయందగు, నొవ్విక్ వాఁడెగ్గులాడు నుత్తము నయినన్." విజ్ఞా. ప్రా. ౫౦. భా. రా. యు. ౨౧౪౫. 2. వ్యాధి. "క. ఎవ్వరు నేటికి నామెయిఁ, గ్రొవ్విసమాంసంబు గలదు కొను మాఁకలియఁన్, నొవ్వియును దీఱునంతట, నవ్వల నారోగ్యమగు మృగాధిప నీకున్." నా. పంచ. ౧, ఆ. ౪౦౮.

నొవ్వు. దే. వి. (నొచ్చు ధా.) 1. బాధ, వేదన. "గీ. వాయువంగంబులందు దుర్వ్యాప్తిఁ గదిరి, నొవ్వుఁ దెవులును బుట్టించుఁ గ్రొవ్వు చెఱుచు." భార. అశ్వ. ౧, ఆ. ౧౭౬. భార. విరా. ౨, ఆ. ౧౦౬. 2. వ్యాధి. "ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వఁ దీర్ప, వెజ్జనీవకావె..." భార. ఉద్యో. 3, ఆ. ౨౬.

నొసలికన్ను. దే. వి. (నొసలు+కన్ను.) ఫాలనేత్రము.

నొసలిచూపువేల్పు. దే. వి. శివుఁడు చంద్రి. ౫ ఆ. ౧౦౫.

నొసలు. దే. వి. నుదురు, ఫాలము. "ఉ. నిక్కపుఁ గిన్క వచ్చిన ననిన్ నొసలం గనుసూపు వింటిపాటక్కట రిత్తవోవునె..." భార. అశ్వ. ౪, ఆ. ౧౫. ఆం. భా. ద్వి. ౧౪3.

# నో

నోఁచు. దే. స. క్రి. (వ్రతాదులు) ఆచరించు. "ఉ. నోములు నోఁచినమ్మలు మనోరథముల్ దయివాఱ నిత్తఱిన్, దామరతంపరై ప్రియులుఁ దారు విహారము సల్ప..." స్వా. 3, ఆ. ౭౯. భార. ఆది. ౪, ఆ. ౧౦౨.

నోఁత. దే. వి (నోచు ధా.) నోఁచుట. "చ. వెలిచవి గోరు దుండగపువేడుకకత్తెల నోమునోఁత... చీకటిపర్వె నుర్వరన్." కవిక. ౪, ఆ. ౮౬. (వ్రతఫల మని భావము.)

నోటిగయ్యాళి. దే. వి. (నోరు+గయ్యాళి.) వాక్పారుష్యముగలస్త్రీ. "సీ. మాటమాటెఱుఁగదో నోటిగయ్యాళియో యాచారహీనయో యాలసురాలొ." చెన్న. ౪, ఆ. 3౯.

నోటిబీగము. దే. వి. (నోరు+బీగము.) దేవతలకు మ్రొక్కుబడిగా మౌనావలంబనమునకై దవుడల యందు కుట్టుకొను లోహపుకడ్డీ. "వ... కొందఱు నోటిబీగముల దాపల్ల వెల్లున నోరులఁ బూరుల గఱచువారును..." ప్రబంధ. ౮౮

నోమించు. దే. స. క్రి. (నోము ధా. ప్రే.)

నోము. దే. స. క్రి. 1. వ్రతాదు లాచరించు. "గీ. వ్రతము నోమించు దినవాసరములు దెలుపు." కాశీ. ౬, ఆ. ౬౦. పార్వ. 3, ఆ. ౧3౬. 2. పూజించు. "క. అన్నెలఁత...క్రొన్ననవిలుతుని నోముచు..." విక్ర. ౧, ఆ. ౧౨౦. జై. ౮, ఆ. ౭౫. 3 పోఁగొట్టు. (శ. ర.) వి. 1. వ్రతము. "ద్వి. మానసంబున రంగమందిరుం జేరి, యానోము తానోమి యానోముకరణి." ద్వి. పరమ ౫, ఆ. ౪౦౯. స్వా. 3, ఆ. ౨౯. 2. యజ్ఞము. "చ... వాఁడు దివ్యులన్, మునులను బిల్చి నోము పెనుమాఢత నోచిననోముఁగాక..." వీర. ౧, ఆ. ౧౧౪; ౧, ఆ. ౧౧౫.

నోముపంట. దే. వి. (నోము+పంట) వ్రతఫలము. "ఉ...తొలినోమిన నోముపంటగా, హిండితకీర్తి యుంక్తి జనియించెను..." శశాం. పీఠి. ౪౭.

నోయు. దే. అ. క్రి. 1. నొచ్చు, బాధపడు. "వ. వినతయు మాటువడి కద్రువకు దాసియై నోసినపనులు సేయుచున్నంత..." భార. ఆది. ౨, ఆ. ౩౭. భా. రా. సుం. ౨౪౪.

నోరఁబట్టు. దే. స. క్రి. (నోరన్+పట్టు) త్రాగు, పుక్కిటఁబట్టు. "ఉ. ..అగస్త్యమూర్తియై, యీ వృషకేతనుం డది మహోగ్ర జలాంబుధి నోరఁ బట్టెడున్." జై. భా. ౧, ఆ. ౧౦౦.

నోరదుము. దే. స. క్రి. నోరునొక్కు, మాటలాడ నీయకుండు. "గీ. అత్తమామల గృహకర్త లగుచు మెలఁగు, నట్టిధూర్తులనెల్ల నోరదిమి గదిమి, పొంచి యుపనాథుతోడఁ గ్రీడించి..." శుక. ౧, ఆ. ౫౫.

నోరాడు. దే. అ. క్రి. మాటవెలువడు. "గీ. చెప్ప నోరాద దేమని చెప్పవాఁడ, నెఱిఁగినర్థంబు చెప్పక యెట్లుడంతు." కాశీ. ౪, ఆ. ౩౫.

నోరార్చు. దే. స. క్రి. (నోరాడు. ధా. ప్రే.) నోరాడించు, బొంకు. "ద్వి. దంటమాటలు గొన్ని తడవాటివన్ని, గెంటక నోరార్చి గెల్వఁజాలెదవు." ద్వి. హరి. పూ. ౩౦౦. పం.

నోరికిఁబోవు. ద్వ. అ. క్రి. నోటికింపగు. "ఉ. తుప్పులుకట్టె నేర బలుతూపులు నీగురిగించఁబడండెకున్, దప్పిలి వేమి నావుడు నరుండును గ్గన లేచి దేవరా, యిప్పటికమ్ము లంతచెడియుం గడి నోరికిఁ బోదుదూపకుం, దిప్పలు నీరె మాగురుల తీయని పాలు రుచింపవేమియున్." కకు. ౪, ఆ. ౫౧.

నోరితాళము=నోటిబీగము. "గీ. లలనయొకర్తు నోరి తాళంబు లిచ్చె, శక్తిజాతర సద్భక్తిశక్తులెసఁగ." పాండు. ౩, ఆ. ౭౭.

నోరిసని. ద్వ. వి. తినుట కుపయోగము లేకపోవుట, అనుభవమున కదృష్టము లేకపోవుట. "క. నోరిసని నుండకే నోరోరియకట మా సమీపపూరణ మని యుం, దూరము వోయితివే సా, మ్మేరీతిని నీకు దక్కనే కానీరా." అము. ౬, ఆ. ౧౨.

నోరుకాయు. ద్వ. అ. క్రి. నోటికి రుచియైనదెల్లఁ దినకుండ పథ్యముచేయు.

నోరుకాయలుగాచు = పలుమాఱు పిలుచుటవలన నోరు నొప్పిచెందు

నోరుచేయు. దే. అ. క్రి. మాటలాడు. "సీ. కూడ నిత్తునె మాఱుకొని మోఱయెత్తినఁ గదిమెద నోరింతకంటెఁ జేయ." బహు. ౨, ఆ. ౬౧.

నోరుగొట్టు. ద్వ. స. క్రి. (నోరు+కొట్టు) తినకుండఁ జేయు. "సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలు వ్రాసి హరువుమీఱఁగ మణియములు చేసి." శుక. ౩, ఆ. ౩౭౫.

నోరుదెఱచు. దే. అ. క్రి. (నోరు+తెఱచు). 1. మాటలాడు. "ఆ. శిఖలు చూపకుండ శిక్షించి హాలికి నై, నోరుదెఱవకుండ పేరవెట్టి, నేఁడియెల్ల నడిపి విబుధారి కినుకమై, భీతిపాత్రుఁ జేసె వీతిహోత్రు." నృసిం. ౨, ఆ. ౧౧౦. 2. బదులు చెప్పకయుండు. 3. ఆత్మ్యాశపడు. "క. గతమునకును వగవక సాగతమునకును నోరుదెఱచి కడుఁగోరక దీనతఁబొందక దైవం బేగతిఁబుచ్చిన దానఁబోదుఁగా కనవలయున్." భార. శాం. ౩, ఆ. ౩౦.

నోరునొక్కు. ద్వ. స. క్రి. మాటలాడకుండఁజేయు. "గీ. ఎవ్వఁడిది యని పక్కన నవ్వుమాటి, నోరు నొక్కుచుఁ గౌఁగిటఁ జేరఁదిగిచి, నగువచెవిలోన నలుకుడు మాను మేము, వాసవుఁడ నిన్నుఁ గని కూర్మి వచ్చినాఁడ." జాహ్నవీ. ౪, ౧౭.

నోరుమాలినది. దే. విశే. 1 నోరులేనిది. (జంతువు.) "గీ. శర్వ యీనోరుమాలినజంతువునకు, మొదల వరమిమ్ము వరమిమ్ము పిదప నాకు." కాశీ. ౫, ఆ. ౩౩౫. 2. గడుసుగా మాటలాడఁజాలనివాఁడు.

నోరుమూయు. దే. అ. క్రి. (నోరు+మూయు) మాటలాడకుండు. "ఆ. అనిన నోరుగఱచి యసుర ద్విషుండోరి, పసుచ నానఁ బుట్టి చెడుగవైతి, పేర్చి నోరుమూయు పెదకలవాపోయి, దిట్టవదర గలఁడె యెచటనైన." నృసిం. ౪, ఆ. ౩౭.

నోరుమెంగ. దే. విశే. (నోరు+మెంగ) మూఁగ. "క. తన్నట్టు పలికి ద్రొబ్బఁగ, మిన్నకచన నంత నోరు మెంగయొ..." కళా. ౩, ఆ. ౨౩౯.

నోరుమెదపు. దే. అ. క్రి. మాటలాడు.

నోరుమెదల్చు. దే. స. క్రి. చెప్పు. "ఉ. ఎన్నఁగ నింత రత్నచయ మింతగభీరిమ యింత దానసం,ప న్నత యింతశుద్ధి యని బ్రహ్మయు నోరుమెదల్ప లేని య,త్యున్నతిఁగన్న పెన్నదలి సుస్థితమై వెలిదీవిచెన్నగున్." పాండు. 3, ఆ. ౧౫౧.

నోరూరు. దే. అ. క్రి. 1. అపేక్షకలుగు. "సీ. గబ్బిగుబ్బలఁ బతియెదఁ గ్రమ్మి క్రమ్మి, యున్నసకి యలఁ జూచి నోరూరసాగె." కలు. శ. ౨౨. 2. తినుబండములఁ దలఁచినపుడు నోట నీరుపుట్టు. "క. శ్రీరాముని దయచేతను, భారూఢిగ సకల జనులు నౌరా యనఁగా, ధారాళమైన నీతులు, నోరూరఁగఁ జవులుపుట్ట నుడికెద సుమతీ!" సుమ తి. శ. ౧.

నోరెత్తు. దే. అ. క్రి. (నోరు+ఎత్తు) మాటాడ యత్నించు. "ఉ. అత్తఱి భీష్మ ముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబులెల్ల నో, రెత్తకయూరకుండిరి మహీశ్వరు చిత్తమెఱుంగ కున్కి..." భార. ఉద్యో. ౧, ఆ. ౩౪౯. భో. ౬, ఆ. ౧౭౬.

నోవరి. దే. విణ. (నోవు+అరి) వ్యాధికలవాఁడు.

నోవి. దే. వి. = నొవ్వి. (నొచ్చు ధా.) బాధ, నొప్పి. రూ. నోవు.

నోవిక. దే. వి. అనుకూల్యము.

నోవు. దే. వి. (క. త. నోవు.) 1. బాధ. "క. చావును నోవును మనయో, ధావలికిన్ గెలుపు నుబ్బును నావలికిని నీ,చే వినియెదఁ దుదిసెట్టులు, శ్రీవిభవము పాండవులకుఁ జేపడునకదే." భార. భీష్మ. ౨, ఆ. ౧౯౯. ఉద్యో. 3. ఆ. ౨౬౭. 2. వ్యాధి. "ఉ...జింకలు నక్కలు గొంకనక్క —లు, ద్దోమలు మ్రాఁకులుం బొదలునోవులఁ బీడలఁ బొందువారు మున్, తామసభాగులట్ల మఱి తద్విధ జంతువు లెన్నియన్నియున్." భార. అశ్వ. ౨. ఆ. ౧౧౭.

## నౌ

నౌ. దే. వి. నవ్వు (మొదటిరూపము నవు. శ. ర.)

నౌక. సం. వి. ఆ. స్త్రీ. 1. నావ, ఓడ. 2. చిన్నపడవ,

నౌకర్ణధారుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు. మాలిమికాఁడు.

నౌక్రమము. సం. వి. న్. న. నావికవృత్తి.

నౌకాదండము. సం. వి. అ. పుం. ఓడనడపుగడ్డ, తెడ్డు.

నౌకు. దే. వి. మొత్తి. "ద్వి. నల్లమబ్బుకుఁ గ్రిందగ నౌకుదాపునను, దెల్లనివాల్చుక్క తెగిపడ్డరీతిఁ, గనిపించె..." ద్వి. సా. ౨. భా, ౩౮. పు. రూ. నవుకు.

నౌచరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పడవతో తిరుగువాఁడు, నావికుఁడు.

నౌజీవికుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువృత్తి జీవనముగాఁ గలవాఁడు.

నౌజే. దే. వి. భక్ష్యవిశేషము.

నౌడుకొట్టు. దే. అ. క్రి. మిణకరించు. రూ. నవుడు కొట్టు. (శ. ర.)

నౌతార్యము. సం.విణ. (అ. ఆ. అ.) ఓడచే దాటఁ దగినది.

నౌబత్తు. హిం. వి. = నవుబత్తు. మహారాజులకోట ముందు వాయించెడు చర్మవాద్యవిశేషము. "సీ. నక్తం దివంబును నాదుపాదుకొనంగ సాహేబు నౌబత్తు చఱువఁబనిచి." రంగా ౨, ఆ. ౧౯౦. రూ. నౌబతు.

నౌరు. దే. విణ. = నవురు. మృదువు. (శ. ర.)

## న్య

న్యంకువు. సం. వి. ఉ. పుం. 1. ఇఱ్ఱి. 2. ఒకానొక ముని.

న్యంచనము. సం. వి. అ. న. 1. తక్కువపాటు. 2. వంపు. 3. పల్లము.

న్యంతము. సం. వి. అ. పుం. చిట్టచివరిభాగము.

న్యక్కరణము. సం. వి. అ. న. అవమానము.

న్యక్కారము. సం. వి. అ. పుం. తిరస్కారము.

న్యక్కు. సం. విణ. (చ్. నీచీ. చ్.) 1. పల్లము. 2. నీచము.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ. న్యక్కరణము.

న్యక్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రూయఁ బడినది.

న్యక్షము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అధమము, 2. సమస్తము. వి. అ. పుం. దున్నపోతు.

న్యక్షుఁడు. సం. వి. అ. పుం. పరశురాముఁడు.

న్యగ్రోధము. సం. వి. అ. పుం. 1. మఱ్ఱి. 2. జమ్మి. 3. బార.

న్యగ్రోధి. సం. [illegible] స్త్రీ. ఎలుకజీడి.

న్యచ్ఛము. సం. [illegible] అ. న. పుట్టుమచ్చ.

[illegible] అ.పుం. 1. నాశము. 2. తఱుగుట.

[illegible] సం. వి. అ. న. పదియర్బుదములసంఖ్య. విశే. (అ. ఆ. అ.) పదియర్బుదముల సంఖ్యకలది.

న్యసనము. సం. వి. అ. న. 1. ఉంచుట. 2. ఇల్లడ పెట్టుట. 3. విడిచిపెట్టుట.

న్యసించు. సం. స. క్రి. 1. ఉంచు, 2. ఇల్లడపెట్టు, 3. తాఁకు. 4. జపసమయమున దేహావయవములను బీజాక్షరము లుచ్చరించుచు స్పృశించుట. "వ. ...కేశవాది నామంబులతోడ గోకర్ణహస్తంబున మాషమజ్జనపరిమితశుద్ధోదకంబుల మున్మాఱు లోనికిం గొని యినుమాఱు పరిమార్జనంబుచేసి దక్షిణపూర్వకంబుగా నేత్రనాసాశ్రోత్రద్వయ శిరోబాహుద్వయ నాభిహృదయంబుల న్యసించి యాచమనంబుచేసి..." వి. పు. ౪, ఆ. ౧౯౨.

న్యస్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది. 2. త్రోయఁబడినది. 3. ఇల్లడపెట్టఁబడినది. 4. మంత్రోచ్చారణముచే తాఁకఁబడినది.

## న్యా

న్యాక్యము. సం. వి. అ. న. వేఁపుడు బియ్యము. (వాచ.)

న్యాదము. సం. వి. అ. పుం. 1. భోజనము, కుడుపు. 2. ఆహారము.

న్యాయపథము. సం. వి. అ. పుం. 1. ధర్మమార్గము. 2. మీమాంసాశాస్త్రము.

న్యాయము. సం. వి. అ. పుం. 1. తగవు. 2. స్వధర్మమువలన చలింపకుండుట. 3. తర్కశాస్త్రము. 4. పద్ధతి. 5. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయనము, నిగమములను పంచావయవములుగల వాక్యసముదాయము. 6. లోకమందును శాస్త్రమందును ప్రసిద్ధమగు దృష్టాంతవాక్యవిశేషము.

న్యాయవర్తి. సం. విశే. (న్. నీ. న్.) న్యాయముగ నడచువాఁడు.

న్యాయవాది. సం. విశే. (న్. నీ. న్.) 1. న్యాయమునకై వాదించువాఁడు. 2. న్యాయముచెప్పువాఁడు.

న్యాయసూత్రము. సం. వి. అ. న. గౌతమరచితమగు న్యాయశాస్త్రసూత్రములు.

న్యాయి. సం. విశే. (న్. నీ. న్.) న్యాయవంతుఁడు.

న్యాయ్యము. సం. విశే. (అ. ఆ. అ.) న్యాయముతోఁ గూడినది.

న్యాసకుఁడు. సం. విశే. (అ. సికా. అ.) న్యాసము చేయువాఁడు.

న్యాసధారి. సం. విశే. (న్. ణీ. న్.) ఇల్లడసొమ్ము దాఁచిపెట్టువాఁడు.

న్యాసము. సం. వి. అ. పుం. 1. ఉంచుట. 2. ఇల్లడ. 3. వాడిక. 4. సన్న్యాసము, విడుపు. 5. మంత్రమును జపించునపుడు దేహావయవములందు మంత్రబీజాక్షరము లుంచుట.

## న్యు

న్యుబ్జము. సం. విశే. (అ. ఆ. అ.) 1. బోరగిల నుంపఁబడినది. 2. వంకరైనది. 3. గూనుకలది. వి. అ. పుం. దర్భతో చేసిన స్రుక్కు. న. కర్మరంగ మను మ్రానిపండు.

## న్యూ

న్యూంఖము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రియము.

న్యూనాంగుఁడు. సం. విశే. (అ. ఆ, ఈ. అ.) 1. హీనమైన అవయవములు కలవాఁడు. 2. వికలాంగుఁడు. 3. నిందింపఁదగినవాఁడు.

న్యూనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తక్కువైనది. 2. నిందింపఁదగినది.

న్యూనాధికము. సం. విశే. (అ. ఆ. అ.) [illegible] హెచ్చుతగ్గులు కలది.

## న్ర

న్రస్థిమాలి. సం. వి. న్. పుం. (నృ+అస్థిమాలి.) శివుఁడు.



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1953.

# సంస్కృతాంధ్ర నిఘంటువులు

## సంస్కృత నిఘంటువులు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| సంస్కృత ఆంధ్ర అకారాది నిఘంటువు | * | |
| త్రికాండశేషము, సటీక | 1 | 12 |
| విశ్వకోశము, (విశ్వనిఘంటువు) సటీక | 2 | 8 |
| మేదినీకోశము ,, | 4 | 0 |
| హారావళి, ఏకాక్షరీకోశము ,, | 1 | 0 |
| వైజయన్తినిఘంటువు | * | |
| అమరము, ప్రథమకాం॥మూ॥ పెద్దచ్చు | 0 | 4 |
| ,, ,, టీక | 0 | 10 |
| అమరము 3 కాండలు, మూలము | 1 | 0 |
| అమరము, సటీక, మేలుకాకితములు, కలికో | 5 | 0 |
| ధనంజయనిఘంటువు, సటీక | 1 | 4 |
| నానార్థరత్నమాల, సటీక | 2 | 8 |
| గురుబాలప్రబోధిక, సటీక | * | |

## తెనుగు నిఘంటువులు

| | రూ. | అ. |
|---|---|---|
| నానార్థనిఘంటువు, పద్యకావ్యము | 0 | 4 |
| శ్రీ వేంకటేశాంధ్రము, పద్యకావ్యము | 0 | 6 |
| షడ్భాషామంజరి (ఆరుభాషల ఒకాబ్యులరి) | * | |
| వావిళ్లనిఘంటువు (అ-ఔ వఱకు) I సంపుటము | 10 | 0 |
| డిటో (క - ఞ వఱకు) II | 12 | 0 |
| డిటో (ట - న) III | 10 | 0 |
| డిటో IV | అచ్చు | |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకా, అకారాద్యనుక్రమణికతో (నిఘంటుత్రయము) | 1 | 12 |
| డిటో కాలికోబైండు | 2 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక | 6 | 0 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr | 2 | 0 |
| Gellette's Telugu Dictionary (*Printed in Roman letters*) | 7 | 8 |
| Sankaranarayana's Telugu-English Dictionary. శంకరనారాయణగారినిఘంటువు (తెనుగుపదములకు ఇంగ్లీషుఅర్థము గలది) | 12 | 0 |
| Sankaranarayana's English-Telugu Dictionary. శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషు పదములకు తెలుఁగు అర్థములుగలది) | 15 | 0 |
| English-Telugu Pocket Dictionary ఇంగ్లీషు-తెనుఁగు పాకెట్టు డిక్షనరి | 5 | 0 |
| Translation Guide (English to Telugu & (*Vice-Versa*) useful for Revenue Officials | 2 | 8 |
| సంస్కృతాంధ్రనిఘంటువు | అచ్చు | |

# ఆంధ్రగ్రంథములు

## ఆంధ్రవ్యాకరణములు, అలంకారములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యకావ్యము | 0 | 6 |
| కవిజనసంజీవని | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | * | |
| లక్షణసారము | 1 | 8 |
| లఘువ్యాకరణము | 1 | 0 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము | 1 | 0 |
| రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెనుగు వ్యాకరణము (ప్రాచీనము) | 1 | 8 |
| పట్టాభిరామపండితీయం (పద్యవ్యాకరణము) | 0 | [illegible] |
| ప్రౌఢవ్యాకరణము | 1 | 8 |
| ,, సటీక | 3 | 0 |
| వెంకయ్యవ్యాకరణము | 0 | 6 |
| వ్యాకరణసంగ్రహము | 0 | 8 |
| ఆంధ్రశబ్దమంజరి బ॥సీతారామాచార్యులు | 0 | 12 |
| బాలవ్యాకరణము, శ్రీ చిన్నయసూరిగారిది | 1 | 4 |
| ,, శ్రీ దూసిరామమూర్తిగారి టీకతో | 6 | 0 |
| ,, విద్వాన్ ఖులుసు వేంకటరమణయ్యగారి లఘుటీకతో | 2 | 8 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| బాలచంద్రోదయము, అలఘుకౌముది | 0 | 8 |
| బాలసరస్వతీయము, సటీక | | అచ్చు |
| విభక్తిచంద్రిక | 0 | 6 |
| ఆంధ్రసంస్కృతవ్యాకరణము, ప్రథమ శిక్షాత్మకము, వేదము సూర్యనారాయణ శాస్త్రిగారిది | 1 | 4 |

## పద్య కావ్యములు

| | | |
|---|---|---|
| అధ్యాత్మరామాయణము | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు | 5 | 0 |
| ,, శ్రీగిడుగురామమూర్తిపంతులవిమర్శ | 0 | 12 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | 0 | 12 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము 2 సం॥ | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము:— | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | 1 | 8 |
| ,, టీక (పాతది) | 8 | 0 |
| ఆదిపంచకము | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 |
| శాంతిసప్తకము | 7 | 8 |
| ఆది సభాపర్వములు, కలసంపుటము | 4 | 0 |
| ఆరణ్యపర్వము | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిపర్వము | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 4 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | 0 | 3 |
| ,, టీకతో | 0 | 10 |
| ఆనందరంగరాట్ఛందము | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు (నిఘంటుత్రయము) కలిసి | 2 | 0 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| ఆంధ్రభాషాభూషణము, విసర్గతో | 0 | 6 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము — శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | 18 | 0 |
| ఆంధ్రభాషార్ణవము | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | 6 | 0 |
| ఉత్తరహరివంశము | 3 | 0 |
| కవికంఠోక్తి | 0 | 4 |
| కవిజనాశ్రయము | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | 0 | 8 |
| కవిరాజమనోరంజనము | 1 | 4 |
| కవిజనరంజనము | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనార్యునిది | 4 | 0 |
| కృష్ణదండకము | 0 | 2 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | 1 | 8 |
| కవిగజాంకుశము | 0 | 4 |
| బేరీజాపద్యములు | 0 | 4 |
| దండకరామాయణము, చక్కనిశైలి | 3 | 8 |
| కృష్ణరాయవిజయము | 0 | 12 |
| కాశీఖండము, శ్రీనాథునిది | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | 0 | 8 |
| డిటో గట్టుప్రభువుకృతము | 0 | 10 |
| కుమారసంభవము; నన్నెచోడకృతము | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యకవి | 0 | 12 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జున సంవాదము) గోపమంత్రిది | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | 0 | 12 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | 1 | 12 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | 0 | 8 |
| జైమినీభారతము | 2 | 8 |
| దశావతారచరిత్ర | 4 | 0 |
| ధనాభిరామము | 0 | 12 |
| నిర్వచనోత్తరరామాయణము | 2 | 8 |